## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ చిన్న జీయర్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) చిన్న జీయర్ వెబ్ సైట్: http://www.chinnajeeyar.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో చిన్న జీయర్ వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## చిన్న జీయర్ వారి వెబ్ సైట్

## http://www.chinnajeeyar.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీ ఖరనామ సంవత్సరం పుష్యమాసం


సంపుటి 64 జనవరి

సంచిక 10 2012


## పండుగలు

**జనవరి:**

5. సర్వేషామేకాదశి, ముక్కోటి ఏకాదశి శ్రీరంగాది సమస్త శ్రీవైష్ణవ క్షేత్రములయందు వైకుంఠ ద్వార దర్శనోత్సవము.
6. కూర్మద్వాదశి, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్ద జీయరు స్వామివారి పరమపదోత్సవము.
11. ఉత్తరాషాఢ కార్తె
13. శ్రీ త్యాగరాజస్వామి ఆరాధన
14. అవమతిథి, భోగిపండుగ, గోదాకళ్యాణం, మకర సంక్రమణం రా.తె. 5-50
15. ఉదయాది ఉత్తరాయణ పుణ్యకాలము, మకర సంక్రాంతి.
16. కనుమ
19. సర్వేషామేకాదశి
20. గోపాలాచార్యస్వామివారి తిరునక్షత్రం, గోపాలోపాయనం
21. తిథిద్వయం, మాసశివరాత్రి.
22. పిండపితృయజ్ఞము
23. అమావాస్య
24. శ్రవణకార్తె
26. రిపబ్లిక్ డే
27. పంచమితిథి
28. శూన్యతిథి, వసంత పంచమి.
30. రథసప్తమి

**ఫిబ్రవరి:**

3. సర్వేషాం భీష్మైకాదశి శ్రీ విష్ణు సహస్రనామ జయంతి
4. భీష్మద్వాదశి
6. ధనిష్ఠకార్తె


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

**శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు**


## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-




మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రొసెసర్స్, సీతానగరం



SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA

Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamy

JEEYAR EDUCATIONAL TRUST
SITANAGARAM - 522 501
GUNTUR DISTRICT. A.P.
✆ (08645) 272929, 272353

# 2012 ఆంగ్ల వత్సరాది మంగళాశాసనాలు

ప్రియ భాగవత బంధువులారా! శ్రీమన్నారాయణ స్మృతి! అనేక మంగళాశాసనాలు!

కాలస్వరూపుడైన భగవంతుడు 2012 వ సంవత్సరముగ మన ముందు ఆవిర్భవించాడు. ఆంగ్ల కాలమానం ప్రకారం క్రొత్త సంవత్సరం ప్రారంభమైంది. మనమందరమూ ప్రేమతో స్వాగతిద్దాం!

2012 మీద ఎన్నో భయాలను ఎందరో కల్పించి పెట్టారు. యుగాంతం ఈ ఏడాది జరుగుతుందంటూ వార్తలు వ్యాపింపచేసారు. మన వైదిక గణన ప్రకారం కలియుగము 4,32,000 సంవత్సరములుంటుంది. అందులో ఇంతవరకూ 5112 సంవత్సరాలు గడిచాయి. కనుక ఇంకా చాల సంవత్సరాలున్నాయి. కనుక మనం నిర్భయంగ మనం చేయదగిన కార్యాలన్ని చేస్తూ ముందుకు సాగవచ్చు.

2011 మనకెన్నో అనుభవాలనిచ్చింది. 2012 వాటికి సమాధానాలు చెప్పాలి. తిరుమల తిరుపతి లో జరుగవలసిన సంస్కరణల విషయంలో భక్తులు చేసే 'శరణాగతి' శ్రీనివాసుడి దయతో సత్ఫలితాలనివ్వాలి. ఎక్కడ ఉండవలసిన వేయికాళ్ళ మండపం, రామానుజ మఠం, అనంతాళ్వారు గృహం మొదలయినవి యథాతథంగా వాటి వాటి స్థానాలలో రావాలి.

కేంద్రప్రభుత్వాలలో మతపరమైన చట్టాలు ఎంతో ఉపద్రవకరంగ తయారుకాబోయే ప్రయత్నాలు ముమ్మరమవుతున్నాయి. అవే కనుక అమలులో కొస్తే ఇక ఈ భారత దేశంలో దేవుడిని, వేదాన్ని స్మరించే అవకాశం ఉండనే ఉండదు.

దేశాన్ని, ధర్మాన్ని, సంప్రదాయాన్ని, విలువలని విశ్వసించే ప్రేమికులు వారంతా ఈ 2012 లో ఎంతో నేర్పుతో, సహనంతో, కలయికతో ముందుకు కదలవలసి ఉంది. అత్యవసరంగా మేలుకోవలసి ఉంది.

ఈ కాలరూపుడైన భగవంతుడు మనలను ఆదిశలో నడుపుగాక!

శ్రీమన్నారాయణ!

E-mail: acharya27@yahoo.com Internet: chinnajeeyar.org



ప్ర.స్కం. ప. అధ్యాయం (1)

# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణీ డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

**నారద జన్మవృత్తాన్తం**

నారదుడు వ్యాసునితో తన పూర్వజన్మవృత్తాంతాన్ని చెప్పి తనకు భగవత్కథా శ్రవణరుచి కలిగిన వైనాన్ని విశద పరచాడు.

నారదుడు పూర్వజన్మలో ఒక దాసీపుత్రునిగా ఉన్నదశలో వేదవిదులైన కొందరు మహాయోగులకు శుశ్రూష చేస్తూ ఉండేవాడు. ఎట్టి చాపల్యమూలేని బాలకుని పట్ల ఆ మహాత్ములు మిక్కిలి ప్రీతిగొన్నారు. ఆ చిన్న వయస్సులో కూడా ఆట పాటలు మాని తమనే అనువర్తించి ఉన్న ఆ బాలుని పట్ల కృపాళువులై నారు ఆ మహానుభావులు. నిరంతరం ఆ బాలుడు పెద్దలు తినగా మిగిలిన పాత్రలకంటి ఉన్న వాటినే స్వీకరిస్తూ కేవలం ఏకభుక్తంతో తన పాపాలను దూరం చేసుకుంటూ జీవనాన్ని సాగించాడు.

ఇలా పెద్దల శుశ్రూషలో జీవనయాపనం చేస్తున్న ఆ బాలునికి, వారి ఆచరణ పట్లనే విశేషాభి రుచి కలిగింది. ఆ సత్సంగంలో నిరంతరం శ్రీహరి కథాగానం సాగుతూ ఉంటే వింటూ, మనోహరాలైన శ్రీహరి గాథల పట్ల ప్రీతిని పెంచుకొన్నాడు. దాని వల్ల చిత్తద్రుతి కలిగింది. ఇలా ఏర్పడిన భగవత్కథా ప్రీతి, అస్ఖలితంగా ప్రసరించింది. దీనివల్ల (అస్ఖలిత భక్తి మూలంగా) నిత్య పరిణామశీలమైన ఈ అచేతన ప్రకృతి (అసత్తు) పరిణామరహితమైన చేతనతత్త్వం (సత్తు) ఈ రెండు, పరబ్రహ్మ పృథక్ సిద్ధమైన నాయందు, ఆ పరబ్రహ్మమాయచేతనే అంటే ఆశ్చర్యకరశక్తి చేతనే కల్పింపబడినదనే వివేకం కలిగింది.

ఇక్కడ భాగవత శ్లోక సమన్వయంలో అద్వైత దర్శన-విశిష్టాద్వైత దర్శన భేదం ఉంది.

**శ్లో॥ తస్మింస్తథా లబ్ధరుచేః మహామతేః**
**ప్రియ శ్రవస్య అస్ఖలితా మతిర్మమ ।**
**యయా మమైతత్సదసత్ స్వమాయయా**
**పశ్యే మయి బ్రహ్మణి కల్పితం పరే ॥**

అనే ఈ శ్లోకంలో- **'మయి బ్రహ్మణి'** అన్న సామానాధి కరణ్యంతో కూడిన ప్రయోగం (ఒకే విభక్తితో సప్తమ్యంతంగా **"మయి-బ్రహ్మణి"** అని ప్రయోగించడం) వలన జీవబ్రహ్మలకు (అస్మచ్ఛబ్దంచేత నిర్దేశింపబడిన జీవునికి బ్రహ్మశబ్దంచేత నిర్దేశింపబడిన పరమాత్మ తత్త్వానికి,) స్వరూపంచేత తాదాత్మ్యం ఉన్నదని, అంటే జీవ-బ్రహ్మలు ఒక్కటే తత్త్వమని, తనకంటే అభిన్నమైన పరబ్రహ్మతత్త్వంపై చేతనా చేతనాత్మక ప్రపంచం భ్రాంతిచే కల్పింపబడిందని అద్వైతవాదం. ఇదే అధ్యాసం అని చెప్పబడుతుంది.

సత్యమైన ఒక వస్తువుపై అసత్యకల్పితమైన వస్తువులా అంటే, సత్యమైన త్రాటిని చూచి భ్రాంతిచే పామును కల్పించి నట్లు, సత్యమైన పరబ్రహ్మం పై మాయచే ఈ చేతనా చేతనాత్మక ప్రపంచం కల్పింపబడిందని, ఇది సదసదనిర్వచనీయ రూపమని అద్వైతవాది సమన్వయం. ఇక్కడ భ్రాంతి కల్పనకు మూలమైన మాయ వాస్తవంగా లేని ఒక అనిర్వచనీయ తత్త్వం. ఈ మాయతో కూడిన బ్రహ్మమే ఈశ్వరుడని చెప్పబడుతున్నాడు. ఈ అభిప్రాయాన్నే-

**యయా మమైతత్ సదసత్ స్వమాయయా పశ్యే మయి బ్రహ్మణి కల్పితం పరే** అనే శ్లోకభాగం చెబుతున్నదని అద్వైత వ్యాఖ్య. ఈ భాగానికే విశిష్టాద్వైత ప్రక్రియలో సమన్వయం ఇలా...

**'మయి బ్రహ్మణి'** అనే సామానాధి కరణ్యం శరీర శరీరి భావమూలమైన తాదాత్మ్యాన్ని మాత్రమే చెబుతున్నది తప్ప స్వరూప తాదాత్మ్యాన్ని కాదు. కనుక **మయి బ్రహ్మణి** అంటే అపృథక్ సిద్ధతా లక్షణమైన తాదాత్మ్యాన్ని పొందిన బ్రహ్మాత్మకుడ నైన నాయందు, అంటే సద్రూప జీవతత్త్వమందు, పరమాత్మ శక్తి అయిన మాయచేత పరిణామశీలమై అసద్రూపమైన జడదేహాది ప్రాకృతిక వస్తుజాతం కల్పింపబడింది. ఈ దేహాది వస్తుజాతం భగవన్మాయచే కల్పింపబడినా, వాస్తవానికి భగవన్మాయామూలంగా జీవావిద్యా రూపమైన కర్మ చేతనే ఈ దేహాదికం కల్పింపబడింది. శ్రీరామానుజ దర్శనంలో అవిద్య అనే శబ్దం విద్యాభిన్నమైన కర్మను బోధిస్తుంది. మాయాశబ్దం జీవావిద్యారూపకర్మ పరిణామమైన దేహాది వస్తు జాతానికి పరిణామ హేతువైన భగవత్సంకల్ప రూపమై, భగవంతుని

ఆశ్చర్యకరశక్తిని **'మయిబ్రహ్మణి కల్పితం'** అన్నచోట, బోధిస్తున్నది. ఇక్కడ అద్వైతవాదాన్ని బట్టి, నాకంటే అభిన్నమైన బ్రహ్మమందు ఈ ప్రపంచం (జీవ ప్రకృతులు రెండూ) కల్పింప బడ్డాయని, కనుక రెండూ అంటే జీవ ప్రకృతి తత్త్వాలు రెండూ కల్పితాలే, అంటే అద్వైత వాదాన్ని బట్టి వాస్తవాలు కావు అని అధిష్ఠానమైన బ్రహ్మం మాత్రమే సత్యం అని జీవ ప్రకృతులు రెండూ మిథ్యాభూతాలే అని ఇలాంటి వివేకమే **'అస్ఖలితమతి'** అని అభిప్రాయం.

ఇక రామానుజ దర్శనంలో పరబ్రహ్మాత్మకుడైన జీవుని యందు కర్మాత్మకావిద్యా మూలంగా కల్పింపబడినదేహాది ప్రకృతి వాస్తవమే. 'కల్పితం' కాదు. కనుక 'కల్పిత' శబ్దానికి నిర్మితం అని అర్థం. ఈ జీవునికి అవిద్యాత్మక కర్మ కల్పితమైన దేహాది ప్రాకృతిక వస్తుజాతం, భగవత్ సంకల్ప రూప మాయాశక్తి చేతనే నిర్మింపబడినదని, ఇలాంటి వివేకం కలిగి ఉండటం అనేది శ్రీహరిపట్ల కల్గిన అచంచల భక్తి వల్ల ఏర్పడినదే నని శ్లోకతాత్పర్యం. భాగవతంలోని ఇలాంటి శ్లోకాలు ఎన్నో ఉన్నాయి. ఇలాంటివే విష్ణుపురాణంలోనూ ఉన్నాయి. వీటికి ఆయా సంప్రదాయాల్లో సమన్వయాలు తాత్పర్యాలు వేరుగానే ఆచార్యులు ప్రదర్శించారని, ఏదో ఒక విధమైన సమన్వయమే సరైనదని భావించడం సరికాదని గమనింపవలసి ఉంది.

ఇలా ఆ బాలుడు శరత్-ప్రావృట్ (వర్షా) కాలాలను రెంటినీ భాగవతులైన మహానుభావుల భగవద్గుణ కీర్తన శ్రవణం చేతనే గడిపాడు. దీని వల్ల ఆతనిలో ఆవిర్భవించిన భక్తి, అతిశయితమై రజస్తమో నిబర్హకం అయింది. ఇలా కల్మష రహితుడై నిత్య శుశ్రూషాశీలుడైన బాలునికి, అలవడిన శ్రద్ధకు అబ్బురపడి, భాగవతోత్తములు, పరమగుహ్యమైన శ్రీమన్నారాయణ తత్త్వాన్ని ప్రతిబోధించారు. వీరు బోధించిన ఈ తత్త్వజ్ఞానం సాక్షాత్ భగవంతుడు ప్రతిబోధించినదని భాగవతం పేర్కొంటున్నది.

**శ్లో॥ జ్ఞానం గుహ్యతమం యత్తత్ సాక్షాత్ భగవతోదితమ్।**
**అన్వవోచన్ గమిష్యంతః కృపయా దీనవత్సలాః ॥**

ఇత్యాది శ్లోకం చేత గుహ్యతమమైన జ్ఞానం ఎలాంటిదో నారదుడు చెబుతున్నాడు. **'గుహ్యతమం'** అంటే పరమ రహస్యమని అర్థం. *(ఇంకా ఉంది.)*

## సంప్రదాయానికి తీరనిలోటు



ఉ॥వే॥ శ్రీమాన్ **యస్. కృష్ణస్వామి అయ్యంగార్**, శ్రీరంగాభిజనులు. తెన్నాచార్య సంప్రదాయానికి వీరు చేసిన సేవ అసమానం. గడచిన **60** సంవత్సరాలుగా తమిళ్ మాస పత్రిక **"శ్రీవైష్ణవ సుదర్శనం"** సంపాదకులై రామానుజ సంప్రదాయంపై ఇతరులు చేసే మాత్సర్యపూర్ణాలైన కువిమర్శలను నిశితంగా ఖండిస్తూ ఆచార్య ఋణాన్ని తీర్చుకుంటున్న మహానుభావులు. గ్రంథరచనం, పరిశోధనం, వ్యాఖ్యాన విరచనం, ప్రవచనం ఇలా బహుముఖంగా సాగుతున్నది. వీరు వృత్తిరీత్యా న్యాయవాదులైననూ తాము ప్రేమించి, అనుష్ఠానంలో పండించుకొన్న సంప్రదాయాన్ని అన్యాయంగా కించపరిచే వారి దుష్టవృత్తిని ధీటుగా ఎదుర్కోవడం, యుక్తాయుక్తంగా నిరూపించి లోకానికి దర్శింపజేయడమే వీరి ప్రవృత్తి. దానికి నిశిత ధర్మాయుధం- **'శ్రీ సుదర్శన'** పత్రిక. దీనిద్వారా **60** సంవత్సరాలుగా అప్రతిహతంగా సాగిస్తున్న సంప్రదాయ ప్రచారానికి దాదాపు **3000** పుటలతో తాము నిర్మించిన శ్రీ గీతాభాష్య-తాత్పర్య చంద్రికల వివరణం అసమాన నిదర్శనం, రహస్య గ్రంథాలను, ఆళ్వార్ శ్రీ సూక్తులనిగూఢ తాత్పర్యాన్ని లోకానికి ద్రావిడాంగ్లాదిభాషల్లో అందించడం వీరికి గల అభినివేశాన్ని విశదపరుస్తున్నది. శత వసంతాలు ఎప్పుడో పూర్తిచేసికొన్నా నేటికీ మొక్కవోని వీరి సంప్రదాయ నిష్ఠాభినివేశాలు లోకానికి ఆదర్శప్రాయాలు, మార్గనిదర్శకాలు.

**వీరు అలంకరించిన పదవులు:** శ్రీవైష్ణవ సుదర్శనం పత్రికకు – సంపాదకులు; శ్రీనివాసం ప్రెస్‌కి – మేనేజర్; భారతీయ పూర్వశిఖ శ్రీవైష్ణవ సభ- శ్రీరంగం- గౌరవాధ్యక్షులగ; శ్రీభాష్య భగవద్విషయ ఆచార్యపీఠం- శ్రీరంగం-ఉపాధ్యక్షులగ; కోయిల్ తెన్నాచార్య సంరక్షణసభ- శ్రీరంగం – సభాధ్యక్షులుగ పదవులను అలంకరించారు. వీరు ఆచార్య తిరువడిని చేరడం సంప్రదాయాభివృద్ధికి తీరని లోటు. శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్‌స్వామి మనకు ఎప్పుడూ ప్రాతఃస్మరణీయులే. వీరు వేసిన మార్గంలో నడవడానికి ప్రయత్నిద్దాం!

- **భక్తినివేదన**



# కలివైరిసూరి వైభవము

గత సంచిక తరువాయి...

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-7-10**

శెజ్గణాళి యిట్టిఱైంజుమ్ శింగవేழ்குన్నుడైయ
ఎంగళీశ నెంబిరానై యిరుందమిழ் నూఱ్పులవన్ ।
మంగైయాళన్ మన్ను తొల్‌శీర్ వణ్డఱైతార్ కలియన్
శంగైయాళన్ శెఞ్జొల్‌మాలై వల్లవర్ తీతిలరే ॥

**ప్రతిపదార్థము:** శెవ్=ఎఱ్ఱనైన; కణ్=కన్నులుగల; **ఆళి**=సింహములు; **ఇట్టు**=(కానుకలుగ) సమర్పించి; **ఇఱైఞ్జుమ్**= ఆశ్రయించునటువంటి; **శింగవేழ் కున్ను**=శింగవేழ் అను పర్వతమును; **ఉడైయ**=వానస్థానముగగల; **ఎంగళ్**=మాయొక్క; **ఈశన్**= సర్వేశ్వరుడును; **ఎంబిరానై**=మాకుఉపకారకుడును; అయిన సర్వేశ్వరునిగూర్చి; **ఇరుమ్**=గొప్పదైన **తమిళ్‌నూల్**=తమిళశాస్త్రము నందు; **పులవన్**=కవులును; **మంగైయాళన్**=మంగైనాడును ఏలెడివారును; **మన్ను**= స్థిరమైనదియు; **తొల్**=ఆదిలేనిదయిన; **శీర్**= సంపదయును; **వండు**=తుమ్మెదలు; **అఱై**=ధ్వనించుచున్న; **తార్**= మాలికలను గలవారును; **శంగైయాళ్**=మిక్కిలిఉదారులైన; **కలియన్**= శ్రీపరకాల మునీంద్రులనుగ్రహించిన; **శెం**=శ్లాఘ్యమైన; **శొల్‌మాలై**= శ్రీసూక్తులనెడి మాలికలను; **వల్లవర్**=అభ్యసించుటకు సమర్థులైనవారు; **తీతుఇలరే**= దోషములేని వారగుదురు.

**తాత్పర్యము:** ఎఱ్ఱని కన్నులుగల సింహములు తమకు లభించిన స్థలము అహోబిలక్షేత్రము. దానిని నివాసస్థలముగ చేసికొన్నవాడును, నాకు స్వామియయినవాడును, ఉపకారుడునైన శ్రీనరసింహమూర్తిని గూర్చి స్తోత్రము చేసిన వారు శ్రీ పరకాలసూరి. వీరు తమిళశాస్త్రమున సమర్థులగు పండితులు. మంగైనాడునకు ప్రభువులు. శ్రీవైష్ణవశ్రీని నిత్యసంపదగాగల భాగ్యశాలురు, పరమ ఉదారులు. తుమ్మెదలు తేనెను ఆస్వాదించునటువంటి పుష్పమాలికలను ధరించి యుండువారు.

**విశేషార్థములు:** పరాక్రమాతిశయము చేత ఎఱ్ఱబారిన కన్నులుగల సింహములు తమకు ప్రతికూలములగు జంతువులను చంపి వానిని శ్రీనరసింహుని నైవేద్యమునకై తెచ్చి ఆస్వామియొక్క శ్రీపాదములముందట పడవేయుచుండును. భగవంతునకు మాంసమును నైవేద్యముచేయవచ్చునా అనుసందేహము ఇట కలుగవచ్చును. **యదన్నః పురుషో భవతి తదన్నాః తస్య దేవతాః** మనము దేనిని భుజింతుమో దేవతలును దానినే భుజింతురు. అని ప్రమాణము తెలుపుచున్నది. కనుక ఇది దోషముకాదు.

ఘంటాకర్ణుడనే రాక్షసుడు తాను ఆహారముగా గొనెడి మాంసమును భగవంతునకు నివేదన చేసి తినెడివాడట.

నవం శవమిదం పుణ్యం వేదపారగమచ్యుత!
**యజ్ఞశీలం మహాప్రాజ్ఞం బ్రాహ్మణం శవముత్తమమ్** అని హరివంశము తెలుపుచున్నది.

**తాత్పర్యము:** ఓ అచ్యుతా! ఈ శవము బ్రాహ్మణశవము. ఈ బ్రాహ్మణుడు వేదాధ్యనమునుచేసినవాడు. పుణ్యుడు, యజ్ఞయాగాదులను చేయువాడు. గొప్పప్రాజ్ఞుడు. ఉత్తముడు. ఈ శవము పర్యుషితముకానిది. (పాసిపోయినది కాదు) అని పలికి భగవంతునకు శవమొకదానిని అర్పించెను కదా!

శ్రీనరసింహస్వామి అహోబిలపర్వతమును వాస స్థానముగ గలవాడు. సంసారులమైన మనము కూడ ఆశ్రయించుటకు వీలుగనుండు మహోపకారకుడు ఆ స్వామి.

**ఇరుంతమిழ் నూర్పులవన్ :** ఏ ఒక్కరును సమగ్రముగ తెలిసినకొనుటకు వీలుగాని ద్రావిడశాస్త్రమును సమగ్రముగ నెరింగిన జ్ఞానాధికులు శ్రీకలివైరిసూరి.

**మంగైయాళాన్**: మంగైనాడు పాలించెడివారు.

**మన్నుతొల్‌శీర్**: **లక్ష్మణో లక్ష్మి సంపన్నః** లక్ష్మణుడు కైంకర్యమనే సంపదను కలవాడన్నట్లు ఈ తిరుమంగై ఆళ్వారులు కూడ పారతంత్ర్యమనెడి సంపదను స్థిరముగ గలవారు.

**వండఱైతార్ కలియన్:** తుమ్మెదలు మధుపానము చేసి ధ్వనించుచున్న పుష్పమాలికలను ధరించినవారు తిరుమంగై ఆళ్వారులు.

**శెంగై యాళన్:** పరమ ఉదారులు. పెరియ తిరుమొழி దివ్య ప్రబంధమును మనకు అను భావ్యమగునట్లు కృపచేసినవారు.

**శెంశొల్‌మాలైవల్లవర్**: తెలిసికొన తగిన అర్థములను స్పష్టముగ వాస్తవముగ తెలియజేయునటువంటి ఋజువులగు శబ్దములను సంపదగలవారు.

**తీతిలరే:** ఈ దశకమును అనుసంధించువారికి కీడు ఎన్నటికిని కలుగదు. శ్రీ నరసింహమూర్తి అనుసంధాతల విరోధులను తొలగించును. కనుక వారికి కీడు కలుగనే కలుగదు.

ఈ దశకము సమాప్తము.



# అహో! భారతమ్

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

## శకుంతల - దుష్యంతుల చరిత్ర

మహాభారతం అందమైన కథలెన్నింటికో పుట్టినిల్లు. ఆ కథలన్నీ మానవజీవితాన్ని అద్భుతంగా ప్రతిబింబించే దర్పణాలే! లోకమంతా స్పష్టంగా కనిపిస్తుంది ఈ కథలలో. ఎందరో ధర్మాత్ములు, పుణ్యశీలురు తమ జీవితాలని ఇతరులకి ఆదర్శంగా నిలబెట్టేంత ఉదార చరితగల మహనీయులు. వీరితో పాటే మానవుని బలహీనతలు, అవకాశవాదాలు, ఆకర్షణలు, ప్రలోభాలు, మమతలు, మాత్సర్యాలు ఇలా సకల జీవకోటియొక్క జీవితానికి నిలబెట్టిన అద్దమే మహాభారతం. అందులో ఒక ఆణిముత్యం శకుంతల కథ.

ఋషుల ఆశ్రమాలు-ధర్మాలు, రాజులపాలన, ధర్మదీక్ష, కర్తవ్యనిష్ఠ, వివాహ పద్ధతులు, ఆచారాలు, సంప్రదాయాలు, ఉపదేశాలు... ఇలా ఎన్నో దర్శనమిస్తాయి భారత కథలలో. ఆ కథలలో అందమైన ధర్మబోధకమైన కథే మహారాజు దుష్యంతుని కథ.

రథంతరి, ఇలినుడు అనే దంపతులు ఎంతో ధర్మంగా రాజ్యపాలన చేస్తూ ఉండేవారు. ఆ రాణికి, రాజుకి కలిగిన సంతానమే దుష్యంతుడు. రాజులు అనగానే వేట అనేది ఆ రోజుల్లో వీరలక్షణంగా కనిపించే వ్యసనం.

దుష్యంతునికి వేట అంటే ఎంత ఇష్టమో... వేటకి బయలుదేరాడు అంటే టప టపా... సింహాల్ని, పులుల్ని, ఏనుగుల్ని.. ఏదో ఒక జింకపిల్లని పట్టుకున్నంత తేలికగా వేటాడేశేవాడు. ఆయన విశాల రాజ్యంలో ఎన్నో దుర్గమారణ్యాలున్నాయి. తపోవనాలూ ఉన్నాయి. ఎంతో ధర్మంగా పరిపాలించే రాజుగా పేరు తెచ్చుకున్నాడాయన. రాజు చూపించే ప్రత్యేక శ్రద్ధ వలన రాజ్యంలో రోగాలు లేవు. దుఃఖాలు లేవు. రాజంటే ప్రజలకి ప్రాణం. తమ రాజుని, ఆయన పాలనని గూర్చి ఎంతో ఆనందంగా చెప్పుకుంటూ ఉండేవారు ప్రజలు.

ఒకనాడు దుష్యంతుడు ఎంతో ఉత్సాహంతో వేటకి బయలుదేరాడు. మనసంతా ఏదో తెలియని ఆనందంతో నిండిపోయింది. ఎందుకో! ఈ వేట అనేది ఈనాడెంత పరవశాన్ని కలిగిస్తోంది. వేటాడేదెవరినో - ఏమో.. రథం పరుగులు తీస్తోంటే, డప్పుల మ్రోతలకి, సైనికుల అలజడికి జంతువులన్నీ పరుగులు తీస్తున్నాయి. ఇది వేటాడడానికి ఎంతో సహాయకారిగా ఉంది... భలే..! పులి ఎంత వేగంగా మీద పడబోయింది. ఒకే ఒక్క బాణం దెబ్బతో నేలవాలింది... ఓ.. అదుగో అడవి పంది. అబ్బా ఎంత భయానకంగ ఉందో.. రథాన్ని దూకించాలని.. ఆ ... ఇంకెక్కడికి పోతుంది!? రివ్వుమని వెళ్ళిన బాణం కస్సుమని దిగిపోయింది దాని శరీరంలో... ఒక్కసారి ఊపిరి పీల్చుకున్నాడు రాజు. అరె... జింకలు.. ఆహా ఏమా పరుగులు.. అలా.. అలా.. అలా... ఆకాశంలోకి ఎగిరి దూకుతూ బ్రతుకుజీవుడా అంటూ తప్పించుకున్నాయి. ఆ అందాలు చూస్తూ బాణం వెయ్యడం మరిచిపోవడం వల్లనే కదా అలా తప్పించుకున్నాయి. ఏం పరవాలేదు. మళ్ళీ కనిపిస్తాయి. రథం గాలిలో తేలిపోతుందన్నట్లు సాగుతోంది. ఎన్ని జంతువులు రాజుగారి బాణాలతో నేస్తం చెయ్యాలని నేలరాలాయో... ఆ వేగానికి, కూడా వచ్చే భటులు తట్టుకొన లేకపోయారు. అడవిలో సగం దూరం వచ్చాక.. అలసటతో, ఆకలిదప్పులతో అదుపు తప్పి ఎక్కడి వారక్కడే ఆగిపోయారు. కొద్దిమంది మాత్రం రాజుని ఒంటరిగా విడువలేక, కూడా సాగారు. అందరికీ అలసట.. దాహం... అబ్బ... ఎక్కడైనా కాసిన నీళ్ళు దొరికితే చాలు... ఎక్కడ... ఎక్కడుందో నీరు?

ఆc.. అదిగో నది! అమ్మయ్య నీరు కనిపించింది. ఇంకా గొంతెండిపోతోంది. తొందరగా... తొందరగా అమ్మయ్య... రథం ఇలా ఆపుదాం. ఇది మాలినీ నది కదా! గబగబా నది దగ్గరగా నడిచి, నీళ్ళలో దిగి కాలు చేతులు, ముఖం చల్లని నీళ్ళతో కడిగి రెండు చేతులతో నీరు తీసుకొని ఆనందంగా త్రాగాడు దుష్యంతుడు.

ఆహా! ఈ నీరెంత తియ్యగా, స్వచ్ఛంగా ఉంది. అందుకే మంచి నదీజలాలని మంచివాడి మనస్సుతో పోల్చారు మహాకవులు. ఏ చెడు భావాలు చేరని మనస్సు, ఏ మాలిన్యం చేరని నీరు... ఆహా! చేతులతో ముఖంపైనా అలా అలా జల్లుకొని ఆనందించి ముఖం ఎత్తి చుట్టుప్రక్కల చూశాడు దుష్యంతుడు.

చుట్టూ ప్రకృతి రమణీయంగా ఆహ్వానిస్తున్నట్లు కనిపించింది. నదికి అటువైపు తపోవనం! ఋషి ఆశ్రమం..

కుటీరాలు.. చెట్లు... పావురాలు.. మంత్రఘోషలు, పక్షుల కిలకిలా రావాలు.. ఇటు ఇంత భయంకరమైన అడవి. నదికి అటువైపు శాంతిపుష్పాలు సుగంధాలు వెదజల్లే ఋషుల ఆశ్రమం. ఈ రెండింటికి నడుమ అందంగా మెలికలు తిరుగుతూ మాలినీనది.

ఆహా! ఎంత అద్భుత దృశ్యం! ఇంతసేపు సాగిన వేట... ప్రాణహాని... ఇపుడు కొత్త ప్రాణాలు పోస్తున్నట్లున్న తపోభూమి. అదేమిటి..! ఆ మూల.. పామునీడలో కప్ప... ఒకటి తినేది.. ఒకటి తినబడేది.. భయంలేదే ఆ కప్పకి..!? జాతి వైషమ్యాలున్న ఈ జంతువులు కూడా ఇంత ప్రేమాస్పదంగా మెలగడానికి కారణం... మహర్షి తపశ్శక్తి గదా! లోపలికి పోయి చూద్దాం.

ఓహ్.. ఈ లతలన్నీ ఒక్కసారి ఇలా పూలు నాపై కురిపించి నా చుట్టూ అల్లుకుంటూ... ఓ ఇది స్వాగతం పలుకడం కాబోలు.. ఇలాంటి అనుభవం మళ్ళీ వస్తుందా ఈ తుమ్మెదలు ఝంకారం చేస్తూ ఆశీర్వచనాల మంత్రాలు చదువుతున్నాయా..! ఈ లతలు అక్షతలు జల్లుతున్నట్లు పూలు రాలుస్తున్నాయా... అంత బడలిక ఎలా మాయం అయి పోయింది! ఈ నదీశీకరాలు చల్లగా పైనబడి పిల్లగాలులు ఒంటిని తాకుతూ ఉంటే ఏదో లోకాల్లో తేలిపోతున్నట్లుంది మనస్సుకి. కమ్మని నేతుల సువాసన.. యజ్ఞంలో హవిర్భాగ పరిమళాలు.. వేదనాదాలు.. సామగానాలు. ఆ గానానుగుణంగా తమ తొండాలు కదుపుతూ, చెవులు ఆడిస్తూ నిలిచిన ఏనుగులు. నీవారధాన్యం. అన్నం ముద్దలు కలిసి మెలిసి తింటున్న పిల్లులు, ఎలుకలు.. అరె..! ఎంత ఆశ్చర్యం?! శత్రుత్వ భావమే కనిపించదేమిటి? ఋషి తపోబలమా?

ఔను ఇది కణ్వమహర్షి ఆశ్రమం. సహజవైరం కలిగిన జంతువులు కూడా ప్రేమాదరాలనే పంచుకొనే తపోభూమి కణ్వమహర్షి మహిమకి నిదర్శనం. ఆ మహనీయుని ఒక్కసారి దర్శించి, నమస్కరించి వస్తాను "దర్శనాదేవ సాధవః" ఒక్కసారి మహనీయులని దర్శిస్తే చాలు పాపాలన్నీ పటాపంచలౌతాయట. మీరంతా ఇక్కడే ఆగిపొండి..! నేను ఆశ్రమంలో ప్రవేశించి, మహర్షి ఆశీస్సులంది వస్తాను అంటూ అందరినీ అక్కడే ఆపి ఒంటరిగా ఆశ్రమం ప్రవేశించాడు దుష్యంతుడు.

ఓహ్... కుడికన్ను, కుడిభుజం అదిరాయేమిటి? ఏం శుభం చోటుచేసికొనబోతోంది? పెద్దల దర్శనాన్ని మించిన మంచి వేరే ఏముంటుంది? ఎందుకో తెలియని ఆనందం... నెమ్మదిగా ఆశ్రమం చేరాడు.. దూరంగా ఎవరది? పద్మంలో పద్మంలా? ఔను ముఖమొక పద్మం. ఆ పద్మంలో ఆ కళ్ళు పద్మదళాలు. అది సంపంగి పూవా... ఓ ముక్కు కదా...! ఆ పెదవులు.. వర్ణనాతీతాలు. క్రింద రెండు చిన్న చిన్న గచ్చకాయలు పక్కపక్కన పెట్టినట్లు అందమైన గడ్డం.. ఎవరీ అపురూప సౌందర్యరాశి? మహాలక్ష్మిలా ఉన్న స్త్రీ అతని కన్నుల ముందు నిలిచింది.

నల్లని కళ్ళనెత్తి దుష్యంతుని చూచి 'స్వాగతం రండి' అంటూ ఆహ్వానించింది. అర్ఘ్యపాద్యాదులనిచ్చి గౌరవించింది.

యాంత్రికంగా ఆమె స్వాగతాదులనందుకొన్నాడు రాజు. మన్మథ రాజ్యలక్ష్మిలా ఉన్న ఆ సౌందర్యానికి రాజు ముగ్ధుడయ్యాడు. ఈవిడ మునికాంతా? వేషం మాత్రం అలా ఉంది కాని రూపం అలా అనిపించడం లేదే...?

'ఇది కణ్వమహర్షి ఆశ్రమం కదా.. ఆయన...' అంటూ ఆగాడు దుష్యంతుడు.

'పళ్ళు, పూలు, పూజాద్రవ్యాలకోసం అడవిలోపలికి వెళ్ళారు మహర్షి. వారు వచ్చేదాకా దయచేసి ఆసీనులుకండి' అంది.

'మరి నువ్వు... ఎవరివి? ఇక్కడికెందుకు వచ్చావు?' అన్నాడు.

'రాజా! నేను కణ్వమహర్షి పుత్రిని'.

'ఔనా! కణ్వమహర్షి గొప్ప తపస్సంపన్నులు, ఇంద్రియాలని జయించినవాడు. ఆయనకి.. కూతురంటే..?' ప్రశ్నార్థకంగ చూచాడు. *(ఇంకా ఉంది)*



# సీతాఫలం రామార్పణమ్



(గతసంచికతరువాయి..)

**శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్**

**అట్లే వార్ధకము కూడా..**

**దాసాః పుత్రాః స్త్రియశ్చైవ బాంధవా స్సుహృదస్తదా ।**
**హసంత్యున్మత్తక మివ నరం వార్ధక కంపితమ్ ॥**

ముసలితనముచేత వణుకుతున్న శరీరము కలిగిన నరుని సేవకులు, పుత్రులు, బాంధవులు, భార్యాబిడ్డలు, మిత్రులు అందరునూ వెఱ్ఱివానివలే చూచెదరు. మహాత్మా! కాలమూ దోషభూయిష్టమే! అని చెప్పబడుచున్నది.

ఈప్రపంచమొక యజమానిలేని పాత ఇల్లు. దీనియందున్న సజ్జనులే వివిధ మణులు. అటువంటి మణులను కాపాడేవారు లేక రత్నాలదొంగ తన ఇష్టము వచ్చినట్లు రత్నములను ఎత్తుకొని వెళ్ళి భయంకరమైన మృత్యుగుహలో పడవేయుచున్నాడు. (యజమానిలేక అనగా మృత్యువు నాపువాడు లేడని అర్థము).

మునివర్యా! యింక నిషిద్ధ విషయములను ఆకర్షించుట ఆచరించుట అనునది వెయ్యి జన్మలనైనను చెడగొట్టును. ఎట్లన విషము తిన్నవాని శరీరమును విషము నాశనము చేయునట్లు, విషముకన్నా విషయవైషమ్యము సహింపరానిది. (అనగా ఆచరించ తగని విషయముల దరికి పోరాదని) కనుక **"యథా జానాసి భగవన్ తథా మోహనివృత్తయే"** మహాత్మా నీవెరిగిన మోహ నివృత్తిరీతిని నాకు చెప్పుము.

**బ్రూహి మే సాధవో యేన నూనం నిర్దుఃఖితాం గతాః**

సత్పురుషులు దేనివలన దుఃఖరహితులు అయినారో నాకు తెలియచేయుము అని అడిగిన రామచంద్రుని మాటలకు విశ్వామిత్ర మహర్షి "వత్సా రామా! నీవు జ్ఞానశ్రేష్ఠుడవు. నీకు తెలియనిది ఏదీ లేదు నీవు తెలుసుకొనుటకు మిగిలినది కూడా ఏదీ లేదు. నీ అంతట నీవే సూక్ష్మబుద్ధితో సర్వమూ తెలుసుకొని నావు. అయిననూ నీవు అడిగినావు కనుక వసిష్ఠమహర్షి నీకు తగినట్లు సమాధానము చెప్పగలడు" అని పలుకగా, వసిష్ఠముని ఈ విధంగా తెలియచెప్పినాడు.

ఉత్పత్తి (పుట్టుక) స్థితి (పెరుగుట) నిర్యాణము (మరణము) లను గురించి చెప్పి, తత్త్వమెరిగిన రామచంద్రా! జ్ఞానమనే ఉపాయంచేత సంచరించే వారికి సంసారం (ఈ సమస్త ప్రపంచమూ) గోష్పదంవంటిది. (ఆవుకాలిగిట్టక్రింద ఏర్పడిన చిన్నగుంటవంటిది) అనగా సులభముగా దాటతగినది. అట్లుగాక జ్ఞానయోగాన్ని విడిచి పెట్టినవారికి గొప్ప సుడిగుండ భూయిష్టమైన మహాసముద్రమువంటిది.

**మహానుభావ సంపర్కా త్సంసారార్ణవ లంఘనే ।**
**యుక్తి స్సంప్రాప్యతే రామ దృఢా నౌరివ నావికాత్ ॥**

రామా! మహనీయుల సత్సంగమువలన మంచి నావికుని చేత నడుపబడు నావవలే సాగరము దాటుటకు చక్కని ఉపాయము లభించును.

**పరమేష్ఠి ముఖా దేవా జనకాద్యా నరా యథా ।**
**లోకవృత్తేష్వ సంసక్తా యథా పద్మాని వై జలే ॥**

రామా! బ్రహ్మాది దేవతల నుండి ఆసక్తిని విడిచి నీటిలోని పచ్చితామరాకునకు నీరు అంటని విధంగా

**లోకసంగ్రహ కార్యార్థం కర్మ కుర్వంతి సర్వదా ।**
**తథా త్వమపి నిష్కామః కర్మాచర రఘూత్తమ! ॥**

లోక సంగ్రహణమునకై వ్యవహారిక (లోక వ్యవహారములను) కర్మలను ఆచరిస్తూనే ఉన్నారు. అదే విధముగా నీవు కూడా ఫలాపేక్ష కర్మలతో సంగము లేకుండా లోకసంగ్రహార్థము కర్మనాచరించు చుండుమని బోధించాడు. మహాసూక్ష్మ బుద్ధిశాలి అయిన శ్రీరామచంద్రుడు గురువు వసిష్ఠులవారి ఉపదేశ తత్త్వమును గ్రహించి మనస్సులోని చింతను విడనాడినాడు. తాను కూడ జనకునివలే నిష్కామ కర్మతో లోకవ్యవహారములను లోక కళ్యాణార్థము నిర్వర్తించుటకు కృతనిశ్చయుడైనాడు. అనంతరము తల్లి కౌసల్య స్వస్త్యయనముతో, తండ్రి దశరథ మహారాజు ఆశీస్సులతో, వసిష్ఠాది మహర్షులకు నమస్కరించి లక్ష్మణుడుతో కూడి ధనుర్ధారి అయి ఉత్సాహంగా విశ్వామిత్రుని వెంట యాగరక్షణార్థము బయలుదేరినాడు.

రామలక్ష్మణులను తనవెంట తీసుకొని వెళ్ళి తాటకిని వధింపచేసి, ఆమె రాక్షసజన్మకు విముక్తి కలిగించాడు. సిద్ధాశ్రమ మున యాగారంభము చేసి దాశరథులను యాగరక్షణకు నియమించినాడు. శ్రీరాముడు మారీచుని మానవాస్త్రంతో లంకలో పడవేసి సుబాహుని వధించి, విశ్వామిత్రుని యాగరక్షణ చేసి కౌశికముని కోరిక తీర్చాడు.

అదే సమయంలో మిథిలాపురాధీశుడైన జనకమహారాజు వద్ద

నుండి సీతా స్వయంవరాహ్వానము విశ్వామిత్రునకు అందినది. శ్రీరామచంద్రునకు వివాహముచేసి, అయోధ్యకు పంపవలెనని తలచినాడు కౌశికముని. సిద్ధాశ్రమ మునులు, దాశరథులతో మిథిలకు బయలుదేరాడు.

**రామకరుణలో కరిగిన నిషాద గుహుని పురాజన్మశాపం**

ప్రాతఃకాలాన లేచి అందరూ గంగాతీరానికి చేరారు. అక్కడయున్న ఒకనావమీద అందరూ ఎక్కారు. కానీ, శ్రీరాముడు కాలుపెట్టబోతుంటే నావికుడు గుహుడు అడ్డగించాడు. 'గుహా! అందరినీ నావ ఎక్కించినావు కదా! నన్నెందుకు ఆపావు?' అని అడిగాడు శ్రీరాముడు.

'రామా! నీ పాదాలు కడుగకుండా నీకాలు నా నావమీద పెట్టనీయను. ఇంతకు ముందే ఒక రాతిని నాతిగా చేసి వచ్చావని నాకు తెలుసు. అలాగే నా కొయ్యపడవ స్త్రీగా మారితే నాజీవనం పోతుంది. అంతే కాదు రామా! నాకొక భార్య ఉన్నది. మరల స్త్రీరూపము ధరించిన నా నావను నేనేమి చేయనూ?' అని చేతులు జోడించాడు.

**నిషాద త్వం పరం భక్త మహం వేద్మి గుణోత్తరమ్ ।**
**యథేష్ట మాచర క్షిప్ర మానయ త్వం సుపాద్యకమ్ ॥**

'గుహా! నీవు పరమ భక్తుడవని నాకు తెలుసు. శీఘ్రమే కాళ్ళు కడుగుటకు నీటిని తెమ్ము' అని శ్రీరాముడు పలుకగా గంగా జలముతో రామపాదాలు కడిగాడు గుహుడు. 'గుహా! నీకేమి కావలెనో కోరుకో'మన్నాడు శ్రీరాముడు. అప్పుడు గుహుడు

'రామప్రభూ! నీవు గొప్ప భవరోగ వైద్యుడివని విన్నాను. నా భవరోగమునకు చికిత్సచేసిన చాలు. అంతేకాదు. నేను కడిగిన నీ పాదాలమీద నిశ్చలభక్తి సదా నాకు ఉండాలి. అనుగ్రహించు'మని కోరాడు. శ్రీరాముని నది దాటించాడు. 'రామా! నిన్ను నేను నదిని దాటించినట్లు నీవు నన్ను సంసార సముద్రాన్ని దాటించు'మన్నాడు.

ఆవిధంగా కోరిన గుహుని రామచంద్రమూర్తి గాఢంగా కౌగలించుకున్నాడు. 'గుహా! నీవు నాకు పరమ మిత్రుడవు. వెళ్ళి కలకాలం సుఖశాంతులతో జీవించు'మని పంపించాడు.

మహర్షులంతా గుహుడు "ధన్యుడు. సదాచారము ఎరుగని జాతి, ధనహీనుడు. అయిననూ శ్రీరామచంద్ర దయాపాత్రుడైనాడు కదా! ధనము చేత, జాతిచేత, గుణముచేత ఆ భగవంతుడు సంతసించడు. కేవలము భక్తిప్రియుడ"ని ఎంతగానో చెప్పుకున్నారు. ఆ మాటలు విన్న నైమిశారణ్యమునులు సూతమునీ! అంతటి అదృష్టమునకు గుహుని పురాజన్మపుణ్యం ఏమిటో చెప్పుమని అడిగారు. అంతట సూతముని... ఇలా చెప్పసాగెను. (సశేషం)

# ముముక్షు రహస్యం

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

*(గతసంచికతరువాయి...)*

'ఏమే ప్రతిభా! ఈ పూలు కడుతూ వాళ్ళకు కథ చెప్పరాదూ..!' అంది బామ్మ.

'బామ్మా సమయానికి వచ్చావు. పూలు నేను కడతాను కాని కథ నువ్వు చెప్పు...!"

'సరేలే సంబరం.. నాకు వంటింట్లో పనులున్నాయి. ఇవాల్టికి నువ్వే చెప్పు..."

"మొదలు పెట్టక్కా.."

**"అవన్ దైవ మన్రేనో మండోదరియైప్పోల"** అంటే అతడే "దైవమని చెప్పానా మండోదరిలాగా" అని అర్థం.

"ఇక్కడ అతడంటే ఎవరో చెప్పండి...?"

"శ్రీరాముడే కదూ..."

"సరిగ్గా చెప్పావు. రామ రావణ యుద్ధంలో చివరికి శ్రీరాముడు రావణ సంహారం చేశాడు కదా! అప్పుడు రావణుడి భార్యలందరూ యుద్ధభూమికి వచ్చి అక్కడ చచ్చిపడి ఉన్న రావణుడి శరీరాన్ని చూసి ఏడుస్తున్నారు. జుట్టు విరబోసుకొని గుండెలు బాదుకుంటూ రావణ గుణాలను, బలాన్ని చెప్పుకుంటూ ఏడుస్తున్నారు."

"అందుకేనా జుట్టు విప్పుకొని జడ వేసుకోకుండా అటూ ఇటూ తిరిగితే బామ్మ 'మండోదరిలా జుట్టు విరబోసు కున్నావేమిట?'ని కోప్పడుతుంది."

"అవును జుట్టు విరబోసుకోవటం అశుభం. అనారోగ్యం కూడా. సరే ఈ మండోదరి ఎవరంటే దానవరాజైన మయుడి కూతురు."

"కబంధుడు కూడా దానవుడే కదా!"

''అవును రాక్షస రాజు భార్య అయినా మహాబుద్ధిమంతురాలు. అందుకే రావణుడు సీతను అపహరించి తెచ్చినప్పుడే "ఇది తప్పు" అని చెప్పింది. ఇప్పటికైనా మించిపోయింది లేదు. తిరిగి రాముడికే అప్పచెప్పి రమ్మన్నది. రావణుడు వినలేదు. తరువాత కూడా చాలాసార్లు చెప్పింది.

"రాముడు కేవలం మానవుడు కాదు. ఆ పరమాత్మ అవతారం. సీత మామూలు మానవస్త్రీ కాదు. శ్రీమహాలక్ష్మి. నువ్వు చేస్తున్నపని నీ ఒక్కడికే కాదు. నీ కులానికి, నిన్ను నమ్మిన నీ ప్రజలకు, మాకు అందరికీ ఆఖరికి లంకకి చేటు" అని చెప్పింది. పెడచెవిన పెట్టాడు.

రాముడు పెద్ద వానరసైన్యాన్ని కూడగట్టుకొని రానే వచ్చాడు. రావణుడిని చంపాడు. అప్పుడు యుద్ధరంగంలో అతని శరీరం అంతటా దిగిన బాణాలు, ఆ గాయాలనుండి కారిన రక్తంతో భీకరంగా, నిర్జీవంగా, కొండలా పడి ఉండడం చూసి ఏడ్చింది మండోదరి. "అప్పుడే శ్రీరాముడి గురించి చెప్పాను. నువ్వు వినలేదు" అని శ్రీరాముడి అవతార రహస్యాన్ని చెప్తుంది. ముఖ్యంగా యుద్ధకాండలో 114వ సర్గలో నాలుగు శ్లోకాలు శ్రీరాముని అవతార రహస్యాన్ని తెలిపేవి. ఆ శ్లోకాలు ముందు చెప్పి తరువాత అర్థం చెపుతాను. సరేనా...

**"వ్యక్తమ్ ఏష మహాయోగీ పరమాత్మా సనాతనః ।**
**అనాధిమధ్య నిధనో మహతః పరమో మహాన్ ॥ 14**
**తమసః పరమో ధాతా శంఖ చక్రగదా ధరః ।**
**శ్రీవత్సవక్షా నిత్యశ్రీః అజయ్యః శాశ్వతో ధ్రువః ॥ 15**
**మానుషం వపురాస్థాయ విష్ణుః సత్యపరాక్రమః ।**
**సర్వైః పరివృతో దేవైః వానరత్వముపాగతైః ॥ 16**
**సర్వ లోకేశ్వరః సాక్షాత్ లోకానాం హితకామ్యయా ।**
**సరాక్షసపరీవారం హతవాం స్త్వాం మహాద్యుతిః ॥ 17**

రావణాసురుని చంపిన శ్రీరాముడు కేవలం మానవుడా కాదు. 'మహాయోగీ' అంటే శరణుకోరిన వాళ్ళని రక్షించటంలో శక్తిమంతుడు."

"అందుకే కదా సీతమ్మకపకారం చేసిన కాకాసురుడిని కూడా రక్షించాడు."

"పరమాత్మా!" అంటే ఆత్మలన్నింటికంటే గొప్పదని అర్థం. ఆత్మలన్నిటికి పుట్టడం, ఉండటం, పెరగటం, మారడం, తగ్గడం, నశించడం అనే వికారాలుంటాయి. పరమాత్మకు ఈ వికారా లుండవు. 'సనాతనః' అంటే ఎప్పటికీ ఉండేవాడు, శాశ్వతుడు అని అర్థం. 'అనాదిమధ్యనిధనః' అంటే కాలప్రమేయం లేనివాడు. ఆత్మలన్నింటికి మొదలు, మధ్య, అంతములనేవి ఉంటాయి. పరమాత్మకు ఉండవు. ఆయన శాశ్వతుడు కదా! "మహతః పరమో మహాన్" బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలందరి కంటే గొప్పవాడు, ఉన్నతుడు. **తమసః పరమః** అంటే ఈ ప్రకృతి మండలానికతీతమైన పరమపదంలో ఉండేవాడు."

"నారాయణుని నిత్యనివాసం పరమపదమే కదా!"

ధాతా : సకల ప్రాణులను సృష్టించువాడు, పోషించువాడు.

'శంఖ చక్రగదా ధరః'

"నేను చెప్తానక్కా. శంఖము, చక్రము, శార్ఙ్గము ధరించినవాడు. కరెక్టేనా!" గోదా.

"ఇంకో రెండు ఆయుధాలుండాలిగా. అవి చెప్పలేదేం!"

"నువ్వు మూడే చెప్పావుగా. "

"కౌమోదకీ, నందకం... అంటే ఏమిటి చిన్నా?"

"అది కూడా తెలియదు పాపం... 'కౌమోదకీ' అంటే గద, 'నందకం' అంటే ఖడ్గం... కత్తి... అర్థమయిందా!"

'శ్రీవత్సవక్షాః' : ఆయన హృదయం మీద 'శ్రీ' యొక్క చిహ్నం అంటే మహలక్ష్మి చిహ్నం ఉంటుందన్నమాట. వేదాలలో కూడా 'నారాయణు'డికి గుర్తుగా 'శ్రీవత్సచిహ్నం' చెప్పబడిందని పెద్దలు చెప్తారు. "నిత్యశ్రీః" నిరంతరం లక్ష్మీదేవితో కలిసి ఉండేవాడు. "అజయ్యః" భక్తులకు తప్ప ఎవ్వరికీ వశపడడు అని అర్థం."

"భక్తితో ఉంచిన తులసీదళానికే తూగాడు కదూ!"

"శాశ్వతః : క్షయము ఉండదు నారాయణునికి."

"క్షయమంటే ఏమిటి?"

"తగ్గిపోవటం, కుంగిపోవటం, క్షీణించి పోవటం. ఇలాంటివేవీ ఆ స్వామికి ఉండవు. పై గుణాలన్నీ రాముడికి ఉన్నాయని అంటే అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడైన ఆ శ్రీమన్నారాయణునికి ఉన్న గుణాలన్నీ ఈ శ్రీరాముడికి ఉన్నాయి. అందువల్ల ఆయన అవతార పురుషుడు. ఆయనతో వైరం పెట్టుకోకు అని ఎన్నోసార్లు మొర పెట్టుకుంటే వినకుండా నీకు, వంశానికీ, లంకకు చేటు తెచ్చావని మండోదరి ఏడుస్తోంది. అధికారం, బలం, సంపద వలన వచ్చిన అహంకారంతో ముందు వెనుక చూడక మంచి చెడు ఆలోచించక సీతమ్మనే ఎత్తుకొచ్చి, రాముడితో వైరం పెట్టుకొన్న దుర్మార్గుడైన రావణాసురుని భార్య అయిన మండోదరి శ్రీమన్నారాయణతత్వం తెలిసి రాముని అవతార రహస్యం ఇంత చక్కగా చెప్పిందే! నేను అలా చేశానా? అని మన తిరుక్కోళూరమ్మాళ్ చింతించింది."

"అబ్బ ఎంత బాగా చెప్పావక్కా!"

"ఒరేయ్! ఇప్పుడు నువ్వు మెచ్చుకున్నా కరగను. పద చాలా పనులున్నాయి. ఈ పూలు కట్టడం కూడా అయిపోయింది.

# నేర్చుకుందామా! - 5

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

మనం ప్రతినెల ఒక్కొక్క పద్యం నేర్చుకుంటున్నాం గదా! ఆ పద్యాలు భాగవత విశేషం తెలిపేవి మంచి సూక్తుల నందించేవి, మన జీవితాన్ని ఎలా గడపాలో, మంచివారితో ఎందుకు కలిసి ఉండాలో.. ఇలా ఎన్నో ఎన్నో మంచిమాటల నందిస్తున్నాయి. ఈసారి మనం శ్రీ కృష్ణ దేవరాయలవారు తమ ఆముక్తమాల్యద ప్రబంధంలో తమ ఇష్టదైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామిని ఎలా ప్రార్థించాలో చదివి నేర్చుకుందామా!

**ఉత్పలమాల:**

**శ్రీ కమనీయ హారమణి జెన్నుగ దానును గౌస్తుభంబునన్**
**దా, కమలా వధూటియు నుదారత దోప బరస్పరాత్మలా**
**దాకవితంబులైన తమ యాకృతు లచ్ఛతబైకి తోచి, య**
**స్తోకత నందు దోచెనన శోభిలు వేంకట భర్త గొల్చెదన్.**

శ్రీ మహాలక్ష్మి, శ్రీ వేంకటేశ్వరస్వామి ఒకరికొకరు ఎదురెదురుగా కూర్చున్నారట. అమ్మ మంచిముత్యాలహారం ధరించి ఉంది. ఆ హారంలో వేంకటేశ్వరస్వామి స్ఫుటంగా ప్రతిబింబించాడట. అలాగే మరి స్వామి హృదయంపైన కౌస్తుభమణి మెరిసిపోతూ ఉంటుంది గదా! ఆ మణిలో అమ్మరూపం చక్కగా ప్రతిబింబించిందట. అమ్మలో తండ్రి, ఆయన హృదయంలో తల్లి, వాళ్ళిద్దరూ ఒకరికెదురుగా ఒకరు ఎంత అందమైన దృశ్యం అది. అదెలా ఉందంటే అమ్మ హృదయం స్వచ్ఛం కాబట్టి ఆ లోపల ఉన్న స్వామి పైకే కనిపిస్తున్నట్లు, అలాగే తండ్రి హృదయం ఎంతో స్వచ్ఛంగా ఉండడం చేత ఆయన మనస్సులో దాచుకున్న తల్లి ఆకౌస్తుభమణిలోనుండి కనిపిస్తోంది అన్నట్లుందట. శ్రీరాయలవారి మధుర భావన ఆదిదంపతులనెంత అందంగా దర్శింపచేసింది.

శ్రీ లక్ష్మీవిశిష్టుడైన శ్రీమన్నారాయణుని నేను సేవిస్తున్నాను అని ఆ సంగీత సాహిత్య చక్రవర్తి వర్ణించడం. శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ప్రార్థనలో ప్రతిపాదించడం కదా!

ఇలాంటి పద్యాలు నేర్చుకుంటే ఎంత ఆనందం కలుగుతుంది! అందుకే మంచి మంచి పద్యాలు నేర్చుకుందాం! నేర్పుదాం!

జై శ్రీమన్నారాయణ!




# తిరుప్పల్లాండు

వైశారదీ

(గతసంచికతరువాయి...)

**ఎన్నాళ్ ఎంబెరుమాన్, ఉన్ తనక్కడియో మెన్ట్రెఝుత్తుప్పట్ట వన్నాళే,**
**అడియోంగళ్ అడిక్కుడిల్, వీడు పెత్తుయ్న్దదుకాణ్।**
**శెన్నాళ్ తోత్తి, తిరుమదుర్రైయుళ్ శిలై కునిత్తు, ఐన్దలైయ**
**పెన్నాకత్తలై పాయ్న్దవనే, యున్నై ప్పల్లాండు కూరుదుమే ॥ 10**

| | | |
|---|---|---|
| ఎన్నాళ్ | = | ఏ రోజైతే |
| ఎమ్+పెరుమాన్ | = | ఓ మా స్వామీ! |
| ఉన్దనక్కు | = | నీకే |
| అడియోం ఎన్టు | = | దాసులము అని |
| ఎఝుత్తుప్పట్ట | = | నిర్ణయింపబడినదో (వ్రాయబడినదో) |
| అన్నాళే | = | ఆ రోజుననే |
| అడియోంగళ్ | = | దాసులయొక్క |
| కుడిల్ | = | వంశములో |
| అడి | = | మూలము వరకు |
| వీడుపెత్తు | = | నీ సన్నిధిలో శాశ్వతస్థానమును పొంది |
| ఉయ్న్దదుకాణ్! | = | మా వంశము ఉజ్జీవించినది సుమా! |
| శెన్నాళ్ తోత్తి | = | ఉత్తమ దివసమందు అవతరించి |
| తిరుమదుర్రైయుళ్ | = | శ్రీ ఉత్తర మధుర నగరమందు |
| శిలై కునిత్తు | = | కంసుడు పెట్టిన ధనస్సును వంచి |
| ఐన్దలైయ | = | ఐదు శిరస్సులుగల |
| పై నాగత్తలై | = | క్రూరసర్పమైన కాళీయుని యొక్క శిరస్సుపై |
| పాయ్న్దవనే! | = | విహరించినవాడా! |
| ఉన్నై | = | నీకు |
| పల్లాండు | = | మంగళాశాసనము |
| కూఱుదుమే | = | పలుకుదుము. |

**తా:** పెరియాళ్వార్లు తమ వంశము గురించి చెప్పుతూ "స్వామీ! మేము నీకు మాత్రమే దాసులము "అని నిర్ణయించుకొనిన రోజుననే దాసులమైన మాయొక్క వంశములోని వారంతా శాశ్వత స్థానమును పొంది ఉజ్జీవించారు. భగవంతుడు ఏ రోజున పుడితే ఆరోజే మంచిరోజుకదా! అష్టమి శుభదినాన అవతరించిన శ్రీకృష్ణుడు, 14 సంవత్సరాల తరువాత, వ్రేపల్లెలో ఉన్నాడని తెలిసి 'ధనుర్యాగము' అనే వంకతో ఆతనిని మధురానగరానికి ఆహ్వానించి సంహరిద్దామని అనుకుంటాడు కంసుడు. కాని కంసుని నయవంచనను గమనించిన శ్రీకృష్ణుడు ధనుస్సుని వంచి కంసుని త్రుంచినాడు. భగవంతునికి అపకారము చేద్దామనుకున్నవానికి కంసునికి పట్టిన గతే పడుతుంది. అలాగే, కాళిందీనదిలో వాసము చేస్తూ ఉన్న ఐదు తలలు కలిగిన కాళీయుడు అనే సర్పము, ఇటు జలచరాలను, అటు ప్రజలను భయభ్రాంతులను చేస్తున్న విషయం తెలుసుకున్న శ్రీకృష్ణుడు, ఆ పాముయొక్క ఐదుతలల పడగలమీద దూకి అహంభావముతో నిండిన విషమంతా పోయేటట్టు నాట్యం చేస్తూ గర్వభంగం చేశాడు. అలాంటి ఓ మా స్వామీ! నీకు మంగళము" అని పాడుదమని ఆహ్వానిస్తున్నారు. (సశేషం)



# శ్రీరామాయణము



*(గతసంచికతరువాయి...)*

తనకోసం ప్రాణాలొదిలిన జటాయువుని తలచుకుంటూ రాముడు పొందిన శోకం వర్ణనాతీతం.

**రాజా దశరథ శ్రీమాన్ యథా మమ మహాయశాః ।**
**పూజనీయశ్చ మాన్యశ్చ తథాఽయం పతగేశ్వరః ॥**

*శ్రీరామాయణం, అరణ్య. 68.26*

'నా తండ్రితో ఇతను సమానం' అంటూ తండ్రి చరమ దేహానికి ఎంత శ్రద్ధతో సంస్కారాల్ని చేస్తాడో అంత శ్రద్ధాభక్తులతో చరమ సంస్కారం, అగ్ని సంస్కారం చేశాడు. జటాయువుకి రాముడు. పెద్దలు దేహం చాలిస్తే ఏ ఏ మంత్రాలు చదవాలో అవి అన్నీ చదివాడు, తర్పణాదులు చేశాడు. ఆశౌచాన్ని పాటించాడు.

**యా గతి ర్యజ్ఞశీలానాం ఆహితాగ్నే శ్చ యా గతిః,**
**అపరావర్తినాం యా చ యా చ భూమి ప్రదాయినాం ।**
**మయా త్వం సమనుజ్ఞాతః గచ్ఛ లోకా ననుత్తమాన్ ॥**

అంటూ 'నిష్కామ యజ్ఞం చేసేవాళ్ళు, అగ్నిహోత్రం అవిచ్ఛిన్నంగా ఆచరించేవాళ్ళు, దానాలు, ధర్మాలు, తపస్సులు, జపాలు ఆచరించే వారంతా 'అపునారవృత్తి లక్షణ'మైన, అంటే, ఏలోకానికి చేరితే మళ్ళీ తిరిగి రారో, దేనిని 'మోక్షం' అని అంటారో, వేదాంతాలన్నీ ఏభగవత్ కైంకర్యస్థానాన్ని పరమానంద ధామమని అంటాయో, ఆ లోకాలకు నేను ఆజ్ఞాపిస్తున్నాను వెళ్ళు!" అని రాముడు స్పష్టంగా పలికి జటాయువుకు మోక్షాన్ని ప్రసాదించాడు.

జటాయువు సంఘటన ఒకరకంగా రామునికి సీతా వియోగం వల్ల కలిగిన వేదన ఉపశమించడానికి తోడ్పడింది. మరోరకంగా జటాయువుపై రామునికుండే పితృగౌరవాన్ని స్పష్టపరిచింది. ఉత్తమ మానవుడిగ జనానికి మోక్షాన్ని ఇవ్వగలిగే రాముని శక్తిని సాక్షాత్కరింప చేసింది. రామకార్యంలో తిర్యక్ జాతులకుండే పట్టుదలను నిరూపించింది. ఇలా ఈ సంఘటన గతంలో కన్పించిన పక్షులకంటే ఒక వైలక్షణ్యాన్ని మనకి కనిపింప చేస్తుంది.

మొదటి కాండలో పక్షులు రామావతార ప్రయోజనాన్ని చెప్పాయి. రెండవ కాండలో పక్షులు రాముడి ప్రశంసకి పాత్రమయ్యాయి. ఈ అరణ్యకాండలోని జటాయువు రామునికి తండ్రికంటే ప్రీతి పాత్రమైంది. తండ్రికూడా నోచుకోని సంస్కారాలని రాముని నుండి పొందగలిగింది.

ఇలా ఈ అరణ్యకాండలో ఉండే పక్షి ప్రస్తావన పూర్వకాండలకంటే ఒక కొత్త వైలక్షణ్యాన్ని సంతరించుకుంది.

శ్రీరామాయణంలో మనకి ఎదురయ్యే పక్షులు ఆషామాషీ పక్షులేమీ కాదు. అవి ఏదో రకంగ ఆచార్య లక్షణాలనో, భాగవత లక్షణాలనో స్పష్టపరుస్తూంటాయి. అవి గమనించడం మన బాధ్యత. ఆ క్రమంలో ఈ జటాయు చరిత్ర ఏమి తెలియచేస్తుందో కొద్దిగ విన్నవించే ప్రయత్నమే ఇది.

భగవంతుడు ఆచార్యులను తనకు తండ్రిగాను, మంత్రాన్ని తనకు తల్లిగాను స్వీకరిస్తాడు, "మంత్రో మాత గురుః పితా" అంటోంది శాస్త్రం.

గోదాదేవి తన తిరుప్పావై మొదటి పాశురంలోనే శ్రీకృష్ణుడి గురించి చెబుతూ **నందగోపన్ కుమరన్ యశోదై ఇళం శింగం** అంది. నందగోపుడంటే ఉండే గౌరవం వల్ల ఆయన దగ్గర వినయం, విధేయతలు కలిగి ఉండి వంగి వంగి నిలబడతాడట. యశోద దగ్గరుండే గారం వల్ల సింహకిశోరంలా చిందులు వేస్తాడట.

అక్కడ నందగోపుడంటే? భగవంతుణ్ణి తలచి, చూసి **నంద**=ఆనందించువాడు ఆచార్యుడు. **గోప**=అనర్థాల బారిన పడకుండా కాపాడువాడు, ఆచార్యుడు. యశోద అంటేనో; **యశ**=అన్నిరకాల కీర్తినీ, **ద**=ఇచ్చునది, అష్టాక్షరీ మహామంత్రము. మంత్రము, ఆచార్యులకు సర్వాత్మనా స్వాధీనమై ఉంటుంది కద! భగవానుడు ఆచార్యుల వద్ద ఒదిగి ఉండడం, మంత్రంలోని అర్థ విశదీకరణ సామర్థ్యం ద్వారా విశ్వవ్యాపకునిగ ఉంటాడని అక్కడ విశదీకరిస్తారు, తిరుప్పావైలో.

ఆ ఆచార్యుడి యోగ్యతలను తెలుపుతున్నట్లుగ, అదే తిరుప్పావైలో 18వ పాశురంలో, **'ఉందు మదకళిత్తన్ ఓడాద తోళ్ వలియన్** అన్నది గోదా. అంటే ఎన్నో మదగజాలను ఓడించినా అలుపురాని భుజబలం కలవాడని అర్థం. తన నాశ్రయించిన శిష్యుల మదాలను ఉపదేశబలంతో అణచగలవాడై ఉంటాడాచార్యుడని తాత్పర్యం. అంటే ఆచార్యుడు బలముకల తండ్రిలాంటివాడన్నట్టేగద. భగవంతుడూ అలానే భావిస్తాడు.

ఇక్కడ మన ప్రస్తుత శ్రీరామాయణ ప్రసంగంలో జటాయువు పైన చెప్పుకొన్న లక్షణాలతో నిండి ఉంది. రాముడు, జటాయువును తండ్రిలా భావించాడు. ఆ జటాయువు ఎంత బలం కలిగి ఉన్నదో మనం చూశాం. ఎన్ని ఆయుధాలున్నా, విశ్వవిజేతగ తనను పొగుడుకున్నా ఆ జటాయువును ఏమీ చేయలేక పోయాడు. మాయోపాయంతో చివరకు అడ్డుకోవలసి వచ్చిందని గద, మనం చూశాం.

ఆచార్యులు, లేక, భగవద్భక్తులు భగవంతునికి ఉపద్రవం కలుగకుండా ఉండాలని భావిస్తారు. ఎక్కడైనా అలాంటిది జరుగుతూంటే, దానిని ఆపడానికి ప్రాణాలను గూడ లెక్కచేయరనే వాస్తవాన్ని జటాయు సంఘటన నిరూపిస్తోంది.

మన పూర్వాచార్యుల చరిత్రలో ఇలాంటి ఓ అద్భుతమైన, హృదయవిదారకమైన సన్నివేశమొకటుంది.

అది 13వ శతాబ్దము మొగలాయిలు భారతదేశాన్ని ఉత్తరం నుండి దక్షిణం దాకా ఆక్రమించడానికి ప్రయత్నాలు తీవ్రతరం చేసిన రోజులవి. పరమ దారుణంగ అడ్డొచ్చిన వారినందరినీ తరిగి పోగులు పోయడం, కనిపించిన ఆలయాలనీ, ఆస్తులనీ కొల్లగొట్టుకుపోవడమే వారి పని. శ్రీరంగక్షేత్రానికి గూడ ఆ ఆపద తప్పలేదు.

అప్పట్లో శ్రీరంగక్షేత్రంలో శ్రీ పిళ్ళైలోకాచార్యులనే మహానుభావులు సంప్రదాయ రక్షకులుగ భగవద్రామానుజ పరంపరలో జగదాచార్యులుగ ఉండేవారు. వీరు మణవాళ మహామునుల పరమాచార్యులు. వీరు రచించినవే అష్టాదశ రహస్యాలు. తురుష్కుల దాడి ఉద్ధృతమయ్యేకాలానికి వీరి వయస్సు సుమారు 102 సంవత్సరాలు.

శత్రువుల బలం తీవ్రమైనదని, తమకు ఇక రక్షకులు వేరే ఎవరూ లేరనే నిశ్చయానికి పిళ్ళైలోకాచార్యులవారు వచ్చేశారు. ఏ క్షణంలోనైనా ఆ దుష్టులు ఆలయంలోకి ప్రవేశించ వచ్చు. లోపలికంటూవస్తే ఏదీ మిగల్చరు. రంగనాథునికి అప్పటికే ఎన్నోసార్లు ఇక్కట్లెదురై బయటపడ్డాడు. ఇప్పుడు వీరిబారిన పడితే ఏమవుతుందో తెలియదు.

అతి ప్రాచీనమైన ఈ మూర్తిని, నంబెరుమాళ్ళను కాపాడాలి, అనుకున్నారు. రంగనాయకీ, రంగనాథుల మూలవర్లకి ముందు రాతిగోడ కట్టి, బయట మరో కృత్రిమ విగ్రహాల్ని పెట్టేశారు. అసలు మూలవర్లు ఇక సురక్షితమే.

ఉత్సవులైన నంబెరుమాళ్ళను తీసుకొని, హృదయానికి హత్తుకొని, ఆవయస్సులో అంటే 102సంవత్సరాల ముదిమిలో ఓ రాత్రికి రాత్రి ఆలయం నుంచి బయట పడి దక్షిణదిశగ పయనమై పోయారు.

తనతో కూడా ముగ్గురు, నలుగురు నమ్మకస్థులని మాత్రం రానిచ్చారు. జనం పెరిగితే రహస్యం దాగదు గద! సుమారు 200 మైళ్ళు అలా ప్రయాణించి మదురై చేరారు.

అక్కడ **యానైమలై** అని ఓ పెద్ద బండరాయి పర్వతం ఉంది. దానిపైన కొన్ని గుహలున్నాయి. వీరు ఆ కొండెక్కి, ఆ గుహలలో దాక్కొన్నారు. అప్పటికే వీరూహించినట్లు తురుష్కులు రావడం, ఆలయాన్ని ఆక్రమించడం, ఆస్తులు దోయడం, విగ్రహాలు ఎటో వెళ్ళినట్లు పసిగట్టడం, వీరిని వెంటాడడం గూడ జరిగింది. వీరున్న పర్వతాన్ని పసిగట్టారు గూడ.

అయితే వీరు ఉన్నగుహలో ఉండకుండా, ఒక్కొక్కరాత్రి ఒక్కొక్క గుహలోంచి మరో దాంట్లోకి మారిపోతూ ఉండేవారు. అలా కొన్ని రోజులు కాపాడగలిగారు. ఇంతలో ఆ తురుష్కులు వీరిని గుర్తించలేక అక్కడి నుండి మరోవైపుకి సాగిపోయారు.

అదేరాత్రి అతినున్నగ ఉండే ఆకొండ పైనుండి మరోచోటికి మారే తొందరలో జారిపోయారు శ్రీలోకాచార్య స్వామి. కొండకు వెనుక భాగంలో ఉండే అడవులలో పడిపోయారు. సుమారు 4,5వందల గజాలపైనుండి నంబెరుమాళ్ళ విగ్రహంతో క్రిందికి పడుతూ గూడ, విగ్రహం క్రింద పడితే ఏ ఉపద్రవం జరుగుతుందోనని, తాను క్రిందపడి, తనపై ఆ రంగనాథుని ఉత్సవమూర్తులైన నంబెరుమాళ్ళు పడేట్టు చేసుకున్నారు.

అక్కడే వారు దేహాన్ని త్యాగం చేసి భగవంతుని శ్రీచరణ కమలాలలో చేరిపోయారు. ఆ ప్రాంతాన్ని **'జ్యోతిష్కోడి'** అంటారు ఇప్పటికీ. ఈ సన్నివేశాన్ని తెలిపే చిన్న ఆలయం అక్కడే వారికై నిర్మించారు.

అక్కడ జటాయువు సీతాసంరక్షణలో తన ప్రాణాలను త్యాగం చేసింది. శ్రీపిళ్ళైలోకాచార్యస్వామి నంబెరుమాళ్ళ సరంక్షణలో తమ ప్రాణాలను త్యాగం చేశారు. అలా బయటకు వెళ్ళినస్వామి సుమారు 80 సం॥ తర్వాత తిరుమల మీదుగ శ్రీరంగం చేరారట. ఇది భాగవతోత్తముల రీతి. ఇది ఆచార్యుల ఆర్తి.

అలాంటి వారిని భగవంతుడు తనకి తండ్రి కంటే గౌరవించదగినవారుగ భావిస్తానని తెలియచేయడానికే శ్రీరాముడు జటాయువుకు చరమకైంకర్యాలు చేశాడు. ఇలా ఈ జటాయువు చరిత్ర నిజమైన భక్తులు భగవద్రక్షణ దీక్షకీ, త్యాగనిరతికి ప్రతీకగ నిలిచింది.



చిత్రకథ - 6



# రామానుజ చిత్రకథ


















నేను పవిత్ర గంగాస్నానం చేయడానికి కాశి వెళ్తున్నాను. మీరెవరైనా వస్తారా?
నేనొస్తాను గురువుగారూ! గురువుగారూ నేనుకూడా వస్తా! నేను కూడా వస్తా! గురువుగారూ ఆc... నేనూను!
రామానుజా! నువ్వు రావా? ఏంటి!
మా అమ్మతో చెప్పి, వెళ్ళమంటే, వస్తా, గురువుగారూ!
సరే! వెళ్ళి త్వరగా చెప్పిరా!


అమ్మా! గురువుగారు కాశీయాత్రకు వెళతారట. నువ్వు అంగీకరిస్తే నేను కూడా వెళ్ళి వస్తా.
కాశీయాత్రా! ఎంత దూరమో!
సరే! జాగ్రత్తగా వెళ్ళిరా నాయనా!
అమ్మా! మీరు జాగ్రత్త! త్వరగానే వచ్చేస్తా!


ఈవాళ్టికి ఈ విద్యారణ్యంలో ప్రవేశించి 10 రోజులైంది.
ఇంకా ఎన్నిరోజులు పడుతుందో కాశీ చేరడానికి?
ఇంకా ఇలాంటివి ఎన్ని అడవులు ఉన్నాయో?


ఈ రాత్రికి ఇక్కడే మన విశ్రాంతి.
గురువుగారు ఈ కాశీయాత్రని అన్న రామానుజుని గురించే పెట్టారా? అన్నకి ఈ విషయం ఎలా చెప్పాలి? ఎలాగైనా చెప్పి తప్పించాలి...


అన్నా! ఎలాగైనా నువ్వు ఇక్కడ నుండి తప్పించుకో! పారిపో!
దేనికి?
ఈ యాత్ర, గంగాస్నానం అన్నీ నిన్ను అంత మొందించటానికే!


గురువుగారూ! మన రామానుజులు కనిపించటంలేదు.
కాస్త అటో ఇటో ఏ అవసరానికో వెళ్ళి ఉంటాడు చూడండి!
గురువుగారూ! అంతా వెతికాము. ఎక్కడా రామానుజుడు కనిపించటంలేదు.
ఏ క్రూర మృగాలకో ఆహారం అయ్యాడేమో! కాగలకార్యం గంధర్వులే తీర్చారు అంటే ఇదేనేమో!


సరే! ఇక ఎంతసేపని వెతుకుతాం? మనం బయలు దేర్దాం.


అప్పుడే మనవాళ్ళని వదిలి మూడురోజుల య్యింది. ఈ అడవిలో దారితెన్నూ తెలియటం లేదు.


ఒకటే వర్షం. కనీసం ఎక్కడా ఫలవృక్షాలు కూడా లేవు. ఇలా ఆహారం లేకుండా ఎన్నాళ్ళని ఈ ప్రయాణం...
వరదరాజా! తండ్రీ! వరదరాజా!
ఇంకావుంది

# మన దర్శనం 'సు' దర్శనం

పూర్వమీమాంస
వైశేషిక
న్యాయ
యోగం
సాంఖ్య
వైశారదీ

*(గత సంచిక తరువాయి...)*

ఆస్తికదర్శనాలు, నాస్తికదర్శనాలు అని దర్శనాలు రెండువిధములు. ఆస్తికులైన ఋషులందించినవి ఆస్తిక దర్శనాలయితే, నాస్తికులైన మహానుభావులు అందించినవి నాస్తికదర్శనాలైనాయి. 'ఆస్తికులు' అంటే దైవాన్ని అంగీకరించినవారు అని అంటుంటారు కదా! నిజానికి 'ఆస్తికులు' అంటే వేదముయొక్క అస్తిత్వాన్ని, ప్రామాణ్యాన్ని విశ్వసించినవారు అని అర్థము. భగవంతుని నిశ్వాసరూపంగ, చతుర్ముఖునికి ఉపదేశంగ అందినది 'వేదము'. కనుక, అది పరమ ప్రమాణమని అంగీకరించి స్వీకరించినవారు, "ఆస్తికులు". వారు వేదం చెప్పినది విశ్వసించి తదనుగుణంగ ఆచరిస్తూ, తత్త్వాన్వేషణ కావించి అందించినవి, "ఆస్తికదర్శనాలు". అవి ఆరు అని తెలుసుకున్నాం! అవి అందించిన మహానుభావులను కూడా స్మరిద్దాం!

1)వైశేషికదర్శనమును కణాదుడు అనే మహర్షి, 2) న్యాయదర్శనాన్ని గౌతమమహర్షి అందించారు. 3) సాంఖ్య దర్శనమును కపిలమహర్షి, 4) యోగ దర్శనమును పతంజలి మహర్షి అందించారు. 5) పూర్వమీమాంసను వ్యాసులవారు తమ శిష్యులైన జైమినిద్వారాను, 6) ఉత్తరమీమాంసను తామే స్వయంగాను అందించారు.

అయితే వీరికి ముందు ఆరకమైన తత్త్వద్రష్టలైన మహర్షులు లేరనుకోవడానికి వీలులేదు. ఆయా దర్శనకారులుగా మనం తెలుసుకుంటున్న ఈ మహర్షులందరికంటే ముందు కూడా తత్త్వద్రష్టలైన మహర్షులెందరో ఉన్నారు. తెలుసుకోవాలన్న తపనతో తమనాశ్రయించిన వారెందరికో ఆ జ్ఞానాన్ని కేవలం వాచికంగానే పంచుతూ వచ్చారు.

వేదకాలంలో మానవుల మేధ కంప్యూటర్స్ మీద ఆధారపడకుండా ఉండేది కనుక, గురూచ్చారణ అనూచ్చారణ రూపంలో సాగి పోతూండేది. కేవలం గురువు నుండి విని నేర్చుకునేవారు. తమ బుద్ధిలో ధరించి ఉండేవారు. కనుక, గ్రంథాల అవసరం ఏర్పడలేదు. లిపీ లేదు. కాలాంతరంలో భావవ్యక్తీకరణకి ఉపయోగించే భాషకి ఆకృతిని కల్పించారు. తాళపత్రాలమీదగాని, బూర్జపత్రాలవంటి వాటి మీద గాని లిఖించి గ్రంథాలుగా కూర్చడం ప్రారంభించారు.

అర్వాచీనులు(ఆధునికులు) లిపి ఏర్పడినది ఈ మధ్యనే సుమారు ఐదు వేల సంవత్సరాలు అయి ఉండవచ్చని అంటారు. కానీ, పారిస్‌లో Loovre అనే చోట ఒక శిలారూపం ఉంది. ఇది సుమారు 8,000 సం. క్రితంది అని అంటారు శాస్త్రవేత్తలు. ఆ శిల ఒక వ్యక్తి కూర్చుని చేతితో వ్రాస్తున్నట్లుగ ఉంది. ఇది మెక్సికన్ scrib ది అంటారు. అంటే ఆనాటికే లిపి ఆదేశంలో ఏర్పడిందన్నమాట.

మనవిషయానికి వస్తే లిపి ఇంకా పురాతనమైనది. ఆదికవి వాల్మీకి శ్రీరామాయణాన్ని లిపిలో వ్రాసి, కుశలవులకి స్వయంగ నేర్పినట్లు తెలుస్తోంది. వాల్మీకి మహర్షి త్రేతాయుగం నాటివాడు. రామాయణం 24వ చతుర్యుగంలోని త్రేతా యుగంలో జరిగినట్లుగ మనకి పద్మపురాణం చెప్తోంది. ఒక చతుర్యుగము అని అంటేనే సుమారు 43,20,000 లక్షల సంవత్సరాలు. 24 చతుర్యుగాలు అంటే సుమారు కోటి సంవత్సరాల పై మాటే కదా! ఆనాటి నుండీ లిపి, గ్రంథరచన అన్నవి మన మహర్షులు మనకి అందించారు.

మన వైదిక విజ్ఞానమంతా కూడా అంతకంటే ముందునుంచీ ఉన్నదే. కేవలము మౌఖికపద్ధతిoral tradition లోనే ఉండేది. తరతరాలుగ గురుశిష్యపరంపరలో ఒకరినుండి ఒకరికి అందుతూ ఉండేది. కొంతకాలానికి అది కాస్త లోపించి ఉండవచ్చు. హ్రాస, వికాసాది మార్పులు జ్ఞానానికి ఎప్పుడూ జరుగుతూంటాయి!

తరువాత దానిని పునరుద్ధరిస్తూ కణాదుడు మొదలైన మహర్షులంతా భావితరాలకోసం సూత్రరూపంలో వాటిని దర్శన గ్రంథాలుగ తీర్చిదిద్ది అందించారు. అందుకే వారిని మనం దర్శన ప్రవర్తకాచార్యులు అనవచ్చును. అసలు దర్శనకర్తలు వేరే ఉంటారు. నిజానికి మన త్రిమతాచార్యులను

కూడా మనం అందుకే ప్రవర్తకాచార్యులనే అంటున్నాం! శంకరులవారికి ముందు కుమారిలభట్టు వంటివారెందరో అద్వైతసిద్ధాంతభావనలను ప్రకటించారు. తరువాత ఆవిర్భవించిన శంకరులు వాటిని ఒక క్రమపద్ధతిలో అందించి ఆ సిద్ధాంతాన్ని వ్యాపింపచేసారు.

విశిష్టాద్వైతానికి సంబంధించి మన భగవద్రామానుజులకి పూర్వం కూడా యామునులు వంటి మన పూర్వాచార్యులెందరో ఈ భావనలని అనుసరిస్తున్న వారే కద! కానీ, భగవద్రామానుజులు వాటిని క్రమబద్ధము చేసి జగత్తంతా వ్యాపింపచేసి విశిష్టాద్వైత ప్రవర్తకాచార్యులుగ ప్రసిద్ధినొందారు.

అలానే వైదికవిజ్ఞానమును అనుసరించి దర్శనవిధానాలను ప్రారంభించిన మహర్షులు, కణాద, వ్యాసాదులుకంటే ముందే ఉన్నారు. వాటిని ప్రవచనాలుగానే కాక, సూత్రరూపంలో గ్రథనం చేసి, వ్యాఖ్యాన గ్రంథాలుగ మనకి అందించిన కణాద, వ్యాసాది మహర్షులను మనం ఆయా దర్శనప్రవర్తకులైన మహానుభావులుగ స్మరిస్తున్నాం!

వారందించిన ఆ సూత్రాలైనా, ఆయా పరంపరలో ఆయా సంప్రదాయాన్ని అనుసరించే గురువులద్వారా అధ్యయనం చేస్తే తప్ప వాటిలోని అర్థం అవగతం కాదు. వాక్యానికి వాక్యానికి మధ్య తెలియాల్సినది, పదానికి పదానికి మధ్య తెలియాల్సినది ఎంతో ఉంటుందని, అది మనంతట మనం చదివేస్తే అర్థమయ్యేది కాదని అంటుంటారు.

తండ్రి తన జీవితకాలమంతా శ్రమించి సంపాదించినది, పిల్లలకి ఏలోటూ రాకూడదని అందిస్తాడు. ఋషులంతా కూడా భావితరాలు తత్త్వాన్వేషణలో శ్రమపడే అవసరం రాకూడదని, వేలాది సంవత్సరాలుగ నియమనిష్ఠలతో తామార్జించిన జ్ఞాన సంపదని మనకి దర్శనాలుగ అందించారు.

వీరంతా జగత్పిత అయిన భగవంతుని ద్వారా అందిన వేదాన్ని, పిత్రార్జితధనంవంటిదిగ, 'జ్ఞాననిధిగ' గుర్తించారు. అది సృష్టికే మూలమని తెలుసుకోగలిగారు. సంపదలన్నిటికీ మూలమైన వైదిక విజ్ఞానాన్ని తరువాతి తరం మానవులంతా సకల సంపదలు పొందాలని అందించారు. 'ఆస్తిక దర్శనకారులుగ చరిత్రలో నిలిచారు. వీరందించిన దర్శనాలనే 'వైదికదర్శనాలు' అని కూడా అంటారు.

వీరికాలంలోనే వేదాన్ని అంగీకరించని వ్యక్తులు కూడా కొన్ని దర్శనాలని ప్రవర్తింపచేసారు. వాటిని 'నాస్తిక దర్శనాలు' అన్నారు. తమాషా ఏమిటంటే, వారు కూడా వేదం అందించిన తత్త్వాలని తీసుకొనే ఖండనాలు చేసారు. ఖండించడానికైనా వాటి ఉనికిని అంగీకరించాలి కద! ఆ విధంగ నాస్తికదర్శనాలు కూడా వేదం మీద ఆధారపడక తప్పదు. ఇవి కూడా ఎప్పటినుండో వస్తున్నాయి. ఇవి కూడా ప్రధానంగ ఆరు. వీటికి పేర్లు ఆయా కాలాల్లో చెప్పిన వ్యక్తులని బట్టిగాని, చెప్పిన విధానాల్ని బట్టి కాని ఏర్పడ్డాయి. ముందుగ వాటి పేర్లేమిటో తెలుసుకుందాం!

1. చార్వాకం– ఇది చెప్పిన విధానాన్ని బట్టి ఈ దర్శనానికీ పేరు ఏర్పడింది. 2. జైనం– 'జినుడు' అనే వ్యక్తి చెప్పడం వలన ఈ పేరు వచ్చింది. 3.బౌద్ధం– ఇది బుద్ధిమంతుడు అనుకున్న వారు చెప్పింది. శిష్యులయొక్క ప్రవృత్తులను బట్టి నాలుగు రకాలుగ ప్రవర్తింపచేసారు, కనుక, బౌద్ధం నాలుగు రకాలైంది. 1. వైభాషికం, 2.సౌత్రాంతికం, 3.యోగాచారం, 4.మాధ్యమికము. ఈ నాస్తిక దర్శనాలను సూక్ష్మంగా తెలుసుకుంటూ ఆస్తికదర్శనాలను అధ్యయనం చేద్దాం!

# గోదా ప్రబోధము

శ్రీమాన్ సముద్రాల శఠగోపాచార్యస్వామి - వరంగల్

సర్వజగత్కారణ భూతుడైన, మోక్షప్రదుడైన నాయకత్వ పరిపూర్తి కలిగిన పురుషోత్తముడైన పరమాత్మయందు తన సహజ ప్రేమను ఆవిష్కరిస్తూ రెండు ప్రబంధములను రచించిన నారీరత్నం గోదాదేవి.

వ్యంగ్యార్థ ప్రధానమై అత్యుత్తమ కావ్యంగా సకల వేదబీజభూతమైన దివ్యప్రబంధముగా కీర్తింపబడే **"తిరుప్పావై"** ప్రబంధమునకు సాటిరాగల గ్రంథమొకటి ఆధ్యాత్మిక వాఙ్మయములో కాని, లౌకిక సాహిత్యములో కాని కనిపించదు.

గోదాదేవి తనను ఒకగోపికగా భావించుకొని వ్రతమాచరించి భగవత్సాయుజ్యాన్ని పొందినది. తనవలె లోకులందరు కూడా తరించి భగవదనుగ్రహపాత్రులు కావలెను అను తలంపుతో తాను అనుష్ఠించిన 'శ్రీవ్రతాన్ని' ఒక ప్రబంధ రూపంలో మనకు అందించినది. అదియే తిరుప్పావై.

తిరుప్పావైలోని ముప్పది పాటలలో గోదాదేవి ఆచరణాత్మకమైన పెద్దల ప్రబోధములనెన్నింటినో ఒక దగ్గర చేర్చికూర్చినది. ఆణిముత్యాలనదగిన ఉపదేశరత్నములను ఒక మాలికగా తిరుప్పావై రూపములో గోదాదేవి అనుగ్రహించినది.

లోకములో ఏవో కొన్ని లాభాలను కలిగించే ఆభాసబంధువులను ఆశ్రయించకుండా **"సర్వ లాభాయ కేశవమ్"** అన్నట్లు ఐహికమైన ప్రేయస్సుతోపాటు పారమార్థికమైన శ్రేయస్సును కూడా అనుగ్రహించే శ్రీమన్నారాయణుని ఆశ్రయించియే పరమపురుషార్థమైన మోక్షసంపదను పొందాలి.

భగవంతునికే చెందిన మనము ఎంతో కాలమునుండి భగవంతునికి దూరమైనాము. **"మాసానాం మార్గశీర్షోఽ హం"** అను భగవద్గీతా వాక్యమును బట్టి మార్గశీర్షమాసము వైష్ణవ మాసమని చెప్పబడినది. దేవమానము ప్రకారం ఒక రోజు సమయం మనుష్యులకు ఒక సంవత్సరకాలంగా నిర్ణయింపబడి, ఈ మార్గశీర్షమాసము దేవతలకు తెల్లవారుఝాము సమయమని నిర్ధారింపబడినది. **"బ్రాహ్మీ ముహూర్తే బుధ్యేత"** అనుస్మృతి ప్రకారం **"బ్రాహ్మీముహూర్తే చోత్థాయ చింతయే దాత్మనో హితమ్"** అనుసూక్తిననుసరించి ఆత్మహితమైన భగవచ్చింతన చేయుటకు తెల్లవారుఝామువనే మేల్కొని 'మార్గళి' వ్రతాన్ని ఆచరించాలని గోదాదేవి ప్రబోధించినది.

భగవద్విరహతాపాగ్ని పీడితులైనట్టి వారందరూ భగవత్ సంశ్లేషరూపమైన 'మార్గళి' స్నానవ్రతాన్ని ఆచరించాలి.

**"హరి సరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం**

**భవమరుపరిఖిన్నః ఖేదమద్య త్యజామి"** అని సంసారమనే ఎడారిలో ప్రయాణం చేసి బడలికను పొందిన తాను శ్రీహరి యనెడు సరస్సులో మునిగి, పరమాత్మ తేజస్సు అనెడు జలాన్నిత్రాగి బడలికను తీర్చుకుందునని కులశేఖరాళ్వార్లు ముకుందమాలలో పేర్కొన్నట్లు, జన్మవ్యాధి జరావిపత్తి మరణరూప దుఃఖపీడితులు అందరూ మార్గళిస్నానవ్రతముతో భగవత్కృపా కటాక్షమునకు పాత్రులై పరమానందమును పొందవలెనని గోదాదేవి ఉద్బోధించినది.

దయామయుడైన పరమాత్మ పాలకడలికి దిగివచ్చి సురగణముయొక్క మొరలనాలకించెను. తన భక్తుల నుద్ధరించుటకు అనేక పర్యాయములు దుర్లభమైన తన స్వరూపమును సులభముగ చేసికొని భువికి దిగివచ్చెను. పరత్వము వీడెను. సౌలభ్యాతిశయముచే భక్తుల చెంతచేరెను. అట్టి ఆశ్రిత వత్సలుడైన పురుషోత్తముడైన పరమాత్మ నామాలను నోరారా పాడి తరించండి అని ఆండాళ్ తల్లి ఉపదేశించినది.

స్నానంచేసి శారీరకంగా పవిత్రులై వచ్చి, వాక్కులో హరినామ సంకీర్తనమొనరించి ఇతర దోషాలను తొలగించుకుని, సుగంధ భరితములైన, పరిశుద్ధమైన పుష్పాలను భక్తితో పరమాత్మకు సమర్పించి, అంజలి ఘటించి మనసారా ధ్యానిస్తే ముక్తి ప్రతిబంధకములైన పూర్వసంచిత పాపరాశి, ఆగామి పాపరాశి అంతయు అగ్నిలో పడిన దూదివలె భస్మమైపోవును.

**"తూయోమాయ్ వందునామ్**

**తూమలర్ తూవి త్తొళుదు**

**వాయినాల్ పాడి మనత్తినాల్ శిందిక్క**

**పోయపిరెయుమ్ పుగుదరువా నిన్ఱనవుమ్**

**తీయినిల్ తూశాగుం శెప్పు"** అని గోదాదేవి తిరుప్పావై ప్రబంధములో పేర్కొన్నది.

భగవంతుని కళ్యాణ గుణప్రవాహము ఒకనదీ ప్రవాహము వంటిదని, మహానదిని దాటునపుడు, మహానదిలో స్నాన మాచరించునపుడు ప్రమాద నివారణకై ఒకరు మరొకరి చేతిని పట్టుకున్నట్లు, భగవద్గుణాలను అందరు కలిసి అనుభవిస్తేనే అమిత ప్రమోదము కలుగునని తన ఆచరణ ద్వారా లోకానికి తెలియజెప్పినది.

భగవదనుభములో బాగా అనుభవమున్న (పండిపోయిన) భాగవతోత్తములను ముందు నిలుపుకొని వారి మార్గ దర్శకత్వంలో, వారి పురుషకార పురస్సరంగానే భగవంతుని పొందుటకు ప్రయత్నించాలి.

అంతేకాని ఆచార్యులను, ఆభాగవతోత్తములను ఉపేక్షించి, తన సుకృతమో తన భక్తియో భగవదనుగ్రహాన్ని సాధించి పెడుతుందని భావించి భంగపడవద్దని, భగవత్కటాక్ష లాభాన్ని సాధించి పెట్టేది భాగవత సాహచర్యమే తప్ప వేరొకటి కానే కాదని గోదాదేవి తన ఆచరణలో స్పష్టపరచినది.

పరమాత్మ తనను ఆశ్రయించని వారిని కూడా వశపరచు కొనగల దయార్ద్రహృదయుడు. కొందరు పరిపూర్ణ విశ్వాసం లేక, ఇంకొందరు శత్రుభావముతో, మరికొందరు వైముఖ్యం తోనో, ఔదాసీన్యంతోనో పరమాత్మను చేరకున్నను, చేరని వారందరిని కూడా తన రూపౌదార్య శౌర్య ధైర్య దయా వాత్సల్యాది గుణాలతో ఆకర్షించి ఆదరపూర్వకంగా ఎక్కువ మక్కువతో అక్కున చేర్చుకునే స్వామిని నోరారా కీర్తించమని తిరుప్పావై ప్రబంధములో పలుమార్లు ఉపదేశించినది.

మార్గళివ్రతానుష్ఠానానికి (భగవదనుభవానికి) కావలసిన సామగ్రిని, భగవంతునికే చెందిన వారమని తెలియ జెప్పే చిహ్నములను, లోకమంతా మెచ్చేరీతిగా భగవంతుడు అందరి సమక్షంలో తన భక్తులకు చేసే గొప్ప (సారూప్య, సాలోక్య, సామీప్యములతోపాటుగా **"అంకే భరతమారోప్య"** శ్రీరామచంద్ర స్వామి భరతుణ్ణి ఒళ్ళో కూర్చోబెట్టుకున్నట్లు సాయుజ్యమనే) సన్మానాన్ని, పరమాత్మ అనుగ్రహంతో నిత్యనిరంతర భగవద్ భాగవతాచార్య సేవాభాగ్యాన్ని కూడా పొందమని గోదాదేవి తెలియచెప్పినది.

ఆవులవెంట వెళ్ళే, అడవిలో కుడి ఎడమలు తెలియ కుండా అన్నపానీయాలను సేవించే గొల్లల ప్రేమకు స్వామి వశుడైనాడు. ప్రకృతికి వశమై సంసారార్ణవమగ్నులై అజ్ఞానాంధకారంలో మగ్గే వారందరు గొల్లలను ఆదర్శంగా గ్రహించి పెద్దల సాహచర్యబలముతో పరమాత్మను ప్రేమ, విశ్వాసాలతో చేరండి. పరమాత్మ వైభవానికి తగినట్లుగా భగవదారాధన చేయలేకపోతున్నామని కూడా చింతించకండి. పరమాత్మ భక్తుల ప్రేమను, భావశుద్ధిని విశ్వాసాన్ని మాత్రమే పరిగ్రహిస్తాడు. ఆయనకు మనకు ఉండే సంబంధం ఒరి(ళి)క్క ఒరి(ళి)యాదు ఒదులుకుంటే వదలబడేది కాదు. నవవిధ సంబంధ బాంధవ్యాలతో కూడినట్టిది. ఆలస్యం చేయకుండా, సుదీర్ఘాలోచనల్లో మునిగిపోకుండా, సంశయగ్రస్తులై సంసార చక్రంలో పడి కొట్టుకుపోకుండా ముక్తినొసగు పరమాత్మను ఆశ్రయించుటకు వెంటనే భక్తులందరూ కదలిరండి అని లోకులకు గోదాదేవి కర్తవ్యోపదేశాన్ని చేసినది.

భగవత్తత్త్వాన్ని పూర్తిగా తెలుసుకోగలిగిన వారెవ్వరునూ లేరు. జగద్రక్షకుడు, సర్వజగత్కారణభూతుడు, నిగ్రహానుగ్రహ దక్షుడు, చరాచర ప్రాణివర్గమును తన ఉదరమున నిలుపు కున్నట్టివాడు, పరమదయతో భక్తుని ప్రతిజ్ఞను నెరవేర్చుటకు తనప్రతిజ్ఞను కూడా విస్మరించునట్టి భక్తవత్సలుడు, శ్రితజన పోషకుడు అయినట్టి పరమాత్మయొక్క పరత్వవైభవాన్ని కీర్తిస్తే ఆయన నొచ్చుకుంటాడు. నేను మీవాడనే కదా! మీకొరకు పడరాని పాట్లను పడినాను. ఎన్నెన్నో మాటలను, సంఘటలను సహించాను కదా! నన్ను ఆత్మీయమైన పిలుపుతో పిలువలేదని చిన్నబోతాడు. పరత్వసూచకమైన నారాయణనామంతో కీర్తించుటకన్న సౌలభ్యాన్ని సూచించే "గోవింద" నామాన్ని 'గోపాలక' శబ్దాన్ని ఉచ్చరిస్తే సంతోషిస్తాడు. అందుకే 'గోవింద' నామాన్నే నోరారా పాడండి.

అడవులలో ఆవులను మేపుచూ ఆవులప్రక్కనే అడవుల్లోనే భుజించే గోపకులానికి చెందిన పశువుల కాపరులవలె, సంసారంలో ఉంటూ సాంసారిక విషయానుభవమే ప్రధానమని భావించే మమ్ములను పరాయివాళ్ళమని భావించవద్దని పరమాత్మను వేడుకోండి. నీఆంతరంగిక సేవకులమని తలచమని కోరండి. నీ ఆంతరంగిక సేవలను చేసే భాగ్యాన్ని అనుగ్రహించమని ప్రార్థించండి.

ఓ పరమాత్మా! ఏడేడు జన్మలకైనా, నీతోనే ఉండే వారలమని, నీకే దాస్యమొనరించువారలమని, నీ ఆశ్రయం తప్ప భిన్నమైన ఏ ఇతర కోరికలను కోరమని విన్నవించండి. ఇతర వాంఛలను పోగొట్టి నీపట్ల అనన్య భక్తి ప్రపత్తులను కలుగజేయుము స్వామీ అని మొరపెట్టుకోండి. ఆ గోవిందుడు తప్పక మీమొర ఆలకిస్తాడు అని గోదాదేవి మార్గదర్శనం చేసినది.

పెద్దలను మేల్కొల్పి, భక్తులను ఒక్క దగ్గరకు చేర్చి, పెద్దలననుసరిస్తూ నేను ఆచరించిన శ్రీవ్రతాన్ని మీరు అనుకరించండి. ముప్పైరోజులపాటు క్రమం తప్పక రోజుకొక్క పాటను పాడుతూ, అందలి సారాన్ని నిర్మలమైన మనస్సులతో ఆచరించుటకు ప్రయత్నించండి. మీరు తప్పక శ్రీ వైకుంఠనాథుని దివ్యానుగ్రహాన్ని పొందగలరని గోదాదేవి ప్రబోధించినది.

తన దూడను పోలిన బొమ్మను చూసి ఇది నా బిడ్డయే అని భావించి గోమాత క్షీరధారలను అనుగ్రహించినట్లు, గోదావ్రతాన్ని అనుకరించిన వారిని పరమాత్మ గోదాదేవితో సమానులని భావించును. వీరంతా ఆండాళ్‌గోష్ఠివారు వీరిని అనుగ్రహించాల్సిందే! వీరు నాకు పరమాదరణీయులు అని భావించి లౌకికమైన సుఖసంతోషాలను, భోగభాగ్యాలను పారమార్థికమైన నిత్యకైంకర్యలాభాన్ని కలిగింపచేస్తాడు అని తిరుప్పావై దివ్యప్రబంధానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన మన పూర్వాచార్యులు పేర్కొన్నారు. కావున మనం తప్పక ప్రతిసంవత్సరం గోదా ప్రబోధాన్ని, పూర్వాచార్యుల ఉపదేశాన్ని శిరసావహిస్తూ క్రమం తప్పకుండా శుభాస్పదమైన 'శ్రీవ్రతాన్ని' ఆచరించి ధన్యజీవులమవుదాం.

గీతా మాహాత్మ్య కథలు-7

# లంకె బిందెలు

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

భగవద్గీతలో మొదటి ఆరు అధ్యాయాలను కర్మషట్కం అంటారు. ఇంతవరకూ ఈ కర్మషట్కానికి సంబంధించిన మహిమలను వివరించే కథలను తెలుసుకున్నాం. కర్మషట్కానికి చివరలో **"జానశ్రుతి"** మహారాజు కథ. మనకి ఎన్నో దాన ధర్మాలు, మరెన్నో యజ్ఞాలు, సత్కర్మలు చేసిన కలిగే ఫలితం కంటే ఎక్కువ ఫలితం, భగవద్గీతలోని ఒక అధ్యాయ పఠనంతోనే లభిస్తుందని నిరూపించింది.

ఇక భగవద్గీతలోని ఏడవ అధ్యాయం "జ్ఞానవిజ్ఞాన యోగా"నికి సంబంధించిన మహాత్మ్యాన్ని తెలుసుకుందాం. జ్ఞానమంటే ఏమిటి? భగవంతుడున్నాడని తెలియడమే జ్ఞానం. విజ్ఞానమంటే, భగవంతుడు సమస్త కళ్యాణ గుణాకరుడని, ప్రకృతిలోను, జీవులలోను ఉండే వికారములు గాని, దోషములుకాని లేని విలక్షణుడని సమగ్రంగా తెలుసు కోవడమే. అట్టి జ్ఞాన విజ్ఞానముల గురించి పరమాత్మ బోధించడం వలన ఈ అధ్యాయానికి 'జ్ఞానవిజ్ఞానయోగమ'ని పేరు వచ్చింది.

ఈ అధ్యాయంలో ప్రకృతిని గురించి వివరిస్తూ శ్రీకృష్ణుడు "అర్జునా! నా ఈ ప్రకృతి భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అని ఎనిమిది విధములు" అని చెప్పాడు. "ఈ ప్రకృతిని చైతన్యవంతం చేసే జీవతత్త్వం కూడా ఒకటుంది. అది శ్రేష్ఠమైనది, అదే తన పరా ప్రకృతి" అని వివరించాడు భగవంతుడు. అలాగే ఈ జీవ, ప్రకృతి తత్త్వాలకు సృష్టి, స్థితి, లయ కారకుడను నేనే అని ప్రప్రథమంగా ఈ అధ్యాయంలోనే చెప్పాడు.

భగవద్గీతలోని సప్తమాధ్యాయాన్ని పురాణాలు ఈ విధంగా కీర్తిస్తున్నాయి.

**శ్లో ॥గీతానాం సప్తమాధ్యాయ మంతరేణ సుధా మయం।**
**జంతునాం జరామృత్యు దుఃఖ నివారణ కారణమ్ ॥**

భగవద్గీతలోని సప్తమాధ్యాయము తప్ప జీవులకు వార్ధక్యము, మృత్యువువంటి దుఃఖముల నివారణకు అమృత మయతత్త్వము వేరొకటి దొరకదు.

ఇక ఈ అధ్యాయ మహాత్మ్యాన్ని తెలిపే పురాణాంతర్గత కథను తెలుసుకుందాం. ఈ సప్తమాధ్యాయ మహాత్మ్యము చెప్పమని అడిగిన పార్వతీదేవితో శంకరుడు "పార్వతీ! ఈ సప్తమాధ్యాయం యొక్క మహిమను చెప్పాలంటే పూర్వం లక్ష్మీదేవికి విష్ణు భగవానుడు చెప్పిన కథనే నీకు చెప్పవలసి యుంటుంది." అని చెప్పడం మొదలుపెట్టాడు.

పూర్వము పాటలీపుత్రమనే ఒక పెద్ద నగరంలో శంకుకర్ణుడనే బ్రాహ్మణుడుండేవాడు. అతడు శ్రోత్రియమైన బ్రాహ్మణవంశంలో జన్మించాడు. అతని తండ్రి ఎల్లప్పుడు భగవద్గీతలోని సప్తమాధ్యాయాన్ని పఠిస్తూ, అదే మోక్ష మార్గమని చెపుతూ ఉండేవాడు. అయినా శంకుకర్ణుడు తండ్రి మాటలు పెడచెవిని బెట్టి, బ్రాహ్మణులు చేయవలసిన వైదిక కర్మలను అన్నింటిని విస్మరించి, ధనమే ప్రధానమని తలచి వైశ్యవృత్తి అయిన వ్యాపారం చేసి అపారమైన సంపదను గడించాడు. కాని దాన ధర్మాలయందు విముఖుడై సంపాదనే ధ్యేయంగా కాలం గడిపేవాడు.

అలా అంతులేని ధనరాశిని ప్రోగుచేసి, దానిని దొంగల బారినుండి కాపాడే మార్గంలేక ఆ సంపదను రెండు లంకె బిందెలలో అమర్చి తన పెరట్లో నిక్షిప్తం చేసాడు. అప్పటికి శంకుకర్ణుడికి మూడు వివాహాలయ్యాయి. వారు బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ కులాలకు చెందినవారు. అప్పుడు అతను నాలుగో వివాహం చేసుకోవాలని తలచి దగ్గరలోనున్న గ్రామానికి తన బంధుమిత్రులతో కూడి ప్రయాణమైనాడు. ఆ మార్గ మధ్యంలో అతనిని ఒక కృష్ణసర్పం కాటువేసింది. శంకుకర్ణుణ్ణి రక్షిద్దామని అతని బంధుమిత్రులు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. శంకుకర్ణుడు అక్కడికక్కడే మరణించాడు.

కొంతకాలానికి ఆతడు ఒక కృష్ణసర్పమై జన్మించాడు. అతడు ఆ సర్పజన్మలో ఉన్నప్పటికి ఆతనికి పూర్వజన్మస్మృతి ఉంది. అందువలన ఆ జీవునిలో గల ధనాశ చావక లోగడ తాను గృహ ప్రాంగణంలో భూనిక్షిప్తం చేసి దాచిన లంకెబిందె లను సంరక్షిస్తూ తిరుగుతున్నాడు.

కొన్నాళ్లకి తనకి గల సర్పజన్మ దుర్భరమనిపించి, తన కుమారులకు కలలో దర్శనమిచ్చి, జరిగిన విషయాన్ని తెలియజేసాడు. తాను దాచిన లంకెబిందెలకు దారి చెప్పాడు. ఆ ధనాన్ని తన పుత్రులందరూ కలిసి త్రవ్వి తీసుకోవలసినదని ఆజ్ఞాపించాడు. ఆ మరునాడు ధార్మికులైన ఆతని పుత్రులందరూ కలిసి ధనం గురించి ఆ ప్రదేశంలో త్రవ్వడం మొదలుపెట్టారు. అక్కడికి ఆ కృష్ణసర్పం రూపంలో ఉన్న శంకుకర్ణుడు వచ్చి తన తనయులతో ఇలా అన్నాడు.

“నాయనలారా! నేను మీ తండ్రినైన శంకుకర్ణుడను. నేను ధనాశచే జీవితమంతా ధనము కోసము పరుగిడి నా పాపములకు పర్యవసానంగా నేడు సర్పమై తిరుగుతున్నాను. అయినా నా ధనాశ చావక, ఈ లంకెబిందెలచుట్టు కాపలాగా తిరుగుతూ, ఈ సర్పరూపంలో మ్రగ్గిపోతున్నాను. ఇక ఈ బాధ భరించలేను. నన్ను మీరందరూ రక్షించాలి. మీరు నాకొరకై అమృత ప్రాయమైన భగవద్గీతయందలి ఏడవ అధ్యాయమును పారాయణచేసి, నాకు సద్గతులు కలిగించండి. మీరు తప్ప నాకు వేరే దిక్కులేదు. అంతేకాదు, మీరు కూడా ఈ ధనాన్ని ధర్మకార్యాలకై వినియోగించి, భగవద్గీతలోని ఏడవ అధ్యాయాన్ని పారాయణ చేసి తరించండి” అని చెప్పాడు.

ఆ మాటలు విన్న పుత్రులు ఆశ్చర్యచకితులై, ఆతని మాటలను గౌరవించి, గీతయందలి ఏడవ అధ్యాయాన్ని తమ తండ్రిని ఉద్ధరించాలనే సంకల్పంతో పారాయణ చేసారు.

ఈ అధ్యాయములో భగవంతుడే స్వయంగ “నాకంటే ఉన్నతమైన తత్త్వమేలేదు, ఈ విశ్వంలో మిగిలినవన్నీ దారంలో కూర్చబడిన మణులులాగ నా యందే ఆధారపడి ఉంటాయని, జ్ఞాని అయినవాడు అనేక జన్మల తరువాత మాత్రమే ఇది గుర్తించగలుగుతాడ”ని, వివరించాడు. అంతేకాక,ఈ అధ్యాయంలోనే

**శ్లో ॥ దైవీ హ్యేషా గుణమయీ, మమ మాయా దురత్యయా।**
**మామేవ యే ప్రపద్యంతే, మాయామేతాం తరంతి తే॥**

“దైవీశక్తి కలది, త్రిగుణాత్మకమయిన ప్రకృతి దాటశక్యము కానిది. నా అధీనమైనది. నన్ను ఎవరైతే శరణు పొందుతారో వారు మాత్రమే ఈ మాయను దాటి తరించ గలుగుతారు” అని శ్రీకృష్ణుడు మోక్షానికి చరమోపాయం కూడా ప్రప్రథమంగా నిర్దేశించాడు. ఈ అధ్యాయాన్ని అభ్యసించినవారు, శ్రీకృష్ణుడే పరాత్పరుడని, అతనిని శరణువేడడమే చరమోపాయమని, ఈ లోకంలో ఉన్నంతవరకూ మనకు కావలసిన అవసరాలన్నీ ఆ స్వామే అనుగ్రహించి ముక్తిబాటలో నడిపిస్తాడన్న జ్ఞానాన్ని పొందుతారు.

ఈ అధ్యాయాన్ని పుత్రులద్వారా శ్రవణం చేసిన శంకుకర్ణుడు త్రిగుణాత్మకమైన ప్రకృతిబంధాన్నుండి విడివడి వెంటనే తన సర్పశరీరాన్ని విడిచి, ఒక దివ్యశరీరాన్ని ధరించాడు. ఆ లంకెబిందెలలో ఉన్న ధనమంతా తన పుత్రుల కప్పగించి తాను మోక్షధామానికి పయనమయ్యాడు..

ఈ సప్తమాధ్యాయ పఠనంతో ప్రభావితులైన ఆతని పుత్రులు కూడా ఆ అపార ధనరాశిని చూచి ఏమాత్రం మోహం చెందక, ఎన్నో దాన ధర్మాలు నిర్వర్తించారు. బావులు, చెరువులు త్రవ్వించారు, దేవాలయాలు కట్టించారు. అన్న సత్రాలను ఏర్పాటు చేసారు. అంతేకాక క్రమం తప్పక వారంతా భగవద్గీతలోని సప్తమాధ్యాయాన్ని భక్తితో పారాయణ చేసి చివరికి మోక్షాన్ని పొందారు.

ఈ కథని శ్రీమహావిష్ణువు శ్రీలక్ష్మీదేవికి చెప్పగా వినిన శంకరుడు పార్వతీదేవికి వినిపించాడు. అబ్బురపరచే ఈ మహాత్మ్యాన్ని విన్న పార్వతీదేవి సంబరపడిపోయి ఇలా అనుకుంది

**శ్లో॥ సప్తమాధ్యాయ జపతో ముక్తిభాజోఽ భవస్తతః।**
**దేవ మిష్టతమం జ్ఞాత్వా నిర్వాణార్పిత బుద్ధయః ॥**

సప్తమాధ్యాయమును తమ పరమ ఇష్ట దైవమును ఎరిగి, మోక్షమును పొందవలెనను బుద్ధితో జపించిన వారు ముక్తిని పొందినవారై తిరిగి జన్మనుపొందరు.

మరి ఇంత మహాత్మ్యం గల ఈ సప్తమాధ్యాయాన్ని మనం కూడ పారాయణ కుపక్రమిద్దామా !

# యతిరాజవింశతి

**శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు**

భగవంతుని పాదములనే భావిస్తూ ఆయన శ్రీపాదములుగ ఆవిర్భవించారు మన నమ్మాళ్వారు. వీరిని శఠారి అని కూడా పిలుస్తారు. "శఠ" అంటే అజ్ఞానమని "అరి" అంటే శత్రువు అని అర్థము. అనగా అజ్ఞానమును దూరం చేసి భగవంతుని అనుగ్రహాన్ని కలిగించువారని నమ్మాళ్వారులను కీర్తిస్తారు. అలాంటి నమ్మాళ్వారుల పాదస్థానీయులు మన రామానుజులు. అందుకే మణవాళ మహామునులు యతిరాజవింశతిలోని మొదటి శ్లోకంలో "పరాంకుశ పాదభక్తం" అని రామానుజులను స్తోత్రం చేశారు.

ఇక రామానుజులను ఆశ్రయిస్తే కలిగే ఫలాన్ని "కామాది దోషహరం ఆత్మ పదాశ్రితానాం'' అంటూ మామునులు కీర్తించారు. దానిని తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

అంతటా భగవంతుడు నిండి ఉన్నాడు. ఆ స్వామిని తెలియజేసే శాస్త్రాలు ఉన్నాయి. కానీ, మనం భగవంతుని పొందలేక పోతున్నాం. కారణం మనలోని దోషాలు. కామక్రోధాది అరిషడ్వర్గం భగవంతుని విషయంలో ఉంటే తరిస్తాం. తనది కాని దాని యందు కలిగే కామం చెడ్డది. అది లభించక పోతే కలిగే క్రోధాదులు మనిషిని పతనం చేస్తాయి. వీటన్నిటికి అహంకార, మమకారములు. ఇవి తొలగి మనం సన్మార్గంలో ప్రయాణించటానికి సద్గురువుల ఉపదేశము అవసరము. అలాంటి సద్గురువు మన రామానుజులు.

**"మదన కదనైః న క్లిష్యన్తే యతీశ్వర సంశ్రయాః"** అన్నట్లు యతీశ్వరులైన రామానుజులను ఆశ్రయించినవారిని మన్మథుడు బాధించడట. ఇందుకు నిదర్శనము భగవద్రామానుజుల చరిత్రయే.

అష్టసహస్రమనే గ్రామంలో యజ్ఞేశుడు, వరదాచార్యులనే వారు రామానుజుల శిష్యులు ఉండేవారు. ఒకనాడు రామానుజులు వీరి ఊరిమీదుగా ప్రయాణం చేయవలసి వచ్చినది. వరదాచార్యుడు చాలా పేదవాడు. పూటగడవడమే కష్టము. అందువల్ల ఆఊరిలో సంపన్నుడైన యజ్ఞేశునికి తమరాకను తెలియజేయవలసినదియని ముందుగా ఇద్దరు శిష్యులను పంపించారు రామానుజులు.

ఆచార్యుల రాకను తెలుసుకున్న యజ్ఞేశుని ఆనందానికి అవధులు లేవు. ఈ ఆనందంలో సుదూరమునుండి వచ్చిన అతిథులకు కనీసం మంచినీరైన ఇవ్వలేదు. ఆస్వాములు తిరుగుప్రయాణమై రామానుజులను కలుసుకొని యజ్ఞేశునికి మీరాకను తెలియజేసామన్నారు. వాడినముఖాలతో ఉన్న వారిని చూచి రామానుజులు జరిగిన విషయాన్ని గ్రహించారు. **"స్ఖాలిత్యేశాసితారం"** అన్నట్లు శిష్యుడు ఎంతగొప్పవాడైనా తప్పుచేసినచో సరిదిద్దు స్వభావం కలవారే సద్గురువు.

భాగవతోత్తములు ఇంటికి వచ్చినపుడు ఆదరించని యజ్ఞేశునికి కనువిప్పుకలగాలని రామానుజులు అతని గృహానికి వెళ్ళలేదు. ఆ ఊళ్ళోనే ఉన్న వరదాచార్యుని కుటీరానికే పరివారంతో వెళ్ళారు రామానుజులు. ఆ సమయంలో వరదాచార్యులు భిక్షాటనకు బయటకు వెళ్ళారు. ఆచార్యులు విచ్చేసిన విషయం తెలిసి వరదుని భార్య ఆనందించింది. అంతలో దుఃఖము. బయటకు వెళ్ళి దాసోహం చేద్దాం అంటే తనదారిద్ర్యము అడ్డువచ్చినది. చిరిగిన చీరతో బయటకు వెళ్ళలేకపోయింది. ఇంట్లో ఎవ్వరూలేరని వెళ్ళబోయే రామానుజులకు లోపల తాను ఉన్న స్థితిని చప్పట్లతో తెలియజేసింది. వరదునిభార్య స్థితిని గుర్తించిన రామానుజులు తమపై వస్త్రాన్ని లోపలికి విసిరారు. ఆ వస్త్రాన్ని కప్పుకుని ఆచార్యులైన రామానుజులను వారితోపాటు వచ్చిన భాగవతోత్తములను సేవించినది. అయ్యో! ఎంతోదూరం నుండి వస్తున్నట్లు ఉన్నారు, మీరంతా స్నానాలు చెయ్యండి. ఈలోగా ప్రసాదం తయారుచేస్తా! అని లోపలికి వెళ్ళింది. అన్నం వండడానికి సామగ్రి ఏమీ లేక ఎలాగ అని ఆలోచించింది.

ఇంతలో ఆ ఊరిలో అతిధనవంతుడైన వైశ్యుడు గుర్తుకు వచ్చాడు. ఇంతకు పూర్వము ఈమె అందానికి మెచ్చి, తనకోరిక తీర్చినట్లైతే దారిద్ర్యాన్ని పోగొడతాను. అనంతమయిన ధనరాశులు ఇస్తానని వ్యామోహపెట్టినా, వాడివైపు కన్నెత్తికూడా చూచేది కాదు. ఆ వైశ్యునివద్దకే వెళ్ళాలనుకుంది లక్ష్మి. అయ్యో! ఇది తప్పుకదా! అని సంశయిస్తూనే పూర్వం తమ పెద్దలద్వారా విన్న వేదవాక్యాన్ని తలచుకుంది. **"యయా కయా చ విదయా బహ్వన్నం ప్రాప్నుయాత్"**

ఇంటికి వచ్చిన అతిథిని ఆరాధించాల్సిన అవసరం ఏర్పడ్డప్పుడు ఏమి చేసైనా, ఎలాగైనా అవసరమైన ఆహారాన్ని

సంపాదించాలి అని ఈ వేదవాక్యానికి అర్థం. అందులోను తన ఇంటికి రాకరాక, వచ్చిన ఆచార్యులకు, శిష్యులకు ఆతిథ్యం ఇవ్వకుండా ఎలా? అని భావించి, ఆలస్యం చేయక ఆ వైశ్యుని ఇంటికి వెళ్ళింది.

ఎంతోకాలంనుండి మాట్లాడిన పలుకనిది, కన్నెత్తయిన చూడని ఆమె తన అంగడికి రావడము ఆశ్చర్యాన్ని కలిగించింది వైశ్యునికి. లక్ష్మి వైశ్యుని సమీపించి అయ్యా! మా ఇంటికి మా ఆచార్యులు పరివారంతో విచ్చేసారు. వారందరికి ఈ పూట మా ఇంటిలోనే ఆతిథ్యం. వారి ఆరాధనకు కావలసిన సామగ్రిని ఇవ్వవలసినదని కోరింది. వైశ్యుడు సంతోషంతో కావలసిన ద్రవ్యాలతోపాటు లక్ష్మికి ఒక పట్టుచీరను, ఆభరణాలను ఇచ్చి రాత్రికి ఇవి అలంకరించుకొని రమ్మని షరతు పెట్టాడు.

ఆచార్యుల ఆరాధన తప్ప వేరొక ప్రపంచం ఎరుగని లక్ష్మి, వాటిని గ్రహించి ఇంటికి చేరి ఆనందంతో అందరికి ప్రసాదాన్ని శుచిగా వండి సమర్పించింది. అందరూ ప్రసాదాన్ని స్వీకరించారు.

సాయంత్రానికి వరదార్యుడు ఇల్లు చేరాడు. తన ఇంటికి వచ్చిన భాగవతోత్తములను చూచి, తన భార్య లక్ష్మి వీరందరికి ఆతిథ్యం ఎలా ఇచ్చిందా? అని ఆశ్చర్యంతో భార్యను సమీపించి జరిగిన విషయం తెలుసుకున్నాడు. తన గృహానికి విచ్చేసిన ఆచార్యులకు, శిష్యులకు లోటులేకుండా ప్రసాదాన్ని ఏర్పాటు చేసావు. అంత కంటే గొప్పవిషయం ఏమి కావాలి! అని తన భార్యచేసిన పనిని కీర్తించాడు. తమకు ఆచార్యులే రక్షకులు అని విశ్వసించారు.

ఆ దంపతుల సంభాషణ విన్న రామానుజులు నీళ్ళు నిండిన కళ్ళతో "రంగా! ఈ దంపతులను రక్షించవలసినది" యని ప్రార్థించారు. రాత్రి సమయానికి తనభార్యను అలంకరింపచేసి వరదుడు స్వయంగా వైశ్యుని గృహందాకా దింపి వెనుదిరిగాడు.

లోపలికి ప్రవేశించిన లక్ష్మి సౌందర్యానికి పరవశుడైన వైశ్యుడు ఇక ఆలస్యాన్ని సహించలేకపోతున్నాడు. ఇంతలో లక్ష్మి ఆ వైశ్యునికి రామానుజుల శ్రీపాదతీర్థాన్ని అందించింది. శ్రీపాదతీర్థసేవనంతో అంతవరకూ వైశ్యుణ్ణి పట్టిపీడిస్తున్న కామపిశాచం వదిలింది. వరదుని భార్య సాక్షాత్తు లక్ష్మీదేవిగా కనిపించింది. ఆమె కాళ్ళమీద పడి 'తల్లీ! నా తప్పును క్షమించు'అని వేడుకున్నాడు. అతనికి ఆచార్యులైన రామానుజుల వైభవాన్ని వివరించింది.

రామానుజులను సేవించడానికి తనకు అవకాశం ఇవ్వమని ఆమెను ప్రార్థన చేసాడు. తన భర్త ఇంటికి చేరేలోపే ఈమె ఇంటికి వైశ్యునితో చేరింది. ఆశ్చర్యపోయాడు వరదుడు. జరిగిన విషయం భార్యద్వారా గ్రహించి ఆచార్యుల శ్రీపాదతీర్థ మహిమను కొనియాడుతూ రామానుజులను సేవించారు.

రామానుజుల శ్రీపాదతీర్థప్రభావానికి మహారాజ కుమార్తెకు బ్రహ్మరాక్షసి వదిలినట్లు ఈ వైశ్యునికి పట్టిన మోహపిశాచం వదిలినది. ఇదే కాదు భార్య సౌందర్యంలో మునిగి తిరువీధి ఉత్సవంలో ఉన్న రంగనాథుని చూడని ధనుర్దాసుని గొప్ప భక్తునిగా మార్చిన రామానుజులు మన ఆచార్యులు. యత్యాశ్రమాన్ని స్వీకరించిన వారందరిలో శ్రేష్ఠులైన రామానుజులను శిరస్సువంచి నమస్కరిస్తున్నాను అని మొదటి శ్లోకంలో మణవాళ మహామునులు వివరించారు. (సశేషం)



# దివ్యసాకేతంలో........ శ్రీరంగనాథుడు

శ్రీమాన్ రఘుదత్తాచార్యులు - ప్రధానార్చకులు

అది యుగాది. స్వామి అనంతుడై లోకములన్నింటిని తన ఉదరమందుంచుకొని శయనించు సమయం. సృష్టి రచనకు సంకల్పిస్తూ తన నాభికమలమందు ఉదయించిన బ్రహ్మకు వేదములనుపదేశించాడు.

సృష్టిచేయమని ఆజ్ఞాపించాడు. అక్కడే మొదలైంది పేచి. స్వామియొక్క దివ్యమంగళ స్వరూపం, యుగములను సైతం క్షణములు చేయు స్వామి సాంగత్యం, ఇవన్నీ కూడా బ్రహ్మను మైమరపింపజేసాయి. ఈ సృష్టిరచనకు వేరొకరిని చూసుకో, నేను మాత్రం నీతోనే ఉంటు నిన్నుసేవిస్తూ ఉంటానన్నాడు. కాదని స్వామి నచ్చజెప్పజూస్తే నిను విడచి క్షణమైన నిలువలేను ఎప్పుడూ నిన్ను సేవించగలిగే భాగ్యాన్నిమ్మన్నాడు.

అదిగో అప్పుడే అవతరించింది, తొలి అర్చామూర్తి జనించబోవు జీవుల జీవనములు ధన్యతనొందడానికి, సమస్త చరాచరములకు సంసారమను సంకెలలు సడలించి, చంచల ప్రకృతినుంచి చిరకాలము చిరునవ్వుల దివ్వెల తరింప జేయటానికి, భవబంధము తొలగాలంటే తపోవ్రతాలు యోగనిష్ఠలే అవసరంలేదు. భక్తి భావమున ఏరూపమును దర్శించిన చాలు భవము భవ్యమై అనంతమైన ఆనందతీరాల నుంచుతుందో, అటువంటి ఆ అర్చామూర్తిని శ్రీరంగనాథుడిగ, శేషశయనమూర్తి, బ్రహ్మకందించి నిగమతుల్యమైన ఆగమమును శ్రీపాంచరాత్రమను శాస్త్రమును ఆరాధనకుగాను అనుగ్రహించాడు శ్రీమన్నారాయణుడు. ఆ మూర్తిని అందుకొని బ్రహ్మ ఆనందభరితుడై సృష్టిరచనను ప్రారంభించాడు.

బ్రహ్మనుండి క్రమక్రమంగా ఆ మూర్తి ఇక్ష్వాకు వంశానికి చేరి రామచంద్రునికి ఆరాధ్యమై శ్రీరాముని నుండి విభీషణునికి అంది ఉభయ కావేరులమధ్య శ్రీవైకుంఠం శ్రీరంగంగా మారితే శ్రీవైకుంఠనాథుడే రంగనాథుడిగా దివ్యదేశాలన్నిటికి మణిమకుటమై అగ్రపూజలందుకొంటున్నాడు.

పాపం విధాత అట్టి అర్చామూర్తిని నిత్యం సేవించ లేడనేమో లేక దివ్యదేశమూర్తులన్నింటిని ఏకకాలాన దర్శించా లనో సాక్షాత్తు శ్రీరంగతుల్యమై, మరో వైకుంఠమై, సృష్టి క్రమమును జరుపు వ్యూహ వాసుదేవునిగా, అంగరంగ వైభవాల ఓలలాడు శ్రీరంగనాథుడై, 106 దివ్యదేశాల మృత్తికల తోడ, తద్భగవద్దర్శన ఫలదాతయై, భగవన్మయమైన సాలగ్రామములు వేలకొలది తనలో నింపుకొని మన దివ్యసాకేతానికి అరుదెంచి భక్తులను అనుగ్రహిస్తున్నాడు.

పాలకడలి నురగలు నల్లనిమేనిపై మెరువ, ప్రకాశించు దివ్యమూర్తి నక్షత్రములతోడ మెరయు నీలాకాశమువోలె రమణీయమైన దయాసముద్రుడాతడు, కమలనాథుడాతడు.

కలువలబోలు కన్నులగల భామలు, శ్రీ భూదేవులు ఇరువురు నునుసిగ్గున స్వామి చరణముల జేరి కమలాశ్రిత పాదములను పూలంటినా కందు కరములతో నొత్తుచున్నారు.

జగన్నాథుడీతడు జీవుల కర్మానుసార జన్మలకు తగు లోకముల సృజించు బ్రహ్మనుసైతం తన నాభికమలమందు కలిగినాడు. సురాసురవందితుడితడు. వైకుంఠమందు గూడా మాకు ఈ దర్శనం దుర్లభము. మరి దివ్యసాకేతపురమందు పరమ సులభమట అంటూ సకల దేవతలూ జేరి సేవిస్తున్నారు.

కరుణలొలుకు క్రీగంటి చూపుతో, అందమైన అమ్మ లిరువురుతో, నాభికమలమందు బ్రహ్మతో, సోమసూర్యాది సకల దేవతలు సేవిస్తుండ శేష శయనుడై శ్రీరంగనాథునిగా స్వామి అనుగ్రహిస్తున్నాడు రండి!

దేవతలు కూడా తపించు దర్శనము మనకు సర్వ సులభము మన దివ్యసాకేతమందు కరతలామలకము! సేవించి దర్శనానందప్రఫుల్లిత ముఖులమై తరిద్దాం!

**యోగనిద్రా వినిద్రాయ భద్రశయ్యాధి వాసినే ।**
**యతీశాన సుసేవ్యాయ రంగనాథాయ మంగళమ్ ॥**



రాయల ఊహల పల్లకి....

# ఆముక్తమాల్యద

ఆయన ఉంటున్నది విల్లిపుత్తూరు. వారి ఇంటిభాష తమిళం. కానీ వచ్చేవారో – ఆసేతు శీతాచలము అన్ని ప్రాంతాలవారూను. ఒక భాషవారా, అంచేత అందరికీ చెందిన సంస్కృతభాషలోనే పలకరింపులు, పరామర్శలూను అంచేత ఆ మాటలే వినవస్తాయి.

ఇల్లా ఎంతో భయభక్తులతో శ్రద్ధతో ప్రేమతో ఎవరు ఏం కావాలంటే వారికి అవి సమకూరుస్తూ విసుగంటూ లేకుండా భాగవతోత్తముల్ని ఆరాధించడమే తమ జీవిత పరమావధిగా కాలక్షేపం చేస్తున్నారు విష్ణుచిత్తులవారు.

ఆ రోజుల్లో పాండ్యదేశంలో మధుర చాలా ప్రఖ్యాతి చెందిన నగరం. ఏ భోగమైనా ఏ ఐశ్వర్యమైనా మధురలో అనుభవానికి వచ్చేకే మిగిలిన ప్రాంతాలవారికి తెలిసేది.

ఆ పట్టణంలో స్త్రీలు చనుకట్టు మీద కర్పూరం పూసుకుంటారు. ముత్యాలసరాలు ధరిస్తారు. మధురకు దగ్గరగా తామ్రపర్ణీనది ఉంది. అది ముత్యాలకు ప్రసిద్ధి. తామ్రపర్ణిలోంచి తాజాగా తీసిన ముత్యాలతో కూర్చినవి వారు ధరించే హారాలు. అంచేత ఆ హారాలు ఇంకా ముత్యపుచిప్పల నీచువాసన కొడుతూ ఉంటాయి. వారు చనుకట్టుపై పూసుకున్న కర్పూరవాసనలు ఆ నీచువాసనల్ని పోగొడతాయి.

మలయపర్వతం ఆ మధురకు దగ్గర. ఆ కొండనిండా చందనపు చెట్లే. మధురలోని మేడలకు ఆ గంధపుచెట్ల కలపనే వాడతారు. ఇక్కడ వాడగా మిగిలిన చందనపు ముక్కలే పై దేశాలవాళ్ళకు దక్కేది. మధురలో ఎన్నో ఏనుగులున్నాయి. అవన్నీ సింహళ ద్వీపం నుంచి వచ్చేయి. బాగా మదపు వాసనలు చిమ్ముతూ ఉంటాయి ఆ ఏనుగులు. ఉత్తరాన్నుండి దక్షిణానికి వీచే గాలి చైత్రం వచ్చేటప్పటికి నడకను తోవనూ మార్చుకొని దక్షిణాన్నుంచి ఉత్తరానికి వీస్తుంది. వసంతఋతువు ప్రారంభమౌతోంది. వసంతంలో పూలతావుల్ని ఈ సింహళ గజాల మదవాసనల్నీ మోసుకుంటూ మధురనుంచి మారుతాలు ఉత్తరానికి బయలుదేరుతాయి. ఒక్కమారు ఈ వాసనలకు ఉత్తర దిగ్గజం ఉక్కిరిబిక్కిరి అయిపోతోంది.

మధురనేలిన రాజులు జాతైన మరకతాలు ధరిస్తారు. అవీ సింహళం నుంచి అక్కడకు చేరుతూంటాయి. కొత్తకొత్తవి రాగానే పాతవాటిని తీసిపారేస్తుంటారు ఆ రాజులు. రాజులకెప్పుడూ కొత్తవాటిమీదే మోజు. అట్లా ఆ రాజులు తీసిపారేసిన పచ్చలు వ్యాపారుల ద్వారా ఇతర దేశాలకు చేరతాయి. ఆయా దేశాల రాజులు వాటిని ధరిస్తారు. మధురరాజులు వాడినవే మిగతారాజులకు లభిస్తాయి. వారు మట్టుకు సరికొత్తవాటిని ధరిస్తారు. అదీ వారి గొప్ప.

వెనుక సీతను వెతకడం కోసం సుగ్రీవుడు దేశం నలు మూలలకూ వానరుల్ని పంపేడు. ఆ వానరులు కొండలంతేసి శరీరాలు కలవారు. దక్షిణదిక్కు వెతుకుతూ వారు మధురకూ వచ్చేరు. అంతంత కొండల్లాంటి వానరులు ఎక్కిన ఎత్తైన గోపురప్రాకారాలు కలది ఆ మధుర. ఆ గోపురం తలుపులు బంగారంతో చేసి ముత్యాలు పొదిగినవి. అల్లాంటి తలుపులు కల గోపురాన్ని కొండలంతటి వాళ్ళు కనుక ఆ వానరులు ఎక్కగలిగేరు. మామూలు వాళ్ళకు కన్నెత్తినా కనరానంత ఎత్తైనవి ఆ గోపురప్రాకారాలు, కోటాను. మధురలోని ముత్యాల తలుపు జగత్ప్రసిద్ధాలు, చరిత్ర ప్రసిద్ధాలూను. "ఆ ముత్యాల తలుపుల్ని మీరు చూడాలి, వాటి అందచందాలు నేను చెప్పటం కాదు" అంటాడు సుగ్రీవుడు వానరుల్ని దక్షిణదిక్కుకు పంపిస్తూ, అంతటి ప్రశస్తి కలది ఆ మధుర. ఆ నగరంలో ఎక్కడ చూసినా పెద్దపెద్దచెట్లు నీడని, చల్లదనాన్నీ ఇస్తూ ఉంటాయి.

మధురచుట్టూ పెద్ద బంగారుకోట. త్రిపురాసురుల్ని సంహరించినప్పుడు శివుడు బంగారుకొండ అయిన మేరువును విల్లుగా చేసుకున్నాడు కదా, త్రిపురసంహారం తరువాత ఆయన ఆ వింటిని విల్లులా వంగిన బంగరుకొండ మేరువునూ ఇక్కడ పడేస్తే అదే మధురను చుట్టుకున్న బంగారపుకోటలా ఇవ్వేళ అనిపిస్తోందేమో!

ఆ కోటమీద బురుజులు సువర్ణమయాలు. ఎంతో ఎత్తుగా ఉన్నాయేమో కిందనిలబడి చూసేవాళ్ళకి చాలా చిన్నవిగా కనబడుతున్నాయి. బంగారంతో చేసిన ఆ బురుజులు పచ్చగా సంపెంగపువ్వుల్లా ఉన్నాయి. ప్రాకారం బంగారం, బురుజులు బంగారం. ఆ రెండూ కలిసి ఆకాశాన్నంటేంత ఎత్తుగా ఉన్నాయి. ఆకాశలక్ష్మి ధరించిన సంపెంగల దండలా కనవస్తున్నాయి ఆ రెండూ కలిసి.

మధురచుట్టూ అగడ్తలున్నాయి. అగడ్త అంటే కందకం. కోటచుట్టూ పెద్ద కాలవలా నీరు ఉంటుంది. ఇది బాగా వెడల్పుగా ఉంటుంది. దీన్ని దాటి కానీ కోటలోనికి రాలేరు.

ఈ అగడ్తలలో పట్టణంలోని స్త్రీలు జలక్రీడలాడుతూంటారు. వక్షస్థలాలకు పూసుకున్న జవ్వాది, కస్తూరి కలిపిన చందనగంధం, అగరుగంధం కరిగి ఆ నీళ్ళలో కలుస్తుంది. ఆ అగడ్తలు బాగా లోతుగా పాతాళం అంచులు తాకేట్టుగా ఉంటాయి. పాతాళంలో గంగ భోగవతి అన్నపేరుతో ప్రవహిస్తూ ఉంటుంది. మధురాస్త్రీలు వక్షస్థలాల పూసుకున్న పరిమళ ద్రవ్యాల వాసనలు నింపుకున్న ఆ అగడ్తలలోని నీరు వెళ్ళి పాతాళనది భోగవతిలో కలుస్తుంది. పాతాళనదికి భోగవతి అని పేరు ఎందుకు వచ్చిందనుకొంటున్నారు? అష్టభోగాల్లో గంధం ఒకటి. అట్లాంటి గంధం మధురలోని అగడ్తల నీటితో కలవడం వల్లనే ఆ పాతాళగంగకు భోగం అబ్బింది కనుక భోగవతి అని అప్పట్నుంచి పేరు పడింది. మధురాస్త్రీలు అంతటి నాగరికులు, హాయిగా, స్వేచ్ఛగా జలక్రీడావిహారాలు చేసేవారు.

పాతాళంలో ఉన్న నాగులు పాతాళంతోపాటు ఈ భూమిని కూడా తమవశం చేసుకుందామని ఆ అగడ్తనీటిలోంచి పైకి వచ్చి ఆ అగడ్తల ఒడ్డుకు తాపిన గరుడపచ్చలను చూసి ఉలికిపడి పైన నిలువలేక లోపలికి మునిగి తమ పాతాళానికి పోతూ ఉంటాయి.

లేతనాచుతో తామరాకులతో ఆ అగడ్తనీరు పచ్చల కాంతితో పసరుతీరి ఉంటుంది. ఆ పసరునీరు మధురకోటను బంగారుమయం చేయటానికి వెనుక బ్రహ్మగారు పిడిచిన మందాకుపసరులా ఉంది.

మధురకోట బురుజులమీది పెద్ద ఫిరంగులున్నాయి. ఆ కోట పునాదుల్లోంచి మంచి దిట్టంగా కట్టబడింది. కోట ఆకాశాన్నంటుతోంది. అక్కడ స్వర్గముంది. దానిచుట్టూ గంగ ప్రవహిస్తోంది. ఈ బురుజులమీది ఫిరంగులు స్వర్గానికీ, గంగకూ మధ్య చొచ్చుకుపోతున్నాయి. చమత్కారం చూసేరా, మధుర ఓ వస్తాదు. స్వర్గపట్టణమనే వస్తాదుతో యుద్ధానికి సిద్ధపడుతున్నాడు. నువ్వు నాకు పోటీరా అని. ఎత్తైన ఫిరంగులు చేతుల్లా ఉన్నాయి. ఆ చేతుల్తో స్వర్గాన్ని ఎత్తి కింద కుదెయ్యాలని మధురవస్తాదు పూనుకున్నాడు. స్వర్గం చుట్టూ గంగ ఉంది కదా, అది స్వర్గం వస్తాదు నడుముకు చుట్టుకున్న కాసెకోకలా ఉంది. ఆ కాసెకోకలోకి తన చేతుల్ని దూర్చి పట్టు దొరకబుచ్చుకుని, పైకెత్తి పట్టుకుని చూసేవాళ్ళకి 'బాబోయ్ ఇహ కింద పడేస్తాడు లాగుంది' అనిపించేట్టున్నాడు.

మధురానగర గోపురం ద్వారం చాలా పెద్దది, ఎత్తైనదీని. దాని తలుపులమీద తాపిన మేకు తలలు గుండ్రంగా గుత్తంగా బంతుల్లా ఉన్నాయి. ఆ తలుపులమీద గంధపట్టెలున్నాయి. బంగరు నగిషీలూ ఉన్నాయి. ఆకాశం మీద ఉన్న సూర్యచంద్రులు ఇవి చూసేరు. పొదుచుకు వచ్చినట్టున్న మేకుల గుబ్బలు స్తనాల్లా, గంధపట్టెలు పొత్తికడుపు మడతల్లా, బంగరు నగిషీలు అలంకరించుకున్న నగల్లా మధురానగరం ఒక శృంగారనాయికలా కనపడింది వారికి. వలచిన నాయిక ఎల్లాగైనా కంటపడితే బాగుండునని విటులు ఆమె ఇంటి వాకిటే కాపుకాయడం లోకంలో ఉన్నదే. వారూ అదే చేస్తున్నారు. సోమసూర్యులిద్దరూ ఆమెకోసం పడిగాపులు పడుతున్నారు. ఆయనకు తెలియకుండా ఈయన, ఈయనకు తెలియకుండా ఆయన పగలల్లా ఒకరు, రేయల్లా ఒకరు ఆ వాకిలి వదిలి పెట్టకుండా అక్కడే తచ్చాడుతున్నారు. వీరిద్దరూ వంతులవారీ పహరా కాస్తూండడంతో మూడోవాడు కన్నెత్తి చూడ వల్లకాదు. సూర్యచంద్రులంతటివారు అల్లా వాకిట తారాట్లాడుతూంటే ఇంతకంటే ఆ నాయికకు సౌభాగ్యం ఏం కావాలి?

మధురలో మేడలు బాగా ఎత్తైనవి. ఆ మేడలపై అంతస్థులపై యువతీయువకులు కామకేళీ విహారాలు కావిస్తున్నప్పుడు వారి మెడలలో వేసుకున్న ముత్యాలపేర్లు తెగి ముత్యాలు కిందపడి జల్లుకుపోతాయి. పొద్దున్న కసవు ఊడుస్తున్నప్పుడు పరిచారికలు కిందపడి ఉన్న పూలతోపాటు ముత్యాలన్నీ కిందకి తోసేస్తారు. అల్లా తోసేప్పుడు ఆ మేడలకింద ఉన్న మేఘాల్లో ఆ ముత్యాలు పడతాయి. వర్షాకాలంలో నీటితోపాటు తమలో ఉన్న ఆ ముత్యాల్నీ మేఘాలు కింద రాలుస్తాయి. దాంతో జనం ఆకాశంలో ముత్యాలుంటాయని అనుకోవడం మొదలు పెట్టేరు. నిజానికి సముద్రంలో ముత్యాలుంటాయి కానీ, ఆకాశంలోనూ మరోచోటా ముత్యాలుంటాయా! *(ఇంకా వుంది.)*

శ్రీరామచంద్రాచార్య

# శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి పర్యటన వివరములు

| జనవరి నెల | కార్యక్రమాలు | |
|---|---|---|
| 5. రాజమహేంద్రి | "ముక్కోటి ఏకాదశి రాజమహేంద్రి" | |
| 6. రాజమహేంద్రి | శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి పరమపదోత్సవం | రాత్రికి హైదరాబాద్ రామాంతపూర్ |
| 7. రామాంతపూర్ | సహస్ర తులసీ శ్రీనివాసం | రాత్రికి మంచిర్యాల |
| 8. ఆదిలాబాద్ జిల్లా, మంచిర్యాలలో | సహస్ర తులసీ శ్రీనివాసం-వివిధ కార్యక్రమాలు | |
| 9. మంచిర్యాలలో | తీర్థగోష్ఠి, | రాత్రికి సిద్ధిపేట |
| 10. సిద్ధిపేట | గోదా కళ్యాణం | రాత్రికి సీతానగరం |
| 11. విజయవాడ | గోదా కళ్యాణం | |
| 12. ప్రకాశం జిల్లా, వినుకొండ | గోదా కళ్యాణం | రాత్రికి పిడుగురాళ్ళమీదుగా సీతానగరం |
| 13. భీమవరం | గోదా కళ్యాణం | రాత్రికి శంషాబాద్ |
| 14. శంషాబాద్ జీవా ప్రాంగణం | గోదాకళ్యాణం | |
| 15. జీవా శ్రీరామనగర్ | "ధర్మాలోచనం" (సాధు సత్పురుషుల సమ్మేళనం) | |
| 17. | | రాత్రికి నల్గొండ |
| 18. నల్గొండ | సహస్రతులసీ శ్రీనివాసమ్ | |
| 19. నల్గొండ | సహస్ర తులసీ అర్చన | రాత్రికి ఖమ్మం |
| 20. ఖమ్మం | "గోపాలోపాయనం", సహస్ర తులసీ శ్రీనివాసమ్ | |
| 21. ఖమ్మం | తీర్థగోష్ఠి అనంతరం హైదరాబాద్ | |
| 22,23 హైదరాబాద్ | డా॥ జె. రామేశ్వరరావుగారి గృహంలో శ్రీసుదర్శన యాగ పూర్ణాహుతి కార్యక్రమంలో పాల్గొంటారు. | |
| 25. | | రాత్రికి సీతానగరం చేరతారు. |
| 26. విజయవాడ | సహస్ర తులసీ శ్రీనివాసమ్ | |
| 27. | | రాత్రికి వరంగల్ జిల్లా , తిమ్మాపూర్ |
| 28. వరంగల్, తిమ్మాపూర్ | శ్రీ సీతారామచంద్రస్వామివారి దేవాలయ ప్రతిష్ఠ | రాత్రికి వీనివంక మం॥,మామిడాలపల్లి |
| 29. మామిడాలపల్లిలో | శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవాలయ ప్రతిష్ఠ | |
| 30. కరీంనగర్ జిల్లా, ఎలికేశ్వరం | రథసప్తమి, శ్రీ సీతారామస్వామి మందిర ప్రతిష్ఠ | రాత్రికి శ్రీరామనగర్ |
| 31. జీవా ప్రాంగణంలో | | |
| ఫిబ్రవరి | | |
| 3. తిరుమల తిరుపతిలో | భీష్మ ఏకాదశి | |
| 4. జైపూర్, అల్వాల్ చేరుట | | |
| 5. అల్వాల్ | చతుర్వేద అఖిల భారతీయ సమ్మేళ కార్యక్రమం | |
| 6. జీవా ప్రాంగణం చేరుట. | | |



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



నవంబర్ 28తేది శ్రీమాన్ సిహెచ్. రమణారావు ఆహ్వానంపై "గుడివాడ" పాటివీధి వేంకటేశ్వరస్వామి ఆలయంలో జరిగే పవిత్రోత్సవాల్లో పాల్గొన్నారు. సాయంత్రం శోభాయాత్ర వైభవంగా జరిగింది.

29వ తేది సహస్రతులసీ శ్రీనివాసం పూజ జరిపి భక్తుల కోరికపై పెద్దజీయర్‌స్వామివారు స్థాపించిన రామక్రతు స్థూపాన్ని, రామాలయాన్ని దర్శించారు.

30వ తేది గుడివాడ శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయంలో పూర్ణాహుతి కార్యక్రమంలో పాల్గొన్నారు. అనంతరం ఆలయ చైర్మన్‌గా గత రెండు సంవత్సరాలుగా పదవీబాధ్యతలు నిర్వహించిన శ్రీమాన్ సిహెచ్. రమణారావుగారికి పదవీ విరమణ సందర్భంగా సమ్మానకార్యక్రమం శ్రీస్వామివారి సమక్షంలో జరిగింది. శ్రీవారు మంగళాశాసనాలు చేశారు.

సాయంత్రం ఒంగోలుజిల్లా చీమకుర్తి సమీపంలో "కాండూరి" వారి అగ్రహారం శ్రీవేంకటేశుని ఆలయం "చిన్న తిరుమల" చేరారు. ఈ సందర్భంగ సమీపంలో గల హరిహరక్షేత్రాన్ని సందర్శించారు.

1వ తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీవేంకటేశునికి శ్రీస్వామివారు, శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామివారు క్షీరాభిషేకం నిర్వహించారు. అనంతరం గోశాలను ఆరంభించి, ఆంజనేయస్వామి విగ్రహావిష్కరణ జరిపి, విచ్చేసిన భక్తులకు ప్రవచనం కృపచేసారు.

అక్కడినుండి శ్రీస్వామివారు చీమకుర్తి, సాకేతపురిలో శ్రీమాన్ మౌనస్వామి నిర్వహించే భద్రాచల శ్రీరామచంద్ర స్వామి ఆలయ నిర్మాణాన్ని సందర్శించి, శ్రీరామనామ వైభవాన్ని ప్రవచించారు. సాయంత్రం "సంతనూతనపాడు"లో శ్రీ సీతారామస్వామి ఆలయాన్ని దర్శించి, రాత్రికి "పెదవడ్లపూడి" నాగార్జున పాఠశాల చేరారు.

శ్రీస్వామివారికి విద్యార్థులు, భక్తులు, నిర్వాహకులు ఘనస్వాగతం పలికారు. విద్యార్థులు తయారుచేసిన Science fareను శ్రీవారికి చూపించారు.

విద్యార్థులు పాఠశాల ప్రాంగణమంతా బాలకృష్ణుని లీలలను చూపుతూ కాళీయమర్దన కృష్ణుడు, రోటికి కట్టిన కృష్ణుడు, గోపాలకృష్ణుడు, గోవర్ధనాన్ని ధరించిన కృష్ణుడు, వెన్నతిన్న కృష్ణుడు, అల్లరి కృష్ణుడు ఇలా అంతా కృష్ణమయంగ గోకులాన్ని తలపింపజేశారు. ఆ చిన్నారులకు శ్రీస్వామివారు మంగళాశాసనములు కృపచేసారు.

విద్యార్థులకు భౌతిక విద్యతోపాటు ఆధ్యాత్మిక విద్యను కూడ అందిస్తున్న నాగార్జున హైస్కూల్ నిర్వాహకులు మాధవి రాఘవయ్య దంపతులను, అధ్యాపక బృందాన్ని శ్రీస్వామివారు ప్రశంసించారు.

2వ తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం విద్యార్థులు ప్రదర్శించిన సాంస్కృతిక కార్యక్రమాలను వీక్షించారు. మంగళగిరి నరసింహస్వామివారిని దర్శించి, అక్కడి నుండి "వీరేంద్రపాడు" శ్రీ సీతారామస్వామి ఆలయాన్ని సేవించి పెరుమాళ్ళకు మంగళాశాసనం చేశారు.

మధ్యాహ్నం మంగళగిరి ఆలయం నుండి శోభాయాత్ర ప్రారంభమైంది. అక్కడినుండి పెదవడ్లపూడి చేరడానికి శ్రీమాన్ జె. రాఘవయ్యగారు 20 బస్సులను ఏర్పాటు చేశారు. శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేస్తూ... "ఆలయాలు పవిత్రతకు స్థానములని, అవి వ్యాపారకేంద్రాలుగా సాగరాదని, పురాతన కట్టడాలను రక్షించుకోవాలని, కోల్పోయిన వాటిని పునర్నిర్మాణం జరుపుకొని, భావితరాలవారు చరిత్రహీనులు కారాదని, మాధవుడు మెచ్చే మానవులం మనం కావాలని, అందుకే ఈ సహస్ర తులసీ శ్రీనివాసమ్ జరుపుతున్నా"మని వివరించారు.

ఈ కార్యక్రమంలో గుంటూరు మున్సిపల్ చైర్మన్ శ్రీమాన్ పాతూరి నాగభూషణం పాల్గొని, గతంలో శ్రీవారితో వారికున్న అనుభవాన్ని వివరిస్తూ..."శ్రీస్వామివారు సత్యసంకల్పులు. 2004లో వర్షాలు లేని కారణంగా కృష్ణావసంతోత్సవం జరిపారు. కార్యక్రమం పూర్తి అవడం ఆలస్యం ఎండిన నది, నిండైన నీటితో దర్శనమిచ్చింది. ఆనాటి నుండి ఈనాటి వరకు కృష్ణానది నిత్యప్రవాహంగా దర్శనమిస్తోందని, ఈ సహస్రతులసీ శ్రీనివాసమ్ కూడా మనకు సమస్త శుభాలు కల్గిస్తుందనడంలో సందేహం లేదు" అని కొనియాడారు.

3వతేది ఉదయం సహస్రతులసీ శ్రీనివాసమ్ కార్యక్రమాన్ని ఆరంభించారు. ఈ కార్యక్రమంలో గుంటూరు ఎంపి. శ్రీమాన్ రాయపాటి సాంబశివరావు, శ్రీమాన్ బొల్లెపల్లి సత్యన్నారాయణ పాల్గొన్నారు. ఈ కార్యక్రమాన్ని నిర్వహించిన శ్రీమాన్ రమణారావు, వి.టి. కార్యకర్తలు శ్రీమతి ఝాన్సీ, శ్రీమతి వరలక్ష్మిలకు, నాగార్జున హైస్కూల్ నిర్వాహకులైన శ్రీమాన్ జె.మాధవి రాఘవయ్య దంపతులకు శ్రీస్వామివారు ప్రత్యేక మంగళాశాసనాలు కృపచేసారు.

సాయంత్రం శ్రీస్వామివారు పెదవడ్లపూడి వేణుగోపాల స్వామి ఆలయాన్ని దర్శించి మంగళాశాసనం చేశారు. అనంతరం గుంటూరులో నూతనంగ నిర్మించిన వి.టి. భవనంలోని రెండవఫ్లోర్‌ను ఉద్ఘాటన గావించారు. శ్రీమతి లగడపాటి రామలక్ష్మి కోరికపై వారి కుమారుడు ఎం.పి. శ్రీమాన్ లగడపాటి రాజగోపాల్ 2వ అంతస్తునిర్మాణాన్ని గావించారు. వీరు మాట్లాడుతూ... 'మా అమ్మగారు శ్రీస్వామి వారి శిష్యురాలు. శ్రీస్వామివారు జరిపే అన్నికార్యక్రమాలలో మేముకూడ అన్వయిస్తూ ఉంటాం' అన్నారు. శ్రీస్వామివారు వీరి కుటుంబసభ్యులకు మంగళాశాసనాలు అందించారు. విచ్చేసిన వి.టి. కార్యకర్తలను ఉద్దేశించి శ్రీవారు ప్రసంగిస్తూ... 'ఈ భవనము గుంటూరుజిల్లాలో మనం జరిపే అన్ని సేవా కార్యక్రమాలకు కేంద్రం కావాలని, దానికి తగిన బృందాలు ఏర్పడాలని సూచించారు'. రాత్రికి ఒంగోలులో శ్రీమాన్ టి. వరప్రసాద్‌దాస్ గృహానికి చేరారు.

4వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం P.V.R. బాలుర హైస్కూల్ గ్రౌండ్‌లో ధార్మిక సమ్మేళనం జరిగింది. ఈ కార్యక్రమంలో ఉ.వే.శ్రీమాన్ పరాశర లక్ష్మీనరసింహస్వామి, ఉ.వే.శ్రీమాన్ భక్తవత్సలం స్వామి ప్రవచనాలను అందించారు. మధ్యాహ్నం ఉపాధ్యాయులతో "ప్రజ్ఞ" సమావేశం జరిగింది. అనంతరం ఒంగోలులోని శ్రీచెన్నకేశవస్వామి ఆలయం నుండి శోభాయాత్ర విశేషంగ జరిగింది. సాయంత్రం 6గం॥లకు వేదికపై శ్రీస్వామివారు శ్రీవేంకటేశ వైభవాన్ని వివరించి, సహస్రతులసీ శ్రీనివాసమ్ కార్యక్రమాన్ని నిర్వహించారు.

శ్రీస్వామివారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించిన శ్రీమాన్ సిహెచ్. శ్రీమన్నారాయణ, శ్రీమాన్ టి. మల్లికార్జున, శ్రీమాన్ ఎ.చంచలరావు, శ్రీమాన్ బి. సీతారామయ్య, ప్రచారబాధ్యతలు స్వీకరించిన శ్రీమాన్ కె.పురుషోత్తమ రామానుజదాస్‌లకు మంగళాశాసనాలు చేసారు.

శ్రీస్వామివారు 5వ తేదీ శ్రీమాన్ శర్మగారి ఆహ్వానంపై ఒంగోలు బాలబాలికల ఉన్నత పాఠశాలలో వికాసతరంగిణి ఆధ్వర్యవంలో నిర్వహించిన "ఉచిత మెడికల్ క్యాంప్"లో పాల్గొన్నారు. సుమారు 400మంది విద్యార్థులకు ఉచిత కంటి, పంటి పరీక్షలు నిర్వహించి, మందులను అందించారు. అక్కడినుండి సీతారామపురం కొండమీద వేంచేసి ఉన్న శ్రీరామచంద్రుని పురాతన ఆలయాన్ని దర్శించి, కళ్యాణ మండపానికి శంకుస్థాపన చేసారు. మధ్యాహ్నం 3గం॥లకు గన్నవరంనుండి బయలుదేరి సాయంత్రానికి "విజయనగరం" చేరుకున్నారు.

6వ తేదీ ఉదయం "గీతాజయంతి" సందర్భంగ అయోధ్యా మైదానంలో (M.R.కాలేజ్) శ్రీశ్రీశ్రీ స్వామివారు శ్రీమద్భగవద్గీతను ఉపదేశాత్మకంగ పారాయణ గావించారు. ఈ పారాయణలో ఎంతోమంది భక్తులు పాల్గొని శ్రీస్వామివారితో కలసి భగవద్గీత పారాయణ చేసే అదృష్టం లభించినందుకు తమ జన్మ ధన్యమైందని భావించారు.

7వ తేదీ ఉదయం 10గం॥లకు ధార్మికసదస్సులో వేదవిద్వాంసులను సత్కరించారు. అనంతరం సమాశ్రయణాలు అనుగ్రహించారు. సాయంత్రం 4గం॥లకు శ్రీ కన్యకాపరమేశ్వరి దేవాలయం నుండి శోభాయాత్ర సాగింది. ఈ యాత్రలో కోలాటబృందాలు, పులివేషాలు, సన్నాయి మేళములతో విజయనగర పురవీధులు మార్మోగాయి. అనంతరం శ్రీస్వామి వారు.. "విశ్వమంతా వ్యాపించి ఉండే భగవంతుణ్ణి ఆరాధించే టప్పుడు నియమాలవసరం లేదని, అదే ఆలయంలో ప్రతిష్ఠించిన భగవంతునికి జరిపే ఆరాధనలో కూడా సమయ పాలనానుగుణంగా నివేదనలు, ఏకాంతసేవవంటి ఎన్నో నియమాలను పాటించవలసిన అవసరం ఉంటుందని" తెలియ జేశారు. ఈ కార్యక్రమానికి విచ్చేసిన భక్తులకు, కార్యకర్తలకు, మంగళాశాసన పూర్వక ప్రవచనాన్ని అందించారు.

8 ఉదయం 9గం॥ నుండి సహస్రతులసీ శ్రీనివాసమ్ అర్చన జరిగింది. 100నామాలకు ఓమారు హారతి, నైవేద్యం సమర్పిస్తూ, భక్తులకు శ్రీ వేంకటేశ్వర వైభవాన్ని వివరించారు శ్రీస్వామివారు. కార్యక్రమ నిర్వాహకులు శ్రీమతి రమణమ్మ, శ్రీమాన్ కృష్ణాజీ, శ్రీమతి అరుణ, కుమారి రమ్య, శ్రీమాన్ తిరుపతిరావులకు మరియు కార్యకర్తలకు, భక్తులకు శ్రీవారు మంగళాశాసనాలు గావించి "బొబ్బిలి" బయలుదేరారు.

రాత్రి బొబ్బిలి రాజావారికోటలో, రాజావారి కుటుంబ సభ్యులు శ్రీస్వామివారికి, శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామి వారికి ఘనస్వాగతం పలికారు.

9 ఉదయం రాజావారి దర్బార్‌మహల్‌లో జరిగిన గోష్ఠిలో తిరుమంగైయాళ్వార్ తిరునక్షత్రవైభవాన్ని వివరించి సమాశ్రయణాలు కావించారు. బొబ్బిలికోటలో ఉదయం 10గం॥ ధార్మిక సదస్సు జరిగింది. శ్రీస్వామివారు, శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామివార్లు ధార్మికజీవనం గడుపుతున్న ఆదర్శవంతులైన పెద్దలను 15మందిని సత్కరించారు.

బొబ్బిలి రాజావారి కుమారులు M.L.A. ఆర్.వి. సుజయ్ కృష్ణరంగారావు, మున్సిపల్ మాజీ చైర్మెన్ ఆర్.వి.యస్.కె.కె. రంగారావు (బేబినాయన)గార్ల సౌజన్యంతో సత్కారకార్యక్రమం జరిగింది. అనంతరం ధార్మిక సదస్సులో భక్తులు సహస్రతులసీ శ్రీనివాసమ్‌పై తమ అభిప్రాయాలను వ్యక్తపరిచారు. మధ్యాహ్నం 3గం॥నుండి బొబ్బిలి పురవీధులలో శోభాయాత్ర కన్నుల పండుగగా సాగింది.

10వ తేదీ ఉదయం సహస్రతులసీ శ్రీనివాసమ్ కార్యక్రమంలో వేలాది భక్తులు పాల్గొన్నారు. ఈసందర్భంగ శ్రీస్వామివారు తిరుప్పాణి ఆళ్వార్ల తిరునక్షత్ర వైభవాన్ని భక్తులకు తెలియజేశారు. ఫిబ్రవరి 3వతేది మనమంతా కలసి తిరుమల కాలినడకన కలసివెళ్ళడానికి సిద్ధంగ ఉండమని శ్రీవారు సూచించారు. వికాసతరంగిణి కార్యకర్తలకు, రాజావారి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు. సాయంత్రానికి విశాఖపట్నం నుండి ఢిల్లీ బయలుదేరారు.

14వ తేదీ "విశాఖపట్నం"లో ఎ.యస్.రాజా ఉమెన్స్ కాలేజీ గ్రౌండ్స్‌లో ధార్మికసదస్సుతో శ్రీసహస్రతులసీ శ్రీనివాసమ్ కార్యక్రమం ఆరంభమైంది. ప్రత్యేక ఆహ్వానితులు శ్రీ పీఠాధిపతులు పూజ్యశ్రీ పరిపూర్ణానంద సరస్వతి స్వామిజీ, ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న వారిజ కమిటీ సభ్యులు శ్రీమాన్ యం.ఎస్. రాజు, శ్రీమాన్ రామానుజం, శ్రీమాన్ నారాయణరెడ్డి, శ్రీమాన్ సుదర్శన్ రాజు, శ్రీమాన్ కాశీరాజు గార్లకు శ్రీస్వామివారి మంగళాశాసనాలు చేశారు.

సాయంత్రం 4గం॥ "అప్పుఘర్"నుండి ప్రారంభించిన శోభాయాత్రలో "అరకు"నుండి వచ్చిన గిరిజనుల 'ధింసా' నృత్యాలు, భజనలు, కోలాటాలు, సంకీర్తనలు ఇంకా అనేక సాంస్కృతిక కార్యక్రమాలతో A.S.రాజా కాలేజి గ్రౌండ్స్‌కి చేరుకున్నారు. శ్రీస్వామివారు, శ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామి వారు, శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్య స్వామి, శ్రీమాన్ శ్రీభాష్యం శ్రీనివాసాచార్యస్వామివార్లు భక్తులకు అనుగ్రహభాషణంతో మంగళాశాసనాలు అందించారు.

15 ఉదయం 10గం॥లకు ప్రారంభమైన సహస్రతులసీ శ్రీనివాసమ్ కార్యక్రమంలో తులసిదళాలతో నిండిన కలశము లతో వచ్చిన భక్తులచే సంకల్పం చేయించి, శ్రీస్వామివారు సహస్రనామార్చన కార్యక్రమాన్ని జరిపించారు. కార్యక్రమ వైభవానికి కారకులైన నిర్వాహకులకు, వికాసతరంగిణి కార్యకర్తలకు, భక్తులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు అనుగ్రహించారు. అనంతరం భక్తినివేదన సంపాదకులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీరామచంద్రస్వామివారి గృహానికి వేంచేసి వారి యోగక్షేమాలను తెలుసుకున్నారు.

అనంతరం సింహాచల వరాహ నరసింహస్వామిని దర్శించారు. అక్కడినుండి యలమంచిలిలో శ్రీమాన్ రామేశ్వరరావుగారి మహాసిమెంట్ ఫ్యాక్టరీలోని నూతనంగా నిర్మాణంలో ఉన్న శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయానికి మంగళాశాసనం చేశారు.

అక్కడ నుండి "నక్కపల్లి"లో శ్రీమాన్ నారాయణరెడ్డిగారి శ్రీ చిన్న జీయర్ నగర్ అను హౌసింగ్ లేఔట్‌ను చూసి రాత్రికి రాత్రికి "తుని" శ్రీమాన్ పద్మావతి సూర్యనారాయణ దంపతుల గృహంలో బసచేశారు.

16వ తేది తీర్థగోష్ఠి అనంతరం ధార్మిక సమ్మేళనం "తుని" మార్కెట్ యార్డ్ గ్రౌండ్‌లో జరిగింది. మధ్యాహ్నం స్థానిక వెంకటేశ్వరస్వామి ఆలయం నుండి శోభాయాత్రను ప్రారంభించారు. మార్గమధ్యంలో "పాయకరావుపేట"లో నూతనంగా నిర్మించిన గ్రంథాలయాన్ని దర్శించి దాని నిర్వాహకులైన తోట నగేష్‌గారికి మంగళాశాసనం చేశారు. శోభాయాత్ర అనంతరం శ్రీస్వామివారి అనుగ్రహభాషణం జరిగింది.

17వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం సహస్రతులసీ శ్రీనివాసమ్ పూజా కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమానికి చక్కటి ప్రచార రథాన్ని, విలక్షణమైన వేదికను తయారుచేసిన వి.టి. కో-ఆర్డినేటర్ శ్రీమాన్ వర్మ, శ్రీమతి ఆండాళ్, శ్రీమాన్ సుబ్బారాయుడు, శ్రీమాన్ రామారావు(మాస్టారు), వి.టి. కార్యకర్తలు శ్రీస్వామివారిని మంగళాశాసనాలను పొందారు. ఆనాటి సాయంత్రం "కాకినాడ"కు బయలుదేరి మార్గమధ్యంలో శాంతి ఆశ్రమాన్ని సందర్శించి, ప్రవచనాన్ని కృపచేశారు.

తరువాత "సామర్లకోట"లోని JET USA శ్రీమాన్ అలక్కి శర్మగారి సోదరుని నూతన గృహానికి, వారి కుటుంబ సభ్యులకు మంగళాశాసనాలను చేసి, రాత్రికి కాకినాడలోని శ్రీమాన్ ప్రసాద్‌రెడ్డిగారి గృహానికి వేంచేశారు.

18వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం జరిగిన ధార్మిక సమ్మేళనంలో శ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారు కూడా పాల్గొన్నారు. అనంతరం శ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారి ఆహ్వానం మేరకు శ్రీపీఠానికి శ్రీస్వామివారు వేంచేసి ఆశ్రమాన్ని పరిశీలించి, ప్రవచనం కృపచేశారు.

మధ్యాహ్నం 4గంటలకు శోభాయాత్ర వైభవంగా జరిగింది.

19వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం సహస్ర తులసీ శ్రీనివాసమ్ అర్చన విశేషంగా జరిగింది. రాత్రికి "ఏలూరు" డా॥ ముక్కామల పార్థసారథిగారి గృహంలో వేంచేశారు.

20వ తేదీ ఆరాధనానంతరం ఏలూరు టి.టి.డి. కళ్యాణ మండపంలో ఉదయం 10 గం.లకు ధార్మిక సదస్సు జరిగింది. ఈ కార్యక్రమంలో శ్రీశ్రీశ్రీ ముత్తేవి సీతారామ గురుదేవులు, ఏర్పేడు ఆశ్రమ పీఠాధిపతి పరిపూర్ణానందస్వామివారు పాల్గొన్నారు.

సాయంత్రం 4గం. ఆర్.ఆర్. పేట శ్రీవేంకటేశ్వరస్వామి వారి సన్నిధినుండి శోభాయాత్ర ప్రారంభమైంది. శ్రీస్వామివారి ప్రవచనానంతరం గోదా కళ్యాణం నృత్యరూపకం జరిగింది.

21వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం సహస్ర తులసీ శ్రీనివాసమ్ పూజా కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమానికి పూర్తి కైంకర్యాన్ని తమ సేవగా అందించిన డా॥ ముక్కామల అప్పారావు దంపతులకు, శ్రీమాన్ ముక్కామల పార్థసారథి దంపతులకు శ్రీస్వామివారు మంగళాశాసనం చేసి రాత్రికి "సీతానగరం" చేరుకున్నారు.

22వ తేదీ నుండి 25వ తేదీ వరకు సీతానగరంలో ధనుర్మాస కార్యక్రమాలలో పాల్గొన్నారు. శ్రీ పాంచరాత్ర ఆగమ విద్యార్థులతో కొంత సమయాన్ని గడిపి వారికి, వారి గురువుగార్లకు మంగళాశాసనం చేశారు. 25వ తేదీ మధ్యాహ్నం శంషాబాద్‌లోని దివ్యసాకేతానికి బయలుదేరారు.

## మెదడుకి మేత! సమాధానములు

1. అన్నము.
2. సాలగ్రామాలు
3. రైక్వుని
4. భగవంతుడలానే సృష్టించడం
5. మనో నిగ్రహం
6. కాళిదాసు
7. దయ, నౌక
8. హృషీకేశుడు
9. తటాకాది నిర్మాణములు
10. తిరుమలనంబి
11. యయాతి
12. కొండి
13. ఎర్రని కాంతి
14. వింధముహూర్తము
15. అభీష్టసిద్ధికి
16. మనస్సు, కోరికలు
17. ఆత్మస్తుతి, తనని తాను పొగడుకోవడం
18. వాని వలన పుట్టి, వానిలో లయించి, వానిచే సంరక్షించ బడే జగత్
19. జ్ఞాన బలైశ్వర్యాది షడ్గుణములు, అనంత కోటి కళ్యాణ గుణములు- దయ
20. భగవదారాధనరూపంగా చేయడమే
21. కొబ్బరి గరిటెలు
22. నళ
23. ఆంతర ప్రపంచంలోనూ పని చేయగలగడం
24. త్రిజట
25. కృష్ణుని ప్రథమంగ దర్శించిన రోజు

## భక్తినివేదన ప్రోత్సాహకులు

| | | | |
|---|---|---|---|
| 1. | ఇ. అలివేలు గారు | హైదరాబాద్ | 15,000/- |
| 2. | కోట కేశవరావు గారు | విజయవాడ | 7,500/- |
| 3. | జి.ఆర్.కె. పరమహంస గారు | రాజమండ్రి | 6,000/- |
| 4. | తాండ్ర సువర్ణలతగారు | జగిత్యాల | 6,000/- |
| 5. | పి. అన్నపూర్ణగారు | చెన్నై | 6,000/- |
| 6. | చిత్రకవి ఆత్రేయ స్వామిగారు | బెంగళూర్ | 5,558/- |
| 7. | ఎస్.టి.వి. అప్పలాచార్యులుగారు | హైదరాబాద్ | 5,116/- |
| 8. | ఎం. విజయకుమార్‌గారు | చెన్నై | 5,100/- |
| 9. | సి.హెచ్. భాష్యం గారు | హైదరాబాద్ | 5,058/- |
| 10. | ఎం. వెంకటరత్న మాణికదిక్యంగారు | గుంటూరు | 5,050/- |
| 11. | జి. శారదా మల్లికార్జునరావుగారు | హైదరాబాద్ | 5,011/- |
| 12. | శ్రీ లీలగారు | హైదరాబాద్ | 5,000/- |
| 13. | మేకల మాలతీదేవిగారు | తెనాలి | 5,000/- |
| 14. | ఎస్.కనకమహాలక్ష్మిగారు | తెనాలి | 5,000/- |
| 15. | జి. శివరామకృష్ణశర్మగారు | బాపట్ల | 5,000/- |
| 16. | కోడె సత్యనారాయణగారు | హైదరాబాద్ | 5,000/- |
| 17. | కె. శకుంతలాదేవిగారు | హైదరాబాద్ | 5,000/- |
| 18. | ఐ.వి.ఆర్ ఆండాళ్‌గారు | బొబ్బిలి | 5,111/- |

**మీరు భక్తినివేదన అభివృద్ధికై ప్రోత్సాహక కైంకర్యాన్ని సమర్పించినందుకు శ్రీస్వామివారి మంగళాశాసనములు అనుగ్రహించారు.**

#  పరమపదము 



రాజమహేంద్రి వాస్తవ్యురాలు, శ్రీ పెద్ద జీయరు స్వామివారి శిష్యురాలు **శ్రీమతి వంగల కమలవల్లి తాయారు** గారు 09.11.2011న ఆచార్యతిరువడి చేరినారు. వీరికి ఆ శ్రియఃపతి సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనం చేశారు.



ఉపమాక అగ్రహారం, నక్కపల్లి మండలం విశాఖజిల్లా గ్రామవాసులు **శ్రీమాన్ ఇల్లిందల చక్రవర్తి కుమార్** 15.10.2010న పరమపదించారు. వీరికి శ్రీపదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందించారు.



తాడేపల్లిగూడెం వాస్తవ్యులు **శ్రీమతి కె. జయప్రద** గారు 05.11.11న పరమపదాన్ని అలంకరించినారు. వీరు సీతానగరం ఆశ్రమం లోని ఆవులకు ఆహారనిమిత్తమై ప్రతినెల కొంత కైంకర్యం చేస్తూ ఉండేవారు. వీరికి పరమ పదంలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామి వారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.



వరంగల్ జిల్లా, పల్లగుట్ట గ్రామ వాస్తవ్యురాలు శ్రీమతి **పొట్లపల్లి ఆండాళమ్మ**గారి ప్రథమ వర్ధంతి సందర్భంగా వీరి కుమారుడు శ్రీమాన్ శరత్‌కుమార్‌గారు భక్తినివేదనకు కైంకర్యం సమర్పించుకున్నారు. వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనములు కృపచేశారు.



కూకట్‌పల్లి, హైదరాబాద్ వాస్తవ్యులు శ్రీమతి **నెల్లుట్ల విజయలక్ష్మీగారు 01.10.2011**న పరమపదించారు. వీరు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారి వద్ద సమాశ్రయణాన్ని పొందారు. వీరికి పరమపదనాథుని నిత్యసేవా కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు అనేక మంగళా శాసనాలు అందించారు.



హైదరాబాద్ వాస్తవ్యులు, శ్రీస్వామివారి శిష్యులు అయిన శ్రీమతి వనజభాస్కరరావు గారి తమ తల్లిగారైన **గుండవరం సత్యవతీదేవి** ది. 26.12.2011న వర్ధంతి సందర్భంగా శ్రీస్వామివారు మంగళాశాసనములు కృపచేశారు.



శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి శిష్యురాలైన **శ్రీమతి కమలాదేవి** (కరీంనగర్‌జిల్లా పెద్దపల్లి గ్రామవాసులు) **21.09.2011**న పరమపదించారు. వీరికి పరమపదనాథుని పదసన్నిధిలో నిత్యం కైంకర్యంచేసుకునే భాగ్యాన్ని ప్రసాదించుగాక అని శ్రీస్వామివారు మంగళా శాసనాలు చేసారు.



విజయవాడ వికాసతరంగిణి సభ్యులైన శ్రీమాన్ కోనేరు నిరంజన్‌గారు తమ తల్లిగారైన **శ్రీమతి సరోజినిగారి ప్రథమ వర్ధంతి** సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యం సమర్పించారు. వీరికి మరియు వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశా సనములు కృపచేశారు.

గుంటూరుజిల్లా, పాతమల్లాయపాలెం గ్రామ వాస్తవ్యులు శ్రీస్వామి వారి శిష్యులు, శ్రీమాన్ **బొంతు కోటేశ్వరరెడ్డి** గారు ది. **2.9.2011**న పరమపదం చేరినారు. వీరు వికాసతరంగిణి సభ్యులు. శ్రీస్వామివారి సేవాకార్యక్రమాలలో ఆసక్తికరంగా పాల్గొనేవారు. వీరికి ఆచార్యుల తిరువడి లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.





శ్రీస్వామివారి ప్రియశిష్యులు, విజయవాడ వాస్తవ్యులు, **శ్రీమాన్ మొగళ్ళపు విద్యా సుగుణ పూర్ణచంద్రరావు** గారి 11వ వర్ధంతి ది. **26-1-2012**న జరుపుకొను సందర్భముగా వారు చేసిన సేవలను గుర్తుంచుకొని వారి శ్రీమతి సరోజనమ్మ గారికి మరియు కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనములు కృపచేశారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన అక్టోబరు నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. ఆచార్య శ్రీపాద ప్రభావం ----- | |
| 2 పిళ్ళైలోకాచార్యులవారు శ్రీరంగనాథుని దాచిన ఏ పర్వత ం? | |
| 3 స్వర్గాన్ని ఎత్తి కుదేయ్యాలని పూనుకున్నవాడు? | |
| 4 'అస్థలితమతి' అని అంటే? | |
| 5 ఆత్మ ఎందుకు అందమైనది? | |
| 6 'నిబర్హకం' అనే పదం ఏ వ్యాసంలో ఏ సందర్భంలో ఎలా ఉపయోగించారు ? | |
| 7 'పర్యుషితము' అనగా----- | |
| 8 'మాలినీ' నదికి ఇరుప్రక్కల ఉన్నవి ఏవి? | |
| 9 'ఉపద' అంటే? | |
| 10 ఈ సహస్రతులసీ శ్రీనివాసమ్ జరపడానికి కారణం ఏమి? | |
| 11 జ్ఞానులకు ఈ సంసారసాగరం? | |
| 12 కౌశికముని అంటే ఎవరు? | |
| 13 కృష్ణుణ్ణి కంసుడు దేనికి ఆహ్వానించాడు? | |
| 14 జటాయువు ప్రాణత్యాగంచేసిన స్థలం? | |
| 15 ఉపనిషత్ పదానికి విగ్రహవాక్యం చెప్పి, అర్థాన్ని తెలపండి? | |
| 16 శ్రీరామాయణం ఏ కాలం లోనిది? | |
| 17 ఈ ఒక్కటి సేవిస్తే చాలు 106 దివ్యదేశ సందర్శనఫలాన్ని పొందవచ్చు? : | |
| 18 మధుర అందాలను అలతి పదాలతో అచ్చతెలుగులో అద్భుతంగా మనకు చూపిస్తున్నవారు? | |
| 19 'భద్రశయ్యాధివాసి' ఈయన? | |
| 20 పరమరహస్యాన్ని ఇలా అంటారు? | |
| 21 శ్రీకృష్ణదేవరాయల వారి ఇష్టదైవం ఎవరు? వారు వ్రాసిన ప్రబంధంపేరు? | |
| 22. కుమారుల భట్టు ------- సంప్రదాయానికి చెందినవారు. | |
| 23. త్రిమతాచార్యులు వీరు... | |
| 24. మాయను దాటగలవారెవరు? | |
| 25. అసలైన నిధి, నిధికాని నిధి | |

గత నెల విజేత : చి॥ ఎమ్. అనిరుద్ రాజహేంద్రి.

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్టు పంపగలరు.

భక్తినివేదన శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...
ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీ ఖరనామ సంవత్సరం మాఘమాసం

## పండుగలు

**ఫిబ్రవరి:**

3. సర్వేషాం భీష్మైకాదశి శ్రీ విష్ణు సహస్రనామ జయంతి
4. భీష్మద్వాదశి
6. ధనిష్ఠకార్తె
12. కూరత్తాళ్వాన్ తిరునక్షత్రం, శ్రీ వైష్ణవ గృహోదులయందు ప్రబందారంభం, మందసా వాసుదేవ ప్పెరుమాళ్ బ్రహ్మోత్సవారంభం.
13. కుంభ సంక్రమణము
14. తిథి ద్వయం
15. మందసా వాసుదేవప్పెరుమాళ్ కళ్యాణోత్సవం
17. స్మార్త ఏకాదశి.
18. వైష్ణవానామేకాదశి
20. శతభిషాకార్తె, మహాశివరాత్రి, వేములవాడ శ్రీ శైలముల యందు అభిషేక కళ్యాణోత్సవము
21. పిండపితృయజ్ఞము, అమావాస్య.
25. త్రిద్యుస్పృక్
29. శూన్యతిథి

**మార్చి:**

2. శ్రీ యాదగిరి లక్ష్మీనరసింహస్వామి కళ్యాణోత్సవము
4. పూర్వాభాద్ర కార్తె, సర్వేషామేకాదశి, కులశేఖరాళ్వార్ తిరు.
5. నృసింహ ద్వాదశి
6. దక్షిణాది కామదహనం
7. ఉత్తరాది కామదహనం
8. హోళికోత్సవము, మదన పూర్ణిమ.


సంపుటి 64 ఫిబ్రవరి

సంచిక 11 2012


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

**శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు**

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-





మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,
ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం

సర్వ సంపదల సిద్ధికై మాఘమాస

# ఆదిత్యహృదయ పారాయణము

**24-1-2012 నుండి 22-2-2012 వరకు**

ఆచార్య స్తుతిః

శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్ ।
యతీంద్ర ప్రవణం వందే రమ్య జామాతరం మునిమ్॥ 1

లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్ ।
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్ ॥ 2

యో నిత్య మచ్యుతపదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే।
అస్మద్గురో ర్భగవతో-స్య దయైక సింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥ 3

మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా॥ 4

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్ పరాంకుశ మునిం ప్రణతో-స్మి నిత్యమ్॥ 5

**అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా**
**యస్స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యన్తర శ్శుచిః ॥**

పుండరీకాక్ష! పుండరీకాక్ష! పుండరీకాక్షాయ నమః,

**3 సార్లు బొటన వ్రేలితో నీరు తలపై చల్లుకోవలెను.**

ఆచమ్య: **ఓం అచ్యుతాయ నమః**
**ఓం అనంతాయ నమః**
**ఓం గోవిందాయ నమః**
} గోకర్ణముద్రతో నీటిని మూడుసార్లు విడివిడిగ త్రాగవలెను. తలపై రాసుకొనరాదు.

### సంకల్పం

ఓం శ్రీగోవింద గోవింద గోవింద! శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య, అద్య బ్రహ్మణః, ద్వితీయ పరార్థే, శ్రీ శ్వేతవారాహ కల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే శకాబ్దే, మేరోః దక్షిణదిగ్భాగే, శ్రీరంగస్య ఉత్తరదిక్ ప్రదేశే, భగవద్భాగవత ఆచార్య సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన, శ్రీ ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే ....... నామ సంవత్సరే ఉత్తరాయణే శిశిరఋతౌ మాఘమాసే, .........పక్షే, .............తిథౌ,...........వాసరే శుభనక్షత్రే శుభయోగ శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం అస్యాం, శుభతిథౌ మమ సకుటుంబస్య క్షేమ స్థైర్య ధైర్య వీర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్య ధనధాన్య పుత్ర పౌత్రాభివృద్ధ్యర్థం సర్వసంపత్ సమృద్ధ్యర్థం, తుష్ట్యర్థం, పుష్ట్యర్థం, సంకల్పిత సర్వకార్యేషు విజయప్రాప్త్యర్థం, సర్వదోష నివారణార్థం, శ్రీసూర్యనారాయణ అనుగ్రహ కృపాకటాక్ష సిద్ధ్యర్థం, విశేషతః భగవత్ భాగవత ఆచార్య కైంకర్యాభివృద్ధ్యర్థం ఆదిత్యహృదయ పారాయణం కరిష్యే। ఇతి సంకల్ప్య।

**(ఉంగరపు వ్రేలితో నీటిని తాకవలెను)**

**నమస్కరించి**

ఆదిదేవ! నమస్తుభ్యం ప్రసీద మమ భాస్కర!।
దివాకర! నమస్తుభ్యం ప్రభాకర! నమోఽ స్తు తే॥

### ఆదిత్యహృదయ సంకల్పం

**అస్య ఆదిత్యహృదయ స్తోత్రస్య విద్యామండలాధీశ్వరః భగవాన్ అగస్త్యః ఋషిః, అనుష్టుప్ ఛందః, ఆదిత్యమండల అంతర్వర్తీ శ్రీమన్నారాయణో దేవతా, నిరస్త అశేష విఘ్నతయా, బ్రహ్మవిద్యాసిద్ధౌ, నీరోగతా సిద్ధౌ, సర్వత్ర జయసిద్ధౌచ వినియోగః।**

**సూర్యప్రార్థన**

*ధ్యానం:-*

ఆదిదేవ! నమస్తుభ్యం ప్రసీద మమ భాస్కర!।
దివాకర! నమస్తుభ్యం ప్రభాకర! నమోఽ స్తుతే॥

ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ
నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః।
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయవపుః ధృత శంఖచక్రః॥

శంఖచక్ర గదాపాణే! ద్వారకానిలయాచ్యుత!।
గోవింద! పుండరీకాక్ష! రక్షమాం శరణాగతమ్॥

వాల్మీకి ప్రార్థన :-

కూజన్తం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ॥

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః ।
శృణ్వన్ రామ కథానాదం కో న యాతి పరాంగతిమ్? ॥

## శ్రీరామధ్యానం

ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది ।
పౌరుషేచా ప్రతిద్వంద్వః శరైనం జహి రావణమ్ ॥

## ఆదిత్యహృదయం

తతో యుద్ధ పరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్ ।
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ॥ 1

దైవతై శ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణమ్ ।
ఉపగమ్యాబ్రవీత్ రామ మగస్త్యో భగవాన్ ఋషిః ॥ 2

*అగస్త్య ఉవాచ :-*

రామ! రామ! మహాబాహో! శృణుగుహ్యం సనాతనమ్।
యేన సర్వా నరీన్ వత్స! సమరే విజయిష్యసి ॥ 3

ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రు వినాశనమ్ ।
జయావహం జపేన్నిత్యం అక్షయ్యం పరమం శుభమ్ ॥ 4

సర్వమంగళ మాంగళ్యం సర్వపాపప్రణాశనమ్ ।
చింతాశోక ప్రశమనం ఆయుర్వర్ధన ముత్తమమ్ ॥ 5

రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతమ్ ।
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్ ॥ 6

సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః ।
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః ॥ 7

ఏష బ్రహ్మా చ విష్ణు శ్చ శివః స్కందః ప్రజాపతిః ।
మహేంద్రో ధనదః కాలో యమ స్సోమో హ్యపాంపతిః ॥ 8

పితరో వసవః సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః ।
వాయుర్వహ్నిః ప్రజాప్రాణా ఋతుకర్తా ప్రభాకరః ॥" 9

ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్ ।
సువర్ణ సదృశో భానుః స్వర్ణరేతా దివాకరః ॥ 10

హరిదశ్వ స్సహస్రార్చిః సప్తసప్తి ర్మరీచిమాన్ ।
తిమిరోన్మథన శ్శంభుః త్వష్టా మార్తాండ అంశుమాన్ ॥ 11

హిరణ్యగర్భ శ్శిశిరా స్తపనోఽహస్కరో రవిః ।
అగ్నిగర్భోఽదితేః పుత్రః శంఖః శిశిరనాశనః ॥ 12

వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః ।
ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీథీ ప్లవంగమః ॥ 13

ఆతపీ మండలీ మృత్యుః పింగళః సర్వతాపనః ।
కవి ర్విశ్వో మహాతేజా రక్త స్సర్వభవోద్భవః ॥ 14

నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః ।
తేజసా మపి తేజస్వీ ద్వాదశాత్మన్! నమోఽస్తు తే ॥ 15

నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః ।
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః ॥ 16

జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః ।
నమో నమః సహస్రాంశో! ఆదిత్యాయ నమో నమః ॥ 17

నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః ।
నమః పద్మప్రబోధాయ మార్తండాయ నమో నమః ॥ 18

బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే ।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయవపుషే నమః ॥ 19

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయా ఽమితాత్మనే ।
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ॥ 20

తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే ।
నమ స్తమోఽభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే" ॥ 21

నాశయత్యేష వై భూతం తదైవ సృజతి ప్రభుః ।
పాయత్యేష తప త్యేష వర్షత్యేష గభస్తిభిః ॥ 22

ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః ।
ఏష చైవాగ్ని హోత్రం చ ఫలం చైవాగ్ని హోత్రిణామ్ ॥ 23

వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ ।
యాని కృత్యాని లోకేషు సర్వాణ్యేష రవిః ప్రభుః ॥ 24

ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ ।
కీర్తయన్ పురుషః కశ్చిత్ నావసీదతి రాఘవ! ॥ 25

పూజయ స్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్ ।
ఏతత్ త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి ॥ 26

అస్మిన్ క్షణే మహాబాహో! రావణం త్వం వధిష్యసి ।
ఏవ ముక్త్వా తదాగస్త్యో జగామ చ యథాగతమ్ ॥ 27

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవ త్తదా ।
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్ ॥ 28

ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్ష మవాప్తవాన్ ।
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధను రాదాయ వీర్యవాన్ ॥ 29

రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్ ।
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్ ॥ 30

అథ రవి రవద న్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః ।
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచ స్త్వరేతి ॥ 31

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే యుద్ధకాండే సప్తోత్తర శతతమ స్సర్గః సమాప్తః*

ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది ।
పౌరుషేచా ప్రతిద్వంద్వః శరైనం జహి రావణమ్ ॥

మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే ।
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేనమార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాః సుఖినో భవన్తు ॥

యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం తు యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తుతే ॥
కాయేనవాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనావా ప్రకృతేః స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి ॥

శ్రీమన్నారాయణాయేతి సమర్పయామి

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు

ప్ర.స్కం. ప. అధ్యాయం (1)



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*గత సంచిక తరువాయి...*

(ప్ర.స్కం. 5వఅధ్యా. నారదపూర్వజన్మవృత్తాన్తం)

**శ్లో॥ జ్ఞానం గుహ్యతమం యత్తత్ సాక్షాత్ భగవతో దితమ్ ।
అన్వవోచన్ గమిష్యన్తః కృపయా దీనవత్సలాః ॥**

ఇక్కడ శ్రీమద్భాగవతం గుహ్య తమమైన జ్ఞానాన్ని గురించి ప్రస్తావించి, ఈ జ్ఞానాన్ని సాక్షాత్తు భగవంతుడే ఆవిష్కరించాడని అంటున్నది.

ఈ **గుహ్యతమజ్ఞానం** ఏమిటి? ఎవరికి ఆవిష్కరింప బడింది? అన్న శంకను, వ్యాఖ్యాతలు వేరు వేరుగా సమాధానిస్తు న్నారు. అవతార రహస్యమే గుహ్యతమజ్ఞానమని, దాన్ని పరమాత్మ చతుర్ముఖబ్రహ్మకు ఆవిష్కరించాడని, లేదా భక్తిరూపమైన జ్ఞానమే గుహ్యతమమని వీరరాఘవీయ వ్యాఖ్య స్పష్టపరిచింది. శ్రీధరస్వామి, జ్ఞానాన్ని మూడుగా విభజించి, గుహ్యం, గుహ్యతరం, గుహ్యతమం, అని చెప్పదగిన ఈ మూడుజ్ఞానాల్లో సాధనమైన "ధర్మ" తత్త్వజ్ఞానం గుహ్యమని, దానిచేత సాధింపబడే సాధ్యరూపమైన జ్ఞానం గుహ్యతరమని, అది, స్థూలసూక్ష్మ దేహాల కంటే వేరైన ఆత్మ తత్త్వజ్ఞానమని, దాని ద్వారా లభించే పరమ ప్రాప్యుడైన ఈశ్వరునికి చెందిన తత్త్వజ్ఞానం గుహ్యతమమని ఇదే భాగవతశాస్త్రమని, ఇది స్వయంగా భగవానుని చేతనే ఆవిష్కరింపబడిందని వ్యాఖ్యానించాడు. ఇలాంటి గుహ్యతమమైన పారమాత్మిక జ్ఞానాన్నే మునులు పూర్వజన్మలో బాలకునిగా తమకు శుశ్రూష చేసిన నారదునికి ఉపదేశించినారని భాగవతం స్పష్టపరచింది. ఇలా మహానుభావుల వలన తత్త్వజ్ఞానాన్ని పొంది నారదుడు మాయా రూప-భగవద్విచిత్ర శక్తి విలాసాన్ని గుర్తించాడు. మాయాతరణమే పరమపదప్రాప్తి హేతువుగదా !

**శ్లో॥ ఏతత్ సంసూచితం బ్రహ్మన్ తాపత్రయ చికిత్సితమ్ ।
యదీశ్వరే భగవతి కర్మ బ్రహ్మణి భావితమ్ ॥**

ఇక్కడ ఈ రహస్యం సూచింపబడింది. ఏమిటది? ఏకర్మ, స్వార్థ ప్రయోజన బుద్ధితో ఆచరింపబడి బంధకమై స్వర్గనరకాది హేతువౌతున్నదో, అదే కర్మ భగవంతునియందు అర్పింప బడినప్పుడు భర్జితధాన్యాలవలె (పేల్చిన పేలాలవలె) పుణ్యపాప కర్మ ఫలాలైన స్వర్గనరకాదులను ఈయ జాలదు. అంటే ఒకే ద్రవ్యం రోగకారణ మైనప్పటికీ, అది సంస్కరింపబడినప్పుడు రోగనివర్తకం కూడా కాగలగటం చూస్తున్నాం కదా ! సాక్షాత్తు ప్రాణహారకమైన విషమే, సంశోధితమై ఔషధంగా మారి ప్రాణరక్షకమవడం వైద్య శాస్త్ర ప్రసిద్ధమే. కర్మకూడా ఇలాంటిదేనని అభిప్రాయం. శ్రీగీత సంగత్యాగపురస్సరంగా భగవదర్పణ బుద్ధితో చేయదగిన కర్మల గురించి చాలా విస్తారంగా చెప్పింది.

పై దృష్టాన్తాన్ని భాగవతం ఈక్రింది శ్లోకంలో వ్యక్త పరచింది.

**శ్లో॥ ఆమయో యశ్చ భూతానాం జ్ఞాయతే యేన సువ్రత! ।
తదేవ హ్యామయద్రవ్యం న పునాతి చికిత్సితమ్? ॥**

రోగకారణమైన ద్రవ్యాన్నే చికిత్సకు యథాతథాంగా వినియోగిస్తే అది ఆత్మవినాశన హేతువవుతుందని అభిప్రాయం. సంస్కరిస్తే అదేద్రవ్యం ఆ రోగాన్ని నిర్మూలిస్తుందని కూడా స్పష్టపరిచాడు.

ఇక్కడ కర్మ-జ్ఞానాలకుండవలసిన యోగ్యత ఎలాంటిదో భాగవతం ఇలా చెబుతున్నది.

**శ్లో॥ యదత్రక్రియతే కర్మ భగవత్ పరితోషణమ్ ।
జ్ఞానం యత్త దధీనం హి భక్తియోగ సమన్వితమ్ ॥**

ఈ సంసారంలో ఆచరింపదగిన కర్మ ఏదైనా అది భగవత్పరితోషణ కారణం కావాలి. ఇక జ్ఞానం అనేది భక్తియోగ సమన్వితం కావాలి. అప్పుడే జ్ఞాన కర్మలు ప్రాప్యప్రాపకాలు కాగలుగుతాయి.

ఇక కర్మ–లౌకిక ఫలసాధకంగా ఆచరించినప్పుడు, జ్ఞానం తత్త్వచింతనాపరంకాక విషయ ప్రవణం అయితే, ఆ జ్ఞానకర్మలు ఉపద్రవకారణాలేనని భాగవతం ఉద్ఘోషిస్తున్నదీ శ్లోకంలో . ఇక సమ్యగ్దర్శనం ఎలాంటిదో నిరూపించింది భాగవతం ఈ క్రింది శ్లోకాల్లో ...

**శ్లో॥ కుర్వాణా యత్ర కర్మాణి భగవచ్ఛిక్షయా సకృత్ ।**
**గృణన్తి గుణనామాని కృష్ణ స్యానుస్మరంతి చ ॥**

**శ్లో॥ నమో భగవతే తుభ్యం వాసుదేవాయ ధీమహి ।**
**ప్రద్యుమ్నాయానిరుద్ధాయ నమ స్సంకర్షణాయ చ ॥**

**శ్లో॥ ఇతిమూర్త్యభిధానేన మంత్రమూర్తి మమూర్తికమ్ ।**
**యజతే యజ్ఞపురుషం స సమ్యగ్ దర్శనః పుమాన్ ॥**

ఎవ్వడు సమ్యగ్దర్శనుడు? అంటే ఎవ్వడు సరియైన వివేకం కలవాడు? అని ప్రశ్న? దానికి సమాధానం– భగవదను శాసనాన్ని బట్టి, అంటే, శ్రుతిస్మృతులు భగవదాజ్ఞారూపాలు కనుక, వాటిని అనువర్తించి ఉండడమే భగవదను శాసన పాలనం.

కర్మలనాచరించేటప్పుడు భగవన్నామాలను, వాటిచే ప్రతిపాదింపబడే గుణవైభవాన్ని అనుసంధానం చేయడమే శాసన పాలనం. "నమో భగవతే తుభ్యం" ఇత్యాది మంత్ర ప్రతిపాదితమైన వాసుదేవ–సంకర్షణ– ప్రద్యుమ్న–అనిరుద్ధమూర్తులను కీర్తిస్తూ, పరిమితమైన మూర్తిలేని ఆ తత్త్వాన్ని ఒక మంత్రమూర్తిగ యజ్ఞపురుషుడైన స్వామిగ ఎవ్వడారాధిస్తాడో వాడే సమ్యగ్దర్శనుడు. ఇలా తన వేదాద్యను శాసనాన్ని, తన్మూలమైన నా అనుష్ఠానాన్ని తెలిసికొన్నా శ్రీకృష్ణుడు సమ్యగ్ జ్ఞానాన్ని, ఐశ్వర్యాన్ని, తన పట్ల ప్రీతిని అనుగ్రహించాడు. కనుక, ఓ వ్యాసమహర్షీ! అతిశయిత శాస్త్రవివేకంగల నీవు ఆ శ్రీకృష్ణునికి చెందిన కీర్తిని వర్ణించు. ఆ కీర్తిని విని మననం చేసిన తత్త్వవివేచకుల తత్త్వబుభుత్స, అంటే భగవతత్త్వం తెలిసికోవాలనే ఇచ్ఛ, లెస్సగా ఆవిష్కృత మౌతుంది. దాని వల్ల మరొక పద్ధతిలో దుఃఖప్రశమనాన్ని భావించజాలరు. అంటే అన్ని రకాల క్లేశాలకు భగవద్గుణ వైభవ సంచిన్తనమే పరమ సాధనమనిభావిస్తారు తప్ప, ఇతర సాధనా భాసల వెంటపడరని తాత్పర్యం.

ఇంతవరకు వర్ణింపబడిన నారదపూర్వజన్మవృత్తాన్తంచేత అవగతమయేది, సత్సంగమహిమ, సత్సంగంవల్ల భగవద్గుణ వైభవం హృదయదఘ్నంగా సామాన్యులకు సహితం అనుభవ గోచరం అవుతుంది. ఎన్ని సాంసారిక క్లేశాలు వచ్చినా, వాటిని పోగొట్టుకోవడానికి ఏవేవో లౌకిక సాధన సంపత్తుల నాశ్రయించినా, అవన్నీ సాధనాభాసలే తప్ప నిజంగా క్లేశ దుఃఖాన్ని, తాపత్రాయాన్ని పోద్రోలేవి కావు. కేవలం భగవద్గుణ వైభవ వర్ణనం, శ్రవణం, భగవద్గుణ వైభవనిధిధ్యాసనమే నిజమైన సాధనం. కనుక, శాస్త్రగ్రంథాలు, వేద స్మృతులు ఇలాంటి ఉత్తమసంస్కారాన్ని అలవరచే ధార్మిక జీవన విధానాన్నే ఆవిష్కరిస్తున్నాయి. కనుక వ్యాసుడు కూడా మహాభారత నిర్మాణ ముఖంగా సాధింపలేక పోయిన "భగవత్కల్యాణ గుణవైభవ" ప్రకాశకాలైన లీలల వర్ణనాన్ని భాగవతముఖంగా చేయాలని, నారదుడు ప్రతిబోధించడం ఈ పంచమాధ్యాయ పరమ తాత్పర్యం. *(సశేషం)*

# కలివైరిసూరి వైభవము



గత సంచిక తరువాయి... **శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు**

**ఇంతవరకు మనం అహోబిల క్షేత్రములోని నరసింహ స్వామి వైభవాన్ని, ఆ క్షేత్ర వైభవాన్ని తెలుసుకున్నాం. ఆ స్వామి ఏడుకొండలపై కలియుగ దైవమై తిరుమలలో వేంచేసి ఉన్నాడు. ఈ 8వ దశకంలో ఆ శ్రీనివాసుని వైభవాన్ని, తిరుమల వైభవాన్ని మనకు తిరుమంగై ఆళ్వార్లు ఇలా తెలియజేస్తున్నారు.**

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-8-1**

**కొழு లర్న్ద మలర్‌కురున్ద మొశిత్త కోవల నెమ్బిరాన్**
**శఙ్గుతఙ్గు తడఙ్గడల్ తుయిల్ కొణ్డ తామరై క్కణ్ణినన్**
**పొழு పుళ్ళినై వాయ్‌పిళన్ద పురాణర్ తమ్మిడమ్ పొழுనీర్**
**శెఙ్గయల్ తిళైక్కుం శునైనీర్ త్తిరువేఙ్గడమడై నెంజమే ॥**

ప్రతిపదార్థము: **శంగు**=శంఖములు; **తంగు**=నివసించి యుండు; **తడమ్**=విశాలమైన; **కడల్**=సముద్రమందు; **తుయిల్ కొండు**=శయనించియున్న; **తామరైక్కణ్ణిన్**=కెందామరలవంటి నేత్రములు కలవాడును; **కొழு**=సువాసనలు; **అలర్న్ద**= వ్యాపించుచున్న; **మలర్**=పుష్పములుగల; **కురున్దమ్**= కుంద వృక్షమును (కుంద అనునది అడవులలోనుండు ఒకానొక చెట్టు) **ఒశిత్త**=పెకలించివేసిన; **కోవలన్**=గోపాలుడును; **పొழு**= గర్వముతో విజృంభించిన; **పుళ్ళినై**=బకాసురునియొక్క; **వాయ్**=నోటిని; **పిళన్ద**=చీల్చివేసి; **ఎంపిరాన్**=నాకుపకరించిన వాడునైన; **పురాణర్‌తమ్**=పురాణ ప్రసిద్ధునియొక్క; **ఇడమ్**= స్థానమైన; **తిళైక్కుం**=విహరించు; **శునై**=చెరువులుగల; **తిరువేంగడమ్**=తిరుమలై క్షేత్రమును; **నెంజే**=ఓ మనసా!; **అడై**= ఆశ్రయింపుమా!

**తాత్పర్యము:** పరిమళములను వెదజల్లు పూలతో నిండి యున్న కుందవృక్షమును ఊడబెరికి రూపుమాపిన గోపాలుడు నాకుపకారకుడు. అతను బకాసురుని సంహరించినవాడు. శంఖములతో నిండియున్న మహాసముద్రమున శయనించి యున్నవాడు. తామరస నయనుడు. పురాణ పురుషుడు. ఆతడు వేంచేసియున్న స్థలము శ్రీ వేంకటగిరి. ఆ క్షేత్రము ఎల్లవేపలు సుఖముగ విహరించుటకు వీలైన జలాతిశయముగల కొలనులు కూడియుండును. ఓ మనసా! ఆ శ్రీ వేంకటాద్రిని ఆశ్రయింపుమా!

**విశేషార్థము:** పూర్వదశకమున తిరుమంగై ఆళ్వార్లు **"నిన్నశెన్దీ మొణ్డుశూరై"**=వేడి సుడిగాడ్పులను ఆకాశమునకు ఎగయ వీచుచున్న అనియు, **"కనైత్త తీయుమ్"** =చిటపటలాడు చున్న అగ్ని అనియు, **"తేయ్‌త్త తీయాల్"** రాపిడిచే యేర్పడిన అగ్ని అనియు అహోబిలక్షేత్రము భగవద్విరోధులకు ప్రవేశించు టకు వీలుకాకున్న విధమును తలచి ఓ మనసా! అటువంటి ఆ అహోబిలక్షేత్రమును ఆశ్రయింతుమని తెలిపియున్నాను.

తన భక్తులు తనను చేరుటకు ఆటంకములుగ నున్నవానినన్నింటిని తొలగించుటయే స్వభావముగ గలవాడును తనయందు భక్తి కలవారిని సంశ్లేషించుటయే స్వభావముగ కలవాడును పరమకారుణికుడును అగు భగవంతుడు వీరికి (తిరుమంగై ఆళ్వార్లకు) తన వివిధములగు రూపములను సందర్శింప చేయసాగెను.

భగవన్నామమును నోరార పలికినందులకు తన కుమారునికే శత్రువైన హిరణ్యకశిపుని సంహరించుటకై నరసింహరూపమునుగొని ప్రహ్లాదునకు ఉపకరించినస్వామి కేవలము ప్రహ్లాదునకే కాక భగవ న్నామమును అనుసంధించిన వారి అందరి సాంసారికములగు పాపములన్నింటిని పారద్రోలుటకై తిరుమల శిఖరాగ్రములందు వేంచేసియున్నాడు. ఓ మనసా! మనము అచ్చటకు వెళ్ళి ఆ స్వామిని అనుభవింతుమని శ్రీ కలివైరిసూరి తమ మనస్సు నుద్దేశించి ఈ దశకమున పలుకుచున్నారు.

అహోబిల క్షేత్రమునకు పోయినచో అచ్చటనున్నవారు ఆంధ్రభాషను మాత్రము మాటాడువారుగానుందురు. తమిళమును మాటలాడువారుండరు. **"బోధయన్తః పరస్పరమ్"** అనినట్లు భగవంతుని కళ్యాణగుణములను అనుసంధించు కొనుటకు సహకరించువారు కరువుగా నుందురు.

తిరుమలక్షేత్రము అటులగాక తమిళనాడునకు హద్దుగా ఉన్నందున అచ్చట తమిళులు కూడనుందురు. భగవంతుని వైభవములను అనుసంధించుకొనుటకు వీలుగనుండునని తలచి తిరుమలకు వెళ్ళి తిరుమలేశుని అనుభవింప ఉద్యమించు చున్నారు శ్రీపరకాల కవీంద్రులు.

రాక్షసులు నేరుగా శ్రీకృష్ణభగవానుని సంహరింపలేక మాయరూపములనుగొని తమ ప్రయత్నములను చేయు చుందురు. శకటాసురుడు, వత్సాసురుడు, ధేనుకాసురుడు, గర్దభాసురుడు, బకాసురుడు, పూతన ఇంకను ఎందరెందరో అసురులు ఈ కోవకు చెందినవారే! మిక్కిలి ఆకర్షణీయమగు వృక్షరూపమును దాల్చియున్న ఒక అసురుని శ్రీకృష్ణభగవానుడు సంహరించిన విధమును ఈ పాశురమున పూర్వార్ధముననను బకాసురుని (కొంగరూపమునుగొనిన అసురుడు) సంహరించిన విధమును ఉత్తరార్ధముననను తిరుమంగై ఆళ్వార్లు అనుభవించుచున్నారు.

**కొఙ్గు అలర్న్ద :** ఒక రాక్షసుడు సువాసనలతో కూడిన పుష్పములతో నిండియున్న **"కురుంద"** వృక్షరూపియై శ్రీకృష్ణుని వధించుటకై వేచియున్నాడు.

శ్రీకృష్ణభగవానుడు అసురావిష్టమగు ఆ వృక్షమునుజూచి "ఇది చాల అందముగనున్నదే! అని అందున్న మోసము నెరిగి ఆ వృక్షములోని ఒక పుష్పము కూడ రాలిపోకుండా దానిని ఊడబెరకి నులిమివేసెను.

**కోవలన్ ఎంబిరాన్ :** నేను శ్రీకృష్ణభగవానుని చేరుటకు అడ్డములుగానున్న నా పాపములనన్నింటిని కురుందవృక్షమును ఊడబెరకి నులిమి వేసినట్లు పారద్రోలి నాకుపకరించినవాడు.

ఆ అసురుడు చేయదలచుకొనిన సంహారకార్యమును శ్రీకృష్ణుడు ఆతనికే చేసివేసెను. కాని తిరుమంగై ఆళ్వార్లు భగవంతుడు ఆ అసురుని సంహరించినది తమ కొరకు అని భావించి "ఎంబిరాన్" నాకుపకరించినవవాడని ఈ పాశురమున అనుగ్రహించు చున్నారు.

**శఙ్గిత్యాది:**

**"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః**
**నాగపర్యంకముత్సృజ్య హ్యాగతో మధురాంపురీమ్"**

అన్నట్లు పాలకడలిలో పవళించిన శ్రీమన్నారాయణుడే ఆ నాగపర్యంకమును వీడి మధురానగరమున శ్రీకృష్ణుడుగా నవతరించెను. శ్రీకృష్ణుడుగానవతరించుటకు మూలమగు క్షీరార్ణవశాయిత్వమును శ్రీ పరకాల కవీంద్రులు ఇందు వివరించుచున్నారు. పాలసముద్రము శంఖములతో కూడినదై భగవంతుడు శయనించుటకు వీలుగ సువిశాలమైనదైయున్నది. అందు శయనించియున్న స్వామి.

**పొఙ్గిత్యాది:** పెద్దరూపమునుగొని గొప్ప బలముతో వచ్చిన బకాసురుని నోటిని చీల్చిన స్వామి. ఈ విధముగ అసురులను సంహరించుటయే తనకు స్వభావముగా గల స్వామివచ్చి వేంచేసియుండు స్థలము తిరుమలక్షేత్రము. తిరుమల దివ్యదేశము జలసమృద్ధి, వరికంకుల కాంతులతో పొలములు లేత ఎరుపురంగును కలిగి ఓ మనసా! పంటపొలములతోను సెలయేరులతోను నిండియుండు తిరుమల దివ్యదేశమును ఆశ్రయించెదము రమ్ము! *(సశేషం)*



# సీతాఫలం రామార్పణమ్



శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్

*(గతసంచికతరువాయి...)*

సూతముని గుహుని పూర్వజన్మపుణ్యం ఏమిటో నైమిశారణ్య మునులకు చెప్పసాగెను..

**రాజా! త్వేకో బ్రహ్మహత్యాం కృత్వా తద్దోషమూలతః ।**
**ఉన్మత్త ఇవ కాంతారే భ్రమతిస్మ పురా ద్విజాః ॥**

మహర్షులారా! పూర్వమొక రాజు బ్రహ్మహత్యా పాతకము వలన పిచ్చివాడై అరణ్యాలలో తిరుగుతూ వుండేవాడు. ఆ విధంగా ఆరాజు ఒకవనంలో తిరుగుతూ వుండగా తపస్సు చేసుకుంటున్న ఇద్దరు మునులు కనుపించారు. వారిని చూడగానే ఆ రాజుకు జ్ఞానోదయం అయింది. వారిలో ఒకమునివద్దకు వెళ్ళి 'మహానుభావా! నేను అనేక పాపాలు చేశాను. నాకు పాపపరిహార మార్గాన్ని తెలియజేయు'మని ప్రార్థించాడు. అప్పుడా మునివర్యుడు 'రాజా! మూడుసార్లు రామనామాన్ని, నిశ్చలభక్తితో ఉచ్చరించు. నీ పాపాలన్నీ భస్మీపటలం అయిపోగల'వని, విచారము మానమనీ చెప్పాడు.

ఆ మాటలు విన్న రెండవముని 'ఓ మహర్షీ! ఒక్కసారి రామనామ ఉచ్చారణచేతనే సమస్త పాపాలు నశించును కదా! నీవు శాస్త్రపండితుడివై వుండి కూడా శాస్త్రవిరుద్ధంగా ముమ్మారు రామనామం పలుకమని ఎందుకు చెప్పినావు?' నీవీ అనృత (అబద్ధ) దోషము వలన నిషాదుడవై జన్మించమని శపించాడు. ఆ శాపము వలన ఆ ముని గుహుడనే నిషాదుడై అడవిలో తిరుగుతూ వుండగా ఒకనాడు నారదమహర్షి దర్శనభాగ్యం కలిగింది. నారదునికి నమస్కరించి "దేవఋషీ! భవసాగరాన్ని తరించే ఒక మంత్రాన్ని నాకు ఉపదేశించ"మని వేడుకున్నాడు. అప్పుడు నారదముని

**కాంచి న్నావం కల్పయిత్వా గంగాతీరే వసేద్భవాన్ ।**
**గతాగతా న్జనా న్నిత్యం తారయన్ ధర్మతత్పరః ॥**

"గుహా! నీవొక నావను తయారు చేసుకొని, గంగాతీరము నందు నివసించుము. వచ్చిపోవువారిని, ధర్మబుద్ధితో గంగా నదిని దాటించుము.

**ఏవం స్థితే భావికాలే రామ స్సాక్షా జ్జనార్దనః ।**
**సమాగచ్ఛేదిమం దేశమహల్యాం చాపి పావయేత్ ॥**

కొంతకాలము గడిచిన తరువాత సాక్షాత్తూ విష్ణువు అంశ సంభూతుడైన శ్రీరామచంద్రమూర్తి నీవద్దకు రాగలడు. అందుకు నీకొక గుర్తును కూడా చెప్పెదను వినుము. గంగాతీరమునున్న గౌతమాశ్రమమున ధూళిగ పడిఉన్న అహల్యను ఏ మహాత్ముడు శాపవిముక్తము చేయునో ఆతడే శ్రీరామచంద్రమూర్తి అని గ్రహించు.

**తదా రాఘవ పాదాబ్జక్షాళనం కృతవాన్యది**
**తరిష్యసి నిషాద! త్వ మిత్యుక్త్వాఽగాద్దివం మునిః ॥**

ఆ శ్రీరామచంద్రమూర్తి వచ్చినప్పుడు నీవా మహాత్ముని పాదాలు కడిగిన ఎడల తరించగలవు. అంతేగాని నీకేమంత్ర ములతోనూ పనిలేదని చెప్పి నారదమహర్షి దేవలోకమునకు వెళ్ళిపోయినాడు. అది మొదలు గుహుడు గంగాతీరమున నివసిస్తూ, ధూళిగ ఉన్న అహల్య స్థానాన్ని పరిశీలిస్తూ, కాలం గడుపుతూ వున్నాడు.

ఒకనాడు దానిని నాతి అహల్యగా మార్చిన మహనీయుడే తనను గంగ దాటించమన్న రామచంద్రుడని గ్రహించి, శ్రీరామచరణారవిందాలను కడిగి ఆ పాదోదకాన్ని శిరస్సున ధరించి జన్మచరితార్థము చేసుకున్నాడు" అంటూ గుహుని పూర్వజన్మ కథను వివరించాడు సూతమహర్షి.

### సీతాస్వయంవర చిత్రాలు

విశ్వామిత్ర మహర్షి మిథిలకు చేరి స్వచ్ఛమైన నీరుకలది, జనసమ్మర్దములేనిదీ అయిన ఒక మామిడి తోటలో విడిది చేశారు. వారిరాకను తెలుసుకున్న జనకమహారాజు పూజాద్రవ్యా లతో వెళ్ళి విశ్వామిత్ర మహర్షిని పూజించగా రాజు శ్రేష్ఠుడా! శీఘ్రమే నీ ఇంట కళ్యాణము జరుగుగాక! అని ఆశీర్వదించాడు.

రామలక్ష్మణులను చూచిన జనకమహారాజు ఈ యువకులు ఎవరు? రాజపుత్రులా? మునిపుత్రులా? లేక వేదమున చెప్పిన బ్రహ్మయే వీరిద్దరుగా అయ్యెనా? అని అడుగగా

**తచ్ఛ్రుత్వా మైథిలం నీత్వా రహః ప్రోవాచ కౌశికః**
**ఏషరామో మహారాజ! సాక్షాద్విష్ణ్వంశ సంభవః**
**రక్షార్థం విష్టపానాం తు జాతో దశరథాత్మజః ।**

జనకుని మాటలు విన్న విశ్వామిత్రుడు రహస్యముగా రాజా! ఈ రాముడు సాక్షాత్తు విష్ణ్వంశ సంభూతుడు. లోక రక్షణార్థము దశరథపుత్రుడు శ్రీరామచంద్రుడిగా అవతరించి నాడు. నీవు దేవకన్యకవంటి నీ కుమార్తె సీతను శ్రీరామునికిచ్చి వివాహము చేయుము. నీవు శివధనువును సీతాస్వయంవర ఫణముగా పెట్టినావని నాకు తెలియును. ఈ శ్రీరాముడే ఆ ధనువును ఎక్కు పెట్టగలడనుటలో నీకు ఎటువంటి సందేహమూ వలదు. నీ ఔరసపుత్రిక ఊర్మిళను లక్ష్మణునకు ఇచ్చి పెండ్లి చేయుము.

శివధనుర్భంగము వరకు నాచే చెప్పబడిన ఈ రహస్యమును వెల్లడించకుము. వీరిని సగౌరవంగా స్వయంవర మండపమునకు తీసుకొని పొమ్ము" అని చెప్పగా, జనక మహారాజు మహోత్సవంగా విశ్వామిత్ర మహర్షిని, నీలమేఘ శ్యాముడైన శ్రీరాముని వెండి మబ్బువెలుగువంటి లక్ష్మణుని తోడ్కొని వెళ్ళినాడు.

**ఏతస్మిన్నేవ సమయే దశాస్యో నారదాస్యతః ।**
**సీతా స్వయంవర శుభం శృత్వా పరిజనాన్వితః ॥**

అదే సమయమున రావణుడు నారదునివలన సీతా స్వయంవర వృత్తాంతమును విని, విరాధుని, శూర్పణఖను వెంట తీసుకొని మిథిలకు చేరి అదృశ్యరూపంతో చరించసాగాడు. అక్కడ ఒకవనంలో సీతా, సఖుల మాటలు వినిపించుచున్నవి గానీ సీత కనుపించుటలేదు. ఇదేమి? అని సందేహించి వారి మాటలు వినసాగినాడు రావణుడు.

**హస్తాభరణ యుగ్మంతు నూతనం దృశ్యతే సఖి!**
**కదా నిర్మాపితం చైత దితి పృష్టాఽహ సా సఖీమ్ ॥**

జానకీ! నీ కరకంకణాలు క్రొంగొత్తగా కనుపించుచున్నవే! ఈ గాజుల జతను ఎప్పుడు చేయించినవి? అని అడిగినది.

**ప్రేషితం పరితోషేణ మయేద మనసూయయా ।**
**హస్తాభరణయుగ్మం తు రక్షోఽగోచరతాకరమ్ ॥**

సఖీ! నాకు స్వయంవర శుభము జరుగబోవుచున్నదని ఈ గాజులజతను అనసూయాదేవి నాకు బహుమానముగా పంపినది. సఖీ! ఈ హస్తాభరణములు ధరించినవారు రాక్షసులకు కనుపించరట. అటువంటి శక్తి ఈ ఆభరణాలకు ఉన్నదట. ఆ మాటలు అదృశ్యుడై వున్న రావణుడు విన్నాడు.

**ద్విజస్త్రీ వేషమాశ్రిత్య సహజే! త్వం గతా దృతమ్ ।**
**రాజపుత్రీం మిళిత్వాఽశీర్వచనంతు విధాయ తాం ।**
**సంప్రార్థ్య హస్తాభరణయుగ్మ మానీయ దేహి మే ॥**

వెంటనే శూర్పణఖ వద్దకు పరుగెత్తి వెళ్ళినాడు. సోదరీ! నీవు వేదబ్రాహ్మణ ముత్తైదువువలే రూపము ధరించి ఇక్కడికి సమీపమునున్న రాజపుత్రికను కలుసుకొనుము. ఆ కన్యకను ఆశీర్వదించి ఆమె చేతినున్న క్రొత్తగాజుల జతను యాచించి నాకు తెచ్చిపెట్టుమని చెప్పగా, శూర్పణఖ రావణుడు చెప్పినట్లే సీతవద్దకు వెళ్ళినది.

సీతా! నీకు సార్వభౌముడైన భర్త లభించగలడు. అతడు నీవు కోరినవాడే కాగలడు. నేను పేదబ్రాహ్మణ ముత్తైదువను. దరిద్రముతో బాధపడుతున్నాను. కనుక నీ చేతిగాజుల జతను నాకు ఇచ్చిన ఎడల సంతసిస్తాను అని యాచించినది. ఆ విధంగా యాచిస్తున్న ఆ వేదవనిత మీద సీతకు జాలి కలిగినది. అప్పటివరకూ తన చేతియందు పట్టుకొని వున్న తనకు కలలో కనుపించిన శ్రీరాముని చిత్రపటాన్ని క్రిందపెట్టి తన చేతిగాజులు తీస్తూ వుండగా, ఆ మాయా బ్రాహ్మణ వనిత ఆ రామచిత్రపటమును నెమ్మదిగా తాను దాచుకొని, తన చేతిలోని రావణచిత్రపటమునక్కడ వుంచినది. సీతగాజులను ఆమెకు ఇచ్చినది.

ఆ గాజులను తీసుకొని శూర్పణఖ వెంటనే వనములోని ఒక నిర్జన ప్రదేశమున ఒకమూలకూర్చొని శ్రీరాముని చిత్రపటమును చూచి, రామసౌందర్యమునకు ముగ్ధురాలై తానే సీతవేషము ధరించి, శ్రీరాముని భర్తగా కోరి ధ్యానించసాగింది. అటు తరువాత సీత ఇంటికి బయలుదేరి మధ్యలో ఒకసారి రామచంద్రుని పటంవంక చూడగా అది రావణుని చిత్రపటము. ఛీ! ఛీ! ఇదెక్కడిది? నేను చూడకుండా నావద్దకు వచ్చినదని దానిని చెలికత్తెచేత దూరముగా విసరి వేయించి ఇంటికి వెళ్ళినది.

రావణుడు విరాధుని పిలచి నాసోదరి వెళ్ళి చాలా సేపయినది. యింకనూ రాలేదు. నీవు వెళ్ళి తీసుకొని రమ్మని పంపించాడు.

**ఇత్యుక్త స్స విరాధోఽపి విచరం స్తద్వనేతు తామ్ ।**
**ఏకత్ర భూమిజా వేషమాశ్రితాం తాం నిరీక్ష్యసః ॥**
**స్వయం రాఘవ వేషేణ తస్యా నికట మాయయౌ ।**

ఆ విధంగా రావణునిచేత పంపబడిన విరాధుడు వనంలో శూర్పణఖను వెదుకుచుండగా, ఒకచోట సీతారూపములో (వేషములో)వున్న శూర్పణఖ కనుపించినది. ఆమె నిజసీత అనుకొని, సీతకు రాముడనిన ఇష్టము కనుక తానే రామవేషమున సీతను సమీపించినాడు. *(సశేషం)*



# అహో! భారతమ్

*(గతసంచికతరువాయి...)*

## శకుంతల - దుష్యంతుల చరిత్ర

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

ఔను... కణ్వమహర్షి తపోధనులే. ఒకసారి ఆయన మరొక ఋషి పుంగవునితో నాకథ చెప్తూండగా నేను వినడం జరిగింది. ఆయన నాతో ఎప్పుడూ చెప్పలేదు.

విశ్వామిత్ర మహర్షి తపస్సు చేస్తూండగా ఆ తపశ్శక్తికి లోకాలన్నీ వణికిపోయాయి. ఇంద్రుడయితే భయపడిపోయాడు. అతని తపస్సుని భంగం చెయ్యాలని మేనకను పిలిచాడు. మేనక ముందు చాలా భయపడింది. కాని, ఇంద్రాజ్ఞతో తనశక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తానని మొండిధైర్యంతో బయలు దేరింది.

విశ్వామిత్రుని తపోభంగం చేయడంలో మన్మధుడామెకు సహకరించాడు. మేనకా విశ్వామిత్రులకు పుట్టిన పాప అందాల రాశి. ఆ చిన్నారిని మాలినీనదీతీరంలో విడిచి తనలోకానికి వెళ్ళిపోయింది మేనక. తపస్సు భంగమయినందుకు దుఃఖిస్తూ ఆ మహర్షి కూడా మళ్ళీ తపస్సు ప్రారంభించడానికి వేరే అడవికి వెళ్ళిపోయాడు. చంటిపాప ఏడుపువిని పక్షులన్నీ ఆ పాపచుట్టూ చేరి రెక్కలల్లార్చి రక్షించాయి. ఒకపక్షి పాపనోటిలో తేనె చుక్కలు పడేలా పిండింది. ఆ దృశ్యాన్ని అప్పుడే శిష్యులతో మాలినీనదికి స్నానానికి వెళుతున్న కణ్వమహర్షి చూసి ఆహా... శకుంతాలు. అంటే పక్షులు రక్షించాయి. కాబట్టి ఈ పాపకి శకుంతల అని పేరు పెట్టడం ఎంతో ఉచితం అనుకుంటూ ఋషి నాకు శకుంతల అనేపేరు పెట్టారట.

రాజా - కన్నవాడు, అన్నం పెట్టినవాడు, భయాన్ని పోగొట్టినవాడు ఈ ముగ్గురు స్త్రీలకు తండ్రిలాంటివారు. అదే పురుషులకయితే ఉపనయనం చేసినవారు, వేదవిద్య చెప్పినవారు ఈ ఇద్దరితో కలపి ఐదుగురిని తండ్రిలాంటి వారని చెపుతారు కదా! కణ్వమహర్షి నా భయాన్ని పోగొట్టి, నన్ను పెంచి పెద్ద చేశారు కనుక నాకు తండ్రి. ఈమాటలు ఆయనే చెప్తూంటే నేను స్వయంగా విన్నాను అంటూ తన జన్మవృత్తాంతాన్ని వివరించి చెప్పింది శకుంతల.

ఆ కథ వింటూనే ఆనందంగా ఊపిరి తీసుకున్నాడు దుష్యంతుడు. ఈమె మునిపుత్రిక అయితే నాకు ఇంత ప్రేమెందుకు కలుగుతుంది! రాజునైన నేను మునిపుత్రికనెలా వివాహమాడడం అని బెంగపడుతున్న రాజు మనస్సు శకుంతల క్షత్రియకాంత అని తెలియగానే నాట్యం చేసింది. ఒక్కసారి శకుంతలవైపు చూశాడు దుష్యంతుడు. ఆవిడ కూడా సిగ్గుతో కన్నులు వాల్చి ఓరగా చూసింది రాజును. అమ్మయ్య... అనుకుంటూ ఇంత అందమైన రూపం.. ఈ అడవిలో.. ఆ ముని పల్లెలో.. ఈ ఆశ్రమంలో.. ఇలా పళ్ళుతింటూ... నారచీరెలు ధరిస్తూ.. కాదు - వద్దు.. వీల్లేదు. ఈ దివ్యరూపం అపార భోగభాగ్యాల ననుభవింపవలసిన రూపం.. నిశ్చయంగా చూశాడు రాజు.

శకుంతలా! ఉత్తమ క్షత్రియ వంశంలో పుట్టినవారికి 8 రకాల వివాహాలున్నాయి.

అవి : 1) బ్రహ్మం 2) దైవం 3) ఆర్షం 4) ప్రాజాపత్యం 5) రాక్షసం 6) ఆసురం 7) గాంధర్వం 8) పైశాచం అనేవి ఎనిమిది.

ఇందులో గాంధర్వ రాక్షస వివాహాలు క్షత్రియులకు తగినవి. మనం గాంధర్వ వివాహ పద్ధతిలో వివాహం చేసుకుందాం అన్నాడు దుష్యంతుడు.

రాజు మాటలకి శకుంతల పరమానంద భరితురాలైంది. తనకూ ఇష్టమే... అయితే మాత్రం. నాన్నగారు వచ్చాకా.. ఆయన ఇష్టం తెలుసుకొని... అపుడుగాని ఈ పనిచేయకూడదు. ధర్మప్రవర్తన ఆమె జీవితంలో మేళవించిన తీరు ఆమె మాటలో స్పష్టంగా కనిపించింది.

ఆర్యపుత్రా! మాతండ్రి కణ్వమహర్షి దయాపరులు ధర్మస్వరూపులు. వారు వచ్చాక, వారి ఆశీస్సులతో మనం వివాహమాడడం పద్ధతికదా!

శకుంతలా! నిజమే కాని మనం గాంధర్వ వివాహ పద్ధతిలో ఒకటౌదాము. ఇది రహస్యంగా జరిగే పద్ధతి కదా! "ఓ... అయితే సరే, కాని రాజా! ఒక్కకోరిక, నీ వలన నాకు కలిగిన పుత్రుని నీ విశాల సామ్రాజ్యానికి యువరాజుగా పట్టాభిషేకం చెయ్యాలి. నీకిష్టమేనా... అలా అయితేనే మన వివాహానికి నేనంగీకరిస్తాను."

ఎంతటి గడుసరి శకుంతల! ఎంత లోకజ్ఞానం కలది! తనకు కలుగబోయే సంతానం గురించి ఎంత ముందు జాగ్రత్తలు తీసుకొంది. ఔను - అలా కాకపోతే తన సంతానం కూడా తనలాగే... ఎక్కడో ఒకచోట... ఊహూ... ఆ పరిస్థితి

రాకూడదు. మాటలలో చొరవతోపాటు ఒక బిగువు-ఒక రక్షణ-స్త్రీకి అవసరమైన ఆలోచన... స్వీయ భద్రత.

విన్నాడు రాజు.. శకుంతల నిర్ణయాన్ని మనసారా అభినందించాడు. ఇంత తెలివితేటలున్న కాంత భార్యగా లభించడం ఎంత భాగ్యం!

'శకుంతలా! నీ కోరిక విన్నాను. వరమిస్తున్నాను. అలాగే నీమాట నెరవేరుస్తాను' అంటూ గాంధర్వ విధిలో శకుంతలను చేపట్టాడు. ఇష్టభోగాలన్నీ అనుభవించాడు. రాజ్యానికి బయలుదేరుతూ.. 'శకుంతలా! నేను రాజ్యం చేరగానే నా మంత్రులని మీ తండ్రిగారి దగ్గరికి పంపించి నిన్ను తీసుకొని రమ్మని పంపిస్తాను" అన్నాడు.

'నిజమా...?!' బేలగా చూసింది శకుంతల.

'నన్ను నమ్ము. నిజం...!' అంటూ విడువలేక విడువలేక శకుంతలను విడిచి తన నగారానికి వెళ్ళిపోయాడు దుష్యంతుడు.

తాత్కాలికంగా ఆనందించినా... నాన్న రాకుండా నేను చేసిన ఈ పనికి తండ్రి అంగీకరిస్తాడో లేదో! అని భయపడింది శకుంతల. అడవినుండి తిరిగి వచ్చాడు కణ్వమహర్షి.

కుమార్తెను చూస్తూనే దివ్యజ్ఞానదృష్టితో జరిగినదంతా తెలుసుకున్నాడు. అమ్మా! అంటూ ఆమెను దగ్గరకు తీసుకొని శిరసుపై ముద్దుపెట్టుకున్నాడు. 'తల్లీ! నీవు గర్భవతివి. నీ గర్భంలో ఉన్నవాడు ఈ భూమండలాన్ని పరిపాలించగలిగిన చక్రవర్తి. నీ ధర్మమైన ప్రవర్తన నాకెంతో ఆనందాన్నిచ్చింది. వరం కోరుకో తల్లీ! ఇస్తాను" అన్నాడు.

"తండ్రీ, నామనస్సెప్పుడూ ధర్మంలోనే లగ్నమై యుండాలి. నాకు కలిగే కొడుకు దీర్ఘాయువు, ఆరోగ్యవంతుడు, ఐశ్వర్యవంతుడు అయిన వంశకర్తగా పేరు తెచ్చుకోవాలి" అని కోరింది. వరమిచ్చాడు తండ్రి.

సరే, కొంతకాలానికి శకుంతలకు కొడుకుపుట్టాడు. మహర్షి ఆశీస్సులతో మహావీరుడు ధీరుడు అయ్యాడు. అన్ని జంతువులని చక్కగా అణచివేస్తూ ఆశ్చర్యం కలిగించాడు. అది చూచి ఋషులు ఆ బాలునికి సర్వదమనుడు అని పేరు పెట్టారు. బాలుడు సర్వదమనుడే భరతవంశంలో పుట్టిన బిడ్డ కాబట్టి భరతుడు.

ఆ తేజస్సు, ఆ రూపం, ఆ పరాక్రమం అంతా దుష్యంతుని తలపించేవే. మురిసిపోతున్న కణ్వమహర్షి బాబుని తల్లితో తండ్రి దగ్గరకి పంపాలనుకున్నాడు. మరి అతని వద్ద నుండి ఎవరూ రాలేదే! అయితేనేం! కొడుకు తండ్రి దగ్గరికి వెళ్ళడానికి అడ్డేమిటి? అందుకే శకుంతలని పిలిచి అమ్మాయీ! ఆడపిల్ల ఎక్కువకాలం పుట్టింట్లో ఉండడం ఉచితం కాదమ్మా! భర్త సన్నిధి భార్యకి పెన్నిధి. కాబట్టి అబ్బాయితో కలిసి అత్తింటికి బయలుదేరమ్మా! అన్నాడు. ఆశ్రమాన్ని తండ్రిని విడిచి పెట్టి వెళ్ళాలనే ఆలోచనే శకుంతలకి ఎంతో బాధని కలిగించింది. అయినా భర్త దగ్గరికి చేరుతున్నాననే తృప్తి... ఆనందం... వెంటనే బయలుదేరేలా చేసింది. శకుంతల వెంట శిష్యుల్ని పంపాడు మహర్షి. అంతా కలసి రాజధాని చేరారు.

దుష్యంత మహారాజు మంత్రిసామంతులతో కొలువుతీరి ఉన్నాడు. బాబు వేలు పట్టుకొని, శిష్యుల మధ్య నడుస్తూ ఆ నిండు సభలో అడుగుపెట్టింది శకుంతల. తనను చూస్తూనే రాజు ఆదరంగా ఆహ్వానిస్తాడని, పుత్రుని గుండెలకు హత్తుకుంటాడని, లోకానికి తనభార్యగా తనను పరిచయం చేస్తాడని మధుర ఊహలతో కదలి వచ్చిన శకుంతల రాజు ముఖం చూచి నివ్వెరపోయింది.

'జీవితంలో మొదటిసారి తనను చూచినట్లు చూశాడు దుష్యంతుడు. 'ఈయన నన్ను గుర్తించలేదా! లేక అలా నటిస్తున్నాడా! ఒకవేళ మరచిపోయాడా? అనేక రాచకార్యాలలో మునిగి తేలడం వలన మరిచిపోవడం ఆశ్చర్యమేమీ కాదు. అయినా ప్రభువులకి మరుపు వింతేమీ కాదుకదా! అలా తీవ్రంగా చూస్తున్నాడేమిటి? ఆ కఠినమైన చూపులు ఎదుర్కొనడమే కష్టంగా ఉందే! రాజులు నిత్యనూతన ప్రియులంటారు. ఎప్పటికప్పుడే కొత్తదనం కోరుకుంటారట. ఏమో... నిజంగా మరిచిపోతే గుర్తు చేయవచ్చు. తెలియకపోతే తెలియచెప్పవచ్చు. నటిస్తే... ఎలా చెప్పగలం? ఇంతదూరం వచ్చాక ఇప్పుడు భయపడితే ఏం లాభం? ఒక్కసారి జరిగిన కథని జ్ఞాపకం చేస్తాను. ఈ చిన్నతండ్రిని చూపిస్తాను' అని మనస్సుని సమాధాన పరచుకొని ఇలా మాట్లాడసాగింది.

'రాజా! వేటవంకతో నువ్వు కణ్వమహర్షి ఆశ్రమానికి వచ్చావు కదా! అప్పుడు నాకిచ్చిన వరం ఒక్కసారి గుర్తుకు తెచ్చుకో. పౌరవవంశ అలంకారుడైన ఈ బాబు నీ పుత్రుడు. బాలసూర్యునిలా ఎలా మెరిసిపోతున్నాడో చూడు! యువరాజపట్టాభిషేకానికి తగిన సుగుణాలరాశి అంటూ ముద్దు పెట్టుకొని రాజువైపు చూసింది.

రాజు - దుష్యంతుడు. అమాయక చక్రవర్తి ముఖం పెట్టాడు. ఏదో కథ విన్నట్లుగా విన్నాడు. చివరి మాటకి ఉలిక్కిపడినట్లు నటించి... ఏమిటేమిటీ... ఇంకా ఏదో... చెప్తున్నావు అనుకొంటున్నాను. అసలు నువ్వెవరివి? ఎక్కడి నుంచి వచ్చావు? ఈ కథలేమిటి? వినడానికైనా బాగుండాలా!

నీ మాటలు విచిత్రంగా ఉన్నాయే చాల్చాలు.. వెళ్ళు.. వెళ్ళు.. ఎక్కడి నుంచి వచ్చావో అక్కడికే వెళ్ళు.

పిడుగుపడ్డట్లు... గుండె ఆగినట్లు.. ఏమిటీ మాటలు? ఏమంటున్నాడీ రాజు? ఎంత తేలికగా అబద్ధాలు చెప్పగలుగుతున్నాడు? కళ్ళు జలధారలు వర్షిస్తున్నాయి. భగవంతుడా... నన్ను క్షమించు. ఒళ్ళుపైన తెలియక తొందరపాటుతో తీసుకున్న నిర్ణయం ఇలా కాకపోతే మరెలా ఉంటుంది? ఆకర్షణ - ప్రేమ... ఈ రెండింటి మధ్య భేదం తెలుసుకోలేక పోయాను. పెంచి పెద్దచేసిన తండ్రి వచ్చేవారకైనా ఆగలేక పోయానా? జీవితంలో ముఖ్యాంశమైన వివాహ విషయంలో స్వతంత్రించి తీసుకున్న నిర్ణయాలు ఎలాంటి ఫలితాలనిచ్చినా శిరసా వహించవలసినదే కదా!

ఆనాడు అమ్మ అలా వదిలిపెట్టింది. తండ్రి మాట సరేసరి. ఇప్పుడు భర్త భూమిని పాలించేరాజు... దుష్యంతుడు కూడా ఇలా మాట్లాడితే... నా గతి ఏమిటి? శకుంతల కన్నులు వర్షించాయి. కాని, అంతలో ధైర్యాన్ని తెచ్చుకొంది. ఒక్కసారి చిట్టితండ్రిని ముద్దుపెట్టుకొంది. ధైర్యంగా రెండడుగులు ముందుకు వేసింది. అంతరాంతరాలలో దాగిన భావపరంపర కోపాన్ని కల్గించింది. ఎలాగో అణచుకొంది. రాజు ముందు నిలిచి ఇలా అంది.... *(సశేషం)*



## మెదడుకి మేత! సమాధానములు

1. "కామాది దోషహరం ఆత్మపదాశ్రితానామ్"
2. యానైమలైలో ఉన్న గుహలో
3. మధుర వస్తాదు
4. బ్రహ్మసత్యం, జీవిప్రకృతులు మిథ్య అనే వివేకం.
5. బ్రహ్మతత్త్వ ప్రతిపాదకమైన నిరతిశయానందాన్ని అందిస్తుంది కనుక
6. 'పిబత భాగవతరసమ్...'లో నారదునికి భగవద్గుణ కీర్తన శ్రవణంవల్ల భక్తి అతిశయితమైన రజస్తమో నిబర్హకం అయింది.
7. పాసిపోవుట
8. 4,26,888
9. నిధి
10. ఈ సహస్ర తులసీ శ్రీనివాసమ్ జరపడానికి కారణం
 1) పురాతన కట్టడాలను రక్షించుకోవాలని 2) కోల్పోయిన వాటిని పునఃనిర్మాణం జరుపుకోవాలి 3) చారిత్రక కట్టడాలను పోగొట్టుకుని భావితరాలలో చరిత్ర హీనులు కారాదని 4) మాధవుడు మెచ్చే మానవులం కావాలని
11. గోష్పదం వంటిది. (ఆవు గిట్టలవల్ల ఏర్పడిన గొయ్యి)
12. విశ్వామిత్రుడు
13. ధనుర్యాగం
14. జ్యోతిష్కోడి దగ్గర
15. 'ఉపనిషద్య గృహ్యతే ఇతి ఉపనిషత్' జ్ఞానుల సమీపంలో ఉండివారి ఉపదేశం ద్వారా గ్రహించతగినది.
16. 24వ చతుర్యుగంలోనిది
17. దివ్యసాకేతం
18. శ్రీరామచంద్రాచార్యస్వామివారు
19. శ్రీరంగనాథుడు
20. 'గుహ్యతమం'
21. శ్రీ వేంకటేశ్వరస్వామి, ఆముక్తమాల్యద.
23. (1) అద్వైత సంప్రదాయ ప్రవర్తకులు శంకర భగవత్పాదులు. 2) విశిష్టాద్వైత సంప్రదాయ ప్రవర్తకులు భగవద్రామానుజాచార్యులు 3) ద్వైత సంప్రదాయ ప్రవర్తకులు మధ్వాచార్యులు.
24. భగవంతుణ్ణే శరణువేడినవారు
25. జ్ఞాననిధి

## భక్తినివేదన ప్రోత్సాహకులు

| | | | |
|---|---|---|---|
| 1. | పి. గోపాలకృష్ణమూర్తిగారు | హైదరాబాద్ | 10,116/- |
| 2. | కె. అలివేలుమంగగారు | హైదరాబాద్ | 10,116/- |
| 3. | కె. శ్రీనివాసన్ గారు | హైదరాబాద్ | 5,500/- |
| 4. | కె. లక్ష్మీనారాయణగారు | గుట్టవిల్లి | 5,116/- |
| 5. | వై. కమలా జగదీశ్వరిగారు | బిక్కవోలు | 5,111/- |
| 6. | జి. భాస్కరరావు గారు | పాలచెర్ల | 5,111/- |
| 7. | కె. ప్రకాశ్‌గారు | హైదరాబాద్ | 5,001/- |
| 8. | ఎ. జయప్రదగారు | గుడివాడ | 5,001/- |
| 9. | కె. పద్మగారు | హన్మకొండ | 5,000/- |
| 10. | వి. వాసుదేవగౌడ్‌గారు | సికింద్రాబాద్ | 5,000/- |
| 11. | ఆర్. వెంకటేశ్వరరావుగారు | హైదరాబాద్ | 5,000/- |
| 12. | ఎస్. శ్రీనివాసులుగారు | తిరుపతి | 5,000/- |

మీరు భక్తినివేదన అభివృద్ధికై ప్రోత్సాహక కైంకర్యాన్ని సమర్పించినందుకు శ్రీస్వామివారి మంగళాశాసనములు అనుగ్రహించారు.




# తిరుప్పల్లాండు

వైశారదీ

*(గతసంచికతరువాయి...)*

అల్వ్ఴక్కొన్ఱు మిల్లా, అణికోట్టియరుకోన్, అబిమాన తుంగన్
శెల్వనైప్పోల, తిరుమాలే నాను మునక్కు ప్పఴ్ఱవడియేన్ ।
నల్వకైయాల్ నమో నారాయణావెన్ఱు నామం పల పరవి
పల్వకైయాలుం పవిత్తిరనే, ఉన్నైప్పల్లాండు కూఱువనే ॥ 11

| | | |
|---|---|---|
| పల్వకైయాలుమ్ | = | అన్ని విధములుగాను |
| పవిత్తిరనే! | = | పరిశుద్ధమైన స్వభావముగలవాడా! |
| తిరుమాలే | = | శ్రీ శ్రియఃపతీ! |
| అల్+వ్ఴక్కు | = | దుష్టస్వభావములు |
| ఒన్ఱుమ్+ఇల్లా | = | ఒక్కటీ లేనటువంటి |
| అణి కోట్టియర్ | = | అందమైన తిరుక్కోటియూరు నందుగల భాగవతులకు |
| కోన్ | = | అధిపతియైనవాడును |
| అభిమాన తుంగన్ | = | గొప్ప వైష్ణవాభిమానముగలవాడును అగు |
| శెల్వనైప్పోల నానుమ్ | = | శెల్వనంబివలె నేను కూడా |
| ఉనక్కు పఴ్ఱవడియేన్ | = | నీకు ప్రాచీన దాసుడనే |
| నల్ వగైయాల్ | = | అర్థజ్ఞానపూర్వకముగా మంచిరీతిలో |
| నమో నారాయణా వెన్ఱు | = | అష్టాక్షరీమంత్రములోని "నమో నారాయణా"అంటూ |
| పలనామమ్ | = | అనేక నామములను |
| పరవి | = | ప్రీతితో జపించి |
| ఉన్నై పల్లాండు | = | నీకు మంగళాశాసనము |
| కూఱువనే | = | పలికెదను |

**తా:** విష్ణుచిత్తులవారి గురువు శెల్వనంబిగారు (శెల్వం=సంపద నంబి=నిండుగాకలవాడు) "భగవాన్-పవిత్రం. తత్పాదం-పవిత్రం. తత్పాదోదకం-పవిత్రం" అని మన ఆగమాలు చెప్పినట్లు భగవంతుడు పవిత్రుడు. ఆయన పాదం పవిత్రం. ఆయన శ్రీపాదతీర్థం పవిత్రం. ఇలా అన్ని విధములుగా పవిత్రుడవైన ఓ లక్ష్మీనాథా! ప్రపంచానికే అలంకారమా అన్నట్లు ఉన్న తిరుక్కోష్టియూరు శెల్వనంబినివాసము ఉంటున్న ఊరు. వీరు ఏ రకమైన చెడు స్వభావములు లేనటువంటివారు. తిరుక్కోష్టియూరునందు ఉన్న భాగవతులందరికి అధిపతి అయినవారు. మార్గదర్శకమైన వారున్ను. వీరు గొప్ప వైష్ణవవంశములో పుట్టినవారు ఆరకంగ వైష్ణవ అభిమానం గల శెల్వనంబివారివలే నేనుకూడా నీకు ప్రాచీనమైన దాసుణ్ణే. మంచిరీతిలో అంటే అర్థ జ్ఞాన పూర్వకంగా అష్టాక్షరీ మంత్రమైన **"నమో నారాయణాయ"** మొదలగు అనేక భగవన్నామాలను ప్రీతితో పలికి పవిత్రులమై నీకు మంగళాశాసనమును పలుకుదును.

పల్లాణ్డెన్ఱు పవిత్తిరనై, పరమేట్టియై, శార్ఙ మెన్నుమ్
విల్లాణ్డాన్ తన్నై, విల్లిపుత్తూర్ విట్టుశిత్తన్ విరుంబియశొల్ ।
నల్లాండెన్ఱు నవిన్ఱు ఱైప్పార్, నమో నారాయణాయ వెన్ఱు
పల్లాండుం పరమాత్మనై, శూழ్న్దిరు న్దేత్తువర్ పల్లాణ్డే ॥ 12

| | |
|---|---|
| **పవిత్తిరనై** | = పరమపావనుడును |
| **పరమేట్టియై** | = పరమపదమందు నివసించువాడును |
| **శార్ఙమ్ ఎన్ఱుమ్ విల్** | = శార్ఙము అనెడు ధనస్సును |
| **ఆణ్డాన్ తన్నై** | = ఏలుకొనువానిని |
| **విల్లిపుత్తూర్** | = శ్రీవిల్లిపుత్తూరునందుండు |
| **విట్టు శిత్తన్** | = విష్ణుచిత్తులు |
| **పల్లాణ్డు ఎన్ఱు** | = నిరంతరము మంగళము అగుగాక అని |
| **విరుమ్బియశొల్** | = ప్రేమతో రచించిన ఈ పాశురములను |
| **నల్ ఆణ్డు ఎన్ఱు** | = మంచిరక్షణ నిచ్చును అని |
| **నవిన్ఱు ఉరైప్పార్** | = నేర్చుకుని అనుసంధించువారు |
| **నమో నారాయణాయ వెన్ఱు** | = అష్టాక్షరి మహామంత్రమును ఉచ్చరించుచూ |
| **పల్ ఆణ్డుమ్** | = అనేక వత్సరములు |
| **పరమాత్మనై** | = భగవంతుని |
| **శూழ్న్దు ఇరున్దు** | = చేరియుండి |
| **పల్లాండు** | = మంగళాశాసనములు |
| **ఏత్తువర్** | = చేయుచునే ఉందురు. |

**తా: 'పవిత్రాణాం పవిత్రం యో'** పవిత్రమైనవాటికి పవిత్రతను కలిగించేవాడు భగవంతుడు. భగవంతునికి 'పరమేష్ఠీ' అని మరోపేరు. భగవంతుడు ఎక్కడ ఉంటే (అదే) దానినే పరమపదం (అవుతుంది) చేస్తాడు. విరజానది దాటిన తరువాత ఉండేది వైకుంఠం. దేవుడు అక్కడ కూడా ఉంటాడు. కావున దానిని పరమపదం అని కూడా అంటారు. సుమిత్రాదేవి లక్ష్మణునితో

**"అయోధ్యాం అటవీం విద్ధి మాం విద్ధి జనకాత్మజాం ।**
**రామం దశరథం విద్ధి గచ్ఛత తాత! యథా సుఖమ్॥"** అని అంటుంది. అంటే రాముడు ఎక్కడ ఉంటే అదే అయోధ్య అవుతుంది. అయోధ్యలో రాముడు లేకపోతే అది అడవే అవుతుంది అని అర్థం.

'మనకు వచ్చే ఆపదలను తొలగించడానికి శార్ఙం అనే ధనస్సును ఎల్లప్పుడూ ధరించి ఉంటాడు మన స్వామి' అని శ్రీ విల్లిపుత్తూరునందుండు విష్ణుచిత్తులవారు నిరంతరము మంగళము అగుగాక! అని ప్రేమతో (పాడిన) రచించిన ఈ పాశురములను మనకు మంచి రక్షణనిచ్చునని చేర్చుకుని అనుసంధించు భాగవతోత్తములు, అష్టాక్షరీ మహామంత్రమును ఉచ్చరించుచూ అనేక సంవత్సరములు భగవంతుని (ధ్యానంతో) చేరియుండి మంగళాశాసనములు చేయుచునే ఉందురు.

*పెరియాళ్వార్ తిరువడిగళే శరణం*

# ముముక్షు రహస్యం

*(గతసంచికతరువాయి...)*

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

**"అనుయాత్రై సెంజేనో అణిలంగళైప్పోల!"**

"బామ్మా! చూశావా కృష్ణుడి అల్లరి..!" అంది వేద.

"ఏం చేశాడు బంగారు తండ్రి?" బామ్మ

"వాడన్న దాంట్లో తప్పేం ఉందే వేదా! వాడు చిట్టి చేతులతో రాళ్ళు తెచ్చిపెట్టి వడియాలు పెట్టిన బట్టలు గాలికి ఎగిరిపోకుండాచేశాడా లేదా?" అమ్మ.

"అవునులే! నీకు వాడే గొప్ప. బియ్యం కొలవటం, పిండి పట్టిపెట్టడం దగ్గర్నించి వడియాలు పెట్టడం దాకా ప్రతీ పనిలో సాయం చేశానా! అయినా నాపనులేవీ లెక్కలో లేనే లేవు. వాడు చిన్నపని చేశాడో లేదో.. పెద్ద గొప్పగా చెప్తున్నావు..." మూతి ముడిచింది వేద.

"ఎందుకే వేదా అంతకోపం? ఎవరిస్థాయికి తగ్గట్టు వాళ్ళు చేస్తారు. పనిలో చిన్న, పెద్ద అన్న తేడా లేదు. 'ఉడత సాయం' అన్నమాట వినలేదూ...!"

"వినటమైతే విన్నాను కాని అర్థం తెలియదు బామ్మా!"

"ఇప్పుడు బామ్మ కథ చెపుతుందోచ్..." కృష్ణుడు సంబరంగా బామ్మ ఒళ్ళో వొదిగి పోయాడు.

మా నాయనే...! మా తండ్రే నువ్వు వినాలి కాని ఎన్ని కథలైనా చెపుతానురా కన్నా..."

"మరి నాక్కాదా...?"

"నీకు కూడా. శ్రీరామాయణంలో రావణాసురుడు సీతమ్మవారిని ఎత్తుకెళ్ళి లంకానగరంలో ఉంచాడా! అప్పుడు రామలక్ష్మణులు సీతను వెతుకుతూ సుగ్రీవుడితో స్నేహం చేయటం, సుగ్రీవాజ్ఞ మేరకు హనుమ సీతమ్మ జాడ తెలుసుకొని వచ్చి చెప్పటం, వానర సైన్యంతో చేరి రామలక్ష్మణులు సముద్రతీరం చేరటం తెలుసుకదా!"

"ఆ... ఆ... తరువాత ఏమైందో చెప్పు"

"సముద్రం మధ్యలో ఉన్న లంకకు ఇంత సైన్యం చేరాలంటే సేతువు కట్టాలి. విశ్వకర్మ కొడుకైన నలుడు కూడా ఆ సైన్యంలో ఉన్నాడు. సముద్రుడు నలుడి గురించి రాముడితో చెప్పాడు. నలుడి నిర్మాణ నైపుణ్యం తెలిసి రాముడు అతడిని పిలిచి సేతువు కట్టమని ఆజ్ఞాపించాడు. రాముడి ఆజ్ఞ శిరసా వహించి నలుడు వానరసైన్యం సహాయంతో సముద్రం మీద సేతువు కట్టే పని ప్రారంభించాడు.

పెద్ద పెద్ద బండరాళ్ళు తెచ్చి సముద్రంలో వేస్తున్నారు. వాటి మధ్య రకరకాల మహావృక్షాలు కూకటి వేళ్ళతో పెకలించి తెచ్చివేస్తున్నారు. సముద్రతీరం ఆ పక్కనే ఉన్న అడవి అంతా ఈ హడావిడికి దద్దరిల్లిపోతోంది.

అడవిలో కోతులతోపాటు ఉడుతలు కూడా చెట్లమీద నివసిస్తున్నాయి. రామకార్యంలో కోతులు పాల్గొనటం చూసి ఉడుతల గుంపు తాము కూడా ఆ సేతువు నిర్మాణంలో ఎంతోకొంత సహకరించాలనుకున్నాయి. కానీ, అవి చిన్న జంతువులు కదా!"

"అమ్మో ఆ బండల కింద పడిపోవూ?"

"అందుకే అవి చాలా ఆలోచించి బండలా ఎత్తలేము. చెట్టూ పెకలించలేము. కనీసం బండల మధ్య చెట్లమధ్య మట్టి, ఇసుక నింపుదామనుకున్నాయి. అలాగే అవన్నీ సముద్రంలో మునకలు వేయటంవలన సముద్రమట్టం తగ్గిద్దామను కున్నాయి."

"అదెలా సాధ్యం బామ్మా!"

"అసాధ్యం అన్నవాటిని సుసాధ్యం చేయటం మేగా గొప్పదనం. తొండరడిప్పొడి ఆళ్వార్ ఈ సంఘటనను ఎంత చక్కగా అనుభవించారో... కళ్ళతో చూసినట్టు పాడారు తిరుమాలలో

**"కురఙ్గుగళ్ మలైయనూక్క కుళిత్తు తాం పురణ్ణిట్టు ఓడి।**
**తరఙ్గనీర్ అడై కలుత్త శలమిలా అణిలుం పోలే।**

కోతులు కొండలలాంటి రాళ్ళను, సముద్రంలో వేస్తే ఉడుతలు సముద్రంలో మునిగి లేచి "అబ్బ నీటమట్టం తగ్గించామనుకున్నాయట. అంతటితో ఆగక తడి శరీరంతో ఇసుకలో పొర్లి కోతులు వేసిన రాళ్ళ సందుల్లో ఆ ఇసుకను దులుపుకొని 'ఈ ఇసుకవల్లే కదా ఆ రాళ్ళు అతుకుతున్నాయని" మురిసిపోయాయట.

నిజానికి సేతుబంధనం ఎంత పెద్ద విషయం. ఎంత కష్టపడి ఆ వానరసైన్యం ఆ పని చేస్తుంటే ఉడుతలు

చేసెందెంత? అయినా రామకార్యంలో పాల్గొనాలన్న ఉత్సాహం, శక్తి అవి సేతువును కట్టడంలో పాల్గొనెలా చేశాయి."

"మరి శ్రీరాముడు అవి చేసిన సహాయాన్ని గుర్తించాడా?"

"మాబాగా గుర్తించాడు కాబట్టే ప్రేమతో వాటిని తన చేతుల్లోకి తీసుకొని మూడువేళ్ళతో వీపు నిమిరాడు. ఆ గుర్తులు ఆ జాతిమొత్తానికీ ఇప్పటికీ ఉన్నాయి."

"అవును... ఉడుత వీపుమీద చారికలుంటాయి!"

అందుకే తిరుక్కోళూరమ్మాళ్ "ఆ ఉడత చేసినంత సాయమన్నా చేశానా" అన్న అర్థంలో "అనుయాత్రై సెంజెనో అణిలంగళైప్పోల" అన్నారు.

"అంటే అర్థమేమిటో వివరంగా చెప్పు బామ్మా"

"యాత్ర అంటే తెలుసుగా. ఒక చోటికి పోవటానికి కావాల్సిన సన్నాహాలన్నీ చేసుకొని, సరంజామా కూర్చుకొని అనుకున్న సమయానికి బయలేదేరటం. అలా వాళ్ళు వెళ్ళటం చూసి ముందస్తు సన్నాహాలేవి లేకుండా అప్పటికప్పుడే బయలుదేరి వాళ్ళతో బయలుదేరుతారు కొందరు. అది అనుయాత్ర.

ఇక్కడ వానరాలు సేతువు కట్టడానికి తగిన ఏర్పాట్లు చేసుకొని పని ప్రారంభిస్తే ఉడుతలు ఏ ప్రయత్నమూ లేకుండా అప్పటికప్పుడు పనిలో దిగి తమ చేతనైన పని చేశాయి. అలాగైనా నేనేమి చేయలేదే అని అమ్మాళ్ వాపోతున్నారు.



# నేర్చుకుందామా! - 6

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

మానవ జీవితం భగవత్ ప్రసాదం. ఎన్ని జన్మలలో ఎన్ని పుణ్యాలు చేస్తే ఇలా మనుషులుగా పుట్టామో! భగవంతుడు చక్కని మాట్లాడే శక్తిని మనకు ప్రసాదించాడు. మనిషికి ఏది నిజమైన ఆభరణం అంటే చక్కగా మాట్లాడడమే నిజమైన అలంకారం అంటారు నీతిశతకకారులు.

అందంగా, మధురంగా, మళ్ళీ మళ్ళీ వినాలి అనిపించేలా మాట్లాడగలగడం ఎంత భాగ్యం..! అది మంచి నగ. అలంకరాలేవి నిజంగా అందాలు కావు. మాటే, సంస్కార యుతమైన వాక్కు మాత్రమే నిజమైన ఆభరణం అంటున్నారు కవి.

**కేయూరాణి నభూషయంతి పురుషం, హార న చంద్రోజ్జ్వలాః**
**న స్నానం న విలేపనం నకుసుమం నాలంకృతా మూర్ధజాః।**
**వాణ్యేకా సమలంకరోతి పురుషం యా సంస్కృతాధార్యతే**
**క్షీయంతే ఖలు భూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్॥**

మనం చేతులకి అందంకోసం గాజులు, కంకణాలు వేసుకుంటాం. మెడకి అందం కోసం తెల్లగా మెరిసిపోయే హారాలు ధరించి మురిసిపోతాం. శుభ్రమంటూ ఒకటే స్నానాలు చేసి శరీరానికి శోభ కలిగించామనుకొంటూ.. తలనిండా పూలు పెట్టుకొని ఆహా! ఏమందం! అనుకుంటాం. జుట్టు రకరకాలుగా అలంకరించుకుంటాం. కాని ఇవేనా నిజమైన అందచందాలు– అలంకారాలూ మనిషికి నిజమైన ఆభరణం ఏమిటి? వాణీఏకా – సంస్కృతా వాణీ ఏకా చక్కగా సంస్కరింపబడిన పలుకు మాత్రమే మనిషికి నిజమైన అలంకారం. నగలకి కొనుక్కొంటే దొరికే అవకాశం ఉంది. మంచి పలుకు కొనుక్కొంటే వస్తుందా?

నగలు అరిగిపోయి, కాంతి కరిగిపోయి నశించే ప్రమాదం ఉంది. మధురంగా పలికేమాట శాశ్వతంగా నిలిచిపోతుంది. ఒక్కమాట, ఎంత బలమైనదంటే ప్రాణాలు పోస్తుంది. అందుకే ఈ బాహ్య అలంకారాలకోసం వెంపర్లాడకండి. తియ్యగా పలుకరించండి. ఎదుటివారికి ఆనందం పంచండి. ధైర్యాన్ని అందివ్వండి. జీవితాలని నిలబెట్టండి. మీ వాక్కు ఇంత మంచిపని చేస్తూంటే, అంతకంటే అలంకారం వేరే ఏం ఉంటుంది? ఈ నగ "వాగ్భూషణం భూషణమ్" మిమ్మల్ని ఎలా మెరిసిపోయేలా చేస్తుందో చూడండి!

చిత్రకథ - 7



# రామానుజ చిత్రకథ












ఏ ఊరు వెళ్ళాలి?
కాంచీపురం


మాదీ కాంచీపురమే! భయపడకు! మేమూ అటే పోతున్నాం. మాతో వస్తావా?


మీరెవరో? నాకోసమే దేవుడిలా వచ్చారు. ఈ అడవిలో తిరుగుతూ మూడురోజులైంది. ఇంకా ఎన్ని రోజులు నడవాలో ఏమో?


మేమున్నాం కదా! త్వరగానే పోదాం!


ఈ రాత్రికి ఇక్కడే పడుకుని ఉదయాన్నే బయలుదేరుదాం!


ఏమండీ! దాహం వేస్తోంది


ఇంత అర్ధరాత్రా! పడుకో! తెల్లవారగానే తెచ్చి ఇస్తా!


ఇప్పుడు దాహం వేస్తోందంటే, రేపు ఉదయం నీళ్ళు త్రాగుదువుగానీ అంటాడేమిటి? ఆ తల్లికి ఎంత దాహంగా ఉందో ఏమిటో?
ఇక్కడ దగ్గరలో బావి ఉందా?
ఆc..! దగ్గరలోనే ఒక శాల ఉంది. అందులో తియ్యని నీళ్ళ బావి ఉంది.


పోనీ! దగ్గరలోనే బావి ఉందంటున్నారు కదా! వెళ్ళి తీసుకువస్తా! ఆ శాల, బావి ఎటున్నాయి?
అటు
ఇక్కడ బావి ఉన్నట్లు అతనికెలా తెలుసో? నీళ్ళు కూడా పైకే ఉన్నాయి. కానీ తీసుకువెళ్ళేది ఎలా?


ఒక పనిచేస్తా! ఆకులను దొన్నెలుగా చేసి, తీసుకువెళతా! పాపం! ఆ తల్లి దాహంతో ఎంత బాధపడుతోందో?
అరే! వీళ్ళేరి? ఏమైపోయారు? దొరా! ఓ దొరా! దాహార్తియైన ఆ తల్లిని ఎటుతీసుకునిపోయారు? ఈ చీకట్లో వాళ్ళేమైపోతారో, నేను కాస్త ఆలస్యం చేసేనేష వీళ్ళనెలా వెతికేది?

ఇంతలో తెల్లవారింది.

ఇదేదో చూసిన గుడిలా ఉందే! ఓహ్! ఇది మన కాంచీపురమే! వరదరాజస్వామి గోపురం!

ఎక్కడ వింధ్య పర్వతాలు? ఎక్కడ కాంచీపురం? నెలలు సాగినా తరగని దారి, ఒక్కరోజులో ఎలా రాగలిగాను? బహుశా వీళ్ళు ఈ కీకారణ్యంలో నన్ను కాపాడడానికి వచ్చిన కంచి వరదుడు, పెరుందేవి తాయార్లే! నన్నిక్కడకు చేర్చి వారు అదృశ్యమైపోయారు

తండ్రీ! వరదా! నీ దయకు కృతజ్ఞుడను. స్వామీ! పిలిస్తే పలుకుతావంటారు. నన్ను రక్షించడానికి కోసం అమ్మతో కలసి బోయవేషంతో వచ్చావా స్వామీ!

మాఅమ్మ, పెరుందేవి దాహమడిగింది. ఈ శాలబావి తీర్థం తెమ్మని నీవు ఆజ్ఞాపించావు! అంటే ప్రతిదినము ఆ శాలబావి తీర్థాన్ని తెచ్చి అర్పించడమే నా కర్తవ్యం. అదే నీ నిర్ణయం. అలానే చేస్తాను స్వామీ!

V. Sita Ram

ఇంకా ఉంది..

కిష్కింధా కాండలో



# శ్రీరామాయణంలో పక్షులు



## సంపాతి

ఇంతవరకు మనము శ్రీరామాయణాన్ని మనకందించిన వాల్మీకి కోకిలతో ప్రారంభించి క్రమంగా క్రౌంచ పక్షులు, శుకసారికలు, జటాయువులను పలుకరిస్తూ ప్రయాణిస్తున్నాం. క్రమంగా అరణ్యం దాటి కిష్కింధలో ప్రవేశిద్దాం. ఇక్కడ మనకి కనిపించే ప్రభావశాలి అయిన పక్షి **సంపాతి**. దాన్ని కాస్త పరిచయం చేసుకుందాము.

సీతాన్వేషణకు సుగ్రీవుడు తన పరివారాన్నంతటిని నాలుగు దిక్కులకు పంపాడు. దక్షిణదిశగా సాగిన వానరబృందం యువరాజైన అంగదుడి నేతృత్వంలో ఏర్పడినది. ఈ బృందంలోని ప్రముఖులు నీలుడు, హనుమ, సుహోత్రుడు, శరారి, శర గుల్ముడు, సుషేణుడు, జాంబవంతుడు మొదలైన వారు.

సుగ్రీవుడు సూచించిన ప్రదేశాలన్నింటిని వెతుకుతూ ఈ వానరులు వింధ్యపర్వతాన్ని చేరారు. అక్కడి గుహలు, పర్వతశిఖరాలు, నదీ దుర్గాలు, సరస్సులు ఇలా ఎన్నో దుర్గమమైన ప్రదేశాలను వెదకినా సీతజాడ తెలియలేదు. అలా అలా వెదుకుతూ వారొక నిర్జనవనానికి చేరారు.

అక్కడ వారికి తినడానికి కానీ, త్రాగడానికి కానీ ఏమీ లభించలేదు. ఆ ప్రాంతంలోనూ ఎంతో అందమైన వృక్షాలు, చెట్లు ఉన్నాయి. కానీ ఆ చెట్లకు పుష్పాలుకాని, ఫలాలుకాని లేవు, మన పట్టణాలలో పాలకులు బాటల ప్రక్కన నాటించే వృక్షాలలాగ.

జంతువులుకాని, పక్షులు కాని ఆ వనంలో కనపడటం లేదు. బహుశ వాటికి తినే ఓషధులు ఏవీ అసలు అక్కడ లేకపోవడం వల్ల ఆ వనం నిర్జనారణ్యం అయి ఉంటుంది.

ఈ విషయాన్ని గూడ సుగ్రీవుడు వివరిస్తూ వీరికి తెలిపే ఉన్నాడు. అది వారికి ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఇలా ఈ ప్రాంతమంతా నిస్సారముగ ఉండడానికి కారణమేమని వీరంతా విచారించారు.

ఆ ప్రాంతంలో పూర్వము కండువు అనే ఒక తపోధనుడు ఉండేవాడట. ఆతనికి పదహారు సంవత్సరాల వయస్సుండే ఓ కుమారుడు ఉండేవాడు. ఆతడు ఈ వనంలోనే చనిపోయాడని, అర్ధాయుష్షుతో పుత్రుడు చనిపోయినందుకు కోపించిన ఆ మహాముని "ఈ ప్రాంతము ఏ ప్రాణికీ నివాసయోగ్యము కాకుండా పోతుంది" అని శపించాడని తెలిసింది.

అతికష్టంతో ఆ ప్రాంతాన్ని క్రమంగా దాటి పర్వత చరియలలో సీతాన్వేషణ కావిస్తూ ఉండగా క్రూరకర్ముడనే రాక్షసుడు వీరినందరిని తినేస్తానంటూ పెద్దగా కేకలు వేస్తూ వానరులపైకి దాడి చేశాడు. వాడి ఆకారాన్ని చూసిన వానరులకి చాలా భయం వేసింది.

అతడే రావణుడై ఉండవచ్చని భావించి అంగదుడు వాడిని ఒక్క గుద్దు బలంగా గుద్దాడు. అంగదుడు గుద్దిన గుద్దుకి నోటి నుండి రక్తం కక్కుతూ పర్వతంలా కుప్పకూలిపోయాడు ఆ రాక్షసుడు. అక్కడి నుండి ఇంకొంత దూరం ముందుకు సాగిన వానరవీరులు ఆకలితో ఇక నడవలేక నిరుత్సాహంతో ఒక చెట్టు క్రింద కూర్చున్నారు.

వారికి ఉత్సాహాన్ని కలిగించడం కోసం అంగదుడు వారితో...

**"అనిర్వేదం చ దాక్ష్యం చ మనస శ్చాపరాజయః ।**
**కార్యసిద్ధికరాణ్యాహుః తస్మాదేత ద్బ్రవీ మ్యహమ్ ॥"**

**విహాయ తంద్రీం శోకం చ నిద్రాం చైవ ముత్థితామ్ ।**
**విచినుధ్వం యథా సీతాం పశ్యామో జనకాత్మజామ్ ॥**

ఏదైనా ఒకకార్యాన్ని సాధించాలనుకునేవారు ధైర్యంతో ముందుకు నడవాలి. శోకాన్ని, నిద్రని వదిలి ప్రయత్నిస్తే జనకుని కుమార్తె అయిన సీత తప్పకుండా లభిస్తుంది. అసలే మన సుగ్రీవుడు చండశాసనుడు. మనం ఈ కార్యాన్ని సాధించకుండా వెనుదిరిగి వెళ్ళినా సుగ్రీవుని చేతిలో మరణించవలసినదే!

**అవశ్యం క్రియమాణస్య దృశ్యతే కర్మణః ఫలమ్ ॥**

మనం చేసే ప్రయత్నానికి తప్పకుండా ఫలితాన్ని పొందుతాము అని వానరులను ఉత్తేజపరిచాడు. ఆ అంగదుని మాటలకు వానరులు తిరిగి సీతాన్వేషణ ప్రారంభించారు.

ఆ వింధ్యపర్వత ప్రాంతాలలో అన్వేషణ చేస్తూండగానే సుగ్రీవుడు వారికిచ్చిన గడువు నెలరోజులూ పూర్తైపోయింది. ఆకలి, దాహంతో ఆ వింధ్య పర్వతాల దక్షిణ పడమరల మధ్య ఉండే నైఋతిదిశలో వెతుకుతున్న వారికి ఒక విశాలమైన బిలం (సొరంగం) కనిపించింది. ఆ బిలం లోనుండి పచ్చటివృక్షాలు బయటకి వచ్చి కనిపిస్తున్నాయి. ఇంకా ఆ బిలం నుండి నీటికి తడసి, పుష్పపరాగాలు శరీరానికి అక్కడక్కడా అంటుకొని, ఎర్రగా కనబడుతున్న కొన్ని నీటి పక్షులు, క్రౌంచపక్షులు, హంసలు, బయటికి వస్తూ కనిపించాయి. ఎంతో ఆశతో దాని దగ్గరకు వెళ్ళి లోపల నీరు కనిపిస్తుందేమోనని చూశారు వానరులు. లోపలంతా చాలా చీకటిగా ఉండడం వల్ల వారికి ఏమీ కనిపించలేదు. కాని, మంచి పుష్పాల ఫలాల పరమళాలు బయట వెలువడుతున్నాయి.

అడవులను గురించి, వనాలగురించి పరిచయమున్న హనుమ దీనినుండి నీటిపక్షులు బయటకి వస్తున్నాయి కనుక దీనిలో తప్పనిసరిగా మనకి నీరు లభిస్తుంది. మనం అందరం లోనికి ప్రవేశిద్దాం అని పలికాడు. సూర్యచంద్రులకు కూడా ప్రవేశయోగ్యం కాని ఆ బిలంలోకి వానరులందరు ఒకరి తోకను ఒకరు పట్టుకుంటూ లోపలికి ప్రవేశించారు. లోపల అలా అలా ఎంత దూరం వారు ప్రయాణించారో....

ఇంతలో వారికి అగ్నిహోత్రంలాగా ప్రకాశిస్తున్న బంగారు వృక్షాలు కనిపించాయి. ఆశ్చర్యంతో ఆ ప్రాంతాన్ని పరిశీలించారు. వారికక్కడ ఎన్నో అద్భుతాలు దర్శనమిచ్చాయి.

**"స్తబకైః కాంచనై శ్చిత్రై రక్తైః కిసలయై స్తథా ।**
**ఆపీడైశ్చ లతాభిశ్చ హేమాభరణ భూషితాన్ ॥"** (రా.కి.50.20)

ఆ బిలంలోని వృక్షా మొదలైనవన్నీ అందాన్ని విరజిమ్ముతున్నాయి. బంగారుచెట్లు రత్నాలు, కెంపులు, పచ్చలతో నిండి ఉన్నాయి. లతలు బంగారు ఆభరణాలతో అలంకృతాలై శోభిస్తూ ఉన్నాయి. బంగారంతో నిర్మించిన మేడలు. బంగారు నగలు రాసులు, రత్నఖచిత నేలలో, తినడానికి యోగ్యమైన ఫలాలు పరిమళ భరితమైన పుష్పాలు, తామరలతో నిండిన స్వచ్ఛమైన నీటి కొలనులు ఆ ప్రాంతం అంతా చాలా అద్భుతంగా ఉంది.

ఇంతలో వారికి ఒక తపస్విని నారవస్త్రములు ధరించి, నియమిత ఆహారం తీసుకోవడం వల్ల వచ్చే కాంతితో ప్రకాశిస్తూ కనిపించింది. ఆ వానరులు, బహుశః ఆమెయే సీతకావచ్చు నేమోనని, ఆమెను చూస్తూ అడుగు ముందుకు పడక నిలబడి పోయారు.

ఆ తాపసిని హనుమ "కాసి త్వం? కస్య వా బిలం?" నీవెవరవు? ఈ బిలం ఎవరిది అని ప్రశ్నించాడు. ఇంకా హనుమ ఆమెతో

**"క్షుత్పిపాసా పరిశ్రాంతాః పరిఖిన్నా శ్చ సర్వశః ।**
**మహదరణ్య వివరం ప్రవిష్టాః స్మ పిపాసితాః ॥**

దప్పికతో నీటికోసమని దీనిలోకి ప్రవేశించాము కాని దీనిలోని అద్భుతాలను చూస్తూ ఉండిపోయాము, ఇవి ఎవరికి చెందినవి? అని ప్రశ్నించాడు. దానికి ఆమె..

**మయో నామ మహాతేజా మాయావీ దానవర్షభః ।**
**తేనేదం నిర్మితం సర్వం మాయయా కాంచనం వనమ్॥**

ఈ బంగారు వనం మయుడనే రాక్షస రాజు నిర్మించాడు. హేమ అనెడి అప్సరసది ఈవనం. నేను ఆమె స్నేహితురాలిని నాపేరు స్వయంప్రభ. ఈ వనంలోని ఫలాలను, పానీయాలను స్వీకరించవచ్చు. ఆ తరువాత మీరెవరో, ఎక్కడి నుండి వచ్చారో తెలియజేయండి' అని పలికింది.

హనుమ ఆ తాపసికి ఏమిచెప్పాడు? వారు ఆబిలం నుండి ఎలా బయటపడ్డారు? వచ్చేసంచికలో తెలుసుకుందాం! *(సశేషం)*

# మన దర్శనం 'సు' దర్శనం

పూర్వమీమాంస
వైశేషిక
న్యాయ
యోగం
సాంఖ్య

వైశారదీ

దర్శనకారులుగ మనం చెప్పుకొనే కపిల, కణాద మొదలైన వీరికి ముందు ఆరకమైన తత్త్వద్రష్టలైన మహర్షులు లేరనుకోవడానికి వీలులేదు. ఎందుకంటే నేడు సమాజంలో వెబ్‌సైట్స్ ద్వారా అందుతున్న విజ్ఞానమంతా, ఒకప్పుడు ఎంతో మంది పండితులు, మేధావులు తమ బ్రెయిన్ కంప్యూటర్‌లలోనే నిలుపుకుని మౌఖికంగానే తరతరాలకి అందించారు కద! ఈనాటికి, ఆ విజ్ఞానమంతా సాంకేతిక రూపం దాల్చి వెబ్‌సైట్స్‌లో దర్శనమిస్తూ ఉంది.

అలానే ఆయా దర్శనకారులుగా మనం తెలుసుకుంటున్న ఈ మహర్షులందరికంటే ముందు కూడా తత్త్వద్రష్టలైన మహర్షులెందరో ఉండి ఉండవచ్చు. తెలుసుకోవాలన్న తపనతో తమనాశ్రయించిన వారెందరికో ఆ జ్ఞానాన్ని కేవలం మౌఖికంగా శిష్యాచార పరంపరగా అందిస్తూ ఉండేవారు.

కాలాంతరంలో వచ్చిన కణాదుడు మొదలైన మహర్షులంతా భావితరాలకోసం సూత్రరూపంలో వాటిని గ్రంథాలుగ తీర్చిదిద్ది అందించారు. అయితే ఆ సూత్రాలైనా మనం గురువులద్వారా అధ్యయనం చేస్తే తప్ప వాటిలోని అర్థం అవగతం కాదు. అసలంటూ ఆ జ్ఞాన భాండాగారం లోపించి పోకుండ వాత్సల్యంతో మనదాకా కాపాడి అందించారు ఋషులు.

తండ్రి ఎలాగైతే తాను తనజీవితకాలమంతా కష్టపడి సంపాదించినది తన సంతానానికి ఏ లోటూ రాకుండ ఉండాలని అందిస్తాడో అలా అందించారు ఋషులంతా. పితృధనం పొందిన కొడుకు జీవనం సాగడానికో పైసా పైసా కూడబెట్టడం కోసమో కష్టపడక్కరలేకుండ, తండ్రి ఇచ్చినది పెట్టుబడిగ ఇంకా అభివృద్ధి సాధించుకోవచ్చు కద!

ఋషులంతా కూడా ఈ తపనతోనే భావితరాలు తత్త్వాన్వేషణలో మరల 'జీరో' స్థాయి నుండి ప్రారంభించాల్సిన అవసరం రాకూడదని, వేలాది సంవత్సరాలుగ నియమనిష్ఠలతో తామార్జించిన జ్ఞాన సంపదని మనకి దర్శనాలుగ అందించారు. వీరిలో కొందరు, జగత్పిత అయిన భగవంతుని ద్వారా అందిన 'జ్ఞాననిధిగ' వేదాన్ని విశ్వసించి అందులోని సంపదలను వెలికి తీసి అందించి, ఆస్తికదర్శనకారులుగ చరిత్రలో నిలిచారు. వీరందించిన దర్శనాలనే 'వైదికదర్శనాలు' అని కూడా అంటారు.

అయితే కాలాంతరంలో భగవంతుని అస్తిత్వాన్ని, వేదప్రామాణ్యాన్ని అంగీకరించలేని మహానుభావులు కొందరు ఆవిర్భవించారు. వీరిని 'నాస్తికులు' అంటారు. వేదము ప్రమాణమే కాదంటే, ఆ వేద ప్రతిపాద్య పరమాత్మ ఒకడు ఉన్నాడన్నది వీరెందుకు అంగీకరిస్తారు కనుక? దేవుడూ లేడన్నారు ఈ నాస్తికులు, ఈనాటి వారిలో మేధావుల మనుకొనే కొందరిలాగ.

ఇలాంటి నాస్తికులలో కొందరు మహానుభావు లందించినవి 'నాస్తికదర్శనాలు' అంటారు. అవి ప్రధానంగా ఆరు. 1.చార్వాకము, 2 జైనము, 3.వైభాషికము, 4.సౌత్రాంతికము, 5.యోగాచారము, 6.మాధ్యమికము. ఇవి ఆరుగా ఉన్నా చివరి నాలుగు, బుద్ధుడు వారి శిష్యులద్వారా అందించినవి కనుక ఒకటే 'బౌద్ధదర్శన'మంటారు. జైనము, జినుడనే మహానుభావుని ద్వారా అందింది. ఇక చార్వాకము, సాక్షాత్ బృహస్పతివలన వచ్చింది అంటారు! చార్వాకుడని బృహస్పతికే పేరు.

దేవుడూ లేడు! దెయ్యమూ లేదు! కంటికి కన్పడేదేదో అది మాత్రమే ఉంది. ఎదురుగ కన్పడుతూ ఉన్నది అనుభవించడంలోనే ఆనందం ఉంది. అదే స్వర్గం! అనుభవించాలనుకున్నది అందకపోయినా, అందినది పొందేందుకు ఈ శరీరం సహకరించక రోగంతోనో, ముసలితనంతోనో, బాధలతోనో మూలుగుతూండడమే నరకం! కనుక, శరీరంలో శక్తి ఉన్నంతవరకూ సుఖాలు పొందాలి. అదే జీవిత పరమావధి అనే నేటి ఒకరకపు మేధావి వర్గానికంతటికీ కూడా ఆద్యుడు ఈ చార్వాకుడేనన్నమాట!

చారు-అందమైన, వాక్-మాట కల్గినవాడిని చార్వాకుడన వచ్చు. పేరులో అంత అందముంది, స్థాయి చూస్తేనేమో సాక్షాత్ ఇంద్రాది దేవతలకి గురువు. "లోకంలో ఎవరినైనా మేధావి అని పొగడాలంటే 'బుద్ధికి బృహస్పతి' అంటూ ఈయనతోనే పోలుస్తారే! అంతటి బృహస్పతి ఇలాంటి దర్శనాన్ని అందించాడా?" అనే ప్రశ్న, విస్మయం కలుగుతున్నాయి కదా! అయినా నమ్మక తప్పదు. ఇది నిజం.

నాస్తికవాదానికి ప్రథమ ప్రవర్తకాచార్యుడు చార్వాకుడనే పేరుపొందిన దేవగురువైన బృహస్పతియే! అసలే కండబలం, క్రౌర్యంతో నిండిన అసురులకి బుద్ధిబలం కూడా తోడైతే దేవతల పని ఇక ఇంతే! అని, ఆనాటి పరిస్థితికి దేవగురువైన బృహస్పతియే అసురులని తప్పుదోవ పట్టించి, ధార్మికంగ వారిని బలహీనపరచాలని, నాస్తికవాదాన్ని ప్రవర్తింపచేసినట్లుగ చెప్తారు. అందుకనే దీనికి 'బార్హస్పత్య'మని కూడా అన్నారు.

ఆ రోజులలో అసురులు కూడా వైదిక విజ్ఞానాన్ని కలిగి యుండి యజ్ఞయాగాదులు నిర్వహిస్తూండేవారు. దీనికి ఎన్నో ఉదాహరణలు మన ఇతిహాసాల్లో కన్పిస్తాయి. బలిచక్రవర్తి వంటి అసురులు వైదికజ్ఞానంతో పరలోక, నిశ్శ్రేయస సాధనకై యజ్ఞయాగాదులను నిర్వహించినట్లుగ వింటున్నాం! సాక్షాత్ రావణాసురుడు వేద పండితుడే. అతని కొడుకైన ఇంద్రజిత్ శత్రుసంహారానికై యాగాదులు చేయబోయినట్లు వింటున్నాం!

సహజంగ హృదయమార్దవం, సాత్త్వికభావనలు కొరవడి ఆసురీ ప్రవృత్తి కలవారికి జ్ఞానంఉన్నా ప్రళయ కారణమే కదా! నేటి అణు విజ్ఞానం దుష్టులచేతిలో ఉన్నట్లు.

విద్యుదుత్పాదనవంటి నిర్మాణాత్మక కార్యక్రమాలకి వినియోగపడవలసిన అణువిజ్ఞానం దేశదేశాలు, దేశాలు నాశనమైపోవడానికి ఉపయోగపడుతోందంటే కారణం, ఉపయోగించేవారి ఆసురీప్రవృత్తే కదా! పదిమందికీ విజ్ఞానాన్ని, వినోదాన్ని పంచవలసిన ప్రసారమాధ్యమము దేశాన్ని, ధర్మాన్ని అల్లకల్లోలం చేయడానికి ఉపయోగ పడుతోందంటే వాటి వెనుక ఉన్న వ్యక్తుల ఆసురీభావనలే కదా కారణం! అందుకేనేమో బృహస్పతి అసురులను పెడత్రోవ పట్టిస్తూ వేదము అసలు ప్రమాణమే కాదనే నాస్తిక వాదనని ప్రవర్తింపచేయవలసి వచ్చింది.

ఈ చార్వాకదర్శనానికి, బార్హస్పత్యమనే కాక, నాస్తిక వాదమని, లోకాయతమని, అక్రియావాదమని, అజ్ఞాన వాదమనికూడా పేర్లు ఉన్నాయి. వేదవిరుద్ధమైన అంశాలు చెప్పడం వలన ఇది నాస్తికవాదమైంది.

ఈ నాస్తికులు ప్రత్యక్షంగ కనపడని దానిని దేనినీ అంగీకరించరు. అందువలననే వేదాన్ని కూడా ప్రమాణంగ అంగీకరించరు. వేదం అనంతశబ్దరాశి కద! ఆ శబ్దరాశి కూడా ఇది చేస్తే ధర్మం, ఇది పుణ్యం అంటూ కంటికి కన్పడని అంశాలని గురించి చెప్తోంది. కనుక, ప్రమాణంగ అంగీకరించక పోవడంతో వీరిది నాస్తిక వాదమైంది.

యజ్ఞయాగాది ధర్మకార్యాచరణ, తద్వారా లభించే ఉన్నతమైన దివ్యలోకాలు అతీంద్రియములు, కనుక, వీరు అంగీకరించరు. అందుకని కన్పడని దివ్యలోకాలకై, లేదా, ముక్తిధామానికై వేరే సాధనలేవీ చేయనవసరం లేదనుకుంటారు. వైదికజీవన విధానం ప్రకారం ప్రతి ఒక్కరు పొందాలని కోరుకొనేవి నాలుగు. వీటిని పురుషార్థములు అంటారు. అవి ధర్మము, అర్థము, కామము, మోక్షము.

ధర్మము, మోక్షము అతీంద్రియములు కనుక నాస్తికులు వాటిని అంగీకరించరు. కోరరు. కనుక, వాటికోసం సాధనలు చేయరు. ఇంక మిగిలిన అర్థము, కామము మాత్రమే పొందవలసినవి అవే అని నమ్ముతారు. ఇంద్రియాలకి అందే విషయసుఖ సముపార్జన, కోరికలు తీర్చుకోవడమనే రెండే పురుషార్థములుగ అంగీకరిస్తారు. ఇది ఈనాటికీ లోకంలో చాలామందికి నచ్చే అంశం. చాలా మంది పాటించడానికి ఇష్టపడే అంశం కనుక, త్వరగ లోకమంత వ్యాపించి ఈ నాస్తికవాదము 'లోకాయతము' అనిపించుకుంది.

అంతేకాక, వీరు దేహముకంటే వేరే ఆత్మనుకూడా అంగీకరించరు. ఆత్మను అంగీకరిస్తే జ్ఞానం కలదైన ఆత్మ వలన దుఃఖానుభవరూపమైన జ్ఞానం కలుగుతూ ఉంటుంది కనుక, ఆత్మయే లేదంటారు. జ్ఞాన ప్రసక్తిని ఇష్టపడక 'అజ్ఞాన వాదులు' అన్పించుకున్నారు.

దేహంకంటే వేరే ఆత్మ లేనప్పుడు దేహం వదిలాక ఆత్మ చేరాల్సిన దివ్యలోకాల ప్రసక్తి ఎక్కడ ఉంటుంది? అందువలనే, వాటిని చేరడానికి దేహంలో ఉండగానే చేయాల్సిన క్రియా కలాపాల అవసరం లేదన్నారు. దానితో ఈ నాస్తిక వాదాన్ని 'అక్రియావాదము' అన్నారు. ఆత్మనీ అంగీకరించక, జ్ఞానాన్నీ అంగీకరించక, వీరు, జీవన పరమార్థంగ దేనిని అంగీకరిస్తారు? అంటే వీరి సిద్ధాంత సర్వస్వాన్ని ఒక చిన్న శ్లోకంలో యతిరాజవిజయం అనే నాటకంలో మన పూర్వాచార్యులు అందించారు. దానిద్వారా ఈ నాస్తికవాదాన్ని సూక్ష్మంగ తెలుసుకుంటూ ముందుకు సాగుదాం!

గీతా మాహాత్మ్య కథలు-8

# కుమతులు

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

లోభత్వం ఎంతటి అనర్థదాయకమో గత మాసం కథ అయిన "లంకె బిందెలు" కథలో తెలుసుకున్నాం. ఇక ఎనిమిదవ అధ్యాయం మహిమను తెలియజేసే ఈ అద్భుతమైన కథను చదువుదాం.

భగవద్గీతలోని ఎనిమిదవ అధ్యాయం **"అక్షర పరబ్రహ్మయోగం"** క్షరమంటే నశించేది. అక్షరమంటే నాశము లేనిది. నాశరహితమైన అక్షరపరబ్రహ్మమును గురించి బోధించే అధ్యాయమవడం వలన ఈ అధ్యాయానికి అక్షర పరబ్రహ్మ యోగం అని పేరు.

ఈ అధ్యాయంలో మోక్షగాములయిన ముముక్షువులు ఏ విధంగా పునరావృత్తి రహితమైన మోక్షమును పొందుతారో వివరంగా చెప్పబడింది. మానవులు అంత్యకాలమున శ్రీకృష్ణుని స్మరించుచూ దేహమును త్యాగము చేసిన తననే నిశ్చయముగా పొందుతున్నారన్న రహస్యము కూడా ఈ అధ్యాయంలోనే చెప్పబడింది.

అంతే కాక ఈ అధ్యాయంలో పరప్రకృతి అని చెప్పబడే నిత్యమైన, దివ్యమైన ప్రకృతి గురించి, అపరప్రకృతి అని చెప్పబడే జడమైన, అనిత్యమైన ప్రకృతుల గురించి వివరింప బడింది. కాలస్వరూపము కూడా సూక్ష్మముగా వివరించి, కాలానుగుణముగా ఈ జగత్తుయొక్క ఉత్పత్తి లయముల గురించి కూడా తెలియజేసింది.

ముముక్షువులు, బుభుక్షువులకు మరణానంతరం ప్రయాణించు మార్గముల గురించి వివరింపబడినది. ఇట్టి పరమాత్మను గురించిన జ్ఞానమును ఆకళింపు చేసుకున్న భక్తులు శ్రీకృష్ణధామమే పరమపదమని, అదే తమ గమ్యమన్న జ్ఞానాన్ని పొందుతారు.

శ్లో॥ **అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిం ।**
**యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥**

వేదాన్తములు దేనిని అవ్యక్తమని, అక్షరమని వర్ణిస్తాయో, ఏది పరమస్థానంగా తెలియబడుచున్నదో, ఏ స్థానము పొందిన తరువాత ఈ భౌతిక జగత్తులో తిరిగి జన్మించడో అట్టి లోకమే నా దివ్యధామము.

అందువలన, ఈ రహస్యమునెరిగిన ముముక్షువు వేదపఠనం వలన, యజ్ఞాలవలన, తపస్సుల వలన, దానముల వలన, కలిగే ఫలితాన్ని వద్దనుకొని, నా దివ్యధామాన్ని తన అనన్యభక్తి చేతనే పొందుతున్నాడని ఒక గొప్ప రహస్యాన్ని ఈ అధ్యాయంలో ఆవిష్కరించాడు శ్రీకృష్ణుడు.

అందుకే పురాణాలు ఈ అధ్యాయాన్ని ఈ క్రింది విధంగా కీర్తిస్తున్నాయి.

శ్లో॥ **జపన్ గీతాష్టమాధ్యాయ**
**శ్లోకార్థం నియతేంద్రియః ।**
**సంతుష్టవా నహందేవి**
**తదీయ తపసాభృశం ॥**

ఓ పార్వతీ! భగవద్గీతలోని అష్టమాధ్యాయాన్ని ఇన్ద్రియాలను చక్కగా నియంత్రించి అర్థమును గ్రహించి పారాయణ చేసినట్లయితే, అది తపస్సును మించినదై సర్వ ఆనందాలను, భగవత్ప్రాప్తిని కలిగిస్తుంది. ఇదే అర్థంతో ఈ ఎనిమిదవ అధ్యాయం కథ నడుస్తోంది. మరి చదువుదామా!

దక్షిణ దేశంలో పూర్వం "అమర్థకపురం" అనే ప్రసిద్ధమైన పట్టణం ఒకటి ఉండేది. ఆ పట్టణంలో భావశర్మ అనే ఒక బ్రాహ్మణుడుండేవాడు. అతడు దుర్వ్యసనపరుడు. అతడొక వేశ్యనే ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. అయినా అతడు వ్యభిచరిస్తునే ఉండేవాడు. మద్యమాంససేవనుడు, పరధనాపహరణాలోలుడు, పరస్త్రీసాంగత్యాభిలాష వంటి దుర్వ్యసనములను ఆచరిస్తూనే చివరకు మరణించాడు. మరణానికి ముందు తాను స్నేహితులతో కలిసి తాటికల్లును సేవిస్తూ తాటిచెట్టును శ్లాఘిస్తూ, దానినే తలుచుకుంటూ మరణించాడు. ఆతడు సకలనరకయాతనల అనంతరం, అంతిమస్మృతి కారణంగా తాటిచెట్టుగా జన్మించాడు.

అలా కొద్దికాలం గడిచింది.

అదే గ్రామంలో ఒక బ్రాహ్మణ దంపతులు నివసిస్తూ

ఉండేవారు. వారికి అన్ని మంచి లక్షణాలు గల బ్రాహ్మణుల అలవాట్లే ఉన్నా, ఎనలేని లోభంతో బాధ పడేవారు. ఆ ఇద్దరిలో భర్త పేరు కుశీవలుడు. భార్య పేరు కుమతి. ఇద్దరికి లోభమే. కుశీవలుడు అపరకర్మలలో పట్టరాని దానాలన్నీ పట్టి, ఎట్టి నియమనిబంధనలు, అనుష్ఠానం లేకుండా ఉండేవాడు. భార్య అతనిని అన్ని దానాలకు ప్రేరేపించి, ఇతర బ్రాహ్మణులకు ఏమి దక్కకుండా చూసేది. అంతే కాదు వారి లోభప్రవృత్తి వలన ఎవ్వరికి దానమిచ్చే వారు కారు. పిల్లికి బిచ్చం వేసేవారు కాదు. అలా డబ్బు కూడబెడుతూనే ఇద్దరూ కాలక్రమేణా మరణాన్ని పొందారు. వారి లోభప్రవృత్తి వలన తరువాత వారు రాక్షస దంపతులుగా జన్మించారు. వారు బ్రహ్మరాక్షసి జన్మలో భావశర్మకు పునర్జన్మ అయిన తాటి చెట్టును ఆశ్రయించుకుని నివసిస్తూ ఉండేవారు.

ఒకనాడు వారిరువురు తమ ఆహారం కోసం శతవిధాలా ప్రయత్నించి, విఫలురై తిరిగి తాటిచెట్టు దగ్గరకు వచ్చి అలసి కూర్చున్నారు. ఆహారం దొరకడం లేదని ఇద్దరూ చాలా బాధ పడుతున్నారు.

అప్పుడు కుమతి భర్తతో ఇలా అంది.

"నాథా! మనకిక ముక్తి మార్గమే లేదా? ఈ భయంకరమైన దుఃఖం నుండి బయటపడే స్థితి మనకిక రాదా? అని అడిగింది. దానికి కుశీవలుడు ఇలా సమాధానం చెప్పాడు.

ప్రియా! బ్రహ్మవిద్య, అధ్యాత్మవిచారము, సత్కర్మ తప్ప మనలను రక్షించేదేమి లేదు!

ఆ మాటలకు కుమతి "అయితే స్వామీ! ఆ బ్రహ్మము ఎవరు? అధ్యాత్మం అంటే ఏమిటి? సత్కర్మలంటే ఏమిటి?" అని అడగాలనుకుంది. కాని అప్రయత్నంగా తన నోటి నుండి సంస్కృతంలో ఈ క్రింది మాటలు వెలువడ్డాయి.

**"కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కింకర్మ పురుషోత్తమ!"**

అప్రయత్నంగా ఆమె నోటి నుండి వెలువడిన ఆ పలుకులు, భగవద్గీతలోని ఎనిమిదవ అధ్యాయంలో మొదటి శ్లోకం యొక్క మొదటి పంక్తి. అది అర్జునుడు భగవానునుతో పలికిన మాటలు. వాటినే భాగ్యవశమున కుమతి నోటినుండి వెలువడినవి. తక్షణమే వారికి బ్రహ్మరాక్షసి జన్మలు నశించి, దివ్యదేహములు కలిగినవి. ఒక దివ్యవిమానము వారి ముందర ప్రత్యక్షమైంది. వారు ఆ విమానంలో ఎక్కి స్వర్గప్రాప్తిని పొందారు. వారి కథను విన్న స్వర్గలోకవాసులు కూడా నిర్ఘాంతపోయారు.

ఆ మాటలను తాటిచెట్టు రూపంలోనున్న భావశర్మ కూడా విన్నాడు. ఆ అనుకోని సుకృతం వలన ఆతనికి తాటిచెట్టు జన్మ పోయి మానవరూపం సంప్రాప్తించింది. తనలో బ్రహ్మజ్ఞానం ఉదయించడం మొదలుపెట్టింది. ఆ రాక్షసదంపతులు పలికిన పలుకుల అర్థం అవగతమవడం మొదలయ్యింది.

దాని తరువాత భావశర్మ కాశీ నగరానికి వెళ్ళి, తాను విన్న ఆ భగవద్గీతా శ్లోక భాగాన్ని భక్తితో పఠిస్తూ తపస్సు చేయసాగాడు. అలా కొద్ది కాలం గడిచింది.

ఒక నాడు శ్రీహరి హఠాత్తుగా యోగనిద్ర నుండి మేల్కొన్నాడు. పాదాల వద్ద కూర్చున్న లక్ష్మీదేవి "స్వామీ! ఏమి లేచితిరి?" అని అడిగింది. "దేవీ! భూలోకంలో ఒక బ్రాహ్మణుడు భగవద్గీతలోని ఒక శ్లోకపాదాన్ని అదే పనిగా వల్లె వేస్తూ తపస్సు చేస్తున్నాడు. అతనిని అనుగ్రహించాల్సి ఉంది అని చెప్పి భూలోకానికి వెళ్ళాడు అని కథను క్షణమాత్రం ఆపాడు శంకరుడు. దానికి పార్వతీదేవి"స్వామీ! శ్రీహరి భావశర్మను ఏమని అనుగ్రహించారు చెప్పండి" అంది ఉత్సుకతతో.

"పార్వతీ! ఆ బ్రాహ్మణునికి శ్రీ మహావిష్ణువు మోక్షాన్నే ప్రసాదించాడు. ఆ వరప్రభావం వలన ఆతని వంశస్తులందరు తరించిపోయారు. అంటే వివిధ నరలోకాల్లో శిక్షలననుభవిస్తున్న వారందరికి వైకుంఠప్రాప్తి జరిగింది. కాబట్టి ఓ గిరిజా! ఈ అధ్యాయాన్ని చక్కగా పారాయణ చేసుకునే వారందరికి మోక్షమే ఫలము" అని చెప్పాడు.

భగవంతుడైన శ్రీమన్నారాయణుని కరుణకు పార్వతీదేవి కళ్ళు చెమ్మగిల్లాయి. శ్రీ మహావిష్ణువు లక్ష్మీదేవికి చెప్పిన ఈ వృత్తాన్తాన్ని శివుడు పార్వతికి చెప్పాడు.



# దివ్యసాకేతంలో........ శ్రీరంగనాథుడు

శ్రీమాన్ రఘుదత్తాచార్యులు - ప్రధానార్చకులు

కథలు విన్న కన్నయ్య రూపు కనులముందు కదలాడుతుంటే, మాధవుని మహిమాన్విత చరితలను మనసున నింపుకున్న తండ్రి మాటలు మనసును నిలువనీయకుంటే పరమాత్మను పొందాలంటే ప్రేమనిండిన హృదయమే కావాలని తండ్రి చెప్పిన మాటలు అమృతంలా అనిపించాయేమో! భక్తి భావ సాగరంలో భగవధ్యానము భవ బంధాలను తొలగించి క్షీరసాగరశయనుని చెంతకు తీసుకువెళుతున్నదని తెలసి ఉబ్బితబ్బిబ్బయ్యింది. మార్గంతెలిసింది. ఆచరణకష్టమేమో! కాలాలు మారి, అర్చామూర్తిగా మాత్రమే భగవద్దర్శనమిప్పుడు, మరి స్వామిని మనువాడుట ఎలా?

మొదలు పెట్టుట మనవంతు, ఫలితమిచ్చుట స్వామి వంతు ప్రారంభించమన్నారు తండ్రిగారు. ఇంకేం! కాలాతీతుడైన కారుణ్యమూర్తిని చేరడానికి సర్వం సన్నద్ధమైనది. శ్రీవిల్లిపుత్తూరు నందవ్రజమైంది. చెలియలతో చేరి తాను గోపికైంది. వటపత్రశాయి శ్రీకృష్ణుడైనాడు స్వామి ఆలయమే నందగోప భవనమైంది. "నీమీద ప్రేమ కలిగిన వారియందు నీవు మిక్కిలి ఆదరణతో వారి హృదయములయందు నిదురిస్తూ, పాపకర్మలచే పతమవ్వువారి యందు ఉదాసీనత నీస్వభావానికి తగవయ్యా? మా యందు కూడా నీవు తప్పక దయచూపవలెనని" స్వామికి తన ధర్మాన్ని ప్రబోధించింది మన చిన్నగోదా ?

కథల విన్న కన్నయ్య రూపు కలలమెరియ కలువరేకుల చెలియకనులు అరమోడ్పులయ్యే. చిన్న మాధవుని చూపుల శరాలతాకిడికి సఖి చెంపలు కెంపులాయె! పరమాత్మని పరమనామం పలుక ప్రియ పెదవులు కువకువలాడె! కలలో ముద్దులొలుకు కంఠమును శంఖమని చుంబింప మానసమంతా ప్రకంపితమై విశాలఫాలమున శ్వేద సరోవరమైయె! రంగనాథుని తన నాథుని చేసుకోవాలని కోరికల కురులు భృంగాలై ఫాలసరోతీరాన విరిసిన కనుల కలువలపై తిరుగసాగె! ఇన్ని అందాల గోదను చూచిన రంగనాథుడు నిలువగలడా! గోద నిచ్చెలి విడువగలడా మరొకటి తలువగలడా! అందుకే సర్వశేషి తానే అయినా, చిట్టి గోద విడిచిన మాలా శేషమును పొంది తృప్తిచెందాడు.

ఇంకేముంది! ఏమైనా సరే తనచేతిలో పనే, అర్చకులను పంపాడు. గోదాదేవిని సర్వసన్నాహాలతో శ్రీరంగమునకు కొనితెమ్మనాడు. ఇదిగో పెళ్ళిసందడి మొదలైంది. ఆ సందడి ఎక్కడో శ్రీరంగమునందో, శ్రీవిల్లిపుత్తూరునందో కాదు, ఆ రెండు దివ్య సన్నిధులు కలగలసిన దివ్యసాకేతమందు. అంగరంగ వైభవాల సాకేత మండపం గోదారంగనాథుల కళ్యాణ మండపముగా సిద్ధమైంది. సేవించి తరించాలను భక్తుల హృదయధ్వనులే మృదంగ తరంగాలై మంగళవాద్యాలై ప్రతిధ్వనించాయి. జగదాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో, శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్ స్వామివారి సన్నిధిలో గోదా కళ్యాణం ప్రారంభమైంది.

అభ్యంగనాల ఆరబోసిన కురులకు పరిమళాల విరులతో పూలజడలల్లి నుదుటి పాపిడిబిళ్ళతో, శుభగుణాలన్నింటినీ కళ్యాణ తిలకంతో అద్ది, మాయనంతా కాటుకచేసి కనులకద్ది బుగ్గన చుక్కపెట్టి, శృతులను కర్ణాభరణంగా, సహస్ర నామాలను పెదవులకు రంగులుగా అద్ది, ప్రకృతిని చీరగా చుట్టి, ఆళ్వారుల శ్రీసూక్తులను ఆభరణాలుగా చేసి దాసజనుల ఆశలను పాదాలకు పారాణిగా మార్చి, చిన్నిగోదను పెళ్ళికుమార్తెగా అలంకరించి కళ్యాణవేదికకు తీసుకుని రాగా రంగనాథుడు తన పరివారంతో వేదికను చేరి, ఆచార్యుల సాక్షిగా దీనజనరక్షనే నాకర్తవ్యమను ప్రతిజ్ఞన గోదా పాణిగ్రహణం చేసినాడు. సర్వజగన్మంగళములనే మాజ్గళ్య సూత్రముగా అమ్మ కంఠమున అలంకరింపచేసాడు. ఆ ఉత్సవం అందరికీ ఆనందాల పంట. అదృష్టాల విరిబాట.

శ్లో. స్వోచ్ఛిష్ట మాలికా బంధ గంధ బంధులజిష్ణవే
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్యమంగళం ॥



రాయల ఊహల పల్లకి....

# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

ద్వీపాంతరాలకు వెళ్ళి నౌకాయానం ద్వారా వర్తకం చేసేవాళ్ళకు కొన్ని వ్యాపారపద్ధతులుంటాయి. ఒకద్వీపం నుంచి ఏవో సరుకులతో ఓ నావ బయలుదేరితే మరో ద్వీపంనుంచి మరోరకం సరుకులతో మరోనావ బయలుదేరిందనుకోండి! ఈ రెండు నౌకలూ సముద్రంలో తారసపడినప్పుడు ఆ రెండు నౌకల్లోనివారూ తమతమ వస్తువుల్ని ఒకరికొకరు మార్చుకునేవారు. దీనికోసం ఒకనావలోనివారు తమ సరుకుల్ని మచ్చుకోసం ఒకపట్టుబట్టలో మూటకట్టి ఆ మూటను ఒక గడకు కట్టి రెండోనావమీదకు వాల్చేవారు.

అల్లాగే అవతలి నావవారూ తమ సరుకుల్ని గడకు కట్టి ఈ నావవైపు వాల్చేవారు. ఇద్దరూ సరుకుల నాణ్యతను గమనించి తరవాత బేరసారాలు సాగించుకునేవారు.

ఈ సన్నివేశం ఇప్పుడు మధురలో కనబడుతోంది.

మధురలోని మేడలు ఆకాశగంగకంటే ఎత్తుగా ఉన్నాయి. అంచేత ఆ మేడలూ వాటిలో తిరిగే స్త్రీలూ మేడలమీదుండే జెండాలూ ఆకాశగంగలా ప్రతిఫలిస్తున్నాయి. కాస్త గాలివీచింది. స్వర్గం మేడల జెండాల ప్రతిబింబాలు మధుర మేడల జెండాల ప్రతిబింబాలమీదికి, మధురమేడల జెండాల ప్రతిబింబాలు స్వర్గం మేడల జెండాల ప్రతిబింబాల మీదికీ వాలుతున్నాయి. ఇదిగో నౌకావర్తకం ప్రారంభమైంది.

ఆకాశగంగ సముద్రం. దానిలో మేడల ప్రతిబింబాలు ఓడలు. వాటిలో స్త్రీలు వర్తకులు. జెండాలు సరుకుల మూటలు కట్టిన గడలు. స్వర్గం మేడల ప్రతిబింబాలు ఒక ద్వీపం నౌకలు, మధురమేడల ప్రతిబింబాలు మరోద్వీపం ఓడలూను. ఈ జెండాలు ఆ జెండాలకు, ఆ జెండాలు ఈ జెండాలకూ తగలడం గడలకు తమ సరుకుల్ని పట్టువస్త్రాల మూటలు కట్టి మార్చుకోటంలానూ అనిపిస్తోంది.

ఆ నగరంలో మేడలు నక్షత్రమండలాన్ని దాటి ఉన్నాయి. ఆకాశం మీద పిల్లనక్షత్రాలు అటు ఇటూ తిరుగుతూ ఈ మేడలడ్డురాగానే కిటికీల్లోంచి మేడల్లోకి దూరుతున్నాయి. మేడల్లోని స్త్రీలు ఈ నక్షత్రాల్ని పట్టుకోవాలని చటుక్కున కిటికీల తలుపులు మూసేస్తారు. "అన్నా, చిక్కొచ్చి పడిందే! ముత్యాలనుకొని తమకు కన్నాలు పొడిచేస్తారేమో ఈ స్త్రీలు" అని భయపడి ఆ పిల్ల నక్షత్రాలు పైనున్న చాందినీకి వేలగట్టిన ముత్యాలహారాలతోపాటు తామూ ఓ హారంలా వేలాడుతూ కలిసిపోతాయి. అవీ నిజం ముత్యాలహారాలే అనుకుని ఆ స్త్రీలు వాటి ఊసు మరిచిపోతారు. కొంతసేపయ్యాక రతిక్రీడలతో అలసి వారు చల్లగాలికి కిటికీ తలుపులు తెరుస్తారు. అంతవరకూ హారాలుగా ఉన్న ఈ పిల్లచుక్కలు బతుకుజీవుడా అని కిటికీల్లోంచి వెలుపలకు వచ్చి తమ దారిన తాము పోతాయి.

మధురలో నెమలిపింఛంలా పొడవైన జుట్టుగల నెలతలున్నారు. వారు వినోదం కోసం నెమళ్ళను పెంచుతారు. ఆ మేడలు మేఘమండలంకంటే ఎత్తుగా ఉన్నందువల్ల మేఘాలగర్జనలు అక్కడికి వినబడవు... మేఘగర్జనవింటేకాని, నెమలి పురివిప్పి నాట్యం చెయ్యదు. వారు మంచి పాటకత్తెలు. సంగీత కళామర్మాలు బాగా తెలిసినవారూను. అంచేత నెమలి పురివిప్పి ఆడాలనుకున్నప్పుడల్లా మేఘరంజని అనే రాగాన్ని ఆలాపన చేస్తారు. లిఆ ఆలాపనాదాలు వినపడగానే కిందనున్న మేఘాలు మేడలమీదికి వచ్చి గర్జిస్తాయి. అలా మేఘాలు గర్జించగానే సంతోషంతో నెమళ్ళు పురివిప్పి నాట్యం చేస్తాయి.

స్వర్గంలోని మేడలమీదికి తామరమొగ్గల్లాంటి కలశాలున్నాయి. మధురాపుర మేడల జెండాలు మువ్వల మోతతో ఆ కలశాలని కప్పుతున్నాయి. ఆ మువ్వలమోతవిని ఎవరిదో ఈ చేతిగాజుల సవ్వడి అని స్వర్గగృహలక్ష్మి తలెత్తిపైకి చూస్తూంటే మధురాగృహలక్ష్మి ఆటపట్టించాలని స్వర్గగృహలక్ష్మి కళ్ళు తన చేత్తో మూస్తున్నట్టుంది.

మధురాపుర లక్ష్మి ఒక కొత్తపెళ్ళికూతురు. మేడల్లో ఉన్న కురుజులు (చిన్న చిన్న దాపుకర్రలు) ఆమె చెలికత్తెలు. ఆ కురుజులపైన ఉన్న పట్టెలె చెలికత్తెల చేతులు. పరిమళ ద్రవ్యాల ధూపం రాత్రి. సూర్యుడు దీపం. చెలికత్తెలు చేతుల్తో బలవంతంగా కొత్త పెళ్ళికూతుర్ని వరుడైన విష్ణువు దగ్గరకు నెట్టేరు. ఆమెకు సిగ్గు. కొత్తపెళ్ళికూతురు కదామరి. జెండా అనే చీర చెరవును సూర్యుడనే దీపానికి అడ్డం పెట్టింది. అంతా చీకటైపోయింది. కాని, కొత్తవల్ల కలిగిన భయమో – అది తగ్గలేదు. ఔట్ఘానాలు చిమ్ముతున్న నీరు ఆమె ఒంటికి పట్టిన చెమటలా ఉంది. మేడలమీదున్న పావురాళ్ళ కూజితాలు వినీ వినబడకుండా ప్రియునితో ఆమె అంటున్న మాటల్లా ఉన్నాయి. అల్లా ఏదో అంటూ ప్రియుడైన విష్ణువు పదాన్ని ఒత్తు తున్నట్టుంది. విష్ణుపదమంటే ఆకాశం. ఆకాశాన్నంటుతున్నాయి ఆ మేడలు. సూర్యుణ్ణి తాకుతున్నాదీయి ఆ సౌధాల పతాకాలు.

ఆ పట్టణంలో గోపురాగ్రాన పద్మరాగమణులు తాపేరు. సూర్యుడు మధ్యాహ్నమయ్యేప్పటికి ఆ మధురానగరం మీదికి వస్తాడు. ఈ గోపురాగ్రమ్మీద ఉన్న కెంపులకాంతికి బాగా ఎర్రపడతాడు. బ్రహ్మగారు ప్రాతస్సంధ్యలోను, సాయం సంధ్యలోను సూర్యుణ్ణి ఎర్రగా ఉండేట్టుచేసి మధ్యాహ్న సంధ్యలో ఆ ఎరుపు పెట్టడం మర్చిపోయాడు. ఆ లోటు తీర్చడానికి ఈ గోపురాగ్రాన ఉన్న కెంపులకాంతితో అతని ఒంటికి ఎరుపును పూస్తున్నట్టుంది.

మధురలో పూలుకోసి తెచ్చి పూలఅంగళ్ళలో అమ్మే స్త్రీలున్నారు. వీర్ని 'పుష్పలావికలు' అంటారు. వీరుచమత్కారపు మాటలతో విటులను కవ్విస్తూ పువ్వులమ్ముతూంటారు.

రతీదేవి మన్మథుడికి బాణాలందిస్తున్నట్టు పుష్పలావికలు విటులకు పువ్వులిస్తున్నారు.

వీధుల్లో చంద్రకాంత వేదికలమీద కర్పూరం పునుగువంటి పరిమళ ద్రవ్యాలు అమ్మే స్త్రీలు ఎన్నో సంధ్యామూర్తుల్లా కనిపిస్తూ ఉన్నారు. వారమ్మే కర్పూరఖండాలు నక్షత్రాల్లా ఉన్నాయి. పునుగుపెట్టిన ఏనుగు దంతపుభరిణె తెలుపు ఎరుపు రంగులు కల చంద్రబింబంలా కనవస్తోంది. కుంకుమ అంటినవారి చీరలకాంతి సంధ్యారాగంలా ఉంది. సంధ్య తానొక్కతే బహు రూపాలతో వచ్చి వీధుల్లో పునుగు కప్పురాలు అమ్ముతున్నట్టు కనవస్తోంది.

మధురలో మంచిమదించిన ఏనుగులున్నాయి. ఆ మదపుటేనుగులు తమ ఇష్టం వచ్చినట్టు పోనీక మావటీడు అదలించినందుకు మొహమెత్తి నన్నెందుకు ఆపుతావు అన్నట్టుగా ఆకాశంవైపు తొండాన్ని పలుమార్లు చిమ్ముతున్నాయి ఈటెను పట్టుకుని తమను బెదరించేవాణ్ణి. పెద్దగా ఫీంకరిస్తూ బందాలకాళ్ళతోనే గంతులు వేసి కోటగుమ్మం దాటేవరకూ తరిమి కొడుతున్నాయి.

మదించినవి కావడం చేత సరిగ్గా కానక చల్లదనాన్ని పట్టి అరుగుల్ని గుర్తించి వాటిమీదున్న జనాన్ని పట్టుకోవాలని మాటిమాటికీ తొండాలు చాస్తున్నాయి. మదగజాలు కదా! మొదలే చెక్కిళ్ళ మదం కారుతోంది. దానికితోడు పెద్ద డిండిమాలు వాయిస్తున్నారేమో ఆ చప్పుడుకు మదం ఇంకా ఎక్కువయి కోపం కూడా వచ్చి ఆ డిండిమాలు వాయించే వాళ్ళపై రాళ్ళు రువ్వుతున్నాయి.

పెద్ద వెదురు దెబ్బలకు ఊరుదాటి వచ్చి మరోదారిన వస్తున్న ఏనుగుల ఫీంకారధ్వనులు విని మళ్ళీ వెనుదిరిగి ఊళ్ళోకి వస్తున్నాయి. శత్రురాజులమీదికి ప్రయోగించిన సంహారక దేవతల్లా కోపపు చూపులు చూస్తూ ఆడఏనుగులు కనపడేప్పటికి వాటికి వాటిననుసరించి ఊరిబైటికి పరువుతీస్తాయి ఆ ఏనుగులు. ఇల్లాంటి ఏనుగులు ఎన్నోఉన్నాయి పాండ్యరాజుకు.

ఊరితోపుల్లో ఏనుగుల్ని కడతారు. తొండాలతో అవి తమ మీద ఎప్పుడూ దుమ్ము చల్లుకుంటూ ఉంటాయి. అవి కట్టి ఉన్న పెద్ద పెద్ద చెట్లను ఎన్నో పళ్ళున్నాయి. పక్షులు ఆ పళ్ళను కొరుకుతున్నాయి. ఆ గింజలు కింద ఉన్న ఏనుగుల ఒంటిమీద ఉన్న దుమ్ములో పడుతున్నాయి.

ఏనుగులు తొండాలతోపైన నీళ్ళు చల్లుకుంటూంటాయి. ఆ తడికి ఆ గింజలు మొలకెత్తుతాయి. అల్లాంటప్పుడు వాటి దగ్గరకు వెళ్ళాలన్నా శక్యం కాదు. అవి ప్రాణాలతోడి నడగొండల్లా తిరుగు తూంటాయి. *(సశేషం)*

**శ్రీరామచంద్రాచార్య**

# శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి ప్రచార కార్యక్రమాలు

ఫిబ్రవరి నెల

| | | | |
|---|---|---|---|
| 1,2. | ప్రొద్దుటూరు | కడప జిల్లా, ప్రొద్దుటూరులో 23వ సహస్ర తులసీ శ్రీనివాసమ్ | |
| 3. | తిరుపతి | భీష్మైకాదశి, విరాట్ విష్ణు సహస్రనామ పారాయణ, మున్సిపల్ గ్రౌండ్స్ ఉదయం గం.9.00 నుండి | అనంతరం తిరుమలకు పాదయాత్ర |
| 4. | హైదరాబాద్ | హైదరాబాద్ మీదుగా రాజస్థాన్‌లోని అల్వార్ చేరుట. | |
| 5. | అల్వర్ | వేదసమ్మేళనం సమాపనోత్సవంలో పాల్గొనుట | |
| 6. | అల్వర్ | హైదరాబాద్‌కు తిరుగుప్రయాణం | రాత్రికి హైదరాబాద్ |
| 8 | హైదరాబాద్ | భద్రుకా కాలేజీ, శాంతినికేతన్ స్కూల్ సందర్శన | రాత్రికి కరీంనగర్, పర్లపల్లి |
| 9. | పర్లపల్లి | శ్రీవేంకటేశ్వరాలయ ప్రతిష్ఠ, రేకొండ సందర్శన | రాత్రికి నిజామాబాద్ జిల్లా బాసర చేరుట |
| 10. | బాసర | శ్రీ వడ్డేపల్లి నరసింగరావు ధర్మశాల ప్రారంభం. | రాత్రికి గుత్ప గ్రామం చేరుట |
| 11. | గుత్ప | నర్సింగపల్లి గ్రామ సందర్శన | |
| 12. | గుత్ప | శ్రీ వేంకటేశ్వరాలయ ప్రతిష్ఠ | |
| 13. | | గుత్ప నుండి శ్రీకాకుళంజిల్లా మందసాకు ప్రయాణం | |
| 14. | మందసా | శ్రీ వాసుదేవ పెరుమాళ్ కోవెల బ్రహ్మోత్సవాలు | |
| 15. | మందసా | కళ్యాణోత్సవం | |
| 18. | హైదరాబాద్ | లంగర్ హౌస్ వద్ద లయన్స్ క్లబ్ సమావేశం | |
| 22. | జీవా | దివ్యసాకేతం, శ్రీరామనగరం ప్రాంగణంలో ఉపనయనోత్సవాలు, ఋగ్వేదులకు | |
| 23. | జీవా | యజుర్వేదులకు, ఉదకశాంతి | |
| 24. | జీవా | సామూహిక ఉపనయనాలు | |
| 25. | జీవా | ఋగ్వేదీయుల సదస్సు | రాత్రికి కరీంనగర్, ధర్మవరం |
| 26. | ధర్మవరం | కరీంనగర్‌జిల్లా, ధర్మవరంలో శ్రీవేంకటేశ్వరాలయ ప్రతిష్ఠ | |
| | | సా॥ రవీంద్రభారతిలో సాంస్కృతిక కార్యక్రమంలో పాల్గొని | రాత్రికి వరంగల్ జిల్లా, తిమ్మాపూర్ |
| 27. | తిమ్మాపూర్ | శ్రీ కోదండరామాలయం ప్రతిష్ఠ | రాత్రికి హన్మకొండ |
| 29. | హన్మకొండ | సుమంగళీఫంక్షన్‌హాల్ నందు సమాశ్రయణోత్సవం | రాత్రికి సీతానగరం |
| మార్చి : | | | |
| 1. | ఈదగాలి | నెల్లూరుజిల్లా ఈదగాలి చేరుట | |
| 2. | " | వరగలి, తడకూరు, కడివీడు, కల్వకొండ సందర్శించి | రాత్రికి సోమశిల మకాం |
| 3. | సోమశిల | సోమశిల నుండి ఆత్మకూరు చేరుట | |
| 4. | ఆత్మకూరు | శ్రీ వేంకటేశ్వరాలయ ప్రతిష్ఠ | |
| 5. | హైదరాబాద్ | E.S.I. శ్రీ విజయలక్ష్మీదేవాలయంలో సహస్ర కలశాభిషేకం ప్రారంభం. | |
| 7,8. | కోరుట్ల | కరీంనగర్ జిల్లా, కోరుట్ల | |
| 9. | కోరుట్ల | అష్టలక్ష్మీ దేవాలయ కార్యక్రమాలలో పాల్గొని, | రాత్రికి జనగాం చేరుట |
| 10. | జనగాం | ఆళ్వార్‌ల ప్రతిష్ఠ | రాత్రికి పాల్వంచ, ఖమ్మం జిల్లా. |
| 11,12. | ఖమ్మం | నవభారత్ ఫెర్రోవారి శ్రీ వేంకటేశ్వరాలయ మహోత్సవాలలో పాల్గొనుట. | |
| 14. | చిమిర్యాల | నల్గొండజిల్లా, చిమిర్యాల శ్రీరామాలయ ప్రతిష్ఠ | రాత్రికి మేళ్ళచెర్వు |
| 15. | మేళ్ళ చెర్వు | మహాసిమెంట్స్ శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలు | |



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



డిసెంబరు 25, 26, 27 శ్రీరామనగరంలో శ్రీస్వామి వారు వేంచేసి ఉన్నారు. 27వ తేది సాయంత్రం **15వ సహస్ర తులసీ శ్రీనివాసమ్** కార్యక్రమంలో భాగంగా సైదాబాదులోని శ్రీ కోదండరామాలయం దర్శించారు. అక్కడి నుండి చంపాపేట 'మినర్వా గార్డెన్స్' వరకు శోభాయాత్ర జరిగింది. అక్కడి ప్రజ్ఞ విద్యార్థుల కుమ్మరి భీముడు, కుచేలుడు మొదలగు శరణాగతి దీక్షా కథలలోని పాత్రలను ధరించి అభినయించారు.

అనంతరం ధార్మిక సమ్మేళనంలో భక్తులు వారి అనుభవాలను వ్యక్తం చేశారు. శ్రీస్వామివారు శ్రీనివాస వైభవాన్ని అందరికీ వివరించారు. రాత్రి శ్రీమాన్ సుభద్ర ఆనందరావుగారి గృహంలో బస చేశారు.

28 ఉదయం వేదికపై సహస్ర తులసీ శ్రీనివాసమ్ వైభవంగా జరిగింది. ఈ కార్యక్రమాన్ని సైదాబాద్, సంతోష్‌నగర్, మలక్‌పేట, దిల్‌షుక్‌నగర్ వి.టి.సభ్యులు సమర్థవంతంగా నిర్వహించారు. శ్రీమతి అహల్యా జగపతిరావు దంపతులు, శ్రీమతి భారతి, శ్రీమతి సుభద్ర, శ్రీమతి విజయలక్ష్మి, శ్రీమతి వనజా చక్రపాణి తదితర వి.టి. కార్యకర్తలకు శ్రీస్వామివారు మంగళాశాసనం చేసి రాత్రి జహీరాబాద్ వి.టి. ప్రెసిడెంట్ శ్రీమాన్ అల్లాడి వీరేశంగారి గృహానికి వేంచేశారు.

29 ఉదయం సుభాష్‌గంజ్ మైదానంలో ప్రజ్ఞా విద్యార్థులు, అధ్యాపక బృందంతో సమావేశం జరిగింది. సాయంత్రం ప్రవచన కార్యక్రమంలో శ్రీస్వామివార్లతో పాటు, మూషీస్వామివారు కూడా పాల్గొన్నారు. మూషీ స్వామి ప్రవచిస్తూ "నీటిలోని పద్మాల సౌందర్యాన్ని జలజీవాలు గుర్తించలేవు. కానీ, ఎక్కడో ఉండే తుమ్మెదలు ఆ పద్మంలోని మకరందాన్ని ఆస్వాదించి ఆనందిస్తాయి. అలాగే ఈ లోకంలో చిన్న జీయర్‌స్వామి అనే పద్మపు విలువను అందరూ గుర్తించలేరు. వారి ప్రవచన మాధుర్యాన్ని గ్రోలిన తుమ్మెదలలో నేనూ ఒకడిని. అటువంటి ఆచార్యదర్శనంలో తిరుమల శ్రీనివాసుని దర్శించిన అనుభూతిని నేను పొందగలిగాను" అని వివరించారు.

30 ఉదయం కార్యక్రమంలో శరణాగతి వైభవాన్ని భక్తులకు ప్రవచన రూపంలో అందించారు శ్రీస్వామివారు. భారీ పరిశ్రమల శాఖామంత్రి శ్రీమతి గీతారెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొని శ్రీవారి మంగళాశాసనములు పొంది శ్రీస్వామివారి కార్యక్రమాలలో గత 20 సం॥రాలుగా పాల్గొంటున్నామని తమ సంతోషాన్ని ప్రకటించారు. కార్యక్రమాన్ని నిర్వహించిన వి.టి. సెక్రటరీ ఉమామహేశ్వరరావు భవిష్యత్తు వి.టి. కార్యక్రమానికి క్రొత్త కార్యవర్గ సభ్యులను ప్రకటించారు. కార్యక్రమంలో పాల్గొన్న భక్తులకు, నూతన వి.టి. సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపచేశారు. 16వ సహస్ర తులసీ శ్రీనివాసమ్ ఇక్కడ జరగవలసి ఉన్నా పూర్వరంగం సరిగ్గా సంతరించుకోకపోవడం వల్ల దానిని జరుపలేదు. అయినా అక్కడి వారికి తెలియవలసిన విషయాలను తిరుమలకు సంబంధించిన చారిత్రక చిహ్నాల పరిరక్షణకు సంబంధించిన అంశాలను శ్రీవారు వివరించారు. కార్యక్రమంలో పాల్గొన్న వారికందరికీ మంగళాశాసనం చేశారు.

జహీరాబాద్‌నుండి బయలుదేరి శ్రీస్వామివారు శ్రీమాన్ వరదాచార్యుల ఆహ్వానం మేరకు మెదక్ జిల్లాలోని సంగారెడ్డిలో నూతనంగా నిర్మాణం అవుతున్న శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయాన్ని దర్శించి తగు సూచనలను అందించారు. రాత్రికి శ్రీరామనగరం చేరుకున్నారు.

31వ తేది శ్రీరామనగరంలో భక్తులకు శ్రీస్వామివారు సమాశ్రయణాలు కృపజేశారు.

జనవరి 1వ తేది ఆంగ్ల నూతన సంవత్సర సందర్భంగా తిరుప్పావై గోష్ఠిలో భక్తులు విశేషంగా పాల్గొన్నారు.

"మనకు నూతన సంవత్సరం ఉగాది నుండి ఆరంభమవుతుంది. మన ఉగాది దైవ ప్రార్థనతో ప్రారంభమవుతుంది. మనది వెలుగులోనికి ప్రయాణం. కనుక సూర్యోదయంతో ఉగాది ఆరంభమౌతుంది.

జనవరి 1వ తేది ఆంగ్లేయులకు నూతన సంవత్సరం. వారికి అర్థరాత్రి నూతన సంవత్సరారంభం. వారిది చీకట్లో ప్రయాణం. వారి ఉగాది విలాసాలతో, వికృత రూపాన్ని దాలుస్తుంది.

**ఏమైనా, కాలం దైవస్వరూపం కనుక దాన్ని మంచిగా ఆత్మావలోకనానికి అనువుగా అన్వయించుకో గలగడం బుద్ధిమంతులు చేయవలసిన పని. మనం దీన్ని అలా వినియోగించు కోవా"లని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు. అది ఎలాగో "అమ్బరమే" పాశురం ద్వారా అందించారు.**

**శ్రీవారి ఆశ్వాసన :** ఈమధ్య డిసెంబరు 3వ వారంలో నల్గొండకి చెందిన మన వికాసతరంగిణికి ప్రోత్సాహకులు, మాజీ M.L.A అయిన శ్రీమాన్ K. వెంకటరెడ్డిగారి కుమారుడు యాక్సిడెంట్‌లో హఠాత్తుగా మరణించాడు. నల్గొండలో జరిగే సహస్ర తులసీ శ్రీనివాసానికి వీరు మంచి ఏర్పాట్లు చేశారు. యువకుడైన కుమారుని మరణం వారిని శోకసాగరంలో ముంచింది. ఇది తెలిసిన మన శ్రీస్వామివారు నల్గొండ కార్యక్రమాన్ని వాయిదావేయమని అక్కడి కార్యకర్తలను ఆదేశించారు. ఆ పిల్లవానికి చేయవలసిన ఉత్తరక్రియలు జనవరి 1వ తేదితో ముగిశాయి. ఈ సందర్భంగా.... దుఃఖసాగరంలో మునిగిపోయిన శ్రీమన్ కోమటిరెడ్డి వెంకటరెడ్డి దంపతులను, వారి బంధువులను శ్రీవారు ఓదార్చారు. జరిగే సన్నివేశాలను, అవి మన మనస్సులకు తీరని ఆవేదన కల్గించినప్పుడు ఆరని దుః ఖాన్ని మిగిల్చినప్పుడు ఎలా స్వీకరించాలో ఈ సందర్భంగా శ్రీస్వామివారు వారికి వివరించారు.

"డిసెంబరు 23, 24 తేదీలలో నల్గొండలో జరగవలసిన కార్యక్రమాన్ని అంత విచారంలో ఉన్నా కార్యక్రమాన్ని ఆపవద్దని, దైవకార్యాన్ని కొనసాగించమని మీరు కార్యకర్తలను కోరారు. కానీ, ఇలాంటి విషాద సమయంలో కార్యక్రమాన్ని జరపలేమని, మీరు కూడా పాల్గొనగలిగినప్పుడే ఈ కార్యక్రమాన్ని చేద్దామని మేము వాయిదా వేశాము. ఇది తిరిగి జనవరి 18,19 తేదీలలో చేద్దా"మని శ్రీమాన్ రెడ్డిగారికి శ్రీస్వామివారు సూచించారు. శ్రీవారి ఆదేశాన్ని అంగీకరించి తప్పకుండా వచ్చి పాల్గొంటామని శ్రీమాన్ రెడ్డిగారు తెలియజేశారు.

అక్కడి నుండి సౌభాగ్యపురం కాలనీలోని శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయం దర్శించి పెరుమాళ్‌కు నూతన సాలగ్రామ మాలను శ్రీస్వామివారు సమర్పించారు. అక్కడి భక్తులకు శుభ సందేశాన్ని అందించారు.

రాత్రి జయస్టీల్ ప్యాలెస్ అధినేత శ్రీమాన్ గోపిగారి గృహంలో బస చేశారు.

2వతేది ఉదయం ఆలయ ప్రాంగణములో **16వ సహస్ర తులసీ శ్రీనివాసమ్** పూజా కార్యక్రమము అతి వైభవముగా జరిగింది. వనస్థలిపురం, అలకాపురి, మీర్‌పేట వి.టి.ల సభ్యులు ఆలయ కమిటీ సంయుక్తంగా కార్యక్రమాన్ని నిర్వహించారు. శ్రీమతి సునంద, శ్రీమాన్ పద్మనాభరావ్ విశేషించి కృషిచేశారు. శ్రీమతి సునందగారి కైంకర్యాన్ని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు. శ్రీమాన్ పద్మనాభరావు సమన్వయకర్తగా సమర్థవంతంగా నిర్వహించారు.

రాత్రికి శ్రీస్వామివారు **గద్వాల్** చేరారు. వి.టి. సభ్యులు శ్రీవారికి ఘనస్వాగతం పలికారు. 3వ తేది ఉదయం గద్వాల్ మార్కెట్‌యార్డ్‌లో **17వ సహస్ర తులసీ శ్రీనివాసమ్** కార్యక్రమం ప్రారంభించారు. ప్రవచనాన్ని జరిపి ప్రక్కనున్న కొండపల్లిలో వి.టి. నిర్వహించిన పశువైద్య శిబిరంలో పాల్గొన్నారు.

తిరిగి వేదికపై జరిగిన ధార్మిక సమ్మేళనంలో పాల్గొని భక్తుల అనుభూతులను శ్రవణం చేశారు. మధ్యాహ్నం 3గం॥లకు గద్వాల్ పురవీధులలో అత్యంత వైభవంగా శోభాయాత్ర జరిగింది. విశేషించి వేయి కలశాలతో, ఆచార్యులతో జరుగు శోభాయాత్రకు పూర్వరంగంగా వీధులను నీటితో శుభ్రపరిచారు. వేదిక చేరుకున్న శోభాయాత్ర బృందాన్ని ఉద్దేశించి ప్రవచిస్తూ "గతంలో పంజాబ్ రాష్ట్రంలో జరిపిన పాదయాత్ర ఆ రాష్ట్రంలో ఉగ్రవాద నిర్మూలన జరిగి సుస్థిర ప్రభుత్వం ఏర్పడింది. అలాగే మీ ఊరి కరువు కాటకాలు కూడా ఇంతమంది భక్తుల పాదధూళి సోకి తొలగి ఈ ప్రాంతమంతా భగవత్కృపతో పూర్ణమవుతుంది" అని అన్నారు.

4 ఉదయం వేయిగోష్ఠుల భక్తులందించిన కలశాలలోని తులసితో శ్రీనివాసుని అర్చనా కార్యక్రమం వైభవంగా జరిగింది. ఈ కార్యక్రమం రాష్ట్రమంత్రి శ్రీమాన్ డి.కె. అరుణాభరత్ సింహారెడ్డి నేతృత్వంలో, మార్కెట్ యార్డ్ చైర్మన్ శ్రీమాన్ కృష్ణారెడ్డి బృందం సహకారంతో, జిల్లా వి.టి. సభ్యులు, రంగారెడ్డిగారు, వెంకటరెడ్డిగారు, రాజశేఖర్ అడ్వకేట్ గారు, గురుమూర్తి, నారాయణరెడ్డి గార్లు నిర్వహించారు. వీరందరకూ శ్రీస్వామివారు మంగళాశాసనములు కృపజేసారు. శ్రీమతి D.K. అరుణ మొదట నుండి చివరిదాకా ఎంతో శ్రద్ధతో ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**ముక్కోటి ఏకాదశి-రాజమహేంద్రి**

సాయంత్రం గద్వాల్ నుండి బయలుదేరి తెల్లవారేసరికి రాజమహేంద్రి చేరుకున్నారు. 5వ తేదీ ముక్కోటి ఏకాదశి సందర్భంగా 5.30కు గౌతమిఘాట్ మన శ్రీరంగధామంలో ఏర్పాటు చేసిన సప్తప్రాంగణాలతో అలంకరించిన ఉత్తర ద్వారాన్ని దర్శించారు. ముక్కోటి ఏకాదశి వైభవాన్ని వివరించారు శ్రీస్వామివారు. అనంతరం శ్రీస్వామివారు స్వయంగా తీర్థగోష్ఠి జరిపారు.

శ్రీమతి సరోజమ్మగారు మన రంగధామానికి పెరుమాళ్ ఊరేగించడానికి నూతన రథాన్ని సమర్పించారు. శ్రీస్వామివారు దాన్ని ఆరంభించారు. సహస్ర తులసీ శ్రీనివాస కార్యక్రమంలో భాగంగా శ్రీరంగనాథుని నూతన రథంపై అధిరోహింపచేసి రాజమహేంద్రి కోటగుమ్మం సెంటర్‌నుండి వేయి కలశాలతో శ్రీరంగధామం వరకు శోభాయాత్ర జరిగింది.

మధ్యాహ్నం వేదికపై **18వ సహస్ర తులసీ శ్రీనివాసమ్** కార్యక్రమం ఎంతో వైభవంగా జరిగింది. సాయంత్రం ఆలయం ఎదురుగా 'కోటి దీపోత్సవం' కార్యక్రమాన్ని శ్రీస్వామివారు ఆరంభించారు. చీకటి పడగానే కాంతులీనే పడవలో గోదావరి నదిలో రంగనాథుని ప్లవో (తెప్ప)ఉత్సవం జరిపారు. ఉత్సవంలో వేద, ఇతిహాస, పురాణాదుల పారాయణతో పాటు విశేషంగా నృత్య, గీత, వాద్యాదులతో శ్రీరంగనాథునికి సేవలు జరిపారు. ఈ సందర్భంగా గోదావరి నదీమతల్లికి స్వామికి సమర్పించిన తీర్థ ప్రసాదాలను, పట్టు చీర, సుదీర్ఘమైన పూలజడతో విశేషమైన ఆరాధనను సమర్పించారు.

అనంతరం ముక్కోటి ఏకాదశి సందర్భంగా ఆలయంలో 'రాపత్తు' ఉత్సవం శ్రీస్వామివారు ప్రారంభించారు. పై కార్యక్రమాలలో వేలాది భక్తులు పాల్గొని తరించారు.

**శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి పరమపదోత్సవం**

జనవరి 6వ తేది ఉదయం శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి పరమపదోత్సవం సందర్భంగా శ్రీస్వామివారి ఉత్సవమూర్తికి నవకలశ స్నపన జరిపించారు. కార్యక్రమంలో శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి స్మృత్యర్థం వివిధ సంప్రదాయాలలో నిష్ణాతులైన వేద, పురాణ, ఆగమ, జ్యోతిష, పండితులనే కాక లౌకిక విద్యా, వైద్య ప్రముఖులను కూడ సత్కరించారు.

రాజమహేంద్రి శ్రీరంగధామంలో పై కార్యక్రమాలను వైభవంగా నిర్వహించిన స్థానాచార్యులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ రఘునాథ భట్టర్ స్వామి, శ్రీమాన్ డా. రాజారామ్-జెట్ శ్రీమాన్ రామానుజం-వి.టి., శ్రీమతి పద్మావతి, శ్రీ .ఉ.వే. శ్రీమాన్ కృష్ణమాచార్యులు-గీతాభవనం, శ్రీమాన్ రంగప్రసాద్, శ్రీమాన్ గ్రంథి పిచ్చయ్యలను శ్రీస్వామివారు మరిన్ని కార్యక్రమాలను జరిపేట్టుగా మంగళాశాసనాలు కృపజేశారు.

రాత్రికి బయలుదేరి రామంతపూర్ శ్రీమతి సుగుణా శ్రీనివాస్‌గారి గృహానికి చేరుకున్నారు.

7వ తేది ఉదయం సత్యనారాయణస్వామి ఆలయం నుండి శోభాయాత్రగా బయలుదేరి కార్యక్రమవేదికైన లింగారెడ్డి గార్డెన్స్ శ్రీస్వామివారు చేరుకున్నారు. **19వ సహస్ర తులసీ శ్రీనివాసమ్** కార్యక్రమం ఇక్కడ వైభవంగా జరిగింది. కార్యక్రమంలో విశేషించి శ్రీస్వామివార్లతో పాటు శ్రీ వ్రతధరజీయర్ స్వామివారు కూడా అన్వయించారు.

కార్యక్రమాన్ని రామంతపూర్, హబ్సీగూడా డి.డి. కాలనీ వి.టి.లుసంయుక్తంగా నిర్వహించాయి. శ్రీమతి సుగుణా శ్రీనివాస్, శ్రీమతి సుజాత, శ్రీమతి పేరిందేవమ్మ, శ్రీశ్యామసుందరాచార్యులు, శ్రీ తిరుపతాచార్యులు విశేషించి సేవలందించారు.

అనంతరం శ్రీస్వామివారు బ్రాహ్మణసంఘం - హైదరాబాద్ వారి ఆహ్వానంపై ఉప్పల్ గ్రౌండ్స్‌లో జరిగిన కోటి కుంకుమార్చనలో పాల్గొని అనుగ్రహ భాషణం చేశారు.

సుల్తానాబజార్‌లోని శ్రీ వైష్ణవ సత్సంగ్ మండలి-శ్రీలక్ష్మీనృసింహ మందిరం వారి ఆహ్వానం మేరకు చాదర్‌ఘాట్ స్పోర్ట్స్ గ్రౌండ్‌లో అయోధ్య నుండి వచ్చిన శ్రీమాన్ సంత్ శ్రీధరాచార్యస్వామి వారందిస్తున్న ధనుర్మాస ప్రవచన కార్యక్రమంలో పాల్గొని అనుగ్రహ భాషణం కావించారు. కార్యక్రమంలో "ధనుర్మాస-గీతా భజనమాల" "నిత్య నియమ పాఠమాల" అనే రెండు గ్రంథాలను శ్రీస్వామివారు ఆవిష్కరించారు. కార్యక్రమంలో పాల్గొన మార్వాడీ సమాజ్ భక్తబృందానికి శ్రీవారు మంగళాశాసనం కృపచేశారు.

అక్కడి నుండి శ్రీమతి వనజా భాస్కరరావుగారి ఆహ్వానం మేరకు వారి గృహానికి వేంచేసి మాతృవియోగం చెందిన భాస్కరరావుగార్ని పరామర్శించి, తెల్లవారు జామున "మంచిర్యాల" శ్రీమాన్ పి. హనుమంతరావుగారి గృహానికి చేరుకున్నారు.

8వ తేది ఉదయం **మంచిర్యాల** "హిందీ హైస్కూల్ గ్రౌండ్స్"లో శ్రీస్వామివారు తీర్థగోష్ఠిని జరిపి శ్రీనివాసుని వైభవాన్ని కృపజేశారు. అనంతరం టి.టి.డి. కళ్యాణ మండపంలో ప్రజ్ఞ కన్వీనర్ శ్రీమతి మధురాభాయి గారి నేతృత్వంలో ప్రజ్ఞ చిన్నారుల సమావేశంలో పాల్గొన్నారు. ఐ.బి. చౌరస్తా నుండి మంచిర్యాల పురవీధులలో **రెండువేల కలశాలతో** భజన, కోలాటాలతో విశేషంగా శోభాయాత్ర జరిగింది.

సాయంత్రం 5గం॥లనుండి సహస్ర తులసీ శ్రీనివాస కార్యక్రమం జరిపారు. శ్రీమాన్ శాంతారామ్, శ్రీమాన్ వెంకటేశ్వరరావు, శ్రీమతి ఉమ వెంకన్న దంపతులు, శ్రీమాన్ ప్రభాకరరాజు, శ్రీమాన్ రాజేశ్వరరావు, నర్సింగారావు విస్తృతంగా ప్రచారం జరిపి రెండువేల గోష్ఠులను కార్యక్రమంలో పాల్గొనేట్టుగా కృషిచేశారు. వీరికి శ్రీస్వామివారు మంగళా శాసనాలు కృపజేశారు.

జనవరి 9వ తేది శ్రీస్వామివారు **ఆదిలాబాద్** "దండేపల్లి" గ్రామంలో శ్రీమాన్ శ్రీనివాస్‌గారు నిర్వహించిన సామూహిక గోపూజా మహోత్సవంలో పాల్గొన్నారు. కార్యక్రమానికి శ్రీమాన్ అరవింద్‌రెడ్డి MLA, వి.టి. సభ్యులు శ్రీమాన్ శ్యామ్‌సుందర్ తదితరులు పాల్గొన్నారు. సాయంత్రం 7గంటలకు శ్రీస్వామి వారు సిద్దిపేట చేరుకున్నారు. రాత్రి శోభాయాత్రగా కార్యక్రమ వేదిక శివమ్స్-గార్డెన్స్ చేరుకొని భక్తులనిద్దేశించి ప్రవచించారు. శ్రీమాన్ హరీశ్‌రావు MLA ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

10వ తేది సిద్దిపేట ధనుర్మాసోత్సవంలో భాగంగా "శ్రీ

గోదారంగనాథుల కళ్యాణ మహోత్సవం జరిగింది. కళ్యాణ ఉత్సవములో 600 దంపతులు, ఉభయదారులుగాను పదిహేనువేలమందికి పైగా భక్తులు పాల్గొన్నారు. కార్యక్రమ వైభవానికి కృషిచేసిన శౌరిరాజు పెరుమాళ్, కృష్ణమాచార్య, శ్రీమాన్ రామాచార్యులు, శ్రీమాన్ కూరా పండరినాథ్ వారి బృందానికి శ్రీస్వామివారు ప్రత్యేకించి మంగళాశాసనం కృపచేశారు.

11వ తేది ఉదయం 10గం.లకు "విజయవాడ" – బందర్ రోడ్డులోని "కన్వెన్షన్ హాల్"లో "కూడారై ఉత్సవం, శ్రీ గోదారంగనాథుల కళ్యాణ ఉత్సవము"లు దివ్యంగా జరిగాయి. ఈ కార్యక్రమాన్ని శ్రీమతి తులసమ్మ దంపతులు 'ఉభయ దారులుగా పాల్గొన్నారు. కార్యక్రమంలో శ్రీమాన్ గోకరాజు గంగరాజు దంపతులు, శ్రీమాన్ సిరీస్‌రాజుగారు పాల్గొన్నారు. విజయవాడ వి.టి. సభ్యులు విశేష సేవలందించారు. కార్యక్రమాన్ని చక్కగా సమన్వయం చేసిన శ్రీమాన్‌పురాణం వేంకటాచార్యులు– రామానుజవాణి అధినేతను శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు. ఆ రాత్రి వినుకొండ వి.టి. కన్వీనర్ శ్రీమతి మల్లికా ప్రసాదరావుగారి గృహానికి వేంచేశారు.

12వ తేది 10గం.లకు "వినుకొండ" – మార్కెట్‌యార్డ్‌లో వైభవంగా "శ్రీ గోదారంగనాథుల కళ్యాణ మహోత్సవం" జరిగింది. ఈ కార్యక్రమంలో విశేషంగా భక్తులు పాల్గొన్నారు. కార్యక్రమ నిర్వాహకులు మల్లికా ప్రసాదరావుగారు, ఇతర వి.టి. సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.

అక్కడి నుండి బయలుదేరి పిడుగురాళ్ళలోని ABC స్కూల్ వారి ఆహ్వానం మేరకు స్కూల్ వార్షికోత్సవ సందర్భంగా వారి స్కూల్‌లో నూతనంగా "లాంగ్వేజిలాబ్" మరియు స్పీకింగ్ స్కిల్స్ లాబ్"లను శ్రీస్వామివారు ప్రారంభించారు. నిర్వాహకులు శ్రీమాన్ అనంతకృష్ణ అయ్యంగార్ దంపతులకు, విద్యార్థులకు మంగళాశాసనం కృపజేస్తూ విద్యావిలువలను గూర్చి ప్రవచించారు.

రాత్రికి "భీమవరం"లోని శ్రీమతి గోనె నిర్మలా రాజేంద్రకుమార్ IAS గారి గృహానికి విచ్చేశారు.

13 ఉదయం తీర్థగోష్ఠి అనంతరం "శ్రీ గోదారంగనాథుల కళ్యాణ మహోత్సవం" జరుపుకొని శ్రీమతి నిర్మల దంపతులకు మంగళాశాసనాలు కృపజేసి రాత్రికి హైదరాబాద్ – శ్రీరామ నగరం చేరుకున్నారు.

**భోగి - శ్రీగోదా రంగనాథుల కళ్యాణం - శ్రీరామనగర్**

14 ఉదయం 10గం॥ నుండి మన దివ్యసాకేతంలో శ్రీ గోదారంగనాథుల కళ్యాణమహోత్సవం వైభవంగా జరిగింది. శ్రీస్వామివార్లతోపాటు శ్రీశ్రీశ్రీ త్రిదండి వ్రతధర రామానుజ జీయరు స్వామివారు కూడా ఈ ఉత్సవంలో పాల్గొన్నారు. శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేస్తూ "గోదాదేవి శ్రీరంగనాథుని వివాహం చేసుకున్న రోజునే 'భోగి' అంటారు. ఆరాధనలు మనచే అందుకునే అర్చామూర్తిని ఒక విగ్రహంగా భావించక ఆయన సాక్షాత్తు భగవంతుడే అని విశ్వసించి మానవజాతికి మార్గదర్శకురాలైనది మన గోదమ్మ. వేదసారము తిరుప్పావై ప్రబంధము. అంతటి వైభవము కల పాశురములను ఎవరు చదువుతారో ఆ ప్రాంతమంతా ఏ కరువూ లేకుండా సుభిక్షంగా ఉంటుంది. సకల శుభాలను పొందవచ్చునని" అనుగ్రహించారు.

సాయంకాలం దివ్యసాకేతంలో అధ్యయనోత్సవాలలో చివరిరోజు నమ్మాళ్వారుల పరమపదోత్సవాన్ని వైభవంగా జరిపారు. శ్రీస్వామివారు, ఆళ్వార్ అంటే రక్షకులని, భగవద్భక్తిలో మునిగి తేలినవారని, వారు అనుగ్రహించిన ప్రబంధాల గొప్పతనాన్ని వివరించి, నమ్మాళ్వార్లకు భగవంతుడు పరమపదాన్ని ఎలా అనుగ్రహించారో, మరల సంసారులను ఉద్ధరించడానికి తామ్రపర్ణీ నది నుండి అర్చామూర్తిగా ఆళ్వార్లు ఎలా వేంచేసారో భక్తులకు అనుగ్రహించారు.

15వతేదీ ఉదయం ధర్మలోచన, ధార్మిక సదస్సుకు విచ్చేసిన స్వామీజీలతో శ్రీస్వామివారు సత్సంగాన్ని నిర్వహించారు. అనంతరం సాకేతంలో అధ్యయనోత్సవాలలో భాగంగ జరిగిన వేదపురాణేతిహాస ప్రబంధ పారాయణల ముగింపు "శాత్తుముఱై"లో పాల్గొన్నారు.

17వతేదీ **20వ సహస్రతులసీ శ్రీనివాసమ్** కార్యక్రమ నిమిత్తం రాత్రికి "నల్గొండ" రామగిరి శ్రీసీతారామచంద్రస్వామి సన్నిధికి చేరారు.

18 ఉదయం రామగిరి క్షేత్రంలో పెరుమాళ్ళను సేవించి, నాగార్జున డిగ్రీకళాశాల గ్రౌండ్స్‌లో ధార్మిక సదస్సు నిర్వహించారు. పలు ప్రాంతాలనుండి విచ్చేసిన భక్తులు ఉత్సాహంతో శరణాగతిగోష్ఠి వలన తమకు కలిగిన అనుభవాలను అందరితో పంచుకున్నారు.

ఉన్నతకళాశాలలో చదివే ఒక యువతి మాట్లాడుతూ "నేను పూజలు చేయడం చాల తక్కువ. మా ఇంట్లో మా నాయనమ్మ కలశపూజ అంటూ మా చుట్టుప్రక్కల వారిని పిలిచింది. ఆరోజు శరణాగతి సాధన సామగ్రి పుస్తకం ఇచ్చి నన్ను ఒక కథ చదవమంది. "కుమ్మరి భీముడు" అనే కథ చదివాను. నాకు చాలా బాగా నచ్చింది. దాంతో మిగతా కథలను చదువుతూ నేను కూడా ఈ దీక్షను కొనసాగించా" అని తన అనుభవాన్ని ప్రకటించింది. ఇలా ఎందరో భక్తులు తమ అనుభవాలను శ్రీవారికి విన్నపం చేసారు.

మధ్యాహ్నం నల్గొండలోని టి.టి.డి కళ్యాణమండపం నుండి నాగార్జున డిగ్రీకళాశాలవరకు జరిగే శోభాయాత్రలో శ్రీస్వామివారు

పాల్గొన్నారు. ఈ శోభాయాత్రలో విశేషించి చుట్టుప్రక్కల గ్రామాలనుండి కోలాట బృందాలు విరివిగా పాల్గొన్నాయి. చిన్నారులు వేషధారణలో నాట్యములు చేస్తూ శ్రీవారికి స్వాగతాన్ని పలికారు. రాత్రి గం.7నుండి వేదికపై శ్రీస్వామివారి అనుగ్రహ భాషణం చేస్తూ శరణాగతి వైభవాన్ని వివరించారు.

19వ తేదీ ఉ॥ వేదికపై సహస్రతులసీ శ్రీనివాస పూజా కార్యక్రమం జరిపి, కార్యక్రమానికి తమ ప్రోత్సాహాన్ని అందించిన మాజీ మంత్రివర్యులు శ్రీమాన్ కోమటిరెడ్డి వెంకటరెడ్డిగారి కుటుంబసభ్యులకు మంగళాశాసనం చేసారు.

నల్గొండ వి.టి అధ్యక్షుడు శ్రీమాన్ రంగారావు, విటి సెక్రటరీ శ్రీమాన్ ఈశ్వర్‌రెడ్డి, శ్రీమాన్ విద్యాసాగర్‌రెడ్డి, శ్రీమాన్ చకిలం వేణుగోపాల్‌రావు, శ్రీమాన్ శ్రీనివాస్‌రెడ్డి విశేషకృషి చేసారు. శ్రీమాన్ ఎన్.సిహెచ్.వేణుగోపాలాచార్యులు (సూర్యాపేట) తమ సూచనలు అందించారు. ఈ కార్యక్రమంలో డి.సి.సి. అధ్యక్షులు శ్రీమాన్ టి. దేవేంద్రరెడ్డి దంపతులు, శ్రీమాన్ మోహన్‌రెడ్డి, M.P. శ్రీమాన్ సురేంద్రరెడ్డి పాల్గొన్నారు. వీరందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనములు కృపచేసి, రాత్రికి ఖమ్మంలోని శ్రీమాన్ సాంబశివరావు గృహంలో బసచేసారు.

**16వ గోపాలోపాయనం - ఖమ్మం**

20వ తేదీ ఉదయం మన శ్రీస్వామివారికి ఆచార్యులైన (న్యాయవేదాంతవిద్వాన్) 'వైకుంఠవాసులు, ప్రాతఃస్మరణీయులు శ్రీఉ.వే శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామి"వారి తిరునక్షత్ర సందర్భంగ వారి స్మృత్యర్థం స్వర్ణభారతి కళ్యాణ మండపములో 16వ గోపాలోపాయన పురస్కార మహోత్సవం జరిగింది.

ఈ సంవత్సరం ఉభయవేదాంతాలకు ప్రతీకగా ఇరువురు సుప్రసిద్ధ ఉభయవేదాన్త విద్వాంసులకు పురస్కారాన్ని అందించడం విశేషం.

"బాపట్ల వాస్తవ్యులు **శ్రీ ఉ.వే. శ్రీమాన్ కొమాండూరి ఇళయవిల్లి తిరువేంకటరామానుజాచార్యస్వామి** వారికి, ఖమ్మం వాస్తవ్యులు **శ్రీమాన్ పులఖండం రమేష్ దంపతులు** తమ కైంకర్యాన్ని సమర్పించారు." పురస్కారానికి కైంకర్యం సమర్పించిన శ్రీమాన్ పులఖండం రమేష్ దంపతులకు, శ్రీమాన్ కొల్లా నాగేశ్వరరావు దంపతులకు, ప్రోత్సాహకుడైన శ్రీమాన్ ఆదినారాయణ దంపతులకు శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.

మన శ్రీపెద్దజీయర్‌స్వామివారి అనుగ్రహంతో తమ చిన్న వయస్సులోనే శ్రీగోపాలాచార్యస్వామివారిని ఆశ్రయించి 12 సం॥రాలకు పైగా ఉభయవేదాన్తాలను, సాహిత్యగ్రంథాలను, వాద గ్రంథాలను అధ్యయనం చేసి, అతి చిన్న ప్రాయంలోనే పండితుల ప్రశంసలు అందుకున్న "నేపాల్ వాస్తవ్యులు **శ్రీఉ.వే.శ్రీమాన్ కృష్ణమాచార్య స్వామి**వారికి, మధిర గ్రామవాస్తవ్యులు **శ్రీమాన్ కొల్లా నాగేశ్వరరావు దంపతులు** తమ కైంకర్యాన్ని సమర్పించారు."

శ్రీశ్రీశ్రీ స్వామివారు ఇరువురు పండితులకు "గోపాలోపాయన పురస్కారాన్ని" అందించారు.

ఈసందర్భంగా శ్రీస్వామివారు ప్రసంగిస్తూ. "ఈ సంవత్సరం మనం అందించే పురస్కారం చాల విలక్షణమైనది. శ్రీగోపాలాచార్యస్వామివారి శిష్యులలో చివరివారు, వారి అభిమాన పుత్రతుల్యులు మన నేపాల్ శ్రీకృష్ణమాచార్యస్వామి.

ఆచార్యులవద్ద చిన్ననాటినుండి చక్కని సేవలు చేసి, వారి ఆశయానికి అనుగుణంగ అయోధ్య, నేపాల్ ప్రాంతాలలోని ఆస్తికులైనవారందరికి విద్యను బోధిస్తున్నారు. బృందావనంలోని రంగమందిర నిర్వాహకులుశ్రీమాన్ బాలక్ స్వామికూడా తమ కుమారుని మన శ్రీకృష్ణమాచార్యస్వామి వద్దకు అధ్యయనానికి పంపించారంటే, వీరిపై మన శ్రీగోపాలాచార్యస్వామి కృపాదృష్టి ఎంత ఉందో మనకు అర్థమవుతుంది.

అలాగే, శ్రీ ఉ.వే.శ్రీమాన్ కొమాండూరి ఇళయవిల్లి తిరువేంకట రామానుజాచార్య స్వామివారు పూర్వం నుండి మన ఉభయవేదాంత సభలలో అన్వయించేవారు. ఈ వయస్సులో కూడా తమ కుమారులు శ్రీమాన్ స్థలశాయికీ, శ్రీమాన్ మురళీ కృష్ణమాచార్యులకు ఉభయవేదాంతములను అనుగ్రహిస్తున్న మహనీయులు అని కొనియాడారు.

ఈసందర్భంగ ఉభయవేదాన్తపీఠాధ్యక్షులు శ్రీఉ.వే. శ్రీమాన్ డా॥సముద్రాల వేంకట రంగరామానుజాచార్య స్వామివారు ఇరువురి పండితుల విద్యావైభవాలను సభకు పరిచయం చేసారు.

విజయవాడ వాస్తవ్యులు, విశిష్టాద్వైత సంఘ అధ్యక్షులు శ్రీఉ.వే.శ్రీమాన్ టి. ఉదయవర్లు స్వామి తమ ఆనందాన్ని వ్యక్తపరుస్తూ... శ్రీకృష్ణమాచార్యస్వామితో వారికున్న మధురస్మృతులను తెలియజేసారు.

భద్రాచల వాస్తవ్యులు అథర్వవేద పండితులు శ్రీమాన్ మురళీకృష్ణమాచార్యులు మాట్లాడుతూ "శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు స్వామివారు స్థాపించిన 'శ్రీమన్నారాయణ వేదవేదాంగ పాఠశాల'లో మొట్టమొదటి విద్యార్థిని. ఆ సమయంలోనే శ్రీమాన్ నేపాల్ శ్రీకృష్ణమాచార్యస్వామివారు విద్యార్థిగా వచ్చారు. చాలా స్నేహంగా ఉండేవారము.

ఆశ్రమంలో ఎప్పుడూ అమరకోశాన్ని, స్తోత్రాలను వల్లిస్తూనే ఉండేవారు శ్రీకృష్ణమాచార్యులు. శ్రీ గోపాలాచార్య స్వామి అనుగ్రహ పాత్రులు. అటువంటి మా మిత్రునికి జరిగే సమ్మానం మాకు ఆనందాన్ని కల్గిస్తోంది."

అంతేకాక మరొక మిత్రులు శ్రీమాన్ స్థలశాయి. వీరి నాన్నగారు మాకు శ్రీభాష్యాన్ని అనుగ్రహిస్తున్నారు. ఇక్కడ ఒక మిత్రునికి సమ్మానం. అలాగే మరొక మిత్రుని తండ్రి, మాకు గ్రంథాచార్యులు అయిన వారికీ సమ్మానం. ఇలా ఇరువురికి జరిగే ఈ పురస్కారం చాలా విశేషమని వివరించారు.

పురస్కారగ్రహీత శ్రీ.ఉ.వే. శ్రీమాన్ ఇళయవిల్లి తిరువేంకట రామానుజాచార్య స్వామి తమ ఆనందాన్ని వ్యక్తపరుస్తూ పురస్కారానికి, సమ్మానానికి తేడా వివరించారు.

"గోపాల" అనే పదంలో 'గో'శబ్దానికి భూమి, వేదము, గోవు అని ఇలా అనేక అర్థాలను వివరించారు.

భూమిని పాలించువాడు అనగా ఉద్ధరించువాడు – వరాహస్వామి అని, వేదాన్ని పాలించుట, రక్షించినవాడు – హయగ్రీవుడు అని గోవును పాలించినవాడు – గోవిన్దుడు అని గోపాల అనే పదానికి అర్థాన్ని చెప్పి ఉపాయనములో 'ఉప' అంటే – సమీపము అనగా భగవంతునిముందు ఉంచే పురస్కారము. ఈ "గోపాలోపాయన"మని వివరించారు. వయోభారం చేత గాత్ర సౌకర్యం లేకపోయినా ఆశ్రయించిన వారికి ఏమైనా చెప్పాలనే వారి ఉత్సాహం అందరిని ఆశ్చర్య చకితులను చేసింది.

అనంతరం పురస్కార గ్రహీత శ్రీమాన్ నేపాల్ కృష్ణమాచార్యస్వామివారు ప్రవచనం చేస్తూ చిన్నతనంలోనే తిరుపతి ఆలయాన్ని దర్శించటానికి వెళ్ళినపుడు శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామిని సేవించాను. శ్రీస్వామివారి అవ్యాజమైన కృప నాపై ప్రసరించి మంత్రోపదేశాన్ని అనుగ్రహించారు. శ్రీస్వామివారి ఆదేశంతో మా పెద్దలు నన్ను వారి వద్దనే వదిలి వెళ్ళిపోయారు. మన చిన్న జీయర్‌స్వామివారు పూర్వాశ్రమంలో శ్రీ పెద్ద స్వామివారి వద్ద సేవ చేసేవారు. శ్రీస్వామివారు మన స్వామికి నన్ను అప్పగించి నడిగడ్డపాలెం తీసుకువెళ్ళమన్నారు. అలా నన్ను శ్రీగోపాలాచార్యస్వామి వద్దకు తీసుకువెళ్ళి తెలుగురాని నాకు హిందీలో మాట్లాడుతూ ధైర్యాన్ని ఇచ్చారు మన స్వామివారు. నాకు ఎన్నో సూచనలు అందించిన శ్రీమాన్ జి. వేణుగోపాలస్వామి, ఉత్పల నరసింహాచార్యులు, మా మిత్రులు మురళీ, రామానుజవాణి అధినేత వేంకటాచార్యులు గారు. అలానే టి. ఉదయవర్‌స్వామివారు అందించిన సౌహార్దాన్ని స్మరించారు. శ్రీ గోపాలాచార్యస్వామివారు నన్ను జ్ఞానపుత్రుడు అని భావించి ఎంతో ఔదార్యాన్ని చూపుతూ విద్యతోపాటు ఎన్నో రకాల భౌతిక లాభాలను కూడా చేకూర్చారు. గురుదక్షిణగా ఏమైనా సమర్పిస్తే నాకు నువ్వు డబ్బు ఇచ్చేవాడివా, నిజంగా నాకు దక్షిణ ఇవ్వాలంటే నీకు చెప్పిన విద్యను పదిమందికి అందించు అన్నారు. అంతటి గొప్ప ఆచార్యులు నాకు లభించారని గొప్ప గర్వం నాకు ఉంది" అంటూ ఆచార్యులను, పాఠశాలను శ్లాఘించారు. అనంతరం శ్రీస్వామివార్ల మంగళాశాసనము, కృతజ్ఞతావిష్కరణ, విచ్చేసిన పండితుల సత్కారంతో ఉదయపు కార్యక్రమం ముగిసింది.

మధ్యాహ్నం గం.4.00ల నుండి జరిగే శోభాయాత్రలో శ్రీస్వామివారు అన్వయించారు. సా॥ గం.6.00లకు స్వర్ణభారతి కళామండపంలో సహస్ర తులసీ శ్రీనివాస పూజాకార్యక్రమాన్ని శ్రీవారు నిర్వహించారు. కార్యక్రమ నిర్వాహకులు మన జెట్ సంస్థల ప్రధాన సలహాదారు శ్రీమాన్ ఇ. రామారావు నేతృత్వంలో, ఖమ్మం వికాసతరంగిణి శ్రీమాన్ లక్ష్మణరావు, శ్రీమాన్ పోలా శ్రీనివాస్‌లు చక్కగా నిర్వహించి ఆచార్యుల మంగళాశాసనం పొందారు. శ్రీమాన్ లోకేశ్వరరావు నేతృత్వంలో సత్తుపల్లి మండలంలోని కోలాట బృందాలు ఈ కార్యక్రమంలో పాల్గొని యాత్రకు శోభను కల్గించాయి.

21వ తేది ఉదయం గోష్ఠి అనంతరం శ్రీమాన్ జ్వాలా నరసింహంగారి ఆహ్వానంపై ఖమ్మం జిల్లా 'ముత్తారం' గ్రామంలోని 400ల సంవత్సరాల క్రితం నాటి శ్రీసీతారామ చంద్రస్వామిని దర్శించి, రాత్రికి హైదరాబాద్ మన జీవా చైర్మన్ శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారి గృహంలో బస చేశారు.

22వ తేది ఉదయం శ్రీమాన్ రామేశ్వరరావుగారి గృహంలో శ్రీ సుదర్శన హోమ పూర్ణాహుతిలో పాల్గొని, సామూహిక శ్రీ సుదర్శన పూజా కార్యక్రమాన్ని నిర్వహించారు.

23వ తేది శ్రీమాన్ జె. రామేశ్వరరావు దంపతులు శ్రీవారి మంగళాశాసనములతో 6 1/2 సంవత్సరాల నుండి ప్రతిరోజూ వారి గృహంలో అవిచ్ఛిన్నంగా సాగుతున్న శ్రీ సుదర్శన హవన కార్యక్రమ మహాపూర్ణాహుతి శ్రీస్వామివారు జరిపించారు. ఆ సందర్భంగా డా॥ శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఎస్.వి. రంగరామానుజా చార్యస్వామివారు, శ్రీ. ఉ.వే. శ్రీమాన్ నేపాల్ కృష్ణమాచార్య స్వామి, శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు అనుగ్రహ భాషణం చేస్తూ... రామేశ్వరరావుగారి ధర్మనిరతి, ఆచార్యనిష్ఠను కొనియాడారు. శ్రీస్వామివారు ప్రవచిస్తూ... ఆరోగ్యం కావాలనుకున్నవారు సూర్యుని, జ్ఞానం కావాలను కున్నవారు ఈశ్వరుణ్ణి ఆశ్రయిస్తారు. ఇలా ఒక్కొక్కరిని ఆశ్రయించడం కన్నా, ఏ ఒకరిని ఆశ్రయిస్తే అన్ని లాభాలు ఎలా కలుగుతాయో మా రామేశ్వరరావుగారికి బాగా తెలిసింది. ''శ్రియమిచ్ఛేత్ హుతాశనాత్" అన్నట్లు అగ్నిని ఉపాసిస్తే సంపదలు లభిస్తాయని అగ్ని ఆరాధన ప్రారంభించారు.

అయితే సంపద అంటే కేవలం మనం చూసే కాసులే కాదు. ఆరోగ్యం, విద్య, మంచిబుద్ధి, మంచిమాట ఇలా ఎన్నో. వీటన్నింటిని ''సంపద'' అనే అంటారు. అందుకే మన రామేశ్వరరావుగారు సుదర్శన హోమం ఆరంభించిన దగ్గర నుండి ఎంతెంతో అభ్యున్నతిని సంప్రదాయ శ్రద్ధ, వినయ విధేయతలు ఏమాత్రం తగ్గలేదు. ఇవే వారిని ప్రశంశాపాత్రులగ తీర్చిదిద్దాయి.

సామాన్యంగా కోటీశ్వరుల పిల్లలకు అనేక వ్యసనాలు

రావడం గమనిస్తాం. కానీ, వీరి పిల్లలు 4గురు ఆణిముత్యాలు. కాఫీ, టీ లాంటి అలవాటైనా లేదు. దానికి తగ్గట్టు రామేశ్వరరావు గారికి మంచికోడళ్ళు వచ్చారు. చక్కటి శ్రద్ధ, భక్తి కలిగినవారు. ఇదీ నిజమైన సంపద.

వీరికి భగవంతుని పట్ల ఉన్న విశ్వాసం, కార్యదక్షత, నిజాయితీ ఇవన్నీ వీరి ఎదుగుదలకు కారణము. ప్రతీరోజూ కనీసం కొంతసేపైనా కుటుంబంలో అందరూ కలిసి సత్సంగం చేయడం అవసరం" అంటూ మార్గనిర్దేశాన్ని కటాక్షించారు.

23వ తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం సీతానగరం బయలుదేరి మార్గమధ్యంలో అపోలో హాస్పిటల్‌చైర్మన్ శ్రీమాన్ పి.సి. రెడ్డి వీరి ధర్మపత్ని శ్రీమతి సుచరితారెడ్డిగార్లను వైద్యాలయంలో పలకరించి రాత్రికి సీతానగరం చేరారు.

25వ తేదీ సీతానగరం నుండి బయలుదేరి శ్రీమాన్ గంగరాజుగారి ఆహ్వానంమేరకు వారి గృహానికి విచ్చేసారు.

26వ తేదీ 22వ సహస్రతులసీ శ్రీనివాసకార్యక్రమం విజయవాడ బృందావన్‌గార్డెన్స్‌లోని ఎ-కన్వెన్షన్ సెంటర్ హాలులో ఏర్పాటుచేసారు. శ్రీస్వామివారు గణతంత్రదినోత్సవ సందర్భంగా పతాకావిష్కరణ జరిపారు. అనంతరం శ్రీవారు స్వయంగా తీర్థగోష్ఠిని అనుగ్రహించారు.

ఉ॥10గం॥నుండి ధార్మికసదస్సులో భాగంగా ప్రతి సంవత్సరం మనం జరుపుకునే ఉభయవేదాన్త పండితసభను నిర్వహించారు. ఈసారి దివ్యప్రబంధములోని విషయములపై ఉపన్యాసము కాకుండా, శ్రీఅనంతాళ్వాన్ రచించిన శ్రీవేంకటేశ ఇతిహాసమాల ఆధారంగా తిరుమల చరిత్ర వైభవాలపై పండితులు ప్రవచనం చేసారు.

శ్రీవేంటాద్రివైభవం, స్వామిపుష్కరిణి ప్రాశస్త్యము, రామానుజుల ఆచార్యత్వం, అనంతాచార్యుల వైభవం, తిరుమలనంబి నిష్ఠ, శ్రీనివాసుని ఊర్ధ్వపుండ్ర నిర్ణయము, శ్రీనివాసుని సాక్షాత్కరించుకున్న దేవతల గురించి పండితులు విశేషంగా తెలియచేసారు.

ఈ సందర్భంగా శ్రీస్వామివారు ప్రవచనం చేస్తూ... "శ్రీనివాసుడు వేంచేసి ఉన్న పర్వతానికి వేంగడమని పేరు. ఈ పర్వత సంబంధమే శ్రీనివాసుని, వేంకటేశ్వరుడని పిలుస్తారు. "వేంగడం" అనే పదాన్ని మన నమ్మాళ్వార్లు అనుభవిస్తే తప్ప తీరని ఋణాలవంటి పాపాలను నశింపచేసి అనుగ్రహించు వాడని, అటువంటి స్వామిని 'వేండంగళ్' అనే పాశురంలో అనుగ్రహించారు" అని చెప్పారు.

అనంతరం ప్రజ్ఞ తరగతులలో శిక్షణ పొంది, వ్యాసరచన, వక్తృత్వంలాంటి పోటీలలో ఉత్తీర్ణులైన 70 పాఠశాలలనుండి వచ్చిన విద్యార్థులకు శ్రీవారు జ్ఞాపికలను అందించారు. కార్యక్రమాన్ని నిర్వహించిన కృష్ణాజిల్లా ప్రజ్ఞ కన్వీనర్ శ్రీమతి వేంకటరామమ్మకు మంగళాశాసనం చేసారు.

మధ్యాహ్నం 4గం॥లకు పడమట శ్రీవేంకటేశ్వరస్వామి కోవెలనుండి ఏ-కన్వెన్షన్ హాలువరకు శోభాయాత్ర వైభవంగా జరిగింది. ఐడియల్ పబ్లిక్‌స్కూల్ విద్యార్థులు ప్రదర్శించిన నాటకం అందరిని అలరించింది. దీనిని కూర్చిన శ్రీమతి సీతామహాలక్ష్మిగారిని శ్రీవారు ప్రశంసించారు.

అనంతరం సెంట్రల్ విటి సెక్రటరీ శ్రీమాన్ భవానీ ప్రసాద్, జెట్ చైర్మెన్ శ్రీమాన్ గంగరాజు సభలో ప్రసంగించారు. శ్రీస్వామివారు అనుగ్రహభాషణంతో ఆనాటి కార్యక్రమం ముగిసింది.

27వ తేదీ ఉదయం వేదికపై తీర్థగోష్ఠి అనంంతరం సహస్రతులసీ శ్రీనివాస పూజాకార్యక్రమం వైభవంగ జరిగింది. కార్యక్రమ ప్రోత్సాహకులైన శ్రీమాన్ లైలా గంగరాజు దంపతులకు, కృష్ణాజిల్లా వికాసతరంగిణి శ్రీమాన్ రాఘవన్, శ్రీమతి సీతామహాలక్ష్మి, శ్రీదుర్గ, శ్రీమాన్ రంగారావు, శ్రీమాన్ నల్లూరి కృష్ణ, శ్రీమాన్ చక్రధర్, శ్రీమాన్ శశిధర్ తదితర విటిసభ్యులకు శ్రీవారు మంగళాశాసనం చేసారు. ప్రత్యేకించి శోభాయాత్రలో మన శ్రీపెద్దజీయర్‌స్వామివారి వైభవాన్ని, మన శ్రీస్వామివారు చేసే సేవాకార్యక్రమాలను 3 బస్సులపై చిత్రరూపాలతో (ఫ్లక్స్ బ్యానర్స్) అలంకరించిన శ్రీమాన్ మాధవీ రవీందర్ దంపతులకు మంగళాశాసనం చేసారు.

అక్కడ నుండి ముత్యాలంపాడు కోదండరామాలయం దర్శించి అక్కడ ఆలయ జీర్ణోద్ధరణకై తగు సూచనలు అందించి, ఆప్రక్కనగల శ్రీపట్టాభిరామాలయాన్ని సేవించి సీతానగరం చేరుకున్నారు.

## చర్లపల్లి జైలులో శ్రీవేంకటేశ శరణాగతిదీక్ష

డిసెంబర్ 15 తేదీనుండి 100 ఖైదీలు నెలరోజులపాటు ప్రతిరోజూ భజనలతో, అఖండ దీపారాధనతో దాతల కైంకర్యములతో ప్రసాదవితరణ మరియు ప్రముఖగాయకులు శ్రీమాన్ బాలసుబ్రమణ్యం, శ్రీమతి కొండవీటి జ్యోతిర్మయి, రేడియో జాకి వేణుశ్రవణ్ తదితరులతో ఉ॥నుండి సా॥వరకు భక్తిగీతాలతో జైలుప్రాంగణం తరించింది. ఈ నెలరోజులూ సాత్వికాహారాన్ని మాత్రమే స్వీకరించడం చాలావిశేషం. ఈ కార్యక్రమానికి జైలు సూపరెండెంట్ శ్రీమాన్ శ్రీనివాసన్, డిప్యూటి సూపరెండెంట్ శ్రీమాన్ రాజమహేశ్, జైలర్ శ్రీమాన్ కృష్ణమూర్తి చక్కటి వసతులు కల్పించారు. ప్రారంభంనుండి విరమణ కార్యక్రమాన్ని శ్రీమాన్ సుకుమార్‌స్వామి నిర్వహించారు. వికాసతరంగిణి సభ్యురాలు శ్రీమతి వనజాభాస్కరరావుగారు ఆర్థికంగా మరియు అన్ని సదుపాయాలు సమకూర్చారు. శ్రీస్వామివారి మంగళాశీస్సులతో ఈ దీక్షాకార్యక్రమం సుసంపన్నమైంది.



శ్రీమతే రామానుజాయ నమః





పరమహంస పరివ్రాజకులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములతో...

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో....

నడిగడ్డపాలెం-శ్రీ వాసుదాసాశ్రమంలో వేంచేసియున్న

# శ్రీలక్ష్మీనారాయణ - శ్రీ కోదండ రామస్వామివార్ల పుష్కర బ్రహ్మోత్సవములు

## ది. 02-03-2012 నుండి 09-03-2012 వరకు

## విశేష కార్యక్రమములు

| తేది | వారము | ఉదయపు ఇష్టి | | ఉదయపు వాహనసేవ | రాత్రి వాహనసేవ |
|---|---|---|---|---|---|
| మార్చి | 1 గురు | ఉత్సవారంభ అభిషేకం | | విష్వక్సేనపూజ | అంకురార్పణ |
| " | 2 శుక్ర | అగ్నిమధనం, ప్రతిష్ఠ | | దేవతారోహణం, భేరితాడనం | |
| | | సంతానం కోరివారికి | - పుత్రకామేష్టి | ధ్వజారోహణము | శేషవాహనము |
| " | 3 శని | సర్వాభిష్టి కొరకు | - శ్రీ వేంకటేశ్వరేష్టి | సూర్యప్రభ | చంద్రప్రభ |
| " | 4 ఆది | విద్యాభివృద్ధికై | - హయగ్రీవ ఇష్టి | సింహ | హంస |
| " | 5 సోమ | ఆరోగ్యం కొరకు | - సుదర్శన ఇష్టి | కల్పవృక్ష | హనుమంత |
| " | 6 మంగళ | దుష్టగ్రహ శక్తుల పీడ నివృత్తికై | - నారసింహ ఇష్టి | మోహిని, పల్లకిసేవ | గరుడవాహనసేవ |
| " | 7 బుధ | ఐశ్వర్య మోక్షప్రాప్తికై | - శ్రీలక్ష్మీనారాయణ ఇష్టి | కళ్యాణోత్సవం, అశ్వవాహనసేవ | గజవాహనసేవ, దోపిడీఉత్సవం |
| " | 8 గురు | రథోత్సవం, | మహాపూర్ణాహుతి, అభిషేకం | ద్వాదశారాధన, సప్తావరణ ప్రదక్షిణం, | ధ్వజారోహణం |
| " | 9 శుక్ర | శ్రీ లక్ష్మీహవనం | 108 కలశములతో క్షీరాభిషేకం | | శ్రీ లక్ష్మీనారాయణ కళ్యాణం |
| | | | 1008 మంది భక్తులతో సమష్టి మల్లెల పుష్పార్చన | | గోష్ఠి, ఋత్విక్ సన్మానం |

## ఈ ఉత్సవములలో భాగస్వామ్యము పొందు కైంకర్య వివరములు

| | |
|---|---|
| ఒకరోజు పూర్తి యాజమాన్యం (ఇష్టితో) | రూ. 10,000/- |
| ఒకరోజు బ్రహ్మోత్సవం, వాహనసేవ యాజమాన్యమునకు | రూ. 3,000/- |
| ఒకరోజు ఇష్టి కార్యక్రమమునకు | రూ. 2,500/- |
| ఒకరోజు ఊయలసేవ | రూ. 1,500/- |
| శ్రీ ఆంజనేయ స్వామివారి ఆకుపూజ, వడమాల (3వ తేది, 6వ తేది మాత్రమే) | రూ. 1,000/- |
| కళ్యాణ మహోత్సవమునకు | రూ. 500/- |
| ఒకరోజు సమష్టి లక్ష్మీ మల్లెపుష్ప సహస్ర నామార్చన | రూ. 150/- |
| దీపోత్సవంలో భాగంగా ఒక దీపమునకు | రూ. 5/- |

కావున పవిత్రమైన ఉత్సవములలో జరుగు కార్యక్రమములో వివిధ కైంకర్యముల ద్వారా పాల్గొని మన మనోభీష్టాన్ని నెరవేర్చుకొనుటయే కాకుండా లక్ష్మీ నారాయణుల అనుగ్రహాన్ని - ఆచార్య కటాక్షాన్ని పొందుదాం!

వివరములకు :

ఉభయ వేదాంతాచార్యపీఠం, శ్రీవాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం, గుంటూరుజిల్లా - 522 318.

ఫోన్ (08644) 276522, 08645 272929; సెల్: 94410 65582, 98663 99790, 98497 41537.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన అక్టోబరు నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. సాధనాభాసలు అనగా............. | |
| 2. పురాణపురుషుడు నేటికీ వేంచేసి ఉన్న స్థలం | |
| 3. ఊర్మిళ జనకునికి.............. | |
| 4. భరతుని అసలు పేరు......... | |
| 5. పరమేష్ఠీ అనగా...... | |
| 6. అణిలంగళ్ సేవతో ఈ జాతీయం ఏర్పడింది | |
| 7. స్వయంప్రభ ఉన్న స్వర్ణమయవనం.........చెందినది. | |
| 8. అవశ్యం క్రియమాణస్య..................... | |
| 9. బుద్ధికి బృహస్పతే................... వాదానికి ఆద్యుడు. | |
| 10. లోకాయతులకివి మాత్రమే పురుషార్థాలు........, ...... అర్థము, | |
| 11. అక్షరమనగా......... | |
| 12. రాక్షసదంపతులకి స్వర్గం కలిగించినది...... | |
| 13. ఆళ్వారుల శ్రీసూక్తులే గోదాతల్లికి.......... | |
| 14. నెమలిపురివిప్పి ఆడేందుకు తోడ్పడే రాగం...... | |
| 15. మాఘమాసంలో.............ఉపాసన చేస్తారు. | |

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్టు పంపగలరు.
భక్తినివేదన శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీ ఖరనామ సంవత్సరం ఫాల్గుణమాసం

## పండుగలు

**మార్చి:**

6. దక్షిణాది కామదహనం
7. ఉత్తరాది కామదహనం
8. హోళికోత్సవము, మదన పూర్ణిమ
9. తిథి ద్వయం, వసంతోత్సవం
12. అవమతిథి, మేళ్ళచెర్వు కళ్యాణ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవారంభం
14. మీన సంక్రమణం
17. ఉత్తరాభాద్ర కార్తె, శ్రీ మేళ్ళచెర్వు శ్రీవారి చక్రస్నానం
18. సర్వేషామేకాదశి
20. మాసశివరాత్రి
22. పిండపితృయజ్ఞము, అమావాస్య
23. తెలుగు సంవత్సరాది శ్రీ నందన నామ సంవత్సర ఉగాది వసంత నవరాత్రారంభం
24. పెరియ పెరుమాళ్ తిరునక్షత్రం
27. మత్స్య జయంతి, లక్ష్మీ పంచమి
28. నంబెరుమాళ్ తిరు
31. స్మార్త శ్రీరామనవమి, రేవతి కార్తె

**ఏప్రియల్**

1. వైష్ణవానాం శ్రీరామనవమి, భద్రాచలాది శ్రీ వైష్ణవ క్షేత్రము లందు శ్రీరామ కళ్యాణోత్సవము, మేల్కోట వైరముడి సేవ, శెల్వపిళ్ళై తిరు॥
2. దివ్యసాకేతంలో వసంతోత్సవారంభం
3. సర్వేషామేకాదశి, వామనద్వాదశి
4. అవమతిథి, అనంగ త్రయోదశి
5. శ్రీరంగనాచ్చియార్ తిరు॥
6. హనుమద్విజయోత్సవం, తిరువరంగత్తముదనార్ తిరు ॥


సంపుటి 64 మార్చి

సంచిక 12 2012


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

**శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు**

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-




D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం



మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org

# శ్రీ'నందన' మంగళ మందారం



ప్రియ భగవద్ బంధువులారా!
శ్రీమతే నారాయణాయ నమః!
అనేక మంగళాశాసనములు!

"నందన" నామ సంవత్సరము మీకందరకు సిరి సంపదలను, సుఖ శాంతులను, నిండుగ భగవద్, భాగవత, ఆచార్య కృపా కైంకర్యములని ప్రసాదించాలని కాలాత్మకుడైన శ్రియఃపతిని ప్రార్థిస్తున్నాం.

ఆనంద కందమయిన భగవంతుని వైపు నడిపేది ఈ "నందన" నామ సంవత్సరము. మనలనందరినీ ఆ ఆనందమయుడి వైపు నడిపేది గూడ కావాలని ప్రార్థన చేద్దాము. మొత్తానికి ఉద్వేగాలు, ఉద్రేకాలు తగ్గించి ప్రశాంత ప్రదంగ, ఆనందవర్ధకంగ ఉండాలి.

భగవంతుడు సర్వవ్యాపి. ఆయన కనిపించుట లేదు. "అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అంటూ వేదపురుషుడు ఈ చరాచర ప్రపంచానికి లోపల దూరి నిలబడుతూనే, దానికి బయట వ్యాపించి తనలో పట్టి పెట్టుకున్నాడని, అందుకే ఆతన్ని "నారాయణ" అని స్పష్టపరిచాడు. మరి, ఇలా వ్యాపించిన వాణ్ణి క్రొత్తగ చేరాలా?

అవును, చేరాలి! భగవంతుడికి సర్వవ్యాపిగ ఉండే ఆ అవ్యక్త రూపంతో పాటూనే అతి సామాన్యులమైన మనలనందరిని అనుగ్రహించదలచి స్వీకరించే సువ్యక్త రూపమూ ఒకటి ఉంది. లోపలా బయటా వ్యాపించినట్లు వేదము వ్యాఖ్యానించిన రూపమును ఎవ్వరూ కనలేరు. చతుర్ముఖ బ్రహ్మ మొదలు మనదాక దర్శించి, ధ్యానించి, సేవించి తరించడానికనే గ్రహించిన రూపము, "యత్ తే రూపం కల్యాణతమం తత్ తే పశ్యామి" అని ఆ వేదము చెప్పిన అద్భుతమైన రూపం "అర్చావతారము".

శ్రీరంగం, తిరుమల, మేల్కోట వంటి దివ్యదేశాలలో, ఆచార్య ప్రత్యేక విభూతులయిన భగవద్రామానుజుల శ్రీసంబంధముతో విరాజిల్లుతూ విశాలవిశ్వాన్ని వికసింపచేస్తూ విరాజిల్లే అర్చావతార నిలయములన్నీ, ఆలయములన్నీ ఆ నారాయణుని సువ్యక్త రూపాన్ని దర్శింపచేసే స్థానములే. ఆళ్వారులు పాడినవి, ఆచార్యులు అభిమానించినవి, దేవతలు మహర్షులు, పూర్వాచార్యులు ప్రార్థించి, ప్రతిష్ఠించి మనకందించినవి, మన మన ఇండ్ల గృహాలలో కొలువైయున్న ఆరాధనలందుకొనే తిరువిగ్రహాలన్నీ ఆ నారాయణుని యొక్క సువ్యక్త రూపాన్ని సాక్షాత్కరింపచేసే అర్చావతారములే.

— 2 —

ఈ కనిపించే అవతారాన్ని, సులభుడై సాక్షాత్కరించే దివ్యావతారాన్ని. మనకు స్వాధీనమై, మనం సేవిస్తే సేవించుకొని, మానితే మారాం చేయక మౌనం వహించి, విశ్వసించిన వారి విషయంలోనైతే వింత వింత వినోదాలు సలిపి, ప్రతి వినోదాన్ని ఒక లీలగ, లీలకొక మహోన్నతస్వరూపము, మహోన్నతికి ఒక చరిత్రను సృష్టించి, అలాంటి చరిత్రకొక ఆచారాన్ని ప్రవర్తింపచేసి — ఈ ఆచారాలని చరిత్రనూ, చారిత్రక చిహ్నాలనూ కాపాడుకుంటామో, కాలరాసుకుంటామోనని చిత్రం చూస్తూ ఏమీ చూడనట్టుండే ఈ అర్చావతారాన్ని మనతోటే ఉన్నా — ఇంకా మనం చేరవలసి ఉంది. ఈ "నందనుడే" మనలను చేర్చాలి.

"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్" హే విశ్వపోషకుడా! ఈ ప్రకృతి వస్తువుల ఆకర్షణలో మా మనస్సులు మూసుకుపోయాయి. ధనార్జన, పదవీవ్యామోహాలు, భూమిపై ఆక్రమణ, బంగారంపై ఆశ-ఒకటేమిటి - అర్చావతారమైన నిన్ను చుట్టుకొని ఉన్న వైభవం నీవైపు చూడడం లేదు. నిన్ను దూరం చేసుకుంటూ, బాహ్యవిషయాలలో, భోగలాలసులమై, నిన్ను కూడా అవి తెచ్చిపెట్టగలిగిన ఉత్తమసాధనంగ, సులభసాధనముగ వాడుకుంటున్నాము.

"తత్ త్వం పూషన్! అపావృణు" హే అర్చావతార! మా ఈ అజ్ఞానాన్ని దూరం చేయుము. నేనెంత వున్నా నిన్ను చూసే శక్తి ప్రసాదించుము. ఈ తాత్కాలిక సుఖాలకంటే నిన్ను సేవించే సుఖమే నిజమైన నిలకడ గలిగిన సుఖమనే సత్యాన్ని మాకిమ్ము" అంటూ వేదం చేసిన ప్రార్థన మనమందరమూ చేయాలి. మనతో మన ఊరిలో, మన గుడిలో ఉన్న ఈ ఆనందమయుణ్ణి విశ్వసించాలి, చేరాలి.

అర్చావతారంలో ఆయన చూపిన లీలలకు సాక్ష్యాలున్నాయి. ఆలయాలలోనైతే ఎన్ని ఉన్నాయో లెక్కపెట్టలేము. మేలుకోట, శ్రీరంగం, తిరుమంగై ఆళ్వార్ల దివ్యదేశాలు మొదలైనవెన్నో--- అవి దూరమైనవైనా మనకు దగ్గరగ ఉన్నది తిరువేంకటనాథుని దివ్యసన్నిధి. ఒక్కసారి చూడండి! ఉత్సవాలకు ఉపయోగించే వేయికాళ్ళ మండపం, నాగాభరణాలకి సాక్ష్యం వెముండే గోపురం, అనంతాళ్వార్ల ప్రీతికి తీపిగుర్తు గడ్డానికి కర్పూరం, రామానుజులపై శ్రీనివాసుని భక్తిని వ్యక్తపరిచే మెట్లు శంఖచక్రాలు, బొట్టులోని మార్పులూను. భాష్యకార్ల సన్నిధి నిర్మాణమునూ... రామానుజుల వారూ శ్రీశైలపూర్ణుల రామాయణ కాలక్షేపానికి గుర్తులు - కొండక్రింది శ్రీనివాసుడే పాదాలూ, కొండమీది గుడిలోని శ్రీరామపరివారమునూ. చిదంబర రహస్యాన్ని ఛేదించే చిత్రాంగ పెద్దదైన శ్రీనివాస సహోదరుడయిన గోవిందరాజుని దివ్యసన్నిధి. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నెన్ని చిహ్నాలో... ఇవన్నీ ఆ అర్చావతారుడి దివ్యలీలలను తరతరాలకు తెలిపే తీపిగుర్తులే. నిలువెత్తు సాక్ష్యాలే. చారిత్రక చిహ్నాలు శాశ్వతంగ ఉంటే ఆ అర్చావతార ప్రభావం తరతరాలు స్మరిస్తాయి. సాక్ష్యాలే చెరిగిపోతే, చరిత్రలు కట్టుకథలైపోతాయి. ప్రకృతి పురాణాలని వాస్తవాలని కొందరు

— —

— 3 —

వశీకరించేస్తారు, కలిమాయకళలు. కొట్టేదుటకనిపించే కల్కావతారాన్ని కాసులు మూటలుగ సేకరించుకోడానికే, కపటపు ఆటోపాలకి సాధనంగ, కీలుబొమ్మగ వాడుకొంటారు. కల్కావతారం కావడానికి కమలాపతియే. కానీ ఏం లాభం? కరుడగట్టిన కఠినహృదయుల చేతికి చిక్కిన కోమల కల్పవృక్షమైపోయాడు. కలిప్రభావానికి పరాకాష్ఠయైన మానవాకృతి దాల్చిన అటవికుల పాలబడ్డ బలిపశువైపోయాడు, ఆ సర్వసులభుడైన సర్వేశ్వరుడు.

కల్కావతారంలో అన్నీ తెలిసినా తెలియనట్టు, శక్తి నిండి ఉన్నా లేనట్టు, అన్నీ చూస్తున్నా చూడనట్టు ఉండడమెందుకు? మన దోషాలు, లోపాలు బుద్ధి వంటులన్నా మనమే గుర్తించి సవరించుకోనేందుకు తగిన అవకాశం యిచ్చేటందుకే. అవకాశాన్ని పాడుచేసుకొంటే నష్టపోయేది మనమే కదా! సరిచేస్కోవాలి. అందుకు కాలం తోడుపడాలి. వాడెప్పుడూ కరుణామయుడే. అది తెలిసిరాక పోవడం వల్లే మనకు బుద్ధి పనిచేయటం లేదు. కాలరూపుడైన పరమాత్మ కరుణిస్తే బుద్ధులు మారతాయి. ఉద్రేకాలు కూడ ఉపశమిస్తాయి. పట్టుదలలు సడలుతాయి. జ్ఞానోదయమౌతుంది. కల్కావతారమును ఆరాధిస్తారు. ఆయన విలువ గుర్తిస్తారు. ఏలా చిత్రాలుగా విరిగిపోయినా, స్వయంగ చెరిపివేసిన వాటినైనా చేరదీసి చిరస్థాయిగ నిలబెడతారు. చెరిగిన చరిత్రను చిరకాలం స్థిరం చేస్తూ చేసి శిలాశాసనబద్ధం కావిస్తారు. వైమనస్యాలు తగ్గి సుమనస్కులవుతారు ప్రజలు. అన్నిటికీ కాలమే కారణం. కాలానికి సాటి మరిలేదు. ఆవేశాలు, ఆక్రోశాలు తీరంగాని ఆనందం అందరిలోనూ తాండవిస్తుంది, కాలం అనుకూలిస్తే!

"నాహం న కాలః".. అంటూ కాల ప్రభావాన్ని సీతమ్మ స్వయానా కీర్తించింది. ఆ కాలం భగవత్స్వరూపం. ఎవ్వరికీ అందనిది. ఎవ్వనికీ లొంగనిది. ఎవ్వనికీ అతిక్రమించరానిది. అన్నిటినీ నడిపేదదే. అన్నిటికీ ఆధారమదే! అన్నిటినీ తనలో పదిలపరచేది ఆ కాలమే. మనకు కోరితే రాదది. తానై వచ్చేదానిని అడ్డుకోవడం లేదు. తనరాకను, తన కర్తవ్యాన్ని తానే నిర్ణయించుకొని వస్తుంది. గుర్తించిన వారు ధన్యులు.

కొత్త సంవత్సరం "నందన" పై ఆనందఘనుడైన శ్రియఃపతిని ఆయన తొలి సువ్యక్త స్వరూపంలో సర్వాత్మగా శరణాగతి చేయగల్గు మనలను తీర్చిదిద్దుగాక! అతడి వైభవాన్ని దశదిశలా ఎలుగెత్తి కీర్తించునట్టు మనలను నడిపించుగాక! దానికి తగిన ధనధాన్యాలు, పాడిపంటలూ, పరిజనాలను ప్రసాదించి మనలను పరిపూర్ణ ప్రమోద మనస్కులను చేయుగాక! "నందన" నామక కాలస్వరూపుడా! నీకు స్వాగతమగుగాక!

జై శ్రీమన్నారాయణ!

ఎన్నెస్ శ్రీ. రా. చార్యులు



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*గత సంచిక తరువాయి...*

**(ప్రథమ స్కంధం 6వఅధ్యాయం నారదపూర్వజన్మవృత్తాంతం)**

వ్యాసమహర్షికి విశేష విశ్వాసం కుదురు పడటానికై నారదుడు తన పూర్వ జన్మ వృత్తాంతాన్ని చెప్పి, తనకు కల్గిన భాగవత కృపా వైభవాన్ని ఆవిష్కరించాడు. తాను కూడా అలాగే ఆచరింపదలచి, గురూపదేశం అయిన తరువాత జరిగిన నారదచరితాన్ని ప్రశ్నించాడు వ్యాసుడు.

ఓ దేవర్షీ ! భిక్షువులు వెడలిపోయిన తరువాత వారుపదేశించిన ఉత్తమమార్గంలోనే పయనిస్తున్నా, ఇంకా, ప్రథమవయస్సులోనే ఉన్నావు కనుక, అటు తరువాత ఏం చేశావు? ఓ బ్రహ్మపుత్రా! అటు తరువాతి వయస్సును ఎలా గడిపావు? కాలం ప్రాప్తమైనప్పుడు నీ కరణ కళేబరాల్ని ఎలా విడిచిపెట్టావు? ప్రాచీనకల్పానికి చెందిన నీ జన్మ వృత్తాంతానుభవాన్ని ఈ గడిచిన మహాకాలం నీ స్మృతిపథం నుండి దూరం చేయలేకపోయింది కదా! ఇది ఎలా సాధ్యం అయింది? అన్న వ్యాసుని జిజ్ఞాసను గుర్తించి, నారదుడు ఇలా అంటున్నాడు.

ఓ వ్యాసా! నాకు తత్త్వోపదేష్టలైన భాగవతోత్తములు వెడలిపోయిన తరువాత జరిగిన వృత్తాంతాన్ని చెబుతాను సావధానుడవై విను. ఒకే తనయుడు కల, నా తల్లి అవివేకిని, దాస్యభావాన్ని పొందినది అయి, ఒకే ఒక సంతానము, దిక్కులేని వానిని అయిన నాపట్ల వల్లమాలిన ప్రీతిని పెంచుకున్నది. ఆమె తన యజమానుని వద్ద ఊడిగం చేస్తూ స్వతంత్రురాలు కాజాల నందున, నా యోగక్షేమాలు కోరినదే అయినా, ఏమీ చేయలేక పోయింది. "**ఈశస్య హి వశే లోకాః యోషా దారుమయీ యథా**" ఒక చెక్క బొమ్మ స్వతంత్రంగా ప్రవర్తించలేనట్లే, తన యజమానుని దగ్గర బానిసగా ఉంటూ ఈ లోకం ఏమీ చేయ జాలదు కదా! ఆమె పట్ల ఉన్న అపేక్షతో, నేనూ, ఆ బ్రహ్మకులం లోనే ఉండసాగాను. దేశకాలాలు దిశలు ఏమీ ఎరుగజాలని శైశవవయస్సులో ఐదు సంవత్సరాలవాడినై కాలం గడుప సాగాను.

ఒకనాడు, రాత్రి సమయంలో ఆవు పాలు పితకడానికి వెలుపలకు వెళ్ళి పాముచే కరవబడినదై, ఆమె, కాలకబళిత అయింది. ఇక, నేను, భక్తులకు మంగళాన్ని ఆశంసించే భగవానుని కృపయే ఇది, అని భావిస్తూ, ఉత్తర దిశగా పయనమై వెళ్ళాను. అనేక జనపదాలను, గ్రామాలను, పురాలను, గొల్లపల్లె లను దాటుతూ, ఎన్నో రత్నాలగనులను, కర్షకగ్రామాలను, గిరి ప్రాంతాలను దాటి, వివిధ విచిత్రధాతుభూషితాలైన పెద్ద పెద్ద కొండలవంటి చెట్లతో నిండిన వనాలను, ఉపవనాలను, స్వచ్ఛజలమండితాలైన సరస్సులను దాటి, ఒక మహాగహనమైన అటవిని ప్రవేశించాను. బొంగువెదురు మొదలైన ఎన్నో వృక్షాలక్కడ అల్లిబిల్లిగా చిక్కగా ఒకదానికొకటి ఒరుసుకొని (దట్టంగా) ఉన్న మహారణ్యమది. చాలా ఘోరము, భయంకరము. అనేక క్రూరజంతువులతో క్రిక్కిరిసి ఉన్నదా విపినం. నడచి నడచి, అలసి, క్షుత్పిపాసలతో డస్సిన నేను, ఒక నదికి చెందిన మడుగులో స్నానమాడి, జలోపస్పర్శనం చేసి సేద తీరాను. ఆ వనంలో నిర్మానుష్య ప్రదేశంలోని ఒక పిప్పలవృక్షం క్రింద కూర్చుండి, కుదురు కొల్పిన బుద్ధితో నాలోని పరమాత్మ స్వరూపాన్ని, పెద్దల నుండి విన్న రీతిలో ధ్యానించడ మారంభించాను.

**ధ్యాయత శ్చరణాంభోజం భావనిర్జిత చేతసా ।**
**ఔత్కంఠ్యాశ్రు కళాక్షస్య హృద్యాసీ న్మే శనై ర్హరిః ॥**

**ప్రేమాతి భర నిర్భిన్న పులకాంగోఽ తి నిర్వృతః ।**
**ఆనంద సంప్లవే లీనో, నాపశ్య ముభయం మునే ॥**

**రూపం భగవతో యత్త న్మనఃకాంతం శుభావహమ్ ।**
**అపశ్యన్ సహసోత్తస్థౌ వైక్లబ్యా ద్దుర్మనా ఇవ ॥**

**దిదృక్షుః తదహం భూయః ప్రణిధాయ మనో హృది ।**

**వీక్షమాణోఽపి నాపశ్యమ్, అవితృప్త ఇవాతురః ॥**

**ఏవం యతంతం విపినే, మామాహ అగోచరో గిరామ్।**
**గంభీరశ్లక్ష్ణయా వాచా, శుచః ప్రశమయన్నివ ॥**

ఈ లోకాల్లో నారదునికి ఆ ఘోరారణ్యంలో ధ్యానదశలో కలిగిన విలక్షణానుభవాన్ని, సూతుడు శౌనకాదులకు వివరించాడు.

"అనన్యమైన భక్తిచే మనస్సును జయించిన నేను, భగవంతుని చరణాంభోజాన్ని ధ్యానిస్తూ ఉండగా, కంటివెంట అవిశ్రాంతంగా అశ్రువులు జాలువారాయి. మెల్లమెల్లగా హృదయంలో శ్రీహరి కుదురుకున్నాడు. స్వామి సన్నిధానంచే ప్రేమాతిశయభరితమైన ఆ విలక్షణానుభవం మూలంగా శరీరం పులకాంచితమైంది. ఎంతో ఆనందం నిండి నిబిడీకృతమైంది. ఆనందప్రవాహంలో మునుగుతూ, నన్ను, పరమాత్మను ఈ రెంటినీ వివశుడనై చూడలేకపోయాను. సర్వ శోకాలను పోద్రోలజాలిన ఆ పరమాత్మ దివ్యరూపం, మనోహరమైన నా కంటికి పొడగొట్టలేదు. వెంటనే అలజడి చెంది, దుఃఖంతో వేగంగా లేచిపోయాను, మనస్సు కలవరపడింది. మళ్ళీ, ఆ స్వామి దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించాలనే ఆశతో నా హృదయంలో మనస్సును ఏకాగ్రంగా నిగిడ్చాను. అయినా, నాకా స్వరూపం పొడగొట్టలేదు. ఆతురుడైనవానిలా తృప్తిని పొందలేక పోయినాను. ఇలా, గాఢంగా స్వామిని హృదయంలో ధ్యానముఖంగా దర్శించడానికి ప్రయత్నిస్తున్న నాతో, వాగగోచరుడైన ఆ స్వామి మృదుగంభీరమైన తన వాక్కులతో, నా శోకాన్ని పోద్రోలుతున్నట్లు ఇలా అన్నాడు.

**భగవద్వచనం**: "ఓయీ! ఈ జన్మలో నీవు నన్ను దర్శింప జాలవు. **'అవిపక్వకషాయాణాం దుర్దర్శోఽహం కుయోగినామ్'** సర్వ మలాలను దహింపనివారు, కామాదులను పూర్తిగా జయింపని వారు అయిన **'కుయోగులకు'** నేను దర్శనీయుడను కాను. ఒక్కసారి నీకు చూపించిన నా రూపం, నీకు కేవలం నా రూపం పట్ల నిరతిశయ ప్రీతి కలగడానికే. నా పట్ల కామం **(వల్లమాలిన ప్రీతి)** కుదురుకొన్నప్పుడు, ఆ కామమే క్రమక్రమంగా మెల్లగా, హృదయంలోని ఇతర విషయకామాలనన్నిటిని పోద్రోలుతుంది. సజ్జన సేవను నీవు కొలది కాలమే చేసినా, దాని వల్ల నా పట్ల నీకు దృఢమైన ప్రీతి కలిగింది. కనుకనే, ఈ దోషభూయిష్ఠమైన లోకాన్ని విడచి నా పార్షదభావాన్ని నీవు చేరగలవు. నా పట్ల ఏర్పడిన ఈ బుద్ధి, ఎట్టి దశలోను దూరం కాకూడదు. ఇక అప్పుడు, ప్రళయంలో కూడా నా స్మృతి నిన్ను వీడదు. **(నా భక్తి నిన్ను ఎడబాయనిదని తాత్పర్యం)**" అని ఇంతవరకు మాటాడి, స్వామి విరమించాడు.

**ఏతదు క్త్వోపరరామ తన్మహద్భూతం**
**నభోలింగ మలింగ మైశ్వరమ్ ।**
**అహం చ తస్మై మహతాం మహీయసే**
**శీర్ష్ణావనామం విదధేఽనుకంపితః ॥**

ఇలా సర్వవ్యాపకుడు, అశరీరుడు అయి ఆకాశ తుల్యుడైన స్వామి, సర్వేశ్వరుడైన వాడు 'మహాభూతం'గా కీర్తింప బడినవాడు, మాటాడి విరమించాడు. నేనా మహా మహుడైన స్వామికి, శిరస్సు వంచి, ఆతని కృపకు పాత్రుడనై, నమస్కరించాను.

**నామా న్యనంతస్య గతత్రపః పఠన్**
**గుహ్యాని భద్రాణి కృతాని చ స్మరన్ ।**
**గాం పర్యటం స్తుష్టమనా గతస్పృహః**
**కాలం ప్రతీక్షన్ విమదో విమత్సరః ॥**

'అనంతుడైన భగవంతుని నామాలను ఎట్టి సిగ్గు పడ కుండా పఠిస్తూ, ఆతనిచే చేయబడిన మంగళకృత్యాలను స్మరిస్తూ, భూమినంతా తిరుగుతూ, పరితుష్టమానసుడనై, ఎట్టి కోరికలూ లేక, మద-మాత్సర్యాలను పూర్తిగా విడచి కాలాన్ని ప్రతీక్షిస్తూ ఉన్నాను'.

ఇలా కృష్ణునియందే ఏకాగ్రమైన మనస్సు కలవాడనై లౌకిక విషయస్పృహలన్ని విడచిన సమయంలో మెరుపు తీగలాగా (అకస్మాత్తుగా) కాలం ఆసన్నమైంది. భగవానుడు తాను పూర్వం- **"హిత్వా అవద్య మిమం లోకం గంతా మజ్జనతా మసి"** దోషభూయిష్ఠమైన ఈ లోకాన్ని విడచి నాపార్షదత్వాన్ని **(మజ్జనతాం)** పొందగలవు. అని వాగ్దానం చేసిన విధంగా, ప్రారబ్ధకర్మ నశించగానే నా పాంచభౌతికమైన దేహం రాలిపోయింది.

**కల్పాంత ఇద మాదాయ, శయానేఽంభ స్యుదన్వతః ।**
**అనుప్రాణం శిశయిషో ర్వివిశేఽంతరహం విభోః ॥**

కల్పాంత సమయంలో ఈ సమస్త జగత్తును తనలో ఇముడ్చుకొని సముద్రంలో శయనించిన నారాయణునిలో శయనింపదలచిన చతుర్ముఖబ్రహ్మలో, నేను నిశ్వాసంతో పాటుగా ప్రవేశించాను అన్నాడు నారదుడు.

ఇక్కడ యుగాంతకాలంలోని స్థితికాక, కల్పాంత ప్రలయ కాలంలో జరిగే లయప్రక్రియ సూచింపబడిందని చెప్పాలి. కల్పాంత ప్రలయంలో తన రాత్రికాలంలో బ్రహ్మ, స్వామి శరీరంలో విశ్రాంతి తీసుకుంటాడు. పగటి కాలంలో మేల్కొని సృష్టి ప్రక్రియను సాగిస్తాడు. ఆ చతుర్ముఖబ్రహ్మ ప్రాణాల నుండి నేను, మరీచి మున్నగు ఋషులు పుట్టాము. ఎట్టి వ్రతస్ఖలనము లేనివాడనై లోపల, వెలుపల ముల్లోకాలను అప్రతిహతంగా సంచరింపగలను. శ్రీమన్నారాయణుని అనుగ్రహం చేతనే నాకీ అప్రతిహతగతి ఏర్పడింది. దేవదత్తమైన ఈ వీణ స్వరబ్రహ్మ విభూషితం, దీన్ని మీటుతూ హరికథను గానం చేస్తూ సంచరిస్తాను. ఇలా గానం చేస్తున్న నా హృదయంలో స్వామి, నాచే ఆహ్వానింపబడిన వానిలా తన దర్శనాన్ని నాకు అనుగ్రహిస్తాడు.

నిరంతరం శబ్దస్పర్శాది విషయ సంపర్కం చేత సంసార సాగరంలో పడి ఆతురులైన వారికి, భగవద్గుణగానమే దరి చేర్చు నావ అవుతున్నది. కామలోభాలచే ప్రతిహతమైన ఈ ఆత్మ భగవచ్చరణారవింద సేవచే ప్రశమించినట్లు, యమ నియమాది యోగసాధనాలచే ఎంత మాత్రము శాంతి పొందదు. ఓ వ్యాసా! నీవడిగిన వృత్తాంతమంతా నీకు విశదపరచాను'' అని ఇలా వ్యాసునితో సంభాషించి, వాసవీసుతుడైన వ్యాసుని వీడ్కొల్పి, వీణను వాయిస్తూ, నారదుడు అనుకోకుండగా వచ్చినవాడు తిరిగి వెళ్ళిపోయాడు.

**అహో దేవర్షి ర్ధన్యోఽ యం యః కీర్తిం శార్ఙ్గధన్వనః ।**
**గాయన్ మాద్యద్గిరా తంత్ర్యా రమయ త్యాతురం జగత్ ॥**

*(ఈ శ్లోకంలో 'దేవర్షిర్ధన్యః' అనే చోట రేఫ అధికం, ఇది ఆర్షప్రయోగం)*
ఆహా! ఈ దేవర్షి పరమధన్యుడు కదా! ఈ మహానుభావుడు భగవానుని కల్యాణగుణవైభవాన్ని వీణతో గానం చేస్తూ, సంసారాతురమైన ఈ జగత్తును ఆనందింప జేస్తున్నాడు, అని సూతుడు అధ్యాయాన్ని ముగించాడు.



# నేర్చుకుందామా! - 6

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

ప్రతినెలా ఒకొక్క పద్యం కఠస్థం చేయాలి అనే ఆశయంతో **"నేర్చుకుందామా!"** అనే శీర్షిక ప్రారంభించారు. మరి అందరూ కంఠస్థం చేస్తున్నారా? ముఖ్యంగా మీ పిల్లలకి నేర్పిస్తున్నారు కదూ!

మనం జీవితాన్ని ఏ పనులు చేస్తూ గడపాలో చక్కగా వివరించింది భారతం.

**ఎఱుక గలవారి చరితలు**
**గఱచుచు సజ్జనుల గోష్ఠి గదలక ధర్మం**
**బెఱుగుచు నెఱిగిన దానిని**
**మఱవ కనుష్ఠించునది సమంజస బుద్ధిన్**

తా॥ మనం మహనీయులైన జ్ఞానుల చరిత్రలు నేర్చుకోవాలి. పెద్దలు జీవితకథలు మనకెన్నో నీతులు నేర్పిస్తాయి. జీవితాన్ని మంచిమార్గంలో నడిపిస్తాయి.

మంచివారి సభలలో ఎంతో శ్రద్ధతో పాల్గొని ధర్మాలన్నీ తెలుసుకోవాలి. దానివలన ఎన్నో సందేహాలకు సమాధానాలు దొరుకుతాయి. సంతృప్తినిస్తాయి.

మంచివిషయాలు కేవలం విని ఊరుకుంటే సరిపోదు. వాటిని మరిచిపోకుండా జీవితంలో ఆచరించి చూపించాలి. ఆ ఆచరణలో భక్తి, శ్రద్ధలు ఉండాలి. ఇలా మంచి విషయాలు విని, వాటిని తమ జీవితంలో ఆచరించి తాము ఆనందంగా ఉంటూ నలుగురికీ ఆనందాన్ని పంచిపెట్టడమే ఈ మానవ జీవితానికి సార్థక్యాన్ని కలిగిస్తుంది.



# సీతాఫలం రామార్పణమ్



శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్

*(గతసంచికతరువాయి...)*

**సా తాం దృష్ట్వా ధృవం రామం**
**మత్వా తం వృతవంత్య భూత్‌।**
**సోఽపి తాం చ ధృవం సీతాం**
**మత్వా తాం వృతవా నభూత్‌॥**

రామవేషముతో తనవద్దకు వచ్చిన ఆ విరాధుడే రాముడని భావించిన శూర్పణఖ అతనిని వరించినది. ఆమెయే సీత అని భావించిన విరాధుడు ఆమెను వరించి, పరస్పరము ఇష్టపడి

**గత్వా చ దూరత స్తత్ర విజనే గిరకందరే** దూరంగా వున్న ఒక పర్వత గుహలోనికి వెళ్ళి సరస సల్లాపాలలో ఇరువురి రాక్షసప్రవృత్తులూ బయటపడి, ఒకరినొకరు దూషించుకొని వారి వారి నిజరూపాలు ధరించి, రావణుని వద్దకు బయలు దేరారు.

**సీతా దర్శనజ క్లేశ సంయుత స్స దశాననః ।**
**తద్వనే పటగే హంతు నిర్మాప్య స్థితవానభూత్‌ ॥**

రావణుడు సీత కనుపించలేదన్న విచారముతో ఒక కపట కుటీరం నిర్మించుకొని అక్కడే ఉండిపోయినాడు.

********

### సీతాస్వయంవరంలో రాజుల విన్యాసాలు
### రావణుని అవమానం

రెండవరోజు మధ్యాహ్నం దాటిన తరువాత అనేకమంది రాజపుత్రులు స్వయంవర సభామండపాన్ని అలంకరించారు. విశ్వామిత్రాది మహర్షులు వాద్యఘోషలతో రామలక్ష్మణులతో స్వయంవర మండపానికి విచ్చేశారు. రామలక్ష్మణులు ఆశీనులైన మహర్షులందరికీ నమస్కరించి వారి ఆశీస్సులు పొందారు.

ఐదువందలమంది దూతలు ఎనిమిది చక్రాలు గల శివ ధనువు ఉన్న మంజూషాన్ని లాగుకొని వచ్చి సభామధ్యమున ఉంచారు. అప్పుడు జనకమహారాజు సభాసదులైన రాజులతో

**నృపా శృణుత మద్వాక్యం సురాసుర నరేషు వై ।**
**యశ్చాప మేత న్నమయే త్తం వృణోతు మదాత్మజా ॥**

"రాజపుత్రులారా! దేవదానవ మానవులలో ఎవరు ధనువును ఎక్కుపెట్టెదరో వారిని నా కుమార్తె సీత వరించును" అని తన మాటను చెప్పినాడు. అప్పుడే కొందరు రాజులు ధనువు పరిమాణము చూచి దానికి నమస్కరించి వెనుదిరిగి వెళ్ళినారు.

మరి ఒకరు ధనువువద్దకు వచ్చి చూడగా వానికి అదొక పెద్ద సర్పమువలే కనుపించినదని, దానితో అతడు వెనుదిరిగి రాజపుత్రులారా! ధనువని చెప్పి ఈ రాజు మనను వంచించినాడు అని చెప్పినాడు. మరొకడు తలెత్తి చూచి ధనువెక్కడనీ, కనుపించుట లేదని పలికినాడు. అప్పుడు

**ధనుషో దర్శనం నాస్తి భంజనే తోలనే కిము ।**
**ఇత్యేవ జహాసు స్తం తు సదస్యా స్తు నృపాలకాః ॥**

నీకు అసలు ధనువే కనుపించనపుడు ఇంక నీవేమి ఎక్కుపెట్టెదవులెమ్మని రాజులు పరిహసించారు. మరొక రాకుమారుడు

**సింహ గత్యా మహాగర్వా చ్ఛ్మశ్రూణి స్వకరే దధత్‌ ।**
**త్వమేవ దర్శయామాస చాప స్సైంహీం తనుం నిజామ్‌॥**

తన ఆసనము నుండి లేచి సింహం వలే మహాగర్వంతో మీసాన్ని మెలివేస్తూ ధనువు దగ్గరకు వెళ్ళాడు. వానికి ఆ ధనువు సింహం వలే కనుపించింది. ఆ సింహమును చూచిన ఆ రాజపుత్రుడు క్రిందపడి లేచి పరుగెత్తుచూ రాజపుత్రులారా! ఇది ధనువుకాదు. నిజముగా ఇదొక సింహము. దుష్టుడైన జనకమహారాజు మనలనందరినీ వధించుటకు పన్నిన పన్నాగమని చాటి చెప్పాడు.

**బలే పుత్ర స్తదా బాణ శ్చచాల చ నిజాసనాత్‌ ।**
**దదర్శ శివరూపం చ వదామ చ పునః పునః ॥**

బలిచక్రవర్తి పుత్రుడైన బాణాసురుడు ఆ ధనువు వద్దకు వచ్చాడు. మరల మరల చూచినా అతనికి ఆ ధనువు సాక్షాత్తూ శివరూపంగా కనుపించినది. అప్పుడా బాణాసురుడు ఆ ధనువుకు నమస్కరించి, సభాసదులారా! యిది శివరూపమేగాని ధనువుకాదు. కనుక ఇంక నేను ఇక్కడ ఉండుట తగదు. నేను వెళ్ళెదనని స్వగృహమునకు మరలినాడు.

తరువాత రావణుని మంత్రి వచ్చి జనకమహారాజా! నీ హితము కోరి నేను చెప్పబోవు మాటను వినుము. పులస్త్యబ్రహ్మ మనుమడు, కుబేరుని తమ్ముడు, లంకాధిపతి, శ్రీమంతుడు అయిన రాక్షసరాజు రావణుడు అనునాతనికి నీ కూతురునిచ్చిన నీకు సర్వశ్రేయములు అతడు చేకూర్చగలడు.

'రాజా! నీకుమార్తెను ఎవరో ఒకరికి ఈయక తప్పదు. కనుక, ఆతనికిచ్చిన నీకు క్షేమమగును. అంతే కాదు చతుస్సాగర పర్యంత భూమినీ జయించి నీకు ఈయగలడు' అని చెప్పగా జనకమహారాజు 'మంత్రివర్యా! ఆ రావణుడు శివధనువును ఎక్కుపెట్టినచో నా కూతురినిచ్చుటకు ఎటువంటి అభ్యంతరము లేదు. అట్లుగాక నా పుత్రికను వేరువిధముగా ఎవరికీయను' అని వక్కాణించి చెప్పినాడు.

ఆ మాటలకు రావణమంత్రి....

**చంద్రమౌళేరయం చాప స్తస్మా న్నేచ్ఛతి రావణః ।**
**యది తచ్చాన్య దేవస్య తత్క్షణం చూర్ణతాం నయేత్ ॥**

'రాజా! మా రావణుడు శివభక్తుడు. శివధనువు నెత్తుటకు గానీ, ఎక్కుపెట్టుటకుగానీ ఇష్టపడడు. అదే ఏ ఇతర దేవతల ధనువైనచో దానినెత్తుటకు కాదు, పిండి చేయుటకైననూ తగినవాడే' అని పలికినాడు.

ఆ మాటలకు జనకరాజు 'మంత్రీ! శివుని ఆవాసమైన కైలాసమునెత్తిన వానికి శివధనువొక లెక్కకాదుకదా! రావణుడు ధనువునెత్తుటకు అర్హుడే' అని నవ్వుతూ చెప్పినాడు. ఆ మాటలకు రావణమంత్రి 'జనకా! నీవు రావణునితో సంబంధమును, బంధుత్వ గౌరవమును పోగొట్టుకొనుచున్నావు. ఎట్లయిననూ సీత రావణుని వశము కాక తప్పదు. అందుకెటువంటి సంశయము లేదు' అన్నాడు. ఆ మాటలు విన్న జనకుడు..

**హరణం యది కన్యాయాః రావణస్తు కరిష్యతి ।**
**నాశాయ దశకంఠస్య సీతా చైవ భవిష్యతి ॥**

'రాక్షసుడా! నీవు చెప్పినట్లు రావణుడు సీత నెత్తుకొని పోయిన ఎడల ఆ రావణుని మృత్యువు సీతయే కాగలదు' అని హెచ్చరించినాడు. (సశేషం)



# అహో! భారతమ్

## శకుంతల - దుష్యంతుల చరిత్ర

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

*(గతసంచికతరువాయి...)*

"యశోనిధీ! అన్నీ తెలిసి ఏమీ తెలియనట్లు మాట్లాడడం నీవంటి ధర్మాత్ములకు తగదు. చేసిన తప్పుపనికి సాక్షులెవరూ లేరు గదా! అని అబద్ధాలు పలుకవచ్చా? అంతరాత్మ సాక్షి కాదా! దానిని చంపుకోవచ్చా? ఒక్కసారి కణ్వాశ్రమానికి వచ్చిన గతాన్ని గుర్తుకు తెచ్చుకో. గాంధర్వ పద్ధతిలో నన్ను చేపట్టిన విషయం నీ మనస్సులో ఎలా చెరిగిపోయింది? పతివ్రత అయిన భార్యని అవమానిస్తే ఇహపరాలుంటాయా?

గృహస్థాశ్రమ ధర్మాన్ని రక్షించడంలో మూలకారకురాల యిన భార్యను ఇలా హీనపరచడం నీవంటి వారికి తగిన ధర్మమా? "అంగాత్ అంగాత్ సంభవసి" అంటూ తండ్రియొక్క మరోరూపంగా పుట్టిన కొడుకుని ఎవరో తెలియదని పలకడం న్యాయమా? ఇంత ధైర్యం ఎలా వచ్చింది నీకు? గార్హపత్యం అనే అగ్నినుంచే ఆహవనీయం అనే హోమాగ్ని బయలుదేరినట్లు తండ్రి తనువునుండి కొడుకు తనూభవునిగా జన్మిస్తాడు అని తెలియదా నీకు? తండ్రి నీడే కొడుకు కదా!

అసలు పుత్రుడు అంటే 'పుత్' అనే నరకాన్నుంచి రక్షించేవాడు అని కదా అర్థం. దీపంనుండి మరొక దీపంలా నీనుండి ఈ బాలుడు నాకు కలిగాడు. రాక్షస శక్తులన్నింటిని ఓడించ గలిగాడని, ఇకముందు ఓడిస్తాడు కూడా అని 'సర్వదమనుడు' అని కణ్వమహర్షి నామకరణం చేశారే...! ఇంతటి బాలకిశోరుని, సొంతపుత్రుని కాదనడానికి నీకు మనసెలా వచ్చింది? లోకంలో పుత్రుని కౌగిలి ఇచ్చే ఆనందం మరొక దానివలన కలగదని నీకు తెలియదా?

ఈ నీ పుత్రుడు నూరు వాజపేయ యాగాలు చేస్తాడని వీడు పుట్టగానే ఆకాశవాణి పలికింది. అసామాన్యుడైన బాలుడు వీడు. అకారణంగా వీడిని నిరాకరించకు. మన పెళ్ళినాడు నాకిచ్చిన మాట జ్ఞప్తికి తెచ్చుకో! సత్యవాక్యం గొప్పదనం తెలుసుకో!

చేదుడు బావులు నూరుకంటే దిగుడుబావి ఒక్కటయినా మేలు. దిగుడు బావులు నూరింటికంటె ఒక్క యజ్ఞం చెయ్యడం గొప్ప. నూరు యజ్ఞాలు చెయ్యడం కంటె ఒక్కపుత్రుడుండడం శ్రేష్ఠం. ఆ కొడుకుకంటె ఒక్క సత్యవాక్యం పలకడం ఎంతో పుణ్యప్రదం. ఎందుకు అబద్ధాలు పలుకుతావు చెప్పు? వెయ్యి అశ్వమేధాలు చేసిన ఫలం కంటే ఒక సత్యవాక్యం పలికిన ఫలం గొప్ప అని తెలుసుకో!

నాతండ్రి ఋషివర్యుడైన విశ్వామిత్రుడు. తల్లి సాక్షాత్తుగా అప్సరశ్రేష్ఠురాలయిన మేనక. వారి సంతానాన్ని అయిన నేను అసత్యాలు పొరపాటుగా కూడా పలుకను. జరిగిన దానిని గుర్తుచేసుకొని నన్ను, నీ పుత్రుని ఆదరించు."

నెమ్మదిగా... సూటిగా రాజుని చూసింది శకుంతల. అతని ముఖంలో నిర్మలత్వం మాయమైంది. మాటల్లో కటుత్వం చోటుచేసుకుంది. నిర్లక్ష్యంగా చూస్తూ... "చక్రవర్తిని నేనెక్కడ? మునికన్యవు నీవెక్కడ? మనకి మళ్ళీ... కొడుకు... కొడుకు కూడానా... ఎంత అందంగా అబద్ధం అల్లావు...! ఆడవాళ్ళకి అబద్ధాలల్లడం సొత్తు. జన్మహక్కు. చాల్చాల్లే. పో... వీడట.. నాకు కొడుకట. హ...హ్హా... హ్హా..."

హతాశురాలయింది శకుంతల. ఎంతటి నిర్దయుడు. అబద్ధమాడడానికి ఏమాత్రం సందేహించని ఈ రాజు ఇంత అధర్మాత్ముడని తెలియక అన్నీ సమర్పించానే... అయ్యో! చేసిన తప్పు స్వయంకృతాపరాధం. ఎలాంటి ఫలితాన్నిచ్చిందీ..! అయ్యో! తండ్రీ కణ్వమహర్షి... నన్ను క్షమించు... చేసిన తప్పుకి ఫలితం అనుభవించవలసినదే! ఇంక చెడి పుట్టింటికి పోరాదు కదా! నాకు దేవుడే దిక్కు... అంటూ.. అనుకొంటూ కొడుకు చేతిని పట్టుకొంది. నాన్నా.. హృదయం పగిలినట్లు దుఃఖం కట్టలు తెంచుకువచ్చింది. కన్నకుమారుని గుండెలకు హత్తుకొంది. రా తండ్రీ! మనకా దేవుడే గతి... కన్నీళ్ళు తుడుచుకుంటూ పుత్రునితో నడుస్తోంది శకుంతల.

ఇంతలో ఒక అద్భుతం.. ఆకాశంలో ఒక దివ్యధ్వని "మహారాజా! రాజా.. రాజా.. ఈ మహాపతివ్రత శకుంతల నీ భార్య. నీకు ఈ శకుంతలకు పుట్టిన పుత్రుడే ఈ సర్వదమనుడైన భరతుడు. ఈమె చెప్పిన మాటలన్నీ యథార్థాలు. వీరిద్దరిని స్వీకరించు. భార్యాపుత్రులుగా ఆదరించు ఆదరించు... రాజా... ఆదరించు...."

సభాసదులంతా నిర్ఘాంతపోయారు. ఆకాశవాణి... దేవతావాణి కదా... ఇంతకంటె సాక్ష్యం ఏం కావాలి? ఓహో.. ఈమె శకుంతలా? ఇతడు దుష్యంత పుత్రుడా.. ఆహా....

నెమ్మదిగా తేరుకున్నాడు రాజు. అటూ ఇటూ చూశాడు. "ఔను... ఔనౌను... ఈవిడ శకుంతలే... కణ్వమహర్షి కూతురే!

ఈ అబ్బాయి మాకు కలిగినవాడే... అయినా.. నాకూ శకుంతలకే తప్ప ఇతరులెవ్వరికీ ఈ విషయం తెలియదు కదా అని, ఇంత అందమైన అమ్మాయిని చూసి భార్య అనేశాడు అని, మీరంతా అనుకొంటారేమో అని భయపడి అబద్ధం చెప్పాను... శకుంతల సౌందర్యవతి మాత్రమే కాదు. వివేకవతి కూడా. మహాపతివ్రత కాబట్టే భర్తని శపించలేదు. దివ్యవాణి ధర్మాన్ని చాటింది గదా! ఇంక భయం లేదు లోకనిందకి భయపడి అబద్ధమాడానంతే..." 'భరతా... రా తండ్రీ! శకుంతలా... ఇలా రా...' చేతులు చాచి తల్లీ కొడుకుల్ని ఆదరించాడు రాజు. ఔను దుష్యంత మహారాజు.

భరతునికి యువరాజ్య పట్టాభిషేకం చేశాడు. యువరాజు సర్వదమనుడు భరతునిగా అపార సామ్రాజ్య భారాన్ని వహించాడు. పవిత్రనదీతీరాలలో అనేక యజ్ఞాలు యాగాలు భక్తితో నిర్వహించాడు. వర్ణాశ్రమ ధర్మాలను సమర్థవంతంగా పోషించాడు. అనేక దానధర్మాలు చేశాడు. వంశకర్త అయ్యాడు.

**నాస్తి సత్యసమో ధర్మః న సత్యాత్ విద్యతే పరం**
**న హి తీవ్రతరం కించిత్ అనృతాదిహ విద్యతే**

సత్యంతో సమానమైన ధర్మం లేదు. సత్యంకంటే గొప్పదేదీ లేదు. ఈలోకంలో అసత్యాన్ని మించిన తీవ్రమైన పాపం లేదు. ఏదీలేదు. సత్యమే పలకాలి. సత్యం వద. నిజాన్నే పలకండి.

మహాభారతంలో శకుంతలా దుష్యంతుల చరిత్ర చాలా విశిష్టమైన కథ. దుష్యంత మహారాజు స్వభావాన్నే తీసుకుందాం. శకుంతలని మొదటిసారి చూడగానే మనసు చలించింది. ఆవిడ ఎవరో ఏమిటో తెలుసుకున్నాడు. తన బిడ్డని యువరాజుని చెయ్యాలని ఆవిడ కోరితే అంగీకరించాడు. గాంధర్వపద్ధతిలో వివాహమాడాడు. కొద్దిరోజులలో ఇంటికి తీసుకొని వెళ్ళడానికి ఏర్పాటు చేస్తానని చెప్పాడు. రాజ్యానికి వెళ్ళిపోయాడు.

అయితే తర్వాత అతనికి ఒక భయం, ఒక సందేహం కలిగాయి. తన వివాహాన్ని ఎవరూ చూడలేదు. సాక్షులు లేరు. అలాంటి స్థితిలో తన దగ్గరికి వచ్చిన శకుంతల-నేను నీ భార్యని అనగానే ఔను అని అంటే... ప్రజలేమని అనుకొంటారో... అందంగా ఉంది కదా అని వెంటనే అంగీకరించేశాడు రాజు అని ప్రజలు అపార్థం చేసుకుంటారేమో...?? తనని ధర్మదూరునిగా భావిస్తారేమో... ఎందుకు వచ్చిన గొడవ! ఆవిడెవరో తనకు తెలియదు అనేస్తే సరిపోతుంది. అని అసత్యమాడడానికి కూడా భయపడలేదు దుష్యంతుడు.

మరి శకుంతల గురించి ఆలోచిస్తే శకుంతల పరిపూర్ణ వ్యక్తిత్వం కల స్త్రీ. కణ్వమహర్షి పెంపకంలో ధైర్యం, మనోస్థైర్యం, సమస్యల నెదుర్కొని పరిష్కారాలను అన్వేషించి స్థిరంగా నిలిచే నేర్పు, వివేకం అన్నీ రాశిపోసిన స్త్రీగా తీర్చిదిద్దబడిన వ్యక్తిత్వం. అందుకే దుష్యంతుని గాంధర్వ వివాహం చేసుకోవడానికి భయపడలేదు. విషయమంతా అర్థం చేసుకున్న తండ్రి కణ్వమహర్షిముందు ధైర్యంగా నిలిచింది. ఆశ్రమంలోనే దుష్యంత పుత్రుని కంది. ఆ పుత్రునితో కలసి దుష్యంతుని వద్దకు తండ్రి ఆజ్ఞపై బయలుదేరింది. తీరా అక్కడ రాజు ప్రజా భయంతో నీవెవరివో నాకు తెలియదు, ఇంతకు ముందెన్నడూ నిన్ను చూచి ఎరుగను అని అబద్ధం పలికితే ఒక్కక్షణం మనస్సు చెదిరినా నిలదొక్కుకుంది.

రాజుకి ఎన్నో ధర్మాలు ఉపదేశించింది. ఋష్యాశ్రమంలో పెరిగిన వాతావరణం ఆమెకు ఎన్నో ధర్మాలను నేర్పించింది. పెద్దల వలన విన్న ధర్మాలను ధైర్యంగా రాజుకు వివరించ గలిగింది. గృహస్థాశ్రమ ధర్మాలు, సత్యవాక్య వైభవాలు, పుత్రుని కౌగిలింతలోని ఆనందాలు వివరించి కుమారుని చూపించి సాహసంగా నిలిచింది. అబద్ధాలు పలికే రాజుని స్త్రీ సహజమైన క్షమాగుణంతో విడిచి పెట్టిందేగాని అతనిని శపించలేదు. అతనికి కీడు కోరలేదు. మహాపతివ్రతగా నిలిచి తనవంతు కర్తవ్యాన్ని తాను చేసి చూపించిన ధర్మప్రవర్తకురాలు శకుంతల.

స్త్రీ అంటే ధర్మం, ప్రేమ, సాహసం, క్షమ, పరిపూర్ణ వ్యక్తిత్వం కలబోసిన మూర్తి. ఆ రూపానికి మరోపేరు భారత శకుంతల.

ఇక్కడ మనం ఒక విశేషకథని స్మరించుకోవడం తప్పనిసరి. అదే వచ్చే సంచికలో తెలుసుకుందాం! *(సశేషం)*



# పోతన భాగవతం - మధురభక్తి

శ్రీమతి డా॥ పి. జ్యోతి- వరంగల్

**శ్రీమన్నారాయణ దివ్యరూపాన్ని పోతన తలచినతీరు ఇది**
**స్త్రీ నపుంసక పురుష మూర్తియును గాక**
**తిర్యగమర నరాదిమూర్తియును గాక**
**కర్మగుణ భేద సదసత్ప్రకాశి గాక**
**వెనుక నన్నియుఁదానగు విభుండలతు** *(భాగ॥ 8స్కం॥85ప)*

ఇటువంటి పరమాత్మ తత్త్వాన్ని పోతన భాగవతం, మనకు సన్నిహితం చేసింది. శ్రీకృష్ణుని స్తుతించే ఎన్నో ఘట్టాలలో బ్రహ్మ తత్త్వం ప్రబోధింపబడింది. చిన్నబాలునిగా, రక్షకునిగా, సఖునిగా, ప్రియునిగా కృష్ణతత్త్వం భాగవతంలో ఆవిష్కరించబడింది.

**అతి రహస్యంబైన హరిజన్మకథనంబు**
**మనుజుడెవ్వఁడేని మాపురేపు**
**చాల భక్తితోడఁజదువుఁదా సంసార**
**దుఃఖరాశిఁబాసి తొలగిపోవు**

ప్రహ్లాద చరిత్రలో "చాలభక్తి" అనేది ***"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం"*** అని నవవిధాలుగా ఉంటుందని ప్రహ్లాదుడు తండ్రికి వివరించాడు. భక్తి అనేది కావ్యభాషలో రసనామమైనా మౌలికంగా అది భగవల్లక్షణమైన చిత్త పరిపాకం. ***భక్తి రేవైనం గమయతి, భక్తి రేవైనం దర్శయతి. భక్తివశః పురుషః*** అనే ఉపనిషద్వాక్యాన్ని ఆధారంగా చేసుకొని ఎందరో తమ భక్తిని వివిధ భావాలలో వ్యక్తం చేసినారు.

***"మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసి"*** అని శంకరాచార్యులు కూడ **వివేక చూడామణి**లో భక్తిని మోక్షసాధనకు అనువైన ఉపాయంగా చెప్పినారు.

భాగవతంలోని భక్తియోగం సర్వరసభావాలకు ఆశ్రయమై, రసానుభూతికి శక్తివంతమైన సాధనంగా నిలిచింది. నారదుడు, శాండిల్యుడు ***"పరానురక్తి రీశ్వరే", "సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా"*** అని భక్తిని నిర్వచించినారు.

భగవంతునిపై మిక్కుటమైన ప్రేమతో పరిణతమైన చిత్త పరిపాకమే భక్తి అని భావించవచ్చు.

శాండిల్యుడు ***"సర్వస్మాదధికః స్నేహో భక్తి రిత్యుచ్యతే"*** అని (శాండిల్య తత్త్వ సుధ గ్రంథంలో) పేర్కొన్నాడు.

ఆలంకారికులు భక్తిని రసంగా అంగీకరించలేదు. మమ్మటుడు కావ్యప్రకాశంలో దైవ శృంగార లీలావర్ణనను నిరసించినాడు.

***"కింతు రతిః శృంగారరూపా ఉత్తమ దేవతా విషయా న వర్ణనీయా, తద్వర్ణనం హి స్వపిత్రోః సంభోగవర్ణన మివ అత్యంత మనుచితమ్"*** అని పేర్కొన్నాడు.

ధనంజయుడు ప్రీతి భక్త్యాదులైన భావాలు, వేట, అక్షక్రీడ మొదలైనవి హర్షోత్సాహాదులలోనే అంతర్భవిస్తాయి. కనుక వాటిని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. జగన్నాథ పండిత రాయలు రసగంగాధరంలో భక్తిని రసంగా అంగీకరించలేదు.

భక్తికి రసత్త్వాన్ని అంగీకరించిన వారిలో రూపగోస్వామి ప్రధానంగా పేర్కొనదగినవాడు. తన ఉజ్జ్వల నీలమణిలో ***ముఖ్యరసేషు పురా యః సందీపే చోదితా రహస్యత్వాత్ పృథగేవ భక్తిరసరాట్ సవిస్తరేణోచ్యతే మధురః*** అని మధురం, ఉజ్వలం అనే పేర్లతో భక్తిరసాన్ని వివరించినాడు. భక్తికి రసత్వాన్ని అంగీకరించిన వారిలో మరొకరు మధుసూదన సరస్వతి. ఇతడు తన భగవద్భక్తి రసాయనగ్రంథంలో మధురభక్తిని స్థాపించినాడు.

**ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహికతాం గతా ।**
**సర్వేశే మనసోవృత్తి ర్భక్తి రిత్యభిధీయతే ॥** అని నిర్వచించి

**భగవాన్ పరమానంద స్వరూపః స్వయమేవ హి ।**
**మనోగత స్తదాకారో రసతామేతి పుష్కలమ్ ॥**

అని ప్రమాణ ప్రమేయోపన్యాస పూర్వకంగా భక్తి రసమని సిద్ధాంతీకరించినాడు. అంతేకాక, పరమాత్మ స్వరూప శ్రీకృష్ణరతి పరమానంద సంధాయి కావటంవల్ల రసమని అనుకోవడంలో సందేహం లేదని కాంతాది విషయకమైన ఏ రసాదులవల్ల సంపూర్ణం, అసాధరణమైన ఆనందం కలుగదని, అటువంటివి క్షుద్రరసాలని, భగవద్రతిపూర్ణ రసమని, మిణుగురు పురుగుల కన్న సూర్యకాంతి ఏవిధంగా బలవత్తరమైందో అదే విధంగా మిగిలిన రసాలకంటే భక్తిశ్రేష్ఠమైందని వివరించినాడు. చిత్తద్రవ్యం ప్రకృతివల్ల లక్కలాగ కఠినంగా ఉంటుందని, నిప్పుసెగతో లక్క ద్రవించినట్లుగా తాపకాలైన కామ క్రోధాధి విషయాలతోడి కలయికవల్ల అది ద్రవత్వమొందుతుందని, అదే విధంగా భగవంతుని గుణరూప మహిమలు వినడం వల్ల భక్తుల హృదయాలు ద్రవిస్తాయని, సర్వేశ్వరునిపై ఎడతెగని విధంగా వర్తించే మనోవృత్తినే భక్తి అంటారని తెలిపినాడు.

ద్రవత్వం పొందిన చిత్తంలో ప్రవేశించిన వస్తువు ఆకారం స్థిరంగా ఉండిపోతుంది కనుక, భగవదాకార చిత్తవృత్తి భక్తి రసానికి స్థాయీ భావమై విభావానుభావ వ్యభిచారి భావాలవల్ల పరిపుష్టమై బ్రహ్మానంద రూపమైన రసత్వాన్ని పొంది ఆనందాతిశయాన్ని కలిగిస్తుంది. భక్తి రసానికి భగవంతుడు ఆలంబన విభావం కాగా తులసీ చందనాదులు ఉద్దీపన విభావాలు. నేత్ర భ్రూ విక్షేపాదులు అనుభావాలు. నిర్వేదాదులు వ్యభిచారి భావాలు. ఇటువంటి భగవద్రతి విభావాను భావాల చేత ఉద్దీపితమై పరమానంద స్వరూపమైన భక్తిరసంగా పరిణమిస్తుంది.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు సాహిత్య శిల్ప సమీక్షలో "ఈ రతిలో ప్రేయోభావమిమిడి యున్నది. ప్రేమ లేని భక్తి సాయుజ్య సుఖమునీయజాలదు. ప్రేమ రహితుడైన భక్తుడు భగవంతునకు దూరుడగును. ప్రేమ సహితుడైనవాడు భగవచ్చరణారవిందములను ముద్దిడుకొనును. ఆయనచే ముద్దిడుకొనుగోరును. తమ యిరువురుకు హృదయైక్యము భావించుకొనును. ప్రేమ భక్తికి సజాతీయము. ఈ ప్రేమ మిళిత భక్తియే మధురాతి మధురమైన ప్రణయముగా పరిణమించును.

ఆ భక్తుడు తాను ప్రేయసిగా, ప్రియుడుగా విరహబాధ ననుభవించును. ఒక్కొక్కప్పుడు భగవంతుడు తన కౌగిలిలో చేరినట్లు మానసిక సుఖమనుభవించును. ఆ క్షణములో అతనికి సాయుజ్య సుఖము కలుగును. జీవన్ముక్తుడగును. అట్టి భక్తుడు చేసెడిచేష్టలు, పలికెడి పలుకులు లోకమునకు విపరీత కృత్యములుగా తోచినను భగవంతునకు మాత్రము మురిపెంపు చెయ్యిలేయగును. ఒక్కొక్క భక్తుని మనస్తత్త్వమును బట్టి భక్తిలో ప్రేమ కలిసి యుండు ననియు అది ప్రణయముగా మారి శృంగారముగా పర్యవసించు ననియూ, రత్యాలింగితమైన ఈ భక్తినే వైష్ణవ సంప్రదాయమధుర భక్తియనియూనందురు" అని అభిప్రాయపడినారు.

***స ఏవ వాసుదేవోఽసౌ సాక్షాత్పురుష ఉచ్యతే స్త్రీ ప్రాయమితరత్సర్వం జగద్బ్రహ్మ పురస్సరమ్*** అని ప్రమాణము. కాబట్టి జగత్తులోని ఏకైక పురుషుడైన భగవంతుని భర్తృ సంబంధమైన భావ బాంధవ్యంతో అనుభవించడమే మధురభక్తి. తాను ప్రేమించిన వ్యక్తికి సర్వస్వం అర్పించుకోవడం ప్రేమ లక్షణం. మధురభక్తి పరమార్థం కూడా అదే!

**కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా**
**సామగ్రిన్ శిశుపాల ముఖ్య నృపతుల్ సంబంధులై వృష్ణులుం**
**బ్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రింగంటి మెట్లైన ను**
**ద్దామ ధ్యాన గరిష్ఠుడైన హరిఁజెందన్ వచ్చు ధాత్రీశ్వరా!**

భాగవతంలో భగవంతుని పట్ల తమ భక్తిని ఎన్నోరకాలుగా వ్యక్తం చేసి తరించినవారున్నారు. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మాధుర్య భావాలను ప్రకటించిన వారే కాక వైరాన్ని ప్రకటించి ముక్తులైన వారు కూడా ఉన్నారు. కామోత్కంఠతతో గోపికలు అని అన్నప్పుడు కామమంటే ఇక్కడ దివ్యకామమని అర్థం. కృష్ణుడు గోపరూపంలో వారి మధ్య పురుషునిగా ఉన్నాడు. గోపికల జన్మాంతర సుకృతంవల్ల కృష్ణునిపై అలౌకికమైన ప్రేమ కలిగింది. రామావతారంలోని మునులే గోపికలుగా జన్మించారంటారు. శారీరకమైన భోగాలకోసం వారు కృష్ణుని ప్రేమించ లేదు. బాహ్యంగా అతడు బాలుడు. వీరు భర్తలతో కాపురాలు చేస్తూ సంతానవంతులైన స్త్రీలు. భాగవతంలో వర్ణింపబడిన శృంగారం జీవునివేదనగానే భావించవచ్చు. జీవునిలో ఉండే సంవేదనే స్త్రీత్వమని, దానిపేరే గోపిక అని లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతం వర్ణిస్తున్నది. అందుకే గోపికల కామం జీవుని వేదనకు సంబంధించిందే కనుక దీనికి గమ్యం మోక్షమే కాని ఇతరమైన లౌకికానందం కాదు. దీన్నే మధురభక్తి అని అంటారు.

ద్రావిడ ప్రబంధాలలో కూడ ఆళ్వారులు తమను నాయికగా భావించుకొని, భగవంతుని నాయకునిగా తలచి భగవద్విరహానికి సంబంధించిన మధురపాశురాలను రచించి తమ ప్రేమతత్త్వాన్ని ప్రకటించినారు.

ఆళ్వారులలో ముఖ్యులైన నమ్మాళ్వారులు తమపై స్త్రీత్వావస్థను మూడువిధాలుగా (నాయిక, జనని, సఖి) ఆరోపించుకున్నారు. పరమాత్మపై ఉన్న ప్రేమాతిశయమే వారిని ఉన్మాదులను చేసింది. వారి తిరువాయ్మొళ్ళి గ్రంథంలో విరహావస్థ పొందిన ప్రేయసిగా తమను భావించుకొని భగవంతుని దర్శనాన్ని అభిలషిస్తూ.... స్వామి దగ్గరకు పక్షులనే దూతలుగా సందేశం పంపారు ఇలా.... *(సశేషం)*




# శ్రీరామాయణంలో పక్షులు



గతసంచిక తరువాయి

## సంపాతి

కుమారి ఎ. ఉషశ్రీ - సీతానగరం

హనుమ హేమకు సీతారాముల వృత్తాంతాన్ని తెలిపి సీతాన్వేషణకై తాము రామకార్యార్థులై వచ్చిన విషయాన్ని తెలియజేశాడు.

హనుమ ఆ తాపసిని "అమ్మా! మేము ఈ బిలమునుండి ఎలా బయటకు వెళ్ళాలో నీవే అనుగ్రహించాలి. సుగ్రీవుడు మాకు ఇచ్చిన గడువు పూర్తైపోయింది. ఇంకా మేము చేయవలసిన కార్యము చాలా ఉంది" అని ప్రార్థించాడు.

ఆ తాపసి... 'ఈ బిలములో ప్రవేశించినవారెవరు **జీవితం దుష్కరం మన్యే ప్రవిష్టేన నివర్తితుం** జీవించి బయటపడలేరు. నా తపశ్శక్తితో నా నియమపాలనతో మిమ్మల్నందరిని ఈ బిలమునుండి బయటకు చేరుస్తాను' అని పలికింది. ఒక్కసారి ఆ వానరులు కన్నుమూసి తెరచేసరికి వారంతా బిలం బయటకి వచ్చి ఉన్నారు. ఆమె వారితో ఇది "ప్రస్రవణ" పర్వతము, ఇది సముద్రము అని ఆ ప్రాంతాలను పరిచయం చేసి తిరిగి ఆ బిలంలోకి వెళ్ళిపోయింది.

అక్కడి లతలూ, చెట్లూ అన్నీ అందంగా చిగురించి రంగురంగుల పుష్పాలతో ఎంతో అందంగా ఉన్నాయి. ఆ అరణ్యప్రాంతాన్ని చూడగానే అది వసంత ఋతువని వారికి తెలియ వచ్చింది. సుగ్రీవుడు మార్గశిరమాసంలో సేనలను నలు దిక్కులకు పంపి పుష్యమాసము వరకు వారికి గడువునిచ్చాడు.

సుగ్రీవుడిచ్చిన కాలమూ గడిచిపోయింది. అతని శాసనానికా తిరుగులేదు. వచ్చిన కార్యాన్ని నెరవేర్చకుండా వెనుకకు వెళ్ళితే మరణదండన కూడా తప్పదు. ఇక ఇక్కడ ఈ సముద్రము తప్ప ఇక వెతకడానికి ఏమీ మిగలలేదు. వెనక్కి మరలి వెళ్ళి సుగ్రీవుని చేతిలో మరణించేకన్నా ఇక్కడే ప్రాయోపవేశం చేయటమే మంచిది అని యువరాజైన అంగదుడు పలికాడు.

ఆతని మాటలకు వానరులు 'మనం ఆ స్వయంప్రభ బిలంలోనే ఉండిపోతే ఇది ఎవ్వరికీ ప్రవేశయోగ్యమైనది కాదు కనుక, మనం అక్కడ ఉన్నట్లు ఎవరికి తెలీదు. ఎవరికి కనిపించకుండా ఆ బిలంలోనే ఉండిపోతే... అని ఇలా వారిలో వారు చర్చించుకోసాగారు. "ఈ బిలంలో ఎవరూ ప్రవేశించ లేరని మీరనుకుంటున్నారు. కాని, లక్ష్మణుని బాణం **వజ్రాశని సమస్పర్శః గిరీణామపి దారుణః** వజ్రం కంటే తీక్షణమైనది. దానికి ఈ బిలం లెక్కలోనిది కాదు" అని హనుమ వారితో పలికాడు.

'ఇక వచ్చిన కార్యం సాధించకుండా సుగ్రీవునికి ఎలా కనపడగలం? ఇక మనకి ప్రాయోపవేశమే శరణ్యం' అని ఆపర్వతంపై ప్రాయోపవేశానికన్నట్లు పడుకున్నారు వానరులంతా.

ఇంతలో ఒక ఎత్తైన కొండపైనుండి 'దైవం అనుకూలించి నప్పుడు అన్నీ వాటంతట అవే మనదరికి చేరతాయి. ఈ వానరాలు మరణించినా లేకున్నా కొన్నిరోజులవరకూ వీటిని ఆహారంగా తీసుకోవచ్చు' అంటూ ఓ పెద్ద అరుపు వినిపించింది.

ఒకసారిగా ఆ వానరులంతా ఆ ప్రక్కకు చూశారు. అదొకపెద్ద పక్షి. చూడగానే భయం వేసిందివారికి. ఆ పక్షిని చూసిన అంగదుడు మిగిలిన వానరులతో 'చూశారా! ఈ పక్షి మనల్ని తినడానికి సిద్ధపడుతోంది. జటాయువు కూడా ఈ జాతికి చెందిన పక్షే. అయినా రావణుని నుండి సీతమ్మను రక్షించడానికి తన ప్రాణాలొగ్గి పోరాడింది. ధర్మజ్ఞుడైన జటాయువు సీతజాడ శ్రీరామునికి తెలిపి రామునికి ప్రియాన్ని చేకూర్చింది. శ్రీరాముని కృప పొందగలిగింది. తిరిగి రావలసిన అవసరం లేని పరమపద స్థానాన్ని పొందింది. అదే జాతికి చెందిన పక్షే అయినా ఇది మనల్ని తినడానికి సిద్ధమౌతోందే. ఏమి ఆశ్చర్యమో చూశారా!' ఇలా ఆ వానరులు మాట్లాడు కోవడం కనిపించింది.

ఆ మాటలు వింటున్న ఆ పక్షి "ఏనాడో విడిపోయిన నా తమ్ముని స్మరిస్తున్న మీరెవరు? నా తమ్మునికి ఏమైంది? నన్ను ఈ బండపైనుండి క్రిందకి దింపండి" అని కోరింది. కాని దాని ఆకారాన్ని చూసిన వానరులకు దగ్గరకు పోవడానికి భయం వేసింది.

"నేను జటాయువు సోదరుణ్ణి, నాపేరు సంపాతి. నేనూ నా సోదరుడు జటాయువూ వేగంగా భూమిని చుట్టి రావాలని పందెం వేసుకున్నాం. నా సోదరుడు ఆకాశంలో చాలా ఎత్తుకు వెళ్ళిపోయాడు. సూర్యకిరణాల వేడికి నా తమ్ముడు సృహ కోల్పోయాడు. అతనికి ఆ వేడి తాకకుండా చేయాలని నేను

నా రెక్కలను చాపి ఆతనికన్నా ఎత్తుకు ఎగిరాను. ఆ వేడికి నా రెక్కలు కూడా కాలి క్రిందపడ్డాను. నా తమ్ముడు కూడా ఎక్కడో పడిపోయాడు. మళ్ళీ నాకు ఆతని జాడ తెలియలేదు. ఎంతో కాలం తరువాత మీ నోటినుండి ఆతని పేరు వింటున్నాను. దయచేసి నన్ను ఇక్కడ నుండి క్రిందికి దింపండి" అని వేడుకొంది. సంపాతి మాటలు విన్న వానరులు ఆతనిని క్రిందికి దింపారు. జటాయువు వృత్తాంతాన్ని విని చాలా దుఃఖించింది. ఆ వానరుల సహకారంతో సముద్రస్నానం చేసి జటాయువుకి తర్పణం వదిలింది సంపాతి.

తన తమ్ముని మరణానికి కారణమైన రావణుని మీద కోపం వచ్చింది. రావణున్ని అంతమొందించాలనుకుంది.

**"రామస్య యదిదం కార్యం కర్తవ్యం ప్రథమం మయా"** అని తలచింది. ఆ వానరులతో ఇలా చెప్పడం ప్రారంభించింది.

**"జానామి వారుణాన్ లోకాన్ విష్ణోః త్రైవిక్రమానపి ।**
**మహాసుర విమర్దా న్యప్యమృతస్య చ మంథనమ్ ॥**

త్రివిక్రముడు మూడు లోకాలనూ కొలవడం నాకు తెలుసును. దేవాసుర యుద్ధం నేనెరుగుదును. అమృతమునకై సముద్రమును మథించుట నాకు తెలుసు.

దీనినిబట్టి చూస్తే సంపాతి ఎంత వృద్ధుడో కదా! అతని వయస్సుని లెక్కకట్టడం కూడా కష్టమేనేమో!

**"తరుణీ రూపసంపన్నా సర్వాభరణ భూషితా ।**
**హ్రియమాణా మయా దృష్టా రావణేన దురాత్మనా ।**
**క్రోశంతీ రామ రామేతి లక్ష్మణేతి చ భామినీ ॥**

దురాత్ముడగు రావణుడు సర్వాభరణ భూషితురాలైన సౌందర్యవతిని తీసుకుపోతూంటే నేను చూశాను.ఆమె "రామ! రామ! లక్ష్మణా!" అని ఆక్రోశిస్తోంది. బహుశా ఆమెయే సీతకావచ్చు.

నేను ఇక్కడినుండే రావణుని, సీతను చూడగలను. నా దూరదర్శనంతో నేను వందయోజనముల ఆవల ఉన్న వస్తువులను కూడా స్పష్టంగా చూడగలను.

**"ఇహస్థో అహం ప్రపశ్యామి రావణం జానకీం తథా ।**
**అస్మాక మపి సౌవర్ణం దివ్యం చక్షుర్బలం తథా ॥"**

**సముద్రమధ్యలో లంకాపురం అనే ద్వీపం ఉంది.**
**తస్యాం వసతి వైదేహీ దీనా కౌశేయవాసినీ**
**రావణాంతః పురే రుద్ధా రక్షసీభి స్సురక్షితా**
**జ్ఞానేన ఖలు పశ్యామి దృష్ట్వా ప్రత్యాగమిష్యథ॥**

వైదేహి అక్కడ రాక్షసుల మధ్య సురక్షితంగా ఉందని చెప్పింది. ఆ మాట ప్రాయోపవేశం చేయాలని నిర్ణయించుకున్న వానరుల చెవుల్లో అమృతాన్ని చిలకరించినట్లయింది. ఒక్కసారి వారంతా ఎగిరి గంతేసారు. సీత లంకలో జీవించి ఉందనే వార్త వారికి పట్టరానంత ఆనందాన్ని కలిగించింది.

సంపాతి ఇంకా, తనకు సీతమ్మ ఎలా తెలుసునో ఇలా చెప్పడం ప్రారంభించింది. "సూర్యుని వేడికి రెక్కలు కాలి క్రిందపడిన నాకు ఆరురోజులకు తెలివి వచ్చింది. నా తమ్ముడు ఏమయ్యాడో తెలీదు. ఆ ప్రాంతాన్ని బాగా పరీక్షించిన తరువాత అది దక్షిణ సముద్రతీరమైన వింధ్యపర్వతమని గుర్తించాను.

పూర్వం ఈ ప్రాంతంలో నిశాకర మహర్షి ఉండేవారు. ఇది వరకు నేనూ జటాయువు చాలాసార్లు వారి ఆశ్రమానికి వెళ్ళాము. అతికష్టము మీద వారి ఆశ్రమానికి చేరగలిగాను. ఆ మునిశ్రేష్ఠుని చూడగానే దుఃఖం పొంగివచ్చింది. నోటమాట రాలేదు. నిశాకరమహర్షి ఒక్కక్షణం ధ్యానించి ఇలా పలికారు.

సంపాతీ! నేను నీకు రెక్కలను ఇప్పుడే వచ్చేట్లు చేయగలను. కానీ...

**తస్యపుత్రో మహాతేజా రామో నామ భవిష్యతి ।**
**అరణ్యం చ సహభ్రాత్రా లక్ష్మణేన గమిష్యతి ।**
**అస్మిన్నర్థే నియుక్త స్స పిత్రా సత్య పరాక్రమః ।**

'ఇక్ష్వాకు వంశములో దశరథుడను రాజుకు రాముడను కుమారుడు కలుగుతాడు. తండ్రి ఆజ్ఞచే సోదరుడగు లక్ష్మణునితో అరణ్యానికి వస్తాడు. రావణుడను రాక్షసుడు ఆతని భార్యను హరిస్తాడు. ఆమెను వెదకుతూ వచ్చే రామదూతలగు వానరులకు నీవు సీత ఎచ్చట ఉందో తెలియజేయాలి. అంతవరకు నీవు నిరీక్షించు. నీవలన ఈ దైవకార్యం జరగవలసి ఉంది. మరల అప్పుడే నీకు రెక్కలు రాగలవు', అని నిశాకర మహర్షి నాతో చెప్పారు" అని సంపాతి వానరులకు చెప్తూ ఉండగానే రెక్కలు మొలవడం ప్రారంభమయింది.

రెక్కలు వచ్చిన సంపాతి చాలా ఆనందంతో ఇలా తనకి రెక్కలు రావడం రామకార్యం నెరవేరుననుటకు నిదర్శనమని చెప్పి ఆ వానరాలు చూస్తూ ఉండగానే ఆకాశంలోకి రివ్వున ఎగిరిపోయింది.

సంపాతి చెప్పిన మాటలు అంతవరకూ నిరుత్సాహముతో ఉన్న వానరులలో కొత్త ఉత్సాహాన్ని నింపి సీతాన్వేషణలో కార్యోన్ముఖులను చేశాయి.

రామాయణంలో ఒక్కొక్కకాండలో పక్షులద్వారా ఒక్కో రకమైన సందేశం లభిస్తోంది. పైన మనకి కనిపించిన పక్షుల కంటే సంపాతిలో ఒక క్రొత్తదనం కనిపిస్తుంది.

యుద్ధరంగంలో యుద్ధం చేయనని కూర్చున్న అర్జునుని "క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!" అని కార్యోన్ముఖుని చేసిన శ్రీకృష్ణునిలా, నిరాశా, నిస్పృహలతో జీవించడమే వృథా అని ప్రాయోపవేశం చేయాలనుకునే వానరులకి సంపాతే కదా ప్రాణం పోసింది!

ఇక్కడ మన ఆచార్యులైన గోపాలాచార్యస్వామివారికి సంపాతిమీద ఎంతో కోపం వస్తూ ఉండేది. ఎందుకంటే తన రెక్కలబలంతో ఎన్నోసార్లు భూమిని చుట్టిరాగలిగే శక్తి సంపాతికి ఉంది. కొద్దిదూరంలోనే సీత లంకలో ఉందనే విషయం తనే వానరులకు చెప్పింది.

వానరులకు లంకకు వెళ్ళే మార్గ విషయంలో స్పష్టత లేదు. పోనీ ఎలాగోలా ప్రయత్నిద్దాం! అంటే సముద్రాన్ని దాటగలిగే సాధనాలు వారి దగ్గర లేవు. అలాంటప్పుడు తనకి రెక్కలు వచ్చిన కృతజ్ఞతతో సంపాతి కనీసం కొంతమందినైనా తనతో లంకలో సీత దగ్గరకు తీసుకువెళ్ళి దింపడంగాని, తనే అటువెళ్ళి సీతను తీసుకొనివచ్చి ఈ ప్రక్క దింపడం కాని చేసి ఉండాల్సింది.

రామకార్యం వలన రెక్కలు వచ్చినందుకు ఆ రాముడి విషయంలో తను చేయవలసిన కనీస సేవకదా అది! పోనీ తన సోదరుని చంపిన రావణాసురుని తానే చంపి ఉండాల్సింది. రావణునిమీద నాకెంతో కోపంగా ఉంది అని మాటలతో అందే తప్ప చేతల్లో మాత్రం రావణునిపై దాడి చేయలేదు జటాయువు లాగా.

రావణాసుర సంహారం రాముడే చేయవలసినది అనే భావంతో అందులో చేయిపెట్టి ఉండకపోతే పోవచ్చు. కాని, వానరులకు సహకారం చేయడంలో తనేమీ వెనుకాడాల్సిన పనిలేదు. అలాంటిది ఏమీ చేయకుండా కొత్తగా మొలిచిన రెక్కల అందాన్ని చూసుకుంటూ రెక్కలు రెపరెపలాడించుకుంటూ రైయ్య్య్య్య్..... మని వెళ్ళిపోయింది.

"ఎంత స్వార్థమో దానికి ఈకాలపు మనుషుల్లాగా" అని అంటూ ఉండేవారు మన గోపాలాచార్యస్వామివారు. *(సశేషం)*

**మెదడుకి మేత! సమాధానములు**

1. సాధనవలె కన్పడేది నిజమైన సాధన కానిది; 2. శ్రీ వేంకటగిరి లేదా తిరుమల; 3. ఔరసపుత్రిక; 4. సర్వదమనుడు; 5. పరమపదమందు నివసించువాడు; 6. ఉడుతసాయం; 7. హేమ అనే అప్సరసకి; 8. దృశ్యతే కర్మణః ఫలం; 9. నాస్తిక వాదానికి; 10. అర్థము, కామము; 11. నాశనము లేనిది; 12. కిం తద్బ్రహ్మ, కిమధ్యాత్మం, కిం కర్మ పురుషోత్తమ!; 13. ఆభరణాలు; 14. మేఘరంజని; 15. సూర్యోపాసన.

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...)

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

"బామ్మా! రాముడంతటి గొప్పవాడితో యుద్ధం చెయయ్యొద్దని రావణాసురుడికి ఎవరూ చెప్పలేదా?"

"ఎందుకు చెప్పలేదు. ఎంతమంది చెప్పినా తలకెక్కలేదు రావణుడికి. "వినాశకాలే విపరీత బుద్ధిః" అన్నట్లు తోడబుట్టిన తమ్ముళ్ళైన విభీషణ కుంభకర్ణులు చెప్పారు. భార్య అయిన మండోదరి చెప్పింది. సీతమ్మ చెప్పింది. మారీచుడు చెప్పాడు. తాత మంత్రికూడా అయిన మాల్యవంతుడు... "రామో విగ్రహవాన్ ధర్మః" అంటారు. ఆయన ధర్మస్వరూపుడు. శౌర్యవంతుడు కరుణామయుడు. అలాంటి వాడితో కోరి వైరం తెచ్చుకోవటం మంచిది కాదు. అది వంశనాశనానికి దారితీస్తుందని ఎన్నో రకాలుగా హితవు చెప్పాడు.

**"యస్య దేవర్షయః సర్వే గంధర్వాశ్చ జయైషిణః ।**
**విరోధం మా గమస్తేన సంధిస్తే తేన రోచతామ్ ॥**

'సమస్త దేవతలు, ఋషులు, గంధర్వులు శ్రీరాముడి విజయాన్ని కోరుతున్నారు. బలవంతుడైన ఆ రఘువీరుడితో యుద్ధం పెట్టుకోవద్దు. ఇప్పటికైనా మించిపోయింది లేదు. రాముడితో సంధిచేసుకో' అని వయసులో పెద్దవాడు, పదునాలుగు విద్యలలో ఆరితేరినవాడు అయిన మాల్యవంతుడు చెప్పాడు.

నువ్వు దేవ దానవ యక్షుల వలన మరణం లేకుండా వరం పొందావు. 'కోతులూ, మనుషులూ నావంటి బలవంతుడిని ఏం చేస్తాయ"నుకున్నావు. కాని ఆ కోతులూ, మనుషలూ లంకను ముట్టడించడానికి సిద్ధపడ్డారు. నీ రాజ్యానికి పెట్టని కోటలా చుట్టూ ఆవరించి ఉన్న సముద్రానికి బ్రహ్మాండమైన ఆనకట్ట కట్టారు.

**"యేన బద్ధః సముద్రస్య స సేతుః పరమాద్భుతః ।**
**కురుష్వ నరరాజేన సంధిం రామేణ రావణ!"**

'సేతుబంధనం' సామాన్య విషయం కాదు. దాన్ని బట్టే శత్రువు బలాన్ని అర్థం చేసుకొని సంధి చేసుకోవటం రాజుగా నీ కర్తవ్యం" అని చెప్పాడు మాల్యవంతుడు.

రాజైనవాడు తన రాజ్యాన్ని, ప్రజలను, జాతిని రక్షించేవాడుగా ఉండాలి. భక్షించేవాడు కాకూడదు. సీతను నువ్వు తీసుకురావటమే కదా శ్రీరాముడితో శత్రుత్వానికి కారణం. ఆ తల్లిని ఆయనకు అప్పగించి సంధి చేసుకో" అని పలువిధాలుగా చెప్పాడు.

"మరి రావణుడు వినలేదా?"

"వింటే యుద్ధం జరిగేది కాదుగదా! అందుకే తిరుక్కోళూరమ్మాళ్ "అనుకూలం శొన్నేనో మాల్యవానైప్పోల" అంది.

"అంటే..?"

"మాల్యవంతుడు చెప్పిన మాటలు పైకి రావణుడికి హితబోధలా కనపడ్డా అంతరార్థం రాముడికి అనుకూలంగా మాట్లాడటమే కదా! అలా ఒక్క మంచిపనైనా చేయలేదే అని ఆవిడ బాధపడుతోంది.

"అసలు రాముడు అడవికే రాకపోతే ఈ కష్టాలు ఉండేవి కావు కదా బామ్మా!"

"రామావతారంలో పరమాత్మ సామాన్య మానవుడిలా జీవించాడు. కృష్ణావతారంలో తన అతిమానుష చేష్టలను చూపించలేదు కదా! మరి సామాన్య మానవుడు ఎలా నడుచుకోవాలో ఆచరించి చూపించాలంటే తను తండ్రిమాట ప్రకారం నడుచుకోవాలి కదా! దశరథుడు రాముడికే పట్టాభిషేకం చేయాలని నిశ్చయించుకున్నాడు. రాజ్యంలో ప్రజలందరినీ ఆహ్వానించి సభ చేశాడు. వశిష్ఠాది ఆచార్యులంతా కలిసి మంచి ముహూర్తం పెట్టారు. ప్రజలంతా ఎంతో సంతోషించారు. రాముడిలాంటి సుగుణాలరాశి, ధర్మ పరాయణుడు, సౌశీల్యుడు తమను పరిపాలించబోతున్నాడు కదా! అని మురిసిపోయారు. పట్టాభిషేకానికి అన్నీ సిద్ధం చేశారు. సీతారాములు ముందురోజు ఉపవాసదీక్ష ఆచరించి కులదైవమైన రంగనాథుడి ఆలయానికి వెళ్ళి పూజలు చేశారు.

"మరి శ్రీరాముడికి జరగవలసిన రాజ్యపట్టాభిషేకం ఎందుకు ఆగిపోయింది?"

"అలా అనుకున్నవి జరగకపోవటం, అనుకోనివి జరగటాన్నే 'విధి' అంటారు పెద్దలు. దశరథ మహారాజు ముద్దుల భార్య కైకేయి. ఆమె దాసి మంథర. అంతఃపురంలో

జరుగుతున్న కోలాహలాన్ని చూసి శ్రీరాముడి దాదిని విషయం ఏమిటని మంథర అడిగింది. ఎంతో సంతోషంతో "నీకు ఇంకా తెలియదా! మన రామచంద్రుడికి రాజ్యపట్టాభిషేకం జరగ బోతోంది" అని చెప్పింది ఆ దాది."

"విని ఊరుకుందా మంథర?"

"ఊరుకునే స్వభావమేనా మంథరది? ఎంతో ఆవేశంతో కైక దగ్గరకు వెళ్ళి విషయం చెప్పింది. విన్న కైక చాలా సంతోషించి తనకు రాముడు, భరతుడు సమానమేనని చెప్పింది. మంథర అంతటితో వదలలేదు. రకరకాలుగా చెప్పి కైక మనసు విరిచింది. రాముడి రాజ్యపట్టాభిషేకం ఆపించి భరతుడికి పట్టం కట్టమని, రాముడిని పధ్నాలుగేళ్ళు అడవికి పంపమని దశరథ మహారాజుని అడగమంది. అలా అడగడం భావ్యం కాదేమోనని భావించిన కైకను శంబారాసురవధ సందర్భంలో దశరథుడు ఇచ్చిన వరాల విషయం గుర్తు చేసింది మంథర.

"అతనెవరు?"

"తిమధ్వజుడినే శంబారాసురుడంటారు. దండకారణ్యం లోని వైజయంతీపురం రాజు. అతనికి దశరథ మహారాజుకి జరిగిన యుద్ధంలో రథసారథ్యం చేసిన కైక చాకచక్యం వలన దశరథుడు శంబారాసురుడిని చంపగలిగాడు. అందుకని ఆమె చాకచక్యం, తెలివితేటలకు మెచ్చి రెండు వరాలు కోరుకోమన్నాడు రాజు. తనకు ఏ కొరతా లేదని అవసరం వచ్చినప్పుడు కోరుకుంటానని చెప్పింది కైక. ఆ విషయాన్నే మంథర గుర్తుచేసి ఇప్పుడు ఆ వరాలు కోరుకోమని కైకను వత్తిడి చేసింది."

"ఆమె చెప్తే మాత్రం కైక ఎందుకు వినాలి?"

"పదిసార్లు చెపితే చెడు కూడా మంచిగా తోస్తుందని ఊరికే అన్నారా! మంథర చెప్పగా చెప్పగా కైకబుద్ధి మారి పోయింది. దశరథమహారాజు రాగానే తనకు వరాలు కావాలని ఆడినమాట తప్పటం మహాపాపమని చెప్పి తన రెండు కోరికలు బయట పెట్టింది.

**"అభిషేక సమారంభో రాఘవస్యోఽ ప కల్పితః ।**
**అనేనైవాభిషేకేణ భరతోమేఽ భిషిచ్యతామ్ ॥** *అ11-25*

శ్రీరాముడి పట్టాభిషేకానికి ఏర్పాటు చేసిన వస్తు సామగ్రితో భరతుడికి పట్టం కట్టాలి.

**"నవ పంచ చ వర్షాణి దండకారణ్య మాశ్రితః ।**
**చీరాజిన జటాధారీ రామో భవతు తాపసః ॥"**

నవపంచ అంటే 9+5=14 పధ్నాలుగేళ్ళు రాముడు నారచీరలు కట్టుకొని జటాధారిగా దండకారణ్యంలో తపస్సు చేస్తూ గడపాలి అని కోరింది."

ఆమాట వినగానే దశరథమహారాజు మూర్ఛవచ్చి పడిపోయాడు. కైకేయి శ్రీరాముడిని పిలిపించి మా తండ్రిగారి కోరిక అని తన కోరికల్ని వినిపించింది.

"రాముడు విని ఊరుకున్నాడా?"

సామాన్యులైతే తల్లడిల్లిపోతారు. తెల్లవారితే రాజ్య పట్టాభిషేకం. అంతా సిద్ధమైపోయింది అనుకున్నప్పుడు 'నీకు కాదు భరతుడికి రాజ్యపట్టాభిషేకం. నువ్వు అడవికి వెళ్ళి తాపసిగా పధ్నాలుగేళ్లు గడపాలి' అని చెప్తే కోపంతో ఊగిపోయి ఏ దారుణానికైనా తలపడతారు. లేదు కుప్పకూలి, గుండెపగిలి పోతారు. శ్రీరాముడు ఏదీ కాలేదు. ముందురోజు పట్టాభిషేకం అని తెలిసినప్పుడు ఎలా ఉన్నాడో అడివికి వెళ్ళమన్నప్పుడు కూడా అదే నిబ్బరంతో ఉన్నాడు. జితేంద్రియుడైన శ్రీరాముడు కైకతో ఇలా అన్నాడు.

**"ఏవమస్తు గమిష్యామి వనం వస్తు మహంత్వితః।**
**జటాజినధరో రాజ్ఞః ప్రతిజ్ఞామనుపాలయన్॥** *అయోధ్యకాండ 19.2*

జటాధారిగా నారవస్త్రాలు కట్టుకొని అడవికి తప్పక వెళతానన్నాడు రాముడు. ఈ సంఘటనను గుర్తు చేసుకొని తిరుక్కోళూరమ్మ "కాట్టుకు పోనేనో పెరుమాళైప్పోల" అన్నది. సుఖదుఃఖాలను సమానంగా స్వీకరించే ఉత్తమ గుణసంపన్నుడు కదా! రాముడు. అంతటి భాగ్యం నాకు లేకపోయిందే అని బాధపడింది. *(సశేషం)*

చిత్రకథ - 8

# రామానుజ చిత్రకథ












రామానుజా ఎంత అదృష్టవంతుడివి! ఆ తండ్రి వరదుడు ఎంత దయార్ద్ర హృదయుడు. ఆ వరదుని దయలేకుంటే నేను నిన్ను తిరిగి చూడగలిగేదానినా?
వరదుడు చూపిన శాలలో బావిలోంచి తీర్థాన్ని స్వామి కోరుతున్నాడేమో! రామానుజా! పరమ భక్తులైన కాంచీపూర్ణులను ఒక్కసారి సేవించుకో! మంచి సలహా యిస్తాడాయన


అక్కడ... కాశీలో యాదవ ప్రకాశులు
ఆ రామానుజుడు ఏమై పోయాడో ఏమో? తిరిగి వెళ్ళాక వాళ్ళ వాళ్ళకి ఏం సమాధానం చెప్పాలి?
గురువుగారూ!


గోవిందుడిని ఈ లింగంతో శైవునిగా మార్చే యొచ్చు
అదృష్టవంతుడివోయ్ గోవిందా! ఆ కాశీ విశ్వేశ్వరుడి దయ నీకందింది. శ్రద్ధగా దీనిని పూజించుకో!
ఈ లింగాన్ని నా స్వగ్రామం మధురమంగళం లోనే ప్రతిష్టిస్తా.
ఈనాటి నుండి నిన్ను అందరూ "ఉళ్ళంకై కొండ నైనార్" అనే పేరుతో పిలుస్తారు.


మధురమంగళంలో గోవింద భట్టర్ శ్రీకాళహస్తీశ్వరుని ఆలయ నిర్మాణం చేయిస్తూ, అక్కడ కొద్దిమందిని శైవులుగా మార్చుట


ప్రతిష్ఠ పూర్తైంది. తామిక్కడే ఉండి నిర్వహించండి. స్వామీ!
"నమః పార్వతీపతయే! హర హర మహాదేవ!


కాంచీపురంలో...
నాయనా! రామానుజా! కాంచీపూర్ణులను సేవించావా?
ఇదిగో బయలుదేరుతున్నానమ్మా...!
రామానుజా! కాశీయాత్రకు వెళ్ళావని విన్నానే. బాగా అయ్యిందా?
కాశీ వెళ్ళలేదు స్వామీ! అడవిలోనే దారి తప్పి... వరదుడి దయతో ఎలాగో తిరిగి చేరగలిగా ఇక్కడికి.


ఏమైందంటే..
దారి తప్పి...
బోయవచ్చి...
ఆ! ఎంత ప్రమాదం తప్పిందీ! నాయనా! రామానుజా! నీచేత్తో తీర్థకైంకర్యం స్వీకరించాలనేది వరదుడి కోరిక కాబోలు. ఆ స్వామి కోరినట్లే ఆ తీర్థకైంకర్యాన్ని శ్రద్ధగా చేసుకో!
120వ సం॥లో ప్రవేశిస్తున్నా నా తదనంతరము ఈ భక్తి సిద్ధాంతాన్ని కాపాడే భవిష్యదాచార్యులు కావాలి?
అక్కడ శ్రీరంగంలో యామునులు...
భవిష్యదాచార్యులా... ! ఆచార్యా! మీలాంటి సమర్థులు ఇంకెవరుంటారు?
లేదు లేదు
ఆ మహానుభావుడు ఎక్కడో ఉండే ఉంటాడు
భవిష్యదాచార్యులు ఎక్కడో ఉండి ఉంటారని ఎలా చెప్పగలరు స్వామి?
4వేల ఏండ్ల క్రితమే నమ్మాళ్వార్ "కణ్డోమ్ కణ్డోమ్ కణ్డోమ్ । కణ్ణుక్కినియన కణ్డోమ్॥ అన్నారు కదా!
ద్విజోత్తములారా! సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞుడు, మధుర భాషి సదాచార పరాయణుడు, సర్వ లక్షణ శోభితుడైన బాలుణ్ణి గుర్తించే శ్రమ తీసుకోక తప్పదు. వెతికిరండి
ఆచార్యుని ఆజ్ఞ శిరోధార్యం
ఇంకా ఉంది




సహస్రతులసీ శ్రీనివాసం ముగింపు కార్యక్రమంలో "పర్వతాకారుడయిన శ్రీనివాసునికి మంగళహారతి"



వేదవిశ్వవిద్యాలయం, సీతానగరం - వేదవిద్యార్థులు, జీవా- శ్రీరాంనగర్ విద్యార్థులు, నేత్రవిద్యాలయం - విద్యార్థులు



టి.టి.డి. చైర్మన్ శ్రీమాన్ కనుమూరి బాపిరాజుగారికి మంగళాశాసనాలు చేస్తున్న శ్రీవారు. జీయర్‌స్వాములు, జెట్ ప్రముఖులు



గోవిందనామస్మరణతో మార్మోగిన తిరుమల


తిరుమల పాదయాత్రలో శ్రీవారిని అనుసరిస్తున్న భక్తులు




గోగర్భం డ్యాంవద్ద రాత్రి సమావేశంలో తిరుమల చరిత్రను పరిరక్షించుకోవాలన్న పెద్దల శ్రీసూక్తులను శ్రవణంచేస్తున్న భక్తులు



శరణాగతిదీక్ష నాటిక ప్రదర్శించిన చిన్నారులు



జీయర్ ఛానల్ ఆవిష్కరణ




తొండరడిప్పొడి ఆళ్వార్ అనుగ్రహించిన

# తిరుప్పళ్ళియెళ్ళుచ్చి

శ్రీరంగనాథుని సుప్రభాత గీతిక

గతసంచికలో...నాలాయిర దివ్యప్రబంధానికి ప్రణవమైన తిరుపల్లాండును ప్రతిపదార్థ తాత్పర్యములతో తెలుసుకున్నాం. ఇక ప్రథమ అర్చావతారమైన శ్రీరంగనాథునికి సుప్రభాత గీతికగ తొండరడిప్పొడి ఆళ్వారులు పాడిన **తిరుప్పళ్ళియెళ్ళుచ్చి**ని అర్థపూర్వకంగా తెలుసుకుందాం! వీరినే భక్తాంఘ్రిరేణువు లేదా విప్రనారాయణులు అంటారు.

ఆనాడు త్రేతాయుగంలో విభవస్వరూపుడైన శ్రీరామచంద్రుణ్ణి మేలుకొలిపే అదృష్టం పొందాడు విశ్వామిత్ర మహర్షి. ఆ రాముని ఆరాధ్యదైవమైన శ్రీరంగనాథునికి నిత్య మాలాకైంకర్యం చేస్తూ మేలుకొలుపు పాడే అదృష్టం పొందారు తొండరడిప్పొడి యాళ్వార్.

పన్నెండుమంది ఆళ్వార్లలో శ్రీరంగనాథునికి మేలుకొలుపు పాడింది తొండరడిప్పొడి యాళ్వార్లొక్కరే. ఆండాళ్‌తల్లి తిరుప్పావైలో ఒకటి రెండు పాశురాలలో మాత్రమే పరమాత్మకు మేలుకొలుపు పాడింది. కాని, తొండరడిప్పొడి ఆళ్వారొక్కరే మేలుకొలుపునే ఒక ప్రబంధంగా రంగనాథుని విషయంలో పాడారు. మిగతా ఆళ్వార్లంతా రంగనాథునితోపాటు మిగిలిన దివ్యదేశాలలో ఉండే స్వామిని కీర్తించారు. తొండరడిప్పొడి ఆళ్వార్లు ఒక్క శ్రీరంగనాథుని తప్ప మరొకమూర్తిని స్మరించలేదు. మరొక రకంగా చెప్పాలంటే పన్నెండుమంది ఆళ్వార్ల గానాన్ని పొందింది ఒక్క రంగనాథుడే!

ప్రతిదినం ఆలయాలలో, ఇండ్లలో జరిపే సేవాకాలంలో "తిరుప్పల్లాండు" తరువాతి స్థానాన్ని సుప్రభాత గీతికయైనందున "తిరుప్పళ్ళియెళ్ళుచ్చి" పొందింది. దీని ఆధారంగానే తిరుమల ఆలయాలలో కూడా సుప్రభాతాన్ని తయారు చేశారు.

**తిరుప్పళ్ళి**=శ్రీపర్యంకంనుండి; **యెళ్ళుచ్చి**=మేలుకొలుపు.

తొండరడిప్పొడి ఆళ్వార్లు పాడిన ఈ పదిపాశురాలలోనూ 'అరంగత్తమ్మా! పళ్ళి యెళ్ళుందరుళాయే!" అంటూ శ్రీరంగనాథా పడకనుండి లేచి అనుగ్రహించవయ్యా! అన్న మకుటంతో మేలుకొలుపు పాడారు.

తిరుప్పళ్ళియెళ్ళుచ్చి గ్రంథంలోకి ప్రవేశించే ముందు దానిని మనకందించిన ఆళ్వార్లని ప్రార్థిద్దాం! యామునాచార్యులవారి శిష్యులైన "మాలాధరార్యులు వీరి విషయంలో కీర్తించిన శ్లోకాన్ని తెలుసుకుందాం! మాలాధరార్యులనే తిరుమాలైయాండాన్" అంటారు.

*తిరుమాలైయాండాను సాయించిన తనియ*

**తమేవ మత్వా పరవాసుదేవం**
**రంగేశయం రాజవ దర్హణీయమ్।**
**ప్రాబోధకీం యో౽కృత సూక్తిమాలాం**
**భక్తాంఘ్రిరేణుం భగవంత మీడే ॥**

| | | |
|---|---|---|
| ***రాజవత్*** | = | రాజువలె |
| ***అర్హణీయం*** | = | పూజించదగు |
| ***రంగేశయం*** | = | శ్రీరంగంలో శయనించి ఉన్న దేవుని |
| ***తం*** | = | వేదప్రసిద్ధుడైన |
| ***పరవాసుదేవం ఏవ*** | = | పరమపదవాసుడగు వాసుదేవుడే అని |
| ***మత్వా*** | = | తలచి |
| ***ప్రాబోధకీం*** | = | మేలుకొలుపెడి |
| ***సూక్తిమాలాం*** | = | పాటలమాలికను |
| ***యః*** | = | ఎవరైతే |
| ***అకృత*** | = | తయారు చేసిరో |
| ***భగవంతం*** | = | పూజించదగిన గొప్పగుణములు కల |
| ***భక్త+అంఘ్రి+రేణుం*** | = | భక్తులయొక్క పాదములయందలి ధూళిని నేను అని భావించిన ఆళ్వారును |
| ***ఈడే*** | = | త్రికరణములా స్తుతించుచున్నాను. |

***తా:*** శ్రీరంగనాథుడు భూమిపై ప్రపథమంగా ఆవిర్భవించిన అర్చామూర్తి. స్వయంగా పరమాత్మే సృష్టి ఆరంభంలో చతుర్ముఖ బ్రహ్మకి వాత్సల్యంతో శేషశాయిగ వేంచేసి ఉన్న తన మూర్తిని అనుగ్రహించాడు. తరువాత బ్రహ్మ ఆ మూర్తిని ఇక్ష్వాకు వంశం వారికి అందించాడు. పరంపరగా శ్రీరామచంద్రుడుకూడా ఆరాధించిన ప్రపథమ అర్చారూపమది. పట్టాభిషేకానంతరం

తనని వీడి ఉండలేనన్న విభీషణునికి తనకు ప్రతీకగా తానారాధించిన ఆ శయనమూర్తినే తోడుగ పంపాడు. విభీషణుడు ఉభయకావేరీ మధ్య ఆమూర్తిని ప్రతిష్ఠించాడు. నాటినుండి ఆ ప్రాంతం శ్రీరంగమైంది. స్వామి శ్రీరంగ నాథునిగ, రంగరాజుగ ఆరాధనలందుకుంటున్నాడు.

లోకనాథుడైన శ్రీరంగనాథ స్వామిని (రాజాధిరాజులకు వందిమాగధులు మేలుకొలుపు పాడినట్లు) మేలుకొలుపుతూ 10 పాటలను పాడారు తొండరడిప్పొడి ఆళ్వార్లు. పరతత్త్వమైన పరమాత్మనందే కాక, వాని భక్తులయందు కూడా ఆదరభావం కలవారు. తమని తాము భగవద్భక్తుల పాదరేణువుగా వినయంతో భావించుకునేంతటి భాగవతనిష్ఠ కలవారు. అంతటి భగవద్భాగవతనిష్ఠ కలిగి, భగవంతునికే **సుప్రభాతగీతిక**లను పాటల మాలను సమర్పించిన తొండరడిప్పొడి ఆళ్వార్లను త్రికరణశుద్ధిగ స్తోత్రం చేయుచున్నాను" అని ఈ శ్లోకంలో ఆళ్వార్ల వైభవాన్ని మాలాధరులు తెలుపుతున్నారు.

***తిరువరంగ ప్పెరుమాళ్ అరైయర్ సాయించిన తనియన్***

**మండంగుడి యెన్బర్ మామఱైయోర్ మన్నియశీర్,**
**తొండరడిప్పొడి తొన్నగరమ్, వణ్డు**
**తిణర్త్తవయల్ తెన్ అరంగత్తమ్మానై, పళ్ళి**
**యుణర్త్తుం పిరాన్ ఉదిత్త ఊర్ ॥** 1

| | | |
|---|---|---|
| ***శీర్*** | = | సంపదలు |
| ***మన్నియ*** | = | స్థిరముగా ఉండెడిక్షేత్రం |
| ***మండంగుడి*** | = | మండంగుడి అని |
| ***మా*** | = | గొప్పవారగు |
| ***మఱైయోర్*** | = | వేదవేత్తలు (మఱై=వేదం) |
| ***ఎన్బర్*** | = | అంటారు |
| ***వణ్డు*** | = | తుమ్మెదలు |
| ***తిణర్త*** | = | ఝుంకారము చేయు |
| ***వయల్*** | = | పొలములుకల |
| ***తొల్*** | = | ప్రాచీనమైన |
| ***నగరం*** | = | జనపదమది |
| ***తెన్*** | = | దక్షిణ దిక్కునకు చెందిన |
| ***అరంగత్తమ్మానై*** | = | శ్రీరంగనాథుని |
| ***పళ్ళి ఉణర్త్తుం*** | = | పడకనుండి మేలుకొలుపునట్టి |
| ***తొండరడిప్పొడి*** | = | తొండరడిప్పొడి ఆళ్వార్ అనెడి |
| ***పిరాన్*** | = | ఉపకారకులు |
| ***ఉదిత్త*** | = | అవతరించిన |
| ***ఊర్*** | = | ఊరు అదియే. |

***తా:*** తమిళనాడులో **మండంగుడి** అని ఒక ప్రసిద్ధక్షేత్రము ఉంది. **మండంగుడి** అంటే 'ఆదరించదగిన స్థానము' అని అర్థము. ఇక్కడ సంపదలు స్థిరంగా ఉంటాయని వేదవేత్తలందరూ కూడా అభిమానించిన ఊరు. తొండరడిప్పొడి ఆళ్వార్లవంటి భగవద్భాగవత కైంకర్య నిష్ఠాపరులు అవతరించిన ఊరు. తుమ్మెదలు ఝుంకారము చేస్తూ సంచరించేటువంటి పద్మములతోనిండిన సుభిక్షమైన పొలములు కల ప్రాచీనమైన ఊరు. హృదయ పద్మాలలో భగవంతుని దర్శించి కీర్తించే తుమ్మెదలవంటి భాగవతోత్తములు కలదీ ఊరు.

దక్షిణదిక్కున, శేషపాన్పుపై యోగనిద్రలోనున్న శ్రీరంగని పాటలమాలికతో సుప్రభాతం ఆలపించి, మేలుకొలిపి, మనరక్షణలో ప్రవర్తింపచేసిన ఉపకారకులు వీరు. ఆళ్వార్లు అవతరించడంతో భగవద్భాగవత కైంకర్య సంపద స్థిరంగా నిలిచి ప్రసిద్ధిచెందింది అని వేదవేత్తలంతా ఇక్కడే స్థిరనివాసం ఏర్పరచుకున్నారు" అంటూ యామునుల కుమారులు ఆళ్వార్ల అవతారక్షేత్రాన్ని కీర్తించారీ పాశురంలో.

## బదరీనాథ్ జ్యోతిర్దర్శనం

**శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో...**

**ఈ సంవత్సరం ఏప్రిల్ 29వ తేదీన జ్యోతి దర్శనంతో బదరీనారాయణుడు భక్తులకు దర్శన భాగ్యం అనుగ్రహించనున్నాడు. బదరీనాథ్‌లో మన అష్టాక్షరీక్షేత్రం ది. 26.04.2012 నుండి భగవద్బంధువులను సాదరంగా ఆహ్వానిస్తున్నది.**

**తదీయారాధన కొరకు కైంకర్యములు సమర్పించ దలచినవారు ది. 12.04.2012 లోపుగా వారి వారి ద్రవ్యములను సీతానగరము లేక శ్రీరామనగర్ (ముచ్చింతల్, శంషాబాద్) చేరునట్లు పంపించగలరు.**

## హృషీకేశ్ రామమందిర్ ప్రథమ బ్రహ్మోత్సవములు

**జీయర్ మఠ్, హృషీకేశ్‌లోని శ్రీసీతారామలక్ష్మణ సమేత హనుమాన్ మందిర ప్రథమ బ్రహ్మోత్సములు ది13.5.2012 నుండి 16-5-2012 వరకు జరుగును. భగవద్బంధువులందరికీ ఇదే ఆహ్వానం.**

***వివరములు:***

**జెట్ సీతానగరం - 08645 272929; జెట్ హైదరాబాద్ - 040 23224426 శ్రీరామ్ నగర్ - 9553549971/72 డా॥ టి. రామనాథం-040 24048045; వేణుగోపాల్ -94404 82325; సిహెచ్. వెంకటేశ్వరరావు - 9441234003; ఎమ్.మల్లిఖార్జునరావు- 92467 61235; పి.మోహన్‌రావు - 9347543444.**

గీతా మాహాత్మ్య కథలు-2

# మార్గదర్శియైన మేషం

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

గతసంచికలో **కుమతులు** అనే కథ ద్వారా భగవద్గీతలో అష్టమాధ్యాయములో కేవలం అర్థ శ్లోకం చదివినంత మాత్రమునే ఉద్ధరింపబడినవారి గురించి తెలుసుకున్నాం! ఈ నవమాధ్యాయ మహిమను తెలిపే అద్భుత కథలను తెలుసు కుందాం.

భగవద్గీతలో తొమ్మిదవ అధ్యాయానికి పేరు **రాజవిద్యా రాజగుహ్యాయోగము.** రాజవిద్య అంటే విద్యలలోకెల్ల శ్రేష్ఠమైనది అని అర్థము. రాజగుహ్యం అంటే రహస్యాలన్నింటిలో మిక్కిలి రహస్యమైనదని అర్థము. ఆధ్యాత్మిక విద్యలన్నింటిలో శ్రేష్ఠమైనది, రహస్యమైనది కావుననే ఈ అధ్యాయానికా పేరు పెట్టారు. ఈ అధ్యాయంలో ఈ సకల సృష్టి స్థితి లయకారణుడు తానేనని, మానవులు భక్తియను మార్గము ద్వారానే తనని చేరవలసి యుంటుందన్న రహస్యాన్ని ఈ అధ్యాయములోనే శ్రీకృష్ణ పరమాత్మ బోధించాడు. ఇక కథలో ప్రవేశిద్దాం!

మాహిష్మతీపురం నర్మదానదీ తీరంలో గల అందమైన నగరం. అక్కడ మాధవుడనే శుద్ధ శ్రోత్రీయుడైన బ్రాహ్మణు డుండేవాడు. సకల వేదవేదాంగ పారంగతుడు, నిత్యాగ్ని హోత్రావధాని. అతడు ఒక యజ్ఞాన్ని చేయతలపెట్టాడు. ఆ యాగారంభంలో బలి ఇవ్వడానికి ఒక మేషం, అనగ మేకను సిద్ధం చేసాడు. ఆ మేకను చక్కగా కడిగి, పూజించి బొట్టుపెట్టి, పూలహారం వేసి, నమస్కరించి బలి కొరకు వధ్య స్థలానికి తీసుకొని వచ్చాడు. అప్పుడు ఆ మేక అందరూ ఆశ్చర్యపడేలా బిగ్గరగా నవ్వుతూ, పెద్ద కంఠస్వరంతో ఇలా చెప్పింది.

"మాధవా! అల్పమైనవి, నశించేవి అయిన ఫలితాలనిచ్చే ఈ యజ్ఞాలు చెయ్యడం వలన నీకేం ఒరుగుతుంది? ఇటువంటి యజ్ఞాలు గత జన్మలలో నేను చాలా చేసాను. దాని ఫలితమే నేటి నా మేక జన్మ."

మాధవుడు ఆ మాటలను విని ఆశ్చర్యచకితుడై, తేరుకుని ఆ మేకకు తిరిగి సాష్టాంగ వందనం సమర్పించి ఇలా అన్నాడు. "మహానుభావా! తమరెవ్వరు?" దయయుంచి చెప్పవలసినది అని ప్రార్థించాడు. అందుకు ఆ మేక తన స్వీయ వృత్తాంతాన్ని ఇలా చెప్పింది.

"ఓ బ్రాహ్మణుడా! నేను కూడా గతజన్మలో ఒక పవిత్రమైన బ్రాహ్మణ కుటుంబంలోనే జన్మించాను. వేదవేదాంగాలు చదివాను. ఎన్నోయజ్ఞయాగాదులు నిర్వహించాను. ఆ సమయంలో నా కుమారుడు రోగగ్రస్తుడయ్యాడు. ఆతని రోగాన్ని నయం చెయ్యాలనే ఉద్దేశ్యంతో ఒక కామ్యక్రతువు నారంభించాను. అందులో భాగంగా ఒక మేకను తెచ్చి బలి ఇచ్చాను. ఆ బలి ఇచ్చినదే తడువుగా ఆ మేకపిల్ల తల్లి వచ్చి నాతో ఇలా అంది. "ఓ బ్రాహ్మణాధమా! నీ కుమారుడి ఆరోగ్యం కోసం నా బిడ్డను వధిస్తావా! దీనికి ప్రతిఫలంగా నీకు మరు జన్మ మేక జన్మమే అగుగాక!", అని శపించి ఆ మేక వెళ్లిపోయింది. తత్ఫలితంగా నాకు ఈ మేకజన్మ లభించింది. కిందటి జన్మలలో నేను చేసిన పుణ్యఫలంగా గత జన్మ స్మృతులున్నాయి.

ఈ భయంకర సంఘటన విన్న మాధవుడు ఆ మేకతో "స్వామీ! నీ దయవలన నాకు జ్ఞానోదయమైంది. నేను ఈ యజ్ఞ కార్యక్రమాన్ని విరమిస్తున్నాను. ఇప్పుడు నాకు సర్వ సుఖములు ప్రాప్తించే సన్మార్గాన్ని తెలియజెయ్యి" అన్నాడు. దానికి ఆ మేక ఇలా సమాధానం చెప్పింది.

మాధవా! నీ ప్రశ్నకు సమాధానం తెలిపే కథ చెప్తాను విను. "పూర్వం కురుక్షేత్రాన్ని చంద్రసేనుడనే మహారాజు పరిపాలించేవాడు. ఆ రోజుల్లో ఒక సూర్యగ్రహణం వచ్చింది. తద్దోష నివారణార్థం తాను ఒక పవిత్ర బ్రాహ్మణుణ్ణి పిలిపించి, అతనితో పాటు తాను కూడా నదీ స్నానాన్ని చేసి, ఆతనికి "కాలపురుష" విగ్రహాన్ని దానం చేసాడు.

"చండాల" అనే పాపాత్ముడు అదే విగ్రహం నుండి వెలువడి, పట్టరాని ఆ దానాన్నిపట్టిన ఆ బ్రాహ్మణుని దేహంలోకి ప్రవేశించి పీడించడం మొదలుపెట్టాడు. కాలపురుషుడు అంతటితో ఊరుకోక "నింద" అనే అరుణ నేత్రాలు కలిగిన చండాల స్త్రీని కూడా సృజించాడు.

ఆ చండాల దంపతులు ఆ బ్రాహ్మణుని శరీరంలో ప్రవేశించి ఆతనిని పీడించడం చంద్రసేన మహారాజు స్పష్టంగా దర్శించాడు. కాని ఆ విప్రుడు చలించలేదు. కొద్దిసేపటిలోనే

విష్ణు కింకరులు వచ్చి ఆ చండాల దంపతులను ఆతని దేహం నుండి తరిమివేశారు. చంద్రసేన మహారాజు ఆ విప్రుణ్ణి సమీపించి ఇలా అడిగాడు. "స్వామీ ! మీలో ఇంతటి నిశ్చలతకు కారణమేమిటి? మీరు ఏ మంత్రం అనుసంధించడంవలన ఈ చండాల దంపతులు తరిమివేయబడ్డారు?" దానికి విప్రుడిలా సమాధానమిచ్చాడు...

**గీతాయాః నవమాధ్యాయం జపామి ప్రత్యహం నృప ।**
**విస్తీర్ణాశ్చాపదస్తేన కుప్రతి గ్రహ సంభవాః ॥**

**గీతాయాః నవమాధ్యాయ మంత్రమాలా మయా స్మృతా।**
**తన్మాహాత్మ్య మిదం సర్వం త్వమవేహి మహీపతే! ॥**

"ఓ రాజా! నేను భగవద్గీతలోని నవమాధ్యాయాన్ని సదా జపించడం వలన, అర్థాన్ని అనుసంధానించడం వలన ఈ అవాంతరాల నుండి రక్షింపబడ్డాను. ఈ నవమాధ్యాయం పారాయణ మహాత్మ్యం వల్లనే నేను తీసుకునే ఇటువంటి దానాల వలన కలిగిన పాపం నశించిపోయింది."

"శ్రీకృష్ణుడు ఈ అధ్యాయంలో 1) నీవు ఇహలోక సుఖాలకై చేసే వర్ణాశ్రమవిహిత కర్మలు, దేహధారణకై చేసే ఆహారస్వీకారాదులు, 2) పరలోక ప్రాప్తికై చేసే హోమము, దానము వంటి సత్కర్మలు, అంటే నీ పుణ్యకర్మలను, 3) మోక్ష సాధనకై చేసే తపస్సు, లేక భక్తివంటి ఆముష్మిక కర్మలను కూడా తనకే సమర్పించమన్నాడు. అంటే వాటన్నిటినీ కూడా తన ఆరాధనగ చేస్తూ, వాటి ఫలితాన్ని తనకే అర్పించివేయ మన్నాడు.

తద్వారా మనలో ఉండే 1. కర్తను నేనే అనే కర్తృత్వ అహంకారాన్ని, 2. అనుభవించేది నేనే అనే భోక్తృత్వ అహంకారాన్ని, 3. ఫలితం నాకోసమనే సంగాన్ని, తొలగించి మనలను నిష్కామకర్మమార్గంలో నిలిపి, **సర్వం శ్రీకృష్ణార్పణమస్తు** అనిపిస్తాడు. మనం చేసే వాటిలోని లోపాలని, వాటివల్ల కలిగే దోషాలనీ కూడ తాను పరిహరించి మనకి శ్రేయస్సుని కలిగిస్తానన్నాడు."

రాజా! దీనిని విశ్వసించే విప్రునిగ దానం స్వీకరించటం నాధర్మం. కనుక స్వీకరించాను. వెంటనే స్వామి చెప్పినట్లుగ దానిని కృష్ణార్పణమంటూ మనసులోనే స్వామికి సమర్పించి వేశాను. కనుక దుష్టశక్తుల ప్రభావం నామీద పడకుండా స్వామే అడ్డుకున్నాడు అన్నాడు విప్రుడు. అది విని చంద్రసేనుడు నాటినుండి భగవద్గీత యొక్క నవమాధ్యాయ మహిమను ఎరిగి, చక్కగా అభ్యసించి దోషాలన్నీ తొలగి, ఆ విప్రునితో పాటు మోక్షమును పొందాడు.

మాధవ! నీవు కూడా ఆ నవమాధ్యాయ పారాయణ మాత్రముననే సకల ఫలములను పొందగలవు అని చెప్పిన మేకను మాధవుడు విడిచి పెట్టేశాడు. చక్కగ భగవద్గీత నవమాధ్యాయాన్ని పారాయణ చేశాడు. అందులో..

**అనన్యాశ్చింతయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥**

"ఏ ప్రయోజనము కోరక, ఎవరు నా గురించి సదా చింతిస్తూ, ఎడతెగక ఉపాసిస్తూ, ఎల్లప్పుడు నాయందే నిష్ఠకలిగి యుంటారో వారియొక్క యోగక్షేమములను నేనే వహిస్తాను" అన్నాడు స్వామి.

ఇచ్చట **"యోగం"** అంటే తన భక్తులకు కావలసినవి, లేనివి తెచ్చి ఇవ్వడమన్నమాట. అలాగే **"క్షేమం"** అన్నమాటకు తన భక్తులకు గల భోగములను పోకుండా రక్షిస్తాను అని అర్థం. **వహామ్యహం** అంటే వీటిని ఆ భక్తులేం కోరనవసరంలేదు. నేనే వారిని అర్థం చేసుకుని అవి ఎల్లప్పుడు భక్తులకు సమకూరేలా చూస్తాను అని అర్థం. ఇలా తనను ప్రేమించే భక్తులకు కొంగుబంగారమై యుంటానని ప్రకటించాడు భగవంతుడు.

మాధవుడు నవమాధ్యాయ పఠనం ద్వారా స్వామి చెప్పిన ఈ మాటలను విశ్వసించి, స్వామినే తలుస్తూ, వాని అనుగ్రహంతో సకల సంపదలు పొంది, చక్కటి జీవితాన్ని అనుభవించి అనంతరం ముక్తిని పొందాడు.

ఈ విధముగా శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవికి చెప్పిన ఈ కథను పార్వతీదేవికి గిరిజాపతి తెలియజేసాడు. ఇంత మహిమ గల ఈ నవమాధ్యాయ పారాయణ మనకందరికి ఉద్ధారకము.

## 'మీ' 'భక్తి' 'నివేదన' ఆచార్య వైభవం

మన ఆచార్యుల వైభవం ఎంత చెప్పినా అది తక్కువే అవుతుంది. ఆయన కృప అపారం. అది అనుభవైకవేద్యం. ఒకసారి (సుమారు 15 సం॥ల క్రితం) అపుడు నేను అమెరికాలో మా అమ్మాయి దగ్గర ఉన్నాను. స్వామివారు చికాగో గుడికి వస్తున్నారని తెలిసింది. నేను అపుడు ఒక పెద్ద సమస్యతో సతమతమవుతున్నాను. ఆ సమయంలో స్వామిని దర్శించుకుని సమస్యను విన్నపం చేసుకుందామనుకున్నాను. నేను స్వామివారిని దర్శించుకుని నా బాధ చెప్పుకుంటే స్వామివారు... **"అసలు మీరు ఇక్కడ ఎందుకున్నారు? పిల్లలకు మీరు చేయవలసింది మీరు చేశారు. వారిని సాగనివ్వండి. వారితో పాటు మీరు ఎంత దూరం సాగుతారు? మీరు తరించే మార్గం మీరు చూసుకోండి"** అన్నారు. నాకు అపుడు అర్థమవలేదు. స్వామి నాకు ఏదైనా సలహా చెప్తారు అనుకుంటే ఇలా చెప్పారేమిటి? అనిపించింది. కొంచెం అసంతృప్తిగానే వెనక్కు వచ్చాను.

అపుడు నాతో తెచ్చుకున్న స్వామి ప్రవచనాలు భగవద్గీత 6 వాల్యూమ్స్, ఉపనిషత్తులు 5 వాల్యూమ్స్ క్యాసెట్స్ పెట్టుకుని వినటం ప్రారంభించాను. అంతే అవి వింటుంటే అదొక ఆనందం. ఒకరోజు ఒక అర్థం స్ఫురిస్తే మరుసటిరోజు ఇంకొక అర్థం, ఆ తరువాతి రోజు ఇంకొక అర్థం. ఇలారోజుకో అర్థం స్ఫురిస్తూ నిత్యనూతనంగా అనిపించేది. ప్రొద్దుటి నుండి సాయంత్రం వరకు, పనిచేసుకుంటూ వినేదాన్ని. ఆ విధంగా సుమారు రెండు సంవత్సరాలు విన్నాను. క్రమంగా మనస్సు లౌకిక విషయాల వైపునుంచి భగవంతునివైపు మరలసాగింది. నా విచారం అంతా మరిచి పోగలిగేదాన్ని. కాలక్రమేణ లౌకిక సమస్యలూ దూరమైనాయి. అపుడు నాకు అర్థమయింది. స్వామి నాకు ఏదో చిన్న సలహా ఇస్తారనుకుంటే, ఎంత అమూల్యమైన శాశ్వత పరిష్కారం ఇచ్చారో! ఎన్ని జన్మలకూ తరగని జ్ఞానసంపద నిచ్చారు. అటువంటి ఆచార్యులకు ఏ విధంగా కృతజ్ఞత చెప్పుకోగలను? ఆయన చెప్పిన, చూపిస్తున్న బాటలో నడవటానికి ఈ మనస్సును, బుద్ధిని సరైన మార్గంలో నడిపించి, తద్వారా ఆచార్యముఖ వికాసం కలిగేట్లుగా వారే అనుగ్రహించా లని ప్రార్థిస్తున్నాను.

**శాంతికుమారి-విజయవాడ**



## కోటి అష్టాక్షరీ మహామంత్ర జపము మరియు అఖండ సుందరకాండ పారాయణ

మన ఆచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు సంకల్పించిన కార్యక్రమములు నిర్విఘ్నంగా కొనసాగాలని, అపార్థములు, అపోహలు తొలగాలని **బదరీనాథ్‌లో 29.04.202 జ్యోతిర్దర్శనంనుండి కోటి అష్టాక్షరి మంత్రజపము** మరియు **హృషీకేశ్ రామమందిరములో 15.05.2012** నుండి **అఖండ సుందరకాండ పారాయణ** కార్యక్రమములు శుభారంభము కానున్నవి.

ఈ కార్యక్రమముల సమాపనోత్సవములకు శ్రీశ్రీశ్రీ స్వామివారి ప్రత్యక్షపర్యవేక్షణలో సెప్టెంబరు, 2012లో జరుగును. వివరములు భక్తినివేదనలో ప్రకటించబడును. శ్రద్ధాళువులందరు ఈ అష్టాక్షరీ మంత్ర జపము, హవనము మరియు హృషీకేశ్‌లో సుందరకాండ పారాయణలో నియమబద్ధంగా పాల్గొనవచ్చు. అరుదుగా లభించే ఈ అవకాశాన్ని వినియోగించుకుని ధనరూపంలోగాని ఇతరత్రాగాని కైంకర్యం చేసి, అష్టాక్షరి మహాక్రతువులో పాల్గొని నరనారాయణుల కృపాకటాక్షములు, శ్రీశ్రీశ్రీ జీయరు స్వామివారి మంగళాశాసనములను పొందండి.

ముందుగా తమ పేర్లను నమోదు చేసుకొనిన కైంకర్య పరులకు అన్ని సౌకర్యములు కల్పించబడును.

**శ్రీకార్యం**
**డా॥ రామనాథం**



రాయల ఊహల పల్లకీ....

# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

విల్లిపుత్తూరు నగరంలో ఉత్తమజాతి అశ్వాలున్నాయి. వాటికి రెండు పక్కలా సింగిణీవిల్లులు, అమ్ములపొదులు కడతారు. ఆ అమ్ములపొదుల్లో పాముల్లాంటి బాణాలున్నాయి. ఆ బాణాలకు రెండువైపులా వేగంగా దూసుకుపోవడానికి వీలుగా రెక్కలున్నాయి.

ఒకప్పుడు గుఱ్ఱాలక్కూడా రెక్కలుండేవిట. శాలిహోత్రుడని ఒకమునిశాపంవల్ల వాటి రెక్కలు పోయాయి. సహజంగా గుఱ్ఱాలు కంటికొనలతో పక్కలకు చూస్తాయి. నోట నురుగుంటుంది. కళ్ళెంలాగి బిగపడితే తల ఊపుతూ ఉంటాయి. ఇది వాటలవాటు.

మాకు మునిశాపంవల్ల రెక్కలుపోయేయి, మీకేమో రెక్కలున్నాయి. అయితే ఏం లెండి మాతో వేగంలో మీరు పోటీ వస్తారా? రండి, అని బాణాలను పక్కచూపులతో నురుగుల పరిహాసంతో కళ్ళెపుబిగువున మోరలు అల్లార్చుతూ గుఱ్ఱాలు ఆ బాణాల్ని పోటీకి పిలుస్తున్నట్టుంది.

గుఱ్ఱాలకు పక్కల విల్లు, అమ్ములపొదులు కట్టడం చూసేం కదా! గుఱ్ఱాల్నెక్కి రౌతులు దౌడుతీస్తూ బాణాలు వేస్తారు. కానీ, ఆ బాణాలకంటే వేగంగా వాటికంటే ముందుగా గుఱ్ఱాలు పరుగుతీస్తూంటాయి. ఇప్పుడు రౌతు ముందు అతను వదిలిన బాణం వెనుక అవుతారు. తప్పిదారి ఈ రౌతు వీపున ఆ బాణం వచ్చి తగిలితే ఇల్లా అవుతుందని తెలియని రౌతులకు కష్టంకదా! ఏం చెయ్యడమా అని ఎంతో విచారిస్తూ ఆ గుఱ్ఱాలు గిట్టలతో నేలను గీరుతూంటాయి.

ప్రతివాడూ సాటివారిలో మేటిగా మెలగాలని కోరు కుంటాడు. వాయువేగ మనోవేగంలో వాయువును గొప్పగా చేప్తారు. అంచేత, ఆ ఊరి గుఱ్ఱాలు ఒక్క అంగలోనే అన్ని వాయువుల్నీ దాటి వాటికంటే ముందుంటాయి. ఆ వేగానికి వేడిపుట్టి ఉత్సాహంతో సంతోషిస్తూండగా మనతో సమానంగా ఉన్న అన్ని వాయువుల్నీ జయించేం కాని, సమానం అన్న వాయువొకటి మన కడుపులోనే ఉందే దాన్ని జయించ లేకపోయామే, ఎంత సిగ్గుచేటు! ఈ అపకీర్తి తమ కడుపులోనే ఉందే! అని అనుకొంటూ ప్రొద్దున నిద్రలేచి సైంధవ లవణపు పెల్లల్ని నాకేవేళ నిట్టూర్పులు విడిస్తే వాటివల్ల అద్దాల్లాంటి ఆ లవణపు పెచ్చులు నల్లబారి ఆ అపకీర్తి అల్లా కనబడు తున్నట్టుంటుంది.

జాతిగుఱ్ఱాలు పరుగుతీసేప్పుడు శరీరం సాగి పొడుగవు తుంది. కడుపునేలకు తగుల్తుందా అనిపిస్తుంది. అల్లాగే బాగా ఎత్తైన గుఱ్ఱాలనెక్కడానికి 'అంకవన్నె'లు రెండుంటాయి. గుఱ్ఱం మీదికెక్కడానికీ జీనుపై నుంచి కాలువెయ్యడానికి నిచ్చెనమెట్టులా ఓ ఇనుపకడియంలాంటిదుంటుంది. దాన్నే 'అంకవన్నె' అంటారు. ఎత్తైన గుఱ్ఱాలకు ఈ అంకవన్నెలు వేలాడదీస్తారు.

రౌతులు ఈ గుఱ్ఱాలు పరుగుతీస్తూంటే కాళ్ళు నేలకు రాసుకుంటాయేమో అని భయపడతారు. దానికి తోడు రెండంకవన్నెలచేతకాని వాటినెక్కడం కుదరదు. దీంతో లాఘవం లేనివాడు ఈ రౌతు అని అపకీర్తి కలుగుతుంది. ఏం చెయ్యడవ ని రౌతులు తలలు పట్టుకుంటారు. అంత ఎత్తైనవి, వేగంగా పరుగుతీసేవి ఆ గుఱ్ఱాలు. జాతిగుఱ్ఱాలకు పేరుపడ్డ బాహ్లిక, పారశీక, శకథట్టా, ఆరట్ట, ఘోట్టణ దేశాల్నించి వచ్చినవి.

రతిక్రీడాప్రౌఢలు మధురలోని వారాంగనలు. జుట్టుముడి విప్పగానే వారి పాదపద్మాలమీద నెరికురులు వాలడంవల్ల అవి తుమ్మెదలే అనడంలో సందేహంలేదు. పద్మాలమీద వాలుతున్నవి తుమ్మెదలు కాకమరేమిటి? తుమ్మెదల్లా నల్లగా ఉంటాయి వారి కురులు. పాదాలపై పడడంతో ఒంటిపొడవునా ఉన్నాయి వారి సుదీర్ఘ శిరోజాలు.

ఎంతవాణ్ణైనా చూసీచూట్టంతోనే లోగొనే అద్దమే వారిమొహం. అద్దం తనను చూసినవాణ్ణి, తాను చూసినవాణ్ణీ కూడా లోగొంటుంది. ప్రతిబింబిస్తుంది. వీరిని చూసినవాడూ లొంగుతాడు. వీరు చూసినవాడూ లొంగుతాడు. అంతటి ఆకర్షణ కలవారు వారు.

ఆకాశం వంటి సన్నని నడుముమీద ఉన్నందున చనుగవ చక్రవాకాల జంటకావడంలో సందేహం లేదు. పొలసు దొరలగా కొంటెతనంతో చూసే చూపువల్ల మీనాలే వారి కన్నులనడం సందేహం లేదు.

దరిచేరగానే గుప్పుమని పరిమళాలు చిమ్మడంవల్ల పువ్వుతీగె వారి చక్కటి శరీరం. అనుమానమెందుకు?

ఇట్లా తుమ్మెదల్లాంటి పొడవాటి నెరికురులు, అద్దంలాంటి నెమ్మోము, ఆకాశంలాంటి నడుము, జక్కవల్లాంటి చనుగవ, బేడిసమీలలాంటి కళ్ళు, అలరుతీగవంటి అందాలమేను కలిగిన వారు రతిక్రీడల్లో అందెవేసినవారు –ఆ ఊరి ఆటవెలదులు.

ఆ పురంలో ఇళ్ళలో కర్పూరం రాసులుపడి ఉంటుంది. కుంకుమపూవులు పోగులుగా ఉంటాయి. వీటికి తోడు కస్తూరి వీణలొకటి. కస్తూరివీణలంటే వీణలు కాదు. మరి కస్తూరి ఉండే కస్తూరి మృగం నాభి. దానిమీద వాసనకు తుమ్మెదలు వాల్తాయి. ఆనందంతో ఝుంకారాలు చేస్తాయి. ఇప్పుడు ఈ కస్తూరినే కాసేపు వీణ అనుకుందాం. దానిపై ముసిరిన తుమ్మెదలరొద వీణానాదం. మరి ఆ వీణ ఎవరిది? నారదులవారిది. ఆయనెక్కడున్నారు? కర్పూరరాసి ఉందిగా, అదే నారదులవారు. కుంకుమపు పూలు ఆయన జటలు. ఇప్పుడు నారదులవారు వీణవాయిస్తూ ఆ మధురలో ప్రతిఇంటా ప్రత్యక్షం.

ఆయన కలహభోజనులు కదా! వారున్నచోట కలహాలుండాల్సిందే మరి. మధురలో ఆయన మన్మథకలహాలు పెడతారు. అవి తారాస్థాయికి చేరుకుని మన్మథయుద్ధాలుగా మారతాయి. ఆ మహానుభావులుండగా ఆ యుద్ధాలు ఆగుతాయా? ఎప్పుడూ సాగుతూనే ఉంటాయి.

ఆకాశంలో త్రిశంకు ఉండడంతో అది, చండాలవాటిగా మారిపోయింది. మేము అక్కడ ఎల్లా ఉంటాం అని భూతలానికి వచ్చేసిన నక్షత్రాలు, తారలు, గ్రహాలులా ఉన్నాయి ఆ ఊరి అంగళ్ళలో మనోహరాలైన నవరత్నరాశులు.

ఆ పట్నంలో బ్రాహ్మణులు మహేంద్రుడు, కుబేరుడు లాంటివాళ్ళు. వచ్చి ఏమిస్తామన్నా పుచ్చుకోడానికి కుడిచేయి చాపరు. ఎంచేతనో? చిరకాలం అగ్నిని ఆరాధించినందువల్ల వారి కుడిచేతిలో అగ్ని గూఢంగా కొలువుండి, ఈ దానధారవల్ల తడిసి అది చల్లారిపోతుంది అనేమో, లేక తాము యజ్ఞాలు ఎడతెరపి లేకుండా చేసినందువల్ల ఆ యజ్ఞాన్ని తమశరీరమంతా ఏ అవయవంలో ఆ అవయవంగా ఉండి, అగ్ని కుడిచేయి చాచినట్టు అట్ల చేస్తే అగ్నికి అవమానం కాదూ, అని తలపోసినందువల్లనేమో ఏమైనా ఎంతటివారి దగ్గరైనా చేయి చాచనివారు. ఇల్లాంటి వారినే అప్రతిగ్రహవ్రతులు అంటారు.

ఆ ఊరి రాజకుమారులు మంత్రాల్లో కవచం పఠిస్తారు తప్ప యుద్ధాలో ధరించరు. కవచం లేకుండానే పోరాడే తెగువ కలవారు. అచంచల బాహుబలం కలవారు కావడం చేత ఐదు పది చేయరు. అంటే, అడుగు వెనక్కు వేసి రెండడుగులు సమం చేసి ఐదైదుగా ఉన్నవేళ్ళు పదిచేయడం. ఐదుపది చేయడమంటే వెనుకడుగువేయడం – అది చెయ్యరు. వెనుకంజ వెయ్యని భుజబలం కలవారు. దానవేళల్లో మట్టుకు ఐదుపది చేస్తారు. ఐదివ్వాల్సినచోట పదిస్తారు. రెండుచేతులూ జోడించి నమస్కారం చేస్తారు.

గరిడీలలో నేలను దొర్లుతారు కానీ, భూములకోసం నేలమీద పడిపడి దణ్ణాలు పెట్టరు. పిడుగుల్లాంటి దెబ్బలతో ఇతర రాజుల్ని లొంగదీసుకున్నవారు వారు.

మధురలోని వైశ్యులు ధర్మమార్గంలో ధనమార్జించి కోటికో పడగగా ఒక్కొక్కరు ఎన్నో పడగలెత్తుతున్నారు. రోజురోజూ కొత్తపడగలు లేస్తూనే ఉంటాయి. ఆ పడగలు ఆలంబనం లేకండా ప్రయోజనాలు కోరకుండా ధర్మబుద్ధితో వారు విడుస్తున్న దానధారలు వెల్లువలుకాగా అంగళ్ళ స్తంభాలు తడిసి చిగుళ్ళు తొడుగుతున్నాయా అన్నట్టున్నాయి. అల్లా రోజూ లెక్కలేకుండా లేస్తున్న జెండాలు ఆకాశంలోని మేఘాలను కప్పేస్తున్నాయి.

దానం, ఆర్జవం రెండూ నువ్వా, నేనా అన్నట్టు పోటీ పడుతున్నాయి వాటి దగ్గర. రెండూ ధర్మబద్ధంగానే సాగుతున్నాయి.

రాజుల వైభవానికి మా శ్రమే కారణం. వారి పాదాల్లో నాగలిరేఖలు వైభవ చిహ్నాలు అంటారు. ఆ వైభవ చిహ్నాలైన నాగలి రేఖలకు మూలం మా భుజాలనున్న నాగలిరేఖలే సుమా అంటూ కొండల్లా కోట్లాది ధాన్యపురాసులు పండించి పోస్తూ సజ్జనుల్ని సేవిస్తూ ఉంటారు అక్కడి శూద్రజాతివారు.

ఊరిబైట ఉద్యానాలున్నాయి. వాటిలో ఎన్నోరకాల చెట్లు. వాటిమీద చిలకలు, కోకిలలు ఇలా ఎన్నో పక్షులు. సరేసరి తుమ్మెదలు. ఇల్లా అంతా సందడిగానే ఉంది. తుమ్మెదలు చెట్టునుంచి చెట్టుకు బారులుతీరి గొలుసుల్లా ఉన్నాయి. చిత్రంగా ఉందీ సన్నివేశం.

చెట్లు పూతపట్టకపోతే ఉత్తమజాతి స్త్రీలచేత కొన్ని దోహదక్రియలు చేయిస్తారు. వీటిలో కొన్ని ప్రీతిని కలిగించేవిగా ఉంటాయి. కొన్ని అవమానకరంగా ఉంటాయి. *(సశేషం)*



# దివ్యసాకేతంలో ఉగాది - వసంతోత్సవాలు

శ్రీమాన్ రఘుదత్తాచార్యులు - ప్రధానార్చకులు

క్రొత్తదనం అంటేనే ఒక ఆనందం, ఒక ఉత్సాహం, ఒకింత ఉత్కంఠత ఇవన్నీ కలగలిసి ఉంటాయి. అందున ఈ క్రొత్తదనం కాలం విషయంలో మరింత వైచిత్ర్యాన్ని కలిగి ఉంటుంది. వసంతపు నవనవలు, గ్రీష్మపు ఉష్ణతాపఫెలఫెలలు, వర్షంలో వాగు వంకల గలగలలు, శరత్తులో వెన్నెల మిలమిలలు, హేమంతంలో చలిగాలులతో కొమ్మరెమ్మల రెపరెపలు, శిశిరంలో పాతదనాన్ని వదిలి కొత్తదనాన్నందుకునే కలకలలు ఇవన్నీ కాలం వలన ప్రకృతిలో కలిగే కొత్త అందాలు. వేటికి అవే కొత్త సంతోషాల షణ్ణిధులు. ఈసారి కాలపురుషుడైన భగవానుడు మరింత సంతోషాన్ని మనకు అందివ్వడానికి **నందన** అను పేరుతో నూతన సంవత్సరంగ ఆవిర్భవిస్తున్నాడు.

**నందయతీతి నందనః** ఆనందింపజేసేవాడు నందనుడు. ఈ ఆనందం ఎట్టిదంటే ? ఉపనిషత్తులలో తెలుపబడినట్లుగా అవాఙ్మనసగోచరమైన ఆనందం, వేదం సైతం పదము లందక పరుగున వెనుదిరిగే వైభవాతిశయం కలిగిన ఆనందం, నిరతిశయమై, నిరవధికమై, నిరవచ్ఛిన్నమై, నిర్మలమైన ఆనందం ఎవరియందు ఉంటుందో అతనే ఆ నందుడు. ఇక్కడితో ఇది పరిపూర్ణమవలేదు, ఈ ఆనందం తానే అనుభవిస్తే గొప్పదన మేముంటుంది. బద్ధులైనవారి నుద్ధరించి ముక్తిమార్గమునకు నడిపి ముక్తులకు, నిత్యులకు, ఆనందం నిరంతరం అందించ గలిగిన వాత్సల్యం కావాలి. ఆ గుణం కలిగినవాడే నందనుడు అంటూ శ్రీపరాశరభట్టర్లు వ్యాఖ్యానించారు. అటువంటి ఆనందాన్ని ఇహలోకంలో మనకి అందించడానికే అర్చామూర్తిగా స్వామి మనదివ్యసాకేతంలో అవతరించాడు.

అనేక ఉత్సవములతో మహదానందైశ్వర్యముల భక్తుల నోలలాడిస్తున్న మన రామచంద్రుడు ఈ నూతన సంవత్సరంలో "నందను"డను తన పేరును సార్థకం చేసుకుంటూ జగదాచార్యు లతో పాటు తన దివ్యదర్శనమును అనుగ్రహిస్తున్నాడు. నూతన సంవత్సర యుగాది నుండి శ్రీరామ నవమి, చైత్రపూర్ణిమ వరకు జరుగు వసంతోత్సవాలలో శ్రీస్వామివారితో పాటుగా ఇంకా గొప్పదైన ఆనందాన్ని మనకు అందివ్వడానికి నందనుడై ఉగాది ఉత్సవాలకోసం సిద్ధపడుతున్నాడు. తొలిసారి నూతన సంవత్సరంలో మన ఆచార్యులతో కలిసి స్వామి తన దర్శనాన్ని అందిస్తున్నాడు. స్వామియొక్క వాత్సల్యామృతధారలలో స్నాన మాడుతూ ఆనందప్రఫుల్లిత హృదయాలతో నీరాజనం పలుకుదాం, అందరం సేవిద్దాం! మన వారందరికీ తెలియజేస్తూ ఆనంద నందనులమవుదాం! నందన నామ సంవత్సర శుభాకాంక్షలతో దివ్యసాకేతం మనకు సాదరంగా ఆహ్వానం పలుకుతుంది.

## విజయనగరం నేత్ర విద్యార్థుల ఘనవిజయం

**ఫిబ్రవరి 2,3 తేదీలలో నేషనల్ అసోసియేషన్ ఫర్ బ్లైండ్ అనే సంస్థ బొంబాయిలో క్రీడా మహోత్సవాన్ని జరిపారు. భారతదేశం మొత్తం 70 పాఠశాలలనుండి 500మంది అంధ విద్యార్థులు ఈ పోటీలలో పాల్గొన్నారు. అందులో మన విద్యార్థులు సెలెక్ట్ అయ్యారు. బాలుర క్రీడావిభాగంలో మన విజయనగరం స్కూల్ బాలుడే ప్రథమ బహుమతిని అందుకున్నాడు. ఉత్తమ ఆటగాడుగా సెలక్ట్ అయ్యాడు. జాతీయస్థాయిలో నేత్రవిద్యాలయం సెలెక్ట్ అయ్యింది. ఇందులో 6 బంగారు పతకాలు, 2 వెండి పతకాలు ఒక కాంస్య పతకం మన విద్యార్థులు గెలుచుకున్నారు. అంతేకాదు, అక్కడివారు కేవలం ఆటే కాకుండా పిల్లల సత్ప్రవర్తనను గూడా గమనించారు. మన పిల్లలు తెల్లవారు ఝామున చేసే ప్రాతఃస్మరణీయము, ఆసనాలు, భోజన సమయంలో ప్రార్థన, సమయపాలన వారందరిని ఆకర్షించింది. అందుకే మన స్కూలుకు "బెస్ట్ స్కూల్" అవార్డు లభించింది. ఈ ఘనత ఈ విద్యార్థులను ప్రోత్సహించిన వారిదేనని స్వామివారు ప్రశంసా పూర్వక మంగళాశాసనాలు చేశారు.**





# పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారి ఆహ్వానం మేరకు జనవరి 27వ తేది రాత్రి హైదరాబాద్‌లోని మియాపూర్ చేరుకున్నారు.

28 ఉదయం మియాపూర్‌లో మైహోమ్ జ్యూయెల్ భవన సముదాయంలో నూతనంగా నిర్మించిన ఆంజనేయస్వామి ఆలయ ప్రతిష్ఠగావించి, శ్రీమాన్ రామేశ్వరరావు దంపతులకు మంగళా శాసనములందించారు.

సాయంత్రం కరీంనగర్ జిల్లాలోని ''మామిడాలపల్లి'' చేరుకున్నారు. 29వ తేది ఉదయం శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ ప్రతిష్ఠ జరిపి, స్వామి వైభవాన్ని అక్కడి భక్తులందరికి అందించారు. అక్కడ నుండి "చల్లూరు" శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని దర్శించారు. సాయంత్రం శ్రీస్వామివారు "వీణవంక" అనే గ్రామంలో YUPP T.V. ఫౌండర్ శ్రీమాన్ ఉదయరెడ్డి ఆహ్వానం మేరకు వారిగృహానికి వేంచేశారు. తిరుమలలో జరుగనున్న భీష్మ ఏకాదశి కార్యక్రమం గురించి తెలుసుకున్న శ్రీమాన్ ఉదయరెడ్డిగారు ఆ కార్యక్రమాన్ని ప్రత్యక్ష ప్రసారం చేయటానికి తగిన ఏర్పాట్లు చేస్తామన్నారు. అంతే కాకుండా YUPP T.V.కి అనుబంధంగా "జీయర్ ఛానల్"కు తగిన వసతిని కల్పిస్తామని వాగ్దానం చేశారు. రాత్రికి "ఎలికేశ్వరం" చేరారు. ఈ చిన్నగ్రామము ఆంధ్రరాష్ట్రమునకు చివరిహద్దు.

ఎలికేశ్వరం గ్రామస్థులంతా మంచి భక్తి శ్రద్ధలు కలవారు. శ్రీస్వామివారికి ఏకలవ్య శిష్యరికం చేస్తూ క్యాసెట్ల ద్వారా విష్ణు సహస్ర నామమును కంఠస్థము చేసి అవధానం చేయగల నేర్పరులయ్యారు.

ఈ గ్రామంలో శ్రీరామమందిర ప్రతిష్ఠాకార్యక్రమానికి స్వామివారు వేంచేస్తున్నారని సంబరంతో శ్రీరామచంద్రుడే తమ పల్లెకు వస్తున్నట్లు భావించి, రంగవల్లులతో మామిడి తోరణాలతో ఊరంతా అలంకరించారు.

శ్రీస్వామివారికి చక్కని పర్ణశాలనేర్పరిచిరి. శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రంలోని 108 శ్లోకాలకు ప్రతీకగా 108 స్తంభాలతో విశాల మండపాన్ని నిర్మించారు. ఒక్కొక్క స్తంభానికి ఒక్కొక్క శ్లోకాన్ని అలంకరించారు. దారిపొడవునా నవధాన్యాల అంకురాలతో నిండిన పాలికలతో మంగళహారతులతో మంగళవాయిద్యాలతో శ్రీవారికి స్వాగతం పలికారు.

అనంతరం వేదికపై శ్రీస్వామివారు ప్రవచనం చేస్తూ "మేము యతులము. ఎక్కడకు వెళ్ళినా సహజసిద్ధమైన పర్ణశాలలు, గ్రామీణ ప్రజల నిరాడంబర భక్తియే కావాలి. అది ఇక్కడ సిద్ధించింది. గుహుని సేవకు సంతసించిన శ్రీరాముడు ఒకనాడు తన పల్లెలో విశ్రాంతుడైయ్యాడు. కానీ, మీ భక్తికి మెచ్చిన రాముడు మీ పల్లెలో శాశ్వతంగా సుప్రతిష్ఠితుడు అవుతున్నాడు" అని అన్నారు.

30వ తేదీ రథసప్తమి. ఆదిత్యహృదయ స్తోత్రాన్ని ఉపదేశించి సూర్యభగవానుని వైభవాన్ని వివరించారు. అనంతరం శ్రీరామచంద్ర విగ్రహప్రతిష్ఠ గావించిరి.

సమాశ్రయణ కార్యక్రమమును నిర్వహించారు. కరీంనగర్ జిల్లా వి.టి. అధ్యక్షులు శ్రీమాన్ వీర్ల ప్రభాకర్‌రావు, శ్రీమాన్ నంబివేణుస్వామి ఈ కార్యక్రమానికి బాధ్యత వహించి, దగ్గరుండి చేయించారు.

అనంతరం "సూరారం"లోని శ్రీ చెన్నకేశవస్వామి ఆలయాన్ని దర్శించి రాత్రికి శ్రీరామనగరం చేరుకున్నారు.

31వ తేది సాయంత్రం బయలుదేరి కడప జిల్లాలోని "ప్రొద్దుటూరు"కు చేరుకున్నారు. సహస్ర తులసీ శ్రీనివాసమ్ కార్యక్రమం ఇక్కడ మొదట ప్రోగ్రామ్‌లో లేకున్నా, స్థానిక వి.టి. శ్రీమాన్ బూసెట్టి రాంమోహన్‌గారు పట్టుబట్టి ఈ కార్యక్రమాన్ని జరిపించుకున్నారు. అలానే ఈ కార్యక్రమానికి మన ప్రచారకుడు శ్రీమాన్ పురుషోత్తం రామానుజదాస్ కలశాలను అందించడం ద్వారా ప్రచారం చేశాడు. సమయం తక్కువైనప్పటికి శ్రీమాన్ బూసెట్టి రాంమోహన్‌గారి ప్రోద్బలంతో ఎక్కువ చైతన్యాన్ని వీరు కలిగించగలిగారు.

ఫిబ్రవరి 1వ తేది మధ్యాహ్నం శోభాయాత్ర చాల చక్కగా జరిగింది. అద్భుతంగా అలంకరించబడిన వేదికపై సాయంకాలం తులసీ అర్చన వైభవంగా జరిగింది.

2వ తేదీ ఆరాధన అనంతరం ప్రొద్దుటూరు నుండి బయలుదేరి తిరుచానూరు చేరారు. పద్మావతీ అమ్మవార్లను దర్శించుకున్నారు. శ్రీనివాసుని సోదరుడు చిదంబరంలోని పెరుమాళ్ళ ప్రతీకగా రామానుజులు ప్రతిష్ఠించిన గోవిందరాజ పెరుమాళ్ళను దర్శించారు.

అనంతరం తిరుమల క్షేత్రానికి సంబంధించిన పెద్ద జియ్యంగార్, చిన్నజియ్యంగార్లను శ్రీస్వామివారు కలిశారు. పెద్దజియ్యంగార్ గతంలో శ్రీ వైష్ణవ సంగోష్ఠికి వేంచేశారు. చిన్నజియ్యంగార్‌ని కలవటం ఇదే మొదటిసారి. వారిద్దరితో కలిసి శ్రీ గోవిందరాజస్వామి తెప్పోత్సవాన్ని దర్శించారు.

## 3.2.2012 భీష్మైకాదశి
## విశ్వశాంతి శ్రీ విష్ణు సహస్రనామ విరాట్ పారాయణ
## "సహస్ర తులసీ శ్రీనివాసమ్" సమాపనోత్సవం

గత మూడునెలలుగా జరిగిన **సహస్ర తులసీ శ్రీనివాసమ్** తిరుమల శ్రీనివాసుని పదసన్నిధిలో భీష్మ ఏకాదశి పర్వదినాన సంపూర్ణమైంది.

సహస్ర తులసీ శ్రీనివాసమ్‌లో శ్రీస్వామివారు చేసిన ప్రవచనాలను వక్రీకరిస్తూ మీడియా చేసిన ఎన్నో దుష్ప్రచారాలకి సమాధానాన్ని ఈ వేదికమీద నుంచే ఇవ్వాలని శ్రీస్వామివారు నిర్ణయం చేసుకున్నారు. దానితోపాటు టి.టి.డి. విషయంలో గతంలో 2003లో జరిగిన అర్చకులకు సంబంధించిన అంశాలను, ఆలయానికి సంబంధించిన నిర్వహణ పరమైన లోపాలను, వారు సవరించు కుంటాము అని ఒప్పుకున్న అంశాలని సమాజానికి చెప్పవలసిన సమయం వచ్చిందని నిర్ణయం చేసుకొని శ్రీస్వామివారు దీనినే వేదికగా చేసుకున్నారు. ఈ రకంగా ప్రజలకు, నిర్వాహకులకు, మీడియాకు, టి.టి.డి.వారికి కూడా ఎంతో ఉత్కంఠతని కలిగించింది.

కార్యక్రమానికి శుభారంభంగా వేదికమీదికి పెరుమాళ్ళతో స్వాములు వేంచేయగానే, విజయవాడ ఐడియల్ పబ్లిక్‌స్కూల్ విద్యార్థులు సంక్షిప్త మధురంగా "శరణాగతి దీక్ష"అనే నాటికను ప్రదర్శించారు. భగవంతుడైన శ్రీనివాసుణ్ణి, భక్తులుగా చెలామణి అయ్యేవారు రకరకాలుగా తమ స్వార్థానికి ఉపయోగించు కోవడం, అలాంటివారిని శరణాగతి దీక్షద్వారా ఆచార్యులు సన్మార్గంలో పెట్టడం ఈ నాటిక తాత్పర్యం. దీనిని ప్రదర్శింప చేసిన కృష్ణాజిల్లా వి.టి. కో-ఆర్డినేటర్ శ్రీమతి సీతామహాలక్ష్మిగారికి శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.

తిరుమల శ్రీనివాసుని చరిత్రను తెలుపుతూ శర్వాణి రచించి అందించిన **'మా స్వామి వెంకన్న'** అనే పాటల సి.డి.ని ఆవిష్కరించారు.

సభాకార్యక్రమాన్ని మన సంస్థల సలహాదారు శ్రీమాన్ ఇ. రామారావుగారు ఆరంభించి, విచ్చేసిన శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారిని, శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారిని, శ్రీశ్రీశ్రీ రామచంద్ర జీయరు స్వామివారిని, శ్రీశ్రీశ్రీ త్రిదండి వ్రతధర జీయరు స్వామివారిని, మన జీవా కమ్యూనిటీ కాలేజ్ డైరెక్టర్ శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారిని, మన జెట్ ప్రముఖులు, వెటర్నరీ వైస్ ఛాన్సలర్ శ్రీమాన్ ప్రభాకరరావుగారిని వేదికపైకి ఆహ్వానించారు.

ముందుగా శ్రీస్వామివారు ప్రపంచంలో అందరూ చూడటానికి వీలయ్యేలా తయారైన "జీయర్ ఛానల్"ను ఆవిష్కరించారు. 24గంటలు నడిచే ఈ ఛానల్‌ను త్వరలోనే LIVE Channel గా రూపుదిద్దబోతున్నారు. మొదటి నెలరోజులు తయారైన కార్యక్రమాన్ని మాత్రం దీనిలో ప్రసారం చేస్తారని, భీష్మ ఏకాదశిది మాత్రం ప్రస్తుతం LIVE ప్రసారం చేస్తారని శ్రీస్వామివారు ప్రకటించారు. పెద్దల మంగళాశాసనాలను అందుకొని శ్రీ చిన్నజీయరు స్వామివారే తమ ప్రవచనాన్ని కొనసాగించారు.

"తిరుమలలోని ప్రతి అణువు పురాణాలు అందించిన చరిత్రకి ప్రత్యక్ష సాక్ష్యాలు. ఇతిహాసమాల రామానుజులవారి సమయానికి ముందు వెనుకలలో జరిగిన సన్నివేశాలన్ని తెలియ చెప్పే ఏకైక ప్రమాణ గ్రంథం. టి.టి.డి ఈ గ్రంథంపైగాని, అక్కడి కట్టడాలపైనగాని ఏ అవగాహన లేకుండా సుందరీకరణ పేరుతో, సౌకర్యాల కల్పన అనే పేరుతో, అక్కడి చాలా కట్టడాలని ఇప్పటికే తొలగించింది.

అనంతాళ్వార్ల గృహం, మొండిగోపురం, అనంతాళ్వాన్ పుష్కరిణి, తిరుమల నంబిగృహం, వేయికాళ్ళమండపం... ఈ ప్రవాహంలో కొట్టుకుపోయినవే. చరిత్రకి ఆధారాలైన కట్టడాలు పోతే మనం చరిత్ర హీనులమవుతాం. ఇప్పుడువారు రచించిన తిరుమల చరిత్ర గ్రంథాలలో కూడా పైవాటి ప్రస్తావనలున్నాయి. కానీ ఇప్పుడు కనపడడంలేదు. మన కంటిముందే కూలిపోయాయి. ఈ పుస్తకాలు చదివిన తరువాతి తరంవారు ఈ పుస్తకాల్ని కట్టుకథలే అనుకుంటారు తప్ప, వాస్తవాలు అని అనుకోరు. ఇలా మనం తెలిపిన చరిత్రని మనమే తుడిచి వేసుకుంటున్నాం. ఇది తప్పు.

ప్రపంచ చారిత్రకుల దృష్టిలో మనం దోషులం కాకూడదను కున్నా, భగవంతుడి దృష్టిలో నేరస్థులం కాకూడదనుకున్నా, కూలకొట్టిన చారిత్రక కట్టడాలను పునర్నిర్మించి మరొక్కసారి ఇట్లాంటి దోషం తరువాతి అధికారులు చేయకుండా ఉండేట్లు శిలాశాసనాలని ఏర్పాటు చేయాలి. టి.టి.డిపై తాము బహిరంగంగా లోపాలున్నాయని నిందలు చేయడం తగదని, అవి లోపలే పరిష్కరించుకోవాలని, సంబంధం లేనివారు తిరుపతి విషయం తెలియనివారు సలహాలు ఇవ్వడం హాస్యాస్పదం.

2003 సెప్టెంబరులో వేయికాళ్ళ మండపం కూలగొట్టడానికి ముందే ఈ విషయంమీద ఎన్నో చర్చలు జరిగాయని, 2003 ఫిబ్రవరిలోనే ఆ చర్చల ఫలితంగా ఎన్నో దోషాలు జరుగుతున్నట్లు అప్పటి E.O., J.E.O. ఇద్దరు జియ్యంగార్లు, ఏకాంగులు, వైఖానస అర్చకులు, సలహాదారులు ప్రసాదాలు తయారయ్యే **పోటు**కు సంబంధించినవారు, వీరందరూ ఏకకంఠంగా అంగీకరించారని, 110 లోపాలని మొదటి విడతగా అధికారులందరూ సవరించు కోవటానికి అందిస్తున్నామని, తెలిసో తెలియకో జరిగే ఈ దోషాలకి అందరూ దేవుణ్ణి, శ్రీనివాసుణ్ణి క్షమాప్రార్థన చేసుకోవాలని "ఇది తప్పనిసరి" అని అందరితోటి కూడి ఉన్న Video ను శ్రీస్వామి వారు విడుదల చేశారు. ఇలాంటి విషయాలని బహిర్గతం చేసి పదిమందిలో పెట్టడం మర్యాదకాదనే ఇంతకాలం లోపల దాచుకున్నాం.

2003 ఫిబ్రవరి 2వ తేదీ రాత్రే చాలా సంవత్సరాల తరువాత మొదటిసారిగా రాత్రి 1గం॥ నుండి 3గం॥దాకా ఆలయ ద్వారాల తాళాలు వేసి సంప్రదాయ రీతిలో పెద్దజియ్యంగార్ మఠానికి పంపే ప్రక్రియ చేయించారని, ఆ మరునాడు ఉదయం పూట పెరుమాళ్ళకు చేసే నవనీత ప్రసాదాన్ని కట్టెలమీదే వండించి ఆరగింపుచేసే ఏర్పాటు

చేశారని, అలాగే మిగతావి కూడా క్రమక్రమంగా సంస్కరించుదామని అప్పుడు వారంతా అంగీకరించిన విషయం శ్రీస్వామివారు అందించిన సి.డి.లో స్పష్టంగా తెలుస్తోంది.

సెప్టెంబరు 2003లో **వేయికాళ్ళమండపం కూల్చడం తెలిసిన శ్రీస్వామివారు అది తప్పని, చట్టవిరుద్ధమని చెప్పడంతో ఆ నేరం నుంచి తమని కాపాడుకోవటం కోసం దృష్టిమరల్చి సంస్కరణలని పక్కనపెట్టి, శ్రీస్వామివారిపై నిందారోపణ చేయటంతోపాటు విషయ సంబంధం లేనివారందరినీ ఇందులో టి.టి.డి. చేర్చింది.**

శ్రీస్వామివారు అందించిన సి.డి.లో 2003 ఫిబ్రవరి 7వ తారీఖున పడిభాష్యకారుల సన్నిధిని జీర్ణోద్ధరణ చేసిన అప్పటి జియ్యంగార్లు, దానిని శ్రీపాంచరాత్రం ప్రకారం పునఃప్రతిష్ఠ చేయదలిచారు. అధికారులతో జరిపిన సమావేశంలో ఈ విషయం చర్చకు వచ్చినపుడు, అది తగదని, జియ్యంగార్లకు మనస్సు నొచ్చినా, వారిని ఒప్పించి వైఖానస పద్ధతిప్రకారం పునఃప్రతిష్ఠ జరగాలని శ్రీస్వామివారే నిర్ణయింపచేశారు. ఇప్పటి రమణదీక్షితులుగారు కూడా ఆ చర్చలలో ఉన్నారు.

ఈ విషయాలన్ని కావాలనే దాచి, శ్రీస్వామివారిని వైఖానసానికి విరుద్ధమన్నట్లు, లేని దోషాలు టి.టి.డి.పై ఆరోపిస్తున్నట్లు ప్రచారం చేస్తోంది. ఇప్పటికీ చేస్తోంది. ఇది తెలియక మీడియా శ్రీస్వామివారిపై నిందారోపణ చేస్తూ సమాజాన్ని తప్పుదారి పట్టిస్తోంది.

వేంకటేశ్వరునిలో దోషాలులేవు. కాని, టి.టి.డి.లో దోషాలున్నాయి. తిరుపతికొండకు దోషాలు లేవు కాని, అక్కడి నిర్వహణ అంతా లోపభూయిష్ఠమే! దాన్ని సవరించుకోవడం అందరి బాధ్యత. అందరం మంచినే కోరుకుంటున్నాం. దానికి తగ్గట్టుగ స్పందించడానికి కూడా సిద్ధపడదాం!

చరిత్ర తెలియక, సంప్రదాయ గంధమూలేక, పేరుకోసం పాకులాడే వారెందరో... తిరుపతి విషయాల్లో తలదూర్చి అసలు విషయాన్ని ప్రక్కకు పెట్టి తమ పబ్బం గడుపుకుంటూండడం వల్ల ఇంతమాత్రమైనా గత్యంతరం లేక బయటకు చెప్పవలసి వస్తోందని, జరుగుతున్నాయని ఒప్పుకున్న ఆ తప్పుల List మిగతా వివరాలుగాని, తామిప్పటికీ బయట పెట్టడం లేదని, చిత్తశుద్ధి, దైవభక్తి, సామాజిక బాధ్యత, ఆధికారికమైన హద్దులు పాటించే కట్టుబాటు ఉంటే ఎవరైనా, సంస్కరణలకి సిద్ధపడాలని, వారికి తగిన, మాకు చేతనైన సేవలందించటా నికి మేమెపుడూ సిద్ధమేనని, శ్రీ వేంకటాచల క్షేత్రానికి సంబంధించిన చరిత్ర విషయంలో 7సం॥గ శరణాగతిదీక్షలు చేస్తూ భక్తులు ఎన్నో వాస్తవాలు తెలుసుకున్నారని, మిగతా వారందరికీ ఇది తెలియ జేయడం అవసరమని, మన చరిత్రని, మనం పునర్నిర్మించుకుందామని, సంరక్షించుకుందామని శ్రీశ్రీశ్రీస్వామివారు తెలియజేశారు.

అనంతరం సామూహికంగా శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణ చేశారు. దీపప్రజ్వలనతో స్కందపురాణంలో పరమశివుడు చేసిన ప్రార్థనని భక్తులందరితో చేయించారు. మంగళప్రదమైన నేతి దీపాలతో తిరుమల క్షేత్రానికి, శ్రీనివాసునికి ఎటువంటి ఉపద్రవాలు కలుగకూడదని ప్రార్థిస్తూ హారతులిచ్చారు.

ఈ భీష్మ ఏకాదశి విరాట్ విష్ణు సహస్రనామ పారాయణలో టి.టి.డి. ఛైర్మన్ శ్రీమాన్ కనుమూరి బాపిరాజు దంపతులు పాల్గొన్నారు. శ్రీస్వామివారి సంకల్పము తిరుమల అభివృద్ధి సంప్రదాయ పరిరక్షణనే ప్రధానంగా ఉంది కనుక తప్పక వారి సూచనలను పాటించగలనని బాపిరాజుగారు తెలిపారు.

ఉభయవేదాంతాచార్య పీఠాధ్యక్షులు శ్రీ ఉ.వే.శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్య స్వామివారు, జీవా ఛైర్మన్ శ్రీమాన్ రామేశ్వరరావు దంపతులు, జెట్ ఛైర్మన్ శ్రీమాన్ లైలా గంగరాజు దంపతులు, మొదలగువారు ఈ కార్యక్రమంలో అన్వయించారు.

విదేశాలలోని మన భక్తబృందాలకి ప్రతినిధులుగా శ్రీమాన్ సత్య (ఆస్ట్రేలియా), శ్రీమాన్ డా॥ ముక్కామల అప్పారావు గారు (అమెరికా), శ్రీమతి డా॥ చిత్రామాధవన్ (అమెరికా), శ్రీమాన్ అమరప్రభు(లండన్) ప్రభృతులు ఎంతో శ్రద్ధా భక్తులతో ఈ కార్యక్రమానికి విచ్చేసినందుకు వీరందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు.

భీష్మ ఏకాదశి సందర్భంగా విచ్చేసిన వేలాదిమంది భక్తులకు ప్రసాద వితరణకై కావలసిన సంభారములను గుంటూరు నుండి శ్రీమాన్ గ్రంధి సుబ్బారావుగారు, విజయవాడ శ్రీమతి లక్ష్మీ కిషోర్ దంపతులు (Power Tech), మరియు భక్తబృందం, వినుకొండ వికాసతరంగిణి శ్రీమతి మల్లికగారి నేతృత్వంలో సమర్పించారు. వినుకొండ వికాసతరంగిణివారు భక్తులకు ప్రసాద వితరణ కైంకర్యాన్నికూడా చేశారు. విజయవాడకు చెందిన శ్రీమాన్ తోటకూర రామకృష్ణ దంపతులు 10వేల లీటర్ల మజ్జిగను ట్యాంకర్ ద్వారా తెప్పించి, స్వయంగ భక్తులకు అందించారు. అలాగే నరసరావుపేటకు చెందిన తిరుమల మిల్క్‌ప్రోడక్ట్ ప్రైవేట్ లిమిటెడ్‌వారు 10వేల మజ్జిగ ప్యాకెట్లను భక్తులకు అందించారు.

అనంతరం శ్రీస్వామివారి మార్గనిర్దేశంలో భక్తులందరు 'అడుగడుగు దండాలవాడా' అంటూ 'అలిపిరి' మెట్లమార్గం నుండి పాదయాత్రను కొనసాగించారు. కోలాటాలతో భజన బృందాలతో ఎందరో భక్తులు ఉత్సాహంగా తిరుమలకొండ ఎక్కారు.

సాయంత్రం భక్తులతో కొండపైకి చేరిన శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు వరాహస్వామిని దర్శించి, మాడవీధుల గుండా ఆనందవిమానానికి పరిక్రమణ చేశారు. భేటి ఆంజనేయ స్వామిని సేవించి, తిరుమల పెద్ద జియ్యంగారు ఆహ్వానించగా ప్రక్కనే ఉన్న జీయర్‌మఠాన్ని సందర్శించారు. అనంతరం గోగర్భం డ్యాం వద్ద టి.టి.డి కళ్యాణ మండపంలో కొండ ఎక్కి వచ్చిన భక్తులకోసం ఏర్పాటు చేసిన వసతులను పర్యవేక్షించారు.

ఆస్ట్రేలియానుండి వచ్చిన శ్రీమాన్ సత్య తన అనుభవాలను వివరిస్తూ 'చారిత్రాత్మక కట్టడాలను సంరక్షించు కోవలసిన బాధ్యత సమాజములోని ప్రతిఒక్కరిపై ఆధారపడి యుందని, ఇతర దేశాలలోని వారు వారి వారి దేశాలలోనున్నట్టి 50 సం॥ల క్రిందటికట్టడాలనే ఎంతో జాగరూకతతో సంరక్షించు కొంటున్నారు. ఇక 5,6 వందల

సంవత్సరాల క్రితంనాటి వేయి కాళ్ళమండపం కావచ్చు, వేయ్యేండ్ల క్రితంనాటి అనంతాచార్యుల కుటీరము, వారేర్పరచిన తోట ఇంకా ఎంతో జాగ్రత్తగా మనం చూసుకోవాలికదా! అన్న ఆవేదనను వ్యక్తీకరించారు.

JIVA కమ్యూనిటీ కాలేజ్ ఎకడమిక్ డైరెక్టర్ శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్య స్వామివారు మాట్లాడుతూ... "శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు శ్రీకాకుళం జిల్లాలోని 'మందస' అనే క్షేత్రంలో పూర్తిగా శిథిలమైపోయిన 600 సం॥ల నాటి శ్రీ వాసుదేవ పెరుమాళ్ సన్నిధిని యథాతథంగా పునర్నిర్మింపచేశారు. ఆలయాలు సంస్కృతి పరిరక్షణ పట్ల వారికున్న దీక్షకు ఇది నిదర్శనమని, తిరుమల క్షేత్రంలో కూడా అలాంటి చారిత్రక సాక్ష్యాలని పరిరక్షించడమే వారి ఆశయ"మని ఉద్ఘాటించారు.

శ్రీశ్రీశ్రీ రామచంద్ర రామానుజ జీయర్ స్వామివారు ప్రవచిస్తూ... భీష్మ ఏకాదశి పర్వదినాన శ్రీ విష్ణు సహస్రనామ పారాయణతోపాటు ఒక భీషణ ప్రతిజ్ఞ తీసుకోవటానికి తిరుమల శ్రీనివాసుని సన్నిధికి మనమంతా చేరామన్నారు. మన ఆలయాలను, సంస్కృతిని పరిరక్షించుకుంటామనేదే మన భీషణ ప్రతిజ్ఞ కావాలన్నారు.

ఈ కార్యక్రమానికి కావలసిన ఏర్పాట్లను స్వయంగా దగ్గరుండి నిర్వహించిన శ్రీమాన్ ఇ. రామారావు (వి.టి. ముఖ్య సలహాదారు), జీవా ఛైర్మన్ శ్రీమాన్ జె. రామేశ్వరరావు, జెట్ సొసైటీ అధ్యక్షులు శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డి, జీవా కమ్యూనిటీ కాలేజ్ ముఖ్య సలహాదారు Deen శ్రీమాన్ పురుషోత్తమరావు, రాష్ట్ర వి.టి. ప్రెసిడెంట్ శ్రీమాన్ మహేందర్‌రెడ్డి తదితరులకు మంగళాశాసనాలు చేశారు.

అక్కడి నుండి రాత్రి 11గంటలకు శ్రీరామచంద్ర రామానుజ జీయర్ స్వామివారి ఆహ్వానంపై ఆ పక్కనేగల వారి నూతన మఠాన్ని సందర్శించి, రాత్రి ఒంటిగంటకు తిరుపతి చేరుకున్నారు.

4వ తేది మధ్యాహ్నం తిరుపతినుండి బయలుదేరి సాయంత్రానికి శ్రీరామనగర్ చేరుకున్నారు.

8వ తేదిన శ్రీమాన్ తుంగూరు దయాకర్‌రెడ్డి, కుమ్మరెడ్డి శ్రీనివాసరెడ్డిగార్ల ఆహ్వానంపై శ్రీరామనగరం నుండి బయలుదేరి కరీంనగర్ జిల్లా "పర్లపల్లి" విచ్చేశారు.

9వ తేది శ్రీ వేంకటేశ్వరస్వామి విగ్రహప్రతిష్ఠ కార్యక్రమాన్ని జరిపారు. అనంతరం 'రేకొండ'లో నూతనంగా నిర్మించిన శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయాన్ని సందర్శించారు. అక్కడనుండి కరీంనగర్ సప్తగిరి కాలనీలోని శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయంలో ప్రప్రథమంగా జరుగుతున్న బ్రహ్మోత్సవాలలో పాల్గొన్నారు. అక్కడ నూతనంగా నిర్మించిన కళ్యాణమండపాన్ని ప్రారంభించి, నిజామాబాద్ జిల్లాలోని "బాసర" జ్ఞాన సరస్వతీ మందిరం సందర్శించారు.

10వ తేది శ్రీమాన్ వడ్డేపల్లి నర్సింగరావుగారి (కూకట్‌పల్లి) తల్లిదండ్రుల జ్ఞాపకార్థమై బాసరలో నిర్మించిన భోజనవసతి సదుపాయాలతోకూడిన ధర్మశాలను శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు ప్రారంభించారు. శ్రీమాన్ కూకట్‌పల్లి రామారావుగారు ఈ కార్యక్రమాన్ని నిర్వహింపచేశారు. ఆ రాత్రి ఆర్మూరునుండి నిజామాబాద్ హైవేలోగల "మామిడిపల్లి" (గుత్పా) చేరారు. అక్కడ శ్రీమాన్ రాజారెడ్డి సోదరి శ్రీమతి అమృతమ్మ అద్భుతమైన వేంకటేశ్వరస్వామివారి ఆలయాన్ని నిర్మించారు. అర్చకులకు నిలయం, అతిథిగృహం, వంటశాల, సెక్యూరిటీవారి గృహంవంటి సకల సదుపాయాలతో ఈ ఆలయాన్ని నిర్మించి చుట్టూ పచ్చదనాన్ని పెంచి, కాంపౌండ్ వాల్‌తో నాలుగువీధులతో చక్కటి వ్యవస్థను ఏర్పాటు చేశారు.

11వ తేది మధ్యాహ్నం శ్రీమాన్ దిల్‌రాజ్ (నర్సింహారెడ్డి) ఆహ్వానంపై నర్సింగపల్లి చేరారు. అక్కడ తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ నమూనాతో రాతి కట్టడాన్ని నిర్మిస్తున్నారు. గ్రామస్థులందరూ సహకరించి, శ్రమదానం చేసి ఈ ఆలయాన్ని నిర్మించుకుంటున్నారు. చుట్టూ పచ్చటి చెట్లను పెంచి, ఒక్కొక్కరు ఒక్కొక్క చెట్టు పరిరక్షించేట్లు జాగ్రత్త తీసుకున్నారు. ఆ గ్రామానికి శ్రీమాన్ దిల్‌రాజుగారు శ్రీశ్రీశ్రీ స్వామివారిని ఆహ్వానించారు. గ్రామమంతా కలిసి చేసుకుంటున్నా ఇది ఆదర్శవంతంగా తయారౌతుందని శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు. సాయంత్రానికి గుత్పా చేరుకున్నారు.

12వ తేది 'గుత్పా'లో శ్రీ వేంకటేశ్వరస్వామివారి ప్రతిష్ఠ చేసి, కూరత్తాళ్వాన్ తిరునక్షత్ర సందర్భంగా కూరేశుల ఆచార్యనిష్ఠను, వారికి గల సంప్రదాయ దక్షతను వివరించారు. రాత్రికి శ్రీరామనగరం చేరుకున్నారు.

13వ తేదీ సాయంత్రం హైదరాబాద్‌నుండి విశాఖ చేరి శ్రీమాన్ చీకోటి జనార్దన్‌గారి కుమారుడు వేంకటేశ్వరరావు ఆహ్వానంపై పరవాడ ఇండస్ట్రీ ఏరియాలో నిర్మించిన 'గోదావరీ పాలీమర్స్' అను ప్లాస్టిక్ డ్రమ్స్ ఫ్యాక్టరీని సందర్శించారు. రాత్రికి 'వారిజ' ఆశ్రమాన్ని సందర్శించి తెల్లవారి "మందస" చేరుకున్నారు.

14వ తేది మందసా వాసుదేవస్వామి బ్రహ్మోత్సవాలలో భాగంగా ఆలయంలో జరిగే కార్యక్రమాలలో పాల్గొన్నారు. శ్రీమాన్ గోవిందాచార్యస్వామి, శ్రీమాన్ పురుషోత్తమ స్వామి ప్రోత్సాహంతో వాసుదేవస్వామి ఆలయాన్ని కేంద్రంగా చేసుకొని వేయిప్రాంతాల నుంచి వేయి కలశాలతో తులసిని నింపుకొని భక్తులు అక్కడికి విచ్చేశారు. ఆ తులసితో స్వామివారి సమక్షంలో పెరుమాళ్ళకు అర్చన జరిగింది. ఈ సందర్భంగా శ్రీస్వామివారు ఆలయాలలో బ్రహ్మోత్సవాలు, అధ్యయనోత్సవాలు, పవిత్రోత్సవాల వైభవాన్ని వివరించారు. దానిలోని ఆంతర్యాన్ని అందులో పాల్గొన్నవారికి కలిగే ఫలితాన్ని తెలియజేశారు.

మధ్యాహ్నం 'పలాస'లోని శ్రీమాన్ బాలాజీగారి గృహాన్ని సందర్శించి శ్రీమాన్ సూర్యసురేశ్‌గారి జీడిపప్పును జల్లించే మిషెన్ ఆరంభించారు. అక్కడ నుండి శ్రీమాన్ కన్నారావుగారి రియల్ ఎస్టేట్ వెంచర్‌ను చూసి మందస చేరుకున్నారు.

సాయంత్రం 6.30గంటలకు ఆలయంలో ఎదురుకోలు ఉత్సవం జరిగింది. శ్రీ ఉ.వే.శ్రీమాన్ సముద్రాల రంగరామానుజాచార్య స్వామివారు, శ్రీమాన్ శ్రీవాసుదేవస్వామి వైభవాన్ని వివరించారు.

15వ తేది శాంతి కళ్యాణం జరిపి వాసుదేవ సేవాసమితి, మందసలోని కార్యకర్తలందరికి మంగళాశాసనం చేసి విశాఖ మీదుగా రాత్రికి హైదరాబాద్ శ్రీరాంనగర్ చేరుకున్నారు.

16వ తేది శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారి ధర్మపత్ని శ్రీమతి శ్రీకుమారిగారి సోదరి శ్రీమతి ఎ. విజయలక్ష్మి, విజయలక్ష్మిగారి కుమారుడు శ్రీమాన్ అనిల్‌కుమార్ ఆళ్ళగడ్డ సమీపంలో కారు ప్రమాదంలో 4వ తేదిన పరమపదించారు. శ్రీస్వామివారు వారి కుటుంబసభ్యులను పరామర్శించి, సాంత్వన పలికారు.

17వ తేది మధ్యాహ్నం సెంట్రల్ కమిటీ (వికాస తరంగిణి) సమావేశంలోను BAKASS సభ్యుల సమావేశంలోనూ పాల్గొని భవిష్యత్ కార్యాచరణకై వారలకు తగు సూచన లందించారు. సాయంత్రం 6గం. లకు హైదరాబాద్ మెహిదీపట్నం లోని లంగర్‌హౌస్ వద్ద లయన్స్‌క్లబ్ Regional సమావేశంలో పాల్గొని మంగళాశాసనాలు చేశారు.

18వ తేది శ్రీరాంనగరంలో రాష్ట్ర వికాసతరంగిణి కార్యవర్గ సమావేశం జరిగింది. వికాసతరంగిణి ప్రెసిడెంట్ శ్రీమాన్ మహేందర్‌రెడ్డి, శ్రీమాన్ పద్మనాభరావుగార్లు శ్రీస్వామి వారలను వేదికపైకి ఆహ్వానించారు. శ్రీ అహోబిల జీయర్ స్వామివారు ప్రారంభోపన్యాసమును కావించారు. అనంతరం శ్రీస్వామివారు ప్రవచిస్తూ విజయనగరం నేత్ర విద్యాలయంలోని విద్యార్థుల ప్రతిభను తెలియజేశారు.

వి.టి. కార్యకర్తలందరికి భవిష్యత్ ప్రణాళికను సూచిస్తూ వ్యక్తిని వ్యక్తిగా తయారు చేసుకోవడానికి కావలసిన శిక్షణ తరగతులను వేసవి శిబిరాలుగా మన శ్రీరామనగరంలో నిర్వహిస్తామని శ్రీ స్వామివారు తెలియజేశారు. 24వ తేది రాత్రి గుంటూరు వేంచేశారు. నూతనంగా వివాహం జరిగిన క్రేన్ సుబ్బారావుగారి మనవడికి, మనవరాలికి మంగళాశాసనాలు చేసి శంషాబాద్ చేరారు.

26వ తేది కరీంనగర్ జిల్లాలో "ధర్మారం"లో శ్రీమాన్ పూసుకూరు జితేంద్ర, రామారావుగార్ల నేతృత్వంలో గ్రామ ప్రజలచే నిర్మించబడిన శ్రీ సీతారామచంద్రస్వామి దేవాలయ ప్రతిష్ఠ కావించారు. సాయంత్రం సికింద్రాబాద్ హరిహర కళాక్షేత్రంలో ఆదిలాబాద్ జిల్లాకు చెందిన శ్రీమతి సముద్రాల మాధవి బృందంచే ప్రదర్శించబడిన 'ఆచార్యత్రయం' అనే నాట్యవిభావరిని వీక్షించి, వారికి మంగళాశాసనాలు చేసి రాత్రికి వరంగల్‌లోని శ్రీమాన్ డా॥ బచ్చు మురళీకృష్ణగారి గృహానికి వేంచేశారు.

వరంగల్ సమీపంలోని "అల్లి తిమ్మాపురం" గ్రామంలో శ్రీసీతారామస్వామి, ప్రసన్నాంజనేయస్వామి దేవాలయ ప్రతిష్ఠ కావించారు. అందులో భాగంగా వరంగల్‌కు చెందిన డా॥ బచ్చు రాధాకృష్ణ, మురళీకృష్ణ కుటుంబంవారు నిర్మించిన శ్రీరామస్థూపాన్ని కూడా ప్రతిష్ఠించారు. చుట్టుప్రక్కల గ్రామ ప్రజలు వ్రాసిన 20కోట్ల రామానామాన్ని ఇందులో నిక్షిప్తం చేశారు.

28వ తేదీ హన్మకొండలోని శ్రీమాన్ రామచంద్రరావుగారి గృహంలో ఉండి సుమంగళీ ఫంక్షన్ హాలులో తిరుమంత్రార్థాన్ని దృశ్య శ్రవణ సాధనాలతో భక్తకోటికి అనుగ్రహించారు.

29 ఉదయం హన్మకొండలో 800మంది భక్తులకు మంత్రోపదేశం కావించి రాత్రికి సీతానగరం చేరారు.

## శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి ప్రచార కార్యక్రమాలు

మార్చి నెల

| | | |
|---|---|---|
| 5. హైదరాబాద్ | E.S.I. శ్రీ విజయలక్ష్మీదేవాలయంలో సహస్ర కలశాభిషేకం ప్రారంభం. | |
| 7,8,9 జీవా | 9 రాత్రికి జనగాం | |
| 10. జనగాం | ఆళ్వార్‌ల ప్రతిష్ఠ | రాత్రికి పాల్వంచ, ఖమ్మం జిల్లా. |
| 11,12. ఖమ్మం | నవభారత్ ఫెర్రోవారి శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ మహోత్సవాలలో పాల్గొనుట. | |
| 14. మేళ్ళచెర్వు | సాయంత్రం మేళ్ళచెర్వు చేరతారు. | |
| 15-17 మేళ్ళచెర్వు | మహాసిమెంట్స్ శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలలో పాల్గొనుట | రాత్రికి శంషాబాద్ |
| 18,19 హైదరాబాద్ | శ్రీ వైష్ణవ సేవాసంఘంవారి ఉగాది పంచాంగ ప్రారంభోత్సవ కార్యక్రమంలో పాల్గొంటారు. | రాత్రికి ఆత్మకూరు |
| 20. ఆత్మకూరు | పుష్కరోత్సవం | రాత్రికి జీవా |
| మార్చి 23 | | |
| ఏప్రియల్ 6 శంషాబాద్ | దివ్యసాకేతంలో ఉగాది మరియు వసంతోత్సవ కార్యక్రమాలలో వేంచేసి ఉంటారు. | |
| 14. వైజాగ్ | ఎమ్.వి.పి.కాలనీలో శ్రీ వేంకటేశ్వరాలయం పునఃప్రతిష్ఠ కార్యక్రమం | |
| 16. యలమంచిలి | శ్రీమాన్ జె. రామేశ్వరరావు-శ్రీకుమారిగార్ల మహాసిమెంట్స్ ఆవరణలో శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయ ప్రతిష్ఠ | |

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన ఫిబ్రవరి నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. చతుర్ముఖ బ్రహ్మ శయనించేది.......... | |
| 2. మజ్జనతాం అనగా? | |
| 3. బాణాసురునికి ధనువు దర్శనమిచ్చిందిలా....... | |
| 4. నేటి............ దీక్ష వంటిదే వానరులు చేయాలనుకున్న...... | |
| 5. రాముడికి అనుకూలంగా మాట్లాడిన రావణమంత్రి..... | |
| 6. మహాభూతం ..... | |
| 7. యోగము, క్షేమము తేడా ఏమిటి? | |
| 8. వానరులు సీతాన్వేషణకు బయలుదేరిన మాసం.... | |
| 9. స్త్రీ......... .......... ....... .......కలగలుపు | |
| 10. పడిభాష్యకారుల సన్నిధి పునఃప్రతిష్ఠ వైఖానసం ప్రకారమే చేయాలని నచ్చచెప్పిందెవరు? | |
| 11. శ్రీనివాసుని చుబుకంపై కర్పూరపు రహస్యం... | |
| 12. గోపిక అంటే...... | |
| 13. '............మితిమీరి ఆళ్వారులను........... చేసింది. | |
| 14. "అపావృణు" అనగా ఏమి? దేనిని | |
| 15. శ్రీనివాసుని సహోదరుడు ఎవరు? | |
| 16. పరమాత్మ ఒక్కడే..... మిగిలినదంతా .... ప్రాయమే! | |
| 17. నాగాభరణాలకి సాక్ష్యం..... | |
| 18. రావణుడు............ మనుమడు. ..........తమ్ముడు. | |
| 19. నిష్కామ కర్మమార్గంలో నిలవడానికి...... శ్రీకృష్ణుడు నేర్పిన పాఠం. | |
| 20. గుఱ్ఱాలు .......... వాయువును జయంచలేక సిగ్గుపడ్డాయి. | |
| 21. నందనుడంటే...... | |
| 22. ....... వాయిద్యం వంకతో ఊరు పేరయింది. | |
| 23. తిరుమల చరిత్రను అందించే ..... ధర్మం | |
| 24. విధి అంటే..... | |
| 25. శంకరాచార్యుల దృష్టిలో భక్తి ............ | |

**గత నెల విజేతలు :** జె. సుశీల-హబ్సీగూడ, హైదరాబాద్; సి. పేరిందేవి-హిమాయత్‌నగర్, హైదరాబాద్; హనుమాయమ్మ-విశాఖపట్నం; జయలక్ష్మి-చెన్నై; గుడివాడ రాజ్యలక్ష్మి-గుంటూరు; నల్లమల్లి మంగతాయారు-ఖమ్మం; మిడిదొడ్డి చంద్రమౌళి-మహబూబ్‌నగర్; వై. నాగభూషణం-అమలాపురం, తూ.గో; డా॥ ఎ. రామచంద్రారెడ్డి-హన్మకొండ; ఎమ్.వి.సి. అనిరుధ్ రాజమహేంద్రి; నిడుముక్కల మాధవరావు-గుంటూరు.

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్టు పంపగలరు.
భక్తినివేదన శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీ నందన నామ సంవత్సరం చైత్రమాసం


సంపుటి 65 ఏప్రియల్

సంచిక 1 2012


## పండుగలు

ఏప్రియల్

5. శ్రీరంగనాచ్చియార్ తిరు॥
6. హనుమద్విజయోత్సవం, తిరువరంగత్తముదనార్ తిరు ॥
13. అశ్విని కార్తె, మేష సంక్రమణము, రా. 8.35 తమిళవత్సరాది
17. సర్వేషామేకాదశి
19. మాసశివరాత్రి
20. పిండపితృయజ్ఞము
21. అమావాస్య, పాడ్యమి తిథి
23. పరశురామ జయంతి, ఉయ్యకొండార్ తిరు ॥
24. అక్షతృతీయ, సింహాద్రి చందనోత్సవం
26. శంకర జయంతి
27. రామానుజాచార్య జయంతి, భరణికార్తె
28. చక్రవర్తి తిరుమగనార్ తిరు ॥
29. శ్రీరామనగర్ దివ్యసాకేత బ్రహ్మోత్సవ అంకురారోపణం
30. గురుమౌఢ్యారంభం

మే

2. సర్వేషామేకాదశి
3. పరశురామ ద్వాదశి
4. స్మార్త నృసింహ జయంతి, మధురకవియాళ్వార్ తిరు॥
   కిడాంబియాచ్చాన్ తిరు ॥ తిథి ద్వయం,
   శ్రీ రామనగర్ దివ్యసాకేత అవబృథోత్సవం
5. వైష్ణవానాం శ్రీనృసింహ జయంతి
6. అన్నమాచార్య జయంతి
7. అవమతిథి

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ**

**రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


**చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-**

**విదేశాలకు సంవత్సరచందా $30/-**




మా సేవలో....

**భక్తినివేదన, సీతానగరం - 522 501,**

**గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.**

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం



జై శ్రీమన్నారాయణ!

## శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరుస్వామివారి సందేశం

# ధర్మము

శ్రీమతి పి. జ్యోతి - హన్మకొండ

ఒకసారి మన శ్రీ పెద్ద జీయరు స్వామివారిని ఓ జిజ్ఞాసువు ధర్మానికి లక్షణమేమిటని ప్రశ్నించారట. దానికి శ్రీస్వామివారు ఈ విధంగా సెలవిచ్చారు.

ధర్మం రెండు విధాలు : 1. సామాన్యధర్మం; 2. విశేష ధర్మం. ధృ-ధారణే అనే ధాతువువల్ల ఉత్పన్నమై ధరించేది కాబట్టి ధర్మమని చెప్పబడుతున్నది. అంటే దేనిచే ఈ లీలా విభూతి ఆ నిత్యవిభూతి ధరించబడుతున్నాయో అదే ధర్మమని చెప్పవచ్చు.

ఈ ధర్మమనే దాని అసలు స్వరూపం నిత్యమై ఏకరూపమై ఉంటుంది. అది దేశకాల పాత్రాదులననుసరించి వినియోగాదులను బట్టి వివిధ రూపాలతో భాసిల్లుతుంది.

**సామాన్య ధర్మలక్షణమేమిటంటే:**

**ధృతిః క్షమా దమో స్తేయం శౌచమింద్రియ నిగ్రహః ।**
**హ్రీ ర్విద్యా సత్య మక్రోధః ఏతద్ధర్మస్య లక్షణమ్ ॥**

**ధృతి:** ఎన్ని విఘ్నాలు కలిగినా ఆరంభించిన భగవ ద్భాగవతాచార్య విషయకమైన క్రియలను విడువక పరిసమాప్తి వరకు ధరించియుండి నడపటం.

**క్షమా:** భగవద్భాగవతాచార్య సేవా విషయంలో ఓర్పును కలిగి ఉండటం.

**దమ:** మనస్సును విషయాలవైపుకు పోకుండా ఏకాగ్రత కలదానిగా చేసి భగవద్భాగవతాచార్య విషయంపై అవగాహింపచేయటం.

**అస్తేయం:** తనకు స్వత్వములేని వస్తువులపై తాను స్వత్వబుద్ధిని ఉంచకుండుట. భగవద్భాగవతాచార్యులకు శేష భూతమై, పరతంత్రమై ఉండి ఆత్మ ఆత్మీయులపై స్వతంత్రబుద్ధి లేకుండటం.

**శౌచం:** శారీరకంగా, మానసికంగా ఎటువంటి మాలిన్యం లేకుండా పరిశుద్ధుడై ఉండటం, ఆరోగ్యవంతుడై ఉండటం, భగవద్భాగవతాచార్యులకు అనన్యార్హ శేష భూతుడై, అనన్య శరణ్యుడై, అనన్య భోగ్యుడై ఉండటం.

**ఇంద్రియ నిగ్రహం :**
ఏకాదశేంద్రియాలను విషయానుభవాల నుండి మరలించి ఏకాగ్రాలుగా చేసి భగవద్భాగవతా చార్య విషయంలో వాటి నన్నింటిని ప్రవర్తింపచేయటం.

**హ్రీః:** ప్రాకృత విషయానుభవానికి సిగ్గుపడటం, భగవద్భాగతాచార్యులకు వినయ విధేయుడై ఉండటం.

**విద్యా:** అర్థపంచక జ్ఞానాన్ని కలిగి ఉండటం.

**సత్యం:** హితం-ప్రియమగునట్లుగా, యదార్థ దర్శనానుగుణ మితభాషిత్వం, సర్వభూతహితకరంగా మధురంగా భాషించటం.

**అక్రోధః:** భగవద్భాగవతాచార్య విషయంలో మనోవాక్కాయా లతో కష్టాన్ని కలిగించే వ్యతిరేకమైన తలంపుగాని క్రియలుగాని లేకుండటం.

ఈ పదీ కలిగి ఉంచేది 'ధర్మం'. ఇటువంటి సామాన్య ధర్మానుష్ఠానం వల్ల విశేష ధర్మావలంబానికి తగిన వాడవుతాడు.

**విశేషధర్మమంటే :**

**రామో విగ్రహాన్ ధర్మః కృష్ణం ధర్మం సనాతనం**
**సాక్షాద్ధర్మస్వరూపవాన్, నారాయణః పరోధర్మః**

అని పెద్దలచే తెలుపబడిన సాక్షాత్తు సర్వేశ్వరుడే విశేషధర్మం. ఆతనిని తలవడం, ఆతనికి ఆతని భక్తులకీ సేవచేయడం గొప్ప ధర్మం. ఇంతకంటే మించిన ధర్మం ఎక్కడ ఎప్పుడూ లేనేలేదు.



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*గత సంచిక తరువాయి...*

**(ప్రథమస్కంధం - ఏడవ అధ్యాయం)**

**అశ్వత్థామకృత-సుప్తబాలవధ**

నారద వైభవాన్ని భాగవతసంసర్గ వైభవంగా ఆవిష్కరించి సూతుడు, ద్రోణ పుత్రుడైన అశ్వత్థామ చేసిన సుప్తబాలవధను (నిదురిస్తున్న ఉపపాండవుల వధను) వివరించాడు ఏడవ అధ్యాయంలో. దానికి ముందు, వ్యాసుడు భాగవతరచనం చేసిన వైనాన్ని ఆవిష్కరించాడు. బ్రహ్మదైవతాకమైన సరస్వతీనదీ తీరాన గల తన శమ్యప్రాసమనే పేరు గల ఆశ్రమంలో ఋషులకు చెందిన సత్రయాగం నిరంతరం సాగుతూ ఉండగా, బదరీ తరువులు (రేగుచెట్లు) సమృద్ధిగా గలదవడం చేత బదరీవనంగా ప్రసిద్ధి చెందిన ప్రదేశంలో నారదుడుపదేశించిన ధ్యానప్రక్రియ ననుసరించి ఏకాగ్రచిత్తుడై (భగవానునియందు తన మనస్సు నిగిడ్చి) తన చిత్తంతో భగవానుని దర్శించాడు బాదరాయణుడు.

**భక్తియోగేన మనసి**
**సమ్యక్ ప్రణిహితేఽమలే ।**
**అపశ్యత్ పురుషం పూర్ణం**
**మాయాం చ తదుపాశ్రయామ్ ॥**

భక్తియోగం చేత లెస్సగా నిశ్చలపరచగా, నిర్మలమైన ఆ మనస్సులో పూర్ణ పురుషుడైన శ్రీమన్నారాయణుని, ఆయనకు చెందిన మాయను (ఆశ్చర్యకరశక్తిని) దర్శించాడు.

**యయా సమ్మోహితో**
**జీవ ఆత్మానం త్రిగుణాత్మకమ్ ।**
**పరోఽపి మనుతేఽనర్థం**
**తత్కృతం చాభిపద్యతే ॥**

ఈ మాయయే జీవుని వ్యామోహపరుస్తున్నది. అందు వల్లనే స్వాభావికంగా త్రిగుణాతీతుడైన జీవుడు తనను తాను త్రిగుణమయునిగా భావించి, తన్మూలమైన అనర్థాన్ని పొందు తున్నాడు.

**అనర్థోపశమం సాక్షాత్**
**భక్తి యోగమధోక్షజే ।**
**లోకస్యాజానతో విద్వాన్,**
**చక్రే, సాత్త్వతసంహితామ్ ॥**

సకలానర్థాలను ప్రశమింపజేసే భగవద్విషయకమైన భక్తియోగాన్ని ఎరుగజాలని లోకాన్ని అనుగ్రహించడానికై, తత్త్వవేత్త అయిన వ్యాసుడు, **సాత్వత సంహితను** అంటే భాగవత సంహితను విరచించాడు.

**సత్** అంటే పరమాత్మ, ఆయన కలవారు సత్వంతులు. సత్వంతులే సాత్వంతులు. వారి అనుష్ఠాన ప్రక్రియ, అంటే వారు ఆశ్రయించిన భగవద్ధ్యాన ప్రక్రియయే **సాత్వత సంహిత.** ఇదే భాగవత సంహిత.

సాత్వత-భాగవత శబ్దాలకు అర్థం ఒక్కటే. భగవదనన్య భక్తులని. ఇలాంటి వారి భగవదుపాసనా విధానమే భాగవతంగా ఏర్పడిందని అభిప్రాయం. పై శ్లోకాల తాత్పర్యము ఇది.

భగవంతుని స్వరూప-రూప-గుణ వైభవాలను, సాక్షాత్కరింప చేసేది భక్తియోగం మాత్రమే. భక్తి అంటే భగవంతుని పట్ల గల అనన్య ప్రీతి. ఇదే భగవంతుని దరి చేరుస్తుంది.

కనుక, **యోగం (యుజ్యతే అనేన ఇతి యోగః)** దీని వల్ల భగవానునితో భక్తుడు చేరుతాడు కనుక ఇది **యోగం.** ఇదే భక్తిరూపమైన అంటే భగవత్ప్రీతిరూపమైన యోగం. భక్తియోగం చేత, ఇతరేతర విషయాలలో చిక్కుకున్న మనస్సు, వాటి నుండి విడివడి నిశ్చలం అవుతుంది. అంతే కాదు కామాదిమలాలన్నీ దాని నుండి తొలగిపోతాయి. ఇలా

భక్తియోగం చేత నిశ్చలము, నిర్మలము అయిన మనస్సులోనే పరమపురుషుడైన నారాయణుని దర్శింపగలం.

అంతే కాదు, ఆ భగవానునే ఆశ్రయించి ఉండే ఆశ్చర్యకర శక్తి అయిన **'మాయ'**ను కూడా గుర్తింపగలం. ఈ మాయయే జీవుని ఈ సంసారబంధంలో నిలిపి విషయ వ్యామోహితుణ్ణి చేస్తుంది. తాను స్వాభావికంగా సత్త్వరజ స్తమస్సులనే మూడు ప్రాకృతిక గుణాలకు అతీతుడే అయినా, ఆ గుణాలచే బంధింపబడేలా చేస్తుంది. తన్మూలంగా దుఃఖాల ననుభవించేలా చేస్తుంది.

ఇలాంటి మాయామూలాలైన సకలానర్థాలను పోద్రోలేది కేవలం భగవద్విషయకమైన భక్తియోగం మాత్రమే. ఇది ఎరుగని ఈ బాలిశలోకాన్ని ఉద్ధరించడానికి, భక్తియోగవైభవాన్ని వెల్లడి చేయడానికి, వ్యాసుడు, **'సాత్వత సంహిత'** అని చెప్పబడే భాగవతసంహితను లోకానికి అనుగ్రహించాడు.

ఈ **సాత్వత సంహిత,** త్రిగుణాత్మకప్రకృతిమూలంగా ఏర్పడిన దేహాదులతో ఐక్యాన్ని భావిస్తూ **'నేను మనుష్యుడను' 'నేను దేవుడను' 'నేను పశువును'** అని ఇలా తమను తాము వ్యవహరిస్తూ సంసారతాపాలననుభవిస్తున్న జీవులకు తత్త్వవివేకాన్ని కలుగజేస్తుంది. దేహాత్మభ్రాంతిని తొలగిస్తుందన్న మాట!

**యస్యాం వై శ్రూయమాణాయాం కృష్ణే పరమపూరుషే ।**
**భక్తిరుత్పద్యతే పుంసః శోకమోహభయాపహా ॥**
**స సంహితాం భాగవతీం కృత్వా నుక్రమ్య చాత్మజమ్ ।**
**శుకమధ్యాపయామాస నివృత్తినిరతం మునిమ్ ॥**

ఏ సాత్వత సంహితను విన్నంత మాత్రం చేతనే, పరమ పురుషుడైన కృష్ణనారాయణుని పట్ల, సర్వశోకమోహాలను పటాపంచలు చేసే **'భక్తి'** ఆవిర్భవిస్తుందో, అటువంటి సర్వోత్తమమైన **"భాగవత సంహితను"** విరచించి, దానిని లెస్సగా శోధించి, తన కుమారుడైన శుకునికి బోధించాడు.

శుకుని యోగ్యత ఎలాంటిది?

దాన్ని చెప్పడానికి **'నివృత్తినిరతం' 'మునిమ్'** అని రెండు విశేషణాలు చేర్చబడ్డాయి. నివృత్తినిరతుడు అంటే పరమవైరాగ్య సంపన్నుడు అని అర్థం.

**'ముని'** అంటే మౌనస్తిమితచేతస్కుడన్న మాట. దీన్ని బట్టి భగవద్వైభవ ప్రకాశమైన భాగవత సంహితను లోకానికి వెల్లడి చేయగలవాడు శుకమహర్షి మాత్రమేనని సూచింపబడింది.

శౌనకాదులకు మనస్సుల్లో శంక కలిగింది. సర్వవిధ ప్రవృత్తి మార్గానికీ దూరమైనవాడు, సర్వవిషయాలలో పరిపూర్ణమైన ఉపేక్షాభావం కలవాడు, మౌనవ్రతి, అయిన శుకుడు, ఆత్మారాముడు కదా! నిరంతరం **–స్వసుఖనిభృతచేతాః తద్వ్యుదస్తాన్యభావః'** అన్నట్లు తనలో తాను గాఢ భగవదనుభవ జనితమైన వైవశ్యం కలిగి, ఇతర విషయాల పట్ల సర్వాత్మనా వైముఖ్యం కలవాడు కదా! అటువంటి అంతర్ముఖప్రవృత్తి కల శుకుడు ఎవ్వని సన్నిధిలో అభ్యసనం చేశాడు? ఇలా ఒకరి సన్నిధిలో చేరి యుండి అధ్యయనం చేయడం అనేది సాధ్యం ఎలా అవుతుంది? అని. ఈ శంకనే వెలిబుచ్చారు శౌనకాదులు సూతుని వద్ద.

**స వై నివృత్తి నిరతః, సర్వత్రోపేక్షకో మునిః ।**
**కస్య వా బృహతీ మేతాం ఆత్మారామస్సమభ్యసత్ ॥**అని.

దీనికి సూతుడు ఇలా అన్నాడు.

**ఆత్మారామా శ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే ।**
**కుర్వ న్త్యహైతుకీం భక్తి మిత్థం భూతగుణో హరిః ॥**
**హరే ర్గుణాక్షిప్తమతిః భగవాన్ బాదరాయణః ।**
**అధ్యగా న్మహదాఖ్యానం నిత్యవిష్ణుజనప్రియః ॥**

భగవంతుని కల్యాణగుణాలు అత్యాశ్చర్యకరాలు. అవి భోగులను యోగులను ఇద్దరినీ సమానంగానే ఆకట్టుకుంటాయి. **'ఆత్మారామాశ్చ'** అన్న శ్లోకం ఈ ఇద్దరినీ ఉద్దేశించినదే. ఇక్కడ భోగుల పరంగా వ్యాఖ్యానిస్తే వచ్చే అర్థం ఇది.

**ఆత్మారామాః** ఆత్మా అంటే దేహమే, ఆరామః= విశ్రాంతి స్థానంగా; యేషాం=ఎవ్వరికి ఉన్నదో; తే=వారు ఆత్మారాములు.

అంటే కేవలం దేహము, ఇంద్రియాలు, వాటి ద్వారా కలిగే భోగమే పర్యవసానంగా కలవారు. వారికి అంతకంటే పరమార్థం ఏమీ లేదన్న మాట.

ఇక్కడ ఆత్మశబ్దం దేహబోధకం. తెల్లవారి లేచినది మొదలు రాత్రి పరుండే వరకు దేహము, దేహసంబంధం మాత్రమే పరమార్థమని భ్రమించి, దేహపోషణానికి, దేహ రక్షణానికి, దేహ బాంధవ్య రక్షణానికి నిరంతరం శ్రమించేవారే ఆత్మారాములన్న మాట. వీరికి శాస్త్రమర్యాద తెలియదు.

శాస్త్రవివేకం ఎంత మాత్రం లేదు కనుక మునులు.

మౌనాన్ని అంతర్ముఖ విచారణ పట్ల పూర్తిగా ఔదాసీన్యాన్ని వహించేవారు. శాస్త్రాల పట్ల వైముఖ్యం కలవారు కనుక, నిర్గ్రన్థాః **– నిర్గతాః గ్రన్థాః శాస్త్రాణి యేభ్యః తే నిర్గ్రంథాః–** శాస్త్రాలన్ని వారి నుండి దూరంగా తొలగిపోతాయన్న మాట.

ఇలాంటి కుక్షింభరులు, భోగపరాయణులు అయిన లౌకిక జీవనవృత్తులు కూడా, కుర్వన్తి అహైతుకీం **భక్తిం** = భగవంతుని పట్ల నిర్హేతుక ప్రీతిని పొందుతారట, ఎందువల్ల? **ఇత్థం భూత గుణోహరిః** = ఇలాంటి సర్వవ్యామోహక కల్యాణగుణ వైభవం కలవాడే శ్రీహరి.

దీని తాత్పర్యం ఇది. లోకంలో సామాన్య సాంసారిక జీవనం సాగిస్తూ, ఏదో పని చేస్తూ పొట్టపోసుకొని, దేహ బంధాన్నే పరమార్థంగా భావిస్తూ, శాస్త్రవివేకం ఎంతమాత్రం లేనందున, తత్త్వవిచారణ చేయజాలక ఉదాసీనులై ఉండేవారు, శాస్త్రవచనాలకు విధినిషేధాలకు ఎంత మాత్రం లొంగనివారు అయిన కేవల లౌకిక ప్రవృత్తి కలవారు కూడా, ఎప్పుడో ఒకప్పుడు కలిగిన యాదృచ్ఛిక సజ్జన సంబంధం వల్ల భగవత్కల్యాణ గుణవైభవాన్ని విని, ఈడుపడి క్రమంగా ఏకతానహృదయులు కాగలుగుతారంటే, ఇది కేవలం భగవత్ కల్యాణగుణవైభవమే!

ఇక, తత్త్వచింతనాసామర్థ్యం కలవారి గురించి చెప్పేదేముంది? వారు "ఆత్మారాములు, అంటే పరమాత్మనే విశ్రాంతి స్థానంగా ఆశ్రయించినవారు, వారు శాస్త్రాల కొలబద్దలకు విధి నిషేధాలకు అతీతులు, తత్త్వచింతనానిర్భర చిత్తులై నిరంతరం మౌనం వహించి ఉండేవారు ఇలాంటి అంతర్ముఖ ప్రవృత్తులు సహితం భగవత్కల్యాణగుణ వైభవానికి ఈడుపడి, లీలారసాస్వాదన నిర్భరులౌతారు. ఇట్టి వారే శుకాదులు. *(సశేషం)*

---

**౨౨౬వ భగవద్రామానుజ జయంత్యుత్సవశుభాహ్వానము**

**శ్రీశ్రీ శ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో ....**

**స్థలము: సీతానగరం సమయం-ఏప్రిల్ 25,26,27 తేదీలలో**

**కార్యక్రమం- ప్రతిరోజూ ఉదయం శ్రీరామానుజ అష్టోత్తరశతనామ పూజ, ప్రవచనములు, చివరిరోజున శ్రీరామానుజులకు తిరుమంజన మహోత్సవం.**

**శ్రీ ఉ.వే శ్రీమాన్ రంగరామానుజార్యస్వామివారి తండ్రిగారి పేరున సమర్పించే 11వ భవ్యస్మృతి పురస్కారప్రదానమును శ్రీ ఉ.వే.శ్రీమాన్ తూపురాణి ఉడయవర్లు స్వామివారికి సమర్పించెదరు.**

***సూచన: మందసలో జరుగవలసిన ఈ పురస్కార కార్యక్రమము సీతానగరము నకు మార్చడమైనది.***

**భగవద్బంధువులందరూ ఆహ్వానితులే**

# నేర్చుకుందామా! - 7

**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ**

పరులకి ఉపకారం చెయ్యడం అనే లక్షణం మనిషికి కర్తవ్యాన్ని బోధిస్తోంది. ధర్మసాధనమైన మన శరీరం ఎలా ప్రకాశిస్తుంది అన్న విషయాన్ని మన నీతిశతకకారులు, సూక్తిసుధగా ఎంతో అందంగా జాతికి అందించారు.

ప॥ **అమరు చెవి శాస్త్రమున కుండలమున గాదు**
**వలయమున నొప్ప దీవిచే వెలయు పాణి**
**ఉరు దయాఢ్యుల మేను పరోపకార కలన**
**రాణించు గంధంబు వలన గాదు॥**

మన శరీరంలో చెవి ఎలా ధన్యతను చెందుతుంది అంటే 'శాస్త్రము'న. శాస్త్రం వినడం ద్వారా అంటున్నారు కవి. మంచిమంచి విషయాలెన్నింటినో మన శాస్త్రాలు మనకి అందిస్తున్నాయి. మరి వాటిని విన్నప్పుడే చెవికి సార్థక్యం. కుండలాలు పెట్టుకుంటే సరిపోదు. అవి అందం కాదు.

చేతుల నిండుగా గాజులో, కంకణాలో ధరిస్తే చాలదు. అదికాదు నిజమైన అందం చేతికి మరేమిటి? 'ఈవి' అనగా దానం. ఉన్నదానిలో మనశక్తిని బట్టి కొంత ఇతరులకు ఇవ్వడమే దానం. ఆ గుణంతోటే చేతికి ప్రకాశం. దయాశీలుర శరీరం ఇతరులకి ఉపకారం చేసి రాణిస్తుంది కాని... శరీరమంతా గంధం పూసుకుంటే ఆ చందన పరీమళాలతో మాత్రం రాణించదు.

అంటే అలంకారాలు మాత్రమే శరీరానికి అందాన్ని ఇయ్యవు. మంచిని విని, మంచిని చేసి, మంచితనం చూపించి మాత్రమే ఈ శరీరాన్ని నిజంగా అలంకరించు కోవాలి. తెలిసిందా!



# సీతాఫలం రామార్పణమ్



శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్

(గతసంచికతరువాయి...)

ఆమాటలు విన్న రావణమంత్రి రావణుని సభకు వెళ్ళి రావణుని సీతా స్వయంవర సభకు వెళ్ళమని ప్రోత్సహించినాడు.

రావణుడు జనకసభకు వెళ్ళి

**హేరంబ షణ్ముఖ గిరీశ గిరీంద్రజాభి**
**రాకీర్ణ మత్సధిక భృత్య గణైశ్చ పూర్ణమ్ ।**
**ఉధృత్య సంస్థితవతో రజతాద్రి మస్య ॥**

జనకరాజా! విఘ్నేశ్వరుడు, షణ్ముఖుడు, పార్వతీ పరమేశ్వరులు సమస్త ప్రమథ గణములతో నిండివున్న కైలాస పర్వతమును అనాయాసముగ ఎత్తిన నాకు బాహుపరీక్ష కావలెనా? అందుకు నేను ధనువునెత్తవలెనా? నా సామర్థ్యము నీకు తెలియదా? అని అడిగినాడు.

రావణా! ఎవరీ శివధనువును ఎక్కుపెట్టెదరో అతడే సీతకు భర్తకాగలడు. నేను ఆడినమాట తప్పను అని పలికినాడు. కానీ, లోలోపల వ్యధ చెందినాడు.

అయ్యో! నా ప్రియపుత్రిక ఈ రావణుని చేతిలో పడునా? అమ్మా! భూదేవీ! నీకుమార్తెకు తగిన వరునికూడా సమకూర్చలేని అసమర్థుడనైనాను కదా! లోకమాతా! భూదేవీ! నేను అనాలోచితముగా ఎవరూ నెరవేర్చలేని పణమును పెట్టి ఇప్పుడు కుమిలిపోతున్న నాగతి ఏమిటి? అని భూదేవికి తన వ్యధను నివేదించగా భూదేవి అశరీరవాణితో జనకునికి మాత్రమే వినపడునట్లు

జనకరాజా! నీవు భయపడకు. రావణుడు పరాభవించ బడి యిప్పుడే పారిపోగలడు. అనంతరము సీతాస్వయంవరము నీవు కోరినట్లే జరిగి నీ కోరిక ఫలించును అని పలికినది. అనంతరము

**దశానన స్తద్ధనుషస్తధీశ**
**మీశం త్వనత్వా బహుగర్వయుక్తః ।**
**స్వవామ హస్తేన ధనుస్తు ధర్తు**
**ముద్యుక్త వాం స్త న్న చచాల చాపమ్ ॥**

అహంకారి అయిన రావణుడు ధనువునకు అధీశుడైన శివునికి నమస్కరించకుండా బహుగర్వంతో తన ఎడమచేతితో ధనువునెత్తుటకు ప్రయత్నించాడు. కానీ ఆ ధనువు అణువంత కూడా కదలలేదు.

మూర్ఖరావణుడు నన్ను తలచనైనా తలచకుండగనే ధనువునెత్త చూచుచున్నాడని, వాని గర్వము నణచవలెననీ పరమేశ్వరుడు తలచినాడు. తనశక్తినంతనూ తన ధనువున ప్రవేశపెట్టినాడు. అంతట ఆ ధనువు అమిత బరువుకాగా 'అథ దక్షిణహస్తేన దశాస్యో ధర్తు ముద్యతః' రావణుడు తన కుడిచేత ధనువునెత్త ప్రయత్నించాడు. అయిననూ ధనువు కదలలేదు.

**ఏకోనవింశ హస్తై శ్చ ప్రోద్ధర్తుం న క్షమః క్రమాత్ ।**
**క్షమేణో ధృతవా నంతే ధను ర్వింశతిభి శ్శయైః ॥**

తరువాత రావణుడు ఇరవై చేతులతో ధనువును అమిత శ్రమకోర్చి ధనువునెత్తగా, నారి త్రాడుఊడి క్రిందపడగా పందొమ్మిది చేతులతో ధనువునెత్తి, ఒక చేతితో నారిత్రాడును తీయబోగా ఆ ధనువు రావణుని రొమ్ముమీద పడినది.

**తద్ధను హి కేనాపి చాలయితుం తతః ।**
**అథ సర్వే చాలయితుం మైథిలే నార్థితా నృపాః ॥**

ఆ ధనువునెవరు కదల్చుటకు వీలులేకున్నది. అప్పుడు మిథిలాధిపతి జనకుడు ధనువు ఆవలకు త్రోయుడని రాజకుమారులను ప్రార్థించాడు.

**ప్రియతా మయ మిత్యుక్త్వా తత్ర తూష్ణీం స్థితా స్తదా ।**
**ధనుషోஉ థః పతిత్వా సః మర్తుం సిద్ధోஉ భవత్తదా ॥**

కానీ రావణుని చావనిమ్మని ఆ రాజులు మిన్నకున్నారు. రావణుడు ఆ ధనువు క్రిందపడి సమసిపోవటానికి సిద్ధముగా ఉన్నాడు.

**మాం సముద్ధర సర్వేశ మాం సముద్ధర శంకర ।**
**ఇతి మందం దశానస్తు ప్రార్థయామాస శంకరమ్ ॥**

అప్పుడు రావణుడు శంకరా! నన్ను రక్షించు. సర్వేశ్వరా!

నన్ను ఉద్ధరించు. అని లోలోన వేడుకుంటున్నాడు. అప్పుడు జనకమహారాజు సేవకులను పిలచి రావణుని రొమ్ముమీది ధనువును ప్రక్కకు తీయుడని ఆజ్ఞాపించగా అతి ప్రయాసతో అనేకమంది కలిసి తొలగించారు.

అప్పుడు రావణుడు సిగ్గుతో ఆయాసంతో తలవంచుకొని మంత్రుల రక్షణతో పుష్పక విమానమెక్కి లంకాభిముఖంగా బయలుదేరాడు.

అంతట జనకమహారాజు కైలాసము నెత్తిన రావణుడే ఈ విధంగా భంగపడినాడే! మిగిలిన రాజుల సంగతి చెప్పనేల? అయ్యో సీతా! అనాలోచితంగా ధనువును శుల్కముగా పెట్టినానే। నీకు నేనేమి చేయగలనని విచారించి పురోహితుడైన శతానందుని పిలచి రాజులకు ప్రోత్సాహము కలిగించుమని చెప్పగా ఒక మంత్రి పుంగవుని వారి వద్దకు పంపినాడు.

ఆ మంత్రివరుడు రాజులవద్దకు వెళ్ళి "వంగరాజా! ధనువునెక్కు పెట్టుటకు నీవేమందువు?" అనగా, "మంత్రీ! నేను వివాహం అయిన వాడను. కనుక విల్లును ఎక్కు పెట్టుట వృధా ప్రయాస అని మిన్నకున్నాను" అన్నాడు.

"కళింగరాజా! నీవు పరాక్రమశాలివి కదా! విల్లెక్కు పెట్టు"మనగా "నా దేహస్థితి బాగుండలేదు కనుక ఊరకుంటి" ననినాడు.

మగధరాజు నేను బయలుదేరిన శకునము బాగు లేదన్నాడు. పాంచాలరాజు కొండలాంటి ఈ వింటిని నేనెక్కు పెట్టలేనన్నాడు. మాళవరాజు "మంత్రీ! మాకు సీత అను ఆశను కల్పించి, ఇచ్చటికి రప్పించి, అశక్యమైన ధనువునెత్తు మనుట బహు విస్మయకరముగా ఉన్నది" అనినాడు.

నేపాళరాజును అడుగగా "ఇదొక చంద్రమొద్దు కాండముగానీ ధనువుకాదు. అటువంటి మొద్దునెవడు వంచగలడూ? అసాధ్య"మని చెప్పి ఒక నమస్కారము చేసి సభను విడిచి వెళ్ళిపోయినాడు. అంతట విదర్భరాజు నేను ఏకపత్నీవ్రతుడను. ఊరక స్వయంవర మహోత్సవమును చూచుటకు వచ్చినాననినాడు. అప్పుడు జనకమహారాజు సభలోని రాజులతో...

**నిర్వీర్యం నృపమండలం త్వితి నృపా స్వప్నేఽపి నామన్యతే ।**
**ఇత్యేవం మైథిల భాషితం తు వచనం శ్రుత్వా సుమిత్రా సుతః ॥**

హే రాజపుత్రులారా! రాజమండలం ఇంత నిర్వీర్యం అయిపోతుందని నేను కలలో కూడా తలచలేదు సుమా! అని పలుకగా

లక్ష్మణుడు రోషకషాయిత నేత్రుడై ఆవేశంతో "జనకరాజా! నా సోదరుడు శ్రీరామచంద్రుడు ఇక్కడ ఉండగా రాజలోకము నిర్వీర్యమైనదనియెదవా? శ్రీరాముని చూచి మరల ఈ మాట అనుము. మా అన్న శ్రీరాముని, మా గురువు విశ్వామిత్రమహర్షినీ చూచి నీమాటకు నా కోపమును సహించినాను" అని పలుకగా

**సౌమిత్రిం శాంతయిత్వా తం కౌశికః ప్రాహ రాఘవమ్ ।**
**సముద్ధర్తు మిదం చాపం యత స్సాధ్వైవ రాఘవ ॥**

అప్పుడు విశ్వామిత్రుడు లక్ష్మణుని శాంతింపచేసి, "రామా! ఇంక జాగేల! ఆ ధనువును ఎక్కు పెట్టు"మని ఆదేశించినాడు. *(సశేషం)*



# అహో! భారతమ్

## శకుంతల - దుష్యంతుల చరిత్ర

*(గతసంచికతరువాయి...)*

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

ఇక్కడ మనం ఒక విశేషకథని స్మరించుకోవడం తప్పనిసరి. మహాకవి కాళిదాసు ఈ కథ చదివి సామాన్యునిలా తలఊపలేక పోయాడు. ఎందుకో తెలుసా! దుష్యంతుడు అంతటి మహారాజు లోకాపవాద భీతితో అంత ధైర్యంగా అబద్ధం ఆడడం సహించలేకపోయాడు కాళిదాసు. యథారాజా తథా ప్రజా.... అన్నమాట ఈ విషయంలో ఆలోచిస్తే తన సుఖం తాను చూచుకొని తరువాత నాకేం తెలియదని బొంకితే.. ఇది ఎంత వరకు న్యాయం.. అనిపించింది కాళిదాసుకి. ఏమైనా సరే! ఏదో మార్గం చూడాలి. దుష్యంతుని మీద జనాలకి ఏర్పడిన చెడుభావాన్ని తుడిచి వెయ్యాలి. ఎలా... ఎలా... ఎలా... ఆ తోచింది. ఒక దివ్యమైన ఆలోచన... మనం ఏదైనా ఒక కల్పన చేస్తే.. పౌరవ రత్నాలంకారుడైన దుష్యంతుడు అలా అబద్ధం ఆడడానికి ఒక కారణం కల్పిస్తే.. ఔను.. రాజును నిర్దోషిగా లోకానికి చూపించాలి. మహారాజు పిరికివాడు కాడు. అసత్యవాది కాడు అని నిరూపించే ప్రయత్నం చెయ్యాలి.. ఇది సాధ్యమేనా...? ఓ సాధ్యమే.. దీనికోసం ఒక కథ అల్లుదాం అనుకున్నాడు కాళిదాసు. అలా ఆయన ప్రజ్ఞతో కల్పింపబడిన కథే **"అభిజ్ఞాన శాకుంతలం"**.

ఈ కథ పూర్తిగా కాళిదాసు ప్రతిభతో కల్పింపబడిన కథ. మహారాజు జీవితంలో మచ్చను తుడిపివేసిన కథ. అతని అసత్యానికి బరువైన బలమైన కారణాన్ని చూపించిన కథ. ఏమాత్రం తప్పులేని మచ్చలేని రాజుగా దుష్యంతుడు లోకానికి చూపించిన కథ. కాళిదాసు కల్పనే అభిజ్ఞానం. అంటే గుర్తు. కథని నాటకంగా మలచిన కవి. ప్రతిభకి నిదర్శనం. అభిజ్ఞాన శాకుంతలం. ఆ కథని కూడా తెలుసుకుందాం.

దుష్యంతుడు వేట నిమిత్తం కణ్వమహర్షి ఆశ్రమానికి రావడం. అక్కడ శకుంతలని చూడడం, ఆమె జన్మవృత్తాంతం తెలిసికొని గాంధర్వ వివాహం చేసుకొనడం వరకు కథ మామూలే. రాజు రాజ్యానికి వెళ్ళిన దగ్గరనుంచే నాటకం మరింత రక్తికట్టింది.

శకుంతల హృదయం దుష్యంత విరహంతో సర్వశూన్యం అయిపోయింది. ప్రియుని స్మరణలో ఆమెకు ప్రకృతి కూడా స్ఫురించని స్థితి. అటువంటి స్థితిలో వచ్చాడు దుర్వాసమహర్షి. ఆయన రాకే తెలియనంత దీనంగా ఉంది శకుంతల. రాజు, రాజు... తప్ప లోకం కనిపించని స్థితి. అందుకే లేవలేదు. నమస్కరించలేదు. కనీసం రాకను కూడా గుర్తించలేదు. ఇంకేముంది మహర్షి క్రుద్ధుడయ్యాడు. ఎవరిని స్మరిస్తూ నన్నే అవమానించావో ఆతడు నిన్ను మరచుగాక! అంటూ శపించి బయలుదేరాడు. ఈ శాపమూ తెలియదు శకుంతలకి. కాని, ఆమె ప్రియసఖులు అనసూయ, ప్రియంవద విన్నారీ శాపాన్ని. పరుగు పరుగున వెళ్ళి ముని పాదాలపై పడ్డారు. స్వామీ! మా ప్రియసఖి అమాయకురాలు. మీ శాపం తగలనీయకండి స్వామీ! ఆమె అపరాధం క్షమించండి. విముక్తికి మార్గం చెప్పండి అంటూ కన్నీరు మున్నీరుగా విలపించారు. ఋషి కొంచెం శాంతించాడు. 'రాజు ఇచ్చిన గుర్తు... అభిజ్ఞానం ఏదైనా ఉంటే చూపిస్తే, చూసిన వెంటనే ఈమెను గుర్తిస్తాడు' అంటూ శాపవిమోచన మార్గం చెప్పి వెళ్ళిపోయాడు. అదీ తెలియదు శకుంతలకి. ఆమె వేలికి రాజు ఇచ్చిన ఉంగరం ఉంది కదా! అని ధైర్యం తెచ్చుకున్నారు ప్రియసఖులు.

గర్భవతి అయిన శకుంతలని రాజు దగ్గరకి పంపే ప్రయత్నం చేశాడు కణ్వమహర్షి. తోడుగా గౌతమి వృద్ధ సన్యాసినిని తోడిచ్చి శార్ఙ్గరవ–శారద్వతులతో రాజ్యానికి పంపించాడు. వెళ్ళే సమయంలో ఆ తండ్రి చేసిన ఉపదేశం స్త్రీజాతికే కాళిదాసు అందించిన గొప్ప ఉపదేశంగా సాహిత్యంలో నిలిచిపోయింది.

రాజ్యం చేరారు శకుంతల.. పరివారం. ఏ క్షణంలో దుర్వాసుడు శపించాడో ఆ క్షణంలోనే జరిగిన కథ అంతా మరిచిపోయాడు దుష్యంతుడు. శాపం వలన మరపు. కాబట్టి రాజు ధర్మరాజే అయ్యాడు. గర్భవతి అయిన శకుంతలని దర్శించి ఆమె సౌందర్యానికి ఆశ్చర్యపడినా... ధర్మమూర్తి అయిన

అతని మనసు చలించలేదు. అందుకే ఎన్నో ధర్మసూక్తులు వల్లించాడు. స్త్రీలు ఐశ్వర్యకాములై ఎలా అబద్ధాలాడతారో చాలా అందంగా పలికాడు. తన కన్నుల ముందు నిలువవద్దన్నాడు. ఆమెను చూడడానికి కూడా ఇష్టపడని ధర్మమూర్తిగా పౌరవ కులాలంకారునిగా చరిత్రలో నిలిచిపోయాడు. ఇదీ.. ఇదీ.. మహాకవి కాళిదాసు ప్రయత్నఫలం.

కాళిదాసు శకుంతల ముగ్ధ. పాపం ధైర్యంగా నిలువలేదు. మాట్లాడలేదు. గర్భవతి. నా అనుకున్నవారు నాలుగు మాటలనేసి విడిచి వెళ్ళిపోయారు. ఏం చేయాలో తెలియదు. పురోహితుడు తన ఇంట్లో ఆశ్రయమిచ్చి బిడ్డడు పుట్టిన తరువాత లక్షణాన్ని బట్టి చూద్దాం అనే చిన్న ఆశ కల్పిస్తే కొంచెం ఊరట కలిగిందామెకి. అంతలో తల్లి మేనక కాంతిరూపంలో వచ్చి మరీచమహర్షి ఆశ్రమానికి తీసుకొని పోయింది. అదొక అద్భుతం.

శకుంతల ఆశ్రమాన్నించి వచ్చేటప్పుడు నదీ జలాలలో ప్రయాణం చేస్తూ నదీమాతకి నమస్కరించింది. ఆ సమయంలో ఆమె చేతికి ఉన్న రాజముద్రిక కాస్తా జారిపోయింది. దాన్ని ఒక చేప మ్రింగింది. ఆ చేపని కోసేటప్పుడు ముద్రిక బైటపడితే రాజుకి చూపించడానికి తెచ్చారు కొందరు అధికారులు. ఆ ఉంగరాన్ని చూసీ చూడడంతోటే శకుంతలతో తన సంబంధ వృత్తాంతం అంతా గుర్తుకు వచ్చింది రాజుకి. అప్పుడు దుష్యంతుడెంత పశ్చాత్తాపపడినా ఏం లాభం? తాను చేయని తప్పుకి శిక్షను అనుభవించిన మహనీయునిగా దుష్యంతుని లోకానికి దర్శింపచేశాడు మహాకవి కాళిదాసు.

తరువాత శకుంతలను కలుసుకొనడం, పుత్రుని ఆదరించడం అద్భుతంగా నడిచింది ఆ కథ. అభిజ్ఞానం ఒక గుర్తు. ఉంగరం మూలంగా నడిచిన ఈ కథ అభిజ్ఞాన శాకుంతలంగా ప్రసిద్ధి చెందింది. మూలకథ కంటే ఇదే ఎక్కువ ప్రచారంలో నిలిచింది అని చెప్పడం సత్యదూరం కాదు.

వ్యాసభారతం జరిగిన కథని మనకందించే మహా పురాణం. అందులో శకుంతలాదుష్యంతుల చరిత్ర మరువలేని ప్రేమకథ. అందులోనూ శకుంతల పాత్ర లోకానికి అందించిన సందేశం మహత్తరం.

మనుష్యులకే కష్టాలు వస్తాయి. అవి తనకి రావడంలో ఆ మనిషి ప్రమేయం ఏమీ ఉండదు. ఆ కష్టం వెనుకే ఒక సుఖం నీడలా దాగి ఉంటుంది. తల్లీ-తండ్రీ కూడా విడిచి పెట్టిన శకుంతలకి పక్షులు ప్రేమామృతాన్ని పంచి పెంచడం ఆమె శకుంతల అని పేరు తెచ్చుకొనడానికి కారణం. మహర్షి కణ్వుడు ఆమెను పెంచిపెద్దచేసి ధర్మ ప్రబోధం చెయ్యడం, ఆదర్శస్త్రీమూర్తిగా మలిచి లోకానికి అందించడం భగవంతుని కష్టసుఖాల క్రీడగా తీసుకోవచ్చు. మహారాజే అయినా మంచి చెప్పడానికి భయపడనవసరం లేదు అనే భారత శకుంతల చేసిన ఉపదేశం లోకానికి అందించిన ధర్మోపదేశం.

స్త్రీ అంటే కష్టాలు రాగానే విలవిల లాడిపోయి, బోరున ఏడ్చేసి, ప్రాణాలు తీసుకొనే బలహీనురాలుకాదని, కష్టం వచ్చినపుడు ప్రబ్బలిలా తలవంచి ఎదుర్కొని తరువాత పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కొన కలిగిన సహనమూర్తి. సాహసమూర్తి అని భారత శకుంతల మనకి చాలా గొప్ప సందేశాన్ని అందించింది.

**కావ్యం యశసే అర్థకృతే వ్యవహార విదే శివేతరక్షతయే**

అనే మాటలకి అర్థం మన భారతీయ సాహిత్యంలో అడుగడుగునా దాగి ఉంది.

అందుకే కీర్తి కావాలన్నా, సంపాదన కావాలన్నా, ప్రయోజనాన్ని అపేక్షించినా, లోకజ్ఞానం కలగాలన్నా, శుభ పరంపరలు చోటు చేసుకోవాలన్నా మహాభారతం-అహోభారతం అనుకుంటూ చదవాలి... ఆస్వాదించాలి.. ఆనందించాలి... తరించాలి....

జై శ్రీమన్నారాయణ!



# పోతన భాగవతం - మధురభక్తి

శ్రీమతి డా॥ పి. జ్యోతి- వరంగల్

నమ్మాళ్వార్లు పక్షులనే దూతలుగ పరమాత్మకి సందేశం పంపారు. తమ కంటికి కనిపించని పక్షులతో 'ఓ సారస పక్షీ! నా దుఃఖాన్ని చూసి సహింపలేని నీవు దూతగా నా స్వామి దగ్గరకు వెళ్ళి నా బాధను చెప్పు! ఒకవేళ నా స్వామి నిన్ను అవమానిస్తే నా కోసం ఇంతమాత్రం సహించలేవా? అని వేడుకున్నారు. కోకిలలతో 'నాపై మీకు ఎంతో దయ ఉంది కదా! స్వామితో నా దుఃఖాన్ని తెలిపితే మీకు నష్టమేమీ లేదు కదా! కనుక నేను పూర్వం చేసిన పాపాలకు ఇట్లా పోవలసిందేనా! అని నా స్వామిని అడగండి. ఇంకా హంసలతో 'మీ భాగ్యవిశేషం వల్ల ఆడపక్షులతో కూడుకొన్న హంసలారా! నేనెప్పుడు స్వామిని చేరుతానో అడిగి నేను మోహంతో ఉన్నట్లు చెప్పండి' అని క్రౌంచపక్షులతో, నీరుకోడితో, తుమ్మెదతో, చిలుకతో, చల్లని గాలితో భగవంతునికి తన బాధను తెలిపి దూతకృత్యం నెరపుమని ప్రార్థించారు. జీవేశ్వర సంయోగంలో కాని ప్రియాపరిష్వంగంలోకాని బాహ్యాంతర జ్ఞానం ఉండ దంటారు. ఇటువంటి అవస్థను అనుభవించిన గోపికల స్థితిని ఆళ్వారులు కూడా పొంది తమ ప్రబంధాలలో వ్యక్తం చేసినారు.

భాగవతంలో గోపికాగీతలు, భ్రమర గీతలు మధురభక్తికి సంబంధించినవి. భగవద్విరహాన్ని సహించలేని గోపికల ప్రేమ పరాకాష్ఠ పొంది ఎట్లా ప్రకాశించిందో ఆయా ఘట్టాలలో మనం చూడవచ్చు. గోపికలే కాదు ఋషిపత్నులు సైతం పరతత్త్వంపై అటువంటి ప్రేమనే వ్యక్తంచేసిన తీరు దశమస్కంధంలో వర్ణింప బడింది.

గోపాలకులు కృష్ణునితో కలిసి గోవులను మేపడానికి అడవికి వెళ్ళారు. ప్రొద్దుపోయేంత వరకు ఆటలాడి అలసి పోయారు. వారికి బాగా ఆకలి వేస్తున్నది. కృష్ణుని తమ ఆకలి తీర్చుమని అడిగినారు. ఆ సమీపంలోనే ఋషులు అంగిరసం అనే సత్రయాగం చేస్తున్నారు. వారిని అక్కడికి వెళ్ళి బలరామకృష్ణులు యమునాతీరంలో ఉన్నారని 'మా నామములు చెప్పి మైత్రితో నడిగిన, అన్నంబు పెట్టెదరని' చెప్పి పంపిస్తాడు. కాని ఋషులు గోపాలకుల మాటలు విని అగ్నిష్టోమీయం, సౌత్రామణి యాగాలకు దీక్షపూనిన వారి అన్నం ఇతరుల కీయరాదని నిరాకరిస్తారు. పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోలేక పోయారు. తిరిగి వచ్చిన గోపాలకులతో కృష్ణుడు యజ్ఞశాలకు వెనుకభాగంలో ఋషిపత్నులుంటారు. వారినడిగి రమ్మన్నాడు. సరే అని వారు వెళ్ళి ఋషిపత్నులతో

**"గోవుల మేపుచు నాకొని గోవిందుడన్న మడిగి కొనరండని మ మ్మీవేళం బుత్తెంచెను. ధీ విలసితలారా రండు తెండన్నంబుల్"** అని అడిగినారు.

ఋషిపత్నులు ఎంతో సంతోషంతో **సంభ్రమానందంబులు డెందంబుల సందడింప** నదులు సముద్రం వైపు ప్రవహిస్తు న్నట్లుగా నివేదనకు సిద్ధంగా ఉన్న భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయాలన్నింటిని పాత్రలతో పట్టుకొని తొందర తొందరగా బయలు దేరినారు.

**బిడ్డలు మగలును భ్రాతలు నడ్డము చని వలదనంగ నటు దలఁడనంగ నటు దలఁడని మా**

**తొడ్డుచు జగదీశ్వరునకు జడ్డన నన్నంబు గొనుచు జనిరా సుదతుల్"**

యజ్ఞంలో వినియోగింపవలసిన పదార్థాలను గోపాలకు లకు పెట్టపోతున్నారని తెలిసి మునులంతా వారిని అడ్డగించ బోయినారు. వారు అడ్డగించినా మునిపత్నులు వారిని త్రోసి ముందుకు వెళ్ళిపోయినారు. కన్నులారా కృష్ణుని సౌందర్యాన్ని చూసినారు. అలౌకిక ఆత్మానుభవాన్ని పొందినారు. కృష్ణుడు మునిపత్నులతో తిరిగి వెనుకకు వెళ్ళుమని, వారి భర్తలతో కలిసి యజ్ఞం పూర్తి చేయవలసిందిగా చెపుతాడు. అందుకు వారు నిరాకరించారు. పైగా కృష్ణుడే తమకు ప్రాప్యమని ఇక్కడ నుండి మేము వెళ్ళమని పలుకుతారు. వారికి కృష్ణుడు...

**'నా సమీపమున నున్నారంచు నలుగురు, బంధులు భ్రాతలు పతులు సుతులు మిమ్ము దేవతలైన మెత్తురు"** అని అభయమిచ్చి...

**'నా కీర్తనమున దర్శనాకర్ణన ధ్యానంబులను కర్మబంధ**

**దేహంబుల బాసి మీరు మానసంబులు నాయందు మరగజేసి, నన్నుఁజేరెదరట మీద నమ్ము'**డని పలికినాడు.

యజ్ఞస్వరూపుడు, యజ్ఞభోక్త, యజ్ఞఫలప్రదుడు, శ్రీకృష్ణుడే అని కేవలం కర్మ నిష్ఠులైన మునులు గుర్తింపలేకపోయినారు. అందుకే...

**కట కట మోసపోయితిమి కాంతల పాటియు బుద్ధిలేదు నేఁ**
**డిట హరిఁగాన బోనెఱుగ మేము దుర్మాత్ముల మేము కల్మషో**
**ద్భటులము విష్ణుదూరగుల ప్రాజ్ఞతలేల తపంబులేల ప**
**ర్యటనులేల శీలములు యాగములున్ మఱియేల కాల్పనే ॥**

అని చివరకు సత్యాన్ని గ్రహించినారు. అంతకుముందు మునిపత్నులంతా పరుగుపరుగున శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్ళేటప్పుడు ఒక ముని తన భార్యను నిరోధించినాడు. శ్రీకృష్ణుని అమితంగా ప్రేమించిన ఆమె శ్రీకృష్ణుని చేరలేకపోతున్నాననే మహాదుఃఖాన్ని అనుభవించి ప్రాణాలనే కోల్పోయింది. ప్రేమ పూర్ణమైన ఆమె భావన ఆమెను తరింపచేసింది.

సత్త్వగుణం ఆవిర్భవించిన వారికి భగవంతుడు స్వయంగా తానే ఆనందాన్ని ప్రసాదిస్తాడంటారు. రస స్వరూపుడైన భగవంతుడు ఇచ్చే ఆనందమే రసం. అదే రాసలీల. యమునాతీరంలో వెన్నెల రాత్రులలో గోపికలు శ్రీకృష్ణునితో రాసక్రీడలాడినారు. ఇది బాహ్యంగా చూస్తే గోపికల కామ ప్రవృత్తికి సంబంధించినదిగా కనిపిస్తుంది. కాని, ఆంతరంగా జీవ పరమాత్మల సమాగమంలో ఆనందాన్ని తెలుపుతుంది. మధురభక్తి భావాలను నిరూపించింది. ఉపనిషదర్థాలకే ఈ ఘట్టం ఉదాహరణంగా నిలిచింది. ఒక శరద్రాతి వేణుగానం విన్న గోపికలు శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్ళిన తీరును పోతన అద్భుతంగా వర్ణించినాడు.

*యమునా తటవనంబున జగన్మోహనంబుగా నొక్క గీతంబుఁబాడిన విని పరాయత్తచిత్తలై తత్తఱంబున వ్రేత లేపనులకుం జేతులాడకయు గోవులకుం గ్రేపుల విడువకయు విడిచి విడిచియు నీడకయు నీడి యీడియు నీడిన పాలు గాఁ పకయుం గాచి కాఁచియుఁగాఁగిన పాలు దింపకయు దించి దించియు దించిన పాలు బాలురకుం బోయకయుఁ బోసి పోసియుఁ పతులకుఁపరిచర్యలు సేయకయుఁజేసి చేసియు నశనంబులు గుడవకయుఁ గుడిచి కుడిచియుఁ గుసుమంబులు ముడువకయు ముడిచి ముడిచియుఁ దొడవులు దొడుగకయుఁ దొడిగి తొడిగియు గోష్ఠంబు పట్టుల నుండకయుఁ బాయసంబు నెఱయ వండకయు నయ్యెయెడల నిలువంబడకయుఁ గాటుకలు నూటినిడకయుఁ, గురులు సక్కనొత్తకయుఁ గుచంబుల గంధంబులు గలయ మెత్తకయుఁ బయ్యెదలు విప్పి కప్పకయు సఖులకుం జెప్పకయు సహోదరులు మగలు మామలు మఱందులు బిడ్డలునడ్డంబు చని నివారింపంద లారింపకయు సంచలించి పంచభల్లులని భల్లంబుల మెల్లపు జల్లుల పెలునం దల్లడిల్లి డిల్లపడి మొగిళ్ళ గమి వెలువడి యల్లసించు తటిల్లతల పొందున"* గోప స్త్రీలు ఎవరు అడ్డగించినా నిలువక, వెనుకకు మరలక కృష్ణుని చేరబోయి నారు. గోపికల అలౌకిక ప్రవృత్తిని, వారి పరిణత చిత్తవృత్తిని పోతన సహజంగా వ్యక్తం చేసినాడు.

గోపికలు భగవత్ప్రేమలో పరాకాష్ఠ స్థితి ననుభవించిన వారు. కనుక వారికి వేణునాదం ప్రణవార్థంలాగా గోచరించింది. అందుకే అంతవరకు చేస్తున్న పనులను ఆపి కృష్ణాభిముఖులై సాగినారు. స్వస్వరూపాన్ని, పరమాత్మ స్వరూపాన్ని తెలుసు కున్నారు. కనుకనే, కృష్ణుని వియోగాన్ని క్షణకాలం కూడా సహింప లేకపోయినారు. అయితే భాగవతం వింటున్న పరీక్షిత్తుకు సందేహం కలిగింది. గోపికలు జ్ఞానం లేనివారు కదా! కేవలం శ్రీకృష్ణరూప లావణ్యాలకే భ్రమించిన వారు కదా! పరపురుషుని జారిణులు చేరినట్లు చేరినారు. వారికి పరమాత్మ ప్రాప్తి ఏ విధంగా కలిగిందని శుకయోగీంద్రుని ఈ విధంగా అడిగినాడు.

*(సశేషం)*




# శ్రీరామాయణంలో పక్షులు



## సంపాతి

గతసంచిక తరువాయి

ఇంతవరకు మనం శ్రీరామాయణంలోని సంపాతి ప్రస్తావన చేసుకున్నాము. ఇదొక అద్భుతమైన సందేశాన్ని మనకి ఇస్తోంది. సంపాతి, నిరాశా, నిస్పృహలకు లోనై జీవితాశ వదలుకున్న వానరులను కార్యోన్ముఖులను చేసింది. లక్ష్యాన్ని సాధింపచేసింది కూడా. పక్షి సదృశులైన ఆచార్యులు చేసే మహోపకారమిది. కింకర్తవ్యతా విమూఢుడైన జీవునికి దిశానిర్దేశం చేయడం ఆచార్యకృత్యం. పనిచేయవలసినది జీవుడే. ఆచార్యుడు మార్గాన్ని తెలుపుతాడే తప్ప చేయిపట్టుకొని చేయించడు. కర్తవ్యాన్ని ఉద్బోధిస్తాడే తప్ప ఆచార్యుడు, పశువులను తోలే పశుకాపరిలా, దండించో, బ్రతిమాలో మనని నియంత్రించాలనుకోడు.

ఆచార్యులు శిష్యులకు నాలుగు రకాల వల్ల ఉపదేష్టలుగ ఉంటారని గతంలో మనం తెలుసుకున్నాము.

అవి :

1. పరంపరగ పెద్దలిచ్చిన జ్ఞానసంపదను తన తరువాతి తరానికి అందివ్వడం తన బాధ్యత కనుక విధివశులై ఇసారు.
2. శిష్యుడు అనువర్తించి ప్రార్థిస్తే, ప్రార్థనాపరవశులై ఇస్తారు.
3. శిష్యునికి అనువర్తించడం, ప్రార్థించడం చేతకాక, దీనుడై, ఖిన్నుడై బాధపడుతూంటే, చూడలేక దయాపరవశులై కూడా ఇసారు.
4. ఉత్తమకోటికి చెందిన ఆచార్యులు – విధి కానీ, ప్రార్థన కానీ, ఎదుటివాని చేతకానితనం కానీ పట్టించు కోకుండా కేవల కృపామాత్రము చేతనే ప్రసన్నులై ఉపదేశం చేయకుండా ఉండలేక అనుగ్రహిస్తూ ఉంటారు.

వానరులకు ఉపకారం చేయడంలో, సంపాతి, ఈ నాలుగు లక్షణాలలో మొదటికోటికి చెందుతుంది.

నరజన్మ ప్రాణికోటిలో ఉత్తమమైనది. ఎందుకంటే, తత్త్వజిజ్ఞాస కలగడానికి మనిషికే యోగ్యత ఉంది. ఆత్మ, పరమాత్మల నన్వేషించే యోగ్యతా మనిషికే ఉంది. ఆత్మప్రాప్తికీ, పరమాత్మ ప్రాప్తికీ మనిషిమాత్రమే కృషి చేయగలడు. సాధించే అర్హత కూడా ఉంది. మానవజన్మను సవ్యంగవాడుకుంటే లక్ష్యం చేరతాడు. లేకపోతే నరుడుగ వీనిని పిలువదగునా, తగదా అని శంకించవలసి వస్తుంది. అప్పుడు 'వా'నరుడౌతాడు.

తడిరెక్కల పక్షులను చూసిన వానరులు అందాల గుహలో చిక్కుకుపోయినట్టు, ఈ సంసారమనే మరుభూమిలో ఆత్మాన్వేషణ సాగించే జిజ్ఞాసువులు కూడా ప్రాకృతిక ఆకర్షణలలో దారిమళ్ళి చిక్కులలో పడుతూంటారు.

సుగ్రీవుడు వానరులకిచ్చిన గడువును వారు దాటి పోయినట్టే భగవంతుడిచ్చిన సమయాన్ని కోలుపోతూంటారు. సంపాతి వారికి సీతాసమాచారాన్నిచ్చి ప్రాణాలను నిలిపింది. ప్రయత్నశీలురుగ తయారుచేసింది. అలానే సదాచార్యులు తత్త్వస్వరూపాన్ని సాక్షాత్కరించుకొన్న వారై ఆశ్రితులకు మార్గనిర్దేశం చేస్తారు. గుర్వాజ్ఞను ఇలా నెరవేర్చి తన బాధ్యతను తీర్చుకున్న తర్వాత సంపాతికి రెక్కలొచ్చాయి. ఇది నిశాకర మహర్షి ఏర్పరచిన విధి. సంపాతి దానికి కట్టుబడి ఉంది. సమాచారం చెప్పగానే రెక్కలొచ్చాయి. ఎగిరిపోయింది కద! అలానే గురువు తననాశ్రయించిన శిష్యులకు పెద్దల ద్వారా తనకందిన సదుపదేశాలను విధిబద్ధులై మరొకరికి ఉపదేశించి కృతకృత్యులౌతారు. వారాదేశించిన మార్గంలో శిష్యులు సాగి తరిస్తారు. వారు ఇతరులను తరింపచేయటానికి సాగి పోతూంటారు. ఈ విధానాన్నే ఛాందోగ్యోపనిషత్ ఆరవ ప్రపాఠకం ఓ చక్కని కథ ద్వారా మనకి స్పష్టపరుస్తోంది.

గాంధారదేశపు రాజుకు లేకలేక ఒక కుమారుడు కలిగాడు. అల్లారుముద్దుగ అపరంజిబొమ్మలా ఆతణ్ణి పెంచుకుంటున్నారు రాజదంపతులు. నాలుగేళ్ళ వయస్సు వచ్చింది. జన్మదినోత్స వాలు జరుపుతున్నారు. ఒళ్ళంతా బంగారంతో శింగారించారు. పిల్లవాణ్ణి ఆతని గమనాన్ని ఎవ్వరూ అడ్డరాదని ఆజ్ఞ.

ఆనాడు విచ్చేసే విలక్షణులైన అతిథుల పలకరింపులలో రాజదంపతులు ఉక్కిరిబిక్కిరౌతున్నారు. ఇంతలో బాలుడు భవనపు వెనుకభాగానికి చేరాడు ఆడుకొంటూ. అక్కడున్న ఒక

దుర్బుద్ధి, ఈ పిల్లవాణ్ణి మభ్యపెట్టి, వెనకద్వారం గుండా కోట దాటించి ఆ పిల్లవాని ఒంటిపైనున్న ఆభరణాలన్ని ఒలిచేసు కున్నాడు. నోరెత్తి అవరబోతూంటే నోటినిండా బట్టలు కుక్కాడు. కళ్ళకి గంతలు కట్టాడు. పిల్లవాణ్ణెత్తుకొని అడవులబడిపోయి ఓ నిర్జనారణ్యంలో వదిలేశాడు.

ఎంతకాలం గడిచిందో... అదృష్టం పండింది. అదే దారిలో ఓ బోయదంపతులు పయనిస్తున్నారు. సంతాన రహితులు వారు. ఎందరినో మ్రొక్కారు. ఇంతవరకూ ప్రయోజనం కలుగలేదు. నిరాశతో బీటలువారిన వారి హృదయాలను, బద్ధుడైన అనాథ బాలుడు కన్పడటం ఓ దిక్కువాన కురిసినట్టైంది. కట్లు విప్పి, నోట బట్టలు తీసి, సేదదీర్చి ఆ బాలుణ్ణి పెంచసాగారు. దేవుడిచ్చిన అదృష్టానికి పొంగి పోయారు.

సంతానాన్ని కోల్పోయిన రాజదంపతులు ఓ జ్ఞానియైన వైదికోత్తముణ్ణి ప్రార్థించి బాలుణ్ణి వెతికి పెట్టమన్నారు. ఆతడు గ్రామాలూ, నగరాలు తిరిగి వెతికాడు. చివరికీ కారడవిలో ప్రవేశించాడు. బోయదంపతులను అనువర్తించిపోయే బాలుణ్ణి చూశాడు. ఆశ్చర్యం వేసింది. తాను, పుట్టిన రాచబిడ్డడిని చూసినపుడు కన్పడిన చిహ్నాలే సరిగ్గా ఈ బాలుడిలోనూ కన్పించాయి. ఆ పిల్లవాణ్ణి పట్టుకున్నాడు. తల్లిదండ్రులను ఒప్పించాడు. పిల్లవాడికి ఆతని దేశం, ఆస్తిపాస్తులు, పరివారానికి సంబంధించిన వివరాలెన్నో చెప్పాడు. అసలైన తల్లిదండ్రులైన రాజదంపతుల గురించి వివరించాడు. వారి దగ్గరకు వెళ్ళడానికి పిల్లవాణ్ణి అంగీకరింప చేశాడు. ఎలా వెళ్ళాలో దారి చెప్పాడు. ఆ పిల్లవాడు ధైర్యం పూని అందరినీ అడుగుతూ క్రమంగ గాంధారదేశం చేరాడు. ఈతని గురించి ఆ జ్ఞాని, రాజ పరివారానికి ముందే చెప్పిపెట్టాడు. వారి ఆనందానికి హద్దుల్లేవు. పిల్లవాణ్ణి ఎదుర్కొని తీసుకువెళ్ళి, మంగళ స్నానాదులు చేయించి నూతన వస్త్రాలిచ్చారు. అద్భుతమైన ఆభరణాలు పెట్టారు. తిరిగి యువరాజుని చేసి పొంగిపోయారు. ఇదీ ఛాందోగ్యోపనిషత్ చెప్పిన జీవునికథ. మార్గం తెలిపిన జ్ఞానిలా సంపాతిగూడ అలాంటి స్థితిలో ఉన్న వానరులకు సీతాన్వేషణ మార్గాన్ని తెలిపి తనదారిన తాను వెళ్ళింది.

ఆచార్యులు లేని జీవితం చుక్కాని లేని నావలాంటిది. ఈ సంసారమనే సాగరాన్ని ఈదటానికి శరీరమనే పడవకి ఆచార్యులు గమ్యాన్ని చేర్చే చుక్కానిలాంటివారు. మనిషిలో ఏదో ఒక సమయంలో నిరాశ ఆవరించి నిష్క్రియునిగా చేస్తుంది. ఈ జీవితం మీద విరక్తి కలిగేలా చేసి భగవంతుడిచ్చిన దివ్యమైన మానవజీవితాన్ని వ్యర్థపరచుకునేట్లు చేస్తుంది. ఆ నిరాశ, నిస్పృహలను దూరం చేసి జీవితంమీద ఆశను మేల్కొలిపి కర్తవ్యనిష్ఠుడిగా తీర్చిదిద్దేదీ ఈ పక్షి సందేశం".

నిజానికి ఆశ్రితులను కర్తవ్యనిష్ఠులుగా తీర్చిదిద్దని జ్ఞానం జ్ఞానమే కాదు. సదాచార్యులలోని జ్ఞానం శిష్యులను కర్తవ్యోన్ముఖులను చేస్తున్న కొద్దీ నవనవోన్మేషణమై క్రొత్తదనాన్ని సంతరించుకుంటూ ఉంటుంది. సంపాతికీ రెక్కలున్నాయి. కానీ, అవి చిన్నవి. ఎగరడానికి చేతకానివీను. వానరులకి అవసరమైన సందేశాన్ని ఇచ్చిన తరువాత మాత్రమే అది ఎగరగలిగింది.

ఆచార్యులు మార్గాన్ని నిర్దేశిస్తారు నడవవలసినది మనమే. గొర్రెలకాపరి కర్రపట్టుకొని గొర్రెలను నడిపించినట్లు చివరి వరకూ వెనకాల ఉండి నడపరు. మార్గాన్ని నిర్దేశిస్తారు. కర్తవ్యాన్ని బోధిస్తారు. సంపాతి అదే చేసింది.

ఆచార్యులు కూడా దూరదృష్టి కలిగి ఉంటారు. ప్రకృతి బద్ధుడై అహంకారంలో కూరుకుపోయిన జీవుణ్ణి ఉద్ధరించడానికి ఎన్ని రకాల ప్రయత్నాలు చేస్తారో అవి ఎలా ఎలా చేస్తారో ఈ పక్షి సంపాతి చరిత్రలో మనకి గోచరిస్తుంది. ఇలా ఈ సంపాతి చరిత్ర మనకు ఉజ్జీవన మార్గాన్ని చక్కగా బోధించింది.

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...)

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

“అక్కా! శ్రీకృష్ణుడు క్షత్రియుడా? యాదవుడా?” అడిగింది వేద.

“ఇప్పుడు నీకెందుకు ఈ సందేహం వచ్చిందో చెప్పు ముందు” అంది ప్రతిభ.

“అది కాదక్కా! శ్రీకృష్ణుడంటే గొల్లవాడనే కదా బామ్మ చెప్పింది. పైగా పాటలలో కూడా అలాగే ఉంటుంది కదా! మా టీచరేమో ‘శ్రీకృష్ణుడు క్షత్రియపుత్రుడు’అని చెప్పింది.

“రెండూ సరైయైనవే..”

“ఏ ప్రశ్నకైనా జవాబు ఒక్కటే ఉంటుంది. రెండు, మూడు జవాబులు సరి అయినవి ఉండవు కదక్కా...”

“నువ్వు చెప్పేది కూడా కరెక్టే....”

“ఇదిగో ప్రతిభక్కా! తెలియని విషయాలు చక్కగా విడమరచి చెప్తావు కదా! అని నిన్నడిగితే ఇంకా గందరగోళం చేస్తున్నావు. అసలు నీకేమయింది ఇవ్వేళ?”

“అలా ఒంటికాలుమీద లేవకుండా ఇటొచ్చి కుదురుగా కూర్చో! నేను తయారు చేస్తున్న ముత్యాలదండకు ముత్యాలు అందించు. నీకు శ్రీకృష్ణ జన్మవృత్తాంతం చెపుతాను. సరేనా! అప్పుడు నువ్వడిగిన ప్రశ్నలకు నువ్వే జవాబులు చెప్ప గలుగుతావు...”

“అమ్మయ్య... ఇప్పటికి దారికొచ్చావు. సరే... మొదలు పెట్టు. నువ్వు చెప్పినట్టే చేస్తాను...”

“ఈ లోకాన్ని మొట్టమొదట స్వయంభూ మనువు పరిపాలించాడు.”

“ఆయన ఎవరు?”

“విష్ణుమూర్తి కొడుకు. ఆ కాలంలో సూతపుడని ఒక మహానుభావుడుండేవాడు. ఆయనకు చాలాకాలం సంతానం కలగలేదు. మంచిసంతానం కావాలని తనభార్య పృశ్నితో చేరి శ్రీమన్నారాయణుని కోసం తపస్సు చేశాడు. పృశ్నిసుతపుల కఠోరదీక్ష చూసి శ్రీమన్నారాయణమూర్తి కరుణించి వాళ్ళకు ప్రత్యక్షమై “ఏం కోరి ఇంత కఠోర తపస్సు చేస్తున్నార”ని అడిగాడు.

“నీలాంటి పుత్రుడు కావాలి” అని అడిగారు. అయితే సాక్షాత్ శ్రీమన్నారాయణుడు తమ కళ్ళముందుండడంతో ఆనందం పట్టలేక తడబాటుతో అడిగిందే మళ్ళీ మళ్ళీ అంటే మూడుసార్లు అడిగారు. “నాలాంటి వాడు ఇంకొకడు సృష్టిలో లేడు. నేనే మీ కుమారుడుగా పుడతాను'' అన్నాడు. నారాయణమూర్తి.”

“అబ్బ... ఎంత అదృష్టం... ” చిన్నా.

“కాదా మరి. లోకాలనేలే స్వామిని తానే ఈ లోకాలకు తీసుకురావటం అంటే అంతకుమించిన ఆనందం ఉందా!”

“సరే! తరవాత ఏం జరిగిందో చెప్పు.”

“పృశ్నిగర్భాన అవతరించినప్పుడు పృశ్ని గర్భుడుగా పిలవబడ్డాడు శ్రీమన్నారాయణుడు. సూతపుడు, పృశ్ని తరువాత జన్మలో అదితి, కశ్యపులుగా పుట్టారు.”

“అదితి, కశ్యపులు వామనమూర్తి తల్లిదండ్రులు కదా!”

“సరిగ్గా చెప్పావురా నాన్నా...! వామనుడుగా రెండవ అవతారం అన్నమాట. సుతపుడు, పృశ్ని మూడవజన్మలో దేవకీ వసుదేవులుగా పుట్టారు...”

“వాళ్ళు కృష్ణుడి తల్లిదండ్రులుకదా!”

“మరి దేవకీ వసుదేవులు క్షత్రియులు అయితే కృష్ణుడు క్షత్రియుడే కదా! మీ టీచర్ చెప్పింది నిజమే కదా!”

“గొల్లవాడే... అల్లరిపిల్లవాడే.. అని కృష్ణుడి గురించి పాటలు పాడతారు. బామ్మ కూడా రాఘువసింహం అంటే రాముడని, యాదవసింహం అంటే కృష్ణుడని చెప్పలేదూ...”

“నేనింకా పూర్తి చేయలేదు. సాంతం వినరాదూ... కృష్ణుడిని కన్నది దేవకీ వసుదేవులైనా పెంచింది మాత్రం యశోదానందులు.

“ఎందుకని...?”

“ఎందుకంటే ఆ రోజుల్లో కంసుడనే రాక్షసుడు ఉండేవాడు. దేవకి అతనికి చెల్లెలు వరుస. అందుకని దేవకి పెళ్ళికి కంసుడు కూడా వచ్చాడు. పెళ్ళి తరువాత పెళ్ళికూతుర్ని అత్తగారింటికి తీసుకెళతారు కదా!

ఆ సందర్భంలో పుట్టింటి వాళ్ళందరూ దేవకీ వసుదేవ

లకు వీడ్కోలు చెప్తుంటే ఆకాశవాణి "దేవకీదేవి అష్టమ గర్భాన పుట్టిన వాడు కంసుడిని సంహరిస్తాడని" పలికింది.

"కంసుడినే ఎందుకు...?"

"కంసుడే రాక్షసుడు కాబట్టి. మధురాపట్టణ రాజు కంసుడు. అతని రాజ్యంలోని వాళ్ళు రాజు చెప్పినట్టు చేసేవాళ్ళేకాని స్వతహాగా చెడ్డవాళ్ళు కారు..."

"ఓహో...! అలాగా... సరే తరువాత ఏమైందో చెప్పు."

"వెంటనే కంసుడు కత్తిదూసి దేవకీదేవిని చంపబోతాడు. వసుదేవుడు అడ్డుపడి "కొత్తపెళ్లికూతురు, పైగా నీ చెల్లెలు, అబల, .. ఆమెను చంపుతావు? ఆమె చేసిన తప్పేమీ లేదు కదా! ఎప్పుడో పుట్టబోయే బిడ్డ నిన్ను చంపుతాడని భయపడి ఇప్పుడే ఆమెను చంపడం భావ్యం కాదని" చెప్పాడు. వసుదేవుడి మాటలు కొంత పనిచేసినా కంసుడిని భయం వదలలేదు. అందుకని దేవకీవసుదేవులను తన చెరసాలలో బందీలుగా ఉంచాడు.

"పాపం... కదూ అక్కా... " చిన్నా.

"అంతటితో ఆగాడా.. దేవకి కడుపున పుట్టిన ప్రతీబిడ్డను చంపేవాడు. అలా ఏడుగురిని చంపాడు. ఎనిమిదవసారి శ్రీకృష్ణుడు సింహమాసం, రోహిణీ నక్షత్రం, అష్టమితిథినాడు అర్థరాత్రి పుట్టాడు. "దేవకీ పూర్వ సంధ్యాయాం ఆవిర్భూతం మహాత్మనా" శ్రీ విష్ణుపురాణం(5-3-2)లో చెప్పారు.

ఎట్లా ఉన్నాడో తెలుసా? ఆ బిడ్డ. గొప్ప తేజస్సుతో వెలుగుతున్నాడు. శంఖ చక్రాది ఆయుధాలు ధరించి ఉన్నాడు. పీతాంబరధారియై వనమాలాది ఆభరణాలతో అసామాన్యమైన తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. దేవకీవసుదేవుల ఆనందానికి అవధులే లేవు. సర్వవ్యాపకుడు, సర్వరక్షకుడు, సర్వ నియామకుడు, జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులనే ఆరుగుణాలు పరిపూర్ణంగా కలవాడు అయిన పరమాత్మ వాళ్ళ నట్టింట్లో చిన్నబిడ్డగా పుట్టాడంటే ఎంత ఆనందం? ఎంత అదృష్టం? అలాంటి ఆనందం అనుభవించిన దేవకీ వసుదేవు లకు శ్రీమన్నారాయణుడు తాను వాళ్ళకి మూడుసార్లు పుత్రుడై అవతరించిన విషయం గుర్తు చేశాడు.

అంతలో దేవకీ వసుదేవులకు విపరీతమైన భయం పట్టుకుంది. ఎక్కడ కంసుడు వచ్చిపడతాడోనని శ్రీకృష్ణుడిని ఆయుధాలు దాచేయమని ప్రార్థించారు.

**"జాతోసి దేవదేవేశ శంఖ చక్రగదాధర"** అని కీర్తించి **"ఉపసంహార సర్వాత్మా రూపమేతత్ చతుర్భుజమ్"** అని ప్రార్థించారు.

శ్రీకృష్ణుడు తల్లిదండ్రులమాట పాటించి తన దివ్యాయుధాలు, చతుర్భుజాలు, ఆభరణాలు అన్నీ దాచి మామూలు పసిబిడ్డగా మారిపోయాడు. కంసుడికి భయపడి ఆరాత్రికి రాత్రే వసుదేవుడు ఆ బిడ్డను బుట్టలోపెట్టి, ఆ బుట్టతన తలమీద పెట్టుకొని యమునానది దాటి నందగోకులంలో తన మిత్రుడైన నందుడి ఇంట్లో దించి, అక్కడ యశోద కన్నబిడ్డను తీసుకువచ్చి దేవకి పక్కన వదిలాడు.

"కంసుడు ఆ బిడ్డను చంపలేదా?"

"కంసుడు ఏడుగురిని చంపినట్టే ఆ బిడ్డను చంప బోయాడు. కాని ఆ బిడ్డ శక్తిరూపిణి కావటంతో కంసుడికి అందకుండా పైకెగిరి "నిన్ను చంపబోయేవాడు పుట్టే ఉన్నాడులే..." అంది. ఇప్పుడర్థమయిందా! గొల్లపల్లెలో పెరిగాడు కాబట్టి గొల్లవాడన్నమాట శ్రీకృష్ణుడు.

నమ్మాళ్వార్ ఈ విషయాన్నే ఏమన్నారో తెలుసా? తిరువాయ్‌మొళ్ళి(12-3-11)లో "శెమ్ కనివాయ్ ఎజ్గళాయర్ తేవు" అన్నారు. పెరియాళ్వార్ కూడా పెరియాళ్వార్ తిరుమొళ్ళిలో...

**'వాయుళ్ వైయకమ్ కణ్ణ మడనల్లార్ ।**
**ఆయర్ పుత్తిర నల్లక అరుమేదైవమ్ ।**
**పాయశీరుడై పృణ్భుదైప్పాలకన్**
**మాయక ఎన్ను మకిళ్న్దనర్ మాదరే ॥** అన్నారు. (1.1.7)

తిరుక్కోళూరమ్మాళ్ **"దైవత్తై పెత్తేనో దేవకియార్‌పోలే"** అంది. *(సశేషం)*




తొండరడిపొడి ఆళ్వార్ అనుగ్రహించిన

# తిరుప్పళ్ళియెళుచ్చి

శ్రీరంగనాథుని సుప్రభాత గీతిక

కదిరవన్ కుణదిశై చ్చిగరం వన్దణైన్దాన్,
కన ఇరు ళగన్దదు కాలైయం పొళుదాయ్,
మదు విరున్దొళుగిన మామల రెల్లామ్,
వానవ రరశర్‌గళ్ వన్దు వన్దీణ్డి
ఎదిర్ దిశై నిఱైన్దన రివరొడుం పుగున్ద
ఇరుఙ్గళి త్తీట్టముం పిడియొడు మురశుమ్
అదిర్ తలి లలై కడల్ పోన్ఱుళదు ఎంగుం
అరంగత్తమ్మా! పళ్ళి ఎళున్దరుళాయే ॥ 1

| | |
|---|---|
| కదిరవన్ | = సూర్యుడు |
| కుణదిశై | = తూర్పుదిక్కున |
| శిగరమ్ | = ఉదయాద్రి శిఖరమునకు |
| వన్దు | = వచ్చి |
| అణైన్దాన్ | = చేరెను |
| కన | = ఘనమైన (దట్టమైన) |
| ఇరుళ్ | = చీకటి |
| అగన్దదు | = తొలగిపోయినది |
| అం | = సుందరమైన |
| కాలై ప్పొళుదు | = ప్రాతఃకాలము |
| ఆయ్ | = అయినది (తెల్లవారి) |
| మామలర్ | = గొప్ప పుష్పములు |
| ఎల్లాం | = అన్నియు |
| మదు | = మకరందమును |
| విరిన్దు | = విందుగ |
| ఒళుగిన | = స్రవించుచున్నవి |
| వానవర్ | = దేవతలును |
| అరశర్‌గళ్ | = రాజులును |
| వన్దువన్దు | = గబగబావచ్చి |
| ఈణ్డి | = గుంపులుగ చేరి |
| ఎదిర్ తిశై | = నీకు ఎదురుగ |
| నిఱైన్దనర్ | = నిండి ఉన్నారు |
| ఇవరొడుం | = వీరితోపాటు |
| పుగున్దు | = ప్రవేశించిన |
| ఇరుం | = గున్న |
| కళిత్తు | = ఏనుగులయొక్క |
| ఈట్టముం | = గుంపులును |
| పిడియొడు | = ఆడ ఏనుగులతో (ఘీంకరిస్తున్నాయి) |
| మురశుమ్ | = భేరివాద్యములును; |
| అదిర్‌తలిల్ | = ధ్వనిస్తూ |
| ఎంగుం | = అంతటా |
| అలై | = అలలుకల |
| కడల్ పోన్ఱు | = సముద్రమును పోలి |
| ఉళదు | = ఉన్నది (ఘోషిస్తున్నది) |
| అరంగత్తమ్మా! | = శ్రీరంగనాథా! |
| పళ్ళియెళున్దు | = పడకనుండి లేచి; |
| అరుళాయే | = కృపచేయుమా! |

***తా:*** శ్రీరంగనాథా! నిన్ను సేవించాలన్న తహతహతో బాల భాస్కరుడు ఉదయగిరి శిఖరాన చేరినాడు. చిక్కని చీకటంతా క్రమక్రమముగ పారిపోతున్నదదిగో! నీ కిరణస్పర్శ భగవత్పాదస్పర్శ కలిగే మనోజ్ఞ కాలమైందని, తెల్లవారిందని, అర్చనలో భగవంతుని పాదాలను చేరే మంచికాలం ఆసన్నమైందని ఆనందాతిశయాన తామరలన్నీ నవ్వుబోవ వాటినోట తేనెలూరుచున్నవయ్యా!

ఇక దేవతలు, రారాజులంతా ఎవరికివారే మొదట నీ దృష్టిలో పడదలచి గుంపులుగ నీకంటి ఎదుట దక్షిణ దిక్కున నిలిచిరి. లక్ష్మీనాథా! ఆప్రక్క వారివాహనాలు మొదలగు మత్తమాతంగ గజములు తమ తమ భార్యాపరివార సమేతంగ వచ్చి నీ సేవకై చేయు ఆరవారము అటు భేరీనినాదములు, ఇటు దేవతల, రాజుల సందడి ఇవన్నియును

కలిసి పూర్ణిమచంద్రుని చూచిన సముద్రఘోషవలె శ్రీరంగాన నలుదిక్కులందు వ్యాపించుచున్నది. ఈ తరుణాన నీవున్నూ మేల్కొని వీటిన్నిటిని చల్లగ కటాక్షించి మా కైంకర్యమును స్వీకరించవయ్యా! నీ కొరకై విచ్చేసిన బాలభాస్కరునైనా పలుకరించవద్దా! అంటూ ఈ పాశురంలో ఆళ్వార్లు సూర్యుడు తూరుదిక్కున ఉదయించేదీ శ్రీరంగని సేవించాలన్న తపనతోనే అని వర్ణించారు.

**కొళ్లుంగొడి ముల్లైయిన్ కొళ్లుమల రణవి,**
**క్కూర్నదు కుణదిశై మారుద మిదువో,**
**ఎళ్లున్దన మలరణై ప్పళ్ళి కొళ్ళన్నమ్**
**ఈన్పని ననైన్ద తమిరుం శిఱ గుదఱి,**
**విళ్లుంగియ ముతలైయిన్ పిలంపురై పేర్వాయ్,**
**వెళ్ళైయిఱుఱ వదన్ విడత్తిను క్కనుంగి,**
**అళ్లుంగియ వానైయి నరుం తుయర్ కెడుత్త,**
**అరంగత్తమ్మా! పళ్ళి ఎళ్లున్దరుళాయే ॥ 2**

| | | |
|---|---|---|
| **కొళ్లుంగొడి** | = | ఏపుగా పెరిగియున్న (మృదువైన లేత తీగలుకల) |
| **ముల్లైయిన్** | = | మల్లెలయొక్క |
| **కొళ్లు** | = | మత్తెంక్కించు |
| **మలర్** | = | పరిమళమును |
| **అణవి** | = | తనతో చేర్చుకొని |
| **మారుతమ్** | = | గాలి |
| **కుణదిశై** | = | తూర్పుదిక్కు నుండి |
| **(ఇదువో** | = | ఇదిగో) |
| **కూర్న్దదు** | = | వీచుచున్నది |
| **మలర్** | = | పూవులను |
| **అణై** | = | చేర్చుకొని (కౌగలించుకొని) |
| **పళ్ళికొళ్** | = | నిద్రించు |
| **అన్నం** | = | హంసలు |
| **ఈన్** | = | చల్లని |
| **పని** | = | మంచుతో |
| **ననైన్ద** | = | తడిసిన |
| **తమ్** | = | తమయొక్క |
| **ఇరుం** | = | అందమైన |
| **శిఱగు** | = | రెక్కలను |
| **ఉదఱి** | = | విదిలించుకొని |
| **ఎళ్లున్దన** | = | ఇదుగో మేల్కొన్నవి. |
| **ముదలైయిన్** | = | మొసలియొక్క |
| **పిలమ్పురై** | = | బిలమువలె ఉన్న |
| **పేర్వాయ్** | = | పెద్దనోటితో |
| **వెళ్ళై** | = | తెల్లని |
| **ఇరు ఉర** | = | రంపమువంటి పళ్ళుకల |
| **అదన్** | = | ఆ మొసలియొక్క |
| **విడత్తినుక్కు** | = | విషమునకు |
| **అనుంగి** | = | మిక్కిలి నొంగి, కృశించి |
| **అళ్లుంగియ** | = | ఆక్రోశించిన (ఏడ్చిన) |
| **అనైయిన్** | = | (గజేంద్రుని యొక్క) ఏనుగుయొక్క |
| **అరుం తుయర్** | = | గొప్పదుఃఖమును |
| **కెడుత్త** | = | పోగొట్టిన |
| **అరంగత్తమ్మా!** | = | శ్రీరంగనాథా! |
| **పళ్ళియెళ్లున్దు** | = | పడకనుండి లేచి |
| **అరుళాయే** | = | కృపచేయుమా! |

***తా:*** గుబురుగ పెరిగిన తీగమల్లెల మీదుగ తూర్పునుండి వీచు ఈ మలయమారుతములు నిర్మల సుగంధ పరిమళములను గుబాళించుచు నిను లేపవచ్చుచున్నవి. కమలములను కౌగలించుకొని, నిదురించిన రాయంచలు శీతల వాయుస్పర్శచే మేల్కాంచి చల్లగ కురియు మంచున తడిసిన తమ రెక్కలను రెపరెపలాడించుచు ఆ గాలితో నీకు వింజామరలు వీచుచున్నవి. భీకరముగ తెరువబడ్డ మొసలియొక్క అహో! నల్లని బిలమువంటి పెద్దనోటిలోని తెల్లని రంపాలవంటి సూదిపళ్ళు గ్రుచ్చుకొనుటచే ఆ పల్లు విషతీవ్రతను భరించలేక ఘీంకరించిన శ్రీగజేంద్రో ్వానుని ఘోర విపత్తును పోగొట్టి యిచ్చట శ్రీరంగాన శయనించిన రంగనాయకిని కూడిన శ్రీరంగాధిపతీ! ఇంకనూ నిదిరింతువయ్యా? ఆ హంసలు మేల్కొనినచో మా హంసల జంటయైన మీరునూ మేల్కొనవలెనెకదూ! మమ్ము పట్టిన పంచేంద్రియా లనే ఐదు మొసళ్ళనుండి రక్షించవలదా మరి? మేలుకో తండ్రీ! *(సశేషం)*

చిత్రకథ - 9

# రామానుజ చిత్రకథ



కొన్ని నెలల తరువాత

ఆచార్యా! కాంచీపురంలో కేశవాచార్యులు, కాంతిమతుల పుత్రుడు రామానుజుడనే బాలుణ్ణి చూసాం. స్ఫురద్రూపి, సర్వ శాస్త్రార్థ తత్త్వజ్ఞుడు, యాదవప్రకాశులవద్ద శిష్యునిగా ఉన్నాడు. కంచివరదునికి తీర్థకైంకర్యాన్ని చేస్తున్నాడు.

అవునా!

ఆ బాలుణ్ణి వెంటనే చూడాలని నా మనస్సు ఆరాటపడుతోంది. వృద్ధాప్యం అడ్డుతోందే...! స్వామీ రంగనాథా! ఆ బాలుణ్ణి త్వరగా చూసే భాగ్యం కలిగించవయ్యా!

ఇదిలా ఉండగా కాంచీపురంలో

అరే! ఇది కలా? నిజమా? రామానుజుడు బ్రతికే ఉన్నాడే! ఇక్కడికి ఎలా వచ్చాడబ్బా! నా దురాలోచన ఇతనికి తెలియలేదు కదా! ఇతనికి మొహం చూపలేకపోతున్నా!

గురుదేవా!

చిరంజీవ!

నాయనా రామానుజా! ఏమయి పోయావయ్యా? అడవిలో నువ్వు కనిపించక నేనెంత బాధపడ్డానో!


ఈ నవ్వే నన్ను తలవంచుకొనే చేస్తోంది.
గురువుగారు అడవిలో దారి తప్పా! పెద్ద వాన... ఓ బోయదంపతులు... వరదరాజస్వామి వచ్చి నన్ను రక్షించారు.


నీ అదృష్టం. కాదు కాదు నా అదృష్టం. క్షేమంగా నువ్వు ఇంటికి చేరావు. పాతానికి ఎప్పటి నుండి వస్తున్నావు?
గుళ్ళో తీర్థకైంకర్యం చేస్తున్నా స్వామీ!


రామానుజా! స్వామిసేవ మంచిదే! అయినా గ్రంథాన్ని అధ్యయనం చేయొచ్చు. కొత్త కొత్త అర్థాలు మళ్ళీ నువ్వు చెప్పాలి కదా! రా! సరేనా?
ధన్యుణ్ణి స్వామీ! మీ దయ!


దాసోహం స్వామి..
అడియేన్....


ఈ స్వాములెవరు? ఎక్కడనుండి వేంచేస్తున్నారు?
తెలీదూ? శ్రీరంగం నుంచి యామునాచార్యులవారు. మహా గొప్ప పండితులు!
అవునవును. వయస్సు 120 దాకట గద! ఇలాంటి వారిని చూస్తే చాలు పాపాలు పోతాయిట! ఈ వయస్సులో ఎంత శ్రమతో వేంచేశారో?
కంచి వరదుడు వీరిని సేవించాలనుకున్నాడేమో! రప్పించాడు. లేకపోతే ఎక్కడ శ్రీరంగం, ఎక్కడ కాంచీపురం?


"ఓ వైకుంఠ వాసా! కరుణామయా! పీతాంబరధరా! భక్తాభీష్ట ప్రదాయకా! నీకు మంగళం స్వామీ!
ఓం కాంచీపూర్ణా! ఎవరీ శిశువులంతా?


ఆయనే యాదవ ప్రకాశులు. అద్వైత పండితుడు. శాస్త్రంలో దిట్ట.


ఆ శిష్యులమధ్యలో చిరుమందహాసముతో వస్తున్న ఆజానుబాహుడు, విశాలనేత్రుడే రామానుజుడు. దేవరవారికి చెప్పినది ఆ బాలుడి గురించే!


తామరతూడులాంటి చేతులతో, యజ్ఞోపవీతంతో, ఆ ఊర్ధ్వపుండ్రాలతో ఎంత చక్కగా ఉన్నాడూ!


ఓ వరదరాజా! నీ అనుగ్రహలేశంతో మూగ వాడు పలుకుతాడు. కుంటివాడు పరుగెడతాడు. గొడ్రాలు సంతానవతి అవుతుంది. నిన్నే శరణు వేడుతున్నా!


ఈ రామానుజుణ్ణి శ్రీ వైష్ణవ సంప్రదాయ సంరక్షకుడిగా అనుగ్రహించు!


స్వామీ! ఆ బాలుణ్ణి పిలువనా! పలుకరిస్తారా?

# గౌరవ ప్రాప్తి

శ్రీమాన్ సముద్రాల శఠగోపాచార్యస్వామి - వరంగల్‌డ

సమాజంలోని ప్రతి ఒక్కరూ నివాసయోగ్యమైన గృహాన్ని, ధారణకు యోగ్యమైన ఆకర్షణీయమైన వస్త్రాన్ని, రుచికరకమైన, పుష్టికరమైన ఆహారాన్ని సంపాదించుకోవాలని ప్రయత్నిస్తూ ఉంటారు.

మౌలికమైన గృహ, వస్త్ర, ఆహారములతో పాటు జ్ఞాన, బల, ఐశ్వర్య, రూప గుణ సౌందర్యములను కూడా కలిగి యుండాలని భావించే వారెందరో కలరు.

కళాకారులు, గుణవంతులు, బలవంతులు, జ్ఞానాధికులు, ఉన్నతోద్యోగులు, పెద్దలు, పిల్లలు, స్త్రీలు, పురుషులు, చిన్న, పెద్ద, వీరు, వారు అనే భేదం లేకుండా వివేకవంతులైన మానవులు అందరూ ముందుగా కోరుకునేది గౌరవాన్నే.

ఇంటా బయటా గౌరవం కలవారే మనశ్శాంతితో జీవించగలుగుతారు. ఎన్ని ఉన్నా, గౌరవం లేకపోతే ఏదీ లేనట్లే. కొన్ని సందర్భాల్లో ఆర్థికంగా, ఉద్యోగపరంగా, ఆరోగ్యపరంగా ఇబ్బందులను ఎదుర్కొనేవాళ్ళు కూడా తమ ఆత్మగౌరవానికి భంగం కలుగవద్దని కోరుకుంటూ ఉంటారు.

చిరకాలం సమాజంలో గౌరవప్రదమైన స్థానంలో ఉన్నవారు ఏదైనా కారణంచేత ఉద్యోగ, కుటుంబ విషయాల్లో విభేదాలు ఆర్థికస్థితిగతుల్లో హెచ్చు తగ్గులో, లోటుపాట్లో ఏర్పడి అగౌరవానికి గురైతే ప్రాణత్యాగానికి కూడా వెనుకంజ వేయరు.

గౌరవంతో జీవించేవారికి అనూహ్యంగా అపకీర్తి సంభవిస్తే అది వారికి మృత్యుబాధకన్న మిన్నగా దుఃఖాన్ని కలిగిస్తుంది.

**సంభావితస్య చాకీర్తిః మరణాదతిరిచ్యతే।** అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో ఉపదేశించాడు. అపకీర్తివల్ల దుఃఖ పారవశ్యంలో మునిగి క్రుంగిపోయే వ్యక్తికి వేరొక మరణవేదన అవసరం లేదని భర్తృహరి మహాకవి **అపయశో యద్యస్తి కిం మృత్యునా** అని నీతిశతకంలో పేర్కొన్నాడు.

సమాజంలో సముచిత గౌరవాన్ని పొందాలనేవారికి కావలసిన సదుపదేశాన్ని ఒక కవి చిన్నశ్లోకంతోనే వివరించాడు. 'వ' అనే అక్షరంతో ప్రారంభమయ్యే వస్త్రము, వపువు(శరీరము), వాక్కు, విద్య, వినయము అను అయిదు లేకపోతే ఏ వ్యక్తి కూడా తగిన గౌరవాదరాలను పొందలేడు.

**వస్త్రేణ వపుషా వాచా విద్యయా వినయేన వా ।**
**వకారైః పంచభిర్యుక్తో నరో భవతి పూజితః ॥**

అని కవి సూచించాడు.

గౌరవాన్ని కోరుకునేవారు తమ యోగ్యతకు తగినట్లుగా పరిశుభ్రమైన బట్టలను కంటికి ఆకర్షణీయంగా ఉండే వస్త్రాలనే ధరించాలి. శరీర ధారుఢ్యతను కలిగియుండాలి. శారీరక పుష్టిని సమకూర్చుకోవాలి. శరీరాన్ని శుచిగా, సౌందర్యవంతంగా ఉంచుకోవాలి. ఎదుటివారికి ప్రియమైన మాటలనే మాట్లాడాలి. మృదువుగా, మధురంగా, సరళంగా, హితమైన వాక్కులనే పలుకాలి. ఆకర్షణీయమైన వాగ్ధాటిని అలవరచుకోవాలి.

తనకు, తనతోటివారికి, జనబాహుళ్యానికి విశేష ప్రయోజనమును కలిగించే బహుళార్థసాధకమైన విద్యనభ్యసించాలి. ఎదిగేకొద్దీ ఒదిగే మొక్కను ఆదర్శంగా గ్రహించాలి. ప్రతిమనిషి అతిముఖ్యమైన వినయస్వభావాన్ని అలవరచుకోవాలి. 'విద్యా వినయేన శోభతే' అన్నట్లు వినయం వల్లనే విద్య శోభిస్తుంది. ఈ ఐదింటిద్వారా వ్యక్తి పరిపూర్ణతను సంతరించుకుంటాడు. తద్వారా అనన్య సాధ్యమైన, మహోన్నతమైన కీర్తిశిఖరాలను అధిరోహిస్తాడు. విశేష గౌరవాభిమానాలను స్వంతం చేసుకుంటాడు. ఇతరులనుండి గౌరవాన్ని పొందాలనుకునేవారు తాము కూడా ఇతరులను తగినవిధంగా గౌరవించాలి. తాను ఎదుటివారికిచ్చే గౌరవ మర్యాదలపైనే అతని గౌరవమాధారపడి యుంటుందనే సత్యాన్ని గుర్తించాలి.

అందుకే మనపూర్వులు సమాజంలో సమతౌల్యాన్ని పాటించుటకు పెద్దలను గౌరవించమని, చిన్నలను ప్రేమించమని ఉద్బోధించారు. ఈ భావన కార్యరూపం దాలిస్తే సమాజంలో కలతలు, కలహాలు తగ్గుముఖం పడతాయి. గౌరవాదరాలు పెంపొందుతాయి. వ్యక్తుల ఆత్మాభిమానాలు సురక్షితంగా నిలుస్తాయి.

# వేసవి శిబిరం - మనకు వరం

శ్రీమతి పి. జ్యోతి - హన్మకొండ.

ఆర్షవాఙ్మయంలో, భారతీయ జీవన ప్రస్థానంలో శ్రీమద్రామాయణ, భారత, భాగవతాలు ప్రామాణిక పవిత్ర గ్రంథాలు. భారతీయ సనాతన ధర్మానికి మూలస్తంభాలైన సత్యధర్మశాంతి ప్రేమలకు కథారూపక వ్యాఖ్యానాలు. ఈ మూడింటిలో రామాయణం ఒక అనర్ఘమణి.

శ్రీరాముడు భగవదవతారమని తెలియజేసే సన్నివేశాలు శ్రీరామాయణంలో స్వల్పం. శ్రీరాముని సత్యధర్మప్రవర్తనం, ప్రేమకారుణ్యాలు, త్యాగ ఔదార్య గుణాల ద్వారానే భగవంతునిగా గుర్తించగలం. మానవునిగా జీవించి, తన పరత్వాన్ని మరుగుపరచుకొని, తన ప్రవర్తనతో మానవత్వానికే నమూనాగ నిలిచాడు.

మానవుని జీవితంలో అందున సమాజ జీవితంలో రకరకాల సంక్లిష్టతలు, సంక్షోభాలు, ధర్మవ్యతిక్రమాలు సంభవిస్తుండటం ఏ ఒక్క కాలానికో పరిమితం కాదు. ధర్మవ్యవస్థ విశ్లథమైన నాడు లోకాన్ని ధర్మేతర మార్గం నుండి రక్షించి ఉదాత్తమూ లోకహితకరమైన మార్గంలో ప్రవర్తింప చేసేందుకు మహా తపస్సంపన్నులైన, లోకానుగ్రహశీలురైన మహానుభావులు అవతరిస్తుంటారు. వారు భౌతికాధ్యాత్మిక జీవన ప్రవృత్తిని సమార్ద్రపరుస్తూ సమన్వయంతో ఏ విధంగా జీవించాలో తమ ఆచారణ ద్వారా నడవడిక ద్వారా నిరూపిస్తారు. అటువంటి వారే శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారు మొదలైనవారు.

భగవదనుభవనిష్ఠులు, కారుణ్య రసపూర్ణులైన వీరి స్వరూప రూప గుణ విభూతులు అత్యాశ్చర్యకరంగా కనిపిస్తాయి. మానవజాతి అభ్యున్నతికి నిరంతరం శ్రమిస్తూ ధర్మాచరణంలో, సామాజిక సేవలో తమ జీవితాలనే అంకితం చేశారు. పరమోపాదేయమైన శ్రీరామాయణంలో శ్రీరాముడు ఆదర్శపుత్రుడు, సోదరుడు, స్నేహితుడు, పౌరుగా మెలిగిన తీరుగానే వీరు అనితర సాధ్యమైన, మహత్తరమైన కార్యాలెన్నింటినో నిర్వహించి మహోన్నతమైన సనాతన ధర్మానికి, సంప్రదాయానికి ఆధారయష్టిగా నిలిచారు. భగవద్రామానుజులు ప్రకాశింపచేసిన తత్త్వాన్ని లోకానికి అందించి ఒక సంస్థగా, ఒక ఉద్యమంగా, విశ్వమంతా వ్యాపించి భగవంతుని దర్శించుకోవాలనుకునే వారికి భగవతత్త్వంగా, ఆర్తులకు ఆపద్బాంధువులుగా జిజ్ఞాసువులకు బోధకులుగా, ఎందరికో కన్నతల్లిగా ఎవరికి ఏదికావాలో అది అయ్యారు.

భగవంతుడు సంకల్పమాత్రం చేతనే సకల చరాచర సృష్టి చేసినట్లు వీరు తమ సత్యసంకల్పం వల్లనే సామాన్యులు చేయ సంకల్పించనైనా లేని బృహత్తర కార్యక్రమాలెన్నింటినో సునాయాసంగా నిర్వహించారు. వీరి సంకల్పాలు దైవప్రేరితాలు కనుక సామాన్య బుద్ధికి అందవు.

శతయోజన విస్తీర్ణమైన లంకను దాటి కేవలం వానర బలంతోనే రాముడు లంకను జయించటంలో రాముని సంకల్పశక్తి ఎంతటిదో పెద్ద జీయర్ స్వామివారు లోకకళ్యాణం కోసం చేపట్టిన ఎన్నెన్నో కార్యాల నిర్వహణ కూడ అంతటిదే. వీటి ద్వారా వారి సత్యవ్రతం, త్యాగం, మనోబలం స్పష్టమైనాయి. వారు నిర్వహించిన అష్టాక్షరీ హవన క్రతువు, 108 శ్రీరామక్రతువులు, 108శ్రీరామస్థూప నిర్మాణాలు, 108 స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాలు, అఖిల భారత వేద విద్వత్సమ్మేళనాలు, వేద వేదాంగ విద్యాలయ నిర్మాణాలు, అష్టాక్షరీ క్షేత్ర నిర్మాణం, దేవాలయ జీర్ణోద్ధరణలు, మహిళా మండలుల స్థాపన, భక్తినివేదన పత్రిక స్థాపన, నిర్వహణ, ఒకటా? రెండా? ఎన్నో కార్యాలు చేపట్టి అపూర్వంగా నిలిచి లబ్ధప్రతిష్ఠులైనారు. వారు సమాజానికి అందించిన అద్భుత ఫలాలను స్మరించుకోవటమనేది లోకానికి మృతసంజీవనం వంటిది. సీతమ్మ హనుమంతుని ద్వారా రామవృత్తాంతాన్ని విని జీవించి ఉన్నట్టే పెద్ద జీయర్‌స్వామివారు ఆచరించి చూపిన వారి వ్యక్తిత్వం, ఆచరణలు లోకాన్ని జీవింపచేస్తాయి.

వారి మార్గంలోనే పయనిస్తున్నవారు మన శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్‌స్వామివారు. భూతదయ, శాంతి, క్షమ, సత్యం, శౌచం, అకామత, వైరాగ్యం, జ్ఞానం, ప్రేమానురాగాలు నిండిన పరిపుష్టమైన ప్రవృత్తితో చిన్న

జీయర్ స్వామివారు లోకాన్ని అమానవీయ ధోరణుల నుండి ఉద్ధరించి, భౌతిక ఆధ్యాత్మిక తత్త్వాల ఉభయ భూమికల సమ్యక్ సమన్వయంతో, భారతీయ జీవన విధానాన్ని తీర్చిదిద్దుతున్నారు. ఆశ్రమ స్వీకారం నాటి నుండి నేటి వరకు విశ్వవ్యాప్తంగా వారు నిర్వహించిన నిర్వహిస్తున్న కార్యాల గురించి వివరించటమంటే కాగడా ముందు చిరుదీప సామ్యమే అవుతుంది.

శ్రీరామచరితను వ్రాయటానికి తులసీదాసు అలసిపోలేదు కాని, వారి ప్రతిభావ్యుత్పత్తులను చూసి కవిత్వమే సొమ్మసిల్లిందని పెద్దలు వర్ణించినట్లుగా, మానవజాతి శ్రేయస్సుకు అహర్నిశలు శ్రమిస్తున్న మన చిన్న జీయర్ స్వామివారి అమోఘమైన సంకల్పబలాన్ని ఏమని వర్ణించగలం?

శ్రీరాముడు "ఆత్మానం మానుషం మన్యే" అని భావిస్తూ, ఇతరుల వల్లనే సమస్త కార్యాలు సాధింపబడినాయి అనుకున్నట్లుగానే శ్రీస్వామివారు తమ తమ సంస్థల ద్వారా ఎన్నో కార్యాలను నిర్వహిస్తున్నా, తాము నిమిత్తమాత్రులం అనుకుంటారు. అది ఆయా సంస్థల కార్యనిర్వాహకుల దక్షత, సామర్థ్యమా అన్నట్లు లోకానికి కనిపింపచేస్తారు. అది కేవలం శ్రీస్వామివారి అంతఃకరణశక్తి, సంకల్పబలమేనని విజ్ఞులు గ్రహిస్తారు. ఎటువంటి కార్యసిద్ధికైనా ఏ పరికరం అక్కరలేదు వారికి. దయకారణంగా కొందరిని పరికరాలుగా భావిస్తారు. మహాపురుషుల సంకల్పాత్మకమైన ధార్మిక శక్తి దైవీరూపంగా అవతరిస్తుంది. కనుక వారి సంకల్పమే భగవత్సంకల్పం. అది మనం గుర్తించగలగాలి. ఎవరికో ఏవో యోగ్యతలుండో, మన సాధనబలం వల్లనో, పరికరాల శక్తి వల్లనో ఆ కార్యాలు నెరవేరినాయనుకోవటం అజ్ఞానం. అయితే మనం చేయవలసింది ఏమిటంటే ఆచార్యులు సంకల్పించిన కార్యసిద్ధికి మనం హేతువులం కాకపోయినా, లోకకళ్యాణం కోసం మనల్ని ఒక యోగ్యమైన ఉపకరణంగా తీర్చిదిద్దుకొమ్మని, ఆచార్యుల పాదాలను ఆశ్రయించి వేడుకోవటమే. అదే భగవత్ప్రీతికరం కూడ. వేసవిలో జరుగబోయే కార్యకర్తల శిక్షణ శిబిరంలో కార్యకర్తలు గుర్తించవలసిన సత్యమిదే!



## బదరీనాథ్ జ్యోతిర్దర్శనం

### శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో...

ఈ సంవత్సరం ఏప్రిల్ 29వ తేదీన జ్యోతి దర్శనంతో బదరీనారాయణుడు భక్తులకు దర్శన భాగ్యం అనుగ్రహించనున్నాడు. బదరీనాథ్‌లో మన అష్టాక్షరీక్షేత్రం ది. 26.04.2012 నుండి భగవద్బంధువులను సాదరంగా ఆహ్వానిస్తున్నది.

తదీయారాధన కొరకు కైంకర్యములు సమర్పించ దలచినవారు ది. 12.04.2012 లోపుగా వారి వారి ద్రవ్యములను సీతానగరము లేక శ్రీరామనగర్ (ముచ్చింతల్, శంషాబాద్) చేరునట్లు పంపించగలరు.

### హృషీకేశ్ రామమందిర్ ప్రథమ బ్రహ్మోత్సవములు

జీయర్ మఠ్, హృషీకేశ్‌లోని శ్రీసీతారామలక్ష్మణ సమేత హనుమాన్ మందిర ప్రథమ బ్రహ్మోత్సములు ది13.5.2012 నుండి 16-5-2012 వరకు జరుగును. భగవద్బంధువులందరికీ ఇదే ఆహ్వానం.

*వివరములు:*

జెట్ సీతానగరం - 08645 272929;
జెట్ హైదరాబాద్ - 040 23224426
శ్రీరామ్ నగర్ - 9553549971/72
డా॥ టి. రామనాథం-040 24048045;
వేణుగోపాల్ -94404 82325;
సిహెచ్. వెంకటేశ్వరరావు - 9441234003;
ఎమ్.మల్లిఖార్జునరావు- 92467 61235;
పి.మోహన్‌రావు - 9347543444.

# మన దర్శనం 'సు' దర్శనం

పూర్వమీమాంస
వైశేషిక
న్యాయ
యోగం
సాంఖ్య

వైశారదీ

దర్శనాలు "ఆస్తికం", "నాస్తికం" అని రెండు రకాలని తెలుసుకున్నాం. ఆస్తిక దర్శనాలని తెలుసుకోవడానికి ముందు నాస్తిక దర్శనాలని కూడా కొద్దిగ తెలుసుకోవడం అవసరం. నాస్తికదర్శనాలలో మొదటిది చార్వాకం. చార్వాకం, నాస్తికం పర్యాయపదాలుగ వ్యవహరిస్తారు. చార్వాకులు భౌతిక ప్రపంచాన్ని మాత్రమే గుర్తించి, ప్రాపంచిక సుఖానుభవమే పరమార్థంగ భావిస్తారు.

భౌతికవాదానికి చాలా హద్దులున్నాయి. వీరు కన్పించేదానిని మాత్రమే అంగీకరిస్తామంటారు. కన్పించేదానికి వెనుక ఎన్నో కారణాలు కన్పించకుండా పనిచేస్తూంటాయి. ఈ విషయాన్ని మనం చుట్టూ ఉండే ప్రపంచంలో గుర్తించవచ్చు. ఉదాహరణకి మనకి కంటికి తిరుగుతూ కన్పించే ఫ్యాన్ వెనుక పనిచేయించే తీగలు, కరెంట్ వంటి కారణాలు కన్పడకుండా ఎన్నో ఉంటాయి. అలాగే ఈ రోజుల్లో వాడే వైర్‌లెస్ కంప్యూటర్ వంటి పరికరాల వెనుక కూడా కన్పడని అంశాలు ఎన్నో పని చేస్తూంటాయి. మనం ఇచ్చే సమాచారాన్ని అందుకొని సమన్వయం చేసుకొని కావలసిన సమాచారాన్ని బయటికి వెలువరించాలంటే లోపల చిప్, ప్రోసెసర్ వంటి పరికరాలు ఎన్నో పనిచేస్తాయి. కానీ వాటి మధ్య ఉండే సంబంధం మన కంటికి కన్పించదు.

కేవలం ప్రత్యక్షం మాత్రమే ప్రమాణమని విశ్వసించే ఈ చార్వాకమతాన్ని గురించి, మన పూర్వాచార్యులైన పెద్దలు కొన్ని సారసంగ్రహ శ్లోకాలను అనుగ్రహించారు. వాటిలో వాత్స్యవరదాచార్యులు అనే మహానుభావులు 'యతిరాజవిజయం' అనే నాటకంలో చార్వాకాన్ని గురించి ప్రస్తావిస్తూ ఇలా చెప్పారు...

**భుంక్తే వేత్తి చ దేహ ఏవ స మహాభూతాని తేష్వేవ ధీః,**
**కిణ్వాదౌ మదశక్తివత్ క్రతుఫలం భోక్తా న కోపి స్థిరః।**
**దగ్ధః కిం పునరభ్యుపైతి? నియమో న క్వాపి, జీవేత్ సుఖం**
**యావజ్జీవతి, దైవతం నరపతిః న్యాయో బలం కేవలమ్॥**

**భుంక్తే** - అనుభవించేది
**వేత్తి చ** - తెలుసుకునేది కూడా
**దేహ ఏవ** - ఆ దేహమే!
**సః** - ఆ దేహం
**మహాభూతాని ఏవ** - నాలుగు భూతాల కలయికవల్ల ఏర్పడ్డదే!
**ధీః** - జ్ఞానము కూడా
**తేషు+ఏవ** - ఒక పద్ధతిలో కలిసిన ఆ భూతముల యందే ఏర్పడును.
**కిణ్వాదౌ** - మాదక ద్రవ్యాలలో కలయికవల్ల జనించే
**మదశక్తివత్** - మత్తునిచ్చు శక్తివలె
**స్థిరః** - స్థిరంగ దేహంలో ఉండే జీవుడనే వాడు
**న** - లేదు.
**దగ్ధః** - కాల్చిన దేహము, దానిలోని జ్ఞానము,
**పునః** - తిరిగి
**అభ్యుపైతి కిం?** - లేచివచ్చునా ఏమి?
**నియమః** - పోయినవాడు తిరిగి పుట్టుట అనే నియమము
**క్వ+అపి** - ఎక్కడా కూడా
**న** - కన్పించుట లేదు. అందువలన,
**యావత్ జీవతి** - బ్రతికి ఉన్నంత వరకు
**సుఖం** - ఆనందముగ
**జీవేత్** - బ్రతకవలెను.
**నరపతిః** - పాలించే శక్తి ఉన్నవాడే
**దైవతం** - పూజలందదగినవాడు.
**బలం కేవలం** - వానికుండే బలం మాత్రమే
**న్యాయః** - చట్టము.

పై శ్లోకం మనకి చార్వాకుల అభిమతాన్ని స్పష్టంగానే చెప్తోంది. వీరు ప్రపంచపు నిర్మాణంలో ఐదు భూతాలున్నాయని అంగీకరించటం లేదు. మట్టి, నిప్పు, నీరు అనే మూడింటిని స్పష్టంగ అంగీకరిస్తున్నారు, కన్పిస్తాయి కనుక. వీటికి అతీతంగ చెట్లకదలిక మొదలైన వాటినిబట్టి గాలిని కూడా అంగీకరిస్తారు. ఎక్కడ అవకాశం ఉంటే దానిని ఆకాశం అంటారుతప్ప, ఆకాశమనేది పంచభూతాలలో ఒకటైన ద్రవ్యం అన్నది వీరికి అంగీకారం కాదు. నాలుగు భూతాల కలయికవల్లనే ఇవన్నీ

ఏర్పడతాయన్నది వీరి ప్రతిపాదన.

ఈ నాలుగు భూతాల కలయికలో ఉండే మార్పువల్ల రంగులు, రూపాలు, వాటి స్వభావాలు మారుతూంటాయి, అంటారు. మన కంప్యూటర్‌లలో మూడు ప్రధాన రంగుల కలయికవల్ల వేలాది రంగులు ఏర్పడినట్లు, ఈ నాలుగు భూతాల పాళ్ళలో మార్పువల్ల సకలవస్తుజాతమూ ఏర్పడుతుంది. అలా ఏర్పడ్డ వాటిలో ఒకటే, 'చైతన్యము' లేదా 'జ్ఞానము'. 'జీవుడు' అని ఆస్తికులు సంబోధించేది కూడా ఈ రకంగ ఏర్పడ్డ జ్ఞానాన్నే అని వీరు భావిస్తారు. తమలపాకులు, వక్క, సున్నము వంటి వాటిని కలిపి నమిలినప్పుడు, లేదా, సున్నం పసుపు కలిపినప్పుడు, లేదా, పసుపు, నిమ్మరసం కలిపినా, ఆయా విడి ద్రవ్యాలలో లేని 'ఎరుపు' అనే కొత్త రంగు ఏర్పడటం మనం గమనిస్తున్నాం. అందుకే జీవుడు అనేది నాలుగుభూతముల కలయికవల్ల ఏర్పడిన ఒక చైతన్యశక్తి మాత్రమే అని వీరంటారు.

దీనికి వీరు వేదాన్ని కూడా ప్రమాణంగ చూపిస్తారు. "విజ్ఞాన ఏవైతేభ్యో భూతేభ్యో సముత్థాయ తాన్యేవ అనువినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తి" అనే మంత్రానికి అర్థాన్ని అలా సమన్వయం చేస్తారు. ఇప్పటి విజ్ఞాన శాస్త్రంలో కూడా మనకి కన్పిస్తున్న రసాయన చర్యలవల్ల ఏర్పడిందే 'చైతన్యం' తప్ప వేరే ఏదీ లేదు, అని విశ్వసిస్తారు. ఈ కలయికలో పాళ్ళలో తేడాలవల్ల ఏర్పడినవే ఆధులు, వ్యాధులూ వంటివన్నీ. 'ఆధులు' అంటే మనసుకి వచ్చే జబ్బులు. 'వ్యాధులు' అంటే శరీరానికి వచ్చే జబ్బులు. వీటిని ఔషధరూపంలో భౌతిక ద్రవ్యాలనిచ్చి సరిచేస్తారు. అది కుదరనప్పుడు లేదా మరీ ముదిరినప్పుడో సహజంగానే చైతన్యం ఆగిపోతుంది. అదే 'మరణం' అంటారు. అంతే తప్ప జీవుడనే వాడు వేరే దేహంలో ఉండడం గానీ, బయటకి వెళ్ళడం గానీ ఏమీ ఉండవు.

లోకంలో మనం చేసే వ్యవహారంవల్ల కూడా "నేను చిక్కితిని", "నేను బలిసితిని", "నేను పొడుగు", "నేను పొట్టి".... ఇలా 'నేను' అనే శబ్దానికి 'శరీరమే' లక్ష్యంగ ఉండడం చేత, శరీరం కంటే వేరుగ మరొక జీవుడనేవాడెవడూ ఉండదు. అసలు ఆత్మయే శరీరం కంటే వేరుగా లేనపుడు, ఇక అది స్థిరంగ, నిత్యంగ ఉంటుందనేది, దానికి పుణ్యాలు, పాపాలు అంటుతాయనడమూ, వాటిని అనుభవించడానికి ఎక్కడో స్వర్గ నరకాలు ఉంటాయనడమూ సరికాదు. ఆ లోకాలే లేనపుడు వాటిని పొందడానికి యజ్ఞాలు, యాగాలు, దానాలు, ధర్మాలు, వీటిని ఆచరించే శరీరాలకు ఏవో వర్ణాలు, ఆశ్రమాలు ఇలాంటివన్నీ ఉంటాయనడం కానీ, వాటిని పాటించడం-వాటికోసం జన్మకి లభించిన సమయాన్ని వ్యర్థం చేసుకోవడం తగదు.

పైగా, జీవులు, పితృదేవతలుగా పైలోకాలకి పోయి అక్కడ ఉంటారని, వారి తృప్తికోసం ఏవో పితృకార్యాలు అంటూ ఇక్కడ చేయాలని అనడం అంతకంటే సబబు కాదు. ఇవి కొందరు తమ పోషణ కోసం ఏర్పరచుకున్న వ్యవస్థలు. పైలోకాల్లో ఉండే వారికోసం ఇక్కడేదో చేస్తే, ఇది అక్కడుండేవారికి అందుతుందీ అన్నట్లైతే! దూరప్రయాణాలు చేసేవారిని ఉద్దేశించి వారింట్లోనే వారి పేరు చెప్పి ఎవరికో భోజనం పెడితే, ఆ ప్రయాణం చేసేవారి కడుపు నిండిపోవాలి. కానీ, అలా మనకి ఎక్కడా కన్పడటం లేదు. లేదా, మేడమీద వ్యక్తిని కూర్చోపెట్టి వారి పేరున క్రింద వేరొకరికి అన్నం పెడితే ఆపైవారి కడుపు నిండి పోవాలి. కానీ, అదీ జరుగుతున్నట్లు తెలియటం లేదు. పైగా జ్ఞానం ఉన్నవాడు జీవుడు, అతడే దేహాన్ని వదిలిపెట్టి వెడతాడు, అన్నట్లైతే దేహంచుట్టూ కూర్చొని లబోదిబోమంటూ విరహం ఓర్వలేని బంధువులు ఏడుస్తూంటే ఆ బంధువుల బాధను చూడలేక ఆ జ్ఞానమున్న జీవుడు తిరిగి మళ్ళీ రావద్దా! అలా కూడా ఏమీ జరగటం లేదు.

ఇక దైవమనేదీ ఇలా కొందరు బతకటానికి కల్పించుకున్నదే. 'దైవం' అనేది దృష్టమా? అదృష్టమా? కన్పించే దానిని దృష్టము అంటారు. అదృష్టమంటే కన్పించనిది. దైవం కన్పించటం లేదు కనుక అదృష్టం అంటారు. అసలు వస్తువంటూ ఉంటే అది ఎప్పుడో ఒకప్పుడు, ఎవరో ఒకరికి కన్పించితీరాలి. ఎప్పుడో ఒకప్పుడు ఎవరో ఒకరికి కన్పడ లేదంటే అది కుందేటి కొమ్ములాగ, గగనకుసుమంలాగ తుచ్ఛము( లేనిదే) అవుతుంది. కనుక 'దైవం' అంటూ వేరే లేనే లేదు అంటూ నాస్తికులు వాదన చేస్తారు. ఈ వాదనంతటిని మన పూర్వాచార్యులు పై శ్లోకంలో ఇమిడ్చారు.

ఇక ఈ సిద్ధాంతంలో వీటికే కాక ఇలాంటి మరెన్నో వాదనలకి మరింత విపులంగ యుక్తియుక్తంగ సమాధానాలని మన పూర్వాచార్యులు వారి గ్రంథాల్లోనే చెప్పారు.....వాటిని మనం వచ్చే సంచికలో తెలుసుకుందాం!

గీతా మాహాత్మ్య కథలు-10

# ధీరబుద్ధి

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

గత మాసపు గీతా మహాత్మ్య కథలు – 9లో కామ్యకర్మలు ఎంతటి అనర్థాన్ని కొనితెస్తాయో గీతాపారాయణ ఎలా యాదృచ్ఛిక కష్టాలను కూడా అతిక్రమింప చేస్తుందో తెలుసు కున్నాము. ఇక పదవ అధ్యాయానికి సంబంధించి విశిష్ట మహిమను తెలియచేసే ఈ అద్భుత కథను చదువుకుందాం.

భగవద్గీతలోని పదవ అధ్యాయాన్ని **"విభూతి విస్తర యోగం"** అంటారు. విభూతి అనగా భగవంతుడి వైభవమన్న మాట. ఆ వైభవాన్నే విభవము అంటారు. భగవంతుని యొక్క విభూతి స్వామి అవతారాలలో మనకి దర్శనమిస్తుంది. భగవంతుని అవతారాలు అనేకములు, అనంతములు, ఆశ్చర్యకరములు. ఉదాహరణకు ఈ ప్రకృతి కూడా భగవంతుని యొక్క వ్యక్త రూపమే, అంటే ఈ ప్రకృతి కూడా ఆయన విభూతి అన్నమాట. దీనిని బట్టి చూస్తే స్థావర జంగమాది సకల చరాచర జీవ జగత్తు అంతా భగవత్ విభూతి అయి ఉండగా అందులో కొన్ని విభూతులను గురించి చెప్పడం దాదాపు అసాధ్యమైనది. భగవంతుని విభూతుల గురించి చెప్పుకోవడం, తెలుసుకోవడం, మననము చేయడం మున్నగునవి భగవద్భక్తులకు పరమ ప్రీతి కరమైనవే గాక, మోక్షదాయకము కూడా. ఇన్ని విభూతులకు నిలయమైన పరమాత్మ ఈ అధ్యాయంలో ఇలా అంటున్నాడు.

**శ్లో ॥ యో మా మజ మనాదిం చ వేత్తి లోక మహేశ్వరం।**
**అసంమూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥**

నన్ను యదార్థముగా పుట్టుకలేని వానిగా, అనాది అయిన వానిగా, సర్వలోక దివ్య ప్రభువుగా తెలుసుకొనిన వాడు మానవులలో అజ్ఞానము లేని వాడై సర్వ పాపముల నుండి విముక్తుడౌతాడు. అనగా పై శ్లోకములో శ్రీకృష్ణుడు తనని చేరడానికి లేదా మోక్షము పొందడానికి మానవులు అవలంబించదగిన మరియొక ధర్మమును సూచిస్తున్నాడు. భగవంతుడు తన విభూతుల గురించి తెలియజేస్తూ ఎన్నో రహస్యములను బహిర్గతం చేసాడు. ఈ అధ్యాయంలో **"అహ మాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ"** అన్నాడు శ్రీకృష్ణుడు. అంటే ఈ సర్వభూతములకు సృష్టి, స్థితి, లయ కారకుడను నేనే అని తెలియజేసాడు. తన విభూతులను తెలియజేస్తూ తానే బ్రహ్మదేవుడనని, కాలమునని, శంకరుడనని, అర్జునుడనని, వ్యాసుడనని, రాముడనని, ప్రహ్లాదుడనని ఇలా తన విభూతులకు గల ఎన్నో నామాలను తెలియచేశాడు. ఇలా ఎన్నో విభూతులను గురించి తెలియజేయుట వలన విభూతి యోగమన్న సార్థకనామం ఈ అధ్యాయానికి ఇవ్వబడింది. తమాషా ఎమంటే ఈ అధ్యాయాన్ని ఇంత వివరంగా అభ్యసించినా భగవత్ విభూతి యొక్క విస్తారము కేవలం నామమాత్రంగా తెలుస్తుంది.

భగవద్విభవ ప్రకాశమానమైన ఈ అధ్యాయం యొక్క మహిమ కూడా అత్యద్భుతంగా ఒడలు పులకించే విధంగా ఉంటుంది. ఈ అధ్యాయము యొక్క మహిమను వివరించే కథని ఇప్పుడు తెలుసుకుందాము.

పూర్వము కాశీ పట్టణంలో ధీరబుద్ధి అనే పేరుగల ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు శ్రీమన్నారాయణునకు అనన్య భక్తుడు. బ్రహ్మజ్ఞాని, జితేంద్రియుడు, పరమ భాగవతుడు అయిన ధీరబుద్ధి అంటే పరమ శివునకు పరమ ప్రీతి. ఆ ప్రీతి అధికమై ధీరబుద్ధిని చూడకుండా ఉండలేని స్థితికి శంకరుడు చేరుకున్నాడు. అందువలన ధీరబుద్ధి ఎక్కడికి వెళ్లినా పరమ శివుడు ఆతని వెన్నంటె ఉండేవాడు. ఆ భాగవతుని బుద్ధి భగవంతుని నుండి చెదరకుండా ఆతనికి వచ్చే సమస్య లన్నింటిని పరమ శివుడే స్వయంగా తొలగించేవాడు. పరమ శివునికి పరమ భక్తుడైన భృంగి కూడా ఆ శంకరుని అడుగు జాడలలో నడిచేవాడు. ఇలా లయకారుడైన పరమేశ్వరుడు ఆ ధీరబుద్ధికి తోడూనీడా అయి తిరగడం భృంగికి ఆశ్చర్యం కలిగించింది. ఒకరోజు ఆతడు పరమ శివుని చెంత చేరి వినమ్రతతో నిలిచి నమస్కరించి "స్వామీ ఈ ధీరబుద్ధికి వెన్నంటి తమరు తిరుగుటకు కారణం ఏమిటి? ఇంతకీ ఈ మహాత్ముడు ఎవరు? ఈతనికి అనుక్షణము మీరు ఎందుకు ఇలా సేవలు చేస్తున్నారు? తెలియజేయవలసినది." అని ప్రార్థించాడు.

దానికి మహాశివుడు చిరునవ్వుతో ఇలా సమాధానము చెప్పాడు. "భృంగీ! ఒకనాడు నేను కైలాసములో గల

పున్నాగవనంలో ఒక చంద్రకాంత శిలపై ఆశీనుడనై ధ్యానము చేసుకుంటున్నాను. ఒక పక్షి అలికిడి విని కనులు తెరచి చూడగా ఒక నల్లని పక్షి నా పాదాల చెంత పడి ఉన్నది. దాని ముక్కున ఒక అందమైనది, అప్పుడే వికసించినది అయిన పద్మం కనపడింది. ఆ పక్షి ఆ పద్మాన్ని నా పాదాల చెంత ఉంచి భక్తితో నమస్కరించింది. దాన్ని ఆశీర్వదిస్తూ నేనిలా అన్నాను. "ఓ పక్షి రాజా! నీవెవరవు? ఎక్కడ నుంచి వస్తున్నావు? నీ రూపం చూస్తే ఒక హంసలా ఉంది, రంగు చూస్తే కాకిలా ఉంది. నీవు నా వద్దకు రావడానికి గల కారణమేమిటి?"

"ఓ మహాదేవా ! నేను బ్రహ్మదేవుని వాహనమైన హంసను. నేను భూ విహారము చేయడానికి వెళ్ళినపుడు సౌరాష్ట్రమనే దేశంలో ఒక తామర కొలను కనిపించింది. నేను ఆనందంతో ఆ కొలనులో స్నానంచేసి, తామర తూండ్లను భుజించి అక్కడి నుండి బ్రహ్మలోకము చేరుటకు ఎగిరినాను. కాని క్రమంగా నాలోని శక్తి క్షీణించి క్షణకాలములోనే నేల రాలిపోయాను. శుక్లవర్ణం కల నా శరీరపు వర్ణము కాలవర్ణముగా మారింది. నేను ఆశ్చర్యము నుండి తేరుకోక ముందే ఆ కొలనులోని ఒక పద్మము నాతో ఇలా అన్నది.

"ఓ కలహంసా! లే! నీవు ఆకాశములో ఎగురుతూ నా పై నుండి దాట ప్రయత్నించావు. నా పై నుండి దాటుట ఎవ్వరికీ సాధ్యము కాదు. నా పుష్పములోని మధువును గ్రోలుట వలన ఇప్పటికే అనేక వేల తుమ్మెదలు దివ్యదేహాలతో స్వర్గలోకాన్ని పొందాయి. నాకు ఇంతటి దివ్య మహిమ కలగడానికి గల కారణం చెపుతాను విను.

పూర్వజన్మలో నేను సరోజవదన అనే ఒక పతివ్రతను. గురుజనుల సేవ, పతిసేవ నా నిత్యకృత్యాలు, నాకొక పెంపుడు పక్షి ఉండేది. ఆ పక్షితో మాట్లాడుతుంటే నాకు సమయమే తెలిసేదికాదు. దానితో మాట్లాడుతూ కాలం గడుపుతూ ఒకనాడు నా భర్తకు తిరువారాధనలో సహాయం చేయడం మర్చిపోయాను. ఆ పాపము వలన నేను మరుజన్మలో ఒక గోరువంకనై జన్మించాను. నన్ను ఒక ముని బాలిక ముచ్చటతో పెంచుకోసాగింది. ఆ ఆశ్రమములో ప్రతిరోజూ ఉదయం భగవద్గీతలోని దశమాధ్యాయాన్ని భక్తితో పారాయణ చేసేవారు. నేను ఆ భగవద్గీత పారాయణను శ్రద్ధగా వినేదాన్ని. ఆ పుణ్య విశేషము వలన నేను మరుజన్మలో శ్రీమహాలక్ష్మికి చెలికత్తెగా జన్మించాను. అప్పుడు నాపేరు పద్మావతి. లక్ష్మీదేవికి సేవలు చేసుకుంటూ ఆనందంగా గడిపే ఆ రోజులలో నా దృష్టి ఒక మనోహరమైన సరస్సుపై పడింది. ఆ సరస్సులో జలక్రీడలు ఆడాలనిపించి వస్త్రవిహీనగా నీటిలోకి ప్రవేశించాను. ఎంతసేపు స్నానమాచరించానో నాకే తెలియదు. కొద్దిసేపటికి తెలివి తెచ్చుకుని చూడగా ఆ సరస్సు వద్దకు వస్తున్న దూర్వాస మహాముని కనిపించాడు. దిగంబరగా వారికి కనపడటం ఇష్టం లేక నాకు గల కామరూప శక్తితో ఒక పద్మంగా మారాను. కాని ఆ త్రికాలదర్శి అయిన మహాముని ముందు నా ప్రయత్నం ఫలించలేదు. దూర్వాస మహాముని నన్ను పద్మరూపంలోనే అలాగే వందసంవత్సరాలు పడి ఉండమని శపించాడు. ఈ వంద సంవత్సరాలు భగవద్గీతలోని పదవ అధ్యాయము మహిమ తెలిసిన దానను కనుక ఆ దశమాధ్యాయ పారాయణ చేస్తూ గడిపాను. అందుకే నాకు అంతటి మహిమ కలిగింది. ఇప్పుడు నా వంద సంవత్సరాల శాపవ్యవధి పూర్తి కావచ్చింది. నీకోసం చివరిసారిగా భగవద్గీతలోని పదవ అధ్యాయాన్ని పారాయణ చేస్తాను విను" అని ఆ దశమాధ్యాయ పారాయణ చేసి తాను తిరిగి పద్మావతిగా మారి, నాకొక పద్మాన్ని బహూకరించి ఆమె వైకుంఠానికి వెళ్ళిపోయింది.

ఓ పార్వతీపతీ ! నీ పాదపద్మాల వద్ద ఉంచిన ఈ పద్మము ఆ వైకుంఠవాసిని అయిన పద్మావతి బహుమతిగా ఇచ్చినదే" అని చెప్పి ఆ కలహంస నా పాదాల వద్ద తన ప్రాణాలు కోల్పోయింది. ఆ హంసయే ఈ జన్మలో ధీరబుద్ధి అనే బ్రాహ్మణుడై భగవద్గీతలోని పదవ అధ్యాయాన్ని పారాయణ చేసుకుంటున్నాడు. తన మనస్సుని సర్వకాల సర్వావస్థల యందు ఆ శ్రీమహావిష్ణువు పైననే నిలిపి ఉన్నాడు. అందువల్లనే ఆతడు నాకు అత్యంత ప్రీతి పాత్రుడయ్యా"డని మహాశివుడు భృంగికి చెప్పాడు. ఈ కథను విన్న భృంగి పరమానంద భరితుడయ్యాడు.

పూర్వము పదవ అధ్యాయము యొక్క మహిమను తెలుపమని శ్రీమహాలక్ష్మి శ్రీమన్నారాయణుని అడిగినప్పుడు ఆ పరమాత్మ చెప్పిన కథ ఇది. ఈ కథనే దశమాధ్యాయ మహాత్మ్యమును చెప్పమని పార్వతీదేవి అడిగిన ప్రశ్నకు సమాధానముగా మహాశివుడు గౌరీదేవికి ప్రీతితో తెలియ జేశాడు. ఈ కథను విన్న పార్వతీ దేవి పరమానంద భరితురాలై **'తే వైష్ణవా భువనమాశు పవిత్రయంతి"** అట్టి వైష్ణవులే ఈ లోకాలను పవిత్రం చేస్తారు అని పులకిస్తున్న మేనితో అనుకున్నది.

ఈ దశమాధ్యాయ ధారణా పుణ్యాన్ని పద్మపురాణం కూడా

ఈ క్రింది విధంగా కీర్తిస్తోంది.

**శ్లో ॥ దశమాధ్యాయ మహాత్మ్యా త్తత్వజ్ఞానం సుదుర్లభం ।**
**లబ్ధమేతేన మునినా జీవన్ముక్తి రియం తథా ॥**

ఈ దశమాధ్యాయాన్ని పారాయణ చేసిన వారికి ఈ అధ్యాయ మహాత్మ్యం వల్ల తత్వజ్ఞానం సులభంగా లభించడమే కాక మననం చేసిన వారికి మరణానంతరము మోక్ష ప్రాప్తి కూడా కలుగుతుంది.

## భక్తినివేదన ప్రోత్సాహకులు

| | | |
|---|---|---|
| 1. శ్రీమతి బి. చంపకవల్లి | గుంటూరు | 10,000/- |
| 2. రమణమ్మ | తిరుపతి | 9,000/- |
| 3. కలిదిండి సూర్యనారాయణరాజు | పెదపుల్లూరు | 6,000/- |
| 4. మానేపల్లి పెంచలయ్య | శ్రీహరికోట | 5,679/- |
| 5. కె. సత్యం | గోదావరిఖని | 5,516/- |
| 6. ఎన్.వి.కులశేఖర్ | విశాఖపట్నం | 5,116/- |
| 7. ఎమ్. ఆదినారాయణ | హైదరాబాద్ | 5,116/- |
| 8. కె.ఎస్. ప్రభాకరరావు | దావణగిరి | 5,025/- |
| 9. ఎమ్. విశాలక్ష్మి | ఖమ్మం | 5,016/- |
| 10. ఎం. గోపీకుమార్ | తెనాలి | 5,001/- |
| 11. బంగారు పార్వతీ శ్రీనివాస్ | పాలకొల్లు | 5,001/- |
| 12. కె.వి. రామన్ | గుమ్మిడాల | 5,001/- |
| 13. ఆర్. రామానుజాచారి | హైదరాబాద్ | 5,000/- |
| 14. వెంకటరమణమ్మ | పిఠాపురం | 5,000/- |
| 15. పుష్పవల్లీ తాయారు | సికింద్రాబాద్ | 5,000/- |
| 16. సిహెచ్. అన్నపూర్ణ | బొమ్మలూరు | 5,000/- |
| 17. కె. లలితకుమారి | మానికొండ | 5,000/- |
| 18. మధుసూదనరావు | సికింద్రాబాద్ | 5,000/- |
| 19. వై. స్వరూపరాణి | విజయవాడ | 5,000/- |
| 20. టి. వెంకటేశ్వర్లు | హైదరాబాద్ | 5,000/- |
| 21. జి. కమల | హైదరాబాద్ | 5,000/- |
| 22. శ్రీమతి వసుమతి భాస్కరరావు | హైదరాబాద్ | 5,000/- |

**మీరు భక్తినివేదన అభివృద్ధికై ప్రోత్సాహక కైంకర్యాన్ని సమర్పించినందుకు శ్రీస్వామివారి మంగళాశాసనములు అనుగ్రహించారు.**


### STATEMENT OF OWNERSHIP AND OTHER PARTICULARS OF BHAKTHINIVEDANA

FORM IV (See Rule 8)

1. Place of publication : Sitanagaram, Guntur
2. Language / Periodicity : Spiritual Telugu Monthly
3. Printer's Name : **H.H. Sri Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji**
   Nationality : Indian
   Address : **JEEYAR EDUCATIONAL TRUST,** Sitanagaram, Guntur Dt. Andhra Pradesh-522 501
4. Publisher's Name : **H.H. Sri Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji**
   Nationality : Indian
   Address : **JEEYAR EDUCATIONAL TRUST,** Sitanagaram, Guntur Dt. Andhra Pradesh-522 501
5. Editor's Name : **T.P. SRIRAMACHANDRACHARYA**
   Nationality : Indian
   Address : S/o. Sitaramacharyulu 5-74, Ayodhya, Visakhapatnam-530 028. Andhrapradesh.
6. Name and address of individuals who own the news paper and partners of share holders holding more than one percent of the total capital : Nil
7. R.N.I.No. : 52762/91

I, Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji herebydeclare that the particulars given above are true to the best of my knowledge and belief.

Dt. 31.03.2011

Sd/-
**SRI SRISRI TRIDANDI CHINNA SRIMANNARAYANA RAMANUJA JEEYAR SWAMY**
*Signature of Publisher*

# 'మీ' 'భక్తి' నివేదన

**విన్నపాలు వినవలె వింత వింతలు**
**పన్నగపు దోమతెర పైకెత్తవేమయ్యా!**

ఓ శ్రీనివాసా! అనగా అనగా ఒక కాలంలో ఒక దేశంలో నీ తత్త్వాన్ని, నీ మహాత్మ్యాన్ని ఈ జీవులకందించి తరింపచేయాలని సంకల్పించావు. పరిస్థితులను సమకూర్చుకున్నావు. అర్జునుడిని ఎన్నుకున్నావు. నీకనుగుణంగా అతడిలో సంకల్పాలను కలిగించి, మార్చుకుని, అతడిని వ్యాజంగా లోక కళ్యాణార్థమై 'భగవద్గీతను' అందించావు.

ఆ తరువాత శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ పెద్దజీయర్ స్వామివారి సన్నిధిలో శ్రీరామచంద్రుడవై వేంచేశావు. 'జగమంతారామమయం' చేయాలని సంకల్పించావు. నీకు కష్టం కలిగితే, వారు వేదన చెందుతారని నీకు తెలుసు. ఒకానొక మహానుభావుని ద్వారా నీ ప్రతిరూపమైన శ్రీరామాయణ గ్రంథానికి అవమానం జరిగింది. శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారు తల్లడిల్లి పోయారు. నీకు కలిగే కష్టం సమాజానికి హాని కలిగిస్తుందని నివారణార్థమై 'శ్రీరామమహాక్రతువులు' చేయాలని సంకల్పించారు.

ఆ కాలంలో, మామూలుగా వెళ్ళి దర్శనం చేసుకోవాలంటేనే సతమతమయ్యే ప్రదేశాలైన బదరీనాథ్, ముక్తినాథ్ లాంటి క్షేత్రాల్లో, జైళ్ళల్లో, మొత్తం దేశమంతా 9 సం.ల పాటు ఆరని అగ్నిహోత్రంతో నిర్విరామంగా సంచరిస్తూ, 108 శ్రీరామమహాక్రతువులు నిర్వహించి, 108 శ్రీరామక్రతు స్థూపాలు నిర్మించారు. 108 ఆవృత్తులుగ జరిగిన హవనంలో వేలాదిమంది శ్రీరామపారాయణలో గొంతు కలిపారు. అంతేకాక, 'రామనామలేఖనం', రామనామ స్మరణ, రామకార్యంలో, రామకైంకర్యంలో అన్వయించటం.. అలా ఆసేతుహిమాలయమే కాక నేపాల్‌లోను అంతా రామమయం చేశావు.

మరి నేడు..

శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారిని ఎన్నుకున్నావు. యామునాచార్య స్వామి రామానుజుల వారిని కాంచీపుర ఆలయంలో చూచి, తమ ఆశయాలకు తగినవారు వీరేనని నిర్ణయించుకున్నట్లుగా, వేయి కుండాల యజ్ఞంలో 'శ్రీస్వామివారిని' ఎన్నుకున్నావు. 'గీతాజ్యోతి' కార్యక్రమం సందర్భంగా ఊరూరా, పల్లెపల్లెలో 'గీతాజ్యోతి' శ్లోక పారాయణం, భగవద్గీత వైభవం అందించిన శ్రీస్వామివారి నిరంతర కృషి నీకు ఆనందం కలిగించింది. రంగం సిద్ధం చేశావు.

T.T.D వారు, శ్రీస్వామివారిని ఆహ్వానించి చర్చలు జరిపారు. శ్రీస్వామివారి సూచనల ప్రకారం నీ సన్నిధిలో, ఆరాధనాదులలో ఉండే లోపాలు సవరించుకుంటామన్నారు. ఇదే అదనుగా, నీ లీలలను, నీ వైభవాన్ని, నీ భక్తుల గొప్పతనాన్ని, నీ కొండ మహాత్మ్యాన్ని లోకమంతా చాటింపనెంచావు.

అందుకేనేమో! లోపాల సవరణకి బదులు T.T.D అధికారులతో నీ సన్నిధిలోని వేయికాళ్ళ మండపాన్ని భంగం చేయించావు. ఆచార్యులలో వేదన కలిగించావు. నీకు, మాకు అందరికి ఆచార్యులు భగవద్రామానుజ స్వామి. వారి ఆజ్ఞలకు విరుద్ధంగా తిరుమలలో దోషం జరగడం సహించలేకపోయారు, శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామీజీ. మహానుభావులకు కలిగే వేదన లోకకళ్యాణ కారకమవుతుంది కద!

నీ ఆంతర్యాన్ని గుర్తించిన శ్రీచిన్నజీయర్ స్వామివారు నీ సన్నిధిలోని దోషాలు తొలగించుకోమని నిన్నే ప్రార్థిస్తూ...గత 7 సం.లుగా దేశవిదేశాలలోని వారందరికీ నీ వైభవాన్ని , అనాదిగ మాపై వాత్సల్యంతో ఇలలో వేంచేసి ఉన్న నీ చరిత్రనీ తెలియ జేయటమే కాక వారందరితో, నీ నామ సంకీర్తనం, లేఖనం, నీ గుణగాన పూర్వక శరణాగతి దీక్షలు వైభవంగా జరిపేలా అనుగ్రహించావు.

పిల్లాడు తన పేరు చెపితే మురిసిపోయే తండ్రిలాగా 108 నామాలు చాలక 1000 నామాలను పలికిస్తూ, నీకిష్టమైన తులసీదళాలతో, ఊరూరా శ్రీస్వామివారిననుసరించి మేమంతా, అర్చించేలా చేయించుకున్నావు. నీప్రియపుత్రులైన, శ్రీస్వామివారితో అంగరంగ వైభవంగా కార్యక్రమాలు చేయించుకున్నావు. సరే!

ఇంకెంతకాలం ఈ దాగుడు మూతలు! ఇక చాలు స్వామీ! పిల్లలు అలసిపోతారు. సేదతీర్చు తండ్రీ! భగవద్రామానుజ స్వామి ఆజ్ఞానుసారం నీ శిఖరాలమీద పూర్వపు వైభవం ఉట్టిపడేలా అంతా సరిచేసుకుని అన్నీ సవ్యంగా చేయించుకో ప్రభూ!సహస్రతూణీర మండపంలో నీ దేవేరులతోపాటు వేంచేసి, ఆచార్య పర్యవేక్షణలో రంగరంగ వైభవంగా నీ ఆరాధనలు జరిపించుకో తండ్రీ! తద్వారా సర్వులకూ శ్రేయస్సును కలిగించు స్వామీ! సంకల్పమాత్రం చేత ఈ చరాచరములన్నిటినీ, సృజించిన స్వామివి! సర్వసమర్థుడవు! సకల కళ్యాణ గుణాకరుడవు. నీవు చేయలేనిది లేదు. వాత్సల్య గుణనిధివి. తొందరగా చేయించుకో తండ్రీ!

**లోకాః సమస్తాః సుఖినో భవంతు!**

**సర్వేజనాః సుఖినో భవంతు!**

అనేకానేక దాసోహములతో

**జయలక్ష్మిరామానుజదాసి–చెన్నై.**



రాయల ఊహల పల్లకీ....

# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

మధువును పుక్కిటపట్టి పొగడచెట్టుమీద ఉమ్మితే అది పూస్తుంది. కాలితో తంతే అశోకం పూస్తుంది. నవ్వితే నమేరువు పూస్తుంది. మాటలాడితే కర్ణికారం పూస్తుంది.

నవ్వడాన్ని పరిహాసంగా భావించింది నమేరువు. మాటలాడటం నిందలు పలకటంగా భావించింది కర్ణికారం. ఉమ్మడం తన్నడం స్పష్టంగా అవమానాలాయె. ఉమ్మగా, తన్నగా, పరిహసించగా, నిందించగా అవమానపడిన చెట్లు ఆలింగనం, వీక్షణం, స్పర్శనం మొదలైన గౌరవ మర్యాదల్ని పొందిన చెట్లని మమ్మల్ని అవమానపరచిన ఆ పొగరుబోతుల్ని మా కప్పగిస్తారా లేదా అని నిలదీశాయి.

అవి తప్పించు కోకుండా తుమ్మెద గొలుసుల్తో వాటిని బంధించి (దొంగకు వేసిన హాండ్‌కప్ రెండోకొన పోలీసు తనకే వేసుకున్నట్లు) ఆ తుమ్మెద గొలుసుల రెండోకొసల్ని తమకే కట్టుకున్నాయి. కాని ఆ చెట్లు వాటిని అప్పగించేట్టు కనపడలేదు. అప్పుడవి ఆ నగరం మీదే యుద్ధం ప్రకటించేయి. నువ్వే ఆ పొగరుబోతుల్ని (ప్ర-మదలు) మాకు తెచ్చి అప్పగించు. లేకపోతే యుద్ధం తప్పదు అని హెచ్చరించి తమకు సాయంగా మన్మథుణ్ణి తన సైన్యాలు పంపమని కోరినాయి.

వార్త అందగానే మన్మథసైన్యం చిలకలు, గోరువంకలు, కోకిలలు ఎన్నో పక్షులు తండోపతండాలుగా వచ్చి పడ్డాయి ఆ ఉద్యానాల్లో. ఎక్కడ చూసినా తుమ్మెదలే! ఎక్కడ చూసినా చిలకలే! ఎక్కడ చూసినా గోరువంకలే! ఎక్కడ చూసినా కోయిలలే! దీంతో నగరంలోంచి బైటికి రావాలన్నా బయటున్నుంచి లోనికి వెళ్ళాలన్నా సందులేనంతగా ముసురుకునానయి అవన్నీని.

ఇల్లాంటి ఉద్యానాలతో ఎంతో సందడిగా ఉంది ఆ మధుర. మధురలో మందమారుతం వీస్తోంది. అది మలయ మారుతం. మామూలుగానే కాదు. మలయపర్వతం మీంచి నేరుగా మధురకు వచ్చి అక్కడ సంచరిస్తోంది. అది మలయానిలం కావడంచేత దక్షిణదిక్కున ఉన్న వామనం అనే దిగ్గజ మదవాసనలు దానికి తెలుసు. ఇప్పుడు మధురకు వచ్చేటప్పటికి ఒక దిగ్గజమా! దిగ్గజాల్లాంటి ఎన్నో ఏనుగులు కనిపించేయి. ఈ ఏనుగుల మదవాసనలు ఎల్లా ఉన్నాయో చూడాలని ఓ కుతూహలం కలిగింది. మెల్లగా ఒక్కో ఏనుగూ గండస్థలాలను రాసుకుంటూ రాసాగింది.

అల్లా వస్తూ మేడల్లో ప్రవేశించింది. కిటికీల్లోంచి గదుల్లోకి దూరింది. రతిక్రీడలలో అలసిపోయి చెమటలు పట్టి శయ్యల నున్న కాంతలను చూచి జాలిపడి, అయ్యో! పాపం అనుకొని సుతారంగా వారి చెక్కిళ్ళు నిమిరి ఆ చెమటలు పోగొట్టింది.

ఆ గదుల్లోంచి ఇవతలకు రాగానే చింపి కస్తూరి తీసేసిన కస్తూరి మృగాల బొడ్లతో ఉన్న తోలుసంచులు కనపడ్డాయి. వీటిలో దూరితో వీటికి ప్రాణం వచ్చి కస్తూరి కనక పుడితే ఆ పరిమళాలను మోసుకుపోవచ్చుననుకొని వాటిలో దూరింది.

ఆ తోలుసంచుల్లోంచి ఇవతలకు వచ్చేటప్పటికి ఇళ్ళకొణిగెల మీద ఉన్న నెమళ్ళు కనపడ్డాయి. తన శత్రువులైన పాముల్ని (పాములు గాలిని తింటాయి. అంచేత గాలికి అవి శత్రువులన్నమాట) చీల్చేవి కదా అని ఒకానొక సౌహార్దంతో ఆ నెమళ్ళ కుంచెలు నిమిరింది.

మనం ఊరికే పరుగులెత్తిపోవడం కాదు. మెల్లిగా ఈ ఊళ్ళో ఏమేం ఉన్నాయో అన్నీ బాగా చూసి మరీవెళ్ళాలి అని తొందరపడకుండా మెల్లగా సాగుతోంది. అసలా మారుతం బయలుదేరేప్పుడే తొందర, హడావిడి లేకుండా మెల్లగా అన్నీ చూసుకుంటూ వెళ్ళాలనే తన దిక్కున (వాయవ్య దిశ) ఉన్న పుష్పదంతం అనే దిగ్గజాన్ని ఎక్కిమరీ వచ్చినట్టుంది. గజగమనం తాపీగా సాగుతుంది కదా!

ఇట్లా మలయానిలం ఆ మధురలో ఎప్పుడూ సంచరిస్తూ ఉంటుంది. మత్స్యధ్వజుడు అనే పాండ్యచక్రవర్తి మధురనేలు తున్నాడు. ఆయన సామదానాలు భేదదండాలు అనే ఉపాయాలు బాగా ఎరిగినవాడు. సంధి విగ్రహాదులారింటా బాగా ఆరితేరినవాడు. మలయాచలం ఆయనకు క్రీడాశైలం. మేరుపర్వతం మీద తన బిరుదాన్ని తన రాజలాంఛనమైన మత్స్యాన్ని చెక్కించి అంతదాకా తన ఏలుబడిని సాగించినవాడు. ఏనుగుల్ని గొలుసుల్తో కట్టేసినట్టు మేఘబృందాల్ని వశపరచుకుని తన నగరంలో అట్టే పెట్టుకున్నాడు. అలనాడు శ్రీరామచంద్రుడిలా సముద్రానికి మరో సేతువును నిర్మించిన నేటికాలపు రాఘవుడాయన. తామ్రపర్ణిలో జలకాలాడ్డం

ఆయనకు వినోదం. విభీషణుడు ఆయనకు మంచి మిత్రుడు. అగస్త్యమహర్షి ఆయన రాజ్యంలో ఆశ్రమం నిర్మించుకుని ఎప్పుడూ ఆయనకు మేలుకలగాలని ఆశీస్సులనుగ్రహిస్తూ ఉంటాడు. ఆయన ధనుర్విద్యా ప్రావీణ్యం చూసి దేవేంద్రుడు కూడా ఎప్పుడూ గడగడలాడుతూ ఉంటాడు. మత్స్యధ్వజుడు మంత్రవిద్యలో కూడా మంచిదిట్ట. భూతాల్ని అన్నింటినీ తనవశంలో పెట్టుకొని మరో మహేశ్వరుడిలా ఉంటాడు.

వారిది చంద్రవంశం. నీతితప్పని ప్రభువాయన. ఎట్టి పరిస్థితుల్లోనూ ప్రజలను నొప్పించకుండా వారిని ఒప్పించి వారు నిండుమనసులతో ఇచ్చే కప్పాలనే స్వీకరిస్తాడు. చక్రవర్తి దగ్గర కాస్త చనువుంది కదా అని ఎవరైనా ఎవరిమీదైనా కొండేలు చెప్పినా ఆ మాటలు విని అదే పట్టుకుని ముందు వెనుకలు చూడకుండా ఎవరికీ హానితలపెట్టడు. ఎవరైనా తనను పొగిడినా అవి సత్యాలే అయినా అహంకరించడు. మొగ మాటమితో తలవంచుకుంటాడు. తానెంత శూరుడు కానీండి అవతలవాడిలో పిరికితనం కనిపించినంత మాత్రాన వాడిని నిందించడు.

మలయపర్వతారణ్యాల్లో విహారాలు చేస్తాడాయన. అయినా అహిభయం ఆవంతైనా ఆయనకు లేదు. అహిభయమంటే పాములభయం. అదెరగడు. చందనపు అడవుల్లో పాములుంటాయని ప్రతీతి. అట్లాంటి అడవుల్లో తిరిగినా పాములభయం ఆయనకు లేకపోవడం ఎట్లా? అంటే, రాజులకు స్వపక్షంనుంచి వచ్చే భయాన్ని 'అహిభయం' అంటారు. అంటే, ఆయనకు పరపక్షభయం ఎల్లాగూ లేదు. స్వపక్షభయం కూడా లేనివాడు. ఇంటిపోరు ఇంతా అంతా కాదుకదా!

చాలా మితభాషి. పొగడ్తలు గిట్టనివాడు. మితభాషే అయినా శత్రువులను పరిహాసప్రసంగాలతో తూట్లు పొడవడంలో దిట్టే సుమండీ! పాండ్యదేశంలో తామ్రపర్ణి ఉంది కదా! అంచేత, ఆయన తామ్రపర్ణికి నాథుడు. తామ్రపర్ణి అని ఓ ఆడదిగ్గజం. దానికి భర్త. ఏనుగుకు భర్త కనుక ఈయనా ఏనుగే! ఏనుగుల స్వభావం ఎప్పుడూ దుమ్మూ, ధూళీ పట్టి మలినంగా ఉండడం. ఈయనకు ఎలాంటి మాలిన్యాలూ లేవు. ఎంచేత? ఎప్పుడూ సజ్జనగోష్ఠులతోనే పొద్దుపుచ్చుతూన్నందు వల్ల వారి మంచిమాటలు వినివినీ, వారి సచ్చరిత్రను చూసి చూసీ తానూ అల్లాగే ఉంటాడు.

మాధుర్యానికి నెలవైనవాడు. అయినా లావణ్యంతో ఉల్లాసంగా ఉంటాడు. ఇదెల్లా కుదురుతుంది? మాధుర్యమంటే తియ్యదనం, లావణ్యమంటే ఉప్పదనమూనూ. ఈ రెండూ ఓ దగ్గిరెల్లా ఉంటాయి? మధుర ఆయనకు రాజధాని. అంచేత ఆయన మాధుర్యానికి తావు. మంచి శరీరలావణ్యం అంటే, ఒంటి తళుకు బెళుకులు కలవాడు.

పరబలాల్ని చీల్చిచెండాడేవాడు. ఈ చెండాట్టమూ చమత్కారంగా ఉంటుంది. శత్రుసైన్యం ఓ పెద్ద సముద్రం. సముద్రంలో తిమి అని ఒక రకం చేప ఉంటుంది. ఇది చాలా పెద్దది. ఈ తిమి తోక ఓ కత్తి అనుకోండి. సముద్రంలో కెరటాలు ఏనుగుల్లా ఉన్నాయి. కెరటాల విరుపులు ఏనుగుల కుంభస్థలాలు. తిమితోకతో అలలని కొడుతూంటుంది. ఇది కత్తితో ఏనుగుల్ని కొట్టడంలా ఉంది. కత్తితో ఏనుగు కుంభస్థలాన్ని కొట్టేటప్పటికి ఆ కుంభస్థలం పగిలి దానిలో ఉన్న ముత్యాలు కిందికి రాల్తాయి కదా! తిమి తోక దెబ్బకు కెరటాల వంపులమీంచి నీటి తుంపరలులేవడం ఈ ముత్యాలు రాలడం. మత్స్యధ్వజుడు కత్తి పుచ్చుకు శత్రుసైన్యంలోకురికి గజసైన్యాన్ని చీల్చి చెండాట్టం సముద్రంలో తిమి ఉత్సాహంతో కోపంతో రెచ్చిపోయి తోకతో కెరటాలను నుగ్గునుగ్గు చెయ్యడంలా ఉంటుందన్నమాట. (సశేషం)

శ్రీరామచంద్రాచార్య



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



మార్చి 1వ తేది శ్రీస్వామివారు మధ్యాహ్నం సీతానగరం నుండి బయల్దేరి రాత్రి గం.10.00లకు నెల్లూరుజిల్లా ఈదగాలి గ్రామం చేరుకొని శ్రీమాన్ శ్యాంసుందర్‌రెడ్డిగారి గృహంలో బస చేశారు.

2వ తేది ఉదయం తీర్థగోష్ఠి ముగించుకొని, శ్రీమాన్ వెంకట్రాంరెడ్డి మరియు శ్రీమాన్ సుధాకర్‌రెడ్డిగారి ఆహ్వానంపై శ్రీస్వామివారు ఇసుకపాలెంలోని కోదండరామాలయాన్ని సందర్శించి మంగళాశాసనం చేశారు. మధ్యాహ్నం 12.30లకు తమ్మినిపట్నం చేరుకొని పురాతనమైన చెన్నకేశవస్వామి ఆలయాన్ని సందర్శించారు.

శ్రీమాన్ జానకిరెడ్డిగారి ఆహ్వానంపై వరగలి గ్రామంలోని శ్రీకోదండరామస్వామి ఆలయాన్ని సందర్శించారు. మధ్యాహ్నం వోమిడిగ్రామంలో శ్రీమాన్ శ్రీనివాసరెడ్డి కుమారులైన సంపత్కుమారరెడ్డి గృహానికి వేంచేసి మంగళాశాసనాలు చేశారు. 3.00లకు కలువకొండలోని ప్రాచీన నృసింహ ఆలయం సందర్శించారు. అక్కడ చేరిన భక్తులను ఉద్దేశించి ప్రవచిస్తూ, ప్రాచీన సంస్కృతిని, చరిత్రను కాపాడుకోవాలని, శిథిలావస్థలో ఉన్న ఆలయాన్ని పునరుద్ధరించడం మన కర్తవ్యం అని ఉద్బోధించారు.

సాయంత్రం 5గం॥ కేడిమాల ఆంజనేయస్వామి ఆలయాన్ని, శివాలయాన్ని కూడా సందర్శించి మంగళా శాసనం చేశారు. 6గం॥ శ్రీమాన్ వేమారెడ్డి, శ్రీమాన్ కుమార్‌రెడ్డి ఆహ్వానంపై చవటమాల వేంచేసి మంగళాశాసనా లనుగ్రహించారు. రాత్రి 7॥లకు శ్రీస్వామివారు గొలుగుమూడి వేంచేసి తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్న శ్రీమాన్ బాలసుబ్రహ్మణ్యంగారిని పరామర్శించారు. రాత్రి 8॥లకు శ్రీమాన్ నారాయణగారి ఆహ్వానంపై నెల్లూరులోని శ్రీ వేంకటేశ్వర ఆలయాన్ని రా. 11గం॥లకు సోమశిల ఆశ్రమం చేరుకున్నారు.

మరునాడు ఉదయం శ్రీస్వామివారు సోమశిల ఆశ్రమంలో ఆరాధనాదులు ముగించుకుని కలువాయి గ్రామం వేంచేసి, నూతనంగా నిర్మిస్తున్న శ్రీ నృసింహ ఆలయాన్ని దర్శించి తగు సూచనలందించారు.

సాయంకాలం శ్రీమాన్ బొమ్మారెడ్డి రాఘవేందర్‌రెడ్డిగారి ఆహ్వానంపై నెల్లూరుజిల్లా ఆత్మకూరులోని వారి గృహానికి వేంచేశారు. అక్కడ నూతనంగా నిర్మించిన వేంకటేశ్వరస్వామి ఆలయాన్ని సందర్శించారు. గం.7.30కు శ్రీస్వామివారు జూనియర్ కళాశాల మైదానంలో భక్తులకు మంగళాశాసన ప్రవచనాన్ని అనుగ్రహించారు.

4వతేది ఉదయం గం.5.30కు ఆత్మకూరు, శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయ కుంభాభిషేకం, కలశ స్థాపన, ప్రతిష్ఠా మహోత్సవములు శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో అంగరంగ వైభవంగా జరిగినవి. అదేరోజు శ్రీమనవాళ మహాముని తిరునక్షత్రం కావటం విశేషం. ఉ॥ 11.30కు బయల్దేరి సాయంకాలానికి జీవా – శ్రీరాంనగర్ చేరుకున్నారు.

5వ తేది హైదరాబాద్, ఇ.ఎస్.ఐ. విజయలక్ష్మి దేవాలయం, సహస్ర కలశాభిషేకం ప్రారంభించారు.

6వ తేది అల్లంపల్లి

శ్రీస్వామివారు మార్చి 7,8 తేదీలు జీవా – శ్రీరాంగనర్‌లో వేంచేసి వున్నారు.

9వ తేది సాయంకాలము శ్రీశ్రీశ్రీ స్వామివారు పంచాంగ కర్త శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతిగారి ఆహ్వానంపై జనగామ పట్టణానికి వేంచేశారు.

వారు నిర్వహిస్తున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయంలో జరిగే విశేష ఉత్సవాల్లో పాల్గొన్నారు. ఇందులో భాగంగా 10వతేది ఉదయం శ్రీశ్రీశ్రీ స్వామివారి కరకమలముల మీదుగా ఆళ్వార్, ఆచార్యుల మరియు హనుమత్ విగ్రహ ప్రతిష్ఠా మహోత్సవం జరిగింది.

సాయంకాలం శ్రీశ్రీశ్రీ స్వామివారు శ్రీమతి రమాదేవి అశోక్, శ్రీమతి రాజశ్రీ త్రివిక్రమ్ గార్ల ఆహ్వానంపై వారిచే నిర్వహింపబడుచున్న నవభారత్ ఫెర్రో ఇండస్ట్రీస్ ప్రాంగణం లోని శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఆలయ 25వ అనగా రజతోత్సవ బ్రహ్మోత్సవాల్లో పాల్గొనడానికి పాల్వంచ పట్టణానికి విచ్చేశారు.

11వ తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం ఆలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి కళ్యాణం శ్రీస్వామివారి ప్రత్యక్ష

పర్యవేక్షణలో అంగరంగ వైభవంగా జరిగింది. ఈ సందర్భంగా శ్రీస్వామివారు వజ్రోత్సవ సంచికను ఆవిష్కరించారు. సాయంకాలం శ్రీస్వామివారు నవభారత్ వారు విజయవంతంగా మరియు స్వచ్ఛందంగా నిర్వహించే నేత్ర వైద్య విజ్ఞానసంస్థను, వృత్తివిద్యా సంస్థలను సమీక్షించి వారి కృషిని శ్లాఘించారు. అనంతరం సామూహిక శ్రీ లక్ష్మీనారాయణ పూజా కార్యక్రమాన్ని నవభారత్ ఫెర్రో భక్తగోష్ఠిచే విధివిధానంగా చేయించారు. ఈ సందర్భంగా అక్కడి చిన్నారులు నృత్యాన్ని ప్రదర్శించి అందరిని అలరించి శ్రీవారి మంగళాశాసనాలు అందుకున్నారు.

12వ తేది ఆలయ బ్రహ్మోత్సవాల్లో భాగంగా జరిగే మహాపూర్ణాహుతి అనంతరం నవభారత్ యాజమాన్యానికి, సిబ్బందికి మంగళాశాసనాలందించి శ్రీస్వామివారు భద్రాచలానికి బయల్దేరారు.

మధ్యాహ్నం భద్రాద్రి శ్రీసీతారామచంద్రస్వామివారిని సేవించుకున్నారు. అనంతరం నిర్మాణంలో ఉన్న జీయర్ మఠానికి వేంచేసి నిర్మాణపు పనులను సమీక్షించారు. రాత్రికి సీతానగరం చేరుకున్నారు.

13వతేదీ సీతానగరంలో వేంచేసి ఉన్నారు.

14వ తేదీ ఉదయం శ్రీస్వామివారు గం.6లకు శ్రీమతి లక్ష్మీకిశోర్ దంపతుల ఆహ్వానంపై విజయవాడలో వారు నూతనంగా నిర్మించదలచిన షాపింగ్‌మాల్ శంకుస్థాపన కావించారు. అనంతరం గం.10.00లకు విమానంలో హైదరాబాద్ వేంచేశారు. జీవా, శ్రీరాంనగర్ వేంచేసి జీవాని పర్యవేక్షిస్తున్న శ్రీమాన్ కంప్యూటర్ కృష్ణమాచార్యస్వామివారి తండ్రిగారైన కీ.శే. శ్రీమాన్ తూపురాణి రంగాచార్యులుగారి పరమపదోత్సవాన్ని విధివిధానంగా జరిపించారు.

15వ తేదీ రాత్రికి శ్రీస్వామివారు జీవా చైర్మన్ మరియు మైహోమ్ గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్ అధినేత శ్రీమాన్ డా॥ జూపల్లి రామేశ్వరరావుగారు, వారి కుటుంబ సభ్యుల ఆహ్వానంపై శ్రీకళ్యాణ వేంకటేశ్వరస్వామి 14వ బ్రహ్మోత్సవాల్లో పాల్గొనడానికి మేళ్ళచెరువు సమీపంలోని మహాసిమెంట్స్ ప్రాంగణానికి విచ్చేశారు. శ్రీస్వామివారితో పాటు ఈ కార్యక్రమంలో పాల్గొనడానికి శ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు కూడా విచ్చేశారు.

16వ తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీ భూ సమేత శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామివారి కళ్యాణం శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో అత్యంత వైభవంగా జరిగింది. ఈ సందర్భంగా శ్రీస్వామివారు శ్రీ నందననామ సంవత్సర క్యాలెండర్ – పంచాంగం (2012–2013ను ఆవిష్కరించారు.

దీనిని రచించిన సిద్ధాంతకర్త శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్యులను, దీనిని సకాలంలో అందంగా ముద్రించి అందించిన శ్రీమాన్ గుదిమెళ్ళ రఘునాథాచార్యులను సమ్మానించారు.

సాయంకాలం శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో పెరుమాళ్ళ గరుడ వాహనసేవ అంగరంగ వైభవంగా జరిగినది.

17వ తేదీ ఉదయం 11.30కు మహాసిమెంట్స్ వారు నూతనంగా అధునాతన సౌకర్యాలతో నిర్మించిన అతిథిగృహాన్ని శ్రీస్వామివారు ప్రారంభించారు. అనంతరం సిమెంట్‌ని ఇతర రాష్ట్రాలకు వేగంగా పంపిణీ చేయడానికి నిర్మించిన రైల్వేట్రాక్‌ని లోకోమోటివ్ రైలును ప్రారంభించారు. అటు పిమ్మట డిగ్రేడెబుల్ బయో ప్రోడక్ట్స్‌తో విద్యుత్తును ఉత్పత్తి చేసి ఆల్టర్నేటివ్ పవర్ ప్రాజెక్టును, అధిక మోగా వాట్స్ విద్యుత్తును ఉత్పత్తి చేసి పవర్ ప్రాజెక్ట్‌ను ప్రారంభించారు. ఆ తర్వాత కాలనీవాసులు కలిసి ఉత్సవాలను జరుపుకోవడానికి వీలుగా నిర్మించిన కమ్యూనిటీ కమ్ రిక్రియేషన్ సెంటర్‌ను, వాటర్ ఫౌంటేన్‌ను ప్రారంభించారు. చివరగా శ్రీస్వామివారు మరియు జూపల్లి కుటుంబ సభ్యులందరూ స్కూల్ ఆవరణలో మొక్కలను నాటి, కాలనీవాసులందరికీ వివిధ ఫల, పూలమొక్కలను పంపిణీచేశారు. శ్రీస్వామివారు అందరికీ మంగళాశాసనాలు కృషి చేసి సాయంత్రం గం.5.00లకు మహాసిమెంట్స్ నుండి బయల్దేరి రాత్రికి జీవా శ్రీరాంనగర్ చేరుకున్నారు.

18వ తేది ఉదయం శ్రీస్వామివారు శ్రీ వైష్ణవసేవా సంఘం వారి ఆహ్వానం మేరకు ఎల్.బి.నగర్ హైదరాబాద్‌లోని చంద్రపురి కాలనీకి వచ్చేశారు. ఈ సంఘం వారునూతనంగా నిర్మించిన శ్రీ వైష్ణవ సదనమును ప్రారంభించి మంగళా శాసనాలు కృపచేశారు. ఈ కార్యక్రమానికి శ్రీరామచంద్రజీయర్ స్వామివారు, శ్రీ వ్రతజీయర్ స్వామివారు, శ్రీ కృష్ణ శరణ్య జీయర్ స్వామివారు, శ్రీ అహోబిల జీయర్ స్వామివారు, శ్రీమాన్ రమణాచార్యులు I.A.S కూడా విచ్చేశారు.

శ్రీస్వామివారు మధ్యాహ్నం జీవా – శ్రీరాంనగర్ విచ్చేసి వెంటనే కర్నూలు జిల్లా ఆత్మకూరు, శ్రీ వేంకటేశ్వరస్వామివారి పుష్కరోత్సవాలలో పాల్గొని సాయంత్రానికి జీవా – శ్రీరాంనగర్ చేరుకున్నారు.

ఆత్మకూరులో శ్రీ వేంకటేశ్వరస్వామివారి పుష్కరోత్సవా లలో పాల్గొని సాయంత్రానికి జీవా–శ్రీరాంనగర్ చేరుకున్నారు.

21వ తేది ఉదయం శ్రీస్వామివారు బద్రుకా కుటుంబ సభ్యుల ఆహ్వానం మేరకు కాచిగూడ– హైదరాబాద్‌లో బద్రుకా ఎడ్యుకేషనల్ సొసైటీ ద్వారా నిర్వహిస్తున్న బద్రుకా కళాశాలకు విచ్చేశారు. ముందుగా ఈ సంస్థను స్థాపించిన కీ.శే. శ్రీమాన్ బంకట్ లాల్ బద్రుకా విగ్రహాన్ని ఆవిష్కరించారు. అనంతరం కాన్ఫరెన్స్‌హాల్‌కి విచ్చేసి బద్రుకా కుటుంబ సభ్యులందరికీ మంగళాశాసనాలందించారు. అటు పిమ్మట కళాశాల ఆడిటోరియంలో సెక్రటరీ & కరెస్పాండెంట్ శ్రీమాన్ హరిప్రసాద్‌గారు బద్రుకా శ్రీస్వామివారికి పాదపూజచేశారు. అనంతరం శ్రీస్వామివారు బద్రుకా పరివారానికి, కళాశాల సిబ్బందికి చక్కటి సందేశాన్నందించారు. కీ.శే. శ్రీమాన్ బంకట్లాల్ బద్రుకాగారి ఆదర్శవంతమైన జీవన విధానాన్ని కొనియాడారు. ఈ సందర్భంగా బద్రుకా సంస్థ 60వ సంచికను శ్రీస్వామివారు ఆవిష్కరించారు.

మధ్యాహ్నం శ్రీస్వామివారు హైదరాబాద్‌లోని శాలివాహన నగర్‌లోని హనుమత్ ఆలయాన్ని దర్శించి, భక్తుల అభ్యర్థనపై 289వ, శాఖగా వికాసతరంగిణిని, మరియు కార్యాలయాన్ని ప్రారంభించారు. శ్రీస్వామివారు శ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు వారియొక్క సేవానిరతికి మంగళా శాసనాలు చేశారు. దీనికి కారకులైన శ్రీమాన్ కాటూరి శ్రీనివాసాచార్యులు బృందానికి మంగళాశాసనం చేశారు. ఆ ప్రాంత కార్పోరేటర్ శ్రీమాన్ అస్లాంగారు కులమతాలకతీతంగా వారు చేస్తున్న సామాజిక, ఆధ్యాత్మిక సేవాకార్యక్రమాలను కొనియాడారు.

22వ తేది మధ్యాహ్నం కరీంనగర్ వేంచేసి శ్రీమాన్ ప్రసాద్‌రావుగారి IRS School నూతన భవనాన్ని ప్రారంభించి, మంగళాశాసనాలు చేశారు.

23వ తేదీ నుండి ఏప్రియల్ 3వ తేదీ వరకు దివ్యసాకేతంలో జరిగే ఉగాది మరియు శ్రీరామనవమి ఉత్సవాలలో వేంచేసి ఉన్నారు.

ఉగాది ఉదయం పెరుమాళ్ళ తిరుమంజనం తరువాత శ్రీశ్రీశ్రీ స్వామివారు పంచాంగ శ్రవణం చేయించారు. మన ఆస్థాన జ్యోతిష్కులు, వేదపండితులు, శ్రీమాన్ గోవర్ధనాచార్యులుగారు పంచాంగ పఠనం కావించగా శ్రీస్వామివారు ఫలితాలను వివరించి మంగళాశాసనాలు చేశారు.

శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా॥ సముద్రాల రంగరామానుజాచార్య స్వామివారు మంగళాశాసనాలు కావించారు. తీర్థగోష్ఠి అనంతరం శ్రీరామాయణంలో సుందరకాండ పారాయణని శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు ఉపదేశాత్మకంగా ప్రారభించి శ్రీరామనవమి ప్రారంభించారు.

## మెదడుకి మేత! సమాధానములు

1. శ్రీమన్నారాయణుని శరీరంలో, 2. నా పార్శదత్వము, 3. శివరూపము, 4. నిరాహార(ఆమరణ) దీక్షా, ప్రాయోపవేశం, 5. మాల్యవంతుడు, 6. సర్వేశ్వరుడు, 7. భక్తులకు కావలసినవి లేనివి తెచ్చివ్వడం యోగం, ఉన్న భోగములను పోకుండా రక్షించడం క్షేమం, 8. మార్గశిర మాసం, 9. ధర్మ, ప్రేమ, సాహసం, క్షమ, 10. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు, 11. అనంతార్యులపై ప్రీతికి తీపి గుర్తు, 12. జీవులలో ఉండే సంవేదనే, 13. ప్రేమాతిశయం, ఉన్మాదులను, 14. దూరం చెయ్యి, అజ్ఞానాన్ని, 15. గోవిందరాజులు, 16. పురుషుడు, స్త్రీ, 17. మొండిగోపురం, 18. పులస్త్య బ్రహ్మకు, కుబేరునికి, 19. సర్వం శ్రీ కృష్ణార్పణమస్తు, 20. సమానం అన్న, 21. ఆనందింపజేసేవాడు, 22. వీణ, 23. శేషధర్మము, 24. అనుకున్నవి జరుగకపోవడం, అనుకొనివి జరుగటం, 25. మోక్షసాధనకు అనువైన ఉపాయం.

# నడిగడ్డపాలెం బ్రహ్మోత్సవ విశేషాలు

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి ప్రత్యక్ష ప్రారంభ దివ్య మంగళా శాసనములతో శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారి ప్రత్యక్షపర్యవేక్షణలో, గుంటూరుజిల్లా, చుండూరు మండలం, నడిగడ్డపాలెం, శ్రీ వాసుదాసాశ్రమములో వేంచేసి యున్న శ్రీ లక్ష్మీనారాయణ - శ్రీ కోదండరామస్వామి వార్ల (12వ) పుష్కర బ్రహ్మోత్సవములు ది. 02.03.2012 నుండి 09.03.2012 వరకు అత్యంత వైభవంగా జరిగాయి.

మార్చి 1వ తేదీ గురువారం శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు ప్రత్యక్షంగా పాల్గొని ఈ ఉత్సవాలను ప్రారంభించినారు.

శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారు ప్రత్యక్షముగా పాల్గొనుట వలన ఈ పుష్కర బ్రహ్మోత్సవాలకు ప్రత్యేకత సంతరించుకున్నది.

ఈ బ్రహ్మోత్సవములో ప్రతిరోజూ ఉదయం శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి తీర్థగోష్టితో ప్రారంభమై, ఉదయం వాహనసేవ, లక్షమల్లెలతో అమ్మకు సమష్టి పూజలు, యాగశాలలో వివిధ ఇష్టి కార్యక్రమాలు నిత్యపూర్ణాహుతి తదీయారాధన, సాయంత్రం శ్రీ విష్ణు సహస్ర నామ పారాయణ, వేదపండితుల ప్రవచనం, శ్రీ లక్ష్మీ తాయార్లుకు సహస్ర దీపాలతోఊయలసేవ, శ్రీస్వామివారి అనుగ్రహ భాషణ, సాంస్కృతిక కార్యక్రమాలు రాత్రి వాహన సేవ తదీయారాధనలతో ప్రతిరోజూ విశేషంగా జరిగినవి.

7వ తేదీ సీతారామకళ్యాణం, 8వ తేదీ ఉదయం రథోత్సం, మహాపూర్ణాహుతి, 9వ తేదీ శ్రీ లక్ష్మీ అమ్మవారి తిరునక్షత్రం సందర్భముగా 108 కలశములతో క్షీరాభిషేకం, 108 భక్తులతో సమష్టి మల్లెల పుష్పార్చన, శ్రీ లక్ష్మీనారాయణుల శాంతి కళ్యాణముతో పై కార్యక్రమాలు పరిపూర్ణమైనవి.

పై కార్యక్రమమునకు గుంటూరు జిల్లా కార్యదర్శి శ్రీ కొత్తూరు శ్రీనివాసరావు, పొన్నూరు వికాసతరంగిణి కార్యదర్శి శ్రీ ఆలపాటి కనకలత, ప్రచార రథాన్ని ఏర్పాటు చేసికొని జిల్లాలో 25 రోజులు 150 గ్రామాలలో ప్రచారం చేసినారు.

ఈ కార్యక్రమానికి శ్రీమాన్ ఉత్పల నరసింహాచార్యులు, శ్రీమాన్ శేషాచార్యుస్వామివారి నేతృత్వంలో, శ్రీమాన్ గుదిమెళ్ళ బదరీనాథ్, శ్రీమాన్ గుదిమెళ్ళ కూర్మనాథ్, శ్రీమాన్ రఘునాథ్ గార్ల పర్యవేక్షణలో జరిగినది.

గుంటూరు వాస్తవ్యులు శ్రీమాన్ అక్కిశెట్టి బాబూరావుగారి పాలకైంకర్యం, పెదవడ్లపూడి శాఖవారు మల్లెపూల కైంకర్యం, బాపట్లశాఖవారు కైంకర్యం చేసినారు. వీరందరితోపాటు వేకనూరు శాఖ, గుంటూరు మహానగర్ శాఖ, పొన్నూరు శాఖ, మంగళగిరిశాఖ, జిల్లాలోని వివిధ శాఖలవారు తమయొక్క సేవలను అందించిన భగవద్బంధువులందరికీ శ్రీస్వామివారి మంగళాశాననములు కృపచేశారు.







# పరమపదము





విజయనగరం వాస్తవ్యులు **శ్రీమతి ఇనుగంటి చిట్టెమ్మగారు** ది. **31.01.2012**న పరమపదం చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనం చేశారు.



సూర్యాపేట వాస్తవ్యులు, శ్రీస్వామివారి శిష్యులు **శ్రీమాన్ సోమవరపు కృష్ణమూర్తి ది. 30.12.2011**న పరమపదం చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో శాశ్వతకైంకర్యం లభించాలని శ్రీస్వామి వారు మంగళాశాసనం చేశారు.



వరంగల్ జిల్లా, హన్మకొండ వాస్తవ్యులు, శ్రీస్వామివారి శిష్యులైన **శ్రీమాన్ కుందూరు నర్సింహారెడ్డి ది. 05.01.2012**న పరమపదం చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.



ఖమ్మంజిల్లా, కొణిజర్ల గ్రామవాస్తవ్యురాలు, శ్రీస్వామివారి శిష్యురాలు, వికాసతరంగిణి సభ్యురాలైన **శ్రీమతి జట్ల రత్తమ్మగారు ది. 27.8.2011** ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.



ఖమ్మం వాస్తవ్యులు, శ్రీ పెద్దజీయరు స్వామివారి శిష్యులు **శ్రీమాన్ ముడుంబ వేంకట రామానుజాచార్యులుగారు** ది. **14.02.2012**న పరమపదం చేరినారు. వీరికి పరమపదంలో శాశ్వత కైంకర్యం లభించాలని, శ్రీస్వామివారు మంగళా శాసనములు చేశారు.



శ్రీకాకుళం జిల్లా వాస్తవ్యులు, శ్రీస్వామి వారి శిష్యురాలు **శ్రీమతి దామెర చంటమ్మ ది. 15.11.2011** ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.



కృష్ణాజిల్లా, చవటపాలెం వాస్తవ్యులు శ్రీస్వామివారి శిష్యులు **శ్రీమాన్ లంకపల్లి వెంకటరామయ్య** ది. **20.02.2012**న పరమ పదం చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.

నల్గొండ జిల్లా, కోదాడ వాస్తవ్యురాలు **శ్రీమతి నల్లాన్ చక్రవర్తుల ఆండాళమ్మగారు** ది. **07.10.2011**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.



వరంగల్ జిల్లా, కూనూరు వాస్తవ్యులు శ్రీస్వామివారి శిష్యులు **శ్రీమాన్ నెల్లుట్ల బలరామారావు** ది. **17.02.2012**న పరమ పదం చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.



సూర్యాపేట వాస్తవ్యులు **వెలగపూడి వెంకటేశ్వరరావు 10వ వర్ధంతి సందర్భంగా** రాణి భ్రమరాంబగారు భక్తినివేదనకు కైంకర్యం సమర్పించినారు. వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారి మంగళాశాసనములు తెలియచేస్తున్నాం.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన అక్టోబరు నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. ఆత్మారాములు ఎవరెవరు? | |
| 2. 'ఆత్మ' శబ్దానికి ఏయే అర్థాలున్నాయి? | |
| 3. మానవుల మేనికి అసలు అలంకారం? | |
| 4. గిరీంద్రజ అంటే ఎవరు ? | |
| 6. అభిజ్ఞాన మనగా ఏమి? శాకుంతలంలో అది ఏది? | |
| 7. కావ్యపఠనం కలిగించే ప్రయోజనాలేవి? | |
| 8. నమ్మాళ్వార్లు దౌత్యమడిగిన పక్షులు..... | |
| 9. యజ్ఞాలుచేసేవారే ఐనా శ్రీకృష్ణుని......గ గుర్తింపలేక పోయారు. | |
| 10. మానవుని మిగిలిన ప్రాణుల నుండి వేరు చేసే యోగ్యత... | |
| 12. తప్పిపోయిన జీవుని కథ ......ఉపనిషత్...భాగంలోనిది. | |
| 13. ఒక్క వరంతో మూడు జన్మల్లో భగవంతునికన్న అదృష్టవంతులు ....... | |
| 14. తమిళంలో "అమ్మా" అంటే మనకి ............... | |
| 15. శ్రీపెద్దస్వామివారు చేసిన కార్యాలు వారిలోని.....గుణాలకి నిదర్శనాలు. | |
| 16. తాను మానవుడనేనని శ్రీరాముడు అన్న మాట........... | |
| 17. దేహానికి జ్ఞానం ఉందని వాదించేవారు............. | |
| 18. పారాణిలో ఎర్రదనం.......... కలిస్తే వచ్చింది. | |
| 19. ఆధులనగా.............. | |
| 20. అదృష్టమంటే.................. | |
| 21. భగవద్గీత 10వ అధ్యాయం పేరు ............... | |
| 22. ధర్మమంటే ....... కలపోతగ సిద్ధించేది. | |
| 23. "ప్రమదలు" అని వీరిని కూడా అన్నారు. | |
| 24. వాయువుని భక్షించేవి............. | |
| 25. ......సాక్షాత్తు ఆదిశేషుని అవతారం! | |

**గతనెల విజేతలు :** 1. శ్రీమతి జయలక్ష్మి, చెన్నై, 2. శ్రీమతి రాగిణీ మకరంద. అనంతపురం.

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్టు పంపగలరు.
**భక్తినివేదన** శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః



64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



శ్రీ నందన నామ సంవత్సరం వైశాఖమాసం


సంపుటి 65 మే

సంచిక 2 2012


## పండుగలు

మే

6. అన్నమాచార్య జయంతి
7. అవమతిథి
11. కృత్తిక కార్తె, అగ్నికర్తరీ
14. వృషభ సంక్రమణము రా 6.57
15. హనుమజ్జయంతి
16. సర్వేషామేకాదశి
17. నర్మదానది పుష్కరారంభం
19. మాసశివరాత్రి
20. శనిజయంతి, అమావాస్య పిండపితృయజ్ఞము
21. త్రిద్యుస్పృక్
22. తిరుక్కోటి యూర్నంబి తిరు ॥
24. అగ్నికర్తరీ త్యాగము, రోహిణీ కార్తె
28. వాస్తు కర్తరీ త్యాగము
29. గురుమౌఢ్య నివృత్తి
30. అవమతిథి
31. స్మార్త ఏకాదశి, నిర్జలేకాదశి, ఏకాదశి గురువారవ్రతం.

జూన్ :

1. వైష్ణవానామేకాదశి, రామలక్ష్మణ ద్వాదశి, కూర్మజయంతి. శుక్రమౌఢ్యారంభం
2. శనిత్రయోదశి, అళకియ సింగర్ తిరు॥
3. నమ్మాళ్వార్ తిరు ॥
4. పరాశర భట్టర్ తిరు ॥
5. తిథి ద్వయం, తిరువరంగప్పెరుమాళ్ తిరు ॥
7. మృగశిరకార్తె

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

**శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు**

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-

D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రొసెసర్స్, సీతానగరం





మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*గత సంచిక తరువాయి...*

## (ప్రథమస్కంధం – ఏడవ అధ్యాయం)

సూతుడు చెబుతున్నాడు శ్రీహరి కల్యాణగుణాలచే ఆకృష్టమైన మనస్సుకల బాదరాయణి (శుకుడు) నిత్యము విష్ణు జనులకు ప్రీతికరుడై గొప్ప ఆఖ్యానాన్ని ఆవిష్కరించాడు.

పరీక్షిత్తు పుట్టడం, ఆతను చేసిన కలినిగ్రహాది కృత్యం, ఆతడు తక్షక దంశన వ్యాజంతో దేహత్యాగం చేయడం ఇవన్నీ చెప్పాడు. అంతేకాదు, శ్రీకృష్ణబలంచేత పాండవులు స్వర్గారోహణాదులు చేయడం, ఇలాగే శ్రీకృష్ణ వైభవ ప్రకాశకాలైన గాథలను మనోజ్ఞంగా ఆవిష్కరించాడు.

మహాభారతయుద్ధంలో కౌరవవంశీయులు, అలాగే సృంజయ వంశీయులైన ధృష్టద్యుమ్నాదులు వీరగతిని పొందిన తరువాత, భీముని గదాభిఘాతానికి తొడలు విరిగిన దుర్యోధనుడు నేలకూలగా, తన ప్రభువుకు కల్గిన దుర్దశకు ప్రతీకారం చేయాలనే క్రోధ కలుషిత చిత్తంతో ద్రోణపుత్రుడైన అశ్వత్థామ ద్రౌపదీపుత్రుల శిరస్సులను ఛేదించాడు. ఇలా అశ్వత్థామ చేసిన ఈ కృత్యాన్ని పరమ విగర్హితమని అందరూ భావిస్తారు. తల్లి ద్రౌపది, తన పుత్రుల ఘోరమరణాన్ని విని శోకాకుల అయింది. అపారమైన దుఃఖాన్ని అనుభవించింది. శ్రీకృష్ణస్వామి, ప్రియుడైన అర్జునుడు ఆమెను సాంత్వన పరుస్తూ అన్నాడు.

**తథాశుచస్తే విమృజామి భద్రే**
**యద్బ్రహ్మబంధోః శిర ఆతతాయినః ।**
**గాండముక్తై ర్విశిఖై రుపాహరేః**
**త్వాక్రమ్యయత్ స్థాస్యసి దగ్ధపుత్రా ॥**

ఓ ప్రియురాలా! ద్రౌపదీ! బ్రాహ్మణాధముడైన ఆ అశ్వత్థామను నా గాండీవం నుండి విడచిన బాణాలతో శిరః ఖండనం చేసి, వధించి, నీ కన్నీటిని తుడుస్తాను. ఆ దుర్మార్గుడు **'ఆతతాయి'** అయిన అశ్వత్థామ శిరస్సును ఆక్రమించి దగ్ధపుత్రవైన నీవు కూర్చుండగలవు" అని ఊరడించాడు.

అశ్వత్థామ బ్రాహ్మణుడు కదా! అతని హననం బ్రహ్మహనన దోషాన్ని కలిగింపదా? అనే శంకను వారించడానికి **"ఆతతాయినః"** అన్నాడు అర్జునుడు.

**ఆతతాయి అంటే:** నిప్పు పెట్టేవాడు, విషం పెట్టేవాడు, ఇతరులను చంపడానికే శస్త్రాన్ని చేతపట్టినవాడు, ధనాన్ని అపహరించేవాడు, ఇతరుల పొలాన్ని ఆక్రమించేవాడు, పరుల భార్యలను అపహరించేవాడు ఇలా ఆరు ఘోరదోషాలు చేసేవాడు. ఇలాంటివాడు అగుపిస్తే వెంటనే చంపమని ధర్మశాస్త్రకారులు చెబుతున్నారు.

**అగ్నిదోహరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః ।**
**క్షేత్రదారహరశ్చైవ షడేతే హ్యాతతాయినః ॥** అని.

ఆరురకాల పాపాలు చేసేవారిని ఆతతాయులు అన్నారు. **ఆతతాయిన మాయాన్తం హన్యాదేవా విచారితం** అని శాస్త్రనిష్కర్ష. కనుక నిదురించే బాలకులను హననం చేసినవాడు కూడా **'శస్త్రపాణి'**గా దోషియై ఆతతాయి కనుక ఆతనిని వధించడం తప్పుకాదని అర్జునుని భావన.

ఇలా తన ప్రియురాలైన ద్రౌపదిని సాంత్వన పరిచాడు "అచ్యుత మిత్రసుతు"డైన అర్జునుడు. (అచ్యుతుడే మిత్రునిగా సూతునిగా అంటే రథసారథిగాకల అర్జునుడు) ఉగ్రమైన గాండీవాన్ని ధరించి, గురుపుత్రుడైన అశ్వత్థామను వెదకడానికై రథంపై బయల్వెడలాడు కపిధ్వజుడు. రథంపై వస్తున్న అర్జునుని దూరంగా చూచి, కుమారహంత అయిన అశ్వత్థామ ఉద్వేగాన్ని పొందాడు. ప్రాణాలు రక్షించుకోవాలనే భయంతో పలాయనం చేసి, గుర్రాలు అలసిపోగానే తనకు ఇక రక్షణ లేదని కలవర

పడ్డాడు. తాను బ్రహ్మశిరో నామకమైన అస్త్రం చేత మాత్రమే ఆత్మరక్షణం చేసికోగలనని భావించి, జలాన్ని స్పృశించి, దాన్ని ఉపసంహరించడం ఎరుగకయే, ఆ అస్త్రాన్ని సంధించాడు. దానివల్ల దశదిక్కులు ప్రచండ తేజస్సుతో నిండిపోయింది. దీన్ని గమనించి అర్జునుడు కృష్ణునితో స్తుతి పురస్సరంగా అంటున్నాడు.

**కృష్ణ! కృష్ణ! మహాబాహో! భక్తానా మభయంకర!**
**త్వమేకో దహ్యమానా మపవర్గోసి సంసృతేః ॥**

ఓ కృష్ణా! మహాబాహో! భక్తులకు అభయాన్నిచ్చే స్వామీ! ఈ సంసార మహాగ్నిచే దహింపబడుతున్న వారికి నీవే దిక్కు!

**త్వమాద్యః పురుషః సాక్షాత్ ఈశ్వరః ప్రకృతేః పరః।**
**మాయాం వ్యుదస్య చిచ్ఛక్త్యా కేవలే స్థిత ఆత్మని ॥**

స్వామీ! నీవే ప్రకృతికి అతీతంగా ఉన్న పురుష తత్త్వానివి. ఆద్యపురుషుడవు నీవే! నీవే సర్వనియామకుడైన ఈశ్వరుడవు. నీచిచ్ఛక్తితో (జ్ఞానాత్మకమైన శక్తితో) మాయను దూరం చేసి నీ స్వస్వరూపంతో ప్రకాశిస్తున్నావు. అట్టి నీవే, నీ మాయచే మోహింప చేయబడిన ఈ లోకానికి, నీ వీర్యం చేత ధర్మాది రూపమైన శ్రేయస్సును అనుగ్రహిస్తున్నావు. అలాగే నీ యీ అవతారం భూమికి భారాన్ని తీర్చదలచి ఏర్పడినదే! నిన్నాశ్రయించిన అనన్య భావకులైనవారి నిరంతర ధ్యానానికి ఏర్పడింది. ఈ తేజస్సు నలుమూలలా వ్యాపిస్తూ వస్తూన్నది. ఇది ఏమిటో, ఎక్కడ నుండి వస్తున్నదో నాకు తెలియడం లేదు. చాలా దారుణంగా ఉంది.

**స ఏవ సర్వలోకస్య మాయా మోహిత చేతసః ।**
**విధత్సే స్వేన వీర్యేణ శ్రేయోధర్మాది లక్షణమ్ ॥**
**తథాయం చావతారస్తే భువో భారజిహీర్షయా ॥**
**స్వానాంచానన్య భావానామ్ అనుధ్యానాయ చాసకృత్॥**
**కిమిదం స్విత్? కుతోవేతి, దేవదేవ న వేద్మ్యహమ్ ।**
**సర్వతోముఖమాయాతి తేజః పరమదారుణమ్ ॥**

అన్న అర్జునుని మాటలు విన్నాడు స్వామి "ఓ అర్జునా! ఇది ద్రోణపుత్రుడైన అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం, దీన్ని ప్రాణసంకటం ఏర్పడినప్పుడు ప్రయోగింపగలడే తప్ప ఉపసంహరింపలేడు. ఈతనికి చెందిన ఈ బ్రహ్మాస్త్రాన్ని మరే అస్త్రమూ నిలువరించలేదు. కనుక, అస్త్రప్రయోగోపసంహారాలు ఎరిగిన నీవే వానికి ప్రతిక్రియ చేయి" అని ప్రతిబోధించాడు స్వామి.

అర్జునుడు, స్వామి చేసిన ప్రతిబోధనాన్ని విని, ఉదకాన్ని స్పృశించి బ్రహ్మాస్త్ర నివారణానికి తానూ బ్రహ్మాస్త్రాన్నే సంధించాడు. అశ్వత్థామ అర్జునుడు ఇరువురూ ప్రయోగించిన రెండు బ్రహ్మాస్త్రాల తేజస్సులు ఆకాశాన్ని వ్యాపించి ప్రలయ కాలపు మహాసంవర్తాగ్నివలె క్షోభను కలుగచేశాయి. మూడు లోకాలను దహిస్తున్న ఆ మహాస్త్ర తేజస్సును చూచి లోకులు దహింపబడుతూ ఇది మహాప్రలయాగ్నియేనని భావించారు. ప్రజోపద్రవాన్ని గమనించి శ్రీకృష్ణాదేశంతో అర్జునుడు రెండు అస్త్రాలను తానే ఉపసంహరించాడు. వెంటనే వేగంగా దరిచేరి అశ్వత్థామను బంధించాడు. రజ్జువుతో బంధించి శిబిరానికి ఆతనిని తోడ్కొని అర్జునుడు రాగా, వానిని చూచి పద్మాక్షుడు క్రోధావిష్టుడైనాడు. "ఓ అర్జునా! ఈ బ్రాహ్మణాపసదుణ్ణి రక్షించరాదు. వెంటనే ఈతనిని వధించు. ఈ దుర్మార్గుడు నిరపరాధులై నిద్రిస్తున్న బాలకులను క్రూరబుద్ధియై వధించాడు. ఈతని అపరాధానికి నిష్కృతిలేదు.

**మత్తం, ప్రమత్తమ్ ఉన్మత్తం,**
**సుప్తం, బాలం జడం స్త్రియమ్ ।**
**ప్రపన్నం, విరథం, భీతం,**
**న రిపుం హన్తి ధర్మవిత్ ॥**

శత్రువే అయినా, ఎవ్వడు త్రాగినమత్తులో ఉంటాడో, అనవధానస్థితిలో ఏమరి ఉంటాడో, ఎవ్వడు ఏమీ తెలియని ఉన్మాదస్థితిలో ఉంటాడో, నిదురించినాడో, బాలుడో, మంద బుద్ధియో, స్త్రీత్వం కల వ్యక్తియో, ప్రపన్నుడైనవాడో, రథ రహితుడో, భయపడి పారిపోతున్నాడో అట్టి వానిని ధర్మబుద్ధి, ఎంతమాత్రం చంపడు.

**స్వప్రాణాన్ యః పరప్రాణైః ప్రపుష్ణాత్యఘృణః ఖలః ।**
**తద్వధస్తస్యహి శ్రేయో యద్దోషాద్యాత్యధః పుమాన్ ॥**

(సశేషం)



# అహో! భారతమ్

## భీష్మ చరిత్ర

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

ఇక్ష్వాకుల వంశంలో మహాభిషుడు అనే రాజు ఉండేవాడు. ఆయన ఎప్పుడూ సత్యమే పలికి 'సత్యవాది' అని పేరు తెచ్చుకున్నాడు. గొప్ప పరాక్రమవంతుడు కూడా ఆ రాజు. ఆయన వెయ్యి అశ్వమేధయాగాలు, వంద రాజసూయయాగాలు చేసి స్వర్గం చేరాడు. ఇంద్రుని ఎంతో ఆనందపెట్టాడు.

ఒకసారి దేవతలంతా బ్రహ్మగారిని సేవించుకోవాలని బయలుదేరారు. వారితో ఎంతోమంది రాజర్షులూ, మహాభిషుడు కూడా బ్రహ్మలోకం చేరారు. అందరూ ఉండగా నదీమతల్లి అయిన గంగ బ్రహ్మగారి దగ్గరకి వచ్చింది. అనుకోకుండా పెద్దగాలి రావడంతో ఆమె శరీరంపైన ఉన్న బట్ట ఎగిరింది. దేవతలందరూ తలలు వంచేసుకున్నారు. మహాభిషుడు మాత్రం భయం, సందేహం లేకుండా ఆమె ఊరుసౌందర్యం చూస్తూ ఉండిపోయాడు.

బ్రహ్మగారు ఆ రాజుని గమనించి "దుర్బుద్ధీ ఏమిటలా చూడడం. నువ్వీలోకాలలో ఉండతగవు. భూలోకంలోనికి పో! అక్కడ జన్మించి తర్వాత మళ్ళీ పుణ్యలోకాలకి వస్తావులే! ఇప్పుడు నీ మనసు దోచిన ఈ గంగే అప్పుడు నీమాట వినదు. నీకు గంగపై కోపం వచ్చినపుడే శాపవిమోచనం కలుగుతుంది" అంటూ శపించాడు.

విన్నాడు మహాభిషుడు. "నేను ప్రతీపుడు అనే మహారాజును తండ్రిగా ఎన్నుకుంటాను. ఆయన కడుపున పుడతాను" అని వేడుకొన్నాడు. సరేనన్నాడు బ్రహ్మగారు. ఏమిటో ఇదంతా అనుకుంటూ ఆరాజునే చూస్తూ వెళ్ళిపోయింది గంగ. అలా వెడుతూంటే ఆవిడకి వసువులు కనిపించారు. వాళ్ళుకూడా స్వర్గం నుంచి క్రిందికి భూమివైపు వెళుతున్నారు. వాళ్ళ ముఖాలు దీనాతిదీనంగా ఉన్నాయి. యమధర్మరాజుకి 10మంది భార్యలు. వారిలో వసువు అనే భార్యకు పుట్టినవారే వసువులు. వీరంతా ఎప్పుడూ కలిసి ఉండే గణదేవతలు. వారిపేర్లు...

1. ఆపుడు; 2. ధ్రువుడు; 3. సోముడు; 4. అధ్వరుడు; 5. అనిలుడు; 6. ప్రత్యూషుడు; 7. అనలుడు; 8. ప్రభాసుడు.

గంగ వారిని చూసి ఏమయింది మీకు? ఎందుకిలా మీ దివ్యరూపాలు పోగొట్టుకున్నారు. ఎటుపోతున్నారు? అని అడిగింది. వారు "మహానదీ! మేం అష్టవసువులం. ఒకసారి తెలియక ఒక అపచారం చేశాం. వసిష్ఠమహర్షి చెట్టుచాటున సంధ్యావందనం చేసుకుంటున్నాడు. మేం ఆయన్ని పట్టించుకోకుండా ప్రక్కనుంచి వెళ్ళిపోతున్నాం. ఆయనకి కోపం వచ్చింది. వెంటనే 'మీరు మానవులుగా పుట్టండి' అని శపించాడు. పెద్దల దగ్గర చూపించవలసిన భక్తి శ్రద్ధలు మేం చూపించక, అహంకారంతో మా దారిన మేం పోవడం అపరాధమే కదా! పెద్దలు ఎక్కడ కనిపించినా ఆగి నమస్కరించి వెళ్ళాలి. అలా చేయనందుకు శాపం పొందాం. కల్యాణీ! మేం మానవస్త్రీ కడుపున పుట్టలేం. నువ్వు మానవస్త్రీగా జన్మించు. నీ కడుపున మేం పుడతాం అన్నారు.

సరే గాని మరి మీకు అపుడు తండ్రి ఎవరు? అంది.

ఇదుగో ఈ మహాభిషుడే ప్రతీపమహారాజుకి కొడుకుగా పుడతాడు. శంతనుడు అని ప్రసిద్ధి చెందుతాడు. అతడే మాకు తండ్రి. నీవే తల్లివి కావాలి అని కోరారు. అంగీకరించింది గంగ. అమ్మా! మాకు 'పుడితే చాలు' అనే శాపం. అందువల్ల నువ్వు మేం పుట్టగానే మమ్మల్ని నీళ్ళలో పడెయ్! మాకు శాపవిముక్తి కలుగుతుంది అన్నారు.

చాలా బాగుంది. కాని, మీలో ఒక్కడయినా దీర్ఘాయుష్షు కలిగిన పుత్రుడుగా మిగిలితే నాకూ, ఆ రాజుకీ కూడా తృప్తి కలుగుతుంది అంది గంగ. అయితే మాలో ప్రతిఒక్కరి నాల్గవ అంశతో అష్టమ వసువు ప్రభాసుడు దీర్ఘాయువుగా, ఉత్తమునిగా మహావీరునిగా ఈ లోకంలో ఉంటాడులే అన్నారు వాళ్ళు. ఆనందంగా ఒప్పుకుంది గంగ. వసువులు వెళ్ళిపోయారు.

భారతకులంలో ప్రతీపుడనే మహారాజు చాలా ధర్మాత్ముడిగా ప్రసిద్ధి చెందాడు. అతని భార్య సునందాదేవి, ఆయన గంగాద్వారంలో నివసిస్తూ ఎన్నో సంవత్సరాలు అష్టాంగ యోగానుసారం తపస్సు చేశాడు.

అష్టాంగయోగమంటే ఎనిమిది రకాల నియమాలు పాటిస్తూ చేసే తపస్సు. అష్ట=8; యోగము=కూర్చునది. ఎనిమిది రకాల నియమాలను పాటించటం ద్వారా మనస్సుని పరమాత్మతో అనుసంధించే సాధనని అష్టాంగయోగమంటారు.

అవి 1. యమం 2. నియమం 3. ఆసనం 4. ప్రాణాయామం 5. ప్రత్యాహారం 6. ధ్యానం 7. ధారణం 8. సమాధి. హింసాదులు చేయకుండా ఉండడం **యమం.**

అవి మళ్ళీ 10 రకాలు. 1. సత్యం, 2. దయ, 3. క్షమ, 4. ధృతి, 5. మితాహారం 6.ఆర్జవం, 7. బ్రహ్మచర్యం, 8. అస్తేయం 9. అహింస, 10. శౌచం.

రెండవది **నియమం.** మట్టి, నీళ్ళు సాధనాలుగా చేసే యోగసాధన నియమం. అదికూడా పది విధాలు. తపం, సంతోషం, ఆస్తికత్వం, దానం, భగవద్దర్శనం, వేదాంత శ్రవణం, లజ్జ, మతి, జపం, వ్రతం.

ఇలాంటి మంచిలక్షణాలతో సాగింది ప్రతీపుని తపస్సు. ఆ సమయంలో గంగానది అందమైన స్త్రీగా మారి, సర్వాంగ సుందరంగా అలంకరించుకొని గబగబా వచ్చి ప్రతీపమహారాజు ఒడిలో కుడితొడపైన విలాసంగా కూర్చుంది. ఆశ్చర్యపోయాడు రాజు. అరే నువ్వెవరివి? ఎందుకిక్కడికి వచ్చావు? తొడపై ఎందుకు కూర్చున్నావు? అన్నాడు.

'ఓ ఇంద్రసమానుడా! నేను జహ్నుమహర్షి పుత్రిక జాహ్నవిని. గంగని. నిన్ను, నీరూపాన్ని, గుణాల్ని చూచి నీకు భార్యను కావాలని వలచి వచ్చాను. నన్ను స్వీకరించు' అంది.

'పద్మముఖీ! అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యను తప్ప ఇతరులను మనసులో కూడా స్మరించను నేను. ఆత్మనిగ్రహంతో తపస్సు చేసుకొనే నన్ను సామాన్యునిగా భావించి అమాయకంగా భలే కోరిక కోరావే! అది సాధ్యమయ్యే విషయం కాదు. పైగా నువ్వేం చేశావో తెలుసా! పుత్రులు-సంతానం కుడితొడపై కూర్చోవాలి. భార్య ఎడమతొడపై కూర్చోవాలి. నువ్వేమో కుడివైపు కూర్చున్నావు కాబట్టి మా అబ్బాయిని పెళ్ళి చేసుకో' అన్నాడు. గంగ అతనికి నమస్కరించి మాయమైపోయింది.

ప్రతీపుడు భార్య సునందాదేవితో పుణ్యతీర్థాలు సేవిస్తూ వ్రతాలు చేస్తూ చాలాకాలం గడిపాడు. ఆ దంపతులకు చాలాకాలానికి ఒక కుమారుడు కలిగాడు. ఆ పుత్రుడే శంతనుడు. శాంతుడైన తండ్రికి పుట్టడం వలన శంతనుడు అయ్యాడు. అతనిని గారంగా పెంచి పెద్దవానిని చేశాడు రాజు. రాజ్యాన్ని అప్పగించి గంగకు తాను చెప్పిన మాటలు కొడుకుకి చెప్పి ఆమెను వివాహం చేసుకో. ఆవిడకి ఎదురు చెప్పకు అని ఆదేశించి తపోవనానికి వెళ్ళిపోయాడు ప్రతీపుడు.

శంతన మహారాజుకి వేటమీద కోరిక ఎక్కువ. ఒకనాడు వేటకి బయలుదేరాడు. వేటాడి అలసి అలసి గంగానది ఇసుక తిన్నెలపై చేరాడు. అక్కడ ఒక దివ్యసుందరి అతనికి కనిపించింది. ఆ అందానికి నిశ్చేష్టుడయ్యాడు రాజు. ఈవిడ వనదేవతా? రాక్షసరాజకన్యా? సర్పరాజపుత్రికకాదుకదా? దేవతాకన్య కావచ్చునేమో! గంధర్వ కిన్నెర కింపురుషాదులలో ఏదైనా ఒకజాతికి చెందిన అందమా ఈ మూర్తిది? మానవకన్య ఈ అడవిలో ఒంటరిగా నదీతీరంలో ఎందుకు సంచరిస్తుంది అనుకుంటూ కళ్ళతో త్రాగేస్తున్నట్లు చూస్తున్నాడు. సరిగ్గా ఆవిడ కూడా అదే స్థితిలో ఉంది. అడిగేద్దామా అనుకొంటున్నాడు శంతనుడు. ఆవిడే ముందుకి వచ్చింది.

"రాజా! నేను నీకు పట్టమహిషిని కావాలని అనుకొంటు న్నాను. నన్ను స్వీకరించు. కాని ఒక నియమం. నువ్వు ఎట్టి పరిస్థితిలనూ, శుభమైనా, అశుభమైనా నేనేం చేసినా సరే నన్ను అడ్డగించకూడదు. నాకు కష్టం కలిగించేలా మాట్లాడకూడదు. ఏమాత్రం ప్రశ్నించకూడదు. అలా అయితేనే నేను నీదగ్గర ఉంటాను. ఎప్పుడైనా ఎదిరించి ప్రశ్నించావా.. నిస్సందేహంగా నిన్ను విడిచి వెళ్ళిపోతాను. ఇష్టమైతేనే... అంది.

ఆ రూపం ఆ మాట.. కళ్ళు తిప్పుకోలేకపోతున్నాడు రాజు. సరే, నాకిష్టమే! రా అంటూ తనచేతిని అందించి రథమెక్కించి రాజధాని చేరాడు. ఆమెతో క్షణక్షణం వినూత్న ఆనందాన్ని పొందుతూ కాలం గడిపాడు. గంగాదేవి కూడా రాజుని ఆనందలోకాలలో తేలుస్తూ అతనితో జీవితాన్ని పంచుకొంది. మాసాలు, ఋతువులు, సంవత్సరాలు ఎలా గడిచిపోతున్నాయో తెలియలేదు ఇద్దరికీ. *(సశేషం)*

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# ఆత్మయాత్ర దేహయాత్ర

శ్రీ ఉ.వే. శ్రీమాన్ కె.ఎస్. రామానుజాచార్యస్వామి- నరసాపురం.

అనంతకోటి జీవరాశులలో మానవజన్మ లభించడం చాలా దుర్లభం. అందునా వేదాన్ని పరమప్రమాణంగా అంగీకరించే వైదికసంప్రదాయానికి చెందినవారం కావడం అత్యంత దుర్లభం. ఇలా దుర్లభమైన ఈజన్మను మనకు ప్రసాదించిన భగవానుని విషయంలో మనం కృతజ్ఞులుగా ఉండాలిగదా!

మనం అంటే ఎవరు? ఈ కనిపించే శరీరంకాదు. దీని లోపలఉండే జ్ఞానవంతుడైన జీవుడే అన్న విషయం మనకు తెలుసును.

అయితే అసలు మనం ఇక్కడికి అంటే ఈ భూమండలంలోకి ఎందుకు వచ్చామో! ఏం పనిమీద వచ్చామో! తెలుసుకోవాలి.

ఒకప్పుడు ప్రళయకాలంలో మనం అంతా నామరూపాది విభాగంలేక అవస్థపడుతుంటే చూచి భగవానుడు మనకు ఒక శరీరాన్ని, ఇంద్రియాలని ప్రసాదించి వాటిని సక్రమంగా ఉపయోగించు కోడానికి వీలుగా శాస్త్రాన్నీ ప్రసాదించాడు. కానీ మనం ఏం చేశాం? భగవంతుడు ప్రసాదించిన ఈ ఇంద్రియాలని జ్ఞానాన్ని మన స్వార్థంకోసం వినియోగిస్తూ వచ్చాం. ఆ స్వార్థం మనచేత అనేక అకృత్యాలని చేయించింది. వాటి ఫలితంగా మనకి పుణ్యపాపరూపమైన కర్మలు పట్టుకొన్నాయి. ఆనాడు గజేంద్రుడి కాలుపట్టుకొని మడుగులోకి లాగేసే మొసలిలా ఈనాడు మనకర్మలు మనని పట్టుకొని ఈ సంసార సాగరంలోకి ఈడ్చుకు పోతున్నాయి. ఈ కష్టాలకడలిలోపడి అనేక జన్మలుగా మనం విలపిస్తూనే ఉన్నాం! కానీ వీటినుంచి గట్టెక్కే మార్గాన్ని ఎంచుకోలేక పోతున్నాం.

ఇలా దుఃఖపడే మనలనుజూచి పరమకృపాళువైన భగవానుడు అత్యంతదయా స్వరూపుడైన ఆదిశేషులవారిని శ్రీరామానుజులుగా ఈ భూలోకంలో అవతరింపజేశాడు.

భగవానుడికి అత్యంతప్రీతిపాత్రులు శ్రీరామానుజులు. కనుకనే భగవానుడు వారికి సర్వదా అనుకూలుడై ఉంటాడు. కనుక శ్రీరామానుజులవారిని ఆశ్రయిస్తే రామానుజ సంబంధం చేత భగవానుడు మనగుణ, దోషాలతో సంబంధం లేకనే మనలని అనుగ్రహిస్తాడు. కనుక శ్రీరామానుజ సంబంధమే మనకు ఉత్తారకం.

రామానుజసంబంధం కలిగి ఉండడమంటే ఆచార్యులను ఆశ్రయించడము మాత్రమేగాదు. ఆ ఆచార్యులు ఉపదేశించిన మార్గంలో మనం ప్రయాణించాలి. అలా ఆచార్య పరంపరద్వారా మాత్రమే మనకు లభించే మంచి విషయాలను రహస్యాలు అని అంటారు. ఇలాంటి రహస్యాలెన్నో ఉన్నాయి. అలాంటి రహస్యం ఒకటి మనం తెలిసికొందామా!

మనం దేనికోసం చింతించాలి? ఆలోచించాలి? ఆత్మయాత్ర విషయం ఆలోచించాలా! లేక ఈ ఆత్మను ధరించిన ఈ దేహ యాత్రకోసం చింతించాలా? లేక రెండిటికోసం చింతించాలా?

ఆత్మయాత్రకోసం మనం చింతించాల్సిన పనేలేదు. ఎందుకంటే- ఈ ఆత్మ భగవానుడికి శరీరం గదా! శరీరం తనని తాను కాపాడుకుంటుందా! లేక ఆశరీరంగలవాడు కాపాడుకుంటాడా! మనకు తెలుసు గదా! మనమే మన శరీరాన్ని కాపాడుకుంటాంగానీ- శరీరం తనని తాను కాపాడుకోలేదు అని. ఉదాహరణికి మనకు తలనొప్పి వచ్చిందనుకోండి. తనకు వచ్చిన ఆ నొప్పి పోవడానికి తల తానుగా ఏదైన ఒకమందో మాకో వేసికొని తగ్గించుకుంటోందా! లేక ఆ బాధ తగ్గడానికి మనమే ఒక మందు వేసుకుంటున్నామా! మనమే మందు వేసికొని మన తలకి వచ్చిన బాధని పోగొట్టుకుంటున్నాం. అలాగే భగవానుడుకూడా తనకు శరీరంగా ఉండే ఈ ఆత్మనుకూడా తానే కాపాడుకుంటాడు. ఆతడే దీనిని నడిపిస్తాడు. కనుక ఆత్మయాత్ర గురించి ఆలోచించాల్సిన పనే లేదు.

అయితే మరి దేహయాత్ర విషయం ఏమిటి?అని ప్రశ్న.

మనం గతంలో చేసిన పుణ్యపాపరూపాలైన కర్మలను అనుభవించడానికి కదా! ఈ శరీరం లభించింది. ఈ శరీరంతోనే మనం మన కర్మఫలాన్ని అనుభవించాలి. ఉదాహరణకి మనం ఒకవిందుభోజనం చేశామనుకుందాం. అందులో రకరకాల పదార్థాలు ఉంటాయి. మన ఆరోగ్యాన్ని గమనించ కుండానే వాటిని యథేచ్ఛగా ఆరగించామనుకోండి. జీర్ణమైతే ఆరోగ్యాన్ని కలిగిస్తాయి. మరి జీర్ణం కాపోతేనో అనారోగ్యాన్ని కలిగించి బాధిస్తాయిగదా! అలానే మనకు హితాన్ని కోరి భగవానుడు ఉపదేశించిన మార్గంలో కాకుండా మనయిష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తే దానివల్ల మనకు లభించే ఫలితాన్ని అనుభవింప జేయడానికి ఈ జన్మ మనకు లభించింది. కనుక ఈ జన్మలో ఆ ఫలితాన్ని అనుభవించే తీరాలి. అందుచేత దేహయాత్ర కర్మాధీనం. దానికోసం ఆలోచించ వలసిన అవసరమేలేదు.

అలా చింతిస్తే మనకు ప్రయోజనంలేదు సరిగదా! మన ప్రపన్నత్వమే నశించిపోతుంది. అయితే ప్రపన్నులంటే ఎవరు? ఎవరైతే తన రక్షణభారాన్ని భగవంతుడిమీదపెట్టి నిశ్చింతగా ఉంటారో వారు ప్రపన్నులు. అలాంటివారిని భగవానుడు తానై వచ్చి రక్షిస్తాడు.

ఆనాడు గజేంద్రుడు మొసలితో పోరాడిపోరాడి చివరకు అలసిపోయి నీవే తప్ప ఇతఃపరంబెరుగ అని ప్రార్థిస్తే పరుగుపరుగున వచ్చిగదా! రక్షించాడు.

అలాగే మనం మన ఆత్మయాత్రకోసం దేహయాత్రకోసం చింతించడం మానేసి భగవంతుని విషయంగా చింతనచేద్దాం.

**భగవద్రామానుజులవారు ఉపదేశించిన** ఈ ప్రథమ రహస్యాన్ని మనం మననం చేసికొంటూ నిరంతరం పాటించుదామా!



## స్మృత్యర్థం - సమర్పణ

పరమపదవాసులు **శ్రీమాన్ తుమ్మల వెంకటేశ్వరరావు**గారి స్మృత్యర్థం వారి కుమారుడు, పటమట విజయవాడ వాస్తవ్యులు **శ్రీమాన్ తుమ్మల బాబూరావుగారు** మన సీతానగరంలో జరుగుతున్న 996వ **భగవద్రామానుజ జయంతి** పురస్సరంగ మన **జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌కి ఒక లక్షరూపాయలు** విరాళముగ సమర్పించారు. వారికి **శ్రీశ్రీశ్రీ స్వామివారు** మంగళాశాసనాలు అందించారు.



జై శ్రీమన్నారాయణ!

**శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరుస్వామివారి సందేశం**

# కర్మ రహస్యం

**శ్రీమతి పి. జ్యోతి - హన్మకొండ**

ప్రపన్నుడైనా, ఏకాంతియైనా, పరమేకాంతియైనా, దేహేంద్రియాది సంపర్కమున్నంతవరకు కర్మాచరణ తప్పదుకదా! అటువంటి కర్మబ ంధం నుండి విముక్తి చెందటం ఎట్లా అని మనస్వామి వారిని కొందరు ప్రశ్నించినపుడు, దానికి స్వామివారు ఈ విధంగా వివరించారు.

**యత్కరోషి యదశ్నాపి యజ్జుహోషి దదాసియత్ ।**<br>**యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥**

నీవు ఏ పనిచేసినా, ఏది తిన్నా, దేనిని హోమం చేసినా, దేనిని ఎవరికిచ్చినా ఎటువంటి తపస్సు నాచరించినా మొత్తం అన్నింటిని కృష్ణార్పణం ఒనర్చు.

అంటే, ఆయా కర్మల ఫలితాన్ని నీవాశించక ఆ పనిని చేయించిన భగవానుడు దానికి కర్త. అతడే దానికి భర్త. దానికి ఆయనే భోక్త. అన్నీ శ్రీకృష్ణపరమాత్మయే అనే యథార్థ విషయాన్ని తెలుసుకోవాలి. ఆ అర్థంపై సంపూర్ణ విశ్వాసం కలిగి ఉండాలి. అంతంలో తత్కర్మ ఫలితాన్ని శ్రీకృష్ణపరమాత్మకు అర్పించు. దానివల్ల నీకు ఆ కర్మలందు సంగము, వానివల్ల బంధం కాని ఉండదు. నీ విద్యుక్తకర్మల నాచరించుటలో మాత్రమే నీకు అధికారం. మిగతా భాగాలతో నీకు సంబంధం లేదు. అని దీన్నే శ్రీకృష్ణుడు తెలిపినాడు. ఆ విధంగా ఆచరించుటం వల్ల మాత్రమే కర్మబంధం నుండి విముక్తి లభిస్తుంది.

సుందర కాండలో



# శ్రీరామాయణంలో పక్షులు

## శకునపక్షి



బోయవాడైన ఋక్షుడు నారదుని అనుగ్రహంతో వాల్మీకిగా మారాడు. ఆ నారదుని అనుగ్రహంతో శ్రీరామాయణాన్ని లోకానికందించాడు. ఆ శ్రీరామాయణమే ఆదికావ్యమై వెలిసింది. సంస్కృత వాఙ్మయంలో ఉత్తమమైన కావ్యంగ నిలిచింది. బాహ్యంగ అందమైన కథను మనకి చూపిస్తూనే శ్రద్ధకల జిజ్ఞాసువులకి అనర్ఘమైన విషయాల నెన్నింటినో దర్శింప చేస్తుంది, సముద్రము తన లోలోపలి పొరలు చేరదలచినవాడికి అమూల్య రత్నరాశులను ఎన్నింటినో అందించేటట్లు.

భగవద్రామానుజుల వారికి శ్రీశైలపూర్ణులు తిరుమలలో చెప్పినర్థాన్ని చెప్పకుండా పదునెనిమిదిసార్లు శ్రీరామాయణాన్ని ప్రవచనంగ అనుగ్రహించారు. అంటే, ఈ శ్రీరామాయణంలో నిగూఢంగ దాగి ఉన్న అర్థాలు ఎన్నో కదా!

శ్రీరామాయణ మహాసాగరంలోంచి కీర్తిమూర్తులు పరమాచార్యులైన శ్రీ గోపాలాచార్యస్వామి అనుగ్రహించిన అనేకానేక అంశాలలో ప్రస్తుతం పక్షులను గురించిన విశేషాలు తెలుసుకుంటున్నాం.

కిష్కింధకాండలో సంపాతి అనే పక్షి సీతమ్మజాడను ప్రాణాలమీద ఆశ విడిచి ప్రాయోపవేశానికి సిద్ధపడ్డ వానరులకి తెలియజేసిందని తెలుసుకున్నాం కదా! అలా తానూ కొత్త రెక్కలొచ్చి హాయిగ ఎగిరిపోయింది. వానరవీరులూ క్రొత్తగ చిగురించిన ఆశలతో ధైర్యం తెచ్చుకుని, అందరూ కలిసి జాంబవంతుని సూచనమేరకు హనుమంతుణ్ణి లంకకు పంపారని తెలుసుకున్నాం.

ఇక మనమూ ఆయనవెంట జాగ్రత్తగ లంకకుపోవాలి. అక్కడి పక్షులతో కాస్త నేస్తం చెయ్యాలి. అవి ఏం చెబుతున్నాయో జాగ్రత్తగా వినాలి, వాటి భావాన్ని గుర్తించాలి. రండి! పోదాం...!

ఆటంకాలు ఎన్ని ఎదురైనా, వాటన్నింటినీ తెలివిగ ధైర్యంతో, బుద్ధిబలంతో ఎదుర్కొని అన్నింటినీ దాటిన హనుమ లంకలోకి ప్రవేశించాడు. క్రమంగ అశోకవాటిక ప్రమదావనాన్ని చేరాడు. అక్కడి శింశుపావృక్షం మీద కూర్చుని చుట్టూ పరిశీలిస్తూండగ ఆ చెట్టుక్రిందనే ఓ నారీమణి కూర్చొని కనిపించింది. ఆమె ఆకారాన్నిబట్టి, దీనస్థితినిబట్టి, వస్త్రధారణను బట్టి, ఆభరణాల గుర్తులను బట్టి ఆమె సీతయే అయి ఉండవచ్చుననుకున్నాడు. తాము గతంలో కిష్కింధలో రాముడు వచ్చినపుడు కొన్ని ఆభరణాలు ఒకవస్త్రంలో మూటగ తమ వద్ద ఆకాశంలోంచి పడిన వాటిని చూపారు. ఆ మూటగచుట్టిన పచ్చని వస్త్రఖండము రంగూ, ఈమె ధరించిన వస్త్రపురంగూ ఒకేరకంగ ఉన్నాయి.

పైగా ఈ చీర అంచులో ఆ భాగం చింపినట్టుగ కనిపిస్తోందిగూడ. ఈమె సీతయే! సందేహం లేదు అనుకుంటూ ఉండగ ఇంతలో తెల్లవారడమూ మేళతాళాలతో, స్త్రీ జనాలతో రావణుడు రావడమూ, వాని నోటికొచ్చిన కారు కూతలు పలికి ఆమె మనస్సును దారుణంగ గాయపరచడమూ, అయినా ఆమె ధైర్యంగ ఆ రావణుడికి చెప్పవలసిన మంచి మాటలను ఓర్పుతో, దయతో ఉపదేశించడమూ, రావణుని చెవికి అవేమీ ఎక్కకపోవడంతో, “నీకు ఇక రెండు నెలలు సమయ మిస్తున్నా! మనసుమార్చుకోకపోతే ఉదయపు ఆహారానికి నిన్ను మావాళ్ళు పట్టుకుపోతారు, జాగ్రత్త!” అంటూ బెదిరించి వెనుతిరిగి పోవడమూ జరిగిపోయాయి.

ఏదో రకంగ సీతను స్వాధీనపరచుకొని మనసు మార్చండని రాక్షసస్త్రీలను ఆజ్ఞాపించి రావణుడు వెళ్ళిపోయాడు. రాక్షసస్త్రీలు తమ సహజ ప్రవృత్తిని ప్రదర్శిస్తూ, సీతను అంగాంగాలుగ చీల్చి చెండాడి తినేస్తామంటూ బెదిరించడం ప్రారంభించారు. ఇంతలో త్రిజట తన స్వప్నవృత్తాంతం వివరించి ఆ రాక్షసస్త్రీలను కాస్త ఉపశమింపచేసింది.

క్రమంగ వాళ్ళంతా నిద్రలోకి జారుకున్నారు. “ఈమె నిస్సందేహంగ సీతయే” అని నిశ్చయించుకున్నాడు హనుమ. కానీ, ఈమె అతిదయనీయ స్థితిలో ఉంది. పైగా తన జడతో ఉరివేసుకొంటూ ఆత్మహత్యా ప్రయత్నానికి ఉద్యమిస్తోంది. ఇదీ సన్నివేశము.

సరిగ్గా అదే సమయంలో సీతమ్మకు ఎడమకన్ను అదిరింది. ఎడమభుజం, ఎడమ తొడ అదరసాగాయి. కొంగు కాస్త జారినట్టై శుభసూచకంగ అనిపించింది. ఎన్నో

శుభశకునాలు గోచరించాయి. శ్రీరాముడే ఎదుట నిలిచిన అనుభూతి సీతమ్మకు కలిగింది. ఇంతలో తాను కూర్చున్న శింశుపావృక్షం మీద ఒక కొమ్మమీదున్న శకున పక్షి శుభాగమనాన్ని సూచిస్తోందా అన్నట్టు "కుహూ" అంటూ కూయసాగింది. ఇవన్నీ సీతమ్మలో కలిగిన నిరాశకు సాంత్వనంగ, త్రిజట అప్పుడే చెప్పిన స్వప్నంలోని సన్నివేశాలు నిజాలౌతాయి సుమా! రాముడొస్తాడు త్వరలో, రావణుడు అంతమౌతాడు, లంకంతా అగ్ని జ్వాలలకు ఆహుతౌతుంది, స్మశాన సదృశంగ లంకంతా శవాలతో నిండిపోతోంది, ఒకకోతి లంకను భయపెడుతుంది. రాముడు విజయుడై, అలంకృతయైన సీతను తనతో ఆకాశమార్గాన తీసుకుని వెళతాడు... త్రిజట స్వప్నంలో చెప్పినవన్నీ ఇలా నిజమౌతాయి అన్నట్టుంది ఆ పక్షి చేసే శుభశకున ధ్వని.

ఈ పక్షిధ్వని విని, శుభశకునాలను తలచి ఆశ్చర్యపడుతూ ఉండేటంతలో, చెట్టుపైనున్న హనుమ సీతను ఆత్మహత్య ప్రయత్నంలోంచి ఎలా విరమింపచేయాలా అని బాగ ఆలోచించి, ఆలోచించి దీనికి మంచి ఉపాయమిదే, మరణించ సిద్ధమైన వారికి కూడా పునర్జన్మ నివ్వగలిగిన ఏకైక ఔషధ మిదే అన్నట్టు "రాజా దశరథో నామ రథకుంజర వాజిమాన్" అనగనగా దశరథుడనే రాజు..." అంటూ శ్రీరామకథను వినిపించాడు. "శుభశకునాలను చూపే పక్షి, పైగా రామకథ చెప్పే ఈ గొంతు ఎక్కడా?" అంటూ అంతటా వెతుక్కుంటూ పైకి చూసిన సీతమ్మకు హనుమ కూడా కన్పించాడు.

సరే! తర్వాత క్రిందకు దిగి సీతమ్మకు హనుమ ధైర్యం చెపుతాడు. ఈ సందర్భంలో సుందరకాండలో మనకు సాక్షాత్కరించిన శకున పక్షి చాల గొప్పది. దానిని దర్శింపచేస్తూ వాల్మీకి మహర్షి చెప్పిన శ్లోకమిది

**పక్షీ చ శాఖానిలయః ప్రహృష్టః పునః పునశ్చోత్తమ సాంత్వవాదీ।**
**సుస్వాగతాం వాచముదీరయానః పునః పున శ్చోదయతీవ హృష్టః ॥**

*శ్రీరామ.సుం. 27అ. 51*

శాఖానిలయః=చెట్టుకొమ్మలలోనున్న; పక్షీ చ=పింగళికా అనే శకున పక్షి కూడా; ప్రహృష్టః=ఆనందించిన; పునః పునః చ=ఒకసారి కంటే మరోసారి, ఉత్తమ సాంత్వవాదీ=అధికమైన ఓదార్పును ధ్వనింపచేస్తున్నట్టు కూస్తోంది.

అదెలా ఉందంటే సుస్వాగతాం=ప్రియమైన బంధువుల రాకకు సంబంధించిన వాచం=వార్తను; ఉదీరయానః= వివరిస్తూ; హృష్టః=సంతోషమధికమై; పునః పునః= మళ్ళీ మళ్ళీ; చోదయత్ ఇవ= ప్రేరేపిస్తున్నట్లు ఉంది. ఏమని? "ఓ సీతా! ఎందుకమ్మా శోకిస్తున్నావు? ఇది ఏడ్వదగిన సమయం కాదు. త్వరలోనే నీ భర్త శ్రీరామచంద్రుడు ఇక్కడ లంకకు రాబోతున్నాడు. నీ కష్టాలన్నీ కడతేరుస్తాడు. కలసి ఉండి కాలం గడపాలనే నీ కలలను నిజం చేస్తాడు. నీకీ విషయం తెలుసా? నిజానికి ఆతని శోకానికి హద్దే లేదమ్మా? నీ శోకం నిన్ను శుష్కింపచేస్తోంది. కానీ, ఎడబాటువల్ల కలిగిన శోకం శ్రీరాముణ్ణి నిలువునా దహించి వేస్తోంది. సుమా! నీకై అన్వేషిస్తూన్న ఆ రాముడు త్వరలో వస్తాడు. ఆతనికి సంబంధించిన సమాచారం నీకు అందబోతోంది. శోకాన్ని వదులుమా! శ్రీరాముని స్వాగతించడానికి సమాయత్తము కావద్దా? చక్కగ స్నానమాడి, సర్వాభరణ భూషితవై సిద్ధము కమ్ము! అని తొందర పెడుతున్నట్టుగ ఉంది ఆ పింగళికా పక్షియొక్క మాటిమాటికీ రెట్టిస్తూ మధురంగ కూసే ధ్వని.

హనుమ సీతమ్మను దర్శించే ముందు సుందరకాండలో సాక్షాత్కరించే పక్షి ఇది. శ్రీరామాయణానికే శిరోభూషణమైనది సుందరకాండ. ఇందులో సుందరముకానిదేముంది? హనుమ, లంక, సీతమ్మ, రాముని వర్ణన... ఇలా ఈ కాండలో పేరు పెట్టి చెప్పదగిన ప్రతీదీ సుందరమేనంటారు తత్త్వం తెలిసిన పెద్దలు. అందుకే ఈ పక్షీ, దీని కూతలు గూడ తప్పక సుందరమే అవుతాయి. అదెట్లానో చూద్దామా! *(సశేషం)*





# పోతన భాగవతం - మధురభక్తి

శ్రీమతి డా॥ పి. జ్యోతి- వరంగల్

*(గత సంచిక తరువాయి)*

శ్రీకృష్ణుని రూపలావణ్యాలకే ఆకర్షితులైన గోపికలు పరమాత్మ ప్రాప్తిని ఏ విధంగా పొందగలిగారని పరీక్షిత్తు శుకయోగీంద్రుని ఇలా ప్రశ్నించెను....

*జారుఁడని కాని కృష్ణుఁడు, భూరి పరబ్రహ్మమనియు బుద్ధి దలంపన్*
*నేరరు గుణమయ దేహము, లేరీతిన్ విడిచిరింతు లెఱింగింపు శుకా!*

ప్రేమించటం, ద్వేషించటం అనేవి ప్రేమింపబడే, ద్వేషింపబడే వస్తువుయొక్క గుణాన్ని బట్టి మనసును పాడు చేస్తాయి. శ్రీకృష్ణుడు ప్రాకృతమైన పురుషుడు కాడు. శుద్ధ సత్వమయుడు. కామంతో స్మరించినా, ప్రేమతో స్మరించినా, స్నేహంతో స్మరించినా భావం ఎటువంటిదైనా స్మరింపబడే వస్తువు ఆనందం కలిగింది కనుక ఆనందమే ఇస్తుంది. తెలియక నమిలినా మిరియపు గింజ కారాన్నే ఇచ్చినట్లు, కలకండ తీపినే ఇచ్చినట్లు వస్తుతత్త్వాన్ని బట్టి ఏదైనా ఉంటుంది.

***బాంధవమున నైనఁ బగనైన వగనైన,***
***బ్రీతినైనఁబ్రాణ భీతి నయిన***
***భక్తినైన హరికిఁ బరతంత్రులైయుండు,***
***జనులు మోక్షమునకుజనుదు రధిప***

అంతేకాక పరమ పురుషుడైనవాడు, అజుడు, యోగీశ్వరుడు, పరమాత్మ అయిన హరిని సోకితే స్థావరమైనా ముక్తమవుతుందని, అందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదని శుకుడు పరీక్షిత్తుకు వివరించాడు. మన భావాలలో భేదమున్నా ఫలంలో భేదముండదు. శిశుపాలుడు ద్వేషంతో, గోపికలు ప్రేమతో ముక్తిని పొందినారు. ప్రేమింపబడినవాడు కృష్ణుడు కనుక అది ప్రాపంచిక కామం కాదు. గోపికలది జారత్వం కాదు. ఇంతవరకు తమ భర్తలనుకొని శరీరాలను మాత్రమే, భర్తలుగా పిలువబడే వారిని ప్రేమించడమే జారత్వం. కృష్ణుని వేణుగానం వినిపించగానే వారికి ప్రణవార్థం మనసులో పడింది. భగవంతునికే చెంది, ధరింపబడి నియమింపబడి, వానికే చెందినవారమనే భావం రూఢమైంది. వారికి ఇతర సంబంధాలు అందుకే తొలగిపోయినాయని శుకుడు పరీక్షిత్తు సందేహాన్ని తీరుస్తాడు.

శ్రీకృష్ణుడు గోపికలను పరీక్షించాలనుకొని "అర్థరాత్రి పరుగు పరుగున యమునాతీరానికి ఎందుకు వచ్చినారు? మీ మీ తల్లులు, తండ్రులు, పుత్రులు, సోదరులు, భర్తలు మీకోసం వెతుకుతారు. మీ బిడ్డలు ఏడుస్తుంటారు. దూడలు అరుస్తుంటాయి. ఈ వెన్నెల సమయంలో వనసౌందర్యం చూసినారు కదా! వెళ్ళిరండి" అని ఇంకా ఈ విధంగా అన్నాడు.

సీ॥ **ప్రాణేశుఁడెఱిగిన బ్రాణంబునకుఁ దెగు,**
**దండించు నెఱిఁగిన ధరణి విభుడు**
**మామ యెఱింగిన మనువెల్లఁ జెడిపోవఁ**
**దలవరి యెఱిఁగిన దగులు సేయుఁ**
**దలిదండ్రు లెఱింగినఁ దలలెత్త కుందురు,**
**రేరా లెఱింగిన నెత్తిపొడుచు**
**నాత్మజు లెఱిఁగిన నాదరింపరు చూచి,**
**బంధువు లెఱింగిన బహి యొనర్తు.**

ఆ॥ **ఇతరు లెఱింగిరేని నెంతయుఁ జుల్కగా**
**జూతురిందునందు సుఖము లేదు**
**యశము లేదు నిర్భయానందమును లేదు**
**జారుఁజేరఁజనదు చారుముఖికి.**

అని మందలించినాడు. అంతేకాక నాపై ప్రేమ మిక్కుటమై మీరు నా దగ్గరకు రావడం యుక్తమే అయినా స్త్రీలకు భర్తను సేవించడమే పరమధర్మం. భర్త ఎటువంటి వాడైనా అనుకూలంగా ఉండి అతనికి సేవ చేయడం కంటే సనాతన ధర్మమింకొకటి లేదు, పరపురుషుని చేరటం నిందింపదగినది, ఇది నీచకార్యం. కనుక, వెంటనే మీ భర్తల దగ్గరకు వెళ్ళండి అని అనునయ వాక్యాలు పలికినాడు. మీమీ ఇండ్లలోనే ఉండి నాపై ప్రేమ కలిగి ఉండండి అని చెప్పిన కృష్ణుని మాటలు విని గోపికలు సహించలేకపోయినారు. విరహాగ్ని శిఖలలో నిట్టూర్పులు విడిచినారు. ఆ నిట్టూర్పుల వేడికి ముఖాలు వాడి పోయాయి. పొంగిన దుఃఖంలో మాటలు రాక తలవంచుకొని,

కాలిని నేలతో వ్రాస్తూ కాటుకతో నిండిన కన్నీటిని విడుస్తున్నారు. "ప్రియము లాడని ప్రియుని" చూచి బెగ్గడిల్లి గద్గద స్వరంతో నీవింత క్రూరంగా మాట్లాడడం తగదు.

*అకటా నమ్మితి మేము క్రూరుండన నిన్నర్థంబె మా యిండ్లలో*
*సకల వ్యాప్తులడించి నీ పద సరోజాతంబు లర్చింపంజి*
*క్కక్క యేతెంచితి మీశుండాధ్యుండు ముముక్షాసక్తులం గాచుపో*
*లికం గావం దగుం గావవే విడువమేలే కాంతలన్ భ్రాంతలన్*

ముముక్షువులను ఆర్తితో నీవే విధంగా స్వీకరిస్తావో ఆ విధంగా స్వీకరించుమని గోపికలు కృష్ణుని ప్రార్థించినారు. ఇంకా గోపికలు కృష్ణునితో నీ ధర్మోపదేశాలు వినడానికి రాలేదు మేము. ధర్మాచరణం కంటే ప్రియమైనది ఆత్మ. దాని కన్నా ప్రియతముడవు నీవు. లోకంలోని భర్తలు, బిడ్డలు మొదలైన వారు ఒకనాడు సుఖాన్ని కలిగిస్తారు.

ఒకనాడు వారే దుఃఖాన్ని కలిగిస్తారు. కాని నీవో, ఎప్పుడూ ఆనందాన్ని కలిగించే నిత్య బంధువువు. నీ వేణుగానానికి తరుమృగఖగ గోగణాలే పులకించి పోయినాయి. "అబలలు గరగరె నిను గన్న నీదు గానము విన్నన్" అని నిష్ఠూరాలాడినారు. మేము మాత్రం మా ధర్మాన్ని ఆచరిస్తూ ఇండ్లలో ఉండగలమా?

**సీ॥ ఈ పంచ బాణాగ్నినే వెంట నార్తుము**
**నీ మంజువాగ్వృష్టి నెగడదేని**
**నీ మన్మథాంబోధి నే త్రోవం గడతుము**
**నీ దృష్టి నావయై నిలువదేని**
**నీ చిత్తజ ధ్వాంతమే జాడం జెఱుతుము**
**నీ హాసచంద్రిక నిగడదేని**
**నీ దర్పక జ్వరమే భంగి నడంతుము,**
**నీ నవాధర సుధ నింపవేని.**

**ఆ॥ నెట్లు నిర్వహింతు మేలాగు మాలాగు,**
**కరుణ సేయవేనిం గదియవేని**
**మరుడు నిర్దయుండు మననిచ్చునే**
**యశోదా కుమార యువతి ధైర్యచోర**

మా ఆర్తిని పోగొట్టడానికే అవతరించిన నీవు మాకోసం యాచింపనక్కరలేదు. కొండలనెత్త నవసరం లేదు. అమరులను కాచిన విధంగా దయతో "అభయ హస్తము మాయురముల శిరముల ప్రమదంబున నిడుము మూర్ఛ పాల్పడకుండన్" అని పరిపరి విధాలుగా గోపికలు తాము కృష్ణునికే చెందిన వారమని వేడినారు. శ్రీకృష్ణుడు గోపికల దుఃఖం తొలగించడానికి వారిని చేరినాడు. వారితో చేరడం కామం వల్ల కాదు. అతడు ఆత్మారాముడు. ఆత్మలన్నీ తనవిగా కలిగి, ఆత్మలలో సంతతం చేరి ఉండి, వాటికి ఆనందాన్నిచ్చి ఆనందించేవాడు. గోపికలు వికసించిన ముఖాలతో కృష్ణుని చుట్టూ చేరగా కృష్ణుడు కూడా వారితో కలిసి గానం చేస్తూ వైజయంతీమాలను ధరించి విహరించినాడు. యమునాతీరం చేరి గోపికలను ఆలింగనం చేసుకొని, వారి ముంగురులను సవరించి పరిహాసాలు చేసి, విలాసంగా చూసి, నవ్వి తనపై వారికి కలిగిన ప్రేమను ఉద్దీపింప చేసినాడు. ఇవన్నీ లౌకికమైన చేష్టలుగా కనిపించినా సాక్షాత్తు, ఆనందమే పురుషాకృత్రియై వెలసింది. కనుక మోక్షం పొందిన తరువాత ఇవన్నీ పైలోకంలో ఆత్మపొందే అనుభవాలుగా చెపుతారు. ఇది మన మాటలకు, మనసుకు అందనిది. ఇంత ఆనందాన్ని ఒకేసారి గోపికలు భరించలేరని కృష్ణుడు హఠాత్తుగా అంతర్ధానమైనాడు. (సశేషం)

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...)

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

తిరుక్కోళూరమ్మాళ్ "దైవత్తై పెత్తేనో దేవకియార్పోలే" అంది.

"అంటే ఏమిటో వివరంగా చెప్పవా...!"

నమ్మాళ్వారేమో 'మా యాదవ దేవుడా! (ఎజ్గిళాయర్ తేవు) అని పిలిచారు.

పెరియాళ్వారేమో 'నువ్వు మామూలు గొల్లపిల్లవాడివి కాదు. మా దైవమే" (ఆయరే పుత్తిరనల్లన్ అరుమేదైవమ్) తిరుక్కోళూరమ్మాళేమో 'దేవకిలా దైవాన్ని కన్నానా?" అన్నది.

'ఇప్పుడర్థమయిందక్కా. శ్రీకృష్ణుడు క్షత్రియ వంశంలో పుట్టి యదువంశంలో పెరిగాడు.

"ఈ సందర్భంలోనే తిరుక్కోళూరమ్మాళ్ ఇంకొక మాట కూడా అన్నది. అదేమిటంటే ఆళ్ళిమరై ఎన్నేనో వసుదేవరైప్పోలే?"

"అంటే అర్థమేమిటక్కా?"

"ఇందాక చెప్పాను కదా! శ్రీకృష్ణుడి శంఖ చక్రాది ఆయుధాలు, చతుర్భుజాలు ఉపసంహారం చేయమని వసుదేవుడు ప్రార్థించగానే శ్రీకృష్ణుడు తండ్రి మాటకు కట్టుబడి ఆయుధాలను, చతుర్భుజాలను దాచుకున్నాడని. వసుదేవుడు ఎందుకలా చెప్పాడు?"

"కంసుడి వలన శ్రీకృష్ణుడికి ఏదైనా ఆపద వస్తుందేమో నన్న భయం వలన కదా...!" వేద.

"సరిగ్గా చెప్పావు. అంటే, శ్రీకృష్ణుడి మీద ప్రేమ. శ్రీకృష్ణుడంటే సాక్షాత్ నారాయణమూర్తి. ఆ పరమాత్మ మీద ప్రేమ వలనే కదా వసుదేవుడు ఆయననే పుత్రుడిగా పొందాలను కున్నాడు. ఆ అపారమైన ప్రేమ వలనే కదా ఆయుధాలు, చతుర్భుజాలు ఉపసంహరించమన్నాడు. నాకు పరమాత్మ మీద అంతటి ప్రేమ లేదే అని తిరుక్కోళూరమ్మాళ్ వాపోతున్నారు.

"అక్కా మరి యశోదకు శ్రీకృష్ణుడు తన బిడ్డ కాదని తెలుసా?"

"తెలియదు. ఆమె శ్రీకృష్ణుడు తను కన్నబిడ్డ అనే భావించింది. ఎంతో ముద్దు, మురిపెంగా పెంచుకుంది. పెరియాళ్వార్ అనుగ్రహించిన పెరియాళ్వార్ తిరుమొళ్ళిలో యశోద శ్రీకృష్ణుడిని ఎలా పెంచింది. పసిపిల్లలకు చేసే వేడుకలు ఎలా చేసింది, ఆ పిల్లవాడి అల్లరికి ఇరుగుపొరుగు ఎలా గొడవ చేసింది ఎంతో చక్కగా చెప్పారు తెలుసా...!"

"అమ్మా, బామ్మా కలిసి పాడుతుంటారుగా... విన్నాలే"

"అంతే కాదు, యశోదశ్రీకృష్ణుడిని గోవులు మేపుకు రావటానికి పొద్దున్నే చద్దన్నం మూట, చేతికో కర్ర ఇచ్చి పంపటం, తీరా పంపాక అయ్యయ్యో... చిన్నబిడ్డను అన్యాయంగా అడవికి పంపానే అని బాధపడడం...

"మరి శ్రీకృష్ణుడు దేవుడని యశోదకు ఎప్పటికీ తెలియదా?"

"శ్రీకృష్ణుడు అవతరించిన క్షణం నుంచీ అవసరం వచ్చినప్పుడల్లా తన పరతత్త్వం చూపించాడు. కాని, అంతలోనే ఏమీ తెలియని గొల్లపిల్లవాడిలా మారిపోయేవాడు.

"ఎలా...?"

"ఒకసారి ఏం జరిగిందంటే, పిల్లలందరూ ఆడుకుంటూ ఉత్తుత్తి అన్నాలు తింటుంటూ శ్రీకృష్ణుడు నిజంగా మట్టి తీసుకొని నోటి నిండా పోసుకున్నాడు. తోటిపిల్లలు యశోద దగ్గరకు పరుగున వచ్చి 'యశోదమ్మా మీ కృష్ణుడు మట్టి తింటున్నాడ'ని చెప్పారు. యశోదకు ఒక్కసారే చాలా కోపం వచ్చింది. ఇంటినిండా బానలకొద్దీ పాలు, పెరుగు, వెన్న ఉండగా మట్టి తింటాడా? అని కోప్పడ్డది. అప్పుడు కృష్ణుడేమో అమాయకంగా ముఖం పెట్టి "మట్టి తినలేదన్నాడు. అయితే నోరు తెరిచి చూపించమన్నది. శ్రీకృష్ణుడు నోరు తెరిచాడు.... ఇంకేముంది.. ఆ నోరు చూసి యశోద మూర్ఛవచ్చి పడిపోయింది.

"ఎందుకు? అంత మట్టి ఉందా నోట్లో...!"

"కాదురా పిచ్చితండ్రీ! సమస్త లోకాలు ఆయన నోట్లోనే

ఉన్నాయి. పరమాత్మ ఆదిమూలం కదా! సమస్త లోకాలు ఆయనలో ఉంటాయి. ఆయన అంతటా వ్యాపించి ఉంటాడు."

"అదెలా సాధ్యం...?"

"నీలో ఉన్న ప్రతీ అణువు నీదే కదా! అంటే ప్రతీ అణువులోనూ నువ్వున్నావు. అలాగే ఆ అణువులన్నీ కలిసి నువ్వు. అందులో ఏ భాగం లేకపోయినా నువ్వు సంపూర్ణంగా లేనట్టే! అర్థమయ్యిందా?"

"అవుతూ ఉంది.."

"సరే మెల్లగా అర్థం చేసుకో! పరమాత్మలో సమస్త లోకాలు, ఆ లోకాలలో ఉండే పదార్థాలు ఇమిడి ఉంటాయి. పరమాత్మ అంతటా వ్యాపించి ఉంటాడు. ఈ చిన్నికృష్ణుడు అదంతా తన చిన్నినోరు తెరచి చూపించాడు. యశోద అనుకుంది "వీడు మన గొల్లపిల్లవాడు కాదు. పరమాత్మ" అని మూర్ఛపోయింది. మళ్ళీ కృష్ణుడు అమాయకంగా ముఖం పెట్టగానే జరిగింది మర్చిపోయి 'నా బిడ్డే కదా' అని చంకన ఎత్తుకుంది. ఇలా కృష్ణుడు ఎన్ని చేష్టలు చేశాడో..."

"ఆ నందగోకులంలో....."

"ఇంకో చేష్ట చెప్పవా..."

"ఒకసారి ఇంద్రుడికి బదులుగా గోవర్ధనగిరికి పూజలు చేయించాడు కృష్ణుడు.

"ఇంద్రుడికెందుకు పూజలు చేయాలి?"

"ఎందుకంటే గోవులకు గడ్డి, మనుషులకు తిండి కావాలంటే పంటలు పండాలి. పంటలు పండాలంటే వర్షాలు కావాలి. వర్షాలనిచ్చేది ఇంద్రుడు. అందుకే నందగోకులంలో సంవత్సరానికొకసారి ఇంద్రుడికి పూజలు చేసేవారు. అయితే ఆ పనికి ఇంద్రుడిని నియమించింది నారాయణుడే. ఇంద్రుడు ఆ విషయం మర్చిపోయి. తానే గొప్పవాడినని అహంకారం పెంచుకున్నాడు. అందుకే కృష్ణుడు ఆ సంవత్సరం "ఇంద్రుడికి బదులుగా గోవర్ధనగిరికి పూజలు చేద్దాం" అన్నాడు.

"గోవర్ధనగిరికే ఎందుకు?"

"గోవర్ధనగిరి పశువులకు మేతనిస్తోంది. పిల్లలకు కాయలు, దుంపలు, పండ్లు, ఔషధాలు... ఇంకా ఎన్నో ఇస్తుంది. అందుకన్నమాట..."

"సరే! తరువాత ఏం జరిగింది?"

"ఇంద్రుడికి కోపం వచ్చి రాళ్ళవర్షం కురిపించాడు."

"అమ్మో! అలా రాళ్ళు కురిస్తే దెబ్బలు తగలవూ!"

"అందుకేగా శ్రీకృష్ణుడు గోవులను, గోపాలురను కాపాడటానికి గోవర్ధనగిరినే ఎత్తాడు. ఎలా తెలుసా తన చిటికెన వేలు మీద......"

"అమ్మో! ఎంత కష్టం... అలా ఎన్నాళ్ళు.......?"

"వారం రోజులు అలా రాళ్ళవర్షం కురుస్తూనే ఉంది. ఏడు రోజులూ శ్రీకృష్ణుడు తన చిటికెనవేలుమీద ఆ గిరిని అలా ఆపి ఉంచాడు. అప్పుడు ఆ గొల్లపిల్లలంతా ఆశ్చర్యపోయారు. భయపడ్డారు. "కృష్ణా నువ్వు దేవుడివా? నీకింత శక్తి ఎక్కడిది? నువ్వు ఎవరు?" అన్నారు.

"అప్పుడు కృష్ణుడు ఏం చెప్పాడు?"

"నేను మీలో ఒకడిని. మీవాడిని. మీ బంధువుని. నన్ను వేరు చేసి మాట్లాడవద్దు" అన్నాడు. ఆ వాన తగ్గి అందరూ గోకులం చేరగానే పిల్లలు మామూలుగా కృష్ణుడితో ఆడి, పాడి కలిసి అన్నాలు తిని, చాడీలు చెప్పుకుంటూ కృష్ణుడు దైవమన్న మాటే తలచకుండా తమలో ఒకడిగానే భావించారు. అలాగే యశోదకూడా కృష్ణుడిని తన పిల్లవాడుగానే భావించి తమ కులధర్మాలు, ఆచారాలు నేర్పి, కృష్ణుడిని కట్టి, కొట్టి, లాలించి, పాలించింది యశోద. అందుకే తిరుక్కోళూరమ్మాళ్ "ఆయనై వళర్తేనో యశోదయైప్పోలే" అంది.

"ఆయన్ అంటే అర్థమేమిటక్కా?"

"గొల్లవాడు. సృష్టి, స్థితి, కారకుడు. సమస్త జీవాత్మలకు నియామకుడు అయినవాడిని తాను నియమించింది కదా యశోద. ఆమె ఎంతటి భాగ్యశాలి. అంతటి భాగ్యం నాకు అబ్బలేదే" అని తిరుక్కోళూర్ అమ్మాళ్ బాధపడుతోంది. *(సశేషం)*

# నేర్చుకుందామా! - 8

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

**మ॥ వరవైకుంతము సారసాకరము, దివ్య స్వర్ణశాలాంక గో**
**పుర హర్మ్యావృతమైన తద్భవన మంభోజంబు, దన్మందిరాం**
**తర విభ్రాజిత భోగి కర్ణిక తదుద్యద్భోగ పర్యంకమం**
**దిర వొందన్ వసియించు మాధవుడు దానేపారు భృంగాకృతిన్.**

*ఆంధ్రమహాభాగవతము మూడవ స్కంధము 51వ పద్యము*

పోతనామాత్యులు తమ భాగవతములో మనోహరంగా అందించిన పద్యరత్నమది.

లోకోత్తరమైన వైకుంతము ఒక సరోవరమట. సరస్సులో ఏముంటాయి? పద్మాలు. ఇక్కడ ఉన్న ఒక మహామందిరము ఆ సరస్సుమధ్యలో ఉన్న పద్మమట. ఆ అందాల మందిరంలో బంగారు మంటపాలు, గోపురాలు, మేడలు ఎన్నో ఉన్నాయి. ఆ మంటపం మధ్యభాగంలో ప్రకాశించే ఆదిశేషుడే తామరమధ్యలో ఉండే దుద్దు. ఇవన్నీ ఒక ఎత్తు, ఆ శేషతల్పంపై శయనించే ఆ మాధవుడున్నాడే అమనే తుమ్మెద. ఇదీ పోతన్నగారి అద్భుత వర్ణన.

లోకంలో చెఱువు, అందులో పద్మం, దానిమధ్య దుద్దు, దానిపై వ్రాలిన తుమ్మెద కనిపిస్తూనే ఉంటాయి. కాని ఒకలోకాన్ని చెఱువుగా అందులో ఒక భవనాన్ని పద్మంగా అక్కడ ఆదిశేషుని ఆ పద్మం మధ్యలో ఉన్న దుద్దుగా, ఆ శేషతల్పంపై శయనించిన శ్రీహరిని తుమ్మెదగా భావించి చెప్పడం అనేది మహనీయుడైన కవికి తప్ప ఇతరులకి సాధ్యం కాని విషయం కదా!

## ఏప్రిల్ మెదడుకి మేత! సమాధానములు

1. దేహేంద్రియభోగమే పర్యవసానంగా కలవారు. పరమాత్మయే విశ్రాంతి స్థానంగా కలవారు. 2. దేహము, మనస్సు, పరమాత్మ, జీవుడు, 3. పరోపకారం, 4. పార్వతి, 6. గుర్తు, రాజముద్రిక, 7. కీర్తి, సంపద, లోకజ్ఞానం, శుభపరంపరలు, 8. సారసము, కోకిల, హంసలు, చిలుక, క్రౌంచం, నీరుకోడి, 9. యజ్ఞభోక్తగా, 10. తత్త్వజిజ్ఞాస, 12. ఛాందోగ్యఉపనిషత్, 6వ ప్రపాఠకం, 13. పృశ్ని సుతపులు, 14. నాథా లేదా స్వామి, 15. సత్యవ్రతం, త్యాగం, మనోబలం, 16. "ఆత్మానం మానుషం మన్యే", 17. చార్వాకులు, 18. సున్నం, పసుపు, 19. మనసుకి వచ్చే జబ్బులు, 20. కంటికి కనపడనిది, 21. విభూతి విస్తర యోగం, 22. ధృతి, క్షమా, దమం, అస్తేయం, శౌచం, ఇంద్రియ నిగ్రహం, హ్రీ, విద్యా, సత్యం, అక్రోధం, 23. పొగరుబోతుల్ని, 24. పాములు, 25. భగవద్రామానుజులు




తొండరడిపొడి ఆళ్వార్ అనుగ్రహించిన

# తిరుప్పళ్ళియెళుచ్చి

శ్రీరంగనాథుని సుప్రభాత గీతిక

శుదరొళి పరన్దన శూర్న్తిశై యెల్లామ్
తున్నియ తారకై మిన్నొళి శురుంగి
పదరొళి పశుత్తనన్ పనిమతి యివనో
పాయిరు ళకన్దతు పైమ్బొళ్గిల్ కముగిన్
మదలిడై క్కీఱి వణ్పాళైగళ్ నాఱ
వైకఱై కూర్న్దదు మారుత మితువో!
అడలొళి తికళ్ద్ తరు తికిరి యం తడక్కై
అరంగత్తమ్మా! పళ్ళి ఎళున్దరుళాయే ॥ 3

| | | |
|---|---|---|
| శుదర్ | = | ప్రకాశించు |
| ఒళి | = | కాంతి |
| దిశై | = | దిక్కులందు |
| ఎల్లాం | = | అంతటను |
| శూర్న్ | = | చుట్టుకొనుచు |
| పరన్దన | = | వ్యాపించినది |
| తున్నియ | = | దట్టమగు |
| తారకై | = | నక్షత్రములయొక్క |
| మిన్ | = | మెరిసే |
| ఒళి | = | కాంతి |
| శురుంగి | = | క్రమముగ తగ్గి |
| పదర్ ఒళి | = | రాత్రి మిక్కిలి కాంతులీనిన |
| పశుత్తనన్ | = | పసిమికల (పచ్చగాఉన్న) |
| పని మది | = | చల్లని చంద్రుడునూ; |
| ఇవన్ | = | ఇదిగో (కాంతిహీనుడాయెను) |
| పాయ్ ఇరుళ్ | = | అలుముకొనిన చీకటి |
| అకన్దదు | = | తొలగినది. |
| పైమ్ పొళిల్ | = | పచ్చగానున్న తోటలలోని |
| కముకిన్ | = | పోకచెట్లయొక్క |
| మదలిడై | = | మట్టలమధ్యభాగాన్ని |
| కీఱి | = | చీల్చుకొని (తొలగించుచు) |
| వణ్ పాళైకళ్ | = | అందమైన పోక గుత్తులు |
| నాఱ | = | పరిమళించగ |
| వైకఱై మారుతమ్ | = | మలయమారుతము |
| ఇదు కూర్న్దదు | = | ఆ పరిమళములు నింపుకొని ఇదుగో వీచుచున్నది. |
| అడల్ | = | ధ్వనించుచు |
| ఒళి తిగళ్దరు | = | అధిక కాంతులీను |
| తిగిరి | = | శ్రీసుదర్శన ఆళ్వారులు |
| అమ్ తడమ్ కై | = | అందమైన విశాలమగు చేతియందుగల |
| అరంగత్తమ్మా! | = | శ్రీరంగనాథా! |
| పళ్ళి యెళ్ళున్దు | = | పడకనుండి లేచి |
| అరుళాయే | = | కృపచేయుమా! |

***తా:*** ప్రభాత భాస్కరుని నులివెచ్చని కాంతికిరణములు దిక్కులన్నియు చుట్టుముట్టదలచి లేచినవి. అది చూచి అసంఖ్యాక నక్షత్రములయొక్క మిలమిలమెరయు రాత్రి మెరుపులనన్నియు సిగ్గుతో ముడుచుకుపోయినవి. ఇతడేనా! గొప్పగ వెలిగిన చల్లని జాబిల్లి? ఎట్లు వెలవెలబోవుచున్నాడో చూడుమా!.

రాత్రంతా ఎదురులేకుండగ రాజ్యమేలిన గాఢాంధకారమేదీ! ఎపుడో పారిపోయింది. ఇపుడు గద, పచ్చటి పచ్చికబయళ్ళలోని పొదుగాటి మట్టల చీల్చుకొని, పోకలు నిన్ను చూడవలెనను ఆత్రుతతో, గుత్తులు గుత్తులు పూచి తమ 'దివ్యపరిమళము'లను కానుకలను ప్రభాత మలయ మారుతములద్వారా నీదరి జేర్చుచున్నవి. సాటిలేని దీప్తితో ప్రకాశించు శ్రీ సుదర్శనాళ్వార్లను ధరించిన విశాలమైన సుందరహస్తము కలవాడవు కదయ్యా! ఇదిగో అందుకో! వీటినన్నింటినీ కటాక్షించుటకు స్వీకరించుటకు లేచిరావయ్యా! మా కొఱకు యిక్కడకు వచ్చి, ఇంకనూ పడుకొనుట సబబా?

మేట్టిళ మేతికళ్ తళైవిడు మాయర్‌కళ్,
వేయ్ంగుఝ్లోశైయుం విడై మణి క్కురలుం,
ఈట్టియ విశై తిశై పరన్దన వయలుళ్,
ఇరిన్దన శురుమ్బిన మిలంగైయర్ కులత్తై,
వాట్టియ వరిశిలై వానవరేఱే!,
మాముని వేళ్వియై కాత్తు అవపిరదమ్,
ఆట్టియ వడుతిఱ లయోత్తి యెమ్మరశే,
అరంగత్తమ్మా! పళ్ళి ఎఝున్దరుళాయే ॥ 4

మేడు = ఎత్తు భూములలో
ఇళ మేదిగళ్ = లేగదూడలను (లేత గేదెలను)
తళైవిడుం = మేతకై విడుచునట్టి
ఆయర్‌గళ్ = గొల్లలయొక్క
వేం కు ల్ = వెదురు పిల్లనగ్రోవి
ఓశైయుం = నాదమును
విడై = ఎద్దుల మెడలలో వ్రేలాడు
మణి క్కురలుం = గంటల నాదమును
ఈట్టియ ఇశై = ఈరెండు చేరిన శబ్దము
దిశై పరందన = దిక్కులందు విస్తరించినది.
వయలుళ్ = వరిపొలములలో ఉన్న
శురుంబు ఇనం = తుమ్మెదల గుంపు
ఇరిన్దిన = ఝుంకారము చేయుచూ చెదరిపోయినవి
ఇలంగైయర్ కులత్తై = లంకాధిపతి వంశము రాక్షస వర్గమును
వాట్టియ = నాశము చేసిన
వరి = చూడతగిన
శిలై = శార్ఙ్గమను ధనస్సుగల
వానవర్ = దేవతలందరిలో
ఏఱే = శ్రేష్ఠుడా!
మాముని = విశ్వామిత్ర మహర్షియొక్క
వేళ్వియై = యాగమును
కాత్తు = కాపాడి
అవపిరదం = అవభృదస్నానమును
ఆట్టియ = చేయించిన
అడు తిరల్ = విరోధుల నశింపజేయు బలముగల
అయోత్తి = అయోధ్యను ఏలునట్టి
ఎమ్ అరశే = మా రక్షకుడా!
అరంగత్తమ్మా! = శ్రీరంగనాథా!
పళ్ళియెఝున్దు = పడకనుండి లేచి
అరుళాయే = కృపచేయుమా!!

***తా:*** ఎత్తుగ బలిసిన లేగదూడలను పెద్దమేతకై వదలిన గొల్లపిల్లలు నిశ్చింతగ ఊదుకొను పిల్లనగ్రోవి నినాదములు, దానికి తానముగ ఎద్దులయొక్క, మహిషములయొక్కయు మెడలలో కట్టిన చిరుగంటల ధ్వనియు కలిసి నలుదిక్కులయందును మారుమ్రోగుచున్నవి.

చెరువులోని కలువలలో రాత్రి తేనెలారగించి మత్తెక్కిన తుమ్మెదల జంటలు ఈ ధ్వనిచే మత్తుదిగి ఝుంకారములతో చెదిరిపోవుచున్నవి. స్వామీ! మరి నీవో! మేలుకోవద్దా!

లంకాసురుని వంశమును సమూలముగ నశింపజేసిన ఉజ్జ్వల ధనస్సు కలవాడా! విభీషణుని దేవతలకోటిలో చేర్చిన దేవదేవా! నిన్నెరింగిన విశ్వామిత్రుని యొక్క నీయారాధనయనెడి యజ్ఞమునకు ఏ ఆటంకములూ రాకుండా కాపాడి, అవభృదము చేయించిన విరోధి నిరసన శీలుడా! అయోధ్యాధిపతీ శ్రీరామచంద్రా! మమ్ము రంజింపజేయుస్వామీ! శ్రీరంగనాథా! నిన్ను లేపుటకు మరొక విశ్వామిత్రుడు రావలెనా! తెల్లవారిపోయినది లేచి కటాక్షించవయ్యా!

# శ్రీనృసింహావతార వైశిష్ట్యం

డా॥ కండ్లకుంట్ల నరసింహమూర్తి- జనగామ

శ్రీమన్నారాయణుడు ధరించిన అనంతమైన అవతారాలలో దశావతారాలు సుప్రసిద్ధమైనవని భారతాది ఇతిహాసాలు ప్రకటించాయి.

ఆ పది అవతారాలలో నాలుగవది నరసింహావతారం. వానిలో మొదటి మూడు మత్స్య, కూర్మ, వరాహావతారాలు జంతుస్వరూపాన్ని కలిగి ఉన్నాయి.

నాలుగవదైన నరసింహావతారంలో నరుడు, సింహం కలిసి ఉన్న మిశ్రమ రూపం కనిపిస్తుంది.

**నరసింహః** : అంటే **నర ఇవ సింహ ఇవ చ ఆకృతిర్యస్యేతి** నరునివలె, సింహమువలె కల రూపము ఏ మూర్తికి ఉన్నదో, ఆ మూర్తి నరసింహుడు అని వ్యుత్పత్త్యర్థం. **"నరవత్ సింహ వచ్చైవ యస్యరూపం మహాత్మనః"** అని మంత్రరాజపదస్తోత్రంలో కూడ చెప్పబడింది. 'నర' శబ్దార్థాన్ని గురించి విచారించగా **"నకారో ఈశ్వరో భవతి, రకారో అణ్డః విరాడ్భవతి"** అని తారసారోపనిషత్తు వివరించినట్టు నకారం విష్ణువు, రకారం విరాట్టు అలాగే 'సింహ' శబ్దం లయార్థంలో ప్రయుక్తమైందని భావిస్తే, పరమాత్మ లయార్థమై సృష్టిలోకి అవతరించినట్లు 'నరసింహ' శబ్దోత్పత్తిని గమనించవచ్చు. మనుష్యుడు ప్రాణులలో ఉత్తముడు, పరాక్రమంలో సింహం శ్రేష్ఠమైంది. అందువల్ల స్వామి మనుష్య, సింహాల ఆకృతిని ధరించాడు. సింహరూపుడయి నప్పటికి భక్తులకాతడు అభయంకరుడే!

హిరణ్యకశిపుడు బ్రహ్మదేవుని గురించి మందరగిరిపై కఠోర తపస్సు చేశాడు. ఆతని తపస్సుకు మెచ్చి చతుర్ముఖుడు ప్రత్యక్షం కాగా, హిరణ్యకశిపుడు వింతైన వరాలు కోరుకున్నాడు.

**"భూతేభ్యః త్వద్విసృష్టేభ్యః మృత్యుర్మాభూన్మమ ప్రభో!"**

*(శ్రీమద్భాగవతం. 7స్కం. 3అ. 40శ్లో॥)*

అని బ్రహ్మసృష్టిలోని ఏ ప్రాణివల్లా తనకు మృత్యువు కలుగ కూడదని, లోపల, వెలుపల, పగలు, రేయి, ఆయుధాలు, భూమి ఆకాశం, నరులు, మృగాలు, ప్రాణసహితాలు అయిన వాటివల్ల, సురాసుర మహోరగులవల్ల తనకు మరణం సంభవించకూడదని వరాలు అర్థించాడు. పరమ దుర్లభాలైన ఆ వరాలన్నింటినీ బ్రహ్మ అనుగ్రహించాడు. కనుక ఆ దుష్ట రాక్షసుని అంత మొందించేందుకు బ్రహ్మసృష్టిలో లేని వింతైన రూపాన్ని ధరించి స్వామి అవతరించవలసి వచ్చింది.

స్వామి విచిత్రంగా స్తంభంలో నుండి ఆవిర్భవించాడు. ఎందుకంటే-

**సత్యం విధాతుం నిజభృత్య భాషితం**
**వ్యాప్తిం చ భూతేష్వఖిలేఽషు చాత్మనః ।**
**అదృశ్యతాత్యద్భుత రూపముద్వహన్**
**స్తంభే సభాయాం న మృగం న మానుషం ॥**

తనను నమ్ముకున్న పరమభక్తుడైన ప్రహ్లాదుని మాట నిజం చేయాలి. అలాగే తాను సర్వాంతర్యామి అనే విషయాన్ని నిరూపించాలి. కనుకనే అత్యద్భుతమైన నరసింహరూపాన్ని ధరించి రాక్షస రాజసభలోని స్తంభంనుండి స్వామి ఆవిర్భవించాడు. ప్రహ్లాదరక్షణ కొరకు స్వామి ఈ విచిత్ర రూపాన్ని ధరించి సృష్టిలోని చేతనా చేతన పదార్థాలన్నింటిలో దాగి ఉన్నాడు. అయితే మిగిలిన ప్రపంచం ఆయనను తన గర్భంలో ధరించి ఉండగా, కేవలం ఆ స్తంభం మాత్రమే నృసింహునికి జన్మనిచ్చి ఆ స్తంభం లోకాలన్నింటికి నాయనమ్మ అయింది **"స్థూణా పితామహీ అభూత్"** అని వేదాంత దేశికులు మనోహరంగా వర్ణించారు.

మన ఋషులు, పూర్వాచార్యులు నరసింహావతారాన్ని దివ్యసుందరరూపంగా అభివర్ణించారు. ఆయన ఉగ్రమూర్తి అయినప్పటికి ప్రహ్లాదుని వంటి భక్తులకు ఆకర్షణీయమైన సుందరమూర్తిగా దర్శనమిస్తాడు. హిరణ్యకశిపుని వలె తలచేవారికి ఆయన భయంకరమూర్తిగానే స్ఫురిస్తాడు. తిరుమంగైయాళ్వారు **'అఙ్గియ సింగర్ తానే అరియురువుం తానే'** అని సింహాన్ని తనలో భాగస్వామిగా చేసుకొని సుందరమూర్తి అయినట్లు వర్ణించారు. నరసింహునివలె ప్రతిచోటా వ్యాపించిన అవతారం మరొకటి లేదు కనుక నమ్మాళ్వారు **"యెంగుమ్ నాడినాడి నరసింగా వెన్రు"** అని అంతటా నరసింహునే వెదకేవారు.

ఆయనవలె సర్వాంతర్యామి అయిన స్వరూపం వేరొకటి లేదని వారి భావన.

ఆగ్రహానుగ్రహాలు ఏకకాలంలో ప్రదర్శించిన ఈ అద్భుత అవతారానికి సమానమైన అవతారం ఇంకొకటి లేదు. మధురం, ఉపశమన కారకమైన దయ, భయానకం, ఉగ్రమైన క్రోధం ఏకకాలంలో ఆయన కంటినుండి వెలువడ్డాయని వేదాంత దేశికులు వర్ణించారు. ఒకేకాలంలో నరసింహుని నేత్రం నుండి వెలువడిన కోపం హిరణ్యకశిపుని హృదయంలో భయాన్ని పుట్టించగా, అదే కంటినుండి వెలువడిన దయావర్షం ప్రహ్లాదుని పులకిత గాత్రుని చేసింది. నరసింహుని అఘటన ఘటనా సామర్థ్యాన్ని వెల్లడించే ఈ చర్యను కవి సింహుడు "నరసింహత్తిన్ పొకు ఒరు కవిసింహత్తుక్కు తావె తెరియమ్" అని లోకానికి వెల్లడించారు. రుక్మిణీదేవి శ్రీకృష్ణునికి తన ప్రణయ సందేశంలో..

**"..... ధీరాపతిం కులవతీ నవృణీత కన్యా**
**కాలే నృసింహ నరలోక మనోభిరామమ్"**

*(శ్రీమద్భాగవతం 10స్కం 52 అధ్యా॥ 40శ్లో॥)*

అని నిర్దిష్ట సమయానికి వచ్చినవాడా! అని ఆయన అవతారంలోని మరో విశిష్ట లక్షణాన్ని అభివర్ణించింది. సకాలానికి ప్రత్యక్షమై తన భక్తుడైన ప్రహ్లాదుని ఆపద నుండి కాపాడిన ఉదంతాన్ని ఆమె స్మరించుకున్నది.

**వృషభే స్వామి నక్షత్రే చతుర్దశ్యాం శుభేదినే ।**
**సంధ్యా కాలేన సంయుక్తే స్తంభోద్భూతో నృకేసరీ!॥**

శ్రీ నరసింహ స్వామి వృషభమాసంలో, స్వాతీ నక్షత్రయుక్త చతుర్దశిరోజు సంధ్యాకాలంలో స్తంభం నుండి ఆవిర్భవించాడు. సూర్యుడు వృషభరాశిలో సంచరించే నెలరోజుల కాలాన్ని సౌరమానం ప్రకారం వృషభ మాసమంటారు. వృషభరాశికి శుక్రుడు అధిపతి. శుక్రుడు రాక్షసగురువు. ఒక ప్రముఖ రాక్షసవీరుని సంహరించేందుకు స్వామి రాక్షసగురువుయొక్క మాసాన్ని ఎంచుకున్నట్లు భావించవచ్చు. అలాగే స్వాతీ నక్షత్రం చర నక్షత్రం మరియు తిర్యక్ నక్షత్రం. తాను చరరూపమైన తిర్యక్ (జంతు) ఆకారాన్ని ధరించబోతున్నాడు కనుక స్వాతిని గ్రహించినట్లు ఊహించవచ్చు.

నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణ – తిథులని మొత్తం తిథులు ఐదు విధాలు. వానిలో చవితి, నవమి, చతుర్దశి, రిక్త తిథులు. ఈ రిక్త తిథులు శుభకార్యాలకు శ్రేష్ఠమైనవి కావని జ్యోతిష వేత్తలంటారు. కాని, ఈ రిక్త తిథులైన చవితిరోజు వినాయకుడు, నవమిరోజు శ్రీరాముడు, చతుర్దశిరోజు శ్రీ నృసింహుడు అవతరించి ఆ తిథుల వైశిష్ట్యాన్ని ఇనుమడింప జేశారని తలవంచవచ్చు. కనుకనే "చతుర్దశ్యాం శుభేదినే" అని నృసింహావతార విషయం చెప్పబడింది.

ఉపాసకుల యెడల అనుగ్రహం కోసం నారసింహ తత్త్వం అనేక భిన్న రూపాలలో దర్శనమిస్తూ ఉంటుంది. నవవిధ రూపాలతో అహోబిలంలోను, వరాహనారసింహ రూపంతో సింహాచలంలోను, పానకాలనృసింహ రూపంతో మంగళగిరి లోను, పంచవిధ నారసింహ రూపాలతో వేదాద్రి, యాదగిరిగుట్ట వంటి క్షేత్రాలలోను, ఇంకా అనేక ప్రాంతాలలో వేరు వేరు రూపాలతోను స్వామి భక్తుల పూజలందు కుంటున్నారు.



చిత్రకథ - 10

# రామానుజ చిత్రకథ




















ఆ...! ఎంత అశ్లీలవర్ణన. భగవంతుని సౌందర్యాన్ని కించపరచినట్లు.


రామానుజా! ఏమైంది ఆ కన్నీళ్ళేంటి?


గురువుగారూ! ఉపనిషత్తు, భగవంతుని సౌందర్యాన్ని అలా ఎందుకు వర్ణిస్తుంది?


ఏం? నీకు ఇంతకంటే బాగా తోస్తే చెప్పు చూద్దాం!


ఆజ్ఞ...!


నీటిని త్రాగేది తామరతూడు కదా! దాన్ని "కపి" అంటారు. "కం పిబతీతి" కపిః. దానిపైన ఆసం అంటే ఉండేది. "కప్యాసం".


అయితే ఏం తెలిసింది?


కోసి ప్రక్కన పెట్టిన పుష్పంలో కాంతి తక్కువ కదా! అదే నీటిలో కాడపైన ఉంటే కాంతు లీనుతూ ఉంటుంది. అలాంటి పద్మంలాంటి నేత్రాలు కలవాడు.


ఆహ్! బాగుందోయ్!


అవును గురువుగారూ! ఈ ఉపమానం చాలా బాగుంది.


రామానుజా! ఇంకా ఏదో చెప్పాలనుకుంటు న్నట్లున్నావే! చెప్పు... నీ కలవాటే గద!











కాడమీదే ఉన్నా, రాత్రి సమయంలో పుష్పం ముడుచుకొని కదా ఉంటుంది! సూర్యకిరణాలు పడగానే నిగనిగలాడుతూ విచ్చుకుంటుంది. అలాంటి 'అందమైన విప్పారిన నేత్రాలు' అని శ్రుతి చెప్తోంది.







ఇంకా ఉంది..

# హనుమద్వైభవము

*ఈ నెల 15వ తేదీ హనుమజ్జయంతి సందర్భంగా...*

**శ్రీమాన్ సముద్రాల శఠగోపాచార్యస్వామి - వరంగల్**

హనుమంతుడు బుద్ధిబలాన్ని దేహబలాన్ని, యశస్సును, ధైర్యాన్ని, నిర్భయాన్ని, ఆరోగ్యాన్ని, మహోత్సాహాన్ని, వాక్పటుత్వాన్ని సమృద్ధిగా కలవాడు. తనను స్మరించిన భక్తులందరికి తనలోని విలక్షణమైన ఈ గుణసంపదను అనుగ్రహిస్తాడని

**"బుద్ధిర్బలం యశో ధైర్యం నిర్భయత్వమరోగతా।**
**అజాడ్యం వాక్పటుత్వం చ హనుమత్ స్మరణాద్భవేత్॥"**

అనే శ్లోకం ద్వారా తెలియుచున్నది. రామునికి దాసుడైన, స్వామిభక్తి నిండుగా కలిగిన హనుమంతుడు శ్రీమద్రామాయణ మహామాలలో మధ్యమణిగా పేర్కొనదగినవాడని **"రామాయణ మహామాలా రత్నం వందే అనిలాత్మజమ్"** అనే సూక్తితో పెద్దలు పేర్కొన్నారు.

అనితరసాధ్యములైన, అతిమానుషకృత్యములను అద్భుత కార్యాలను, నిర్వహించిన హనుమంతుడు ప్రప్రథమంగా దర్శన మిచ్చేది కిష్కింధాకాండలోనే. ఏడుకాండల రామాయణానికి మధ్యమణిగా ప్రకాశించే కిష్కింధాకాండకు ప్రాముఖ్యం సిద్ధించుటకు, రామసుగ్రీవులమధ్య మైత్రి ఏర్పడుటకు, మూలకారకుడు వాయునందనుడైన హనుమంతుడే.

కిష్కింధాకాండలో మొదలైన హనుమంతుని ప్రశస్తి తరువాతి కాండలైన సుందర, యుద్ధ, ఉత్తరకాండలలో రెట్టింపయ్యింది. కళ్యాణగుణాకరుడైన శ్రీరాముడికి దాసుడనని పేర్కొనే హనుమంతుడిలో అపారపాండిత్యము, స్వామిభక్తి, కార్యదక్షత, బుద్ధికుశలత, దేహబలము, వినయసంపద, ఆత్మ విశ్వాసము, ఏకాగ్రత, వాక్పటుత్వము వంటి విశిష్టగుణములెన్నో కలవు.

సుగ్రీవుని ఆజ్ఞకు బద్ధుడై హనుమంతుడు, క్రొత్తగా అరణ్యంలోకి ప్రవేశించిన రామలక్ష్మణుల స్వరూపస్వభావాదు లను తెలుసుకొనుటకై భిక్షురూపాన్ని ధరించి పలికిన పలుకులే అతనిలోని గుణవైభవాన్ని ఆవిష్కరిస్తాయి. అందుకే గుణాభిరాముడైన శ్రీరామచంద్రస్వామికూడా హనుమద్వైభవాన్ని గుర్తించి కిష్కింధాకాండలోని మూడవసర్గలో హనుమత్ప్రశస్తిని లక్ష్మణస్వామికి వివరించెను.

శ్రీరాముడు లక్ష్మణునితో – ఋగ్వేదంలో సంపూర్ణంగా శిక్షితుడు కానివాడు, యజుర్వేదాన్ని సమగ్రంగా ధారణచేయని వాడు, సామవేదాన్ని శ్రావ్యంగా గానం చేయడం తెలియనివాడు ఈవిధంగా మాట్లాడలేడు. హనుమత్సంభాషణను బట్టి ఇతడు వేదవిదుడు అని నిశ్చయంగా తెలుస్తున్నదని పలికెను.

రాముడు హనుమంతునికి కల వేదపాండిత్యాన్ని అతని మాటలలోనే గుర్తించాడు. ఋగ్వేదంలో ప్రతివర్ణానికి స్వరం ఉంటుంది. స్వరాధిక్యం గల ఋగ్వేదాన్ని అవధానముతో విని, మనసును ఏకాగ్రముగ ఉంచుకొని (ఋగ్వేద) మంత్రోచ్చారణ చేయవలసి యుంటుంది. అందుకే హనుమంతుని మాటల్లోని ఏకాగ్రత, అతనిలోని అవధానము, ఇతడు ఋగ్వేదవినీతుడు అనే విషయాన్ని గోచరింపచేసింది.

యజుర్వేదములోని ప్రతి అనువాకంలో వేరొక అనువాకం లోని వాక్యం తప్పకవస్తూంటుంది. వాక్యసామ్యాన్ని సరిగా గుర్తించకపోతే ధారణలో లోపమేర్పడితే క్రమం తప్పి వేరొక అనువాకంలోని శ్రుతివాక్యాలను పఠించే ప్రమాదం సంభవిస్తుంది. ధారణాశక్తి కలవారు మాత్రమే తాము ప్రారంభించిన అనువాకాన్ని సంపూర్ణంగా క్రమగతిలో పూర్తిగా పఠిస్తారు. అందుకే యజుర్వేదానికి ధారణ అవసరం. అట్టి ధారణాశక్తి హనుమంతునిలో నిండుగా మెండుగా ఉన్నది. కావున హనుమ యజుర్వేదధారి అని శ్రీరాముడుకి తెలిసెను.

సామవేదము గానప్రధానమైనది. సమర్థముగా సమగ్రముగా గానం చేయడానికి ఊహించేశక్తి పరిపూర్ణంగా ఉండవలెను. ఆ ఊహాశక్తి హనుమంతునిలో అత్యధికముగా ఉన్నది. దీనిని బట్టి హనుమంతుడు సామవేద విద్వాంసుడు అని శ్రీరాముడు పేర్కొనెను.

హనుమంతుడు వేదాధ్యయన సంపన్నుడే కాక వేదాంగము లను కూడా క్షుణ్ణంగా అభ్యసించినవాడని కూడా శ్రీరాముడు గుర్తించెను. కావుననే వేదాంగములు ఆరింటిలో ప్రధానమైన వ్యాకరణశాస్త్రాన్ని ఈ హనుమంతుడు చాలాసార్లు గురువు దగ్గర వినియున్నాడు. అందువల్లనే హనుమంతుడు సుదీర్ఘమైన తన సంభాషణలో ఒక్క అపశబ్దాన్ని కూడా ప్రయోగించలేదు (వ్యాకరణ విరుద్ధమైన శబ్ద ప్రయోగాన్ని చేయలేదు).

అంతేకాక వేదాంగములలో ఒకటైన "శిక్షా"ను కూడా ఈ హనుమంతుడు బాగా తెలిసినవాడు. 'శిక్షా' అను వేదాంగము వర్ణములను (అక్షరములను) ఎట్లా ఉచ్చరింప వలెనో, వాక్యాలను ఎట్లా పలుకవలెనో, మాట్లాడునప్పుడు ఏవిధంగా మాట్లాడాలో తెలియజేస్తుంది.

'శిక్షా' స్వరూపాన్ని సమగ్రంగా ఎరిగిన హనుమంతుడు తాను మాట్లాడునప్పుడు ముఖకవళికల్లోగాని, కళ్ళ కదలికల్లో గాని నుదుటిభాగంలో కాని ఇతరావయవాలలో కాని ఏ విధమైన దోషాత్మకమైన వికారాన్ని కలిగియుండలేదు.

సామాన్యులైన కొందరు తాము మాట్లాడేటప్పుడు చేసే తల ఊపుట, చేతులు కాళ్ళు ఊపుట (ముందుకు వెనుకకు ఆడించుట), మాటిమాటికి కనుబొమ్మలు కదలించుట, మాటల మధ్యలో చిన్నచిన్న రాగాలాపనలు చేయుట, సాగదీసి మాట్లాడుట, కళ్ళు మూసుకొనుట వంటి తప్పిదాలను చేస్తారు. కాని అటువంటి దోషములేవి కూడా హనుమంతుడి మాటలలో మచ్చుకైనా కనిపించడం లేదని శ్రీరామచంద్రుడు పేర్కొనెను.

ప్రధానమైన విషయాన్ని మాట్లాడేవారు పాటించాల్సిన నియమాలన్నింటిని హనుమంతుడు తు.చ. తప్పకుండా పాటించాడు. ఉత్తమవక్తకు ఉండవలసిన ప్రధాన లక్షణాలను నిండుగా కలిగియున్నవాడు హనుమంతుడు అని శ్రీరాముడు అభిప్రాయపడెను.

ఉత్తమవక్త చెప్పవలసిన విషయాన్ని ఎక్కువ మాటలతో చెప్పడు. తొందర తొందరగా చెప్పడు. అతినెమ్మదిగా చెప్పబోడు. సందేహం కలుగునట్లుగా, అపార్థం (పెడర్థము) సంభవించు నట్లుగా మాట్లాడడు. అత్యుచ్చ స్వరంలోకాని అతిహీనస్వరంలో కాని మాట్లాడడు. మధ్యమ స్వరంలోనే శబ్దోచ్చారణను చేస్తాడు. పళ్ళు బిగపట్టి లేదా గద్గదముగా కాని, పాటపాడుచున్నట్లు లేక దీనముగా కాని, ముక్కుతో కాని ఊపిరి బిగపట్టికాని మాట్లాడడు. ఈ విధమైన సంభాషణా చాతుర్యము 'శిక్ష'ను అభ్యసించిన హనుమంతునిలో పరిపూర్ణంగా ఉండెను.

హనుమంతుని మాటలలో సంస్కారము నిండుగా కనిపించును. వైయాకరణుడు అయిన ఈ హనుమంతుడు, వర్ణములు ఒకదానిపై మరొకటి దొర్లకుండా అన్ని అక్షరములను స్పష్టంగా పలుకువాడు. అర్థవివరణకు, భావవ్యక్తీకరణకు తగిన పదములనే ఎంచుకొని సంభాషించువాడు, మార్దవమును, సౌలభ్యమును, ప్రసన్నతను, స్పష్టతను తన మాటలలో కలిగి యున్నవాడు, మధురముగా మాట్లాడుచు శ్రోతల హృదయాలను ఆకర్షించువాడు అని శ్రీరాముడు లక్ష్మణునితో పలికెను.

వాక్ చాతుర్యము కల ఈ హనుమంతుని మాటలను విన్నచో, కత్తి చేతిలో పట్టుకొని నరికిచంపుటకు సిద్ధపడిన శత్రువుయొక్క మనుసులో కూడా ప్రీతి కలుగును.

అతడు ఎంతటి కఠినాత్ముడైనా, క్రూరుడైనా వానిని కూడా దయాంతరంగునిగా, మృదుస్వభావిగా, సాధుపుంగవునిగా మార్చగలుగును. ఇట్టి హనుమంతుని దూతగాగలిగిన రాజు యొక్క సకల కార్యాలు నిర్విఘ్నంగా సాఫల్యమును పొందగలవు అని శ్రీరాముడు హనుమద్వైభవాన్ని లక్ష్మణునికి వివరించెను.

లక్ష్మణుడు కూడా హనుమద్వైభవాన్ని స్వయంగా గుర్తించెను. శ్రీరాముడితో ఈ హనుమంతుడు ఆనందంగా మాట్లాడుచున్నాడు. నేను మాట్లాడిన మాటలకు అమితంగా సంతోషిస్తున్నాడు–

**"కపిః కథయతే హృష్టో యథాయం మారుతాత్మజః।**
**కృత్యవాన్ సోపి సంప్రాప్తః కృతకృత్యోసి రాఘవ॥**
**ప్రసన్న ముఖవర్ణశ్చ వ్యక్తం హృష్టశ్చ భాషతే।**
**నానృతం వక్ష్యతే వీరో హనుమాన్ మారుతాత్మజః॥**

మనము సుగ్రీవుని సహాయాన్ని కోరుకుంటున్నటుల ఆ సుగ్రీవుడు కూడా మన స్నేహాన్ని, మన సహాయాన్ని కాంక్షిస్తున్నాడనే ప్రియవాక్యాన్ని పలికినాడు. మన కార్యము నెరవేరినట్లేనని సూచనగా తెలిపినాడు. ఇతడు మోసము చేయువాడు కాడని అతని మాటలు ముఖకవళికలు తెలుపు చున్నవి. ముఖము ప్రసన్నముగ ఉన్నది. ఇతడు వాయు పుత్రుడు. వాయువు సకల ప్రాణులకు జీవనాధారమైనట్లే, ఇతడు మనకు ఆధారభూతుడైనవాడు. పైగా ఈ హనుమంతుడు మహావీరుడు, అసత్యమును పలుకనివాడు అని హనుమత్ తత్త్వాన్ని గుర్తించిన లక్ష్మణుడు శ్రీరామునికి హనుమద్వైభవాన్ని వివరించెను.

కిష్కింధాకాండలో రామసుగ్రీవ మైత్రి ఏర్పడుటకు హనుమంతునిలోని బుద్ధిబలము, వాక్పటుత్వము అనునవి మూలకారణాలైనట్లే, సీతాన్వేషణలో, లంకాదహనంలో, శత యోజన విస్తీర్ణమైన సముద్రలంఘనంలో హనుమంతుని దేహబల ధైర్యగుణాలు కారణాలై నిలిచాయి.

హనుమంతుని బుద్ధిబలము, స్వామిభక్తియను గుణములు అతనిలోని ఇతర గుణాలన్నింటికంటెను అధిక ప్రభావమును

కలిగియున్నాయి. ఈ రెండు గుణాలు ఇతరములైన ధైర్య నిర్భయత్వ శాస్త్రపాండిత్యాది గుణాలతో కలిసి హనుమంతుని శ్రీమద్రామాయణమహామాలకు మధ్యమణిగా ప్రకాశింప చేస్తున్నాయి.

హనుమంతుడు అనుకూల ప్రతికూల రూపములైన విఘ్నములను అధిగమించడంలోను మైనాకుని సంతృప్తి పరచడంలోను సింహికా సురసల గర్వమణచడంలోను, లంకిణీ సంహారంలోను, అశోకవనంలో ఉన్న సీత జాడను గుర్తించడం లోను తన బుద్ధిబల వైభవమును రుచి చూపించెను.

సీతాదేవితో మాట్లాడుటకు ఉపక్రమించు సమయంలో తన ధీసంపదను హనుమంతుడు ప్రకటించెను. లోక వ్యవహారములోనున్నట్టి అర్థవంతమైన మానుషవాక్యములో హనుమంతుడు శ్రీరామచరితామృతాన్ని గానం చేస్తానని–

**"వాచం చోదాహరిష్యామి మానుషీమిహ సంస్కృతామ్"**

అనే సూక్తితో పేర్కొనెను. అట్లుకాక పోయినచో సీతమ్మ నన్ను రావణుడే రూపాంతరముతో వచ్చినాడని భావించును. **"సీతా భీతా భవిష్యతి"** సీతమ్మ భయకంపితురాలు అగునని భావించిన ధీబలశాలి హనుమంతుడు.

సీతాన్వేషణలోనే కాకుండా సీతమ్మ తల్లి క్షేమంగా ఉందని తెలిపే సందర్భంలోనూ హనుమంతుడు తన ధీశక్తిని ప్రదర్శిస్తూ

**"దృష్టా సీతేతి విక్రాంతః సంక్షేపేణ న్యవేదయత్"**

చూడబడినది సీత అనియే సంగ్రహముగా కుశలవార్తను వినిపించెను. అందువల్లనే వెంటనే వాలిపుత్రుడైన అంగదుడు.

**"అహోస్వామిని తే భక్తిః అహోవీర్య మహోధృతిః।"**

ఓ హనుమా! నీ స్వామిభక్తి, నీ పరాక్రమము, నీ ధైర్యము అనునవి అద్భుతమైనవి అని హనుమంతుని గుణగణమును ప్రశంసించెను.

సుగ్రీవుడు కూడా దక్షిణ దిక్కునకు వెళ్ళిన హనుమంతు డొక్కడే సీతాదర్శనం చేయగలిగిన సమర్థుడు. హనుమంతుడు తప్ప వేరొకరు ఈ కార్యాన్ని సాధింపలేరు.

**దృష్టా దేవీ న సందేహో న చాన్యేన హనూమతా।**
**న హ్యన్య స్సాధనే హేతుః కర్మణోస్య హనూమతః॥**
**కార్యసిద్ధిర్మతిశ్చైవ తస్మిన్ వానరపుంగవే।**
**వ్యవసాయశ్చ వీర్యం చ శ్రుతం చాపి ప్రతిష్ఠితమ్॥"**

కార్యసిద్ధి, బుద్ధి, పట్టుదల, పరాక్రమము, పాండిత్యం కూడా హనుమంతునియందే కలవు అని ప్రశంసించుట చేత హనుమంతుని బుద్ధికుశలత, కార్యదక్షత ఎంతటివో ప్రకటిత మగుచున్నవి.

సుగుణాభిరాముడు, సకల కళ్యాణగుణాకరుడైన శ్రీరామచంద్రుడు సుగ్రీవుని సమక్షంలో కార్యదక్షుడైన స్వామిభక్తి పరాయణుడైన హనుమంతుని ఘనతను కీర్తిస్తూ చెప్పిన ఈ మాటలు హనుమద్వైభవానికి నిదర్శనంగా పేర్కొనదగినవి.

ఈ భూమండలంలో హనుమంతుడు కాక మరొకరు ఎవరూ కూడా మనసులో కూడా చేయలేని పనిని, బహు దుర్లభమైన పనిని, చాలా చాలా గొప్పనైన పనిని హనుమంతుడే చేసినాడు అని శ్రీరాముడు హనుమత్ ప్రశస్తిని ప్రకటించెను–

**"కృతం హనుమతా కార్యం సుమహద్భువి దుర్లభమ్।**
**మనసాపి యదన్యేన న శక్యం ధరణీతలే॥"**

సముద్రలంఘనమే గొప్పపని. లంకలో ప్రవేశించుట అంతకంటే గొప్పపని. అశోకవన భంగం, లంకాదహనం అనునవి సుదుర్లభమైన పనులు. మరొకరు ఎవరు చేయలేని, చేసినట్లు ఊహించనూలేని ఘనకార్యములు ఇవి. ఒకవేళ ఎవరైనా కష్టపడి లంకలో ప్రవేశించ సంకల్పించినా రావణుని చేతినుండి తప్పించుకోలేరు. సీతాక్షేమవృత్తాంతాన్ని తెలుసుకొని వెనుకకు మరలి ఆపై రాలేరు. అనితరసాధ్యమైన పనిని చేసిన హనుమంతునికి సంతోషాన్ని కలిగించే విధంగా తగిన పారితోషికాన్ని ఇవ్వలేకపోవుచున్నాను. ఇందుకు గాను నేను ఎంతో కుమిలిపోవుచున్నాను. నాకు కలిగిన ఈ మానసిక పరితాపం, నా సర్వస్వాన్ని హనుమంతునికి ఇచ్చిననాడే తొలగును–

**"ఇదం తు మమ దీనస్య మనోభూయః ప్రకర్షతి।**
**యదిహాస్య ప్రియాఖ్యాతుః న కుర్మి సదృశం ప్రియమ్॥"**
**"ఇత్యుక్త్వా ప్రీతిహృష్టాంగో రామస్తం పరిషస్వజే।**
**హనూమంతం మహాత్మానం కృతకార్య ముపాగతమ్॥"**

హనుమంతునికి ప్రత్యుపకారంగా నా సర్వస్వమైన నా శరీరాన్ని ఇచ్చెదను. ఇంతకంటె ప్రస్తుతం నా దగ్గర వేరొకటి లేదని భావించి శ్రీరాముడు మహాత్ముడైన హనుమంతునికి గాఢాలింగన సుఖాన్ని ప్రసాదించెను.

రామలక్ష్మణుల, సుగ్రీవాంగదుల ప్రశంసను, రామాలింగన సౌఖ్యాన్ని పొందిన హనుమంతుని గుణవైభవము అపూర్వమైనది. ఆశ్చర్యకరమైనది, అనన్య సదృశమైనది అని పేర్కొనడంలో లేశమంత అతిశయోక్తి కూడా కనిపించదు.

గీతామాహాత్మ్యకథలు - 11

# వివాహ మండపం

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

పెద్దలను గౌరవించడం ఎంత ముఖ్యమో, అలాగే గౌరవించక పోవడం వలన ఎంతటి కష్టాలను కొని తెచ్చుకుంటామో, అలాంటి కష్టాల సమయాలలో కూడా గీతా పారాయణం మనని ఎలా రక్షిస్తుందో చెప్పేకథని "సరోజవదన" కథగా గత మాసపు గీతామాహాత్మ్య కథలు -10 లో భాగంగా తెలుసుకున్నాం. ఇక పదకొండో అధ్యాయానికి సంబంధించిన సంభ్రమాశ్చర్యాలను కలిగించే ఈ కథను తెలుసుకుందాం.

భగవద్గీతలోని పదకొండో అధ్యాయం పేరు **"విశ్వరూప సందర్శన యోగం** ఈ అధ్యాయంలో సంజయుడు విశ్వరూపాన్ని వర్ణిస్తూ ఈ క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

**శ్లో ॥ అనేక వక్త్ర నయనం అనేకాద్భుత దర్శనమ్ ।**
**అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥**

అనేక ముఖములు, నేత్రములు, అనేకమైన అద్భుత దర్శనములు, అనేక దివ్యాభరణములు, అనేకమై ఎత్తబడిన దివ్యాయుధాలు కలిగినది ఆ అద్భుత దర్శనము అంటాడు సంజయుడు.

భగవంతుడి యొక్క అనేక విభూతులను గురించి తానే చెప్పగా విన్న అర్జునుడు, శ్రీకృష్ణుడియొక్క ఈశ్వర తత్త్వాన్ని సంపూర్ణంగా తెలుసుకున్నవాడై వినమ్రతతో తనకు ఆ విభూతి సర్వస్వమైన విశ్వరూపాన్ని చూపించమని ప్రార్థించాడు. దయాళువైన శ్రీకృష్ణ పరమాత్మ, తన విశ్వరూపం చూడడానికి కావలసిన దివ్యచక్షువులను అర్జుననకు ప్రసాదించి, అప్పుడు తన విశ్వరూపాన్ని చూపించాడు. ఆ విశ్వరూపాన్ని చూసిన అర్జునుడు విస్మయాన్ని పొందాడు. పులకాంకితుడయ్యాడు. ఆ ఉజ్జ్వల రూపాన్ని సంభ్రమాశ్చర్యాలతో వీక్షించిన అర్జునుడు భయభ్రాంతుడు కూడా అయ్యాడు, ధైర్య విహీనుడయ్యాడు. దిక్కుతోచని స్థితికి చేరాడు. గద్గద స్వరంతో తనను క్షమించమని పదేపదే వేడుకున్నాడు. మళ్ళీ తనకు ఆ పాత స్వరూపమే కావాలని విశ్వరూపాన్ని ఇక చూడలేనని ప్రాధేయపడ్డాడు.

కరుణామయుడైన ఆ పరమాత్మ వేదాధ్యయనం చేత గాని, యజ్ఞములచేత గాని, దానము చేతగాని, పుణ్యకర్మలచేత గాని అన్యులెవ్వరూచూడలేని ఆ భయంకరమైన విశ్వరూపాన్ని మళ్ళీ అర్జునుని కోరిక ప్రకారమే ఉపసంహరించాడు. అందుకనే ఈ అధ్యాయానికి "విశ్వరూప సందర్శన యోగ"మంటారు.

ఈ అధ్యాయంలో భగవంతుడు అర్జునుడితో "నేను జననాశనమునకై ప్రబలిన కాలుడను" అంటాడు. అంటే ఈ విశ్వరూపం కాలస్వరూపమన్నమాట.

మరి భగవంతుడి విశ్వరూపం అంటే కాలరూపమా? లేక విశ్వరూప సందర్శనమా? అంటే అది అంతేకాదు. ఇంకా ఇలాంటివి చాలానే ఉన్నాయి. శ్రీకృష్ణుడు యశోదాదేవికి తననోట్లోనే ఒక విశ్వరూపాన్ని చూపించాడు. దాని వర్ణన వేరు. ఆయనే ధృతరాష్ట్రుడి కొలువులో మరో విశ్వరూపాన్ని చూపించాడు. దాని వర్ణన మరో రకంగా ఉంది. వామనావతారంలోని బలిచక్రవర్తికి గర్వభంగం చేసి ఆతనిని పాతాళానికి అణగద్రొక్కడానికి ఒక విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. దాని వర్ణన మరోవిధంగా ఉంది. ఒక మత్స్యావతారం, ఒక కూర్మావతారం ఒక వరాహావతారం అని విభుస్వరూపాలే. ఇలా మన స్వామికి గల విశ్వరూపాలెన్నో ఉన్నా, అనేక విశ్వరూపాలలో సంభ్రమాశ్చర్యాలు కొలిపే అర్జునుని ముందు ప్రదర్శించిన ఈ విశ్వరూపం ఒకటి.

పద్మపురాణం ప్రకారం పార్వతీదేవి శంకరుని సమీపించి "స్వామీ! నాకు భగవద్గీతలోని విశ్వరూప సందర్శన యోగం అనే అధ్యాయ మహిమను వివరించవలసినది" అని కోరగా, శంకరుడు "దేవీ! ఈ పదకొండవ అధ్యాయం మహిమను ఎవ్వరు చెప్పగలరు? కాని నీకోసం దీని మహిమకు సంబంధించిన ఒక్క కథను మాత్రం తెలియజేస్తాను విను. దీనిని ఇంతకు పూర్వము శ్రీ మహావిష్ణువు లక్ష్మీదేవికి చెప్పాడు. అదే కథను నీవు కూడా విను" అన్నాడు.

పూర్వం ప్రణిత అనే నది ఒడ్డున మేఘకరమనే ఒక పట్టణం ఉండేది. ఆ పట్టణంలో శ్రీమహావిష్ణువు వామన

రూపంలో దర్శనమిచ్చే ఒక అందమైన ఆలయమొకటుంది. ఆ ఆలయ సమీపంలోనే మేఖల అనే ఒక పుణ్యతీర్థం ఉంది. ఆ తీర్థంలో ఒక్కసారి స్నానమాడిన మానవులు మరణానంతరం వైకుంఠధామాన్ని చేరుకుంటారని ప్రతీతి.

ఆ తీర్థము ఒడ్డున నిత్య భగవద్గీతా పారాయణశీలి యైన బ్రాహ్మణుడొకడుండేవాడు. ఆ మహాత్ముడి పేరు సునందుడు. ఆతనికి అత్యంత ప్రీతిపాత్రమైనది భగవద్గీతలో గల 11వ అధ్యాయాన్ని పారాయణ చెయ్యడమే. ఒకనాడు ఆతడు తన శిష్యులతో కలసి తీర్థయాత్రలకు బయలుదేరాడు. ఆ మార్గమధ్యంలో "వివాహ మండపం" అనే నగరానికి చేరాడు. అక్కడ తాను తన శిష్యులు ఉండటానికి ఏదైనాచోటుకావాలని అడుగగా ఆ ఊరి ప్రజలందరూ తమ ఊరి ధర్మాధికారిని అడగమన్నారు. ఆ ధర్మాధికారి ఆ నగరంలో ఉన్న ధర్మసత్రంలో ఉండమని కోరాడు.

అక్కడ విశ్రమించిన సునందుడు, ఉదయాన్నే లేచిచూస్తే తన శిష్యులులేరు. రాత్రి తమతో పాటు పడుకున్న ఇతర యాత్రికులూ లేరు. తానొక్కడే ఉన్నాడు. ఆశ్చర్యపడి ఎక్కడికి వెళ్ళారో కనుక్కుందామని వెతుకుతూ వెళ్ళి ఆ ధర్మాధికారినే కలిసాడు. తనతో పాటు పడుకున్న శిష్యులందరూ ఎక్కడికి పోయారో వెతికించమని కోరాడు. దానికి ఆ ధర్మాధికారి చాల ఆశ్చర్యపోతూ ఇలా అన్నాడు.

"అయ్యా! తమరు బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తున్నారు. అందుకనే మిమ్మల్ని ఆ బ్రహ్మరాక్షసుడు తినలేక పోయాడు. లేకపోతే ఆ రాక్షసుడు నా కుమారుడిని, మీ శిష్యులను, ఇతర యాత్రికులను తిన్నట్లు మిమ్మల్ని కూడా తిని యుండేవాడు కదా !"

"బ్రహ్మ రాక్షసుడా ! అతడెవడు ? అన్నాడు సునందుడు. ఆ మాటలకు ధర్మాధికారి ఇలా చెప్పాడు.

"స్వామీ! ఈ రాక్షసుడు ఇంతకు ముందు ఈ నగరం లోనే ఉండే ఒక బ్రాహ్మణుడు. ఈతడు వ్యవసాయము చేసికొని జీవించేవాడు. ఒకనాడు ఆతడు పొలంపనులు చేసుకుంటూ ఉండగా ఆ దారిన పోయే బాటసారిని ఒక పెద్ద రాబందు వెంబడించి గాయపరచ సాగింది. కాని ఈ బ్రాహ్మణుడు ఆ బాటసారిని రక్షించే ప్రయత్నం చేయలేదు. ఆ బాటసారి రక్షించమని అరుస్తూ పరుగెత్త సాగాడు. కాని ఆ రాబందు వెంటపడి అతి తీవ్రంగా గాయపరచి అతడిమీద కూర్చుని అతని మాంసాన్ని భక్షించడం మొదలు పెడుతుండగా, ఒకయోగి ఆమార్గంగుండా ప్రయాణిస్తూ ఆ దృశ్యాన్ని చూశాడు. తాను కూడా పెద్దగా అరుస్తూ రాళ్ళతో కొట్టి ఆ రాబందును తరిమి వేశాడు. కాని అప్పటికే ఆ బాటసారి ప్రాణాలు అనంత వాయువులలో కలిసిపోయాయి. ఆ బాటసారి ప్రాణాలు రక్షించగలిగి రక్షించని రైతును గురించి ఆలోచిస్తూ, యోగి పద్మపురాణంలోని ఈ క్రింది శ్లోకాన్ని జ్ఞాపకం తెచ్చుకున్నాడు.

**శ్లో॥ అశ్వమేధ సహస్రాణి వాజిపేయ శతాని చ**
**శరణాగత సంత్రాణ కలాం నార్హంతి షోడశీమ్ ॥**
**దీనస్యోపేక్షణం కృత్వా భీతస్య చ శరీరిణః**
**పుణ్యవానపి కాలేన కుంభీపాకేస పచ్యతే ॥** (పద్మపురాణం)

వేయి అశ్వమేధయాగాలు, నూరు వాజపేయయాగాలు చేసినా ఆ పుణ్యం శరణాగతులను, ఆపదలో చిక్కుకున్న వారిని రక్షించిన పుణ్యంలో 16వ వంతుకు కూడా సరికాదు. దీనులు భయభీతులైన వారిని ఉపేక్షించిన పాపాత్ములకు కుంభీపాక నరకం తప్పదు.

అలా యోగి చాల బాధపడి, తన పొలంపని చేసు కుంటూ ఆ బాటసారిని రక్షించని ఈ బ్రాహ్మణుని పిలిచి "ఓరీ! నీ ఎదుట ఇంతఘోరం జరుతున్నా ఎలా ఊరుకోగలిగావు. తోటి మానవుణ్ణి రక్షించగలిగే స్థితిలో ఉండికూడా ఊరుకున్నావు. కాబట్టి నేటినుండి రాక్షసుడవై పడియుండు" అని శపించాడు.

ఆ మాటలకు బ్రాహ్మణుడు పశ్చాత్తాపంతో ఆ మహానుభావుని పొందాలంటే "మహాత్మా! నేను ఇక్కడే ఉన్నా పొలంపనులలో నిమగ్నమై ఉన్న నాకు ఈ సందడి వినబడలేదు. అందుకనే నేను ఈ బాటసారిని రక్షింపలేక పోయాను. నన్ను క్షమించి శాపవిమోచనాన్ని అనుగ్రహించండి " అని పదే పదే ప్రార్థించాడు.

ఆతని ప్రార్థనలు విన్న ఆ యోగి దయతో " ఎవరైతే భగవద్గీతలోని 11వ అధ్యాయాన్ని అనుదినము పఠించే మహాత్ముడు నీ శిరస్సుపై నీరు చల్లినట్లై నీవు

శాపవిమోచనమౌతుంది.” అని చెప్పి వెళ్లిపోయాడు.

స్వామీ! ఆ బ్రాహ్మణుడే ఈ రాక్షసుడు. అని చెప్పాడు ధర్మాధికారి. సునందుడు వెంటనే భగవద్గీతలోని 11వ అధ్యాయాన్ని పఠించడం మొదలు పెట్టాడు. ఆ రాక్షసుడు ఆ పారాయణ విని అక్కడికి వచ్చి, ఆయన పాదముల వద్ద మోకరిల్లి కూర్చున్నాడు. సునందుడు పారాయణ పూర్తి చేసి ఆ రాక్షసుని శిరస్సున నీళ్ళుజల్లాడు. వెంటనే ఆ బ్రాహ్మణుడు రాక్షస రూపాన్ని వదిలి నిజరూపంలోకి ప్రవేశించాడు. సునందునికి పాదాభివందనం చేసాడు. ఈ విషయాన్ని పద్మపురాణం ఇలా కీర్తిస్తోంది.

శ్లో॥ నిష్కర్మతయా ప్రాపుస్తే పరమం పదమ్
ఏకాదశస్య సామర్థ్యా దధ్యాయస్య భవిష్యతి ॥

భగవద్గీతలోని 11వ అధ్యాయాన్ని చక్కగా అర్థం చేసుకుని, పారాయణ చేస్తూ నిష్కామ కర్మ మార్గంలో నివసించే వారికి పరమపదం ప్రాప్తిస్తుంది.

రాక్షసుడికి శాపవిమోచనం అయినంతనే ఆతడు తినివేసిన మనుషులు, ఆ అధికారి కుమారుడు, సునందుని శిష్యులు అందరు శంఖ, చక్ర ధారులై, చతుర్భుజులై పునరుజ్జీవనం పొంది, అందరూ ఒక దివ్య విమానంలో ఆ రాక్షసుడితో సహా ఒక దివ్య విమానాన్ని అధిరోహించి వైకుంఠానికి వెళ్ళిపోయారు.

ఆ తరువాత ఆగ్రామాధికారి కూడా సునందుడి వద్ద భగవద్గీతలోని ఏకాదశాధ్యాయాన్ని అభ్యసించి పారాయణం చెయ్యడం మొదలు పెట్టాడు. కొంతకాలానికి వారిద్దరూ కూడా మోక్షాన్ని పొంది విష్ణుసన్నిధికి చేరుకున్నారు. అని చెప్పగానే పార్వతీదేవి ఆనందంతో తన కన్నీరును తుడుచుకుంది.

ఇలా విష్ణుమూర్తి లక్ష్మీదేవికి వినిపించిన భగవద్గీత లోని ఏకాదశాధ్యాయ మహిమను పరమశివుడు ఉమాదేవికి వినిపించాడు.



రాయల ఊహల పల్లకీ....

# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

దానం త్యాగం అని రెండున్నాయి. ఉదకధారా పూర్వకంగా ఇచ్చేది దానం. ఉదకధార లేకుండా ఒకరడక్కుండానే ఇచ్చేది త్యాగం. మత్స్యధ్వజుడు దానాలూ ఇస్తాడు. త్యాగాలు చేస్తాడు. ఈ రెండింటివల్ల ఆయనకు విశదమైన కీర్తి వచ్చింది. కీర్తి తెల్లగా కదా ఉంటుంది. అది ఓ ఆడహంసలా ఉంది. ఆ హంసకి రాజుగారి దానం ఓ రెక్క, త్యాగం మరో రెక్కానూ.

మామూలుగా పక్షులు రెక్కలు తడిస్తే ఆకాశం మీద ఎగరలేవు. హంసలు అట్లాకాదు. రెండు రెక్కలు తడిసినా అవి హాయిగా ఆకాశాన ఎగరగలవు. అవి ఎప్పుడూ నీళ్ళలోనే కదా ఉండేది. ఇప్పుడు మత్స్యధ్వజ చక్రవర్తి కీర్తి ఓ ఆడహంస. దీనికి ఓ రెక్క మట్టుకు ఎప్పుడూ నీళ్ళలో నానుతూనే ఉంటుంది. అయినా హంస కనుక మిగతా పక్షుల్లా రెక్కలు తడిస్తే ఎగరలేకపోవడమనేది దీనికి లేదు. అంచేత హాయిగా ఆకాశం మీద ఎగురుతుంది. హంసలా తెల్లగా స్వచ్ఛంగా ఉన్న ఆయన కీర్తి భూమిమీదే కాదు ఆకాశం మీద కూడా రెక్కలు కట్టుకు మరీ విహరిస్తోంది. ఎక్కడకు పడితే అక్కడికే ఆయన మహాదాని, మహాత్యాగి అన్నకీర్తి వ్యాపిస్తోంది.

మత్స్యధ్వజ చక్రవర్తి ఈతిబాధలు ఏమీలేకుండా చక్కగా ప్రజాపాలనం చేస్తున్నాడు. (ఈతి బాధలంటే చిలకలు, ఎలకలు దగ్గరగా ఉన్న రాజులు, అనావృష్టి, అతివృష్టి, మిడతలు) ఇవి విచ్చలవిడిగా ఉంటే జనజీవితానికి విఘాతం ఏర్పడుతుంది. వీటిని ఓ పద్ధతి ప్రకారం నియంత్రిస్తున్నాడు ఆయన.

వారకాంతలు వినోదానికి ఇళ్ళల్లో పంజరాల్లో చిలకల్ని పెంచుతారు. ఇట్లా ఆయన రాజ్యంలో చిలకలన్నీ పంజరాల్లో చేరిపోవడం వల్ల ప్రజలకు వీటి బాధ తప్పింది. ఎలకలు ఓడిపోయిన శత్రురాజులు వదిలిపారిపోతే పాడుపడిన వారి భవనాల్లో చేరి చెండాడుతున్నాయి. తమలో తాము మాటిమాటికీ చెండాడుతున్నాయి. వీటి బాధ ఇల్లా తప్పింది. తమలో తాము మాటిమాటికీ కలహించుకొంటూ దగ్గరదగ్గరగా ఉన్న రాజులు కేంద్రప్రభుత్వా నికి తలనొప్పిగా తయారవుతారు. వాళ్ళనందరినీ జయించి వాళ్ళ పరస్పర సంఘర్షణల్ని పారద్రోలేడు. పరాజితులైన రాజుల బొమ్మల్ని అందెలో చెక్కించి గెలిచినవారు ఆ అందెని కాలికి వేసుకుంటారు. మత్స్యధ్వజుడు కాలికి వేసుకున్న అందెలో ఇలాంటి చాలామంది రాజుల బొమ్మలున్నాయి. అంచేత చోటు చాలక ఒకర్నొకరు ఒరుసుకున్నారు. (చిన్న కెమేరాతో తీసే పెద్దఫోటోలో చాలామంది ఇరుక్కుంటూ నిలబడ్డట్టు) ఇదిగో ఈ ఒరపిడిలు అందెలో తప్ప బయటలేవని చమత్కారం.

అనావృష్టి - వర్షాల్లేకపోవడం. ఎక్కడా తడిలేకపోవడం. ఈ అనావృష్టి తన ఏనుగులతో పోటీపడి సాగలేక చావలేక సాగిలపడిన శత్రురాజుల ఏనుగుల గండస్థలాలను చేరుకుంది. అక్కడ వాటి మదం ఇంకిపోయింది. ఇలా అనావృష్టి అక్కడ చేరిపోయినందువల్ల ప్రజలకు దాని భయం తప్పింది.

ఇహ అతివృష్టి - వర్షాల్లేకపోవడం ఎంత నష్టమో, ఎక్కువ కురవడమూ అంతనష్టమే! దాన సమయాల్లో ఆయన చేతిని చేరుకుంది ఈ అతివృష్టి. దానాలు ఇచ్చి ఇచ్చి జలధారలు విడిచి విడిచి నీళ్ళు ప్రవాహాలుగా పారుతూ ఉంటే మరి అది అతివృష్టే కదా! ఇది ఇట్లా ఇక్కడ చేరినందువల్ల ఈబాధ ప్రజలకు లేదు.

ఇహ మిడతలు - ఆయన ప్రతాపమనే అగ్నిలో క్షుద్ర శత్రువుల రూపంలో మిడతలు పడి భస్మమైపోతున్నాయి. శత్రువులు మిడతల్లా మాడిమసైపోతున్నారు. ఇట్లా ఈ భయం ప్రజలకు లేదు. ఇట్లా ఏ ఈతిబాధా లేకుండా పాండ్యదేశాన్ని మత్స్యధ్వజ మహారాజు పరిపాలిస్తున్నాడు.

ఇట్లాంటి పాండ్యదేశంలో గ్రీష్మ ఋతువు ప్రవేశించింది. ఓ ఏడు వేసవి వచ్చింది. గ్రీష్మం వచ్చిందనగానే కలిగొట్టు చెట్లకు సంతోషం. అవి వేసవిలోనే పూస్తాయి. ఎండమావులు వేసవిలోనే కనవస్తాయి. ఎండల్లోనే ఎండమావుల్లో నీళ్ళు కనిపిస్తాయి. ఈ రోజుల్లోనే బూరుగుకాయలు ఎండవేడికి పగిలి దూది బయటకు వస్తుంది.

సెలయేటి కాలువలు సొంతం ఇంకిపోయాయి. ఏళ్ళలో రేవుల్లో ఉన్న చాపరాళ్ళు ఎప్పుడూ నీటితో ఉండడాన్న పాచిపట్టి ఉంటాయి. ఇప్పుడు నీరింకిపోగానే దళసరిగా ఉన్న ఆ పాచి పెల్లలుగా లేస్తోంది.

నీటి వడియలకు వచ్చే గువ్వలని బోయలు పట్టుకుంటారు. ఇప్పుడాపడియలు ఇంకిపోయాయి. నీరులేక

పోవడంతో గువ్వలటుమరిరావు. అంచేత పడియల్లో గువ్వలు చేరడం కోసం వాట్నిపట్టేవాళ్ళు నీళ్ళు తెచ్చి పోస్తున్నారు. అక్కడక్కడ అల్లాంటి పడియలు కనిపిస్తున్నాయి.

సుడిగాలులు లేస్తున్నాయి. కార్చిచ్చుకు కాలిన ఆకులు ఆ సుడిగాలికి పయికి(పైకి) ఎగురుతున్నాయి. ఆ ఎగిరే ఆకుల్ని పావురాలనుకుని డేగలు వాటిలోకి దూసుకొస్తున్నాయి.

కాస్త నీడగా ఉంటుందని బాటసారులు చెట్లకింద పడుకుంటున్నారు సేదతీరటం కోసం. అయితే ఆ నీడలు అల్లా నిలవక మెల్లగా జరుగుతున్నాయి. ఆ నీడలతోపాటు ఈ బాటసారులూ అవి చేరినవైపు దొర్లుతున్నారు.

దిక్కులు నాలుగూ తెల్లటి ఎండమావుల బయళ్ళలా ఉండి, శివునికి, ఉది(తి)కిన బట్టలు ఆరవేసే చాకిరేవులయ్యేయి. దిక్కులేగా మరి ఆయన బట్టలు.

ఏనుగులు, ఎనుబోతులు, పందులు వేసవి ఎండకు తాళలేవు. చల్లదనం కోసం రొంపిలోకి దిగి నానతాయి. కాస్త తాపం చల్లారేక నిండాపట్టిన బురదతో పైకొస్తాయి. వాటి ఒంటిమీదనున్న బురద ఎండవేడికి ఆరిపోతుంది. ఈ వేసవి ఎండతో ఈ ఏనుగుల దున్నల పందుల పనిసరి. ఈ వేసవి పోయేక మళ్ళీ ఈ ఏనుగుల్నీ, ఎనుబోతుల్నీ, పందుల్నీ సృష్టించుకోవాలి ఆ బ్రహ్మగారు. ముందు జాగ్రత్తతో వాటి ఒంటిమీదే మట్టితో మూసలు కట్టి, పడమటిగాలికి మండుతున్న ఎండ అనే ప్రచండాగ్నిలో ఆ మూసల్ని కాల్చి పెట్టుకుంటున్నా దనిపిస్తోంది.

ఒక వస్తువులా మరో వస్తువు కావాలంటే మొదటి వస్తువులాంటి మూస తయారు చేసుకోవాలి. ఆ మూసలో పోతపోస్తే అచ్చు అలా మూసపోసినట్టు మరోటి తయారవు తుంది. వీటిపని సరి అనుకున్న బ్రహ్మగారు వాటి శరీరాలపై ఉన్న బురదతోనే మూసలు కడుతున్నాడు. అట్లా కట్టిన మూసలను నిప్పుల్లో కాలుస్తారు. ఎండ నిప్పులానే ఉంది. అందులో కాల్చి మరీ పెట్టుకుంటున్నాడు మూసల్ని బ్రహ్మ.

ఆకాశాన సుడిగాలులు లేస్తున్నాయి. ఆ సుడిగాలిలో దుమ్ము చక్రాల్లా చుట్టూ అంచుల్లో గడ్డిపోచలు అల్లల్లాడుతూంటే పైకెగురుతోంది. నూతుల్లో నీళ్ళింకిపోయినాయి. సుడిగాలివల్ల పైకి లేచిన ఈ దుమ్ము చక్రాలు నీళ్లింకిపోయిన నూతులు. ఇవి నేలనుండి నింగికి ఎగిసి సూర్యుడితో చూసేవయ్యా నీ కిరణాలు మా నీళ్ళను దొంగిలించేయి, ఎపుడూ కార్చిచ్చు పొగ కమ్మినవేళ. దొంగిలించేది చీకట్లో కదా! నీవాళ్ళను (నీ కిరణాలను) కాస్త మందలించి మా సొత్తు (నీళ్ళు) మాకు ఇప్పించమని మొరపెట్టుకుంటున్నాయిట.

సూర్యుడు కిరణాల్ని మందలించి అదేమిటి, ఆ నూతుల నీళ్ళను మీరు దొంగిలిస్తారా? వాటివి వాటికిచ్చేయండి అంటాట్ట. అంటే ఏమిటి? నేలమీది జలం సూర్యకిరణాల ద్వారా పైకిపోయి ఆవిరిగా మారి, మేఘంలో చేరి మళ్ళీ సూర్యకిరణాల ద్వారానే కిందికొస్తుంది. దొంగిలించినవారిని శిక్షించి మా సొత్తు మాకిప్పించమని నూతులు వేడుకొన్నాయి. నూతులు నిండడంతోబాటు వర్షాలు పడితే చెరువులు, దొరువులు కూడా నిండుతాయిగా, అల్లా అవి నిండుగా ఉంటేనే ఆ చెరువుల్లో దొరువుల్లో తామరలు వికసిస్తాయి. తామరల వికాసం సూర్యుడికి ఇష్టం. ఇట్లా ఆయన లాభం కూడా ఇందులో ఉన్నందువల్ల తప్పకుండా తమనీటిని తమకు ఇప్పిస్తాడన్న భరోసాతో నూతులు మొరపెట్టుకుంటున్నట్టుంది. తెచ్చిన కిరణాలనే ఇచ్చేసి రమ్మంటాడని.

తప్పు చేసిన వారిచేతే ఆ తప్పు దిద్దించడం, పరిహార మిప్పించడం ప్రభువుల కర్తవ్యం. అందునా ఆ తప్పు చేసినవారు పైవారు కాదు. ఆయన వారేనాయె. అంచేత ఆయనకూ బాధ్యత ఉంది. అది చూసి వీరికి భరోసా. ఆ భరోసాతోనే ఆయన దగ్గరకు వెళ్ళడం. (సశేషం)

శ్రీరామచంద్రాచార్య

---



# పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



మార్చి 29వ తేది సాయంత్రం శ్రీస్వామినారాయణ గురుకుల ట్రస్ట్ వారి ఆహ్వానంపై శ్రీశ్రీశ్రీ స్వామివారు "జడ్చర్ల" వేంచేశారు. సాయంత్రం 5.30గం॥లకు జడ్చర్ల, నాగర్ కర్నూలు రోడ్‌లోని "చెన్నకేశవనగర్"లో శ్రీస్వామినారాయణ అంతర్జాతీయ పాఠశాల భవన నిర్మాణానికి శిలాన్యాసం గావించారు.



సాయంత్రం 6గం॥ గురుకుల విద్యార్థులచే సాంస్కృతిక కార్యక్రమ ప్రదర్శన అనంతరం మన ఆచార్యులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు అనుగ్రహ భాషణం చేస్తూ "దైవం పట్ల, దేశం పట్ల విద్యార్థులలో శ్రద్ధ కలిగించడంలో స్వామి నారాయణ గురుకులాలు అగ్రగాములుగా ఉంటున్నాయి. విద్యార్థులును ప్రభావితం చేసే అనేక కార్యక్రమాలు వీరు చాల చక్కగా నిర్వహిస్తున్నారు. ఇక్కడ నిర్మింపబడుతున్న ఈ అంతర్జాతీయ పాఠశాలకూడ చక్కటి వ్యక్తులుగా విద్యార్థులను తీర్చిదిద్దే కేంద్రంగా విలసిల్లాలని" మంగళాశాసనం చేశారు. ఆనాటి కార్యక్రమంలో సద్గురు శ్రీ దేవరస్వామిజీ కూడా పాల్గొన్నారు.

ఏప్రిల్ 3వ తేది శంషాబాద్ నుండి "వైజాగ్" వేంచేశారు.

4వ తేది ఉదయం వైజాగ్ వి.టి. సభ్యులైన శ్రీమాన్ ఎమ్.వి. శ్రీనివాసవర్మగారు నూతనంగ స్థాపిస్తున్న "వాజీ" ఛానెల్‌ను శ్రీశ్రీశ్రీ స్వామివారు ప్రారంభిస్తూ మంగళాశాసనం గావించారు. ఆ సందర్భంగా ప్రవచిస్తూ... "వాజీ అనగా హయగ్రీవ స్వరూపమని అశ్వమని, పరుగెడుతున్న గుర్రమని అర్థం. పేరుకు తగినట్లుగా ఈ నూతన ఛానెల్ కేవలం వైజాగ్‌కే పరిమితం కాక మంచి కార్యక్రమాలతో గోదావరి, కృష్ణ, పెన్నానదులని కలుపుకుంటూ రాష్ట్రమంతటా వ్యాపించాలని శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు. ఆనాటి కార్యక్రమంలో గిరిజనశాఖ మంత్రి శ్రీమాన్ బాలరాజుగారితో పాటు అనేకమంది రాజకీయ ప్రముఖులు పాల్గొని శ్రీస్వామివారి మంగళాశాసనములు పొందారు.

4వ తేది సాయంత్రం శ్రీశ్రీశ్రీ రామచంద్ర రామానుజ జీయరు స్వామివారు స్థానికంగా నిర్వహిస్తున్న శ్రీ మహాలక్ష్మీ యాగ కార్యక్రమంలో పాల్గొని తెల్లవారు ఝామును సీతానగరం వేంచేశారు.

**తాయారు తిరునక్షత్రం**

5వ తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం సాయంత్రం జరగబోయే ఉత్తర పంగుని ఉత్సవకార్యక్రమానికి భక్తులంతా ఆనందోత్సాహలతో "సీతానగరం" ఆశ్రమాన్ని అలంకరించారు.

వేదవిద్యార్థుల శ్రీ విష్ణు సహస్రనామ పారాయణతో సాయంత్రం కార్యక్రమం ప్రారంభమయినది. శ్రీశ్రీశ్రీ స్వామివారు, పంగుని నక్షత్రంలో అమ్మ క్షీరసాగరం నుండి ఆవిర్భవించిన క్రమాన్ని వర్ణిస్తూ క్షీరసాగర మథనం వెనుక ఉన్న దేవేంద్రుని దుశ్చర్య, దుర్వాసముని శాపం, అమ్మ అనుగ్రహంతో దేవేంద్రుడు ఆ శాపం నుండి బయట పడిన వైనం అనుగ్రహించారు.



ఏప్రిల్ 1వ తేది దివ్యసాకేతంలోని శ్రీసీతారామ కళ్యాణమహోత్సవము




ఇదేరోజు శ్రీరంగంలో శ్రీ రంగనాయకీ తాయారు తిరునక్షత్రం మహోత్సవంకూడా అత్యంతవైభవంగా నిర్వహిస్తారని, రంగనాథుడు సంవత్సరం మొత్తంలో ఈ ఒక్కరోజునే రంగనాయకి సన్నిధికి వేంచేస్తాడని, దానినే "శేర్తి ఉత్సవం"గా అత్యంత ఆనందోత్సాహ లతో జరుపుతారని, ఆ క్రమాన్ని వివరించారు.

అలనాడు ఈ **శేర్తి** ఉత్సవాన్ని సేవిస్తూ భగవద్రామానుజులు అనుసంధించిన "గద్యత్రయమ్", శరణాగతిగద్య, శ్రీరంగగద్య, వైకుంఠగద్యలను ఉపదేశాత్మకంగా భక్తులందరిచే శ్రీశ్రీశ్రీ స్వామివారు అనుసంధింపచేశారు.

అనంతరం శాపవిమోచనకై దేవేంద్రుడు చేసిన లక్ష్మీపూజా విధానంలో భక్తులందరిచే సామూహిక "లక్ష్మీపూజలు" నిర్వహింప చేశారు. తీర్థప్రసాదగోష్ఠితో ఆనాటి కార్యక్రమం సుసంపన్నమైంది.

అతి స్వల్పసమయంలో లక్ష్మీ అమ్మవారి తిరునక్షత్ర మహోత్సవానికి కావలసిన వసతులు, వనరులు సమకూర్చిన ఆశ్రమ మేనేజర్ శ్రీమాన్ వేంకటాచార్యులు,వి.టి సభ్యులు శ్రీమాన్ రంగారావు శ్రీమాన్ కృష్ణ ప్రభృతులకు శ్రీస్వామివారు మంగళాశాసనం గావించారు.

6వ తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం నడిగడ్డపాలెం బ్రహ్మోత్సవాలు సందర్భంగా శ్రీపెద్దస్వామివారిని, పెరుమాళ్ళను సేవించి నెల్లూరు బయలుదేరారు.

శ్రీమాన్ యు. శ్యామ్ సుందర్‌రెడ్డిగారి కోరికపై శ్రీమాన్ ఆనం వివేకానందరెడ్డి సోదరుల ఆహ్వానంపై శ్రీశ్రీశ్రీ స్వామి వారు "నెల్లూరు" మూలపేటలోని ప్రాచీన శ్రీ వేణుగోపాలస్వామి ఆలయ పునఃప్రతిష్ఠ కార్యక్రమానికి వేంచేశారు.

7వ తేది ఉదయం కుంభాభిషేకం కావించారు. అక్కడ నుండి శ్రీకాళహస్తిలో స్థపతి శ్రీమాన్ లక్ష్మీనరసింహాచార్యులు దంపతుల ప్రార్థన మేరకు వారి గృహాన్ని సందర్శించి మంగళాశాసనాలు చేశారు. రాత్రికి శ్రీకాళహస్తి ప్రక్కనే ఉన్న "కాట్రేపల్లి"కి వేంచేశారు.

8వ తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీమాన్ కోలా ఆనంద్ దంపతుల ఆహ్వానంపై వారు నిర్వహిస్తున్న శ్రీ వైకుంఠనాథుని ఆలయాన్ని సందర్శించి, అక్కడ ఉన్న భక్తబృందానికి అనుగ్రహభాషణం గావించి మంగళాశాసనాలు చేశారు.

రాత్రికి హైదరాబాద్ JIVAకు చేరారు. 9వ తేది ఉదయం జీవా శ్రీరాంనగర్‌లో దివ్యసాకేత బ్రహ్మోత్సవాల నిర్వాహక సమావేశంలో 29వ తేదీనుండి జరుగబోయే ఉత్సవాల వివరాలను సమీక్షించారు శ్రీస్వామివారు.

కూకట్‌పల్లిలో ఉండే మన జెట్‌స్థలంలో క్రిందటి సంవత్సరం, శ్రీమాన్ చంద్రయ్యగారు ఓ ప్రైవేట్ పాఠశాలను ప్రారంభించి నడుపుకుంటున్నారు. లీజుకు తీసుకున్న ఆ స్థలంలో మన శ్రీస్వామివారిపై ఉండే అభిమానంతో "శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ ఇంటర్నేషనల్ స్కూలు" అని పేరు పెట్టుకున్నారు. ఆ పేరువల్ల అది మన స్థలంలో జరుగుతున్నందువల్ల చాలమందికి అది మన శ్రీ చిన్న జీయరు స్వామివారు నడిపే స్కూలు కాబోలుననే భ్రాంతి కూడా కలిగింది. కానీ, కాదు. శ్రీమాన్ చంద్రయ్యగారికి శ్రీవారిపై ఉండే గౌరవభావం అలా నామకరణం చేసుకొనేట్టు చేసింది. ఇప్పుడా స్కూలు ప్రథమ వార్షికోత్సవం జరుపుకునే సందర్భంగ, శ్రీవారిని దానికి ముఖ్య అతిథిగ ఆహ్వానించారు. 9వతేదీ రాత్రి సాంస్కృతిక కార్యక్రమాలు జరిపి, ఆపై శ్రీవారి సందేశాన్ని విచ్చేసిన ప్రేక్షకులకివ్వవలసిందని శ్రీ చంద్రయ్యగారు ప్రార్థించగ "విద్యా వైభవాన్ని" శ్రీవారు ప్రవచించారు.

అక్కడనే నివసిస్తున్న శ్రీమాన్ చలమచర్ల శేషాచార్యులగారి గృహాన్ని సందర్శించారు. శ్రీ శేషాచార్యులు గారి తల్లిదండ్రులు 92,96 సం॥రాల వయస్సున్న నవదంపతులు. వారికి శ్రీవారు మంగళాశాసనాలందించారు. స్కూలు కార్యక్రమం కాగానే బయలుదేరి 10వ తేదీ ఉదయానికి సీతానగరం చేరారు.

10, 11, 12 తేదీలలో సీతానగరంలో వేంచేసి ఉండి ప్రజ్ఞ తరగతులకు సంబంధించిన సిలబస్‌ను సమీక్షించారు.

13వ తేది ఉదయం హైదరాబాద్ వేంచేసి వనస్థలిపురం వద్దనున్న హస్తినాపురం కాలనీలో నూతనంగ నిర్మించిన శ్రీ వేంకటేశ్వరాలయ ప్రతిష్ఠా కార్యక్రమంలో పాల్గొన్నారు. తిరిగి సాయంత్రానికి వైజాగ్ వేంచేశారు.

వైజాగ్, ఎమ్.వి.పి. కాలనీలోని శ్రీమాన్ M.V.S. వర్మగారి గృహానికి వేంచేశారు.

14వ తేది ఎమ్.వి.పి. కాలనీలోని శ్రీ వేంకటేశ్వరాలయ పునః ప్రతిష్ఠ జరిపించారు. రాత్రికి సీతమ్మధారలోని శ్రీమాన్ చిరంజీవి రాజుగారు, కొండమ్మ దంపతుల గృహానికి వేంచేశారు.

15వ తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీమతి లతాకుమారి, రిటైర్డ్ ప్రిన్సిపాల్‌గారు నిర్వహించే ప్రజ్ఞ గోష్ఠిని పరామర్శించారు. తదుపరి యలమంచిలిలోని భాగవతుల ఛారిటబుల్ ట్రస్ట్‌వారి ఆహ్వానంపై పంచదార్ల గ్రామానికి వేంచేసి అక్కడి B C T. కేంద్రం, స్కూలు ద్వారా జరిపే కార్యక్రమాలని, నిర్వహణ విధానాలని పరిశీలించి మంగళాశాసనాలు కావించారు.

భాగవతుల ఛారిటబుల్ ట్రస్ట్ నిర్వాహకులైన శ్రీమాన్ B. పరమేశ్వరరావుగారు ఛైర్మన్ శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్‌గార్లు తమ విద్యార్థులకు అందిస్తున్న విద్యావిధానాన్ని, వృత్తి విద్యలలో శిక్షణని గురించి శ్రీస్వామి వారికి ప్రదర్శన పూర్వకంగా వివరించారు. ఈ ట్రస్ట్‌వారు చుట్టుప్రక్కల గ్రామాలనుండి కూడా విద్యార్థులను సేకరించి వారికి చక్కటి ప్రచారకులుగ కూడా శిక్షణని అందిస్తున్నారు.

విద్యాభ్యాసంతోపాటు చక్కటి వ్యక్తిత్వ నిర్మాణానికి, స్వయం సమృద్ధికి తగినశిక్షణకూడా ఇక్కడ లభించడం స్వామివారికి ఆనందదాయకంగా అనిపించింది. ఇక్కడ చేరిన విద్యార్థులకు వారి వారి అభిరుచులకు తగినట్లుగా కరెంట్ వైరింగ్, వెల్డింగ్, టైలరింగ్, బుట్టలల్లడం, వ్యవసాయం వంటివృత్తి విద్యలను కూడా నేర్పిస్తున్నారు.

వారు చేసిన ఉత్పత్తికి తగిన ఆదాయాన్ని వారి వారి వ్యక్తిగత ఎకౌంట్లలో భద్రపరుస్తూ వారికి కావలసిన పుస్తకాలు, యూనిఫాంలు కొనుక్కోవడానికి ఆ ధనాన్నే వినియోగించుకునే అవకాశం కల్పిస్తూ ఈ ట్రస్ట్‌వారు విద్యార్థులలో స్వయం ఉపాధి భావనలని ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించడం చాలా సంతోషదాయకమని శ్రీస్వామివారు మంగళాశాసనాలు కావించారు.

అంతేకాకుండా, సాయం సమయాలలో విద్యార్థులను గ్రామాలకుపంపి వారితో ప్రచారం చేయించడంద్వారా ఆ చుట్టు ప్రక్కల గ్రామాలలో "మద్యపానానికి బానిసలైనవారిలో గ్రామాల పారిశుద్ధ్యావకాశాల విషయంలో సత్‌పరివర్తన" తీసుకు రాగలడం ద్వారా ట్రస్ట్‌వారు విద్యార్థులలో సేవాభావనతో కూడిన సమాజ సంస్కరణలపై ఆసక్తి కల్పించడం అత్యంత ముదావహం అని శ్రీస్వామివారు ట్రస్ట్‌వారికి, అక్కడ విద్యనభ్యసిస్తూ పరిపూర్ణ వ్యక్తులుగా రూపొందుతున్న విద్యార్థులందరకు అనేకానేక మంగళాశాసనాలు చేసి రాత్రికి యలమంచిలి వద్దనున్న మహాసిమెంట్స్ శ్రీనగర్ ప్రాంగణానికి వేంచేశారు.

16వ తేది ఉదయం మహాసిమెంట్స్ అధినేత శ్రీమాన్ J. రామేశ్వరరావుగారు తమ కర్మాగారంలో నిర్మించిన శ్రీ వేంకటేశ్వరాలయ కుంభాభిషేక కార్యక్రమములో పాల్గొన్నారు.

వైదికకార్యక్రమాలు పూర్తికాగానే ప్రాంగణంలో వనమహోత్సవం జరిగింది. శ్రీవారి ద్వారా, విచ్చేసిన అథితుల ద్వారా కూడా వృక్షారోపణ సేవ చేయించారు. సాయంత్రం రాజమహేంద్రి శ్రీమాన్ కృష్ణమాచార్యులుగారి ఆహ్వానంపై స్థానిక గీతామందిరంలో నూతనంగా నిర్మించుకొన్న శ్రీ వేంకటేశ్వరాలయ ప్రతిష్ఠా కార్యక్రమంలో పాల్గొని మంగళాశాసనాలు గావించి రాత్రికి సీతానగరం వేంచేశారు.

17వ తేది తీర్థగోష్ఠి అనంతరం ఆర్తులైన భక్తబృందానికి సమాశ్రయణాలు గావించి, "నడిగడ్డపాలెం" వేంచేశారు.

శ్రీశ్రీశ్రీ పెద్దస్వామివారి అనుగ్రహ పాత్రుడై వారినే అనుసరిస్తూ, నిత్యం సేవిస్తూ మన ఆచార్యులైన శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారితో పాటు అనేక కార్యక్రమాలలో పాల్గొన్న, నిరంతర సేవాతత్పరుడైన, దివిసీమ వాసియైన శ్రీమాన్ అంజయ్య పరమపదోత్సవ కార్యక్రమంలో పాల్గొని మంగళాశాసనాలు గావించి, పొన్నూరుకు వేంచేశారు.

శ్రీరామనగరంలోని దివ్యసాకేత ఆలయ ప్రధానార్చకులలో ఒకరైన శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘుదత్తు ఆహ్వానంపై పొన్నూరులోని వారి స్వగృహానికి వేంచేశారు. ఆతనికీమధ్యనే వివాహం జరిగింది. శ్రీవారు ఆ దంపతులకు మంగళాశాసనాలు గావించారు. రాత్రికి విజయవాడలోని పటమటకు వేంచేశారు.

18వ తేది ఉదయం పటమటలోని శ్రీమాన్ గడిపూడి రాంబాబు, సరోజనీ దంపతులు తమ గృహంలో నిర్వహిస్తున్న సుదర్శన హోమంలో పాల్గొని మంగళాశాసనాలు గావించారు. ఈకార్యక్రమానికి హోస్‌పేట మామీ దంపతులు దగ్గరుండి సకల ఏర్పాట్లు గావించారు.

సుమారు 5 సంవత్సరాలకు పూర్వం వీరికోసమే మైసూరు మామీ దంపతులు శ్రీవారిని ఆహ్వానించారు. అది ఇప్పటికి ఫలించింది. శ్రీవారు భక్తులదరికీ శ్రీ వైష్ణవ సంప్రదాయ వైభవాన్ని ఉపదేశించారు.

19, 20వ తేదీలు ప్రజ్ఞ తరగతుల పుస్తక సమీక్షా కార్యక్రమాన్ని పూర్తి కావించారు.

21వ తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం "వీరవల్లి" లోని శ్రీమాన్ శశిధర్‌గారి "శ్రేయ రిఫ్రాక్టరీస్&మోనోలితిక్స్ ఫ్యాక్టరి ఆవరణలో "మత్స్యయంత్ర ప్రతిష్ఠ" గావించి విమానంలో "బెంగుళూరు" చేరారు.

బెంగుళూరులో వివిధ సాఫ్ట్‌వేర్ కంపెనీ వ్యాపారాలు చేసుకొనే కొంతమంది C.E.O లు శ్రీమాన్ మురళీ, శ్రీమాన్ నారాయణాచార్యులు, శ్రీమాన్ గిరీష్ వీరందరు కలిసి ఒక ఆర్గనైజేషన్ నడిపిస్తున్నారు. వీరంతా శ్రీమాన్ T.S.N. రాజుగారి ద్వారా శంషాబాద్‌లో శ్రీశ్రీశ్రీ స్వామివారిని కలిసి వారి సంస్థ కార్యకలాపాలను వివరించి, వికాసతరంగిణితో కలిసి భవిష్యత్ కార్యక్రమాలను నిర్వహించడానికి పరిశీలించవలసిందిగా .Rural shores అనే వారి సంస్థని సందర్శించాలని శ్రీశ్రీశ్రీ స్వామివారిని ఆహ్వానించారు.

ఇన్ఫర్మేషన్ టెక్నాలజీకి సంబంధించిన అవుట్ సోర్సింగ్ కార్యక్రమాన్ని మారుమూల ఉండే యువతకు అందించాలనే సంకల్పంతో ఆరంభించారు.

గ్రామాల్లో ఉండే పది, పదకొండు సంవత్సరాల వయస్సు కలవారినుండి 18 సంవత్సరాల వయస్సు ఉండే యువతని పట్నాలకు వలసి పోకుండా తమ ప్రాంతాలలోనే తమ తమ కుటుంబాలతో ఉంటూ తమ కాళ్ళమీద తాము నిలబడే వసతిని కల్పిస్తే, తద్వారా గ్రామాలలో ఉండే యువత దురభ్యాసాలకు లోనుకాకుండా, అనాసక్తంగా ఉండిపోకుండా ఆధునిక విజ్ఞానాన్ని సంతరించుకుంటున్నాయి.

ఆధునిక విజ్ఞాన పరిచయం వల్ల ఆ యువతలో ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. గ్రామానికీ ఆర్థిక పరిపుష్టి కలుగుతుందనే సద్భావనతో ఈ సంస్థవారు వివిధ రాష్ట్రాలలో సుమారు 12 కేంద్రాలను మారుమూల పల్లెలో ఏర్పరిచారు. అందులో బెంగుళూరుకు సుమారు 35 కి.మీ. దూరంలో ఏర్పరచిన ఒక కేంద్రానికి శ్రీశ్రీశ్రీ స్వామివారిని ఆహ్వానించారు.

సుమారు 150 కంప్యూటర్లతో ఏర్పాటైన ఈ కేంద్రంలో పనిచేసేదంతా గ్రామీణ యువతే! ఈ కేంద్రానికి 5కి.మీ. పరిధిలో ఉండే గ్రామాలవారికి ఈ కేంద్రాలలో పని కల్పించారు.

వీరే హైస్కూల్ కూడా స్థాపించి విద్యను అభ్యసింపచేస్తూనే 10వ తరగతి పూర్తి చేసుకున్నవారికి ఈ కేంద్రాలలో ఉపాధిని పొందే శిక్షణను కూడా కల్పించడం ఎంతో ముదావహం.

అంతేకాక, వీరిలో ఆధ్యాత్మిక భావనను పెంపొందించే కార్యక్రమాలను కూడా ఏర్పాటు చేసి, విద్యావకాశాలు, ఉపాధి అవకాశాలు, ఆర్థిక పరిపుష్టితో పాటు వ్యక్తిత్వ వికాసానికి కూడా వన్నె పడుతున్న వీరి ప్రణాళిక శ్రీశ్రీశ్రీ స్వామివారికి చాలా ఆనందాన్ని కలిగించింది.

మన వికాసతరంగిణి కేంద్రాల ద్వారా మరిన్ని మారుమూల గ్రామాలలో ఇలాంటి కేంద్రాల విస్తరణకు సంబంధించి పరిశీలన చేస్తామని శ్రీశ్రీశ్రీ స్వామివారు ఆ సంస్థవారికి మంగళాశాసనాలు చేశారు.

రాత్రికి జక్కర్ ఏరియాలోని గ్రీన్ గ్రో ఇంటర్నేషనల్ హైస్కూల్ అధినేతలు శ్రీమాన్ అరుణ, డాక్టర్ రాజశేఖర్‌రావు గారి ఆహ్వానంపై వేంచేశారు.

22వ తేది ఉదయం వి.టి. సభ్యులు శ్రీమతి ఉషాజగదీష్ గారు నూతనగృహంలో జరుపుకుంటున్న సుదర్శనహోమ పూర్ణాహుతి కార్యక్రమానికి వేంచేసి మంగళాశాసనాలు చేసి, శ్రీమాన్ తూపురాణి గిరిధర్ దంపతులు, నారాయణచారి స్వామిగారి, శ్రీమాన్ గిరీష్‌కుమార్‌గార్ల గృహాలకు వేంచేసి మంగళా శాసనాలు గావించి తిరిగి అరుణారాజశేఖర్ గార్ల గృహానికి వేంచేశారు.

ఆ రోజు సాయంత్రం గ్రీన్ గ్రోవ్ ఇంటర్నేషనల్ స్కూల్ ఆవరణలో శ్రీమతి అరుణా రాజశేఖర్‌గార్ల కోరికపై శ్రీ వేంకటేశ్వరస్వామి కళ్యాణ మహోత్సవాన్ని నిర్వహింపచేసి, స్కూల్ ఆవరణలో ఉన్న స్విమ్మింగ్ పూల్‌లో పెరుమాళ్ళకి తెప్పోత్సావాన్ని నిర్వహింపచేసి భక్తులకు మంగళాశాసనాలు కావించారు. సుదర్శన హోమ కార్యక్రమాన్ని, కళ్యాణమహోత్సవాన్ని మన ఆగమ ప్రధానాచార్యులైన శ్రీమాన్ మధుసూదనాచార్యులుగారు తమ శిష్యబృందంతో శ్రీస్వామివారి నేతృత్వంలో నిర్వహించారు.

23వ తేది ఆరాధనానంతరం నాగార్జునా కన్‌స్ట్రక్షన్స్ శ్రీమాన్ రమేష్‌రాజుగారు శ్రీమాన్ జె.వి.ఇ. రంగరాజు దంపతులు, వారి పరివార గృహాలకు వేంచేసి మంగళా శాసనాలు కావించి, సింహాచల చందనోత్సవానికి వేంచేశారు.

**సింహాచలం - చందనోత్సవం**

దీనికి ముందుగా 17వ తేదీ సాయంత్రం శ్రీస్వామివారు సీతానగరంలో వేంచేసియుండగా ఆహ్వానించడానికి వచ్చి, సింహాద్రి నాథుని ఆలయ వైదికవర్గమైన అర్చకులు, పురోహితులు, E.O.గారు శ్రీశ్రీశ్రీ స్వామివారిని చందనయాత్రకు తప్పక రావాలని ఆహ్వానించారు. ఒకరోజు ముందుగా చందన వలుపు సమయానికే శ్రీస్వామివారిని వేంచేయాలని కోరారు. సింహాచలం E.O. మరియు అర్చకవర్గం వారు శ్రీస్వామివారికి అక్కడి పరిస్థితులను వివరించారు.

చందనయాత్రా సమయంలో అభిషేకం ప్రారంభమయ్యే వరకే రాత్రి సుమారు ఒంటిగంట అవుతోందని, అసలైతే సూర్యాస్తమయం కాగానే అభిషేకం ఆరంభమవడం అనేది ఆనవాయితీగా ఉండేది. చందనంలోనుండి పెరుమాళ్ళు బయటకు వచ్చిన తరువాత తిరిగి అభిషేకం జరిగి మొదటి విడత చందనకాప్పు అయ్యేవరకు స్వామికి

ఆరాధనాదులుకానీ, పక్వాహారపు నివేదనలుకాని ఉండవు. కేవలం అపక్వాహారమైన పళ్ళు, డ్రైఫూట్స్‌వంటివి ఆరగింపు చేస్తున్నట్లు చెప్పారు.

నిజరూపమూర్తికి కూడా ఆరాధన, ఆరగింపు ఉన్నట్లు శాసనాలు చెప్తున్నాయి. కాని, మనకు తెలిసిన కాలపరిధిలో ఇప్పుడు ఉండే అర్చకులుగాని, వారి పెద్దలు కాని, ఆరగింపు చేస్తున్నట్లు లేదని చెప్తున్నారు. శాసనాలలో ఉండే క్రమానికి ఇప్పుడు ఉండే క్రమానికి ఎప్పుడు మారిందనేది పరిశీలన చేయాలి.

చందనం వలచిన తెల్లవారు ఝామునుండి ఆ రోజంతా ఆరాధనాదులు లేకుండా రాత్రి ఒంటిగంటకు తిరుమంజనం ఆరంభమయితే, తెల్లవారి మొదటి విడత చందనకాప్పు అయ్యేవరకు సుమారు ఒకటిన్నరరోజు పెరుమాళ్ళకు ఆరగింపు లేకుండా అయిపోతుంది. కనుక ఈ సమయాలు మార్చుకుంటే బాగుంటుందని శ్రీశ్రీశ్రీ స్వామివారు దానికి తగిన ఏర్పాట్లను వారికి సూచించారు.

అయితే చందనయాత్రకు వచ్చే భక్తులరద్దీ చాలా ఉంటుందని కనుక రాత్రి ఒంటిగంటలోపు అభిషేకం మొదలుపెట్టడం కుదరటంలేదని ఆలయ E.O. చెప్పారు.

దానికి శ్రీశ్రీశ్రీ స్వామివారు చందనం వలచిన తెల్లవారి సూర్యాస్తమయం అయ్యేవరకు అనగా సుమారు రాత్రి 7గం॥ వరకు నిజరూప దర్శనం ఇవ్వచ్చున్నారు. అప్పుడు భక్తుల దర్శనాన్ని నిలిపి, అభిషేకం ప్రారంభం చేసుకొని, తిరిగి భక్తులను క్యూలో పంపించి నట్లయితే సామాన్యభక్తులకు కూడా అభిషేక దర్శనం కలిగే అవకాశం ఉంటుందని, అభిషేకమూ సకాలంలో పూర్తి చేసుకో గలుగుతామని, ఆ విధంగా బారికేడ్స్ వంటి నిర్మాణం చేసుకోమని సీతానగరంలోనే సూచించారు.

23వ తేదీ సాయంత్రం విశాఖ చేరగానే ఆలయ ఏర్పాట్ల పరిశీలనార్థం ఒకరోజు ముందుగానే వేంచేసి, ఆలయం సందర్శించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు ఆలయం నుండి గంగధార వరకు ఉండే మార్గమంతా కాలినడకన వెళ్లి పరిశీలన చేసి, గంగధారాతీర్థంతో కూడిన కలశాలతో వచ్చే స్వాములకు ఎలాంటి ఇబ్బంది లేకుండా ఆలయం చేరేటట్టు, ఆలయంలో ప్రవేశించాక స్వామి అభిషేకాన్ని సందర్శించవచ్చే ఉభయదారులకు, స్థానిక ప్రముఖులకు దర్శనానికి ఆటంకం లేకుండా కలశాలు తెచ్చే స్వాములు ఎటునుండి వచ్చి ఎటువైపుగా తిరిగి వెళ్ళాలి, అదే సమయంలో సామాన్య భక్తులు కూడా అభిషేకాన్ని స్వీకరిస్తున్న స్వామిని దర్శిస్తూ క్యూలో ఎలా సాగవచ్చో ఆ మార్గాన్ని సూచిస్తూ తగువిధంగా బారికేడ్స్ మార్గాన్ని మార్చమని అధికారులకి తగు సూచనలు చేశారు.

23వ తేదీ రాత్రే ఆరాధనానంతరం శయనోత్సవాన్ని జరిపి మళ్ళీ వెంటనే సుప్రభాత సేవ చేసేసి, ఆరగింపు పెట్టి అప్పుడు చందనం వలవడం మొదలుపెడతారు. ఇది పద్ధతి. ఆరోజురాత్రి సుమారు ఒకటిన్నర రెండు గంటల మధ్యలో ప్రారంభమైన ఈ కార్యక్రమం 45 ని॥ నుండి ఒక గంట సమయం పడుతుంది.

శ్రీస్వామివారు ఆ కార్యక్రమం పూర్తయ్యేవరకు ఉండి నిజరూప దర్శనం చేసి వెళ్ళారు. అప్పుడుకూడా ఉత్సవ నిర్వహణకు సంబంధించి తగు సూచనలు అధికారులకి గుర్తు చేశారు.

అయితే ఈ ఉత్సవ నిర్వహణ బాధ్యతనంతటినీ ఆ జిల్లా కలెక్టర్‌గారికి అప్పగించారు. వారు రెవెన్యూశాఖ, పోలీస్‌శాఖ వారికి అందించటంతో సుమారు 1400 మంది పోలీసులను ఆలయ పరిసరాలలో సమాయత్తం చేశారు. ఆయా శాఖలవారు, అక్కడికి వచ్చిన పోలీసువారు కూడా తమతమ బంధుమిత్రులకు ఫ్రీ పాస్‌లు అందజేసుకున్నారు. పైగా ఆలయ నిర్వాహకులుగా ఉండే వ్యక్తులుగానీ, సిబ్బందికానీ రెవెన్యూవారికి, పోలీసువారికి తెలియకపోవడం, పట్టించుకోకపోవడం వలన అసలువారినే ఆపేశారు. దానితో ఏర్పాట్లు చేయవలసిన నిర్వాహకులు దూరంగా ఉండిపోయారు. ఈలోపు ప్రభుత్వాధికారులు దర్శనార్థం రావడం, తగని మర్యాదలు జరగలేదని అసంతృప్తి చెంది వారికి తోచిన పత్రికా ప్రకటనలు ఇవ్వడం జరిగి పోయింది. అధికారులు కినుక వహించారు. వారిచ్చిన స్టేట్‌మెంట్స్ వలన E.O. మొదలగువారు వెనుకుండిపోయారు.

రెవెన్యూవారు, పోలీసువారు దర్శనం చేసుకొని వెళ్ళిపోయారు తప్ప బాధ్యతలు పట్టించుకోలేదు. అంతేకాక, వారి వారి బంధుమిత్రులను పంపి భక్తులను నిలిపివేశారు.

23వ తేదీ రాత్రి గం. 3.30 నుండి క్యూలో ఉన్నవారికి కూడా 24వ తేదీ సాయంత్రం వరకు దర్శనం చేసుకొనే అవకాశం కలగలేదు. క్యూలో ఉండిపోయినవారికి మంచినీళ్ళ ఇచ్చేనాథుడు లేకపోయాడు. నీటికోసం మోటర్ వేసే సిబ్బందికానీ, నిర్వాహకులుగాని దగ్గరలేకపోవడంతో భక్తులు చాలా ఇబ్బందుల పాలయ్యారు.

ఆలయానికి వచ్చే అధికారులు మర్యాదలకోసం ఎదురు చూడడం తగదు. మర్యాదలే కావాలనుకుంటే ఉత్సవ రద్దీ తగ్గిన తరువాత ఆలయ నిర్వాహకులకు ముందుగా తెలియజేసి దర్శించుకోవచ్చు. ఎప్పుడూ పనిచేసే సిబ్బంది అందుబాటులో లేకపోవడం, కొత్తవారు బాధ్యతలు తీసుకోవడం, పోలీసుల చేతిలో పరిస్థితి ఉండిపోవడంతో అంతా అస్తవ్యస్తమైపోయింది. నిజానికి అంతమంది పోలీసులు అవసరమే కాదు.

గతంలో మూడు నాలుగు సంవత్సరాల క్రితం భక్తులనే వాలంటీర్స్‌గా తీసుకొని ఉత్సవాలు నిర్వహించేవారు. ఈసారి ఎందువలనో ఎవరిచేతుల్లోను లేనివిధంగా పరిస్థితి మారి పోయింది. మన వికాసతరంగిణి వంటి సేవాసంస్థలు ఎన్నో ప్రసాదవితరణం చేయడంవలన భక్తులకు ప్రసాద వితరణ బాగా జరిగింది. మన వికాసతరంగిణి తరఫున శ్రీమాన్ ఎమ్.ఎస్. రాజుగారు 10 క్వింటాళ్ళ ప్రసాదాన్ని వితరణ కావించారు. మిగిలిన సంస్థలు వారుకూడా చాల చక్కగా ప్రసాద వితరణ కావించారు.

సాయంత్రం గం.6.30లకు శ్రీశ్రీశ్రీ స్వామివారు అభిషేకానికి సన్నద్ధులై ఆలయానికి వేంచేశారు. పరిస్థితిని గమనించి వారే స్వయంగా ఆలయ ముఖమండప మధ్యభాగాన్ని ఖాళీచేయించి ఒక ప్రక్క అభిషేకం జరుగుతుండగానే ప్రధాన ఉభయదారులు కూర్చునే విధంగా సన్నద్ధం చేయించారు. భక్తులంతా సేవించే విధంగా బారికేడ్స్ మార్చుకుంటూ గంగధారవరకు దారిచేసు కుంటూ అభిషేకానికి ఋత్విక్కులుగా వేంచేసిన స్వాములందరితో కలశాలలో తీర్థం నింపుకొని తీసుకొని వచ్చి రాత్రి సుమారు గం.9.30లకు అభిషేకాన్ని ప్రారంభించారు.

అర్ధరాత్రి 2గం॥వరకు అభిషేక మహోత్సవం కొనసాగింది. సామాన్య భక్తులందరూ కూడా ఈసారి అభిషేకాన్ని దర్శించుకొని సంతసించారు. అభిషేకానంతరం నేరుగా "రామానుజ జయంతి ఉత్సవాల"కై సీతానగరం బయలుదేరారు.

ఉత్సవానికి ముందు వివిధ అభిప్రాయ భేదాలు, వైమనస్యాలు ఉన్నప్పటికిని ఉత్సవం సుఖాంతమైంది. ఉత్కంఠతతో ఉద్రిక్తతతో సందేహాత్మకంగా ప్రారంభమైన చందనయాత్ర విజయవంతంగా జరిగింది.

24వ తేదీ ఉదయం వారిజ ఆశ్రమం సమీపంలో ఉన్న ISKON ఫౌండేషన్ వారి నూతన ఆలయానికి శంకుస్థాపన కావించి, మంగళాశాసనాలు కావించారు.

**భగవద్రామానుజ జయంత్యుత్సవములు**

25వ తేది ఉదయం సుమారు 11 గంటలకు శ్రీశ్రీశ్రీ స్వామివారు సీతానగరం చేరారు.

శ్రీస్వామివారి ఆజ్ఞపై ఆనాటి ఉదయ సభా కార్యక్రమంలో ఆగమ వేదవిద్యార్థులు, శ్రీమాన్ మధుసూదనాచార్యులుగారి నేతృత్వంలో చి॥ అనంత శయనాచార్యులు, వెంకటరమణ, వంశీకృష్ణలు భగవద్రామానుజుల వైభవాన్ని భక్తులకు వీనుల విందుగా అందించారు.

శ్రీమాన్ ఆగమ ప్రధాన అధ్యాపకులు శ్రీమాన్ మధు సూదనాచార్యులు సభాసమన్వయకర్తగా అన్వయిస్తూ రామానుజులు కేవలం ఆధ్యాత్మిక విశిష్టాద్వైతమత ప్రచారకులుగా సంఘసంస్కర్త అని వర్ణించారు.

అనంతరం తీర్థగోష్ఠి, తదీయారాధనతో ఉదయం కార్యక్రమం పూర్తయింది. తిరిగి సాయంత్రం 5.30గం॥లకు సామూహిక శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ అనంతరం ప్రపన్నగాయత్రి అయిన "ఇరామనుజ నూత్తందాది" శ్రీ ఉ.వే.శ్రీమాన్ ఉడయవర్లుస్వామి వారు వివరించారు. శ్రీ ఉ.వే.శ్రీమాన్ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యస్వామివారు భగవద్రామానుజ వైభవాన్ని వివరిస్తూ... అద్వైతం నుండి విశిష్టాద్వైతాన్ని ప్రతిపాదించడం ద్వారా అనేక అపోహలను తొలగించారన్నారు. అద్వైతులు జగన్మిథ్య, శాస్త్రం మిథ్య అంటూ ఉంటే, సామాన్య జీవులకు ఆలంబనమేదో తెలియని స్థితి ఏర్పడింది. దీనిని నివారించడానికే భగవద్రామానుజులు భగవంతుడు సకల కళ్యాణ గుణాకరుడని, ఆయనచే సృజించబడిన ఈ జగత్తంతా ఉపాదేయమేనని వివరించ వలసి వచ్చింది. భగవద్రామానుజుల ననుసరించి నింబార్క, వల్లభ వంటి అనేక వైష్ణవ సంప్రదాయాలు వెలువడ్డాయన్నారు.

26వ తేది సాయంత్రం హైదరాబాద్‌లో స్వామి పరిపూర్ణానంద గారు శంకరజయంతిసందర్భంగ నిర్వహించే కార్యక్రమానికి వేంచేశారు.

ఈ కార్యక్రమంలో మధ్వ సంప్రదాయాచార్యులైన శ్రీశ్రీశ్రీ సుగుణేంద్ర తీర్థస్వామివారు కూడా అన్వయించారు. ఆనాటి కార్యక్రమంలో శ్రీస్వామివారు అనుగ్రహ భాషణం చేస్తూ మతత్రయాచార్యులు చేసిన వైదిక ధర్మ ప్రతిష్ఠాపన గురించి వివరించి, ధర్మరక్షణలో అందరూ కలిసి చేయవలసిన ఆవశ్యకతని, తీసుకోవలసిన చర్యలని వివరించారు.

27వ తేది ఉదయం తిరిగి రామానుజ జయంతి కార్యక్రమా లకు హైదరాబాద్ నుండి వేంచేశారు.

శ్రీస్వామివారి ఆజ్ఞపై శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు సీతానగరంలోనే వేంచేసి ఉండి మూడురోజులూ సభా నిర్వహణ బాధ్యత వహించారు.

భగవద్రామానుజులకు తిరుమంజనాన్ని సమర్పించి నానంతరం వేదికపై సమ్మాన కార్యక్రమం ప్రారంభమైంది. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు మాట్లాడుతూ... "మన ఉభయవేదాంతా చార్య పీఠ అధ్యక్షులు శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారు 1994 నుండి ప్రతి సంవత్సరం భగవద్రామానుజ జయంతి నాడు తమ తండ్రిగారైన శ్రీఉ.వే. శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్యులవారి పేరుమీద ఒక పండితుణ్ణి, ఆచార్యవరివస్యగా **భవ్యస్మృతి పురస్కారాన్ని** అందిస్తూ వస్తున్నారు.

ఈ సంవత్సరం చక్కటి నిష్ఠ కలిగిన మహనీయులు సంప్రదాయం మీదున్న అభినివేశమే రూపుదిద్దుకున్నదా! అన్నట్లున్న శ్రీ ఉ.వే.శ్రీమాన్ ఉడయవర్లు స్వామివారికి సమర్పించాలనుకున్నారు. ఇది చాల సంతోషించ తగ్గ విషయం. శ్రీ ఉడయవర్లు స్వామివారు హైదరాబాద్ LICలో పనిచేస్తూ ఉండేవారు. ఉభయవేదాంత సభలలో పాల్గొనటానికి వస్తూ ఉండేవారు. ఉభయవేదాంతం అంటే సంస్కృత-ద్రావిడ వేదాంతాలుగా రెండు రకాలు ఉంది.

విశ్వరచనకు మూలమైనది వేదం. దీనికి వ్యాఖ్యానంగా అందిన ఇతిహాస, పురాణ, బ్రహ్మసూత్రాలను వ్యాసాది మహర్షులు సంస్కృత భాషలలో అందించారు కనుక సంస్కృత వేదాంతం అంటారు.

నిజానికి వేదాంతమంటే వేదానికి సారభూతము. ఇదీ తత్త్వము, పొందదగినది అంటూ నిర్ణయించే భాగము. ఇది సంస్కృతభాషలో ఉంటే సంస్కృత వేదాంతమని అంటారు.

భగవంతుడే స్వయంగా కొందర్ని పుట్టించి, వారికి తనయొక్క పరిపూర్ణ అనుభవాన్ని అందించి, అది వారిలో నిండి పొంగిపొరలేట్లు చేసి పాశురాలుగా పాడించింది ద్రవిడ వేదం. అలా భగవదనుగ్రహంతో పాడిన వారినే ఆళ్వార్లు అంటారు. వాటికి వ్యాఖ్యానంగా అందిన గ్రంథాలను ద్రవిడ వేదాంతం అంటారు.

మన ఉడయవర్లు స్వామివారికి ఏ భాషకి చెందిన వేదాంతాన్ని ఆ భాషలోనే ప్రవచనం చేస్తే బాగుండు అని ఉండేది. ముఖ్యంగా సంస్కృత వేదాంతాన్ని మొత్తం సంస్కృతం లోనే ప్రవచనం చేయాలని ఆర్తి పడేవారు. దాంతో వారు ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూనే హైదరాబాద్‌లో శ్రీమాన్ వేదాంతాచార్య స్వామివారిని, శ్రీ ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామి వారిని ఆశ్రయించి, శుశ్రూష చేసి ఉభయ వేదాంతాధ్యయనం చేశారు.

శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారు ఎలా అయితే కోరిన వారికి కోరినదంతా, యోగ్యులకు రుచిపుట్టించి గ్రంథాలని అధ్యాపన చేసేవారో, అలానే వీరు కూడా అభ్యసింప చేస్తూండే వారు. 76 సంIIల వయస్సులో కూడా భక్తి, భాగవత నిష్ఠ, ఆచార్యానురక్తితో శ్రీ ఉ.వే.శ్రీమాన్ తూపురాణి ఉడయవర్లు స్వామివారు తమని ఆశ్రయించిన వారికి భగవద్విషయాన్ని కాలక్షేపంగా అనుగ్రహిస్తూనే ఉన్నారు. పాండిత్యంతోపాటు శ్రీమాన్ ఉడయవర్లు స్వామివారు అరమరికలు లేనివ్యక్తి అని, ఎదుటివారిలో లోపాలు తెలిసినా "తీక్కురళై చెన్నోదోం" అని ఆండాళ్‌తల్లి చెప్పినట్లుగా మరొకరికి చేరవేయకుండా నిగ్రహించుకోగలిగిన వ్యక్తి అని, చక్కటి సౌహార్దం కలవారని ప్రశంసించారు.

భగవద్రామానుజుల తిరునక్షత్రం రోజునాడు అలాంటి మహానుభావుణ్ణి సమ్మానించాలని సమ్మానించాలనుకున్నారు.

శ్రీమాన్ ఉడయవర్లు స్వామివారి దేహస్థితిని గమనించి వారినెక్కువగా శ్రమపెట్టకుండా ఉండాలని ముందుగా ఈ సమ్మాన కార్యక్రమం, రామానుజ జయంతి మందసలో జరగాలని అనుకున్నా, భక్తినివేదనలో ప్రకటించినా తిరిగి సీతానగరం మార్చుకోవడం జరిగింది.

ఈ రోజు భగవద్రామానుజ జయంతి సందర్భంగా ముందుగా భాగవత సత్కారాన్ని చేసుకొని, తరువాత ఆచార్యారాధన, కావించుకుందాం అన్నారు.

అనంతరం శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామివారు మాట్లాడుతూ... సమ్మాన గ్రహీత శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఉడయవర్లు స్వామివారు లౌకిక ఉద్యోగ నిర్వహణలో ఉంటూ, కుటుంబ బాధ్యతలు నిర్వహిస్తూ ఉభయ వేదాంతాలని అధ్యయనం చేసిన సంప్రదాయ నిష్ఠాపరులన్నారు. తాము అధ్యయనం చేయడమే కాక అనేకమందికి ఈనాటికీ భగవద్విషయాన్ని పరంపరగా అందిస్తూ వస్తున్నారన్నారు. పాండిత్యంతోపాటు, వారిలోని సౌజన్యం, సౌహార్ద్రం, సచ్చారిత్రం వలన వారిని సత్కరించు కుంటున్నాం. సహజంగా పాండిత్యంలో కలవారిని హృదయ మార్దవం గమనించం. రెండు కలగలిపిన మహానుభావులు మన ఉడయవర్లు స్వామివారు. వారిని సమ్మానించుకుందామని మాల నూతన వస్త్ర, దక్షిణ తాంబూలాదులతో సంభావించి, తమ తండ్రిగారిపేరుమీద అక్షరస్మృతిని శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి కరకమలముల మీదుగా ఉడయవర్లు స్వామివారికి అందజేశారు. అక్షరస్మృతిని శ్రీమాన్ రంగరామానుజచార్య స్వామివారు సభాముఖంగా వినిపించి ఉడయవర్లుస్వామివారికి అందింప చేశారు.



సమ్మానానంతరం శ్రీమాన్ ఉడయవర్లు స్వామివారు మాట్లాడుతూ... "పరగత పరమాణు పర్వతీ కృత్య .... " అంటూ పెద్దలెప్పుడూ కూడా సామాన్యులలో ఉండేటటువంటి ఓ లవలేశమైన మంచిగుణాన్ని పర్వతమంతగా పెంచి పెద్దదిగా చేసి అనుగ్రహిస్తూంటారని, ఈనాడు ఈ రకమైన సమ్మానాన్ని పొందడానికి తగిన సుకృతం దాసునికి శ్రీమాన్ గోపాలాచార్య స్వామివారితో ఉన్న అనుబంధమేనని, వారి అనుగ్రహమే ఈనాటి ఈ స్థితికి కారణమని సంతోషాన్ని వెలిబుచ్చారు.

శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారు అనుగ్రహించిన గ్రంథాలని ఇతరులకు చెప్పగలిగే స్థితి వారి అనుగ్రహమే నన్నారు. శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారి బంధువర్గంలో చేరి ఉండగలగడం, వారి ఇంట్లో ఉంటూ ఉన్నత విద్యను అభ్యసించ గలగడం, చివరి సమయంలో వారికి సేవ చేసుకుంటుంటే వారి భాగవతం చదివి వినిపించమన్నారు. ఈ అదృష్టమే ఈనాడు పెద్దలంతా దాసుణ్ణి అంగీకరించే స్థితికి కారణమన్నారు. లోకంలో వారికి భిన్నంగా కనిపిస్తున్న దాసుణ్ణి ఆదరించిన శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామివారికి ఈ సమ్మానానికి, సంతోషానికి కారణమైన శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారికి దాసోహపూర్వక కృతజ్ఞతలు సమర్పించు కుంటున్నాం అన్నారు.

ఇంత ఎండలోకూడా నాపై అభిమానంతో వచ్చిన భగవద్బంధువలందరికీ కూడా కృతజ్ఞతా పూర్వక అభినందనలు తెలియచేశారు.

ఈనాటి కార్యక్రమంలో రెండు గ్రంథాలను, C.D. ని శ్రీ స్వామివారి కరకమలమీదుగా ఆవిష్కరింపచేశారు.

**1. ఆపస్తంబీయ పూర్వప్రయోగము**

మానవునికి పుట్టినది మొదలు జననం నుండి మరణం వరకు జరిపే ప్రధాన కర్మలను షోడశ కర్మలంటారు. చివరిది అంత్యేష్టి అంటారు. ఆ చివరిది తప్ప మిగిలిన శుభకర్మలన్నీ జరిపే విధానాన్ని అందించే గ్రంథమే పూర్వ ప్రయోగము. ఈ గ్రంథాన్ని శ్రీమాన్ పురాణం వేంకటాచార్యులుగారు తాము మొలుగు రామానుజాచార్య స్వామివారివద్ద సేవించినప్పుడు వ్రాసుకొన్న నోట్స్ ఆధారంగా, గోపాలాచార్యస్వామివారు వ్రాసిన గ్రంథాన్ని మరిన్ని వివరాలతో కలిపి, శ్రీస్వామివారి పర్యవేక్షణలో రూపొందించారు. దీన్ని తమ వ్యక్తిగత కైంకర్యంగా, తమ తల్లిదండ్రులు శ్రీమాన్ పురాణం అయ్యమాచార్యులు-వేంకట నరసమ్మ దంపతుల పేరుమీద ముద్రింపచేశారు. శ్రీమాన్ వేంకటాచార్యస్వామి శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనం చేశారు.

**2. ఆర్తిప్రబంధము:** మణవాళ మామునులు ఆర్తితో భగవద్రామానుజుల విషయంలో అనుసంధించిన గ్రంథము. భగవద్రామానుజ జయంతి సందర్భంగా శ్రీమతి శాఖమూరి లింగయ్య-సీతారావమ్మ దంపతుల స్మృత్యర్థం వారి కుమారుడు లక్ష్మీనారాయణ-రేణుక దంపతులు ద్రవ్యాన్ని సమర్పించి ఈ గ్రంథాన్ని ప్రతిపదార్థ తాత్పర్యాలతో ముద్రింప చేశారు. వీరికి శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.

**3. భగవద్రామానుజ వైభవం C.D.** : భగవద్రామానుజ జయంతి సందర్భంగా మంచిర్యాలలో శ్రీశ్రీశ్రీ స్వామివారు అనుగ్రహించిన భగవద్రామానుజ వైభవాన్ని ఆలోక్ స్టూడియో-సీతానగరం వారు భక్తలోకానికి C.D.గా అందించారు.

అనంతరం శ్రీశ్రీశ్రీ స్వామివారు భగవద్బంధువులందరికీ రామానుజ జయంతి కానుక ఎప్పటికీ గుర్తుండేలా "భగవద్రామానుజ స్తుతి సర్వస్వమ్" అనే గ్రంథాన్ని అందింప చేశారు. దాని వెలగా "గ్రంథాన్ని తీసుకున్న భక్తులందరూ 2016 భగవద్రామానుజ సహస్రాబ్దికి ఆ గ్రంథంలో ఉన్న రామానుజ స్తోత్రాలన్నింటిని కంఠస్థం చేయాలన్నారు. ఆ సహస్రాబ్దిలో లక్షల సంఖ్యలో అందరూ ఏకకంఠంతో రామానుజ స్తుతి చేయగలగాలి" అన్నారు.

అనంతరం రామానుజ అష్టోత్తరపూజ, ఈరవాడై తీర్థం ప్రసాద వితరణతో ఆనాటి కార్యక్రమం సుసంపన్నమైంది.

సాయంత్రం శ్రీస్వామివారు వరంగల్‌లో రామస్థూప ప్రతిష్ఠ గావించి తెల్లవారు ఝామునకు గోదావరిఖని చేరారు. అక్కడి వేంకటేశ్వరాలయంలో పాత ధ్వజస్తంభాన్ని తీసి, నూతన ధ్వజస్తంభ ప్రతిష్ఠ గావించి, దివ్యసాకేత బ్రహ్మోత్సవాలకై శంషాబాద్ వేంచేశారు.

**నేత్రవిద్యాలయ విజయోత్సవం**

**ఈ సంవత్సరం శంషాబాద్ నేత్ర విద్యాలయ విద్యార్థులు 27మంది CEC గ్రూప్‌తో ఇంటర్మీడియట్ 2వ సంవత్సరం పరీక్షకు హాజరుకాగా 25 మంది ఉత్తీర్ణులయ్యారు. వీరిలో ముగ్గురు ఏ గ్రేడ్‌తో ఉత్తీర్ణులై అత్యధికమార్కులు సాధించారు. మిగిలినవారు బి, సి, గ్రేడ్స్ పొందారు.**

**శ్రీశ్రీశ్రీ స్వామివారి మే నెల కార్యక్రమాలు**

| | |
|---|---|
| **ఏప్రిల్ 29 - మే 6** | **శంషాబాద్, శ్రీరామనగర్‌లోనే దివ్యసాకేత బ్రహ్మోత్సవాలలో వేంచేసి ఉంటారు.** |
| **మే 7-27** | **వి.టి., మరియు అల్లంపల్లి ఉపాధ్యాయుల శిక్షణ శిబిరాలను నిర్వహిస్తారు.** |
| | **వివిధ వికాసతరంగిణి కేంద్రాలవారు ముందుగానే ఇంటర్వ్యూ చేసి, సెలక్ట్ చేసుకున్న కార్యకర్తలు మాత్రమే ఈశిబిరంలో శిక్షణ పొందుతారు.** |

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన ఫిబ్రవరి నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. ఆతతాయిలపట్ల శాస్త్రనిష్కర్ష............ | |
| 2. అశ్వత్థామ ఆత్మరక్షణకు వినియోగించినది................ | |
| 3. చిచ్ఛక్తి అనగా................. | |
| 4. స్వప్నం భవిష్యత్తును సూచిస్తోందన్న స్త్రీ................ | |
| 5. సీతకి శుభాలను సూచించిన పక్షిపేరు............ | |
| 6. కప్యాస మనగా.................. (రామానుజ నిర్వచనం) | |
| 7. ప్రపన్నులనగా............. | |
| 8. 2016కి శ్రీస్వామివారు మనకందించిన లక్ష్యం........ | |
| 9. గంగ గంగపాలు చేసినవారు ఎందరు? ఎవరు?............. | |
| 10. కపిః అనగ 3 అర్థాలు చెప్పండి?............... | |
| 11. 'వరి' అనగ ధాన్యం కాదు, మరి? | |
| 12. ఉభయవేదాంతాలు ఏవి?....................... | |
| 13. 'పూర్వప్రయోగం' దేన్ని తెలుపుతుంది? .............. | |
| 14. యమునిపేరుతో నియమం...................... | |
| 15. వేణుగానంలో .................. అర్థాన్ని గ్రహించారు గోపికలు | |
| 16. స్థూణా పితామహీ అభూత్ ఎవరికి? ఎవరు?............ | |
| 17. ఆయన్ అనగ.............. | |
| 18. మహాభిషుడే .................. గా పుట్టాడు | |
| 19. పోతనభావించిన తుమ్మెద.................... | |
| 20. కృష్ణునిమెడలో మాల.................. | |
| 21. రామసుగ్రీవ మైత్రికి కారణమైన హనుమగుణాలు................. | |
| 22. వీరికి కుంభీపాకం తప్పదు............... | |
| 23. .................. గాయత్రీ.................. | |
| 24. రామానుజులననుసరించి ఏర్పడిన వైష్ణవసంప్రదాయాలు........ | |
| 25. వేసవిరాకతో సంతోషంతో పూచేవి!!! ........... | |

గత నెల విజేత : ఆరుట్ల రంగాచార్యులు, వావిలాలపల్లి, కరీంనగర్

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్లు పంపగలరు.

**భక్తినివేదన** శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః



65 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...
ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



శ్రీ నందన నామ సంవత్సరం జ్యేష్ఠమాసము

| | |
|---|---|
| సంపుటి 65 | జూన్ |
| సంచిక 3 | 2012 |

## పంచాంగ వివరాలు

జూన్ :

3. నమ్మాళ్వార్ తిరు ॥
4. పరాశర భట్టర్ తిరు ॥
5. తిథి ద్వయం, తిరువరంగప్పెరుమాళ్ తిరు ॥
7. మృగశిరకార్తె
10. శుక్రమౌఢ్య నివృత్తి
14. మిథున సంక్రమణం రా.తె. 5-11
15. కట్టెకోల ఏకాదశి, సర్వేషామేకాదశి
16. త్రయోదశి తిథి
17. మాసశివరాత్రి, శూన్యతిథి
19. పిండపితృయజ్ఞము, అమావాస్య వటసావిత్రీవ్రతం
21. పూరీ జగన్నాథ రథయాత్ర
22. ఆర్ద్ర కార్తె
24. స్కంద పంచమి
28. తిథి ద్వయం
29. పెరియాళ్వార్ తిరు॥
30. తొలి ఏకాదశి, సర్వేషామేకాదశి శయనైకాదశి, చాతుర్మాస్యారంభము.

జులై :

1. అవమతిథి, వాసుదేవద్వాదశి, నాథముని తిరు॥
3. గురుపూర్ణిమ, వ్యాసపూర్ణిమ, యతులకు చాతుర్మాస్యారంభం
6. పునర్వసు కార్తె
14. సర్వేషామేకాదశి

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

**శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు**

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-





మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,
ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం



E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org

శ్రీస్వామివారి సందేశం

# వేసవి శిబిరము - శ్రీరామనగరం

మేనెల 7వ తేదీ నుండి 27వ తేదీ వరకూ శంషాబాద్, జీవా ప్రాంగణంలో శ్రీస్వామివారి నేతృత్వంలో మన విద్యాలయాల అధ్యాపకులకు శిక్షణ తరగతులు జరిగాయి. వాటితో కలిపి వికాసతరంగిణి కార్యకర్తలకు కూడా 10దినాల చొప్పున రెండు వేసవి శిబిరాలు జరిగాయి. ఈ సందర్భంగ శ్రీశ్రీశ్రీ స్వామివారు వికాస తరంగిణి కార్యకర్తలకు అందించిన సందేశము.

'మన భగవద్బంధువులందరికోసం, వికాసతరంగిణి అంటేనే వికాసాన్ని తరంగింపచేసేది అని అర్థం వికాసాన్ని అందుకున్న మనమూ తరంగింపచేయగలిగితేనే వికాసతరంగిణి కార్యకర్తలమౌతాం! వికాసమనేది మూడుస్థాయిల్లో జరగాలి. అది లోపలినుండి రావాలి.

1. **బయటకి కన్పించే భౌతిక వికాసం.**
   **శిశువు యువకుడుగా మారడం లాంటిది.**
2. **బయటకి కన్పించకున్నా మన ప్రవర్తనలో పరిణతి ద్వారా కన్పించే అంతర్వికాసం.**

ఇది మనసుకి, ప్రవర్తనకి సంబంధించినది. కాయ పండి లోపల మధురరసం నిండడం లాంటిది.

**3. ఆధ్యాత్మిక వికాసం**..... కన్పడక లోపల ఉండే ఆత్మస్థాయిలో జరిగే వికాసం. **1. పరమాత్మతో మనకున్న సంబంధాన్ని ఆచార్యోపదేశం ద్వారా గుర్తించగలగడం. 2. ఈ సకల జగత్తు పరమాత్మశరీరంగ భావించి సేవ చేయాలన్పించడం వంటివి ఆధ్యాత్మిక వికాసం** అంటారు.

ఈ మూడు స్థాయిలలోనూ వికాసం కలిగినప్పుడే ఒకవ్యక్తిలో సమగ్రమైన లేదా పరిపూర్ణమైన వికాసం కలిగినట్లు. అపుడే ఏ పనినైనా సవ్యంగ చేయగలిగే యోగ్యత లభిస్తుంది.

సేవా, ఆధ్యాత్మిక కార్యక్రమాల ద్వారా ఈ పరిపూర్ణ వికాసాన్ని ఒకరినుండి మరొకరికి తరంగింపచేయాలన్నదే మన వికాసతరంగిణి ఆశయం. తద్వారా సమగ్ర వికాసాన్ని పొందిన సమాజాన్ని నిర్మించుకోగలుగుతాం. దానికోసమే మన వికాసతరంగిణికి రెండు లక్ష్యాలు ఏర్పరచుకున్నాం!

**1. మాధవసేవగ - సర్వప్రాణిసేవ.**

**2. స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ.**

1. మాధవుడు అంటే, ఈ సకల చరాచరముల యందు దయకలిగి వాటిని అన్నింటినీ తన శరీరంగా ధరించియున్న విశ్వశరీరకుడు. ఈ సకల విశ్వంలో ఏ ప్రాణికి మనం సేవ చేసినా అది మాధవుని సేవే అవుతుంది. కారణం ఆయా ప్రాణులన్నీ ఆతని శరీరంలో భాగాలే కనుక! ప్రతీవస్తువు మాధవమయం. మనమంతా ఆయనలోని అవయవాలం. ఆ విశ్వశరీరకునిలో మనుష్యులంతా ఒక భాగం. పశుపక్ష్యాదులు ఒక భాగం. మిగిలిన ప్రాణుల కంటే జ్ఞానము, శక్తి అధికంగా కల వారం మానవులం. మిగిలిన ప్రాణికోటికి మనం చేసే సేవ కూడా మాధవసేవే అవుతుంది.

చేయి తీసుకొనివెళ్ళి ఆహారాన్ని నోటికి అందిస్తే ఆ శక్తి శరీరమంతటా అందుతోంది చేతికి కూడా లభిస్తోంది కదా! అలానే ఈ విశ్వశరీరకునితో మనకీ మిగిలిన ప్రాణులకీ ఉన్న అనుబంధాన్ని కనుక మనం గుర్తించి భావన చేసినట్లైతే మనలో చక్కటి వికాసం కలుగుతుంది. సేవాభావం పెరుగుతుంది.

ఇక రెండు **"స్వీయ ఆరాధన- సర్వ ఆదరణ"** ఈ సృష్టిలో ఎంతో వైవిధ్యమున్నా, అంతా ఒక పరమాత్మలోని భాగమే అని, గుర్తించి, విశ్వశరీరకుని వివిధ అవయవాలమని భావించగలిగితే తోటివారిని ఆదరించగలుగుతాము.

శరీరంలో ఏ అవయవానికావయవం ఒక ప్రత్యేకతని కలిగి, ప్రత్యేకమైన పనిని చేస్తాయి. ప్రతి అవయవం చేసే పనిని మిగిలిన అవయవాలు అడ్డుకోవు కదా! ఒకదాని పనిలో మరొకటి కల్పించుకోవు కదా!

అలాగే పరమాత్మ శరీరంలోని అవయవాలమైన మనం మనపని మనం చేసుకుంటూ, ఇతరులది ఇతరులని చేసుకోనివ్వాలి. మనకి చెందిన సంప్రదాయాన్ని, ధర్మాన్ని, జీవన విధానాలని మనం పాటిస్తాం! మన దైవాన్ని మనం ఆరాధిస్తాం! ఇతరులని ఆదరిస్తాం! వారివి వారు పాటించుకోనిస్తాం!

ఈ రెండు లక్ష్యాలను పరిపూర్ణంగా అవగాహన చేసుకో

గలిగితే మనలో సమగ్ర వికాసం మూడుస్థాయిలలో ఏర్పడుతుంది. ఒకరినుండి ఒకరికి ఈ వికాసం తరంగిస్తే పరస్పర స్నేహపూరిత వాతావరణం సమాజంలో ఏర్పడుతుంది.

ఈరకమైన సమగ్ర వికాసాన్ని మన కార్యకర్తలలో కలిగించాలన్న ఆశయంతోనే ఈ వేసవి శిబిరము నిర్వహిస్తున్నాం! మన వికాసతరంగిణి కార్యకర్తలు ఒక చక్కటి సంపెంగపూవులాగ, తేనెటీగలాగా ఈ వికాసాన్ని వ్యాపింప చేయాలి'' అని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.

"సంపెగ పువ్వులో సమగ్ర వికాసం ఏర్పడగానే చక్కని పరిమళాలను అందరికీ పంచుతుంది. ఆకుచాటున తాను దాగున్నా, పరిమళంతోనే అందరికీ ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తన ఉనికిని చాటుతుంది. తాను పరిమళిస్తూ, తనని ఆశ్రయించిన వారికీ ఆ పరిమళాన్ని కలిగిస్తుంది. అలా మన కార్యకర్తలు సమర్థవంతులై, ఎక్కడ ఉంటే అక్కడ సమర్థవంతంగ తయారుచేయాలి.

ఇక తేనెటీగ పుష్పాలలోని మకరందాన్నే గ్రహించినట్లు, మన చుట్టూ ఉండే కార్యకర్తలలోని మంచిగుణాలనే గ్రహించ గలగాలి. తేనెటీగ, తాను శ్రమించి సాధించిన తేనెను తేనె పట్టులో దాస్తుంది. తీసుకున్న వారికి పంచుతుంది. మనం జరిపే సత్సంగములే తేనెపట్టు. అందులో మనం సేకరించిన జ్ఞానాన్ని, సేవాభావనలని అందరికీ పంచగలగాలి.

తేనెటీగ తేనెతుట్టుకు కావలసినది (వ్యాక్స్) పూల నుండే సేకరిస్తుంది. అలాగే మన కార్యక్రమాలకి కావలసిన సరంజామాని మనమే సేకరించుకోగలగాలి.

తేనెటీగ తేనెని సేకరించేటపుడు ఒకపుష్పంలో చాలినంత తేనె లేకుంటే మరికొన్ని పుష్పాలనుండి సేకరిస్తుంది. తగినంత ఇవ్వలేదని మొదటి పుష్పానికి హాని చేయదు. అసంతృప్తి వ్యక్తం చేయదు. పైగా పరపరాగ సంపర్కానికి సహకరిస్తుంది. అలానే మన కార్యకర్తలు అనేకమంది కార్యకర్తలను కలుపుకుని సత్సంగాన్ని, కార్యక్రమాలను విజయవంతం చేయాలి. సేవాకార్యక్రమాలను విస్తరింప చేసుకోవాలి'' అంటూ మంగళాశాసనం చేశారు.

27వ తేదీనాడు ఈ శిబిరాలు విజయవంతంగ ముగిసాయి. శ్రీవారందించిన శ్రీసూక్తులను యథావకాశం అందించే ప్రయత్నం భక్తినివేదన చేస్తుంది.

## శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి పర్యటన కార్యక్రమాలు

**జూన్ నెల**

| | | |
|---|---|---|
| 6-10 | హైదరాబాద్ | బాహేతి భవన్‌లో శ్రీమాన్ దామోదర్‌లాల్ హోడా గారి పరమపదోత్సవం కార్యక్రమంలో పాల్గొంటారు. |
| 8 | బొంబాయి | పన్వల్‌లోని శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రతిష్ఠా మహోత్సవం |
| 11 | సీతానగరం | పటమట శ్రీమతి సీతమ్మగారి పరమపదోత్సవం |
| | | డా॥ బసవేశ్వరావుగారి డెంటల్ హాస్పిటల్ ప్రారంభోత్సవం |
| 13 | హైదరాబాద్ | BHELలోని రామాలయ కళ్యాణ మండప సందర్శనం , |
| | | రాత్రికి శ్రీమాన్ సిహెచ్. రామచంద్రారెడ్డిగారి గృహంలో బస. |
| 14-15 | సేలం | శ్రీమాన్ శ్రీరాంగారి షష్టి పూర్తి మహోత్సవ కార్యక్రమంలో పాల్గొంటారు |
| 16-17 | చెన్నై | కుచలాంబాళ్ కళ్యాణమండపంలో వార్షికంగా జరిగే విద్యార్థుల కార్యక్రమంలో పాల్గొంటారు. |
| 18-19 | మాయవరం | (మైలాడు దురై) లక్ష్మీ నారాయణ టింబర్ మర్చంట్స్ సందర్శన |
| 19-20 | శివకాశి | |
| 21 | రాజపాలయం | పెరుమాళ్ళ కోవెల సందర్శన, సుదర్శన హోమాలు |
| 22 | JIVA | శ్రీరామనగర్ |
| 28 | పుల్లూరు సిద్దిపేట | నరసింహస్వామి ఆలయంలో సహస్ర కలశాభిషేకంలో పాల్గొంటారు. |
| 3 జూలై | JIVA | శ్రీరామనగర్, శంషాబాద్‌లో శ్రీశ్రీశ్రీ స్వామివారి చాతుర్మాస్య దీక్ష |



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*గత సంచిక తరువాయి...*

## (ప్రథమస్కంధం - అష్టమాధ్యాయం)

### (సప్తమాధ్యాయం- అశ్వత్థామ పరాభవం

అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రాన్ని నిలువరించడానికి అర్జునుడు శ్రీకృష్ణాదేశంతో, తానూ బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి, తాను ప్రయోగించిన అస్త్రాన్ని ఉపసంహరింపలేక, వెల్లబోయిన, అశ్వత్థామను బంధించాడు. పశువులా బంధించి తీసికొని రాబడిన అశ్వత్థామను చూచి, తన బిడ్డలనైదుగురిని, దారుణంగా రాత్రి సమయంలో నిదురిస్తూ ఉండగా, చంపిన అశ్వత్థామను చూచి కూడా శోకార్త అయిన ద్రౌపది ఆతనిని వధింపరాదని నివారించింది. అప్పటికే **"ద్రోణ"** రూపుడైన పుత్త్రుని గర్భాన ధరిస్తున్నది అశ్వత్థామ పత్ని. ఈ దుర్మార్గుని చంపి ఆమెకు అన్యాయం చేయరాదని నివారించింది ద్రౌపది. నా బిడ్డలు పోయి నేను దుఃఖిస్తున్నట్లు అశ్వత్థామను కోల్పోయి ఆతని తల్లి గౌతమి, శోకించరాదని ప్రార్థించింది.

ధర్మరాజు న్యాయమైన ద్రౌపదీ వచనాన్ని అభినందించాడు. శ్రీకృష్ణుడు కూడా అశ్వత్థామను చంపరాదని అంటూ ఆతని శిరస్సుపై ఉన్న రత్నాన్ని పెరికివేసి నిస్తేజుని చేయమని ఆదేశించాడు. అర్జునుడు అలాగే చేశాడు.

బాలహత్య చేతనే తేజోహీనుడై, మణిని కోల్పోయి మరింత శోభాహీనుడైన అశ్వత్థామను, కట్లు విదల్చి, విడిపెట్టారు. అటు తరువాత మరణించినవారికి జలప్రదానాదులు ముగించారు పాండవులు.

### అష్టమాధ్యాయం

తన వారికి తిలోదకాలు సమర్పించడానికి ద్రౌపదితో పాటు స్త్రీలంతా, గంగకు వెళ్ళారు. శ్రీహరి పాదరజఃపూతమైన గంగలో స్నానం చేసి, దుఃఖిస్తూ ఉదకాన్ని సమర్పించారు. అక్కడనే ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి, ద్రౌపదులను కృష్ణుడు పరామర్శించాడు. వారికి ఆ సమయాన పలుకవలసిన ఉపస్వాంతన వచనాలను పలికి, రథం పై కృష్ణుడు ద్వారకకు బయలుదేరాడు. అదే సమయంలో ఉత్తర కృష్ణుని ప్రార్థిస్తూ ఇలా పలికింది.

**"హే భగవన్! అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రం నన్ను వెంటాడుతున్నది. నేను మరణించినా, నా గర్భం నశింపరాదు. స్వామీ! నీవే రక్షించు"** అని ఈ మాటలు విన్న పాండవులు అస్త్రాలను సంధించి అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రాన్ని నిలువరించనుద్యమించారు. శ్రీకృష్ణుడు తన సుదర్శనాన్ని ప్రయోగించి, అందరినీ రక్షించాడు.

**వ్యసనం వీక్ష్య తత్తేషామనన్య విషయాత్మనామ్**
**సుదర్శనేన స్వాస్త్రేణ, స్వానాం రక్షాం వ్యధా ద్విభుః ॥**

సర్వభూతాంతరస్థుడైన స్వామి, తన మాయచే ఉత్తరా గర్భాన్ని ఆవరించి, కురువంశాంకురాన్ని రక్షించ ప్రయత్నించాడు. అయితే, అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రం చాలా ప్రబలమైనదవడం చేత, గర్భంలో ప్రవేశించినా, వైష్ణవాస్త్రమైన సుదర్శనం వల్ల ప్రశమించింది. అలా బ్రహ్మ తేజస్సునుండి రక్షింపబడిన తన బిడ్డలతో పాటు, ప్రయాణోన్ముఖుడైన కృష్ణస్వామిని కుంతి కీర్తించింది.

#### కుంతీకృతభగవత్ స్తుతి

**నమస్యే పురుషం త్వాద్యమీశ్వరం ప్రకృతేః పరమ్ ।**
**అలక్ష్యం సర్వభూతానామన్తర్బహిరవ స్థితమ్ ॥**

ఎరుగరానిదైన పురుషతత్త్వానికి ప్రణమిల్లుతున్నాను. అని ప్రారంభించి కుంతి చేసిన స్తుతి శ్రీ భాగవతంలోని దేవక్యాదులు చేసిన స్తుతుల్లాగానే తత్త్వగహనమైంది. అయినా కొంత సారళ్యాన్ని పొంది ఉంది దీన్ని మననం చేద్దాం.

**మాయాయవనికాచ్ఛన్నమ్, అజ్ఞా అధోక్షజమవ్యయమ్**
**న లక్ష్యసే మూఢదృశాం నటో నాట్యధరోయథా ॥**

**'మాయ'** అనే తెర చేత అగుపించకుండా కప్పబడినవాడు, అధోక్షజుడు, అవ్యయుడు అయిన నీవు, నాట్యధరుడైన నటుడు

వేషం చేత కప్పబడి తెలియబడనట్లు, తెలియబడవు. అందునా మూఢదృష్టులమైన మా బోంట్లకు ఎంత మాత్రం తెలియవు". ఈ శ్లోకంలో పరమాత్ముని వాస్తవస్వరూపం మాయచేత కప్పబడుతున్నదని అందువల్ల తెలియదని కుంతి అంటున్నది. **'మాయ'** అంటే భగవంతుని ఆశ్చర్యకరశక్తి. దీనిని అడ్డంగా తెరలా ఉంచి, తన యథార్థస్వరూపం అగుపడనీకుండా తెలియకుండా చేస్తాడు.

భగవద్యామునులు తమ శ్రీస్తుతిలో (కాంతా చతుఃశ్లోకిలో) **"జవనికా మాయా జగన్మోహినీ"** అన్నారు. సకల జగత్తులకు వ్యామోహపరచి తత్త్వం తెలియనీయక అడ్డంగా తెరలా ఉండేదే మాయ. భగవద్రామానుజులు శరణాగతిగద్యలో మాయా స్వరూపాన్ని ఇలా నిర్దేశించారు.

**"మదీయానాది కర్మప్రవాహ ప్రవృత్తాం భగవత్ స్వరూప తిరోధానకరీం, విపరీతజ్ఞానజననీం, స్వవిషయాయాశ్చ భోగ్య బుద్ధేర్జననీం, దేహేన్ద్రియత్వేన భోగ్యత్వేన సూక్ష్మరూపేణ చావ స్థితాం, దైవీం గుణమయీం మాయాం,"** అనే శరణాగతిలోని వాక్యం మాయాస్వరూపాన్ని విశదపరుస్తున్నది. దీని తాత్పర్యం.

**'మాయ'** అనేది జీవుల అనాదిసిద్ధమైన కర్మ ప్రవాహం వల్లనే ప్రవర్తిస్తున్నది. ఇది భగవంతుని స్వరూపాన్ని తెలియనీయ కుండా చేస్తుంది. విపరీతబుద్ధిని కలుగజేస్తుంది. తను భోగింపదగిన దానిననే బుద్ధిని కలిగిస్తుంది. ఈ మాయయే తాను ఈ జీవకోటికి చెందిన దేహాలుగాను, ఇంద్రియాలుగాను ఏర్పడి ఉండి, సూక్ష్మరూపంగా ఉంటుంది. **'దైవి'** అనడం చేత ఇది పరమాత్మకు చెందిన ఆశ్చర్యకరశక్తి.

దీన్నే విష్ణుపురాణం పరమాత్మకుగల మూడుశక్తుల్లో (విష్ణుశక్తి, క్షేత్రజ్ఞశక్తి, అవిద్యాశక్తులు మూడింటిలో) మూడవదిగా నిర్దేశించింది. ఇది త్రిగుణాత్మిక అనడం చేత ఇదే ప్రకృతిరూపంగా ఉన్నదని గ్రహించాలి. కనుకనే, **శ్వేతాశ్వతరోపనిషత్తు- "మాయాంతు ప్రకృతిం విద్యాత్"** అని అంటున్నది. ఈ వాక్యాలను బట్టి మాయయే, తాను ప్రాకృతికపదార్థ తత్త్వంగా ఉంటూ, తానే, తన యందు జీవులకు భోగ్యతాబుద్ధిని కలిగిస్తుంది. ఇలా మాయామయ, ప్రాకృతిక పదార్థ భోగప్రవణుడైన జీవుడు, స్వస్వరూపాన్ని పరస్వరూపాన్ని మరచిపోతాడు. దేహాత్మాభిమానంతో దేహబాంధవ్యమే శాశ్వతమని, భ్రమసి, ఆత్మబాంధవ్యాన్ని మరచిపోతాడు. ఇదంతా **'మాయా'** ప్రభావమే. **'మాయాజవనికాచ్ఛన్నమ్'** అనే విశేషణం స్పష్టపరుస్తున్నది. అధోక్షజ శబ్దానికి రెండర్థాలను వ్యాఖ్యాతలు చెబుతున్నారు. **'అక్షేభ్యోజాతం అక్షజం'** అంటే ఇంద్రియాల వల్ల పుట్టిన జ్ఞానం. ఈ అక్షజమైన జ్ఞానం ఎవ్వని చేత అధఃకరింపబడిందో ఆతడే అధోక్షజుడు. ఇంద్రియసాపేక్ష జ్ఞానం లేనివాడని అభిప్రాయం. అంటే ఇంద్రియాల మూలమైన జ్ఞానం ఎంత మాత్రం అపేక్షింపకయే సర్వజ్ఞుడు, సర్వవేత్త అయినవాడు, స్వామి, అని తాత్పర్యం. మరొక అర్థం. **'అధః అక్షం యేషాంతే అధోక్షాః'** ఇంద్రియాలకు గల విషయప్రవృత్తిని అధఃకరించిన వారు అధోక్షులు. అట్టి వారి హృదయాల్లో తాను స్వామి ఆవిర్భవిస్తాడు కనుక అధోక్షజుడు. అంటే నిగృహీతేంద్రియులైన మహానుభావుల హృదయాల్లో తాను గోచరిస్తాడు కనుక భగవానునికి అధోక్షజుడని పేరు. ఇదొక అర్థం. **'మూఢదృక్'** అంటే దృష్టి ఉన్నా తెలిసికొనలేనివాడు. దానికి కారణం **'అజ్ఞ'** శబ్దం చేత నిర్దేశించింది కుంతి. శాస్త్రజ్ఞానం, వివేకం లేకపోవడమే. ఇట్టి పరమాత్మ యొక్క స్వరూపస్వభావాలు తన వంటి **'అజ్ఞ'**లకు (అజ్ఞానపూర్ణలకు) సాక్షాత్కరించదంటున్నది కుంతి. ఇక్కడ **"నటోనాట్యధరో యథా"** అనేది దృష్టాంతం. ఒక వ్యక్తి నటుడుగా వేషం వేసుకొని నాట్యం చేస్తున్నప్పుడు ఆతని స్వరూపం యథార్థతః తెలియదు. దానికి కారణం ఆతడు వేసుకున్న వేషమే. అదే ఆతని వాస్తవ స్వరూపాన్ని కప్పి, ఆతడెవరో తెలియనీయకుండా చేస్తుంది. మాయ కూడా అంతేనన్న మాట. *(సశేషం)*

# కలివైరిసూరి వైభవము



ఫిబ్రవరి సంచిక తరువాయి...

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

## తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-8-2

పళ్ళియావతు పార్కడలరంగమిరంగవల్ పేయ్ములై

పిళ్ళైయాయ్ ఉయిరుండ ఎందైపిరానవన్ పెరుకుమిడమ్।

వెళ్ళియాన్ కరియాన్ మణినిరవణ్ణ నెన్నెణ్ణినాడొరుమ్

తెళ్ళియార్ వణంగుం మలై తిరువేంగడమద్దై నెంజమే! ॥

ప్రతిపదార్థము: **వల్**=కఠినమైన మనస్సును కలిగిన; **పేయ్**=పూతనయొక్క; **ములై**=స్తనములను; **ఇరంగ**=చేపట్టగ; **పిళ్ళైయాయ్**=పిల్లవాడై; **ఉయిర్**=(ఆపూతనయొక్క) ప్రాణములను; **ఉండ**=ఆరగించిన; **ఎందై**=మాకు స్వామి అయినవాడును, **పిరానవన్**=ఉపకారకుడును అయిన సర్వేశ్వరుడు; **పళ్ళియావతు**=శయనించియుండు; **పార్కడల్**=క్షీరసముద్రమును; **అరంగం**=శ్రీరంగమును; **పెరుకుం**=అభివృద్ధినొందుచున్న; **ఇడం**=స్థానము; **తెళ్ళియార్**=జ్ఞానాధికులైనవారు (ప్రయోజనాన్తర పరులుకాని వారు); **వెళ్ళియాన్**=(కృతయుగమునందు) శ్వేతవర్ణము కలవాడు; **కరియాన్**=(కలియుగమునందు) నల్లనివాడు; **మణినిరవణ్ణన్**=(ద్వాపరయుగమున) నీలవర్ణుడు; **ఎన్ను**=అని; **ఎణ్ణి**=తలచి; **నాడొరుం**=ప్రతిదినము; **వణంగుం**=ఆశ్రయించు నటువంటి; **మలై**=శ్రీ వేంకటాద్రి (వానిని) నెంజే= ఓ మనసా!; **అద్దై**=ఆశ్రయింపుమా!

***తాత్పర్యము:*** ఓ మనసా! శ్రీ వేంకటగిరిని ఆశ్రయించుమా! జ్ఞానాధికులైనవారిచే ఆ క్షేత్రము ప్రతిదినము సంసేవింపబడుచుండును. ఆ పెద్దలైనవారిచే కృతయుగమున శ్వేతవర్ణునిగను ద్వాపరయుగమున శ్యామలవర్ణునిగను కలియుగమున కృష్ణవర్ణునిగను ధ్యానింపబడు భగవంతుడు ఆ క్షేత్రమున వృద్ధి నొందుచున్నాడు. అతడు పూతన ప్రాణములను హరించినవాడు. పాలకడలిలో పవళించి యున్నాడు. శ్రీరంగక్షేత్రమున శయనించియున్నాడు.

***విశేషార్థము:*** మొదటి పాశురమునందు వ్యూహ దశలో పాలకడలిలో స్వామి పవళించియున్న తీరునకు ముగ్ధులైన శ్రీ కలివైరిసూరి ఈ రెండవ పాశురమున విభవావతారమగు శ్రీకృష్ణావతారమున యశోదమ్మ ఒడిలోను అర్చావతారమున శ్రీరంగక్షేత్రము నందును శయనించియున్న విధమును అనుసంధించుచున్నారు.

**పళ్ళియావదు పార్కడల్ అరంగమ్:** బ్రహ్మాది దేవతలు వచ్చి ఆశ్రయించుటకు వీలుగ క్షీరాబ్ధియందు స్వామి వేంచేసి ఉన్నాడు. అంతదూరము వెళ్ళలేని సంసారులు శయన సన్నివేశములోని తన దివ్యసౌందర్యమును సందర్శించి తరించుటకు వీలుగ శ్రీరంగక్షేత్రమున శయనమూర్తిగ వేంచేసి యున్నాడు.

**ఇరంగవిత్యాది:** స్పృశించినంతనే పాలను స్రవించి శుష్కించిన స్తనముగలదై (పూతన) ఆక్రందనము చేయసాగినది. స్వామి చిన్నిశిశువుగా నుండి పాలకు ప్రాణమునకు గల వ్యత్యాసమును తెలియనివాడై పాలతోపాటు ఆమె ప్రాణములను కూడ ఆరగించినాడు.

**ఎన్దై పిరానవన్ పెరుకుమిడమ్:** నా కులనాథుడును గొప్ప ఉపకారకుడును అయిన స్వామి వర్ధిల్లు దివ్యదేశము తిరుమల దివ్యదేశము.

**వెళ్ళియాన్ :** భగవంతుడు గైకొనిన రూపములు అనేకములు. ఈ తిరుమంగై ఆళ్వారులకు అన్నియును ఆదరణీయములుగ నున్నవి. శ్రీమన్నారాయణుడు కృత యుగమున తెల్లగను, ద్వాపరయుగమున శ్యామలవర్ణముగను కలియుగమున నల్లగను ఉండును. భగవంతునియొక్క ఈ వివిధ వర్ణములను జ్ఞానాధికులైన వారు ప్రయోజనాంతరాపేక్ష లేనివారై నిత్యము స్తుతించు స్థలము తిరుమల క్షేత్రము. నిత్యసూరులు నిత్యము భగవంతుని అనుభవించిన తీరున అనుభవింపతగిన స్థలము తిరుమల దివ్యదేశము. *(సశేషం)*




(గత సంచిక తరువాయి)

## భీష్మ చరిత్ర

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

గంగ గర్భం దాల్చింది. కొడుకు కలిగాడు. రాజుకు ఒకటే ఆనందం. గంగ ఆ బాలుని గంగానదిలో విడిచేసింది. వసువుల కిచ్చిన మాటని పాటిస్తూ. నీరుకారిపోయాడు రాజు. కాని, అడగడానికి భయం కదా! ఎక్కడ వెళ్ళిపోతుందో అని.

అలా వరుసగా ఏడుగురు కొడుకులు కలిగారు. నీటి పాలయ్యారు. ఎనిమిదవ కొడుకు కలిగినపుడు దుఃఖాన్ని పట్టలేక పోయాడు రాజు. రాని నవ్వు తెచ్చుకుంటూ 'చూడు! ఎందుకిలా చేస్తున్నావు? మమకారం లేదా? బాలసూర్యుడి లాంటి కొడుకు. ఎలా మెరిసిపోతున్నాడో చూడు. వద్దు. వాడిని చంపవద్దు.. అంటూ ముందుకి వచ్చి నిలబడ్డాడు.

"రాజా! నీతోటి పొత్తు ఈ నిమిషంతో సరి. నేను పుణ్యజల ప్రవాహరూపనైన పవిత్రగంగను. అష్టవసువులు ప్రార్థిస్తే ఆ దేవతల కోసం మానవరూపంలో నీవలన ఈ ఎనిమిదిమంది కొడుకుల్ని కన్నాను. నువ్వెంతో ధన్యుడివి. నీకు పుణ్యలోకాలు కలుగుతాయి. ఈ కుమారుడు అష్టవసువుల అంశతో కూడిన ధర్మమూర్తి. లోకశ్రేయస్సుకోసం ఈ భూలోకంలో చాలాకాలం జీవిస్తాడు. మరి నాకు సెలవు" అంది.

"వసువులేమిటి? శాపమేమిటి?" అన్నాడు శంతనుడు.

"వసిష్ఠ మహర్షి దగ్గర నందిని అనే హోమధేనువుంది. అది ఎవరేమి కోరినా పాలధారగా వర్షిస్తూ ఆ కోరికలు తీర్చేది. ఒకసారి అష్టవసువులు భార్యలతో విహారార్థం మహర్షి ఆశ్రమానికి వచ్చారు. నందినీ ధేనువు మహిమకు ఆశ్చర్యపడి ఎనిమిదవ వసువు ప్రభాసుని భార్య ఆ ధేనువును తన స్నేహితురాలికి కానుకగా ఇస్తానని దానిని తెమ్మని కోరింది. వెంటనే ప్రభాసుడు ఆ ధేనువును పట్టుకొని పోయాడు. వసిష్ఠుడు తపస్సు చేసుకుంటూ ఉంటే ఏమీ తెలియనట్లు వసువులు వెళ్ళిపోతున్నారు. యోగదృష్టితో తెలుసుకొని భూలోకంలో పుట్టమని వారిని శపించాడు వసిష్ఠుడు. ప్రభాసుడు ఎక్కువ నేరం చేశాడు కాబట్టి భూలోకంలో వీడు చాలాకాలం జీవిస్తాడు. సంతానం లేనివాడౌతాడు అని శపించాడు ఋషి" అంటూ తన నిజరూపాన్ని గంగానదీ దేవతగా ఆ రాజుకి చూపించింది గంగ. ఈ బాలుడికి దేవవ్రతుడు అని పేరు. వీడిని పెద్దవాడయ్యేదాకా పెంచి ఇస్తాను అంటూ తనతో తీసికొని వెళ్ళిపోయింది గంగ.

పెట్టినపేరు దేవవ్రతుడు. గంగపుత్రుడు కాబట్టి గాంగేయుడు. ఆ మహనీయుని ఇతిహాసమే ఉజ్జ్వలమైన మహాభారత కథ.

అలా కొన్నేళ్ళు గడిచాయి. ఒకనాడు శంతనుడు గంగానది ఒడ్డుకు వచ్చాడు. నీళ్ళెందుకో చాలా తగ్గినట్లు కనిపించాయి. ఇదేమిటి అనుకుంటూ ముందుకు నడిచాడు. అక్కడ ఒక బాలుని చూశాడు. ఆ అబ్బాయి గంగాప్రవాహానికి అడ్డుకట్ట వేసి నీటి ప్రవాహాన్ని నిలిపేశాడు. ఆశ్చర్యం. అందుకే గంగ సన్నగా కనిపించింది. ఆహా! ఈ వీరబాలుడెవరో? అలా తననే చూస్తున్న రాజును ఆ బాలుడు కూడా రెప్పార్పకుండా చూశాడు. అంతలో వచ్చింది సౌందర్యమూర్తి గంగ. కొడుకు చేయి పట్టుకొని భర్త దగ్గరకి వచ్చి 'ప్రభూ! ఈ బాలుడు నీ కుమారుడు. ఇతడు సామాన్యుడుకాడు. ఇదుగో తీసుకో! అంటూ అప్పగించి వెళ్ళిపోయింది. వెళ్తూ ఒకమాట చెప్పి మరీ వెళ్ళింది. 'వసిష్ఠుడు, శుక్రుడు, బృహస్పతి, పరశురాముడు, సనత్కుమారుడు వీరంతా ఎన్ని విద్యలలో పండితులో, వారందరి పాండిత్యం కలిసి ఈ అబ్బాయిని వరించింది. అంత గొప్ప విద్వత్తు కలవాడు' అంటూ వెళ్ళిపోయింది.

పేదవాడికి పెన్నిధి దొరికినట్లయింది శంతనమహారాజుకి. ఆనందంగా అక్కున చేర్చుకున్నాడు పుత్రుని. అసామాన్య వీరుడయిన ఆ బాలుని రాజ్యానికి తీసుకొని వెళ్ళాడు. రాజప్రధానులందరిని రప్పించి పరిచయం చేశాడు. సకాలంలో యౌవరాజ్య పట్టాభిషేకం చేశాడు. ప్రజలు ఎంత పొంగిపోయారో! రాజ్యంలో బాధలే లేకుండా పోయాయి. నాలుగు సంవత్సరాలు కొడుకుతో ఆనందమే ఆనందం. వేడుకలే వేడుకలు. అటు రాజు– ఇటు ప్రజ కూడా సుఖసంతోషాలలో మునిగిపోయారు. అలా సాగింది దేవవ్రతునితో కూడిన శంతనుని రాజ్యపాలన.

ఒకనాడు శంతను మహారాజు యమునానదీతీరంలో వేటకి బయలుదేరాడు. అక్కడికి చేరగానే అపూర్వం, అపురూపం అయిన సుగంధం–పరిమళం... ఒక్కసారి ఆవహించింది. తెలియని ఆనందానుభూతిని కలిగించింది. ఏమిటీ సువాసన! అనుకుంటూ ఆ దిక్కుగా ముందుకి సాగాడు. అక్కడ పడవ నడుపుకుంటూ

ఒక చిన్నది కనిపించింది. ఓహో.. ఇదేమి అందం! ఆ కళ్ళు అలా మిలమిల మెరిసిపోతున్నాయేమిటి? అంత చంచలంగా ఉన్నాయే? ఆ చిరునవ్వేమిటి? మన్మధబాణానికి రూపం వచ్చినట్లుందేమిటి ఈ చిన్నది. ఎవరై ఉంటుంది. మనసులో ఎన్నో ప్రశ్నలు ఉక్కిరిబిక్కిరి చేశాయి. ఈ యోజనగంధి... ఇంతదూరం సుగంధాన్ని జల్లే ఈ అమ్మాయి.. ఈ సౌందర్యరాశి... ఎవరో అడిగేద్దాం.. అనుకుంటూ ముందుకి సాగాడు. 'సుందరీ! ఇంత అందాలరాశివి పడవనడుపుతున్నావేమిటి? నువ్వు... నువ్వు...

ఒక్కసారి కళ్ళెత్తి చూచి మధురంగా నవ్వింది చిన్నది. నేను దాశరాజు అనే ఆయన కూతుర్ని. ఆయన ఆజ్ఞతోటే ఈ పని చేస్తున్నాను అంది. ఆమెపై నుంచి చూపు తప్పించుకోలేని రాజు గబగబా ఆవిడ తండ్రి దగ్గరకి వెళ్ళాడు. ఆమెను చేపట్టాలి అనే తన కోరికను చెప్పాడు. పొంగిపోయాడు దాశరాజు. అయ్యా! ఎంత భాగ్యం! ఆడపిల్ల అంటే ఎప్పటికయినా ఒక అయ్యచేతిలో పెట్టవలసినదే కదా! నీవంటి మహనీయుడు అల్లుడైతే నాకు కావలసినది ఏముంటుంది? కాని...కానీ, "ఏమిటి? నీకేం కావాలో ఇస్తాను చెప్పు అన్నాడు రాజు. నాకోరిక తీరుస్తానంటేనే మా అమ్మాయిని నీకిస్తాను" అన్నాడు. ఏమిటా కోరిక అన్నాడు రాజు.

'రాజా! నీకు ఈ సుకుమారివలన కలిగిన పుత్రునికే నీ రాజ్యం ఇవ్వాలి. ఆ బిడ్డే రాజు కావాలి అలా చేస్తానని మాట ఇవ్వగలవా? అలా అయితేనే పిల్లనిస్తా' అన్నాడు.

నిశ్చేష్టుడయ్యాడు శంతనుడు. ఒక్కసారి గాంగేయుని ముద్దుముఖం గుర్తుకు వచ్చింది. ఈ మాట తప్ప ఏదైనా కోరుకో! అన్నాడు. నాకింకేమీ వద్దన్నాడు దాశరాజు. చేసేదేమీ లేక రాజ్యానికి తిరిగి వచ్చాడు రాజు. తానైతే వచ్చాడు గాని మనస్సావిడ దగ్గర ఉండిపోయింది. కళ్ళు మూసినా, తెరిచినా ఆ రూపమే! ఏ పనిని శ్రద్ధగా చేయలేకపోతున్నాడు. గమనించాడు దేవవ్రతుడు. 'నాన్నా... ఎందుకిలా ఉన్నారు. రాజ్యంలో శత్రువులు లేరే! అశాంతి లేదే! సమస్యలేవీ లేవే... మరెందుకు బాధపడుతున్నారు మీరు?'

'నాయనా... ఒక్క కొడుకువి... నీతోపాటు మరి కొందరు పుత్రులుంటే బాగుంటుందని...'

విన్నాడు దేవవ్రతుడు. పెద్దలు, మంత్రులు, పురోహితులు అందరితో సంప్రదించాడు. అసలు విషయం బైటపడింది. యోజనగంధిపై మోజుపడుతున్నాడని తెలుసుకున్నాడు. వెంటనే దాశరాజు దగ్గరికి వెళ్ళాడు. "మీ అమ్మాయి సత్యవతిని-యోజనగంధిని మానాన్నకిచ్చి రాణిని చేయండి" అని అడిగాడు. దాశరాజు తండ్రికోసం పిల్లని అడిగిన ఆ కొడుకుని చూచి ఆనందించాడు.

అయ్యా! సత్యవతి ఉపచరుడు అనే రాజర్షి కూతురు. ఈవిడని శంతనునికి మాత్రమే ఇచ్చి వివాహం చెయ్యాలని, ఇతరులకి ఇవ్వకూడదని తండ్రి ఆజ్ఞ. పూర్వం దేవలుడు అనే ఆయన వచ్చి అడిగినా నేను ఇష్టపడలేదు. కాబట్టి నీ తండ్రికి ఇస్తాను. కాకపోతే ఈ అమ్మాయికి సంతానం కలిగితే వాళ్ళకి సవతి సంతానం ఉంటారు గదా... అంటే నువ్వున్నావు గదా! నువ్వు సామాన్యుడివా? నిన్ను త్రిమూర్తులయినా ఎదిరించి నిలువగలరా? చెప్పు. అలాంటి నువ్వు సవతిపుత్రుడవౌతావు. రాజ్యం నువ్వు పాలిస్తున్నావు. మరి మా అమ్మాయి సంతానానికి రాజ్యం ఎలా వస్తుంది చెప్పు? అన్నాడు దాశరాజు. ఏం చెయ్యాలో నువ్వే చెయ్యి. అప్పుడు పెళ్ళిమాట అన్నాడు.

"అయితే ఇక్కడ సమావేశమయిన పెద్దలందరూ, ప్రభువులందరూ వినండి. నా తండ్రి ఆనందం కోసం నేనొక ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఈ సత్యవతికి పుట్టిన కుమారుడే రాజ్యపాలనకి

హక్కుగలవాడు. మాకందరికీ ప్రభువు కాగలిగిన వాడు. కౌరవవంశానికి ఉత్తరాధికారి అతడే" అని గొప్ప ప్రకటన చేశాడు దేవవ్రతుడు.

సభలో ఉన్నవారంతా గగుర్పాటు చెందారు. తాను పాలిస్తున్న రాజ్యం పుట్టబోయే సవతి సోదరులకిచ్చేస్తాడా? ఆహా.. ఇది సామాన్యునికి సాధ్యమేనా?

అంతలో దాశరాజు మరో సందేహం వెలిబుచ్చాడు. చూడు నాయనా! నువ్వు ధర్మాలన్నీ తెలిసినవాడివి కాబట్టి ఇలా ప్రకటించగలిగావు. ఇది నీకేసాధ్యం. బాగుంది. కానీ ముందుకాలంలో నీకు పుట్టబోయే కొడుకులు నీ మాటని పాటిస్తారా? వాళ్ళూ నీలా ధర్మవర్తనులే ఔతారా? మా కోరిక తీరేదేనా?

విన్నాడు దేవవ్రతుడు. మీకా సందేహం అవసరం లేదు. స్థిరమైన బుద్ధితో ఒకమాట చెపుతున్నాను. నేను నా జీవితకాలమంతా బ్రహ్మచర్యాన్నే పాటిస్తాను. వివాహమే చేసుకోను... ప్రతిజ్ఞ చేశాడు దేవవ్రతుడు.

దేవతాకోటి పైనుంచి చూస్తున్నారు. ఆహా! ఎంత గొప్ప మనస్సు ఇతనిది. తనకి వారసత్వంగా వచ్చే రాజ్యాన్ని త్యాగం చెయ్యడమా! బ్రహ్మచర్యవ్రతాన్ని స్వీకరించి జీవితాన్ని గడపడమా... ఎంతటి సత్యనిష్ఠ! తండ్రి కోసం ఎంత ఘోరమైన ప్రతిజ్ఞ చేస్తున్నాడు. ఈ ప్రతిజ్ఞ భీష్మమైన కఠినమైన ప్రతిజ్ఞ. అలాంటి ప్రతిన చేశాడు కాబట్టి. ఇతడు భీష్ముడు-భీష్ముడు-భీష్ముడు అంటూ పూలవాన కురిపించారు దేవతలు. *(సశేషం)*

# నేర్చుకుందామా! - ౨

శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-విజయవాడ

ఆర్షవాఙ్మయం జాతికి అందించిన మహత్తర సందేశాలెన్నో! మన వేదాలు, ఉపనిషత్తులు, రామాయణ భారత భాగవతాలు మానవజాతికి మహోపకారం చేసిన గ్రంథాలు.

మానవుడు పరిపూర్ణ మానవునిగా, కార్యసాధకునిగా ఆదర్శమూర్తిగా జీవితం సాగించాలి అనుకుంటే నేర్చుకొనవలసిన అంశాలెన్నో ఉన్నాయి. అందులో మనిషి నిత్య ఉత్సాహశీలిగా ఉండాలి అంటుంది శ్రీరామాయణం.

శ్లో॥ **నిరుత్సాహస్య దీనస్య శోక పర్యాకులాత్మనః ।**
**సర్వార్థా వ్యవసీదన్తి వ్యసనం ఛాది గచ్ఛతి ॥**

ఏ కార్యాన్నయినా సాధించాలి అంటే ముందుగా ఉండవలసినది ఉత్సాహం. నిరుత్సాహవంతుడు, దీనుడు ఎప్పుడూ ఏదో ఒక విషయం గురించి బాధపడుతూ, బాధపెడుతూ ఉండేవాడు దేనిని సాధించలేడు. అటువంటి వానికి సర్వార్థాలు చెడిపోతాయి. ఆపదలు చుట్టుముట్టి వస్తాయి. అన్ని ప్రయోజనాలు నశిస్తాయి.

శోకం వలన మిగిలేది నిరుత్సాహం. దానివలన దీనత్వం వస్తుంది. దైన్యం వలన ఏ ప్రయోజనం పొందలేము. అటువంటప్పుడే ఆపదలు వచ్చి పడిపోతాయి. అంటే శోకం, నిరుత్సాహం మనిషిని అన్నివిధాలా బాధిస్తాయి.

కాబట్టి శోకాన్ని దూరంగా ఉంచాలి. నిత్యం సంతోషంగా ఉండే ప్రయత్నం చెయ్యాలి. అస్సలు దీనంగా ఉండకూడదు.

దేనినైనా సాధించేదాకా విడిచి పెట్టకూడదు.

ఎదురైన ఆపదల్ని ఉపాయంగా తప్పించుకోవాలి. నిత్యం సంతోషంగా ఉందాం. మన చుట్టూ ఉన్నవారిని కూడా ఆనందంగా ఉంచుదాం.

సంతోషం సగం బలం అన్నారు పెద్దలు ఉత్సాహవంతుడు సాధించలేనిది లేదు.




# శ్రీరామాయణంలో పక్షులు

## శకునపక్షి



*(గత సంచిక తరువాయి)*

శ్రీరామాయణం ఆదికావ్యము. కావ్యాలు రక రకాలుగ ఉంటాయి. పైకి కనిపించే కథ వరకే పరిమితమైనది అధమ కావ్యం. పైన కనిపించే కథ సాగుతూ ఉండగ, దానివెనుకన గంభీరమైన తత్త్వార్థాలు అంతర్లీనమై అభివ్యక్తమవుతూ సాగేది ఉత్తమ కావ్యం. శ్రీరామాయణం ఉత్తమ కావ్యం.

దీని ప్రతికాండలో, ప్రతి శ్లోకంలో, ప్రతిపదంలోనూ ఆ ఉత్తమత్వం ద్యోతకమవుతూనే ఉంటుంది. విశేషించి సుందరకాండ ఆచార్య వైభవాన్ని ప్రకాశింపచేస్తుంది. జీవులమైన మనకి భగవంతునితో సంబంధం అనాదిగా ఉంది. అయినా అజ్ఞానానికీ, అహంకారానికి గురియై మనమీ సంసార చక్ర బంధంలో తగులుకున్నాము. ఆ భగవంతునికి దూరమయ్యాము. ఇందులోంచి బయట పడాలనే కోరిక జీవుడికి కలిగితే, అప్పుడు, ఆచార్యుడే జీవుణ్ణి బాగుపరిచే విధానమేమిటో ఈ పక్షిద్వారా వాల్మీకిమహర్షి స్పష్టం చేస్తున్నాడు.

ఆత్మజ్ఞానాన్ని పాడుచేసే ఈ "శరీరమే-లంక". ఈ శరీరాన్ని పాలించేవి "అహంకారమనే-'రావణుడు". మమకారం అనే కుంభకర్ణుడు. అహంకారంవల్ల ఏర్పడే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, దంభము మొదలైనవి రావణ సంతానమైన ఇంద్రజిత్ ప్రభృతులంతా. ఈ దుష్టుల ప్రేరణతో పనిచేస్తూ ఈ జీవుణ్ణి వేధిస్తూండే నిత్యశత్రువులైన ఇంద్రియాలే ఏకాక్షి, ఏకకర్ణి మొదలైన రాక్షసులు. ఇలాంటి భయంకరులు, భీభత్సమైన కృత్యాలు చేసే వారితో నిండి ఉన్న లంకవంటిది ఈ శరీరం. ఇందులో బద్ధుడైన భగవత్సంబంధం కల జీవుడే శ్రీరామునికి చెందిన సీత. జీవుణ్ణి సీతతో పోలుస్తున్నాం అన్నమాట.

లంకలో సీతమ్మ రావణుని తిరస్కరించి శ్రీరాముడే నాకు గతి అనే విశ్వాసంతో ఉంది.

ఈ శరీరంలో ఉంటూ, అహంకారాదులను అణచి భగవత్పరమైన నిష్ఠతో భగవత్సంబంధాన్ని కోరుకునే జీవుడికి ఆచార్యులు జ్ఞానోపదేశాన్ని అనుగ్రహిస్తారు. అట్లాంటి ఆచార్యుల లక్షణాలను ఈ శ్లోకంలోని పక్షి ద్వారా సూచిస్తున్నాడు వాల్మీకి భగవానుడు.

**పక్షీ చ శాఖానిలయః ప్రహృష్టః**
**పునః పునశ్చోత్తమ సాంత్వవాదీ ।**
**సుస్వాగతాం వాచ ముదీరయానః**
**పునః పునః చోదయతీవ హృష్టః ॥**

ఎగిరే సాధనాలైన రెక్కలను పక్షములంటారు. అవి కలది పక్షి. అంతటా ప్రకాశించే ఆకాశమే భగవత్తత్త్వము. దానిలో నిరంతరమూ సంచరిస్తూంటారు ఆచార్యులు. తత్త్వ విషయములో పూర్ణమైన జ్ఞానము, దానికి సంబంధించిన సదాచారము అనేవి రెండూ వారికి రెక్కలుగ ఉంటాయి. జ్ఞానమూ, ఆచరణా వారు కలిగి ఉండడంతోపాటు, తమ నాశ్రయించే వారందరికీ ఆచరణను అలవాటు చేయిస్తారు. అందుకే వీరు 'పక్షి' పదంవల్ల తెలిసే 'ఆచార్య' శబ్దానికి అర్హులై ఉంటారు.

వీరు శాఖా నిలయులై ఉంటారు. వేదములను శాఖలుగ గుర్తిస్తారు. వీరు, తమకు చెందిన వేదశాఖ బోధించే విషయంలో నిష్ఠ కలిగి ఉంటారు. అంటే, ఆచార్యుడు వేదమార్గావలంబియై స్వశాఖాధ్యయనం చేసి ఉండాలి. అది లేనివాడాచార్యుడు కాలేడు. నేర్చిన వైదిక విజ్ఞానాన్ని మరచిపోరాదు. అదొక ఘోరమైన పాపమంటుంది ధర్మశాస్త్రము.

అందుకే ఆచార్యలక్షణాలు చెప్పేటప్పుడు మొట్టమొదట గుర్తు. వేదము నేర్చి, అనుష్ఠించువాడు అనే చెప్పారు.

**ఆచార్యోవేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః**
**మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ సదామంత్రాశ్రయ శ్శుచిః ।**
**గురుభక్తి సమాయుక్తః పురాణజ్ఞో విశేషతః**
**ఏవం లక్షణ సంపన్నో గురురిత్యభిధీయతే ॥**

వేదాన్నే తన సర్వస్వమూ అనుకున్నవాడే ఆచార్యుడు. వేదవేద్యుడు వేదసారము అయిన విష్ణువునందు భక్తికలిగిన వైష్ణవుడే ఆచార్య శబ్దానికి అర్హుడు. ఇతరుల వైభవమునకు సంతసించువాడు. ఆత్మోజ్జీవనకరమైన మంత్రము తెలిసినవాడు. దానియందు ప్రేమతో పదిలంగ దాచుకొనువాడు, ఇతరులకు బోధించే వరకే కాక, తానూ అదేమంత్రమందు విశ్వాసం కలవాడు మంత్రప్రభావాన్ని స్వాధీనపరచుకున్నా, మనస్సులో ఏమాత్రమూ గర్వములేనివాడు, ఇవన్నీ తన ఆచార్యుల అనుగ్రహంవల్ల లభించాయనే వినయము,

విశ్వాసమున్నవాడు అంటే, తనంతట తానే ఇవన్నీ సాధించాననే స్వయంభూకాని వాడన్నమాట.

వేదార్థాన్నిగూడ తదుపబృంహణములైన పురాణాదుల ద్వారా నిశ్చయించుకున్నవాడే సరైన అర్థనిర్ణయాన్ని చేయగలుగుతాడు. లేనినాడా జ్ఞానము అసమగ్రమౌతుంది. ఇవన్నీ కలవాడినే ఆచార్యుడంటారు. ఈతడే మన అజ్ఞా నాంధకారాన్ని తొలగించే "గురువు" కాగలుగుతాడు.

ఇలాంటి ఆచార్యుడు ఎప్పుడూ **'ప్రహృష్టః'** జ్ఞానపూర్ణుడై ఆనందిస్తూంటాడు. అట్టివారినే **'ద్రష్టవ్యః సర్వదేహిభిః'** సదా దర్శించాలి బాగుపడగోరే వారందరూ, అంటుంది శాస్త్రము.

వారిని **'ఉత్తమ సాంత్వవాదీ'** అంటారు. భగవంతుడికి 'ఉత్తముడు' అని పేరు. బద్ధజీవులకంటే, ముక్తజీవులకంటే పైవాడు భగవంతుడు కనుకనే ఆయన ఉత్తముడు,.. కర్మబద్ధఫలమైన మనం భగవంతుణ్ణి గుర్తించలేక, ఆయనతో సమానుల మన్నంత ధీమాతో, అహంకారగ్రస్తులమై తిరుగుతూంటే మనకు భగవంతుణ్ణి గురించి తెలిపి, ఆతని స్వామిత్వాన్ని, మన దాస్యాన్ని అంగీకరింప చేస్తారాచార్యులు. భగవంతునితో కలహం వద్దంటారు. ఇది ఒకసారి చెప్తే మనకు అర్థంకాదు. ఒప్పుకోము. అయినా విసుగుచెందరు ఆచార్యులు. "పునఃపునః చ" మంచిపంటను కోరిన రైతు విసుగు, విరామం లేకుండా క్షేత్రంలో కృషి సాగిస్తారు. ఒకసారి పంటకు చీడపట్టచ్చు. మరొకసారి అతివృష్టి వల్లనో, అనావృష్టివల్లనో ఇతర కారణాలవల్లనో పంట దక్కకపోవచ్చు. అయినా, నిరాశచెందడు. కృషి మానడు. అందుకే ఆ రైతుని 'కర్షకుడు' అంటారు. కృషి చేసేవాడు అని అర్థం.

సదాచార్యుడు ఒకసారి చెప్పేశాను కనుక నా బాధ్యత తీరిపోయిందనుకోకుండా పునః పునః కృషిచేసి మనకు ఆ భగవత్ తత్త్వాన్ని అర్థమయ్యేటట్లు చేస్తాడు. దీనివల్ల భగవంతుని కంటే ఆచార్యుడే గొప్పవాడు అని తెలుస్తుంది.

ఒకసారి భగవంతుడు అర్జునునికి భగవద్గీతను బోధించాడు. అది అర్జునుని మనస్సులో బాగ పడలేదు. భారత యుద్ధమైపోయాక ఈ విషయాన్ని గమనించాడు కృష్ణుడు. 'కోపం వచ్చింది.' 'ఇంత అశ్రద్ధా? దుర్మేధాశ్చాసి పాండవ!' అంటూ కోపగించి, భగవద్గీతాసారాన్ని తిరిగి ఉపదేశించాడట. కానీ, ఆచార్యుడలా కాక, తిరిగి తిరిగి చెప్పి మనస్సుకు పట్టించి, శిష్యులను బాగుచేస్తాడు. ఆ చెప్పేదిగూడ ఏదో తన నోటికి, మనస్సుకి తోచినదీ, నచ్చినదీ చెప్పకుండా సుస్వాగతాం **వాచం ఉదీరయానః** సు+స్వ+ఆగతాం=పూర్వాచార్య పరంపరనుండి ఏమాత్రం చెడకుండా తన ఆచార్యుల ద్వారా తన దాక అందుతూ వచ్చిన సదర్థజాతమును తన శిష్యులకు తాను అందిస్తాడు. దీనినే "సం+ప్ర+దాయము" అని అంటారు. మన ఆచార్యులతో ఆరంభమైన గురుపరంపర **'ఆభగవత్తః'** అంటూ ప్రథమాచార్యుడైన శ్రియఃపతి వరకూ సాగుతుంది. ఈ ఆచార్యపరంపర ఆదరించిన మంత్రరాజము శ్రీమదష్టాక్షరీ మహామంత్రము. దీనిని అనుష్ఠాన పర్యంతమయ్యేటట్లు బోధిస్తారాచార్యులు. ఒకసారి చెప్పి ఊరుకోరు. కేవలము దయతోటే "పునఃపునః చోదయతి ఇవ" పదే పదే చింతన చేయిస్తూ శిష్యులమైన మనము బాగుపడేటంత వరకూ బోధిస్తారు.

తప్పటడుగులు వేస్తోంటే **స్ఖాలిత్యే శాసితారం** అన్నట్టు నయాన్నో భయాన్నో మనలను తిరిగి మంచిమార్గంలోకి తెస్తూంటారు. వారివల్ల మనం బాగుపడి ప్రయోజనవంతులమైతే అది చూచి తామే ఆనందిస్తారు. **'హృష్టః'** శిశువు ఆనందంగ ఉంటే ఆనందం తనదని భావించే తల్లిలా, శిష్యులు బాగుపడి ప్రయోజన వంతులైతే, అదేదో తమకు లాభం కల్గినట్టు పొంగిపోతూంటారు ఉత్తములైన ఆచార్యులు. చెట్టుపై కూర్చొని కూసే పింగళికా అనే ఈ శకునపక్షి ఇంత చక్కని తత్త్వార్థాన్ని వెలువరిస్తోంది తన కూతలతో. అది చెవికిసోకిన సీతమ్మ తన ఆత్మహత్యా ప్రయత్నాన్ని విరమించుకుంది. వెంటనే హనుమ పాడిన రామకథ వినిపించింది. ఇది సుందరకాండలోని పక్షికథ. *(ఇంకా ఉంది)*



# పోతన భాగవతం - మధురభక్తి

శ్రీమతి డా॥ పి. జ్యోతి- వరంగల్

*(గత సంచిక తరువాయి)*

త్రుటికాలమైనా అతని వియోగాన్ని భరించలేని గోపికలు కృష్ణుని నడకను, లీలలను అనుకరిస్తూ కృష్ణుని వెదుకుతూ ఆ చెట్టును, ఈ చెట్టును కృష్ణజాడలు చెప్పుమని నిలదీస్తారు. ఓ అశ్వత్థమా! ఓ న్యగ్రోధమా! ప్రేమనిండిన చూపులతో నవ్వులతో మా మనసును దోచుకొని నందగోపాలుడు వెళ్లిపోయినాడు. మీరెక్కడైనా చూచినారా? అంటూ..

**పున్నాగ కానవే, పున్నాగవందితుఁ దిలకంబ కానవే, తిలకనిటలు ఘనసార కానవే, ఘనసార శోభితు బంధూక కానవే, బంధుమిత్రు మన్మథకానవే, మన్మథాకారుని, వంశంబ కానవే, వంశధరునిఁ జందన కానవే, చందనశీతలుఁ, గుందంబ కానవే కుందరదను.**

తే॥ **నింద్ర భూజమ కానవే యింద్ర విభవుఁ**
**గువల వృక్షమకానవే కువలయేశుఁ**
**బియక పాదప కానవే ప్రియ విహారు,**
**ననుచు గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు.**

కృష్ణాన్వేషణ తత్పరులైన గోపికల గీతలు మధురభక్తి నిర్భరమైనవి. భరతుడు నాట్యశాస్త్రంలో 'కామం చతుర్విధ పురుషార్థ సంబంధియై ఉంటుం'దన్నాడు.

**ధర్మకామోర్థ కామశ్చ మోక్ష కామ స్తథైవ చ**
**స్త్రీ పుంసయోస్తు సంయోగో యః కామస్సతు సంస్మృతః**

అని భరతుడు స్త్రీ పుంస సంయోగ రూపమైన కామమే కాక ధర్మార్థ మోక్ష కామాల గురించి చెప్పినాడు. శ్రీకృష్ణుని పట్ల ఉన్నది గోపికలకు మోక్షకామం. ఇంద్రియ సంబంధి కాదు. బ్రహ్మ భావనతో సమానమైనది. ఇటువంటి ఉజ్జ్వల శృంగారానికి గమ్యం మోక్షమే కాని ప్రాపంచికమైన ఇంద్రియానందం కాదు. ఇటువంటి మధురభక్తి నిధానాలైన సన్నివేశాలెన్నో భాగవతంలో ఉన్నాయి.

**నల్లనివాడు పద్మనయనంబుల వాఁడు కృపారసంబు పైఁ**
**జల్లెడువాఁడు మౌళి పరి సర్పిత పింఛము వాఁడు నవ్వురా**
**జిల్లెడుమోము వాఁడొకఁడు చెల్వల మానధనంబు, దోచెనో**
**మల్లియలార మీ పొదల మాటున లేఁడు గదమ్మ చెప్పరే!**

అని గోపికలు కృష్ణుని జాడలకై వెదకుతూ కృష్ణుని చేష్టలను అనుకరించినారు. వారిలో ఒక గోపిక శకటాసురుని లాగా నటించింది. మరొక గోపిక ఆమెను పాదతాడనం చేసింది. మరొకరు తృణావర్తుని లాగా అనుకరిస్తే ఇంకొక గోపిక గాలికి వానకు భయపడకండి. నేను ఈ కొండను ఎత్తి రక్షిస్తానని శూన్యంలో చేతిని ఎత్తి గోవర్ధనమెత్తినట్లు అనుకరించింది. ఒకామె వేరొక గోపికను రోటికి కట్టి బెదిరించింది. కట్టబడిన ఆమె భయపడినట్లు వెక్కి వెక్కి ఏడ్చింది. కృష్ణభావనతో నిండి వారంతా తన్మయత్వం పొందినారు. వారికి తాము గోపస్త్రీలమన్న భావనే లేదు. శ్రీకృష్ణుడు వారిని ఆవేశించినట్లుగానే పోతనను ఆవేశించినాడు. అందుకే పరవశుడై పోతన ఈ ఘట్టాన్ని రసవంతంగా వర్ణించినాడు. ఇది భక్తికి పరాకాష్ఠ.

ఈ విధంగా గోపికలు కృష్ణ విరహాన్ని సహించలేక దుఃఖించినారు. తీవ్రమైన వేదననుభవించినారు. అటువంటి తపన కలిగితేనేగాని భగవద్దర్శనం కాదంటారు. అందుకే శ్రీకృష్ణుడు వారికి వెంటనే సాక్షాత్కరించినాడు. ప్రేమతో గోపికల కండ్లు విప్పారినాయి. అందరూ శ్రీకృష్ణుని చుట్టూ మూగినారు. కృష్ణదర్శనంతో కొంతవరకు వారి విరహం తీరింది. కృష్ణునితో తమను కొంతసేపు ఎందుకు విడిచి వెళ్ళినావని, నిజంగా నీవు నిర్దయుడవేనని గోపికలు అలక వహించినారు. కృష్ణుడు వారితో నా పట్ల మీకు నిరంతర స్మరణ కలుగడం కోసమే అంతర్ధానం చెందినానని చెప్పి మీరు నాకోసం సర్వం త్యజించినారు. లోకనియమాలను ఉల్లంఘించినారు. శరీర బంధువులను వదలడం సాధ్యం కాదు. అయినా శరీర బంధువులను, ఇంటిని, అన్ని బంధాలను త్రెంచుకొని సేవించిన మీ ప్రేమకు ప్రత్యుపకారం చేయడం నాకు సాధ్యం కాని పని. నేను కూడా ఎప్పుడూ మీ ప్రేమనే నిరంతరం భావిస్తానని చెప్పి ఊరడించినాడు. వారి నందరిని తీసుకొని వెళ్ళి యమునా సైకతంపై రాసక్రీడలు ప్రారంభించినాడు.

**ఆ సమయంబునన్ విభుఁడనంతుడు కృష్ణుడు చిత్రమూర్తియై**
**చేసెను మండల భ్రమణ శీల పరస్పర బద్ధ బాహుకాం**

**తాసు విలాసమున్ బహువిధ స్ఫురితానన హస్తపాద వి**
**న్యాసము రాసముం గృత వియచ్చర నేత్ర మనోవికాసమున్.**

మండలాకారంగా గోపికలు శ్రీకృష్ణుని చుట్టూ చేరగా ఇద్దరిద్దరికి మధ్య కృష్ణుడు నిలిచినాడు. భగవంతుని హస్తస్పర్శను పొందిన గోపికల భాగ్యానికి ఆనందిస్తూ దేవతలు ఆకాశంలో నిలిచి ఉత్సాహంతో దర్శించినారు. దుందుభులు మ్రోగినాయి. వారిపై పుష్పవృష్టి కురిసింది. రాసక్రీడలో నర్తనం చేస్తున్న గోపస్త్రీల కంకణాల, నూపురాల, కింకిణుల ధ్వనులతో ఆ ప్రదేశమంతా నిండిపోయింది. శ్రీకృష్ణుడు ఒక్కడే! గోపికలు ఎంతోమంది. పరమాత్మ ఒక్కడే. జీవులు ఎంతోమంది, కనుక ఇది జీవాత్మ పరమాత్మల సంబంధంగా పేర్కొనవచ్చు. ప్రతి జీవునిలో పరమాత్మ ఉన్నా వారి వారి యోగ్యతల ననుసరించి పరమాత్మ దర్శనం కలుగుతుంది. ఆ వెన్నెల రాత్రిలో వేణునాదం వినబడినట్లు ఓంకారనాదం చెవినబడి దాని అర్థం మనసులో భావించిన వారికి పరమాత్మ సాక్షాత్కరిస్తాడు. గోపవనితలు ఆ రాత్రి అంతా కృష్ణునితో గడిపి తెల్లవారు సమయంలో ఇండ్లకు వచ్చినారు. కృష్ణ సంకల్పం వల్ల గోపాలకులు తమ భార్యలు తమవద్దలేరని అనుకొనలేదు. బ్రహ్మానుభవాన్ని అనుభవించి ఉదయమే ఇంటికి పొమ్మన్న కృష్ణుని ఆజ్ఞను ఇష్టం లేకపోయినా పాటించినారు గోపికలు.

ఈ వృత్తాంతాన్ని విన్న పరీక్షిత్తు శుకునితో కృష్ణుడు పరదారలతో విహరించడం ఎంతవరకు సబబు అని ప్రశ్నించినాడు. శుకుడు భగవంతుడు ఈ లోకంలో మనుష్యులవలె జన్మిస్తాడు. కాని కర్మవశ్యుడు కాడు. లోకంలో అధర్మంగా తోచేది భగవంతుని పట్ల అధర్మం కాదు. పరదారలు అతనికి పరదారలు కాదు. లోకమంతా అతనికే పరతంత్రం అతని చేతనే నియమింపబడి అనుభవింపబడుతుంది. అజ్ఞానం వల్ల భగవంతుని మరచి దూరమైన వారిలో కొందరికి ఆర్తి కలిగి భగవంతుని కోసం తపిస్తారు. అటువంటి సందర్భంలో ఆర్తి కలిగినా విరోధులు అడ్డుపడుతున్నప్పుడు ఆ విరోధులను తొలగించి వారిని తనలో చేర్చుకోవడానికి ఏ విధంగా ప్రవర్తించాలో ఆ విధంగా ప్రవర్తిస్తాడు. అందుకే భగవంతునికి దోషమంటదు అని చెపుతాడు. *(ఇంకా ఉంది)*

## భక్తినివేదన ప్రోత్సాహకులు

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యనారాయణమూర్తి | విజయవాడ | 11,116/- |
| 2. | కె. లక్ష్మీ సుజాత | దొడ్డనపూడి | 5,116/- |
| 3. | ఎమ్. వేంకటాచార్యులు | హనుమకొండ | 5,111/- |
| 4. | ఎమ్. రామారావు | హైదరాబాద్ | 5,000/- |
| 5. | రాజకుమారి | హైదరాబాద్ | 5,000/- |
| 6. | కె. మురళీకృష్ణారావు | తిరువూరు | 5,000/- |
| 7. | బి.వి. రమణమ్మ | కాకినాడ | 5,000/- |
| 8. | వి.వి.ఎస్. ప్రసాద్, బేబి సరోజిని | విజయవాడ | 5,000/- |
| 9. | పి. నిరంజన్ | చెన్నై | 5,000/- |
| 10. | శ్రీనివాసాచార్యులు | రామాయంపేట | 5,000/- |

**మీరు భక్తినివేదన అభివృద్ధికై ప్రోత్సాహక కైంకర్యాన్ని సమర్పించినందుకు శ్రీస్వామివారి మంగళాశాసనములు అనుగ్రహించారు.**

## మేనెల మెదడుకి మేత! సమాధానములు

1. ఆతతాయిన మాయాంతం హన్యాదేవ అవిచారితమ్।, 2. బ్రహ్మ శిరోనామకాస్త్రం, 3. జ్ఞానాత్మకమైన శక్తి, 4. త్రిజట, 5. పింగళిక, 6. తామర తూడుపై ఉండు పద్మం, 7. తమ రక్షణభారాన్ని భగవంతునిపై పెట్టి నిశ్చింతగ ఉండేవారు, 8. కంఠస్థం చేయడం, లక్షమంది ఏకకంఠంగ పారాయణ చేయడం, 9. అష్టవసువులలో 7గురు, 10. కోతి, తామరతూడు, సూర్యుడు, 11. చూడదగినది, 12. సంస్కృతవేదాంతం, ద్రవిడ వేదాంతం. 13. మనిషి పుట్టినదగ్గరనుండి వివాహపర్యంతం తెలుపుతుంది. 14. యమం, 15. ప్రణవార్థం, 16. లోకానికి, నృసింహుడు ఆవిర్భవించిన స్తంభం, 17. ప్రహ్లాదుడు, 18. శంతనుడు, 19. శ్రీహరి, 20. వైజయంతిమాల, 21. బుద్ధిర్బలం, 22. భయభీతులయినవారిని ఉపేక్షించినవారికి, 23. ప్రపన్న గాయత్రీ, ఇరామానుజ నూత్తందాది, 24. నింబార్క, వల్లభ, చైతన్య, 25. కలిగొట్టుచెట్లు.

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...)

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

## వర్మ్రీ అడిమై శెంజోనో లక్ష్మణనైప్పోల

"అత్తయ్యా... మీ మనవణ్ణి కాస్త పిలవండి..." అమ్మ కాస్త కోపంతో.

"ఏం చేశాడేం... అంత కోపం వాడిమీద....?" బామ్మ.

"గోవిందుడు హాస్టల్‌కు బయలుదేరుతున్నాడా! వీడు వెంటబడుతున్నాడు. తనూ గోవిందుతో వెళతాడట... అదిగో ఆ మొండితనం చూడండి..." అమ్మ.

"వేంకటకృష్ణా... రా.. నాన్నా..." బామ్మ.

"నేను రాను.. పో.. అన్నయ్యతో నేనూ వెళతా.." కృష్ణుడు.

"గోవిందును సంచి సర్దుకోనీయకుండా అడ్డంగా కూర్చున్నాడు చూడండి...." అమ్మ.

"కిట్టప్పా... దా.. తొందరగా వచ్చావంటే నీకో మంచికథ చెప్తా... గోవిందుడితో వెళితే అక్కడ నీకు కథలెవరూ చెపుతారు? మన రాముడికి మాలకట్టటానికి పూలు ఎవరు కోసిస్తారు? ఇంకా ఎన్ని పనులున్నాయి నీకు. అవన్నీ ఎవరు చేస్తారు? దా.. నాన్నా..."

బామ్మ మాటలకు మెల్లగా కరిగి, ఉన్న చోటునుంచి కదిలాడు కృష్ణుడు.

"దా... దా... బంగారుకొండ.. మనం దొడ్లో పూలుకోసుకుంటూ కథ చెప్పుకుందాం..."

"నా ఒక్కడికే చెప్పు బామ్మ... గోవిందన్నకు చెప్పకు..."

"సరేలే! రా .. వాడు హాస్టలుకు వెళ్ళిపోతాడుగా! నువ్వే కథలన్నీ విందువుగాని.. సరేనా.. నీకు లక్ష్మణుడి గురించి తెలుసా?"

"ఓ తెలుసు... రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు నలుగురు అన్నదమ్ములు కదూ!"

"అబ్బో! బుల్లి కిట్టప్పకు బాగానే గుర్తుందే! శ్రీరాముడికి పట్టాభిషేకం చేయాలనుకున్నాడు కదా దశరథుడు! అప్పుడేమో 'కైక', అంటే దశరథ చక్రవర్తి చిన్నభార్య, రెండు కోరికలు కోరుకుంది."

"ఏమిటవి?"

"ఒకటి, రాముడికి బదులుగా భరతుడికి పట్టాభిషేకం చేయాలి. రెండు, రాముడు పధ్నాలుగేళ్ళు అడవికి వెళ్ళాలి."

"అయ్యో పాపం! రాముడు ఒంటరిగా అడవికి వెళ్తే ఆయనకు అన్నం ఎవరు పెడతారు? ఎవరు మాట్లాడతారు? ఎవరితో ఉంటాడు? కష్టం కదూ బామ్మా!"

"నా బంగారమే! రాముడి మీద నీకెంత ప్రీతిరా కన్నా! అయితే నీలాగే లక్ష్మణుడు, రాముడు ఒంటరిగా అడవికి వెళ్తే కష్టపడిపోతాడని, నేనూ నీతో వస్తానన్నాడు.

**"మయా సమేతోఽరణ్యాని బహూని విచరిష్యసి ।**
**పక్షిభిః మృగయూథైశ్చ సంఘుష్టాని సమంతతః ॥**

"అన్నా క్రూరమృగాలతో, ఏనుగులతో నిండి ఉండే అడవులకు నువ్వు ఒంటరిగా వెళ్ళొద్దు. రకరకాల పక్షికూతలతో, భయంకరమైన జంతువులతో, వాటి అరుపులతో ప్రతిధ్వనించే అడవులలో నువ్వొంటరిగా తిరగడం నేను భరించలేను. నేనూ నీతో అడవికి వస్తాను. ధనుస్సు పట్టుకొని నీకు అండగా నీతోనే ఉంటాను" అన్నాడు.

"రాముడు ఒప్పుకున్నాడా?"

"లక్ష్మణుడికి రాముడిమీద ఎంత ప్రేమో, రాముడికీ లక్ష్మణుడి మీద అంత ప్రేమా ఉంటుంది కదా! అందుకనే తన తమ్ముడు కష్టపడటం ఇష్టంలేక రావద్దన్నాడు. తాను మాత్రమే వెళ్ళాలని తండ్రిగారు తనను మాత్రమే అడవులకు వెళ్ళమన్నారని చెప్పాడు రాముడు.

"అయితే లక్ష్మణస్వామి రాముడితో అడవికి వెళ్ళలేదా బామ్మా!"

"ఊరుకుంటాడా లక్ష్మణస్వామి?"

**యదర్థం ప్రతిషేధో మే క్రియతే గంతు మిచ్ఛతః ।**
**ఏతదిచ్ఛామి విజ్ఞాతుం సంశయోఽయం మమానఘ ॥**

"అన్నా! ఎప్పుడూ నీతోనే ఉండటానికి మునుపే ఒప్పుకున్నావు. ఇప్పుడేమో వద్దంటున్నావు. నావల్ల ఏదైనా అపరాధం జరిగిందా! చెప్పు" అని నిలదీసి అడిగాడు. లక్ష్మణస్వామిని ఎన్నిరకాలుగా చెప్పి ఒప్పించాలనుకున్నా వినలేదు, రాముడివల్ల కావడం లేదు.

**"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే ।**
**అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే ॥**

సీతమ్మ, నువ్వు అడవులలోని పర్వతసానువుల్లో, హాయిగా విహరిస్తుంటే మీకు కావాల్సిన సకలోపచారాలు నేను చేసి పెడతాను. జంతువులనుండి, రాక్షసులనుంచి ఆపద కలగకుండా కాపలా ఉంటాను అని ఎన్నో విధాలుగా ప్రయత్నించి ఆఖరికి ఒప్పించాడు. సీత వస్తానంటే ఆమెను కూడా ఆపాలని రాముడు ప్రయత్నించాడు. ఆవిడా ఆగలేదు. చివరికి సీతా రామ లక్ష్మణులు అడవికి బయలుదేరారు.

"మరీ లక్ష్మణుని తల్లి సుమిత్ర కదా! ఆవిడ లక్ష్మణుడు అడవికి వెళ్ళటానికి ఒప్పుకుందా!"

"పెద్దవాళ్ళక్కూడా రాని అనుమానం నీకొచ్చింది. సుమిత్ర ఒప్పుకోవటమేకాక తప్పక వెళ్ళమని చెప్పింది.

**'రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్ ।**
**అయోధ్యాం అటవీం విద్ధి గచ్ఛ తాత! యథాసుఖమ్ ॥**

(శ్రీమద్రామాయణం, అయోధ్యాకాండ 40-9))

లక్ష్మణా! శ్రీరాముడే ఇకనుంచి నీకు తండ్రి. సీతమ్మను తల్లిగా భావించు. అడవిని అయోధ్యగా భావించు. హాయిగా సీతారాములతో వెళ్ళిరా! అని దీవించి పంపింది.

"తిరువాయ్‌మొళ్లిలో నమ్మాళ్వార్ ఈ కైంకర్యం గురించి ఎలా వర్ణించారో చెప్పు బామ్మా!" అంది ప్రతిభ.

"ప్రతిభా! నువ్వెప్పుడొచ్చావు? పూలు కోస్తూ నిన్ను చూడనేలేదు" అంది బామ్మ.

"ఇందాకే వచ్చాను బామ్మా. "ఒళ్లివిల్..." పాశురం చెప్తాను బామ్మా"

**ఒళ్లివిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని ।**
**వళ్లివిలా అడిమై శెయ్యవేణ్డుమ్ నామ్ ।**
**తెళ్లికుర లరువి త్తిరువేఙ్గడత్తు ।**
**ఎళ్లిల్‌కొళ్ శోది ఎన్దై తన్దై తన్దైక్కే ॥**(తిరువాయ్‌మొళ్లి 3.31)

లక్ష్మణస్వామిలా జీవితకాలమంతా పరమాత్మ కైంకర్యం చేయాలి. ఆ కైంకర్యంలో ఎలాంటి దోషాలు దొరలకుండా ఉండాలని తిరుమల శ్రీనివాసుడిని ప్రార్థించారు."

"అంతేనా

**ఆళుమాళార్ । ఆళ్లియుమ్ శంగుమ్ శుమప్పార్ తామ్ ।**
**వాళుమ్ విల్లుంకొణ్డు । పిన్ శెల్వార్ మత్తిల్లై ।**

*(తిరువాయ్‌మొళ్లి 8.3.3)*

లక్ష్మణస్వామి రాముడివెంట వెళ్ళి ఆయన ఆయుధాలన్నింటినీ భుజాన వేసుకు తిరిగాడు. ఆ లక్ష్మణుడు కూడా వెంట లేకపోతే ఏమైపోయేదో శ్రీరాముడికి అని తపించిపోయారు నమ్మాళ్వార్.

"ఎంత బాగా చెప్పావే ప్రతిభా! అలా రాముడికి ఆజన్మం దాస్యం చేసి ముక్తి పొందడం ఎంతమందికి సాధ్యమవుతుంది. ఎంత పుణ్యం చేసుకుంటే ఆ భాగ్యం దొరుకుతుంది....!"

**"వళ్లి అడిమై శెంజేనో లక్ష్మణనైప్పోల** అని తిరుక్కోళూరుమ్మాళే అంది. మనమెంత బామ్మా...!"

"నువ్వన్న దానికి అర్థం చెప్పు ప్రతిభక్కా!" అన్నాడు కృష్ణ.

"లక్ష్మణునిలా జీవితమంతా దాస్యం చేశానా," అని అంది తిరుక్కోళూరమ్మ. (సశేషం)

# ఉపకారస్మృతి

**శ్రీమాన్ సముద్రాల శఠగోపాచార్యస్వామి - వరంగల్**

మానవుడు సంఘజీవి. అతడు పుట్టింది మొదలుకొని గిట్టేవరకు సమాజంలోని అనేకుల సహాయ సహకారాలను పొందుతూనే ఉంటాడు. సామాజికులు ఒకరికొకరు సహకరించుకోకుండా, ఇతరుల తోడ్పాటు లేకుండా కుటుంబ జీవనాన్ని గడపలేరు. ప్రగతిపథంలోకి అడుగిడలేరు. అందుకే ప్రతివ్యక్తి తనకు ఇతరులు చేసిన ఉపకారములను చివరివరకు మరువకూడదు. తప్పక అందరూ 'ఉపకారస్మృతి'ని కలిగి యుండవలసిందే! అంతేకాక అవకాశము వచ్చినప్పుడల్లా తనశక్తిమేరకు ఇతరులకు తోడ్పడవలసినదే! ఉపకరించినవారికి ప్రత్యుపకారం చేయడమనేది సనాతనధర్మమని తెలుసుకొన వలెను. **కృతే చ ప్రతికర్తవ్యం ఏష ధర్మస్సనాతనః** అని శ్రీమద్రామాయణ సూక్తి మనకు ప్రబోధిస్తున్నది.

ఈ సూక్తిసారాన్ని ఆచరణలో నిలుపుకున్న మహనీయుడు శ్రీరామచంద్రుడు. తనకు ఎవరైనా ఒకచిన్న ఉపకారాన్ని తెలిసి చేసినా, తెలియక చేసినా, ఉపకారాన్ని, ఉపకారం చేసినవారిని మాటిమాటికీ తలచుకుంటూ పరమానందాన్ని పొందేవాడు అనే విషయం.. "కథం చిదుపకారేణ కృతేనైకేన తుష్యతి" అను శ్రీమద్రామాయణ సూక్తి ద్వారా వెల్లడగుచున్నది.

ఆదర్శవంతమైన రీతిలో రాజ్యాన్ని పరిపాలించిన విక్రమాదిత్యుడు కూడా 'ఉపకారస్మృతి' అనే సద్గుణం కలవాడే. సహజంగా విక్రమాదిత్యుడు తాను ప్రతిరోజు ఎందరెందరికో ఎన్నెన్నో సహాయాలు చేసేవాడే అయినా తనకు ఉపకరించిన వారిని ఎన్నడూ మరువలేదట.

శ్రీరాముడు తన అర్ధాంగియైన సీతాదేవి క్షేమవృత్తాంతాన్ని తెలుసుకొని లంకనుండి తిరిగి వచ్చిన హనుమంతునితో ఇట్లు పలికెను – 'నీవు నాకు గొప్ప ఉపకారాన్ని చేశావు. నీవు చేసిన గొప్ప సహాయానికి నేను తగిన ప్రత్యుపకారాన్ని ఏ విధంగా చేయగలను. అయినా నా సర్వస్వమనదగిన గాఢాలింగనాన్ని నీకు అందిస్తున్నాను స్వీకరించుము..

**"ఏష సర్వస్వభూతోమే పరిష్వంగో హనూమతః ।**
**మయాకాలమిమం ప్రాప్య దత్త స్తస్య మహాత్మనః॥**

అని హనుమంతుణ్ణి శ్రీరాముడు ఆలింగనం చేసుకొనెను.

స్నేహితులు పాలు నీళ్ళలా అరమరికలు లేకుండా కలిసిపోవాలి. ఉపకారబుద్ధితో జీవించాలి. ఒకరికొకరు చేదోడు వాదోడుగా మెలగాలి. కష్టసుఖాల్ని సమంగా పంచుకోవాలి. పాలు తమను చేరిన నీళ్ళకు తెల్లదనాన్ని కమ్మదనాన్ని సంక్రమింపజేస్తాయి. పాలను కాస్తున్నప్పుడు నీళ్ళు ఉపకారస్మృతితో పాలకంటె ముందుగా తాము ఇంకిపోతూ పాలను రక్షించుకుంటాయి. తమకు ఉపకరించే దిశగా నీళ్ళు ఇంకిపోవడాన్ని పాలు సహించలేవు. అందుకే మంటల్ని ఆర్పేసేందుకు పాలు పొంగిపొర్లుతుంటాయి. అప్పుడు పొంగేపాలలో నీళ్ళను చల్లగానే మిత్రుణ్ణి పొందిన ఆనందంతో పాలు పొంగిపొర్లడాన్ని విరమించుకుంటాయి. పాలునీళ్ళవలె ఉపకారస్మృతితో, కృతజ్ఞతాభావంతో సమాజంలోని అందరూ ఆదరాభిమానాలతో ఆత్మీయానురాగాలతో మెలగాలి. అంతేకాని ఏ పరిస్థితిలోనూ పొందిన ఉపకారాన్ని విస్మరించరాదు. పొందిన ఉపకారాన్ని, ఉపకరించిన వ్యక్తులను విస్మరించడం 'కృతఘ్నత'గా పేర్కొనబడును.

ఇతరుల సహాయాన్ని విస్మరించి, కృతజ్ఞత లేక, ప్రత్యుపకారబుద్ధి లేని కృతఘ్నుని ప్రవర్తన పేద–గొప్ప, చిన్న–పెద్ద, పండిత–పామర అనే భేదం లేకుండా అందరినీ బాధించు నట్టిదే. పొరపాట్లను, తప్పిదాలను సరిదిద్దుకునే ప్రాయశ్చిత్త మార్గాలెన్నో ఉంటాయి. కాని పశ్చాత్తాపం లేనివారిని, కృతఘ్నులను ఎవరూ నచ్చరు, మెచ్చరు, చేరదీయరు, చేయూతనివ్వరు.

మహాపరాధములను చేసినవానికి, బ్రహ్మహత్యను, మద్యపానమును, దొంగతనము చేసినవారికి, ప్రారంభించిన వ్రతాన్ని మధ్యలో వదిలినవారికి, ప్రాయశ్చిత్తము కలదు. కాని ఇతరులు తమకు చేసిన ఉపకారాన్ని మరిచిన కృతఘ్నులకు మాత్రం నిష్కృతి లేనేలేదని కిష్కింధాకాండ 34వ సర్గలోని ఈ క్రింది శ్లోకము ద్వారా స్పష్టమగుచున్నది.

**బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా ।**
**నిష్కృతిర్విహితా సద్భిః కృతఘ్నేనాస్తి నిష్కృతిః ॥**

అందుకే అందరి ఆదరాభిమానాలకు పాత్రుల్ని చేసే 'ఉపకార స్మృతిని అలవరచుకోవలసిందే!

గీతామాహాత్మ్యకథలు - 12

# సిద్ధ సమాధి యోగి

శ్రీమాన్ నోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

ప్రాణాపాయ స్థితిలో ఉన్నవారిని రక్షించగలిగే స్థితిలో ఉండి రక్షించకపోవడం పరమ దుర్మార్గమే కాకుండా, మహా రాక్షసకృత్యం. అలాంటి తప్పు చేసిన వారికి దండన, భగవద్గీత చూపిన నిష్కృతి గతమాసంకథ **వివాహ మండపం**లో చదివాం. ఇక భగవద్గీతలోని భక్తిషట్కంలోని ఆఖరి అధ్యాయం అయిన "భక్తియోగా"నికి సంబంధించిన కథను గురించి తెలుసు కుందాం.

భక్తియోగంలో నిష్ఠ కలిగిన అర్జునుడు భగవంతుని యొక్క ఐశ్వర్య విస్తారాన్ని దర్శించాలని కోరాడు.

దయాసముద్రుడైన పరమాత్మ తన కార్యరూపాన్ని యథార్థంగా ప్రదర్శించాడు. అలా ప్రదర్శించి, అట్లాంటి స్వరూపాన్ని దర్శించాలన్నా, జ్ఞానాదులు పొందాలన్నా తనపై మనకు గల అనన్యభక్తియే సాధనమని చెప్పాడు పదకొండో అధ్యాయంలో.

"అయితే స్వామీ! మరి నిన్ను నిరంతరం ఉపాసన చేసే భక్తులు, అవ్యక్తమైన ఆత్మోపాసన చేసే భక్తులలో శ్రేష్ఠులు ఎవరు?" అని అడిగాడు. ఆ ప్రశ్నకి పన్నెండో అధ్యాయంలో, ఆత్మప్రాప్తికి సాధనమైన ఆత్మోపాసనచేయడం కంటే, భక్తి రూపమైన భగవదుపాసన చేయడం ద్వారా ఆత్మప్రాప్తిని, పరమాత్మ దర్శనాన్ని కూడా సులభంగా శీఘ్రంగా పొంద వచ్చును, కాబట్టి పరమాత్మోపాసకుడే శ్రేష్ఠుడని చెప్పాడు.

ఆ పరమాత్మపై మనసు నిలపడానికి సర్వ కర్మల ఫలములను తనకు శ్రద్ధగా సమర్పించవలసినదని ఆజ్ఞాపించాడు శ్రీకృష్ణుడు. ఎందుకంటే....

**శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే ।**
**ధ్యానాత్కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతి రనంతరమ్ ॥**

అభ్యాసం కంటే జ్ఞానం శ్రేయోదాయకం. జ్ఞానం కంటే ధ్యానం ఉత్తమమైనది. ధ్యానం కంటే కర్మఫల త్యాగం మేలైనది. ఆపై అలాంటి కర్మఫల త్యాగం వలన శాంతి లభిస్తుంది అని చెప్పాడు శ్రీకృష్ణుడు.

ఈ అధ్యాయంలో ఇలాంటి ఉత్తమమైన విషయాలు తెలుపుకుంటూ, భక్తులకుండవలసిన లక్షణాలలో తనకిష్టమైనవి ఏమిటో తెలియజేసాడు. కలతచెందనివాడు, కలతపెట్టనివాడు, తటస్థుడు, శుచియైనవాడు, సమర్థుడు, ఉదాసీనుడు, ద్వంద్వాల కతీతుడైనవాడు, మమకారరహితుడు, మననశీలాది సద్గుణ సంపన్నుడు తనకు ప్రియుడని చెప్పాడు భగవంతుడు.

భక్తియొక్క శక్తి విలువను ఎందరో మహానుభావులు నిరూపించారు. వారి కథలలో ప్రహ్లాదచరిత్ర ఎంతో ఆశ్చర్యకరంగా ఉంటుంది. అలాంటి సంభ్రమాశ్చర్యాలు కలిగించే ఈ మాసం కథని ఇప్పుడు చదువుదాం.

మీకు శ్రీవేంకటేశ్వరస్వామి కథ గుర్తుండే ఉంటుంది. శ్రీవేంకటేశ్వరుడి మీద అలిగి వచ్చేసిన లక్ష్మీదేవి భూలోకంలో కొల్హాపురం అనే గ్రామానికి దగ్గరగా తపస్సు చేసుకుంటూ కూర్చుంది. ఇప్పుడు మనం చెప్పబోయే కథ దక్షిణదేశంలో ఉన్న ఈ కొల్హాపురం అనే గ్రామానికి చెందిన కథే. ఇక్కడ లక్ష్మీదేవి స్వయంగా వచ్చి నివసించడం వలన ఆ గ్రామం పట్టణమై సర్వసౌభాగ్యాలతో తులతుగుతూ ఉండేది. లక్ష్మీదేవి అక్కడే ఉండడం వలన ఎందరో దేవతలు కూడా ఆ పట్టణంలోనే అదృశ్యరూపంలో తిరుగాడుతుండేవారు.

ఒకరోజు ఆగ్రామానికి సకల శుభలక్షణాలు కలిగిన ఒక నవయువకుడు వచ్చాడు. అతడొక రాకుమారుడు. బలిష్టమైన అవయవ సన్నివేశం కలిగిన ఆ రాకుమారుడు, స్ఫురద్రూపిలా కనబడుతున్నాడు. అతడు తిన్నగా ఈ లక్ష్మీమాత మందిరానికి వచ్చి ఇలా ప్రార్థించాడు.

"అమ్మా! జగజ్జననీ! ఈ లోకంలో ఉన్న అందరి ఐశ్వర్యము, సొగసు, శాంతి, మంగళకరమైన ఫలితములు సర్వము నీ ఆధీనము కాబట్టే నిన్ను శ్రీయని, శ్రీమత్ అని పిలుస్తుంటారు. ఐహికంగా మాకు కలిగే సర్వలాభములు నీ సంకల్పము వలననే సిద్ధిస్తున్నాయి. అమ్మా నీ మహిమ యొక్క అంతు ఎవ్వరికీ తెలియదు. ఎందుకంటే దానికి హద్దేలేదు కనుక. నీ అనుగ్రహ ముంటే సాధారణమైన వాడుకూడా బృహస్పతి అంతటివాడు అవుతాడు. సరస్వతీ, దుర్గాదులు నీకు కోడళ్ళై సేవకురాళ్ల వలె మెలుగుతున్నారు...." ఇలా అనేక విధాలుగా లక్ష్మీదేవిని కీర్తించాడు.

ఆ ప్రార్థనను ఆలకించిన లక్ష్మీదేవి ఆ రాకుమారుడి ముందు సాక్షాత్కరించింది. "నాయనా! నీవు భక్తితో చేసిన స్తుతికి ఎంతగానో సంతోషించాను. నీకేదైనా వరమివ్వాలను కుంటున్నాను కోరుకో" అంది లక్ష్మీదేవి వాత్సల్యంతో.

ఆ రాకుమారుడు తల్లియైన లక్ష్మీదేవికి సాష్టాంగ వందనం సమర్పించి, "అమ్మా! నీవు కరుణామూర్తివన్న మాట నీ దర్శనమే

నిరూపిస్తోంది. మాతా! నా తండ్రియైన బృహద్రథమహారాజు అశ్వమేథ యాగం చేస్తూ, వ్యాధిగ్రస్తుడై మరణించాడు. ఆయన పూర్తి చేయదలచుకున్న అశ్వమేథయాగాన్ని నేను పూర్తి చేయాలనుకుంటున్నాను. కాని యాగసమాప్తికి కావలసిన యాగాశ్వం కనబడటంలేదు. అశ్వమేథయాగాన్ని పూర్తిచేసి పితృఋణం తీర్చుకోవాలనుకుంటున్నాను. కాబట్టి నాకు ఆ యాగాశ్వాన్ని తిరిగి అనుగ్రహించు" అని ప్రార్థించాడు.

లక్ష్మీదేవి ఆ రాకుమారుని పితృభక్తికి మెచ్చి "కుమారా! ఈ ఆలయప్రాంగణంలోనే ఒక బ్రాహ్మణుడు నివసిస్తున్నాడు. ఆతనిని సిద్ధ సమాధి యోగి అని పిలుస్తారు. నీవతనిని ఆశ్రయించు నీ కోరిక నెరవేరుతుంది" అని చెప్పి అంతర్థానమై పోయింది.

రాకుమారుడు ఆ సిద్ధసమాధియోగి వద్దకు వెళ్లి ఆతనికి సాష్టాంగ వందనం చేసి, ఆతని సన్నిధిలో చేతులుకట్టుకుని నిలబడ్డాడు. ఆ యోగి కన్నులుతెరచి చూశాడు. ఆ రాకుమారుని చూచి "నిన్ను లక్ష్మీదేవి పంపించింది కదూ! ఒక్క నిమిషం" అని రెండు కళ్లూ మూసుకుని దేవతలందరిని తన సమ్ముఖానికి రమ్మని ఆజ్ఞాపించాడు. వారందరు ఆయన ముందు సాక్షాత్కరించి భక్తితో నమస్కరించి 'స్వామీ! ఏమి ఆజ్ఞ!' అని అడిగారు. "ఈ రాకుమారుని తండ్రి చేసే అశ్వమేథ యజ్ఞంలోని యాగాశ్వాన్ని దేవేంద్రుడపహరించాడు! వెంటనే వెతికి తీసుకురండి" అని ఆజ్ఞాపించాడు.

కొద్ది సమయంలోనే ఆ దేవతలు యాగాశ్వంతో ప్రత్యక్షమయ్యారు. ఆ పోయిన గుఱ్ఱాన్ని చూసి రాకుమారుడు సంభ్రమాశ్చర్యాలకు గురి అయ్యాడు. వెంటనే ఆ యోగి వైపుకు తిరిగి మళ్లీ ఇలా అన్నాడు. 'స్వామీ! నాతండ్రి మృతదేహాన్ని తైలద్రావకంలో భద్రపరచి ఇక్కడికి వచ్చాను. మీరు చాలా మహిమాన్వితులు, దయచేసి నా తండ్రిని పునరుజ్జీవితుని చేయండి. ఆయన తలపెట్టిన అశ్వమేథ యాగాన్ని ఆయన తోటే పూర్తి చేయిస్తాను.

ఆ రాకుమారుని పితృభక్తిని చూచి చాల సంతోషించి గట్టిగా పైకే పక పక నవ్వాడు. "నీ పితృభక్తి నన్ను చాల ఆనందింపజేసింది. నీ రాజ్యానికి పద, చూద్దాం!" అని ఆ రాకుమారుడి రాజ్యానికి వెళ్లి ఆతని తండ్రి మృతకళేబరాన్ని చూసాడు. వెంటనే తన కమండలంలోని జలాన్ని మంత్రించి ఆ శరీరంపై జల్లాడు. అందరూ స్థాణువుల్లా నిలబడి చూస్తుండగా ఆ మహారాజు సజీవుడయ్యాడు. మహారాజుకు రాకుమారుడు జరిగిన వృత్తాంతమంతా చెప్పాడు. మహారాజు ఆశ్చర్యానికి అంతేలేదు.

అప్పుడు మహారాజు, రాకుమారుడు తిరిగి ఆ సిద్ధసమాధి యోగి వద్దకు వెళ్లి "ఓ మహాయోగీ ! తమరికింతటి మహత్తు రావడానికి గల కారణమేమిటి? దయతో తెలియజేయ వలసినది" అని ప్రార్థించారు. ఆ యోగి "రాజా ! ఇందులో పెద్ద రహస్యమేమి దాగియుండలేదు".

**గీతానాం ద్వాదశాధ్యాయం జపామ్యహ మతంద్రితః ।**
**తేనశక్తిరియం రాజన్ మయాప్రాప్తోఽసి జీవితమ్ ॥**

"ఓ రాజా! నేను భగవద్గీతలోని 12వ అధ్యాయాన్ని సతతము పారాయణ చేయడం వలననే నాకిట్టి శక్తి ప్రాప్తించింది" అని చెప్పాడు.

అది విని ఆ రాజు, కుమారుడు కూడా చాలా సంతోషించి, ఆతని వద్ద గీతయందలి ద్వాదశాధ్యాయాన్ని భక్తి శ్రద్ధలతో నేర్చుకున్నారు. ఆ తరువాత అశ్వమేథయాగాన్ని పూర్తిచేసి, ప్రతి దినము భగవద్గీతలోని 12వ అధ్యాయమైన భక్తియోగాన్ని భక్తితో పారాయణ చేసి తమ జీవితానంతరం మోక్షాన్ని పొందారు అని శంకరుడు ఉమాదేవికి 12వ అధ్యాయం మహిమగా చెబుతూ ఈ కథను ఇంతకు పూర్వమే లక్ష్మీదేవి అడిగిన ప్రశ్నకు సమాధానంగా శ్రీమన్నారాయణుడు చెప్పాడని చెప్పాడు.

ఉమాదేవి ఆ సిద్ధయోగిని, ఆ రాకుమారుణ్ణి తలచుకుని మురిసిపోయింది.

చిత్రకథ - 11

# రామానుజ చిత్రకథ
























అవునోయ్! ఇకపై రామానుజులే పాఠాలు చెప్తే బాగుంటుంది.


అవును. నన్నే సవరించే ఈ స్థితి ప్రోత్సహించ తగదు. ఇతన్ని నా దగ్గర ఉంచుకుంటే నేను చెప్పేది ఎవరు వింటారు? తలెత్తుకు తిరగడం నాకే కష్టం.


రామానుజా! ఇన్ని తెలిసిన నువ్వు ఇక చదవడం అనవసరం కదూ! చాలు... చాలు... మన పాఠానికి....


స్వామీ! మీరు చెప్పమన్నారు కాబట్టి నాకు తోచింది చెప్పా.
అదే! నేను చెప్పేదానికంటే నీకు బాగా తెలుసు. ఇక చాలు, వెళ్ళు!


విచారముతో కాంచీపూర్ణుల వద్దకి ప్రయాణమయ్యారు.


దాసోహములు
రామానుజా! నీ అధ్యయనం బాగా సాగుతోందా! విచారంగా కనిపిస్తున్నావు కారణమేమిటి?


ఈ రోజు గురువుగారూ.... ఇక నేను వారి వద్ద నేర్వవలసినది ఏమీలేదు వెళ్ళమన్నారు


రామానుజా! వరదునిసన్నిధిలో నీ తీర్థకైంకర్యము ఉండనే ఉందిగద! శ్రద్ధగా చేయి. ఆ వరదుడే ఏదో మార్గము చూపిస్తాడు


వరదరాజ స్వామి సన్నిధికి తీర్థ కైంకర్యం చేస్తున్నారు రామానుజులు


రామానుజుని గురించి ఆచార్యులకి తెలియ పరచాలి


కొంతకాలం తరువాత..
దాసోహం! మేము కాంచీపుర వాసులము
కాంచీపురం నుండా! రామానుజుడనే బాలుడు బాగున్నాడా!


కేశవయజ్వ పుత్రుడే కద! రామానుజుడు! బాగున్నాడు.
ఇంకా వుంది

తొండరడిప్పొడి ఆళ్వార్ అనుగ్రహించిన




# తిరుప్పళ్ళియెళ్ళుచ్చి

శ్రీరంగనాథుని సుప్రభాత గీతిక

వైశారదీ

(గతసంచికతరువాయి...)

**పులమ్బిన పుట్కళుం పూంపొళ్ళిల్ కళిన్‌వాయ్,**
**పోయ్‌త్తు క్కంగుళ్ పుగుందదు పులరి,**
**కలన్దదు కుణతిశై క్కనై కడ లరవం,**
**కళి వండు మిళ్ళత్తియ కలంబకం పునైన్ద,**
**అలంగలం తొడైయల్ కొండడియిణై పణివాన్,**
**అమరర్‌కళ్ పుకున్దన రాతలిల్ అమ్మా!,**
**ఇలంగైయర్ కోన్ వళ్ళిపాడుశెయ్ కోయిల్,**
**ఎంబెరుమాన్! పళ్ళి యెళ్ళున్దరుళాయే ॥ 5**

**పూం** = పూచి ఉన్న
**పొళ్ళల్‌కళిన్ వాయ్** = తోటలలోనుండి
**పుట్కళుం** = పక్షులును
**పులంబిన** = (మేలుకొని) అరుచుచున్నవి
**కంగుళ్** = రాత్రి
**పోయ్‌త్తు** = గడిచిపోయినది
**పులరి** = ఉషఃకాలము
**పుగున్దదు** = ప్రవేశించినది.
**కుణ తిశై** = తూర్పు దిక్కున;
**కనై** = ఘోషించుచున్న
**కడల్ అరవం** = సముద్రధ్వనియు
**కలన్దదు** = పైవాటితో చేరినది.
**కళి** = తేనెను త్రాగి ఆనందించు చున్న
**వన్దు** = గండు తుమ్మెదల యొక్క
**మిళ్ళత్తియ** = ఝుంకారమును కలిగిన
**కలంబకం పునైంద** = అనేక రకములైన పూవులచే కూర్చబడిన
**అం** = అందమగు
**తొడైయల్** = మాలలు
**కొండు** = చేతిలో ధరించి
**అలంగల్** = నీకు అలంకరణ చేయుభక్తులుగ
**అమరర్‌గళ్** = దేవతలు
**అడియిణై పణివాన్** = నీ పాదద్వయమును సేవించుటకు
**పుగున్దనర్** = ప్రవేశించిరి.
**ఆదలిల్** = కనుక
**అమ్మా!** = సర్వస్వామీ!
**ఇలంగైయర్ కోన్** = లంకాధిపతియగు విభీషణుడు
**వళ్ళిపాడు శెయ్** = దాసవృత్తి చేయు
**కోయిల్** = శ్రీరంగమునందుండు
**ఎంబెరుమాన్** = మాస్వామి! (నన్ను ఏలువాడా!)
**అరంగత్తమ్మా!** = శ్రీరంగనాథా!
**పళ్ళియెళ్ళున్దు** = పడకనుండి లేచి
**అరుళాయే** = కృపచేయుమా!

***తా:*** చూడు! విరబూచిన పూదోటలో నిదురించిన పక్షులు కూడ మేల్కొని (అజ్ఞానాన్ని) చీకటి పోగొట్టేస్తామంటూ కిచకిచలాడుతూ తిరుగుతున్నాయి. ఔనన్నట్లు తెల్లవారి పోతోంది గూడ. స్వామీ! చీకటిని నీవే పోగొట్టాలికదూ! మరి అవట్లా తిరుగుతోంటే హోరెత్తిపోతున్నాయి. తమయందూరుచున్న తేనెలు త్రాగి మదగర్వంచే ఝుంకరించు భ్రమరములతోనున్న రకరకములైన పుష్పమాలికలను వయ్యారములొలుకునట్లు గైకొని నీ పాదపూజకై దేవగణమంతా అపుడే దిగివచ్చినది. మరి నీవింకా శయనిస్తే ఎలా? దుష్ట రావణుని తమ్ముడై, నిన్నచ్చటికి చేర్చిన విభీషణుని లంకాధిపునిగ, నీ దాసునిగ జేసికొంటివే, మరి మమ్మునూ అట్లే చేసి మా కైంకర్యములనూ గైకొనునట్లు లేచిరమ్ము స్వామీ. లేపుటకునూ ఆ విభీషణుడే రావలెనా? ఏమి?

ఇరవియర్ మణినెడుం తేరొడు మివరో,
ఇఱైయవర్ పతినొరు విడైయరు మివరో,
మరువియ మయిలిన నఱుముక నివనో,
మరుదరుం వశుక్కళుం వందు వందీండి,
పురవియో డాడలుం పాడలుం, తేరుం
కుమరదండం పుగున్దీండియ వెళ్ళం,
అరువరై యత్తైయ నిన్ కోయిల్ మున్నివరో,
అరంగత్తమ్మా! పళ్ళి యెళ్లుందరుళాయే ॥ 6

మణి = మణులతో కూడి

నెడుం = పెద్దదైన

తేరొడుం = రథము కలిగిన

ఇరవియర్ = ద్వాదశాదిత్యులు

ఇవరో = ఇరుగో!

ఇఱైయవర్ = భక్తులపూజలందుకొను

పదినొరు = పదకొండుమంది

ఇడయరుం ఇవరో = రుద్రులును ఇరుగో!

మరువియ = అమరిన

మయిలినన్ = నెమలివాహనము కల

అరుముగన్ = షణ్ముఖుడును

ఇవనో = ఇడుగో!

మరుదరుం = 49మంది మరుత్తులును

వశుక్కళుం = అష్టవసువులును

వన్దు వన్దు = ముందుగా వచ్చి

ఈండి = గుమిగూడి నిలిచియుండ

పురవియోడు = గుర్రములతోను

తేరుం = రథములతోను

పాడలుం = పాటలతోను

ఆడలుం = నృత్యములతోను

కుమరదండం పుకున్దు = దేవసేన ప్రవేశించగా

ఈండియ వెళ్ళం = దట్టమైన జనప్రవాహము

అరువరై = ఒకరినొకరు

అత్తైయ = తోసుకొనునట్లు

నిన్ = నీ

కోయిల్ = కోవెల

మున్ = ముంగిట

ఇవరో = నీ చూపుకై ఇదుగో వేచి ఉన్నారు.

అరంగత్తమ్మా = శ్రీరంగనాథా!

పళ్ళియెళ్లున్దు = శయ్యనుండి దయతో మేల్కాంచి

అరుళాయే = కృపచేయుమా!

*తా:* శ్రీరంగా! ఇది చూశావా! నీవాజ్ఞాపించిన సూర్యుడు ఒక్కడేకాక మిగిలిన పదకొండుమంది, మొత్తం ద్వాదశాదిత్యులూన్నూ ఇరుగో దిగివస్తున్నారు. పశుపతులుగా పేరుగాంచిన ఏకాదశ రుద్రులుకూడా ఇరుగో వచ్చిరి. విడువని నెమలి వాహముపైన దేవసేనాపతి షణ్ముఖుడు (సుబ్రహ్మణ్యస్వామి) కూడా వచ్చి ఇచటనే ఉన్నాడు. ఇంకా 49మంది మరుత్తులు, అష్టవసువులు ఒకరికంటె ఒకరు ముందుకి తోసుకొస్తున్నారు. ఇంతేకాదు వీళ్ళు గుర్రాలు, రథాలు, వారి ఆనందసూచకమైన ఆటలు పాటలు, ఈ షణ్ముఖుని వెనుక ఆయన సైన్యము, వాళ్ళ ఆయుధాలు, ఓహో! ఒకరా ఇరువురా? (నీవు చూడటంలేదుగాని) కొన్ని మేరుపర్వతాల్లా వీరంతా వచ్చి నీ కోవెల వాకిట్లో ఎదురుగా నీసేవకై కాచుకొని ఉన్నారు. ఇంకా నీవు నిద్రిస్తుంటే ఎలా? కటాక్షించు స్వామీ!



రాయల ఊరేల పల్లకీ....

# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

సూర్యుడు ఉదయాన్నే దినయాత్రకు బయలుదేరతాడు తన రథంమీద తెలుసుకదా! ఆయన గుఱ్ఱాలకు కళ్ళేలు పాములు, సారథి అనూరుడు. తొడల పై భాగమేకాని కిందిభాగంలేని వికలాంగుడు. పాములకు ఆహారం గాలి. చల్లని గాలి వాటినోటికి హితవుగా ఉంటుంది. పడమటి దిక్కు వాటికి పెట్టేది ఉడుకన్నం. వేడి వేడి తిండి. అది నోటికెక్కడంలేదు. దాంతో పాపం అవి కూటిపేదలయి బడలిపోయి ఎక్కడికక్కడ అవయవాలు సడలిపోయి గుఱ్ఱాలు క్రుంగి పోతున్నాయి. ఆ రథానికి సంబంధించిన కళ్ళేలు గుఱ్ఱాల నోళ్ళలోంచి జారిపోతున్నాయి. కళ్ళేలు లేకుండా రథం తోలేది ఎట్లా? కళ్ళేలు సరిగా పెట్టి మరీ పోనివయ్యా రథాన్ని. సూర్యులవారి హుకుం. పాపం సారథి వికలాంగుడు. పిచ్చుగుంటు. రథం దిగడం కళ్ళేలు అమర్చడం చచ్చీచెడి మళ్ళీ రథం మీద కూచోగానే అన్నహితవులేక అలమటించిపోతున్నాయేమో, మళ్ళీ బడలిపోయి చచ్చుపడి జారిపోవడం. ఉః...కళ్ళేలమర్చు, ఆయనగారి ఆజ్ఞ. రథం దిగడం, ఎక్కడం – బ్రహ్మప్రళయమౌతోంది ఆ సారథికి. దీంతో రథం కాస్తా వెళ్ళాల్సిన వేగంతో వెళ్ళక అస్తాద్రిని బాగా ఆలస్యంగా చేరుకోవడం. ఇదిగో ఇందువల్లనే గ్రీష్మకాలంలో పగళ్ళు దీర్ఘాలు కావడం (ఆషాఢమాసపు పొద్దు ఆరుజాములని ఒకనానుడి కూడ ఏర్పడింది దీనివల్ల.)

ఏళ్ళల్లో నీరింకిపోయింది. బాటసారులు దాహం తీర్చుకోవడానికి చెలమలు తీసుకుంటున్నారు. అవి వరుసగా ఉన్నాయి. ఆ చెలమనీళ్ళల్లో సూర్యబింబాలు ప్రతిఫలించి తళుకులు చిమ్ముతున్నాయి. సముద్రుడితో నదులకు ఎడబాటు కలగడంవల్ల అవి తపిస్తున్నాయి. ఆ వియోగతాపాన్ని చల్లార్చుకుందుకు నదులు ధరించిన ముత్యాలపేరుల్లా ఉన్నాయి సూర్యబింబాల తళుకులతో ప్రకాశిస్తున్న చలమల వరసలు.

నదుల్లో నీరింకిపోవడంతో తామరలు బైటపడ్డాయి. తామరపూలకు పచ్చటిదుద్దుమాత్రం మిగిలి రేకలన్నీ రాలిపోయాయి. పొడుగ్గా కాడకనపడుతోంది. ఈ సన్నివేశం ఎల్లా ఉంది? వెనుక అతివృష్టివల్ల తమకు సముద్రం దరికి చేరుస్తాడని (వర్షం కురిసి నీటితో సముద్రం వరకూ సాగేట్టు చేస్తాడని) తలచి ఏరులు ఆకాశం మీదున్న అతనికి ఇదిగోఈ బంగారునాణేలు తీసికొని బాబ్బాబూ ఈ ఉపకారం చేసిపెడుదూ మాకు అని చెయ్యెత్తి బతిమాలుతున్నట్టుంది. తామరకాడలు ఎత్తిన బాహువుల్లా దుద్దులు బంగారునాణేల్లా కనవస్తున్నాయి.

కొంగకు, కాస్త వాడిన నాచు తీగలను తినగా గొంతు వగరుగా అయింది రుచిమార్పుకు ఏదైనా తినాలనిపించింది. ఇంతలో పొలసుగాలి తగిలింది. ఆ వాసనకు అక్కడ లేతచేప మంచి మేతగా దొరికేట్టుంది.

ఒక్కచోటే బాగా కాలితో బురదలో ఏమైనా ఉన్నాయేమో అని తొక్కిచూచి తగిలిన ఉరుచల్ని, చేపల్ని, చిన్ననత్తగుల్లల్నీ నవులుతూ ఎండ్రకాయ కాలు పట్టుకునేప్పటికి కొంచెం పక్కకు తప్పుకుని దానిపట్టు వదిలించుకుని దాన్ని పోనీకుండా పదునైన ముక్కుతో పొడుచుకుతింటూ తడారిన నేలలో చేమమడిలాంటి తామరతోపులో జీలుగుచెట్ల దగ్గర ఎండలను గడుపుతూ తిరుగుతూన్న కొంగలకు చెరువులు మోకాలిబంటి అయినాయి. చేమమడులూ, తామరతోపులూ ఒక్కలాగే ఉంటాయి. చేమాకులు పసరుగా పెద్దగా తామరాకుల్లా ఉంటాయి. కాడలు నీరింకిపోయేక కనవచ్చే తామరకాడల్లా ఉంటాయి. అవీ తామరలాగే తోపులా ఉంటాయి. ఆకులు ఎండతగలకుండా గొడుగులా ఉంటాయి. అట్లాంటివే తామరతోపులూను. అంచేత చల్లదనానికి కొంగలు అక్కడ చేరడం.

నీరు లేకపోవడంతో బయటపడ్డ మొసళ్ళు ఉడుముల్లా రాత్రులు తిరుగుతున్నాయి. వాటిని చూసి పట్టుకోవాలని కుక్కలు పరుగున వస్తున్నాయి. ఆ కుక్కల్ని తప్పించుకోడంలో కొన్ని మొసళ్ళు బావుల్లో పడుతున్నాయి. కొన్ని పశువుల ఎరువులో ఉన్న పురుగుల్ని ఏరుకుతింటున్నాయి. పాముల్లా పొడుగ్గా ఉండే మలుగుచేపలు బొరియల్లో దూరుతున్నాయి.

ఆ వేసవి నీళ్ళులేని మడుగులో ఉన్న పెద్దచేపలన్నింటినీ ముందే మింగినాయి పెద్దకొంగలు. రానురాను నీరు బాగా

ఇంకిపోయి బురదకూడా ఎండిపోడం ప్రారంభించింది. తడి కిందికి చేరి బురదలో కలిసి ఉన్న బొమ్మిడాయిలను చేదుచేపలనూ కూడా ఆ కొంగలు తినేస్తున్నాయి.

అల్లాంటి వేసవిలో ప్రాతఃకాలాల్లో గాలికి పొదిరిపూలు రాల్తున్నాయి. మాటిమాటికీ రాలుతున్న ఆ పూలవల్ల నేల తడిసి కమ్మని వాసనలు చిమ్ముతున్నాయి ఉద్యానాలు. ఆ ఉద్యానాల్లో చెట్లకు నీళ్ళకోసం కాలవలున్నాయి. ఆ కాలవల నడుమ అక్కడక్కడ బావులున్నాయి. ఆ బావుల్లోంచి ఏతాములతో నీరు తోడి కాలవల్లోకి పారిస్తారు. ఏతాము తొక్కుతున్నవారు తారస్థాయిలో పాడుకుంటున్నారు. ఏతపుబాన నీటిలో దిగేటప్పుడు వచ్చే ధ్వని వారిపాటకు మృదంగనాదం సమకూరుస్తున్నట్టుంది.

ఆ వేసవిని ప్రచండమైన పగటి బీరెండ తగిలి మూర్ఛిల్లిన లేత బొండుమల్లె పొదల కొనలపైన అగ్గిబొబ్బల్లా అణగిన పెద్దపెద్దమొగ్గలు బయలుదేరినై.

వేసవికదా! అక్కడక్కడ చలివేంద్రాలు వెలసేయి. దారిన వచ్చేపోయే వారికి అక్కడ తాగడానికి చల్లని నీళ్ళు ఇస్తారు. సామాన్యంగా చలివేంద్రాల్లో స్త్రీలే నీళ్లిస్తుంటారు. వీరిని 'ప్రపాపాలికలు' అంటారు. 'ప్రప' అంటే చలివేంద్రం. దాన్ని చూసుకునేవారు ప్రపాపాలికలు.

గ్రీష్మంలో అంతా అయిపోతే పునస్సృష్టికి కావలసిన జాగ్రత్తలు పడుతున్నారుట జలదేవతలు. నీటిసుడి బొడ్డుగా, పద్మాలు కనులుగా నాచు జుట్టుముడిగా చక్రవాకాలు స్తనాలుగా, నురుగులు నవ్వులుగా తమ తమ అవయవాలకు మారు రూపాలు కల్పించుకుని గ్రీష్మం వెళ్ళేక పునస్సృష్టికోసం విత్తనాలు దాచుకున్నట్టు కడవల్లో కొంత జలాన్ని దాచుకుని ఇక్కడైతే గ్రీష్మభయముండదని ఆ చలిపందిళ్ళలో జలదేవతలే ప్రపాపాలికల్లా ప్రవేశించారేమో అనిపిస్తోంది.

ఎండలకు భయపడి తమచాటున దాగిన గంగాయమునల్లా మల్లెలు కుట్టిన జడలు మెరుస్తున్నాయి. మీరు దొంగిలించిన మా అందాలు మాకు ఇచ్చేయండి, ఏవీ ఎక్కడ దాచేరు అని వెతుకుతున్న స్తనాల్లా చిన్నచెంబులు కడవల్లో మునుగు తున్నాయి. బాటసారులకు నీరు ధారగా చేతిలో పోస్తూంటే ఆ ధారలో ప్రతిఫలిస్తున్న వారి కనుల తళుకులు నీరు వాసనలు చిమ్మేదిగా ఉండడం కోసం అందులో వేసిన కలువరేకుల్లా అనిపిస్తున్నాయి. నీరు పోస్తూంటే బాటసారి తల ఊపుతున్నాడు. నీరు చాలునని కాక తమ మోమందాలు మెచ్చుకొని తల ఊపుతున్నాడని గుర్తించి ఆపకుండా నీళ్ళు పోస్తూ వారు నవ్విన నవ్వు నేర్పునకు వారి గుండె కరిగిపోతోంది.

మన్మథుడు ఈ మండువేసవిలో తన ప్రతాపం ఎక్కడా పనికిరాక నెలతలు నీళ్ళు పోసే ఈ చలవపందిళ్ళు చేరేడు. కుంటివాడిలా అక్కడే కూలబడ్డాడు. లేని గొప్పలు నటిస్తూ ఆ బాటసారులు నీరు పోసిన కాంతలకు కృతజ్ఞతతో ఇచ్చే తాంబూలాలపేర సుంకాలు వసూలు చేస్తున్నట్టుంది.

ఓ బాటసారి ఎండకు దప్పికకు డస్సిపోయి తూలిపోతూ వచ్చి అమ్మా! నీకు పున్నెముంటుంది. కాసిన్ని నీళ్ళు పొయ్యమ్మా! అక్కా! ప్రాణాలు కడబట్టిపోతున్నె కూసిని నీళ్ళుపోసి ప్రాణాలు నిలబెట్టు తల్లీ! అంటూ ఎంతో ఆర్తితో వినయంతో చలిపందిరికి వచ్చి దోసిలి పడతాడు. అమ్మా, అక్కా అని వావికలిపేమే అన్న భావమే మనసులోంచి తుడుచుకుపోయింది. ఆ నీళ్ళు తాగుతూనే వారిమొగం, వక్షస్థలం, బాహుమూలాలు ఎగాదిగా అదే పనిగా చూస్తూ నీళ్ళు తాగడం నటిస్తున్నాడు. ప్రపాపాలికలు వీడి పైత్యం గమనించేరు. చూడు వీడి తీరు అన్నట్టుగా కనుసైగలతో నవ్వుకున్నారు. నీటిధారను సన్నచేసి తాగడానికి దొరక్కుండా పోయనారంభించినారు.

పెనంమీంచి ఎగసిన ఆవిరిలా పగటిఎండ దిగంతాలు కమ్ముకుంటూనే ఉంది. ఆ ఉడుకు చల్లారకుండానే నేలంతా పండువెన్నెల కాచింది. ఆ కాస్తున్న పండువెన్నెల చకోర శిశువులకు పోసిన పెద్ద అట్టులా ఉంది. (సశేషం)

శ్రీరామచంద్రాచార్య




మనుష్యులు, జంతువులు మొదలైన ప్రాణులన్నీ శరీరము+ఆత్మ అనే రెండు ద్రవ్యాల కలయికతో ఏర్పడుతున్నాయి. శరీర నిర్మాణములో కొద్ది కొద్ది తేడాలు ఏర్పడగానే పేర్లు గూడ వేరే వేరే పెట్టారు. అలాంటి జీవజాతులు 2.84 లక్షలున్నాయని గ్రంథాలు చెపుతున్నాయి. వాస్తవానికెన్ని ఉన్నాయనేది అనుభవైకవేద్యమే! శరీరాలన్నీ పంచభూతాలతోటే ఏర్పడ్డాయి. ఈ పంచభూతాలనే ద్రవ్యాల కలయికలోను పాళ్ళలోనూ ఉండే కొద్ది కొద్ది మార్పులవల్లనే ఈ ప్రాణుల శరీరాలలో ఆకారాలలో నిర్మాణక్రమంలో రంగులలో అవి అవి స్పందించే రీతులు, మొదలైన వాటిలో ఒకదానికొకటి పోలిక లేమీలేక దేనికదే స్వతంత్ర ప్రతిపత్తి కలిగి జీవిస్తున్నాయి. శరీరంలేనిదే ఆ లోపలి ప్రాణికి నిలకడ ఉండదు. లోపలి ప్రాణిలేనిదే శరీరము ఓ ఆకారంలో అమరి ఉండలేదు. ఇలా పరస్పరం ఆధారపడి ఉండే శరీరమూ, ఆత్మ అనే ఇవి రెండూ వాటంతట అవి నిలవటం లేదు. ఈ రెంటికీ అతీతమైన మరో విశ్వవ్యాప్తమైన ద్రవ్యముమీద ఆధారపడుతూ ప్రవర్తిస్తున్నాయి. దానినే పరమాత్మ భగవంతుడు, నారాయణ ఇత్యాదిగ లెక్కలేనన్ని పేర్లతో వ్యవహరిస్తారు. ఇదొక పరమచేతన తత్త్వము. పరిపూర్ణ మైనదీ, వాఙ్మనసాతీతమైన అద్భుతమైన నారాయణతత్త్వం.

ఈ జీవకోటి శరీరాలన్నీ పంచభూతాలతో తయారైనందు వలన ఈ శరీరాల పోషణలో ఎప్పుడైనా ఒడిదుడుకులెదురైతే, వాటిని పంచభూత ద్రవ్యాలతోటే పూరించవలసి ఉంటుంది. అంటే, శరీరంలో నీటిశాతం తగ్గితే ఏదోరూపంలో కొంతనీటిని నింపాలి. మృత్తికాశాతం తగ్గితే, ఏదోరూపంలో దానిని ఆహారంగా శరీరానికి అందించాలి. ఒక క్రమపద్ధతిలో ద్రవ్యాలు అందితే, లోపాలు తీరి శరీరము సుఖంగా పెరుగుతుంది.

అలానే జ్ఞానమే రూపుదిద్దుకొన్న దానిని 'ఆత్మ' అంటారు. దీని సహజస్వభావము జ్ఞానాన్ని కలిగి ఉండి, లభించిన దేహాన్ని బట్టి తనకున్న జ్ఞానాన్ని సంకోచింప చేయటం, వికసింప చేయడమున్నూ. దీనిని రెండు పదాలతో చెబుతారు. జ్ఞానైకాకారము, జ్ఞానగుణకము అని.

పాంచభౌతిక ద్రవ్యాలేవీ, శరీరపోషణకే తప్ప, ఈ ఆత్మ యొక్క పోషణకు పనికి వచ్చేవికావు. ఇక ఆత్మపోషణ, కేవలం ఉన్నతమైన జ్ఞానం కల పరమాత్మవల్లనే కావాలి. పరమాత్మ అనే తత్త్వం సర్వజ్ఞత్వము, సర్వవేత్తృత్వము అనే గుణాలు కలదని ఉపనిషత్తులు ఉద్బోధిస్తున్నాయి.

సర్వజ్ఞత్వమంటే విశ్వములోని సకల పదార్థాల గురించిన విస్పష్టమైన జ్ఞానము కలిగి యుండటం. సర్వవేత్తృత్వమంటే ఆ పదార్థాలలోని ప్రతి ఒక్కఅంశమును గురించిన సంపూర్ణమైన అవగాహన కలిగి ఉండటం. ఇలాంటి యోగ్యత ఒక్క భగవానుడైన శ్రియఃపతికి తప్ప ఇతరులెవరికీ ఉన్నట్లు తెలియడం లేదు.

జీవుల జ్ఞానంలో లోపాలేర్పడితే ఆ లోపాలను పూరించ వలసినది భగవంతునికి సంబంధించిన జ్ఞానంతోనే.

జీవుల కర్మననుసరించి రకరకాల శరీరాలేర్పడతాయి. అతి క్షుద్రమైన కీటకం దగ్గరనుంచి చతుర్ముఖ బ్రహ్మవరకూ ఉండే ఈ శరీరాలన్నీ కర్మల తారతమ్యంతో ఏర్పడ్డవే!

ఆ కర్మను అనుసరించి జ్ఞానంయొక్క సంకోచ వికాసాలు సాగుతూంటాయి. మనిషికంటే క్రిందస్థాయిలో ఉండే జీవకోటికి పాపకర్మానుభవంతో జ్ఞానవికాసానికి సంబంధించిన ఆలోచనే ఉండదు. మనిషికి పైస్థాయిలో ఉండే దేవజాతులు భోగభూములలో పుణ్యకర్మానుభవంతో సుఖాలలో తేలియాడు తూండడం వలన వారికీ జ్ఞాన వికాసానికి సంబంధించిన ఆలోచనకు అవకాశం లేదు.

పుణ్యపాపాలను కలిపి అనుభవించే శరీరాలు కల మనుష్యులకే జ్ఞానవికాసానికి సంబంధించిన ఆలోచనకు అవకాశం ఉంది. అందుకే శాస్త్రాలన్నీ మనుష్యులనే లక్ష్యంగా

చేసుకొని బయలుదేరాయి. శాస్త్రములకి కట్టుబడి జీవించడం మనుష్యులకే అవసరం, బాధ్యతకూడ. ఆ శాస్త్రాలు కూడా జీవునిజ్ఞానం భగవంతునికి సంబంధించిన జ్ఞానంవల్లనే శుభ్రపడుతుందని, వికసిస్తుందని తెలుపుతున్నాయి.

ఆ భగవంతునికి సంబంధించిన జ్ఞానం మనంతట మనమే మన ప్రయత్నంతోటే పొందగలమా? వీలుకాదు. దానికి కారణం? జీవులమైన మనమందరమూ అణు స్వరూపులము. భగవంతుడనేది విభు స్వరూపము. అణువంటే చిన్నవాటిలోకెల్ల చిన్నది. ఇకపై విడదీయడానికి వీలుకానంత సూక్ష్మాతి సూక్ష్మమైన 'అంశ'ను అణువంటారు.

విభువంటే అతిపెద్ద పదార్థాలైన మహాకాశమువంటి వాటికంటే పెద్దది. చిన్నవాటికంటే చిన్నవాడై, పెద్దవాటికంటే పెద్దవాడై, సర్వజ్ఞత్వాది సుగుణాలతో సర్వత్రా వ్యాపించి ఉండేవాడే పరమాత్మ. అలాంటి తత్త్వాన్ని మన ప్రయత్నముతో పొందుట అసాధ్యం. ఇక ఆ తత్త్వమే మనకోసం ఏదో చేసి, తనజ్ఞానంతో ఈ జీవుల జ్ఞానంలో ఏర్పడే లోపాలను పూరించాలి.

కళ్యాణగుణపూర్ణమైన ఆ భగవత్ తత్త్వము కృపా, కారుణ్యముల ప్రభావంతో ఈ జీవుల సముద్ధరణకోసం అంతటా నిండి ఉండేదే అయినా తనను ఐదు స్వరూపములలో సాక్షాత్కరింప చేస్తుందని వేదాలు, వాటి 'ఉపబృంహణాలు' వివరిస్తున్నాయి. ఉపబృంహణాలంటే, వేదాలలో దాగి ఉండే అర్థాలను వివరించి, విస్తరింపచేసి చూపే గ్రంథాలు. అక్కడ సూక్ష్మంగా ఉన్న అర్థాన్ని ఇవి పెంచి పెద్ద చేసి చూపిస్తాయన్న మాట. ఐదు స్వరూపాలలో లభించే ఆ భగవత్ తత్త్వాన్ని 'పరత్వాది పంచక'మని అంటారు. ఈ పరత్వాది పంచకాన్ని వివరిస్తూ బయలుదేరిన మంత్రమే **'పూర్ణమిదం...''** అనే శాంతి మంత్రము.

భగవత్ తత్త్వమెప్పుడూ ''పూర్ణ''మైయ్యే ఉంటుంది. భగవత్‌తత్త్వమెక్కడున్నా ''పూర్ణ''మయ్యే ఉంటుంది. భగవత్‌తత్త్వమెలా ఉన్నా ''పూర్ణ''మయ్యే ఉంటుంది. వేటితో పూర్ణమై ఉంటుంది? అనే ప్రశ్నకు తన సర్వవ్యాపి స్వరూపము చేత, అద్భుతమైన ఆకర్షకమైన ఆకృతి విశేషంచేత, ఆశ్రితులను రక్షించే కళ్యాణగుణములచేత, వీటన్నిటికీ ఆధారమైన దివ్యమంగళ విగ్రహ విశేషం చేత కూడా ఆయన పూర్ణుడై ఉంటాడు. ఆ తత్త్వాన్ని, అది స్వీకరించిన ఐదు రూపాలతో వివరిస్తోందీ శాంతి మంత్రం. ముందుగా అత్యంత సమీప మందున్న స్థానాన్ని చూపుతోంది.

'ఇదం' పూర్ణం= 'ఇది' నిండుదనం కలిగినది, అంటూ.

అందుబాటులో ఉన్న వస్తువునుండి ప్రారంభించి, దూరంలో ఉన్న వాటిని, లేదా, కనిపించేవాటితో ప్రారంభించి కంటికి దూరంగా ఉండేవాటిని తెలియచేయడాన్ని **స్థూలారుంధతీ న్యాయ**మని అంటారు. నూతనంగ వివాహితులైన దంపతులకు అరుంధతీనక్షత్రాన్ని చూపాలి. అది చాల చిన్నది. సప్తర్షిమండలంలో ఉంటుంది. దంపతులకది కనపడదాయె. అందుకని ముందు సప్తర్షిమండలంగ ఉండే ఏడు నక్షత్రాలని చూపిస్తారు. అక్కడికి దృష్టి వెళ్ళాక, వాటిలో వెనుక తోకలా ఉండే మూడు నక్షత్రాలను చూపుతారు. అంతవరకూ ఈ పిల్లల చూపు ప్రసరించాక, 'ఆమధ్యలో ఉన్న నక్షత్రమే వశిష్ఠుడు' అని అక్కడకు చూపును చేరుస్తారు. దానిని గమనించాక, ఆ నక్షత్రానికి ప్రక్కనే కొద్దిగ మిలమిల మెరుస్తూ కనిపించే 'చిన్న నక్షత్రమే అరుంధతి' కనిపించిందా? అని అడుగుతారు. ఆ క్రొత్త దంపతులు, పాపం!, ఆ అర్థరాత్రిపూట, ఏకళన ఉంటారో, 'ఆ! ఆ!, కనిపించింది' అని అంటారు. ఇలా కనిపించే వాటినుండి ప్రారంభించి కనిపించని దానిని గుర్తింపచేసేటట్లే, సులభంగ తెలుసుకోగలిగే దానిని ముందు వివరించి ఆపైన ''అదః'' అని వివరిస్తోంది మంత్రం. *(ఇంకా ఉంది)*

# శ్రీనృసింహావతార వైశిష్ట్యం

డా॥ కంద్లకుంట్ల నరసింహమూర్తి- జనగామ

**మంత్ర వివరణ:**

శ్రీ నృసింహుడే సకల చరాచర సృష్టి, స్థితి, లయ కారకుడని, ఆయన సర్వజగత్స్వరూపుడని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి. నృసింహ పూర్వ–ఉత్తర–తాపిన్యుపనిషత్తులు, అవ్యక్తోపనిషత్, ఈ విషయాన్ని స్పష్టంగా వివరించాయి. నృసింహ పూర్వతాపిన్యుపనిషత్తులో నృసింహ మంత్రరాజం, దాని మహిమ వివరించబడింది. ఉత్తర తాపిన్యుపనిషత్తులో ప్రణవస్వరూపం, ఓంకారాంతర్యామి నృసింహుడే అనే విషయం విశదీకరించబడింది.

మొదట ఈ విశ్వమంతా జలమయంగా ఉండేది. ఆ జలం నుండి ఒక కమలం ఉత్పన్నం కాగా, దానిలో నుండి ప్రజాపతి జన్మించాడు. ఆ ప్రజాపతికి సృష్టిచేయాలనే సంకల్పం కలిగి తపస్సు ఆరంభించాడు. బ్రహ్మదేవుడు తపఃఫలంగా..

**ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖమ్ ।**
**నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్॥**

అనే అనుష్టుప్ ఛందస్సు ఉన్న నృసింహ దేవతాకమైన మంత్రరాజాన్ని దర్శించాడు. ఆ మంత్రబలం వల్లనే బ్రహ్మ ఈ వ్యక్త ప్రపంచాన్ని సృష్టించాడు. అందువల్ల ఈ విశ్వానికి అనుష్టుప్ మంత్రరాజమయమని పేరు. ఈ అనుష్టుప్ నుండే భూతజాలం జన్మించి, జీవించి తిరిగి అనుష్టుప్‌లోనే లీనమవు తున్నది. ఈ అనుష్టుప్ ఛందస్సు మిగిలిన ఛందస్సులలోకెల్ల శ్రేష్ఠమయింది.

ఈ మంత్రానికి సాగరాలు పర్వతాలతో కూడిన, సప్తద్వీపాలుగల భూమి మొదటిపాదం. యక్ష గంధర్వ అప్సరోగణ సేవితమైన అంతరిక్షం రెండవ పాదం. వసురుద్ర ఆదిత్యులు, సకల దేవతలచే సేవింపబడే స్వర్గలోకం మూడవ పాదం. మాయారహిత పరమ పవిత్ర బ్రహ్మస్వరూపమైన వ్యోమం (ఆకాశం) నాలుగవ పాదం. సాంగ, సశాఖీయమైన ఋగ్యజుస్సామాథర్వ వేదాలు నాలుగు ఈ మంత్రానికి నాలుగు పాదాలుగా పేర్కొనబడ్డాయి. ఇంకా సంపూర్ణ విశ్వం, ప్రాణులు, ఇంద్రియాలు, పశువులు, అన్నం, అమృతం, సమ్రాట్టు ఈ మంత్రానికి ప్రథమ చరణమని: ఋగ్యజుస్సామాథర్వరూపుడు, సూర్యుడనే పేరుగలవాడు, ఆదిత్యుని లోపల ఉన్న హిరణ్మయ పురుషుడు ద్వితీయ చరణమని : ఓషధులకు, తారలకు అధిపతి అయిన సోముడు తృతీయ చరణమని: తానే బ్రహ్మ, శివ, విష్ణు, ఇంద్ర స్వరూపుడైన నిత్యుడైన పరమ స్వరాట్టు చతుర్థ చరణమని కూడ నృసింహ పూర్వతాపిన్యుపనిషత్తు పేర్కొన్నది.

ప్రణవంయొక్క నాలుగు స్వరాలు ఈ సామయొక్క నాలుగు మాత్రారూపాలు. ప్రణవం 'అ'కారం, 'ఉ'కారం, అర్థమాత్రలతో కూడి ఉన్నట్లే నృసింహమంత్రరాజం కూడ నాలుగు పాదాలతో కూడి ఉన్నది. కనుక నృసింహానుష్టుప్‌లో విశ్వమంతా నిక్షిప్తమై ఉన్నట్లు ప్రణవంలో కూడ సమస్త విశ్వమున్నది. శంఖంలోని ముడుతలు శంఖంలోనే నిక్షిప్తమై ఉన్నట్లు సమస్తవాక్కు ఓంకారంలోనే నిబిడీకృతమై ఉన్నది.

ప్రణవాన్ని, ప్రణవంతో కూడిన మహాలక్ష్మీ యజుర్గాయత్రీ మంత్రాన్ని, నృసింహానుష్టుప్‌కు అంగంగా ముందు అనుసంధించాలి. గాయత్రిని, ప్రణవాన్ని, యజుర్లక్ష్మీ గాయత్రిని – అపాత్రులకు ఉపదేశించకూడదని, అటువంటి ఉపదేశం వల్ల గురువుకు కూడ అధోగతి సిద్ధిస్తుందని పూర్వ తాపిన్యుపనిషత్తు తెలిపింది. (4వమంత్రం) ఈ మంత్రం మహిమాన్వితమైంది కనుక ప్రధానంగా ఉపాసకులనుద్దేశించి ఈ విధంగా చెప్పబడిందని భావించవచ్చు. ఈ మంత్రసిద్ధివల్ల అమరత్వం కలుగుతుందని, ముల్లోకాలలో విజయం సిద్ధిస్తుందని, ఆయువు, యశస్సు, కీర్తి, జ్ఞానం, ఐశ్వర్యాలు ప్రాప్తిస్తాయని ఈ ఉపనిషత్తు పేర్కొన్నది.

క్షీరసాగరశాయి, నరసింహ స్వరూపుడు, యోగులచేత ధ్యానింపదగినవాడు, పరమపదమైనవాడు, అధిదేవతగా పేర్కొనబడిన ఈ అనుష్టుప్ మంత్రాన్ని ఆచార్య ముఖంగా ఉపదేశం పొందినవాడు సంసారబంధ విముక్తుడవుతాడు. ఈ మంత్రజపంతో ఈ శరీరంతోనే నృసింహ దేవతా దర్శనం చేయగలడు. కలియుగంలో ఇంతకంటె సులభోపాయం మరొకటి లేదు. మృత్యువు, పాపం, సంసారాలకు భయపడిన

దేవతలు బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళారు. బ్రహ్మముందుగా తాను నృసింహమంత్రాన్ని దర్శించి ఋషియై, తరువాత, ఆ మంత్రాన్ని దేవతలకు ఉపదేశించి ఆచార్యుడైనాడు. వారు ఈ మంత్రాన్ని జపించి మృత్యువును, సంసారాన్ని తరించగలిగారు. కనుక బాధలతో ఉన్నవారు ఈ మంత్రరాజాన్ని గ్రహిస్తే వారికి ఎటువంటి భయాలు ఉండవు.

ఇటువంటి మహిమాన్వితమైన ఈ మంత్రరాజాన్ని గ్రహిస్తే వారికి ఎటువంటి భయాలు ఉండవు.

ఇటువంటి మహిమాన్వితమైన ఈ మంత్రాన్ని సాంగంగా తెలుసుకున్నవాడు విష్ణువుయొక్క సాలోక్య, సారూప్య, సాయుజ్యాలను పొందగలుగుతాడు. స్త్రీ పురుషులెవరైనా సదాచారంతో ఈ మంత్రానుష్ఠానం చేస్తే వారికి నృసింహుడు సమస్త ఐశ్వర్యాలను ప్రసాదిస్తాడని పూర్వతాపిన్యుపనిషత్తు తెలిపింది.

**నారసింహ మంత్ర అంగస్వరూపం**

ప్రణవం, సావిత్రీ గాయత్రి, యజుర్లక్ష్మీ గాయత్రి, నృసింహ గాయత్రి అనే నాలుగు నారసింహమంత్రానికి అంగాలు. అంగం అంటే పుష్టిని లేక పూర్ణత్వాన్ని కలిగించేది. ఈ నాలుగు అంగాలను తెలుసుకున్నవాడు అమృతత్త్వాన్ని పొందుతాడు.

ప్రణవం బ్రహ్మాత్వకమైనది. ఈ సర్వప్రపంచం "ఓం" అనే ఒక్క అక్షరమే! అదే భూత వర్తమాన భవిష్యత్కాల స్వరూపం. త్రికాలాతీతమైంది ఏదైనా ఉంటే అదీ ఓంకారమే! కనుపించే ఈ సర్వం బ్రహ్మస్వరూపమే అని మాండుక్యోపనిషత్తు (1-2) వివరించింది. ఈ ప్రణవం నాలుగు పాదాలు కలిగి ఉంటుంది. చతుష్పదమైన ఈ ఓంకారం నారసింహ మంత్రానికి ప్రథమాంగం అయింది.

సవితృ దేవతాకరూపమైన గాయత్రీ ఛందం నారసింహ మంత్రానికి ద్వితీయాంగమయింది. యజుస్సు చేత చెప్పబడిన ఈ ఛందంతోనే జగత్తంతా వ్యాపింపబడింది. "ఘృణిః" అనే రెండు, "సూరియః" అనే మూడు, "ఆదిత్యః" అనే మూడు మొత్తం ఎనిమిది అక్షరాలతో కూడిన "ఓం ఘృణిస్సూర్య ఆదిత్యః " అనే "సావిత్రస్యాష్టాక్షరం" పదం శ్రీ చే అభిషిక్తమయింది. ఈ విషయాన్ని ప్రతిపాదిస్తూ ఋగ్వేద మంత్రమున్నది.

**"ఋచో అక్షరే పరమే వ్యోమన్**
**యస్మిన్ దేవా అధి విశ్వే నిషేదుః**
**యస్తన్న వేద కిమృచా కరిష్యతి య**
**ఇత్తద్విదుస్త ఇమే సమాసత ఇతి॥** ఋగ్వేదం 1-164-36

శ్రీ బీజంతో కూడిన అష్టాక్షరయుక్తమైన పరమ వ్యోమంలో సావిత్రాకాశంలో సకల దేవతలు అధిష్టించిఉంటారు. ఈ ఛందస్సు తెలియనివానికి ఋక్కుతో ఉపయోగం లేదు. దేవతాధిష్ఠానభూతమైన దీనిని తెలుసుకున్న వానికి అన్ని కోరికలు నెరవేరుతాయి. వేదాలు తెలిసినా దీనిని గురించి తెలియనివాడు విజ్ఞుడనబడడు. ఈ సావిత్రిని తెలుసుకున్నవాడు సకల వేదాలు తెలిసినవాడవుతాడు అని వివరించబడింది. కనుక ఇటువంటి శక్తిమంతమైన సావిత్రీ గాయత్రి నృసింహ మంత్రరాజానికి ద్వితీయాంగమయింది.

నారసింహ మంత్రరాజానికి మహాలక్ష్మీ యజుర్గాయత్రి తృతీయాంగం అని చెప్పబడింది."ఓమ్ భూర్లక్ష్మీః భువర్లక్ష్మీః స్వర్లక్ష్మీః కాలకంఠీ తన్నో మహాలక్ష్మీః ప్రచోదయాత్" అనేది యజుర్వేదంలో చెప్పబడిన 24 అక్షరాలుగల మహాలక్ష్మీ యజుర్గాయత్రి. భూః, భువః, సువః అనే వ్యాహృతిత్రయం త్రైలోక్య లక్ష్మి స్ఫురించేందుకు చెప్పబడింది. కాలస్వరూపుడైన నారాయణుడు కంఠోపలక్షితమైన ఈమె హృదయంలో ఉంటాడు కనుక, ఈమె కాలకంఠి అయింది. వ్యాహృతిత్రయ నిష్పన్నమైన త్రైలోక్యైశ్వర్యాదులందు ఆమె మమ్ము ప్రేరేపించుగాక అని ఈ యజుర్గాయత్రీ మంత్రానికి అర్థం వివరించబడింది. ఈ మంత్రమే సమస్త ప్రపంచం కనుక ఈ మహాలక్ష్మీ గాయత్రీ మంత్రాన్ని తెలుసుకొన్నవారు గొప్ప సంపదలు పొందగలరు అని ఈ మంత్ర ప్రభావం చెప్పబడింది. *(ఇంకా ఉంది)*

## ముఖచిత్ర పరిచయం :



ఈ నెల 3వ తారీఖున నమ్మాళ్వార్ల తిరునక్షత్ర మహోత్సవము. సూర్యుడు వృషభరాశిలో ఉండగా వచ్చే విశాఖ నక్షత్రంనాడు శ్రీ నమ్మాళ్వార్లు ఈ భూమిపై పాదం మోపి పావనం చేశారు. కలియుగం ఆరంభమైన 41వ రోజున వీరు అవతరించారు. దక్షిణదేశంలోని తిరునగరి యందుండే ఆదినాథ పెరుమాళ్ అనుగ్రహంతో "కారి, నాథనాయకి దంపతులకు సంతానంగా అవతరించారు.

ఆ ఊరినే కురుకా పురి అని అంటారు. భగవదనుగ్రహంతో అవతరించిన వీరు పుట్టగానే ఏడవడం గాని, తల్లిపాలను స్వీకరించడంగాని చేయలేదు. కేవలం మాంస పిండంగా నిశ్చలంగా ఉండే వీరిని నిరుపయోగమని భావించిన తల్లిదండ్రులు భగవదాలయంలో ఉండే చింతచెట్టు మొదట్లో వదిలివేశారు. ఆశ్చర్యకరంగా ఏ ఆహారాలు లేకుండగానే ఆ శిశువు యోగాసనంలో కూర్చుంది. 16 సంవత్సరాలు పెరిగాడు. ఆ తరువాత జిజ్ఞాసువులైన మధుర కవి అనే భక్తుని ప్రేరణతో ఇహలోక స్మరణను పొంది మరో 16 సంవత్సరాలు గడిపాడు. మొదటి 16 సంవత్సరాలలో సర్వవేద సారాన్ని యోగంలో దర్శించి భగవంతుని కళ్యాణగుణాలను పరిపూర్ణంగా ఆస్వాదించాడు. తరువాత 16 సంవత్సరాలలో అదే స్థానంలో ఉంటూ అనుభవించిన వేదసారార్థాలను ద్రావిడ ప్రబంధాలుగా పాడారు. వాటి సౌందర్యానికి లోకమంతా మోహపడింది. చివరికి అర్చారూపంలో ఉండే భగవంతుడు కూడా వీరి వాక్కు ద్వారా ఒక్కసారైనా పాడించుకుని సంతృప్తి చెందాలని ఆరాటపడ్డారు.

భూమిమీద ఉండే శ్రియఃపతియొక్క 106 దివ్యదేశాలలో 32 ఆలయాలలో ఉండే అర్చామూర్తులు స్వయంగా వీరికి సాక్షాత్కరించి, తమ వైభవాన్ని చూపి వీరి ద్వారా పాటలు పాడించుకున్నారు. శ్రీరంగం, తిరుపతి మొదలైన క్షేత్రాలెన్నో వీరి ప్రశంసకి పాత్రమయ్యాయి. వేదాలకంటే స్పష్టంగా వేదసారమైన భగవంతుణ్ణి అందరూ పాడుకునేట్టు పాశురాలుగా ప్రసాదించిన ఆళ్వారులు అందరూ వివిధ అంగాలైతే ఈ మహానుభావుల్ని వారందరికీ "శరీరి" లేదా 'అవయవి'గా భావించి మిగిలిన పదకొండు మందిని వీరి అవయవములుగా భావిస్తారు. దానిని బట్టి వీరి ప్రభావాన్ని మనం గుర్తించవచ్చు. వారి తిరునక్షత్రం సందర్భంగా వారి వైభవాన్ని మరింత విపులంగా తెలుసుకోవడం భక్తులైనవారందరి కర్తవ్యం.

తనియన్

వృషభే తు విశాఖాయాం కురుకాపురికారిజమ్ ।
పాణ్డ్యదేశే కలేరాదౌ శఠారిం సైన్యపం భజే ॥

నిత్య తనియన్

మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రి యుగళం ప్రణమామి మూర్ధ్నా ॥

---

## 1. పదకేళి - వంశి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ■ | 3 | 4 | |
| | ■ | | ■ | 5 | ■ | | ■ |
| | ■ | 6 | | | ■ | 7 | 8 |
| | ■ | | ■ | 9 | | | |
| | ■ | | ■ | | ■ | | ■ |
| | ■ | ■ | 10 | ■ | 11 | | |
| 12 | 13 | | | ■ | 14 | | ■ |
| ■ | | ■ | | ■ | | 15 | |

నిలువు:

1. స్తోత్రాలన్నీ ఒక చోట మాలగా చేర్చి జెట్‌వారు అందించారు. (7)
2. ఆళ్వార్లలో ముందువారు (5)
5. శ్రీకృష్ణుడు ద్రౌపదికి ఇచ్చినవి (4)
4. హంస రాయబారంతో దంపతులైన వారు (7)
8. వరదుడు రామానుజులని ఈ రాజు అన్నారు (2)
10. ఏ పవిత్ర కార్యం చేయాలన్నా చేతిలో ఇవి ఉండాల్సిందే (3)
11. ఉత్తానపాదుని భార్య – మంచి రుచిగా ఉంటుంది (2)
13. అగ్నినే ఇలా కూడా అంటారు. (2)

అడ్డము

1. అందరి ఆరాధ్య దైవం, ఈ పురాణ పురుషుడు (4)
3. జనకుడి కుమార్తె (3)
7. దాక్షిణ్యంతో కలిపి వాడే ముందు పదం (2)
6. పేలాలనే ఇలా అంటారు (3)
9. సంపదలు గల భూమి (4)
11. పున్నామ నరకం నుంచి రక్షించే పుత్రుడే ఇతడు (3)
12. రామచంద్రుని కథని అతని ముందే గానం చేసినవారు (4)
14. తల కోల్పోయిన దేవతలు (2)
15. శబ్దజాలమంతా ఇందులోనే పుట్టింది (1)

# హృషీకేశ్ - బదరీనాథ్ వార్తలు

క్రిందటి సంవత్సరం మేనెలలో హృషీకేశంలో ఉండే మన జీయరు మఠంలో, శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు 'వైకుంఠ రాముడుతో కూడి ఉండే హనుమంతుని' శ్రీ విగ్రహ ప్రతిష్ఠను జరిపించారు. అప్పటి నుండి ప్రతినిత్యమూ అక్కడ శ్రీ పాంచరాత్రాగమ పద్ధతిలో ఆరాధన చక్కగా జరుగుతోంది. చూస్తూండగానే కాలచక్రంలో ఓ ఏడాది గడిచిపోయింది. ప్రథమ వార్షికోత్సవం రానే వచ్చింది.

ఈ ఏడాది 13.5.2012 నాటి నుండి 16.5.2012 వరకు శ్రీ వైకుంఠరామ పరివార సమేతుడైన హనుమంతుని సన్నిధిలో ప్రథమ బ్రహ్మోత్సవాలు జరపాలని, మన బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన శాఖాసంఘం (బాకాస్) నిర్ణయించింది. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు హైదరాబాద్, జీవాలో శిక్షణ శిబిరాలు జరుపుతున్నందువలన, శ్రీవారి ఆశీస్సులను స్వీకరించి, శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారి నేతృత్వంలో మన ఆచార్యపీఠాధ్యక్షులైన శ్రీ ఉ.వే.శ్రీమాన్ S.V. రంగరామానుజా చార్యస్వామివారి పర్యవేక్షణలో ఈ బ్రహ్మోత్సవాలు జరపాలని బాకాస్ అధ్యక్షులు శ్రీమాన్ డా॥ రామనాథంగారు నిర్ణయించారు. ఉత్సవ యాజ్ఞికము నిర్వహించడానికి మన ఆగమ కళాశాలనుండి శిష్యబృందంతోపాటు ఆగమాచార్య శ్రీమాన్ M. మధుసూదనా చార్యస్వామిని ఆహ్వానించారు.

ఈ ఏడాది పంచాంగాలలో దేశపరిస్థితులు, ప్రజల సుఖాలు అస్తవ్యస్తంగ ఉంటాయంటూ జ్యోతిష్కులు హెచ్చరికలు కురిపించారు కద! ఆ దోషాలు కొంతైన ఉపశమించి శాంతి చేకూరాలని అందుకు మనవంతు సేవను ఎలాగైనా అందించాలని మన బాకాస్ నిర్ణయించింది. నిజానికిది అందరి కర్తవ్యం కదూ! శాంతి కార్యక్రమములో భాగంగా హృషీకేశ్ ఆశ్రమంలో వైకుంఠరాముని సన్నిధిలో నిత్యసుందరకాండ పారాయణ కనీసం ఆరునెలలైనా చేయించాలని సంకల్పించింది. అలానే బదరీనాథుని సన్నిధిలో ఈ సంవత్సరం మన క్షేత్రంలో అక్కడ అన్నదానం జరిపే ఆరునెలల కాలంలోనూ మంత్రబ్రహ్మమైన శ్రీమదష్టాక్షరీ మంత్రాన్ని జప-హోమ-తర్పణాది క్రమంలో అనుష్ఠానరూపంగ చేయించాలని కూడా నిర్ణయించింది. ఇది ఎక్కడైనా చేయదగినదే అయినా ఇంటికంటే, గోశాలలో చేసే అనుష్ఠానానికి పదిరెట్లు ఫలం అధికంగ ఉంటుందని శాస్త్రం. గోశాలకంటే నదీతీరంలో ఉండే ఇసుకలో, దానికంటే ఆలయంలో చేస్తే మరో పదిరెట్లు, దానికంటే పర్వతాలపై చేస్తే మరో పదిరెట్లు ఫలితాలెక్కువట. ఆ పర్వతాలలో కూడా దేవపర్వతంగ కీర్తి గణించిన బదరీనాథ్‌లో చేస్తే ఏ కొద్ది చేసినా అనంతమైన ఫలము లభిస్తుందని ఈ అనుష్ఠానం అక్కడ సంకల్పించారు.

ఫలంకోరి అనుష్ఠానం చేయవచ్చా? స్వంతలాభానికీ, స్వకుటుంబపోషణకీ అయితే అది తప్పే కావచ్చు. కానీ మన బాకాస్ సంకల్పించినది ఏ ఒక్కరి ప్రయోజనానికీ కాదు. ఇది కేవలం మన ప్రజానీకం, దేశమూ కూడా శాంతియుతంగ, ఆరోగ్యవంతంగ ముందుకు సాగగలగాలనే ఉత్తమ సంకల్పంతో ప్రారంభించింది ఈ అనుష్ఠానాన్ని. నిజానికి ఇలాంటి సంకల్పం చేయకపోతే దోషం తప్ప, చేయడం సర్వథా స్వాగతించదగినది. అందుకే శ్రీ చిన్న జీయరు స్వామివారూ దీనిని అంగీకరించారు.

శ్రీవారు ఈ ఏడాది అక్టోబరు నెలలో బదరీనాథ్ దర్శనానికి విచ్చేస్తున్నారు. సెప్టెంబరు 30వ తేదీన శ్రీవారు జరిపే చాతుర్మాస్యదీక్ష హైదరాబాద్, జీవాలో ముగుస్తుంది. అక్కడి నుండి బయలుదేరి శ్రీవారు అక్టోబరు 3వ తేదీనాటికి హృషీకేశ్, మన జీయరు మఠానికి చేరుతారు.

4.10.2012వ తేదీన అక్కడ జరిగే నిత్య సుందరకాండ పారాయణ కార్యక్రమాన్ని సమాపన చేయిస్తారు. 5వ తేదీన బదరీనాథ్ బయలుదేరి, వీలయితే, ఆ రాత్రికి బదరీ అష్టాక్షరీ క్షేత్రానికి చేరతారు. 6వ తేదీ అక్కడ జరిగే అష్టాక్షరీ జప, హోమ, తర్పణాది అనుష్ఠానానికి మహాపూర్ణాహుతి జరిపిస్తారు. అలానే 7వ తేదీ ఆదివారంనాడు బదరీలో పంచసంస్కారాలతో సమాశ్రయణాలు అనుగ్రహిస్తారు.

8వ తేదీన వీలునుబట్టి అక్కడి నుండి తిరుగు ప్రయాణం చేస్తారు.

ఈ ఏడాది పంచాంగ కర్తల నిర్ణయం ప్రకారం గ్రహబలాదులు ఎవ్వరికీ అంత అనుకూలంగ కనపడటం లేదు. అందుకే సర్వుల సంక్షేమార్థం, ఆధ్యాత్మిక, ధార్మిక, సామాజిక సేవలు బాగ, వైభవోపేతంగ జరగాలని, గ్రహబాధలు తగ్గి సుఖజీవనం అందరూ కొనసాగించాలని సంకల్పించి ఈ జప, పారాయణాలు ప్రత్యేకించి సంకల్పించింది మన బాకాస్.

అత్యంత మహిమాన్వితమైన, లోకోపకారకమైన ఈ కైంకర్యంలో శ్రద్ధ, ఆసక్తి, లోకహిత కాంక్ష కలిగిన వారెవ్వరైనా పాల్గొని ప్రోత్సహించవచ్చును. అలాంటి ఆసక్తి కలిగిన భక్తులు తమ తమ గోత్ర, నామ, నక్షత్రాది వివరాలు తెలుపుతూ తామర్పించ దలచిన కైంకర్యముతో పాటు వివరాలు మన కార్యాలయానికి సీతానగరం/ జీవా/ జెట్ హైదరాబాద్/ మొదలైన ప్రాంతాలకు పంపవచ్చును.

లేదా బాకాస్ అధ్యక్షులైన డా॥ రామనాథంగారిని సంప్రదించవచ్చు.

*వివరములకు:*

**డా॥ టి. రామనాథం :93478 81779; 040 - 24048045;**

**జెట్ సీతానగరం : 08645 - 272929,**

**జెట్ హైదరాబాద్ : 040 - 23224426**

**JIVA-శ్రీరామనగర్ : 95535 49971/72**

13వ తేది మే, నాటికి మన సంస్థల పెద్దలందరూ, భక్త పరివారాలతో హృషీకేశం మఠానికి చేరారు. ఆనాటి సాయంకాలం అంకురార్పణతో బ్రహ్మోత్సవమారంభమైంది. 14వ తేదిన ఆలయంలోని పెరుమాళ్ళకు లోకాంత తిరుమంజనం అద్భుతంగ జరిగింది. 15వ తేదీ హనుమజ్జయన్తి. ఆ రోజు మంగళవారం కావడం విశేషం.

విశేష తిరుమంజనం, వడమాలాది కైంకర్యములు ఉదయం జరిగాయి. సాయంకాలము హృషీకేశ్ పురవీధులన్ని పులకరించి పోయేట్టు ప్రత్యేకాలంకరణల ప్రసాధనముతో పెరుమాళ్ళ తిరువీధి ఉత్సవం శోభాయాత్రగ సాగింది.

విశేషగతులతో సాగిన ఈ శోభాయాత్ర మహోత్సవాన్ని నగర ప్రజానీకమంతా ఆధ్యాత్మికానంద ప్రవాహంలో మునకలు వేస్తూ సేవించుకొన్నారు. అటు చల్లని గంగా ప్రవాహం, ఇటు దివ్యానంద ప్రవాహం. తిరువీధి ఉత్సవం జరుగుతున్న సమయమంతా, పురవీధులలోని భక్తులకి వందలాది కిలోల పుళిహోర, చక్కెరపొంగలి, విశేషంగ వితరణ జరుపుతూనే ఉన్నారు.

నగర ప్రముఖులు, ఆశ్రమాల సంఘాలవారు, ప్రెస్‌వారూ ఈ రకమైన సేవ ఇంతవరకూ ఎప్పుడూ జరపగా తాము చూడలేదని ప్రశంశల వర్షం కురిపించారు. మన బాకాస్ సభ్యులంతా శ్రీమాన్ పి. మోహన్‌రావు దంపతుల ద్వారా సుమారు 20 దినాలముందు నుండే సమాచారాన్ని అందరికీ తెలియ చేయడంతో ప్రారంభిస్తే, అన్ని ఏర్పాట్లు చేశారు. ఆశ్రమ కేర్‌టేకర్ శ్రీమాన్ గోపాలకిషన్‌రావు దంపతులు అతిథి వసతులను సమకూర్చారు. శ్రీమాన్ లక్ష్మణరావు ఇందులకవసరమైన సహకారాన్నందించారు.

శ్రీమాన్ త్రిపాఠి, శ్రీమాన్ కృష్ణగార్లు చక్కటి ప్రసాదాల తయారీ బాధ్యతతో తదీయారాధన బాగా జరగడానికి తోడ్పడ్డారు.

16వ తేదీనాడు మహాపూర్ణాహుతి, శాంతి కళ్యాణాలతో ఈ ప్రథమ బ్రహ్మోత్సవాలు ఆశ్చర్యకరంగ సుసంపన్నమైనాయి.

బదరీనాథ్, హృషీకేశ్‌లలో జరిగే తదీయారాధనకు ప్రతి ఏడాది ఎవరో ఒక భక్తులు ఉభయదారులుగ కైంకర్యాన్ని సమర్పిస్తూండడం జరుగుతోంది. అలానే ఈ ఏడాది మన బాకాస్ సంఘ కోశాధికారి అయిన శ్రీమాన్ చీకోటి వెంకటేశ్వరరావు దంపతులే సమగ్రంగ వస్తుసామగ్రిని సమర్పించారు. మన బాకాస్ సభ్యులందరూ ఆ వస్తువులను 3 లారీలలో క్రిందటి నెలలో జరిగే జ్యోతిర్దర్శనం సమయానికే చేరేటట్లుగ స్వయాన హైదరాబాద్ నుండి పంపించారు. ఆ వస్తు సామగ్రినే ఈ ఉత్సవాలలో అందరికీ వినియోగించారు. శ్రీమాన్ వెంకటేశ్వరరావు దంపతులీ తదీయారాధన కైంకర్యం చేయడం రెండవసారి కూడా!

వీరితోపాటు ప్రతీ ఏడాదీ చేస్తున్నట్టుగానే ఈ తదీయారాధనలో వినియోగపడే వివిధ వస్తుసామగ్రిని వివిధ ప్రాంతాల భక్తులు గూడ సమర్పించి తరించారు. ఈ కైంకర్యంలో VT గుండవరం, VT తాడేపల్లి, VT మంటాడ, నరసరావుపేట, రామచంద్రాపురం, ద్రోణాదుల, కొత్త మల్లాయపాలెం, పిట్టలవానిపాలెం, గన్నవరం, వరహాపట్నం, పొదిలి, గణేషునివారి పాలెం, తిమ్మరాజుపాలెం, చింతపల్లిపాడు, విజయవాడ, హనుమాన్ జంక్షన్, లింగగుంటపాలెం, గొల్లపూడి, సూర్యాపేట, నందిగామ, చందర్లపాడు, కొల్లూరు, గుంటూరు గ్రామాలకిచెందిన భక్తులు అమితోత్సాహంతో పాల్గొన్నారు.

ఈ హృషీకేశ్‌లోని ఆలయ నిర్మాణ బాధ్యతను శ్రీమాన్ రవిభట్ స్వీకరించి, ఆలయానికి మంచి రక్షణ కల్పించారు. కమిటీ సభ్యులైన శ్రీమాన్ రామారావు శారదామల్లిఖార్జునరావు, వేణుగోపాల్, చారిగారు ప్రభృతుల భాగస్వామ్యం, కైంకర్య శ్రద్ధ ఈ సందర్భంగ ప్రశంసనీయులు.

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు మధుస్వామి తమ పరివారం అందరితో కార్యక్రమానంతరం బదరీనాథ్ వేంచేసి, స్వామిని దర్శించి, మన అష్టాక్షరీ క్షేత్రంలో జరిగే అన్నదానాన్ని పరిశీలించి తిరిగి వేంచేశారు.

## ఆచార్య తిరువడిలో...



**విజయవాడ, పటమట వాస్తవ్యు రాలైన శ్రీమతి పి. సీతమ్మగారు 19.5.2012న ఆచార్య తిరువడి చేరినారు. ఈమె మన సీతానగరం ఆశ్రమ ప్రారంభం నుండి వేదవిద్యార్థులకు, విచ్చేసే భక్తులకు అనేక సేవలందించేవారు. ఇటీవల కొంతకాలంగా అనారోగ్యంతో ఉంటూ ఆచార్యులనే తలచుకుంటూ, పాత జ్ఞాపకాలను నెమరు వేసుకుంటూ పరమపదం చేరినారు. ఈమెకు పరమపదనాథుని పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు అనేక మంగళాశాసనములు చేశారు.**



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



### దివ్యసాకేతంలో తృతీయ బ్రహ్మోత్సవాలు:-

శ్రీశ్రీశ్రీ స్వామివారు శ్రీరామనగర్ దివ్యసాకేత బ్రహ్మోత్సవాల సందర్భంగా 27వ తేదీ సాయంత్రానికి శంషాబాద్ వేంచేశారు. 28,29 తేదీలలో కార్యక్రమ ఏర్పాట్లను సమీక్షించారు.

29వ తేదీ సాయంత్రం శ్రీ విష్ణు సహస్రనామస్తోత్ర పారాయణ, అంకురారోపణ కార్యక్రమాలతో బ్రహ్మోత్సవాలు ప్రారంభమయినాయి. 30వ తేదీ ఉదయం గరుడపటాన్ని ఆవిష్కరించి అనంతరం హోమాగ్నిని సూర్యకిరణాలనుండి సేకరించారు. ఈ సందర్భంగా శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేస్తూ గరుత్మంతుని ఆవిర్భావక్రమాన్ని వివరించారు.

ఒక వృక్షానికి మూలం ఒకటే అయినా, కొమ్మల, రెమ్మలు, ఆకులు, పండ్లు అని వేరు వేరుగా దానినుండి వికసించినట్లుగా నారాయణుడు ఈ సకల సృష్టికి మూలంగా చతుర్ముఖబ్రహ్మను ఏర్పాటు చేశాడు. ఆయన నుండి 11మంది ప్రజాపతులు శాఖలుగా ఆవిర్భవించారు. వారి నుండి వచ్చినవారు మనువులు, వారి నుండి ఆవిర్భవించిన మనం 'మానవుల' మయ్యాము.

11మంది ప్రజాపతులలో కశ్యపప్రజాపతి నుండి మిగిలిన జాతులన్నీ ఆవిర్భవించాయి. భూమిమీద ప్రాణికోటికంతటికి ఆద్యుడు కశ్యప ప్రజాపతి. ఆయనకు వినత, కద్రువ అని ఇద్దరు భార్యలు.

కద్రువ సంతానంగా అనేక సర్పజాతులు ఆవిర్భవించాయి.

వినత సంతానంగా రెండు అండాలను ప్రసవించింది. మొదటి అండం ఆత్రుతతో ఆగలేని వినతే ఛిద్రం చేసింది. దానిలో నుండి ఊరువులు ఇంకా తయారుకాని ఒక శిశువు ఆవిర్భవించాడు. ఊరువులులేని కారణంగా 'అనూరుడు' అని అతణ్ణి పిలిచారు. ఇతనికే 'అరుణుడు' అని కూడా పేరు.తన జీవితాన్ని సవతిపై అసూయతో వికసించనీయకుండా చేసినందుకు తల్లిని 'దాసివి'కమ్మని శపించి, సూర్యుని రథసారథిగా వెళ్ళిపోయాడు. వెంటనే బాధపడి రెండవ గ్రుడ్డును కపాడమని, అందు జన్మించినవాడు శాపం తొలగే ఉపకారం చేస్తాడు కనుక ఓపిక పట్టమని తల్లిని ప్రార్థించుకున్నాడు. మరికొంత కాలానికి రెండవ అండమునుండి వజ్రం కంటే శక్తి కలిగిన దేహంతో సకల వేదాలకు నిలయుడైన 'గరుత్మంతుడు' ఆవిర్భవించాడు.

అన్నగారి శాపంతో దాసిగా మారిన తల్లిని, విముక్తురాలిని చేయటానికై అమృతభాండాన్ని పరాక్రమంతో తెచ్చాడు. ఈ గరుత్మంతుని విష్ణువు తనకు వాహనంగా చేసుకున్నాడు. అటువంటి శక్తిశాలి అయిన గరుత్మంతుని ధ్వజంమీద ఆవాహనం చేసి ఆరాధనాదులు సలిపి, గరుడపటాన్ని ఎగరవేస్తారు. ఆ సమయంలో నైవేద్యంగా సమర్పించిన ప్రసాదాన్ని సంతానార్థులైన భక్తులకు అందజేస్తారు. అవి తిన్నవారికి గరుత్మంతునివంటి బలవంతుడైన సంతానం కలుగుతుందని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.

గరుడపట ఆవిష్కరణానంతరం ఆలయంనుండి పెరుమాళ్ యాగశాలకి వేంచేశారు. హోమాగ్నిగా సూర్యకాంతమణి నుండి తేజశ్శక్తిని సంగ్రహించేక్రమాన్ని శ్రీస్వామివారు వివరించారు. హోమ కార్యక్రమాలలో వినియోగించే అగ్ని మూడు రకాలుగా ఉంటుందని, 1.బాలాగ్ని, 2. యువాగ్ని, 3. వృద్ధాగ్ని అంటారని అన్నారు. ప్రతిష్ఠా మహోత్సవాదులలో అప్పుడే మథనం చేసి ఆవిర్భవింపచేసిన బాలాగ్నిని హోమానికి వినియోగిస్తారు.

అనంతరం జరిగే ఉత్సవాలలో తరుణాదిత్యుని నుండి సేకరించిన 1. యువాగ్ని లేదా నిత్యాగ్నిహోత్రుల నుండి కాని, ఆలయాలలోని వంటశాలనుండి సేకరించిన 'వృద్ధాగ్ని'ని కాని వినియోగిస్తారు.

సూర్యుని నుండి అగ్నిని సేకరించి యాగశాలలో ఐదు కుండాలలో హోమాగ్ని ప్రారంభించారు.

శ్రీశ్రీశ్రీస్వామివారు విచ్చేసిన భక్తులందరిచేత "సామూహిక శ్రీ లక్ష్మీనారాయణ పూజ"ను నిర్వహింపచేశారు. పూజావిధానాన్ని వివరిస్తూ మంత్రపూతంగా స్నానమాచరించి పవిత్రమయ్యే ఒక సూక్ష్మ ఉపాయాన్ని అనుగ్రహించారు. "అపవిత్రః పవిత్రోవా" అనే మంత్రం ద్వారా ప్రయాణాదుల లోను, అత్యవసర సమయాలలోను మంత్రస్నానం చేయవచ్చని వివరించారు.

అదే రోజు సాయంత్రం గరుడుని ఆధ్వర్యవములో భేరీతాడన పూర్వకంగా సకల దేవతాహ్వానం జరిగింది. ముందుగా భేరి పూజను నిర్వహించి, స్వామికి ఆయుధాలుగా ఆభరణాలుగా ఉండే నిత్యసూరులతో ప్రారంభించి బ్రహ్మాది లోకాల వారిని, వేదాలను మన దాకా అందించిన ఋషులను, ఆయా దివ్యలోకాలలో ఉండే దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, నాగ, కిన్నెర వంటి దేవతలను పర్వత అధిష్ఠాన దేవతలను, నదులు, వనాలు, గ్రహాలు, గ్రహాధిపతులు, కాలాధిపతులను వారి వారి పరివారాలతోటి వాహనాలు, పరిజనంతోటి ఈ రకంగా 42 వర్గాలకు చెందిన దేవతలను వారి వారికిష్టమైన రాగ, తాళాలతో ఆహ్వానించారు.

శబ్దమయాలైన వేదాలను వాయుదేహం కలిగిన దేవతా రూపాలను, అగ్ని శరీరంకల తేజస్స్వరూపులను, నదులు మొదలైన జలసంబంధ అధిష్ఠాన దేవతలను, పర్వతాలు మొదలైన భూమి మీదుండే సకల ప్రాణులను, వారందరికి ఆహారరూపంలో ఉండే ఆయా ధాన్యాది అధిష్ఠాన దేవతలని అందరిని ఒకే కలశంలోకి ఆవాహనచేసి ఉత్సవ సమాప్తి పర్యంతం ఈ కలశాన్ని ఓ రహస్య ప్రదేశంలో గుప్తంగా భద్రపరచారు.

వీరందరికి ఆహ్వానం గరుడుడు పలికితే, కావలసిన మర్యాదలు, ఏర్పాట్లు చేసే బాధ్యత విష్వక్సేనునిది. వచ్చిన దేవతలంతా ఆలయం చుట్టూ వారి వారి స్థానాల్లో, ఆయా దిక్కుల్లో వేంచేసి ఉత్సవ సమయంలో భగవంతున్ని సేవిస్తారు. పూర్వకాలంలో ఊరికి మధ్యలో ఆలయం ఉండి, చుట్టూ వీధులు ఏర్పడితే అది శ్రేష్ఠమైనదని భావించేవారు. శ్రీరంగక్షేత్రం అలా ఏర్పడి ఉన్నతినందినదే!

సాయంత్రం శేషవాహనసేవ అత్యంత వైభవంగా జరిగినది. తిరువీధికి ముందు శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి వారు వాహనసేవ పరమార్థాన్ని వివరించారు. “శ్రీమన్నారాయణుడి ప్రధాన వాహనం గరుత్మంతుడే! ఆయననే మిగిలిన అన్ని వాహనాలలోకి ఆవాహనచేసి అపుడు వాహనసేవ చేస్తారన్న” రహస్యాన్ని అందించారు.

శేషవాహన సందర్భంగా శేషుని వైభవాన్ని వివరిస్తూ “స్వామి సేవకులలో ప్రథముడిగా నిలిచినందున అనంతుడినే ఆదిశేషునిగా కీర్తిస్తున్నా”మన్నారు. ఈ సకల చరాచర జగత్తుకి ఆధారభూతమైనది ఆదిశేషుడే అన్నారు. శ్రీ విష్ణుపురాణం శేషుని గురించి వర్ణిస్తూ ఏకకుండలధరః రక్తనేత్రః... అంటూ ఆయన పాతాళంలో ఉంటూ లయప్రక్రియను చేసేవానిలో, రక్తనేత్రునిగా చెప్పింది'' అని వివరించారు.

సంతానార్థులు సంతానకారకుడైన శేషుని ఆరాధించి, నాగప్రతిష్ఠ చేయడం వంటి ప్రక్రియ ఒకటి ఉందన్నారు. దేవకీదేవి, ఏడో గర్భంలో ఈ నాగశక్తి ప్రతిష్ఠాపనమే బలరామ స్వరూపమని కృష్ణుని సంతానంగా దక్కించుకోగలిగిందన్నారు. తత్ఫలితంగానే సంతాన కారకమైనది మూలాధారంలో కుండలినికి ఆధారమైన స్థానంలో ఉండేది ఈ నాగశక్తియే. అందులో లోపం ఏర్పడినపుడు దానికి గరుడ ప్రసాదమే మందు అని “గరుడ ముద్దల” ప్రభావాన్ని కూడా గుర్తు చేశారు.

ఈ రకంగా కుండలినికి, సంతానానికి ఆధారమైన నాగశక్తి స్వరూపుడైన శేషునిపై వాటిని అనుగ్రహిస్తూ మనలో ఉండే అహంకారాది దోషాలను తొలగిస్తూ స్వామి శేషవాహనంపై విరాజిల్లుతున్నాడని ఆనాటి వాహనసేవ వైభవాన్ని వివరించారు.

మే 1వ తేదీ వైశాఖ శుక్ల దశమి. తీర్థగోష్ఠి అనంతరం యాగశాలలో హోమ కార్యక్రమాన్ని ప్రారంభింపజేసి శ్రీస్వామివారు అనుగ్రహభాషణ పూర్వక సామూహికంగా శ్రీ భూ సహిత శ్రీరంగనాథ అష్టోత్తర పూజా కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా ప్రవచిస్తూ ఈ శుభదినాన్నే కలియుగారంభంలో తిరుమల వెంకన్న పద్మావతీ దేవి కళ్యాణం వైభవంగా జరిగిందని శ్రీస్వామివారు అనుగ్రహించారు.

శ్రీరంగనాథావిర్భావ క్రమాన్ని వివరిస్తూ శ్రీమన్నారాయణుడు ఉండేది శ్రీ వైకుంఠం అని, సృష్టి, స్థితి, లయాలకు అతీతమైన స్థానము. సృష్టి సంకల్పంతో వ్యూహ స్వరూపిగా అనిరుద్ధునిగా పాలకడలిలో వేంచేసి నాభికమలం నుండి బ్రహ్మని ఆవిర్భవింపజేశాడు.

సృష్టి క్రమాన్ని కొనసాగించడానికై వేదాలను పంచభూతాత్మకమైన అండాన్ని ప్రసాదించాడు. తనని వీడి ఉండలేనన్న బ్రహ్మకి, తన అర్చారూపాన్ని ఇచ్చి ఆరాధనా విధానంగా పారమేశ్వర సంహితని అనుగ్రహించాడు.

పాలకడలిలో అనిరుద్ధ స్వరూపునిగా ఏ విధంగా తాను శేషశయ్యపై శయనించి ఉన్నాడో, అదే ఆకృతితో అర్చా స్వరూపాన్ని బ్రహ్మకిచ్చాడు. తపస్సు చేసి తనను మెప్పించిన ఇక్ష్వాకువుకు అదే మూర్తిని వరంగా బ్రహ్మ అందించాడు.

ఆ ఇక్ష్వాకువు నుండి మన రామచంద్రుని వరకు ఆ మూర్తి కులధనంగా పరంపరగా అందుతూ వచ్చింది.

రావణవధ అనంతరం అయోధ్యకు పట్టాభిషిక్తుడైన శ్రీరామచంద్రుడు విభీషణుడికి తనకు ప్రతిరూపంగా అదే మూర్తిని అనుగ్రహించాడు. లంకకు తిరిగి వస్తూ విభీషణుడు ఉభయ కావేరి మధ్యనున్న ఇసుకతిన్నెలను చూచి అదే స్వామికి తగిన స్థానమని అక్కడ దింపాడు. స్వామి అక్కడే స్థిరంగా ఉండిపోయాడు. అదే సకల సంపదలకు నిలయమైన శ్రీరంగమైంది. ఈనాటికి లంకనుండి విభీషణుడు వచ్చి నిత్యం ఆరాధించి వెళ్తుంటాడు అదృశ్యరూపంలో.

మన శ్రీరామచంద్రప్రభువుకి కులధనమైన శ్రీరంగనాథుని శ్రీ భూ సమేతంగా యాగశాలలోకి వేంచేపు చేశారు. భగవద్రామానుజులకు ప్రీతిపాత్రుడైన స్వామి, భగవద్రామానుజులకి ఉభయ విభూతి నాయకత్వాన్ని ప్రసాదించిన ఆ రంగనాథుని అష్టోత్తర శతనామార్చన శ్రీస్వామివారు సామూహికంగా అందరిచేత చేయించారు.

అదేరోజు సాయంత్రం హనుమద్వాహనంపై స్వామి, హంస వాహనంపై అమ్మవారు ఎదుర్కోలు మహోత్సవానికై కళ్యాణ మండపానికి వేంచేశారు. ఆనాటి ఎదుర్కోలు ఉత్సవంలో ఆచార్యులు చక్కటి సామరస్య ధోరణిలో అమ్మ మరియు స్వామియొక్క వైభవాన్ని భక్తులకు పంచారు.

పూర్ణాహుతితో ఆరోజు కార్యక్రమం పూర్తి అయినది.

తరువాతిరోజు తీర్థగోష్ఠి అనంతరం ఆలయంలో శ్రీ సీతా రామచంద్రస్వామి పరివారానికి కల్యాణ ప్రయుక్త నవకలశస్నపనం అయ్యింది. యాగశాలలో శ్రీస్వామివారు భగవద్రామానుజులకు ఆరాధ్యదైవం, శ్రీశ్రీశ్రీ పెద్ద జీయర్ స్వామివారి ఆరాధ్యదైవం, మన దివ్యసాకేత రాముడు మనందరి ఆరాధ్యదైవమైన శ్రీసీతారాములకు సామూహిక అష్టోత్తర శతనామ పూజ నిర్వహింపజేశారు. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు భక్తులచేత శ్రీరామనామాలను పఠింపచేశారు.

పూజా సమయంలో శ్రీస్వామివారు ఆలయంలో ఉండే అర్చామూర్తికి సంబంధించిన ఐదు బేరాలను గురించి వివరించారు.

“1. ఆలయంలో వేంచేసి ఉండే మూలమూర్తిని ఎట్టి పరిస్థితుల్లోను కదిలించరు.

2. ఉత్సవమూర్తి నిత్య, పక్ష, మాస, సంవత్సర ఉత్సవాలలో ఆరాధనలందుకునే మూర్తిని ఉత్సవమూర్తి లేదా ఉత్సవబేరం అంటారు.

3. అభిషేకాన్ని స్వీకరించే మూర్తిని స్నపనమూర్తి లేదా స్నపనబేరమని అంటారు. మనం కూడా స్నానానికి వేరే వస్త్రాన్ని ధరించాలన్నది నియమం. ఈ స్నపనమూర్తిని కేవల అభిషేకాలలో మాత్రమే ఆరాధిస్తారు.

4. నిత్యం ఆరాధనాదులలో దిగ్బలికి వేంచేసే మూర్తిని బలిబేరమంటారు.

5. రాత్రివేళల పవళింపుసేవ స్వీకరించేమూర్తి. దీనిని శయనబేరం లేదా శయనమూర్తి అంటారు.

వీటితోపాటు మూలబేరము నుండి ఆయా ఆరాధనలు అందుకునే మిగిలిన బేరాలలోకి ఆవాహన చేయడానికి మధ్యలో ఉండే బేరాన్ని "కర్మార్చ" లేదా "కౌతుక బేరం" అని అంటారు. మూలమూర్తిలోని శక్తిని ఆవాహన చేసి ఆయా బేరాలలోకి ఆయా సమయాల్లో ఆ శక్తిని ప్రవేశపెడతారు.

ప్రాచీన ఆలయాలలో ఈ బేరములన్నీ ఉంటూండేవి. ప్రస్తుతం ప్రతీ ఆలయంలోను మూలమూర్తి, ఉత్సవమూర్తి అన్నవి తప్పని సరిగా ఉంటాయి.

మన దివ్యసాకేతంలో ధృవమూర్తి, కర్మార్చ, ఉత్సవబేరం, స్నపనబేరం, శయనబేరము అన్నీ వేంచేసి పరిపూర్ణారాధనలు అందుకుంటున్నాయి" అని ఆలయంలో శ్రీమూర్తుల వివరాలను అందించారు. సాయంత్రం "కళ్యాణ మహోత్సవం" కన్నుల పండుగగా అత్యంత రమణీయంగా జరిగింది.

ఈ బ్రహ్మోత్సవంలో భాగంగా జరిగిన సీతారాముల శాంతి కళ్యాణానికి మన జెట్ సంస్థ అధ్యక్షులు శ్రీమాన్ జె. రామేశ్వరరావు దంపతులు, వారి పరివారం, దివ్యసాకేత నిర్వహణ కమిటీ అధ్యక్షులు శ్రీమాన్ మురళీకృష్ణంరాజు దంపతులు, వారి పరివారం, శ్రీమాన్ ఇ. రామారావు, శ్రీమాన్ పురుషోత్తంరావు, ఆడిటర్- శ్రీమాన్ టి.వి.ఎస్. రాజు, శ్రీమాన్ వి.విష్ణు రెడ్డి వంటి పెద్దలు మరి ఎందరో ప్రముఖులంతా పెళ్ళి పెద్దలుగా వ్యవహరించారు.

మే3వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం ఆలయంలో రంగనాథ, సాకేత రాములకు స్నపన మహోత్సవం జరిగింది.

భగవద్రామానుజుల అనుగ్రహ విశేషంచేతనే మనం ఈనాడు అర్చామూర్తి వైభవాన్ని, వాని ఆరాధనా విధానాన్ని తెలుసుకొని ఆరాధించగలుగుతున్నాం కనుక మార్గనిర్దేశకులై ఆచార్యులైన భగవద్రామానుజ అష్టోత్తర శతనామార్చన సామూహికంగా జరిపించారు శ్రీస్వామివారు.

ఈ సందర్భంగా భగవద్రామానుజ వైభవాన్ని అనుగ్రహిస్తూ శ్రీస్వామివారు తిరుమలలో శ్రీనివాసునికి శంఖ చక్ర ప్రదాత భగవద్రామానుజులేనని, తిరుక్కురుంగుడిలో వైష్ణవనంబికి ద్వయమంత్రం ఉపదేశం చేసింది వీరేనని, కంచి వరదుడే శిష్యరూపంలో వచ్చి భగవద్రామానుజులచే పుండ్రధారణ చేయించు కున్నాడని, అటువంటి ఆచార్యులను ఆశ్రయించడం ద్వారా పరమాత్మని చేరాలి కనుక ఆచార్య అష్టోత్తర పూజ అవసరమని దానిని నిర్వహింపచేశారు.

సాయంత్రం గరుడోత్సవం మనోహరంగా సాగింది. వేద స్వరూపుడైన గరుత్మంతునిపై స్వామిని అనుసరిస్తూ వేద పండితులు పారాయణను, ముందునుండి స్వామి సౌందర్యాన్ని తిలకిస్తూ నాలాయిర దివ్యప్రబంధ పండితులు ప్రబంధ పారాయణతో ముందుకు నడిచారు.

4వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీమాన్ మురళీకృష్ణంరాజు దంపతులు సమర్పించిన 27 అడుగుల ఎత్తున్న నూతనరథంలో శ్రీ సీతారామచంద్రస్వామి పరివార సహితుడై ఆలయానికి ప్రదక్షిణ కావిస్తూ, భక్తులను అనుగ్రహిస్తూ యాగశాలకి వేంచేశాడు.

యజ్ఞాచార్య స్వామి శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్య స్వామి రథోత్సవ వైభవాన్ని వివరిస్తూ "రథంలో ఉండే వివిధ అధిదేవతల గురించి, ఆయా శక్తుల గురించి వివరించారు. రథానికుండే చక్రాలు సూర్య చంద్రులని, రథ చక్రాలపై ఉండేది ఆధార కూర్మపీఠమని, ఆపైన ఉండేది కప్పు అనంతునికి (ఆదిశేషునికి)ప్రతీక అని రథానికి ఉన్న ఎనిమిది స్తంభాలు ధర్మ-అధర్మ, జ్ఞాన-అజ్ఞాన, వైరాగ్య-అవైరాగ్య, ఐశ్వర్య-అనైశ్వర్య అనే శక్తులని, ఎనిమిది దిక్కులలో అష్ట దిక్పాలకులు వేంచేసి ఉంటారని, ఆపై కప్పుపై ఉండే శిఖరం సుదర్శనుని అంశ అని సుందరంగా వివరించారు.

అలాంటి దివ్యరథంలో వేంచేసి వచ్చిన స్వామికి యాగశాలలో తిరుమంజనాన్ని సమర్పించారు. అనంతరం ఈశాన్యమూలలో నూతనంగా నిర్మింపబడిన పుష్కరిణిలో "చక్ర తీర్థ స్నానం" ఆచరించారు. శ్రీస్వామివారిననుసరించి భక్తజనమంతా చక్రతీర్థ స్నానాన్ని ఆచరించారు.

సాయంత్రం ఆలయంలో శ్రీ విష్ణు సహస్రనామ పారాయణా నంతరం శ్రీ పుష్పయాగం, ద్వాదశారాధనలు ప్రారంభమయ్యాయి. శ్రీ పుష్పయాగంలో వివిధ వర్ణాల పుష్పాలతో చక్రాబ్జ మండల రచన చేశారు. చక్రాబ్జ మండలంలో భువనకోశమంతటిని భావనచేస్తూ ఓ పద్మాన్ని ఆరురేకులు, పన్నెండు రేకులు, పద్దెనిమిది రేకులుగ వికసిస్తున్నట్లు చిత్రించారు.

సత్త్వ, రజస్తమో గుణాలకు ప్రతీకలుగా ఎరుపు-తెలుపు-ముదరు వర్ణాల పుష్పాలతో మూడు వీధులను చిత్రించారు. వాటి మీదుగా లతలు తీగలుగా ఆకుపచ్చని పరిమళ ఆకులతో ఉపవీధులను చిత్రించారు. ఇది మూడు చతురస్రాల మధ్య అమరిన వృత్తాకారంలో అనేక రేకులతో వికసించిన పద్మంలా శోభిల్లింది.

ఈ చక్రాబ్జమండల రచన అనేది వేరు వేరు సమయాల్లో వేరు వేరు రకాలుగా చిత్రిస్తారని శ్రీస్వామివారు వివరించారు. అగ్ని స్పర్శ దోషం జరిగినపుడు శాంతికోసం చేసే కార్యక్రమాలలో కూడా ఈ చక్రాబ్జ మండలం చేస్తారు. అలా చేసే దానిని "భద్రమండలం" అంటారు.

ప్రతిష్ఠా సమయంలో కూడా చక్రాబ్జమే వేస్తారు. కానీ, అది వేరు. అలాగే అర్చకులకు ఇచ్చే దీక్షా సమయంలో కూడా చక్రాబ్జమండల

రచన ఉంటుంది. సందర్భాన్ని బట్టి ఆ మండల రచన, పేరు మారుతూ ఉంటుందని స్వామివారు దాని వైభవాన్ని వివరించారు.

శ్రీ పుష్పయాగంలో కాల సంబంధమైన ఋతువులు, అయనాలు, సంవత్సరాలు, పక్షాలు మొదలైనవన్నీ ఈ మండలంలో ఆవాహన చేసి, ఆయా కాల సంబంధ గుణాలన్నీ ఈ పుష్పాలు వికసించినట్లు మనలో వికసించాలి. అదీ భగవంతుని సేవకోసం ఏర్పడాలి అని ప్రార్థిస్తూ పుష్పాలను అర్పిస్తారు.

చక్రాబ్జ మండలంలో ఆయా దిక్కులలో ఉండే పుష్పాలను సేకరించి 'ఇవి మాకు ఫలవంతములై అనుగ్రహించుగాక!' అని ప్రార్థన చేస్తూ స్వామికి అర్పిస్తారు. అనంతరం జరిగే ద్వాదశారాధనల్లో ప్రతీసారి షోడశోపచార పూజను సమర్పించి, వేద, ఇతిహాస, పురాణ, సంకీర్తన, ప్రబంధాది విన్నపాలు చేసి, ఒకొక్కమారు ఒక్కొక్క పదార్థాన్ని నివేదన చేస్తూ పన్నెండు మార్లు ఆరాధన, నివేదనాన్ని సమర్పిస్తారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారు బ్రహ్మోత్సవక్రమాన్ని వివరిస్తూ మూడు రకాలుగా ఈ బ్రహ్మోత్సవ శుభదినాలని నిర్ణయిస్తారని, ఉత్సవాలను గురించి ప్రతిఒక్కరికి అర్థమయ్యేలా వివరణాత్మక అనుగ్రహ భాషణాన్ని కావించారు.

మూడురకాలుగ బ్రహ్మోత్సవసమయ నిర్ణయం.

1. మూర్తి ప్రతిష్ఠజరిగిన నాటికి పూర్ణాహుతి, చక్రతీర్థం వచ్చేలాగా సంకల్పం చేసి ఐదు రోజులు ముందునుండే ఉత్సవాలను ఆరంభిస్తారు. ఈ సంవత్సరం మన దివ్యసాకేత రామునికి ఈ విధంగానే బ్రహ్మోత్సవాన్ని జరుపుకుంటున్నాం. వైశాఖ మాసంలో వచ్చే చిత్త నక్షత్రం నాడు ప్రతిష్ఠ జరుపుకున్నాం. ఆనాటికి మహాపూర్ణాహుతి వచ్చేలాగ ఐదురోజులు ముందుగ ఉత్సవాలు ప్రారంభించుకున్నాం.

2. మూర్తి ప్రతిష్ఠ జరిగిన రోజునుండి ప్రారంభించి ఐదు రోజులు బ్రహ్మోత్సవాన్ని చేసుకోవచ్చు.

3. ప్రతిష్ఠ జరిగిన నాటికి శాంతి కల్యాణం జరిగేట్లుగా ముందు, వెనుక రోజులు కలిపి ఐదు రోజులు ఉత్సవంగా చేసుకునే పద్ధతి కూడా ఉంది.

బ్రహ్మోత్సవాలు ఐదురోజులు జరుపుకోవడం అన్నది ఈమధ్య బాగా ప్రసిద్ధి చెందింది. నిజానికి పది లేదా ఇరవై రోజులుకూడా ఈ ఉత్సవాలు జరుపుతారు. ప్రతిష్ఠ అయిన నాటినుండి ఒక సంవత్సరం పూర్తయిన తరువాత ప్రతి సంవత్సరం ప్రతిష్ఠా మహోత్సవాన్ని స్మరిస్తూ, ఆ రోజును బట్టి ఈ బ్రహ్మోత్సవ కాలాన్ని నిర్ణయిస్తారు. మనం మన పిల్లలకి జరిపే పుట్టిన రోజు పండగ లాంటిది. వీటినే తిరునాళ్ళు (మంచిరోజులు) అని కూడా అంటారు. గ్రామీణ ప్రాంతాలలోవారు తిరనాళ్ళు జాతరగా పిలుచు కుంటారు.

బ్రహ్మగారు మొదటగ ఈ ఉత్సవాలని నిర్వహించారు కనుక బ్రహ్మోత్సవాలని పిలుస్తారు. ఇవి ఎక్కడెక్కడ జరిగితే బ్రహ్మగారు అక్కడక్కడ ఉంటారని, దేవతాహ్వానంలో బ్రహ్మగారికి ఒక స్థానాన్ని కలిపించి, ఋత్విక్‌లలో ఒకరిని బ్రహ్మస్థానంలో వరించి వారిలోకి బ్రహ్మని ఆవాహన చేస్తారు. ఉత్సవాంతంలో తిరిగి వారినుండి ఉద్వాసన కూడా చేస్తారు.

ఈ మహోత్సవాలలో ప్రధానమైనది వాహనసేవ. తిరువీధి ఉత్సవం. ఆయా జీవజాతులన్నిటికీ ఆధారంగ తానే ఉండి నడిపిస్తాడు అని తెలిపేదే వివిధ వాహనసేవ. కదిలేవి, కదలినివి, ప్రాణం ఉన్నవి, ప్రాణం లేనివి, స్వయం ప్రకాశాలు, చూపిస్తే తప్ప కనపడనివి... ఇలాంటి జీవరాశికి ప్రతీకగ ఒక్కొక్క వాహనాన్ని ఏర్పాటు చేసి పెట్టారు. అలాంటి వాహనసేవ చాలా ప్రధానం. అవకాశాన్ని బట్టి 3,5,10,20 వాహనాలపై సేవ. ఉదయం ఒక వాహనసేవ సాయంత్రం ఒక వాహనసేవ అలా ఎన్ని అవకాశం ఉంటే అన్నింటిపైనా చేస్తారు. మనం శేష, హనుమ, గరుడ వాహనాలతో పాటు సాకేత రామునికి రథోత్సవాన్ని కూడా జరుపుకున్నాం ఈ ఏడాది.

ఉత్సవంలో భాగంగ శాంతి కళ్యాణం జరుపుకున్నాం. చక్రతీర్థస్నానమాచరించాం. ఇక ఉత్సవపరిసమాప్తికి ముందుగ గడచిన సంవత్సరకాలంలో మన సాకేత ఆలయంలో మూడు స్థానాలలో వేంచేసి ఉన్న స్వామి ఆరాధనలో నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవాదులలో, సంవత్సరకాలపు ఆరాధనలో ఏమైనా లోపాలు జరిగి ఉంటే తద్దోష పరిహారార్థం ద్వాదశారాధన జరుపుకున్నాం. ఒక్కొక్క మాసానికి ఒక్కొక్క ఆరాధన వంతున పన్నెండు నెలలకి పన్నెండు మార్లు ఆయా మాసాలలో

లభించే వివిధ ఫలపుష్పాదులతో అర్చించుకున్నాం.

ద్వాదశారాధనతో ఈ ఉత్సవాంతర్గత కార్యక్రమాలు విజయవంతంగ పూర్తి అయ్యాయి. ఇక మహాపూర్ణాహుతి అనంతరం ఆయా దేవతలను తిరిగి వారి వారి లోకాలకు పంపవలసి ఉంటుందని శ్రీ స్వామివారు యాగశాలకు వేంచేశారు.

శ్రీ స్వామివారు యాగశాలలో మహాపూర్ణాహుతి కావించగానే ఆలయంలో దేవతా ఉద్వాసనం చేశారు.

ఏయే క్రమంలో దేవతాహ్వానం జరిగిందో అదే క్రమంలో ఉద్వాసన పలికారు. అనంతరం గరుడపటలాన్ని అవరోహణం చేసి యాగశాలలో ప్రధానకలశంతో దివ్యసాకేత పెరుమాళ్ళకి శ్రీస్వామివారు కుంభప్రోక్షణ కావించారు. అనంతరం భక్తులందరికీ సంప్రోక్షణ చేసి మంగళా శాసనాలు చేశారు. తీర్థప్రసాద గోష్ఠితో కార్యక్రమం సుసంపన్నమైంది.

ఈ 4వ తేదీనాడే నృసింహజయన్తి మహోత్సవం కూడా రావడం ఈ ఏడాది భాగ్యం. నృసింహస్వామికి తిరుమంజనం జరిపి, స్వామి అష్టోత్తరశతనామార్చన. స్వామి వైభవ సంశ్రవణమూ జరిగిన తర్వాత తిరునక్షత్ర తనియన్లను శ్రీస్వామివారందరిచేతా పలికించారు. ఆ తదుపరి పెద్ద మంగళాశాసనంతో వేదేతీహాస ప్రబంధాదుల శాత్తుముఱై జరిగింది. కార్యక్రమాలు రాత్రి సుమారు 11.00లకు పూర్తికావడం విశేషం. భక్తులందరికి ప్రసాదాల నందించి తృతీయ మహోత్సవాలను సుసంపన్నం కావించారు.

తెల్లవారి 5 వ తేదీ ఉదయం సాకేత రామునికి ఉత్సవాంతరం స్నపనం జరిగింది. సాయంత్రం సప్తావరణలతో బ్రహ్మానందాన్ని హృదయాలలో నింపుకుని భక్తులంతా కూడా ఇండ్లకు తిరుగు ప్రయాణమయ్యారు.

6వ తేదీ శ్రీశ్రీశ్రీ స్వామివారు హైద్రాబాద్ సౌభాగ్యపురి బ్యాంక్ కాలనీలో శ్రీవేంకటేశ్వర స్వామివారి బ్రహ్మోత్సవాలలో పాల్గొని భక్తులకు మంగళాశాసనం చేశారు.

28వ తేది గుంటూరు దగ్గరలోని ఇదుపులపాడు గ్రామానికి శ్రీస్వామివారు వేంచేసి, ఎమ్ శ్రీమన్నారాయణ రావుగారి పరమపదోత్సవాన్ని వారి కుమారులు శ్రీనివాసరావుగారిచే నిర్వహింప చేశారు.

శ్రీస్వామివారి శిష్యురాలు శ్రీమతి రంగాలుగారు ఇచటి గోష్ఠిని సంప్రదాయ వైభవంగా తీర్చిదిద్దారు. గోష్ఠి శ్రద్ధాసక్తులకు ఆనందించి తమ మంగళాశాసనాన్ని కటాక్షించారు.

అక్కడ నుండి బయలుదేరి విజయవాడలో అనారోగ్యము నుండి కోలుకుంటున్న శ్రీమాన్ గంగరాజు (JET అధ్యక్షులు)గారిని శ్రీవారు పరామర్శించారు.

30వ తేదీ అమలాపురం దగ్గర అయినవిల్లిలో రుక్మిణీ కళ్యాణోత్సవంలో పాల్గొని శ్రీమాన్ T.V.S. రాజుగారికి, వారి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన ఫిబ్రవరి నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| | ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|---|
| 1. | దేవవ్రతుడు క్రిందటి జన్మలో......... ఈ జన్మలో...... | |
| 2. | అధోక్షజుడనగ...................... | |
| 3. | ఆత్మోపాసనకంటే..... రూప.......ఉపాసనే మిన్న. | |
| 4. | చకోరశిశువులకి ఆహారం...... ఇలా ........కనిపించింది. | |
| 5. | సంతానం లేనివారికిది దివ్యౌషధం................ | |
| 6. | అడియిణై అంటే......... | |
| 7. | చక్రాబ్జమండలంలో................ను భావనచేస్తారు. | |
| 8. | .......................... ఏషధర్మస్సనాతన: | |
| 9. | కనిపించే వాటినుండి కనపడనిది తెలపడాన్ని ...అంటారు | |
| 10. | స్నానం కాని స్నానం పవిత్రం చేస్తుంది. | |
| 11. | వి.టి కార్యకర్తలు వీటిలా ఉండాలి......., ........ | |
| 12. | తమిళంలో అమరిన'ది..... | |
| 13. | వీరిని ఎవరు మెచ్చరు, చేరదీయరు? | |
| 14. | ఈయనకే ఉత్తముడని సార్థకనామము? | |
| 15. | జీవితమంతా రామదాసునిగ నిలచినవాడు..... | |
| 16. | కాలకంఠి ఎవరు? | |
| 17. | స్నానం కాని స్నానం పవిత్రం చేసిది? | |
| 18. | రామానుజులచే పుండ్రం ధరించిన స్వామి? | |
| 19. | కార్యసాధకుడు దూరంగ ఉంచాల్సింది? | |
| 20. | చెడునుండి మరలించే ఆచార్యులని..... అంటారు. | |
| 21. | క్రమంగ నాలుగు యుగాలలో స్వామి వర్ణాలు... | |
| 22. | వేసవి చలివేంద్రం పేరు? | |
| 23. | యువాగ్ని అంటే? | |
| 24. | మూలమూర్తి నుండి బేరాలలోకి ఆవాహనకి మధ్యవర్తి? | |
| 25. | ఆభగవత్త: అంటే? | |

**గత నెల విజేత :** పులిజాల శ్యాంసుందరరావు–సూర్యాపేట, జయలక్ష్మి రామానుజదాసి – చెన్నై, కె. సత్యశివప్రభు – హనుమకొండ.

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్టు పంపగలరు.

**భక్తినివేదన** శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః



65 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



శ్రీ నందన నామ సంవత్సరం ఆషాఢమాసము


సంపుటి 65 జూలై

సంచిక 4 2012


## పంచాంగ వివరాలు

జూలై :

1. అవమతిథి, వాసుదేవద్వాదశి, నాథముని తిరు॥
3. గురుపూర్ణిమ, వ్యాసపూర్ణిమ, యతులకు చాతుర్మాస్యారంభం
6. పునర్వసు కార్తె
14. సర్వేషామేకాదశి
16. కర్కాటక సంక్రమణము పగలు 12 నుండి దక్షిణాయణ పుణ్యకాలము
17. మాస శివరాత్రి
18. పిండపితృ యజ్ఞము
19. చుక్కల అమావాస్య
20. పుష్యమి కార్తె
23. శ్రీ ఆండాళ్ తిరునక్షత్రము, నాగ గరుడ పంచమి
24. అవమతిథి
25. బదరీనారాయణ పెరుమాళ్ తిరు॥ సుదర్శనాళ్వాన్ తిరు॥
27. వరలక్ష్మీ వ్రతం
29. సర్వేషామేకాదశి
30. తిథి ద్వయం, దామోదర ద్వాదశి
31. వరాహ జయంతి
1. హయగ్రీవ జయంతి, ఆళవందార్ తిరు॥, పుండరీకాక్షుల తిరు॥, ఋగ్యజుర్వేదులకుపాకర్మ, రక్షాబంధనం, విఖనస జయంతి, తేర్కాళ్వార్ తిరు॥
3. ఆశ్లేష కార్తె,
6. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి తిరునక్షత్రము
9. స్మార్త శ్రీకృష్ణాష్టమి

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

**శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు**

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవరచందా $30/-




మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం



E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*గత సంచిక తరువాయి...*

## (ప్రథమస్కంధం - అష్టమాధ్యాయం)

### కుంతీకృత భగవత్ స్తుతి

**తథా పరమహంసానామ్ మునీనామమహాత్మనామ్ ।**
**భక్తియోగ విధానార్థం కథం పశ్యమహిస్త్రియః॥**

స్వామీ! ఆత్మానాత్మ వివేకంకల ఆత్మ అంటే ఏమిటో, ఆత్మకానిది ఏమిటో ఎరిగిన వారు, మననశీలులు అయిన మహానుభావులకు, భక్తియోగంలో ప్రవేశం కల్గించడానికి నీవు అవతరించావు. ఎందువల్లనంటే, వీరంతా ఆత్మారాములు. ఇట్టివారిని కూడా నీ కళ్యాణగుణాలచే ఆకట్టుకొని నీపట్ల అనన్య ప్రీతి కలవారై ఉండేలా చేయడానికే నీవు అవతరిస్తావు. ఇలాంటి నీతత్త్వాన్ని కేవలం విజ్ఞతలేని మాబోటివారం ఎలా తెలియగలం? హే కృష్ణా! వాసుదేవా! దేవకీనందనా! నంద గోపకుమారా! గోవిందా! నీకు ప్రణామాలు.

**కృష్ణాయ వాసుదేవాయ దేవకీనందనాయ చ ।**
**నందగోపకుమారాయ గోవిందాయ నమో నమః ॥**

**నమః పంకజనాభాయ నమః పంకజమాలినే ।**
**నమః పంకజనేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే ॥**

అని ఇలా స్వామిని కీర్తిస్తూ కుంతి స్తుతించింది. "స్వామీ! కంస ప్రతిరుద్ధ అయిన దేవకిని రక్షించినట్లే నన్నూ రక్షించావు. నాకు కల్గిన ఆపదలనన్నింటినీ నీవే తరింపచేశావు" అని స్వామి చేసిన మహోపకారాలనన్నింటినీ ఉద్ఘాటించింది.

**"విషాన్మహాగ్నేః పురుషాదదర్శనాత్,**
**అసత్యభాయాః వనవాసకృచ్ఛ్రతః ॥**
**మృథే మృథేఽనేక మహారథాస్త్రతో**
**ద్రౌణ్యస్త్రతశ్చాస్మ హరేఽభిరక్షితాః ॥"**

భీమసేనుని విషం నుండి నీవే రక్షించావు. లక్క యింటిలో ఏర్పడిన అగ్నిదాహం నుండి రక్షించావు. హిడింబాది రాక్షసులనుండి కాపాడావు. ద్యూతకపటం సాగిన దుష్టసభ నుండి రక్షించావు. వనవాసక్లేశాలనుండి బయలుపడచేసావు. యుద్ధాలలో మహారథుల అస్త్రజాలం నుండి పరిరక్షించావు. చివరకు అశ్వత్థామప్రయోగించిన బ్రహ్మశిరోనామకమైన అస్త్రమునుండి పాండవవంశాంకురాన్ని బ్రతికించావు.

అంతేకాదు స్వామీ! మాపైకి ఉసికొల్పి పంపబడిన దుర్వాసోముని దుర్యోధన ప్రేరణచే మమ్ములను శపించడానికి సిద్ధపడి వచ్చికూడా, కేవలం నీ అనుగ్రహంచేత ముల్లోకాలతో పాటుగా వన్యఫలపత్రాలతోనే తృప్తిపడి వెనుదిరిగిపోయాడు కదా! ఇలా స్తుతించి, కుంతిపలికిన పలుకులు స్వామిని ప్రార్థించినతీరు విశేషమననీయం అవుతుంది.

**విపదః సన్తు నః శశ్వత్ తత్రతత్ర జగద్గురో ।**
**భవతో దర్శనం యత్ స్యాత్ అపునర్భవ దర్శనమ్ ॥**

"స్వామీ! జగద్గురూ! మాకు అక్కడక్కడ నిరంతరం ఆపదలే కలుగుతూ ఉండాలి. ఎందువల్లనంటే, ఆపదలు కలిగినప్పుడే కదా నిను చూచేది. నిన్ను దర్శించడమంటే ఇక జన్మరాహిత్యాన్ని దర్శించడమే కదా స్వామీ!" అంటుంది కుంతి.

మానవునికి అన్నీ తాననుకున్నట్లు, తన ఇష్టం వచ్చినట్లే జరిగితే ఇక భగవంతుని అవసరమేముంటుంది? కనుక దైవస్మరణానికి అవసరమే ఉండదు. అలాకాక, తన ఆలోచనలు తలక్రిందులు చేసి, తాను ఊహించినవిధంగ ఏదైనా జరిగినపుడే మానవుడు తనకంటే అతీతమైన దైవతత్త్వం ఏదో ఉండి అంతా నడిపిస్తుందనే విశ్వాసాన్ని ఏర్పరచుకుంటాడు. నిరంతరం

ఆపదలు కలిగినప్పుడే, ఉక్కిరిబిక్కిరై, కరావలంబనాన్ని కోరతాడు. శంకరభగవత్పాదులవంటివారు సహితం ఆపద కలిగినప్పుడే...

**'లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబమ్'** అని ప్రార్థించారు. మానవుని ఆర్తియే భగవంతుని స్మరింపచేస్తున్నది. చీకటిలో ఉన్నవానికేకదా వెలుగు అవసరపడేది. అలాగే కష్టాల్లో ఉన్నవానికే, కష్టాలుగడిపే ఉపాయం కావాలి. ఆ ఉపాయం 'దైవమ్' తప్ప మరేమీ కాదు అని కుంతి నిష్కర్షచేస్తున్నది.

సామాన్యంగా మానవుడు దైవాన్ని విశ్వసించడు. తన అభిజనాన్ని పురస్కరించుకొని, సర్వనియమన సామర్థ్యంవల్ల, వేదశాస్త్ర విజ్ఞానంవల్ల, ధనంవల్ల, మదం అతిశయించిన పురుషుడు, నీనామాన్ని ఉచ్చరించడానికి కూడా అర్హుడుకాడు. కేవలం "అకించనుల"కు మాత్రమే అంటే పైన పేర్కొన్న మదహేతువులైన యోగ్యతలేవీ లేనివానికి మాత్రమే నీవు గోచరిస్తావు కదా స్వామీ!

**నమోఽకించన విత్తాయ నివృత్త గుణవృత్తయే ।**
**ఆత్మారామాయ శాంతాయ కైవల్యపతయే నమః ॥**

అకించనులకు (ఏమీలేని దరిద్రులకు) విత్తం (ధనం) అయిన స్వామీ! నీకు నమస్సు. అంతేకాదు. "అకించనులే" విత్తం తప్ప, పరమాత్మకు వేరే విత్తం ఏదీ అపేక్షితం కాదు. సమస్త గుణప్రవృత్తులూ నీనుండి మరలిపోయినాయి. అంటే సత్త్వరజస్తమస్సులనే మూడు ప్రాకృతిక గుణాలను పురస్కరించుకొని ఏర్పడే విషయభోగాలేవీ దరిచేరజాలవు కదా! స్వామి ఆత్మారాముడు. స్వానందఘనుడు.

ప్రశాన్త స్వభావుడు. 'కైవల్యమని' చెప్పబడే ఆత్మానుభవాన్ని కూడా జీవునికి అనుగ్రహించేవాడు. అట్టి స్వామికి నమస్సు అంటుంది కుంతి. *(ఇంకా ఉంది)*

# నేర్చుకుందామా! - 10

శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-విజయవాడ

## కాలమహిమ

రామే ప్రవ్రజనం బలేర్నియమనం, పాండోః సుతానాం వనం
వృష్ణీనాం నిధనం, నలస్య నృపతే రాజ్యాత్ పరిభ్రంశనమ్ ।
కారాగార నిషేవణం చ మరణం సంచిన్త్య లంకేశ్వరే
సర్వః కాలవశేన నశ్యతి నరః కో వా పరిత్రాయతే ॥

**ఎంతటి వారైనా కాలానికి తలవంచక తప్పదు. దేనినైనా నశింపచేసే శక్తి కాలానికే ఉంది. ఉదాహరణకి- శ్రీరాముడెంత గొప్ప వీరుడు! పరశురామునంతటివానిని ఓడించాడు. రావణుని వధించాడు. అంతటి మహనీయునికి అరణ్యవాసం తప్పలేదు. కాలమహిమ కదూ!**

**బలిచక్రవర్తి ఎంతటి దాత! మూడు లోకాలూ జయించాడు. అనేక యాగాలు చేసాడు. శ్రీహరినే తన ఇంటికి ద్వారపాలకునిగా చేసికొన్నాడు. అయినా పాతాళానికి తొక్కబడడం కాలమహిమ కదూ!**

**పాండవులో........ రాజసూయాది యాగాలు చేసినవారు. కిమ్మీర, హిడింబాదుల జయించినవారే. కానీ, అరణ్యవాసం తప్పించుకోలేక పోయారు.**

**శ్రీకృష్ణుని వంశంలో పుట్టిన భాగ్యవంతులే అయినా, ఒకరినొకరు చంపుకొన్నారు ఆవేశంలో వీరులు.**

**అశ్వవిద్యలో, జూదంలో ఎంతో గొప్పవాడైన నలుడు రాజ్యం పోగొట్టుకున్నాడే. అబ్బ! ఎన్నికష్టాలు అనుభవించాడు!**

**రావణుడో! కార్తవీర్యునిచేత బంధింపబడడం, రాముని చేతిలో ప్రాణాలు కోల్పోవడం..... ఇవన్నీ తలుచుకుంటే కాలాన్ని ఎవ్వరూ ఎదిరించలేరు. కాలశక్తి చాలా చాలా గొప్పది అనేవిషయం స్పష్టమౌతుంది. ఆ కాలం సాక్షాత్తు భగవంతుడే కదా! కాలస్వరూపునికి అంజలి సమర్పిద్దాం!**

# కలివైరిసూరి వైభవము



*గత సంచిక తరువాయి...*

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-8-3 (బృహత్సూక్తి)**

**నిన్న మామరుతిత్తవీழ் నడన్ద నిన్మలన్ నేమియాన్**
**ఎన్నుమ్ వానవర్ కైతొழுమిణైత్తామరైయడియెంబిరాన్**
**కన్నిమారిపొழிన్దిడ క్కడితానిరైక్కిడర్ నీక్కువాన్**
**శెన్నుకున్నమెడుత్తవన్ తిరువేంగడమడైనెంజమే ॥**

ప్రతిపదార్థము: **నిన్న**=(కొంచమైనను కదలక) నిలచి యున్న; **మామరుతు**=పెద్దవైన మద్దిచెట్లు, **ఇత్తవీழ்**=విరిగి పడునట్లు; **నడన్ద**=వానిమధ్య నుండి వెళ్ళిన (పాకుచూ వెళ్ళి); **నిన్మలన్**=నిర్మల స్వభావుడును; **నేమియాన్**=శ్రీహస్తమున చక్రము కలవాడును; **వానవర్**=నిత్యసూరులు; **ఎన్నుమ్**= ఎల్లవేళల; **కైతొழுమ్**= అంజలిఘటించెడి; **ఇణై**=పరస్పర దృశమైన; **తామరై**=తామర పుష్పములవంటి; **అడి**= శ్రీపాదములుగల; **ఎంబిరాన్**=మాకు మహోపకారకుడును; కన్ని=(ఇంద్రుడు) కోపగించి; **మారి**= శిలావర్షమును; **పొழிన్దిడ**=వర్షింపచేయగ; **ఆనిరైక్కు**=పశువుల మందలకు; **ఇడర్**=దుఃఖమును; **నీక్కువాన్**=పోగొట్టువాడును; **కడితు**= శీఘ్రముగ; **శెన్ను**=వెళ్ళి; **కున్నం**=గోవర్ధనపర్వతమును; **ఎడుత్తవన్**=ఎత్తైనవాడునగు స్వామియొక్క; **తిరువేంగడమ్**= తిరువేంగడమనెడి దివ్యదేశమును; **నెంజే**=మనసా!; **అడై**= ఆశ్రయింపుము.

**తాత్పర్యము:** ఓ మనసా! శ్రీ వేంకటగిరిని ఆశ్రయింపుము. భగవంతుడు అచ్చట వేంచేసి యున్నాడు. అతడు మద్దిచెట్ల రూపమున ఉన్న యములార్జునులను భంజించినవాడు. చక్రాయుధమును శ్రీహస్తమున ధరించినవాడు. ఎల్లప్పుడు నిత్యసూరులచేత సేవింపబడు శ్రీచరణములు కలవాడు. ఇంద్రుడు కురిపించిన వర్షమువలన ఆవులమందలకు ఆపద సంభవింపగా గోవర్ధనగిరిని గొడుగుగా చేసికొని వానిని కాపాడినవాడు.

**విశేషార్థము:** నేడు మనము తిరుమలలో సందర్శించుచున్న శేషాద్రివాసియగు శ్రీనివాసుడు పూర్వము శ్రీకృష్ణుడుగా అవతరించి అద్భుతలీలలను గావించినవాడు. అతని ఆ అద్భుతలీలలను తిరుమంగై ఆళ్వారులు ఈ పాశురమున తెలుపుచున్నారు.

**నిన్న:** శ్రీకృష్ణుని ఏ విధముగనైనను సరే సంహరింప వలెనని ఇద్దరు రాక్షసులు సంకల్పించుకొని జంటగా పెద్ద పెద్ద మద్దిచెట్లరూపమునుగొని శ్రీకృష్ణుని రాకకై నిరీక్షించు చున్నారు. ఆ మద్దిచెట్లు ఎంతపెద్దవి అనగ ఆ చెట్టు నేలకూలిన పుడు ఆ దృశ్యమును జూచిన జనులు అబ్బో! ఈ వృక్షములు శ్రీ కృష్ణునకు అవతలవైపు పడినవి. ఎంతో భాగ్యము. అటులగాక అవి శ్రీకృష్ణునివైపే పడి ఉండినచో మన చిన్నికృష్ణునకు ఎంత ప్రమాదము సంభవించి ఉండెడిదో కదా! అని భయమును కలిగించినంతటివి. అవి హఠాత్తుగ నేలవ్రాలినవి.

**నిన్మలన్:** ఆ మద్దెవృక్షములమధ్య నుండి దోగాడి వెళ్ళిన పరిశుద్ధుడు.

**నేమియాన్ :** చక్రాయుధమును ధరించినవాడు. తన (శ్రీకృష్ణుని) ప్రమేయము లేకనే అసురులను సంహరింప తగిన పరికరమును (చక్రాయుధమును) ధరించిన భగవంతుడు శ్రీకృష్ణుడుగా నవతరించెను.

**ఎన్నుం ఇత్యాది:** పరమపదమునందు నిత్యసూరుల బృందముతో నున్నవాడు కదా ఇపుడు భూలోకమున ఒంటరిగా శ్రీకృష్ణుడుగా నవతరించినాడు.

**కన్ని యిత్యాది :** ఇంద్రుడు కోపాతిశయముతో మేఘములను గోకులముపైకి పంపెను. అవి ఇంద్రుని మనస్సునకు తగినట్లు గోకులముపై తీవ్రముగ వర్షించినవి.

ఆనిరైక్కు ఇడర్ నీక్కువాన్ : కడితు శెన్ను కున్నమెడుత్తవన్: తమను తాము సంరక్షించుకొనుటకు సాధనమేదియులేని పశువులపై ఒక్కనీటిబొట్టును పడుటకు ముందే వానికి ఏ దుఃఖమును కలుగకుండునట్లు గోవర్ధనపర్వతమును ఎత్తినవాడు.

**తిరువేంగడమడై నెంజమే:** ఆనాడు కొండనొకదానిని యెత్తి గోవులకు వచ్చిన ఆపదను తొలగించిన స్వామి ఇపుడు ఒక కొండపై వేంచేసి ఉండి మనలను సంరక్షింప నెంచియున్నాడు. ఓ మనసా! ఆతనిని ఆశ్రయింపుము. *(ఇంకా ఉంది)*



# అహో! భారతమ్

(గత సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

దాశరాజు ఆనందంతో సత్యవతిని శంతనునకిచ్చి వివాహం చేయడానికి అంగీకరించాడు. కుమారుని సుగుణసంపదకి రాజు తన్మయుడయ్యాడు. ప్రజలందరూ జయ జయ ధ్వానాలు చేశారు. జై భీష్మ మహారాజుకు జై... జయ జయ ధ్వానాలతో మారు మ్రోగిపోయింది రాజ్యం. కాబోయే తల్లిని రథంపై ఎక్కించుకొని వచ్చి తండ్రికి సమర్పించాడు.

మానవమాత్రులకు అసాధ్యమైన ఈ సత్యనిష్ఠ, ఈ భీష్మప్రతిజ్ఞ శంతనుని అత్యంతాశ్చర్యాలకి, ఆనందానికి గురిచేసింది. "నాయనా!... కుమారా... నీకొక వరం ప్రసాదిస్తున్నాను. నీవు ఎపుడు రావాలి అనుకొంటూ అప్పుడే మరణం వచ్చేలా అనుగ్రహిస్తున్నాను. స్వచ్ఛంద మరణం... ఇదే నేను నీకిచ్చేవరం" అని ప్రేమగా దగ్గరకు తీసుకున్నాడు పుత్రుని.

సత్యవతిని వివాహం చేసుకున్నాడు శంతనుడు. వారిద్దరూ ఆనందంగా కొంతకాలం గడిపారు. వారికి చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అనే ఇద్దరు కొడుకులు పుట్టారు. అలా శంతనుడు సంతానాన్ని పొంది కొంతకాలానికి స్వర్గస్థుడయ్యాడు. తండ్రి కార్యాలన్నీ శ్రద్ధతో పూర్తి చేశాడు భీష్ముడు.

తల్లి సత్యవతి అనుమతిని పొంది ఆమె పెద్దకుమారుడు చిత్రాంగదునికి రాజ్యాధికారం కట్టబెట్టాడు. అయితే అతడు అహంకారంతో దేవ, గంధర్వ, రాక్షసాదులనెవ్వరిని లెక్కపెట్టకుండా ప్రవర్తించేవాడు. ఒకసారి చిత్రాంగదుడు అని అదే పేరున్న గంధర్వరాజు ఇతని పొగరు చూచి భరించలేకపోయాడు. చిత్రాంగదుడివి నువ్వా? నేనా? నా పేరు పెట్టుకున్నావు కాబట్టి నాతో యుద్ధం చెయ్యి. చెయ్యలేక పోతే పేరు మార్చుకో! నా పేరుతో నిరర్ధకంగా, మాట్లాడే మనిషిని నేను ప్రాణాలతో విడిచిపెట్టను" అన్నాడు. అతనితో ఘోరయుద్ధం జరిగింది. అవతలివ్యక్తి గంధర్వుడు కదా! మాయలు బాగా తెలిసినవాడు. ఆ శక్తితో అతడు పాపం! చిత్రాంగదుణ్ణి చంపి పారేశాడు. ఆనందంగా తనలోకం చేరాడు ఆ గంధర్వుడు. అలా చిత్రాంగదుని జీవితం ముగిసిపోయింది. భీష్ముడు జరిగిన దానికి ఎంతో బాధపడ్డాడు. అయ్యో! రాజు మరణించాడే! అతని తమ్ముణ్ణి రాజుని చేద్దాం అంటే ఇంకా చిన్నవాడు విచిత్రవీర్యుడు. అయితేనేం. మిగిలినవాడు వాడేకదా! ఈ రాజ్యాన్ని అతడికే అప్పగించడం నా కర్తవ్యం. నా బాధ్యత అని విచిత్రవీర్యుని రాజుగా చేశాడు. చిన్నవాడైనా విచిత్రవీర్యుడు భీష్ముని మాట వింటూ రాజ్యపాలన సాగించాడు. తల్లికి, భీష్మునికి ఎంతో గౌరవాన్నిస్తూ వారి మాటలు మన్నిస్తూ పాలించడంతో చక్కని ధర్మపరిపాలన చోటు చేసుకుంది. అలా అలా పెరిగి పెద్దవాడయ్యాడు విచిత్రవీర్యుడు.

విచిత్రవీర్యుడు భీష్ముని ఆజ్ఞతో భూమిని పాలిస్తూ, పెరిగి పెద్దవాడయ్యాడు. యౌవనంలో ప్రవేశించిన అతనినిచూచి అహో! ఇతనికి వివాహ ప్రయత్నం చెయ్యాలికదా! అని, తన కర్తవ్యాన్ని గుర్తుకు తెచ్చుకున్నాడు భీష్ముడు. అంతే, వెంటనే రథం ఎక్కి కాశీపట్టణానికి బయలుదేరాడు.

కాశీరాజుకి ముగ్గురు అమ్మాయిలు. అంబ, అంబిక, అంబాలిక అని వారి పేర్లు. ఆ రాజు తన ముగ్గురు కూతుళ్ళకి స్వయంవరం చాటించాడు. అందుకని, ఆవిషయం తెలిసికొని, అక్కడికే తిన్నగా బయలుదేరాడు భీష్ముడు. అక్కడ రాజులందరూ సమావేశమై ఉన్నారు. సరిగ్గా ఆసమయంలో ఆ ముగ్గురు అమ్మాయిల్ని తన రథం ఎక్కించుకొని "వీరిని నాతమ్మునకిచ్చి వివాహం చెయ్యాలని తీసికొని పోతున్నాను. ఎవరైనా ఎదిరించే వారుంటే, నేను యుద్ధానికి సిద్ధమే" ఇలా జయించి పిల్లల్ని తీసుకొని పోవడం న్యాయం కూడా అని ప్రకటించాడు.

ఆ మాటలు విని రాజులంతా కోపంతో మండిపడ్డారు. అంతా కలిసి ఒక్కసారి భీష్మునితో యుద్ధం చేసారు. కానీ భీష్ముడు వారు వేసిన బాణాలు మీదపడకుండా మధ్యలోనే ముక్కలుగా విరిచి, రాజులందరిని కకావికలు చేసాడు. భయంతో అందరూ పారిపోయారు. భలే.... అనుకొంటూ వస్తూండగా వెనుకనుంచి సాళ్వరాజు వచ్చాడు. వారితో కాదు! నాతో యుద్ధంచేసి గెలు చూస్తానంటూ.... బాణవర్షం కురిపించాడు. ఆహా! ఇదేదో చాలా బాగుందే! రండి రండి!! చూద్దాం! అంటూ కొంతమంది చాలా ఆసక్తిగా వారిని చూస్తున్నారు. సాళ్వుడు వేల, లక్షల బాణాలు వేశాడు భీష్ముని రథంపైన. కానీ, భీష్ముడు సాల్వుని రథాన్ని, అతని మనోరథాన్ని (కోరికని) కూడా ముక్కలు చేసేశాడు. అంబ, అంబిక, అంబాలికలని తన రాజ్యానికి తెచ్చి విచిత్రవీర్యునికిచ్చి పెళ్ళిచేద్దాం అనుకున్నాడు.

కానీ, పెద్దమ్మాయి అంబ సాళ్వరాజు నన్ను పెళ్ళాడాలని

అనుకున్నాడు. మా తండ్రి ఇష్టపడ్డాడు కూడా. మరిప్పుడు ఏంచేయాలో ఏం చేయవచ్చో నువ్వే చెప్పు అంది.

పెద్దలనడిగి వారి ఆజ్ఞతో అంబని సాళ్వరాజు దగ్గరకు పంపేసాడు. అంబికని, అంబాలికని విచిత్రవీర్యునకిచ్చి పెళ్ళిచేసాడు. విచిత్రవీర్యునికి భార్యల అందం ముందు లోకం గుర్తుకు రాలేదు. కామభోగాలలో ఒకటే.... ఒకటే కోరిక! ఆ అనుభవానికి తృప్తి అనేది కలుగలేదు. అంతే! చిక్కి, శల్యమైపోయి మరణించాడు.

భీష్ముడు దుఃఖంతో తమ్ముని పరలోకయాత్ర విధానాలన్నీ యథావిధిగా జరిపించాడు. తల్లిని, మరదళ్ళను ఓదార్చాడు. ఏంచేయగలడు! పెద్దావిడ సత్యవతి పాపం, కోడళ్ళముఖాలు చూడలేకపోయింది. దుఃఖం పెల్లుబికి వచ్చింది.

"నాయనా! భీష్మా! శంతనుని వంశం పెరిగి పెద్దది కావాలంటే నువ్వే నన్ను రక్షించాలి. నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. ఈ వంశాభివృద్ధిని చేయడంలో, సంతానాన్ని పొందడంలో సహకరించు తండ్రీ! అంది. భీష్ముడు అమ్మా! ఇలా మాట్లాడడం నీకు తగినదేనా? ఆనాడు నేను చేసిన ప్రతిజ్ఞ, చేపట్టిన బ్రహ్మచర్యవ్రతం విడిచిపెట్టే అవివేకినా! ఎట్టిపరిస్థితిలోనూ నా ఉత్తమ వ్రతాన్ని విడిచిపెట్టను.

ఒక విషయం పెద్దలవలన నాకు తెలిసినదానిని చెపుతాను. అది మంచో, చెడో అందరితో ఆలోచించి నిర్ణయం తీసుకో" అంటూ లోకపావనుడు, ధర్మమూర్తి అయిన మహానుభావుని సంతానార్థం ప్రార్థించమని చెప్పాడు. వెంటనే సత్యవతికి తన అనుభవం ఒకటి గుర్తుకువచ్చింది. తాను కన్యగా ఉన్నప్పుడు పరాశరమహర్షి తనను చూచి, మోహించాడు. తనకి కన్యాత్వదోషం లేకుండా వరమిచ్చాడు.

యమునానదీ ద్వీపంలో తనకు వ్యాసుడు జన్మించాడు. అమ్మా నాతో నీ కెప్పుడు పనిపడితే అప్పుడు నన్ను తలచుకో వెంటనే నీ ముందు నిలుస్తానని అనుజ్ఞ తీసికొని తపోవనానికి వెళ్ళిపోయాడు. ఆయనే కృష్ణద్వైపాయనుడు. ఆయనే వ్యాసుడు. అన్ని ధర్మాలు బాగా తెలిసినవాడు. అతడు అంగీకరిస్తే తమ్ముని భార్యలందు సంతానాన్ని పొందుతాడు". అని చెప్పింది.

వ్యాసుని పేరు వినగానే చేతులు జోడించి ఆయనకి నమస్కరించాడు భీష్ముడు. ఆయన వల్లనే తన కురువంశం నిలుస్తుందని ఆనందపడ్డాడు.

సత్యవతి తన వంశాన్ని నిలుపుకొనడం కోసం వేదవ్యాసుని తలచుకొంది. వెంటనే ఆవిడముందు ప్రత్యక్షమయ్యాడు వ్యాసుడు. బంగారంలాంటి పచ్చని జడల సమూహంతో, నల్లని దేహంతో కాంతులు చిందుతూ కనిపించాడు. ఆవిడ ఆనంద బాష్పాలతో, అతనిని, తన మొదటి కుమారుని కౌగిలించుకొని, ఆశీర్వదించింది.

అమ్మా! ఎందుకు నన్ను తలచుకున్నావు అని అడిగాడు వ్యాసుడు. నాయనా! నీకు తెలియని దేముంది. ఈ భీష్ముడు ప్రతిజ్ఞ, ధర్మనిష్ఠ నీకు తెలిసినవే కదా! కోడళ్ళని చూస్తూంటే కడుపు తరుక్కొని పోతోంది. విచిత్రవీర్యుడు చూస్తే అలా తనువు చాలించాడు. మరి మన వంశం ఇక్కడితో.... ఇక్కడితో ఆగిపోవడమేనా నాయనా!

భర్త మరణిస్తే అతని సోదరుని వలన సంతతిని పొంది వంశాన్ని నిలుపడాన్ని దేవరన్యాయం అంటారు. నువ్వు అలా ఈ వంశాన్ని నిలపాలి... అంటూ అడిగింది.

అమ్మా! నీ ఆజ్ఞ శిరసావహిస్తాను. ఈ రోజుల్లో ఈ న్యాయం అంతటా ఉంది. వేదాలు, పురాణాలు కూడా అంగీకరించిన నియమమే ఇది.

కాశీరాజపుత్రికలకి సంతానాన్నిస్తాను. కానీ వారు ఒక సంవత్సరకాలం అతి పవిత్రంగా నియమనిష్ఠలతో జీవితాలు గడపాలి అన్నాడు. *(ఇంకా ఉంది)*



# పోతన భాగవతం - మధురభక్తి

(గత సంచిక తరువాయి)

శ్రీమతి డా॥ పి. జ్యోతి- వరంగల్

దశమస్కంధంలోని భ్రమరగీతలు కూడ మధురభక్తి రూపమైన ప్రేమతత్త్వాన్ని ఉపదేశించినాయి. మధురానగరం వెళ్ళిన తరువాత కృష్ణుడు తల్లిదండ్రుల, గోపికల యోగక్షేమాలు విచారించడానికి వారికి ఊరట కలిగించడం కోసం ఉద్ధవుని పంపిస్తాడు. ఉద్ధవుని చూడగానే గోపికలంతా కృష్ణుని తలచుకొని తలచుకొని దుఃఖిస్తారు.

తల్లిదండ్రులపై ప్రేమ వదలలేక కృష్ణుడు కబురు పంపి ఉంటాడని తమను మరచిపోయి ఉంటాడని మకరందంపై కోరిక ఉన్నంతవరకే తుమ్మెదలు పూవులకై వ్రాలినట్లుగా ప్రయోజనం తీరగానే స్త్రీలను పురుషులు మరచిపోతారు సుమా... అని ఉద్ధవునితో నిష్ఠురోక్తులు పలుకుతారు.

ఇంతలో అక్కడికి ఒక తుమ్మెద వచ్చింది. అది వారి చుట్టూ తిరుగుతూ ఉన్నప్పుడు, దాన్ని చూసి శ్రీకృష్ణుడు పంపిన దూతగా భావించుకొని దూతతో మాట్లాడినట్లు, అన్యాపదేశంగా శ్రీకృష్ణుడు తమ బాధలు తెలుసుకునేటట్లు గోపికలు మాట్లాడుతారు. తుమ్మెదతో పలికిన పలుకులు వారి తీవ్రమైన వియోగాన్ని, దుఃఖాన్ని వ్యక్తం చేసినాయి.

***ఒక పువ్వందలి తేనె ద్రావి మధుపా యుత్సాహివై నీవు వే***
***ఱొకటిం బొందెదు భంగి మమ్మధర పీయూషంబునందేల్చి మా***
***యకలంకోజ్జ్వల యౌవనంబు గొని యన్యాసక్తుఁడయ్యెన్ విభుం***
***డకటా యాతనికెట్లు దక్కెసిరి మిథ్యాకీర్తి నమ్మేంజుమీ!***

అని నీలాంటివాడే కృష్ణుడు. అందుకే అతనికి తగిన దూతవైనావు. అని కాసేపు భ్రమరాన్ని నిందించినారు. వీరు కృష్ణతత్త్వం తెలిసినవారు కనుక కృష్ణుని నారాయణునిగా తెలుసుకొని దివ్యమైన ప్రేమతో పరవశం చెందినారు. రామావతారంలోని కాఠిన్యాన్ని చెప్పి దూషించారు.

***వాలిం జంపెను వేటకాని పగిదిన్ వంచించి, దైత్యానుజన్***
***లోలం బట్టి విరూపజేసెను, బలిన్ లోభంబుతో గట్టి యీ***
***త్రైలోక్యంబు మొఱంగి పుచ్చుకొనియెన్ ధర్మజ్ఞుడే మాధవుం***
***డేలా షట్పద యెగ్గు మా వలన నీకెగ్గింపఁగా నేటికిన్.***

తనను వలచి వచ్చిన శూర్పణఖను చెవులు ముక్కు కోసి విరూపను చేసిన కఠినుడు మీ స్వామి! కాని ఏం చేస్తాం? అతని కృత్రిమమైన అందమైన నవ్వులకు కనుబొమల కదలికలకు వశపడి ప్రేమించిన స్త్రీలు ఈ లోకంలో గాని పైలోకంలోగాని పాతాళలోకంలో గాని ఉన్నారా? లక్ష్మీదేవి కూడ మోసపోయి వానికి వశయై పాదాలు సేవిస్తున్నది. మేమెంత? దుష్టుడైనా వాడే సంతతం స్మరణకు వచ్చి వదల డానికి వీలుకాకుండా మమ్మల్ని వెంటాడుతున్నాడు.

మాలాగా ఎందరో ఇతనికొరకు అందరినీ వదలి భిక్షువులై సంచరిస్తున్నారు. మేము అతని స్వభావం తెలిసినవారమే! అయినా అతని మోసంలో పడక తప్పలేదు మాకు! అంటారు. వేటగాండ్లు అడవిలో లేళ్ళను పట్టడానికి పాటలు పాడుతారు. ఆడులేళ్ళు తెలివితక్కువగా ఆ పాటలకు పరవశించి వేటగాని చేరినట్లుగా మేము ఆ కృష్ణుని “మాయా లాపముల్” విని మోసపోయితిమని అనుకున్నారు.

***బంధుల బిడ్డలన్ మగల భ్రాతలదల్లులఁదండ్రులన్ మనో***
***జాంధతఁజేసి డించి, శరణందిన మమ్ము వియోగ దుర్దశా***
***సింధువులోనఁ ద్రోచి, యిటుచేరక పోవుట పాడి గాదు, పు***
***ష్పంధయ మీ యధీశునకుఁ బాదములంబడి యొత్తి చెప్పవే***

అని వేడుకున్నారు.

ఈ విధంగా గోపస్త్రీలు భ్రమరంతో మాట్లాడుతున్నట్లుగా మాట్లాడి ఉద్ధవునికి తమ శ్రీకృష్ణ విరహం వల్ల కలిగిన తీవ్రమైన వేదనను దుఃఖాన్ని తెలుపుకున్నారు. వారి ఆత్మస్వరూప జ్ఞానానికి ఆశ్చర్యపడిన ఉద్ధవుడు “ఓ గోపవనితలారా! జపదానవ్రత హోమ సంయమ తపస్స్వాధ్యాయ కర్మలవల్ల కూడ భగవంతుని చిత్తంలో నిలుపుకోవడం శక్యం కాదు.

మీరు ఎటువంటి కర్మ చేయకపోయినా “విశ్వేశుపై మీ కజస్ర పటుధ్యానములిట్లు నిల్చునె భవ చ్చారిత్రముల్ చిత్రముల్” అని కృష్ణునిపై ఇంతప్రేమ గల మీకంటే కృతార్థులెవరు? అందువల్ల కృష్ణునితో ఎడబాటు మీకులేదు. బాహ్యంగా ఎడబాటును అనుభవిస్తున్నారు మీరు. అంతరంగా భగవంతునితో నిత్య సమాగమాన్నే అనుభవిస్తున్నారు. దుఃఖించకండి! అని వారిని అనునయించినాడు. కృష్ణుడు వారికి పంపిన సందేశాన్ని ఈ విధంగా తెలిపినాడు.

ఎల్లకార్యములకు నేను బ్రధాన కారణము గావున మీకు రామలారా
కలుగదు మద్వియోగము చరాచర రూపములలో మహాభూతములు
వసించు
కరణినుండుదు సర్వగతుండనై నే మనఃప్రాణబుద్ధి గుణేంద్రియాశ్ర
యుండ
నాత్మ యందాత్మచే నాత్మ బుట్టింతు రక్షింతును ద్రుంతు
హృషీక భూత

గుణగణాకార మాత్మకు గొమరు మిగులు
నిబిడ మాయానుభవమును నిత్యశుద్ధ
మాత్మ విజ్ఞాన మయమునై యమరు గుణము
బ్రకృతి కార్య మనోవృత్తి బట్టి పొందు

కృష్ణసందేశాన్ని విన్న గోపికలు ఊరడిల్లినారు.

భాగవతంలో దశమస్కంధమంతా మధురభక్తికి ఉదాహరణంగా చెప్పవచ్చు. గోపికాకృష్ణుల ప్రణయాన్ని వర్ణించే సందర్భంలో పోతన "పోతనామాత్యుడు" కాదు. "పోతన్న గోపిక" అయినాడు. ఆ భక్తిపారవశ్యమే పోతనకీర్తికి పతాక ఎత్తిందనడంలో సందేహం లేదు. సమాప్తం

యుద్ధకాండలో



# శ్రీరామాయణంలో పక్షులు



(గత సంచిక తరువాయి)

పక్షులు ప్రాచీనకాలం నుంచే మానవులకి మార్గదర్శకాలుగ ఉంటున్నాయి. వైదికంగానూ, పక్షుల ఉపకారాన్ని ఉపనిషత్తులు ఎన్నోచోట్ల ప్రస్తావిస్తాయి. లౌకికంగానూ, పక్షులు మానవులకి ఎన్నో రకాలుగ తోడ్పడటం మనకందరికీ, ఇప్పటికీ అనుభవ సిద్ధమే! అందుచేతనే కాబోలు శ్రీరాముడంతటి మహానుభావుడు, మర్యాదలకు ఎల్లలనెఱింగిన పురుషోత్తముడు కూడా ఒకటికి రెండుసార్లు పక్షులను తనకు దృష్టాంతంగ స్వీకరించాడు. తానూ వాటివంటి ఆచారనిష్ఠను పొందాలని ఉవ్విళ్ళూరాడు. గతంలో అలా రాముడాదర్శంగ తీసుకొన్న ఒక జంటపక్షుల గురించి ప్రస్తావన అయోధ్యకాండకు సంబంధించిన కథలో ఎలా ఉందో తెలుసుకున్నాము. అలాగే తానే స్వయంగ ప్రస్తుతించిన ఓ పావురమునకు సంబంధించిన ప్రస్తావన శ్రీరామాయణయుద్ధకాండలో 18వ సర్గలో సాక్షాత్కరిస్తుంది.

అది సముద్రతీరం. శ్రీరాముడు, సుగ్రీవాది వానర వీరులందరినీ తోడుచేసుకొని అక్కడకి చేరాడు. లంకలోని సీతమ్మను చూసి వచ్చిన హనుమ ఇక్కడినుండే లంకకు ఎగిరి వెళ్ళాడు. తనకుండే శక్తి విశేషంవల్ల ఆయనంటే అంతదూరం విహంగ విహారం విజయవంతంగ చేసి వచ్చాడు కానీ, మరి ఈ వానరులంతా లంక చేరెదెలా? వానరులలో కొందరు ఎగిరేశక్తి కలవారున్నారు కానీ, రామలక్ష్మణులు ఈ వంద యోజనాల సాగరాన్ని దాటేదెట్లా? వానరులలో కూడా అందరూ అంతంత దూరం ఎగరలేరు. లంకకుపోలేరు. వందయోజనాలు దాటించే పడవో, ఓడో ఇక్కడేదీలేదాయె. ఇక ఆవలికి సముద్రాన్ని దాటి లంకలో చేరేదెట్లా? చేరిన తర్వాత కద రావణునితో పోరు సలిపేది! ఇప్పుడేమిచేయాలీ, ఎవరినడగాలి? ఎలా దాటాలీ... మొదలైన విషయాలని గురించి ఆలోచనలో మునిగి ఉన్నారు శ్రీరామలక్ష్మణులు. మధ్యలో కాస్త విశ్రాన్తి దొరికనట్టుంది సుగ్రీవునికి. తనవద్దనున్న పరివారంతో అలా, కాస్సేపు సముద్రతీరంలోని ఇసుకతిన్నెలమీద ఇటూ అటూ విహరిస్తున్నాడు. ఇంతలో...

'ఆజగామ ముహూర్తేన యత్ర రామస్సలక్ష్మణః'' (రా.యుద్దే.17స. 1శ్లో) రావణుడి తిరస్కారాన్ని అవమానాన్ని, నిందనూ భరించలేక, ఆతనికి చెప్పవలసినవన్నీ నిర్మొగమాటంగ, సుస్పష్టంగాను బోధించి, ఇక క్షణం కూడా ఇక్కడ ఉండరాదని నిశ్చయించుకొని, లంకారాజ్యంయొక్క లంకాపుర ప్రజలయొక్క హితాన్ని కోరుకొన్న విభీషణుడు. తనతో ఉండదలచుకొన్న నలుగురు రాక్షసుల్ని తోడుచేసుకొని లంకానగరపు రావణ సభాభవనంలోంచే అమాంతం ఆకాశంలోకి ఎగిరిపోయి, సాగరమునకు ఉత్తరతీరాన్ని వానరులతోను, లక్ష్మణుడితోను రాముడున్న చోటును వెతుక్కుంటూ ఒక్కక్షణకాలంలో వచ్చిచేరాడు. క్రిందకి దిగలేదు. **ఉత్తరం తీరమాసాద్య ఖస్థ ఏవవ్యతిష్ఠత'** (రా.యు.17.8) తీరానికి చేరాడు. ఆకాశంలోనే అలానే నిలబడి ఉండిపోయాడు. ఆతని దేహం కాంతివంతమైంది. రావణుణ్ణి వదలినందుకు తృప్తి. రాముణ్ణి చేరినందుకు ఆనందంతో ప్రకాశిస్తున్నాడు. సలసల కాగే అగ్నిపర్వతపు లావాలోంచి బయటపడి చల్లటి పుష్కరిణిలోకి దిగినట్టుంది ఆతనికి ఆకాశంలో అలా ప్రకాశిస్తూ వస్తూంటే చూసిన సుగ్రీవాదులకి ఓ పెద్ద మెరుపుతీగ వస్తోందా అనిపించింది.

ఆయన వణికిపోతున్నాడు భయంతో. అందుకే మెరుపుతీగెలా చంచలంగ కనిపిస్తున్నాడు. ఎందుకంటే, రామపరివారమైన ఈ వానరమూకలు తనని అసలక్కడికి రానిస్తాయో లేదో తెలియదు. గతంలోనే రావణుడు పంపిన శుకుడనే రాక్షసవీరుడు వానరవేషంతో వచ్చి వీళ్ళతో చేరితే వాడిని పసిగట్టినవానరులు శుభ్రంగ దేహశుద్ధిచేశారు. వాడు చావు దెబ్బలు తిని, లబోదిబోమంటూ రాముడి కాళ్ళపైబడి ఆయన దయతో ఎలానో చావు తప్పి కన్నులొట్టపోయి బ్రతికి

బయటపడి, బ్రతుకుజీవుడా అనుకుంటూ తిరిగి రావణుడి దగ్గరికి చేరాడు. మరి యిప్పుడు నన్నేం చేస్తారో అనే సంశయం మనసులో పీడిస్తూండడంవల్ల కాంతితో మెరిసేదే అయినా చంచలమైన మెరుపుతీగెలా కనిపిస్తున్నాడు విభీషణుడు. అయితే ఒకసారి రాముణ్ణి చేరితే మాత్రం జన్మధన్యమౌతుందనే దృఢ విశ్వాసం మాత్రం ఉంది.

నేలమీదుంటే ఈ చెట్టుచాటునో, గట్టుమాటునో దాగవచ్చు. కానీ, విభీషణుడు ఆకాశంలో ఉండేసరికి అందరి వానరులకంటపడ్డాడు. వానరవీరులంతా చాల జాగరూకతతో ఉన్నారు. ఎటునుంచి ఏ ఉపద్రవం రాముడికి వస్తుందోననే భయంతో అన్ని వైపులా పరికిస్తూ, పరిశీలిస్తూ ఏకాస్త అనుమానాస్పదంగ ఏ వస్తువు కన్పించినా, ఒక్కసారిగ అందరూ ఎదుర్కొనేందుకు సన్నద్ధులైపోతున్నారు. అందులోనూ విభీషణుడు ఒంటరిగా రాలేదాయె! ఈయనతో మరో నలుగురుగూడ వచ్చేశారు. అనలుడు, శరభుడు, సంపాతి, ప్రఘనుడు అనేవి ఆ తోడొచ్చిన నలుగురు రాక్షసులపేర్లు.

వాళ్ళను చూచిన సుగ్రీవుడు ఇంక ఆలస్యం చేయడానికి వీల్లేదు. ఈ రాక్షసుడు ఆయుధాలు ధరించి, పూర్తి ఆధికారిక వేషంతో ఉన్నాడు. పైగా కొందరిని వెనుక వేసుకు మరీ వచ్చాడు. ఆ వచ్చేవాడు కూడా మంచిమాటకోసం 'దూత'గ వచ్చినట్టు లేదు. ఆయుధాలు వేషం ఉన్నాయి గనుక. పోనీ, 'గూఢచారి'గనూ కనపడటంలేదు. రహస్యంగ, మారువేషం లోనూ రాలేదు. నేరుగ తన రాక్షసరూపంలోనే వచ్చి నిలబడ్డాడు. అంచేత తప్పకుండా పోరాడటానికే వచ్చినట్టున్నాడు'' అనుకుంటున్నాడు.

చూడండర్రా! వీడూ, వీడి ఆయుధాలు, వీడితో ఉన్న తోడు రాక్షసులున్నూ, వీళ్ళు రాముడికి ఏం చేస్తారో ఎంటో మన ప్రాణాలు తీసేట్టున్నారు. మనలనెవరినైనా ఏమైనా చేస్తే తట్టుకోవచ్చు. అసలు రాముణ్ణే ఏమైనా చేశాడనుకోండి. ఇక మనమంతా ఉండి కూడా దండగేకద! ఏమంటారు?" అని అడిగాడు. రాజైన సుగ్రీవుడి మాటలు ఆపకుండానే కూడా ఉన్న వానరువీరులంతా చెట్లూ రాళ్ళూ పెళ్ళగించి ఎత్తి నిలబడ్డారొక్కసారిగ. 'నువ్వు ఊ! అను. ఆ ఆకాశంలోని వాళ్ళని అక్కడే, అలానే అంతం చేసి పారేస్తాం!" అంటూ సిద్ధపడ్డారు.

అయినా రాముడు తనని రక్షిస్తాడనే ప్రగాఢమైన విశ్వాసం మనసులో నిండి ఉన్న విభీషణుడు, వీళ్ళ ఉద్యమానికి జంకలేదు. క్రుంగలేదు. వెనుతిరిగి పారిపోలేదు. ఆకాశంలో అంతర్ధానం చెందలేదు. అలానే నిలబడి ఉండి వానరులకు తనను పరిచయం చేసుకున్నాడు. ఈ వానరులకి తనపై ద్వేషంలేదు. కానీ, వీళ్ళల్లో ఉండే రామప్రేమ వీళ్ళని ఈ విధంగ ప్రవర్తింపచేస్తోందని విభీషణుడికి తెలుసు. అందుకే ముందు తనలోని లోపాలను చెప్పుకోదలచుకున్నాడు.

"ఓ వానరులారా! పరమ దుర్మార్గుడూ, క్రూరుడూ అయిన రావణుడి తమ్ముణ్ణి విభీషణుణ్ణి. వాడు జనస్థానం నుంచి సీతమ్మను దొంగతనంగ ఎత్తుకొచ్చాడు. అడ్డొచ్చిన జటాయువును చంపాడు. రాక్షసస్త్రీల కాపలా మధ్య జాగ్రత్తగ లంకలో పెట్టాడు. నేనే ఎన్నోరకాలుగ నయనా, భయానా కూడా సీతమ్మను రాముడికి తిరిగి యిచ్చేయని చెప్పి చూశాను. కానీ, అవేవీ వాడి చెవికెక్కలేదు. మృత్యువు వెన్నంటిన వాడికి ఏవీ తలకెక్కవు గద! పైగా నన్ను ఇష్టమొచ్చినట్లు తిట్టి అవమానించి, పరమదారుణంగ వెళ్ళగొట్టాడు. సర్వస్వాన్ని వదిలి రాఘవుణ్ణి నమ్మి శరణాగతుణ్ణై వచ్చాను. రాముడు అన్ని లోకాలకీ రక్షకుడని నమ్మాను. నన్ను విభీషణుడంటారు. కాస్త నాగురించి చెప్పరూ?" అంటూ ప్రార్థించాడు. *(ఇంకా వుంది)*

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...)

వట్రి అడిమై శెంజోనో లక్ష్మణనైప్పోల

శ్రీమతి చక్రవర్తుల చూడామణీ -ఖమ్మం

"అక్కరైక్కు విట్టేనో గుహప్పెరుమాళైప్పోల?"

"బామ్మా! శ్రీరాముడి రాజ్యం అయోధ్యకదా! వనవాసానికి దండకారణ్యం వెళ్ళాడు కదా! అంతదూరం ఎలా వెళ్ళాడు చెప్పవూ" అన్నాడు వెంకటకృష్ణ.

"వీడి బుజ్జిబుర్రనిండా సందేహాలే బామ్మా!"

"పోనీలే ప్రతిభా మంచి సందేహాలేగా. 'బాల్యంలో నేర్చుకున్న విద్యలు రాతిమీద గీతలా ఎప్పటికీ చెరగనివి' అంటారు పెద్దలు. ఈ వయసులోనే వీడికి జిజ్ఞాస కలిగించాడు పరమాత్మ. ఇలాగే వీడు జ్ఞానాభివృద్ధి చేసుకుంటే ఇహపర సుఖాలు పొందుతాడు.

"నేనడిగింది చెప్పకుండా మీరే మాట్లాడుకుంటున్నారు..."

"రా... అలా అరుగుమీద కూర్చొని మాలకడుతూ చెప్తాను. మరి నువ్వేమో పూలందించాలి. సరేనా!" అంది బామ్మ.

"బామ్మా! నువ్వలా కూర్చొని చెప్తుండు. నేను మాల కడతాలే. మిగిలిన సైన్యం కనపడదే" ప్రతిభ.

"వాళ్ళకు ఇవ్వాళ్ళ 'స్కూల్ డే' ఉందట. వీడికి లేదు. అందుకే మనవెంట పడ్డాడు.... కిట్టు ఇదిగో ఇలా రెండేసి పూలు జతచేసి అక్కచేతికి అందించాలి. రాముడు వనవాసానికి బయలుదేరాడు కద! సీతా లక్ష్మణులు మేమూ వస్తామని ఆయనవెంట బయలుదేరారు. కౌసల్య, సుమిత్రతోపాటు అయోధ్యవాసులంతా ఎంతో బాధపడ్డారు. దశరథుడు తన మంత్రి సుమంత్రుడిని పిలిచి వాళ్ళకు కావాల్సిన వస్తువులన్నీ ఏర్పాటు చేసి గంగాతీరం దాకా రథంలో తీసుకుపోయి దింపమని ఆజ్ఞాపించాడు. సుమంత్రుడు రాజాజ్ఞ పాటించి సీతారామలక్ష్మణులను గంగాతీరంలోని శృంగభేరి పురానికి రథంలో తీసుకువచ్చాడు.

శృంగభేరి పురానికి రాజు గుహుడు. అక్కడ ప్రజలంతా నిషాదులు.

"నిషాధులంటే ఎవరు?"

"అడవులలో ఎన్నో రకాల జాతులవాళ్ళు ఉంటారు. వాళ్ళల్లో నిషాదులది కూడా ఒక జాతి. ఆ జాతికి నాయకుడు గుహుడు. వీళ్ళకు, దశరథుడికి చాలా కాలంగా మంచి సంబంధాలున్నాయి. అందువలన గుహుడు సీతారామ లక్ష్మణులను ఎంతో ఆదరంతో ఆహ్వానించాడు. శ్రీరాముడికి మిత్రుడు, ఆత్మీయుడు అయిన గుహుడికి చతురంగ బలాలున్నాయి."

"చతురంగ బలాలంటే ఏమిటి?"

"ఆ రోజుల్లో రాజులకు తమ రాజ్యాన్ని ప్రజలను కాపాడుకోవటానికి నాలుగు రకాలైన బలాలుండేవి. వాటినే చతురంగబలం అంటారు. అవి: 1. కాల్బలం, అంటే భూమి మీద నిలబడి యుద్ధం చేసేవాళ్ళు. 2. అశ్వబలం – గుర్రాల మీద సవారి చేస్తూ యుద్ధం చేసే బలం; 3. రథబలం – రథాల మీద నిలబడి వీరులు యుద్ధం చేస్తూంటారు. ముందు సారధి ఉండి రథం నడిపిస్తారు."

"కృష్ణుడిలాగా కదూ..."

"అవును. అందుకే కదా ఆయనను పార్థసారథి అంటారు. పోతే నాలుగవది గజబలం. వీరులు ఏనుగులమీద ఉండి యుద్ధం చేస్తారు. మావటీలు ఏనుగును నడిపిస్తుంటారు."

"విమానం నుంచి బాంబులు వేస్తేనో..."" వాళ్ళకు విమానాలు, ఓడలు లేవా?"

"ఆ రోజుల్లో యుద్ధాలకు విమానాలు లేవు. సముద్రతీరంతో వాళ్ళకు ఓడలుండేవి. భూమి మధ్యభాగంలో ఉన్నవాళ్ళకు ఓడలు అవసరం లేదు కదా!"

"రాకెట్లు లేవా బామ్మా!"

"లేదురా కన్నా! ఆకాలంలో ఎదురుపడి యుద్ధం చేసి గెలిచేవాళ్ళు. ఇప్పట్లా దొంగదెబ్బ కొట్టే పద్ధతి లేదు."

"గుహుడికి చతురంగ బలాలున్నాయని చెప్పావు"

"గుహుడు సీతారామలక్ష్మణులకు, సుమంత్రుడికి మంచి ఆహార పదార్థాలు, రకరకాల వంటకాలు సిద్ధం చేయించాడు. గుహుడి అభిమానానికి సంతోషించాడు రాముడు.

**"భుజాభ్యాం సాధుపీనాభ్యాం పీడయన్ వాక్యమబ్రవీత్"**

(అయోధ్యకాండ 50.41)

తరువాత గుహుడిని ఎంతో ఆదరంతో తన బలమైన చేతులతో కౌగలించుకున్నాడు. ప్రేమతో గుహుడు పెట్టిన పదార్థాలను శ్రీరాముడు తీసుకోలేదు.

"ఎందుకు తీసుకోలేదు?"

"ఎందుకంటే వనవాసంలో ఉన్నాడు కదా! వనవాసంలో తాపసిగా ఉన్నవాళ్ళు కందమూలాలు, పళ్ళు, ఫలాలు మాత్రమే తినాలి. అందువల్ల గుహుడు సిద్ధం చేసిన వంటకాలేవి తినలేదు. రాత్రి అక్కడే నేలమీద పడుకున్నాడు.

లక్ష్మణుడు గుహుడితో పొద్దున్నే తాము బయలుదేరడానికి తగిన నావను సిద్ధం చెయ్యమన్నాడు. గుహుడు తన అతిథులకు రక్షణ కల్పించాల్సిన బాధ్యత తనది కాబట్టి ధనుర్బాణాలు పట్టుకొని వాళ్ళకు కాపలాగా ఉన్నాడు. లక్ష్మణస్వామి కూడా అన్నగారికి కాపలాగా ఉన్నాడు.

**గుహోऽపి సహ సూతేన సౌమిత్రిమనుభాషయన్ ।**

**అన్వజాగ్రత్ తతో రామ యే అప్రమత్తో ధనుర్ధరః ॥**

*(అయోధ్యకాండ 50.51)* అన్నాడు వాల్మీకి.

లక్ష్మణుడు, గుహుడితో, సుమంత్రుడితో మాట్లాడుతూ ధనుర్ధారిగా సీతారాములకు కాపలాకాస్తూ జాగారం చేశాడని అర్థం. ఆరోజు మొదలైన జాగారం. పట్టాభిషేకం దాకా పద్నాలుగేళ్ళు కొనసాగింది లక్ష్మణస్వామికి.

"గంగనెలా దాటారు?"

"గుహుడు మంచి అందమైన, సౌకర్యవంతమైన పెద్ద ఓడను వీళ్ళకోసం ఏర్పాటు చేశాడు. మరుసటిరోజు పొద్దున్నే తనే స్వయంగా సామానంతా ఓడకెక్కించి సీతారామ లక్ష్మణులను గంగదాటించి అవతలి ఒడ్డులో వదిలిపెట్టాడు.

ఇక్కడ విశేషమేమిటంటే లోకంలో అందర్నీ తరింప చేసేవాడు, ఇహలోకం నుండి పరలోకానికి చేరవేసేవాడు, ఈలోకంలో ఉన్న సంసారమనే సాగరాన్ని దాటించేవాడు అయిన రాముడిని గుహుడు గంగదాటించాడు.

అందువలన ఆయన గుహప్పెరుమాళ్ అయ్యాడు. అంతేకాదు నిషాదజాతిలో పుట్టినా, శ్రీరాముడికి పరమమిత్రుడు, ఆప్తుడు అవటం వలన మన సంప్రదాయంలో 'గుహప్పెరుమాళ్' అని పిలుస్తారు.

అందుకేకదా! మన తిరుక్కోళూరమ్మాళ్ "అక్కరైక్కు విట్టేనో గుహప్పెరుమాళైప్పోల" అంది.

"అర్థం నేను చెపుతాలే బామ్మా" "అద్దరికి దాటించానా గుహప్పెరుమాళ్ లాగా" అని అర్థం. తెలిసిందా...." ప్రతిభ.

''బామ్మా రామలక్ష్మణులతో భరతుడు ఎందుకు వెళ్ళలేదు?" కిట్టు.

"ఓరి కిట్టప్పా నిన్ను చూసే 'రామాయణం అంతా విని రాముడికి సీత ఏమవుతుంది?' అని సామెత పుట్టినట్టుంది. కృష్ణుడిని చూసి ప్రతిభ పకపక నవ్వింది.

"పోనీలే ప్రతిభ వాడు చిన్నవాడు కదా! ఆట పట్టించకు. నువ్వురా నాన్నా, నేను చెప్తాగా! చెప్పేది జాగ్రత్తగా విని గుర్తు పెట్టుకోవాలి... సరేనా... రా.. ఇలా కూర్చో." బామ్మ. *(సశేషం)*

# శ్రీనృసింహావతార వైశిష్ట్యం

(ఇంకా ఉంది)

డా॥ కండ్లకుంట్ల నరసింహమూర్తి- జనగామ

నారసింహానుష్టుప్పుకు నృసింహ గాయత్రీమంత్రం చతుర్థాంగం. చతుర్వింశత్యక్షర యుక్తమైన ఈ నృసింహ గాయత్రి మహామహిమాన్వితమైంది. ప్రసిద్ధమైన ఈ మంత్రమే ఋగాది చతుర్వేదాలకు, అగ్ని, ఇంద్రాది సకల దేవతలకు కారణభూతమైంది. ఈ మంత్రాన్ని తెలుసుకున్నవానికి సకల వేద విజ్ఞానం అవగతమయినట్లే!

**"ఓమ్ నృసింహాయ విద్మహే వజ్రనఖాయ ధీమహి!**
**తన్న సింహః ప్రచోదయాత్"**

ఏ పురుషసింహుని కొరకు ఈ సమస్తం కలదని తెలుసుకుంటున్నామో, వజ్రసమాన కఠోర నఖ విశిష్టుడైన ఆతనియందు తత్పరధ్యాన విశిష్టమైన మా మనస్సు లగ్నమగు గాక! – అని ఈ గాయత్రీ మంత్రార్థము.

నరసింహావతారంలో సింహ స్వరూపానికే ప్రాధాన్యం. ఎట్లన గాయత్రిలోని ''వజ్రనఖాయ'' అనే పదం: నారసింహ మంత్రరాజంలోని జ్వలంతం, భీషణం, మృత్యుమృత్యుం అనే అవతార ప్రయోజన ప్రదర్శకాలైన పదాలు నరసింహావతారం లోని సింహస్వరూపానికే ప్రాధాన్యమిస్తున్నాయి.

గాయత్రిలోని ఉత్తరపాదంలో తన్నస్సింహః ప్రచోదయాత్ – ఆ సింహమే మమ్ము రక్షించుగాక అని ఉపాసకుడు ప్రార్థించి నందువల్ల సింహస్వరూపానికే ప్రాముఖ్యం కనిపిస్తున్నది.

శంకర విరచిత లక్ష్మీనృసింహ కరావలంబస్తోత్రంలో కూడ "సంసారయూథ గజసంహతి సింహదంష్ట్రా..." అనే శ్లోకంలోని దంష్ట్రా, కరాళ మొదలైన శబ్దాలద్వారా సంసారవర్తి ప్రాణియూథ గజసమూహాలను భేదించే సింహము ఈ స్వామి అని నిరూపింపబడినందున అక్కడకూడా సింహస్వరూపానికే ప్రాధాన్యమివ్వబడింది. మన మనస్సులు దౌర్భాగ్యమత్తమదేభాల వంటివి గనుక, వానిని భేదించేందుకు సామర్థ్యం గలవి నరసింహుని వజ్రసమాన నఖములే గనుక, అట్టి కార్యానికై మన మనస్సులు ఆయనయందే లగ్నం కావాలని ఉపాసకుడు కోరుకున్నందున కూడా సింహశబ్ద ప్రాధాన్యం సూచించబడింది.

**ప్రత్యంగ మంత్ర స్వరూపం :**

నృసింహానుష్టుప్‌లోని నాలుగు పాదాలకు నాలుగు అంగమంత్రాలు పైన వివరించబడ్డాయి. అదే విధంగా నృసింహానుష్టుప్‌లోని ముప్పదిరెండు అక్షరాలకు ముప్పదిరెండు ప్రత్యంగమంత్రాలు ప్రత్యేకంగా పేర్కొనబడ్డాయి. ఈ ముప్పది రెండు ప్రత్యంగ మంత్రాలలో శ్రీ నృసింహుడే 1 బ్రహ్మ, 2. విష్ణువు, 3. మహేశ్వరుడు, 4. పురుషుడు. 5. ఈశ్వరుడు, 6. సరస్వతి, 7. లక్ష్మి, 8. గౌరి, 9. ప్రకృతి, 10. విద్య, 11) ఓంకారుడు, 12. అర్ధమాత్రలు, 13. సాంగ సశాఖసేతిహాస పూర్వక వేదాలు, 14. పంచాగ్నులు, 15. సప్తమహా వ్యాహృతులు, 16. అష్టదిక్పాలకులు, 17. అష్టవసువులు, 18. ఏకాదశ రుద్రులు, 19. ద్వాదశాదిత్యులు, 20. అష్టగ్రహాలు, 21. పంచమహాభూతాలు, 22. కాలము, 23. మనువు, 24. మృత్యువు, 25. యముడు, 26. అంతకుడు, 27. ప్రాణము, 28. సూర్యుడు, 29. చంద్రుడు, 30. విరాట్ పురుషుడు, 31. జీవుడు, 32. సర్వం అని వివరించబడింది.

**మంత్రరాజ అధ్యయన ఫలం:**

మంత్రరాజమైన ఈ నారసింహానుష్టుప్‌ను నిత్యం అధ్యయనం చేసేవాడు అగ్నిపూతుడు, వాయుపూతుడు, ఆదిత్య పూతుడు, సోమపూతుడు, సత్యపూతుడు, బ్రహ్మపూతుడు, విష్ణు పూతుడు, రుద్రపూతుడు, దేవపూతుడు, సర్వపూతుడు కాగలడు. ఇది నిశ్చయమని తెలిపేందుకు మంత్రంలో "ససర్వపూతో భవతి, ససర్వపూతో భవతి" అని రెండు పర్యాయాలు చెప్పబడింది. ఈ మంత్రరాజాన్ని నిత్యం అధ్యయనం చేసేవాడు మృత్యువును జయించగలడు. పాపాలనుండి విముక్తుడవు తాడు. బ్రహ్మహత్య, భ్రూణహత్య, వీరహత్య, సర్వహత్యాది పాపాలనుండి విముక్తుడై సంసారాన్ని తరించగలుగుతాడు. ఇంకా అగ్నిని, వాయువును, సూర్యచంద్రులను, జలరాశిని, సమస్త దేవతలను, గ్రహాలను కూడ స్తంభింప చేయగలడు.

ఈ మంత్రరాజాన్ని నిత్యం అనుష్ఠించేవాడు, దేవ, యక్ష, నాగ, గ్రహ, నరులను ఆకర్షించగలడు. భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనోలోక, తపోలోక, సత్యలోకాది సర్వ లోకాలను జయించగలడు. అగ్నిష్టోమ, ఉక్థ, షోడశి, వాజపేయ, అతిరాత్ర, ఆప్తోర్యామ, అశ్వమేధాది సర్వక్రతువులు ఆచరించిన

ఫలితాన్ని పొందగలడు. ఋగ్యజుస్సామాథర్వణ వేదాలను అధ్యయనం చేసినవాడవుతాడు. వేదాంగాలను, వేదశాఖలను, పురాణాలను, కల్పాలను, బ్రాహ్మణాలను, "పురుషాన్నపరం కించిత్-నేహనానాస్తికించన" ఇత్యాది నారాశంస్య వాక్యాలను, ప్రణవాన్ని, సర్వాన్ని అధ్యయనం చేసిన ఫలితాన్ని పొందుతాడు.

**మంత్రరాజ ఉపాసనోత్కృష్టత :**

ప్రపంచంలో ఉన్న తారతమ్యమంతా నారసింహ మంత్ర రాజాన్ని జపించే వానియందే విశ్రమిస్తుంది. అనగా నారసింహ మంత్రరాజాన్ని జపించేవాడు సర్వోత్కృష్టుడని భావం. గాయత్రీమంత్ర సంస్కారశూన్యులైన 100మంది అనుపనీతులు ఒక ఉపనీతునితో సమానం. ఒక గృహస్థుడు 100మంది ఉపనీతులతో సమానం. ఒక వానప్రస్థుడు 100మంది గృహస్థులతో సమానం. ఒక యతి 100మంది వానప్రస్థులతో సమానం. శతరుద్రీయాన్ని పఠించేవాడొకడు 100మంది యతులతో సమానం. అథర్వ శిరశ్శాఖాధ్యాపకుడు 100మంది రుద్రజపకులతో సమానం. తాపినీయ ఉపనిషత్తును అధ్యయనం చేసేవాడొకడు 100మంది రుద్రజపకులతో సమానం. 'నారసింహమంత్రరాజాధ్యాపకుడొకడు" తాపనీయ ఉపనిషత్తును అధ్యయనం చేసే 100మంది విద్వాంసులకంటే గొప్పవాడు- అని తెలుపబడింది. కనుక ఈ అనుష్టుప్ మంత్రం ఎంతటి మహిమోపేతమైందో గ్రహించవచ్చు.

**మంత్రరాజానుష్ఠానం ద్వారా పరమపదప్రాప్తి :**

ఈ మంత్రరాజాన్ని అధ్యయనం చేసేవానికి పరమపదం లభిస్తుంది-అని ఉపనిషత్తు తెలిపింది. ఆ పరమపదం ప్రకృతికి భిన్నమైంది. అక్కడ సూర్యుడు ప్రకాశించడు. వాయువు వీచదు. చంద్రుడు తనవెన్నెలను ప్రసరింపజేయడు. నక్షత్రాలు ప్రకాశించవు. అగ్ని దహించదు. మృత్యువు అక్కడికి ప్రవేశించదు. అక్కడ దుఃఖముండదు. ఎల్లప్పుడు పరమానందమే లభిస్తుంది. ఆ లోకం శాంతమైంది, శాశ్వతమైంది. సదా క్షేమకరమైంది. బ్రహ్మాది దేవతలచే నమస్కరింపబడుతూ ఉంటుంది. యోగులచే ధ్యానింపబడుతూ ఉంటుంది. ఎక్కడికి వెళ్ళిన తరువాత యోగులు తిరిగిరారో, అదే పరమపదం. అది వైకుంఠుడైన శ్రీమన్నారాయణుని నివాసస్థానం. అక్కడి నుండే ఆయన "బహుస్యాం ప్రజాయేయ" అని సృష్టిచేయ సంకల్పించు కుంటాడు.

"యద్గత్వా న నివర్తంతే, తద్ధామ పరమం మమ" అని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ పరమపదాన్ని గురించి వివరించాడు. ఋగ్వేదంలో కూడ పరమపదాన్ని ప్రస్తుతించే మంత్రమున్నది.

**తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి**
**సూరయః దివీవ చక్షురాతతమ్ ॥**
**తద్విప్రాసో విపన్యవో జాగృవాం సః సమింధతే**
**విష్ణోర్యత్పరమం పదమ్ ॥** *(ఋగ్వేదం 1-22,20-1)*

ఏ లోకంలో అనంత, గరుడ, విష్వక్సేనాది నిత్యసూరులు నారాయణుని సౌందర్యాన్ని రెప్పవేయకుండా ఎప్పుడూ తిలకిస్తూ పులకిస్తూ ఆయనను స్తుతిస్తూ నిరంతరం జాగరూకులైన ప్రకాశిస్తుంటారో, అటువంటి విప్రులు కలది పరమపదము అని మంత్రార్థము. ఇటువంటి పరమపదం నిష్కామయోగులకు మాత్రమే లభిస్తుంది. నృసింహానుష్టుప్ మంత్రరాజాన్ని అనుష్ఠించేవాడు ఈ పరమపదాన్ని సులభంగా పొందగలుగు తాడని చెప్పబడినందువల్ల మంత్రమహిమ విశదమవుతున్నది.

**ఓంకారాంతర్యామి నృసింహుడే :**

దేవతలు తమ గురువైన ప్రజాపతివద్దకు వెళ్ళి అణువుకన్న మిక్కిలి చిన్నదైన (అణోరణీయాన్) ఆత్మగురించి, ఓంకారాన్ని గురించి వివరంగా తెలుపుమని ప్రార్థించారు. బ్రహ్మదేవు డప్పుడు ఓంకార విశేషార్థాన్ని, ఆత్మస్వరూపాన్ని గురించి విశదీకరించి, ఓంకారాంతర్యామి నృసింహుడే అనే విషయాన్ని, మంత్రరాజమే బ్రహ్మాత్మల ఐక్యానికి హేతువని నృసింహ ఉత్తరతాపినీయ ఉపనిషత్తులో వివరించాడు. *(సశేషం)*




*గత సంచిక తరువాయి*

**వైశారదీ**

ఆత్మకు అతిచేరువలో ఉన్న భగవంతుని స్వరూపం **'అంతర్యామి'** తత్త్వం. సుర, నర, తిర్యక్, స్థావరములనే నాలుగు రకాల స్థానములలో జీవవర్గానికంతటికీ లోపల ఉండి ఆ జీవుల ఉనికికి ఆధారమై ఉండే భగవంతునే **"అంతర్యామి స్వరూపం"** అంటారు.

జీవునికి, అతడు ధరించిన దేహముకూడా అంతర్యామి అయిన భగవంతునికంటే దూరముదే అవుతుంది. అత్యంత సమీపంలో, అందుబాటులో ఉన్నది భగవత్స్వరూపమన్నమాట.

భగవంతుడు ఎంత సులభుడో దీనిని బట్టి తెలుస్తోంది. ఆతణ్ణి అందుకోడానికి ఎందరెందరో ఎన్నెన్నో సాధనాలు అవలంబిస్తూ ఉంటారు. ఎన్నెన్నో తీర్థాలు, క్షేత్రాలు దర్శిస్తూంటారు. ఆతణ్ణి అందుకోవడానికి ఇవేవీ కాదు చేయవలసినది! ఆ అంతర్యామితో దెబ్బలాడవద్దు. వివాదాలు పెట్టుకోకుండా ఉంటే చాలు. ఇంకేమీ అవసరం లేదంటారు ఋషులు.

**యమో వైవశ్వతో రాజా యస్తవైష హృదిస్థితః ।**
**తేనచేత్ అవివాదస్తే మా గంగాం మా కురూన్ గమః॥**

'సర్వప్రాణికోటినీ నియంత్రించేవాడు, జీవులందరినీ చైతన్యవంతులను చేసే సూర్యునికి కూడా లోపల ఉండి నడిపేవాడు, జీవకోటిని రంజింపచేసేవాడు అయిన సర్వేశ్వరుడు నీ హృదయములోనే స్థిరముగ ఉన్నాడు. ఆతనితో నీకు వివాదము లేనట్లైతే నీవు పవిత్రతకోసం గంగాది జలాల్లో మునగనక్కరలేదు. కురుక్షేత్రాది స్థలాలను దర్శించ పోనవసరం లేదు.

మనకీ భగవంతునికీ వివాదమేమీలేదే? అనిపిస్తుంది. కానీ, మనం స్వతంత్రుల మని ఆలోచించ ప్రారంభించామంటే ఆతనితో దెబ్బలాడుతున్నట్లే. ఈ ప్రపంచంలో ప్రతివస్తువూ భగవంతునికి చెందినదే. అలాంటి వస్తువులలో ఏవో కొన్నింటిని "నావి" అనుకొంటున్నామంటే, ఆతని వస్తువులను అపహరించడమే కదా! అది తగ్గాలి. తొలగాలి. అన్ని వస్తువుల్లో జీవులందరూ చివరికి నేనుగూడ, "నీవాడనే" నీ సేవకై నేను జీవించాలి. ఈ వస్తు జాతమంతా నీదియే" అనే భావన ఎంతెంతగా మన హృదయంలో నిండితే మనమాతని చెంత అంతంత నమ్రులమై మనగలుగుతాము. ఆతనితో చెలిమితో మెలుగుతున్నామని అర్థం.

అతి సమీపంలో హృదయాంతర్యామిగ భగవంతుడు జీవులందరిలోనూ ఉన్నాడు. 'అంతర్ యామి' అంటేనే లోపల ప్రవేశించి ఉండి శాసించువాడు. జీవులందరి లోపల ప్రవేశించి ఉండడం, వీని ఉనికిని నిలబెట్టి కర్మను కరిగించుకొనేట్లు నడిపించడం కోసమేనని 'అంతః ప్రవిష్టః శాస్తా జనానాగ్ సర్వాత్మా' అని యజుర్ వేదమంత్రం తెలుపుతోంది. అయినా, ఈ లోపలుండే స్వరూపాన్ని దర్శించ వీలయ్యేట్లు, మన ఇంద్రియాలు లేవు. 'పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః, తస్మాత్ పరాజ్ పశ్యతి నాంతరాత్మన్' పరమేశ్వరుడు ఇచ్చిన ఇంద్రియాల్లో పరాంచి=బయటి వస్తువులను గ్రహించగలిగేటట్లు ఉన్నాయి తప్ప, లోపలి తత్త్వాన్ని చూడలేవు. అందుకే మనకు అంతర్యామి తత్త్వం దర్శన స్పర్శనాదుల కేమాత్రమూ అందదు.

జీవులయందాలికే కరుణతో కదు చేరువకేతెంచి కనిపెట్టుకొని కూర్చున్నా, మనమా స్వామిని తెలుసుకోలేని వారమయ్యేసరికి భగవంతుడు మొదటి ప్రయత్నము అనుకున్న ఫలాన్ని ప్రసాదించలేదు. అప్పుడా భగవానుడైన ఆదినారాయణుడు మరొక స్థానాన్ని స్వీకరించాడు. 'పూర్ణం అదః' విశ్వమంతా వ్యాపించి ఉన్న స్వరూపమది. చరాచరాత్మకంగా ఉండే ఈ విశ్వాన్ని తన శరీరంగ చేసుకొని అన్నింటిని పట్టి తనలో ఉంచుకున్నాడు. దీనిని బహిర్వ్యాప్తి అంటారు. ఒక పాత్రనీటిని తనలో ఇముడ్చు కొని ధరించి ఉంచుకొన్నట్లు తనలో ఈ విశ్వాంతరాళాల నన్నింటినీ ఇముడ్చుకొని పట్టి ఉంచాడు. అణువై ఉండేవాడే ఇలా బృహత్‌గ ఉన్నా ఆయనలో ఏ లోటూ లేకుండా గతంలో మనం గుర్తించినట్లు స్వరూపంతో కానీ, ఆకార విశేషాలతోగాని, గుణములతోగాని తన సంపదలైన ఈ లోకాలతోగానీ నిండియే ఉండును. అందుచే ఆతడు 'పూర్ణు'డే.

సర్వత్ర వ్యాపించిన స్వరూపంతోపాటు, ఈ విశ్వానికావల ఉండే పరమపదంలో ఓ దివ్యమంగళ విగ్రహస్వరూపాన్ని ధరించి

కూడా, నిత్యముక్తగణ పరివేష్టితుడై, ఉంటాడట. ఈ రూపం ఆయనయొక్క బహిర్వ్యాప్తికి, పరత్వానికీ చిహ్నం. అయితే, అలా పరస్వరూపుడై ఉన్నా సేవించదలచిన ఇక్కడి జీవులకు అందదు. దర్శనాదులకు వీలుపడదు.

కనుక ఈ లోకంలోని ఉపాసకులకు, సేవించదలచిన భక్తులకు ఈ రెండవస్థానము కూడా ఉపయోగపడనిదే అయింది. దీనిని కారణ వైకుంఠం, లేదా కలంగా పేరునగర్' అంటారు ఆళ్వారులు. ఈ పరమపదము కలత చెందని దివ్యనగరమన్నారు. ఇచ్చటికి ఎవ్వరూ రాకపోకలు చేయలేరు. జగద్రచనా కార్యాన్ని కొనసాగించ దలచిన ఆ శ్రియఃపతి తన నిర్హేతుకమైన కరుణతో ఈ జీవులను అనుగ్రహించదలచి మరొక స్థానాన్ని ఏర్పరచుకున్నాడు. అదియే వ్యూహస్వరూపము.

పూర్ణాత్ పూర్ణం ఉదచ్యతే: పూర్ణుడైన పర వాసుదేవునినుండి వ్యూహ స్వరూపము ఏర్పడును. ఈ స్థానముగూడ స్వరూపరూప, గుణ, విభూతులతో పరిపూర్ణమైయ్యే ఉండును. ఈ స్థానాన్ని గురించి శ్రీపాంచరాత్రాగమమునకు చెందిన సంహితా గ్రంథాలు విపులంగ తెలియచేస్తున్నాయి.

వ్యూహ స్వరూపుడైన నారాయణుడు తనను జగత్తుయొక్క సృష్టి స్థితి లయములనే కార్యములను నిర్వహించడానికిగాను నాలుగు రూపాలుగ ఏర్పరచుకుంటాడు. అవి వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ స్వరూపములంటారు.

వీటిలో వ్యూహ వాసుదేవ స్వరూపమనేది కేంద్రముగ ఉంటుంది. ఇది ఉండేచోటును, కార్యవైకుంఠ'మంటారు. ఏ ఋషులో, చతుర్ముఖుడులాంటివారో, సనకసనందాదులో చేరేది ఈ చోటికి మాత్రమే. జయ, విజయులు శాపాదులు మొదలైన చరిత్రలు జరిగేది కూడా ఇక్కడే. విరజానది కావల కారణవైకుంఠ ముంటుంది. విరజానదికి ఈవల ఈ కార్యవైకుంఠము ప్రకాశిస్తూ ఉంటుంది.

ఇందులోంచి ప్రళయమనే కార్యాన్ని నిర్వహించడానికి స్వీకరించిన వ్యూహ స్వరూపాన్ని 'సంకర్షణు'డని పిలుస్తారు. ఈ స్థానానికి పేరు 'సమ్మోద' మంటారు. ఇక్కడ తన కళ్యాణగుణాలలో వీర్య, తేజస్సులనే గుణాలను ప్రధానంగ చేసుకొని, మిగిలిన గుణాలను వీటికి తోడు చేసుకొని జగత్తుయొక్క లయ కార్యాన్ని జరిపిస్తారు. ఈ వ్యూహ వాసుదేవుడి నుండే జగత్తుయొక్క సృష్టికార్యాన్ని జరపడానికని మరో రూపాన్ని ధరిస్తాడు. దానిని 'అనిరుద్ధ వ్యూహ' మంటారు. ఆ స్థానానికి పేరు "ఆమోదము". జ్ఞాన, శక్తులనే గుణాలను ముఖ్యంగ కలిగి ఉండి, మిగిలిన గుణాలును వీటికి తోడు చేసుకొని ఈ విశ్వసృష్టి కార్యాన్ని చక్కగ నిర్వహిస్తాడు.

అలానే, అదే వ్యూహకందమైన వాసుదేవుడినుండి ఈ జగత్తుయొక్క రక్షణకార్యం నిర్వహించడానికి మరో వ్యూహ మేర్పడింది. అది ప్రద్యుమ్నవ్యూహం. బల, ఐశ్వర్యములనే గుణములు ప్రధానముగానూ, మిగిలినవి వాటికి సహకార మందిస్తూ ఉండగ "ప్రమోద"మనే ఈ చోటునుండి ఆ శ్రియఃపతి రక్షణకార్యాన్ని ఇంద్రునిద్వారా నిర్వహిస్తూంటాడట.

ఇలా ఆరు ప్రధాన దివ్యగుణాలతో మూడుచోటులలో నుంచి జగత్సృష్టి, స్థితి లయాలు చేసే 'వ్యూహ' స్వరూపమిది. బ్రహ్మాదులకు, ఇక్కడకు వచ్చినా, ఆయన గొంతు వినడం తప్ప స్వరూపాన్ని చూడలేరట. ఇన్ని కార్యాలూ చేస్తూన్నా, ఉపాసన చేసే భక్తుల సౌకర్యార్థము వచ్చిన ఆయన ఈ వ్యూహ స్వరూపాలలో కూడ కనపడనంత దూరంలో, ఎత్తులో ఎక్కడో ఉండిపోయాడు. మనవంటి సామాన్యులకది ఉపయోగపడనే పడలేదు. అందుకే ఆ వ్యూహ స్వరూపంలో ఆయాకాలంలో ఆయా అవసరాలను, ప్రార్థనలను సఫలం చేయడానికి అన్నట్టు అసంఖ్యాకమైన అవతారాలను ధరిస్తూ ఉంటాడు. అందుకే వ్యూహస్వరూపాన్ని "అవతారకంద"మని అంటారు.

(ఇంకా ఉంది)

తొండరడిప్పొడి ఆళ్వార్ అనుగ్రహించిన




# తిరుప్పళ్ళియెళ్ళుచ్చి

శ్రీరంగనాథుని సుప్రభాత గీతిక

వైశారదీ

(గతసంచికతరువాయి...)

**అన్దర త్తమరర్‌గళ్ కూట్టంగ ళివైయో,**
**అరుం తవ మునివరుం మరుతరు మివరో,**
**ఇన్దిర నానైయుం తానుం వన్దివనో,**
**ఎంబెరుమాన్ ఉన కోయిలిన్ వాశల్,**
**శున్దరర్ నెరుక్క విచ్చాదరర్ నూక్క,**
**ఇయక్కరుం మయంగినర్ తిరువడి తొళ్ళువాన్,**
**అన్దరం పారిడమిల్లై మత్తిదువో,**
**అరంగత్తమ్మా! పళ్ళి ఎళ్ళున్దరుళాయే ॥ 7**

**అందరత్తు** = అండాంతర్వర్తులగు
**అమరర్‌గళ్** = దేవతలయొక్క
**కూట్టంగళ్** = గుంపులు
**ఇవైయో!** = ఇవిగో!
**అరుం** = దుర్లభమగు
**తవ** = తపస్సంపన్నులగు
**మునివరుం** = సనకాది మహర్షులును
**మరుదరుం ఇవరో** = 49 మరుత్ గణములును ఇవిగో
**ఎంబెరుమాన్** = ఓ మా స్వామీ!
**ఉన్ కోయిలిన్ వాశల్** = నీ గోపురపు వాకిట
**ఇందిరన్ తానుం** = ఇంద్రుడు గూడ
**ఆనైయుం** = తన ఐరావతముతో సహా
**వందు ఇవనో** = ఇదే వచ్చియున్నాడు!
**సుందరర్** = గంధర్వులు
**నెరుక్క** = క్రిక్కిరిసియుండగా
**విచ్చాదరర్** = విద్యాధరులును
**నూక్క** = త్రోయగా
**ఇయక్కరుం** = యక్షులున్నూ
**తిరువడి** = నీ శ్రీపాదములను
**తొళ్ళువాన్** = సేవించుటకు
**మయంగినర్** = మోహించి యున్నారు
**ఇదివో** = ఇదిగో!
**అన్దరం** = ఆకాశము నందు
**పార్** = భూమియందు
**మత్తు** = మరి ఎక్కడా
**ఇడం ఇల్లై** = స్థలం లేదు
**అరంగత్తమ్మా** = శ్రీరంగనాథా
**పళ్ళియెళ్ళున్దు** = శయ్యపైనుండి మేల్కాంచి
**అరుళాయే** = కృప చేయుమా!

***తా:*** ఇక పై లోకాల్లో ఉండే దేవజాతులన్నీ వచ్చి గర్వరహితులై ఇక్కడున్నాయి. కఠోర తపస్సంపన్నులైన సనకాది గణములొక ప్రక్క, మరుద్గణములొక ప్రక్క, అంతే కాదయ్యా! సపరివారంగ ఇంద్రుడు ఐరావతముతో దిగివచ్చి, ఇపుడే, రంగనాథా! నీ కోవెల వాకిట నిలిచినాడు. ఇక్కడిట్లుండగా స్వామీ! గాయకులగు గంధర్వులు కిక్కిరిసిరి. బలవంతులగు విద్యాధరులు త్రోసుకుంటున్నారు. ఈ హడావిడిలో సుకుమారులగు యక్షులు పాపం! స్మృతి కోల్పోవుచున్నారు. మనసులో నీ పాదసేవకై ఆత్రుత, బైట త్రొక్కిడి. ద్వారపాలకులకిక ఈ ప్రవాహాన్ని ఆపుట శక్యము కాదుసుమా! మన్నూమిన్నూ ఏకమైపోయాయి. వీరందరినీ ఇట్లు పరీక్షించుట తగునా స్వామీ! శయ్యాసనము విడిచి వేంచేసి కటాక్షించుము.

వంబవిళ్ వానవర్ వాయుఱై వఴఙ్గ,
మానితి కపిలై యొణ్ కణ్ణాడి ముతలా,
ఎంబెరుమాన్ పడిమైక్కలమ్ కాణ్డర్కు,
ఏఱ్పనవాయిన కొండు నన్ మునివర్,
తుంబురు నారదర్ పుకున్దన రివరో,
తోన్ఱినన్ ఇరవియుం తులంగొళి పరప్పి,
అంబర తలత్తిల్ నిన్ఱు అకల్కిన్ఱ తిరుళ్ పోయ్,
అరంగత్తమ్మా! పళ్ళి యెழுన్దరుళాయే ॥ 8

| | |
|---|---|
| వానవర్ వఴంగ | = దేవతలు,నీకు సమర్పించుటకై |
| అంబు అవిళ్ | = సువాసన వెదజల్లు |
| వాయుఱై | = గరికను |
| మా | = గొప్ప |
| నిధి | = శంఖ, పద్మాది నిధులను, |
| కపిలై | = కామధేనువును |
| ఒణ్ | = ప్రకాశించు |
| కణ్ణాడి ముదలా | = నిలువుటద్దము మొదలైనవి |
| ఎంబెరుమాన్! | = హే సర్వస్వామిన్! నీవు |
| కాండర్కు | = కటాక్షించుటకు |
| ఏర్పన వాయిన | = తగినట్టిదిగానుండు |
| పడిమైక్కలం | = ఉపకరణములన్నియు |
| కొండు | = తెచ్చి |
| నల్ మునివర్ | = అనన్య ప్రయోజనులగు ఋషులును |
| తుంబురు నారదర్ | = తుంబురులు,నారదులును |
| పుగున్దనర్ | = ప్రవేశించినారు. |
| ఇవరో | = ఇరుగో! |
| ఇరవియుం | = సూర్యుడును |
| తులంగు ఒళి ప్పరప్పి | = తన అధికతేజస్సునువ్యాపింపజేయుచు |
| తోన్ఱినన్ | = ఉదయించెను |
| ఇరుళ్ | = చీకటి |
| అంబర తలత్తిల్ నిన్ఱు | = ఆకాశమునుండి |
| పోయ్, అగల్ గిన్ఱదు | = పూర్తిగా తొలగిపోతున్నది. |
| అరంగత్తమ్మా | = శ్రీరంగనాథా! |
| పళ్ళియెழுన్దు | = శయ్యపైనుండి మేల్కాంచి |
| అరుళాయే | = కృప చేయుమా! |

*తా:* ఓహో! నిన్ను మేల్కొలుపు పరికరములు అన్నీ ఉంటేకాని లేవవు కాబోలు! అవునులే రంగరాజువి గదా! నిత్యయౌవనముతో పరిమళిస్తున్న ఈ దేవతలు నూతన దూర్వనుగైకొని, మాటల్లోనే, నీకై వచ్చేస్తున్నారు. అంతేగాదు, శంఖపద్మనిధులు విలువైన నవరత్నములతోపాటు కపిల గోవులు, చూచుకొను ఒక పెద్ద అద్దము, మిగిలిన పరికరాలు అన్నీ నీకు తగినట్లుగానే తెచ్చినారు తండ్రీ! నిత్య ముక్తుల నుండి గాయకసార్వభౌములగు తుంబురుడు, నారదుడు కూడ నీవు పడుకున్నపుడు జోలపాటపాడి నిద్రబుచ్చునట్లు, లేపునప్పుడున్నూ మంగళగీతముల ఆలాపనకై వేంచేసిరి. సూర్యకిరణములు బాగా వేడెక్కి అంతటా వ్యాపిస్తున్నాయి. ఇక చీకటి అసలు ఆకాశంలోనే లేదు. మరి శ్రీరంగధామా! నీవు కూడా లేచి మా అందరి లోపలి చీకట్లని పోగొట్టవద్దా! కైంకర్యమును స్వీకరించుటకు వేంచేయి తండ్రీ!
*(ఇంకా ఉంది)*

చిత్రకథ - 12

# రామానుజ చిత్రకథ


















మరి! ఎక్కడున్నాడు ఇప్పుడు


వరదరాజస్వామికి
తీర్థకైంకర్యమును
చేస్తున్నాడు.


రంగనాథా! ఇంతకాలానికి నామీద
దయ కలిగిందా స్వామీ!


మీరిద్దరూ కంచికి బయలుదేరండి.
రామానుజునికి వినిపించేట్లు వరదుని సన్నిధిలో
ఈ శ్లోకాన్ని చదువండి!
ఆపిల్లవాణ్ణి వీలైతే తీసుకురండి!




స్వాభావి కానవధి కాతిశయ యేశితృత్వం నారాయణ! త్వయి నమృష్యతి వైదికః కః
బ్రహ్మే శివశ్శతమఖః పరమస్వరాడితి ఏతేపి యస్య మహిమార్ణవ విపృషస్తే ॥


ఓ ద్విజోత్తములారా! మీరు చదువుతున్న ఈ స్తోత్రాన్ని వ్రాసినవారెవరు?ఎక్కడిదీ శ్లోకం? ఓ రత్నంలా ఉందిది!


సర్వశాస్త్రార్థ తత్వజ్ఞులు, తురీయాశ్రమానికే అలంకారభూతులూ అయిన శ్రీ యామునా చార్యులు వారు


అలాగా! ఎక్కడుంటారు వారు.


వారుశ్రీరంగ క్షేత్రంలో ఉంటారు. వయోవృద్ధులు


నేను వారిని కలవవచ్చా నాకు దర్శనమిస్తారా?


మాతో వస్తావా?


నాకు ఆ యతీశ్వరులను సేవించుకోవాలని ఉంది. శ్రీరంగానికి నన్ను తీసుకువెళ్తారా!


శ్రీరంగం చాలా దూరం కదా! మరి


ఎంతదూరమైనా సరే పరవాలేదు.


ఓ అలా అయితే సరే! మరి బయలుదేరుదాం. పదండి!


పదండి! భగవంతుని ఆజ్ఞను ప్రార్థిస్తాను.
(ఇంకా ఉంది)

# మన ఆళ్వార్లు



- శ్రీ నృసింహ -

ఆళ్వారుల, ఆచార్యుల పరంపరకి చెందిన మనం ధన్యులం. ఆళ్వారులు అంటే ఎవరు? భగవంతుని కళ్యాణ గుణాల్ని తలచుకొని, తలచుకొని తాదాత్మ్యం చెంది, ఆ గుణపరీవాహంలో తలమునుకలయిన ధన్యులే ఆళ్వారులు.

శ్రీవైకుంఠంలో సర్వకాలాలలో ఆ శ్రీమన్నారాయణునే దర్శిస్తూ, ఆనందసాగరంలో ఓలలాడే నిత్యసూరులే ఆళ్వార్లు.

శ్రియఃపతి ఈ సంసారంలో తేలియాడే బద్ధ జీవుల్ని కూడా తనవద్దకు చేర్చుకోవాలని ఎంతో శ్రమపడ్డాడు. వేదాలనిచ్చాడు. శాస్త్రాలని అనుగ్రహించాడు. శ్రీరామాయణ మహాభారతాది ఇతిహాసాలిచ్చాడు. శ్రీభాగవతాది పురాణాలు అందించాడు. అయితే మాత్రం వాటిని చదవడం, అర్థం చేసికొనడం, ఆచరించడం ఇవన్నీ ఈ జీవునికి సాధ్యాలా? వాటిని అర్థంచేసికొనకపోవడం సరిగదా! అపార్థాలు, అజ్ఞానాలు, అన్యథాజ్ఞానాలు, విపరీత జ్ఞానాలు.... ఇలా జీవితాన్ని వ్యర్థం చేసుకొనడమే పరమార్థంగా జీవకోటి సాగుతోంది.

పరమాత్మ అనంత, గరుడ, విష్వక్సేనాదులని, సుదర్శన, పాంచజన్య, కౌమోదకీ, నందక, శార్ఙ్గాది ఆయుధరూప భక్తుల్ని మీరు భూలోకానికి చేరి అక్కడి బద్ధులైన జీవకోటికి భక్తిమార్గంగురించి తెలియచేయండి! సమాజంలోని అసమానత లని తుడిచివెయ్యండి! భక్తిసామ్రాజ్యాన్ని పరిపాలించండి! అంటూ ఆజ్ఞాపించాడు.

వారు స్వామి ఆజ్ఞని తలదాల్చి ఈ భూలోకానికి విచ్చేసారు. కులాతీతమైన సాంఘిక స్థితికి పట్టంగట్టారు. భక్తి అంటే ప్రేమ అనే సిద్ధాంతాన్ని లోకమంతా వెదజల్లారు. వారే పన్నిద్దరు ఆళ్వార్లుగా ప్రసిద్ధికెక్కారు. అంటే పన్నెండు మంది అన్నమాట.

ఆళ్వార్లు పదిమంది అని ముందుగా పదిమందిని మాత్రమే చెప్పి, ఆ తరువాత ఇద్దరిని చేర్చి పన్నెండుమందిగా మన శ్రీవైష్ణవ సిద్ధాంతం చాటిచెప్పింది.

***వారెవరంటే!.....***

| | | |
|---|---|---|
| 1. | **పొయ్‌గై ఆళ్వార్** | **సరోయోగి** |
| 2. | **పూదత్తాళ్వార్** | **భూతయోగి** |
| 3. | **పేయాళ్వార్** | **మహాయోగి** |
| 4. | **తిరుమడిశై ఆళ్వార్** | **భక్తిసారులు** |
| 5. | **నమ్మాళ్వార్** | |
| 6. | **కులశేఖరాళ్వార్** | |
| 7. | **పెరియాళ్వార్** | **భట్టనాథులు (విష్ణుచిత్తులు)** |
| 8. | **తొండరడిప్పొడి యాళ్వార్** | **భక్తాంఘ్రిరేణువు** |
| 9. | **తిరుప్పాణి ఆళ్వార్** | |
| 10. | **తిరుమంగై ఆళ్వార్** | |
| 11. | **మధురకవి ఆళ్వార్** | |
| 12. | **గోదాదేవి** | |

ఇలా 12 మంది భాగవతోత్తములు, భక్తాగ్రగణ్యులు అయిన ఆళ్వార్లు సంతతిగా మన మెంత భాగ్యవంతులమో కదా! ఆమహనీయుల చరిత్రలని **"మన ఆళ్వార్లు"** శీర్షికగా మనకి అందిస్తోంది మన **భక్తినివేదన**. ఇక ఆలస్యమెందుకు! ముందుకు సాగుదాం! (సశేషం)

# పంచాంగ ప్రాశస్త్యము

**శ్రీమాన్ న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ**

పవిత్ర వైదిక సంప్రదాయం మనది. మన జీవితం ప్రతిక్షణం ఏది మంచి, ఏది చెడు అనే విషయాన్ని ఆధారంగా చేసికొని నడుస్తోంది. ఈ మంచి, చెడు అనేవి మన కెలా తెలుస్తాయి? వాటిని చక్కగా వివరించి చెప్పేదే పంచాంగము.

ఇందులో 5 విషయాలు స్పష్టంగా వివరంగా ఉంటాయి. ఇవి 1. తిథి, 2. వార, 3. నక్షత్ర, 4.కరణ, 5.యోగములు అనేవి. గ్రహ – నక్షత్ర గమనాదులతో మన జీవితాలు ముడిపడి ఉంటాయి గదా! అందుకే పంచాంగం గూర్చి మనకి తెలియాలి. ప్రతిరోజూ లేవగానే ఒక్కసారి పంచాంగం చూచుకొనే అలవాటు చేసికోవాలి. ఆ విశేషాలన్నీ మనకి తెలియాలి అంటే.....

శ్రీమాన్ తి॥న॥చ॥ సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతిగారు దైవజ్ఞ శిఖామణులు. జ్యోతిషరత్న బిరుదాంకితులు మన భక్తినివేదన పంచాంగ కర్త.

వీరు పంచాంగ విశేషాలను మనకు తెలియచేయడానికి అంగీకరించారు. ఒకొక్కనెలలో ఒకొక్కవిశేష విషయాన్ని గురించి తెలుసుకుందాం! పంచాంగ ప్రాశస్త్యాన్ని తెలుసుకోవడంతో మొదలు పెడదాం!

*జై శ్రీమన్నారాయణ!*

వేదము యొక్క పూర్వభాగము అంతయు కర్మాచరణమును విధించును. ఈ కర్మలు కాలవిశేషమును ఆశ్రయించి, అనుష్ఠింపతగినవి. కాలమును తెలిపేది జ్యోతిశ్శాస్త్రము.

కర్మార్హ కాల విశేషము జ్యోతిశ్చలనము వలన కలుగును. జ్యోతిస్సులనగా ఏమి? జ్యోతిస్సులనగా, సూర్యచంద్రులు. (బింబగ్రహములు) కుజాది పంచగ్రహములు (తారలు). మందోచ్ఛలు, విలోమగతి గల పాతలు. నక్షత్రములు ఈరకముగా అయిదువిధములుగా ఉండేటువంటి జ్యోతిస్సులచలనము వలన కాలవిశేషములు ఏర్పడుతూ ఉంటాయి. ఈ కాలవిశేషములు అయిదు లోకములకు సంబంధించి ఉంటాయి.

1. ప్రజాపతిలోకము, 2. బృహస్పతిలోకము, 3. దేవలోకము, 4. పితృలోకము, 5. మనుష్యలోకము. అందువల్ల ఈ మనుష్యలోకమున శాస్త్రోక్తకాలముల యందు అనుష్ఠింపతగిన యాగాది కర్మలందలి హవ్యకవ్యములు ఆయాలోకాలలో నివసిస్తున్న దేవతలకు సంక్రమించుట వలన మానవులకు ఇహపర సౌఖ్యములు లభించుచున్నవి. అందువలన ఇంతటి విషయ పంచకముతో ఒప్పుచున్నటువంటి పంచాంగమును చూడడము ప్రతివ్యక్తి యొక్క కర్తవ్యము. *(ఇంకా ఉంది)*

---

జై శ్రీమన్నారాయణ!

పరమహంస పరివ్రాజకులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి**

## 104వ తిరునక్షత్ర మహోత్సవ శుభాహ్వానము

**1.8.2012 నుండి 6.8.2012 వరకు**

**జీయర్‌స్వామివారి బృందావనం, నడిగడ్డపాలెం**

**ఈ మహోత్సవములో ప్రతిరోజూ వేద ఇతిహాస**
**దివ్యప్రబంధ పారాయణలు**
**వివిధ ఇష్టులు**
**రాత్రి వివిధ వాహన సేవలతో**
**అత్యంత వైభవముగ జరుగును.**

కావున భక్తులు ధన వస్తు రూపములలో తమ కైంకర్యములను సమర్పించి, ఆచార్య అనుగ్రహానికి పాత్రులు కాగలరు

వివరములకు : **శ్రీమదుభయవేదాంతాచార్య పీఠం**

**నడిగడ్డపాలెం - ఫోన్ : 08644 276 522, 08645 272929, 94410 65582**

---

### జూన్‌నెల మెదడుకి మేత! సమాధానములు

1.ప్రభాసుడు, భీష్ముడు; 2. ఇంద్రియసాపేక్ష జ్ఞానం లేనివాడు, ఇంద్రియనిగ్రహం కల మహానుభావులహృదయాలలో ఆవిర్భవించేవాడు; 3. భక్తిరూప, భగవంతుని; 4. పండువెన్నెల, పెద్ద అట్టులా; 5. గరుడముద్దలు; 6. పాదద్వంద్వము; 7. భువనకోశము; 8. కృతే చ ప్రతికర్తవ్యం; 9.స్థూలారుంధతీ న్యాయం; 10. మంత్రస్నానం; 11. సంపెంగపువ్వు, తేనెటీగ; 12. మరువియ; 13. కృతఘ్నులు, పశ్చాత్తాపం లేనివారు; 14. భగవంతుడు; 15. లక్ష్మణుడు; 16. మహాలక్ష్మి; 17 మంత్రస్నానం; 18.కంచివరదుడు; 19. శోకం; 20. స్థాలిత్యే శాసితారం; 21. తెలుపు, ఎరుపు, నీలి, నలుపు లేదా శ్వేత, రక్త, శ్యామల, కృష్ణ; 22.ప్రప; 23. సూర్యుని నుండి సేకరించే అగ్ని; 24. కర్మార్చా;25. భగవంతుని వరకు

---

## వంశీ

**పదకేళి - 1**

సమాధానములు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 శ్రీ | రా | 2 ము | డు | | 3 జా | 4 న | కి |
| ప | | ద | | 5 వ | | ల | |
| తి | | 6 లా | జ | లు | | 7 ద | 8 య |
| స్తు | | ళ్వా | | 9 వ | సు | మ | తి |
| తి | | ర్లు | | లు | | యం | |
| మా | | | 10 కు | | 11 సు | తు | డు |
| 12 ల | 13 వ | కు | శ | | 14 రు | లు | |
| | హ్నా | | | | చి | | 15 ఓం |

# నమో వ్యాసరూపాయ విష్ణవే

- సముద్రాల శఠగోపాచార్యులు, వరంగల్

**వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్**

**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్**

సత్యవతీ పరాశరులయొక్క పుత్రుడుగా అవతరించిన వ్యాసమహర్షికి కృష్ణద్వైపాయనుడు, బాదరాయణుడు, పారాశరుడు మొదలైన నామాంతరాలు కూడా ఉన్నాయి.

పరాశరుని పుత్రుడవడం వల్ల వ్యాసమహర్షికి పారాశరుడని, నీలవర్ణంలో యమునా ద్వీపంలో జన్మించడం వల్ల **కృష్ణద్వైపాయనుడ**ని వ్యవహారమేర్పడింది.

స్వతః ప్రమాణములైన అపౌరుషేయములైన, విశ్వవిజ్ఞాన ప్రదములైన వేదములను విభజించి వేదవ్యాస మహర్షిగా ప్రసిద్ధినొందినాడు.

**వ్యాసుడు - నారాయణుని అవతారమే :**

మత్స్యపురాణం: **యస్య ద్వైపాయనః పుత్రః స్వయం విష్ణురజాయత** అని తెలిపినట్లు వ్యాసమహర్షి సాక్షాత్తూ శ్రీమహావిష్ణువుయొక్క అంశావతారమే. మహాభారతంలో కూడా వైశంపాయన మహర్షి జనమేజయ మహారాజుతో...

**"నారాయణస్యాంశజమేకపుత్రం**

**ద్వైపాయనం వేద మహానిధానం"**

అంటూ వ్యాసమహర్షి నారాయణాంశతో జన్మించిన వాడని అభివర్ణించాడు. అందుకే మన పెద్దలు **వ్యాసస్తు భగవాన్ స్వయమ్** అని అంటారు.

బృహన్నారదీయం అనే గ్రంథంలోని–

**"వ్యాసో నారాయణః సాక్షాత్" "శ్రీహరిః వ్యాసరూపేణ జాయతే చ యుగే యుగే"** వంటి సూక్తులు వ్యాసుడు సాక్షాత్తూ శ్రీమన్నారాయణుని అవతారమే అని పేర్కొంటున్నాయి. శ్రీమద్భాగవతం శ్రీమహావిష్ణువుయొక్క ఇరవైఒక్కఅవతారాలను వర్ణిస్తూ ఆసందర్భంలో వ్యాసమహర్షిని శ్రీమహావిష్ణువుయొక్క పదిహేడవ అవతారంగా కీర్తించింది.

కృష్ణద్వైపాయనుడుగా ప్రఖ్యాతినొందిన వ్యాసమహర్షి సాక్షాత్తూ నారాయణుడే, అతడు నారాయణుడు కాకపోతే పంచమవేదమయిన మహాభారతాన్ని రచించి మనకు అందించ లేకపోయేవాడు అని.

**"కృష్ణద్వైపాయనం విద్ధి స్వయం నారాయణం ప్రభుమ్।**

**కోహ్యన్యః పుండరీకాక్షాత్ మహాభారత కృత్ భవేత్"॥**

అనే విష్ణుపురాణ శ్లోకం తెలుపుచున్నది. విష్ణుమూర్తితో వ్యాసునికి అభేదాన్ని భావిస్తూ **"వ్యాసాయ విష్ణురూపాయ, వ్యాసరూపాయ విష్ణవే"** అని అంటూ వ్యాసమహర్షికి ప్రణమిల్లే సందర్భంలోని శ్లోకాన్ని విష్ణుసహస్రనామస్తోత్ర ప్రారంభంలో మనం దర్శించవచ్చు.

వేదవిభాగాన్ని చేసిన వ్యాసమహర్షి వేదాంతాలైన ఉపనిషత్తులను ఆధారంగా చేసుకొని శ్రుతివాక్యాలను సమన్వయ పరుస్తూ బ్రహ్మసూత్రాలను రచించారు.

**అష్టాదశ పురాణ నిర్మాణము :**

సృష్టి, ప్రతిసృష్టి, వంశములు, మన్వంతరములు, పూర్వరాజుల కథ

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ। వంశాను చరితం చేతి పురాణం పంచలక్షణమ్॥** అను ఐదు లక్షణాలు కలిగిన 18 పురాణాలను వ్యాసుడు రచించి లోకానికి అందించెను.

**"పురా అపి నవం భజతే"** అనే నిర్వచనాన్ని అనుసరించి ప్రాచీనమైన విషయాలను నవీనమైన పద్ధతిలో పాఠకులు చదువుకునేట్లుగా, శ్రోతలు ఆసక్తితో కుతూహలంతో వినేట్లుగా ఆకర్షణీయమైన పద్ధతిలో కొనసాగే వ్యాసపురాణాలు పద్దెనిమిది

కలవు.

అవి –**మద్వయం భద్వయంచైవ బ్రత్రయం వచతుష్టయమ్।**

**అనాపలింగకూస్కాని పురాణాని ప్రచక్షతే॥**

1. మత్స్య, మార్కండేయ, భవిష్యత్, భాగవత, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, వామన, వాయు, వరాహ, విష్ణుధర్మోత్తర, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ స్కాందపురాణములు.

పురాణపఠనం వల్ల ధర్మాధర్మ పరిజ్ఞానం ఏర్పడుతుంది. భగవంతునిపట్ల భక్తి, సత్ప్రవర్తనలు అలవడుతాయి. విశ్వాసంతో పురాణాల పేర్లను ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం సమయాలలో పలికినా, పురాణవిషయాలను విన్నా, చదివినా పాపం నశిస్తుంది. పుణ్యం కలుగుతుంది. పరోపకారం, పుణ్యకరం, పరాపకారం పాపకరం హానికరం అనే జ్ఞానం అబ్బుతుంది. భారతదేశంలో పండితపామరభేదం లేకుండా, నగరవాసులు గ్రామీణులు అనే తేడా లేకుండా మనకంటే ముందుతరంవారి వరకు కూడా అందరికీ ఎన్నో ఎన్నెన్నో పౌరాణిక గాథలు తెలిసేయుండేవి. పౌరాణిక గాథలు మౌఖికంగా ఒకరినుండి మరొకరికి చేరుతూ విస్తృత ప్రచారాన్ని పొందుతూండేవి. నేటితరంలో మౌఖికమైన పౌరాణిక విషయాలను వంటపట్టించుకునే ధోరణి తగ్గిపోతున్నది.

**పురాణాలూ ప్రామాణికాలే :**

వేదసారాన్ని ప్రబోధించే ఇతిహాసాలకు పురాణాలకు **"ఇతిహాస పురాణంచ పంచమో వేద ఉచ్యతే"** అంటూ ప్రాచీనులు పంచమ వేదస్థాయిని (అంగీకరించారు) ఏర్పరిచారు. అంతే కాకుండా అల్పజ్ఞానం కల వ్యక్తి స్వరాది నియమాలను పాటించకుండా తనకు ఎటువంటి స్థితిని కలిగిస్తాడో అని వేదమాత భయకంపితురాలవుతుంది.

ఇతిహాసపురాణాల అధ్యయనము ద్వారానే ఆ వేదమాత భయం తొలగుట, వేదస్వరూపాన్ని స్పష్టంగా సమగ్రంగా గుర్తించుట, వేదార్థ విశదీకరణలు సంభవిస్తాయని–

**"బిభేత్యల్పశ్రుతాత్ వేదః మామయం ప్రహరేదితి।**

**ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్॥"**

అనే శ్లోకం ద్వారా తెలుస్తున్నది. అంతేకాక వివిధ చరిత్ర లకు ఆధార భూతమైనట్టివి పురాణములు. పూర్వరాజుల చరిత్ర, దేవతల చరిత్ర, పురాణేతిహాసాల్లో కన్పించే వివిధ వ్యక్తుల పూర్వ జన్మవృత్తాంతాలు తెలియుటకు, వైదిక గాథల పరస్పర సమన్వయానికి గొప్పగా ఉపకరించేవి కూడా పురాణములే. అందుకే ప్రాచీనమైన ఈ పురాణాలూ ప్రామాణికములే అని మన పెద్దల నిర్ణయము.

పురాణాలతో పాటు పంచమ వేదస్థానాన్ని ఆక్రమించిన, సర్వధర్మసముచ్చయ రూపమైన శ్రీమన్మహాభారతాన్ని కూడా వ్యాసమహర్షియే రచించినాడు. వ్యాసభారతంలోని విషయాలు సులభశైలిలో, రమ్యంగా హృదయాకర్షకంగా, వినసొంపుగా ఉన్నాయి. అందుకే మన తెలుగువారికి కూడా మహాభారత మంటే అధిక ప్రీతి.

ఈ విషయాన్నే **వింటే భారతమే వినాలి, తింటే గారెలే తినాలి** అనే మాట తెలుపుతున్నది.

వ్యాస మహాభారతం శ్రావ్యమైనదే కాక అమృతమయ మైనట్టిది. అట్టి మహాభారతాన్ని రచించిన వ్యాసమహర్షి ప్రాతః స్మరణీయుడు. అందుకే వ్యాసునికి నమస్కరిస్తున్నానని 'వేణీ సంహార' నాటక కర్త భట్టనారాయణుడు తన నాటకంలో–

**"శ్రవణాంజలి పుటపేయం విరచితవాన్ భారతాఖ్యమమృతం యః।**

**తమహమరాగమకృష్టం కృష్ణద్వైపాయనం వందే॥"**

అనే శ్లోకంలో పేర్కొన్నాడు.

ధర్మార్థ కామమోక్షాల గురించి, ధర్మ సూక్ష్మాలను గూర్చి క్షుణ్ణంగా తెలుసుకోవడానికి ఏకైక సాధనం భారతమే అనే విషయం వ్యాసమహర్షి యొక్క ప్రతిజ్ఞా పూర్వక వాక్యం ద్వారానే తెలుస్తున్నది.

మహాభారతంలో లేనిది మరెక్కడా లేదని, భారతంలో కనిపించే విషయాలే మనకు మరెక్కడైనా కనిపిస్తాయని వ్యాసమహర్షి –

**"ధర్మేచార్థేచ కామేచమోక్షేచ భరతర్షభ**

**యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచిత్** "అనే శ్లోకం ద్వారా ప్రకటించినాడు. కర్తవ్యాన్ని ప్రబోధించేది, ఉపనిషత్సారభూతమైన **శ్రీమద్భగవద్గీత**, ఇహపర సాధకమైన, **శ్రీ సహస్రనామస్తోత్రమ్** అనే రెండింటితో కూడి సర్వశ్రేష్ఠమై నదిగా నిలిచిన వ్యాసమహాభారతాన్ని విన్నా, చదివినా అనేకానేక శుభ ఫలితాలు కలుగుతాయని భారతంలోని ఆదిపర్వంలోనే అనేక సందర్భాలలో చెప్పబడింది.

అధిక జ్ఞానాన్ని, విస్తృత పాండిత్యాన్ని పొందినంత మాత్రాన

ఎవరిజీవితం కూడా ధన్యమైనట్లు కాదని, ఆచరణలో నిలిచే జ్ఞానమే నిజమైనదని, పెద్దల నుండి గురువులనుండి శాస్త్రగ్రంథాల నుండి తెలుసుకున్న దానిని ఆచరించినవాడే ధన్యజీవి అని వ్యాసమహర్షి కూడా–

**యస్తు క్రియావాన్ పురుష స్స విద్వాన్** – అనే శ్లోకపాదంతో పేర్కొన్నారు.

ఎవరైతే విద్యాభ్యాసం చేయరో, తపమాచరించరో దాన బుద్ధిని కలిగియుండరో, యుక్తాయుక్త విచక్షణాజ్ఞానపరులు కారో, సత్ ప్రవర్తనకు దూరమగుదురో, గుణహీనులై జీవించెదరో, ధర్మమార్గాన్ని అనుసరించరో, అటువంటివారు ఏ ప్రయోజనాన్ని సాధించలేకపోతూ, తమ ఉనికి కూడా భూమికి భారమయ్యేటట్లుగా జీవనాన్ని కొనసాగిస్తారు. ఇటువంటి వారిని మానవులుగా పరిగణించవీలులేదని వ్యాసమహర్షి–

**యేషాం న విద్యా న తపో న దానం- జ్ఞానం న శీలో న గుణో న ధర్మః।**

**తే మర్త్యలోకే భువి భార భూతాః మనుష్యరూపేణ మృగాశ్చరంతి**

అనేశ్లోకంలో ఉద్బోధించారు.

అధిక విలువ కలిగిన, చందనపు చెట్లను పొయ్యిలో వేసే కట్టెలవలె, అతిఖరీదైన అమిత ప్రకాశం కల్గిన జాతిరత్నాలను విలువలేని పలుగురాళ్ళవలె భావించడం ఎంతటి అవివేకమో, అట్లే సుదుర్లభమైన మానవజన్మను పొందినవారు తమ శక్తియుక్తులను గుర్తించక, అల్పమైన క్రిమికీటకాదులవలె చెదపురుగుల వలె జీవించడం సరికాదని కఠినమైన రీతిలో వ్యాసమహర్షి హితబోధ చేశారు.

తీసుకునే ఆహారాన్ని, కలిగియుండే రూపాన్ని, వేషభాష లను బట్టి మానవుడిగా నిర్ణయించడం సరికాదు. వివేకజ్ఞానం కలిగి మానవత్వ విలువలకు కట్టుబడి ఉండేవాడిని, శక్తివంతమైన మానవజన్మను చరితార్థం చేసుకోవడానికి శక్తివంచనలేకుండా సంపూర్ణంగా కృషి చేసేవాడినే మానవుడిగా వ్యవహరించాలి. పూర్వపుణ్యం వల్ల లభించిన మానవజన్మను తన శ్రేయస్సుకు వంశగౌరవానికి ఉపకరించేట్లుగా మలుచుకోవాలని మరొక సందర్భంలో వ్యాసమహర్షి, సన్మార్గ దర్శకులైన ఉత్తమోపాధ్యాయ పాత్రను పోషిస్తూ కర్తవ్యబోధ చేసినారు.

నారదమహర్షి అందించిన స్ఫూర్తితో వ్యాసమహర్షి శ్రీకృష్ణలీలామృతంగా చెప్పదగిన శ్రీమద్భాగవతాన్ని రచించాడు. ఇందులో వ్యాసుడు మోక్షసాధనము లైన భక్తి, జ్ఞాన వైరాగ్యాలను, తపస్సును గురించి మోక్షప్రాప్తిని గురించి వివరించాడు.

శ్రీకృష్ణుడు పరీక్షిత్తును రక్షించడం, పరీక్షిత్తుకు శృంగిమహర్షి శాపం, శాపగ్రస్తుడైన అతడికి శుకమహర్షి భాగవతాన్ని బోధించడం, భగవద్ భక్తి వైభవం, జయవిజయుల గాథ, హిరణ్యకశిపు హిరణ్యాక్షులజననం, హిరణ్యాక్షవధ, దక్షయజ్ఞం, ధ్రువ, పృథు, భరత అజామిళ ప్రహ్లాద, వామన చరిత్రలు, వృత్రాసురవధ, గజేంద్రమోక్షం, అంబరీష శమంతక కుచేలోపాఖ్యానాలు, శ్రీకృష్ణజననం, శ్రీకృష్ణలీలలు, రుక్మిణీ కళ్యాణం, మార్కండేయుడు భగవంతుడి మహిమను దర్శించడంవంటి విశేషాలను శ్రీమద్భాగవత రూపంలో వ్యాసమహర్షి లోకానికి అందించాడు.

వ్యాసమహర్షి భారతము అను తైలముతో జ్ఞానమనే ప్రదీపాన్ని వెలిగించి మన అజ్ఞానాంధకారాన్ని తొలగించుటకు అవతరించిన గురుమూర్తి. ఆయన బ్రహ్మజ్ఞాననిధియగు వశిష్ఠ వంశోద్భవుడు, విష్ణు స్వరూపుడు. ప్రాతఃస్మరణీయుడు కూడా.

**నమోస్తుతే వ్యాసవిశాలబుద్ధే! ఫుల్లార విందాయత పద్మనేత్ర।**

**యేన త్వయా భారత తైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః॥**

విస్తృతవాఙ్మయ రచన ద్వారా కర్తవ్యోపదేశం చేయడం ద్వారా సర్వప్రాణి హితైషులై మార్గదర్శకత్వాన్ని వహించడం ద్వారా, విశ్వశ్రేయస్సును కాంక్షించి, భక్తిని, ముక్తిని ప్రసాదించు రచనల ద్వారా ప్రాతఃస్మరణీయులై నిలిచిన వ్యాసమహర్షి అందించిన సదుపదేశాలను శిరసావహిద్దాం. ఆచరణలో పెట్టుకుందాం. అప్పుడే మనం వ్యాసభగవానుడు అవతరించిన ఆషాఢపౌర్ణమిని గురుపూర్ణిమగా ఒక మహోత్సవంగా ప్రతి సంవత్సరం చేసుకోవడంలో ఔచిత్యం ఉంటుంది. మన ఋషులు, పెద్దలు, గురువులు అందించే జ్ఞానాన్ని మనం అందుకోవడమే కాకుండా, మనం మన తరువాతి తరాలకు కూడా అందించినప్పుడే మనం మూడు ఋణాల్లో ఒకటైన ఋషి ఋణాన్ని తీర్చుకున్న వారలం అవుతాము.

**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే।**

**నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః॥**

***వందే గురు పరంపరామ్***

# ముఖచిత్ర పరిచయం :

జూలై 31వ తేదీ శ్రీవరాహపెరుమాళ్ జయంతి. శ్రీమన్నారాయణుని దశావతారములలో మూడవ అవతారం వరాహరూపం. ముట్టె, కోరలు, నీటిలో మునిగిన వస్తువుని సులభంగా పైకి నిలబెట్ట గలవని ఆరూపాన్ని ఎన్నుకొన్నాడు స్వామి.

అలనాడు హిరణ్యాక్షుడు భూదేవిని అపహరించి సముద్రంలో ప్రవేశించినపుడు భూపరిరక్షణ, ఉద్ధరణకోసం స్వామి ధరించిన అవతారమే శ్రీవరాహావతారం.

ఘుర్ఘుర శబ్దంతో, చక్కటి కిటి రూపంతో భూదేవిని ఉద్ధరించిన స్వామిని మనం సందర్శిస్తున్నాం! ఈ అవతారంలోనే భూమాతకి స్వామి తన భక్తరక్షణ పరాయణత్వాని వివరించిన చరమశ్లోకాలు ప్రసిద్ధాలు.

*వరాహ చరమశ్లోకము*

**స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః ।**
**ధాతు సామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మామజమ్ ॥**
**తతస్తం మ్రియమాణం తు కాష్ఠపాషాణ సన్నిభమ్ ।**
**అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్ ॥**

మానవుడు మంచి ఆరోగ్యవంతుడై ఉన్న సమయంలో నన్ను స్మరించాలి. శరీరం అనుకూలించే సమయంలో నన్ను ధ్యానించే నా భక్తుడు, తన శరీరం వశంతప్పి, ప్రాణం శరీరాన్ని విడచిపెట్టి వెళ్ళిపోయే స్థితిలో ఉంటే, నేనుమాత్రం అతనిని విడిచిపెట్టను. ఆ స్థితిలో ఉన్న భక్తుని నేను తలచుకొని, ఆహా! శక్తి ఉన్నప్పుడు నన్ను కొలిచాడే అని భావించి, పరమపదానికి స్వయంగా తీసుకొని వెడతాను అని భూమాతతో వరాహస్వామి పలుకుచున్న సందర్భమే ఇది.



**చక్కటి కిటి రూపమెత్తి,**
**వేడ్కతో భూరమణి నెత్తి,**
**దంష్ట్రాగ్రమునందు నిలుపు,**
**దయామూర్తి నీవయా ।**

**మహావరాహో గోవిందః సుషేణః కనకాంగదీ ।** (శ్రీవిష్ణుసహస్రనామం)

ఔను. ఆస్వామిని చూడండి. ఆ కడలి ఉత్తుంగ తరంగాల మధ్య హిరణ్యాక్షుని వధించి, భూమాతను తన కోరలపై నిలిపి, కనక పీతాంబరధారి ధగధగా మెరిసిపోతున్నాడు. ఆ దయామూర్తిని స్మరిద్దాం! మనలని కూడా ఈ సంసార జలధి నుండి అలాగే, ఉద్ధరించి కాపాడతాడని నిరూపిస్తున్న దృశ్యం ఇది. భూ రమణి ఆనందం– ఆమె ఉద్ధరణలో స్వామి హృదయానందాన్ని ఈ దృశ్యంలో వీక్షిస్తున్నాం!

---

# 2. పదకేళి - వంశీ

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | | | 3 | | 4 |
| | | | 5 | | | 6 | | |
| 7 | | | | | | 8 | | |
| | | 9 | | | 10 | | | |
| 11 | | 12 | | | | | 13 | 14 |
| | | | | | | | | 15 |
| 16 | | | 17 | | | | | |

**నిలువు:**

1. గ్రహాల లాగే ఈ తిరుపతులు
2. ఉభయ విభూతులు గ్రహించి క్రింద నుంచి వచ్చారు
3. పూర్వం వెండి నాణెం
4. ఈయన పట్టాడా.......ఏడేళ్ళు
6. శ్రీ కృష్ణుడు ఈ అంతకు దంటారు
10. వద్దు వద్దు అని వికసించేది
13. ..........బెదురు ఈ రెండూ లేవంటారు
14. మౌనం పాటించే వారు

**అడ్డము**

1. మన ఆళ్వారు
5. మనవాళ మామునులే
7. యతీశ్వరులు అటునుంచి ఇటువచ్చారు
8. మెడలో ధరించేదే పూర్తికాలేదు
9. వెదురు చెరుకు కూడా పొడుగ్గా ఉంటే ఇలా అంటారు
11. పత్నికి ప్రత్యక్ష దైవం
12. జందెం వేసే వైదిక ఉత్సవం
15. అంతం పోయి తిరగబడిన ఫాలం
16. ఇంగ్లీషులో"చూపే"సంస్కృతంలో లోపం
17. ముకుందుని మాలను మనకు అందించినవారు

# శ్రీపతి - భేషజం - భిషక్- హోమియోపతి

- నృసింహ -

## ముందుమాట

అనంతప్రాణికోటిలో మానవజన్మ అద్భుతమైనది. ఆ శ్రీమన్నారాయణుడు, జీవకోటి ఈ సంసారసముద్రంలో విలవిలలాడడం చూచి, కృపాళువై ఎంతో విలువైన దేహ సంపదను అనుగ్రహించాడు. ఈ శరీరాన్ని భగవత్ సేవకే అంకితం చేయ్యాలి. ఇది మనిషి భగవంతుని ఎడల చూపవలసిన కృతజ్ఞత.

'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్' అన్నారు పెద్దలు. ఏ పని చెయ్యాలన్నా, ఈ శరీరం సహకరించవలసినదే. శరీరస్థితి బాగుంటేనే మనస్సు కూడా మన మాట వింటుంది. కాబట్టి శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుకోవాలి. అయితే దేశ, కాల పరిస్థితులను బట్టి ఆరోగ్యం అటు ఇటు ఔతూ ఉంటుంది. దాన్ని నియమించడం కోసం ఎన్నో వైద్యవిధానాలు పెద్దలు మనకి అందించారు. అందులో **హోమియోపతి** వైద్యవిధానం ఒకటి.

మానసిక లక్షణాలను ప్రధానంగా చేసికొని శరీరానికి అందించే ఈ వైద్యవిధానం పసివారినుండి ముసలివారి వరకు అందరిని అలరింపచేసే విధానం. ఎందుకంటే, మాత్రలు వేసుకొనడం తేలిక. ఇది సామాన్యలాభం. ఇంత కంటే అసామాన్యములైన లాభాలెన్నో ఉన్నాయి ఇందులో. మూల శారీరక ధర్మాలని కూడా మార్చగలిగిన అద్భుత వైద్య విధానం ఇది.

శ్రీమాన్ డా॥ జి. రామారావుగారు అనుభవజ్ఞులైన హోమియో వైద్యులు. భగవత్ శక్తిని, వైద్యశక్తిని మేళవించి, రోగాలనుండి ఎందరికో విముక్తిని ప్రసాదిస్తున్న ఉపకారకులు. వైద్యంతో పాటు ఆ వైద్యవిధానంలోని విశిష్టతని మన భక్తినివేదన పాఠకులకు అందించాలనే ఒక తపనతో వారి వ్యాసాలను ఈ నెలనుంచి పరిచయం చేస్తోంది 'మన **భక్తినివేదన**'.

ఆ విశేషాలను తెలుసుకొని, ఆ వైద్యవిధానాలను అలవరచుకొని, మరింత ఆరోగ్యవంతులమై భగవత్ భాగవత సేవలో ముందుకు సాగుదాం!

# మదర్ టించర్స్

- డా॥ జి. రామారావు

హిప్పొక్రటిస్ నుండి హనీమన్ వరకు వైద్యశాస్త్రం దాని తీరుతెన్నులు మందుల వాడకం, కాలగమనములో గడియారము లోని లోలకమువలె అటునిటు ఊగిసలాడు చున్నది. మనిషి ఒక యంత్రము వలెనో లేక ప్రయోగశాలలోని పరీక్ష నాళిక వలెనో ఉపయోగించబడుచున్నది. జీవము ఉన్న మనిషిని అలక్ష్యము చేసినది. మనిషిని స్వస్థతపరచుటలో నైపుణ్యము కరువైనది.

శాస్త్రజ్ఞులతోపాటు మందుల సంఖ్య పెరుగుచున్నది. మందుల తయారీలో పోటీ ఏర్పడినది, వాణిజ్యము, ఆర్థిక బలము ప్రముఖ పాత్ర వహించుచున్నది. మనుష్యుల ఆరోగ్యమునకు హానికరమైన పరిస్థితులు దాపురించినవి. ప్రతి మందుకు వ్యాధిని ఉపశమింపజేయు గుణముతో పాటు కొన్ని దుష్ఫలితములు ఉత్పన్నము చేయుటవలన ఆరోగ్యమునకు కీడు జరుగుచున్నది.

సింకోనా బెరడు కషాయం త్రాగుట చేతనే హానిమన్ శరీరంలో మలేరియా జ్వర లక్షణములు వచ్చినవి. చైనా అను మందు కనుగొనబడినది. అది హోమియో వైద్య విధానమునకు మూలం అయినది. వైద్యశాస్త్రము కొత్తపుంతలు త్రొక్కినది.

ఆకులపసరులు, కషాయములు భారతదేశ, పురాతన వైద్యవిధానమున నరజాతికి విస్తృతమైన సేవలు చేసినవి. సమస్య ఎక్కడ ఉండునో పరిష్కారం కూడా అక్కడే ఉండును. ఒక ప్రాంతమందుగల వ్యాధి నివారణ చేసే ఔషధం, ఆ ప్రాంతమందే ఉండును, అది తెలుసుకొనుటకు శాస్త్రీయ పరిశోధన అవసరము ఒక మందు ఆరోగ్యవంతుని ఎట్టి లక్షణములు కల్గించునో అట్టి లక్షణములు గల ఏ వ్యాధినైననూ ఆ మందు కుదుర్చును. హోమియో వైద్యవిధానమున పోలీక్రెస్టులు అనగా సంపూర్ణముగా పరిశోధింపబడిన ఔషధములు విజయవంతమైన విధముగా మిగిలిన ఔషధముల ఫలితములను ఊహించుట కష్టము కానీ అనుభవంతో కొందరు హోమియో వైద్యులు హిందూదేశ **మూలికల రసమును తగిన సమయంలో గ్రహించి వాటిని ఆల్కహాలులో నిల్వచేయగలిగి మదర్ టించర్స్ అను నామముతో చాలా కేసులు కుదిర్చి రోగులకు మేలుచేయుచున్నారు**. పాశ్చాత్యులు కూడా మదర్ టించర్స్ తయారు చేయుటలో ముందడుగు వేయుచున్నారు.

ఈ మదర్ టించర్స్వ్యాధిని ముదరనీయవు. కొంత లేక పూర్తి స్వస్థతను ఇచ్చునట్లు తెలియుచున్నది. దీర్ఘవ్యాధుల నివారణలో ఎంతో ఉపయోగముగా కన్పట్టుచున్నవి. తరుణవ్యాధులలో అద్భుతమైన ఫలితములు ఇచ్చుచున్నది. కనుక ముఖ్యముగ ప్రతి తల్లి ఈ మదర్ టించర్స్ గూర్చి తెలుసుకొని తమ బిడ్డల ఆరోగ్యమును కాపాడుకొనవలసి ఉన్నది.

తల్లులే ముఖ్యము అని చెప్పుటకు కారణం ఉంది, ఒక తల్లి, విరోచనము వ్యాధితో బాధపడు కుమారునికి వాని చిన్నతనమున నల్లమందు వాడి కుదిర్చెను. క్రమముగా అది వానికి అలవాటు అయ్యెను. నల్లమందు వాడనిదే అతనికి రోజు నడవదు. అతడు పెద్ద అయిన తర్వాత ఆరు నెలలు వయస్సు గల్గిన తనకుమారునకు విరోచనములు గల్గినపుడు తాను అలవాటు పడ్డ నల్లమందును వాడెను, బిడ్డ చనిపోయెను. ఆయన కూడా నల్లమందు వాడుక వల్ల వచ్చిన జలోదర వ్యాధితో నడి వయస్సున కన్నుమూసెను.

ఒక తల్లి పసిబిడ్డ అయిన తన కుమార్తె కళ్ళలో కండ్లకలక వ్యాధి తగ్గించుటకు, ఎవరు చెప్పిరో జిల్లేడు పాలు పోసెను. పిల్లగ్రుడ్డిదాయెను. కామెర్ల వ్యాధి వచ్చిన తన బిడ్డకు ఎవరు ఇచ్చిరో, ఏదో ఒక రసమును నోటిలో పోసి చంపుకొనెను. ఇట్లు ఎన్నో ఉదాహరణములున్నవి అందువల్ల ప్రతి తల్లి బిడ్డల ఆరోగ్యమును మెరుగుపరచుటకు ఏదో ఒక మందుగాక వైద్యుని సలహాని పాటించవలెను మదర్ టించర్స్ వారికి ప్రథమ చికిత్సవలె తోడ్పడును.

### శరీర పోషకములు

## 1. ఆల్ఫాల్ఫా (Alfafa)

ఆల్ఫాల్ఫా వివిధ వాతావరణములో ప్రపంచ వ్యాప్తంగా పెరుగును, మూడ అడుగుల ఎత్తు వరకు పెరుగు ఈ మొక్క వంగ (Violet) రంగు పూలు పూసే సమయంలో దీని రసమును గ్రహించి ఆల్కాహాలు కలిపి మదర్ టించర్ గా తయారుచేయుదురు.

ఆల్ఫాల్ఫా కొన్ని వేల సంవత్సరములుగ చైనాదేశంలో కిడ్నీలలోని రాళ్ళను బహిర్గతపరచుటకు వాడుచున్నారు. మొట్టమొదట అరబ్‌లు దీనిని కనుగొనిరి, వారు ఈ మొక్కను "ఫాదర్ ఆఫ్ ఆల్ ఫుడ్స్" అని పిలిచేవారు. వారు ఈ మొక్కలను వారి గుర్రముల ఆహారంగా పెట్టేవారు. అవి శీఘ్రంగా ఆరోగ్యంగా పెరిగెడివి. ఆల్ఫాల్ఫా ఆకులు అధిక లవణములు, పోషక విలువలను కలిగియున్నది. దీనిలో కాల్షియం, మెగ్నీషియం, పొటాషియం, కెరోటిన్ మొదలుగునవి ఉన్నవి. ప్రొటీన్‌లు, విటమిన్-ఇ, విటమిన్-కె మెండుగా ఉన్నవి. క్లోరోఫిల్ మరియు కెరోటిన్ కలిగిన ఆహార పదార్థములు తయారు చేయుటలో ఆల్ఫాల్ఫా రసమును పయోగించు చున్నారు. వీటి ఆకులలో ఎనిమిది ముఖ్యమైన ఎమైనో ఏసిడ్స్ ఉన్నవి. వీటివల్ల ప్రొటీన్స్, పెప్‌టీన్స్ ఏర్పడుచున్నవి. ఆల్ఫాల్ఫా విరోచనము అగునట్లు చేయు మందుగా మరియు సహజమైన మూత్రము అధికముగా అగునట్లు చేయుదగు ఔషధము. మూత్రనాళములు, కిడ్నీలు, మూత్రాశయము మరియు ప్రొస్టేట్ గ్రంధి వ్యాధిగ్రస్తమైనపుడు చేయు వైద్యములో ఆల్ఫాల్ఫా తోడ్పడును.

శరీర భాగములందు ముఖ్యమైన జీర్ణాశయము, కాలేయము మొదలగు ప్రధాన అవయములందు ఆమ్లములు హెచ్చినప్పుడు, విషపూరితము అగునపుడు క్షారతత్వమును పెంచి ఆమ్లములను తటస్థీకరణ మొనర్చును.

పిట్యుటరీగ్లాండ్ శరీరంలో వినాళగ్రంధులలో రాజు వంటిది. ఇది మెదడు అడుగు భాగములోనుండును. ఇందలి ముందు భాగమున శరీరంలోని ఇతర వినాళ గ్రంధులపై పనిచేయు అనేక హార్మోనులను ఉత్పత్తి చేయును. వెనుక భాగము పిట్యుట్రిన్ అను హార్మోనును ఉత్పత్తి చేయును. పిట్యుట్రిన్ గర్భకోశము యొక్క ప్రేగులయొక్క కండరములను సంకోచింపచేయును. రక్తపు పోటును హెచ్చించును. మూత్రోత్పత్తిని తగ్గించును. ఆల్ఫాల్ఫా, పిట్యుటరీగ్లాండ్ సూక్ష్మజీవుల బారిపడి వ్యాధి గ్రస్తమైనపుడు దానిని స్వస్థతపరచి ఏంటీ ఫంగస్ ఏంజంట్‌గా ఉపయోగపడును.

క్రొవ్వు కణాలతో కూడిన సంధాయక ధాతువుల నిర్మాణములో ఆల్ఫాల్ఫా ఉపయోగం. పాండురోగము (Anaemia) అంటే రక్తములో ఎర్రరక్తకణాలు తక్కువై చర్మము పాలిపోవుట, ఆయాసము, గుండెదడ, శక్తిహీనత, అలసట మొదలగు లక్షణములుగలుగును. క్లోరోసిన్‌ను గ్రీన్‌సిక్‌నెస్ అని కూడా అంటారు. ఒక రకమైన రక్తక్షీణత యువతులలోఉండును. ఋతుక్రమములో తేడాలుండును, ఆకలి, జీర్ణశక్తి క్షీణించి నీరశించి పోవుదురు.

మెరాస్‌మస్ (Marasmvs) శిశువులు ఆహారం వంటపట్టక క్రమేపి శుష్కించిపోవుదురు. శరీరభాగములు పెరుగుదల సక్రమముగా ఉండదు. ధాతువుల నిర్మాణలోపము, నిరుపయోగము కారణమయిఉండును. ఈ స్థితిలో ఆల్ఫాల్ఫా ఉపయోగపడును.

తరుణవ్యాధి తర్వాత గాని, దీర్ఘవ్యాధులలో ఎన్నిక చేయబడిన పోలీక్రెస్టులైన ఔషధముల ఉపయోగించుటతో పాటు గాని, శస్త్రచికిత్సల అనంతరముగాని ఆరోగ్యము చేకూరువరకు ఆల్ఫాల్ఫా మదర్‌టించర్స్ తీసుకొనుట మంచిది.

ప్రస్తుతకాలంలో ఆహారపు అలవాట్లు అన్ని వయస్సుల వారిలోనూ సక్రమముగా లేదు. తల్లి ఉద్యోగస్తురాలు అగుటచేత,

పిల్లలు ఎక్కువ గంటలు పాఠశాలలో ఉండుటవలనను, వారికి మంచిఆహారము లభించుట లేదు. పైగా చాక్లెట్లు, బిస్కెట్లు, జంక్‌ఫుడ్స్ ఎక్కువగా తినుటవలన వారి ఆరోగ్యము నానాటికి పాడగుచున్నది.

యువతులు ముఖ్యంగా (Obesity) క్రొవ్వుఅధికంగా ఉన్న ఊబకాయము వచ్చునన్న భయముతో ఆహార స్వీకరణలో తమకు తోచిన విధంగా ఆంక్షలు పెట్టుకొనుచున్నారు. పోషక ఆహారపు విలువలు కల్గిన ఆహారమును వదిలివేసి మలినమైన ఆహారాన్ని స్వీకరించుచున్నారు. సహజ సిద్ధమైన ఋతుక్రమమును అలోపతీ మాత్రల ద్వారా తమకు తగినట్లుగా మార్చుకొనుచున్నారు, క్రమముగా వీరు క్లోరోసిస్ బాధపీడుతులు అగుచున్నారు. పొత్తికడుపు బాధలను కొనితెచ్చుకుంటున్నారు. వాయువు పొంగరించుట, ప్రేగులలో నొప్పి, విరోచన బద్ధకము లేక విరోచనములు, ఎప్పెండిసైటిస్ అను క్రిమికవ్యాధి, నీరసం, నిస్త్రాణ, నిద్రలేమి మొదలైన బాధలు పడుతున్నారు.

పురుషులు ఉద్యోగరీత్యా సమయమునకు ఆహారం తీసుకోకుండా అధిక దాహము, వాయువుతో కడుపు ఉబ్బరించుట, అధిక నీరసము మొదలగు వ్యాధులతో బాధపడుతున్నారు. సాయంత్రం అగువరకే వీరి బాధలు పెరుగుట ప్రారంభించి నిద్రలేక ఉసూరుమనుచున్నారు.

వృద్ధులు జీర్ణావయవ బాధలతోనూ, మలబద్ధకముతోటీ, ప్రోస్టేట్ గ్రంధి వాపుతోటి, అతిమూత్ర వ్యాధితోటి వయస్సు ముదురుకొద్దీ నీరసపడి, కదలలేని స్థితిలోకి పోవుచున్నారు. వీరందరికీ మదర్‌టించర్ ఎక్కువ ఉపయోగింపబడును.

గర్భవతులకు రక్తాభివృద్ధి, తల్లులకు స్తన్యమును వృద్ధి చేయును. బాలింతులు ప్రసవమైన వెంటనే ఆల్ఫాల్ఫా మదర్ టించర్‌ను 20 చుక్కల చొప్పున పావుకప్పు నీళ్ళలో ప్రతి ఆరు గంటలకు అంటే రోజుకు 4 సార్లు త్రాగినచో తల్లిపాలు వృద్ధి చెందును. మిగిలిన వారు 10 చుక్కలు ఉదయము, సాయంత్రము పావుకప్పు నీటిలో స్వీకరించిన స్వస్థత చేకూరును.

వచ్చేనెల **అవీనా సెతీవా** (AVENA SATIVA) గురించి తెలుసుకుందాం!

(ఇంకా ఉంది)



రాయల ఊహల పల్లకీ....

# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

వేసవిని మలయమారుతం నామమాత్రావశిష్టం అయింది. కనపడని మలయమారుతాన్ని విసనకర్రలు ఏదో ఇంద్రజాలం చేసి తెచ్చి చూపిస్తున్నాయి. అది గారడీమాయ. అసలు నిజానికి మలయానిలం ఎక్కడుంది? లేనిదాన్ని ఇంద్రజాలంతోనే ఉన్నట్టు చూపిస్తారు. అది ఇంద్రజాలమే అనడానికి ఆ విసనకట్టలలో నెమలిపురుల కదలికలే సాక్షి. ఇంద్రజాలానికి నెమలిపురి సాధనం కనుక ఇక్కడి విసనకట్టల్లో ఉన్న నెమలిపురుల వల్ల ఏదో ఇంద్రజాలం చేసి మలయానిలం ఉన్నట్టు అనిపింప చేస్తున్నారు. కానీ, నిజానికి అది లేదు.

అట్లాంటి వేసవిలో బెట్టిదమైన వేడిచేత చేయిచెమర్చి మాటి మాటికీ వింటి పిడికట్టు జారిపోతున్నందువల్లనే సవరించు కోవడానికి శక్యంకాక మన్మథుని చెరకువిల్లు కిందపడిపోతోంది.

వేసవుల్లో బావుల్లో నీరు లోతులకు పోతుంది. సూర్యుడి ధాటికి తాళలేక పాతాళగుహల్లో దాక్కొన్నాయి నీళ్ళు. పైకి రావడానికి ఇష్టపడ్డంలేదు. యువతులు నూతిగట్టు మీదనుంచి వంగి చేదకు తాడుకట్టి తోడుతున్నారు. అందుకోసం ఒక తాడు చాలక రెండుమూడు తాళ్ళు అతుకులు వేసి మరీ చేదకు కడతారు. ఎంతో పొడుగాటి తాళ్ళతో చాలాసేపు తోడితేకానీ నీళ్ళు పైకి రావడం లేదు. ఇది ఎలా ఉంది? ఈ యువతులు నూతిగట్టుమీద వంగినప్పుడువారి చనుకట్టు నీళ్ళకు కనిపించింది. దాని చల్లదనం చూసేటప్పటికి వాటికి ఇదేదో మనకోవలోదిలాగుంది అనుకున్నాయి. ఒక పిట్టను పట్టుకోవాల్సిన వచ్చినప్పుడు అల్లాటి మరోపిట్టను చూపిస్తే ఇదీ మనజాతిదే అన్న భావంతో ఆవలిపిట్ట దాని దగ్గరకు వస్తుంది. అప్పుడు దాన్ని పట్టుకుంటారు. అట్లాగే నీరు చేదడానికి గట్టుపై వంటిన తరుణుల చనుకట్టు చలువలు ఆకర్షించినందువల్ల పాతాళంలో దాక్కున్న నీళ్ళు పైకి వచ్చేయి. కానీ ఈ అతుకుల తాళ్ళా వాటిని తెచ్చేది అని జనం అనుకొని పైకి వచ్చిన నీళ్ళను చూసి సంతోషడుతున్నారు.

మల్లెలూ పాటలాలూ కూడా వేసవిలో పూస్తాయి. ఆ కాలంలో వచ్చే పువ్వులు కనక, స్త్రీలు మల్లెల్నీ పాటవాల్నీ కూడా కొప్పుల్లో పెట్టుకుంటారు. అయితే మల్లెలు తాము పుట్టిన వేసవిలాగే వేడి కలవి కావడాన స్త్రీలు నెరికురుల చివరలను పాయలుగా చీలుస్తాయి. పాటలాల మనసు మంచిది. తాము పుట్టిందీ ఆ వేసవిలోనే అయినా, చల్లని మనసుతో తమనుండి జాలువారు తేనెసోనలచేత ఆ చీలికలను మళ్ళీ కలుపుతాయి. ఏమయ్యా, రెండూ తోడబుట్టువులే కద, ఇల్లా వేర్వేరు బుద్ధులు వచ్చేయేమిటి? అంటే, ఇది లోకంలో ఉన్నదేనయ్యా! విషం అమృతం రెండూ సముద్రంలోనే పుట్టేయి. విషం ప్రాణాలు తీస్తుంది. అమృతం ప్రాణాలు పోస్తుంది. అల్లాగే ఇక్కడాను.

ఆ వేసవిని భోగులు దోరమామిడి కాయముక్కలూ, చేపబద్దలూ చుఁయ్ అనే నూనె తాలింపులో వేసి, నీరిగిరి పక్వమయిన ఆ ఇగురును మధ్యాహ్నం భోజనంలో ఆరగిస్తారు. సాయంకాలం ఆ భోజనం అరుగుదలకు వస్తున్నప్పుడు మామిడి ముక్కల చేపబద్దలకనరు తేనుపులు వస్తాయి. చల్లగా ఉండడం కోసం కేళివనాల్లో ఉన్న ఇసుకలో పూడ్చిన చల్లని కొబ్బరిబొండాల నీరు తాగేటప్పుడు ఆ కసరు తగ్గుతుందిట.

ఆ వేసవిలో ప్రతిగ్రామంలో ఒక్కో సామంతునికి ఒక్కో చలువపందిరి వేసేరు. నేలంతా వేడికి ఉడికిపోతూ ఉంటే ఈ చలవ పందిళ్ళు కుంపట్లో మొలిచిన తామరల్లా ఉన్నాయి.

చలవకోసం పగలంతా తోటల్లో ఉండి, మల్లెలు తలలో తురుముకొని కావివస్త్రాలు ధరించి, రాత్రి కాగానే చెరకు గానుగుల దగ్గరకు చేరుకొనే జనం రాబోయే వర్షానికి సూచనగా గుడ్లుమోసుకుంటూ తీపికోసం గానుగల దగ్గరకు చేరుతున్న ఎర్రచీమల్లా ఉన్నారు.

ఆ మందువేసవిని ఆ మధురకు దగ్గరగా ఉన్న అళఘర్ సుందరబాహుస్వామివారికి తెప్ప తిరునాళ్ళు వచ్చేయి. ఓ పరదేశి విప్రుడు భక్తితో ఆ ఉత్సవాలను సేవించాలని వచ్చి ఉత్సవాలయ్యేక ఎల్లాగూ ఇందాకా వచ్చేము. మధుర గొప్పగా ఉంటుందంటారు. ఆ నగరాన్ని కూడా చూసిపోదాము అనుకొని మధురకు వచ్చేడు.

తిరునాళ్ళలో బాగా అలసిపోయి ఎక్కడన్నా కాస్త చోటు చూసుకొని విశ్రమింతామని వైగైనదిలో సంధ్యాద్యనుష్ఠానాలు

కావించుకొని ఇట్లా వచ్చిన పరదేశివిప్రుల్ని ఆదరించేది రాజపురోహితులు కావడాన్న ఆయనింట దిగేడు.

అరముగ్గిన సుగంధి అరటిపళ్ళు పెద్ద పెద్ద పనసతొనలు నేతిముద్దల్లా తెల్లగా చెక్కుతీసిన మృదువుగా ఉన్న చెరుకుముక్కలు రకరకాల మామిడిపళ్ళు, మృదువులైన ద్రాక్షఫలాల గుత్తులు. పొల్లూ పొట్టూ లేకుండా బాగుచేసి చేసిన వడపప్పు, తియ్యని దానిమ్మ గింజలు, రసదాడులనే అరటిపళ్ళ ముక్కలు, వీటితోపాటు పానకం, ఆ పురోహితుల ఇంట్లో అతిథులందరకూ సమర్పిస్తూంటే ఈ పరదేశి విప్రుడూ స్వీకరించి ఆరగించేడు. అతిథులని గౌరవంగా చందనగోష్ఠి కావించి చందనమియ్యగా పూసుకొన్నాడు. పువ్వులిస్తే వాటిని సిగలో ధరించేడు. ఇచ్చిన కర్పూరపుతాంబూలం వేసుకొన్నాడు.

తన యాత్ర సంచి (ప్రయాణాల్లో మోసుకెళ్ళడానికి అనువుగా భుజంమీద ముందుకూ వెనక్కూ రెండు సంచులుండేట్టు కుట్టిన సంచి) తలగడగా చేసుకొని వీధరుగు మీద నడుం వాల్చేడు. చాలామంది చేరేరుగా, ఒక్కోరు ఒక్కో వేపున చేరబడ్డారు. కాలక్షేపం కావాలిగా. అదీ కాక పదిమంది చేరినప్పుడు ఏదో ప్రసంగం రాకా మానదు. ఒకరన్నారు.. అయ్యా! ఏదీ ఓ శ్లోకం వినిపించండి అని. వెంటనే ఒకాయన ఆర్యా ఛందస్సులో కొన్ని శ్లోకాలు వినిపించేడు. మొదలెట్టకనే పోవాలి కాని, మొదలుపెడితే అది అంతవేగం ఆగుతుందా! మరొకాయన భగవద్గీతనందుకున్నాడు. మన పరదేశి బ్రాహ్మణుడు సుభాషితాలు ప్రారంభించేడు. చదువుతున్నాడు.

అప్పుడు పన్నీటితో కదంబంగా చేసి పూసుకున్న కస్తూరి పరిమళాలు గుప్పుమని ఎవరో రాచనగరువారు అటువస్తున్నా రనిపించింది. చూస్తే ఎవరో మహారాజులా ఉన్నాడు. ఎవరో ఏమిటీ మధురనేలే మత్స్యధ్వజ మహారాజే. పెద్ద అట్టహాసంగా మరోవీధిలో ఉన్న తన భోగకాంత మందిరానికి వెడుతున్నాడు. ఆ ఠీవీ, ఆ హొయలు ఆ హంగామా అంతా ఆయన రాచరికాన్ని చెప్పకనే చెబుతున్నాయి. ముందుగా తలవరులు కొందరు కమ్ముకొని నడుస్తున్నారు. పక్కనే తమ్మపడిగం పట్టుకొని ఓ స్త్రీ నడుస్తోంది. పొదరిపూలు సిగలో తురుముకున్నట్టున్నాడు. ఆ తావులకు తుమ్మెదలు మూగుతున్నాయి. ఆయన నడుస్తూంటే కదులుతున్న టోపీకుచ్చులు వాటిని అదలిస్తున్నట్టుంది. చెవులకు వేలాడుతున్న ముత్యాల కమ్మలకాంతులు పైకి ఎగబాకాలని చూస్తున్న హారకాంతుల్ని కిందకి తొక్కేస్తున్నట్టుంది. భుజంమీంచి వేలాడుతున్న వల్లెవాటు వెన్నెల్లా ఉంది. ఆ వల్లెవాటుకొంగును మోచేతిమీద వేసుకొని ఆ చేత్తోనే మెరుస్తున్న బంగరుపడిగల వాడికత్తి పట్టుకొన్నాడు. అల్లా ఆయన పోతూ ఉంటే మేరుపర్వతం నడిచివస్తున్నట్టుంది. సరిగ్గా రాజపురోహితుల వాకిటికి ఆయన వచ్చేటప్పటికి మన పరదేశి విప్రుడు చదువుతున్న సుభాషితం ఆయన చెవినపడింది.

**వర్షార్థమష్టౌ ప్రయతేతమాసాన్ నిశార్ధమర్ధం దివసేయతేత**
**వార్ధక్యహేతోర్వయసా నవేన పరత్రహేతోరిహ జన్మనాచ"**

వర్షాకాలం నాలుగు నెలలకోసం మిగిలిన ఎనిమిది నెలల్లోనూ, రాత్రికోసం పగలు, వార్ధక్యంకోసం వయసులోనూ, పరానికి ఇక్కడా ప్రయత్నించాలి అని ముందుచూపుతో మనిషి చెయ్యాల్సిన పనుల్ని చక్కగా నిర్దేశించి చెప్తున్న శ్లోకం ఆయన చెవినే కాదు మనస్సునూ పట్టుకుంది. మనసులో ఆలోచనలు ముసిరినై. మళ్ళీ మళ్ళీ ఆ శ్లోకార్థాన్ని మననం చేసుకున్నాడు. అన్నా ఎంతపొరపడ్డాము? జీవితమంటే ఏవిటో ఎల్లా గడపాలో తెలియకుండానే ఇన్నేళ్ళు గడిపేసేమే! సుఖభోగాలు, రాజ్యాధికారాలూ అందుకోసం యుద్ధాలు, విజయాలకోసం పాట్లూ ఇదే జీవితం అనుకొన్నావు. నన్ను నేను వంచించుకున్నాను. ఇదంతా స్వయంకృతాపరాధం, అన్నన్నా ఎంత పొరపాటు జరిగిపోయింది. ఇకనైనా మేలుకొని జాగ్రత్త పడకపోతే కానీ లాభం లేదు అనుకున్నాడు. అడుగుముందుకు పడలేదు. మనసు దొలిచేస్తుంది. (సశేషం)

శ్రీరామచంద్రాచార్య



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



శ్రీశ్రీశ్రీ స్వామివారు మే 29న సీతానగరం నుండి బయలుదేరి కోనసీమలోని అయినవిల్లికి చేరుకున్నారు. మన దివ్యసాకేత ఆలయ కమిటీలో ప్రధానులైన శ్రీమాన్ టి.వి. సత్యనారాయణ రాజుగారు వాళ్ళమ్మాయిల చేత రుక్మిణీ కళ్యాణ మహోత్సవాన్ని శ్రీశ్రీశ్రీ స్వామివారి సమక్షంలో జరపాలని ప్రార్థించారు. వారి కోరిక మేరకు శ్రీస్వామివారు అయినవల్లిలో రెండురోజులు వేంచేసి ఉండి వారి అమ్మాయిల చేత రుక్మిణీ కళ్యాణం జరిపించారు. వారికి, వారి పరివారానికి మంగళాశాసనాలు కావించి, 30వ తేది రాత్రికి శ్రీరాంనగర్ వేంచేశారు.

శ్రీమాన్ టి.వి యస్. రాజుగారు శ్రీస్వామివార్లకి పరివారానికి, భక్తబృందానికి మండు వేసవిని మరిపించే చక్కటి చల్లచల్లని ఆహ్లాదకరమైన ఏర్పాట్లన్నీ చాలా ఘనంగా చేశారు.

జూన్ 1వ తేది ఉదయాన్నే శ్రీస్వామివారు బెంగుళూరు వేంచేసారు. స్థానిక మల్లేశ్వరంలోని శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయ కమిటి వారు గతంలోనే శ్రీవారిని ఆహ్వానించారు. శ్రీవేంకటేశ్వరుని ఆనంద నిలయ విమాన గోపుర ప్రతిష్ఠ కార్యక్రమంలో పాల్గొని కుంభ ప్రోక్షణ గావించారు. వచ్చిన భక్తులందరికి శ్రీవేంకటేశుని వైభవాన్ని వివరించి, మంగళాశాసనాలు గావించారు. అదే రోజు రాత్రికి శ్రీరాంనగర్‌కి వేంచేసారు.

జూన్ 6నుండి 10వ తేదీ వరకు హైదరాబాద్ బాహితీ భవన్‌లో శ్రీమాన్ ద్వారకాదాస్ దామోదర్‌లాల్ గారి పరమపదోత్సవ కార్యక్రమంలో వేంచేసి ఉన్నారు. దామోదర్ లాల్ గారు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారు హైదరాబాద్‌లో నిర్వహించిన భాగవత సప్తాహం 2000మంది పండితులతో జరిపిన 18వ స్వాధ్యాయజ్ఞానయజ్ఞంలోను ప్రధానంగ నిలబడిన కైంకర్యపరులు.

ఆరోజుల్లో అక్కడి మార్వాడీ సమాజ మంతటికీ ప్రేరణ కలిగించి, కార్యక్రమంలో అన్వయింపచేయడమే కాక, తాము ముందుండి అన్నివిధాల సేవలందించి, శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామి వారి కృపకు పాత్రులైన ధన్యజీవి వీరు. కనుకనే వారి కొడుకు, కోడలు శ్రీమతి లీల శ్రీమాన్ శ్యామ్ దంపతులు ప్రార్థించగానే మన శ్రీస్వామివారు దామోదర్‌లాల్ గారి పరమపదోత్సవ కార్యక్రమంలో పాల్గొనడానికి అంగీకరించి, అనుగ్రహించారు. పరమపదోత్సవంలో భాగంగ వైభవేష్టి జరిపించారు.

మధ్యలో 7వ తేదీ రాత్రికి ముంబాయ్ ప్రక్కన ఉన్న పన్‌వేల్ వేంచేసారు. అక్కడి "తెలుగు అసోసియేషన్ సంఘం" వారు ప్రాచీన గణపతి ఆలయంలో నూతనంగ శ్రీవేంకటేశ్వరుని ప్రతిష్ఠింపచేయాలని శ్రీస్వామివారిని ఆహ్వానించారు. అక్కడి మన తెలుగువారంతా ఒక సంఘంగ ఏర్పడి, గత కొద్ది సంవత్సరాలుగ శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్ర పారాయణాదులు శ్రద్ధగ జరుపు కుంటున్నారు. వారంతా కలసి, క్రమేణ శ్రీవేంకటేశ్వరుని ఆలయాన్ని నిర్మించుకొని శ్రీవారిని ఆహ్వానించారు. శ్రీమాన్ కోడూరు శ్రీనివాస్‌గారి నేతృత్వంలో ఆలయ కమిటీ వారంతా కలసి శ్రీస్వామివారిని ఆహ్వానించు కొని, చక్కటి ఏర్పాట్లతో శ్రీవేంకటేశ్వరుని ప్రతిష్ఠింపచేసు కున్నారు. శ్రీస్వామివారు కలియుగదైవమైన శ్రీవేంకటేశుని వైభవాన్ని వారి కనుగ్రహించి, మంగళాశాసనాలు కావించారు. శ్రీమాన్ రామారావుగారి గృహానికి విచ్చేసి, వారి పెరుమాళ్ళకి మంగళాశాసనాలు చేసి, 8వ తేది రాత్రికి హైదరాబాద్‌లోని పరమపదోత్సవ కార్యక్రమానికి చేరుకున్నారు.

9,10 తేదీలలో బాహితీ భవన్‌లో పరమపద వైకుంఠోత్సవం వైభవంగ జరిగింది. 10 రాత్రికి సీతానగరం చేరుకున్నారు.

11 ఉదయం ఆరాధనానంతరం శ్రీమతి సీతమ్మ పరమపదోత్సవంలో పాల్గొన్నారు. శ్రీమతి సీతమ్మ మన జెట్ ప్రారంభమైన నాటినుండి మన శ్రీస్వామివారు నిర్వహించిన అనేక యజ్ఞ యాగాదుల కార్యక్రమాలలోనూ, సేవాకార్యక్రమాలలోనూ సేవనందించిన కైంకర్యపరురాలు. ఆమెకు ఆ పరమపదనాథుని సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేసారు.

అనంతరం విజయవాడలో శ్రీబసవేశ్వరరావుగారి ఆహ్వానం మేరకు "శ్రీలక్ష్మీసాయి మల్టీస్పెషాలిటీ డెంటల్ కేర్ హాస్పిటల్"ని శ్రీస్వామివారు ప్రారంభంగావించారు. రాత్రికి శ్రీరాంనగర్ వేంచేసారు.

12 ఉదయం ఆరాధనానంతరం విజయనగర్ కాలనీ శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయానికి ప్రధానార్చకులు శ్రీమాన్ శశికుమారాచార్యులు ఆహ్వానంపై వేంచేసారు. భక్తుల సహకారంతో ఆలయంలో నిర్వహిస్తున్న శ్రీసుదర్శనహోమ పూర్ణాహుతిలో పాల్గొని తిరిగి శ్రీరాంనగర్ వేంచేసి, రాత్రికి కూకట్‌పల్లిలోని బి.హెచ్.ఇ.ఎల్. చేరుకున్నారు.

13 ఉదయం ఆరాధనానంతరం బి.హెచ్.ఇ.ఎల్. రామాలయంలో నూతనంగ నిర్మించిన కళ్యాణమండపం ప్రారంభించి, భక్తులకు మంగళాశాసనం గావించారు. రాత్రికి మన జెట్ సొసైటీ అధ్యక్షులు శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డి గారి గృహానికి వేంచేశారు. తెల్లవారురఘామున వాస్తు, సుదర్శనహోమ కార్యక్రమంలో పాల్గొన్నారు. అనంతరం మన జీవా అధ్యక్షులు శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారు నూతనంగ నిర్మిస్తున్న అపార్ట్‌మెంట్ కాంప్లెక్స్‌కి శంకుస్థాపన గావించి, 'ABHRA' అని నామకరణంచేసి, నేరుగ విమానాశ్రమం చేరి, మధ్యాహ్నం 3గం॥కు కోయంబత్తూర్ వేంచేశారు.

శ్రీమతి శ్యామలా వరదరాజన్ దంపతుల గృహానికి వేంచేసి, వారి పెరుమాళ్ళకి మంగళాశాసనం చేసి, సాయంత్రానికి సేలం చేరుకున్నారు.

సేలంలోని సంప్రదాయపరులైన భక్తబృందం రామానుజ సహస్రాబ్దినాటికి స్థానికంగ ఒక చక్కటి నిర్మాణం చేయాలని ఒక సమావేశాన్ని ఏర్పాటుచేసుకొని, శ్రీవారిని ఆహ్వానించారు. ఆనాటి సమావేశంలో ఆ నిర్మాణానికి సంబంధించిన నిర్ణయాలు తీసుకున్నారు. రామానుజ వైభవాన్ని ప్రతిబింబించే విధంగ వారి చరిత్రను తెలిపేట్టుగ చక్కటి చిత్రాలతోనూ, రామానుజుల మూర్తిని ప్రతిష్ఠించుకునేట్లుగానూ, దూరప్రాంతాలనుండి వచ్చిన భాగవతులకు వసతులు కల్పించేట్లుగానూ ఒక చక్కని భవన నిర్మాణం కావాలనుకున్నారు. దానికి "రామానుజ సహస్రాబ్ది మణిమండపం" అని పేరు నిర్ణయించారు.

తదనుగుణంగ శిలాశాసనంచేసి, శ్రీస్వామివారి కరకమలములతో ఆవిష్కరించారు. శ్రీస్వామివారు మన ఉభయవేదాంతాచార్యపీఠం తరపున 3లక్షలు అందించి, శిలాశాసనం ఆవిష్కరించి, మంగళాశాసనం గావించారు.

అనంతరం శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి తిరువడి సంబంధంకలవారు, కైంకర్యపరులైన శ్రీమాన్ ఎ.ఎన్.ఎస్. గుప్తాగారి కుమారులు శ్రీమాన్ శ్రీరామ్ గారు తమ షష్టిపూర్తి మహోత్సవాన్ని శ్రీస్వామివారి సన్నిధిలో జరుపుకోవాలని ఎప్పటినుండో ప్రార్థిస్తున్నారు. సేలంలో నివసిస్తూ, జూవెల్లరీ షాప్ అధినేత అయిన శ్రీమాన్ శ్రీరామ్‌గారు మన శ్రీస్వామివారు నిర్వహించే అనేక కార్యక్రమాలకు కైంకర్యం చేస్తున్నారు. మన జీవా నిర్మాణంలో భాగస్వాములుగ ఉన్నారు.

మన దివ్యసాకేత పెరుమాళ్ళకి ఆభరణాలు చేయించి ఇస్తున్నారు. వారి ప్రార్థనకి అంగీకరించి, శ్రీస్వామివారు దగ్గరుండి షష్టిపూర్తి మహోత్సవాన్ని నిర్వహించి, మంగళాశాసనాలు చేశారు.

15 ఉదయం ఆరాధన, తీర్థగోష్ఠి అనంతరం షష్టిపూర్తి సందర్భంగ జరిపే హోమం, ఆరాధనాదులు పూర్తి అయ్యాక శ్రీస్వామివారి పర్యవేక్షణలో శ్రీసీతారామ కళ్యాణ మహోత్సవం జరిగింది. తదనంతరం పెరుమాళ్ళ సన్నిధిలో షష్టిపూర్తి వేడుకలు జరిగాయి. మన ఆగమకళాశాల ప్రధానాధ్యాపకులు శ్రీమాన్ మధుసూదనాచార్యులు తమ శిష్యబృందంతో శ్రీస్వామివారి నేతృత్వంలో ఈ కార్యక్రమాన్ని వైభవంగ జరిపించారు.

అక్కడనుండి నేరుగ చెన్నైలోని కుచలాంబాళ్ కళ్యాణమండపానికి 16 ఉదయానికి చేరుకున్నారు. స్థానికంగ మన వికాసతరంగిణివారు ఏర్పాటుచేసుకున్న "ప్రజ్ఞ ఓరియంటేషన్ క్యాంప్"లో పాల్గొన్నారు. సుమారు 100మంది పాల్గొని అనేక విషయాలు శ్రీస్వామివారినుండి నేర్చుకునే అదృష్టాన్ని పొందారు.

క్యాంప్‌లో భాగంగానే 17 ఉదయం భక్తులందరికోసం సామూహిక లక్ష్మీనారాయణ పూజని శ్రీస్వామివారు జరిపించారు. మధ్యాహ్నం తిరిగి ప్రజ్ఞ ట్రైనింగ్ క్లాసెస్‌లో పాల్గొన్నారు. సాయంత్రం సభకి తమిళనాడు గవర్నర్ శ్రీమాన్ కె.రోశయ్యగారిని ముఖ్య అతిథిగ ఆహ్వానించారు. శ్రీస్వామివారిని "స్నేహం" అనే విషయాన్ని అనుగ్రహించవలసినదిగ కార్యకర్తలు ప్రార్థించారు. శ్రీస్వామివారు అత్యద్భుతంగ స్నేహభావాన్ని వివరించారు. రాత్రికి క్యాంప్ ఆర్గనైజర్స్ అందరికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు గావించారు.

18 ఉదయం నాగపట్నం జిల్లాలోని మాయవరం అనే దివ్యదేశానికి సమీపంలో ఉండే "పల్లవరాయన్ పేటై" అనే గ్రామానికి చేరారు. స్థానికంగ ఉండే 1. మహదేవన్, 2. రంగనాథన్, 3. లక్ష్మీనారాయణన్ అనే ముగ్గురు సోదరులు శ్రీస్వామివారిని ఆహ్వానించారు. వీరు ముగ్గురు టింబర్ వ్యాపారం చేస్తున్నారు.

వీరి పూర్వులు ఈ గ్రామంలో చిన్న శ్రీవేంకటేశ్వర ఆలయాన్ని నిర్మిస్తే, వారి కుటుంబీకులు తరతరాలుగ ఆ ఆలయాన్ని నిర్వహిస్తున్నారు. ఆ ఆలయాభివృద్ధికై మంగళాశాసనాలు చేయవలసినదిగ ఆ సోదరులు శ్రీస్వామివారిని వేంచేపుచేసు కున్నారు.

శ్రీస్వామివారి రాక సందర్భంగ ఆలయంలో శ్రీసుదర్శన హోమాన్ని ఏర్పాటుచేసుకున్నారు.

18 ఉదయం వారి గృహంలోనే వేంచేసి, ఆరాధనానంతరం పంచసంస్కారాలు అనుగ్రహించారు శ్రీవారు. వీరి బంధువర్గమంతా కలసి సుమారు 100 కుటుంబాలవారు చక్కటి వైష్ణవ నిష్ఠ, భాగవత నిష్ఠ కలిగి, చక్కటి ఆహారశుద్ధిని పాటిస్తూ, ఆప్రాంతంలో మన సంప్రదాయానికి ఆటపట్టుగ నిలచారు.

వీరిలోని శ్రద్ధను చూసి, శ్రీస్వామివారు వారి ఆహ్వానాన్ని అంగీకరించి, ఆ ఊరికి వేంచేశారు. మంత్రోపదేశానంతరం ఆలయంలో జరిగిన సుదర్శనహోమ పూర్ణాహుతిలో పాల్గొని, ఆలయాభివృద్ధికై అనేక మంగళాశాసనాలు అనుగ్రహించి, అక్కడినుండి బయలుదేరారు.

18 సాయంత్రం 108దివ్యదేశాలలో ఒకటైన “శ్రీముష్ణం” చేరి, “భూవరాహస్వామి” సన్నిధిని సేవించారు. రాత్రికి చిదంబరం చేరి, మన వేదవిద్యార్థులకు అపురూప మైత్రాయణీ శాఖను అధ్యాపనంచేసిన బ్రహ్మశ్రీ పరమేశ్వర దీక్షితుల వారి ఆహ్వానంపై నటరాజస్వామి సన్నిధిలో జరిగిన వైదిక సదస్సులో పాల్గొని, చిదంబరంలోని తిరుచ్చిత్రకూటం గోవిందరాజస్వామి సన్నిధిని సేవించారు.

19 ఉదయం ఆరాధనానంతరం తిరువిందళూర్ పరిమళ రంగనాథుని సందర్శించారు. అక్కడినుండి శిరుపులియూర్‌లో జరుగుతున్న మహా సంప్రోక్షణ కార్యక్రమంలో అన్వయించి, భక్తబృందానికి, నిర్వాహకులకి మంగళాశాసనం గావించారు.

అక్కడి నుండి ఈమధ్య నేపాల్, ముక్తినాథ్‌యాత్ర విమాన ప్రమాదంలో అసువుల బాసిన శ్రీమాన్ సుధాభట్టర్ గారి కుటుంబసభ్యులని పరామర్శించారు.

సుధాభట్టర్ గారు కుంభకోణంలో ఉండే శార్జ్గపాణి, రామస్వామి ఆలయాల్లో దీక్షితులై ఆరాధనచేసే కుటుంబాలకి సంబంధించిన అర్చకస్వామి. వీరు మన శ్రీరామనగర్‌లోని దివ్యసాకేత ఆలయప్రతిష్ఠలోనూ పాల్గొన్నారు. దివ్యదేశాల జీర్ణోద్ధరణలో వీరు చాలా శ్రద్ధవహించి, శ్రీమాన్ తిరుకొట్టియూర్ మాధవన్ గారి ప్రేరణతో, అనేక కార్యక్రమాలని శ్రద్ధగా నిర్వహిస్తూ ఉండేవారు. ఆచార్య తిరువడిని చేరిన వీరు లేని లోటును త్వరలోనే వారి కుమారులు తీర్చాలని, చక్కగ చదువుకొని పైకిరావాలని శ్రీస్వామివారు మంగళాశాసనాలు గావించారు.

అక్కడినుండి బయలుదేరి తిరుక్కూడలూర్, తిరుక్కండియూర్ దివ్యదేశాలమీదుగ తెల్లవారేసరికి తిరుత్తంగాల్, శ్రీవిల్లిపుత్తూర్ సమీపంలో ఉన్న ‘శ్రీనిన్ఱ నారాయణ పెరుమాళ్’ ఆలయానికి పరివారంతో చేరారు. అక్కడ మన స్వామివారి దగ్గర పంచసంస్కారాలు పొందిన శ్రీవిల్లిపుత్తూర్ ఆలయాధ్యక్షులైన ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీమతి రుక్మిణీ రవిచంద్రన్‌గారి గృహానికి విచ్చేశారు.

20 ఉదయం రాజపాలయం సందర్శించి, అక్కడి కార్యక్రమాలను ముగించుకొని, మధురై మీదుగ హైదరాబాద్ వేంచేశారు.

## శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి పర్యటన కార్యక్రమాలు

**జూన్ నెల**

| | | |
|---|---|---|
| 28. | సిద్ధిపేట | పుల్లూరులో నృసింహాలయ సందర్శన |
| 29. | మానుకోట | శ్రీలతమ్మగారి సోదరి శ్రీమతి రుక్మిణీదేవిగారి పరమపదోత్సవం |
| 30. | రాత్రికి | సీతానగరం |

**జూలై నెల**

| | | |
|---|---|---|
| 1. | | లివ్ లైఫ్ హాస్పిటల్ ప్రారంభోత్సవం |
| 2. | నడిగడ్డపాలెం | శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి సందర్శన, చాతుర్మాస్య దీక్షకి ఆజ్ఞతీసుకొనుట |
| 3. | శ్రీరాంనగర్‌లో చాతుర్మాస్యారంభం. | |



జై శ్రీమన్నారాయణ!

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి

# చాతుర్మాస్య దీక్ష - కార్యక్రమ వివరాలు

జీవా ప్రాంగణం, శ్రీరాంనగరం, మదనపల్లి క్రాస్, ముచ్చింతల్ రోడ్, శంషాబాద్

3-జూలై-2012 న ఉదయం 9.15ని॥ దీక్షా ప్రారంభం-మధ్యాహ్నం 12 గం॥ తీర్థగోష్ఠి

**ప్రతిరోజు శ్రీస్వామివారి అనుగ్రహ భాషణం : ఉదయం 8.30నుండి 9గం॥ వరకు**

## దివ్యసాకేతంలో విశేష కార్యక్రమాలు

| | | | | |
|---|---|---|---|---|
| శ్రావణ శుక్రవారం | 20-07-2012 | శుక్రవారం | ఉ॥ 10-00 నుండి మ॥ | మ॥ 12-00 వరకు |
| ఆండాళ్ తిరునక్షత్రోత్సవం | 23-07-2012 | సోమవారం | ఉ॥ 10-00 నుండి | మ॥ 12-00 వరకు |
| బదరీనారాయణ తిరునక్షత్రోత్సవం | 25-07-2012 | బుధవారం | ఉ॥ 10-00 నుండి | మ॥ 12-00 వరకు |
| వరలక్ష్మీ వ్రతం | 27-07-2012 | శుక్రవారం | ఉ॥ 10-00 నుండి | మ॥ 12-00 వరకు |
| శ్రావణపూర్ణిమా, హయగ్రీవజయన్తి పూజ | 01-08-2012 | బుధవారం | ఉ॥ 10-00 నుండి | మ॥ 12-00 వరకు |
| శ్రీ పెద్దజీయరుస్వామివారి తిరునక్షత్రోత్సవం | 02-08-2012 | గురువారం | ఉ॥ 10-00 నుండి | మ॥ 12-00 వరకు |
| | 06-08-2012 | సోమవారం | ఉ॥ 10-00 నుండి | మ॥ 12-00 వరకు |
| శ్రావణ శుక్రవారం | 10-08-2012 | శుక్రవారం | ఉ॥ 10-00 నుండి | మ॥ 12-00 వరకు |
| స్వాతంత్ర్యదినోత్సవం | 15-08-2012 | బుధవారం | ఉ॥ 09-00 నుండి. | |
| శ్రావణ శుక్రవారం | 17-08-2012 | శుక్రవారం | ఉ॥ 10-00 నుండి | మ॥ 12-00 వరకు |
| నేత్ర విద్యాలయ వార్షికోత్సవం | 31-08-2012 | శుక్రవారం | ఉ॥ 10-00 నుండి | మ॥ 12-00 వరకు |
| కృష్ణాష్టమీ - శ్రీ జయన్తి | 08-09-2012 | శనివారం | సా॥ 10-00 నుండి | రా॥ 12-00 వరకు |
| ఉట్టెలు కొట్టుట | 09-09-2012 | ఆదివారం | ఉ॥ 10-00 నుండి | మ॥ 12-00 వరకు |
| విఘ్ననివారణ చతుర్థి | 19-09-2012 | బుధవారం | ఉ॥ 10-00 నుండి | మ॥ 12-00 వరకు |

**వేదసదస్సు - వేద పరీక్షలు జూలై 8,9,10,11, తేదీలలో...!**

వివరములకు: 95535 49972 www.chinnajeeyar.org



శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారి

# అమెరికా పర్యటన

## జూన్ 26 నుండి నవంబర్ 8 వరకు

అమెరికాలోని వివిధ రాష్ట్రాలలో జెట్ మరియు వికాసతరంగిణి నిర్వహించే వివిధ ఆధ్యాత్మిక కార్యక్రమాలు, ప్రవచన గోష్ఠులలో పాల్గొంటారు.

హ్యూస్టన్ నగరంలో జరుగు 'నాటా' సభలలో, అట్లాంటలో జరుగు 'ఆట' సభలలో పాల్గొంటారు.

వివరాలకు: 609 610 3307, 630 877 5551

www.jetusa.org

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన ఫిబ్రవరి నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | | సమాధానాలు |
|---|---|---|
| 1. | శంతనుడు భీష్మునికిచ్చిన వరం | |
| 2. | వ్యాసుడు ఎవరి కుమారుడు? | |
| 3. | అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రం | |
| 4. | ఆత్మానుభవాన్నే ఇలాకూడా అంటారు. | |
| 5. | యమళార్జునులు ఏ రూపంలో ఉన్నారు? | |
| 6. | భ్రమర గీతలు ఏం ఉపదేశిస్తున్నాయి? | |
| 7. | వానరులు దేహశుద్ధి చేసిన రాక్షసుడు | |
| 8. | ఆకాశంలో నిలిచిన విభీషణుడు ఎలా కనిపించాడు? | |
| 9. | ఆల్వార్లను మొట్టమొదట కనిపెట్టినవారు? | |
| 10. | 'ఫాదర్ ఆఫ్ ఆల్ ఫుడ్స్' అని దేనికి పేరు? | |
| 11. | పరీక్షిత్తును శపించిన మహర్షిపేరు? | |
| 12. | గురుపూర్ణిమను ఎపుడు జరుపుకుంటాము? | |
| 13. | వేణీసంహారాన్ని ఎవరు రచించారు? | |
| 14. | భాగవతం విష్ణువు అవతారాలెన్నని చెప్పింది? | |
| 15. | తిరుప్పళ్ళి ఎళ్ళుచ్చి అంటే | |
| 16. | అవతార కందమని దేనికి పేరు? | |
| 17. | భూత యోగికే ద్రవిడభాషలో మరో పేరు? | |
| 18. | నరసింహావతారంలో ప్రాధాన్యరూప మేది? | |
| 19. | గుహుడు శ్రీరాముని దాటించిన నది | |
| 20. | ఏనుగును నడిపించేవాని పేరు? | |

గత నెల విజేత : ఎ. సత్యనారాయణ మూర్తి - హైదరాబాద్.

**సూచన**

సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929



# పరమపదవార్తలు





శ్రీకాకుళం వాస్తవ్యురాలు **శ్రీమతి న్యాపతి జానకిరామ్** గారు 8.6.2012న ఆచార్య తిరువడిని చేరారు. వీరు శ్రీపెద్దజీయర్‌స్వామి వారు శ్రీగోపాలా చార్య స్వామివార్లు చేసిన అనేక కార్యక్రమాలలో సేవలనందించారు. శ్రీచిన్నజీయర్‌స్వామివారి మంగళాశాసనంతో శ్రీకాకుళం జిల్లాలో అనేక కార్యక్రమాలలో పాల్గొనేవారు. వీరికి శ్రీవారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.



వరంగల్ జిల్లా, జనగాం వాస్తవ్యురాలు శ్రీమతి **బీచరాజు పద్మావతిగారు** 22.4.2012న పరమపదాన్ని అలంకరించినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనాన్ని అనుగ్రహించారు.



కృష్ణాజిల్లా, సరిదింటకుర్రు వాస్తవ్యులు శ్రీమాన్ **పొట్లూరి వీరరాఘవ స్వామి** 2.4.2012న పరమపదించారు. వీరు హృషీకేశ్ రామాలయానికి విగ్రహాలను సమర్పించినారు. వీరికి శ్రీవారు అనేక మంగళాశాసనాలు కటాక్షించారు.



ప్రకాశంజిల్లా, ఒంగోలు వాస్తవ్యురాలు **గొల్లపూడి అమ్మణ్ణమ్మగారు** 30.5.2012 పరమపదాన్ని అలంకరించినారు. వీరికి స్వామి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.



వరంగల్ జిల్లా, హన్మకొండ వాస్తవ్యులు **శ్రీమాన్ గుడిపాటి గోపాలరెడ్డి** 6.3.2012న పరమపదించినారు. వీరికి పరమపదంలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీవారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.



కృష్ణాజిల్లా పుట్రాల గ్రామవాస్తవ్యులు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి శిష్యురాలు **శ్రీమతి కోటగిరి తిరుమలాయమ్మగారు** 27.5.2012న ఆచార్య తిరువడిని చేరారు. వీరికి పరమపదంలో నిత్యకైంర్యం లభించాలని శ్రీవారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.



వరంగల్‌జిల్లా హనుమకొండ వాస్తవ్యులు **శ్రీమతి గున్‌రెడ్డి పూలాదేవి**గారు 7.5.2012న పరమపదాన్ని చేరారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్యసేవా కైంకర్యం లభించాలని ఆచార్యులు మంగళాశాసనాలు అందించారు.



హైదరాబాద్ వాస్తవ్యురాలు **కోర్పోలు యశోదమ్మగారు** 17.6.2012న సంవత్సరీక సందర్భముగ భక్తినివేదనకి కైంకర్యము సమర్పించారు.



**రామానుజకూటం మనవాళయ్య** 7.2.2012న పరమపదాన్ని అలంకరించినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీవారు మంగళాశాసనాలు కటాక్షించారు.

విజయవాడ వాస్తవ్యులు **వెలగపూడి వెంకటేశ్వరరావు**గారి 10వ వర్ధంతి సందర్భముగ వారి శ్రీమతి రాణి భ్రమరాంబగారు వారికుమార్తెలు భక్తినివేదనకు కైంకర్యము సమర్పించారు.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః



65 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



శ్రీ నందన నామ సంవత్సరం శ్రావణమాసం


సంపుటి 65 ఆగస్టు

సంచిక 5 2012


## పంచాంగ వివరాలు

ఆగస్టు :

1. హయగ్రీవ జయంతి, ఆళవందార్ తిరు॥, పుండరీకాక్షుల తిరు॥, ఋగ్యజుర్వేదులకు ఉపాకర్మ, రక్షాబంధనం, విఖనస జయంతి, తేర్కాళ్వార్ తిరు॥
3. ఆశ్లేష కార్తె,
6. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి తిరునక్షత్రము
9. స్మార్త శ్రీకృష్ణాష్టమి
10. నవమి తిథి
11. శూన్యతిథి
13. సర్వేషామేకాదశి
15. స్వాతంత్ర్య దినోత్సవము
16. మాసశివరాత్రి
17. పిండపితృయజ్ఞము
సింహసంక్రమణము ఉ 8., పోలాలమావాస్య, మఖకార్తె
22. తిథి ద్వయం
25. అవమతిథి
27. సర్వేషామేకాదశి
30. పుబ్బకార్తె

సెప్టెంబరు :

8. శ్రీ వైష్ణవ శ్రీకృష్ణ జన్మాష్టమి, కణ్ణన్ తిరు
12. సర్వేషామేకాదశి

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

**శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు**

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-




మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*గత సంచిక తరువాయి...*

(ప్రథమస్కంధం - అష్టమాధ్యాయం)

పృథా కృతకృష్ణస్తుతి

(కుంతి భగవంతుని స్తుతిస్తున్నది.)

**"కృష్ణాయ వాసుదేవాయ దేవకీ నందనాయచ ।**
**నందగోపకుమారాయ గోవిందాయ నమోనమః ॥**
**నమః పంకజనాభాయ నమః పంకజ మాలినే ।**
**నమః పంకజనేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే"॥**

ఓ కృష్ణా! వాసుదేవా! దేవకీనందనా! నంద గోపకుమారా! గోవిందా! నీకు నమస్సులు. ఓ పంకజనాభుడా! పంకజమాలాధారీ! పంకజనేత్రుడా! పంకజపాదుడా! నీకు ప్రణతులు. ఇక్కడ ఒక్కొక్క నామం స్వామి అవతారలీలలను ఆవిష్కరిస్తున్నది. "ఓ హృషీకేశా! కంసునిచే బహుకాలం నిరుద్ధయైన దేవకిని నీవు రక్షించావు. అయినా ఆమె పుత్రులు ఆరుగురు రక్షింపబడలేదు. ఆమెకు వేరొక నాథుడున్నాడు. కాని నాకు నాథుడు (రక్షకుడు) మరెవ్వరు లేరు. నీవు నన్ను నా పుత్రులతో పాటు రక్షించావు స్వామీ ! ఆమె ఒక్కసారి మాత్రమే నీచే రక్షింపబడింది. మరి నా విషయంలో నీ కృప అపారం. ఒకసారి కాదు. పలు మారులు వివిధాపదల నుండి నన్ను రక్షించావు స్వామీ! విషంనుండి, మహాగ్నినుండి, రాక్షసుని నుండి, అసజ్జన సమాకీర్ణమైన సభనుండి, వనవాసక్లేశాల నుండి, ఇలా ఎన్నో విధాలనన్ను రక్షించావు తండ్రీ" అని ఇలా తన ఆర్తితో పాటు, తానెరిగిన భగవత్తత్త్వాన్ని ఇలా ఆవిష్కరిస్తున్నది.

**మన్యేత్వాంకాల మీశానమ్ అనాదినిధనం విభుమ్ ।**
**సమం చరన్తం సర్వత్ర భూతానాం యన్మిథః కలిః ॥**

స్వామీ! ఏకాలం నిమిత్తంగా పరస్పర కలహం ఈ ప్రాణులలో కలుగుతున్నదో, అట్టి సర్వనియామక కాలతత్త్వానివి నీవే అని నేను విశ్వసిస్తున్నాను. నీవు అంతటా సమస్వభావుడవై సంచరిస్తావు. అయినా ఈ వైషమ్యాలు ఉత్తమాధమాది భేదాలు, కలహాలు ఇవన్నీ మా స్వభావాల వల్లనే ఏర్పడుతున్నాయి తప్ప, వాటికి నీవెంత మాత్రం కారణం కాదని నేను తెలిసికొన్నాను స్వామీ!

**నవేద కశ్చిద్భగవంశ్చికీర్షితం**

**తవేహ మానస్య నృణాం విడంబనమ్ ।**

**న యస్య కశ్చిద్దయితోఽస్తి కర్హిచిత్**
**ద్వేష్యశ్చ యస్మిన్ విషమా మతిర్నృణామ్ ॥**

స్వామీ! హే భగవాన్ ! నీ సంకల్పాన్ని ఎవ్వరూ గుర్తింప లేరు. నీవు కేవలం మనుష్య స్వభావాన్ని అనుకరిస్తూ మమ్ములను రక్షిస్తూ, మా శత్రువులను నిగ్రహిస్తూ కనిపిస్తూన్నావే తప్ప, వాస్తవానికి నీకు విశేషంగా అనుగ్రహింప దగిన వాడు, నిగ్రహింపదగిన వాడు ఎవ్వడూలేడు. ఎందువల్లనంటే, నీకు మిత్రులు శత్రువులు అనే వైషమ్యమే లేదు కదా! కేవలం తరతమభేదాలు వైషమ్యం, వీడు నావాడు, వీడు పెరవాడు అనే కుదృష్టి మానవులకు మాత్రమే ఉంది.

**జన్మ కర్మచ విశ్వాత్మన్ అజస్య అకర్తురాత్మనః ।**
**తిర్యఙ్నరర్షి యాదస్సు తదత్యంత విడంబనమ్ ॥**

స్వామీ! పుట్టుకలేని నీకు, పశుపక్ష్యాదుల్లోను నరులలోను, జలజంతువులలోను పుట్టుక, తదను గుణంగా కర్మాచరణం చేయడం, ఇదంతా కేవలం అనుకరణమే తప్ప స్వాభావికం కాదు. నీకు వాస్తవంగా కర్మమూలమైన జన్మ కర్మ, తత్కర్తృత్వం ఇవేవీ లేవు. నీ చేష్టలన్నీ, అద్భుతలీలలే స్వామీ!

**"గోప్యాదదే త్వయి కృతాగసి దామ తావద్**
**యా తే దశాశ్రుకలితాంజన సంభ్రమాక్షరమ్ ।**

**వక్త్రం నినీయ భయభావనయా స్థితస్య**
**సామాం విమోహయతి భీరపి యద్బిభేతి ॥**

"తండ్రీ ! ఆనాడునీవు నవనీత చౌర్యాది దోషాన్ని చేసినపుడు, తల్లి, యశోద, నిన్ను కట్టి వేయడానికి త్రాడు పట్టుకున్నది. ఇంకేముంది, కన్నీటితో కరిగిన కాటుకతో తొట్రుపడుతున్న అక్షరాలతో పలుకుతున్న వదనాన్ని తుడుచు

కుంటూ భయ భావనలోనిండి నిలువబడిన నీ ఆ"దశ" ఎంత మనోహరం! సమస్తానికీ భయకారణమైన నీవే భయాన్ని ప్రదర్శిస్తున్నావంటే, ఈ సన్నివేశ భావనయే మమ్ములను మోహపరుస్తున్నది స్వామీ!

స్వామియొక్క ఈ లీలకు ఆశ్యర్య సంభ్రమాలను పొందుతున్నది కుంతి. కూరేశులనే శ్రీవత్సాంక మిశ్రులు తాము అనుగ్రహించిన పంచస్తవిలోని అతిమానుషస్తవంలో ఈ దామ బంధన లీలను హార్దంగా అనుభవించి ఇలా ఆవిష్కరించారు.

**త్వామన్యగోప గృహ గవ్యముషం యశోదా**
**గుర్వీ త్వదీయ మవమాన మమృష్యమాణా ।**

**ప్రేమ్ణాఽథ దామ పరిణామజుషా బబన్ధ**
**తాదృఙ్నతే చరిత మార్యజనా సహన్తే ॥**

స్వామీ! నీవు నందవ్రజంలోని అన్యగోపాంగనా గృహాల్లో నిర్విశంకంగా వెన్నను దొంగిలించి తింటూ, సహాయు లకు పంచుతూ బాల్యలీలారస నిర్విష్టుడవైనా, నీ లీలా వైభవాన్ని గుర్తింపజాలని వ్రజాంగనలు, నీపై చాడీలు చెప్పి, అమ్మదగ్గర దోషాన్ని ఆవిష్కరిస్తే, అది విని సహింపజాలని గోపెమ్మ నిన్ను త్రాటితో కట్టింది, స్వామీ! అది త్రాడుకాదు కేవలం ఆమెకు గల అనన్య ప్రీతియే సుమా! తన ప్రేమనే త్రాటిగామార్చి నిన్ను బంధించింది. ఈ వైనాన్ని తమ హృదయాలలో భావించిన పెద్దలు ఎంతమాత్రం తట్టుకోలేక పోయారు కదా! అంతే కాదు..

**"మాత్రాయది త్వమసి దామని సన్నిబద్ధః**
**తచ్ఛ్రావిణా ముదిత చాక్షుష నిర్జరాణామ్**

**బధ్నాసిహంత! హృదయం భగవాన్ కుతస్తత్**
**సర్వోహి వశ్యవిషయే వివృణోతి వీర్యమ్ "**

"నాయనా! నీవు నీ తల్లిచే త్రాట కట్టబడిన వృత్తాంతాన్ని విన్న వారి కన్నులు ఏరులై పారాయి, ఇలా నీ భవ్య చేష్టితంతో వారి హృదయాలను కట్టి వేశావే! ఎందుకు స్వామీ! అవునులే, ప్రతివ్యక్తి, తనకు లోకువైనవాని పైననే కదా తన శౌర్యాన్ని చూపేది! నీవూ అంతే! నీ లీలతో నీవారి పైననే నీ శౌర్యాన్ని చూపిస్తావు" అంటారు శ్రీవత్సాంకమిశ్రులు. కుంతి ఇలా స్తుతిస్తున్నది.

స్వామీ! నీవు, పుణ్యశ్లోకుడు నీకు ప్రీతి పాత్రుడు అయిన యదువుకు కీర్తికలగడానికై మలయ పర్వతం పై చందనంలా ఆతని వంశలో పుట్టినావని కొందరంటారు. మరి కొందరు, యాచింపబడిన వాడవై వసుదేవునికి దేవకియందు జన్మించావంటారు. నిన్నాశ్రయించిన వసుదేవుని రక్షించడానికి, సురద్వేషులైన వారిని నిగ్రహించి భూభారాన్ని తొలగించడానికి అవతరించావంటారు. ఈ భూమి పాపాత్ములభారంచే సముద్రంలో నావలా మునిగిపోతూ నిన్ను ప్రార్థించింది. అందుకోసమే నీవవతరించావు. అవిద్య, కామం, కర్మ అనే ఈ విషయచక్రంలో పడి క్లేశపడుతున్న వారికి శ్రవణ-స్మరణ యోగ్యాలైన కృత్యాలు లీలలుగా నిర్వహించడానికే నీవవతరించా వంటారు మరి కొందరు.

**శృణ్వంతి గాయన్తి గృణన్త్యభీక్ష్ణశః**
**స్మరన్తి నందన్తి తవేహితం జనాః।**
**త ఏవ పశ్యంత్యచిరేణ తావకం**
**భవప్రవాహోపరమం పదాంబుజమ్ ॥**
**అప్యద్య నస్త్వం స్వకృతే హిత ప్రభో**
**జిహాససి స్విత్సుహృదోఽనుజీవినః ।**

**యేషాం నచాన్యద్భవతః పదాం బుజాత్**
**పరాయణం రాజసుయోజితాం హసామ్ ॥**

స్వామీ! నీ దివ్య చేష్టితాన్ని జనులు వింటున్నారు. గానం చేస్తున్నారు. స్తుతిస్తున్నారు. నిరంతరం స్మరిస్తున్నారు. ఆనందిస్తున్నారు. ఇలా ఎవ్వరు చేస్తున్నారో వారే త్వరలో ఈ సంసార ప్రవాహాన్ని పోద్రోలే నీ పాదపద్మాన్ని సాక్షాత్కరిస్తారు.

ఎవ్వరికి నీ పాదాబ్జంకంటే వేరే పరాయణం (ఆశ్రయణీయం) లేదో, అట్టి స్నిగ్ధభావం కలిగి, నిన్నే ఆశ్రయించి బ్రతుకుతున్న మమ్ము నీవు విడువతగదు. ఎందువల్లనంటే మేము మా పాపాలన్నీ రాజులయందే విడిచిపెట్టాం. నీవు ఎదుటివారు చేసిన దానిని గమనించే వాడవు కదా! మేము దుర్యోధనాదుల పట్ల చేసిన పాపకృత్యాలను కూడా ఎరుగుదువు. అయినా నిన్నే ఆశ్రయించిన మమ్ము నీవు విడవడం తగునా? స్వామీ! నీదర్శనమే లేకపోతే యాదవులము పాండవులము మేమంతా ఏపాటి వారము? కేవలం పేరులు ఆకారాలు తప్ప మాకున్న సత్త ఎలాంటిది స్వామీ! హృషీకేశుడవైన నీ దర్శనం వల్లనే మా అందరికీ సత్త తప్ప ఇతరథా ఏమీ లేదు కదా! ఈనాడు మేము పాలిస్తున్న యాభూమి, విలక్షణ లక్షణాలుకల నీ పాదాలచే చిహ్నితమై భాసిస్తున్నదే తప్ప, నీ పాదస్పర్శ లేకపోతే ఎంతమాత్రం శోభించదు స్వామీ!

ఇలా బహువిధాల, కుంతి శ్రీకృష్ణస్వామిని స్తుతించి- "ఓ విశ్వేశా! విశ్వాత్మకుడా! విశ్వమూర్తీ! నీ వారైన యాదవ పాండవుల పట్ల నీకు గల దృఢ స్నేహ పాశాన్ని ఛేదింపవచ్చు.

**త్వయి మే అనన్య విషయా మతిర్మధుపతేఽ సకృత్ ।**
**రతి ముద్వహతా దద్ధా గంగేవౌఘ ముదన్వతి ॥**

మహాగంగ సముద్రంలోనే చేరినట్లు నీ యందే నా బుద్ధినిరంతరం అన్యన్యప్రీతమై ఉంది. నీవు తప్ప మరేదీ నామతి ఎరుగదు. ఈ ప్రీతి నిరవగ్రహంగా ప్రవర్తించునుగాక "అని తన అనన్య శరణతను ఆవిష్కరించింది కుంతి. కుంతి చేసిన స్తవనాన్ని విన్నాడుస్వామి! స్పృహణీయాలైన పదాలతో సమస్తాభ్యుదయ పరిణతమై ఉంది ఆస్తుతి. స్వామి, తన మాయచే మళ్లీ ఆమెను మోహింపచేస్తున్నట్లుగా చిన్నగా నవ్వాడు. ఆమెను, "అలానే " అంటూ సమ్మానించి మరల్చి, ప్రేమతో యుధిష్ఠిరునిచే నివారింపబడిన వాడై, మళ్లీ హస్తినాపురాన్నే ప్రవేశించాడు. భీష్మాది మరణంచే విమనస్కుడైన యుధిష్ఠిరునికి వ్యాసాదులు, స్వయంగా కృష్ణుడు ప్రతిబోధనం చేశారు. అయినా అతని మనస్సు విశదపడలేదు.. *(ఇంకా ఉంది)*

## ప్రేమామృత హృదయులు




**శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి నిర్వహణలో ఆదిలాబాద్ జిల్లా, అల్లంపల్లి, బీర్సాయిపేట జీయర్ గురుకులంలో విద్యను అభ్యసిస్తున్న చిన్నారుల సురక్షిత ప్రయాణ సౌకర్యార్థం రవాణా సౌకర్యాన్ని కల్పించాలని, శ్రీమాన్ తోట రవీందర్, శ్రీమతి యశోధర దంపతులు భావించారు. దానికోసం అల్లంపల్లి జీయర్‌గురుకులం స్కూల్‌కు ఒక బస్సును, బీర్సాయిపేట జీయర్ గురుకులం స్కూల్‌కు ఒక బస్సును ఉదార హృదయంతో సమర్పించారు. ఈ కైంకర్య దాతలకు శ్రీస్వామివారు మంగళాశాసనములు అనుగ్రహించారు.**

**దీనిని ఆదర్శంగ తీసుకొని, మరింతమంది వదాన్యులు ముందుకు వచ్చి, ఈ పాఠశాలలను తమ కైంకర్యాలతో ముందుకు నడిపిస్తే, మార్గదర్శకులౌతారు.**

# నేర్చుకుందామా! - 11

**శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-విజయవాడ**

జీవితం చాలా విలువైనది. బ్రతికి ఉన్నంతకాలం ఈ సత్యాన్ని గుర్తుచేసుకుంటూ అనుకొన్న లక్ష్యాన్ని సాధించడం వివేకవంతుల లక్షణం. ఎందుకంటే ఏ సమయంలో ఏ రూపంలో మృత్యువు కబళిస్తుందో చెప్పలేం. మృత్యుదేవతకి వీరూ వారూ అనే భేదం లేదు. అందరూ సమానులేనట. ఆ విషయాన్ని ఈ క్రింది శ్లోకం వివరిస్తోంది.

**పండితేచైవ మూర్ఖేచ బలవత్యపి దుర్బలే**
**ఈశ్వరే చ దరిద్రే చ మృత్యోః సర్వత్ర తుల్యతా ॥**

మృత్యుదేవతలకి పండితుడనీ, మూఢుడనే తేడా ఏమీ ఉండదు. బలవంతుడనీ, బలములేనివాడని భేదమే ఉండదు.

ధనవంతుడనీ, బీదవాడనీ ఏమాత్రం ఆలోచనే ఉండదు. పుట్టిన ప్రతివారిని ఒకే విధమైన ఆదరంతో తన ఒడిలోనికి తీసుకుంటుంది ఆ దేవత.

**"జాతస్యహి ధృవో మృత్యుః"**

తస్మాత్ జాగ్రత్త.

# కలివైరిసూరి వైభవము



గత సంచిక తరువాయి...

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-8-4 (బృహత్సూక్తి)**

**పార్త్తర్కాయన్ను పారతమ్ కైశెయ్‌తిట్టు వెన్నుపరంశుదర్**
**కోత్తంగాయర్‌తమ్ పాడియిల్ కురవై పిణన్ద వెంకోవలన్,**
**ఏత్తువార్ తమ్మనత్తుళ్ళాన్ ఇడవెన్దై మేవియ ఎంబిరాన్**
**తీర్తనీర్ తడంశోలైశూழ் తిరువేంగడమడై నెంజమే! ॥**

ప్రతిపదార్థము: **అన్ను**=ఆనాడు; **పారతమ్**=భారతయుద్ధమందు, **పార్త్తర్కాయ్**=అర్జునుని కొరకు; **కైశెయ్ తిట్టు**=సేనను విభజించి; **వెన్న**=కౌరవులను జయించిన; **పరంశుదర్**= దివ్య తేజోవంతుడును; **అంగు**=అచ్చట; **ఆయర్‌తం పాడియిల్**= గోకులమందు; **కురవైకోత్తు**=రాసక్రీడను చేసి సంశ్లేషించిన; **ఎంకోవలన్**=మా గోపాలుడును; **ఏత్తువార్‌తమ్**=స్తోత్రము చేయువారియొక్క; **మనత్తుళ్ళాన్**=మనస్సునందున్నవాడును; **ఇడవెన్దై**=తిరువిడందై అను దివ్యదేశమందు; మేలిమి=పొందియున్న; **ఎమ్ పిరాన్**=మాకుపకారకుడునగు స్వామి వేంచేసియున్న; **తీర్తనీర్**= పరిశుద్ధమగు తీర్థముగల; **తడమ్**=తటాకములచేతను; **శోలై**=తోటల చేతను; **శూழ்**=పరివేష్టితమై ఉన్న; తిరువేంగడమ్=శ్రీ వేంకటాద్రి అనెడి దివ్యదేశమును; నెంజే=మనసా! అడై= ఆశ్రయింపుమా!

***తాత్పర్యము:*** ఓ మనసా! శ్రీ వేంకటగిరిని ఆశ్రయింపుము. పాండవపక్షపాతియై భారతయుద్ధమును జరిపి అందు విజయమును సాధించినవాడు. ఆశ్రిత సంరక్షణము నెరవేరినందుకు సంతోషముతో దివ్యరాజక్రీడను సలిపినవాడు తనను స్తుతించువారి హృదయములను వీడకనుండువాడు. తిరువిడందై క్షేత్రమున వెలసియున్నవాడునగు మన స్వామి తిరుమల క్షేత్రమున వేంచేసియున్నాడు. ఆ పర్వతము చుట్టూ ఎన్నెన్నో పుణ్యతీర్థములు, పూలతోటలు గలవు.

***విశేషార్థము:*** శ్రీకృష్ణభగవానుడు కేవలము, పూతనను, బకాసురుని, మద్దెవృక్షములను జయించుటయేకాదు. అతిరథ మహారథులగు భీష్మద్రోణాదుల దుర్వర్గమంతటిని జయించిన విధమును అంతటి ఆ స్వామి గొల్లభామల చేజిక్కి వారితో కలిసి చేసిన జానపద నృత్యమును తిరుమంగై ఆళ్వార్లు ఈ పాశురమున సరసముగ వివరించుచున్నారు. శ్రీకృష్ణ భగవానుని వీరశృంగారము ఈ పాశురమున వర్ణింపబడియున్నది.

**పార్త్తర్కాయ్ :** అర్జునుని కొరకు.

**అన్ను పారతం కైశెయ్‌తిట్టు :** అప్పుడు భారతయుద్ధమునందు వ్యూహాత్మకముగ సైన్యమును నడిపి.

**వెన్నుపరంశుదర్ :** దుర్యోధనాదులకు అపజయమును, పాండవులకు విజయమును కలుగునట్లు చేసి, ద్రౌపది కురులను ముడివేసిన పిమ్మట శ్రీకృష్ణుని దివ్యతిరుమేనిలో కలిగిన ఔజ్వల్యమును ఆళ్వార్లు ఈ పాశురమున "పరంశుదర్" గొప్పకాంతి అని అనుసంధించుచున్నారు. భక్తులకు తానిచ్చిన మాటను నెరవేర్చిన పిమ్మటనే అతడు (భగవంతుడు) గొప్పగ ప్రకాశించునట.

***అదియెట్లనగ :*** శ్రీరామాయణమున చూడుడు. రాజ్యకాంక్షి యగు విభీషణుడు సముద్రతీరమున శ్రీరామచంద్రుని శరణువేడెను. శ్రీరామచంద్రమూర్తి ఆతనిని అనుగ్రహించి అభయమునొసంగి అప్పటికప్పుడే ఆ సముద్రతీరమునందే విభీషణుని పట్టాభిషిక్తుని చేసెను. రావణవధ కాకనే విభీషణుని పట్టాభిషిక్తుని చేసిన శ్రీరామచంద్రమూర్తియొక్క ధైర్యము ఎంతటిదో కదా! శ్రీకూరేశ మిశ్రులు (కూరత్తాళ్వాన్) శ్రీరామభద్రునియొక్క ఈ సాహస ప్రవృత్తికి చకితులై అతిమానుష స్తవమునందు ఇట్లు అనుగ్రహించుచున్నారు.

**అబ్ధిం న తేరిథ న జిగ్యిథ రాక్షసేంద్రం**
**నైవాస్య జజ్ఞిఐ యదా చ బలాబలం త్వమ్ ।**
**నిస్సంశయ స్సపది తస్య పదేஉభ్యషించః**
**తస్యానుజం కథమిదం హి విభీషణం చ ॥** *(అతిమానుషం-24)*

తా॥ రామ! నీవింకను సముద్రమును దాటనేలేదు. రావణుని జయింపనేలేదు. కనీసము రావణాసురుని బలాబలములను కూడ నీవెరుగలేదు. రావణానుజుడగు విభీషణునకు పట్టాభిషేకమును ఎటులజేసితివి?

శ్రీరామచంద్రమూర్తి సత్యసంధుడు, మహావీరుడు. 'అంగుళ్యగ్రేణ తాన్ హన్యామ్' తన కాలిగోటితో రావణుని

సంహరించ గలననెడి ఆత్మవిశ్వాసము కలవాడు. ఆ విధముగనే రావణుని జయించినాడు. విభీషణుని లంకాభిషిక్తుని చేసినాడు. ఈ సందర్భమున మహర్షి వాల్మీకి శ్లోకమును చూడుడు.

**అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్ ।**

**కృతకృత్యః తదా రామో విజ్వరః ప్రముమోద హ ॥**

రాక్షసశ్రేష్ఠుడగు విభీషణుని లంకానగరమున పట్టాభిషిక్తుని చేసెను. తాను కృతకృత్యుడాయెను. అపుడే తాను రాముడనిపించు కొనెను. జ్వరరహితుడాయెను. సంతుష్టుడాయెను. ఇదియేమి ఆశ్చర్యము!

భగవంతుడు భక్తులకు తానిచ్చిన మాటను నెరవేర్చిన పిమ్మట తానెంతో సంతోషముతో పొంగిపోవును. ప్రకాశించుచుండును. ఈ విషయాలనే తిరుమంగై ఆళ్వార్లు ఈ పాదమున "పరంశుడర్" అనే పదముద్వారా వివరించి యున్నారు.

**కోత్తు ఇత్యాది:** కురవై అనునది జానపద నృత్యవిశేషము. గొల్లలు సరదాగా ఆడుకొనెడి ఒక విధమగు నాట్యము. గోకులమున గొల్లలు చేయు నృత్యములో తాను కూడ పాల్గొని వారితో కలిసి ఆ నృత్యమును చేసి భక్తులను ఆనందింపచేసిన స్వామి.

**ఏత్తు వార్ మనత్తుళ్ళాన్:** శ్రీవాసుదేవుని భక్తులు నిరంతరము ధ్యానము చేయు రాసక్రీడయొక్క ప్రభావమును శ్రీకూరేశమిశ్రులు అతిమానుషస్తవమున ఇట్లు అనుసంధించుచున్నారు.

**ధూర్తాయితం తవ తు యత్కిల రాసగోష్ఠ్యాం ।**

**తత్కీర్తనం పరమపావన మామనన్తి ॥** *అతిమానుషస్తవం 58*

ఓ కృష్ణా! రాసక్రీడలో నీ ధూర్త చేష్టితములను కీర్తించుట పరమపవిత్రమని పెద్దలనుచున్నారు. అట్టివారి హృదయములను ఎడబాయక నుండువాడు.

**ఇడవెన్దై:** తిరువిడందై క్షేత్రమున లక్ష్మీదేవి కొరకు వచ్చి స్థిరముగ వేంచేసినట్లు తన వైభవమును స్తుతించు వారి హృదయములను వీడక అందే స్థిరముగ వేంచేసి ఉండునటు వంటివాడు.

**తీర్తనీర్:** సకల సమృద్ధిని కలిగించునటువంటి జలసమృద్ధి కలదై శ్రమలను తీర్చునటువంటి తోపులతో నిండియుండునది తిరుమలక్షేత్రము.

తీర్థమ్ అనుపదమునకు పావనము అనియు అర్థము కలదు. దృష్ట అదృష్ట ఫలములను కలిగించునటువంటి నీటితో కూడిన క్షేత్రము తిరుమల దివ్యదేశము. మనసా! అటువంటి శ్రీవేంకటగిరిని ఆశ్రయింపుమా! *(ఇంకా ఉంది.)*



# అహో! భారతమ్

*(గత సంచిక తరువాయి)*

**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ**

'నాయనా! అంతకాలం ఆగితే రాజ్యం అరాజకం కాదా! అందుకని వెంటనే వంశాంకురాలు కలగాలి' అంది.

సరే! అన్నాడాయన. సత్యవతి వెంటనే ఋతుస్నాతయైన అంబిక దగ్గరకి వెళ్ళి విషయం వివరంగా చెప్పి.. అమ్మా! సిద్ధంగా ఉండు అని వెళ్ళింది. సరే అంది అంబిక. వ్యాసుడు బయలుదేరి వచ్చాడు.

అతనిని చూడగానే భయపడిపోయింది అంబిక. బాబోయ్ ఆ గడ్డం- ఆ రంగు ఏమిటీ? ఆ జడలేమిటీ? ఆ కళ్ళు చూపులు ఏమిటీ? సన్నగా, నల్లగా, పొడుగ్గా.. ఆ శరీరం.. రూపురేఖలు ఏమిటీ? భయంతో కళ్ళు రెండు గట్టిగా మూసేసుకుంది. పుత్రదానం చేసిన తరువాత వ్యాసుడు అంబికకి కొడుకు పుడతాడు. కాని, తల్లిదోషం వలన వాడు అంధుడు, గుడ్డివాడుగా పుడతాడు అని చెప్పాడు తల్లికి. సత్యవతి మనస్సు నీరుకారిపోయింది.

నాయనా! పోనీ అంబాలికకి ఒకపుత్రుని ప్రసాదించు అని కోరింది. తల్లిమాటని కాదనలేక పోయాడు వ్యాసుడు. కాని, అంబాలిక వ్యాసుని చూచి భయంతో వెలవెల పోయింది. శరీరం పాలిపోయింది. వ్యాసుడు తల్లికి ఆ విషయం చెప్పి అమ్మా... బల పరాక్రమవంతుడయిన కొడుకు పుడతాడు కాని, పాండుదేహుడు అవుతాడు అని చెప్పాడు. తెల్లని శరీరంతో వెలవెలపోయే రంగుతో పుడతాడు అని చెప్పాడు. అతని మాటలకి తల్లి విలవిలలాడింది. నాయనా! అంబికకి గుడ్డివాడు పుత్రుడన్నావు. మంచివానిని ఒక్కకొడుకుని ప్రసాదించవా! అని కోరింది. 'అమ్మా... స్త్రీమనసుని బట్టి సంతానం ఉంటుంది. ఆవిడ నిగ్రహం కల్గి మంచిగా ఉంటే మంచికొడుకే పుడతాడు' అన్నాడు. ఆయన అన్నట్టు అంబికకు ఒక కొడుకు పుట్టాడు కాని, అతడు గ్రుడ్డివాడుగా పుట్టాడు. బుద్ధిని చూపుగా చేసుకొనవలసివచ్చింది అతనికి. పదివేల ఏనుగుల బలంతో పుట్టాడు. అయితేనేం తల్లి చేసిన పనికి ఫలితంగా అంధుడయ్యాడు.

అలాగే అంబాలికకి కూడా కొడుకు పుట్టాడు. కాని అంబాలిక వ్యాసుని చూచి భయపడిపోయి వెలవెల పోయింది కదా! అందువలన పాండువర్ణంతో పుట్టాడు కొడుకు. సద్గుణాలన్నీ మూర్తీభవించినవాడే! తెల్లని చర్మంతో పాండురాజు జన్మించాడు. భీష్ముడు జాతకర్మ మొ॥ సంస్కారాలన్నీ యథావిధిగా చేయించాడు.

మనిషి పుట్టినప్పటినుండి మరణించేవరకు 16 సంస్కారాలు చేస్తారు. వాటిని షోడశకర్మలు అంటారు. అవి 1. గర్భాధానం, 2. పుంసవనం, 3. సీమంతం, 4. జాతకర్మ, 5. నామకరణం, 6. అన్నప్రాసనం, 7. చౌలం, 8. ఉపనయనం, 9. ప్రాజాపత్యం, 10 సౌమ్యం, 11. ఆగ్నేయం, 12 వైశ్వదేవం, 13. గోదానం, 14. సమావర్తనం, 15 వివాహం. 16.అపరక్రియ అనేవి.

ఇలా పుట్టుగ్రుడ్డి, పాండురోగి కలగడం వలన సత్యవతి దుఃఖానికి అంతం లేకుండా పోయింది. వ్యాసుని తలచుకొంది. వెంటనే వచ్చి ఎందుకమ్మా పిలిచావు అన్నాడాయన. ఆవిడ నాయనా! అంబికకి గ్రుడ్డివాడు పుట్టాడు కదా! ఆమెకు అందమైన ఒక్క కొడుకు నియ్యవయ్యా! అంది. తలవంచి అంగీకరించా డాయన. వెంటనే సత్యవతి అంబికకి విషయం వివరించి సిద్ధం చేసింది. కాని, అంబిక వ్యాసుని వేషాన్ని, ఆకారాన్ని, శరీరం వాసనని తలచుకొని ఒక్కసారి అసహ్యించు కొంది. తన దాసిని ఒకావిడని పిలిచి తన అలంకారాలన్నీ పెట్టి తనస్థానంలో ఉంచి తప్పుకుంది. ఆ దాసి వ్యాసుని ఆనందంగా సేవించింది. వ్యాసుడామె సేవలకు మురిసి చక్కని సంతానాన్ని అనుగ్రహించాడు. ఆ పుత్రుడే విదురుడు. ఈ విదురుడెవరంటే యముడే భూలోకంలో పండితుడు, ధర్మమూర్తి, బలసంపన్నుడు అయిన విదురునిగా పుట్టాడు. యముడు ధర్మమూర్తి కదా! అంతటివాడు దాసీవనితకి కొడుకుగా పుట్టడం ఏమిటి అని అందరికీ సందేహం. అదొకకథ.

విదురుడే యముడు. అతడు దాసికి ఎందుకు జన్మించా డంటే.. పూర్వం మాండవ్యుడు అని ఒక బ్రహ్మర్షి భూలోకంలో ఉన్న పుణ్యతీర్థాలన్నింటిని చక్కగా సేవించుకొని, పట్టణానికి దూరంగా ఒక అడవిలో ఆశ్రమం నిర్మించుకున్నాడు. దాని ద్వారప్రాంతంలో చెట్లు వేసి ఆ చెట్టు మొదట్లో చేతులు పైకెత్తి మౌనంగా తపస్సు చేసుకుంటున్నాడు.

కొందరు దొంగలు ఆ పట్టణం రాజుగారి ధనం దోచు కున్నారు. రాజభటులు ఆ దొంగల్ని వెంటాడారు. ఏం చెయ్యాలో తెలియక వారంతా మాండవ్యుని ఆశ్రమంలో దాక్కొన్నారు. తరుముకుంటూ వస్తున్న భటులు మునిని చూచి ఇదిగో దొంగలు నీ దగ్గరకే పరుగెత్తుకొని వచ్చారు. ఏరీ.. ఏమయ్యారు? చెప్పు అంటూ అరిచారు.

కాని, మాండవ్యునికి ఇవేమీ తెలియవు. తన తపస్సులో తాను మునిగిపోయి ఉన్నాడు. అందువల్ల ఏసమాధానం చెప్పలేదు. భటులకి కోపం వచ్చింది. ఆశ్రమంలో వెదికి దొంగల్ని పట్టుకొన్నారు. ఇలాంటి దొంగతనాలు చేయిస్తూ మునిలా వేషం వేసుకొని నటిస్తున్నావా అంటూ తిట్టారు. దొంగలతోపాటు మాండవ్యుని కూడా బంధించి ధనంతో సహా రాజుకి అప్పగించారు. రాజు దొంగలని చంపించాడు ఈ మునిని చూశాడు. అసలు దొంగ ఇతడేకదా! అని నగరం బయట ఇనుపటెక్కెంలో దిగవేసి కట్టిపడేయమన్నాడు. అయినా మాండవ్యుడు కోపగించలేదు. శాంతాన్నే పాటించాడు. ఆహారం లేకుండా అలాగే తపస్సు చేసికొంటున్నాడు. అతని ఇంద్రియ నిగ్రహానికి ఋషులు ఆశ్చర్య పడ్డారు. రాత్రివేళ పక్షుల ఆకారంలో వచ్చి 'నీలాంటి వానిని ఇంతలా బంధించిన వారెవరయ్యా' అంటూ ప్రశ్నించారు.

వారి మాటలు విని మాండవ్యుడు పరిహాసంగా నవ్వాడు. అయ్యా! మహర్షులారా! మీకన్నీ తెలుసు. తెలిసి తెలిసి ఇలా అడుగుతున్నారేమిటి? మనిషి తన కర్మకి తానే ఫలమనుభవించాలి కదా! అన్నాడు. నగర రక్షకులు అతని మాటలు విని వెంటనే రాజుకు చెప్పారు. రాజు పరుగు పరుగున బయలుదేరి వచ్చి మాండవ్యుని కాళ్ళపై పడ్డాడు. మహర్షీ! నా తప్పుని మన్నించు. తెలియక నిన్ను శిక్షించాను. క్షమించు అంటూ.. అతని శరీరంలో గ్రుచ్చిన శూలాన్ని బయటికి లాగాడు. అది తీయడానికి రాలేదు. అప్పుడు నెమ్మదిగా నరికించాడు. అతని కంఠంలోని ప్రక్కభాగంలో శూలం ముక్క మిగిలిపోయింది. అణి అంటే శూలం చివరిభాగం. శూలం చివరిభాగం శరీరంలో మిగిలిపోయింది కాబట్టి అలా ఉండడం వలన అతనికి అణిమాండవ్యుడు' అనే పేరు వచ్చింది. మాండవ్యుడు ఘోరాతి ఘోరంగా తపస్సు చేసి యముని లోకానికి వెళ్ళాడు.

ఓ దండధరుడా! నేనేంపాపం చేశానని ఇటువంటి శిక్షని విధించావు అని అడిగాడు. అప్పుడు యముడు అయ్యా! నువ్వు నీ చిన్నతనంలో చేసిన తప్పుకు శిక్ష ఇది. నువ్వు చిన్నప్పుడు తూనీగలు ఎగురుతూ ఉంటే వాటిని ఎగురనీయకుండా పట్టేసుకొని వాటిని మేకులకు గ్రుచ్చి ఉంచేవాడివి. వాటి రెక్కల్ని దర్భలతో గ్రుచ్చేవాడివి. ఆ పాపఫలాన్ని ఇప్పుడు ఈ శిక్షగా అనుభవించావు. హింస చేసేవారికి శిక్షలు తప్పవు కదా! అన్నాడు.

## గోమాత జగన్మాత - గోదానం వరదానం

**గవామంగేషు తిష్ఠంతి భువనాని చతుర్దశ**
**యస్మాత్ అస్యాః ప్రదానేన అతః శాంతిం ప్రయచ్ఛమే ॥**

అన్ని దానాలలోను గోదానం గొప్పది. పదునాలుగు లోకాలు గోవులో నిండి ఉన్నాయి. సర్వపాప హరమైన గోవును పోషించడం సర్వలోక పోషణమే ఔతుంది. మన స్వామివారు నిర్వహించే గోశాలలు-గోజాతి రక్షణకై వారు పడే తపన మనకి తెలిసినదే! అందుకే గోపోషణలో మీ ధనాన్ని సద్వినియోగ పరచుకోండి. గోమాత పరిరక్షణలో చేయూత నందించండి. **మరిన్ని వివరాలకు జెట్ సీతానగరం, 08645 272929, 272353**

మాండవ్యునికి చాలా కోపం వచ్చింది. ఒకమనిషి పుట్టింది మొదలు పన్నెండు ఏళ్ళు దాటే వరకూ వాడు బాలుడు. వాడికి ధర్మ, అధర్మాలు తెలిసేవయస్సు కాదది. ఆ సమయంలో అతడే తప్పు చేసినా పాపం రాదు. అతణ్ణి ఏమైనా చేస్తే ఆ కీడు చేసిన వారు మహాపాపం పొందుతారు. పిల్లలు తప్పు చేస్తూంటే పెద్దలు చూస్తూ ఊరుకోకూడదు. వారిని వారించాలి. పదునాల్గు సంవత్సరాల వయస్సు వరకు పిల్లలకు పాపము అంటదు. ఇది నేను చేసిన నియమం. నువ్వు ఈ విషయం తెలుసుకొనక నా బాల్యంలో నాకు తెలియక చేసిన పాపానికి ఇంత పెద్ద శిక్ష విధించావు. దానికి ఫలితం అనుభవించు. మానవలోకంలో ఒక దాసికి పుత్రునిగా పుట్టు అంటూ శపించాడు. ఆ శాపం మూలంగా యముడు ఇప్పుడు ఈ అంబికదాసికి కుమారునిగా జన్మించాడు. అతడే విదురుడు. అతడు ధర్మార్థకుశలుడు. లోభం, క్రోధం లేనివాడు. శాంతికాముడు. శాంతిస్వరూపుడు. కురువంశ శ్రేయోభిలాషి.

ఇలా వ్యాసుని వలన అంబికకి ధృతరాష్ట్రుడు, అంబాలికకి పాండురాజు, అంబిక దాసికి విదురుడు జన్మించారు. విదురుడు యముడే. శాపఫలం అనుభవించేవానిగా పుట్టిన దండధరుడు. మాండవ్యుని శాపఫలితంగా ఈ లోకంలో జన్మించిన యమధర్మరాజు.

మాండవ్యుని కథలో పిల్లలు చేసే ఆకతాయి అల్లరి పనులు ఎలాంటి శిక్షకు దారితీస్తాయో తెలుస్తోంది. పిల్లలు చేసే చెడు పనుల్ని పెద్దలు వారించాలి. ఎప్పటికప్పుడు పిల్లలకి ప్రబోధిస్తూ ఉండాలి. వారిని మంచిమార్గంలో నడిపించవలసిన బాధ్యత పెద్దలదే! పట్టించుకొనకపోతే ఆ జీవితాలు ఎలా శిక్షింప బడతాయో మనకి తెలియచేస్తుంది మాండవ్యుని కథ.

ఇలా భారతంలో ఎన్నో విశేషాలు. స్త్రీలు ఎప్పుడు ఎలా ఉండాలో.. తమ మనస్సును ఎంత మంచిగా.. ఆనందంగా ఉంచుకోవాలో.. అలా లేకపోతే ఎటువంటి సంతానం కలుగుతుందో పైకథవలన మనకి తెలుస్తోంది. ఇలాంటి నీతుల నెన్నింటినో మనకి అందించే భారతకథ, నిత్యనూతనంగా అహో అనిపిస్తుంది. ఆ కథలను ఆస్వాదిస్తూ సాగుదాం! *(ఇంకా వుంది)*



## ముఖచిత్ర పరిచయం:

శ్రీమద్ వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య, పరమహంస పరివ్రాజక శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి తిరునక్షత్ర మహోత్సవం సందర్భంగా వారి దివ్య ముఖ మండలం భక్తినివేదన ముఖచిత్రమైంది. ఆ పరమహంస విహారం.. ఆ దివ్యజ్ఞాన జలాలు.. దర్శించండి.

పరిచయావసరమే లేని పరమహంస... జ్ఞాన భాస్కర స్వరూపులు మన పెద్దజీయరుస్వామివారు. ఆ మందస్మిత వదనారవింద శోభ అక్కడ లేక మరెక్కడ కన్పిస్తుంది? దివ్య ముఖవర్చస్సు వేరెక్కడ దర్శనీయ మౌతుంది! *శీతాంశోః అమృతార్పణమ్* అన్నట్లు చంద్రునికి అమృత సమర్పణమా? పెద్ద జీయర్ స్వామివారికి పరిచయమా! అవసరమా! మన తృప్తికోసం, ఆత్మానందం కోసం - కృతజ్ఞతా నివేదన కోసం, భక్తజన హృదయానందం కోసం ఈ ప్రయత్నం.

మన భక్తినివేదన పత్రిక వ్యవస్థాపకులు, మన చిన్న జీయర్ స్వామివారి ఆచార్యులు, లోకోద్ధరణ కాంక్షతో ఆ శ్రీమన్నారాయణుని ఆజ్ఞతో అర్తమూరు గ్రామంలో అవతరించిన అపర రామానుజులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు.

ఆశ్రమ స్వీకారానికి పూర్వమే హరిజనోద్ధరణకి దీక్ష వహించారు. దేశభక్తిని మనసంతా నింపుకొని ఖాదీ ఉద్యమాన్ని ప్రోత్సహించారు. కులమతాతీత వ్యవస్థకే శ్రీకారం చుట్టారు. హోమియో వైద్యులుగా కుగ్రామాలు కూడా దర్శించి, ఆరోగ్యదాతలైన జ్ఞానభాస్కరులు పెద్ద జీయరుస్వామివారు. న్యాయ వేదాన్త విద్వాన్, ఉభయ వేదాన్త ప్రవర్తకా చార్యులు శ్రీమాన్ తెలికిచెర్ల కందాళ గోపాలాచార్య స్వామివారితో వీరి కలయిక శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారానికే వెన్నెముకగా నిలిచింది. శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజా చార్య స్వామివారి ప్రవేశం వీరికి త్రిమూర్త్యాత్మకతని జోడించింది. శ్రీమత్ ఉభయ వేదాన్త పీఠాన్ని స్థాపించి, సంస్కృత వాఙ్మయ లోకానికి వీరు గావించిన సేవ నిరుపమానం.

ఆధ్యాత్మిక చింతనకీ, సామాజిక స్పృహని జోడించడంతో వీరి సేవా సంపద హద్దులు లేని ఆకాశాన్ని, అంతు చూడలేని సాగరాన్ని కూడా వెక్కిరించింది. పవిత్ర జంతువైన గోమాతసేవకి శ్రీకారం చుట్టి గోశాలలు నెలకొల్పి గోరక్షణ ప్రధానధ్యేయంగా సాగిన వీరి అకుంఠిత దీక్షకి లోకం కైమోడ్పులందించింది. లోకులనుద్ధరించి తరింపచేయడం కోసం వీరు చేపట్టిన కోటి తులసియజ్ఞాలు, శ్రీరామ క్రతువులు, స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాలు, అష్టాక్షరీ మహాక్రతువులు, శిక్షా శిబిరాలు, సీతా కళ్యాణాలు, పుష్కర ప్రయుక్త బ్రహ్మ యజ్ఞాలు, శుక్రవారోత్సవాలు, సహస్రనామ పారాయణలు... ఒకటా రెండా నిద్రాణమైన జాతిని మేల్కొల్పి చైతన్యాన్ని రంగరించిపోసి జాగృతం చేసి ఆధ్యాత్మిక చింతనతో నింపివేశాయి.

సామూహిక ఉపనయనాది సంస్కార కార్యక్రమాలు చేయూత నిచ్చాయి. పండితసన్మానాలు, ఉభయ వేదాంతసభలు శ్రీరామాయణాది పారాయణ కార్యక్రమాలు పామరులకే కాదు పండితులకి కూడా అత్యంత ప్రోత్సాహకాలై అలరారాయి. మహిళా సంఘాలు, శుక్రవారోత్సవ పూజాదికాలు మహిళాలోకాన్ని వెన్నుతట్టి లేపి సంఘవ్యవస్థని సుస్థిరం చేయడంలో స్త్రీల కర్తవ్యాన్ని చాటి చెప్పాయి.

శ్రీస్వామివారు ఆ సేతు శీతాచలం శ్రీరామాయణ క్రతు సందర్భంగా జాతికందించిన శ్రీరామనామ స్థూపాలు భారతీయ ఆర్ష సంప్రదాయా నికి ఎత్తిన పతాకలై విశ్వానికే హిందూధర్మ వైశిష్ట్యాన్ని చాటి చెప్పాయి.

అష్టాక్షరీ మహామంత్ర జపంతో మరింత పునీతమైన వీరి అవతారం కణ్ణినుణ్ శిరుత్తాంబు దివ్య పారాయణతో దేదీప్యమాన శోభలను సంతరించుకొంది. శ్రీవారి దివ్యదర్శనం భక్తులకి అత్యద్భుతమైన ఆనందా న్నిచ్చింది. ఆత్మ విశ్వాసాన్ని పెంచింది. శ్రీరామానుజ సిద్ధాంత వైభవాన్ని లోకమంతటా విస్తరింపచేసింది. నాస్తికత్వాన్ని పరుగులు పెట్టించింది. దైవ చింతనని లోకమంతా నింపింది. లోకమనే జైలులో మేం ఉన్నాం. జైలుగా కనిపించే భాగంలో మీరున్నారు. ఆ భగవంతుణ్ణే మీ హృదయాలలో బంధించండి అంటూ ఖైదీలకు వారందించిన ఉపదేశామృతం ఎందరో ఖైదీల జీవితాలలో వెలుగులు నింపింది. శిక్షలని రద్దుచేసింది. స్వతంత్ర ప్రతిపత్తిని కలిగించింది. శ్రీరామనామలేఖనం మానవ జీవితాలనే దైవత్వంతో నింపేసింది.

*న చేత్ రామానుజ ఇతి ఏషా చతురాచతురక్షరీ* అని "రామానుజ" అనేనాల్గు అక్షరాలు లేకుంటే ఏమయ్యేవారమో అని ఆలోచించే జాతికి, మన జీయర్ స్వామి లేకుంటే ఈ ప్రచారం, ఈ అభివృద్ధి, ఈ సాహాయ్యక చర్యలు, ఈ జాతి-ఈ జీవనం... అసలుండేవా అన్న స్థితిని స్థిరం చేసింది శ్రీవారి జీవితం.

*'యస్మిన్ జీవతిసతి జీవంతి బహవః స తు జీవతి'* అన్న ఆర్యోక్తిమార్గంలో... ఒక్క వ్యక్తి అవతార ప్రసక్తి జాతి మనుగడకి ఆధారమై నిలిచింది. శ్రీ చిన్న జీయర్ స్వామివారి ఆచార్య సేవాయాత్ర.. శ్రీవారి వైభవాన్ని వేనోళ్ళ లోకానికి చాటింది. ఆ మహనీయుని జన్మనక్షత్రం జాతికి పండుగ నిచ్చింది. వారికి పరిచయమేమిటి? మన తృప్తి.. మన ఆనందం.. మనం వారి పరివారమనే ధైర్యం...

జై శ్రీమన్నారాయణ!

యుద్ధకాండలో



# శ్రీరామాయణంలో పక్షులు



*(గత సంచిక తరువాయి)*

విభీషణుని ప్రార్థన విన్నాడు సుగ్రీవుడు. శ్రీరామచంద్రునిపైన అతనికెంతో ప్రేమ. అతి ప్రేమ ఎప్పుడూ పాపాన్నే శంకిస్తుందంటారు కదా! అందువల్ల ఆయన ఆలోచనలు ఇలా సాగాయి. 'ఈ రాముడసలే శరణాగత వత్సలుడు. ఎవరైనా శరణు అని అంటే చాలు, ఒక్కసారి అన్నా చాలు రక్షిస్తానని వ్రతం పట్టి కూర్చున్నాడు కదా! ఇప్పుడీ విభీషణుని మాటలు ప్రార్థన విని వెంటనే రక్షించాలని అనుకుంటాడు. విభీషణుని మనస్సు తెలుసుకోవాలనే అనుకోడు. మరి ఆ రాక్షసుడు ఏదైనా దురాలోచన-పాపపుటాలోచన చేస్తే ఇంకేమైనా ఉందా...' అని. అక్కర్లేని భయం చోటు చేసికొంది. వెంటనే లక్ష్మణుని కూడా తనతో తీసుకొని శ్రీరామచంద్రుని ముందుకు వెళ్ళాడు. మధ్యలో ఆయనెందుకు అంటే ఆయన ఆలోచనలు కూడా ఇలాగే కలుస్తాయి. ఎందుకంటే శ్రీరాముని మీద చెప్పలేనంత ప్రేమ ఆయన గుండెల్లో. అందుకని ఆయనతో కలిసి వెళ్ళి మరీ చెప్తున్నాడు.

'ఆ వచ్చిన వాడెవరనుకొంటున్నావు స్వామీ...! వాడి పేరు విభీషణుడు. రావణునికి సాక్షాత్తుగా సోదరుడు. (ఆ రాక్షసబుద్ధులే ఉంటాయి అన్నసూచన) రామా! ఒక్కడూ రాలేదు తెలుసా...! నలుగురు మంత్రులతో కలిసి మరీ వచ్చాడు నిన్ను శరణు వేడడానికి.

శ్రీరామా! కార్యాకార్యాలని విచారించేటప్పుడు సైన్య విచారణలో, రాజనీతి విషయంలో, చారులను పంపించే విషయంలో మనం చాల జాగ్రత్తగా ఉండాలి. అప్పుడే పనిలో విజయాన్ని సాధించగల్గుతాం. ఈ రాక్షసులున్నారే ఎన్నో మాయలు తెలిసినవారు, కామరూపులు. వీరిని అస్సలు నమ్మకూడదు. ఏమో... ఒకవేళ రావణాసురుని గూఢచారిగా వచ్చాడేమో! మన బలాలన్నీ తెలుసుకొని వంచిస్తాడనిపిస్తోంది. కాబట్టి మంత్రులతో సహా ఈ విభీషణుని చంపవలసినదే! అంటూ తన మనోభావాలతో పాటు తన ప్రేమనీ వ్యక్తం చేశాడు. విన్నాడు శ్రీరామచంద్రుడు. అక్కడున్న హనుమాన్ మొదలైన వీరులను చూస్తూ... విన్నారుగా ఈ సుగ్రీవుని మాటలు మరి మీరంతా నా శ్రేయోభిలాషులే కదా! మీరేమంటారు చెప్పండి అని అడిగాడు. వారంతా ఆయన అలా అడిగినందుకు మురిసిపోయారు. స్వామీ నీకు తెలియని విషయాలు మేం చెప్పగలిగినవి ఏమున్నాయి చెప్పు. పెద్దమనసుతో మా అభిప్రాయం తెలుసుకోవాలని మాకో అవకాశమిచ్చావని మాకు తెలుసు. అయినా అడిగావు కనుక ఆనందంతో మా అభిప్రాయం చెపుతాం అంటూ ముందుకి వచ్చారు.

ముందుగా యువరాజుగారు అంగదుడు 'ఈ విభీషణుడు శరణు శరణు అంటూ వచ్చిన మాటే నిజమే! అయినా, ఎక్కడి నుంచి వచ్చాడు అని ఆలోచిస్తే, శత్రువు.. మనకే శత్రువైన రావణుని దగ్గర నుండి వచ్చాడు కదా! అందువల్ల మనకి అనుకూలుడు కాదు అనిపిస్తోంది. నమ్మదగిన వాడు కాడనిపిస్తోంది. అందువల్ల ఇతని గుణదోషాలని ఒక్కసారి పరీక్షించాలి. మంచివాడని తెలిస్తే రక్షించవచ్చు. కాదు అని తెలిస్తే విడిచి పెట్టవచ్చు. కాబట్టి ముందుగా అతడెలాంటివాడో పరీక్షించాలి. చిన్న చిన్న దోషాలున్నా మొత్తం మీద మంచివాడేనని తెలిశాకే రక్షించాలి. ఏమంటారన్నట్లు చూశాడు అంగదుడు.

శరభుడు లేచాడు. ఒకపని చేద్దాం. సూక్ష్మబుద్ధి గల ఒక చారుణ్ణి పంపి పరీక్షిద్దాం. దానిని బట్టి నిర్ణయిద్దాం అన్నాడు.

జాంబవంతుడు ముందుకి వచ్చాడు. మనకింతహాని చేసిన బద్ధ శత్రువు, మహాపాపి అయిన రావణుని దగ్గరనుండి దేశం కాని చోట, అన్నగారిని విడిచి పెట్టకూడని కాలంలో విడిచి పెట్టి వచ్చాడే.. ఆలోచించండి. నాకైతే నమ్మబుద్ధి కావడం లేదు. రక్షించాలా.. చెప్పండి అన్నాడు.

మైందుడు అన్నాడు గదా... అయ్యా! నెమ్మదిగా, తియ్యగా మాట్లాడి విభీషణుణ్ణి మాటల్లో దింపి రావణుని గూర్చి అడిగి తెలుసుకుందాం! ఆయన మాటల్లో భావాన్ని బట్టి మంచివాడా.. చెడ్డవాడా అన్న విషయం తెలుస్తుంది గదా.. అపుడు చూడవచ్చు అన్నాడు.

ఈ మాటలన్నీ వింటున్నాడు హనుమ. ఆయన ఎంత సంస్కార సంపన్నుడో మొట్టమొదటిసారి ఆయనను కలిసినపుడు శ్రీరామచంద్రుడే ప్రశంసించాడు కదా! అంతటి మహనీయుడు ముందుకి వచ్చి ఇలా అన్నాడు. *(ఇంకా వుంది)*

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...)

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

వర్తి అడిమై శెంజోనో లక్ష్మణనైప్పోల

కైక భరతుడికి పట్టం కట్టాలనే రాముడిని అడవులకు పంపింది. మరలాంటప్పుడు భరతుడు రాముడితో అడవికెలా వెళతాడు? పైగా, ఇవన్నీ జరిగేటప్పుడు భరతుడు అక్కడ లేడు. తన మేనమామ ఇంట్లో కేకయరాజ్యంలో ఉన్నాడు.

"అదే నేనడిగింది..." అన్నాడు కృష్ణుడు.

"సరేలే.. ఇప్పుడన్నా చెప్పేది సరిగ్గా విను. భరతుడు కేకయరాజ్యంలో ఉన్నాడని చెప్పానా! శత్రుఘ్నుడు కూడా భరతుడితోనే ఉన్నాడు. ఇక్కడ అయోధ్యలో శ్రీరామపట్టాభిషేకం చేయాలని నిశ్చయించడం, అది తెలిసి కైక తన వరాలడగడం, శ్రీరాముడిని అడవులకు పంపటం, ఆ దుఃఖం భరించలేక దశరథుడు మరణించడం మొదలైన విషయాలేవి భరత, శత్రుఘ్నులకు తెలియదు. తండ్రి మరణించాక అప్పుడు ఆ వార్త తెలియజేసి భరతుడిని అయోధ్యకు తీసుకువచ్చారు మంత్రులు.

అయోధ్యకు వచ్చాక జరిగిన విషయాలు తెలుసుకొని ఎంతో బాధపడ్డాడు భరతుడు. తన తల్లి కైక మీద కోపం తెచ్చుకున్నాడు. భరతుడు స్వార్థం లేనివాడు. అన్నగారి మీద అపారమైన ప్రేమ గలవాడు. ధర్మం తెలిసినవాడు కావటం చేత తల్లి చేసిన పనులకు ఆమెను తీవ్రంగా మందలించాడు. సామాన్యులైతే, స్వార్థంతో ఏదో రకంగా తల్లి తనకు రాజ్యం సంపాదించి పెట్టింది కదా! అని సంతోషించేవారు."

"మరి భరతుడు శ్రీరాముడి తమ్ముడు కదా! స్వార్థం ఎందుకుంటుంది?" కిట్టు.

"అవును కదా! అందుకే తండ్రికి చెయ్యాల్సిన ఉత్తరక్రియలు పూర్తి కాగానే మంత్రులను, పురోహితులను, శ్రేయోభిలాషులను సమావేశపరిచాడు. ఇది రాముడి రాజ్యం. ఆయన ఏలాల్సిందే! అందుకని అందరం అడవిలో ఉన్న రాముడి దగ్గరకు వెళ్లి బతిమాలి, ఒప్పించి తీసుకువద్దాం! ఆయనకే పట్టాభిషేకం చేద్దాం!" అని చెప్పాడు. మంత్రులు, పెద్దలు రాజ్యభారం స్వీకరించమని భరతుడితో అన్నారు. అందుకు భరతుడు, నేను ఈ రాజ్యం రెండూ ఆ శ్రీరాముడి సొత్తు. ఆయన వస్తువులం. ఒక వస్తువు మరొక వస్తువును పరిపాలించటం లోకంలో ఎక్కడైనా, ఎప్పుడైనా జరిగిందా? నాకు ఈ రాజ్యభారం వద్దు. శ్రీరాముడి దగ్గరకి వెళ్ళి శరణువేడి ఎలాగైనా రాజ్యానికి తీసుకువద్దాం! అందరూ సహకరించండని సభలోనివారిని కోరాడు. భరతుడి మాటలకు మంత్రులు, పురోహితులు, పెద్దలు సంతోషించి ప్రయాణసన్నాహాలు మొదలుపెట్టారు.

అందరూ కలసి చిత్రకూటంలో ఉన్న సీతారామ లక్ష్మణుల దగ్గరకి చేరారు. కుశలప్రశ్నలయ్యాక తండ్రిమరణవార్త తెలుసుకొని ఎంతో బాధపడ్డారు సీతారామలక్ష్మణులు. తరువాత భరతుడు తాము వచ్చిన పని చెప్పాడు. అన్నగారిని అయోధ్యకు వచ్చి రాజ్యపాలన చేయమని అడగటానికే వచ్చామని చెప్పాడు.

**ఏభిశ్చ సచివైః సార్థం శిరసా యాచితో మయా ।**
**భ్రాతుః శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తు మర్హసి ॥**

*(శ్రీరామాయణం, అయోధ్యకాండ,104-12.)*

నీకు శిష్యుడిని, దాసుడిని, ఈ మంత్రులందరితో కలిసి శిరసువంచి నమస్కారం చేస్తున్నాను. నువ్వు కరుణించి అయోధ్యకు రావాలని ప్రార్థించాడు. దానికి రాముడు..

**న మయా శాసనం తస్య త్యక్తుం న్యాయమరిందమ ।**
**తత్ త్వయాఽపి సదా మాన్యం స వై బంధుః స నః పితా॥**

*(శ్రీరామాయణం, అయోధ్యకాండ,104సర్గ-12శ్లో.)*

"తండ్రిగారి ఆజ్ఞ ఉల్లంఘించడం ధర్మముకాదు. నేనూ త్రికరణశుద్ధిగా పాటించి పధ్నాలుగేళ్ళు వనవాసం చేస్తాను. నువ్వూ అలాగే రాజ్యభారం వహించి మంచి పరిపాలన నందించు" అని చెప్పాడు.

భరతుడు ఎన్నో రకాలుగా బతిమాలినా, ప్రార్థించినా రాముడు తండ్రిమాట మీరడానికి ఒప్పుకోలేదు.

ఆఖరికి భరతుడు...

**సోఽధిరుహ్య నరవ్యాఘ్రః పాదుకే హ్యవరుహ్య చ ।**
**ప్రాయచ్ఛత్ సుమహాతేజా భరతాయ మహాత్మనః ॥**

బంగారు తాపడం చేసిన ఈ పాదుకలను ధరించి ఇవ్వు. వీటినే సింహాసనం మీద ఉంచి నీ ఆజ్ఞగా పరిపాలిస్తాను అని ప్రార్థించి ఆ పాదుకలు తీసుకొని వెనుకకు తిరగాడు. పధ్నాలుగేళ్ళు తను వనవాసిలాగా నారచీరలు కట్టుకొని, కందమూలాలనే తిన్నాడు. ఒక్కక్షణం కూడా మరిచిపోయి కూడా ఈ రాజ్యం తనదని, తను రాజని భావించలేదు. రామపాదుకలనే రాజుగా భావించి దాసుడిలా పరిపాలనాభారం వహించాడు."

"అంటే రాముడు చెప్పినట్టు విన్నాడని అర్థం కదూ బామ్మా."

"ఇప్పుడు సరిగ్గా అర్థం చేసుకున్నావురా కిట్టప్పా.." ప్రతిభ.

(ఇంకా వుంది)

అవ్యక్తోపనిషత్ ప్రకటించిన

# శ్రీనృసింహానుష్టుప్ మాహాత్మ్యం

*గత సంచిక తరువాయి*

డా॥ కండ్లకుంట్ల నరసింహమూర్తి- జనగామ

మంత్రరాజమైన శ్రీనృసింహానుష్టుప్పును బ్రహ్మదేవుడు పొందిన విధం, ఆ మంత్రరాజ ప్రభావం, ఆ మంత్రమే సకల సృష్టికి కారణమనే విషయాన్ని శ్రీనృసింహ తాపిన్యుపనిషత్తుల కంటే కొద్ది భేదంతో అవ్యక్తోపనిషత్తు విశదీకరించింది.

పూర్వం ఈ ప్రపంచం ఏదీ లేదు. స్వర్గం, అంతరిక్షం, పృథివి ఏమీ లేదు. కేవలం జ్యోతిరూపం, ఆది అంతాలు లేనిది, స్థూలం కానిది, రూపం లేనిది, రూపం కలది, తెలియశక్యం కానిది, జ్ఞానరూపమైనది, ఆనందమయమైనది మాత్రమే ఉండేది. ఆ రూపం ఆకుపచ్చ, ఎరుపు అనేరెండు రంగులుగా విభజింపబడింది. వానిలో ఆకుపచ్చనిది మాయారూపం. ఎఱ్ఱనిది పురుషరూపం. ఆ రెండు రూపాల కలయికవల్ల బంగారుగ్రుడ్డు ఏర్పడి పరిణతి చెందింది.

ఆ గ్రుడ్డు నుండి పరమేష్ఠి జన్మించాడు. నా కులమేమిటి? నా కర్తవ్యమేమిటి? అని అతనికి జిజ్ఞాస కలిగింది. అప్పుడు "ఓ ప్రజాపతీ! నీవు అవ్యక్తం నుండి ఉద్భవించావు. నీ కృత్యం వ్యక్తం" అని అతనితో అశరీరవాణి పలికింది. నా జన్మకు కారణమైన ఆ అవ్యక్తమేమిటి? నా కృత్యమైన వ్యక్తమేమిటి? అని బ్రహ్మ ప్రశ్నించాడు. "అది తెలియశక్యం కాని తేజస్సు, ఏది అవిజ్ఞేయమో అది అవ్యక్తం, కనుక దాన్ని తెలుసుకోగోరితే నన్ను తెలుసుకో" అని చతుర్ముఖునితో అశరీరవాణి తెలిపింది. బ్రహ్మవాక్కువైన నీవెవరవు? నీ గురించి తెలుపు" మని పరమేష్ఠి ప్రార్థించాడు. తపస్సుతో నన్ను తెలుసుకొమ్మని ఆ వాక్కు ఆదేశించింది.

అప్పుడు ప్రజాపతి బ్రహ్మచర్యంతో వెయ్యేళ్ళు తపస్సు చేసి, అనుష్టుప్ ఛందస్సులో ఉన్న ఋక్కును పరమవిద్యను కనుగొన్నాడు. ఆ ఋక్కులోనే పరబ్రహ్మ, సకల దేవతలు ప్రతిష్ఠింపబడి ఉన్నారు. సర్వమంత్రాలు దానికి అంగభూతమై నవే! ఆ ఋక్కులో పదాలకు ఆది అంతాలలో ఓంకారాన్ని ఉంచి బ్రహ్మ వెయ్యేళ్ళు గానం చేశారు.

తత్ఫలితంగా దివ్యమంగళ నృసింహరూపాన్ని బ్రహ్మ దర్శించాడు. ఆ స్వామి లక్ష్మీదేవితో కూడి, గరుత్మంతుడు రథంగా గలిగి, శేషుని పడగలచే కప్పబడిన శిరస్సుగలవాడై, మృగముఖం గలవాడై, చంద్రసూర్యాగ్నులు నేత్రాలుగా గలవాడై ప్రకాశించాడు. బ్రహ్మదేవుడతనికి నమస్కరించి, స్తుతించి, అర్చించాడు. అతడు మృగరూపుడు, ఉగ్రుడు గనుక "ఉగ్రం" అన్నాడు. వీర్యవంతుడు గనుక "వీరం" అన్నాడు. ఆయన మహత్తులకన్న గొప్పవాడు, భూమ్యాకాశాలు వ్యాపించి ఉన్నవాడు గనుక "మహావిష్ణుం" అన్నాడు. ప్రజ్వరిల్లుతున్నాడు గనుక "జ్వలంతం" అన్నాడు.

విశ్వరూపుడై అన్ని వైపుల ముఖాలు గలవాడు కనుక "సర్వతోముఖం" అన్నాడు. నరరూపుడు, సింహరూపుడు గనుక "నృసింహం" అన్నాడు. అతని భయంవల్లనే సూర్య, చంద్ర, అగ్ని, వాయు, మేఘాదులు తమ కర్తవ్యాలు సక్రమంగా నిర్వహిస్తున్నారు గనుక "భీషణం" అన్నాడు.

మంగళకరుడు, లక్ష్మిచే ఆలింగనం చేయబడినవాడు కనుక "భద్రం" అన్నాడు. మృత్యువుకు మృత్యువు గనుక "మృత్యుమృత్యుం" అన్నాడు. ప్రజలకు అమృతత్వాన్ని ప్రసాదిస్తున్నాడు గనుక "నమామి" అన్నాడు. యజుర్వేదంలో చెప్పబడినట్లు అంతా ఆయనే గనుక "అహం" ఈ విధంగా –

**ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖమ్ ।**
**నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్ ॥**

అని బ్రహ్మ చేసిన స్తుతికి నృసింహుడు ప్రసన్నుడై, బ్రహ్మను ఏదేని వరం కోరుకొమ్మన్నాడు. "హే భగవన్! నేను అవ్యక్తం నుండి జన్మించానని, నా కృత్యం వ్యక్తమని ఇదివరకు విన్నాను. ఆ అవ్యక్తం నీవే అని తెలుసుకున్నాను. ఇక వ్యక్తమంటే ఏమిటో తెలుపు"మని పరమేష్ఠి ప్రార్థించాడు. వ్యక్తమంటే ఈ చరాచర సర్వప్రపంచమని నృసింహుడు వివరించాడు. తాను ఈ జగత్తును సృష్టించేందుకు సమర్థుడను కానని, అందుకు ఉపాయం సూచించుమని ప్రజాపతి ప్రార్థించాడు.

నా అగ్నిలో, స్వాత్మనే హవిస్సుగా ధ్యానించి ఆ అనుష్టుప్ ఋక్కుతో యజ్ఞం ఆచరించుమని, అది ధ్యానయజ్ఞమని, ఆ ఋక్కు సకల కోరికలను నెరవేర్చ సమర్థమైందని నృసింహుడు ఉపదేశించాడు. ప్రణవంతో కూడిన ఆ ఋక్కును ధ్యానించి మనోయజ్ఞం చేసి బ్రహ్మ సృష్టి చేయగల సమర్థుడు, సర్వజ్ఞుడు, సర్వకర్త, అనంత శక్తిమంతుడైనాడు. అప్పుడు ప్రజాపతి లోకాలను సృజింపగోరినవాడై ఆ ఋక్కులోని ముప్పదిరెండు అక్షరాలతో మూడులోకాలను సృష్టించాడు. ఇంకా రెండేసి అక్షరాలను వాటికి ఇరువైపులా కూర్చాడు.

ఆ ముప్పది రెండక్షరాలతో దేవతల సృష్టించాడు. అందరు

దేవతలతోను తాను ఇంద్రుడైనాడు.(ముప్పదిమూడు కోట్లమంది దేవతలు) కనుక ఇంద్రుడు దేవతలలో అధికుడైనాడు. ఈ మంత్రజ్ఞానం కలిగినవాడు గనుక తన సమానులలో అధికుడైనాడని భావం.

ఆ మంత్రంలోని పదకొండు పదాలతో పదకొండుమంది రుద్రులను సృష్టించాడు (ఏకాదశరుద్రులు). ఆ పదకొండు పదాలతోనే ఆదిత్యులను కూడ సృష్టించి, వారందరితో తాను విష్ణువైనాడు. (ద్వాదశాదిత్యులు) కనుక ఆదిత్యులలో విష్ణువు అధికుడైనాడు. ఆ ఋక్కులోని నాలుగేసి అక్షరాలతో అష్టవసువులను (4×8=32) రూపొందించాడు. తరువాత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే చతుర్వర్ణ జనులను సృష్టించాడు. అనుష్టుప్ అర్ధభాగాలతో దివారాత్రు లను కల్పించాడు.

ఋక్కుయొక్క ప్రథమపాదం నుండి ఋగ్వేదాన్ని, ద్వితీయ పాదం నుండి యజుర్వేదాన్ని, తృతీయపాదం నుండి సామవేదాన్ని, చతుర్థపాదం నుండి అథర్వణవేదాన్ని ఏర్పరచాడు. ఎనిమిది అక్షరాలు గల గాయత్రీఛందస్సును, పదకొండు అక్షరాలుగల త్రిష్టుప్ ఛందస్సును, నాలుగుపాదాలు, ముప్పదిరెండు అక్షరాలుగల అనుష్టుప్ ఛందస్సును సృష్టించాడు. ఇవి సర్వఛందస్సులు. ఈ సర్వజగత్తు అనుష్టుప్ ఛందస్సునుండే ఉత్పన్నమై దానిలోనే ప్రతిష్ఠితమై ఉన్నది.

తరువాత ఈ ఋక్కునుండే ఉగ్రరూపుడైన శంకరుడు అవతరించాడు. ఆయన నలుపు, ఎరుపురంగుగల సమ్మేళనంతో, పినాకంతో, స్త్రీరూప పురుషరూప మిశ్రమంతో ఉన్నవాడు. బ్రహ్మ అతనిని విభజించి స్త్రీలలో స్త్రీరూపాన్ని, పురుషులలో పురుషరూపాన్ని నిక్షేపించాడు. దేవతలందరి తరువాత జన్మించిన ఇంద్రుని వారు తమ అధిపతిగా అంగీకరించనందున ఇంద్రుడు ప్రజాపతివద్దకు తిరిగివచ్చి తన బాధను వివరించాడు. అప్పుడు ప్రజాపతి అనుష్టుప్‌చే అభిమంత్రించబడిన మూడు పూర్ణ అమృత కలశాలతో ఇంద్రుని అభిషేకించి, అతని కుడి ఎడమ భుజాలపై సుదర్శన పాంచజన్యాలతో ముద్రలు వేశాడు. ఈ విధంగా ఇంద్రునికి చక్రాంకితాలు చేసి బ్రహ్మ ఆయనకు ఆచార్యుడై అనుష్టుభ మంత్రోపదేశం గావించాడు. తరువాత సూర్యవర్చస్సుగల బంగారురేకుపై అనుష్టుభ మంత్రాన్ని వ్రాసి, దానిని ఇంద్రుని కంఠంలో అలంకరించాడు. దానితో అతడు దుర్నిరీక్ష్య తేజుడై దేవతలకు అధిపతి అయినాడు. అప్పుడు దేవతలాతని ఆధిపత్యాన్ని అంగీకరించారు. ఆ ఆధిపత్యంలో ఆయన స్వరాట్టు (స్వర్గరాజు) అయ్యాడు. తరువాత బ్రహ్మదేవుని ద్వారా కమఠాకృతిగల భుజగేంద్రులకాధారమైన భద్రాసనాన్ని పొంది, పృథివిని, ఉదకమండలాన్ని కూడ జయించాడు.

ఈ అనుష్టుభ మంత్రాన్ని పఠించినవాడు సకల వేదాలను అధ్యయనం చేసినవాడు, క్రతువులు ఆచరించినవాడు, పవిత్ర తీర్థాలలో స్నానమాచరించినవాడు, మహాపాతకోపపాతకాల నుండి ముక్తుడై, గొప్ప వర్చస్సును పొందగలుగుతాడు. తన వంశంలోని పూర్వులను, తరువాతి వారిని పవిత్రం చేయగలడు. ఇతనిని అపస్మారాది రోగాలు దరిచేరవు. యక్షులు ప్రేత పిశాచాలు కూడ ఇతనిని స్పృశించి, చూచి, విని, పాపులై కూడా పుణ్యలోకాలు పొందగలుగుతారు. ఇతని మనోవాంఛితార్థ సిద్ధి త్వరితంగా కలుగుతుంది. అందరు ఇతనిని తండ్రివలె భావిస్తారు. ఇతడు పునరావృత్తి రహితుడై ఎక్కడ విరాట్టయిన నృసింహుడుంటాడో అక్కడికి చేరుకుంటాడు అని ఈ ఉపనిషత్తులో ఈ మంత్రప్రభావం వివరించబడింది. *(సమాప్తం)*

## కృతజ్ఞతాంజలి



**శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారిని వరంగల్ జిల్లా, మహబూబాబాద్ శ్రీమాన్ విష్ణువర్ధన్‌రెడ్డి గారు తమ తల్లిగారైన శ్రీమతి నూకల రుక్మిణీదేవి (శ్రీలతమ్మగారి సోదరి) పరమ పదోత్సవాన్ని జరిపించమని ప్రార్థించగా, వారి కోరిక మేరకు ది. 29.6.2012 సాయంత్రం వారి గృహానికి విచ్చేశారు.**

**శ్రీమతి రుక్మిణీదేవిగారు శ్రీ పెద్దస్వామివారి శిష్యురాలు. ఎన్నోమార్లు మానుకోట శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయానికి ఆహ్వానించి ఎన్నో ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహించేవారు. వారి ఆధ్మాత్మిక భక్తికి మెచ్చి, ఆమె పరమపదోత్సవాన్ని జరిపించారు.**

**శ్రీస్వామివారు తమ సందేశంలో "ప్రతిమనిషీ భక్తిభావనతో జీవితాన్ని సార్థకం చేసుకోవాలని, మానవజన్మ రావటమే అదృష్టమని, స్వంత కార్యక్రమాలతోపాటు, భక్తికార్యక్రమాలు కూడా చేయాలని అప్పుడే భగవంతుని అనుగ్రహం పొందటానికి అర్హులు అవుతారని తెలిపారు. రుక్మిణీదేవిగారు రామాయణం, భాగవతము రెండు గ్రంథాలు స్వయంగా, తప్పులు లేకుండా వ్రాసి మాకందించార"ని తెలిపారు.**

**తరువాత స్థానిక వేణుగోపాలస్వామి ఆలయాన్ని సందర్శించి ఛైర్మన్ శ్రీమాన్ యిమ్మడి వెంకటేశ్వర్లుకు, ఆలయ అర్చకులకు, భక్తులకు మంగళా శాసనాలు గావించారు.**

**శ్రీస్వామివారు మా తల్లిగారి పరమపదోత్సవాన్ని జరిపించినందుకు, కుటుంబ సభ్యులను ఆశీర్వదించటానికి వచ్చినందుకు హృదయపూర్వక కృతజ్ఞతలు అని విష్ణువర్ధన్ రెడ్డిగారు తెలిపారు.**

**MUKUND A/c**
Mahabubabad, Warangal Dist.




*గత సంచిక తరువాయి*

**వైశారదీ**

**'పాఱ్కడలుళ్ పైయ తుయిన్ఱ పరమన్ అడిపాడి'** క్షీరసాగరాన ఆదిశేషుని అందాలపాన్పుపై యోగ నిద్రాసక్తుడైన పరంధాముని పాదారవిందమును స్మరిస్తూ ప్రొద్దున్నే మేలుకొనవలెనని ఆండాళ్ తల్లి ఆదేశము. ఉజ్జీవించగోరు ప్రతి మానవుడు తన దినాన్ని ప్రారంభిస్తూ చేయవలసిన మొదటపనిగ శాస్త్రాలు తెలిపిన శ్రీచరణగానానికి మూలమైన ఈ యోగనిద్రాభిరాముడు **"వ్యూహాస్వరూపం"**తో విరాజిల్లే నారాయణుడే. **'పూర్ణాత్ పూర్ణముదచ్యతే'** అంటూ శాంతిమంత్రము ప్రస్తావించే మూడవ పూర్ణమిదే.

అవతారకందమైన ఈ వ్యూహస్థానం సృష్టిస్థితిప్రళయాలకు తగ్గట్టుగ అమరి ఉంటుందనీ, ఒక్కొక్క కార్యం చేస్తూ రెండురెండు గుణాలు ప్రధానంగాను, మిగిలిన సమస్తగుణాలూ వాటికి సహకారంగాను కలిగి ఉంటుందనిన్నీ తెలుసుకున్నాము. ఈ వ్యూహముగ ప్రకాశించే నాలుగు అద్భుతస్థానాలూ గుణపూర్ణములయ్యే ఉంటాయి.

**"యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ ప్రయన్త్యభిసంవిశన్తి, తద్ విజిజ్ఞాసస్వ, తద్‌బ్రహ్మేతి"** అంటూ ఉపనిషత్తులు కీర్తించినదీ ఈ వ్యూహస్వరూపమైన కార్య వైకుంఠనాథుణ్ణే. ఈ సమస్త భూతములు సుర, నర, తిర్యక్, స్థావరములుగ ఎవ్వనినుండి పుడుతున్నాయో, అలా పుట్టిన జీవరాశులన్ని ఎవని అనుగ్రహముతో బ్రతికి బట్ట కడుతున్నాయో, ప్రళయకాలములో చేరే చోటు ఎవరో– అంతేకాక– తిరిగిరాని చోటుగ, మోక్షమని కీర్తించే ఎవ్వనియందు కర్మబంధ విముక్తులైన వారు చేరుతున్నారో, అతడే ఉపాస్యుడయిన 'పరబ్రహ్మ' అంటూ తైత్తిరీయోపనిషత్ ప్రస్తావించిన స్వరూప మిదే. సృష్ట్యాదులు మనకి అనుకూలంగ ఉండేటట్లు చేయాలన్నా, మనకు ఉపకరించే అవతారాలను ప్రసాదించాలన్నా అనుగ్రహించ వలసినది ఈ వ్యూహమే కనుక ఉదయము లేస్తూ ఆతణ్ణే తలచుకోవాలని అనేక ధర్మశాస్త్రాలూ, ఆచార్యులూ, ఆండాళ్ కూడా తెలియచేసారు.

**"జగామ సత్రినయనః తీరం క్షీరపయోనిధేః"** భూభారాన్ని తగ్గించదలచిన చతుర్ముఖుడు, తన కుమారుడైన శివుణ్ణి తోడుచేసుకొని, గోరూపం ధరించిన భూమిని ఇతర దేవతల నందరినీ వెంట బెట్టుకొని, రక్షణకోరి, ప్రార్థించవచ్చినది వ్యూహ స్వరూపంలో ఉన్న ఈ గుణపూర్ణుని వద్దకే. అందుకే ఈ స్థానాన్ని **"కూప్పీడు కేట్కుమిడం"** మొరలను వినేచోటు అంటారు శ్రీపిళ్ళైలోకాచార్యస్వామి. ఇక్కడ విన్నవించిన ప్రార్థనలకు స్పందించిన తీరును బట్టే అవతారాలుంటాయని గుర్తించాలి.

అవతారాలు ఏ రూపంలో ఉన్నా గుణపూర్ణాలే అవుతాయి. అయితే అవసరానికి తగ్గట్టు ఒక్కొక్క గుణాన్ని మాత్రం ప్రధానం చేసుకుంటాడు. మిగిలినవి ఆతణ్ణి వదలి ఉండవు కనుక ఆయనలోనే ఉంటాయి. ఆ స్థానాన్నే చెపుతుందీ శాంతిమంత్రంలోని **పూర్ణస్య పూర్ణం** అనే భాగము. వ్యూహం నుండి వెలువడే అవతార సముదాయమని తాత్పర్యము. ఇది నాలుగవ స్థానం. అవతారాలన్నీ ఆయా కాలానికీ, ప్రాంతానికీ మాత్రమే చాలావరకు పరిమితమై ప్రవర్తిస్తుంటాయి కనుక, వాటిని కొన్ని విభాగాలుగ చేసారు మన ఋషులు. ప్రధానంగ అవతారాలను ముఖ్యములు, గౌణములు అని విడదీస్తారు. తానే సాక్షాత్తు వచ్చి అవతరిస్తే అవి ముఖ్యావతారాలు. రాముడు, కృష్ణుడు, నరసింహుడు మొదలైనవి ఈ విభాగంలో చేరుతాయి. ఏవో కొన్ని గుణాలు ప్రధానంగ గ్రహించి ఒక్కొక్క జీవుని ద్వారా, కొన్ని కార్యాలు జరపడానికని స్వీకరించే అవతరాలు గౌణావతారాలు. వ్యాస, పరశురామ, బలరామ, బ్రహ్మ, రుద్రాదులన్నీ ఈ విభాగంలో చేరుతాయి. ముముక్షువులకు వాటిలో ముఖ్యావతారాలు మాత్రమే ఉపాసించదగినవి అని నిర్ణయించారు పెద్దలు.

**అవతారాలు:**

అవతారాలను అన్నింటినీ ఆరు భాగాలుగ కీర్తించారు.

1. **పరిపూర్ణవతారం**: అన్ని అవతారాల చేష్టలూ, అంశాలు ఉండే అవతారాన్ని **'పరిపూర్ణ'**మని అంటారు. ఇది శ్రీకృష్ణావతారం మాత్రమే.
2. **పూర్ణావతారము**: నవరసాలు నిండి ఉండే అవతారాన్ని పూర్ణావతారమంటారు. శ్రీరామావతారం ఈ గణంలో చేరుతుంది. మానవునిగ ఉండదగిన నవరసాలను ఆయా సందర్భాలలో ప్రకటించడం వల్ల ఆదర్శ మానవావతార మైన శ్రీరాముణ్ణి **'పూర్ణావతార'**మంటారు.

శ్లో॥ **శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానకాః ।**
**బీభత్సాద్భుత శాంతాశ్చ రసాః నవ ప్రకీర్తితాః ॥** ఈ తొమ్మిదింటిని నవరసాలంటారు.

మన పూర్వాచార్యులు, శ్రీరామావతారంలో ఈ రసాల నెలా ప్రకటించారో, ఈ శ్లోకంలో అందంగ తెలియచేసారు. ప్రాసంగికంగ వచ్చినా, అందమైనదీ శ్లోకం కనుక దీని అర్థాన్ని కూడా చెప్పుకొంటే ఆనందం కలుగుతుంది చూద్దాం!

శ్లో॥ **శృంగారం క్షితినందినీ విహరణే, వీరం ధనుర్భంజనే,**
**కారుణ్యం జలిభోజనే,ఉద్భుతరసం సింధౌ నగస్థాపనే ।**
**హాస్యం శూర్పణఖాముఖే, భయమఘే బీభత్స మాయోధనే**
**రౌద్రం రావణమర్దనే, మునిగణే శాంతం వపుఃపాతు నః॥**

నవరసాలలో ఏ రసాన్ని ఏ సమయంలో ఎవరి విషయంలో ప్రదర్శించాలో, అది అలా సాగినప్పుడే ఆదర్శమౌతుంది. లేకపోతే అది రసాభాస అవుతుంది. 'శృంగార రసాన్ని యుద్ధానికి బయలుదేరుతూ తన భార్య విషయంలో ప్రదర్శించాడట దుర్యోధనుడు' అంటాడు వేణీ సంహారమనే నాటకంలో, ఇది ప్రకరణానికి విరుద్ధంగ ఉంటుంది కద! అలాంటివి లేకుండా ఉండాలి. చూడండి! పై శ్లోకంలో శ్రీరాముడు ఎలా ఈ గుణాలని సందర్భోచితంగ ప్రకటించాడో!

1. **శృంగారం-** 'మా కళ్యాణానంతరం అయోధ్యలో సరిగ్గా పన్నెండు సంవత్సరాలు నివసించాను. ఆ సమయంలో ఆయా ఋతువులకనుగుణంగ లభించే వస్తువులతో హాయిగ అన్ని రకాల సుఖాలను నాకందించాడు శ్రీరామచంద్రుడు', అంటుంది సీతమ్మ స్వయంగ, "సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే, భుంజానా మానుషాన్ భోగాన్...." ఇది అనసూయతో చెప్పిన మాట. అనుభవించదగిన సమయంలో సీతమ్మ విషయంలో శృంగార రసాన్ని దివ్యంగ అనుభవిస్తూ ప్రదర్శించాడు శ్రీరాముడు.
2. **వీరం-** ఎందరో వీరాధివీరులుండే జనకసభలో, విశ్వామిత్రుని ఆజ్ఞతో, శివధనస్సును అనాయాసంగ ఎత్తి నారిని సంధించాడు. ఎవ్వరూ కదపనైనా చేతకాని ఆ ధనస్సు కాస్తా ఆతడు వంచుతూంటే విరిగిపోయింది. ఆ శబ్దానికే అక్కడి వారంతా అదిరిపోయారు. శ్రీరాముని ఈ చేష్ట ఆతని వీరత్వానికి గుర్తు.
3. **కారుణ్యం-** బలిభోజనుడు అంటే కాకి. ఒక కాకి, సీతమ్మ చిత్రకూటంలో ఉన్న సమయంలో, ఆమె వక్షాన్ని చీరింది. అది చూచి, కోపించిన రాముడు బ్రహ్మాస్త్రాన్ని వదిలాడు. ముల్లోకాలు తిరిగి దిక్కు దొరకక శ్రీరాముని పాదాల ముందు వ్రాలింది ఆ కాకి. అదెవరోకాదు. సాక్షాత్తు ఇంద్రుడి కొడుకైన జయంతుడే. దేవతలంతా కలిసి ఆ పిల్లవాడికి ఈ వేషం వేయించి పంపారు. రాముడికి ఏం చేస్తే కోపం వస్తుందో పరీక్షించే విషయంలో ఇదీ ఒక ప్రయోగమన్నమాట. రాముడికి కోపం రానే వచ్చింది. ఈ పిల్లవాడు దానికి బలి అయిపోయి ఉండేవాడు. దాన్ని తగ్గించడానికి ఆ దేవతలెవ్వరూ సాహసించి ముందుకు రాలేకపోయారు.

పాపం! చివరికి ఏ గతీ దొరకక శ్రీరాముడి శ్రీచరణాల వద్ద, క్రమం కూడా గమనించే స్థితి లేక, వచ్చిపడ్డాడు. సీతమ్మ తల్లి చూసింది. అయ్యో పాపం! పిల్లవాడే అని జాలి తలచింది. శ్రీరామునికి పురుషకారం చేసింది. ప్రార్థించింది కాపాడమని. దాని వల్ల శ్రీరామునిలో కారుణ్యరసముప్పొంగింది. అస్త్రం అయితే వ్యర్థం కాకూడదు కనుక ఒక కన్ను మాత్రం తీసేసాడు. ప్రాణభిక్ష పెట్టి పొమ్మనాడు. బ్రతుకు జీవుడా! అని దేవతలు గాలి పీల్చుకున్నారు. ఇక్కడ ఆ స్వామి కరుణారసాన్ని కమనీయంగ కనపరిచాడు. దీన్ని తలచిన మహర్షి వ్యాసుడు **కృపాపీయుషసాగరః** అని శ్రీరాముణ్ణి సంభావించి మురిసి పోయాడు, పాద్మపురాణంలో.

*(ఇంకావుంది)*

శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః
ఓమ్ వేదపురుషాయ నమః

# జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ నిర్వహణలో జరిగిన తృతీయ వార్షిక వేదాగమపరీక్షా నివేదిక

**ప్రియ వేదపురుషానుగ్రహ పాత్రులారా!**

ప్రతీ మానవుడు జన్మను సార్థకం చేసుకోవాలని, ఆనందంగా ఉండాలని కోరుకుంటాడు. ఆనందమయ జీవితాన్ని పొందటానికి పూర్వ ఋషులు పరంపరానుగతంగా తమకు అందిన వేదశబ్దరాశిని మనదాక అందించారు. **వేదము** అంటే? **తెలిపేది**. దేనిని? మన ఇంద్రియాలకు, ఊహకు అందని ఆనంద సాధనాలనెన్నింటినో తెలియజేసే అలౌకిక శబ్దరాశి. అన్నింటికి ఆధారమైన భగవంతుడు వేదశబ్దరాశి ద్వారానే సకల చరాచర సృష్టిరచనను చేస్తాడు.

**"నామరూపం చ భూతానాం**
**కృత్యానాం చ ప్రపంచనమ్ ।**
**వేదశబ్దేభ్య ఏవాదౌ**
**దేవాదీనాం చకార సః ॥"** అంటూ మనువు తెలియచేస్తాడు.

ఇంతటి గొప్పశక్తి కలిగిన వేదశబ్దరాశి పరంపరగా మన భారత భూభాగంలోనే సువ్యవస్థితంగా, సురక్షితంగ ఉండడం మన అదృష్టం.

"వేదాలలోని ప్రతీశబ్దము, అక్షరమూ పరమాత్మని చెప్పేదే" అని మన పెద్దలు

**వేదాక్షరాణి యావంతి పఠితాని ద్విజాతిభిః ।**
**తావంతి హరినామాని కీర్తితాని న సంశయః ॥** అంటూ నిర్ణయించి స్తోత్రం చేశారు.

1131 శాఖోపశాఖలుగా విస్తరించి ఉన్న వేదశబ్దరాశిని వేదవ్యాసుడు వాటి స్వభావాన్ని బట్టి ఋక్, యజుస్, సామ, ఆథర్వణములుగా ప్రవర్తింపచేసాడు. కానీ ఈనాడు కేవలం 12 శాఖలు మాత్రమే సజీవంగా ఉన్నాయి. ఈ కొద్దినైనా సరిగ్గా సంరక్షించుకోపోతే అవికూడా లోపించిపోయే ప్రమాదముంది. సంరక్షించడమంటే? ఆ శబ్దరాశిని నిర్దుష్టంగ నేర్చి యథాతథంగా మరికొంతమందికి అందించడమే.

1957వ సంవత్సరంలోనే మన పరమాచార్యులైన **శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులు, సత్యసంకల్పులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ పెద్దజీయర్ స్వామివారు** నడిగడ్డపాలెంలో **శ్రీమన్నారాయణ వేదవేదాంగ పాఠశాల**ను స్థాపించి, ఎందరో విద్యార్థులకు వేదాన్ని నేర్పే వ్యవస్థకు శ్రీకారం చుట్టారు. అదే క్రమాన్ని బహుముఖంగా వ్యాపింపచేయడానికి మన **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నజీయర్ స్వామివారు** పవిత్ర కృష్ణానదీ తీరాన సీతానగరంలో 1982వ సంవత్సరములో **జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్** ద్వారా **వేద విశ్వవిద్యాలయా**న్ని స్థాపించారు. వేదపాఠశాలల ద్వారా అపూర్వ శాఖలకు జీవంపోస్తూ వేయికి పైగా విద్యార్థులను వేదవిద్వాంసులుగా తీర్చిదిద్ది లోకానికందించారు. వేదంతోపాటు శ్రీపాంచరాత్రాగమ, నాలాయిర దివ్యప్రబంధములను విద్యార్థులకు నేర్పించి "వేదవిశ్వవిద్యాలయము ద్వారా పండితులుగా" తయారు చేసారు. ఇప్పటి వరకు ఈ వేదవిశ్వవిద్యాలయం నుండి ఋగ్వేదం శాకలశాఖలో, శుక్లయజుర్వేద కాణ్వ శాఖలో, యజుర్వేద తైత్తిరీయ శాఖలో, యజుర్వేద మైత్రాయణీ శాఖలో, అథర్వవేద శౌనకశాఖలో, శ్రీపాంచరాత్రాగమంలో, నాలాయిర దివ్యప్రబంధ విభాగాల్లో విద్యార్థులు పండితులుగాతయారై దేశవిదేశాలలో ఉంటూ వేదవేద్యుని అనుగ్రహంతో సుఖమయ జీవితాన్ని సాగిస్తున్నారు. మన పరమా చార్యులకు కృతజ్ఞతా పుష్పంగా **జీయర్ శతాబ్ది** ఉత్సవాలను జరిపి మన శ్రీచిన్నజీయర్ స్వామి వారు JIVA **జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమి**ని ఆంధ్రరాష్ట్ర రాజధాని అయిన హైదరాబాద్‌లో శంషాబాద్ సమీపంలో శ్రీరామ నగర, దివ్యసాకేత క్షేత్రంలో రూపుదిద్ది లోకానికి అందించారు. ఇది ఇలా ఉండగ మొదటినుండీ మన వేదవిశ్వవిద్యాలయంలో చదివే విద్యార్థులకు వార్షిక వేదపరీక్షలు జరిపేవారు. 2009లో జరిగిన జీయర్‌శతాబ్ది ఉత్సవం నుండి మన సంస్థలోనే కాకుండా వివిధ ప్రాంతాలలో ఇతర వేదపాఠశాలలలో చదువుకునే విద్యార్థులకు కూడా వేదపరీక్షలు నిర్వహించి ఉత్తీర్ణులకు సర్టిఫికెట్లు, సంభావన అందిస్తూ ప్రోత్సహించడం ప్రారంభించారు శ్రీవారు జెట్ ద్వారా. ఈ నందననామ సంవత్సరంలో కూడా ఆషాఢ మాస కృష్ణపక్ష పంచమి నుండి సప్తమి వరకు 2012 జులై 8,9,10 తేదిలలో జీవా ప్రాంగణంలో **3వ వార్షిక వేదపరీక్షలు** జరిపి ఉత్తీర్ణులకు యోగ్యతాపత్రముతో పాటు సంభావనలు అందించారు. వేదపరీక్షామండలి ద్వారా జరిపిన ఈ సంవత్సరపు వేద, ఆగమ, నాలాయిర దివ్యప్రబంధ పరీక్షలలో ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక, రాజస్థాన్ రాష్ట్రాల నుండి పరీక్షార్థులు వచ్చి ఈ క్రింది విధంగా వివిధ శాఖలలో 65 మంది యోగ్యతాపత్రాన్ని, సమ్మానాన్ని పొందారు.



## వేదపండితుని వైశిష్ట్యం

– పద్మపురాణం

**ఏకం వేదాన్తగం విప్రం భోజయేత్ శ్రద్ధయాన్వితః ।**
**తస్య భుక్తౌ భవేత్ కోటి విప్రాణాం నాత్ర సంశయః ॥**

**వేదాన్త శాస్త్రాన్ని చక్కగా నేర్చుకొన్న బ్రాహ్మణోత్తమునికి చక్కటి భోజనం పెట్టి తృప్తి పరిస్తే... అది కోటిమంది బ్రాహ్మణోత్తము లకు కడుపునింపిన పుణ్యాన్ని ప్రసాదిస్తుంది.**

**వేదపండితుడైన బ్రాహ్మణోత్తమునికి చేసే అన్నదాన ఫలితం ఎంత గొప్పదో చూశారా... మరి వేదవిద్యార్థులను పోషిద్దాం. ప్రోత్సహిద్దాం. మన సంపదలని ధన్యం చేసుకొందాం! త్వరపడండి. మంచిపని చెయ్యడానికి ఆలస్యం పనికిరాదు.**

**మరిన్ని వివరాలకు: 08645 272929, 272353**

**ఋగ్వేద శాకలశాఖ ఘనాన్త పరీక్షలో...**

బ్రహ్మశ్రీ G. సూర్యనారాయణ శర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ చింతలపల్లి ఉమాశంకర శర్మ ద్వితీయ

**ఋగ్వేద క్రమాంత పరీక్షలో**

బ్రహ్మశ్రీ K.P. మరుదీశ్వరన్ ప్రథమ
శ్రీమాన్ V. రవిశర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ S. శశికాంత్ జోషి ప్రథమ
బ్రహ్మశ్రీ సాయికిరణ్ జోషి ప్రథమ
బ్రహ్మశ్రీ V. విఘ్నేష్ శర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ M.V. చంద్రకాంత్ శర్మ ప్రథమ

**మూలాంత పరీక్షలో**

బ్రహ్మశ్రీ రామకృష్ణన్ ప్రథమ
బ్రహ్మశ్రీ S. హరిహరన్ ప్రథమ
బ్రహ్మశ్రీ P. ప్రశాంత్ దీక్షిత్ ప్రథమ
బ్రహ్మశ్రీ V. రామనాథ్ శర్మ ప్రథమ
శ్రీమాన్ V. వంశీకృష్ణమాచార్య ప్రథమ
శ్రీమాన్ CH. పవన్ కుమారాచార్య ద్వితీయ
బ్రహ్మశ్రీ K. శ్రీవత్స శర్మ ద్వితీయ
బ్రహ్మశ్రీ S. రామస్వామి ద్వితీయ
బ్రహ్మశ్రీ S. రత్నగిరీశ్వరన్ ద్వితీయ

**శుక్లయజుర్వేద కాణ్వశాఖ క్రమాంత పరీక్షలో**

శ్రీమాన్ కంజర్ల వేంకటరమణాచార్యులు ప్రథమ
బ్రహ్మశ్రీ కూసుమంచి వేంకటసాయి శ్రీకాంత్ శర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ గోదావరి నాగవేంకట సంగమేశ్వర శర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ ఆరాధ్యుల బాలకృష్ణ ద్వితీయ
బ్రహ్మశ్రీ భాగవతుల నాగవెంకట హనుమంతరావు శర్మ ॥

**మూలాంత పరీక్షలో**

బ్రహ్మశ్రీ తుట్టగుండు వేంకటసాయి ఫణిభాస్కర్ శర్మ ప్రథమ

**యజుర్వేద మైత్రాయణీ శాఖ మూలాంత పరీక్షలో**

శ్రీమాన్ గణదళం అనంతశయనాచార్యులు ప్రథమ
శ్రీమాన్ పులికంటి వేంకటరమణాచార్యులు ప్రథమ
శ్రీమాన్ సముద్రాల గోపికిషోరాచార్యులు ప్రథమ
శ్రీమాన్ V.S.K.P ఆదిత్యా చార్యులు ప్రథమ
శ్రీమాన్ వానమామలై ఆచార్యరాహుల్ ప్రథమ
శ్రీమాన్ సముద్రాల వేంకటరమణాచార్యులు ప్రథమ
శ్రీమాన్ K.S చెన్నకేశవాచార్యులు ప్రథమ
శ్రీమాన్ తిరుమల హయగ్రీవాచార్యులు ద్వితీయ
శ్రీమాన్ నంబి చక్రధరాచార్యులు ద్వితీయ

**యజుర్వేదీయ తైత్తిరీయ శాఖ ఘనాంత పరీక్షలో**

బ్రహ్మశ్రీ బదరీనాథ్ శర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ రాఘవేంద్ర శర్మ ప్రథమ

**క్రమాంత పరీక్షలో**

బ్రహ్మశ్రీ మారేపల్లి చైతన్యకృష్ణ శర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ అనిరుద్ధ శర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ వెంకటరమణన్ ప్రథమ
బ్రహ్మశ్రీ పాకుర్తి వంశీకృష్ణ శర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ ఘట్టి వెంకట సుబ్రహ్మణ్య స్వామి ప్రథమ
బ్రహ్మశ్రీ కుప్పావెంకట జనార్దన శర్మ ప్రథమ
శ్రీమాన్ ముదివర్తి శ్రీనివాసాచార్యులు ప్రథమ
బ్రహ్మశ్రీ సామవేదం ఆదిత్య శర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ ముప్పవరపు సాయికుమార్ శర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ రవికుమార్ ద్వితీయ
శ్రీమాన్ ముదివర్తి లక్ష్మీనరసింహాచార్యులు ద్వితీయ
బ్రహ్మశ్రీ మండాది శశిధర శర్మ ద్వితీయ
బ్రహ్మశ్రీ మండాది శ్రీనివాస శర్మ ద్వితీయ

**మూలాంత పరీక్షలో**

శ్రీమాన్ వరాహాల శరణ్ కుమార్ ద్వితీయ
శ్రీమాన్ గోమఠం శ్రీనివాసాచార్యులు ద్వితీయ
శ్రీమాన్ S.T.S రామకృష్ణమాచార్యులు ద్వితీయ
శ్రీమాన్ శ్రీరంగం కృష్ణమాచార్యులు ద్వితీయ
శ్రీమాన్ వంగీపురం వికాసాచార్యులు ద్వితీయ

**సామవేదం కౌథుమశాఖ పూర్వభాగ క్రమాంత పరీక్షలో**

బ్రహ్మశ్రీ ఆయిపిల్ల శ్రీకాంత్ శర్మ ప్రథమ
బ్రహ్మశ్రీ కలకోట శశికాంతాచార్యులు ద్వితీయ

**అథర్వవేద శౌనకశాఖ మూలాంత పరీక్షలో**

బ్రహ్మశ్రీ గంగాధర పండా ప్రథమ
బ్రహ్మశ్రీ దుర్గాలాల్ శర్మ ద్వితీయ

**శ్రీ పాంచరాత్రాగమ ఉత్సవాంత పరీక్షలో**

శ్రీమాన్ కండ్లకుంట రఘురామాచార్యులు ద్వితీయ
శ్రీమాన్ కోయిల్ కందాడై కౌశికాచార్యులు ద్వితీయ
శ్రీమాన్ కండ్లకుంట చక్రపాణాచార్యులు ద్వితీయ
శ్రీమాన్ K.S.G. కృష్ణమాచార్యులు ద్వితీయ

**నిత్యారాధన పరీక్షలో**

శ్రీమాన్ సముద్రాల మురళీకృష్ణ ద్వితీయ
శ్రీమాన్ చంగోలం నరసింహా చార్యులు ద్వితీయ
శ్రీమాన్ పెద్దింటి సీతారామాచార్యులు ద్వితీయ

**నాలాయిర దివ్యప్రబంధం తిరువాయ్‌మొడి పరీక్షలో**

శ్రీమాన్ తిరువాయ్‌మొడి కృష్ణమాచార్యులు ప్రథమ
శ్రీమాన్ అంబారిపేట మురళీధరాచార్యులు ద్వితీయ

ఘనాంత ప్రథమశ్రేణి 4500 రూ॥లు,
ద్వితీయశ్రేణి 4000 రూ॥లు
క్రమాంత ప్రథమశ్రేణి 3500 రూ॥లు,
ద్వితీయశ్రేణి 3000 రూ॥లు
మూలాంత ప్రథమశ్రేణి 2500 రూ॥లు,
ద్వితీయశ్రేణి 2000 రూ॥లు
శ్రీపాంచరాత్రాగమ ఉత్సవాంత ద్వితీయశ్రేణి 2000 రూ॥లు
నిత్యారాధనాంత ద్వితీయశ్రేణి 1000 రూ॥లు
దివ్యప్రబంధ తిరువాయ్‌మొడి ప్రథమశ్రేణి 1500 రూ॥లు,
ద్వితీయశ్రేణి 1000 రూ॥లు

ప్రతీసంవత్సరం ఉత్తీర్ణులైన వారందరికి సంభావనలను అందిస్తున్నది మన సంస్థ.

**వివిధశాఖలకు పరీక్షాధికారులుగా వ్యవహరించిన విద్వాంసులు**

ఋగ్వేద శాకల శాఖ
**శ్రీమాన్ సందుగుల రాఘవాచార్య ఘనపాఠి**

శుక్లయజుర్వేద కాణ్వ శాఖ
**శ్రీమాన్ మోదేకుర్తి సంతోష్ కుమారాచార్య ఘనపాఠి**
**శ్రీమాన్ కంజర్ల శేషాద్రిసత్యనారాయణాచార్య క్రమపాఠి**
**శ్రీమాన్ ఉల్లంగంటి సురేశ్ స్వామి క్రమపాఠి**

యజుర్వేద మైత్రాయణీశాఖ
**శ్రీమాన్ గోవర్ధనం రంగనాథాచార్య**
**శ్రీమాన్ కలకుంట్ల వరప్రసాదాచార్య**
**శ్రీమాన్ గోపరాజు కృష్ణమోహనాచార్య**

యజుర్వేదీయ తైత్తిరీయశాఖ
**శ్రీమాన్ కలకోట గోపాలాచార్య క్రమపాఠి**
**శ్రీమాన్ మరింగంటి గోవర్ధనాచార్య క్రమపాఠి**

అథర్వవేద శౌనక శాఖ
**శ్రీమాన్ భట్టర్ సుందరప్రహ్లాదాచార్య**
**శ్రీమాన్ కావటూరి శరత్ కుమారాచార్య**

శ్రీపాంచరాత్రాగమశాస్త్రం
**శ్రీమాన్ ముడుంబై మధుసూదనాచార్య**
**శ్రీమాన్ దెబ్బట వరప్రసాదాచార్య**

నాలాయిరదివ్యప్రబంధం
**శ్రీమాన్ మరింగంటి రామలక్ష్మణాచార్య**

వీరందరూ మన వేదవిశ్వవిద్యాలయ పూర్వవిద్యార్థులు. వీరే విద్వాంసులై పరీక్షాధికారులుగా ఉండటం మన వేదవిశ్వవిద్యాలయానికి గర్వకారణం.

**యజుర్వేదీయ తైత్తిరీయశాఖ**
**బ్రహ్మశ్రీ కేదారనాథ ఘనపాఠి**
**బ్రహ్మశ్రీ కోలుంరాజు సీతారామ ఘనపాఠి**

**సామవేద కౌథుమశాఖ**
**బ్రహ్మశ్రీ సీతారామ శ్రౌతి**

పరీక్షాధికారులుగ ఉండి పరీక్షలను సక్రమంగా నిర్వహించారు.

వేదాధ్యయనం చేసిన వ్యక్తిని నడయాడే వేదముగ కీర్తిస్తారు. అలాంటివారిని ఒక్కరిని సత్కరించినా, సమ్మానించినా వందలాది మందికి అన్నదానంచేసిన ఫలితం కలుగతుందని చెబుతారు ఋషులు. మన సంస్థ ఇందరు పండితులను సత్కరించే భాగ్యం పొందింది. ఇది కేవలం ఉదారులు, వైదికశ్రద్ధ కల ఆస్తికులు అయిన మీరందరూ అందించే సేవలవల్లనే కద సాధ్యమయ్యింది! మరి ఈ సేవలవల్ల కలిగే ఫలితమంతా మన సంస్థకు ఆర్థికముగాను, హార్దికముగాను సేవలందించే భాగవతోత్తములందరిదీ కదూ! అందుకే మీ అందరికీ ఇటువంటి సేవ లభిస్తూ మరిన్ని సత్కార్యాలు మన సంస్థద్వారా చేసుకోగలగాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాము.

శ్రీశ్రీశ్రీ మన చిన్నజీయర్‌స్వామివారి మంగళాశాసనాలను ఈ ఉత్తమకార్యంలో ప్రత్యక్షంగా, పరోక్షంగనూ పాల్గొని ప్రోత్సహించిన వారందరికీ అందజేస్తున్నాము.

వేదాగమపరీక్షామండలి
జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్

**వేదపరీక్షలకు సంబంధించిన చిత్రములు ముఖచిత్రం వెనుక పేజీలో, మరియు టైటిల్ బ్యాక్ ఇన్నర్ పేజీలో చూడవచ్చును.**


చి॥ S. రాజు

## అభినందనలు

**భారత ప్రభుత్వం జాతీయస్థాయిలో నిర్వహించిన పోటీలలో మన జీయర్ గురుకులం అల్లంపల్లినుండి Inspire Awards ప్రోత్సహకర బహుమతులను అందుకొన్న చిరంజీవులు వీరు.చిరంజీవి ఎస్. రాజు, చి॥ N. మౌనిక.**


చి॥మౌనిక




**శ్రీస్వామివారి మంగళాశాసనములందుకొన్న ఈ చిన్నారులు మన విద్యాసంస్థకే గర్వకారకులు. ప్రతిభా సంపన్నులయిన విద్యార్థులను ప్రోత్సహించండి. మన గురుకుల పాఠశాలలను ఆదర్శ పాఠశాలలుగా లోకానికి చూపించవలసిన బాధ్యత మనదే! అందుకొరకు మీ మీ ధన కైంకర్యం అందజేయండి. పాఠశాల పోషణకి చేయూత నివ్వండి. మనబడి... మన బాధ్యత.**

తొండరడిప్పొడి ఆళ్వార్ అనుగ్రహించిన




# తిరుప్పళ్ళియెళ్ళుచ్చి

శ్రీరంగనాథుని సుప్రభాత గీతిక

వైశారదీ

(గతసంచికతరువాయి...)

ఏదమిల్ తణ్ణుం మైయెక్కం మత్తళి,
యాళ్గ్కుళ్లల్ ముళ్లవమో డిశైదిశై కెళ్లుమి,
కీతంగళ్ పాడినర్ కిన్నరర్ కెరుడర్గళ్,
కన్దరువ రవర్ కంగులు లెల్లాం,
మాతవర్ వానవర్ శారణ రియక్కర్,
శిత్తరుం మయంగినర్ తిరువడి తొళ్లువాన్,
ఆతలి లవర్కు నాళోలక్క మరుళ,
అరంగత్తమ్మా! పళ్ళి ఎళ్లున్దరుళాయే ॥ 9

| | | |
|---|---|---|
| **ఏదమిల్** | = | దోషంలేని |
| **తణ్ణుం** | = | మృదంగమును |
| **మైయెక్కం** | = | ఒక తంత్రికల వాద్యమును |
| **మత్తళి** | = | మద్దెలయును |
| **యాళ్గ్** | = | వీణయును |
| **కుళ్లల్** | = | పిల్లనగ్రోవియు |
| **ముళ్లవమోడు** | = | వీటన్నిటి ధ్వనితో |
| **ఇశైదిశై కెళ్లుమి** | = | తమ స్వరమును చేర్చి ఆయా దిక్కులందు |
| **కంగులుళ్** | = | రాత్రియందు |
| **ఎల్లాం** | = | అంతటా |
| **కిన్నరర్** | = | కిన్నరులును |
| **గరుడర్గళ్** | = | గరుడులును |
| **కన్దరువర్** | = | గంధర్వులును |
| **అవర్** | = | వారివారికి చెందిన |
| **గీతంకళ్** | = | కీర్తనలను |
| **పాడినర్** | = | గానం చేసిరి. |
| **మాదవర్** | = | గొప్పతపస్సంపన్నులు |
| **వానవర్** | = | దేవతలు |
| **శారణర్** | = | చారణులు |
| **ఇయక్కర్** | = | యక్షులున్నూ |
| **తిరువడి** | = | నీ దివ్యపాదపద్మములను |
| **తొళ్లువాన్** | = | సేవించుటకు |
| **శిత్తరుమ్** | = | చిత్తరువులవలె |
| **మయంగినర్** | = | మోహించియున్నారు. |
| **ఆదలిల్** | = | అందువలన |
| **అవర్కు** | = | వారికి |
| **నాళ్** | = | ప్రాతఃకాలపు |
| **ఓలక్కమ్** | = | సభాదర్శనమును |
| **అరుళ** | = | అనుగ్రహించుటకు |
| **అరంగత్తమ్మా** | = | శ్రీరంగనాథా! |
| **పళ్ళియెళ్లున్దు** | = | శయ్యపైనుండి మేల్కొంచి |
| **అరుళాయే** | = | కృప చేయుమా! |

**తా:** ఓ రంగనాథా! రాత్రి, నీవు శయనింప దేవతలంతా జోలపాటలు పాడిరి. అనేక వాయిద్యములతో వారికివారికి చెందిన పద్ధతులలో కీర్తనలను ఆయా దిక్కులలో నుండి గానం చేసిరి. కొందరు లయప్రధాన వాయిద్యములను మృదంగము మరియు మద్దెలలను మ్రోగించిరి. మరికొందరు ఒకేతీగకల ఏకతార, వీణ వంటి అనేక తంత్రీనాద పరికరములను మీటిరి. మరికొందరు పిల్లనగ్రోవుల నూదిరి. గానకళలో ఆరితేరిన కిన్నరులు, గంధర్వులు, గరుడులు అందరూ వాయిద్యధ్వనులతో గొంతుకలిపి శ్రావ్యంగ పాడిరి.

గొప్ప తపస్సంపన్నులైన మునులు, దేవతలు, చారణులు, యక్షులంతా నీవు నిద్ర మేల్కొనగ, నీ దివ్యపాదారవిందములను సేవించుటకు వేచియున్నారు. ఆ దివ్య సౌందర్యధ్యానంతో మోహము చెంది, చిత్తరవులవలె నిలచి, నీ దర్శనమునకై ఆశతో ఎదురుచూస్తుండగానే తెల్లవారింది. అందువల్ల నిద్రలేచి, కొలువుదీరి, వారందరిమోహము తొలగునట్లు ఓ రంగనాథా! పడకనుంచి లేచి, సభకు వేంచేసి అనుగ్రహించుము. (ఇంకా ఉంది)

# 3. పదకేళి -వంశీ

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | 3 | | 4 |
| | | | | 5 | | | |
| | | | | 6 | | | |
| 7 | | | | | | 8 | |
| 9 | | | | | 10 | | |
| | | 11 | | 12 | | | |
| | 13 | | | | | | 14 |
| | | | 15 | | | | |

**పదకేళిని పూరించి, భక్తినివేదన - సీతానగరం చిరునామాకి పంపించగలరు. 15వ తేదీలోపు అందినవాటిని మాత్రమే పరిశీలిస్తాం!**

### ఆధారములు

*అడ్డం:*

1. శ్రీకృష్ణుడు కొండనెత్తి పొందిన పట్టాభిషేకనామం.
3. కంచిలో వెలసిన స్వామిని ఆర్తిగా పిలవండి.
4. పట్టణం – ఇతడు
5. ఇంద్రాగ్నులు శిబివద్దకు – పావురాలుగా వచ్చారు.
6. పవిత్రాగ్ని అయినా తడబడ్డాడు.
7. పావురాల సవ్వడి
8. ప్రమద్వర జంట
9. ఒక ధాన్యం
11. నలునితో కలిసి ప్రసిద్ధి
14. ప్రాసతో సన్యాసి
15. ముసలావిడ పాపం తిరగపడింది.
16. పద్మమే... స్వామివారి ఆశ్రమాలలో ఒకటయింది.

*నిలువు*

1. మన స్వామి ఇచ్చే పురస్కారాలలో ఒకటి
2. సత్కారానికి ముందుకొస్తుంది.
3. రామానుజసేవలో తరించిన నంబి
4. అమ్మ తాటితో కట్టినా గొప్ప పేరొచ్చిందని మురిశాడు.
5. నిశ్చయంగా ఇతడే
10. సత్వగుణాన్ని పెంచే ఆహారం
11. భయమే
12. స్వర్లోకపాలకుడు
13. ఈ గోపాలుని పదాలు ప్రసిద్ధి
15. ప్రత్యక్ష దైవం.

## 2. పదకేళి - సమాధానములు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| న | మ్మా | ళ్వా | ర్లు | | | వ | | శ |
| వ | | | వ | ర | వ | ర | ము | ని |
| తి | ప | తి | య | | | హా | ర | |
| రు | | గ | డ | | | | | |
| ప | తి | | ఉ | ప | న | య | న | ము |
| తు | | | | | | | దు | ను |
| లు | క్కు | | కు | ల | శే | ఖ | రు | లు |

# మన ఆళ్వార్లు



పొయ్‌గై ఆళ్వార్ పూదత్తాళ్వార్ పేయాళ్వార్

- శ్రీ నృసింహ -

## ముదలాళ్వార్లు

### పొయ్‌గై ఆళ్వార్లు - పూదత్తాళ్వార్లు - పేయ్ ఆళ్వార్లు

శ్రీరంగనాథుడు బ్రహ్మ ఆరాధించే దివ్యమూర్తి. బ్రహ్మగారు నిత్యతిరువారాధనలో ఆస్వామిని అర్చించేవాడు. ఒకప్పుడు తన కులధనమైన ఈ శ్రీరంగని ఇక్ష్వాకు మహారాజుకు అనుగ్రహించాడు బ్రహ్మ. మరి తనకి ఆరాధనకోసం స్వామిని తెచ్చుకోవాలిగా! అందుకని కాంచీపురంలో ఒక యజ్ఞం చేశాడు. కాంచీపురి ఎంత గొప్ప దివ్యదేశమో కదా!

**అయోధ్యా మధురామాయా కాశీ కాంచీ అవంతికా ।**
**పురీ ద్వారవతీ చైవ సప్తైతా మోక్షదాయకాః ॥**

మోక్షాన్ని ప్రసాదించే దివ్యక్షేత్రాలుగా పై ఏడింటిని చెప్తారు. అందులో కంచి ముఖ్యంగా శ్రీ వైష్ణవ సిద్ధాంతానికి అతి ముఖ్యమైన దివ్యక్షేత్రం.

క అంటే బ్రహ్మ. అంచ్ అంటే పూజ. బ్రహ్మగారి చేత ఆ స్థలంలో పరమాత్మ యజ్ఞరూపిగా ఆరాధింపబడ్డాడు కాబట్టి ఆ క్షేత్రానికి **కంచి** అనే పేరు వచ్చింది. ఈ ఊరికే కరిశైలం, హస్తిగిరి అనే పేర్లు కూడా ఉన్నాయి. అక్కడి కొండ ఏనుగు ఆకారంలో ఉంటుంది. కరి-హస్తి అని ఏనుగుకి పేర్లు. అందువలన ఆ కొండకి కరిశైలం, హస్తిగిరి అనే పేర్లు కూడా వచ్చాయి. అలా బ్రహ్మగారు పూజించినప్పుడు యజ్ఞగుండంలో ఆవిర్భవించి ఆ కొండపై నిలిచిన స్వామి పేరే వరదరాజ పెరుమాళ్. ఆ కొండ కుంభస్థలంలో ఒక పుణ్యకోటి విమానం ఉంది. ఆ విమానంలో వేంచేసి భక్తులను అనుగ్రహిస్తున్నాడు శ్రీ వరదరాజు. యాగగుండం నుంచి బైటికి వచ్చాడు కాబట్టి తాపం చాలా ఎక్కువగా ఉంటుంది. అందుకనే ఆ స్వామికి విసనికఱ్ఱతో నిత్యం విసురుతూ ఉండడం చాలా గొప్ప సేవగా ప్రసిద్ధి చెందింది. ఈ దివ్యక్షేత్రంలో **యథోక్తకారి** అనే పెరుమాళ్ సన్నిధి ఉంది. ఆయన భక్తులు ఎలా చెప్తే అలా చేసే సులభుడు కాబట్టి ఆ పేరు తెచ్చుకున్నాడు. అక్కడే ఒక దివ్యసరస్సు కూడా ఉంది. దానిని అనంత సరస్సు అని కూడా అంటారు. ఆ పుష్కరిణి నిండా తామరపూలే బంగారుపూలలా మెరిసిపోతూ ఉంటాయి. బంగారుకాంతితో మెరిసే పద్మాలకి నిలయం కాబట్టి ఆ కొలనుకి **హేమ కాసారం** అని కూడా పేరు వచ్చింది.

అంత పవిత్రమైన కంచిక్షేత్రంలో ఆ స్వామి పుష్కరిణిలో ఒక బంగారుకాంతికల పద్మంలో అవతరించారు పొయ్‌కై ఆళ్వార్లు. పొయ్ కై అంటే సరస్సు అని అర్థం. సరస్సులో అవతరించారు కాబట్టి అదే పేరుతో పొయ్‌కై ఆళ్వార్లు అని ప్రసిద్ధి చెందారు. సరస్సులో ఆవిర్భవించడం వలన సరోయోగి, కాసారయోగి, సరోమునీంద్రులు అనే పేర్లు లోకంలో ప్రసిద్ధి చెందాయి. ఆ మహనీయుల అవతార సమయం-

ద్వాపరయుగాంతంలో ఎనిమిది లక్షల అరువదిరెండు వేల తొమ్మిది వందల రెండవ సంవత్సరం, సిద్ధార్థి నామ సంవత్సరం, ఐప్పశి... ఆశ్వయుజమాసం, శుక్లపక్షము, అష్టమి, మంగళవారం, శ్రవణనక్షత్రం శుభసమయం.

శ్రీమన్నారాయణుని పాంచజన్య శంఖంయొక్క అంశతో అవతరించారు పొయ్‌కై ఆళ్వార్లు. సరస్సుకి 'కొలము' అని పేరు కాబట్టి తమిళ సంప్రదాయ నామం కొళత్తాళ్వార్ అని అంటారు. సరస్సు వీరి పేరుగా మారింది. ఈ పోలిక ఈ నామం చాలా రమణీయం. ఎందుకంటే సరస్సు

**సజ్జీవనత్వాత్ బహు సత్వయోగాత్**
**సంసారదావాగ్ని వినాశకత్వాత్ ।**
**శైత్యోదయాత్ సూక్ష్మమృత ప్రదానాత్**
**సరోభిధానం యముదాహరన్తి ॥**

1. సజ్జీవనం : మంచినీళ్ళతో కూడి ఉంటుంది. ఈ ఆళ్వార్లు కూడా సజ్జీవనులే! అంటే, సత్పురుషులకి జీవనమైన వారు. అంటే వీరిని గూర్చిన ధ్యానమే జీవితాన్ని నిలబెడుతుంది.
2. సరస్సు బహు సత్వసంపన్నం. అంటే చెరువులో ఎన్నో సత్వాలు, ప్రాణులు – ఆ నీటిని త్రాగుతూ ఆ నీరే ఆధారంగా జీవిస్తూ ఉంటాయి. ఈ ఆళ్వార్లు కూడా అంతే! వీరి జీవితాన్ని, గ్రంథాలని, శ్రీసూక్తుల్ని ధారకంగా, పోషకంగా, భోగ్యంగా గ్రహిస్తూ ఎందరో భాగవతోత్తములు తమ జీవనయానం సాగించారు. సాగిస్తున్నారు–ఎప్పటికీ సాగిస్తారు.
3. సరస్సులో జలం దావాగ్నిని ఆర్పుతుంది. వీరి సూక్తులనే జలం తాపత్రయాలని చల్లారుస్తుంది.
4. సరస్సులో మునిగితే తాపం తీరిపోతుంది. ఈ ఆళ్వార్ల కథామృతం తాపాన్ని తీరుస్తుంది. సంసారమనే తాపం బాధ తగ్గిపోతుంది.
5. సరస్సు తన అమృతం వంటి నీటినిచ్చి దాహం తీరుస్తుంది. ఈ ఆళ్వార్ల శ్రీసూక్తులు కూడా అమృత మయంగా తియ్యగా ఉండి మన దాహాన్ని తీరుస్తాయి.

అంటే శరీరతాపం – దాహబాధ రెండూ పోతాయి ఈ మహనీయుల దివ్యోపదేశం చేత. అందువల్లనే పెట్టిన పేరు చరితార్థమైంది. ఈ దివ్యపురుషుల విషయంలో వీరి జన్మ నక్షత్రాది వివరాలను పెద్దలు మనకి ఎంతచక్కగా అందించారో చూడండి.

శ్లో॥ **తులాయాం శ్రవణేజాతం కాంచ్యాం కాంచన వారిజాత్।**
**ద్వాపరే పాంచజన్యాంశం సరోయోగినమాశ్రయే ॥**
శ్లో॥ **కాంచ్యాం సరసి హేమాబ్జే జాతాం కాసారయోగినమ్ ।**
**కలయే యః శ్రియః పత్యుఃరవిం దీపమకల్పయత్ ॥**
శ్లో॥ **ముకుందస్య ముఖోల్లాస మూల వాగ్జాల మూర్ఛితం ।**
**మునిముఖ్యం సరోజాతం ముక్తిమూలముపాస్మహే ॥**

********

పొయ్కై ఆళ్వార్లు అవతరించిన కాలంలోనే అవతరించారు పూదత్తాళ్వార్లు, పేయాళ్వార్లు కూడా. ఈ ముగ్గురు ఆళ్వార్లలో అందరికంటే ముందు అవతరించిన వారు, మొదటివారూ కాబట్టి "ముదల్ ఆళ్వార్లు" అని పేరు పొందారు.

ఈ ముగ్గురిలో రెండవ ఆళ్వార్లు **పూదత్తాళ్వార్లు.** వీరు "తిరుక్కడల్ మల్లై" అనే దివ్యదేశంలో అవతరించారు.

ఆ ఊరే **మహాబలిపురం**. అక్కడ బండి గురిగింజపుష్పంలో అవతరించారు.

శ్రీమన్నారాయణుని గదాంశంతో వీరు ఈ భూమిపై అవతరించారు. కౌమోదకి అనే పేరు స్వామి ధరించిన గదకి. ఆ అంశతో వచ్చారు వీరు. ద్వాపరయుగం ఎనిమిది లక్షల అరువదివేల తొమ్మిదివందల రెండవ సంవత్సరం సిద్ధార్థ నామ సంవత్సరం ఆశ్వయుజమాసం, శుక్లపక్షము నవమి బుధవారం ధనిష్ఠా నక్షత్రంలో అవతరించారు. నల్లకలువలో అవతరించిన స్వామిగా చెపుతారు వీరిని. సుగంధభరితమైన జాజి పూపొదరింటిలో అవతరించారని చెపుతారు.

కురుక్కత్తి పుష్పము – మాధవీపుష్పము–అత్తిపుష్పము. వీటి పరిమళం వ్యాపించి నట్లు లోకరక్షణార్థము అవతరించారు వీరు. భగవత్ తత్త్వస్థాపన చేయడంకోసం వచ్చిన వీరిని వైష్ణవ భూతమని అనేవారట. విష్ణు పరత్వాన్ని స్థాపించారు వీరు.

**"అస్తి బ్రహ్మేతి చేద్వేద సన్తమేనం తతోవిదుః"** అన్నట్లు బ్రహ్మజ్ఞానం కలిగి ఉన్నవాడే జీవించి ఉన్నవాడు. సత్ భూ సత్తాయాం. ఉండుట అని అర్థం. అలా బ్రహ్మజ్ఞానమూర్తిగా భూదత్తాళ్వార్ – పూదత్తాళ్వార్లు పేరు పొందారు.

వీరిని అనుసంధానం చేసుకొనవలసిన తనియన్ :

**తులా ధనిష్ఠా సంభూతం భూతం కల్లోలమాలినః ।**
**తీరే ఫుల్లోత్ఫలే మల్లా పుర్యామీడే గదాంశకమ్ ॥**
**మల్లాపుర వరాధీశం మాధవీ కుసుమోద్భవం ।**
**భూతం నమామి యో విష్ణోః జ్ఞానదీప మకల్పయత్ ॥**

********

ముదలాళ్వార్లు ముగ్గురిలో మూడవవారు పేయాళ్వార్లు. భగవంతుని నిర్హేతుకమైన దయతో ఈ భువిలో అవతరించారు వీరు. చెన్నపట్టణానికి దగ్గరలో మైలాపూర్‌లో మణికైరవం అనే బావిలో ఎఱ్ఱ కలువ పుష్పంలో అవతరించారు వీరు. వీరు కూడా ద్వాపరయుగం ఎనిమిది లక్షల అరువది వేల తొమ్మిది వందల రెండవ సంవత్సరం సిద్ధార్థిలో ఆశ్వయుజమాసం శుద్ధదశమీ గురువారం శతభిషానక్షత్రంలో అవతరించారు.

"నందకం" అనే ఖడ్గం అంశతో వీరవతరించారు. వీరికి మహదాహ్వయులు, మైలాపురాధిపతులు అనే పేర్లు

ప్రసిద్ధికెక్కాయి. పేయ్ అంటే పిచ్చి, భ్రాంతి అని అర్థం. పిశాచం అనే అర్థం కూడా ఉందిట. భక్తిపిచ్చిలో పడినవారు లోకాన్ని పట్టించుకోరు కదా! వీరూ అంతే! భగవధ్యానంలో నవ్వుతూ, ఏడుస్తూ చూసేవారికి పిచ్చివారిలా కనిపించేవారు కాబట్టి పేయాళ్వార్ అని పేరు వచ్చింది. చాలా చాలా భక్తి కలయోగి వీరు. అందుచేత మహాయోగి అన్నారు. వీరవతరించిన బావి భూతయోగి అవతరించిన పూపొదరింటికి ఉత్తరదిక్కుగా ఉంది. కేశవస్వామి ఆలయానికి ఎదురుగా ఉందిది.

భూలోకంలో అవతరించారు కాబట్టి వీరికి పంచ సంస్కారములు అనుగ్రహించాలని ఆ శ్రీమన్నారాయణుడు భావించి శ్రీ విష్వక్సేనులను ఆదేశించాడు. శ్రీ విష్వక్సేనులు ఈ ముగ్గురికీ పంచసంస్కారమలు ప్రసాదించి మంత్ర మంత్రార్థాలు ఉపదేశించారు. ఆ మహోపదేశంతో వీరు శుద్ధ సత్త్వ జ్ఞానమూర్తులయ్యారు.

భగవద్ గుణానుభవమే ఆకలిని తీర్చే సాధనం. భగవద్ గుణానుభవమే నిద్ర. అదే ఆహారం. శ్రీమన్నారాయణుని తత్త్వ చింతనతో అన్నీ తెలిశాయి వారికి. సమస్త విజ్ఞానం కరతలామలకమైంది.

శ్లో॥ **తులా శతభిషిక్ జాతం మయూరపురి కైరవాత్ ।**
**మహాన్తం మహదాఖ్యాతం వందే శ్రీనందకాంశజమ్ ॥**

శ్లో॥ **దృష్ట్వా తుష్టావయో విష్ణుం రమయా మయిలాధిపమ్।**
**కూపే రక్తోత్పలే జాతం మహాదాహ్వాయ మాశ్రయే ॥**

శ్రీమన్నారాయణుడు లోకులని చూచి ఎంతో బాధపడ్డాడు. అయ్యో! అజ్ఞానులై ఈ సంసారులు ఈ భూచక్రంలో ఇలా తిరుగుతున్నారే! ఈ ముగ్గురు ఆళ్వార్లని పంపి ఈ భూజనులకు మంచిని ఉపదేశింపచేసి తరింపచేస్తే బాగుంటుంది అనే దయ ఆయనకి కలిగింది. ఆ దివ్యసంకల్పమే ఈ ముగ్గురిని ఒకచోటికి చేర్చింది.

ఈ ముగ్గురు ఒకరికొకరు తెలియరు. భగవన్నామగానం చేసుకుంటూ రోజుకొక గ్రామంలో ఉంటూ సంచారజీవనం సాగిస్తున్నారు. అలా సాగిన ప్రయాణంలో వారు ముగ్గురు ఒక దివ్యక్షేత్రంలో కలుసుకున్నారు. వీరి ముగ్గురికి ఆచార్యులు సేనముదలియార్ అంటే విష్వక్సేనులు.

వీరి పెరుమాళ్ ఆళ్వార్‌గళ్‌నైనార్ ఆ స్వామి కృపతో ఈ ముగ్గురు ఎప్పుడు ఎక్కడ ఎలా కలిశారంటే... సశేషం

**జూలై నెల మెదడుకి మేత! సమాధానములు**

1. స్వచ్ఛంద మరణం; 2. పరాశరమహర్షి; 3. బ్రహ్మ శిరోనామకం; 4.కైవల్యం; 5. మద్దిచెట్ల రూపం; 6. ప్రేమతత్త్వం; 7. శుకుడు; 8.మెరుపుతీగలాగ; 9. అరబ్బులు; 10. ఆల్ఫాల్ఫా మొక్కకు; 11. శృంగి; 12. ఆషాఢ పూర్ణిమ; 13. భట్టనారాయణుడు; 14. 21 అవతారాలు; 15.శ్రీరంగనాథుని సుప్రభాత గీతిక; 16. వ్యూహస్వరూపానికి; 17.పూదత్తాళ్వార్; 18.సింహస్వరూపం; 19. గంగానది; 20. మావటీడు;

# పంచాంగ స్వరూపము

**శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ**

**శ్రీకళ్యాణగుణావహం రిపుహరం దుఃస్వప్న దోషాపహమ్।**
**గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్॥**
**ఆయుర్వర్ధక ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం।**
**నానాకర్మ సుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్॥**

మానవాళికందరకు భగవత్కళ్యాణ గుణములు పరిపూర్ణముగా నొసంగి శత్రుబాధలను తొలగించి దుఃస్వప్న దోషములను హరించుటయేకాక గంగాస్నాన విశేష పుణ్య ఫలము నిచ్చునది, గోదానముతో సమమైన ఫలమును ఆయుర్వృద్ధిని ఉత్తమమైన శుభకరమైన సంతానమును సంపత్తు నొసంగునదియు శుభాశుభ కర్మలను సముచితముగా సుసాధనము చేయునదీ పంచాంగము. ప్రతిఒక్కరు ఆకర్ణించవలసిది, చూడవలసినది.

పంచాంగ నిర్వచనము :

**తిథివారం చ నక్షత్రం యోగః కరణమేవ చ ।**
**పంచాంగమితి విఖ్యాతం కాలోఽయం కర్మసాధకం ॥**

1. తిథి, 2. వారము, 3. నక్షత్రము, 4. యోగము, 5. కరణము. ఈ అయిదింటిని పంచాంగము అను నామము (పేరు)తో వ్యవహరిస్తారు. ఇవి శుభాశుభ కర్మలన్నింటిని జరుపుటకు సాధనముగా ఉపయోగిస్తారు.

**తిథేశ్చ శ్రియమాప్నోతి వారాదాయుష్యవర్ధనం ।**
**నక్షత్రాద్ధరతే పాపం యోగాద్రోగ నివారణమ్ ॥**

**కరణాత్కార్య సిద్ధిశ్చ పంచాంగం ఫలముత్తమమ్ ।**
**కాలవిత్కర్మ కృద్ధీమాన్ దేవతానుగ్రహం లభేత్ ॥**

తిథి : సిరిసంపదలనిచ్చును వారము; ఆయుష్షును, వృద్ధి పొందించును. నక్షత్రము; పాపమును హరించును. యోగము: రోగనివారణచేయును. కరణము; కార్యసిద్ధిని కలిగించును. కావున పంచాంగమనునది ఉత్తమమైన ఫలమును ఇచ్చును.

ఈ పంచాంగములోని ఈ అయిందింటిని ప్రతినిత్యము అనుష్ఠించుటవల్ల కాలపురుషుడను భగవానుడు మానవాళి కందరకు తన సంపూర్ణానుగ్రహాన్నివ్వగలడు.

**అవతారాణ్యనేకాని హ్యజస్య పరమాత్మనః ।**
**జీవానాం కర్మఫలదో గ్రహరూపీ జనార్దనః ॥**

పరమాత్మకు అనేక అవతారములు కలవు. జనార్దనుడు గ్రహరూపియై జీవులకు కర్మఫలములనిచ్చును.

**రామోవతార స్సూర్యస్య చంద్రస్య యదునాయకః ।**
**నృసింహో భూమిపుత్రస్య బుధ్ధ స్సోమసుతస్య చ ॥**
**వామనో విబుధేజ్యస్య భార్గవో భార్గవస్య చ ।**
**కూర్మో భాస్కర పుత్రస్య సైంహికేయస్య సూకరః ॥**

**కేతోర్మీనావతారశ్చ యేచాన్యేతేఽపి భౌమజాః ॥**

1. **రాముడు - సూర్యుని అవతారము**
2. **కృష్ణుడు - చంద్రుని అవతారము**
3. **నృసింహుడు - కుజుని అవతారము**
4. **కల్కావతారము - బుధుడు**
5. **వామనుడు - బృహస్పతి**
6. **పరశురాముడు - శుక్రుని అవతారము**
7. **కూర్మము - శని**
8. **వరాహము - రాహువు**

ఇవి ముఖ్యముగా గ్రహరూపములుగా చేరినవి.

నవగ్రహములు ఇచ్చు ఫలితములు :

1. **రవి - శౌర్యము**
2. **చంద్రుడు - వైభవము**
3. **అంగారకుడు(కుజుడు) - మంగళములు**
4. **బుధుడు - ఐశ్వర్యమును**
5. **బృహస్పతి - గౌరవము**
6. **శుక్రుడు - సుఖము**
7. **శని - ధనము**
8. **రాహువు - బలము**
9. **కేతువు - కులగౌరవములను**

మానవాళికి ఇచ్చును.

# మహాత్ములు - ఏకరూపులు

- శ్రీమాన్ సముద్రాల శఠగోపాచార్యస్వామి, వరంగల్

సత్కార్యాచరణ తత్పరులై అనితరసాధ్యమైన రీతిలో జీవనయానాన్ని కొనసాగించే మహాత్ములు కష్టసుఖాల్లో, జయాపజయాల్లో, లాభనష్టాల్లో సమచిత్తులై ఏకరూపులై ఉంటారు. మహాత్ములు ఆపదలు వచ్చినప్పుడు క్రుంగిపోరు. సంపదలు వచ్చినప్పుడు పొంగిపోరు. దూరాన్ని లెక్కించరు. అవలీలగా సముద్ర లంఘనం చేస్తారు. పర్వతాల్నీ అధిరోహిస్తారు. తమకేదీ అసాధ్యం కానట్లుగా మహోన్నత లక్ష్యాలను ఏర్పరచుకుంటారు. లక్ష్యసాధన దిశగా అడుగులేస్తారు. సమున్నత ఫలితాలను పొందుతారు.

తమ తమ ప్రతిజ్ఞలకు అనుగుణంగా మహత్కార్యాలను ఆరంభించేప్పుడు సుఖ సంపదలను, కీర్తిప్రతిష్ఠలను కాంక్షించరు. ఏవైనా అడ్డంకులు వచ్చినా, అధైర్యం చెందక సంకల్పించిన కార్యాన్ని నెరవేర్చుటకై దీక్షబూనుతారు అనే విషయాన్ని తెలియజెప్పే శ్లోకమిదియే –

**అర్థ స్సుఖం కీర్తిరపీహ మాభూత్**
**అనర్థ ఏవాస్తు తథాపి ధీరాః ।**
**నిజ ప్రతిజ్ఞా మనురుధ్యమానా**
**మహోద్యమా కర్మ సమారభంతే ॥"**

మహాత్ములు స్తుతినిందలకు, లోభ మోహాలకు అతీతులు. మహారాజ్యాన్ని, మహారణ్యాన్ని ఒకేవిధంగా భావిస్తారు. శ్రీరామచంద్రప్రభువు లక్ష్మణస్వామితో – నేను రాజ్యలక్ష్మిని కోల్పోయానని బాధపడకు. నాకు రాజ్యాధికారం కన్నా పితృవాక్యపరిపాలనకై చేసే వనవాసమే ఎక్కువ ఆనందాన్ని కలిగిస్తుంది.....

**మా చ లక్ష్మణ సంతాపం కార్షీః లక్ష్మ్యా విపర్యయే ।**
**రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః ॥**

అని పేర్కొన్నాడు.

అవికారులు, సమచిత్తులు అయిన మహాత్ములలో అగ్రగణ్యుడు శ్రీరామచంద్రుడే. రాజ్యపట్టాభిషేకానికి ముహూర్తం దగ్గర పడుతుండగా కైకేయి శ్రీరామచంద్రునితో – నీవు నారవస్త్రాలను ధరించి వెంటనే అరణ్యానికి బయలుదేరమని కఠినోక్తులను పలికినా అతను ఏమాత్రం చలించలేదు. పైగా కైకేయితో శ్రీరామచంద్రుడు – నేను సంపదలకు ఆశపడేవాడిని కాను (నాహమర్థపరో దేవి) అని తెలిపినాడు. నేను ఆడిన మాటను తప్పేవాడను కాను. మేరు మందరపర్వతములతో సరితూగే ధనరాశులను, అరణ్యము నందలి గడ్డిపరకలతో సమానంగా భావించే ఋషుల కోవకు చెందినవాడను (విద్ధి మాం ఋషిభిస్తుల్యమ్). కోపగించకు, నేను నారవస్త్రాలను, జటలను ధరించి వెంటనే అరణ్యానికి బయలుదేరుతాను. నీవు సంతోషంగా ఉండుము.

**మన్యుర్నచ త్వయా కార్యో దేవి! బ్రూమి తవాగ్రతః ।**
**యాస్యామి భవ సుప్రీతా వనం చీరజటాధరః ॥"**

అని పలికినాడు.

అంతఃపురంలో హంసతూలికాపాన్పుపై నిదురించవలసిన శ్రీరామచంద్రుడు అరణ్యంలో కటిక నేలపై నిదురించాడు. పట్టువస్త్రాలను ధరించి, పంచభక్ష్య పరమాన్నాలను ఆరగించాల్సి యుండగా నారవస్త్రాలను ధరించి కంద మూల ఫలాల్ని భుజించాడు. మహోన్నత కార్యాలను నిర్వర్తించే మహాత్ములు ఎప్పుడూ తమ కష్టసుఖాలను లక్ష్యపెట్టరు అని తెలిపే..

**క్వచిత్ పృథ్వీశయ్యః క్వచిదపి చ పర్యంకశయనః**
**క్వచిచ్ఛాకాహారః క్వచిదపి చ శాల్యోదనరుచిః ।**
**క్వచిత్ కంథాధారీ క్వచిదపి చ దివ్యాంబరధరో**
**మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖమ్ ॥**

అను సూక్తిసారము శ్రీరామచంద్రప్రభువుయొక్క కార్యాచరణలో ప్రత్యక్షనిదర్శనంగా, అక్షరసత్యంగా దర్శనమిచ్చును.

ప్రజల, ప్రభువుల శ్రేయస్సుకై యజ్ఞ, దాన, తపములను ఆచరించెడు మునిజనులు ఇంద్రియనిగ్రహం కలిగియుంటారు. వారికి ప్రియాప్రియములు అనేవి ఉండవు. వారు పాపస్పర్శ లేనివారు, నిశ్చలచిత్తులు. లోకపూజ్యులు, మహాత్ములు అయినట్టి మునులకు సీతాదేవి నమస్కరించిన విధమును వాల్మీకి మహర్షి

శ్రీమద్రామాయణం సుందరకాండ 26వ సర్గలోని...

**ధన్యాః ఖలు మహాత్మానో మునయః త్యక్తకిల్బిషాః ।**
**జితాత్మానో మహాభాగా యేషాం న స్తః ప్రియాప్రియే ॥**
**ప్రియాన్న సంభవేద్దుఃఖ మప్రియాదధికం భయమ్ ।**
**తాభ్యాం హి యే వియుజ్యంతే నమస్తేషాం మహాత్మనామ్॥**

అను శ్లోకాలతో ప్రకటించెను.

సంపదలు వచ్చినా గర్వాన్ని పొందనట్టి, ఆపదలు వచ్చినా దుఃఖించనట్టివారే మహాత్ములని, ఇలాంటి మహానుభావులు చాలా అరుదుగా జన్మిస్తుంటారని ఈ హితోపదేశ శ్లోకం వల్ల తెలుస్తున్నది–

**సంపది యస్య న హర్షో విపది**
**విషాదో రణే చ భీరుత్వమ్।**
**తం భువనత్రయతిలకం**
**జనయతి జననీ సుతం విరలమ్ ॥**

ఆపదల్లో ధైర్యాన్ని, అభివృద్ధిలో ఓర్పును, సభలో వాక్చాతుర్యాన్ని, యుద్ధంలో పరాక్రమాన్ని, యశస్సంపాదనలో అభిరుచిని, వేదాధ్యయనం పట్ల వ్యామోహమును ఎవరు కలిగియుంటారో అట్టివారే మహాత్ములు అని భర్తృహరి నీతిశతకంలో మహాత్ముల లక్షణాన్ని నిర్వచించాడు –

**విపది ధైర్యమథాభ్యుదయే క్షమా**
**సదసి వాక్పటుతా యుధి విక్రమః ।**
**యశసి చాభిరుచిః వ్యసనం శ్రుతౌ**
**ప్రకృతిసిద్ధమిదం హి మహాత్మనామ్ ॥**

మహాత్ముల మనసులోని ఆలోచనలు, వారు మాట్లాడే మాటలు, చేసే పనులు ఒకే విధంగా ఉంటాయి. సూర్యుడు ఉదయించినపుడు, అస్తమించినపుడు ఒకే విధంగా అరుణ వర్ణంలో ఉన్నట్లు మహాత్ములు సంపదలు వచ్చినప్పుడు, ఆపదలు వాటిల్లినప్పుడు కూడా ఒకే విధంగా ఉంటారు. అందుకే మహాత్ములు ఎల్లప్పుడూ అవికారులై, ఏకరూపులై, నిశ్చలచిత్తులై ప్రకాశిస్తూ ఉంటారు.

**యథా చిత్తే తథా వాచి యథా వాచ స్తథా క్రియాః ।**
**సంపత్తౌ చ విపత్తౌ చ మహతా మేకరూపతా ॥**

**ఉదయే సవితా రక్తః రక్తశ్చాస్తమయే తథా ।**
**సంపత్తౌ చ విపత్తౌ చ మహతా మేకరూపతా ॥**

అని తెలిపే ఆర్యోక్తుల సారాన్ని మనసులో నాటుకుందాం. మహాత్ముల మార్గాన్ని అనుసరించేందుకు ప్రయత్నిద్దాం.

**జై శ్రీమన్నారాయణ**

గీతామాహాత్మ్యకథలు - 13

# హరిక్షేత్రము

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

గత మాసపు గీతామహాత్మ్య కథ "**సిద్ధ సమాధి యోగి**" లో ఒకరి ప్రాణాలు రక్షించగలిగే స్థితి ఉండి రక్షించక పోయినట్లైతే రాక్షసజన్మ వస్తుందని పద్మపురాణం చెప్పింది. ఇది తెలుసుకున్న తరవాత మనం రక్షించగలిగే వారిని మనం రక్షిస్తున్నామా! రోడ్డు మీదనుండి పోతూ కనబడిన రోడ్డు ప్రమాదాలలో ఇరుక్కున్న వారికి మనవంతు సహాయం చేస్తున్నామా! 'అయ్యా! మాబిడ్డ తీరనిరోగంతో బాధపడుతున్నాడు సహాయం చెయ్యండి' అని వచ్చేవాళ్లకి మనమేమైనా సహాయం చెయ్య గలుగుతున్నామా! అంటే, అన్ని ప్రశ్నలకు లేదనే సమాధానం వస్తోంది. ఇలా ఇతరుల గోడు పట్టించుకోకుండా బ్రతకాడానికి మనకి సవాలక్ష కారణాలున్నాయి. కాని ఈ తప్పును సరిదిద్దుకోవడానికి మన మరణానంతరం అవయవదానం చెయ్యవచ్చు అంటోంది **మోహన్‌ఫౌండేషన్**. తప్పు దిద్దుకోవాలి అనుకున్నవారు 09392456355 ని సంప్రదించండి.

ఇక ఈ మాసం మనం చెప్పుకోబోయే కథ భగవద్గీతలోని 13వ అధ్యాయం **క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగానికి** సంబంధించింది. మనం అసలు కథలోకి వెళ్లబోయేముందు ఈ అధ్యాయం అందిస్తున్న జ్ఞానం వైపు ఒకసారి చూద్దాం. ఈ 13వ అధ్యాయం నుండి చివరి వరకూ ఉన్న ఆరు అధ్యాయాలను **జ్ఞానషట్కం** అని కూడా అంటారు.

మనం ఈ శరీరంతోటే గుర్తింపు పొందుతాం. కాని మనం ఈ శరీరం కాదు. ఈ శరీరంలో ఒక జీవాత్మ ఉంది. దానికి తాను ఈ శరీరం కాదు అని తెలుసు. అందుకే ఆ జీవాత్మను జ్ఞాత అని పిలుస్తారు. ఆ జీవాత్మలోకి ప్రవేశించి దానికి సత్త కల్పించే పరమాత్మ అయినవాడు వేరే ఒకడున్నాడు. ఇవన్నీ నేను చెపుతున్న విషయాలు కావు. సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుడే ఈ అధ్యాయంలో చెప్పాడు. మీరు ఈ క్రింది రెండు ప్రమాణ శ్లోకాలు చదవండి, మీకే తెలుస్తుంది.

శ్రీభగవానువాచ

**ఇదం శరీరం కౌంతేయ, క్షేత్రమిత్యభిధీయతే**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥** *(భ.గీ-13-2)*

ఓ అర్జునా! ఈ శరీరాన్నే క్షేత్రమంటారు. ఈ క్షేత్రాన్ని తెలుసుకునే వానినే (జ్ఞాతను) క్షేత్రజ్ఞుడని జ్ఞానులు చెప్తున్నారు.

**ఉపద్రష్టానుమంతా చ, భర్తా భోక్తా మహేశ్వరః ।**
**పరమాత్మేతి చాప్యుక్తః దేహేఽస్మిన్ పురుషః పరః ॥** *(భ.గీ. 13-23)*

ఈ జీవాత్మ క్షేత్రమునందున్నప్పటికీ, క్షేత్రముకంటే వేరైన వాడు, సాక్షీభూతుడు, అనుమతించువాడు, పర్యవేక్షకుడు, భోగించు వాడు పరమాత్మగా ప్రసిద్ధికెక్కినవాడు ఈ శరీరము నందు వేరొకడున్నాడు.

ఇలా శరీరము, జీవాత్మ పరమాత్మ అని ముగ్గురున్నారని స్పష్టంగా చెప్పిన అధ్యాయం ఈ పదమూడో అధ్యాయం. కాని కొందరు ఆత్మేపరమాత్మ కాబట్టి ఉన్న తత్త్వాలు రెండే అని వాదిస్తారు. కాని అది తప్పు. ఉన్న తత్త్వాలు మొత్తం మూడు అని భగవంతుడే స్వయంగా వెల్లడించాడు.

ఇలా ఈ శరీరం లేదా క్షేత్రము. క్షేత్రజ్ఞులు అయిన జీవాత్మ, పరమాత్మలకు చెందిన ఎంతో జ్ఞానాన్ని ఈ అధ్యాయంలో వివరించాడు. అందరూ ఈ అధ్యాయాన్ని చక్కగా అర్థంతో పాటు చదివి ఈ జ్ఞానాన్ని ఆస్వాదించండి. ఇక కథలోకి వద్దాం.

దక్షిణదేశంలో తుంగభద్రానదీతీరంలో ఒక హరి క్షేత్రముండేది. ఆ నగరంలో హరి దీక్షితుడను ఒక పుణ్యశీలియైన బ్రాహ్మణుడుండేవాడు ఆతడు మహావిద్వాంసుడు. ఈతడు ఎంతటి పుణ్యాత్ముడో ఆతని భార్య అంతటి పాపాత్మురాలు, అంతటి దుశ్శీల. భర్తకి తరచుగా చెడుమార్గాలను బోధిస్తు ఉండేది. హరిదీక్షితుడు మహాభక్తుడు. శ్రీమన్నారాయణునకు అనన్య భక్తుడు. ఆతని భార్య పరపురుషుల సాంగత్యము లేక యుండలేని కామచారిణి, వ్యభిచారిణి, జారిణి. భర్త చెప్పు సద్వాక్యములను సదా పెడచెవిన బెట్టి తన ఇచ్ఛ వచ్చినట్లు ప్రవర్తించేది. తన విటులను కలుసుకోవడానికి వివిధ సమయాల్లో వివిధ సంకేత స్థలాలను చెప్పేది. సంకేతస్థలాలెప్పుడు నిర్జనంగా ఉండే అటవీ ప్రాంతాలనే ఎన్నుకునేది. తన సంకేత స్థలాల్లోకి ఎవడో ఒక విటుడు వచ్చి తనకోరికలు తీరుస్తూ ఉండేవాడు. అలా కొన్నాళ్లు గడిచిన తరువాత ఒక రోజు అర్ధరాత్రి అయినా ఒక్క విటుడు కనబడలేదు. ఆమె కామాతురతో గట్టిగా అరవడం మొదలు పెట్టింది. ఆ అడవిలో పిచ్చెక్కినట్లు ప్రవర్తించింది. ఒకటే అరుపులు, కేకలు, రాని విటులను తిట్లు.... ఈ గోలకి తనకి కావలసిన వారెవరూ రాలేదు కాని, దూరంగా ఒక చెట్టుకింద పడుకుని ఈమె గోలంతా చూస్తున్న పులికి మాత్రం చిరాకువేసింది. అది నెమ్మదిగా లేచి వచ్చింది. ఆ అలికిడి విన్న ఆమె తన ప్రియుడెవడో వస్తున్నాడని ఆ పులి ఉన్న వైపుకు పరుగెత్తింది. వెంటనే ఆ పులి ఆమె పైకి ఉరికి కింద పడేసి "దుర్మార్గురాలా! చావు" అని మానవభాషలో అంది. "నువ్వెవరు? నన్నెందుకు చంపుతున్నావ"ని అడిగింది ఆ జారిణి.

"నా గురించి తెలుసుకోవాలనుకుంటే విను. నేను గత జన్మలో ఒక ఉత్తమ వంశసంజాతుడనైన బ్రాహ్మణుడను. కాని నాకు డబ్బు పిచ్చి పట్టి, అపర కర్మలన్నంటిలో పట్టరాని దానాలన్నీ పట్టేవాడిని. దర్భలు పుచ్చుకుని విభూతిరేఖలు పూసుకొని నది ఒడ్డున కూర్చునేవాణ్ణి. కాని ఏనాడు సంధ్యావందమైనా చేసే వాణ్ణి కాను. నాకు నాలాంటి మిత్రులు కలిసారు. వాళ్లకి గూడా నాకు వచ్చే లాంటి దానాలు ఇప్పించి వారి సొమ్ములోంచి కొంత నేను అడిగి తీసుకునేవాణ్ణి. నామిత్రులవద్ద అప్పులు చేసి ఎగ్గొట్టేవాణ్ణి. అలాగే బ్రతుకుతూ వార్థక్యం సంప్రాప్తించి, శక్తి ఉడిగి ఉన్న సమయంలో ఒక కుక్క కరవడం వలన చివరికి మరణించాను. దాని తరువాత జన్మే ఈ వ్యాఘ్రజన్మ. కాని కేవలం భగవంతుడి దయవలన నాకు పూర్వజన్మ స్మృతి ఉంది. నేను చేసిన పాపాలు నాకు తెలిసివచ్చాయి. అందుకని నాకు ఈ పులి జన్మ కలిగినా పుణ్యాత్ములను, విద్వాంసులను, శ్రీవైష్ణవులను, పతివ్రతలను మాత్రం చంపక కేవలం దుర్మార్గులను, పతితలను, నీచులను, చోరులను, మాత్రమే చంపి తింటున్నాను. నీవు కులటవు. కాబట్టి నీవు చావవలసిందే "అని ఆమెను చంపి భక్షించి వెళ్లి పోయింది ఆ పులి.

ఆ తరువాత ఆమె నేరుగా నరకలోకానికి వెళ్లింది. అనేక రకాల నరకలోక శిక్షలను కొన్ని కల్పాలకాలం అనుభవించి తిరిగి అదే క్షేత్రంలో ఒక నీచజాతిలో స్త్రీగా జన్మించింది. తన గతం తెలియని ఆమె తన స్వభావరీత్యా తిరిగి కామచారిణిగానే ప్రవర్తించింది. ఆ నీచ ప్రవృత్తిలో ఆమె శరీరం రోగాల పుట్ట అయ్యింది. ఆమెకు కుష్ఠువ్యాధి సంక్రమించింది. ఇన్నాళ్లు ఆమెతో ఉన్నవాళ్లందరు ఆమెను ఊరిలోంచి వెళ్లగొట్టగా ఊరిబయట ఉన్న దేవాలయం మెట్లుమీద తన స్థితికి తానే దుఃఖిస్తూ కూర్చుంది.

ఆ దేవాలయంలో ఒక బ్రాహ్మణుడు నారాయణుని సదా అర్చిస్తూ ఉండేవాడు. అతనికి ప్రతినిత్యం భగవద్గీతలోని 13వ అధ్యాయమైన క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం పారాయణను భగవత్కైంకర్యంగా చెయ్యడం అలవాటు. ఆ రోజు కూడా భగవంతుని అర్చన పూర్తిచేసి 13వ అధ్యాయం పారాయణను నివేదించాడు. ఆ గుడి మెట్లమీద కూర్చున ఆ వనిత ఆ పారాయణను భగవంతుడిపై దృష్టికేంద్రీకరించి శ్రద్ధగా విన్నది. అది ఆమె భాగ్యవిశేము. ఆ పారాయణ పూర్తి అయ్యే సరికి ఆమె జన్మ జన్మాంతరాలలో చేసిన పాపరాశి అంతా దగ్ధమయ్యింది. మరణమాసన్నమయ్యింది. ఆమె ఆ తన శరీరం నుండి బయటకు వచ్చి ఒక దివ్య దేహాన్ని ధరించింది. అంతలో ఒక దివ్యరథం అక్కడికి వచ్చి ఆమెను వైకుంఠానికి తీసుకొని వెళ్లిపోయింది. ఆ దివ్యవిమానంలో కూర్చునికూడా ఆమె ఆ ముకుందుని పాదారవిందాలపైననే దృష్టి నిలిపింది. శ్రవణ మాత్రాన్నే ఇంతటి అద్భుతఫలాన్నిచ్చే ఈ అధ్యాయ మహిమను విన్న ఉమాదేవి హర్షపులకాంకిత అయ్యింది. ఈ అధ్యాయాన్ని గురించి పద్మపురాణం ఈ కథ చెప్పి ఇలా కీర్తిస్తోంది.

**గీతా త్రయోదశాధ్యాయం ఉద్గిరంతీ హ్యానారతమ్।**
**తతస్త్ఛ్రవణాదేవ ముక్తా శ్వపచ విగ్రహాత్ ॥**

భగవద్గీతలో 13వ అధ్యాయమును అనవరతముగా పారాయణచేయుచుండగా శ్రవణము చేసి మానవ దేహము నుండి ముక్తి నొందినది. ఆహా! భగవద్గీత మహిమ ఎంత గొప్పది. కేవల శ్రవణమునకే ఇంతటి ఫలితముంటే భక్తితో పారాయణ చేసే వారికి లభించే ఫలము ఇంకెంతయో!

ఈ 13వ అధ్యాయ మాహాత్మ్యాన్ని శ్రీమహావిష్ణువు రమాదేవికి ఇలా చెప్పాడని మహాశివుడు ఉమాదేవికి తెలియజేశాడు.

# మదర్ టించర్స్

- డా॥ జి. రామారావు

## అవీనా సెతీవా
## (AVENA SATIVA)

అవీనా సెతీవాను మధ్య యుగంనుండి వైద్య విధానంలో నరముల బలహీనత నుండి రోగులనుకాపాడుటకు ఉపయోగించు చున్నారు. ఆత్రుత, ఆందోళనలతో, బాధపడేవారి మానసిక అలసటను పోగొట్టుటకు నిద్రవచ్చునట్లు చేయు ఔషధముగా ఉన్నది. ఆల్కాహాలు, ప్రొగత్రాగుట, మత్తుమందులు వినియోగించు టవలన రోగగ్రస్తులైన వారు కృంగి కృశించిపోయినవారు స్వస్థత పరచుటలో ఈ ఔషధము ఉపయోగములో ఉన్నది. ఆయుర్వేద శాస్త్రంలో నల్లమందు వలన కల్గిన విషపరిణామాలకు విరుగుడుగా, చర్మవ్యాధులకు సైతము ఓట్స్‌నుఉపయోగించుట గలదు. రక్తంలోని (Cholesterol) క్రొవ్వువంటి పదార్థం అధిక రక్తపు పోటును కల్గించును. ధమనులను గట్టిపరచును. వైద్యశాస్త్ర నిపుణులు ఓట్స్‌ను కొలెస్ట్రాల్ తగ్గుటకు సూచించుట గమనింపతగినది.

బీటా లూకాన్స్ నీళ్ళలో కరిగే ఫైబర్స్‌ని కలిగిన పదార్థం ఓట్స్‌లో ఉండుటచే అది కొలెస్ట్రాల్ తగ్గించి గుండె జబ్బులను నిరోధించును. కడుపు ప్రేగుల సహజ ఆరోగ్యస్థితి గతులను కాపాడును.

నరముల బలహీనతకు అనేకానేక కేసులలో అవీనా సెతీవా ఔషధముగా పేరుపొందినది. మగవారిలో లైంగిక సామర్థ్యము తగ్గుట, నరముల శక్తి అంతా క్షీణించుట, మానసిక, శారీరక నిస్త్రాణ, అలసట, మందకొండిగా నుండుట, ఏపని చేయుటకు ఇష్టములేకపోవుట, అస్థిమితము, కోపము, తలనొప్పి, నిద్రలేక పోవుట, సాధారణ బలహీనత, రోగికి తెలియునట్లు గుండె వడిగా కొట్టుకొనుట, నిద్రలేకపోవుట, ఏ విషయము పైనను స్థిరంగా మనస్సు నిలపలేకపోవుట, ఋతుక్రమము సరిగా లేకపోవుట మొదలగు బాధలకు అవీనా సెతీనా మంచి పేరు పొందిన ఔషధము.

(మార్ఫిన్) నల్లమందులోని ఒక ముఖ్యపదార్థము యొక్క అలవాటును మానిపించుటకుఈ ఔషధం తోడ్పడును. ముష్టి మైథునము వలన కలిగిన లైంగిక బలహీనతలు అవీనా సెతీనా పోగొట్టును.

జలుబుతో బాధపడువారికి అవీనా సెతీవాను గోరు వెచ్చని నీటిలో కలిపి ఇచ్చిన తొందరగా ఉపశమనము లభించును. శుక్ల నష్టము, నపుంసకత్వము, అధిక సంభోగము వలనవచ్చు బాధలు, నరముల నిస్త్రాణ, స్వప్నస్కలనములను మాన్పును. విద్యార్థులు, ఉపాధ్యాయులు, ప్లీడర్లు, వ్యాపారస్థులు, మెదడును ఎక్కువ ఉపయోగింతురు. అవీనా సెతీవా వీరికి కలుగు నరముల నిస్త్రాణను మాన్పును. శరీరంలోని రక్తప్రసరణమును సరైన స్థితికి తెచ్చును.

సామ్యూల్ జాన్‌సన్ ఓట్స్ గురించి “స్కాట్‌లాండ్ ప్రజలు ఓట్స్ తింటారు, ఇంగ్లాండులో గుఱ్ఱాలు తింటాయి అందువల్లనే ఇంగ్లండులో మంచి గుఱ్ఱాలు, స్కాట్‌లాండ్‌లో మంచి మనుషులు ఉన్నారు” అని తన డైరక్టరీలో పేర్కొన్నారు.

హోమియో వైద్యములో అవీనా సెతీవా నరములను బలపరచు ఔషధముగ వాడపడుచున్నది. సిలికాన్, మాంగనీసు, జింక్, విటమిన్స్ A, $B_1$, $B_2$ మరియు ఇ కలిగి ఉండుటచే ఎముకలు, చర్మము, జుట్టు, గోళ్ళు ఆరోగ్యముగ ఎదుగుటకు అవీనాసెటైవా తోడ్పడును.

(Herpes) చర్మము పై ద్రవముతో కూడిన పొక్కులు గలిగి, తర్వాత పుండు పడును, ఆ తర్వాత పొక్కుగట్టును, ఆపొక్కుక్రింద క్రొత్త పొక్కులు ఏర్పడి చర్మము వాచును. నరముల నొప్పి, నరముల పొడుగున చురక కత్తితో పొడుచుచుండుట, మంట, నరముల వాపు నిత్యముండును. దీర్ఘకాల వైద్యములో అవీనా సెతీనా ఔషధముగానున్నది.

King అను నతడు ఈ మూలికను గురించి, (Spasmodic) కండరములు అప్రయత్నముగా దగ్గరకు ముడుచుకొనిపోవుట, నరముల బలహీనతతో (Exhaustion) అలియుట (Spermatorrhaea) శుక్ర నష్టము, (Erythsism) గోధుమరంగు మచ్చలు, భరించలేని తలనొప్పి మొదలగువానికి అవీనా సెవాతీ ఉత్తమమైన ఔషధమని పేర్కొనెను. యువకులలో, క్రొత్తగా పెళ్ళి అయిన వారిలో కలుగు లైంగిక శక్తిహీనతకు ఇది మేలుచేయును. స్త్రీలలో గర్భాశయ, అండాశయ బాధలతో సతమతమై క్రుంగిపోవుచున్న సమయమున ఈ ఔషధము అవసరము. మెదడునుపయోగించి పనిచేయువారికి వచ్చు మాడుపోటు, మంట, (Sick headache) పొర్లు పొర్లుగా కలిగెడి తలనొప్పి అజీర్ణ లక్షణములలో ఈ ఔషధము స్వస్థత కలుగ చేయును.

Dr. French రోగులు తాముసాధారణముగా చేసెడి పనులను చేయజాలని అసమర్ధతను కల్గించు మానసిక బాధతో

కృంగి పోయినపుడు, ప్రేమించిన వ్యక్తులు శాశ్వతంగా దూరమైనప్పుడు పడువేదనలుకు అవీనా సెతీవా అద్భుతముగా పనిచేసినట్లు చెప్పెను. కృంగదీయు జ్వరముతో బాధపడిన వారిని శీఘ్రముగా సామాన్య స్థితికి తెచ్చుటకు తోడ్పడును.

10 నుండి 20 చుక్కలు గోరువెచ్చని నీటితో త్రాగిన జలుబు తగ్గును. మిగిలినవారు 10 చుక్కలు పావు కప్పు నీళ్ళలో ఉదయము సాయంత్రం స్వీకరించుట ఉపయుక్తము. 20 కంటే ఎక్కువచుక్కలు స్వీకరించిన వారికి తలవెనుక భాగమున నొప్పి వచ్చును. దీనిని తీసుకొనుట చేయవలెను.

## జింగో బైలోబా

### (GINKGO BILOBA)

జింగో శరీర భాగములో ముఖ్యముగ మెదడులో రక్తము ప్రవహించుటకు మంచి టానిక్. రక్త ప్రవాహంలోని ఎగుడు దిగుడులను రూపుమాపును. యురోపియన్ వైద్యులు (Raynaud's disease) వ్రేళ్ళు, కాళ్ళు చేతుల ధమనుల్లో కేశనాళికల్లో రక్తప్రవాహమునకు ఆటంకం కలిగి ధాతువులు మృతినొంది పక్షవాతమునకు దారితీయు స్థితిలో జింగోను ఉపయోగింతురు. (Vasicose veins) శిరలుబ్బినపుడు గుండె నొప్పి వచ్చినపుడు రక్తస్రావము కలిగినపుడు, శరీర భాగములను దెబ్బతీసే కారకములు విజృంభించినపుడు, ఋతు సమయానికి ముందు ఏ వ్యాధిలోనైనా ఉండునట్టి సమస్త లక్షణములలో స్తనముల నొప్పిని పోగొట్టుటకు ఎన్నుకోదగిన ఔషధము.

వృద్ధులకు ఇది మంచి టానిక్. ఆక్సిజన్ ఉపయోగమును ఇది వృద్ధి చేయును. జ్ఞాపకశక్తిని పెంచును. మనస్సును బాగుగా కేంద్రీకరించగలుగుదురు. మానసిక స్థితిని క్రమబద్ధము చేయును (Dencentia) మానసిక శక్తులు శిధిలమై ఒక రకపు ఉన్మాదము కలిగి రోగి అయోమయ స్థితిలో ఉండి పరిసరములను గుర్తించలేడు. అలక్ష్యముగానుండును. జ్ఞాపకశక్తిపోవును (Tinnitus) చెవులలో హోరు ఉండును. మానసికంగా కృంగిపోవుట జరుగును. అట్టి స్థితిని వయోవృద్ధులకు ఇది ఎంతో మేలుచేయును. తలనొప్పి, సైనసైటిస్, తలత్రిప్పులకు శీఘ్రంగా ఉపశమనము కలుగుజేయును. 5 లేక 10 చుక్కలు పావుకప్పు నీటిలో కలిపి మూడు పూటలా స్వీకరింపదగును. జీర్ణా వయములలో తేడాలు, తలనొప్పి, విరోచనములు కలిగినచో జింగోను ఆపివేయాలి. గర్భవతులు వాడరాదు.

## సబాల్ సెర్రులేటా

### (SABAL SERRULETA)

Saw Plametto చెట్టు ఆకులు, పండ్లు, విత్తనములు ఔషధ గుణములు కలిగి యున్నవి. Hale, Boriecke, Read, Solomons మొదలగువారు దీనిని గూర్చి శాస్త్రీయమైన పరిశోధనలు చేసిరి. సుఖ నిద్ర కలిగించుట,కళ్ళెతో కూడిన దగ్గుతగ్గించుట, శరీర నిర్మాణములో పుష్టి చేకూర్చుటను గమనించిరి. (Cardiac Asthma) గుండె సరిగా పనిచేయక పోవుటచే ఆయాసం వచ్చుట, (Phthisis) ఊపిరితిత్తులలో క్షయ, (Chronic Bronchitis) దీర్ఘకాలిక శ్వాసనాళములవాపులలో శీఘ్రనివారణ, పరిపూర్ణ ఆరోగ్యమును చేకూర్చుటను తెలుసుకొనిరి.

చిన్నవిగానూ, సమానముగా లేని యువతుల స్తనముల పెరుగుటకు ఇది ప్రముఖ ఔషధము. శీఘ్రకోపము, తీవ్ర విచారంతో కృంగిపోవుట, ప్రోస్టేటు గ్రంధిపెద్దది అవుట, మూత్రాశయము మరియు అండాశయములలో బాధలు, జననేంద్రియములు మూత్రావయములలో బాధలు, లైంగిక శక్తి క్షీణించుట మొదలగు వ్యాధులలో సబాల్ పేరెన్నికగన్న ఔషధము. మెదడును అధికంగా ఉపయోగించు వారికి వచ్చు తలనొప్పికి, నిద్రించిననేదో జరుగునను శంకతో నున్న వారికి ఈ ఔషధము మేలు చేయును. ఇది బలమును కలిగించు టానిక్. శరీర పోషణలో తోడ్పడును, ఉత్తేజము కల్గించును, బక్కగా ఉన్నవారికి శరీర ధారుఢ్యము పెంచుమందు.

మూత్ర కోశపు మెడ వద్ద విపరీతమైన తీపు, చల్లనిస్పర్శవలె జననేంద్రియములలోకి, పొత్తికడుపులోకి, తొడలలోకివ్యాపించును. తరచుగా మూత్రము అగుచు నిద్ర భగ్నమగును. గర్భకోశము సున్నితమై వ్యాకోచము చెందును. గర్భకోశపు చెంతనున్న సెల్యులార్ ధాతువులు వాచును. అట్టి స్థితిలో సబాల్ సెర్రులేటా ముఖ్య ఔషధము.

దీర్ఘకాలిక మలబద్ధకము ఉండును. తలదిమ్ము, తల తిరుగుడు, నరముల బలహీనతలతో శీఘ్ర కోపము వచ్చినప్పుడు రాత్రివేళ తరచుగా మూత్ర విసర్జన అనుమానము, వృద్ధులలో ప్రొస్టేట్ గ్రంధి వాచుట వలన ఎడతెగకుండా మూత్ర విసర్జన మొదలగు పరిస్థితులలో సబాల్ సుర్రులేటా ఎంతోమేలు చేయును. 5 నుండి 10 చుక్కలు పావుకప్పు నీళ్ళల్లో మూడుపూటలా ఈయదగును. వచ్చేనెల **అశ్వగంధ (ASWAGANDHA)** గురించి తెలుసుకుందాం!

*(ఇంకా ఉంది)*



రాయల ఊహల పల్లకీ....

# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

ఈ రాజ్యవైభవాలు ఎన్నాళ్ళుంటాయి? ఈ భోగాలు ఎన్నాళ్ళుంటాయి? ఈ సంబరాలేమిటి? శరీరం నీటిబుడగ లాంటిది. ఎప్పుడు పగిలిపోతుందో తెలియదు. ఇంతటి అశాశ్వతమైన శరీరాన్ని నమ్ముకుని శాశ్వతానందాన్నిచ్చే పరం కోసం లెక్కచేసేను కాదు. అసలు అదోటుంది అందుకోసం ప్రయత్నించాలి అన్న ఊహకూడా లేకుండా ఎల్లా బతికేను ఇన్నాళ్ళూ?

యుగాలకు యుగాలు బతికినా మనువు మాంధాత లాంటి వాళ్ళు సైతం యమునిపాల పడకుండా మిగిలేరా? పడవలో కూచున్నవాళ్ళని కాలగమనం తెలియకుండా ఆ పడవ ఆవలి ఒడ్డుకు చేర్చినట్లు కాలం తాను అట్లాగే ఉన్నట్టుండి క్షణాలమీద యుగాలు గడిచిపోయి ఆయువు పూర్తయి మనుషులు చావు నోటపడిపోతారు.

సగరుడు, నలుడు, పురూరవుడు, హరిశ్చంద్రుడు, పురుకుత్సుడు, కార్తవీర్యుడు అనే షట్చక్రవర్తుల్ని కాలం వదిలి పెట్టిందా? గయుడు, పృథువు, భగీరథుడు, సుహోత్రుడు, శిబి, భరతుడు, దిలీపుడు, భార్గవుడు, మాంధాత, శశిబిందుడు, అంబరీషుడు, యయాతి, రంతిదేవుడు, శ్రీరాముడు, మరుత్తుడు అనే షోడశమహారాజులు కాలగర్భంలో కలిసి పోయేరు.

ఎవ్వరైనా కాలాన్ని మనగలిగేరా? మెరుపులా క్షణికమైన రాజ్యానందంలో పడి ఇంద్రియ సుఖాలనుభవిస్తూ ఇన్నాళ్ళూ గడిపేసేనే. ఇహ వీటి జోలికిపోను. పరలోకానందం కోసం ప్రయత్నిస్తారు. అంతేకాదు, ధర్మార్థకామాలను మాత్రం సేవించి యజ్ఞాదులు చేసి పుణ్యం సంపాదించడం నాకిష్టంలేదు. పుణ్యం సంపాదిస్తాం. స్వర్గాదులు వస్తాయి. ఆ పుణ్యం తరిగిపోతుంది. మళ్ళీ నేలమీద పుట్టాలి. మళ్ళీ పుణ్యం స్వర్గం అవి తరిగి పోవడం మళ్ళీ పుట్టడం ఈ జననమరణ చక్రభ్రమణంలో కూడా పడదలుచు కోలేదు. మోక్షంకోసమే ప్రయత్నిస్తాను. మోక్షమివ్వ గల దేవత ఎవరో తెలుసుకొని ఆ దేవతను ఉపాసించి మోక్షాన్ని పొందుతాను.

అని అప్పటికప్పుడే నిశ్చయానికొచ్చాడు మత్స్యధ్వజుడు. తాంబూలపు పెట్టెలోంచి ముద్రవేసి ఉంచిన ఓ మూటను తలారిచేత తనకళ్ళు తెరిపించిన ఆ పరదేశి విప్రుడికి ఇప్పించాడు. ముందుకుపోక అంతఃపురానికి మరలిపోయేడు.

తెల్లారి సభలో కొలువుతీరేడు. ఆస్థానంలో ఉన్న పండితుల్ని పిలిపించేడు. వారితో మీమీ సిద్ధాంతాల ప్రకారం మోక్షాన్నిచ్చెదెవరో నిర్ణయించి మాకు తెలియచెప్పండి అన్నాడు. అట్లా తేల్చేటప్పుడు చర్చ రావచ్చు. ప్రశ్నలు కలగవచ్చు వాటన్నింటికీ చక్కగా సమాధానాలు చెప్పి తనను, సభను మెప్పించి ఒప్పించిన వారికి బహుమతిగా ఇవ్వడం కోసం బీరపువ్వుల్లాంటి బంగారు నాణేలమూట ఒకటి సభామధ్యంలో వేలగట్టించేడు. గెలిచినవారు ఆ బహుమానాన్ని స్వీకరించ గలరన్నాడు.

సభలో వాదం ప్రారంభమైంది. వివిధ సిద్ధాంతాలవారు, సంప్రదాయాలవారు చేరేరు. ఒకడు శివుడు పరదైవం, ఆయనే మోక్షప్రదాత అన్నాడు. కాదు, పార్వతి పరదేవత ఆమే మోక్షాన్నివ్వగలది అని ఒకాయన. కాదు, సూర్యుడని మరో ఆయన. గణపతి మోక్షదాత అని ఒకడంటే చంద్రుడు మోక్షదాతని ఇంకో ఆయన. ఇల్లా రకరకాల వాదనలు మొదలయ్యేయి. ఎవరి మట్టుకు వారు తాము చెప్పిన దేవతే మోక్షప్రదాత అనడమే తప్ప కారణాలతో ఉపపత్తులతో ప్రమాణాలతో సభను రాజును ఒప్పించ లేకపోతున్నారు, మెప్పించలేకపోతున్నారు.

మధురలో ఇలా వాదసభ జరుగుతోంది. ఇది తెగేది కాదు. అంత తొందరగా ముగిసేదీ కాదూ. ఒక్కసారి విల్లిపుత్తూరు పదండి – అక్కడ ఏం జరుగుతోందో చూద్దాం... (ఇంకా ఉంది.)

శ్రీరామచంద్రాచార్య



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



ఈ ఏడాది చాతుర్మాస్యానికి ముందు జరిగిన తమిళనాడు యాత్ర ప్రశాంతంగా సాగింది. జూన్ 21వ తేదీ శివకాశీ సమీపంలోఉన్న తిరుత్తంగాల్ గ్రామంలో శ్రీమాన్ రవిచంద్రన్ గారి గృహంలో వేంచేసి ఉన్నారు. శ్రీమాన్ రవిచంద్రన్‌గారి పరిశ్రమలను సందర్శించి మంగళాశాసనములు చేసారు. ఆనాటి రాత్రే రాజపాలాయం అనే ఆ పరిసర నగరానికి విచ్చేసారు.

శ్రీస్వామివారు గతంలో ఆస్ట్రేలియా పర్యటన చేసే సమయంలో శ్రీరామసుబ్రమణ్యారాజా అనే పిల్లవాడు సమాశ్రయణమయ్యాడు. ఆ పిల్లవాని ఊరు రాజపాలాయం. చిన్నవాడైనా మంచి ఆలోచన కలవాడు. ఆతడు మంచి నిష్ఠగ ఉంటూ తన ఊరిలో శిథిలమైపోయిన 200సం॥ చరిత్ర గల ప్రాచీనాలయాన్ని జీర్ణోద్ధరణ చేస్తే ఊరు, వారి వంశము కూడా బాగుపడతాయని తెలుసుకున్నాడు. ఊరిలో పెద్దలంతా ఉన్నా, వారినందరినీ ఒక త్రాటిమీదకు తేవాలి, ప్రేరణ కలగాలి, ప్రాచీనవైభవాన్ని వారు పునః ప్రకాశింపచేసుకోడానికి పూనుకోవాలి. క్రొత్త ఆలయాలు కట్టడంలో ఉండే శ్రద్ధ, పాత వాటిని పరిరక్షించడంలో కనబడటం లేదు. అసలు పాతవాటిని పట్టించుకోరు. నిజానికవి బాగుచేస్తే ఆనాటి చరిత్రతో సంబంధం కలగడమే కాకుండా, చేయించిన వారి గౌరవమూ పెరుగుతుంది.

ఇలాంటి శ్రీవారి మాటలను ఎన్నింటినో శ్రీవారిద్వారా వినటమే కాకుండా వేయికాళ్ళ మండపం కోసం చేసిన ఉద్యమాలలో ఉత్సాహంగా పాల్గొన్న వ్యక్తికూడా కావడం చేత, ఆ ప్రచార ప్రభావం తన ఊరులోని ఆలయంపై మరలింది. జ్యోతిష్కులను అడిగితే ఆచార్యులు పాదం పెడితే నీకల నెరవేరుతుందని చెప్పారట. అంతే, ఆ పిల్లవాడు వెంటనే స్వామివారికి విషయం తెలిపి తమ ఊరును ఒక్కసారి సందర్శించి ఆ ఆలయ నిర్మాణార్థం ఊరిపెద్దలను సుముఖులుగ చెసి మంగళాశాసనం చేయమని, గత 4సం॥లుగ నిర్బంధిస్తున్నాడు. చిన్నవాడైనా ఆతని శ్రద్ధను చూసి శ్రీవారు తప్పక అక్కడికి వెళ్ళాలని నిర్ణయించారు. ఈసారి తమిళనాడు యాత్రకి ప్రధాన లక్ష్యం ఆఊరు వెళ్ళిరావడమే. ఆస్ట్రేలియానుండి ఆ పిల్లవానికి సెలువు దొరకక రాలేకపోయినా ఆతని ప్రయత్నంతో ఊరివారంతా కలిసారు. ఆతని తల్లితండ్రులు కార్యక్రమాన్ని జరిపారు.

ఆ ఊరిలో ఉన్న రాజులంతా 500సం॥ క్రితం తెలుగునాట నుండి అటు వెళ్ళినవాళ్ళే. అందుకే ఇప్పటికీ వాళ్ళ ఇళ్ళల్లో అంతా తెలుగే మాటలాడుకుంటారు. అయితే ఆ తెలుగుకి, మనం మాటలాడే తెలుగుకీ పొంతన ఉండదు. తమిళం కాస్త, మళయాళం కాస్త, కలిసి పోయి మనకి అంతగ అర్థంకాదు.

21వ తేదీన శ్రీమాన్ రవిచంద్రన్ గారు శ్రీవిల్లిపుత్తూరు ఆండాళ్ సన్నిధికి శ్రీస్వామివారిని తీసుకువెళ్ళి ఆండాళమ్మ వారి దర్శనం చేయించారు. వీరు ఆ ఆలయానికి చైర్మన్‌గ ఉన్నారు. శ్రీవారి ద్వారా సమాశ్రయణం కావడం వీరికి లభించిన అదృష్టమిది, ఆయన వీరి కుటుంబ సభ్యులంతా మురిసిపోతూ ఉంటారు. వైఖానసాగమాన్ని పాటించే ఈ ఆలయం శ్రీవైష్ణవ సంప్రదాయానికి ప్రధానకేంద్రంగా ఉంటుంది. ఇక్కడి వైఖానసాగమార్చకులు భగవద్రామానుజ సంప్రదాయానికి కట్టుబడి ఉండటమే కాదు, ఆళ్వార్ల విషయంలో ఎంతో ప్రీతిని కలిగి ఉంటారు.

పెరియాళ్వార్లకు ప్రత్యేకసన్నిధి ఉంది ఇక్కడ. పెరుమాళ్ళకి ఆండాళ్ తల్లిని అర్పించిన మామగారుకద వీరు. అందుకే వీరి సన్నిధిలో పదిదినాల బ్రహ్మోత్సవాలు ప్రత్యేకించి జరుగుతాయి. తెన్నాచార్య సంప్రదాయం ప్రకారం జరిగే సాంప్రదాయిక ఆచార పద్ధతులన్నీ ఇక్కడి అర్చకులు వైఖానసాగమం ప్రకారం, ఇప్పుడు కొత్తగ కాదు వేలసంవత్సరాలుగ, బహుశ్రద్ధతో పాటిస్తారు. వీరే కాదు, తమిళనాడులోని వైఖానసార్చక స్వాములందరూ ఈ సంప్రదాయ సంబంధమైన విషయంలో, అంత శ్రద్ధగాను ఉంటారు. మన స్వామివారి విషయంలో బహుప్రీతితోనూ ఉంటారు. వీరందరూ సపాదంగనే తిరుమణ్‌కాప్పు ధరిస్తారు. ఇదే వారి ఆగమవిధానమని స్పష్టం చేయడమే కాదు, ఈ మధ్య ఈ బొట్టు విషయంలో తగాదా వచ్చి అది సుప్రీంకోర్టుదాక పోయింది. ఆలయార్చకులే దృఢంగ నిలబడి, వాదించి తమ బొట్టుకి తగినట్టుగానే ఇక్కడి ఉత్సవాదులన్ని జరుగుతాయని తీర్మానం చేయించుకున్నారు. ఇప్పటికీ అర్చకులంతా తమతమ గృహాలలో జరిగే ఉత్సవాలలోగూడ దివ్యప్రబంధానుసంధానం చేసుకుంటూ మణవాళమహామునులను స్మరించుకుంటూ శాత్తుముఱై చేసుకుంటున్నారు. ఇది తమిళనాడులోని ప్రాచీనులందరి గృహాలలోను, ఆలయాలలోను ఇప్పటికీ మనం చూడవచ్చు. ఈ ప్రాచీనాచార పరంపర ఇతర రాష్ట్రాలలోని ఆధునికులందరూ గుర్తించాలి. వారికిది ఆదర్శం కావాలి.

ఎంతో కాలంగా ఎందరో పెద్దలు ఈ శ్రీవిల్లిపుత్తూరుకి చైర్మన్‌లుగ వచ్చినా శ్రీవైష్ణవ సంప్రదాయం ప్రకారం సమాశ్రితులైనవారు రాలేదు. రాజకీయంగా పలుకుబడితో ఎవరో వస్తుంటారు కదా సామాన్యంగా! శ్రీ రవిచంద్రన్ పంచసంస్కార పరుడైన మొదటి చైర్మన్ అని అక్కడి వారంతా ఆయన్ని ఎంతో అభిమానిస్తారు. శ్రీస్వామివారి సూచనతో వీరుకూడా అక్కడి అర్చకులకి, ఇతరులకి ఎన్నో సౌకర్యాలు కల్పించారు. అలానే ఆండాళ్ సన్నిధి విమానాన్ని బంగారు కవచంతో అలంకరించే బృహత్తర కార్యక్రమాన్ని ప్రారంభించి, ఇంతవరకూ, రాగితొడుగును పూర్తి చేయించారు. దానిపై బంగారు పూతకై కొంత బంగారాన్ని సేకరించారు కూడా. ఇంకా సుమారు 75కేజీలు అవసరముంటుందని అక్కడ వారు తెలిపారు. మన ప్రాంతంనుండి

కూడా ఎందరో భక్తులు ఈ ఆండాళ్ స్వర్ణవిమాన కైంకర్యంలో పాల్గొన్నారు. అయినా ఇంకా ఎందరికో ఆ అవకాశం ఉంది. అది త్వరలో పూర్తి కావాలని శ్రీవారు ఆ విమానాన్ని సేవించి ప్రార్థించారు. దానిని చేయించే బాధ్యత తీసుకొన్న శ్రీమాన్ మాధవన్ స్వామికి, శ్రీమాన్ రవిచంద్రన్ గారికి, అర్చక స్వాములకి మంగళాశాసనాలు చేసారు.

రాత్రికి తిరిగి రాజపాలాయం చేరి, సామూహిక లక్ష్మీనారాయణ పూజలు జరిపించారు. ఆ ఊరి పెద్దలంతా శ్రీవారిని గ్రామమధ్యలో ఉన్న చావడికి తీసుకువెళ్ళి చూపారు. 500సం॥ల క్రితం శ్రీకృష్ణదేవరాయల కాలంలో ఈ ప్రాంతానికి ఎన్ని గోత్రాల కుటుంబాలు వచ్చాయో తెలిపే బోర్డులు, అప్పటి పెద్దల చిత్రపటాలు అందులో భద్రపరిచారు. శ్రీ వైష్ణవ సంప్రదాయకళ కట్టుపడేట్టుండే వారి శ్రద్ధకు శ్రీవారు మంగళాశాసనాలు చేసి, సమీపంలోని కళ్యాణమండపంలో లక్ష్మీనారాయణ పూజలు జరిపారు. మరునాటి ఉదయం శ్రీరామసుబ్రమణ్యరాజా యొక్క తల్లిదండ్రులు, అతను పునర్నిర్మించదలచిన ఆలయ ప్రాంతాన్ని సందర్శింపచేసారు. శిలామయంగ, యథాతథంగ సాగే ఈ పునరుద్ధరణ, జీర్ణోద్ధరణ చేసేవారందరికీ ఆదర్శంకావాలని శ్రీవారు మంగళాశాసనాలు చేసారు. అక్కడి నుండి బయలుదేరి మధురై మీదుగా రాత్రికి హైదరాబాద్, జీవాకి వేంచేసారు.

మన వికాసతరంగిణి కోశాధికారిగ, జీవా గ్రంథపరిశోధనా విభాగానికి సేవలందించే శ్రీమాన్ సి.రామకృష్ణమాచార్యులు గారు తమ షష్టిపూర్తి సందర్భముగా శ్రీవారిని తమ గృహానికి ఆహ్వానించారు 25వ తేదీన. వారి గృహాన్ని, బంధు పరివారాన్ని ముఖ్యముగ ఆచార్యుల గారి తల్లిగారికి మంగళాశాసనములు చేసారు శ్రీస్వామివారు. ఇంత వయస్సులోను మంచి సరదాగా మాటలాడుతూంటారు ఆమె. అక్కడి నుండి మన నేత్రవిద్యాలయ సమితి అధ్యక్షురాలైన శ్రీమతి అనీల్ గాయత్రీగారి సోదరులు వేముగంటి రఘురామారావు, శ్రీజాత గార్లు తమ గృహానికి ఆహ్వానించగ శ్రీవారు వారి గృహాన్ని సందర్శించి, వారి పెరుమాళ్ళకు మంగళాశాసనాలు చేసారు.

28వ తేదీన భువనగిరి, నల్గొండజిల్లాలో నూతనంగా నిర్మించిన Senius.e Techno స్కూలును ప్రారంభించి, దాని నిర్వాహకులు శ్రీమాన్ సూర్యనారాయణ, రమణారావు గారికి మంగళాశాసనాలు చేసారు. అక్కడి నుండి రాత్రికి సిద్ధిపేట సమీపంలో ఉండే పుల్లూరుకొండ, శ్రీలక్ష్మీనరసింహస్వామి ఆలయానికి చేరారు. ఆ గ్రామాన్నంతా సందర్శించి రాత్రి అక్కడి వారికి సందేశాన్నిచ్చారు.

29వ తేదీన ఆలయంలో స్వామికి అష్టోత్తరశత కలశాభిషేకం జరిగింది. ఆ ఆలయంలో భగవద్రామానుజులకు ప్రత్యేకసన్నిధి ఏర్పడిఉంది. సుమారు 800సం॥రాల చరిత్రగల ఈ గుట్టమీద 2 జలాశయాలున్నాయి. ఒకటి పెరుమాళ్ళ కోసం, రెండవది రామానుజుల కోసమని, వారిపేరనే ప్రసిద్ధి చెందిందట. ఆ పుష్కరిణిలో నీరు తీసుకువెళ్ళి అనావృష్టి సమయంలో పొలాలలో జల్లుకుంటారట రైతులు. వానలు కురిసి మంచి పంటలు పండుతున్నాయని గ్రామస్థులు చెప్పుకున్నారు.

ఈ కార్యక్రమాన్నంతటినీ అక్కడి ఆలయార్చక స్వాములు, కలకుంట్ల రంగాచార్య, కృష్ణమాచార్య, వేంకటాచార్య, పొడిచేటి శ్రీనివాసాచార్య మొ॥వారు సిద్ధిపేటలో ఉండే అర్చకస్వాములు సౌరిరాజ పెరుమాళ్ బృందంతో మరియు కె. హనుమంతరావు, వెంగళ్‌రావుగారు మొ॥ వారంతా ఈ కార్యక్రమము కలిసి వైభవంగా జరుపుకుని, పదిహేను బస్తాల ప్రసాదం చేయించి భక్తులకు అందజేసారు.

శ్రీ స్వామివారు అక్కడినుండి సిద్ధిపేటలో శ్రీమాన్ టి.పాండురంగం గారిని వారి కుమారుడు టి.రవికుమార్ గారిని పరామర్శించారు. మన వికాసతరంగిణి నిర్వాహకులుగ ఉండే వీరికి ఈమధ్యనే పత్నీవియోగ మేర్పడింది. చక్కగ సేవాకార్యక్రమాలు జరపమని మంగళాశాసనాలు చేసారు వారికి. మరో ఇరువురు భక్తులు నరసింగారావు, గట్టు జగదీశ్వర్, సురేందర్ రెడ్డి మొ॥ వారి గృహపెరుమాళ్ళని సందర్శించి, రాత్రికి వరంగల్ జిల్లా మానుకోటకు శ్రీవారు చేరారు.

మానుకోటలోని శ్రీవేణుగోపాల స్వామి ఆలయం ప్రాచీనమైనది. దీని నిర్వాహకులుగా ఉండే పరమభాగవతోత్తమురాలు శ్రీమతి ఎన్.రుక్మిణమ్మ గారు మన పెద్దస్వామివారి శ్రీచరణ సంబంధులు. వారి శ్రద్ధవల్లనే మన పెద్దస్వామివారు అక్కడ శ్రీరామక్రతు స్థూపము, స్వాధ్యాయ జ్ఞానయజ్ఞస్థూపమూ కూడా నిర్మింపజేసారు.

ఈమె స్వయంగ శ్రీరామాయణం, శ్రీవిష్ణుపురాణం, శ్రీమద్భాగవతం మూలగ్రంథాన్నంతా పుస్తకాలుగ వ్రాసుకుని శ్రీవారి ఆశీస్సులందుకున్నారు. వీరు క్రిందటి సంవత్సరం పరమపదించిన సందర్భంగా వారి సోదరి అయిన మన జెట్ శ్రీలతమ్మగారు, రుక్మిణమ్మగారి కుమారులు శ్రీమాన్ విష్ణువర్ధన్‌రెడ్డిగారు ప్రార్థించగ 30వ తేదీన శ్రీవారు రుక్మిణమ్మగారి పరమపద ఉత్సవాన్ని చక్కగా జరిపించారు. 30వతేదీ రాత్రికి అక్కడి నుండి సీతానగరం మీదుగ నడిగడ్డపాలెం, మన పెద్దస్వామివారి సన్నిధికి చేరారు. అక్కడ అనుష్ఠానానన్తరం శ్రీవారి సన్నిధిలో చాతుర్మాస్య వ్రతాన్ని జీవా ప్రాగణంలో జరపడానికి ఆచార్యాజ్ఞను స్వీకరించారు.

జూలై 1వతేదీన విజయవాడలో "లివ్‌లైఫ్" పేరుతో ప్రారంభించ దలచిన హాస్పిటల్‌ను శ్రీ స్వామివారు మంగళాశాసనాలు చేసారు. శ్రీమాన్ డా॥ దుక్కపల్లి నందకిషోర్ గతంలో హైదరాబాద్‌లో, శరీరాన్ని తగ్గించుకోడానికని ఏర్పరచిన ఈ హాస్పిటల్‌ని ప్రారంభించారు. ఇప్పుడు విజయవాడలో దాని శాఖను ప్రారంభించి, దీనినిగూడ స్వామివారే ప్రారంభించాలని వారు కోరడంతో శ్రీవారు దాన్నంగీకరించారు.

మంగళగిరి (NRI) హాస్పిటల్ నిర్వాహకులు శ్రీమాన్ ముక్కామల అప్పారావుగారు తమ మిత్రులైన శ్రీమాన్ గోపాలకృష్ణగారి ఆధ్యక్ష్యంలో సుమారు 19మంది ప్రత్యేక యోగ్యతలు, శ్రద్ధకలిగిన మిత్రబృందంతో విజయవాడలో **ఆయుష్** అనే పేరుతో ఓ వైద్యాలయాన్ని ప్రారంభించారు. శ్రీవారిని ఆ వైద్యాలయాన్ని సందర్శించమని ఆహ్వానించగ శ్రీవారు వారికీ మంగళాశాసనాలు చేసి సాయంకాలానికి హైదరాబాదు చేరారు.

నేరుగా" భక్తిచానల్ " శ్రీమాన్ నరేంద్ర చౌదరిగారు ఏర్పాటు చేసిన ధార్మిక సమ్మేళనంలో పాల్గొని తమ సందేశాన్నందించారు. గత భీష్మైకాదశి నాడు తిరుపతిలో శ్రీవారు **"ధర్మానికి" మనస్ఫూర్తిగా నిలబడగలనని ఎవరైనా ప్రతిజ్ఞచేస్తే అలాంటి టి.వి వారితో మాత్రమే మాటలాడతామని** చేసిన బహిరంగ ప్రవచనానికి స్పందనగా వీరు ముందుకు వచ్చారు. అందుకే

ఏడు సంవత్సరాల మౌనము తరువాత మొదటి సారిగ టి.వి వారు ఏర్పరచిన బహిరంగ కార్యక్రమములో పాల్గొన్నారు.

శ్రీమాన్ చౌదరిగారు ధర్మప్రచారానికే తాను కట్టుబడి ఉంటానని, తమ **టి.వి.**లో ఇంతవరకు ఇతర మతాల ప్రచారాన్ని కూడా అంగీకరించ లేదని, అదే పద్ధతి కొనసాగిస్తానని, అందుకే తప్పక రావలసినదని శ్రీమాన్ రామేశ్వరరావుగారి పురుషకారంతో ప్రార్థించారు. అందుకు తగినట్లు శ్రీవారు కూడా స్పందించి ఆ కార్యక్రమములో పాల్గొన్నారు. ఆ తరువాత ప్రతిరోజూ తమ భక్తి టి.వి లో చాతుర్మాస్య సందర్భంగా ఉదయం అరగంట సేపు ప్రవచనాన్ని ప్రత్యక్షప్రసారం చేసే అవకాశాన్నివ్వమని కోరగా, దానికి కూడా శ్రీవారంగీకరించడం విశేషము.

2వతేదీన బదరీ అన్నదాన సంఘాధ్యక్షులు శ్రీమాన్ డా॥ రామనాథం గారి అబ్బాయి, డా॥ శ్రీకాంత్ తన మిత్రులతో చిన్ని శిశువులకోసం ప్రత్యేకంగా వైద్యాన్నందించే “అంకుర్” వైద్యాలయాన్ని (నియోనెటల్‌కేర్) శ్రీవారు ప్రారంభించి మంగళాశాసనం చేసారు. అదేరాత్రి, శ్రీమాన్ కె.వి రాఘవాచార్య స్వామి, ప్రతి ఏడాది చేస్తున్నట్లే ఈ ఏడాది కూడా వేదాంతదేశికులు రచించిన గ్రంథాలలో “వరదరాజ పంచాశత్” గ్రంథాన్ని తెలుగు అనువాదంతో కూర్చగ, వారి కుమారులు డా॥ రమణాచారి(IAS) గారు దాని ఆవిష్కార మహోత్సవాన్నేర్పరచగా, ఆ కార్యక్రమంలో పాల్గొని వారికి మంగళాశాసనాలు చేసారు.

3వతేదీ గురుపూర్ణిమ. శంషాబాద్ శ్రీరామనగరం, జీవా ప్రాంగణంలో శ్రీస్వామివారు తమ చాతుర్మాస్య వ్రతాన్నారంభించారు. ప్రతిరోజు ఉదయం ఆరాధనానంతరం గం॥8-30కు ఉపనిషత్ ప్రవచనమును అనుగ్రహిస్తున్నారు. వీరితో పాటు శ్రీమాన్ డా॥ఎస్. రంగరామానుజాచార్య స్వామి, శ్రీ విష్ణుపురాణములోని తత్త్వార్థ రహస్యాలను ప్రవచనంగా అందిస్తున్నారు. నేపాలు దేశానికి చెందిన, గోపాలోపాయన పురస్కార గ్రహీత శ్రీ ఉ.వే శ్రీమాన్ కృష్ణమాచార్య స్వామి తెలుగులోనే గురుపరంపరా ప్రభావాన్ని ప్రవచిస్తున్నారు.

8-7-2012 నాడు సికింద్రాబాద్‌లో శ్రీలక్ష్మీనారాయణ పెరుమాళ్ళ ఆలయ కుంభాభిషేకం శ్రీస్వామివారు శ్రీహస్తాలమీదుగా జరిగింది. ఈ కార్యక్రమానికి శ్రీస్వామివారు చాతుర్మాస్యంలో ఉన్నా వస్తామని వాగ్దానం చేసి పాల్గొన్నారు. గతంలో మన శ్రీపెద్దజీయర్‌స్వామివారు హైదరాబాద్ ఎప్పుడు వేంచేసినా ఆ ఆలయంలోనే వేంచేసి ఉండేవారు. అంతేకాదు శ్రీచిన్నజీయర్‌స్వామివారి ఉపనయన కార్యక్రమంగూడ పెద్దస్వామివారి సన్నిధిలో ఈ ఆలయంలోనే 1975వ సం॥ ఫిబ్రవరిలో జరిగింది. అప్పట్లో ఆ ఆలయం బాగా శిథిలమై ఉండేది. 1933సం॥లో వానమామలై కలియన్ జీయర్ స్వామివారు యాత్రగా వచ్చినప్పుడు ఈ ఆలయాన్ని దివ్యదేశం చేసారు. దీని నిర్మాతలు శ్రీమాన్ కీ॥శే॥ గుమిడిల్లి లక్ష్మీనారాయణచే ఎంతో శ్రద్ధతో కార్యక్రమాలన్నీ జరిపించారు. ఈ ఆలయం వారి కుటుంబ నిర్వహణలోనే ఇప్పటికీ ఉంది. ప్రస్తుతం ప్రతిష్ఠాపకులయొక్క మనుమడు శ్రీమాన్ గుమిడిల్లి శ్రీనివాస్ తమ సోదరులతో, సొంత ధనంతో ఈ ఆలయాన్నంతటినీ పునర్నిర్మాణం చేసారు. ప్రాచీనకట్టడాలు ఎలా ఉన్నాయో అలానే వాటిని పునరుద్ధరించారు. అయితే దీనిని శ్రీశ్రీశ్రీ వానమామలై స్వామివారు వేంచేసి సంప్రోక్షణ చేయవలసి ఉన్నా, దేహస్థితి సహకరించక వారు రాలేక చిన్నజీయర్ స్వామివారితో చేయించమని అనుజ్ఞయిచ్చి ఉన్నారు. ఈ కారణాలచేత శ్రీచిన్నజీయర్‌స్వామివారు ఈ సంప్రోక్షణని జరిపించారు.

ఈ దీక్షాకాలంలో మహబూబ్‌నగర్ వికాసతరంగిణి సభ్యులందరూ శ్రీవారి మంగళాశాసనములతో జీవా ఆశ్రమములో అఖండ హరినామ సంకీర్తన జరపాలని నిర్ణయించి, గోష్ఠులుగా ఈ కార్యక్రమాన్ని జరిపిస్తున్నారు.

శ్రావణమాసంలో శుక్రవారపు పూజలు, ఆండాళ్, నరనారాయణ జయంతులు, శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి తిరునక్షత్ర మహోత్సవము, శ్రీకృష్ణాష్టమి, విఘ్ననివారణ చతుర్థి మొదలైన ఉత్సవాలన్నీ ఈ దీక్షాకాలంలో జీవా, శ్రీరామనగరంలో జరుగుతాయి. అంతే కాకుండా **ఆగస్టు 5, సెప్టెంబర్ 22 తేదీలలో పంచసంస్కారాలు** (సమాశ్రయణములు) జరుగుతాయి.

శ్రీవారు సెప్టెంబర్ 30వ తేదీ దాక దీక్షలో ఉండి విశేష కార్యక్రమాలన్నీ జరిపిస్తూ వేంచేసి ఉంటారు.

## శ్రీశ్రీశ్రీ స్వామివారి పర్యటన వివరములు

- **సెప్టెంబర్ 30తేది** రాత్రికి **ఉత్తరప్రదేశ్‌లోని బృందావనం** చేరతారు.
- **అక్టోబర్ 1వ తేదీ**నాడు అక్కడి భక్తులు ఏర్పాటు చేసిన కార్యక్రమాలలో పాల్గొంటారు. ఆరోజు రాత్రికి రాజస్థాన్‌లోని **అల్వర్** చేరతారు.
- **2వ తేదీ** ఉదయము ఆరాధన కాగానే ఫరీదాబాద్‌లోని శ్రీలక్ష్మీ నారాయణ దేవాలయాన్ని సందర్శించి ఢిల్లీ చేరతారు. శ్రీమాన్ ఉమాశ్రీనివాస్ దంపతులకు మంగళాశాసనం చేసి **ఋషీకేశ్** చేరతారు.
- **4వ తేదీ** అక్కడ జరిగే హోమకార్యక్రమాల మహాపూర్ణాహుతిలో పాల్గొంటారు.
- **5వ తేదీ** ఉదయము **బదరీనాథ్** బయలుదేరతారు.

  **7వ తేదీ**న అక్కడి మన ఆశ్రమంలో **సమాశ్రయణ కార్యక్రమం** ఉంటుంది.
- **8వ తేదీ**న అక్కడి నుండి **ఋషీకేశ్** బయలుదేరతారు. ఉత్సాహముకల భక్తులందరూ బృందావనయాత్ర మొదలైన ఈ పై కార్యక్రములలో యథావకాశం పాల్గొన వచ్చును.

---

శ్రీశ్రీశ్రీ త్రిదణ్డి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు 25-06-2012 నాడు అమెరికా బయలుదేరి వెళ్ళారు.

అక్కడ మన జెట్ U.S.A వారు ఏర్పాటు చేసిన వివిధరకముల కార్యక్రమాల్లో అన్వయిస్తూ అక్కడ హూస్టన్‌లో జరిగిన నాటా సభల్లోను, ఆట్లాంటాలో జరిగిన ఆటా సభల్లోను వారి ఆహ్వానంపై పాల్గొని, మన సంస్కృతి, సంప్రదాయాల గురించి ప్రవచించారు. అక్టోబర్ మాసాంతం వరకు కూడా వీరి పర్యటన సాగుతుంది.

వివరములకు: www.jetusa.org

---

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన జూలై నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. కుంతినే ఇలా కూడా పిలుస్తారు. | |
| 2. జానపద నృత్య విశేషమొకటి గోకులాన్ని ఆకర్షించింది. | |
| 3. శూలం చివరి భాగాన్నే ఇలా అంటారు. | |
| 4. యముడు విదురునిగా మారడానికి కారణం. | |
| 5. ఒకొక్క మహనీయుని అవతారం దీనికి ఆధారమౌతుంది. | |
| 6. వానరుల యువరాజు | |
| 7. అదేశం- అకాలంలో వచ్చాడు కాబట్టి విభీషణుని నమ్మకూడదన్నాయన | |
| 8. నేను కూడా రాజ్యంలాంటివాడినే అన్నాడితడు. | |
| 9. ఏది అవిజ్ఞేయమో అదే | |
| 10. ఈ చరాచర సర్వ ప్రపంచానికే ఈ పేరు | |
| 11. 32 అక్షరాలున్నది | |
| 12. శ్రీమన్నారాయణుడు అందరి మొరలూ వినే స్థానానికి పేరు | |
| 13. అవతారాలెన్ని విధాలుగా విడదీయబడినవి? | |
| 14. సీతమ్మ తన కథనెవరికి చెప్పింది? | |
| 15. కాకి మరోపేరు | |
| 16. ఈనాడు సజీవములైన వేదశాఖలెన్ని? | |
| 17. ఏదం అంటే.. | |
| 18. బ్రహ్మ పరమాత్మని పూజించిన దివ్యక్షేత్రం | |
| 19. శ్రీమన్నారాయణుని కౌమోదకి ఇలా వచ్చింది. | |
| 20. కార్యసిద్ధిని కలిగించేది | |
| 21. ధైర్యం ఇప్పుడే అవసరం ఎప్పుడు? | |
| 22. గీత చివరి ఆరధ్యాయాల పేరు | |
| 23. మెదడులో రక్త ప్రవాహాన్ని పెంచే టానిక్ | |
| 24. మత్స్యధ్వజుడు వాదసభనేఊరిలో ఏర్పాటు చేశాడు. | |
| 25. పాండ్యరాజు ఎవరిని గూర్చి తెలియాలన్నాడు? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు.**

శ్రీ ముక్కు కృష్ణమీనన్–రాజమహేంద్రి; శ్రీ మైథిలి–నేరేడుమెట్ట, హైదరాబాద్.

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తోంది. బహుమతులను కూడ పంపిస్తుంది.**

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

**భక్తినివేదన** సీతానగరం–522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





65 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన


శ్రీ నందన నామ సంవత్సరం

అధిక, నిజ భాద్రపదమాసములు

సంపుటి 65 సెప్టెంబరు

సంచిక 6 2012


## పంచాంగ వివరాలు

సెప్టెంబరు :

8. శ్రీ వైష్ణవ శ్రీకృష్ణ జన్మాష్టమి, కణ్ణన్ తిరునక్షత్రం
12. సర్వేషామేకాదశి
13. ఉత్తర కార్తె
14. మాస శివరాత్రి
15. పిండపితృయజ్ఞము
16. అమావాస్య
17. నిజభాద్రపదమాసం
17. కన్యా సంక్రమణం ఉ.8-25, అవమ తిథి, తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవారంభం.
18. బలరామ జయంతి, అట్ల తదియ, షోడశోమావ్రతం.
19. విఘ్న నివారణ చతుర్థి, విష్వక్సేనపూజ.
20. ఋషి పంచమి
21. సూర్యషష్ఠి
26. సర్వేషామేకాదశి, వామన జయంతి, వేదాంతదేశికర్ తిరు॥ తిరువేంగడత్తాన్ తిరు॥, తిరుమల శ్రీవారి చక్రస్నానం.
27. హస్తకార్తె
28. అనంత పద్మనాభవ్రతం
30. మహాలయ పక్షారంభము

అక్టోబరు :

3. భరణీ మహాలయము, చవితి తిథి
4. శూన్యతిథి
10. చిత్తకార్తె
11. సర్వేషామేకాదశి
12. యతులకు మహాలయము
13. మాసశివరాత్రి

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ

రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-




మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*గత సంచిక తరువాయి...* **(నవమాధ్యాయం - భీష్మకృత ధర్మనిరూపణం - కృష్ణస్తుతి - భీష్మముక్తి)**

సూతుడు చెబుతున్నాడు– ధర్మరాజు ప్రజాద్రోహం జరుగుతుందేమోనని భయపడి స్వర్గసాధకాలైన ధర్మాలను తెలిసికొనగోరి, ఏ ప్రదేశంలో భీష్ముడు పార్థుని బాణఘాతాలకు ఒరిగిపోయాడో ఆ కురుక్షేత్ర భూమికి వేగంగా వచ్చిచేరాడు. ఆతనితో పాటు సోదరులంతా రథాలెక్కి అనుసరించారు. వ్యాసధౌమ్యాదులు కూడా వచ్చారు. శ్రీకృష్ణుడు కూడా పార్థునితో కూడి, ఆ ప్రదేశానికి చేరాడు.

ఆకాశం నుండి జారిపడ్డ దేవతలా ఉన్న భీష్ముని చూచారు వారంతా. నమస్కరించారు. బ్రహ్మర్షులు, దేవర్షులు, రాజర్షులు అంతా అక్కడకు చేరారు. పర్వతుడు, నారదుడు, ధౌమ్యుడు, వ్యాసుడు, బృహదశ్వుడు, భారద్వాజుడు, పరశురాముడు, వసిష్ఠుడు, ఇంద్రప్రమదుడు, త్రితుడు, గృత్సమదుడు, సుదర్శనుడు, ఇంకా ఎందరో ఋషులు భీష్ముని దర్శించడానికి విచ్చేశారు.

వీరందరినీ వీక్షించి, దేశకాలజ్ఞుడు కనుక, వసూత్తముడైన భీష్ముడు మానసికంగా ప్రణమిల్లాడు. కృష్ణుని ప్రభావాన్ని పూర్తిగా ఎరిగినవాడు కనుక, తన హృదయంలో కొలువై ఉన్న ఆ స్వామిని, మాయా విగ్రహునిగా యాదవోద్భవుడని ఎరిగి సేవించాడు.

దగ్గరగా ప్రహ్వాభావంతో కూర్చుండిన పాండవులను, ప్రీత్యశ్రువులు కమ్మిన కన్నులతో వీక్షింపజాలక ఇలా మాటాడాడు భీష్ముడు.

అహో! ఎంత కష్టం! ఎంత అన్యాయం! విప్రులను, ధర్మాన్ని, అచ్యుతుని ఆశ్రయించిన మీరు ఇంత క్లేశభూయిష్ఠ స్థితిలో జీవించడానికి ఎంతమాత్రం తగరు.

అతిరథుడైన పాండురాజు బ్రతికి ఉన్నప్పుడే, పిల్లల పట్ల అమితప్రేమగల కుంతి, మీ గురించి ఎన్నో క్లేశాలను అనుభవించింది. ఇదంతా కాలకృతమని నేను భావిస్తాను. వాయువుకు అధీనపడి మేఘపటలం ఉన్నట్లుగా, కాలానికి వశపడి సర్వమూ ఉంటున్నది. ధర్మాత్ముడైన యుధిష్ఠిరుడు, గదాధారియైన వృకోదరుడు, అస్త్రధారియైన అర్జునుడు, గాండివచాపాన్ని కలిగియుండి, కృష్ణసహాయుడై ఉండికూడా విపత్తును అనుభవించారు. ఆ కాలము యొక్క నైజాన్ని మానవమాత్రుడెవ్వడూ ఎరుగజాలడు. ఏ కాలాన్ని గురించి జిజ్ఞాస చేస్తూ కవులు(క్రాంతదర్శనులైన ఋషులు సహితం) మోహాన్ని పొందుతున్నారో ఆ కాలం దురవగాహం. కనుక, ఇదంతా "**దైవతంత్ర**"మని గుర్తించి, దానికి అనుకూలంగా ఉంటూ అనాథులైన ఈ ప్రజలను నీవే నాథుడవై పాలించు. ఈ గోచరించే కృష్ణరూపంలో సాక్షాత్తు ఆద్యుడైన నారాయణుడే యాదవులలో గూఢరూపాన్ని ధరించి సంచరిస్తున్నాడు.

**ఏష వై భగవాన్ సాక్షాత్ ఆద్యో నారాయణః పుమాన్ ।**
**మోహయన్ మాయయా లోకం గూఢశ్చరతి వృష్ణిషు ॥**

ఈతడు తన మాయచే లోకాన్ని మోహపరుస్తున్నాడు. ఈతని గూఢ చేష్టితాన్ని కేవలం **"శివుడు"** దేవర్షి నారదుడు, సాక్షాత్తు కపిలుడు ఎరుగుదురు.

**అస్యానుభావం భగవాన్ వేద గుహ్యతమం శివః ।**
**దేవర్షి ర్నారదః సాక్షాత్ భగవాన్ కపిలో నృప ॥**

ఎవ్వనిని మేనత్త కొడుకుగా భావించి, ప్రియునిగానూ, మిత్రునిగాను, సుహృత్తుగాను తలచి, దూతగా సచివునిగా చివరకు సారథిగా రథచోదకుని కూడా చేసుకున్నావో, ఆ

మహానుభావుడు, సర్వప్రాణుల పట్ల సమదృష్టి కలవాడు, అసమానుడు, అహంకారదూరుడు, ఎట్టి దోషాలూ లేని ఈ మహాత్మునికి **మతి వైషమ్యం** (విషమబుద్ధి) అనేది ఎంత మాత్రం లేదు. అయినా, ఆయన పట్ల అనన్యభక్తి (ఏకాన్తభక్తి) కలవారి పట్ల ఈ మహానుభావునికి గల అనుకంప (దయ) ఎలాంటిదో గమనించు. మరణశయ్యపై చావుకు దగ్గరై ఉన్న, నాకు కట్టెదుట సాక్షాత్కరించి అనుగ్రహించిన మహానుభావుడు కదా ఈ స్వామి!

**భక్త్యావేశ్యమనో యస్మిన్, వాచా యన్నామకీర్తయన్ ।**

**త్యజన్ కలేవరం యోగీ ముచ్యతే కామకర్మభిః ॥**

ఎవ్వడు భక్తితో తన మనస్సు ఏ స్వామియందు దృఢంగా లగించి, మాటతో కీర్తిస్తూ, శరీరాన్ని విడుస్తాడో వాడు కామాల నుండి, కర్మలనుండి విముక్తుడౌతాడు.

సూతుడంటున్నాడు – ధర్మరాజు ఈ మాటలను విన్నాడు. శరపంజరంలో శయనించి ఉన్నా ఆ మహానుభావుని పలు రకాలైన ధర్మాలను అడిగి, ఋషులంతా వింటూ ఉండగా, తన జిజ్ఞాసను తీర్చుకున్నాడు.

పురుషులకు స్వభావంగా శాస్త్రవిహితాలైనవి, ఆయా వర్ణాలకు, ఆశ్రమాలకు సముచితాలైనవి, వైరాగ్యమూలాలు, లోకప్రీతిమూలాలు అయిన నివృత్తి ప్రవృత్తిధర్మాలను రెంటిని అడిగాడు. దానధర్మాలు, రాజధర్మాలు, మోక్షధర్మాలు, వేరు వేరుగా, పలువిధాలైన స్త్రీధర్మాలు, భగవద్ధర్మాలు, సంగ్రహం గాను, విస్తారంగాను వినగోరి ప్రశ్నించాడు.

ధర్మార్థకామమోక్షాలు, వాటిని సాధించే ఉపాయాలు, అనేకానేకోపాఖ్యాన–ఇతిహాసపురస్సరంగా ఆ మహానుభావుడైన భీష్ముడు ధర్మజునికి వివరించాడు. (ఈ విశేషాలన్ని మహాభారతంలో శాన్త్యానుశాసనిక పర్వాల్లో విస్తారంగా వర్ణింపబడి ఉన్నాయి.)

ఇలా పలు ధర్మాలను విశదపరుస్తున్న భీష్మునికి కాలం సమీపించింది. స్వచ్ఛందమృత్యువు, యోగి, ఐన ఆ మహానుభావునికి అపేక్షితమైన ఉత్తరాయణం వచ్చింది.

**"తదోపసంహృత్యగిరస్సహస్రణీః**

**విముక్త సంగం మన ఆదిపూరుషే ।**

**కృష్ణే లసత్ పీతపటే, చతుర్భుజే**

**పురః స్థితే, మీలితదృగ్వ్యధారయత్" ॥**

ఆ సమయంలో పలువిధాలుగా ప్రవర్తిస్తున్న వాక్కులను ఉపసంహరించి, బాహ్యవిషయ సంపర్కాన్ని విడచిన మనస్సును, పచ్చటి పట్టుబట్టకట్టి, నాల్గు భుజాలతో ఎదుట సాక్షాత్కరించిన శ్రీకృష్ణస్వామి యందు నిగిడ్చి, నిమీలితనేత్రుడై, మనస్సును ఆ శుభాశ్రయంపై దృఢంగా లగించాడు భీష్ముడు.

**విశుద్ధయా ధారణయా హతాశుభః**

**తదీక్షయైవాశు గతాయుధవ్యథః ।**

**నివృత్త సర్వేంద్రియవృత్తి విభ్రమః**

**తుష్టావ జన్యం విసృజన్ జనార్దనమ్ ॥**

శుభాశ్రయమైన పరమాత్మను మనస్సులో ధరించడంవల్ల ఆయన ధారణ విశుద్ధమైంది. దానివల్ల పాపాలన్నీ నశించిపోయినాయి. స్వామిని చూడడం చేత, స్వామిచే చూడబడడం చేత (**'తదీక్షయా'**ఏవ) వెంటనే ఆయుధమూలంగా కలిగిన పీడ అంతా ప్రశమించింది. ఇంద్రియాలకు చెందిన బాహ్యవ్యాపారాలన్నీ ప్రశమించాయి. ఇలా నిశ్చలమైన మనస్సుతో స్వామిని సందర్శిస్తూ దేహాన్ని విస్మరించి జనార్దనుణ్ణే స్మరించి – ఇలా స్తుతించాడు. *(సశేషం)*

# కలివైరిసూరి వైభవము



గత సంచిక తరువాయి...

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొళ్ళి 1-8-5 (బృహత్సూక్తి)**

**వణ్కైయాన వుణర్కు నాయకన్ వేళ్వియిల్ శెన్నుమాణియాయ్**
**మణ్ కైయాలిరున్దాన్ మరామరమేళుమ్ ఎయ్‌ద వలత్తినాన్**
**ఎణ్కైయానిమయత్తుళ్ళాన్ ఇరుంశోలై మేవియవెంబిరాన్**
**తిణ్ కైమాతుయర్ తీర్తవన్ తిరువేంగడమడై నెంజమే! ॥**

ప్రతిపదార్థము: **వణ్కైయాన్**=ఉదారమగు శ్రీహస్తము కలవాడై; **అవుణర్కు**=రాక్షసులకు; **నాయకన్**=నాయకుడైన మహాబలిచక్రవర్తియొక్క; **వేళ్వియిల్**=యజ్ఞమందు; **మాణియాయ్**=బ్రహ్మచారియయి; **శెన్ను**=వెళ్ళి; **మణ్**=భూమిని; **కైయాల్**=శ్రీహస్తముతో; **ఇరున్దాన్**=యాచించినవాడును; **మరామరమేళుమ్**=సాలవృక్షముల నేడింటిని; **ఎయ్‌త**=(బాణములతో) పడద్రోసిన; **వలత్తినాన్**=బలాఢ్యుడును; **ఎణ్కైయాన్**=ఎనిమిది భుజములు కలవాడును; **ఇమయత్తుళ్ళాన్**=హిమాచలమందు వేంచేసియున్నవాడు; **ఇరుంశోలై**=తిరుమాలిరుంశోలై క్షేత్రమందు; **మేవియ**=నిత్యవాసము చేయుచున్న; **ఎంబిరాన్**=మాకు ఉపకారకుడును; **తిణ్**=దృఢమైన; **కై**=తొండము గల; **మా**=శ్రీగజేంద్రునియొక్క; **తుయర్**=దుఃఖమును; **తీర్తవన్**= పోగొట్టినవాడును అగు సర్వేశ్వరునియొక్క; **తిరువేంగడమ్**= తిరుమలను; **నెంజే**=మనసా! **అడై**=ఆశ్రయింపుమా!

**తాత్పర్యము:** ఓ మనసా! సర్వేశ్వరుడు వేంచేసియున్న శ్రీ వేంకటగిరిని ఆశ్రయింపుము. అతడు పరమ ఉదారుడగు బలిచక్రవర్తియొక్క యాగశాలకు శ్రీవామనమూర్తియై బ్రహ్మచారిగ వేంచేసి మూడడుగులనేలను అర్థించినవాడు. శ్రీరామావతారమున సుగ్రీవునకు నమ్మకమును కలిగించుటకై ఒకేబాణముతో ఏడు సాలవృక్షములను భంజించినవాడు. ఎనిమిది భుజములుకలవాడు. హిమగిరియందున్న వనాద్రి (తిరుమాలిరుంశోలై)యందును వేంచేసియుండువాడు. దృఢమగు తొండముగల గజరాజునకు మొసలి వలన కలిగిన దుఃఖమును తీర్చినవాడు.

**విశేషార్థము:** శ్రీకృష్ణభగవానుడు తనను ఆశ్రయించినవారి కొరకు గావించిన దౌత్యసారధ్యములను తిరుమంగై ఆళ్వార్లు దిగువ పాశురములందు వర్ణించియున్నారు. అంతమాత్రమేకాక తన భక్తులకొరకు తాను శ్రీవామనావతారమున అవలంబించిన యాచకవృత్తిని, శ్రీరామావతారమున గావించిన సప్తతాళ భంజనమును, శ్రీగజేంద్రుని దుఃఖమును బాపిన విధమును శ్రీ కలివైరిసూరి ఈ పాశురమున అనుసంధించుచున్నారు.

**వణ్కైయాన్ ఇత్యాది :** బలిచక్రవర్తి రాక్షసస్వభావము కలవాడే! అయినను అతనిలో ఔదార్యము అనే గొప్ప గుణము కలదు. అందువలన అతనిని సంహరించుటకు బాణములను ప్రయోగించుట సబబుకాదు. బలి తాను ఇష్టపడి ఎన్నుకొనిన మార్గముననే (దానము చేయుట అను మార్గముననే) ఆతనిని జయింపదలచి శ్రీమహావిష్ణువు వామనావతారమునెత్తి యాచక వృత్తిని అవలంబించి ఆతని ఐశ్వర్యమంతటిని అపహరించెను.

**మాణియాయ్ కైయాల్ ఇరున్దాన్:** యాచన చేయుటలో ఆరితేరిన భగవంతుడు బ్రహ్మచారి వేషమునుగొని వామనుడై బలిచక్రవర్తి చేయుచున్న యాగశాలకు వెళ్ళి ఆతనిని యాచించి భూమిని తీసికొని ఇంద్రునకు ఇచ్చెను.

**మరామరమ్ :** తనను ఆశ్రయించిన వారికి విశ్వాసము కలిగించి, వారిని సంరక్షించు స్వభావము కలవాడు.

**వలత్తినాన్:** బలము కలవాడు.

**ఎణ్ కైయాన్:** తనను ఆశ్రయించిన వారి విరోధి

వర్గములను పోగొట్టుటకు తగు దివ్యాయుధములను ధరించుటకై అనేకములుగు శ్రీహస్తములు కలవాడు. లేదా కాంచీపుర క్షేత్రమునందు వేంచేసియున్న అష్టభుజ స్వామిని తిరుమంగై ఆళ్వార్లు ఈ పాశురమున స్మరించినారనియును భావించవచ్చును.

**ఇమయత్తుళ్ళాన్:** హిమగిరిలోని తిరుప్పిరుది క్షేత్రమున వేంచేసియున్నవాడు.

**ఇరుంశోలై:** తిరుమాలిరుంశోలై దివ్యదేశమందు వేంచేసియున్నవాడు.

**తిణ్‌కైమాతుయర్ తీర్తవన్:** మొసలి వాతనుండి తనను తాను రక్షించుకొనలేని దశలో గజరాజును సంరక్షించినవాడు.

**తిణ్‌కై:** అన్నింటిని బాధపరచునటువంటి ఏనుగు తాను బాధపడుచుండగా దానిని సంరక్షించినవాడు.

**తిరువేంగడమ్:** శ్రీగజేంద్రుని ఆర్తిని తీర్చి అంతమాత్రమే కాక ఆ పిమ్మట వారి కొరతలను తీర్చి వారికి ముందుగా ఉపకరించుటకై స్వామి వేంచేసియున్న స్థలము తిరుమల దివ్యదేశము. ఓ మనసా! తిరుమల క్షేత్రమును ఆశ్రయింపుము.

# ముఖచిత్ర పరిచయము

**దివ్యసాకేతలక్ష్మి శ్రీరామనగర్‌లో కొలువుతీరిన చిత్రమిది.**




**లోకము లన్నింటిని పరిపాలించే శ్రీరంగరాజ మహిషి శ్రావణమాసంలో వరలక్ష్మీవ్రత సందర్భంగా దివ్య సాకేతంలో వేదికపై కొలువు తీరింది. నయనానందంగా దర్శన మిచ్చింది.**

**వందలాది సువాసినులు అమ్మని సేవించుకొని, ఆ తల్లిని పూజించి పసుపు కుంకుమలతో అర్చించి తీర్థ ప్రసాదాలు స్వీకరించి తరించారు. ఆ అందం చూడడానికి రెండు కళ్ళూ చాలవు అనిపించింది. అమ్మను వేంచేపు చేసిన దివ్యమండపం శుభకరములైన కదళీవృక్షాలతో, మామిడి తోరణాలతో, అరటి గెలలతో అలంకరింపబడి భక్తుల మనస్సులను దోచుకుంది.**

**ఆ జగన్మాత ఎదపై ధరించిన మణి ఆ తల్లి మదిలోని దయాకిరణాల్ని భక్తులపై వెదజల్లింది. అలంకరణార్థం మండప స్తంభాలకు చుట్టిన ఆకుపచ్చని లతలు ఆ తల్లి శ్రీమన్నారాయణుని ఆశ్రయించుకొని ఉన్న తత్త్వాన్ని చక్కగా చాటి చెప్పాయి.**

**అతి విశాలములైన తల్లినేత్రాలు కరుణని ప్రసరిస్తూ అభయ మునందించాయి. అభయహస్తం వెనుబలాన్నిచ్చింది. ఆ తల్లి సన్నిధిలో ధగద్ధగాయమానంగా వెలిగే దీపకాంతులు భక్తకోటి జీవితాలను వెలుగులతో నింపాలని ప్రార్థిద్దాం!**

# నేర్చుకుందామా! - 12

**శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-విజయవాడ**

అనంత నామధేయములున్న స్వామి శ్రీమన్నారాయణుడు. ఆయన దయ ఉండడం చేత జీవికి శరీరం ఏర్పడుతోంది. అందునా మానవశరీరాన్ని కలిగి ఉండడం మరింత అదృష్టం. అయితే భగవంతుడిచ్చిన ఈ దేహసంపద ఆయన సేవకి, సమాజసేవకి, పరోపకారానికి ఉపయోగపడితే అంతకంటే ఆనందమేముంటుంది?

'వలయమున ఒప్పదు ఈవిచే వెలయుపాణి' అన్నారు పెద్దలు. చేతులనిండా బంగారు గాజులు తొడిగితే చాలదు. చేతులారా దానం చేయడమే చేతులకి నిజమైన అందం.

**శ్లో॥ ధనినో ప్యదాన విభవా గణ్యన్తే ధురి మహాదరిద్రాణామ్।**
**హన్తి న యతః పిపాసాం అతః సముద్రోపి మరురేవ॥**

లోకంలో ఎంతో డబ్బు ఉన్నవారున్నారు. కాని వారికి దానం చెయ్యడం అంటే ఏమిటో తెలియకపోతే వారు కూడా దరిద్రులలోనే లెక్కపెట్టబడతారు. ఎందుకంటే లేక ఇవ్వలేని వారు కొందరు. ఉండీకూడా ఇచ్చేగుణం లేనివారు వీరు. ఉదాహరణకి సముద్రం ఉంది. అందులో ఎన్ని నీళ్ళుంటాయో కదా! కాని మన దాహం తీరుస్తుందా? తీర్చగలదా? లేదు. ఆ సముద్రం వలన గొంతు ఎండిపోయే వారి దాహం తీరదు కదా!

దానగుణం చాల చాల గొప్పది. ఇతరులకి ఇవ్వడంలో ఎంతో ఆనందం ఉంది. శరీర భాగాల్ని కోసి ఇచ్చిన దాతల కథలు తెలుసుకదా! అంత కాకపోయినా మనకున్నదానిలో కొంత... కొంతైనా ఇతరులకి సహాయంగా అందిద్దాం!

వారిలో ఆనందాన్ని చూద్దాం!!



# అహో! భారతమ్

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

*(గత సంచిక తరువాయి)*

భీష్ముడు ధృతరాష్ట్ర, పాండురాజులకి విదురునికీ విద్యాభ్యాసం చేయించాడు. ఉపనయనాది సంస్కారాలు చేయించాడు. భీష్ముడు సమర్థుడు, ధర్మబద్ధుడు అవడం వలన దేశంలో శాంతి సౌభాగ్యాలు ఓలలాడాయి. సకాలంలో ధృతరాష్ట్రుని పట్టాభిషిక్తుని చేసి తన పరాక్రమంతో విదురుని బుద్ధిబలంతో కౌరవ రాజ్యాన్ని రక్షించాడు.

ధృతరాష్ట్రునికి పెళ్ళి చేయాలని అనుకున్నాడు. గాంధార రాజు సుబలుడు. అతని కూతురు గాంధారి. ఆవిడ శివదేవుని వరం పొందింది. అదేమిటంటే ఆవిడికి వందమంది కుమారులు, ఒక కుమార్తె పుడతారు అని శివుడామెకు వరం ఇచ్చాడు.

ఈ విషయం భీష్మునికి తెలిసింది. అలాంటి అమ్మాయే మనకి కావాలి విదురా.. ఈ వంశం చాలా బాగా విస్తరించాలి. సుబలునికి మన కోరికను చెపుదాం అంటూ పెద్దల్ని పంపించాడు. వెంటనే ఆనందంగా అంగీకరించాడు రాజు. గాంధారిని అడగనే లేదు. ఈవిషయం తెలిసిన వారి బంధువులు చెవులు కొరుకున్నారు. అయ్యో... కళ్ళులేనివానికిచ్చి పిల్లపెళ్ళి చేస్తాడా! అని. గాంధారి మాత్రం విషయం తెలుసుకొంది. నాకు ధృతరాష్ట్ర మహారాజే భర్త. నేనింక ఎవ్వరినీ పెళ్ళి చేసుకోను. ఆ రాజు చూడలేని లోకాన్ని నేనూ చూడను అంటూ తాను కూడా కళ్ళకి గుడ్డ కట్టేసుకుంది. ఆవిడతోపాటు ఆవిడ చెల్లెళ్ళు పదిమందిని కూడా ధృతరాష్ట్రుడు పెళ్ళి చేసుకున్నాడు.

గాంధారి సోదరుడు శకుని సంపదలెన్నింటినో బావగారికి కానుకలుగా తెచ్చాడు. వంశాభివృద్ధినే దృష్టిలో పెట్టుకున్న భీష్ముడు మరొక వందమంది అమ్మాయిలనుకూడా తీసుకొని వచ్చి ధృతరాష్ట్రునితో పెళ్ళి జరిపించాడు. మరి పాండురాజుకు కూడా వివాహం చెయ్యాలి గదా... ఎవరినిచ్చి చెయ్యాలా అని ఆలోచిస్తున్నాడు.

## కుంతి చరిత్ర

కుంతిభోజుడనే రాజుకి పిల్లలు లేరు. శూరుడు అనే యాదవరాజు కూతురు కుంతి. శూరుడికి కుంతిభోజుడు మేనత్త కొడుకే. అతనికి తన పెద్దకూతురు కుంతిని పెంచుకోమని ఇచ్చాడు. ఆ అమ్మాయి సుగుణవతి. వచ్చిపోయే పెద్దలందరికీ సపర్యలు చేస్తూ ఆదరిస్తూ ఉండేది. ఒకరోజు దుర్వాసుడు అనే ముని వారింటికి అతిథిగా వచ్చాడు. కుంతి ఆయనని ఆదరించింది. ఆయన ఎంతో మెచ్చుకొని 'అమ్మా! నీకో మంత్రం చెప్తాను. ఆ మంత్రంతో నువ్వే దేవతలని ఆరాధిస్తావో ఆ దేవతలు నీకు కొడుకులనిస్తారు' అంటూ ఒక దివ్యమంత్రాన్ని ఉపదేశించి వెళ్ళాడు. కుంతికి ఆ మంత్రశక్తి ఎంతటిదో తెలుసుకోవాలనిపించింది. ఒకరోజు గంగానదికి వెళ్ళి స్నానం చేసి ఆ మంత్రాన్ని జపించి సూర్యునికి నమస్కరించి 'ఆదిత్యా! నీలాంటి కొడుకుని ప్రసాదించవయ్యా' అంది. మరుక్షణంలో సూర్యుడు ఆవిడ దగ్గర నిలిచాడు. ఆ దివ్యతేజోరూపాన్ని చూచి భయంతో వణికిపోయింది కుంతి. భయమెందుకు? పిలిచావని వచ్చానన్నాడు సూర్యుడు. మహానుభావా! ఒక మహర్షి చెప్పిన మంత్రాన్ని పరీక్షించాలని అలా ప్రార్థించాను. నన్ను క్షమించు అంది. మా స్త్రీలు ఇలా తప్పులు చేస్తూంటారు. అజ్ఞానమే దీనికి కారణం. మన్నిస్తావు కదూ! అంది.

భాస్కరుడు 'నీకు మహర్షి ప్రసాదించిన వరం ప్రకారం నా దర్శనం వృథా కాదు. కొడుకుని గ్రహించు' అన్నాడు.

'అయ్యో! నాకింకా పెళ్ళి కాలేదే! నలుగురిలో నగుబాటు కాదా స్వామీ!' అందావిడ. ఆయన దయతో సద్యోగర్భంలో కుమారుడు పుడతాడులే! నీ కన్యాత్వం చెడదు అంటూ వరమిచ్చి వెళ్ళాడు. పుత్రుడు కలిగాడు కుంతికి. చేతుల్లో బాబుని చూచి భయపడింది కుంతి. సహజకుండలాలతో పుట్టాడు వాడు. విధి విలాసం! ఆ దుర్వాసుడు నాకు మంత్రం ఎందుకు చెప్పాడు? నేను బుద్ధిలేక పరీక్షించాలని ఎందుకు

అనుకున్నానూ? ఆ సూర్యుడలా ప్రత్యక్షమై నిన్ను నాకెందుకు అనుగ్రహించాడు? ఈ విషయం తెలిస్తే నన్నందరూ దూషించరా? ఏం చెయ్యనీ బాలుణ్ణి. అంటూ నిలబడింది. ఇంతలో నదీప్రవాహంలో ఒక పెట్టె కొట్టుకొని వచ్చింది. ఇంక క్షణం ఆలోచించకుండా ఆ పసివాణ్ణి ఆ పెట్టెలో పెట్టేసి వదిలేసింది. ఆ పెట్టెలో రత్నాలు బంగారం ఉన్నాయి. ఆ పెట్టె ఒక సూతవంశంలో పుట్టిన వానికి దొరికింది. అతడు దానిని తీసుకొని వెళ్ళి తన భార్య రాధకిచ్చాడు. చూస్తే.. అబ్బాయి. ప్రేమపొంగి ఆ చంటివానికి పాలనిచ్చింది ఆ తల్లి. వసు అంటే బంగారం అని అర్థం. బంగారంతో రత్నాలతో దొరికాడు కాబట్టి "వసుషేణుడు" అనే పేరు పెట్టి పెంచారు.

కుంతి యథాపూర్వం కుంతిభోజుని ఇంట్లో పెరుగుతోంది. ఆ అమ్మాయిని పాండురాజుకిచ్చి పెళ్ళి చేయాలని అనుకొన్నాడు భీష్ముడు. అలాగే చేశాడు.

భీష్ముని ఆజ్ఞతో మద్రదేశరాజపుత్రి అయన మాద్రిని కూడా వివాహం చేసుకున్నాడు పాండురాజు. మహావీరుడైన పాండురాజు దిగ్విజయ యాత్రకి బయలుదేరాడు. రాజులందరూ ఆయనను దర్శించి ఎన్నో కానుకలిచ్చారు. తలలు వంచారు. ఆ సంపదలన్నింటిని పెద్దల పాదాలవద్ద సమర్పించాడు పాండురాజు. ధృతరాష్ట్రుడు ఆనందంగా ఆ ధనంతో వంద అశ్వమేధ యాగాలు చేశాడు. ధృతరాష్ట్రునికి అండగా నిలిచిన తమ్ముని అందరూ ఆశీర్వదించారు.

కుంతి, మాద్రులతో కలసి పాండురాజు ఒకసారి వేటకి బయలుదేరాడు. వ్యసనమేమో... ఒకటే వేట.. కాని ఒక్క జంతువూ దొరకదే! కోపం-పట్టుదల పెరిగిపోయాయి. హఠాత్తుగా ఒక మగ-ఆడ జింకల జంట కనిపించింది. వెంటనే ఐదు బాణాలొక్కసారి వేసి గట్టిగా కొట్టాడు. అంతే... మగజింక మనిషిలా మాట్లాడింది. 'రాజా! నేను ఒక మునిని. నా పేరు కిందముడు. మృగాలెలా కలుస్తాయో చూచి అలాగే నేనూ చేయాలని భార్యతో కలిసి జింకలుగా మారాం. ఆనందంగా గడుపుతున్నాం. ఆడదానితో కలిసినపుడు మృగాలని చంపకూడదనే ధర్మం నీకు తెలియదా!' అన్నాడు.

పాండురాజు ఆ మాటలు విని పూర్వం అగస్త్యమహర్షి మృగమాంసంతో శ్రాద్ధం పెడుతూ రాజులకి మృగాలని చంపితే పాపం రాదు అని నియమాన్ని ఏర్పాటు చేశాడు. అందువల్ల చంపాను. ఇందులో తప్పేముంది? అన్నాడు. అయినా ఆ ముని 'భార్యతో కూడిన సమయంలో మమ్మల్ని చంపావు కాబట్టి నువ్వు కూడా నీ ప్రియురాలితో కూడితే మరణిస్తావు. నీ భార్యకూడా మరణిస్తుంది' అని శపిస్తూ ప్రాణాలు విడిచాడు.

ఆహా! పూర్వజన్మ కర్మఫలమా ఈ శాపం! ఆనాడు నా తండ్రి కామపరవశుడై మరణించాడే! ఈనాడు నేనిలా... అయ్యో... ఇంక మునివృత్తిని చేపట్టి ఫలాలే ఆహారంగా, అవీ లేకపోతే ఉపవాసదీక్షతో జీవితం కొనసాగిస్తానని భార్యలను హస్తినాపురానికి వెళ్ళమన్నాడు. వారు స్వామీ! మేం నీతోనే ఉంటాం. వద్దంటే ప్రాణాలు విడుస్తాం అన్నారు. ఇంక తప్పక, సరే అన్నాడు పాండురాజు. తనవి అనుకొన్న సంపదలన్నింటిని ధృతరాష్ట్రునకిచ్చేశాడు. ఎన్నో కొండలు దాటి, చివరికి శతశృంగ పర్వతం చేరాడు. అక్కడ తపస్సు కొనసాగించాడు. ఒకసారి వెయ్యిమంది మహర్షులు స్వర్గలోకం పోతూ ఉంటే ఎక్కడికి వెడుతున్నారని వారిని ప్రశ్నించాడు.

వారు అయ్యా ఈరోజు అమావాస్య. బ్రహ్మగారిని సేవించుకోవాలని ఋషులు, పితృదేవతలు అందరూ ఈ రోజు బ్రహ్మలోకం వెడతారు. మేమూ అక్కడికే పోతున్నాం. ఈమార్గం చాలాకష్టంగా ఉంటుంది. నీ భార్యలు చాలా సుకుమారశరీరాలు కలవాళ్ళు కదా! వారితో రాలేవులే! ఆగిపో అన్నారు. పుత్రులు లేనివారు పుణ్యలోకాలు చేరలేరు అనే విషయాన్ని వారి మాటల ద్వారా తెలుసుకొని విచారించాడు. *(సశేషం)*

యుద్ధకాండలో



# శ్రీరామాయణంలో పక్షులు



*(గత సంచిక తరువాయి)*

వైశారదీ

విభీషణుని రక్షించడమనే విషయంలో కపివీరులందరు చెప్పిన మాటలు విన్నాడు హనుమ. శ్రీరాముడు తన అభిప్రాయంకూడ చెప్పమని ఆజ్ఞాపించాడు కనుక, తనకు మంచిదని తోచినదేదో ఒకటి చెప్పక తప్పదని, లేచి నిలబడ్డాడు. బృహస్పతిని మించిన వాక్ నైపుణ్యము ఉందేమో.. వినయంగా ఇలా చెప్పడం మొదలు పెట్టాడు.

“నేను కీర్తికౌశలం కలవాడిని అని మాట్లాడడం లేదు. వాదించే సామర్థ్యం ఉందని అసలు ముందుకి రావడం లేదు. మీ అందరితో పోటీపడి మాట్లాడాలని ఏమాత్రం అనుకొనడం లేదు. నేనేదో బుద్ధిమంతుడననీ, మాటకారిననీ అంతకంటే అనుకొనడం లేదు. ఎలాగైనా అందరిముందు మాట్లాడాలని కోరికతో కూడా ముందుకి రావడం లేదు. ఆ విభీషణుని మీద పక్షపాతం కూడా నాకేమీలేదు. శ్రీరామచంద్రస్వామి మన అభిప్రాయాలు తెలుసుకోవాలి అని ప్రేమగా మనని అడిగాడు. పెద్దలు అడిగినప్పుడు మాట్లాడకపోతే వారిని అవమానించినట్లే కదా! అందువలన కేవలం శ్రీరామచంద్రునియందు గౌరవంతో మాత్రమే చెపుతున్నాను.

ఇంతవరకూ పెద్దలందరూ వారి వారి అభిప్రాయాలు చెప్పారు కదా! వాటిలో కొంచెం దోషముందేమో అని నాకు అనిపిస్తోంది.

1. అంగదుడు ఆ వచ్చిన వ్యక్తిని పరీక్షించాలి అన్నాడు. తగిన రాజకార్యాలలో నియోగిస్తేగాని పరీక్షించడం ఎలా కుదురుతుంది? సామర్థ్యం తెలియకుండా పెద్ద పనులలో ఎలా నియమిస్తాము? పనిలో పెడితేగాని శక్తి తెలియదు, శక్తి తెలిస్తేగాని పనిలో పెట్టడం కుదరదు కదా! ఇందులో ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉంది కాబట్టి అన్యోన్యాశ్రయం అనే దోషం ఉన్నట్లుంది.

2. శరభుడు చారులను నియమించి అతని స్వభావం తెలుసుకుందాం అన్నాడు. ఆకాశంలో, కళ్ళ ముందు, స్పష్టంగా కనిపించేవాని దగ్గరకి చారులను పంపడమేమిటి? ఇంకో దేశంలో ఉంటే అన్నీ తెలుసుకొని రమ్మని పంపించవచ్చుగాని నలుగురిలో ఎదురుగా ఉన్నవాడిని గూర్చి చారులేం తెలుసు కోగలరు?

3. జాంబవంతుడు, ‘ఇప్పుడా..? ఇక్కడికా..? అన్నని విడిచి రావడం! పూర్వమే సీతమ్మని ఎత్తుకొని పోగానే తాను రావచ్చుగా? అదేశంలో అకాలంలో వచ్చాడు కాబట్టి రక్షించవద్ద’ న్నాడు. కాని కొంచెం ఆలోచిస్తే ఇదే తగిన దేశం, ఇదే తగిన కాలం అని నాకనిపిస్తోంది. ఎందుకంటే... తప్పుచేసిన వెంటనే అన్నని విడిచి పెట్టలేదు. మంచి చెప్పడానికి ఎన్నో విధాల ప్రయత్నించాడు. చెప్పి, చెప్పి అలసి పోయాడు. అవమానాల పాలయ్యాడు. వీడిని మార్చలేం అనుకొన్నాడు. అటువంటి చోట ఉండకూడదనుకొన్నాడు. స్వామిని చేరి ఆశ్రయించడమే ధర్మం అనుకొన్నాడు. వచ్చాడు. తన ప్రయత్నం తాను చేసి మరీ వచ్చాడు. కాబట్టి ఇదే మంచిసమయం, దేశం కూడా! విభీషణుని రక్షించడమే కర్తవ్యం” అని తన భావాన్ని ఇంకా ఇలా కొనసాగించి చెప్పాడు.

4. “మైందుడు మంచిగా మధురంగా అన్నీ అడిగి తెలుసుకుందాం అన్నాడు. క్రొత్తవాళ్ళువచ్చి అడిగితే ఎవరైనా మనసు విప్పి చెప్తారా? అయినా ఒక్కసారి మాట్లాడినంత మాత్రాన వారి స్వభావం మనకి తెలుస్తుందా? విభీషణుని చూస్తే ఏ చెడ్డభావం తెలియడం లేదు. అనుమానించేలా లేనేలేదు. మనసులో భావం ఏదైనా ఏదోఒకచేష్టలో బయటపడక మానదు. ఏమైనా ఈ విభీషణుడిలో ఏ దోషం వెదికినా నాకైతే కనిపించడం లేదు. సుగ్రీవునికి పట్టాభిషేకం చేశాడు కదా శ్రీరాముడు. ఏమో!... నాకు కూడా అలాంటి అవకాశం అనుగ్రహించి, లంకాప్రజలను రక్షిస్తాడేమో అని ఆశించి వచ్చాడేమో!, నాకైతే ఇలానే అనిపించింది. మీరంతా పెద్దలు, బుద్ధిమంతులు, మీకెలా మంచిదని అనిపిస్తే అలా చెయ్యండి” అన్నాడు.

శ్రీరామచంద్రస్వామి నవ్వుతూ విన్నాడా మాటలు. 'విభీషణుని రక్షిద్దాం' అన్న హనుమ మాట ఎంతో ఆనందాన్ని ఇచ్చింది. "మీరంతా నామీద ప్రేమతో చక్కగా మాట్లాడారు. నా అభిప్రాయం కూడా విని ఎలా చేస్తే బాగుంటుందో అలా చేద్దాం! నాకు విభీషణుని రక్షించడమే ధర్మం అని అనిపిస్తోంది. ఎందుకంటే మిత్రభావంతో వచ్చాడు మన దగ్గరకి. శరణు శరణు అంటూ వచ్చాడు మన దగ్గరకి. ఒకవేళ అతనిలో దోషాలే ఉన్నాయనుకోండి, ఉంటే ఉండనియ్యండి. అటువంటి వానిని రక్షించడమే కదా మన ధర్మం! సత్పురుషులంతా మెచ్చుకొనేపని అదే కదా!

**శ్లో॥ మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన ।**
**దోషోయద్యపి తస్యస్యాత్ సతా మేత దగర్హితమ్ ॥**

మీరందరూ విభీషణుని దగ్గర దోషాలున్నాయి కాబట్టి రక్షించకూడదు అంటున్నారు. హనుమ అతనిలో ఏ దోషం లేదు కనుక స్వీకరించవచ్చు అని చెప్పాడు. కాని దోషం ఉన్నా సరే! అతనిని రక్షించాలి అనేది నా అభిప్రాయం. శరణు అని వేడినవాడు తప్పుచేసిన వాడైనా సరే క్షమార్హుడే! శరణాగతుని గూడ మిత్రభావనతో చూడడం విశాలహృదయుల లక్షణం. "తస్మాదపి వధ్యం ప్రసన్నం న ప్రతి ప్రయచ్ఛంతి" అంది శ్రుతిమాత. చంపతగినంత తప్పు చేసినవాడైనా సరే "నీవే శరణు" అని అంటే చంపకుండా విడిచి పెట్టాలి అని అర్థం. చేసిన తప్పుల్ని వాత్సల్య భావంతో భోగ్యంగా గ్రహించి క్షమించడం, ఆదరించడం మనధర్మం. సుగ్రీవా! ఒకవేళ విభీషణుడు దుష్టభావంతో వచ్చి అపకారం తలపెడితే చూస్తూ ఊరుకుంటానా? నేను సంకల్పిస్తే.. ఒక్కసారి ఇలా చెయ్యాలి అని అనుకుంటే అవతలివాడు పిశాచ, రాక్షస గణాలకి సంబంధించినవాడై, అందరితో కలిసినాపైకి వచ్చినా కొనగోటితో వారిని నాశనం చెయ్యగలను. 'ఇచ్ఛన్' – అలా అనుకొంటే!! కాని నేనలా భావించడం లేదు. ఈ సందర్భంగ మీకొక కథ చెపుతాను వినండి.

**కపోతోపాఖ్యానం**

ఒక అడవిలో ఒక కపోతం అంటే పావురం ఉంది. అది తిర్యక్‌జాతికి చెందినది. మనలా మనిషి కాదు. అయినా, అది ఒక శరణాగతుని రక్షించింది. నేను ఒక మనిషిని. మంచిచెడు తెలుసుకోగలిగినవాడిని. గొప్పవంశంలో పుట్టినవాడిని. ఆ పక్షికిఉన్నజ్ఞానం కూడా లేకుండా ప్రవర్తించవచ్చా?

రెండు పక్షులు ఆనందంగా కొమ్మమీద కూచుని ఆనందిస్తూ ఉన్నాయి. అంతలో వచ్చాడు వాటి పాలిట యమునిలా ఒక బోయవాడు. బాణంతో ఆడపక్షిని కొట్టాడు. విలవిలలాడుతూ ప్రాణాలు విడిచింది ఆ పావురం. తన కన్నుల ముందే జరిగిన దానికి పాపం మగపక్షి అల్లల్లాడిపోయింది. భయంతో ఎగిరిపోయింది. వాడు ఎటో వెళ్ళిపోయాడు.

అంతలో పెద్దగాలి వాన. ఆ బోయవాడు దారితప్పి తిరిగితిరిగి మళ్ళీ ఆ చెట్టు క్రిందకే వచ్చాడు. తడిసి ఉన్నాడు. చలికి వణుకుతున్నాడు. ఆకలితో అలమటిస్తున్నాడు. వేటగాడు ఆ చెట్టు క్రిందకి రావడం తన ఇంటికి రావడంగా భావించింది ఆ మగపావురం. తన ఇంటికి వచ్చిన అతిథి ఆకలి, చలితో గడగడ వణుకుతున్నాడు. అతిథిని ఆరాధించాలనుకొంది పావురం. తనని వాడేమీ అడగలేదు. పైగా భార్యని చంపిన పరమ కిరాతుడు అని తెలుసును. అయినాసరే, శరణాగతుడుగా నిలిచాడుకదా! రక్షించాలి అనుకొంది. అతని చలితీర్చాలని ఆ వానలోపడి ఎక్కడినుండో ఎండుపుల్లలు తెచ్చింది. అగ్నిని తెచ్చి మంటచేసి వెచ్చదనం కల్పించింది. ఇక ఎక్కడ నుండో ఆహారం తేలేదు. ధర్మసాధనమైన తన శరీరాన్ని అగ్నికి అర్పించి ఆ మాంసాన్ని బోయవానికి ఆహారంగా చేసింది. తన భార్యని చంపిన శత్రువు అని తెలిసికూడా ఒక అల్పమైన పక్షి అంత త్యాగం చేసిందే! ఈ విభీషణుడు నాకు ప్రత్యక్షంగా ఏమీ అపకారం చెయ్యలేదు. ఇతనిని రక్షించడంలో ఆలోచన ఎందుకు? పైగ తన భార్యను చంపినవాడినే రక్షించిందీపక్షి. నాభార్య సీతను అపహరించినది రావణుడు. అతడేవచ్చినా, రక్షించాలి నేను. ఇప్పుడొచ్చినది ఆతడు కానేకాదు. ఏపాపమూ ఎరుగని విభీషణుడు. ఆ రావణుని తమ్ముడు. ఇతనిమీద మనకెందుకు అనుమానం రావాలి?

అది ఒక్కపక్షి. ఒక్కటే ఉండికూడా అలా రక్షించిందే! నేను ఇంతమంది సాయంతో ఉండి శరణన్న వానిని రక్షించలేనా? పక్షి తిర్యక్‌జాతిలో పుట్టినది అంత పనిచేస్తే మంచిచెడు విచక్షణ జ్ఞానం ఉన్న మనిషిగా పుట్టానే, రక్షించడం ధర్మమని తెలుసుకొని ఈతని రక్షణ చేయవద్దా? బోయవాడు 'శరణు' అనకపోయినా రక్షించిందే ఆ పక్షి. 'శరణు శరణు'

అంటూ అడిగించుకొని తరువాతనైనా వానిని సంరక్షించవద్దా?

రక్షించడమే ధర్మంగ గలిగిన క్షత్రియునిగా పుట్టి కాపాడ కుండా విడిచిపెట్టవచ్చా? శరీరాన్నే అర్పించిందా పక్షి. శరణు అని వస్తే చాలిక్కడ. ఆ మాత్రం ధర్మం తెలియవద్దా? బుద్ధి మాంద్యంగల పక్షి, ఏ శాస్త్రాలు తెలియని పక్షే శరణాగత ధర్మాన్ని పాటిస్తే శాస్త్రాలన్నింటిని నేర్చి, శరణాగత రక్షణ ధర్మంగా కలిగిన క్షత్రియ వంశంలో పుట్టిన నేను ఆ ధర్మాన్ని పాటించ వద్దా?

**శ్లో॥ శ్రూయతే హి కపోతేన శత్రుః శరణమాగతః ।**
**అర్చితశ్చ యథాన్యాయం స్వైశ్చ మాంసైః నిమంత్రితః ॥**

కపోతేన– ఒక్క పావురంచేత వేటగాడు పూజలందు కున్నాడే, మరి నేనో? మీ అందరిసాయం అందుకుంటున్నాను గదా! ఇప్పుడు ఎలా ప్రవర్తించాలో చెప్పండి. బలం ఉండికూడా ఆపదలో ఉన్నవాడిని రక్షించకపోతే, వాళ్ళపాపాలన్నీ మనకి వచ్చేస్తాయి.

ఇలా వాళ్ళ నందరినీ ఒప్పించే సందర్భంలో శ్రీరాముడు కండుమహర్షి చెప్పిన విషయాలను ఒక ఎలుగుబంటి కథను ఉట్టంకిస్తూ, వివరంగా చెప్పాడు ఈ పావురము చరిత్ర గురించి. శ్రీరామునికి కూడా ఆదర్శముగ నిలచిందన్నమాట ఈ పావురము.

ఈ విషయాలన్నీ చెప్పి, "అందుచేత ఈ విభీషణుడికి అభయమైతే ఇదివరకే ఇచ్చి ఉన్నాను. ఆశ్రయించినవాడిని వదిలే ప్రశ్నే లేదు. దేనినుండైనా సరే ఈ విభీషణుణ్ణి రక్షించి, శరణునీయవలసిందే! కనుక, సుగ్రీవా! నీవే వెళ్ళి సగౌరవంగా ఆతణ్ణి తీసుకొని రమ్మ"ని హెచ్చరిక చేసి మరీ పంపాడు శ్రీరామచంద్రుడు.

ఆశ్రయించిన శిష్యుణ్ణి ఉజ్జీవింపచేయడమే తన జీవిత లక్ష్యంగ భావిస్తాడు ఆచార్యుడు. శిష్యుని క్లేశాలను తొలగించ డానికి ఉద్యమించిన తాను, మధ్యలో ఏమైపోతానో అనికానీ, భావించడు. అవసరమైతే ప్రాణత్యాగానికి గాడా సిద్ధమను కొనగల వాడే ఉత్తమకోటికి చెందిన ఆచార్యుడు. అలాంటి ఆచార్యుణ్ణి ఆదర్శంగ గ్రహించియే భగవంతుడు ఆశ్రిత జీవకోటిని అనుగ్రహిస్తూ ఉంటాడనడానికి ఈ యుద్ధకాండలో మనకి కనిపించే మొదటి పక్షికథ ఈ "కపోతోపాఖ్యానము" నిదర్శనము.

పక్షులు సర్వథా పరోపకారాలే చేస్తాయి. రామాయణ మంతా పక్షుల వృత్తాంతంతో విశేష గౌరవాన్ని పొందింది. చివరకి తననే ఒక వ్యక్తికి ఆహారముగ సమర్పించుకున్న పావురమును శ్రీరామచంద్రుడు ఉదాహరణముగ గ్రహించాడు. తనకొక ఆచార్యతుల్యునిగాను భావించాడు.

లోకంలో ఆచార్యులకు శిష్యుడు సర్వస్వమును సమర్పించుకొని వారి విషయములో విధేయుడైయుండాలన్నది సామాన్య నియమము. కానీ, శిష్యుడి ఉజ్జీవనమునే తన ప్రయోజనముగ భావించి, తమ సర్వస్వమును వాళ్ళకోసమే సమర్పించుకొన్న దయామయులైన ఆచార్యులుగూడ కొందరు లోకంలో ఉంటారు. అలాంటి మహనీయులు ఉంటారనే రామచంద్రుడు పక్షిని ఉదాహరణగ గ్రహించాడు. శిష్యులకే తమ సర్వస్వమును సమర్పించి, వారికోసమే పాటుపడే వారుంటారా? అని సందేహం కలుగవచ్చు.

> **కర్తవ్యమేవ కర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి**
> **ఎంతటి కష్టం ఎదురైనా సరే చేయ వలసిన మంచిపనిని చేసి తీరవలసినదే!**
> **5. మంచిని చేయడంలో జాప్యం పనికిరాదు. అనుకొన్న వెంటనే చేసెయ్యాలి.**

దీని సమాధానానికి దూరం వెళ్ళనవసరం లేదు. మన 'భక్తినివేదన' పత్రికకు పూర్వసంపాదకులు వైకుంఠవాసులు న్యాయవేదాంత విద్వాంసులైన శ్రీ ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారు, ఈ విషయంలో సేవించినవారికి గానీ, వారిని గురించి విన్నవారికి గానీ ప్రత్యక్ష ఉదాహరణ స్వరూపులు.

తమకు శారీరకముగ ఎన్నెన్నో కష్టాలున్నా, వాటిని లక్ష్య పెట్టకుండా, అన్నివిధాలుగ తమ సర్వస్వమును శిష్యులకే సమర్పించి, వారికి సులభులై నిస్స్వార్థంగ ఉభయవేదాంత విద్యను ధారపోసిన వారి జీవనము అత్యుత్కృష్ట ఆచార్య లక్షణానికి నిదర్శనము.

ఇదే యుద్ధకాండలో మరోపక్షికూడా దర్శనమిస్తుంది. అదో అద్భుతమైన ఆచార్యలక్షణాలను ఆవిష్కరిస్తుంది. అవి ఏమిటీ?

(వచ్చే సంచికలో)

# పురాణాలలో నృసింహ కథా వైవిధ్యం

*గత సంచిక తరువాయి*

డా॥ కండ్లకుంట్ల నరసింహమూర్తి- జనగామ

సంస్కృత పురాణ వాఙ్మయంలో నృసింహకథ అనేక రకాలుగ కనిపిస్తున్నది. శ్రీనృసింహగాథకు శ్రీమద్భాగవతాన్ని పరమప్రామాణికంగా గ్రహించడం అనూచానంగా వస్తున్న సంప్రదాయం గనుక ఈ వ్యాసంలో శ్రీమద్భాగవత పురాణ విషయాన్ని మొదట కొంత విజ్ఞాపిస్తాను.

**శ్రీమద్ భాగవత పురాణం:**

ఈ పురాణంలోని సప్తమస్కంధం 1 నుండి 10 అధ్యాయాలలో హిరణ్యకశిపుని వృత్తాంతం, ప్రహ్లాద చరిత్ర, నృసింహావతార విషయం విస్తారంగా వర్ణితమైంది.

బ్రహ్మ మానసపుత్రులైన సనకసనందనాదులు భువన త్రయ సంచారం చేస్తూ అయిదేండ్ల బాలకులవలె దిగంబరులై విష్ణు సందర్శనార్థం శ్రీహరి మందిరద్వారం వద్దకు వచ్చారు. వారు శిశువులని తలచి హరి ద్వారపాలకులిరువురు వారిని అడ్డగించారు. సనకాదులు కుపితులై ఆ ద్వారపాలకులను రాక్షసులుగా జన్మించవలసిందని శపించారు. వారు శాపదగ్ధులై క్రిందకు పడుతుండగా మూడు జన్మలవరకే వారికా శాపం వర్తిస్తుందని తరువాత స్వస్థానానికి తిరిగి రాగలరని మునులు తమంత తామే అనుగ్రహించారు.

వారిరువురు దితి కశ్యపులకు హిరణ్యకశిపుడు - హిరణ్యాక్షులనే సోదరులుగా జన్మించారు. వారిలో చిన్నవాడైన హిరణ్యాక్షుడు భూదేవికి హాని కలిగించిన కారణాన మహావిష్ణువు వరాహరూపం ధరించి వానిని వధించాడు. శ్రీహరివల్ల తన తమ్ముడు నిహతుడైనందుకు హిరణ్యకశిపుడు మహావిష్ణువుపై ద్వేషాన్ని పెంచుకున్నాడు. తన శూలంతో హరి శిరస్సును ఖండించి ఆతని రక్తంతో తన తమ్మునికి తర్పణం గావిస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

తన ప్రతిజ్ఞ నెరవేరే వరకు - విష్ణువుకు నిలయాలైన యజ్ఞాలు, ధర్మకార్యాలు, దేవతలు, ఋషులు, పితృదేవతలు, బ్రాహ్మణులు, గోవులు, వేదాలు, వర్ణాశ్రమ ధర్మాలు మొదలైనవానిని అల్లకల్లోలం గావించవలసిందిగా తన అనుచర రాక్షసగణాన్ని ఆదేశించాడు. వారు రాజాజ్ఞను శిరసావహించి తమ ప్రతాపాన్ని చూపించారు. దేవతలు స్వర్గాన్ని విడిచి భూలోకంలో రహస్యజీవనం కొనసాగిస్తున్నారు. హిరణ్యకశిపుడు, మరణించిన తన సోదరునికి తిలోదక దానాదులను నిర్వర్తించి, ఆతని కుమారులను, వారి తల్లి పృషద్భానువును, తన తల్లి దితిని అనేక విధాల ఊరడించినాడు. మరణించిన వీరుని గురించి దుఃఖించవద్దని వారికి సుయజ్ఞోపాఖ్యానం కుళింగోపాఖ్యానం వివరించి సాంత్వన వాక్యాలు చెప్పాడు.

తరువాత హిరణ్యకశిపుడు తనకు అజేయత్వం, అజరామరత్వం, అప్రతిక్షతత్వం, ఏకరాజత్వం సాధించదలచు కొని మందరగిరికి వెళ్ళి కఠోర తపస్సు చేశాడు. ఆతని తపస్సు వలన అమరులు తప్తులై బ్రహ్మవద్దకు వెళ్ళి రాక్షసుని శాంతింప జేయమని ప్రార్థించారు. బ్రహ్మదేవుడు దైత్యరాజాశ్రమానికి వచ్చి, దానవేశ్వరుని తపస్సుకు మెచ్చి వరాలు అనుగ్రహిస్తాను కోరుకొమ్మన్నాడు. అసురరాజు బ్రహ్మకు దండప్రమాణా లాచరించి ఆనందబాష్పాలతో శరీరం జలదరించగా దగ్గుత్తికతో సృష్టికర్తను పలువిధాల ప్రస్తుతించాడు.

**శ్లో॥ భూతేభ్యః త్వద్విసృష్టేభ్యః మృత్యుర్మాభూన్మమ ప్రభో!**

*(స్కం॥7, అధ్యా॥ 3, శ్లో॥ 400)*

బ్రహ్మసృష్టిలోని ఏ ప్రాణివల్లా తనకు మృత్యువు కలుగకూడదని, లోపల, వెలుపల, పగలు, రేయి, ఆయుధాలు, భూమి, ఆకాశం, నరులు, మృగాలు, ప్రాణసహితాలు అయిన వాటివల్ల, సురాసుర మహోరగులవల్ల తనకు మరణం సంభవించకూడదని, సమరంలో అప్రతిభటత్వం, ఏకరాజత్వం కలగాలని, సకల లోకపాలకులకు ఉన్న అణిమాద్యష్ట సిద్ధులు ఎల్లప్పుడు నశించకుండా తనక సంక్రమించాలని చతుర్ముఖుని హిరణ్యకశిపుడు వరాలు అర్థించాడు.

పరమదుర్లభాలైన ఆవరాలన్నింటినీ బ్రహ్మ అనుగ్రహించాడు. వరగర్వితుడైన రాక్షసరాజు దివ్యతేజో విభ్రాజితుడై భ్రాతృవధను తలచుకొని నారాయణునిపై విద్వేషాన్ని మరీ అధికం చేశాడు. ఆ మహాసురుడు సకల దిగ్విజయం చేసి ముల్లోకాలు గెలిచి,

విశ్వవిజయం పొంది లోకపాలకుల స్థానాలను వారి తేజస్సుతో సహా హరించాడు. స్వర్గంలో ఇంద్రభవనాన్ని ఆక్రమించి అందులో నివాసం ఏర్పాటు చేసుకున్నాడు. లోకపాలక ప్రముఖులు కానుకలతో వానిని సేవించారు. తుంబురనారదాదులు వానిని ప్రస్తుతించారు. హవిర్భాగాలను వాడే గ్రహిస్తున్నాడు. ఐశ్వర్యమదమత్తుడై, శాస్త్రప్రమాణాలను ఉల్లంఘించిన ఆ శాపగ్రస్తుడు ఈ విధంగా చాలాకాలం గడిపాడు.

ఆ దైత్యుని దురాగతాలను సహించలేక లోకపాలకులు మున్నగువారంతా ఇతర రక్షణగానక నారాయణుని శరణువేడారు. శ్రీహరి వారికి దృశ్యమానుడుగాక అశరీరవాణి ద్వారా ఆ దైత్యాధముని దుర్వృత్తి తనకు విదితమేనని, దానికి శాంతి గావిస్తానని, అందుకు కొంత సమయం అవసరమని, మహానుభావుడైన తన కుమారుడు ప్రహ్లాదుని ఆతడెప్పుడు ద్వేషిస్తాడో, బ్రహ్మవరాలు ఉన్నప్పటికి తాను వానిని అప్పుడు వధిస్తానని వారికి అభయమిచ్చాడు. ఆ మాటలకు ఊరట చెంది వారు నిజస్థానాలకు చేరుకున్నారు.

కొంతకాలం తరువాత ఆ దైత్యపతికి పరమాద్భుత చారిత్రులు నలుగురు కుమారులు జన్మించారు. వారిలో ప్రహ్లాదుడు– బ్రహ్మణ్యుడు, శీలవంతుడు, సత్యసంధుడు, జితేంద్రియుడు, దయామయుడు, ప్రియసహృదుడుగా వర్ధిల్లు తున్నాడు. ఆ బాలుడు ఆసురభావం వదిలి– కూర్చున్నా, సంచరిస్తున్నా, భుజిస్తున్నా, శయనిస్తున్నా, మాట్లాడుతున్నా గోవిందనామస్మరణమే గావించేవాడు. సర్వకాల సర్వావస్థలలో విష్ణుసంస్మరణను మరచేవాడు కాడు. శుక్రనందనులైన చండామార్కులను దైత్యపతి తన కుమారునికి విద్యాగురువులుగా నియమించాడు. వారతనికి దండనీతి మున్నగు విద్యలన్నీ బోధించే వారు. ఆబాలుడు గురువులు చెప్పిన విషయాలు వినేవాడు, చదివే వాడు. కాని ఆ చదువులు నిష్ప్రయోజనములని విశ్వసించేవాడు.

ఒకరోజు అసురేంద్రుడు కొడుకును పిలిపించి తొడపై కూర్చుండబెట్టుకొని, తాను అభ్యసించిన వానిలో ఉత్తమమని తోచిన ఏదేని ఒక విషయం గురించి వివరించమన్నాడు. అహంకార మమకారాలను వదలి, అంధకూప సదృశమైన గృహస్థ జీవితాన్ని వదలి, అడవులలోకి వెళ్ళి హరిని ఆశ్రయించి, ఆయన ధ్యానంలో జీవితం గడపటం ఉత్తమమని కుమారుడు ఉద్బోధించాడు. తన శత్రుస్తుతి వచనాలు విన్న రాక్షసరాజు నవ్వి బాలకుల బుద్ధి ఈ విధంగా పెడత్రోవ పట్టడం సహజమే అని, కనుక తన కుమారుని గురుకులంలో ఉంచి విద్యాభ్యాసం చేయించాలని నిశ్చయించుకొని వారికి అప్పగించాడు. వారు బాలుని తమ స్థానానికి కొనితెచ్చి బుజ్జగించి మృదు సామవచనాలతో మిగిలిన బాలురెవ్వరికి లేని ఈ విపరీతబుద్ధికెలా కలిగిందో వివరించమని అడిగారు.

అయస్కాంతానికి ఇనుమును ఆకర్షించడం ఎలా సహజమో అదే విధంగా చక్రపాణి సన్నిధి తన చిత్తాన్ని ఆకర్షించిందని, అది తనకెవ్వరూ ఉపదేశించింది కాదని ప్రహ్లాదుడు ప్రత్యుత్తరమిచ్చాడు. శిష్యుని పలుకులు రుచించని గురువులు ఆతనిని దండోపాయంతో శిక్షిస్తామని బెదిరించారు. అనేక విధాల భయపెడుతూ ఆతనికి త్రివర్గ విద్య నుపదేశించారు. దండనీతిలో ప్రవీణుడైనాడని తాము తృప్తిచెందారు గురువులు, ప్రహ్లాదుని తల్లి జలకమార్చి, అలంకరించి మృష్టాహారాలు పెట్టిన తరువాత తండ్రి వద్దకు కొనిపోయారు.

తనవద్దకు వచ్చి అభివందనమాచరించిన బాలుని తండ్రి ఆశీర్వదించి కౌగిలించుకొని, పరమానందభరితుడై తొడపై కూర్చుండబెట్టుకొని ఆనందాశ్రుజల సిక్తమైన ఆతని శిరస్సుని మూర్కొని చిరునవ్వుతో తానభ్యసించిన విద్యలలో ఒక చక్కని అంశాన్ని వివరించమని కుమారుని అడిగాడు. వెంటనే ప్రహ్లాదుడు...

**శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం ।**
**అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్ ॥**

**శ్లో॥ ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవ లక్షణా ।**
**క్రియతే భగవత్యద్ధా! తన్మన్యేధీతముత్తమమ్ ॥**

*(భాగవతం 7స్కం. 5అ. 23,24శ్లో॥)*

అని నవవిధ భక్తిమార్గాలతో విష్ణువును గూర్చిన జ్ఞానం గలవాని చదువే అన్నింటిలో ఉత్తమమైనదని తన అభిప్రాయాన్ని వెల్లడించాడు. *(సశేషం)*




*గత సంచిక తరువాయి*

**వైశారదీ**

**4. అద్భుతం :** వానరవీరులతో సాగరతీరం చేరాడు శ్రీరాముడు. వంద యోజనాల సముద్రం. సాధనాలేమీ లేవు. ఎలా దాటాలో తెలియదు. సమయం గడచిపోతోంది. అప్పుడే వచ్చిన విభీషణుడి సలహా ప్రకారం శరణాగతి చేసాడు సముద్రుణ్ణి కరుణించమని. కానీ, అది విరుద్ధమైనదనుకొని సముద్రుడు రాలేదు. దారివ్వలేదు. రాముడికి కోపమాగలేదు. సముద్రుడి అంతం చూస్తానన్నాడు. బాణమెత్తాడు శ్రీరాముడు. బలానికే అందరూ లొంగుతారు తప్ప, బ్రతిమాలుతుంటే చేతకానివాడని గేలిచేస్తారు.

దెబ్బకు దిగివచ్చాడు సముద్రుడు. కోపం తగదని సముదాయించాడు. సాగరాన్ని దాటే సరైన ఉపాయం 'సేతుబంధన'మని సెలవిచ్చాడు. "నీలుడనే వానరుడు, నలుడనే వానరుడు, ఇద్దరూ వరబలంకలవారు. నీలుడు ఎలా నిర్మించాలో నిర్ణయిస్తాడు. నలుడుకి రాళ్ళను నీళ్ళపై తేల్చే శక్తి ఉంది. అలా రాళ్ళను సాగరజలాలపై తేలియాడేట్టు చేసి, మంచి సేతువును నిర్మించుకొని హాయిగ సాగరాన్ని దాటండి. కార్యాన్ని నిర్విఘ్నంగ నెరవేర్చుకొనండి" అంటూ ఉపాయాన్ని చెప్పాడు. 5 దినాలలో వానరులంతా 10×10 యోజనాల సేతువును అలవోకగ నిర్మించారు. 5 దినాలలో ఎలా పూర్తైంది? అది ఎంత కాలం ఉంటుంది? ఇలాంటి ప్రశ్నలు అర్థరహితాలు. ఎందుకంటే ఆనాడు వారు నిర్మించినట్లు చెప్పిన ఆ సేతువు ఇప్పటికీ అలానే ఉంది. భౌగోళిక పరిణామాలవల్ల పైన నీరుపెరిగి అది కాస్త, ఓ పది అడుగులు క్రిందికి కనిపిస్తోందే తప్ప, అప్పటిది ఇప్పటికీ అలానే ఉంది. ఇన్ని లక్షల సంవత్సరాలు గడచినా చెదరని రీతిలో, అంత సముద్రంలో ఆ రోజుల్లో, వంద యోజనాల పొడవుతో, కోతుల నేతృత్వంలో నిర్మింపచేయడం అంతుబట్టని ఆశ్చర్యం కదూ! ఇప్పటికీ ఏకైక చారిత్రకాధారంగ నిలచిన సేతువును నిర్మింపచేసిన శ్రీరాముడు అద్భుతరసాన్ని ప్రసాదించాడు ప్రపంచానికి.

**5. హాస్యం :** పంచవటీ కుటీరవాసంచేసే రోజులలో తనను చూడవచ్చిన శూర్పణఖ కామకాతరయై ప్రేమాలాపనలు చిలకరించింది. ఆమెకు నచ్చ చెప్పే ప్రయత్నం చేసాడు చాలా సేపు. అటు లక్ష్మణుడున్నాడు. ఆయన ఉపదేశం వినమన్నాడు. అర్థంకాలేదు ఆ మందబుద్ధి శూర్పణఖకి. అటు పరుగులు పెట్టింది సరసమాడడానికి. 'అందుకు కాదు ఇటు రమ్మన్నది. నాలుగు మంచి మాటలు వింటావనీ. కావాలంటే పోయి కనుక్కో' అన్నాడు లక్ష్మణుడు. మాటల తాత్పర్యాలు గుర్తించలేక, ఇటు అటూ తిరుగాడి, చివరికేం చేయాలో తోచక, 'అత్తమీదికోపం దుత్తమీదచూపినట్లు' అమాయకురాలైన సీతమ్మను తినేస్తానని అటు పరుగులు తీసింది. లక్ష్మణుడు సమయానికి స్పందించి, ఆమె ముక్కు, చెవులు తీసేసాడు. దుర్ముఖిగ తయారు చేసాడు. ఈ సందర్భంలో శూర్పణఖ ప్రవర్తన తీరు, ఆమెతో శ్రీరామలక్ష్మణుల ప్రసంగతీరు గూడ నవ్వుతెప్పిస్తాయి.

**6. భయరసం:** ఏదైనా పాపపుపని చేయాలంటేనే భయం శ్రీరామునికి. శ్రీరాముడు దుష్టులందరికీ భయంకరుడే తప్ప, ఆయనకెప్పుడూ భయం అనేది లేదు వేరేగా. తాటక రాక్షసి అయినా ఒక స్త్రీ. ఆమెను నిరోధించాలంటే బాణాలతో హింసించాలి. స్త్రీ హింస తగదాయె! ఆలోచిస్తాడు శ్రీరాముడు. కొట్టిపారేయమంటాడు విశ్వామిత్రుడు. అయిష్టంగానే అంతమొందించాడు ఆమెను. దానికి ఎవ్వరినీ లక్ష్యపెట్టనక్కర్లేదు నిజానికి.

అయినా **పితుర్వచననిర్దేశాత్, పితుర్వచనగౌరవాత్, వచనం కౌశికస్య ఇతి** నాన్నగారు ఋషిమాట వినమన్నారు కనుక, ఋషిచెప్పినమాట నిస్సంకోచంగ ఆచరించతగును, ఇప్పుడీయన ఆ తాటకను సంహరించమని ఆజ్ఞాపించాడు కనుక నాకేమీ సంబంధం లేదు. దీనివల్ల ఏ పాపమో, పుణ్యమో వచ్చినా, నాకు పూచీలేదు. అంటూ ఇన్ని రకాల సమాధానాలు చెప్పుకొని అప్పుడు సంహరించాడామెను. ఏదైనా పాపకార్యము చేయాలంటే ఎంత భయమో !

**7. బీభత్సరసం:** ఇక యుద్ధరంగంలో విజృంభించేటప్పుడు ఒళ్ళు గగుర్పొడిచే దృశ్యాలెన్నో తయారు చేస్తాడు శ్రీరాముడు. అది ఖరదూషణాదులతో యుద్ధం జరిగేటప్పుడు, రావణాసురుడితో పోరాడేటప్పుడు కూడా చూడవచ్చు. తెగిపడ్డ చేతులూ, కాళ్లూ, తలలూ, ముక్కలైన రథాలు, గుఱ్ఱాలు, ఏనుగులు వంటి జంతువుల మృతకళేబరాలు.. ఇలా ఆ రణరంగాల దృశ్యాలను తలచు కొంటేనే వెంట్రుకలు నిక్కబొడుచుకునే టట్లుండే "బీభత్సరసాన్ని" చూపిస్తాడు.

**8. రౌద్రరసం:** రావణుడి మదము అణిగి, ఎవరబ్బా ఇతడు? సాక్షాత్తు నారాయణుడు కాదు కద! అని ముక్కున వ్రేలు వేసుకొనేటట్లు ప్రదర్శించిన రసం రౌద్రరసం.

**9. శాంతరసం:** ఎన్ని ఉన్నా, పరమపావనులైన తాపసుల సన్నిధిలో సంచరిస్తూంటే ప్రపంచాన్నంతనూ మరచి పోయి ప్రశాంతంగ పరావర తత్త్వజిజ్ఞాస చేస్తూ. మునుల పరిచర్యలతో గడిపే శ్రీరాముడు 'శాంతరసా'న్ని ఆవిష్కరిస్తాడు.

ఇలా చెప్పుకుంటూ పోతే మరో ఆనందసాగరంలో మునిగి పోతాం. కనుక ఈ ప్రసంగాన్నాపి ప్రకృతమైన అవతారాల విభాగవిశేషాలను ప్రస్తావించుకుందాం! *(ఇంకావుంది)*



## విద్యతే బ్రాహ్మణే దమః

శమము, దమము, అంతరింద్రియ నిగ్రహం, బహిరింద్రియ నిగ్రహం. ఈ రెండూ బ్రాహ్మణునిలో ఉంటాయి. బ్రహ్మ అంటే వేదం. వేదాన్ని అభ్యసించినవాడు బ్రాహ్మణుడు. వేదవిద్యను పరిరక్షించండి. వేదమాత సేవలో తరించండి.

## మైత్రాయణీశాఖ -వేద విద్యార్థుల ప్రతిభ

**రాజమహేంద్రి శ్రీ వేదశాస్త్ర పరిషత్ వారు ప్రతి సంవత్సరం నిర్వహించే పరీక్షలలో తొలిసారిగా మైత్రాయణీశాఖను స్వాగతించారు. సీతానగరం వేదవిశ్వ విద్యాలయం నుండి మైత్రాయణీశాఖ విద్యార్థులు అన్వయించి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. చి॥ అనంతశయన, చి॥ గోపీకిషోర్, చి॥ ఆదిత్య, చి॥ సంతోష్‌లకు యోగ్యతా పత్రాలను అందించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు, వీరికి అధ్యాపకులయిన శ్రీమాన్ కల్లకుంట్ల వరప్రసాదాచార్యులను అభినందించారు. విద్యార్థులకు మంగళాశాసనములు కృపచేశారు.**


చి॥ జి. అనంతశయనాచార్యులు


చి॥ గోపీకృష్ణమాచార్యులు


చి॥ ఆదిత్యాచార్యులు


చి॥ సంతోష్‌కుమారాచార్యులు




తొండరడిప్పొడి ఆళ్వార్ అనుగ్రహించిన

# తిరుప్పళ్ళియెళ్ళుచ్చి

**శ్రీరంగనాథుని సుప్రభాత గీతిక**

**వైశారదీ**

*(గతసంచికతరువాయి...)*

**కడిమలర్ కమలఙ్గళ్ మలర్న్దన ఇవైయో?**
**కదిరవన్ కనైకడల్ ముళైత్తన నివనో?**
**తుడి యిడైయార్ శురికుళ్లల్ పిళ్లిన్దుదటి**
**తుగిలుడు త్తేటినర్ శూళ్లపున లరఙ్గా!**
**తొడైయొత్త తుళవముం కూడైయుం పొలిన్దు**
**తోన్టియ తోళ్ తొణ్డరడిప్పొడి యెన్నుమ్**
**అడియనై అళియ నెన్నరుళి ఉన్నడియార్కు ఆళ్**
**పడుత్తాయ్ పళ్ళియెళ్ళు న్దరుళాయే ॥ 10**

**తొండరడిప్పొడియాళ్వార్ తిరువడిగళే శరణమ్**

**తిరుప్పళ్ళియెళ్ళుచ్చి సంపూర్ణమ్**

**పునల్** = కావేరీనది
**శూళ్** = చుట్టియున్న
**అరంగా!** = శ్రీరంగనాథా!
**కడి** = (తేనెలూరు) తేనెలు
**మలర్** = (వికసించిన) స్రవించు
**కమలంగళ్** = తామరలు
**మలర్న్దన** = వికసించినవి
**ఇవయో** = ఇవిగో!
**కదిరవన్** = సూర్యుడు
**కనై** = ఘోషించు
**కడల్** = సముద్రమునుండి
**ముళైత్తనన్** = ఉదయించెను
**ఇవనో** = ఇడుగో!
**తుడి ఇడయార్** = సన్నని నడుముకల స్త్రీలు
**శురి** = ముడివేసిన
**కుళ్లల్** = తమ కేశములను
**పిళ్లిన్దు, ఉదటి** = పిండి, దులిపి
**తుగిల్, ఉడుత్తు** = వస్త్రములను ధరించి
**ఏటినర్** = గట్టెక్కిరి
**తొడైయొత్త** = అందముగా అల్లిన
**తుళవముం** = తులసియును
**కూడైయుం** = చేతియందు బుట్టయు
**పొలిన్దు** = ధరించి
**తోన్టియ** = దర్శనమిచ్చు
**తోళ్** = భుజముకల
**తొణ్డరడిప్పొడి ఎన్నుం** = 'తొండరడిప్పొడి' అనే పేరు కల (భక్తపాదధూళి)
**అడియనై** = ఈ దాసుని
**అళియన్ ఎన్ఱు** = రక్షింపదగినవాడు అని
**అరుళి** = దయతలచి
**ఉన్** = నీయొక్క
**అడియార్కు** = దాసులకు
**ఆళ్** = సేవకునిగా
**పడుత్తాయ్** = చేసివేసినావు
**పళ్ళియెళ్ళున్దు** = పడకనుండి లేచి
**అరుళాయే!** = ఇకనైనా అనుగ్రహించుమా!

***తా:*** శ్రీరంగములో రంగనాథుల మూలవరులు పెరియ పెరుమాళ్ళు కృష్ణావతారమని; ఉత్సవరులు-నంబెరుమాళ్ళు రామావతారమని పూర్వాచార్యుల నిర్వాహము. ఓ రంగనాథా! ఇందాక కొద్దిగ వికసించిన తామరలిపుడు పూర్తిగా విప్పారి, పరిమళభరిత తేనెలను స్రవించుచున్నవి. మరి నీ నేత్రకమలములింకా ముకుళించియే యున్నవి. మొదట కిరణములనంపి నిను చూడబోయి, తన తప్పు గ్రహించిన

సూర్యుడు తానే స్వయముగా సాగరం పైగ, లేచి కోవెల లోలోపలికి తొంగిచూచుచున్నాడు. అడుగో! నీకుశలప్రశ్నకై వేచి యున్నాడు.

నీవు అలనాడు యమునాతీరాన స్నానమాడు గొల్ల కన్నెలకు వ్రతలోపము రాకుండటకై వాదులాడి వస్త్రము లందించితివి. ఆ ఆనందరసము చేజారిపోతోంది సుమా ఇపుడు! చూడు! నీ చుట్టూ కల ఉభయకావేరీ నదులలో, సన్నని మోహింపజేయు నడుముకల కన్నియలంతా నీ రాకకై వేచిచూచి, స్నానమాడి, తడి శిరోజములను పిండి, దులుపుకొని గట్టునకల వస్త్రాలను తామే ధరించి బోవుచున్నారులే! నీ భుజములకు శంఖచక్రములు అలంకారములు. నీకే తగిన పెద్ద పెద్ద తులసిమాలికలు, వాటినుంచు బుట్టలు ధరించుట ఈ నీ "దాసుల పాదధూళి"యను దాసుని (నాయొక్క) భుజములకలంకారము. దుష్టుడనైన ఈ దాసునియందలి కృపచే చెడునుండి మరల్చి నీ దాసుల పాదసేవయే ధారకమగునట్లు తీర్చిదిద్దితివి. నీయోగనిద్ర ఇందుకేగద! వెంటనే మేల్కొని అనుగ్రహించు తండ్రీ! (సమాప్తం)



# శ్రీకృష్ణ జన్మాష్టమి

శ్రీకృష్ణజయంతి అష్టమితిథి, రోహిణీ నక్షత్రం. ఈ రెండూ కలిసిన పవిత్ర సింహమాసంలో వస్తుంది. ఈ సంవత్సరం అధిక భాద్రపదమాసంలో 8వ తేదీ సెప్టెంబరు నెలలో ఈ పండుగ చోటుచేసుకొంది.

**శ్లో॥ కృష్ణాష్టమ్యాం భవేద్యత్ర కలైకా రోహిణీయది ।**
**జయంతీ నామ సాప్రోక్తా ఉపోష్యాసా ప్రయత్నతః ॥**

అష్టమి తిథి, రోహిణీనక్షత్రం కలసినప్పుడే జయంతి అని అంటారు. పుట్టినరోజు అనే అర్థంలో ఈ పదం ప్రచారంలో ఉంది. చాంద్రమానంలో తిథికి, సౌరమానంలో నక్షత్రానికి ప్రాధాన్యం ఇవ్వడంతో ఈ పండుగను చేసుకొనడంలో రెండు సంప్రదాయాలు ఏర్పడ్డాయి.

పరిపూర్ణావతారుడైన శ్రీకృష్ణ పరమాత్మ ధర్మానికి గ్లాని కలిగినప్పుడు, అధర్మం తలఎత్తినపుడు తాను అవతరిస్తానని ఈ లోకంలో అడుగుపెట్టాడు. దుష్టశక్తుల్ని ఖండించాడు. శిష్టాచారాలని, సాధువులని, రక్షించాడు. అర్జునుని నిమిత్తంగా చేసుకొని లోకానికి భగవద్గీతను కటాక్షించి జగద్గురువుగా నిలిచాడు.

**శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వ సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥**

అంటూ చరమార్థాన్ని ప్రసాదించి కర్తవ్యబోధ గావించాడు.

**శ్లో॥ సింహమాసేఽసితే పక్షే రోహిణ్యాం అష్టమీతిథౌ ।**
**చరమార్థ ప్రదాతారం కృష్ణం వందే జగద్గురుమ్॥**
**తతోఽఖిల జగత్పద్మ బోధాయాచ్యుత భానునా ।**
**దేవకీపూర్వ సంధ్యాయాం ఆవిర్భూతం మహాత్మనా ॥**



జై బదరీవిశాల్‌కీ.....

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో...

# హృషీకేశ్‌లో నిత్య సుందరకాండ పారాయణ మరియు

# బదరీనాథ్‌లో అష్టాక్షరీ క్రతు మహాపూర్ణాహుతి



# శుభాహ్వానము

ఈ సంవత్సరం ఎవ్వరికీ గ్రహబలం అంత అనుకూలముగ లేనందున దేశానికి, ప్రజలకు సంక్షేమం కలగాలని, మనం నిర్వహించే ఆధ్యాత్మిక, సేవా కార్యక్రమములు నిర్విఘ్నముగ కొనసాగాలన్న సంకల్పముతో అష్టాక్షరీ అనుష్ఠానాన్ని క్షేత్ర దర్శనారంభం నుండి శ్రీస్వామివారు వేంచేసే వరకు బదరికాశ్రమములో చేయాలని, అలానే గ్రహబాధ నివారణకు నిత్య సుందరకాండ పారాయణ హృషీకేశ్ వైకుంఠ రామాలయములో మన బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన సేవా సమితి నిర్వాహకులు 'బకాస్' 15.5.2012న ప్రారంభించారు. ఇది 4.10.2012న మహాపూర్ణాహుతితో పూర్తికాబోతోంది.

**హృషీకేష్‌లో కార్యక్రమ వివరములు**

**3.10.12** శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆగమనము

**4.10.12** ఉదయం: స్నపన తిరుమంజనం, సుందరకాండ సమాపనము, హోమము, మహాపూర్ణాహుతి, తదీయారాధన

సాయంత్రం: శ్రీ సీతా వైకుంఠరాముల శాంతి కళ్యాణము, శ్రీస్వామి వారి అనుగ్రహభాషణము.

**5.10.12** హృషీకేశ్‌నుండి శ్రీస్వామివారు బదరీ ప్రయాణం,

**బదరీనాథ్-అష్టాక్షరీక్షేత్రంలో కార్యక్రమ వివరములు:**

**6.10.2012**

ఉదయం: శ్రీస్వామివారి సమక్షంలో అష్టాక్షరీ జపము, హోమము, తర్పణము, పుష్పాంజలి, తదీయారాధన.

సాయంత్రం: విష్ణు సహస్రనామ పారాయణ తిరు మంత్రార్థ ప్రవచనము,

**7.10.2012**

ఉదయం: సమాశ్రయణములు, అష్టాక్షరీ అనుష్ఠాన సమాపన హోమము, మహాపూర్ణాహుతి, శాంతి కళ్యాణము, అవబృథ స్నానము.

సా॥ శ్రీవారి అనుగ్రహ భాషణం, మంగళాశాసనములు

**8.10.12** శ్రీస్వామివారు బదరీనుండి తిరుగు ప్రయాణం.

*గమనిక:* గ్రహబలం అనుకూలముగాలేని భగవద్బంధువులు ప్రత్యక్షముగా పాల్గొనలేక పోయినవారి వారి జన్మ నక్షత్రము, గోత్ర నామములు ఈ క్రింది ఇ-మెయిల్‌కు పంపించిన ఎడల వారి తరపున పూజ హోమము చేయించబడును. bakasshyd@gmail.com

**వివరములకు:** డా॥ టి. రామనాథం :93478 81779; 040 - 24048045; జెట్ సీతానగరం : 08645 - 272929,
జెట్ హైదరాబాద్ : 040 - 23224426, JIVA-శ్రీరామనగర్ : 95535 49971/72

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...)

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

'రావమ్మా! విమలా.. ఎన్నాళ్ళైందో నిన్ను చూడక..."

"ఏదీ పిన్నీ రంగడి పెళ్ళిలో కలిశాం కదూ.. అయినా నేను కూడా వద్దామనే అనుకుంటున్నా ఎప్పటికప్పుడు ఏదోపని.. వదిన ఇంట్లో లేదూ..."

"రావమ్మా మరదలా! ఎన్నాళ్ళకు దయ కలిగిందో..."

"అదేం కాదులే... ఏదో పనివత్తిడి... అయినా ఇవ్వాళ పిన్ని దగ్గర కొన్ని విషయాలు చెప్పించుకోవాలని ఎక్కడి పని అక్కడ పడేసి వచ్చాను..."

"అలా చెప్పు.. 'ఊరకరారు మహానుభావులని' ఉత్తినే అన్నారా?"

"పోనీలే.. అలాగైనా వచ్చింది... సరే చెప్పు. ఏం తెలుసు కోవాలనుకున్నావు?"

"తిరుక్కోళూరమ్మాళ్ ప్రశ్నలు చదువుతుంటే **ఇడైయాత్తూర్ నంబి** గురించి వచ్చింది. ఆయన ఎవరు? ఏమిటో తెలుసు కుందామని నీ దగ్గరకు వచ్చాను పిన్నీ."

"మంచిపని చేశావు. 'నిల్లెన్ను పెత్తేనో ఇడైయాత్తూర్ నంబిప్పోల?" అనే కదా అమ్మాళ్ ప్రశ్నించింది?"

"అవును పిన్ని... వదినా ఆకులు, ఈనెలూ నాకూ ఇవ్వు. నేనూ విస్తళ్ళు కుడుతూ వింటాను."

"నీకెందుకమ్మా.. నువ్వు కూర్చో."

"అదేం నేను విస్తళ్ళు కుట్టలేనా... చెవులేగా వినేది. చేతులు కాళీయేగా.. ఆకులు ఇటు అందుకో వదినా..!"

"సరే.. ఇవిగో తీసుకో విమలా... 'ఇడైయాత్తుర్' అనేది శ్రీరంగం దగ్గర చిన్నఊరు. అక్కడ నివాసం ఉండే భక్తులలో ఒకరికి శ్రీరంగనాథుడి ఉత్సవాలను తనివితీరా సేవించడంలో అపారమైన నిష్ఠ ఉండేది. ఆ రోజులలో ఎక్కడికి పోవాలన్నా కాలినడకే కదా! అయినా ఆయన ప్రతీ సంవత్సరం శ్రీరంగంలో జరిగే బ్రహ్మోత్సవాలు నాలుగింటికి క్రమం తప్పక వచ్చి సేవించేవారు. అదికూడా ఎలా! ఏదో ఒకరోజు ఉత్సవాల మధ్య వచ్చి కనపడి పోవటం కాదు. అంకురార్పణకు వస్తే చక్రస్నానం దాకా ఉండే వారన్నమాట."

"అంటే ప్రారంభంనుండి చివరిదాకా నన్నమాట."

"అవునమ్మా! అలా ప్రతీ ఘట్టంలో శ్రీరంగనాథుని వైభవం చూసి ఆనంద పరవశులయ్యేవారు. అంతేకాదు వాటిని మళ్ళీ మళ్ళీ స్మరిస్తూ, పలవరిస్తూ, పులకరిస్తూ ఉండేవారు. ఇంట్లోవాళ్ళు "సాపాటుకు లెమ్మంటే" మళ్ళీ రంగనాథుడి ఉత్సవాలు వచ్చేశాయా?" అనేవారట. శ్రీరంగనాథుడి మీద ఆయనకు అంత భక్తి ఉండేది. ఇలా చాలాకాలం గడిచి పోయింది.

ఒకసారి బ్రహ్మోత్సవాల అంకురార్పణకు రాలేక పోయారు. శ్రీరంగనాథుడు ఇది గమనించి "మన ఉత్సవాలకు ఇడైయాత్తూర్ నంబి రాలేదే!" అనుకున్నారట.

"ఆహా ఆ రంగడికి తన భక్తులమీద ఎంత కృప?"

"వీరు ఆరవరోజుకు చేరుకున్నారు. వీరిని చూడగానే "నంబీ వచ్చారా! మీకో వరం ఇద్దామనుకుంటున్నాం. కోరుకోండి" అన్నారట శ్రీరంగనాథులు. "ఆహా రంగడే కోరుకోమంటే ఆ స్వామి ఏం కోరుకున్నారత్తయ్యా!"

"ప్రపన్నులు ఏం కోరుకోవాలో అదే కోరుకున్నారు.

'తమరు ఇచ్చిన ఈ కాయానికి నూరు తిరునక్షత్రాలు గడిచాయి. ఈ శరీరంతో ఎన్నో అనుభవించాను. ఎన్నో ఉత్సవాలకు వచ్చాను. కానీ ఇప్పుడిది రాకపోకలకు పనికిరాకుండా పోయింది. తమరి ఉత్సవాలు సేవించుకునే భాగ్యం లేకుండా పోతుందేమో..." నన్నారట. వెంటనే శ్రీరంగనాథుడు ఏమన్నారో తెలుసా?

'అలా అయితే ఇక్కడే ఉండండి' అని సెలవిచ్చారు. వీధి పురప్పాడు ( స్వామి శోభాయాత్ర) ముందుకు సాగి వీధి మలుపు తిరిగింది. ఇడైయాత్తూర్నంబి అక్కడికక్కడే పరమపదం చేరారు.

అంటే నిత్యకైంకర్య భాగ్యం అబ్బిందన్నమాట.

"అంతే కదా మరి! స్వామి అనుగ్రహంతో ఆయన దగ్గరకు చేరటం సామాన్యులకు సాధ్యమా! వారెంతో నిష్ఠాగరిష్ఠులు కాబట్టి వారికంతటి భాగ్యం లభించిందని తిరుక్కోళూరమ్మాళ్ వాపోయారన్నమాట." (సశేషం)



చిత్రకథ - 14

# రామానుజ చిత్రకథ


















ఇది దైవవిధి! జనన మరణాలకు సుఖదుః
ఖాలకు, లాభాలాభాలకీ భగవంతుడే కారణం


రామానుజా! వారి చరమ దేహానికి యతి సంస్కారములు చేసేలోపైనా కనీసం మనం సేవించుకోవాలి. పదండి త్వరగా చేరాలి.


ఇసుకలో కూర్చుని ఉన్న రామానుజుని రెండు చేతులతోటి పట్టుకుని నడిపించుట....


మహాత్ములను చూడాలన్నా భాగ్యం ఉండాలి. నానుదుట అది లేదు కాబోలు. సరే! కనీసం చరమదేహాన్నైనా చూడలిగాను.


స్వామికి ప్రదక్షణం చేయొచ్చా? ఈ దాసుడు కాంచీనుంచి, వారిని చూడాలనే వచ్చాడు. భాగ్యం దక్కలేదు.


కాస్త కొన్ని ఘడియల ముందొచ్చినా బాగుండేది కదయ్యా! సరేలే! ప్రదక్షణం చేస్కో! ఇంతలో సంస్కారాలకి సిద్ధపడతాం!


పాదాలవద్ద మోకాళ్ళపై కూర్చొని, కన్నీళ్ళు కారుస్తూ రామానుజులు


లేచి, ప్రదక్షణ చేస్తోంటే, ముడిచిన వ్రేళ్ళు కన్పించాయి


అరే!ఇదేంటి? వేళ్ళు 3 ముడుచున్నాయే?


పుట్టినప్పుడు వేళ్ళు ముడుచుకుని, మరణానంతరం వ్రేళ్ళు తెరచుకొని ఉండడం సహజం కదా! మరి వీరి వేళ్ళు.


వీరి వ్రేళ్ళు ఎప్పుడూ ఇంతేనా లేక ఇప్పుడే ఇలా ముడుచుకుని... ఉన్నాయా?







యామునాచార్యుల మధ్యవేలు తెరుచుకొనుట, చుట్టూ ఉన్నవారు ఆశ్చర్యంతో...

అదిగో ఒకవేలు తెరుచుకుంది.

ఇంకా ఉంది..

# మన ఆళ్వార్లు

- శ్రీ నృసింహ -




*గత సంచిక తరువాయి*

## ముదలాళ్వార్లు

శ్రీమన్నారాయణుడు ఈ ముగ్గురినీ కలపాలి అనుకున్నాడు. కలి బాధలు తగ్గించాలి అనుకొన్నాడు. లోకానికి జ్ఞానదీపాన్ని చూపించాలి అని నిశ్చయించుకున్నాడు. ఒక చక్కని సన్నివేశాన్ని ఏర్పాటు చేశాడు.

పొయ్‌గై, పూదత్త, పేయాళ్వార్లు ముగ్గురూ ఎవరికి వారే పరమాత్మ గుణానుభవంతో మునిగి తేలుతూ ఒక్కొక్క గ్రామంలో ఒకొక్కరోజు మాత్రమే ఉంటూ సంచరిస్తూ ఉండేవారు. భగవంతుని లీల. ఈ ముగ్గురూ తిరుగుతూ తిరుగుతూ **తిరుక్కోవలూరు** అనే ఊరు చేరుకున్నారు. ఈ ఊరు వామనక్షేత్రం. ఇక్కడ **ఉలహమళంద పెరుమాళ్** త్రివిక్రమమూర్తి వేంచేసి ఉన్నాడు. ఆయన మాయచేత ఆనాటి రాత్రి వానకురవడం మొదలు పెట్టింది. అంతవరకు చక్కగా ఉన్న వాతావరణం మబ్బు లేదు– ఏమీలేదు... అనుకోని వాన... పొయ్‌గై ఆళ్వార్లు గబగబా వచ్చి అక్కడ ఒక ఇల్లు కనిపిస్తే లోపలికి రావచ్చా అని అడిగారు.

మృకండు అనే మహర్షి ఇల్లది. ఆయన బైటికి వచ్చి ఈ వైష్ణవోత్తమునికి నమస్కారం పెట్టి లోపలికి రండి స్వామీ..! ఇదుగో ఈ వీధి అరుగుగదిలో విశ్రాంతి తీసుకోండి అంటూ చిన్నగదిని చూపించాడు. సరే అని అక్కడ చేరి పడుకున్నారు పొయ్‌గై ఆళ్వార్లు.

మరి కాసేపటికి పూదత్తాళ్వార్లు కూడా అక్కడికే వచ్చారు. దగ్గరలో ఆ ఇల్లొకటే ఉంది. అందుకని తడిసిపోకుండా ఉండాలని అయ్యా! లోపలికి రావచ్చా! అన్నారు.. వెంటనే పడుకున్న పొయ్‌గై ఆళ్వార్లు లేచి... అయ్యా! ఒరువర్ పడుక్కలాం, ఇరువర్ యిరుక్కలామ్, ఒకరైతే పడుకోవచ్చు. ఇద్దరు ఉండవచ్చు రండి! రండి!! అంటూ ఆదరంగా పిలిచారు. పూదత్తాళ్వార్ కూడా ఆ గదిలో చేరారు. కూర్చున్నారిద్దరూ.

ఇంతలో పేయాళ్వారు వచ్చి చేరారు. ఎవరికైనా వాన... బాధేగా... అమ్మయ్య ఒక ఇల్లు కనపడిందిలే అనుకొని వచ్చి అయ్యా! లోపలికి... రావచ్చా అన్నారు. మువ్వర్ నిక్కలామ్... ముగ్గురైతే నిలబడవచ్చు అనుకుంటూ ఆహ్వానించారు ముందరి వారిద్దరూ. వారూ లేచి నిలబడ్డారు. ఒకరినొకరు తాకుతూ... ఏదో ఆశ్రయం దొరికింది అంతే చాలు అని. ఆ మహనీయులు ముగ్గురు ఒక్కచోట చేరేసరికి ఆగలేకపోయాడు ఆ ఊరిలో ఆలయంలో ఉన్న స్వామి. అమ్మ లక్ష్మీదేవితో, గరుడవాహనంతో బయలుదేరివచ్చి అదృశ్యరూపంతో వారి ముగ్గురి మధ్యలో ప్రవేశించాడు.

అసలే ఒకరినొకరు తాకుతూ నిలుచున్నారేమో... మధ్యలో ఈయన దూరేసరికి చాలా ఇరుకు ఇరుకుగా అయిపోయింది. ఒకరినొకరు త్రోసుకోవడం... ఏమిటిలా అయింది అని ఆశ్చర్యపోయారు వారు ముగ్గురూ. ఒక్కసారి యోగదృష్టితో చూశారు. శ్రీలక్ష్మితో కూడిన స్వామి గరుడ వాహనారూఢుడై కనిపించాడు. నిశ్చేష్టులయ్యారు వారు. స్వామిని స్పష్టంగా సేవించుకోవాలని పొయ్‌గై ఆళ్వార్లు ఈ భూమిని ప్రమిదగా చేశారు. సముద్రాన్ని తైలంగా భావించారు. సూర్యుని దీపమనుకున్నారు. ఆ వెలుగులో స్వామిని దర్శించారు. ఆహా! ఏమి దివ్యమంగళ విగ్రహము! అని ఆశ్చర్యపోయి వంద పాశురాలతో ఆ స్వామిని కీర్తించారు. ఆ పాశురమాలని ముదల్ తిరువందాది అని అంటారు.

చివర ఉన్న పదాన్నే మళ్ళీ మొదటిపదంగా చేస్తూ కవిత్వం చెప్పే పద్ధతికి అంత–ఆది=అందాది అని పేరు. అలా వందపాశురాలు. అందులో మొదటి పాశురమిది.

**పా॥ వైయం తకళియా వార్ కడలే నెయ్యాక**
**వెయ్య కదిరోన్ విళక్కాక శెయ్య**
**శుదరాళ్రియా నడిక్కే శూట్టినేన్ శొల్‌మాలై**
**ఇదరాజినీఙ్గుకవే ఎన్రు.** (ముదల్ తిరువందాది) మొదటి శతశ్లోకి మొదటి 100 పాశురాలు.

**ప్రతిపదార్థము:–** వైయమ్=భూమి; తకళియా=ప్రమిద గానూ; వార్=పారుచున్న; కడల్=సముద్రము; నెయ్యాక= నెయ్యిగాను; వెయ్యకదిరోన్=వేడి కిరణాల సూర్యుడు; విళక్కాగ=దీపముగాను ఉంచి; శెయ్య=ఎఱ్ఱనైన; శుదర్=కాంతి కల; ఆళ్రియాన్=చక్రాయుధమున్న స్వామి; అడిక్కే=పాదము లందే; ఇదర్=దుఃఖమనెడు; ఆజి=సముద్రము; నీంగుక= పోగొట్టవలెను; ఎన్రు=అని ఉద్దేశించి; శొన్మాలై=శబ్దమాలను; శూట్టినేన్=సమర్పించితిని.

ఇలా మొదలు పెట్టి ముదల్ తిరువందాది 100 పాశురాలను కీర్తించిరి. ఆ పాశురాలు వింటూంటే ఆ స్వామికి ఆనందం ఆగలేదు. ఆ గడపలోనే నాట్యం చెయ్యడం మొదలు పెట్టాడు. అందుకే ఆ స్వామిని దేహళీకుడు=నడవలో నాట్యం చేసినవాడు అని పిలిచారంతా.

**తాత్పర్యము:** ఈ భూమినంతా ప్రమిదగా చేసి, విశాల సముద్రజలాన్ని అందులో నెయ్యిగా పోసి, సూర్యుని దీపంగా వెలిగించి, చక్రాన్ని ధరించిన స్వామి పాదపద్మాలకు హారతినిస్తూ ఈ స్తుతి మాలికని సమర్పిస్తున్నారు. ఇలా ఈ దుఃఖసంసార సముద్రాన్ని దాటిపోవాలని కోరిక. ఈ వందపాశురాలలో వీరు శ్రీరంగం, కంచి, తిరుమల, తిరుక్కోవలూరు దివ్యదేశాలలోని సర్వేశ్వరుని కీర్తించారు.

**పా॥ అన్బే తకళియా ఆర్వమే నెయ్యాక**
**ఇన్బురుకు శిన్దై యిడు తిరియా నన్బురికి**
**ఞానచ్చుదర్ విళక్కేత్తినేన్ నారణర్కు**
**ఞానత్తమిళ్ పురిన్దనాన్.** (ఇరండాన్తిరువందాది) రెండవ శతశ్లోకి (రెండవ వందపాశురాలు అందాది)

**ప్రతిపదార్థము:–** అన్బే=భక్తియే; తకళియా=ప్రమిద గానూ; ఆర్వమే=శ్రద్ధనే; నెయ్యాక=నెయ్యిగా పోసి; ఇన్బు= ఆనందముచేత; ఉరుకు=కరిగిన; శిన్దై=మనస్సు; ఇడు= వేయతగిన; తిరియా=వత్తిగాను చేసి; ఞానమ్=జ్ఞానప్రదమైన; తమిళ్=ద్రావిడ ప్రబంధమును; పురిన్ద=చేసిన; నాన్= దాసుడు; నన్బు=ఆత్మ; ఉరుకి=కరిగి; నారణర్కు=శ్రీమన్నారాయణునికి; ఞానమ్=పరభక్తియనెడు; శుదర్=ఉజ్జ్వలమైన; విళక్కు=దీపమును; ఏత్తినేన్=పెట్టితిని.

***తాత్పర్యము:*** భక్తిని ఒక ప్రమిదగాచేసి, శ్రద్ధనే నెయ్యిగా పోసి, నా మనస్సును వత్తిగా మార్చి జ్ఞానదీపాన్ని వెలిగించి శ్రీమన్నారాయణుని నేను ఈ ద్రావిడభాషలో స్తుతి చేస్తున్నాను.

అబ్బబ్బ... ఆహాహా... ఓహోహో... ఎంత బాగుందీ...! ఇలా పాడుతూ ఉంటే! ఆ స్వామి అలా ఆడుతూనే ఉన్నాడే... ఈ వందపాశురాలలో వీరు శ్రీరంగం, తిరుమల, మహాబలిపురం, తిరుక్కోవలూరు, కంచి అజకసింగరు, తిరుక్కోట్టియూర్, తిరునీర్మలై వర్ణించారు.

మొదటి ఆళ్వార్ల మంగళాశాసనంలో భూమి, సముద్రం, సూర్యుడు... ఇలా అన్నీ కనిపించేవే... మరి పూదత్తాళ్వార్ల దృష్టిలో భావనాప్రపంచం. ఏవీ కనిపించనివే. భక్తి–ప్రేమ ప్రమిద సేవించాలి అనే శ్రద్ధాభావనే నెయ్యి. ఆనందంలో కరిగే మనసే వత్తి. జ్ఞానమే దీపము. ఇలాంటి దృశ్యము– అదృశ్యరూపములలో ఉన్న జ్యోతి ప్రకాశంలో మూడవ ఆళ్వార్లు ఆ స్వామిని దర్శించారు. ఆయన ఎలా ఉన్నాడో స్పష్టంగా తెలుస్తోంది. అందుకే ఆనందంతో ఇలా కీర్తించారు.

**పా॥ తిరుక్కణ్డేన్, పొన్మేనికండేన్ తిగళుం**
**అరుక్క నణి నిరముం కండేన్ శెరుక్కిళరుం**
**పొన్నాళికండేన్ పురిశంకం కైక్కణ్డేన్**
**ఎన్నాళి వణ్ణన్ పాలిన్డు.** (మూన్ట్రాన్తిరువందాది) 3వ వంద పాశురాలు)

**ప్రతిపదార్థము:** ఎన్ ఆళివణ్ణన్ పాలిన్డు తిరుక్కణ్డేన్ స్వామిని, సముద్రునివలె నీలుడు అయిన స్వామిలో శ్రీ మహాలక్ష్మిని సేవించితిని.

పొన్ మేని కండేన్. తికళుమ్ అరుక్కన్= అందమైన శరీరమును సేవించితిని. ప్రకాశించు సూర్యునివలె,

అణి నిరముమ్ కండేన్=సుదర్శనమును సేవించితిని. పురిశంగు=స్నేహముగల పాంచజన్యమును; అంకై కండేన్=అందమైన స్వామి చేతిలో చూచితిని.

**తాత్పర్యము:** నీల సముద్రకాంతిగల స్వామి గుండెలపై శ్రీదేవిని దర్శించాను. బంగారుకాంతిగల శరీరాన్ని దర్శించాను. సూర్యతేజంవంటి దివ్యదేహాన్ని చూశాను. రెండు భుజాలలో గొప్పశంఖ చక్రాలను దర్శించాను.

ఈ మూడవ వందపాశురములలో వీరు తిరువల్లిక్కేణి, కంచి, తిరుమలై, తిరువేఃకావేళుక్కై, తిరుక్కుడందై, పాడకమ్, క్షీరాబ్ధి, పరమపదము, కడికై, తిరువిణ్ణగర్, శ్రీరంగం, తిరుక్కోట్టియూర్, అష్టభుజ దివ్యక్షేత్రములను వర్ణించారు.

ముగ్గురు ఆళ్వార్లు ఇలా కీర్తిస్తూ ఉంటే స్వామి అలా ఆడుతూనే ఉన్నాడు. కాలం తెలియనే లేదు. తెల్లవారింది. స్వామి అంతర్ధానమయ్యాడు. వీరు కూడా వారి వారి మార్గాలలో నిష్క్రమించారు.

తిరుమంగై ఆళ్వార్లు 'శెన్‌తమిళ్ పాడువార్' అంటూ ముదలాళ్వార్లనూ శ్లాఘించారు. (మంచి శ్రీసూక్తులను ద్రావిడంలో అనుగ్రహించి పాడిన మహనీయులు)

అదే భావంలో నమ్మాళ్వార్లు 'శెంజొల్ కవిగాళ్' ఇన్ కవిపాడుం పరమకవిగాళ్ అని వీరిని కీర్తించారు.

మణవాళ మామునులు, 'నత్తమిల్ నూల్ శెయ్‌దు నాట్టై యుయ్‌త్త' మంచి ద్రవిడభాషతో లోకాన్ని తరింపచేసిన మహనీయులని వీరిని ప్రస్తుతించారు.

ముదలాళ్వారులను గర్భశ్రీమంతులు అంటారు. ఎందుకంటే తాము జన్మించిన పుష్పములలో ఉన్నప్పటినుండే భక్తితో భగవంతుని సాక్షాత్కరింపచేసుకున్న మహనీయులు.

వీరి అంగశ్లేషము అంటే వీరిని ఒక్కసారి స్పృశిస్తే తాకితే చాలు అని ఆ శ్రీమన్నారాయణుడే వారి మధ్య ఇరికి వారి శరీరములను స్పృశించి ఆనందమయుడయ్యాడు.

శ్రీ గరుడవాహన పండితులు తమ 'దివ్యసూరి చరితము' లో వీరిని అద్భుతముగా ప్రస్తుతించారు. ఏమని అంటే... చెరకుగడని గట్టిగా నొక్కితే చాలా మధురమైన రసాన్ని మనకందిస్తుంది.

అలాగే ఈ కవుల మధ్య స్వామి ఇరికి వారికి ఒత్తిడిని కలిగించినదెందుకంటే వారి నుండి మూడు వందల పాశురాల ఆనందరస ప్రవాహాన్ని లోకానికి అందించడానికే! ఈ రససంజీవని సంసారతప్తులయిన జీవులకి మోక్షానందాన్ని కలిగించింది. సశేషం

# 4. పదకేళి -వంశీ



### ఆధారములు

*నిలువు:*

1. వీటిక్రింద పడితే ఇంతే...
2. రెండు తిథులు
4. ఏకాదశి వ్రతం చేసిన రాజు
5. కొండ
9. ప్రత్యక్ష దైవాలు
12. అప్పాలమాలలాగే ఈ మాల కూడా ఆంజనేయస్వామికి ఇష్టం
16. క్రిందనుండి పధ్నాలుగవ తిథి
19. స్వామి పాదాది శిరఃపర్యంతం ధరించేది
20. జ్ఞానము ఇచ్చే ముని
21. లక్ష్మి
23. తమిళంలో నోరు. క్రిందనుండి
24. ఉపయోగించు, తిరగబడితే సః కూడా
1. శ్రీకృష్ణుని పుట్టినరోజునే ఇలా అంటారు.

*అడ్డము :*

3. 4వ ఆళ్వార్లు
6. రథంలో ఉన్నవాడు (తిరగబడితే)
7. మూడువైపులా నీరుండేది
8. పార్వతి
10. సంస్కృతంలో వీడే
11. తిరుగబడిన లత
13. తేరు
14. పది అడ్డమే తెలుగులో
15. మెడలో, తలలో నిలచేది
17. నువ్వు సంస్కృతంలో
18. పధ్నాలుగు లోకాలు
21. బదరిలో నారాయణుని ముందు పదం
22. లక్ష్మీప్రియుడు
25. సంస్కృతంలో ఇచ్చుట
26. పద్మం, లక్ష్మి కూడా

### 3. పదకేళి - సమాధానములు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| గో | విం | దు | డు | | వ | ర | దా |
| పా | | శ్యా | | వీ | డు | | మో |
| లో | | లు | | డే | గ | | ద |
| పా | కు | వ | డు | | | రు | రు |
| య | వ | | | | శా | | డు |
| నం | | భీ | మ | పా | క | ము | |
| | య | తి | | కా | | వ్వ | అ |
| | ము | | వా | రి | జ | | మ్మ |

**పదకేళిని పూరించి, భక్తినివేదన - సీతానగరం చిరునామాకి పంపించగలరు. 15వ తేదీలోపు అందినవాటిని మాత్రమే పరిశీలిస్తాం!**

### ఆగస్టు నెల మెదడుకి మేత! సమాధానములు

1. పృథ; 2. కురవై; 3. అణి; 4. మాండవ్యుని శాపం; 5. జాతి మనుగడకి; 6. అంగదుడు; 7. జాంబవంతుడు; 8. భరతుడు; 9. అవ్యక్తం; 10. వ్యక్తం; 11. అనుష్టుప్; 12. కూప్పీడు కేట్కుమిదం; 13. రెండు విధాలు; ముఖ్యములు-గౌణములు; 14. అనసూయాదేవికి; 15. బలిభోజనుడు-బలిభాక్; 16. పన్నెండు; 17. దోషం; 18. కంచి; 19. పూదత్తాళ్వార్; 20. కరణము; 21. ఆపదలో; 22. జ్ఞానషట్కము; 23. జింగోబైలోబా; 24. మధుర; 25. మోక్షప్రదాత ఎవరు అని తెలియాలి అన్నాడు.

### భక్తినివేదన ప్రోత్సాహకులు

| | | |
|---|---|---|
| 1. కోసూరి లక్ష్మీపతిరాజు | పోడూరు | 5,000/- |
| 2. బి.వి.ఎస్.శేషాచార్యులు | బెంగుళూరు | 5,000/- |
| 3. వి.వి. నరసింహులు | మెదక్ | 5,111/- |
| 4. బి. లక్ష్మీబాయి | హైదరాబాద్ | 5,000/- |
| 5. టి. రామకృష్ణ | చెన్నై | 5,000/- |
| 6. నూతక్కి కోటేశ్వరరావు | సికింద్రాబాద్ | 5,000/- |
| 7. రామానుజ దాసి కళావతి | హైదరాబాద్ | 5,000/- |
| 8. బి. రుక్మారావు& గోదాదేవి | హైదరాబాద్ | 5,000/- |
| 9. ఎమ్. అసయ్య | చిపల్లి | 5,000/- |
| 10. అడుసుమిల్లి స్వరాజ్యలక్ష్మి | చంద్రాల | 5,000/- |

**మీరు భక్తినివేదన అభివృద్ధికై ప్రోత్సాహక కైంకర్యాన్ని సమర్పించినందుకు శ్రీస్వామివారి మంగళాశాసనములు అనుగ్రహించారు.**

# పంచాంగము - సంకేతములు

శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ

### ఋషి పంచమి

భవిష్యోత్తర పురాణం ఈ పండుగనిలా వివరించింది.

భాద్రపద శుద్ధ పంచమినాడు మధ్యాహ్నకాలంలో దగ్గరలో ఉన్న నదిలోగాని, చెఱువులోగాని స్నానం చేసి ఈవ్రతాన్ని ఆచరించాలి.

శితాశ్వరాజు బ్రహ్మగారిని సమీపించి సకల పాపాలు పోగొట్టే వ్రతం ఏది అని అడిగితే ఆయన చెప్పిన వ్రతమే "ఋషిపంచమి".

విదర్భదేశంలో ఉత్తంగుడు-సుశీల అనే దంపతులు ఉండేవారు. సుశీల మహాపతివ్రత. వారికి ఒకకొడుకు, ఒక కూతురు. కొడుకు వేదాధ్యయన పండితుడయ్యాడు. కూతురు పాపం బాలవితంతువయింది. తండ్రి వేదం చెప్తూ ఉంటే వింటూ సేవచేస్తూ ఉండేది.

ఒకసారి ఆ అమ్మాయి శరీరంనుండి పురుగులు రాలి పడ్డాయి. అందరూ కంగారుపడ్డారు. తండ్రి ఆలోచించి చూస్తే ఇంట్లో కలపకూడని రోజులలో ఇంట్లో తిరిగేసింది. ఋషులు వ్రతం చేసుకొంటూ ఉంటే ఎక్కిరింపుగా నవ్విందని, ఆ కారణంగా ఇలాంటి జబ్బు చేసిందని తెలిసింది. అంటే తెలిసి చేసిన దోషాలు కొన్ని, తెలియక చేసిన దోషాలు కొన్ని. జ్ఞాత, అజ్ఞాత దోషాలంటారు వీటిని. ఋషిపంచమి వ్రతపూజ చేస్తే అలాంటి పాపాలన్నీ పోతాయని ఈ పురాణం చెప్తోంది.

ఈ పూజచేసినరోజున కేవలం శాకాహారాన్ని మాత్రమే తీసుకోవాలి. ఈ వ్రతాన్ని చతుర్వర్గ చింతామణి అనే గ్రంథంలో రక్షాపంచమి అని చెప్పారు. ఇది ప్రాయశ్చిత్తాత్మక వ్రతం.

స్మృతి కౌస్తుభం, పురుషార్థ చింతామణి, వ్రతరత్నాకరం అనే గ్రంథాలలో ఋషిపంచమి అనే వర్ణింపబడింది. ఉత్తరేణి చెట్టుకి పూజచేయడం ఒక విశేషం. ఉత్తరేణి పుల్లతోనే ముఖ ప్రక్షాళనాదికాలు చేసుకోవాలి.

పుంస్త్రీలు పసుపు వ్రాసుకోవాలి. వితంతువులు గోపీచందనం, పంచగవ్యాలు ఉపయోగించి స్నానం చెయ్యాలి.

సప్తఋషుల్ని అరుంధతీదేవితో సహా పంచమినాడు పూజించే పండుగే ఋషిపంచమి.

వివాహితలు భర్తృప్రేమను పొందాలని చేస్తారు. వితంతువులు ఇలాంటి కష్టం రాకూడదని మరుజన్మలో మంచిభర్త లభించాలని చేస్తారు. స్త్రీలందరూ చేసే వ్రతం ఋషిపంచమి.

---

1. **తిథిద్వయం:** ఒకేరోజున రెండు తిథులు వచ్చిన దానిని తిథిద్వయం అంటారు.
2. **త్రిద్యుస్పృక్:** ఒకే తిథి మూడురోజులలో కలిగి యుండుటను త్రిద్యుస్పృక్ అంటారు.

ఉదా: ఈరోజు సూర్యోదయము లోపల వచ్చి మరుసటి రోజు పూర్తిగా వుండి ఆ మరురోజు సూర్యోదయము తదుపరి ఉన్నట్లయితే ఆ తిథిని త్రిద్యుస్పృక్ అని వ్యవహరిస్తారు.

3. **అవమతిథి:** ఒకే రోజున మూడు తిథులు వచ్చుటను అవమతిథి అంటారు.

ఉదా: ఈరోజు సూర్యోదయమునకు ఒకతిథి ఉండి తదుపరి మరొక తిథి వచ్చి సూర్యోదయం లోపల వెళ్ళిపోయి మరొక తిథి రావటమును **అవమతిథి** అంటారు.

---

గీతామాహాత్మ్యకథలు - 14

# విక్రమ భేతాళుడు

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

ఈ మాసపు కథ భగవద్గీత 14వ అధ్యాయం గురించి పద్మపురాణంలో ఉన్నకథ. భగవద్గీత 14వ అధ్యాయం "గుణత్రయ విభాగ యోగం" కథా భాగంలోకి వెళ్ళేముందు ఈ అధ్యాయంలో శ్రీకృష్ణుడు ఏం చెప్పారో కూడా సంక్షిప్తంగా తెలుసుకుందాం.

ఈ ప్రకృతి సత్త్వరజస్తమోగుణాలతో కూడి ఉంది. అందువలన ఈ ప్రకృతిలో ప్రతిప్రాణి, ప్రతి వస్తువు కూడా ఈ మూడు గుణాల తోటే కూడి ఉంటుంది. మరి ఈ మూడు గుణాలు మనతో పాటే ఉంటే మనం ఆ గుణకర్మలనే చేస్తే వచ్చేఫలం ఎలాంటిది? అవి జీవుని కర్మ బద్ధుణ్ణి ఎలా చేస్తాయి? దానికి భగవానుడు ఇలా చెపుతున్నాడు.

**శ్లో ॥ కర్మణ స్సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలం ।**
**రజసస్తు ఫలం దుఃఖం అజ్ఞానం తమసః ఫలమ్ ॥**

సాత్త్విక కర్మలకు సుఖము, రజోగుణకర్మలకు దుఃఖము, తమోగుణకర్మలకు అజ్ఞానము కర్మ ఫలములు అని పెద్దలు చెప్పారు. మనకి ఈ లోకంలో ఉన్న సత్త్వరజస్తమోగుణాలకు సుఖ, దుఃఖ అజ్ఞానములే ఫలములవుతుండగా, మనం ఈ లోకంలో లేని ఆనందాన్ని వెతకడంలో అర్థం ఏముంది? ఆనందం అనేది మోక్షంలో కలిగే అనుభూతి. అంటే అది భగవంతుడి పాదాలు గట్టిగా పట్టుకుంటే వచ్చే ఫలం. దానిని ఈ లోకంలో వెతుకుతూ జీవితాన్ని వ్యర్థం చేసుకోవలసిన పనిలేదు. నిజానికి ఇవి 'మనం చేసే కర్మలకి ఫలం' అనుకుంటాం కాని, నిజానికి ఇవి మనం చేసే కర్మలు కావనీ కర్మలన్నింటిని ఆ ప్రకృతిలో ఉన్న త్రిగుణాలే చేసుకుపోతున్నాయి అంటున్నాడు పరమాత్మ, అవలోకించండి.

**శ్లో ॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి ।**
**గుణేభ్యశ్చ పరంవేత్తి మద్భావం సోఽధి గచ్ఛతి ॥**

సర్వకర్మలకు త్రిగుణముల కంటే అన్యుడైన కర్త వేరొక్కడు లేడని చక్కగా గ్రహించి, త్రిగుణములకు భిన్నుడుగా తనను తాను ఎరుగగలిగిన వాడు ఆత్మానందమును పొందు చున్నాడు.

ఈ అధ్యాయ మహిమగా పద్మపురాణంతర్గత కథా భాగంలోకి ప్రవేశిద్దాం.

పూర్వం కాశ్మీరదేశాన్ని శౌర్యవర్మ అనే రాజు పరిపాలి స్తూండేవాడు. అతనికి జాతి శునకాలను పెంచడంలో సరదా. వాటిని నగర రక్షణా కార్యక్రమాలలో కూడా వాడుతూ ఉండేవాడు.

శౌర్యశర్మకు సింహళదేశపు మహారాజు చిరకాల మిత్రుడు. అతని పేరు విక్రమ భేతాళుడు. ఈతడు మహా విక్రమ పరాక్రముడు, కళానిధి. ఈతనికి వేటయందు మక్కువ ఎక్కువ.

ఒకనాడు శౌర్యవర్మ విక్రమ భేతాళునకు ఒక మగ శునకాన్ని ఒక ఆడశునకాన్ని బహుమతిగా ఇచ్చాడు. కొంతకాలం తరువాత విక్రమ భేతాళుడు వేటకి వెళుతూ ఈ రెండుకుక్కలను కూడా తనతో తీసుకువెళ్ళాడు. కొంతవరకు వేటసాగిన తరువాత వారికి ఒక కుందేలు కనబడింది. అది ఈ శునకాలను చూడగానే ప్రాణభీతితో వేగంగా పరుగెత్తడం మొదలుపెట్టింది. ఆ కుందేలును చూచిన ఆడకుక్క కూడా పెద్దగా అరుస్తు సైనికుల చేతిలో పట్టుకున్న తాళ్లను గట్టిగా విదిలించుకుని ఆ కుందేలును తరుమసాగింది. రాజు సైనికులు ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ఆ కుందేలు పరుగెత్తి పరుగెత్తి ఒక ముని ఆశ్రమం వాకిట ఉన్న బురదగుంటలో పడి మునిగి మరణించింది. దానిని తరుముకుంటూ వెళ్లిన వేటకుక్క కూడా అదే బురద గుంటలో పడింది. మరణించిన ఆ కుందేలు ఒక పట్టుపీతాంబరాలు ధరించిన పురుషునిగా మారి తనకోసం వచ్చిన ఒక దివ్యవిమానాన్ని అధిరోహించి స్వర్గానికి వెళ్లిపోయింది. అదే బురద గుంటలోపడిన కుక్క మరణించక పోయినా తాను కూడా ఒక దివ్యాంగన రూపం ధరించి గంధర్వులు తెచ్చిన మరియొక దివ్యవిమానాన్ని అధిరోహించి స్వర్గానికి వెళ్ళిపోయింది.

ఈ దృశ్యాన్ని చూసి ఆ ముని ఆశ్రమంలో నిలిచియున్న ఆ ముని శిష్యుడు తనలో తాను నవ్వుకున్నాడు. ఈ విచిత్రాన్ని చూస్తున్న విక్రమ భేతాళుడు అత్యంత ఆశ్చర్యానికి గురియై తనసేనతో సహా ఆ ముని శిష్యుడి దగ్గరకు వెళ్లి భక్తితో ప్రణామం చేసి ఇలా అన్నాడు.

"ఓ మునీశ్వరా! నేను విక్రమ భేతాళుడను సింహళదేశపు రాజును. ఈ కుందేలు, కుక్కలు, నీచజన్మల నెత్తి కూడా అవి దివ్య రూపాలను ధరించి దివ్యలోకాలకు ఎలా వెళ్లగలిగాయి? తమరు దయతో ఈ విషయాన్ని వివరించి చెప్పండి"

దానికి ఆ మునీశ్వరుడు ఇలా చెప్పాడు. "రాజా! ఈ ఆశ్రమం

శ్రీవత్సుడనే మహామునికి చెందినది. వారు సద్బ్రాహ్మణులు. నాకు ఆచార్యులు. వారు జితేంద్రియులు. అనునిత్యం భగవద్గీత యందలి 14వ అధ్యాయాన్ని పఠించే నిత్య పారాయణ శీలి. ఆ అధ్యాయాన్ని వారివద్ద అభ్యసించిన నేను కూడా ఈ అధ్యాయాన్నే పారాయణ చేస్తుంటాను. మా ఆచార్యులు భగవద్గీతా పారాయణం చేసే ఉదయ మధ్యాహ్న, సాయం సమయంలో ఆచార్యులవారి పాద ప్రక్షాళన కార్యక్రమాన్ని నేనే స్వయంగా నిర్వహిస్తాను. అర్ఘ్య పాద్య స్నానాది కర్మలొనరించడం వలన ఏర్పడిన మడుగే ఈ మడుగు. ఇందులోనే కుందేలు పడి మరణించినది. ఈ మడుగు జలం వలననే ఆ కుందేలు, ఆడకుక్క కూడా ప్రక్షాళితమై ఉత్తమలోకాలను చేరాయి. ఆ బురద అంటుకున్నందుకే కుక్కకు కూడా ఊర్ధ్వలోకాలు లభించడం వలన నాకు చిన్న నవ్వువచ్చింది" అన్నాడు.

దానికి విక్రమభేతాళుడు పరమానందభరితుడై "స్వామి! ఇంతకీ ఈ కుందేలు, శునకం ఎవరు? ఎందుకు కుందేలు కుక్కను చూసి భయపడింది?" అని అడిగాడు దానికి ఆ శిష్యుడు నవ్వుతూ ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"రాజా! మంచి ప్రశ్నవేశావు. వీరి వైరానికి ఉన్న కారణం కూడా చెపుతాను విను. ఎందుకంటే అది కూడా నా చిరునవ్వుకు మరో కారణం. మహారాష్ట్రంలో పూర్వం ప్రత్యుదకం అనే నగరం ఒకటుండేది. ఆ నగరంలో ఒక బ్రాహ్మణ దంపతులుండేవారు. భర్త పేరు కేశవుడు. అతడు మహా కపటుడు, క్రూరుడు. అతని భార్యపేరు విలోభన. ఆమె దుర్వర్తనురాలు. తన సౌఖ్యం కోసం ఎంత డబ్బు అయినా విచ్చలవిడిగా ఖర్చు చేసేది. కాని ఇతరులకు ఇవ్వాలన్నా, దాన ధర్మాల విషయాల్లోనూ పరమ లోభంగా ఉండేది. చివరికి తన భర్తకు కూడా చిల్లిగవ్వ విదిలించేది కాదు. దాంతో విసిగిన కేశవుడు తన భార్యను గుట్టుచప్పుడు కాకుండా మట్టుబెట్టాడు. కొద్దికాలం తరువాత రోగగ్రస్తుడై తాను మరణించాడు. ఆ కేశవుడే ఈ కుందేలు, ఆ విలోభనయే ఈ శునకం. వాళ్ల జన్మలు మారినా, వైరం మాత్రం మర్చిపోలేదు.

ఆ జన్మ సంబంధ వైరం వలననే కుక్కచే కుందేలు తరుమ బడి రెండూ తమ ప్రాణాలను పోగొట్టుకున్నాయి. కాని వాటి భాగ్యవశముచేత ఈ మహాముని వాకిట నీటిచే సంప్రోక్షితమై ఉత్తమ లోకాల్ని పొందాయి"

ఆ మాట విన్న విక్రమ భేతాళుడు పరమానందాన్ని పొంది ఆ ముని శిష్యుణ్ణి సేవించి ఆతని వద్ద భగవద్గీత యొక్క 14వ అధ్యాయాన్ని అధ్యయనం చేసాడు. నాటినుండి ఆ రాజు ఆ అధ్యాయాన్ని భక్తితో పారాయణం చేసి ముక్తిని పొందాడు. అని శంకరుడు ఉమాదేవికి చెప్పి "దేవీ ఇది పూర్వము లక్ష్మీదేవికి శ్రీమన్నారాయణుడు చెప్పిన భగవద్గీతా చతుర్దశాధ్యాయ మహిమ" అని చెప్పాడు.

ఈ విషయాన్ని బోధించిన పద్మపురాణం ఈ అధ్యాయ పారాయణ ఫలాన్ని ఈ క్రిందిశ్లోకంతో వివరిస్తోంది. అవధరించండి.

**శ్లో ॥ చతుర్దశంతు అధ్యాయం జపామ ప్రత్యహం నృప**
**మదీయ చరణాంభోజ ప్రక్షాళన జలేలుఠన్ ।**
**శ్లో ॥ శశస్త్రి దివమాపన్న శ్శునక్యా సహభూపతే ॥**

"రాజా ! నేను నిత్యము భగవద్గీత 14వ అధ్యాయమును పారాయణ చేయడం వలన, నేను గురు పాద ప్రక్షాళన చేసుకునే మడుగు వద్ద ఈ శునకము, కుందేలు తమ జాతి వైరము మరచి ఆత్మస్థితిని చేరుకున్నవి. ఇదంతయూ భగవద్గీత యొక్క చతుర్ధశాధ్యాయ పారాయణ ఫలమే సుమా!"

ఈ కథ విన్న పార్వతీదేవి అచ్చెరువొందింది. భాగవతుల పాదప్రక్షాళనా జలానికి ఇంత మహిమ వచ్చిందంటే అది భగవద్గీతా మహిమే కదా అని తలచుకుని తలచుకుని ఆనందించింది.

మరి ఇంతటి మహిమాన్వితమైన భగవద్గీతా పారాయణను మనమూ ఆరంభిద్దామా!

# మదర్ టించర్స్

డా॥ జి. రామారావు-9440884396

## అశ్వగంధ

## (ASWAGANDHA)

ఆయుర్వేద వైద్యంలో అశ్వగంధ ఉపయోగము ప్రాచీన కాలమునుండి ఉన్నది. ఆయుర్వేద వైద్యులు ఒక వ్యాధికి ఉపయోగించిన ఔషధములు సత్ఫలితములు ఇవ్వని సమయంలో అశ్వగంధని వాడుదురు. మాయ (ఏమీ తెలియని) రోగమునకు అశ్వగంధ ఔషధము.

మూలికల సేకరణలో ఒక గొప్ప విషయము తెలిసినది. ఒక ఆయుర్వేద వైద్య ఉపాసకుడు విజయవాడ దగ్గర కృష్ణానది తీరంలో అశ్వగంధ పెంచెను. పరిపక్వదశలో దాని ఔషధ గుణములు శాస్త్రీయముగ పరిశోధించగా ఆతడు పెంచిన అశ్వగంధ మొక్కలలో ఏ మాత్రము అశ్వగంధ ఔషధ లక్షణములు లేవు. దీనిని బట్టి ఏ మూలిక అయినను ప్రకృతి వడిలో ఏ ప్రదేశంలో ఎక్కువగా పెరుగునో అక్కడి మొక్కలు మాత్రమే సంపూర్ణ ఔషధ లక్షణములు కలిగి ఉండునని తెలియుచున్నది. కనుక ఔషధ వృక్షములను పెంచువారు ఆయాప్రాంతములనే ఎన్నిక చేసుకొనుట ఉత్తమము.

హోమియో వైద్యంలో మానసిక స్థితిని మెరుగుపరచుటకు ఈ ఔషధము మిక్కిలి ఉపయుక్తముగా ఉన్నది. అనగా రోగులలో మానసిక స్తబ్ధత, ఎట్టి చైతన్యములేక పరుండుట, ఎట్టి ఉత్తేజకరమగు వాటికి ప్రతిక్రియ చూపకుండుట, తెలివి తక్కువగానుండుట అను లక్షణములు కన్పించినచో అశ్వగంధ వారిని స్వస్థత పరచును. అశ్వగంధ ఒక మంచి టానిక్. ఇది జ్ఞాపకశక్తి పెంపొందించును. విశదీకరించు నైపుణ్యమును కలుగుచేయును. విద్యార్థులకు ఏకాగ్రతను కలుగుచేయును. కండరాల శక్తినిపెంచును. యువకుల లో శుక్ర కణములను అభివృద్ధి చేయును. సిఫిలిస్, గనేరియా అణగదొక్కబడినప్పుడు వచ్చు వ్యాధులలో అశ్వగంధను ఎక్కువ కాలము వాడవలసివచ్చును.

సాధారణంగా కలుగు నీరసము, శక్తిహీనత, వంధ్యత్వము (Sterility), ఋతు సంబంధిత బాధలు, రక్తస్రావములు, అధిక రక్తపోటు మొదలగు వ్యాధులకు అశ్వగంధ టానిక్ వలె పనిచేయును.

ఎయిడ్స్, కేన్సర్ రోగులకు రోగనిరోధక శక్తిని పెంపొందింపజేయుటలో అశ్వగంధ వాడకం ప్రయోజనం చేకూరుస్తుంది. 5 నుండి 10 చుక్కలు పావు కప్పు నీటిలో కలిపి మూడు పూటలా ఈయదగును.

## విరోచనమగునట్లు చేయు మందులు

## (LAXATIVES)

జీవన విధానము, ఆహారపుటలవాట్లు అతిముఖ్యము. జంతువుల నుండి తీసికొన్న ఆహారము మలబద్ధకమును కలుగజేయును. బాగుగాపండిన పండ్లు డ్రైఫ్రూట్స్, మజ్జిగ, రాత్రి నిద్రబోవుటకుముందు నిద్రలేచిన తర్వాత మంచినీళ్ళు త్రాగుటలు సుఖవిరోచనమునకు తోడ్పడును. తగిన వ్యాయామము అవసరము. ఎండుఖర్జూరం నెల రోజులు క్రమంగా తింటే మలబద్ధకముండదు. పావుకప్పు నీళ్ళలో అవిశ గింజలు అరస్పూను నానవేసి అందులో నిమ్మరసము, తేనె కలిపి పరగడుపున అవిశ విత్తనాలు నమిలి, మిగిలిన మిశ్రమమును త్రాగిన సుఖ విరోచనము కల్గును - ఏదేని పండ్లరసములో, తేనె కొంచెం వేడినీళ్ళు కలిపి త్రాగిన మలబద్ధకమును పోగొట్టుకొనవచ్చును.

### సునాముఖి

### (Indian Senna)

ఇండియాసెన్నాను తెలుగులో సునాముఖి అందురు. Senna రకాలు దాదాపు దేశవిదేశాలలో 350 రకాలున్నాయి. చిన్నచిన్న పొదలులాగా పెరుగును. ఈ మొక్కలపై అనేక పరిశోధనలు జరిగినవి మరియు జరుగుచున్నవి.

అలంకరణకు, జుట్టుకు చేయు వైద్యములో హెన్నాలాగ ఉపయోగించుచున్నారు. మనదేశమున ప్రాచీన కాలమునుండి సునాముఖి ప్రజలలో విరోచన ఔషధముగా ప్రాచుర్యము పొందిన మూలిక.

ఇండియన్ సెన్నా మనదేశంలో తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, గుజరాత్ మరియు మహారాష్ట్రలలో సాగుచేయు చున్నారు. సెన్నా తీవ్రత గల్గిన విరోచనకారి. Tanninacid లేకపోవుటచే నాళములు లేక ధాతువులు దగ్గరకు ముడుచు కొనవు. విరోచనము కల్గించిన తర్వాత మలబద్ధకమురాదు.

పసిపిల్లలకు కడుపుబ్బరము కలిగినప్పుడు, వాయువు నోటిద్వారా త్రేన్పులుగాను, గుదముద్వారా అపాన వాయువు గాను పోవును. కాని అసాధారణముగా జీర్ణాశయములో బంధింపబడి

శూల కలుగజేయును. ఆస్థితిలో వాళ్ళు నిద్రపట్టక అసహనముతో నుందురు. విపరీతముగా తుమ్ములు వచ్చును. నత్రజని అధికమగుటచే తేలికగా అలసట కల్గును.

ఆహారస్వీకరణ తర్వాత కూడా నీరసము కన్పించును. తలబరువు, వరుస తుమ్ములు వేడిపుట్టించును. పెదవులు పాలిపోయి యుండును. వికారము వాంతిచేసుకొనవలసి వచ్చుట గల్గును. శరీరమునుండి అపరిశుభ్రమగు వాసన వచ్చును గుదము జారి మంట పుట్టును. మలబద్ధకము కలుగును. కాలేయము పెద్దదగును. ఆకుపచ్చని జిగురు పదార్థము విరోచనమగును. ఆకలిమందగించును. మూత్రపు సాంద్రత హెచ్చును. వారికి సెన్నా మిక్కిలి ఉపయోగపడు ఔషధము.

**కారిక పాపయ**

**(Caricapapaya)**

బొప్పాయి హిందూదేశములో పెరెన్నిక గన్న చెట్టు. కాయలను కూరచేసుకొందురు పండ్లుతిందురు. బజారులో అన్ని కాలములలో ఈ పండ్లు లభించును. అమెరికా, చైనా, మెక్సికో మరియు ఉష్ణమండలములోని వ్యవసాయ క్షేత్రములలో ఈ చెట్లను పెంచుచున్నారు. ఇది ప్రజల ఔషధముగా ప్రాచుర్యము పొందినది.

గర్భస్రావము, అజీర్ణము, కంటికలక, కాలేయము వాచుట, ప్లీహము (Spleen), గర్భాశయ వ్యాధులందు Carica papaya పని చేయును.

కడుపుకు, ప్రేగులకు సంబంధించిన లక్షణములలో కాలేయము, ప్లీహము వాపుతో జ్వరమువచ్చుట, అజీర్ణము, అరుగుదల తగ్గుట, జీర్ణముకాని ఆహార పదార్థములు మలము ద్వారా అధికముగా వెడలుట, నాలుక తెల్లగా మారుట, పాలయందయిష్టత, నెలకొనియుండును. కారిక పాపయ అరుగుదలను పెంచి శరీరమునకు స్వస్థతను చేకూర్చును. స్తన్యమును వృద్ధిచేయును. ఋతు దోషములను పోగొట్టును. 5 నుండి 10చుక్కలు పావు కప్పునీళ్ళలో ఉదయం, రాత్రి బాధలు తగ్గువరకు మాత్రమే వాడవలయును.

వచ్చేనెల **ఎబ్రోమ అగష్ట** **(Abroma augusta)** గురించి తెలుసుకుందాం! *(ఇంకా ఉంది)*



రాయల ఊరేల పల్లకి....

# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

విల్లిపుత్తూరులో వటపత్రశాయికి రకరకాల పుష్పమాలికలు సమర్పిస్తూ శ్రీహరి కైంకర్యం చేసుకుంటూ ఉన్నారు విష్ణుచిత్తుల వారు. అష్టాక్షరిని అనుసంధిస్తూ ఒకనాడు విష్ణుచిత్తులు వటపత్రశాయికి పుష్పమాల సమర్పిస్తున్నారు. అప్పుడా మన్నారుస్వామి విష్ణుచిత్తులతో మధురలో జరుగుతున్న వాదసభలు గురించి ఆరాజుకు కలిగిన వైరాగ్యాన్ని గురించి ఎరిగించాడు...

"ఓయీ! మహాప్రాజ్ఞుడా! నువ్వు వెంటనే మధుర వెళ్ళాలి. పాండ్యరాజు సభలో పండితులు కొందరు చేరి ఏవేవో దుర్వాదాలు చేస్తున్నారు. గర్వంతో కన్నూమిన్నూ కానక కలరూపు తెలియక కారులు పలుకుతున్నారు. తాము అజ్ఞానంలో పడి కొట్టుకోవడంతో పాటు వాస్తవం తెలుసు కుందామని ఆర్తితో ముందుకొచ్చిన పాండ్యరాజును కూడా తమ దుర్వాదాలతో అపమార్గం పట్టించాలని చూస్తున్నారు.

వారి నోరుమూయించి, నా తత్త్వాన్నీ, నామహత్త్వాన్నీ ప్రకటించి వాడు సభలో కట్టేడే బంగారునాణేలమూట – దాన్ని నువ్వు స్వీకరించాలి. వాడికి ఇహలోక ప్రవృత్తి మీద విరక్తి కలిగింది. ఇదే సరైన అదును. అతడిని విష్ణుభక్తుణ్ణి చేసి తరింపచెయ్యి" అన్నాడు.

అది విని విష్ణుచిత్తులవారు "స్వామీ! నేనింతవరకూ ఏ శాస్త్రాలూ వేదాలూ మరే గ్రంథాలూ చదవడం మాటటుంచి కనీసం చూడనైనా చూడలేదు. పూలతోటలో మొక్కల కోసం నేల గొప్పులు తవ్వి తవ్వీ నాచేతులు కాయలు కాచి మొరటుబారినై. ఇది తప్ప మరోటి ఎరగని అజ్ఞానిని. దేవరవారి కోవెల పరిచారకుణ్ణి. నన్ను వాదంకోసం పంపిస్తే రాజసభలో పండితులతో శాస్త్రచర్చలు ఏం చేస్తాను? వారినెట్లా జయిస్తాను? అక్కడ నేనోడిపోవడం మీకు అపకీర్తి కాదా?

దాసుడికి తెలిసిందల్లా దేవరవారి కైంకర్యం చేసుకోవడం మాత్రమే! కోవెల తుడవమన్నారా చక్కగా తుడుస్తాను. తిరుమంజనతీర్థం కావాలన్నారూ తీసుకొస్తాను. దేవరవారు అమ్మవార్లతో సాయం విహారాలకు వెళతా మంటే ఆ అందాలపల్లకి మోస్తాను. సరేసరి వనమాలికలు నిత్యం సమర్పిస్తూనే ఉన్నాను. ఇంకా విశేషంగా సమర్పిస్తాను. ఇక్కడ సేవకుణ్ణి కనుక సేవాభాగ్యంగా దేవరవారి ప్రభుత్వ లాంఛనంగా ధ్వజం పట్టుకుంటాను. శ్రమ పోగొట్టడానికి వీవనపట్టుకు విసురుతాను. ఎండ తగలకుండా గొడుగు మోస్తాను. మీ సన్నిధికి తిరువిళక్కు సమర్పిస్తాను. నరహరీ! నాకు వాదాలేమిటయ్యా? నీ లీలకు మరెవ్వరూ దొరకలేదా స్వామీ! తగినవారినెవరినైనా అక్కడికి పంపు తండ్రీ!" అన్నారు విష్ణుచిత్తులు.

"నీ ఇష్టమేమిటయ్యా? మారాడక మెదలకుండా మధుర పోయిరా! రాజ్యసభలో నువ్వు గెలిచేట్టు నే చూసుకుంటాను. ఇహనేం అడ్డాలు చెప్పకు–నువ్వు పోయిరా. తరువాత చూసుకుందుకు నేనున్నాను కదయ్యా" అన్నాడు వటపత్రశాయి.

మన్నారుస్వామి ఇల్లా అనేటప్పటికి మారుపలక భయపడి "సరే స్వామీ! నీ చిత్తం ఎల్లా ఉంటే అల్లానే కానీ, వెళతానులే మధురకు" అన్నారు విష్ణుచిత్తులు.

విష్ణుచిత్తుల మాటవింటూనే వటపత్రశాయి అర్చక స్వామితో 'విష్ణుచిత్తుల ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు చేయించండి' అన్నాడు.

హరి ఆజ్ఞ పొంది అర్చకస్వామి ఆలయాధికారికి నివేదించాడు. ఆయన శ్రీభండారం నుంచి ప్రయాణానికి కావల్సిన దారిబత్తేలను సమకూర్చేడు. తనకున్న పాతపల్లకీని ఇచ్చి మోయడానికి బోయీలను పంపేడు.

ప్రయాణంలో బరువులు మోయగల మంచిబలమైన గుఱ్ఱాలని అద్దెకు తీసుకున్నారు. వాటిమీద ఇటు అటూ మూటలు వేలాడే మాత్రసంచులు పెట్టేరు.

ఆ గుఱ్ఱాలకిరుప్రక్కలా బంధువులు, బంధాలను విడిచి కావిబట్టలు కట్టుకుని కైంకర్యం కావించే ఏకాంగులు నడుస్తూ ఉంటే స్వామికి నివేదించిన ప్రసాదపు అరిసెలు రాజుగారికి ఇవ్వడం కోసం కావిళ్ళలో పెట్టించుకుని విష్ణుచిత్తులు మధురకు ప్రయాణమయ్యారు.

విష్ణుచిత్తులవారి ఇల్లాలు బహు యోగ్యురాలు మహాపతివ్రత. భర్త అడుగులకు మడుగులొత్తే సుశీల. ప్రయాణంలో దారిలో ఆయనకు ఇబ్బందిలేకుండా ఏవేవో సంచుల్లో సర్దింది. రాయి, పొల్లు లేకుండా ఎసటిపోతలుగా బాగుచేసిన పాతశాలిబియ్యం

క్షేమ తండులాలుగా పెట్టింది. ప్రయాణంలో వట్టిచేత్తో పోకుండా ఇంట్లోంచి కాసిని బియ్యం మూటకట్టుకు వెడితే క్షేమమని అల్లా పట్టుకు వెళ్ళేవారు. ఆ బియ్యాన్ని క్షేమతండులాలు అంటారు.

పిక్కలేకుండా శుభ్రపరిచి జీలకర్ర, బెల్లంవేసి దంపి ఉండలు కట్టిన చింతపండు పెట్టింది. ఆవునేతిబిందెలు కావిళ్ళ కెత్తింది. పెరుగువడియాలు, పచ్చివరుగులు, పప్పులూ పెట్టింది. పెరుమాళ్ళ తిరువారాధన పరికరాలున్న పెట్టెలు అమర్చింది.

వీటన్నింటినీ అందరూ ముట్టుకోకూడదు. తాపం, పుండ్రం, నామం, మంత్రం, యాగం – ఈ ఐదింటినీ పంచసంస్కారా లంటారు. తప్త శంఖచక్ర ముద్రలు భుజాల ధరించడం తాపం. పుండ్రం తిరుమణి తిరుచూర్ణాలు కేశవాది ద్వాదశనామాలతో శరీరంపై పన్నెండు స్థలాల్లో ధరించడం. వీటినే ద్వాదశోర్ధ్వపుండ్రాలంటారు. వైష్ణవ నామాన్ని దాసపదంతో కలిపి పెట్టుకోవడం నామసంస్కారం. అష్టాక్షరి, ద్వయమంత్రం, చరమమంత్రం అనే వాటిని ఉపదేశం పొందడం మంత్ర సంస్కారం. భగవంతుణ్ణి ఆరాధించే విధానాన్ని తెలుసుకోవడం యాగసంస్కారం. ఈ పంచసంస్కారాలూ పొందిన ద్విజులు శాత్తినవారు, ఇది పొందిన ద్విజేతరులు సాత్తనివారు. అని వ్యవహారం. కాని ఇప్పుడు అబ్రాహ్మణులలో ప్రత్యేకించి ఒక కులంవారిని సాతాని (సాత్తని) అని వ్యవహరిస్తున్నారు. ప్రయాణంలో పదార్థాల్ని అందరూ అన్నింటినీ ముట్టుకోకూడదు. కొన్నింటిని సాత్తనివారు తేవచ్చును. కొన్నింటిని శాత్తినవారే తేవాలి. ఈ తేడాలు గమనించి ఏ పదార్థాల్ని ఎవరు తేవాలో దానికి తగిన కట్టుబాట్లు చేసేరు. ఆ ప్రకారమే విష్ణుచిత్తులవారి మధుర ప్రయాణం సాగింది. *(ఇంకా ఉంది.)*

శ్రీరామచంద్రాచార్య



## పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



శ్రీమత్పరమహంసపరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి చాతుర్మాస్యదీక్ష, ఈ సంవత్సరం 03-07-2012 గురుపూర్ణిమ నాడు శ్రీదివ్య సాకేతంలో వేంచేసియున్న పెరుమాళ్ళసన్నిధిలో (జీవాప్రాంగణంలో) ప్రారంభమయింది. గురుపూర్ణిమ సందర్భంగా శ్రీస్వామివారు వేదవ్యాస భగవానుడు వైదిక వాఙ్మయాన్ని లోకానికందించిన పద్ధతిని, ఆచార్యుల మహిమను సరళమధురమైన భాషలో విశదంగా వివరిస్తూ భాగవతోత్తములందరికి మంచి సందేశాన్ని కృపచేసారు.

దీక్ష ప్రారంభమయినరోజునుండే శ్రీశ్రీశ్రీ స్వామివారి ఛాందోగ్యోపనిషత్ప్రవచనములు, శ్రీ ఉ॥వే॥ డా॥ యస్.వి.రంగ రామానుజాచార్యస్వామివారి శ్రీవిష్ణుపురాణ ప్రవచనము, శ్రీ ఉ॥వే॥శ్రీమాన్ నేపాల్ శ్రీకృష్ణమాచార్యస్వామి గురుపరంపరాప్రభావ ప్రవచనము ప్రతిరోజు దివ్యసాకేత మణ్డపంలో కొనసాగుతూనే ఉన్నాయి.

విశేషించి శ్రావణమాసపు ఐదు శుక్రవారాలలో అమ్మవారి సమక్షంలో శ్రీయాగము, విశేషహోమాలు, అర్చన, తాయార్ల వైభవప్రవచనములు శ్రీస్వామివారి మార్గదర్శనంలో అతిభవ్యముగా జరిగాయి. ఎంతోమంది భాగవతోత్తములు, మహిళామతల్లులు, వరలక్ష్మీవ్రతాన్ని సామూహికంగా చాలా ఉత్సాహంగా జరుపుకున్నారు.

ఈ శ్రావణమాసం శుక్రవారంతోనే ప్రారంభమై శుక్రవారం తోనే సమాపనమవడం ఒక విశేషం.

23-07-2012 న ఆండాళ్ తిరునక్షత్రోత్సవము తత్సందర్భంగా పెద్దల ప్రవచనములు, తిరువీధి ఉత్సవ వేడుకలతో వైభవంగా జరిగినది. శ్రీగోదాదేవివైభవాన్ని గురించి శ్రీస్వామివారు స్పష్టంగా వివరించారు.

25-07-2012 రోజున శ్రీనరనారాయణజయన్తి భవ్యంగా జరిగింది. శ్రీనరనారాయణుల వైభవాన్ని, అష్టాక్షరీమంత్ర మహిమను, ఆ క్షేత్రగౌరవాన్ని, మంత్రాన్ని గూడ లోకానికందజేసిన శ్రీమత్పరమహంస పరివ్రాజకులైన శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారి అతిమానుషవైభవాన్ని గూడ విస్తృతంగా శ్రీస్వామివారు ప్రవచించి భక్తులననుగ్రహించారు.

01-08-2012న శ్రావణపూర్ణిమసందర్భంగా మన వేదవిద్యార్థులకు ఉపాకర్మ, తదంగంగా జప, హోమ, వేదాధ్యయనములు సామూహికంగ దివ్యసాకేతమండపంలో శ్రీస్వామివారి సమక్షంలో భవ్యంగా జరిగాయి. ఆ రోజు శ్రీహయగ్రీవ జయన్తి సందర్భముగా శ్రీస్వామివారు కూడాఉండి గురుకుల-నేత్రవిద్యాలయవిద్యార్థులద్వారా సామూహిక హయగ్రీవపూజ చేయించారు.

02-08-2012 నుండి 06-08-2012 వరకు ప్రాతః స్మరణీయులైన శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్దజీయర్‌స్వామివారి తిరునక్షత్రమహోత్సవాలు, వేద-ఇతిహాస-పురాణ-దివ్యప్రబంధాది గ్రంథపారాయణ పురస్సరంగా వారి అర్చారూపం వేంచేసియున్న నడిగడ్డపాలెం క్షేత్రంలోను, దివ్యసాకేతంలోను ఒకేసారిగా ప్రారంభమయ్యాయి.

కొన్నిరోజులుగా భాగవతోత్తములంతా మిక్కిలి ఆర్తితో ప్రతీక్షిస్తున్న శ్రీపెద్దజీయర్‌స్వామివారి అర్చావిగ్రహము, కుంభకోణక్షేత్రంలో సిద్ధమై, అక్కడ వేంచేసియుండే ఆరావముదన్, (సార్ఙ్గపాణి) రామర్ మొదలైన పెరుమాళ్ళ సన్నిధానాల్లో అనుగ్రహాన్ని పొంది భాగవతోత్తములద్వారా దివ్యసాకేతానికి చేరగా శ్రీచిన్నజీయరుస్వామివారి ఆజ్ఞప్రకారం నడిగడ్డపాలెం సన్నిధానానికి ఆ శ్రీవిగ్రహాన్ని చేర్చి అధివాసాదిప్రతిష్ఠాన్త కార్యక్రమాన్ని శ్రీముదుంబై మధుసూదనాచార్యస్వామి ప్రభృతులైన ఆగమ విద్వాంసుల ద్వారా అక్కడ జరిపి పునః శ్రీస్వామివారి అర్చామూర్తిని దివ్యసాకేతానికి వేంచేపుచేసారు.

వైదికవిద్యార్థులతో, విద్వాంసులతో, భాగవతోత్తము లతో కలిసి శ్రీచిన్నజీయర్‌స్వామివారు ఛత్రచామరాదులతో, వాద్యవిశేషములతో, వైదికస్వస్తివచనములతో శ్రీసాకేతరాముని మర్యాదలను శ్రీఆళ్వారాచార్యుల మర్యాదను వారికందజేసి, రెండో అంతస్తులో శ్రీరంగనాథ- శ్రీగోదారంగమన్నార్ పెరుమాళ్ళ

మర్యాదలను స్వామికి ప్రసాదించి, మూడో అంతస్తులో వేంచేసి యున్న శ్రీవైకుణ్ఠనాథపెరుమాళ్ళ మర్యాదను కూడా ప్రసాదించి వైభవోపేతముగా పల్లకిలో ప్రదక్షిణముగా శ్రీస్వామి వారిని సాకేతమండపానికి వేంచేపుచేసారు.

ప్రతిరోజు ఉదయం సాయంకాలం వేద-ఇతిహాసాది పారాయణలు, శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారిని గురించిన విశేషప్రవచనాలు, ఉదయం తిరుమంజనము, సాయంకాలం తిరువీధి ఉత్సవములు వైభవోపేతముగా జరిగాయి. మన భక్తులు, వైదికఛాత్రులు చాలా ఉత్సాహముతో, సేవాభావంతో కార్యక్రమాన్ని శ్రీస్వామివారి నేతృత్వంలో నిర్వహించారు

ఈ ఉత్సవాల్లో ఒకరోజు సాయంకాలం యశోద హాస్పిటల్ నిర్వాహకులైన శ్రీమాన్ సురేందర్‌రావుగారు తమ డాక్టర్‌బృందంతో విచ్చేసారు. సమీపకాలంలోనే మన దివ్యసాకేతక్షేత్రంలో ఒక జిమ్స్ (JIMS) అనే హాస్పిటల్ తయారుకాబోతోంది. అల్లోపతి పద్ధతిలో రోగాన్ని పరీక్షించి, హోమియోపతి పద్ధతిలో సేవలను అందించాలని శ్రీస్వామివారు సంకల్పించారు. శ్రీస్వామివారు వారందరిని సంబోధిస్తూ ఈ హాస్పిటల్ విషయంలో చర్చించారు. శ్రీమాన్ డాక్టర్‌గారు తమవంతుసేవలను అందిస్తామని చెప్పారు.

06-08-2012న శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి తిరునక్షత్రమైన ఉత్తరాభాద్ర రోజున విశేషతిరుమంజనము, ప్రవచనం, శ్రీస్వామివారికి సామూహికఅష్టోత్తరశతనామార్చన, శాత్తుముఱై, తిరువీధ్యుత్సవాలతో కార్యక్రమం సుసంపన్న మైంది. శ్రీపెద్దజీయరుస్వామివారి విగ్రహ నిర్మాణకైంకర్యంలో తమతమ పవిత్రద్రవ్యాలనర్పించిన ఉదారులైన భాగవతోత్తములు ధన్యులు. వారందరికి శ్రీస్వామివారు అనేకానేక మంగళాశాసనాలు చేసారు.

జూలై 6,18, మరియు ఆగష్టు 5వ తేదీలలో శ్రీస్వామివారు భక్తులకు పంచసంస్కారదీక్షను ప్రసాదించారు.

15-08-2012వ రోజున మన భారతదేశమంతా మహోత్సాహంతో జరుపుకొనే స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంగా గురుకుల-నేత్రవిద్యాలయవిద్యార్థులను, అధ్యాపకులను, భక్తబృందాన్ని, సమస్త ప్రజానీకాన్నీ ఉద్దేశించి సారగర్భితమైన సందేశాన్ని అనుగ్రహిస్తూ శ్రీస్వామివారు జీవాప్రాంగణంలో జాతీయపతాకాన్ని ఆవిష్కరించారు. ఆ సందర్భముగ విద్వాంసులు, మన విద్యార్థులు కూడా సమయోచితములైన సంగ్రహసందేశాలను అందించారు.

19.8.2012 తేదీన శంషాబాద్ జీవా ప్రాంగణంలో అమెరికానుండి వచ్చిన చి॥వంశీ-రాహుల్ అనేవారు ఇచ్చట విద్యార్థులతో అభిప్రాయ వినిమయ సమావేశం నిర్వహించారు.

వీరిద్దరు అమెరికా వైట్‌హౌస్‌లో పర్యావరణ పరిరక్షణ విషయంలో ఇచ్చిన ప్రజెంటేషన్‌ను ఇక్కడి వారికి చూపించి విద్యార్థులను ఇలాంటి సేవా కార్యక్రమాల్లో పాల్గొనాలని ప్రేరేపించారు. సుమారు 10మంది విద్యార్థులు ఈ సందర్భముగా తమ అనుభవాలను గోష్ఠితో పంచుకున్నారు.

చి॥ రాహుల్ USAలోని మన VT సేవాసంస్థ అధ్యక్షులయిన పూర్ణచంద్రరావుగారి కుమారులు.

చి॥వంశీ VT సేవా మాజీ అధ్యక్షులయిన హరి ఇప్పనపల్లిగారి కుమారులు.

20-08-2012న లోకకళ్యాణార్థమై తమ అనుగ్రహ పాత్రులైన శ్రీశ్రీశ్రీ వ్రతధరరామానుజ జీయర్‌స్వామివారు ఎగ్జిబిషన్‌గ్రౌండ్స్, నాంపల్లిలో నిర్వహిస్తూన్న 108కుండాత్మక లక్ష్మీనారాయణయాగానికి వేంచేసి, మంగళాశాసనపూర్వకంగా ఉపదేశాత్మకమైన సుమధురసందేశాన్ని భక్తులకందజేసారు శ్రీస్వామివారు. ఇదే మైదానంలో 1975లో 5వస్వాధ్యాయ జ్ఞానయజ్ఞమున్ను, 1976వ సంవత్సరంలో 18వ స్వాధ్యాయజ్ఞానయజ్ఞమును 2000మంది యజమానుల ద్వారా శ్రీమద్భాగవత సప్తాహకార్యక్రమమును ప్రాతఃస్మరణీయులైన శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారు అద్భుతముగా నిర్వహించిన మధుర స్మృతులను శ్రీచిన్నజీయరుస్వామివారు రసవత్తరముగా శ్రోతలకు వివరించారు.

ఈ దీక్షాకాలంలో మహబూబ్‌నగర్ వికాసతరంగిణి సభ్యులందరూ శ్రీవారి మంగళాశాసనములతో జీవా ఆశ్రమములో అఖండ హరినామ సంకీర్తన జరపాలని నిర్ణయించి, గోష్ఠులుగా ఈ కార్యక్రమాన్ని జరిపిస్తున్నారు.

శ్రీకృష్ణాష్టమి, విఘ్ననివారణ చతుర్థీ మొదలైన ఉత్సవాలు ఈ దీక్షాకాలంలో జీవా, శ్రీరామనగరంలో జరుగుతాయి.

అంతే కాకుండా **సెప్టెంబర్ 22 తేదీలలో పంచసంస్కారాలు** (సమాశ్రయణములు) జరుగుతాయి.

శ్రీస్వామివారు సెప్టెంబర్ 30వ తేదీ చాతుర్మాస్య దీక్షానంతరం సాయంత్రం మధుర, (ఉత్తరప్రదేశ్) దగ్గర బృందావనం చేరుకుంటారు.

**బృందావనంలో సంరక్షణకుండ్ జీర్ణోద్ధరణ:** ఇచ్చుట భక్తులు 84 క్రోసుల దూరము కలిగిన గోవర్ధనగిరికి ప్రదక్షిణ చేస్తూంటారు. బృందావనంలో చాలా చారిత్రక చిహ్నములు శిథిలమై పోతున్న వాటిని జీర్ణోద్ధరణ చేయు సంకల్పముతో శ్రీమాన్ వినీత్ నారాయణ అనే మహానుభావుడు 'వ్రజ్ ఫౌండేషన్' అను దానిని స్థాపించి, దాని ద్వారా సంకర్షణకుండ్ అనే దానికి శ్రీమాన్ డా॥ రామేశ్వరరావుగారు (హైదరాబాద్) జీర్ణోద్ధరణకు సహాయాన్ని అందిస్తున్నారు. శ్రీ జీయరు స్వామివారి కరకమలములద్వారా అక్టోబర్ 1న శంకుస్థాపన జరుగును. కార్యక్రమానంతరం శ్రీస్వామివారు రాజస్థాన్‌లో అల్వర్ నగరానికి చేరుకొంటారు.

2వ తేదిన పూజ్యశ్రీ కోసలేంద్ర ప్రపన్నాచార్య స్వామి (ఫలహారీస్వామి) వారి వేదపాఠశాలలో జరిగే కార్యక్రమాలలో పాల్గొని మంగళాశాసనం చేస్తారు.

శ్రీ ఫలహారీ స్వామివారు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో అల్వర్ నగరంలో చతుర్వేద పాఠశాలను నిర్వహిస్తున్నారు. చక్కని వసతులతో కూడిన ఈ పాఠశాలలో 50మంది విద్యార్థులు వేదవిద్యనభ్యసిస్తున్నారు.

అక్కడ నుండి ఢిల్లీ చేరుకొని శ్రీమాన్ శ్రీనివాస్‌గారి పుట్టిన రోజు సందర్భముగా మంగళాశాసనము గావించి ఋషీకేష్ చేరుకొంటారు.

## నేత్రవిద్యాలయ వార్షికోత్సవం

జూనియర్&డిగ్రీ కాలేజీ నేత్ర విద్యాలయాల వార్షికోత్సవం
ఈ ఆగస్టు 30వ తేదీన
జీవా ప్రాంగణంలో జరుగుతుంది.

## సీతానగరం - వేదవిశ్వవిద్యాలయం

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములతో..

సీతానగరం వేదవిశ్వవిద్యాలయంలో పవిత్రమైన ఈ శ్రావణ మాసంలో పలు కార్యక్రమాలను వేద ఆగమ అధ్యాపకులు, విద్యార్థులు ఎంతో వైభవంగా జరుపుకున్నారు.

ముఖ్యంగా వేదవిద్యార్థులు ఆరాధించే హయగ్రీవ పెరుమాళ్ళ జయంతిరోజున ఉదయాన్నే హయగ్రీవ స్వామికి నవకలశస్నపనం సమర్పించి, అష్టోత్తర శతనామావళి చేసి హయగ్రీవ వైశిష్ట్యాన్ని అధ్యాపకులద్వారా తెలుసుకున్నారు.

శ్రావణమాసంలోని ప్రతిశుక్రవారం ఉదయంపూట లక్ష్మీ అమ్మవారికి అభిషేకం సాయంత్రం విద్యార్థులంతా కలిసి శ్రీ లక్ష్మీ సహస్రనామావళిని సామూహికంగా జరిపారు.

శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి సువర్ణవిగ్రహం నడిగడ్డపాలెం నుండి సీతానగరం ఆశ్రమానికి వేంచేయటం జరిగింది. వారికి వేద ఆగమ విద్యార్థులు స్వాగతం పలుకుతూ హయగ్రీవ సన్నిధిలో శ్రీస్వామివారికి అష్టోత్తర కార్యక్రమాన్ని జరిపారు. శ్రీమాన్ మధుసూదనాచార్యులు(ఆగమ అధ్యాపకులు) శ్రీ పెద్ద జీయరు స్వామివారి వైభవాన్ని తెలిపారు. శ్రీ పెద్ద జీయరు స్వామివారి తిరునక్షత్రోత్సవాన్ని మూడురోజులపాటు కన్నుల పండుగగా జరుపుకున్నారు.

## నడిగడ్డపాలెం బృందావనంలో
## శ్రీపెద్దజీయరుస్వామివారి 104వ తిరునక్షత్రవేడుకలు

శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి దివ్య తిరునక్షత్రోత్సవం 1వ తేదీ నుండి 6వ తేదీ వరకు అత్యంత వైభవోపేతంగా జరిగింది. ఈ సందర్భంగా శ్రీ ఆంజనేయ స్వామికి జరిగిన లక్షతమలపాకుల అర్చన అందరినీ విశేషంగా ఆకర్షించింది.

ప్రతిరోజూ స్వామివారికి నవకలశ స్నపన తిరుమంజనం, రాత్రి పెరుమాళ్ళకు శ్రీశ్రీశ్రీ స్వామివారి అర్చామూర్తి అభిముఖంగా వివిధ వాహనములలో తిరువీధి ఉత్సవం నేత్రపర్వంగా సాగింది. 6వ తేదీ తిరునక్షత్రం రోజున శ్రీపెద్ద జీయరు స్వామివారికి రథోత్సవము, 108 కలశములతో క్షీరాభిషేకము, పాదార్చన, ఆలయ మర్యాదలతో కన్నుల పండుగగా జరిగింది. విచ్చేసిన పండితులు ఆచార్య వైభవాన్ని ప్రవచించారు.

విచ్చేసిన భగవద్బంధువులకు ఆలయ నిర్వాహకులు శ్రీమాన్ గుదిమెళ్ళ బదరీనాథ్ సోదరులు, వి.టి. కార్యకర్తలు ఏర్పాటు చేసిన చక్కటి వసతులతో, తదీయారాధనతో కార్యక్రమం అత్యంత వైభవంగా ముగిసింది.

# శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి USA పర్యటన వివరములు

శ్రీ స్వామివారి మంగళాశాసనములతో శ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి USA పర్యటన సందర్భంగా జూన్ 26 సాయంత్రం Houston చేరుకున్నారు. జెట్ సభ్యులు, భక్తబృందం స్వామివారికి స్వాగతం పలికారు. శ్రీస్వామివారు మన అష్టలక్ష్మీ దేవాలయంలోనే బసచేసి ప్రతిరోజూ ఉదయం తీర్థగోష్ఠి, సాయంకాలం శ్రీ లక్ష్మీవైభవం ప్రవచనం అనుగ్రహించారు.

ఈ సంవత్సరం జూన్ 29 నుండి జూలై 1వరకు NATA (North American Telugu Association) ఉత్తర అమెరికా తెలుగు సమితి సభలు జరిగాయి. కార్యదర్శి శ్రీమతి దొంతి గీతగారి ఆహ్వానం మేరకు NATA సభలను ప్రారంభించి, రెండవరోజు మధ్యాహ్నం DO YOU NEED TO PRAY అనే అంశం అనుగ్రహ భాషణం చేశారు.

జులై 3న గురుపూర్ణిమ సందర్భంగా శ్రీ అష్టలక్ష్మీ దేవాలయంలో శ్రీ చిన్న జీయరు స్వామివారి పాదుకలకు పాదపూజా కార్యక్రమాన్ని జరిపారు. ఈ సందర్భంగా శ్రీ స్వామివారు.. వేదవ్యాస భగవానుడు లోకానికి చేసిన ఉపకారాన్ని తెలియజేశారు. వేదవ్యాసుని తమ ఆచార్యులలో దర్శిస్తూ ఆరాధించే రోజు ఈ రోజని వివరిస్తూ ఆచార్యవైభవాన్ని అందించారు.

లోకక్షేమం కోసం మన అష్టలక్ష్మీదేవాలయంలో జూలై 23 నుండి జరిగే "కోటికుంకుమార్చన" కార్యక్రమానికి మంగళాశాసనం చేశారు. పలు సేవాకార్యక్రమాలు నిర్వహించే వి.టి.సేవా మరియు ప్రజ్ఞా విభాగాలలో ఉండే కార్యకర్తలను ప్రత్యేకంగా అభినందించారు.

జూలై 4వ తేది Woodlandsలోని వేదాల శ్రీనివాస్‌గారి ఇంట్లో హయగ్రీవ ఇష్టి సందర్భముగా హయగ్రీవ అవతార వైశిష్ట్యాన్ని వివరిస్తూ మంగళాశాసనాలు గావించారు.

జూలై 5న అష్టలక్ష్మీ ఆలయంలో "సంగీత సాహిత్య కదంబం" అనే కార్యక్రమం జరిగింది. ఇందులో సహస్రావధాని శ్రీమాన్ గరికపాటి నరసింహారావుగారు రామాయణంపై ఉపన్యసించారు. ప్రముఖ భాగవతారిణి శ్రీమతి సావిత్రి జయంతి 'కుచేలోపాఖ్యానం' హరికథను, ఆలయంలో ప్రజ్ఞ విద్యార్థులకు సంగీత శిక్షణను ఇచ్చే శ్రీమతి రాజరాజేశ్వరిగారు భక్తిగీతాలతోను భక్తులను అలరించారు. శ్రీ అహోబిల స్వామివారు సంగీత సాహిత్యాలు సామాజిక జీవితంపై చూపే ప్రభావాన్ని వివరిస్తూ కళాపోషకులైన వీరందరినీ సత్కరించారు.

ఆలయ నిర్వాహకులు శ్రీమాన్ విజయ్ నరసింహయ్య, డా॥ శ్రీమాన్ తమిరస శ్రీనివాసాచార్యులుగారు, జెట్ యుఎస్ఎ. అధ్యక్షులు శ్రీమాన్ ఆలూరి బంగారురెడ్డిగారు ఆలయార్చకులు శ్రీమాన్ పంచాంగం హనుమాన్‌స్వామి, శ్రీమాన్ సముద్రాల అనీల్‌స్వామి, శ్రీమాన్ మరింగంటి యుగంధరాచార్యస్వామి తదితర భక్తబృందానికి మంగళాశాసనం చేస్తూ జూలై 5న అట్లాంటాకు బయలుదేరారు.

మార్గమధ్యంలో క్లింటన్‌లోని శ్రీమతి చింతకుంట్ల విజయ్‌గారి గృహంలో సత్సంగంలో పాల్గొన్నారు. జూలై 6 సాయంత్రం అట్లాంటా చేరుకొని వి.టి. సమన్వయకర్త శ్రీమాన్ గౌరిశెట్టి రవి గృహంలో బస చేశారు.

ATA (American Telugu Association) ఆహ్వానం మేరకు జూలై 7వ తేదీ సభలో పాల్గొని 'వేదసారం' అనే అంశంపై అనుగ్రహ భాషణం చేశారు.

జూలై 8 నుండి 14 వరకు శ్రీమాన్ పురాణం శేషాచార్యులు గారి హనుమాన్ మందిరంలో భాగవత సప్తాహం జరిగింది. ఈ కార్యక్రమానికి విచ్చేసిన భక్తులకు ఆలయ అనుబంధంగా ఉండే 'అమ్మ కిచెన్' వారు ప్రతిరోజూ విశేష తదీయారాధన జరిపారు.

జూలై 15,16 తేదీలు Burmingham లోని శ్రీమాన్ వల్లభనేని సత్యనారాయణరావు-సరస్వతీ దంపతుల గృహంలో శ్రీమద్భాగవతంలోని నవవిధ భక్తిపై ప్రసంగించారు.

జూలై 17,18 తేదీలలో Nashville లో శ్రీమాన్ అశోక్-జానకి దంపతుల గృహంలో శ్రీసుదర్శన హోమాన్ని సత్సంగాన్ని నిర్వహించారు.

జూలై 19న Charlotte లోని శ్రీమాన్ ఉప్పుటూరి అనిల్‌గారి నివాసంలో శ్రీ సుదర్శనహోమాన్ని నిర్వహించారు.

జూలై 20 సాయంత్రం Cary శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయంలో శ్రావణ శుక్రవారం శ్రీలక్ష్మీకుంకుమార్చన జరిగింది. స్వామివారు లక్ష్మీవైభవాన్ని వివరిస్తూ కార్యక్రమంలో అన్వయించిన అశేష భక్తబృందానికి మంగళాశాసనములను అనుగ్రహించారు. ఆలయ ఛైర్మన్ శ్రీమాన్ రాజేంద్ర ప్రసాద్ మాకం, ధర్మకర్త శ్రీమాన్ దామోదరన్ గారలు శ్రీఅహోబిల స్వామివారికి ఆలయాన్ని సందర్శింపచేస్తూ శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారి కరకమలములతోనే స్వామి ప్రతిష్ఠ జరిగిందని, వారి అనుగ్రహంతో అమెరికాలో మరో తిరుపతిగా ఇది భాసిల్లుతోందని ఆనందాన్ని వ్యక్తపరిచారు.

జూలై 20వ తేది రాత్రికి వర్జీనియా చేరుకుని శ్రీమాన్ కర్ర కిరణ్‌గారి గృహంలో బసచేశారు. శ్రీమతి వింజమూరి ఇందిరగారి (స్థానిక జెట్ సమన్వయకర్త) నిర్వహణలో ప్రజ్ఞా సెంటర్‌లో ప్రతిరోజూ సా॥ భగవద్గీత, రామాయణము మొదలగు అంశాలపై ప్రవచనములను అనుగ్రహించారు. శ్రీ ఆండాళ్, బదరీనారాయణ శ్రీ సుదర్శన తిరునక్షత్రములు ఇక్కడ వైభవంగా జరిగాయి.

జూలై 22వ తేది Maryland లోని Baltimore ప్రాంతంలో పల్లెంపూడి వారి గృహంలో శ్రీ లక్ష్మీనారాయణ పూజను నిర్వహించారు. ఇక్కడకు వచ్చిన యువతను ఉత్తేజపరుస్తూ శ్రీస్వామివారు ప్రసంగించారు.

వాషింగ్టన్ డి.సి. కార్యకర్తలైన శ్రీమతి డా॥ రీనా బొమ్మసాని, శ్రీమాన్ తేజస్వి రాపర్ల, శ్రీమాన్ సముద్రాల వేంకటాచార్యులు శ్రీమతి పవిత్ర మందపాటి మొదలగు వారికి మంగళాశాసనాలను అనుగ్రహించారు.

జూలై 25న న్యూజెర్సీలోని శ్రీ జీయరు ఆశ్రమానికి చేరుకున్న శ్రీ అహోబిల జీయరు స్వామివారికి శ్రీమాన్ శర్మ అల్లక్కిగారు మరియు భక్తబృందం స్వాగతం పలికారు. జూలై 26 నుండి ఆగస్టు 5 వరకు శ్రీరామానుజనూత్తందాది వైభవంపై ప్రవచనము లను అనుగ్రహించారు.

ఆగస్టు 1వ తేది శ్రీ హయగ్రీవ జయంతి సందర్భంగా శ్రీ హయగ్రీవ ఇష్టి, పూజ, ప్రవచనములు, శ్రావణపూర్ణిమ సందర్భంగా ఉపాకర్మ, సాయంకాలం శ్రీ ఆళవందారుల తిరునక్షత్ర సందర్భాన శ్రీ యామునాచార్యుల వైభవంపై ప్రవచనం జరిగింది.

ఆగస్టు 6న శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి తిరునక్షత్ర సందర్భంగా శ్రీస్వామివారి పాదుకలకు తిరుమంజనం, విశేషార్చనలు జరిగాయి. సాయంకాలం శ్రీ పెద్దజీయరు స్వామివారి వైభవాన్ని వివరిస్తూ వారి వెంట దండ, పవిత్ర స్థానీయులైన శ్రీ గోపాలచార్యస్వామి వారు, శ్రీ కవిగార్ల వైభవాన్ని శ్రీస్వామివారు అందంగా ఆవిష్కరించారు.

ఆగస్టు 7వ తేది నుండి ఇక్కడి భక్తుల కోరికపై శ్రీమద్భాగవత ప్రవచనములను అనుగ్రహిస్తూ ఉన్నారు.

ఇక్కడి జీయరు ఆశ్రమానికే కాక ఇండియాలోని శ్రీస్వామి వారు నిర్వహించే పలు కార్యక్రమాలలో విశేషసేవలను అందించే శ్రీమాన్ తోట గోవిందరాజుగారు, శ్రీమాన్ తోట రమేష్‌గారు, శ్రీమాన్ తోట రవీంద్ర మరియు శ్రీమాన్ సిరికొండ పూర్ణచంద్రరావుగార్ల గృహాలలో శ్రీ సుదర్శన, నారసింహ, శ్రీయాగ కార్యక్రమాలు విశేషంగా జరిగాయి.

న్యూజెర్సీలోని ఎడిసన్ ప్రాంతంలో 50 అపార్ట్‌మెంట్స్ అగ్నిప్రమాదంలో దగ్ధమయ్యాయి. ఆ సమయంలో అందరూ ఆఫీసులలో ఉండడం వల్ల ఆస్తినష్టం జరిగినా, భగవంతుని దయవల్ల ఎవ్వరికీ ప్రాణహాని కలుగలేదు. వారందరూ కేవలం కట్టుబట్టలతో మాత్రమే మిగిలిపోయారు. ఈ విషయాన్ని తెలుసుకుని మన VT SEVA, JET USA సంస్థలు స్పందించి ఆగస్టు 3వ తేది శ్రీ అహోబిల జీయరు స్వామివారి ద్వారా శ్రీ జీయరు స్వామివారి మంగళాశాసనములను అందిస్తూ వారందరికీ సహాయనిధి అందించారు. ఈ సందర్భంగా వారందరికీ ధైర్యాన్నిస్తూ శ్రీ అహోబిలస్వామివారు ప్రవచించారు. ఈ కార్యక్రమం VT SEVA అధ్యక్షులు శ్రీమాన్ టి.పూర్ణచంద్రరావుగారు, మాజీ అధ్యక్షులు శ్రీమాన్ ఇప్పనపల్లి హరిగారు, JET USA కోశాధికారి శ్రీమాన్ శర్మ అలక్కిగారు VT SEVA ఉపాధ్యక్షులు శ్రీమాన్ రవీంద్రగార్ల నిర్వహణలో జరిగింది.

అన్ని ప్రాంతాలలోనూ ప్రతిఆదివారం జరిగే ఆదిత్యహృదయం, మహాసౌర పూర్వక అరుణ పారాయణం సూర్య నమస్కారాలలో విశేషంగా భక్తుల పాల్గొంటున్నారు.

ఈ కార్యక్రమాలలో శ్రీ అహోబిల జీయరు స్వామివారి వెంట శ్రీమాన్ ముదుంబై శ్రీకాంతాచార్యస్వామి(వారిజ-ఋగ్వేద అధ్యాపకులు), శ్రీమాన్ దెబ్బట వెంకటేష్ (దివ్యప్రబంధం అధ్యాపకులు-సీతానగరం) అనుసరించగా శ్రీమాన్ మరింగంటి యుగంధరాచార్యస్వామి (శ్రీ అష్టలక్ష్మి దేవాలయ అర్చకులు-హ్యూస్టన్) మరియు శ్రీమాన్ భాగవతాచార్యస్వామి-(జీయర్ ఆశ్రమం-న్యూజెర్సీ) పాల్గొని విశేషసేవలను అందిస్తున్నారు.

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు సెప్టెంబర్ 1 నుండి నవంబర్ 11 వరకు USAలో వివిధ ప్రాంతాలలో పర్యటించ నున్నారు. మిగిలిన వివరాలు తరువాత సంచికలో.

## శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి USA పర్యటన

| | | | | | |
|---|---|---|---|---|---|
| MA/NH | 5-Sep | Wednesday | 7-Sep Friday | Boston | Dr. Chandra Reddivari |
| PA | 7-Sep | Friday | 9-Sep Sunday | Pittsburgh | Raghava Srinivasa |
| OH | 9-Sep | Sunday | 10-Sep Monday | Cleaveland | Chakri |
| OH | 10-Sep | Monday | 11-Sep Tuesday | Columbus | Dr. Jagan Chittiprolu |
| OH | 11-Sep | Tuesday | 12-SepWednesday | Cincinnatti | Radhika Vupputuri |
| KY | 12-Sep | Wednesday | 13-SepThursday | Lexington, | KY Padma Lellapalli |
| KY | 13-Sep | Thursday | 14-Sep Friday | Louisville, | KY Padma Lellapalli |
| IN | 14-Sep | Friday | 15-Sep Saturday | Louisville, | KY Padma Lellapalli |
| IN | 15-Sep | Saturday | 15-Sep | Indianapolis, iN | Dr. Vendala Ranganath |
| IN | 15-Sep | Saturday | 17-Sep Monday | Ft. Wayne, IN | Dr. Vijay Chilakamarri |
| MI | 17-Sep | Monday | 24-Sep Monday | Detroit, Toledo | Sudhakar Kolluri |
| IL, WI | 24-Sep | Monday | 3-Oct Wednesday | Chicago, | Bloomington,Peoria,Urbana, Springfield, Moline, Milwaukee, St. Louis JET IL |
| CO | 3-Oct | Wednesday | 8-Oct Monday | Denver | Mohan Madhuri Sagar |
| WA | 8-Oct | Monday | 9-Oct Tuesday | Seattle | Srikanth Boinapalli |
| OR | 9-Oct | Tuesday | 10-OctWednesday | Portland | Mythili Srinivas |
| CA | 10-Oct | Wednesday | 18-Oct Thursday | Bay Area, Sacremento | Vamsi Mudumbai |
| CA | 18-Oct | Thursday | 22-Oct Monday | LA | NarsimhacharyaSwami Cheru 40k5u-p32a6ll-i3598 |
| AZ | 22-Oct | Monday | 23-Oct Tuesday | Phoneix | Rammohan ji 201-658-7005 201-658-7005 |
| TX | 23-Oct | Tuesday | 24-OctWednesday | San Antonio | Dr. Mrudula Thangada 210-378-2815 / 210-497-0683 |
| TX | 24-Oct | Wednesday | 25-Oct Thursday | Austin | Chary / |
| TX | 25-Oct | Thursday | 29-Oct Monday | Dallas | Aparna Kamatam 972-345-5374/469-777-0104 |
| OK | 29-Oct | Monday | 30-Oct Tuesday | Tulsa | Venuswami Gattu |
| FL | 30-Oct | Tuesday | 1-Nov Thursday | Tampa | Subbu Nekkalapudi 813-928-0738 |
| FL | 1-Nov | Thursday | 3-Nov Saturday | Bradenton | Gopi Chary Opening Ceremony, Maitreya Center 941-751-6950 |
| FL | 3-Nov | Saturday | 5-Nov Monday | Ft. Lauderdale | Dr. Mohan Thirumala |
| FL | 5-Nov | Monday | 7-Nov Wednesday | Jacksonville | Dr. Krishna Thirumala Sudarsana Narasimha Ishti |

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన ఆగస్టు నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. భీష్ముడు ధర్మరాజుకి వివరించిన ధర్మాలు ఎక్కడివి? | |
| 2. వనాద్రి అనే పేరుగల ఊరేది? | |
| 3. అష్టభుజస్వామిని కీర్తించిన ఆళ్వారెవరు? | |
| 4. కుంతి ఎవరి కుమార్తె? | |
| 5. మనిషిగా మాట్లాడిన మగజింక పేరేమి? | |
| 6. విభీషణుని మధురంగా ప్రశ్నించండి అన్నవారెవరు? | |
| 7. శరీరం ఎటువంటిది? | |
| 8. శరణాగత ధర్మాన్ని చెప్పిన ఋషి ఎవరు? | |
| 9. సనక సనందను లెవరు? | |
| 10. భక్తి మార్గాలెన్ని? | |
| 11. రాళ్ళను నీళ్ళపై తేల్చే శక్తిగలవారెవరు? | |
| 12. శ్రీరంగంలో మూలవర్లు ఎవరి అవతారమని పెద్దలు చెపుతారు? | |
| 13. సౌరమానంలో దేనికి ప్రాధాన్యము? | |
| 14. తిరుక్కోవలూర్ నందున్న పెరుమాళ్ పేరేమి? | |
| 15. పూదత్తాళ్వార్లు మనస్సును దేనినిగా భావించారు? | |
| 16. ఇడైయాత్తూర్ ఎక్కడుంది? | |
| 17. మూడు తిథులు ఒకేరోజున ఉంటే దానినేమంటారు? | |
| 18. సింహళ దేశపు రాజు పేరేమి? | |
| 19. మానసిక స్థితిని మెరుగుపరచే గొప్పమందేది? | |
| 20. విష్ణుచిత్తుడు వాద సభలకు ఏ ఊరు వెళ్ళాడు? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు.**

శ్రీమతి గుడివాడ రాజ్యలక్ష్మి- గుంటూరు, పి. సీతారాంమోహన్ - వరంగల్

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తోంది. బహుమతులను కూడ పంపిస్తుంది.**

**సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.**

**భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929**

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





65 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...
ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీ నందన నామ సంవత్సరం

నిజ భాద్రపద-ఆశ్వయుజమాసములు


సంపుటి 65 అక్టోబరు

సంచిక 7 2012


## పంచాంగ వివరాలు

అక్టోబరు :

3. భరణీ మహాలయము, చవితి తిథి
4. శూన్యతిథి
10. చిత్తకార్తె
11. సర్వేషామేకాదశి
12. యతులకు మహాలయము
13. మాసశివరాత్రి
15. మహాలయమావాస్య పిండపితృయజ్ఞము, విశకర్మ జయంతి, కుశగ్రహణం, అమాసోమవారవ్రతం, తిరుమల శ్రీవారి నవరాత్రి బ్రహ్మోత్సవారంభం
16. శరన్నవరాత్రారంభం
17. తిథి ద్వయం, తులాసంక్రమణం రా. 6-46
20. అవమతిథి, సరస్వతీపూజ, మణవాళ మహామునుల తిరు॥
21. సేనై మొదలియార్ తిరు ॥
22. దుర్గాష్టమి
23. మహర్నవమి, పొయిఘై ఆళ్వార్ తిరు॥ పిళ్ళైలోకాచార్యర్ తిరు॥, తిరుమల శ్రీవారి చక్రస్నానం.
24. విజయదశమి (దసరా పండుగ) పూదత్తాళ్వార్ తిరు॥, తిరుమలై యాండాన్ తిరు ॥ స్వాతి కార్తె.
25. సర్వేషామేకాదశి, ఏకాదశి గురువారవ్రతం, పేయాళ్వార్ తిరు॥
26. పద్మనాభ ద్వాదశి
27. శనిత్రయోదశి
29. శరత్పూర్ణిమ, వాల్మీకి జయంతి.


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు


## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-





మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రొసెసర్స్, సీతానగరం



E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org

# కలివైరిసూరి వైభవము



*గత సంచిక తరువాయి...*

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-8-6 (బృహత్సూక్తి)**

**ఎణ్ తిశైకళుమ్ ఏழுలకుం వాంగిపొన్ వయిత్తిల్ పెయ్తు**
**పణ్డొరాలిలై ప్పళ్ళి కొణ్డవన్ పాన్మతిక్కిడర్ తీర్తవన్ ।**
**ఒణ్తిరలవుణన్ ఉరత్తు కిర్ వైత్తవన్ ఒళ్ ఎయ్త్తోడు**
**తిణ్ తిరల్ అరియాయవన్ తిరువేంగడమడై నెంజమే.**

**ప్రతిపదార్థము:** **నెంజమే**=ఓ మనసా; **ఎణ్ తిశైకళుం**= ఎనిమిది దిక్కులను; **ఏழ் ఉలకుముమ్**=ఏడులోకములను; **వాంగి**=తీసుకొని; **పొన్వయిత్తిల్**=స్పృహణీయమగు ఉదరము నందు; **పెయ్తు**=ఉంచుకొని; **పణ్డు**=పూర్వము; **ఓల్ ఆలిలై**= ఒకమఱ్ఱిఆకుపై; **పళ్ళికొండవన్**=శయనించినవాడును; **పాన్మతిక్కు**=పాలవలె తెల్లనైన, చంద్రునియొక్క; **ఇడర్**=దుఃఖ మును; **తీర్తవన్**=పోగొట్టినవాడును; **ఒణ్తిరల్**=అధికమైన బలముగల; **అవుణన్**=హిరణ్యాసురునియొక్క; **ఉరత్తు**=ఉరము నందు (గుండెయందు); **ఉకిర్**=గోళ్ళను; **వైత్తవన్**=ఉంచిన వాడును; **ఒళ్**=కాంతిగల; **ఎయ్త్తోడు**=దంతములతో; **తిణ్ తిరల్**=దృఢమైన బలముగలవాడును అయిన; **అరియాయ వన్**=నరసింహరూపియగు స్వామియొక్క; **తిరువేంగడమ్**=శ్రీ వేంకటాద్రిని; **అడై**=ఆశ్రయింపుము.

**తాత్పర్యము:** ఓ మనసా! శ్రీ వేంకటగిరిని ఆశ్రయింపుము. అచ్చట భగవంతుడు నిత్యవాసము చేసియున్నాడు. ప్రళయ కాలమునందు ఎనిమిది దిక్కులను, ఏడులోకములను తన ఉదరమున నుంచుకొని కాపాడినవాడును, వటపత్రముపై శయనించి ఉండువాడును, చంద్రునకు క్షయరోగము వలన కలిగిన దుఃఖమును బాపినవాడును, ధగధగ మెరయు కోరలతో ప్రబల నరసింహస్వామియై తన గోళ్ళతో హిరణ్యాసురుని వక్షమును చీల్చివేసినవాడును అయిన స్వామి అతడు.

**విశేషార్థము: ఎణ్తిశై యిత్యాది:** ఎనిమిదిదిక్కులతో కూడిన లోకములను ఏడింటిని ప్రళయకాలమున తన గర్భము నందుంచుకొనినవాడు. పూర్వము మఱ్ఱిచిగురుటాకుపై శయనించిన అఘటన ఘటనాసమర్థుడు.

**పాల్ మతిక్కు ఇడర్ తీర్తవన్:** పాల్మతి అనగా పాలవంటి చంద్రుడని అర్థము. ఆ చంద్రునకు ఒకప్పుడు సంపూర్ణముగ వినాశకరమగు కష్టము వచ్చినది. దానిని పోగొట్టినవాడు. చంద్రునకు కష్టము కలుగుటకు గల ఐతిహ్యము శ్రీరంగ మాహాత్మ్యము ముప్పై అయిదవ అధ్యాయమున ఈ విధముగా తెలుపబడినది.

దక్షప్రజాపతి తన ఇరవైఏడుమంది కుమార్తెలను చంద్రుని కిచ్చి వివాహము చేసెను. చంద్రుడు ఈ ఇరవై ఏడుగురిలో రోహిణియందుమాత్రమే ఎక్కువ ప్రీతిని కలిగి యుండెను. తక్కిన ఇరవై ఆరుగురును ఈ విషయమును సహించలేక తమ మనోవేదనను దక్షునకు తెలిపిరి. దక్షుడు చంద్రుని పిలపించి ఇట్లుండుట ధర్మముగాదని, అందరి యందును సమప్రీతిని కలిగి ఉండమని లేకున్నచో కష్టములను తాను (చంద్రుడు) ఎదుర్కొనవలసి వచ్చునని మందలించి పంపెను.

కాని చంద్రుడు మాత్రము ముందుమాదిరగానే రోహిణి యందే ఎక్కువ ప్రీతిని చూపుచు కాలము గడుపు చుండెను. మిగిలిన భార్యలు తమ మనోవేదనను తండ్రి అయిన దక్షునకు మరల మొరపెట్టుకొనసాగిరి.

దక్షుడు కోపగ్రస్తుడై చంద్రుని పిలిపించి 'నీవు రోహిణి యందుగల మక్కువతో నామాటను ధిక్కరించితివి. కనుక క్షయరోగివి కమ్ము' అని తీవ్రముగ శపించెను. ఆ శాప కారణముగ చంద్రుడు కాంతివిహీనుడాయెను. ప్రజ్ఞ కోల్పోయెను. కృశించిన శరీరుడాయెను.

దక్షప్రజాపతి దుఃఖార్తుడైయున్న చంద్రుని జూచి శ్రీరంగక్షేత్రములో సన్నిధిలోనున్న పుష్కరిణిలో స్నానమాడి తపమును ఆచరింపుము. నా శాపము తీరునని శాపవిమోచనా మార్గమును తెలిపెను.

చంద్రుడు శాపవిమోచనార్థము శ్రీరంగక్షేత్రమునకు వచ్చి అందున్న పుష్కరిణిలో స్నానమాడి పదునైదు సంవత్సరముల

పాటు తపమునాచరించుచు అందున్న తామర పుష్పములతో శ్రీరంగనాథుని అనుదినము ఆరాధించు చుండెను. చంద్రునకు శాపగ్రస్తమైన కాలము క్షణమున గడచిపోయెను. చంద్రుని తపమునకు ఆతడు చేసినపూజలకు మెచ్చి భగవంతుడు (శ్రీరంగనాథుడు) సుప్రీతుడై ప్రత్యక్షమై ఓ చంద్రుడా! నీతపమునకు మెచ్చితిని. కావలసిన వరమును కోరుకొనుము అనెను. చంద్రుడు తనను శాపవిముక్తుని చేయవలసినదని శ్రీరంగనాథుని ప్రార్థించెను. భగవంతుడు చంద్రుని ఆతడు కోరిన విధంగానే అనుగ్రహించెను. చంద్రుడు స్నానమాడి తపమాచరించి భగవత్సాక్షాత్కారమొందిన కారణమున ఆ పుష్కరిణికి చంద్రపుష్కరిణి అనుపేరు ఏర్పడి నది. ఈ వృత్తాంతమునే "పాల్‌మతిక్కు ఇడర్ తీర్తవన్" అని తిరుమంగై ఆళ్వార్లు ఈ పాశురమున ప్రస్తావించి యున్నారు.

**ఒన్ తిరల్ ఇత్యాది :** మిక్కిలి బలాఢ్యుడైయున్న హిరణ్యా సురుని ఉరమున తననఖాగ్రములనుంచినవాడు. అందమైన దంతములతో శోభిల్లువాడు. అచంచలితమగు బలము కలవాడు శ్రీనరసింహమూర్తి. శ్రీ అష్టాక్షరీమహా మంత్రమును ఉచ్చరించిన చిన్న బాలునకు (భక్త ప్రహ్లాదునకు) ఉపకరించిన వాడు అతడు. అంతమాత్రమేకాదు. తన దివ్యనామమును అనుసంధించిన వారి అందరి సాంసారిక దుఃఖములను తొలగించుటకై ఆ దివ్యమూర్తి తిరుమల దివ్యక్షేత్రమున వేంచేసియున్నాడు. (సశేషం)



# అహో! భారతమ్

*(గత సంచిక తరువాయి)*

**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ**

అనంత గుణసంపన్నుడైన పాండురాజు ఆలోచనా సముద్రంలో మునిగిపోయాడు. ఒక్కసారి అతనికి తన జీవితంలో జరిగిన సంఘటన గుర్తుకి వచ్చింది. మనసంతా బాధతో నిండిపోయింది. ఆనాడు... ఏం జరిగిందంటే..

వేట అంటే చాలాచాలా ఇష్టం పాండురాజుకి. ఆ వేటకి ఒక్కడే పోవడం కాదు. కుంతీమాద్రులతో కలసి విలాసంగా బయలుదేరడం. అదొక విహారయాత్రగా ఆనందించాడు. పైగా, రాజధాని నుండి ఎంతో ఇష్టమైన అన్నపానాలు, ఆభరణాలు, మైపూతలు ఒకటేమిటి... అన్నీ అన్నగారు పంపించే ఏర్పాటు చేశారేమో... ఆనందమే ఆనందం. అలా వేటాడుతూ ఉండగా ఒకనాడు ఒక్కమృగం కూడా దొరకలేదు. పట్టుదల ఎక్కువై పోయింది. ఎలాగైనా సరే జంతువులని చంపే వెనక్కి తిరగాలనుకొన్నాడు. వెదుకుతూండగా, రెండు జింకలు ప్రేమానురాగాలతో కలిసిపోయి ఉండడం చూశాడు. ఆవేశంగా ఐదుబాణాలు తీసి ప్రయోగించాడు. అతే విలవిలలాడాయి జింకలు. మగజింక కొనఊపిరితో మనిషిమాటలతో.. 'రాజా! మేం నిజంగా జింకలం కాదు. నాపేరు కిందముడు. నేనొక మునిని. మృగాలు జంటగా కలిసి ఉండడం చూసి మనం కూడా అలా చేస్తే.. అనుకుంటూ ఈ రూపం ధరించి కలిశాము. వేట తప్పుకాదు కాని ఇలాంటి స్థితిలో ఉన్న జంతువుల్ని కిరాతులు కూడా చంపరు గదా! నీకు తెలియదా? అన్నాడు.

పూర్వం అగస్త్యమహర్షి వేటవలన రాజులకి పాపం రాదని నియమం ఏర్పాటు చేశాడు గదా తప్పేముంది అన్నాడు పాండురాజు. ఏ తప్పు చెయ్యక సుఖాలతో మునిగి తేలే మమ్మల్ని చంపావు కాబట్టి నువ్వు కూడా నీ ప్రియురాలితో కలిసినప్పుడు వెంటనే మరణిస్తావు అని శాపం ఇచ్చి ప్రాణాలు విడిచిపెట్టేశాయి ఆ మృగాలు (కిందముడు-భార్య).

నిరాశానిస్పృహలతో మ్రాన్పడిపోయాడు పాండురాజు. అయ్యో ఆనాడు నా తండ్రి కూడా కామమోహితుడై మరణించాడే. ఈ రోజు నాకు ఇలాంటి శాపమా! దైవమా... ఎంత గొప్పవంశంలో పుట్టినా కర్మఫలం అనుభవింపక తప్పదు కదా! ఈనాటి నుంచి మునివృత్తిని పాటిస్తూ జీవితం గడుపుతాను. కుంతీ... మాద్రీ... మీరిద్దరూ హస్తినాపురానికి వెళ్ళిపొండి. ఇక్కడ ఉండవద్దు. వెళ్ళండి అన్నాడు. స్వామీ! మిమ్మల్ని విడిచి మేం వెళ్ళం. మీ సేవ చేస్తూ వానప్రస్థ జీవితాన్ని గడుపుతాం. కాదంటే ప్రాణాలు విడుస్తాం అన్నారు. ఏమీ చేయలేక సరే అన్నాడు పాండురాజు. ఎన్నో దానాలు చేశాడు. తాపసవృత్తిలో కాలం గడపడం మొదలు పెట్టాడు.

మరి ఈనాడు ఋషులంతా సంతానం లేనివారు స్వర్గద్వారాలు చూడలేరంటున్నారు. అపుత్రస్య గతిఃనాస్తి అంటున్నారు. పితృఋణం తీర్చుకోలేనా... శరీరం నశించినా తీరని ఋణం కదా! అతని బాధని తెలుసుకొని మునులు యోగదృష్టితో సర్వం తెలుసుకున్నారు. 'నాయనా! నువ్వు అపుత్రకుడివి కావు. దేవతల వరాలతో నీకు తప్పక సంతానం కలుగుతుంది' అంటూ ఆశీర్వదించి వెళ్ళిపోయారు. పాండురాజు కుంతిని పిలిచి, పూర్వం శారదండాయని అనే రాజు నీ చెల్లెలు శ్రుతసేన భర్తకదా! పిల్లలు లేరని తానే ఆజ్ఞాపించి ఋత్విజుల వలన సంతానాన్ని పొందాడు. దేవరన్యాయం అని ఉంది గదా! వంశం ఆగిపోకుండా ఉండేందుకే పాటించే ధర్మాలు నీకు తెలుసు. నా జన్మని గురించి కూడా నీకు తెలుసు కదా! మరి.. అంటూ ఆగాడు. ఖిన్నురాలయింది కుంతి. స్వామీ! నేనొక్కమాట చెపుతాను. వ్యుషితాశ్వుడు అనే రాజు కథ మీరు వినే ఉంటారు. మితిమీరిన కామంతో క్షయరోగం వచ్చి మరణించాడారాజు. అతని భార్య భద్ర. భర్తశవంపై పడి ఏడుస్తూ నేనూ నీతో వస్తాను లేదా నీవంటి పుత్రులనయినా ప్రసాదించు అంటూ ఏడ్చింది. అపుడు అతని శరీరం నుంచి దివ్యవాణి వినిపించింది. ఆశ్చర్యంగా శ్రద్ధగా వినసాగింది భద్ర.

'భద్రా! దుఃఖించకు. ఋతుమతివి అయిన ఎనిమిది లేక పదునాల్గవ రోజు పరిశుద్ధ మనస్సుతో శయనించి నన్ను స్మరించు. నీకు సంతానాన్ని ప్రసాదిస్తానన్నాడు. ఆయన వచనానుసారం ఆవిడ అలాగే చేసి ఏడుగురు కొడుకులను పొందింది. అలా దైవానుగ్రహంతో సంతానం పొందే మార్గం చూద్దాం! అంది కుంతి.

పాండురాజు ఎన్నో ఉదాహరణలు చెప్పాడు కుంతికి.

భర్త ఆజ్ఞాపించినట్లు చెయ్యడం భార్య కర్తవ్యం. నేను చెప్పేది విను అన్నాడు. అప్పుడు కుంతి తనకు పెళ్ళికాకముందు దుర్వాసుడు తనకిచ్చిన మంత్రోపదేశం గురించి చెప్పింది. ఏ దేవుని ప్రార్థించమంటారు అని అడిగింది. ఆనందపడిపోయాడు పాండురాజు. 'ధర్మం ప్రధానం కుంతీ! 'విశ్వం ధరతి ఇతి ధర్మః' లోకాన్ని ధరించేది ధర్మం. ఆ ధర్మానికి అధిదేవత ధర్ముడు. ధర్మాన్ని రక్షించడం కోసం ధర్మమూర్తి పుత్రునిగా రావాలి కాబట్టి ధర్మదేవతను ప్రార్థించు' అన్నాడు. కుంతి భర్తకి ప్రదక్షిణ చేసింది. మహామునికి నమస్కరించి మంత్రాన్ని జపించి ధర్మదేవతను ప్రార్థించింది. ఆయన వరమిచ్చాడు. గర్భం ధరించింది కుంతి.

చంద్రుడు జ్యేష్ఠానక్షత్రంలో ఉచ్ఛస్థితిలో ఉన్న సమయంలో సూర్యాది గ్రహాలు శుభస్థానంలో ఉండగా అష్టమినాడు అభిజిత్ ముహూర్త ప్రారంభంలో ధర్మదేవత అంశంతో ధర్మరాజు జన్మించాడు. తారాబలం, చంద్రజలం, గ్రహబలం, దైవబలంతో ధర్మమే మూటగట్టిన రూపం ధర్మరాజు. ధర్మరక్షకుడైన ఆ బాలుడు పుట్టిన సమయం లోకానికి ఎంతో ఆనందాన్ని కలిగించింది. శతశృంగ పర్వతంపైన తపస్సు చేసుకుంటున్న బ్రాహ్మణోత్తము లందరూ అక్కడ కుంతికి కల్గిన బాలుని చూచి ఆనందించి జాతకర్మాదులు చక్కగా నిర్వర్తించారు. ఆకాశవాణి – ఈ బాలుడు కురువంశానికి రాజౌతాడు. ధర్మశీలిగా పేరు పొందుతాడు. యుద్ధంలో స్థిరంగా నిలిచి యుద్ధం చేసే వీరుడౌతాడు కాబట్టి యుధిష్ఠిరుడు అని పిలువబడతాడు అని నామకరణం చేసింది.

ఈ విషయం గాంధారికి తెలిసింది. శ్రీకృష్ణ ద్వైపాయనుని వలన వరం పొంది అప్పటికే గర్భవతి అయి ఉంది గాంధారి. కాని ముందు కుంతికి కొడుకు పుట్టేశాడే! అయ్యో! సంవత్సరమైనా నాకెందుకు ముందు పురుడు రాలేదు అని క్రుంగిపోయింది. అయ్యో! అయ్యో! అంటూ తన కడుపును బాదేసుకుంది. ఇంకేముంది! గర్భస్రావమైపోయింది. విషయం తెలుసుకొని పరుగు పెట్టుకుంటూ వచ్చాడు కృష్ణద్వైపాయనుడు. ఎంత బుద్ధిలేని పనిచేశావు అని గాంధారిని మందలించాడు. పడిన మాంసపు ముద్దను నూటొక్క ముద్దలుగా చేశాడు నూటొక్క కుండలు తెప్పించి నేతితో నింపాడు. ఆ కుండలలో ఈ పిండాల్ని భద్రపరిచాడు. వీటిని చల్లని నీటితో తడుపుతూ ఉండాలి. వీటి నుండి వందమంది కొడుకులు, ఒక కూతురు కలుగుతారు అంటూ గర్భరక్షణ గావించాడు ఆ విజ్ఞానమూర్తి. గాంధారీ ధృతరాష్ట్రులు అతని ఆజ్ఞని శ్రద్ధగా పాటించారు.

అక్కడ పాండురాజు కుంతిని పిలిచి మహాబలశాలి అయిన కొడుకుకోసం వాయుదేవుని ప్రార్థించు అన్నాడు. అతని ఆజ్ఞను శిరసావహించింది కుంతి. వాయుదేవుని అంశతో కుంతికి రెండవ పుత్రుడు కలిగాడు. అక్కడి మహర్షులంతా ఆనందంతో జాతక కర్మాదులు చేస్తూంటే మళ్ళీ ఆకాశవాణి 'భీమసేనుడు' అని నామకరణం చేసింది.

సరిగ్గా భీముడు పుట్టిన రోజునే హస్తినాపురంలో కలి అంశతో దుర్యోధనుడు జన్మించాడు. ఇలా పుట్టాడో లేదో ఒకటే నక్కల కూతలు వినిపించాయి. గుడ్లగూబలు ఘూంకారాలు చేశాయి. గాడిదలు ఓండ్రించాయి. నెత్తుటి వానలు కురిశాయి. లోకోపద్రవాన్ని సూచించే అపశకునాలెన్నో కనిపించాయి. దుర్యోధనుడు పుట్టాక ధృతరాష్ట్రునికి వైశ్యకుల పత్ని వలన కొడుకు పుట్టాడు. వాడి పేరు యుయుత్సుడు. తరువాత దుశ్శాసనాదులు వందమంది, అందరికి చెల్లెలుగా దుశ్శల అనే కూతురు పుట్టారు.

బంధువులు, పురోహితులు, బ్రాహ్మణశ్రేష్ఠులు అంతా కలిసి వచ్చారు ధృతరాష్ట్రుని దగ్గరకి రాజా! మన దుర్యోధనుడు అదే పెద్దవాడు పుట్టినప్పుడు బాబోయ్ ఎన్ని దుశ్శకునాలో చూశావా! జననాశకుడు ఔతాడని పెద్దలు చెప్తున్నారు. నువ్వు వీడిని విడిచి పెట్టేయ్. కులాన్ని రక్షించుకొనడం కోసం ఒకడిని విడిచిపెట్టడం తప్పులేదు. ధర్మం కూడా అని చెప్పారు.

ధృతరాష్ట్రుడు ఆమాటలు విన్నాడు. కాని మమకారం అతనిని ఆ మాటలు విననీయలేదు. కన్నకొడుకుని అందునా పెద్దవానిని విడిచిపెట్టడమా! లాభంలేదు. ఏమైతే అదే ఔతుంది ఫరవాలేదు అంటూ వారి మాటలు నిర్లక్ష్యం చేశాడు. కుమారుని చూచి ఆనందపరవశుడయ్యాడు.

కుంతి భీమసేనుని ఎత్తుకొని ఆలయానికి బయలుదేరింది. దారిలో ఒక కొండగుహనుండి ఒకపులి అపుడే బయటకు వస్తోంది. వారిని చూచి ఒక్కదూకుదూకింది. అది చూచి పాండురాజు దూకే పులిపై బాణాలు వేసి చంపేశాడు. భార్యను, భీముని కాపాడాడు. అయితేనేం భయంతో కుంతి స్పృహకోల్పోయింది. చంటివాడు భీముడు నేలమీద పడ్డాడు. అంతే పడినచోట రాళ్ళు నుగ్గు నుగ్గు అయ్యాయి. ఆ... ఇదేమిటి?

(సశేషం)

యుద్ధకాండలో



# శ్రీరామాయణంలో పక్షులు



*(గత సంచిక తరువాయి)*

వైశారదీ

శ్రీరామాయణమొక జ్ఞానసాగరము. పైన నీటితరంగాలు, లోపల ఎన్నో రకాల జంతువులు, ఆలోపల విలువైన పగడాలు, రత్నాలవంటి మణులు, మరింత లోతులకు చూస్తే ఇంకా విలువైనవెన్నో లభిస్తూంటాయి సాగరంలో.

అలానే పైకి ఓ ఆదర్శమానవుడి చరిత్ర, కాస్త తరచి చూస్తే రాజనీతి, ధర్మాచరణ, ఇంకొంత చూస్తే, సహజనీతి, ఆపై ప్రకృతి సౌందర్యం, దాని తర్వాత గహనమైన వేదాన్త తత్త్వము... ఇలా ఎన్నెన్నో తనలో కలిగి ఉంది కనుకనే **"వందే రామాయణార్ణవమ్"** శ్రీరామాయణమనే మహాసాగరాన్ని నమస్కరిస్తున్నానని అంటారు.

ఇదే విషయాన్ని మహాకవి కాళిదాసు తన రఘువంశ కావ్యంలో స్మరిస్తూ ...

**'వృత్తం రామస్య, వాల్మీకేః కృతిస్తౌ కిన్నరస్వరౌ ।**
**యేన కించిత్ మనోహర్తుం అలంస్యాతాం న శృణ్వతామ్॥**

అంటాడు.

చరిత్రను చూద్దామా, పురుషోత్తముడైన శ్రీరామునికి చెందినది! దానిని గ్రంథస్థం చేసిన వ్యక్తిని చూద్దామా, మహర్షి, తపస్సంపన్నుడూ అయిన వాల్మీకి భగవానుడు. దానిని లోకానికందించిన వాళ్ళను చూద్దామా అంటే సాక్షాత్తు శ్రీరామునిపుత్రులు, కిన్నరులను ఆశ్చర్యపరిచే మధురకంఠంకల కుశలవులు. ఇక ఇన్ని సుగుణాలు ఒకచోట ప్రోగైతే, అందులో అందములేనిదేముంటుందీ! వినేవారికి వీనుల విందొనరించని తెలివంటూ ఉంటే మనస్సును హరించని విషయమంటూ ఏముంటుంది కనుక? అంటూ ప్రశ్నిస్తాడు.

అందులో ఏకాండలో చూసినా పక్షుల కలకలారావాలు వినిపిస్తూంటాయి. ఒక్కొక్క కాండంలో ఒక్కొక్కరకంగ ఈ పక్షులు ప్రవర్తిస్తూ ఉంటాయి. వీటి ద్వారా మనకు ఒక్కొక్క ఆచార్య దివ్యవైభవము తెలియచేస్తాడు వాల్మీకి భగవానుడు అని మనం తెలుసుకున్నాము.

అలా ఇంత వరకూ ఆఱుకాండలలో ఉండే పక్షులను పరిచయం చేసుకుంటూ వాటి ధ్వనులనూ, ధ్వన్యర్థములనూ శ్రవణం చేస్తున్నాము.

పైన సామాన్యంగ తెలిసే అర్థాన్ని కాక, కాస్త జాగ్రత్తగ పరిశీలిస్తే తెలిసే అంతరార్థాన్ని 'ధ్వన్యర్థము', లేదా 'వ్యంగ్యార్థ' మని అంటారు. పైపైన తెలిసే అర్థాన్ని 'వాచ్యార్థము' అంటారు.

వాచ్యార్థానికే పరిమితమయ్యే గ్రంథాలను అధమ కావ్యాలంటారు. 'వ్యంగ్యార్థ ప్రధానమైన కావ్యాలను 'ఉత్తమకావ్య' మంటారు. అందుకే ఇందులో వాచ్యార్థమును, వ్యంగ్యార్థమును గ్రహించాలి. మన పూర్వాచార్యులు ప్రతిగ్రంథములో ఈ వ్యంగ్యార్థాన్ని ఎలా చూడాలో నేర్పారు. అసలు అలా చూడ నేరిస్తేనే ఇతర గ్రంథాలలో ప్రవేశించాలి. లేకపోతే మంత్రార్థాను సంధానముతోనే ముముక్షువైనవాడు జీవితాన్ని గడపాలన్నారు.

తిరుమంత్రమనే నారాయణాష్టాక్షరీమంత్రమే సర్వ వాఙ్మయానికీ మూలము. కనుక ఆ మంత్రము తెలిసే అర్థాన్ని అనంతమైన వాఙ్మయములో ఏఏ గ్రంథము ఎలా వివరిస్తోందో తెలుసుకో గలిగితే వాటిని గూడా స్మరించడం సార్థకమౌతుంది. లేకపోతే, అంటే, మంత్రార్థ వివరణగ కాకుండా కేవల గ్రంథాలుగ మాత్రమే వాటిని చదివేటట్లైతే "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" వాటిని వదలివేయాలి' అంటూ ఇతర గ్రంథపఠనాన్నే అంగీకరించరు.

ఈ శ్రీరామాయణంలో మనకు సాక్షాత్కరించే ప్రతిపక్షిని ఈ దృష్టితో చూస్తే ఎన్నోన్నో ఆశ్చర్యకరమైన రహస్యాలు మనకు తెలుస్తాయని, ప్రతిపక్షీ ఆచార్యులకు ప్రతిరూపమని ఇటు జీవుణ్ణి, అటు దేవుణ్ణీ ఒక కొలిక్కి చేర్చడంలో ఆచార్యులు చేసే ప్రయత్నాలని ఈ పక్షులు ఎంత అందంగ తెలియజేస్తాయో మన ఆచార్యులైన కీర్తిమూర్తులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారు చక్కగ తెలియచేసి ఉన్నారు.

శ్రీరామాయణానికి ఏడుకాండలున్నా మొదటి ఆఱుకాండలనే సుఖాంతంగ స్మరించుకోవడం అందరికీ అలవాటు. అయితే ఏడవకాండం కూడా కలిస్తే కానీ గ్రంథం పూర్తికాదు. పారాయణ చేసేటపుడు అంతవరకూ చేయడమే తగును.

సరే! అదలా ఉంచి ఒక్కొక్కకాండలో ఉండే పక్షులను మనం పలుకరిస్తున్నాం. వీటిల్లో కొన్ని సాక్షాత్తుగ రామకైంకర్యంలో

పాల్గొన్నవి. మరికొన్ని పరోక్షంగ కథాగమనాన్ని కొనసాగించినవీ కద!

ఏడవకాండ అయినఉత్తరకాండలో పూర్వకథానుబంధంగ ఎన్నెన్నో చరిత్రలను అందివ్వడంవల్ల అక్కడి పక్షిని కూడా యుద్ధకాండలోకే తెచ్చివేసాడు. ఇలా ఈ కాండలో పక్షులు ప్రస్తావన రెండుసార్లు రావడం మనం గమనించాలి.

శ్రీరాముడే స్వయంగ ఆదర్శంగ తీసుకున్న కపోతాల గురించి మనం గతంలో తెలుసుకున్నాం. శ్రీరాముడికీ, లక్ష్మణుడికీ కలిపి జీవం పోయడం ద్వారా చరిత్రకు జీవం పోసిన ఓ దివ్యమైన ఖగేశ్వరుడిని వాల్మీకి మనకు యుద్ధకాండ లోని 50వ సర్గలో సాక్షాత్కరింపచేస్తాడు. ఆయనే గరుత్మంతుడు.

లంకానగరంలో చేరిన వానరవీరులతో లంకానగర మంతా నిండిపోయింది. చెట్లు, చేమలు, కొండలు, లోయలు, అడవులు, మైదానాలు ఇసుకవేస్తే రాలనంతగ కిటకిట లాడిపోయింది. నగర తోరణాలు, ప్రాకారాలు, గోడలూ ఎటు చూసినా వానరవీరులే!

**జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః ।**
**రాజాజయతి సుగ్రీవో రాఘవేణాఽభిపాలితః ॥**

అంటూ ఎలుగెత్తి వానరులు చేసే నినాదం లంకంతా మారుమోగి రాక్షసులకు గుండెల్లో గుబులు కలిగిస్తోంది!

నగర తూర్పుద్వారాన్ని 'కుముదుడు' తన వానరసేనతో ఆక్రమించి నిలబడ్డాడు. దక్షిణద్వారాన్ని "శతవలి" అనే వానరప్రముఖుడు కోట్లాది వీరులతో అడ్డుకోవడానికి సిద్ధపడ్డాడు. 'సుషేణుడు పశ్చిమద్వారం వద్ద కోట్లాది సంఖ్యలో ఉన్న తనసేనను మోహరించి నిలబడ్డాడు. ఇక, ఉత్తరద్వారాన్ని స్వయంగ రామలక్ష్మణులిరువురూ, సుగ్రీవాదులను తోడు చేసుకొని ఎదుర్కొనేందుకు సిద్ధపడ్డారు.

ఈ విషయాన్నంతటినీ గమనించే రావణుడు తన రాక్షస వీరులనందరినీ యుద్ధానికి బయలుదేరమని ఆజ్ఞాపించాడు.

రాక్షస – వానర వీరులకి భయంకరమైన యుద్ధం ఆరంభమైంది. ఇంతకు ముందెన్నడూ చూడనంత ఘోర యుద్ధం వానరులకు ఇది. యుద్ధం సాయంకాలమయ్యే సరికి ఆగిపోతూ ఉంటుంది. కానీ పట్టుదలకల రాక్షసులు యుద్ధాన్ని ఆపదలచు కోలేదు. రాత్రి అయ్యే సరికి వాళ్ళకి బలం పెరుగుతుంది కద! పైగ అదంతా వాళ్ళకి తెలిసిన ప్రాంతం. వానరులకి చీకట్లో ఏమీ తెలియడంలేదు. అయినా మసకచీకట్లో కూడా శక్తికొద్దీ పోరాడుతూనే ఉన్నారు.

అంగదుడు ఇంద్రజిత్తుతో పోరాడే మహోద్యమంలో, గదతో అంగదుణ్ణి తలపై మోదాడు ఇంద్రజిత్తు.

ఆనాడు హనుమంతుణ్ణి బ్రహ్మాస్త్రంతో బంధించిన మహావీరుడితడేనని గుర్తించిన అంగదుడికి కోపమాగలేదు. పైగా తనపై గదతో మోదిన ఆవేశానికి ప్రతీకగ అమాంతం ఇంద్రజిత్తురథంపైకి దూకాడు. ఒకే గుద్దుతో గుర్రాలనీ, సారథిని కుప్పకూల్చి పారేసాడు. రథాన్ని పట్టి గిరగిరా త్రిప్పి నేలకేసి కొట్టాడు.

మాయలు నేర్చిన ఇంద్రజిత్తు దాంట్లోంచి తప్పించుకొని మరోరథంతో తిరిగి ఆ రాత్రివేళలోనే యుద్ధాన్ని కొనసాగించాడు.

అతివేగం కల అంగదుడు ఈ రథానికి కూడా మొదటి రథానికి పట్టిన గతినే పట్టించాడు. ఇంద్రజిత్తును పనిపడదా మనుకున్నాడు. కానీ మాయావి అయిన ఇంద్రజిత్తు, అంగదుణ్ణి ఎదుర్కోవడం చేతకాక అక్కడే అంతర్ధానమై పోయాడు.

దేవతలకు కూడా వణుకుపుట్టించే ఈ మేఘనాధుణ్ణి అంగదుడు ఇంటిముఖం పట్టించినవార్త రామునికి తెలిసింది.

సుగ్రీవాదులతో కలిసి అంగదుణ్ణి మంగళాశాసనం చేసి అభినందించాడు. నేతలైన వానరులందరినీ సంబోధిస్తూ 'ఈ రాక్షసులతో చాలజాగ్రత్తగ ఉండాలి. వీరి మాయలు చాల భయంకరమైనవి' అని హెచ్చరిస్తున్నాడు.

పగపట్టిన పాములా, తిన్నదెబ్బకు ప్రతీకారం తీర్చు కోవాలనుకున్నాడు ఇంద్రజిత్తు. మాయారథంలో, నిశ్శబ్దంగానే ఆకాశంలోకి వచ్చి, ఎవ్వరికీ కనపడకుండా నిలబడి, తీవ్రమైన బాణాలతో రామలక్ష్మణులను ముందుగా తాళ్ళతో కట్టిపారేశాడు.

ఈ హఠాత్ పరిణామన్నుండి తేరుకొని వానరులను ఆదేశించ గానే, వాళ్ళు ఆకాశంలో అన్ని దిక్కులకూ ఎగరసాగారు. కానీ అంతా చీకటి. ఇంద్రజిత్తు ఆ వానరులను బాణాలతో హింసించడంతోపాటు, తన తపఃప్రభావంతో సంపాయిందించిన నాగపాశాలను రామలక్ష్మణులపై ప్రయోగించాడు.

అవి సర్పాల్లాగ ఖాళీలేకుండా ఒళ్ళంతా చుట్టేశాయి. బాణాల్లాగా పొడుచుకొంటూ వారిరువురినీ గాయపరచాయి.

తీవ్రంగ రక్తం కారుతూండగ సోదరులిద్దరూ నిశ్చేష్టులై నేలపైకొరిగిపోయారు.

"యుద్ధరంగంలో అదృశ్యుడనై నేను పోరాడుతుంటే ఇంద్రుడు కూడా నన్ను చూడలేడు. ఎదుర్కోలేడు. ఇక మానవ మాత్రులు మీరా నన్నెదుర్కొనేది? యమలోకానికి మిమ్ములను అతిథులుగ

పంపిస్తా' నంటూ దొంగయుద్ధం చేయడమే ఓ గొప్ప యోగ్యతగా బడాయిలు పలికి తనతండ్రిగారికి, తన విజయవార్త చెప్పడానికి పోయాడు ఇంద్రజిత్తు. సుగ్రీవుడు మొదలైన వానరులు హతాసువులై కూలబడిపోయారు. తమ తమ దురదృష్టాన్ని నిందించుకోసాగారు. వానరులందరూ ఏమి చేయాలో తోచక దిక్కులు చూడసాగారు. ఇలా ఎంతసేపు సాగిందో తెలియదు...

రామలక్ష్మణులు సాత్త్వికశక్తి సంపన్నులు, బలవంతులూ కావడంవల్ల, ప్రాణాలైతే పోలేదు. కొంతసేపటికి రాముడికి తెలివివచ్చింది. కానీ ఎటూ కదలలేనిస్థితిలో పడిఉన్నాడు. క్రమంగా కాస్త చుట్టూ ఉన్న పరిస్థితులను గమనించేటంత తెలివి వచ్చింది. ఓ ప్రక్కన పడి ఉన్న లక్ష్మణుడిని గమనించాడు. తనకోసం కుటుంబాన్ని, రాజ్యాన్ని, సుఖాలని వదలివచ్చిన సోదరుడు ఇలా నిశ్చేష్టుడై నేలకొరగడం సహించలేక పోయాడు.

'అయ్యో! ఎందుకు నాకింక సీత? నేను బ్రతికి మాత్రం ఏం లాభం? సీతలాంటి వారెక్కడైనా దొరకవచ్చునేమో! లక్ష్మణుడిలాంటి తమ్ముణ్ణెలా సంపాదించేది? మాతల్లులకెలా సమాధానం చెప్పేది? వాళ్ళనెలా ఓదార్చేది? ఇక నేను బ్రతకను. ఇప్పుడే ఇక్కడే ప్రాణాలొదిలేస్తాను. నన్ను ఒదిలి బ్రతకలేనని వాదించి, నిర్బంధించి నావెంట వచ్చాడే ఇతడు! ఇతణ్ణి వదలి నేనెలా ఉంటాను? నేను ఇప్పుడు ఇతనివెంటే వెళ్ళిపోతాను, యమసదనానికి. ఇలా తన వేదనను వ్యక్తం చేస్తున్నాడే కానీ, కదలలేక పోతున్నాడు నాగపాశాల ప్రభావం చేత. రాముడు వానరవీరులకు సుగ్రీవాదులకు వెనక్కి వెళ్ళిపొమ్మని, అందరికీ కృతజ్ఞతలని చేయవలసిన అప్పగింతలన్నీ చేసేసాడు.

> **శరద్ఘనం నార్దతి చాతకోఽపి**
>
> **వాననీటిని మాత్రమే త్రాగే చాతకపక్షి కూడా నీరులేని శరత్కాల మేఘాన్ని ఆశ్రయించదు.**
>
> **ధనవంతులనే అందరూ ఆశ్రయిస్తారు. కాబట్టి తమ ధనాన్ని దానం చేయడమే పరమావధిగా దాతలు భావించాలి.**

ఇంతలో వార్త తెలిసి ఉరుకులూ పరుగులూ వేసుకొంటూ గదాపాణియైన విభీషణుడు అక్కడికి వస్తే, ఇంద్రజిత్తేమోనని భ్రమించిన వానరులు భయపడ్డారు. సుగ్రీవుడు అందరికీ ధైర్యం చెప్పించాడు. రామలక్ష్మణుల స్థితికి భోరున విలపించాడు విభీషణుడు.

"హా! కీర్తినీ, రాజ్యాన్ని సంపాదించి పెడతారనుకున్నానే, నా ఆశలన్నీ నిరాశలయ్యాయే" అంటూ ఆక్రోశించే విభీషణుడికి ధైర్యం చెప్పి, 'ఎందుకయ్యా నీకీబాధ! వీళ్ళు మళ్ళీ లేస్తారు. నీరాజ్యం, కీర్తి నీకు వస్తాయిలే! దిగులు పడకు. ముందు వీళ్ళకి విడుదల కలిగే ప్రయత్నం చేద్దాం!" అంటూ ఓదార్చాడు. సుగ్రీవుడి గొప్పదనం యిక్కడ తెలుస్తుంది. తన మామగారైన సుషేణుణ్ణి పిలిపించాడు. "రామలక్ష్మణులని కిష్కింధకు తీసుకు వెళ్ళండి. నేను రావణుడి పని బట్టి సీతను తీసుకొని వస్తాను!" అని ఆజ్ఞాపించాడు.

'అయితే సుషేణుడు 'అది సరే! వీళ్ళు బంధవిముక్తు లవ్వాలి గద! వంటిపై గాయాలూ మానాలి. పూర్వం దైవాసుర సంగ్రామం క్షీరసాగరంలో జరిగింది. అక్కడ చంద్రపర్వతమని, ద్రోణ పర్వతమనీ రెండున్నాయి. ఆ యుద్ధంలో దెబ్బలు తిన్నవారందరికీ మంత్రశక్తితో తయారుచేసిన ఓషధులను బృహస్పతి వాడి, వాళ్ళను తిరిగి శక్తివంతులుగ చేసేవాడు. సంజీవకరణి, విశల్యకరణి వంటి దివ్యమైన ఓషధులు ఆ పర్వతాలమీద అప్పటినుంచీ సురక్షితంగ ఉన్నాయి. మన వానరవీరులు సంపాతి, పనసుడు, హనుమ వంటి వీరులు వెళ్ళి, వెంటనే వాటిని తీసుకురాగలిగితే, ఈ సోదరులనిద్దరినీ బ్రతికించే ప్రయత్నం చేయవచ్చు. ముందది చేయండి!" అన్నాడు.

ఇలా ఎవరి హడావిడిలో వారు కొట్టుకుంటున్నారు. ఇంతలో... గాలి, నీరు అల్లకల్లోలం కాసాగింది. పెను తుఫానులూ వస్తున్నా యన్నట్లైంది. భూమి అదరసాగింది. చెట్లన్నీ గాలి ప్రభావానికి ఊగి ఊగి నేలకొరిగిపోనారంభించాయి.

గాలిలో ఓ దివ్యపరిమళం వ్యాపించింది. దానికి నేలపై ఉండే పాములూ, కీటకాలు వంటి విషపు పురుగులన్నీ గబగబా సాగరంవైపు పోతున్నాయి. పోయినవి, నీళ్ళలోకి పోయి దాక్కొంటున్నాయి.

ఇంతవరకూ బిగించి రామలక్ష్మణులను పట్టి ఉంచిన నాగాలు మెల్లగ సడలడం ప్రారంభమైంది. ఇంతలో ఆకాశంలోంచి విశాలకాయంకల ఓ పెద్దపక్షి అమాంతం వచ్చి అక్కడ వ్రాలింది. దానిరాకతో, నాగపాశాలు కాస్తా రామలక్ష్మణులను వదలివేసి సరసరా ప్రాక్కుంటూ సముద్రంలోకి పారిపోయాయి. ఆ పక్షీశ్వరుడు ఎవరోకాదు. సాక్షాత్తూ శ్రియఃపతికి వాహనమైన గరుత్మంతుడు.

తిన్నగా రామలక్ష్మణుల దగ్గరకు వచ్చాడు. తన రెక్కలతో ఆ సోదరులిద్దరినీ ఒక్కసారి నిమిరాడు. వారి ముఖాలను చల్లగా

తాకాదు. ఇంతవరకూ బాణాలతో, వ్రణాలతో నిండి ఉన్న వారి దేహాలు అమృతహర్త అయిన గరుడుని దివ్యస్పర్శతో వజ్రదేహాలుగ మారాయి. వ్రణాలన్నీ పోయాయి. శక్తిపుంజుకుంది. ఇంతవరకూ పడిన క్లేశాలన్నీ, బాధలన్నీ మటమాయమైపోయాయి. తేజస్సు, వీర్యము, ఉత్సాహము, ఓజస్సు-బలము వంటి అద్భుతమైన గుణాలన్ని ఒక్కసారిగ వారిరువురిలోను విజృంభించాయి. పూర్వంకంటే చురుకుగ వీరి బుద్ధి పనిచేయసాగింది. ఇద్దరూ ఆనందంతో లేచారు. అప్పుడే హాయిగ నిద్రనుండి లేచినంత కాంతితో ప్రకాశించ సాగారు.

సుగ్రీవ, సుషేణాదులకిక ఏ ప్రయత్నాలు చేయనవసరం లేదు. విభీషణుడికి తిరిగి ధైర్యమొచ్చింది. 'హే దివ్యరూపగుణ విభూషణ సంపన్నుడా! ఎవరవు నీవు? నీ దయవల్లగద! ఇంద్రజిత్తు ప్రభావాన్నించి బయటపడ్డమేకాదు. పూర్వంకంటే బలిష్ఠులుగ తయారయ్యాము. మా తండ్రి దశరథుణ్ణి, తాతగారైన అజమహారాజును చూచినంత ప్రసన్నంగ మా మనస్సుంది నిన్ను చూస్తుంటే. నీ గురించి చెప్పవూ?" అంటూ పలకరించాడు శ్రీరాముడు గరుడుణ్ణి చూచి.

ఆనందబాష్పాలు కన్నులలోనిండి, ప్రీతి గొంతులో తొణికిస లాడుతూండగ గరుత్మంతుడు 'హే కాకుత్స్థ! నేను నీ ప్రియమిత్రుణ్ణి! ప్రాణమంత ప్రేమ మనమధ్య ఉంది సుమా! నా పేరు గరుత్మంతు డంటాడు. కద్రూసంతానమైన ఈ విషనాగులను తన అస్త్రాలుగ మార్చుకున్నాడు ఇంద్రజిత్తు. భయంకరమైన విషధారణచేసిన ఈ కాద్రవేయుల ప్రభావాన్ని ఇంద్రాది దేవతలుకానీ, అసురులుకానీ, ఎవ్వరుకానీ తప్పించలేరు. వాళ్ళవల్ల మీకీ ఉపద్రవం వచ్చిందని వినగానే, వేరే మార్గంలేదని, మిమ్మిద్దరినీ విడిపించడానికి నేనే స్వయంగ వచ్చాను. నా స్నేహధర్మాన్ని పాలించాను.

అసలు ఈ రాక్షసులంతా కపటయుద్ధాలలోనే ఆరితేరిన వాళ్ళు. మీరేమో బొత్తుగ ఋజుయుద్ధం చేసే వారు కద! చాల జాగ్రత్తగ ఉండాలి వీళ్ళతో. అదృష్టం కొద్దీ మీరిద్దరూ స్వస్థతను పొందారు. ఏమాత్రమూ పరాకు పనికిరాదు. జాగ్రత్త! మన స్నేహం ఎక్కడిదీ? ఎప్పటిదీ అనే జిజ్ఞాస క్రమంగ తీర్చుకుందువుకాని ఇప్పుడు వద్దులే! నీవాజ్ఞ యిస్తే పోయివస్తా! ముందు కార్యానికి సిద్ధం కండి! లంకను శుద్ధం చేసి, సీతను పొందుదువుగాని" అంటూ ఒక్కసారి ఆలింగనం చేసుకొని, వీపు తట్టి, ప్రదక్షణం చేసుకొని 'వెళ్ళివస్తా' నంటూ రివ్వుమంటూ ఎగిరిపోయాడు గగనతలంలోకి.

వానరులంతా నూతనోత్సాహంతో కేరింతలు కొడుతూ లంకానగరాన్ని దద్దరిల్లజేసారు. ఇది పైకి మనకి కనిపించే, శ్రీరామాయణముయొక్క కథ.

పూర్వాపరాలు అలా ఉంచి ఇందులో వివశుడై తనవాళ్ళ కోసం, తన ఆశ్రితులకోసం ఏదో చేయబోయి చివరకి తన స్వరూపానికే హాని కలిగించుకొన్న శ్రీరాముణ్ణి మనం చూడాలి. తానూ ఏం చేయలేక, ఇక ఎవరూ ఏమీ చేయలేని పరిస్థితి దాపురించేసరికి 'కాగల కార్యం గంధర్వులు తీర్చా'రన్నట్లు గరుత్మంతుడే స్వయంగ వచ్చి, రంగంలోకి దిగి శ్రీరాముణ్ణి ఆపదలోంచి బయటకు తేవలసి వచ్చింది. ఇదొక అందమైన ఆచార్యకృత్యం. ఎలానో చూద్దాం!



# పురాణాలలో నృసింహ కథా వైవిధ్యం

*గత సంచిక తరువాయి*

డా॥ కండ్లకుంట్ల నరసింహమూర్తి- జనగామ

తన శత్రువైన శ్రీహరి భక్తిని తన కుమారునకు ఉపదేశించి, తనకు ద్రోహం తలపెట్టారని రాక్షసరాజు గురువులను నిందించాడు.

ఆ విద్యలు ప్రహ్లాదునికి తాముపదేశించలేదని, ఇతరులెవరూ చెప్పలేదని, అది ఆయనకి సహజంగానే అలవడిందని, తమపై కోపించవద్దని రాజును వారు బ్రతిమి లాడారు. ఎవరూ నేర్పని ఈ విద్య నీకెలా అబ్బిందని తండ్రి కుమారుని ప్రశ్నించాడు. నారాయణునిపైగల అపార భక్తి విశ్వాసాలతోనే తనకా జ్ఞానం సిద్ధించిందని, సంసారపాశబద్ధులకు అది సాధ్యం కాదని ప్రహ్లాదుడు బదులిచ్చాడు. ఆ మాటలను సహించలేని రాక్షసరాజు కుమారుని తొడపైనుండి క్రిందకు పడద్రోసి, కులద్రోహి అయిన తన కుమారుని కొనిపోయి వధించండని రాక్షసులను ఆజ్ఞాపించాడు. తన పినతండ్రిని తెగటార్చిన విష్ణుని ఆతని దాసునివలె ఆరాధిస్తున్నాడు. కనుక ఆ బాలుడే తన భ్రాతృహంతకుడని, ఐదేండ్ల బాలుడే విష్ణుభక్తితో తనను ధిక్కరిస్తున్నాడని, శరీరంలో ఏదైనా అవయవానికి వ్యాధి సోకినప్పుడు వైద్యుడు ఆ అవయాన్ని ఖండించి మిగిలిన శరీరభాగాలను రక్షించునట్లే ఆతనిని బంధించి తనజాతిని కాపాడుకోవాలని దానవరాజు నిశ్చయించాడు.

రాజాజ్ఞను తలదాల్చిన దానవవీరులు భయంకర శూలాలతో బాలుని మర్మస్థానాలలో పొడిచారు. నారాయణుని తనచిత్తంలో నిలిపిన ప్రహ్లాదునియెడ ఆ ప్రయత్నాలన్నీ నిష్ఫలమైపోయాయి. అయినా రాజు తన పట్టుదల వీడక దిగ్గజాలతో త్రొక్కించాడు, పాములతో కరిపించాడు. మారణాయుధాలను ప్రయోగించాడు. శిఖరాదుల నుండి పడద్రోయించాడు, మాయలు పన్ని పీడించాడు, గర్తాలలో పూడ్పించాడు. విషభక్షణం చేయించాడు, ఉపవాసాలతో పీడించాడు. పర్వతగుహలలో, హిమ, వాయు, అగ్ని, జలాల్లో పడవేయించాడు.

ఏ విధమైన ప్రయత్నాలతో కూడ ఆ పుణ్యాత్ముని వధించలేక చింతాక్రాంత చిత్తుడై హింసాకర్మ మానుకున్నాడు. తన ప్రయత్నాలన్నీ వ్యర్థమైపోతున్నాయని, ఆ బాలునివలననే తనకు మృత్యువు కలుగనున్నదేమోనని భీతిచెందాడు. శుక్రాచార్యులవారు వచ్చేవరకు బాలుని వరుణ పాశాలతో బంధించి, ఆతనితో సదుపదేశం చేయించటం బాగుంటుందని చండామార్కులు రాజుకు సలహా ఇచ్చారు. ఆ విషయం దానవరాజుకు సంతోషం కలిగించింది. తనకుమారునికి రాజధర్మాలను గృహస్థ ధర్మాలను ఉపదేశించవలసిందని వారిని ఆజ్ఞాపించాడు. వారి ఉపదేశం ప్రహ్లాదునికి సమ్మతించలేదు. ఆచార్యులు ఇంటిపనులలో నిమగ్నులై ఉన్నప్పుడు ప్రహ్లాదుడు తన తోటి రాక్షసబాలురను ఆటలకు పిలిచి, వారి దృష్టిని ఆటల నుండి మరల్చి వారికి నారాయణతత్త్వాన్ని ఉపదేశించేవాడు.

తనకు ఆ జ్ఞానం ఎలా కలిగిందని రాక్షసబాలురు ప్రశ్నించగా తన తండ్రి తపోనిష్ఠలో ఉన్న సమయంలో తాను మాతృగర్భంలో ఉండగా దేవేంద్రుడామెను అపహరించడం, నారదుడు ఇంద్రుని వారించి తన తల్లికి తన ఆశ్రమంలో కొంతకాలం ఆశ్రయం కల్పించడం, ఆ సమయంలో తన తల్లికి నారదుడు ఉపదేశించిన విష్ణుతత్త్వాన్ని తాను గర్భంలో ఉండి వినడం, దానినే జన్మించినప్పటి నుండి మరువక అనుష్ఠించడం మొదలైన విషయాలన్నీ ఆ బాలురకు ఆశ్చర్యం కలిగించేటట్లు వివరించేవాడు.

ఆ బాలురుకూడ గురువచనాల నాదరింపక ప్రహ్లాదుని బోధనలపై ఆసక్తులై హరిభక్తి పరాయణులుగా మారుతున్న విషయాన్ని గురువులు గ్రహించి రాజుతో విషయం నివేదించారు.

దైత్యపతి ఉగ్రుడై తనకుమారుడు, తాను పెడత్రోవ అనుసరించడమే కాక, ఇతర బాలురను కూడ తన మార్గానికి ఆకర్షిస్తున్నాడని, పుత్రుని పరిమార్చేందుకు మనస్సులో దృఢనిశ్చయం చేసుకున్నాడు. పరుషవాక్యాలతో కుమారుని అధిక్షేపించి, లోకపాలురు కూడ తన ఆజ్ఞను అతిక్రమించేందుకు భయపడుతుండగా, నీకింత శక్తి ఎక్కడి నుండి వచ్చిందని కుమారుని ప్రశ్నించాడు.

నారాయణుడే తన బలమని, అసురభావాన్ని వదలి నారాయణుని ఆశ్రయించమని, అరిషడ్వర్గాన్ని జయించమని పుత్రుడు తండ్రికి హితబోధ చేశాడు. ఆ మాటలకు దానవేశ్వరుడు మరీ ఉగ్రుడై, తనకంటే జగదీశ్వరుడు లేడని,

ఆతడు సర్వాంతర్యామి అయితే ఈ స్తంభంలో చూపగలవా అని కుమారుని ప్రశ్నించాడు.

ప్రహ్లాదుడు తన రక్షకుడని నమ్మిన హరి ఆ స్తంభంలో కనిపించకపోతే, కుమారుని తలను పగులగొడతానని హెచ్చరించాడు. పరుషవాక్యాలతో కుమారుని నిందిస్తూ, మహా భాగవతుడైన సుతుని పరిమార్చేందుకు కరవాలం తీసుకొని, సింహాసనం నుండి తటాలున లేచి తన శక్తినంతా ప్రదర్శిస్తూ పిడికిలితో స్తంభాన్ని చరిచినాడు.

ఆ పిడికిలి దెబ్బతో బ్రహ్మాండం బ్రద్దలైనట్లు భీకరధ్వని వినిపించింది. తన సర్వాంతర్యామిత్వాన్ని నిరూపించేందుకు కేవల మృగాకృతి కాక మానవాకృతీ కాకుండా అద్భుతమైన మిశ్రమ నర–సింహరూపాన్ని ధరించి సభామధ్య స్తంభంలో స్వామి ఆవిర్భవించాడు. నరుడు కాదు, మృగము కాదు. ఇదెక్కడి అద్భుతరూపమని హిరణ్యకశిపుడు ఆశ్చర్యచకితుడైనాడు. భయంకరమైన ఆ రూపాన్ని దర్శించి రాక్షసరాజు అధైర్యపడి తనకు చావు తప్పదని నిశ్చయించుకొని కూడ సింహనాదం చేస్తూ గదాపాణియై నృసింహుని ఎదిరించాడు. గరుత్మంతుడు మహోరగాన్ని పట్టినట్లు గదాయుతుడైన దైత్యుని గదాధరుడైన హరి గుప్పిట పట్టుకున్నాడు. అయినా వైనతేయుని తప్పించుకున్న పన్నగంవలె అసురుడు నృసింహుని చేతులలో నుండి తప్పించు కున్నాడు.

నరహరి తన శక్తికి భయడపతున్నాడని రాక్షసుడనుకొని వాలుపలకను పట్టుకొని ఆయన పైకి లంఘించాడు. నరకేసరి డేగవలె వానిని ఒడిసిపట్టుకున్నాడు. పామునోటికి చిక్కిన ఎలుకవలె దానవుడు బయటపడలేక, తప్పించుకొనేందుకు అనేక విధాల ప్రయత్నించాడు. నృకేసరి వానిని అదిమిపట్టి, ద్వారం మధ్యలో కూర్చుని తొడపై పడవేసి, వజ్రాయుధ సమానమైన వాడిగోళ్ళతో అవలీలగా వాని వక్షాన్ని చీల్చాడు. సంరంభంతో భయంకరమైన కళ్ళతో, నోరు తెరచి నాలుక చాచి పలుమార్లు నాకుతూ, ఆ దైత్యుని రక్తం సోకి ముఖము, సటాపటలము పెరుపెక్కగా, ఏనుగును కూల్చి దాని ప్రేవులు దాల్చిన సింహంవలె కనిపించాడు. తరువాత వానిని నేలపై పడవేసి, ఆయుధాలతో తలపడిన వాని అనుచరులు వేలాదిమంది రాక్షసులను పరిమార్చాడు. ఆయన తేజస్సు ముందు ఆకాశం, దిక్కులు నిస్తేజమైపోయాయి.

తరువాత నృసింహుడు ఆ సభలో ఉన్నతాసనంపై కూర్చున్నాడు. మిక్కిలి కోపంతో సహింప శక్యం కాని ముఖవర్చస్సుతో ప్రకాశిస్తున్న స్వామిని భయంతో ఎవ్వరూ సమీపించలేకపోయారు. బ్రహ్మ, రుద్ర, ఇంద్రాది దేవతలు, ఋషులు కొంతదూరంలో నిలిచి శాంతించవలసిందని పరిపరి విధాల స్తుతించారు. అయినప్పటికి ఆయన శాంతించనందున అందరు కలిసి లక్ష్మీదేవిని ఆయనవద్దకు పంపారు. అట్టి అద్భుతరూపాన్ని ఆమె ఇదివరకు కనలేదు, వినలేదు కనుక స్వామిని సమీపించేందుకు ఆమెకూడ వెనుకాడి ఒకచోట ఒదిగి నిలిచింది. వారందరు అప్పుడు ప్రహ్లాదుని స్వామివద్దకు వెళ్ళి ప్రార్థించమన్నారు. పరమ భాగవతోత్తముడైన ఆయన వారి ఆజ్ఞను శిరసావహించి నృసింహునివద్దకు వెళ్ళి సాష్టాంగ దండప్రణామాలాచరించాడు. స్వామి కరుణాంతరంగుడై బాలుని లేవనెత్తి తన దివ్య శ్రీహస్తాన్ని ఆతని శిరస్సుపై మోపి ఆశీర్వదించాడు. హరి కరస్పర్శతో పాపాలన్నీ నశించిన ప్రహ్లాదుడు గద్గద కంఠంతో స్వామిని అనేక విధాల స్తోత్రం చేశాడు. అసురవధ జరిగింది. కనుక ఉగ్రరూపాన్ని ఉపసంహరించమని ప్రార్థించాడు. *(ఇంకా ఉంది.)*




*గత సంచిక తరువాయి*

**వైశారదీ**

వ్యూహమనే పూర్ణతత్త్వంలోంచి వెలువడే "విభవ" మనే మరో పూర్ణతత్త్వాన్ని గురించి మనం తెలుసు కుంటున్నాం. ఈ విభవమనే స్థానం నాలుగవది, ఇప్పటి మనక్రమంలో.

అందులో కొన్ని అవాంతర భేదాలున్నా యని మనం తెలుసుకున్నాము.

అవే 1. పరిపూర్ణమైనవి, 2. పూర్ణమైనవి. 3. ఆవేశావతారాలు, 4. కళావతారాలు, 5. అంశావతారాలు, 6. అంశాంశావతారాలు. వీటిల్లో మూడవది ఆవేశావతారం. ఇది తిరిగి రెండు రకాలుగ ఉంటుంది. స్వరూపావేశావతారాలు. శక్త్యావేశావతారాలు అని.

పరశురాముడు, పృథుచక్రవర్తి వంటివి స్వరూపావేశావతారాలు. భగవంతుడావహించి ఉన్నంత వరకు, వారు చేసే కార్యాలు అత్యద్భుతాలుగ ఉంటాయి ఆ తర్వాత వారు మామూలువారైపోతారు.

నిజానికివి భగవంతుని సాక్షాత్ అవతారాలు కావు. ఒక జీవుణ్ణి ఆధారంచేసుకొని, అంటే ఆతణ్ణి అధిష్ఠించి భగవంతుడు ప్రవర్తిస్తాడన్న మాట. అందుకే ఇవి ముముక్షువులకి అంతగ ఉపాసించదగినవి కావంటారు. అయినా అవేమిటీ అనేదైతే కాస్త తెలియాలిగద! అందుకే ఈ వివరణం.

పై రెండిటిలో పరశురామునియందు ఆవేశించి, దుష్ట పాలకులను దునుమాడడం ద్వారా భూభారాన్ని తగ్గించాడు. ఇరవైఒక్కసార్లు అలా భూమిచుట్టు తిరిగి, అక్కడక్కడ ఉండే దుష్టపాలకుల నిర్మూలనం చేయడం ద్వారా లోకులను కాపాడాడు. తనే తిరిగి శ్రీరామునిగా సాక్షాత్ అవతరించి ఉన్నాడు కనుక, ఇక, ఎవనియందు ఆవహించి పనిచేయించడం అనవసరమని భావించి ఉంటాడు. సీతారామకళ్యాణ యాత్ర అనే ఒక సందర్భాన్ని తానే తయారు చేసుకుని, మిథిలానగరం నుంచి అయోధ్యకి తిరిగి వచ్చే సందర్భంలో ఆ పరశురాముణ్ణి ఎదుర్కొన్నాడు. ఎంతైనా జీవుడికంటూ కొంత అహంకారాది రాజసప్రవృత్తి ఉంటుంది కద! తత్ప్రభావంతో పరశు రాముడు శ్రీరామునిపై సవాలువిసిరాడు. ఆతనిలో ఉండే తన స్వరూపాన్ని భగవానుడు శ్రీరాముడిగా ఉండి వెనుకకి తీసేసుకున్నాడు, ఆతని దగ్గరుండే విష్ణుధనుస్సును తీసేసుకునే వ్యాజంతో, దాంతో ఆ పరశురాముడు కాస్తా మామూలు ఋషి అయిపోయాడంతే...

అలానే పృథు చక్రవర్తి ఒక స్వరూపావేశావతారం. అస్తవ్యస్తంగ ఉన్న భూమిని తన పాలనలో వ్యవస్థితం చేశాడు. ఆయనకి ముందు నగరాలు, గ్రామాలూవంటి తేడాలు తెలియవు. ఏ జంతువులు ఎక్కడ ఉండాలో క్రమమేమీ ఉండేది కాదు. పృథు చక్రవర్తి అనే జీవునిపై భగవంతుడు అధిష్ఠించి ఉండి అద్భుతంగ భూమిని నివాసయోగ్యంగ చేశాడు. జీవులకు ఆహారం లభించేది కాదు అంతకుముందు. భూమిని గోవుగ మార్చి, మనువును దూడగ చేయించి, వీరికి కావలసిన ఆహారాలను సంపాయించగలిగేట్టు మంచి వ్యవసాయాన్ని అభివృద్ధి పరిచాడట. సాదా జంతువులైన గోవులు గుఱ్ఱాలు, ఏనుగులు వంటివి వాటివాటి శాలలో ఉండాలి. క్రూరమృగాలు అడవులకు పరిమితమవ్వాలి. ఇందరుండే అదొక గ్రామం. ఇందరుంటే నగరం, ఆపై మహానగరం. జలతీరాలలో ఉండేవి పట్టణాలు... ఇలా అన్ని రకాల జీవరాశులకీ క్రొత్త జీవితాన్ని ప్రసాదించాడు. దానివల్లనే, అంతకుముందు 'అజనాభ'మనే పేర వ్యవహరించే ఈ భూమిని ఈ చక్రవర్తి పేరనే ఇకనుండి వ్యవహరిద్దామని సకల మానవులు, దేవతలు నిర్ణయించారు. దాంతో ఈ అజనాభము కాస్తా "పృథివి" అయిపోయింది.

అంత గొప్ప కీర్తి కలిగిన పృథుచక్రవర్తి ఒక 'స్వరూపావేశావతార'మని తెలిపారు. ఆ పని పూర్తి అయిపోయిన తర్వాత

భగవత్స్వరూపం తిరోధానం చెందింది. ఆయన యోగాగ్నితో తనువు చాలించాడు. పరశురాముడు ఉగ్రరూపం. పృథువు పరమసాత్త్వికావతారంగను కనిస్తుంది.

అయినా ఇదీ గౌణావతారం కనుకనే ముముక్షువులు దీనినీ ఉపాసించ తగదు. ఇలా కొన్ని స్వరూపావేశావతారాలు.

తాత్కాలికంగ ఒక్కొక్కపని చేయవలసి వచ్చినపుడు ఏదో ఒక సుకృత విశేషము కలిగిన జీవుడియందు తన శక్తిని పెంచి, అది ఉన్నంత వరకూ వారిచే అద్భుతకృత్యాలు చేయిస్తూంటాడు. స్వరూపావేశాలలో ఒకసారే ఉంటాడు. ఒకసారి వారి నుండి తన శక్తిని ఉపసంహరించుకుంటే తిరిగి ఆ జీవుడికి దివ్యశక్తిని మరి యివ్వడు. పరశురాముడివద్ద గమనించవచ్చు.

కానీ, శక్త్యావేశావతారాలు అలా కాదు. కొద్దిశక్తిని యిస్తాడు. వాళ్ళచే కొంత పనిచేయిస్తాడు. తిరిగి ఆ పనికాగానే ఆ శక్తిని వెనుకకు తీసుకున్నా, అవసరమేర్పడితే ఆ శక్తిని, వారికి, తిరిగి తిరిగి ప్రసాదిస్తూ వారిచే దివ్య కార్యాలు చేయిస్తూ ఉంటాడు. ఆ విష్టమైన శక్తి ఉన్నప్పుడే తప్ప, ఇతర సమయాలలో వీరు కూడా సామాన్య మానవులవలెనే ప్రవర్తిస్తూ ఉంటారనేది వారి వారి చరిత్రలలో చూడవచ్చు.

వ్యాసుడు వేదవిభాగం చేసేటపుడు “కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధినారాయణం ప్రభుమ్” అన్నట్లు నారాయణుడేనా అన్నట్లున్నాడు. భగవంతుని శక్తిలేనప్పుడు తన కుమారుడైన శ్రీశుకుని వెంటపడి పరుగులు పెడుతూ “హే పుత్రా! హే శుకా!...” అంటూ పిల్లవానికోసం శోకించాడు. ఇది సహజమైన ఆతనిరూపం. అలానే పురాణాలు, మహాభారతంవంటివి రచించేటప్పుడు “వ్యాసాయ విష్ణురూపాయ” అన్నట్లున్నాడు. మళ్ళీ ఆ శక్తిని తీసేసుకోగానే బదరికాశ్రమంలో కూర్చున్న ఆ ఋషి చింతాక్రాంతుడై విలపించాడు. నారదుడు అక్కడికి చేరి వ్యాసుణ్ణి శ్రీమద్భాగవత రచనకు ప్రేరేపించి, ఆతని శోకాన్ని తగ్గించ వలసి వచ్చింది. ఇలా మాటిమాటికి వీళ్ళ జీవితాలలో జరుగుతూ ఉంటుందన్నమాట. ఇవి శక్త్యావేశము లైన అవతారాలలో గమనించవచ్చు.

ఇలాంటి వారెందరో ఉన్నా ఉదాహరణ కొన్నింటినైన మనం గుర్తించవచ్చునని శ్రీపాంచరాత్రాగమ సంహితలలోని వివరాలు శ్రీమణవాళ మహామునులు తెలిపారు. చతుర్ముఖుడు, మహారుద్రుడు, బుద్ధుడు, వ్యాసుడు, కార్తవీర్యార్జునుడు, కుబేరుడు, అగ్ని మొదలైన అవతారాలన్ని కొన్ని ఉదాహరణలు మాత్రమే.

**4. కలావతారం:** సాక్షాత్తు భగవానుడే ఒక అవతారం ధరించి వచ్చినా, ఆయన కళలలో కొద్ది కళలను మాత్రమే ప్రకటించి, అంతకే పరిమితమై ఉండిపోతే అలాంటి అవతారాలను కలావతార మనవచ్చు. మత్స్యావతారం. ఇది భగవానుడే ధరించిన అవతారం. అయినా, అప్పటి అవసరాన్ని బట్టి సత్యవ్రతుడనే రాజును జీవవర్గమంతటి తోటీ ఓ పడవలో నిలిపి, ఆ రాజునే శ్రాద్ధదేవుడంటారు. ప్రళయం నుండి కాపాడాడు. చరిత్రలో మనకి తెలిసే మొదటి జలప్రళయం అంటే ‘సునామీ’ అదే కాబోలు! దాని నుంచి కాపాడి, అది తగ్గగానే వైవస్వత మన్వంతరా నికి ఆ సత్యవ్రతుణ్ణే వైవస్వత మనువుగ చేయడమే మత్స్యావతార ప్రయోజనం. ఆ తర్వాత హయవదనుడైన ఓ రాక్షసుణ్ణి వధించి, వేదవిజ్ఞానాన్ని బ్రహ్మగారికి ప్రసాదించాడు. ఇవి తప్ప ఈ అవతారములో ఇతర కృత్యాలేమీ పెద్దగా ఉండవు. అంచేత ఇది కలావతారం. హంసావతారం, హయగ్రీవాదుల అవతారాలు గూడ ఈ కోవకి చెందినవే!

**5. అంశావతారాలు :** ఇవి మరల, ఎవరో కొందరు మహానుభావులను అతిలోక ప్రభావశాలురుగ చేసి వారి ద్వారా జగత్కల్యాణాన్ని జరిపించే అవతరాలు. శుక, సనకసనందనాదులు, నారదుడు ఈ కోవకు చెందిన వారు.

**6. అంశాంశావతారాలు:** లౌకికులైన సుర, నరులలో ఏదోకాస్త గొప్పదనం కలిగి, వారు లోకానికి ఆశ్చర్యము కలిగేటట్లు ఉపకార ప్రవృత్తితో ఉంటే, అవన్నీ భగవదంశం తోటే ఏర్పడే అవతరాలు.

ఇలా చూచినపుడు ‘యద్యద్ విభూతిమత్ సత్త్వం శ్రీమత్, ఊర్జిత మేవవా... మమ తేజోంశ సంభవమ్” అని భగవానుడే సెలవిచ్చినట్లు ‘ఈలోకంలో కానీ పరలోకాలలో కానీ అత్యధిక ప్రభావశాలురుగ ప్రవర్తించే వారందరూ ఈ భగవదంశాంశా వతారాలే అంటుంది శ్రీమద్భాగవతం. (సశేషం)

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...) శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

''స్వామి అనుగ్రహంతో ఆయన దగ్గరకు చేరటం సామాన్యులకు సాధ్యమా! వారెంతో నిష్ఠాగరిష్ఠులు కాబట్టి వారి కంతటి భాగ్యం లభించిందని తిరుక్కోళూరమ్మాళ్ వాపోయారన్న మాట" బామ్మ.

"అత్తయ్యా ఎలాగూ మొదలు పెట్టారు కదా! వడుగ నంబిగారి గురించి కూడా చెప్పండి."

ఆళ్వార్లలో మధురకవియాళ్వార్ అంతిమోపాయ నిష్ఠాగరిష్ఠులుగా ప్రసిద్ధి చెందారు. నమ్మాళ్వార్లు తప్ప మరో దైవం తనకు తెలియదని 'తేవు మత్తరియేన్' అని చెప్పుకున్నారు. మనకు పరమాచార్యులైన భగవద్రామానుజాచార్యుల శిష్యకోటిలో అంతటి నిష్ఠాగరిష్ఠులు వడుగనంబిగారు. తమ ఆచార్యులే తమకుపాయమని వారి కైంకర్యమే ఉపేయమని నమ్మి నిరంతరం 'రామానుజా!' అనే నాలుగక్షరాల మంత్రాన్ని జపిస్తూ ఉండేవారు. ఒకసారి వడుగనంబి తమ ఆచార్యులై రామానుజాచార్యులతో వేరే ఊరికి ప్రయాణం కట్టాల్సి వచ్చింది. సామాన్లన్నీ సర్దారు. వడుగనంబి తమ ఆచార్యుల నిత్యారాధన దైవమయిన వరదరాజుల విగ్రహాలతో తను నిత్యారాధన చేసే ఆచార్యుల పాదుకలు కలిపి మూట కట్టి తలమీద పెట్టుకున్నారు. అది గమనించిన రామానుజులవారు వడుగనంబిని ఆక్షేపించారు. దానికి నంబి ఏమని బదులిచ్చారో తెలుసా! తమరి పెరుమాళ్ళకంటే మా పెరుమాళ్ళు తక్కువవేమీకాదు' అన్నారుట.

"దానికి ఆచార్యులు ఏం చెప్పారో?"

"ఏం చెప్పగలరు! మన సంప్రదాయంలో చరమోపాయ నిష్ఠ ఉన్నతమైనది కదా! దానిని అక్షరాలా ఆచరించేవారిని ఏమని ఆక్షేపించగలరు. ఆచార్యులే శిష్యుల వాదనకు తలవొగ్గాల్సివచ్చింది."

"మొదలియాండాన్, కూరత్తాళ్వాన్ కూడా రామానుజా చార్యుల ప్రధాన శిష్యగణంగా చెప్తారుగా పిన్ని?"

"వారూ ప్రధాన శిష్యులేకానీ వారిద్దరినీ వడుగనంబిగారు ఏమని పిలిచేవారో తెలుసా? 'ఇరుకరైయాన్' అనేవారు. ఇరుదరులు పట్టుకున్నవారు అంటే ఇటు ఆచార్యులను, అటు పెరుమాళ్ళను కూడా పట్టుకున్నవారని అర్థం."

"తిరుక్కోళూరమ్మాళ్ 'ఇంగుపాల్ పొంగుమెన్నానో వడుగ నంబియైప్పోల' అన్నారు కదూ అత్తయ్యా!"

''అవునమ్మా. ఒకసారి శ్రీరంగంలో ఆచార్యులతో వడుగనంబిగారు వేంచేసి ఉండగా నంబెరుమాళ్ (శ్రీరంగంలో ఉత్సవర్లు). వీధిపురప్పాడు(శోభాయాత్ర) జరుగుతున్నది. ఆచార్యులు లేచి వీధిలోకి వెళుతూ "వడుగా! పెరుమాళ్ళు వేంచేస్తున్నారు. సేవించడానికి రండి" అన్నారు. అప్పుడు వడుగనంబిగారు వంటింట్లో పాలు కాస్తున్నారు. ఇప్పటిలా గ్యాసు, కరెంటు స్టౌవ్‌లు లేవు కదా! కట్టెలపొయ్యిమీద కాస్తున్నారు. మంట ఆర్పితే మళ్ళీ వెలిగించటం కష్టం. పైగా ఆపాలు తమ ఆచార్యులకోసం కాస్తున్నారు. ఆ పనిలో ఎలాంటి ఆటంకాన్ని ఆయన సహించరు. అందుకని "మీ పెరుమాళ్ళను సేవించడానికి వస్తే మా పెరుమాళ్ళకు పాలు పొంగిపోతాయి. దాని వలన వాసన, రుచి మారిపోతాయి. అందుకని నేను రాలేను" అని బదులిచ్చారట.

"ఆహా... ఎంత ఆచార్యనిష్ఠ!"

"అందుకే తిరుక్కోళూరమ్మాళ్ వడుగనంబిలా ఇక్కడ పాలు పొంగుతాయి అని ఆచార్యనిష్ఠ చాటుకున్నానా? అని వాపోతున్నారు.

"పిన్నీ.. స్వామి భక్తులతో నిజంగా మాట్లాడతారంటావా?"

అదేంమాట తల్లీ ఏకాలంలోనైనా అంతటి భక్తిప్రపత్తు లున్న భక్తులుంటే స్వామి మాట్లాడకుండా ఎలా ఉంటారు. అలా భక్తులతో మాట్లాడేవారనటానికి ఎన్నో దృష్టాంతాలు కనపడతాయి. అంతెందుకు తిరుక్కచ్చినంబి గురించి వినలేదా! రోజూ వరదరాజస్వామికి వీవన వీస్తూ మాట్లాడేవారు కదా!"

"అవునవును. ఆ సమయంలోనే రామానుజాచార్యులు అడగమన్న ఆరుప్రశ్నలు అడిగి జవాబులు తెలుసుకొని ఆచార్యులకు చెప్పారు కదూ!"

"అవును తల్లీ! అసలు తిరుకచ్చినంబిగారిది చెన్నైలోని 'పూవిరుందమల్లి'. దానినే ఇప్పుడు 'పూందమల్లి' అంటున్నారు. ఒకప్పుడు అక్కడ మల్లెపూల తోటలు విస్తారంగా ఉండటం వలన ఆ పేరు వచ్చింది!"

"మరి కంచికి ఎందుకు వెళ్ళారు?"

"గజేంద్రదాసులనేవారు వీరి తండ్రిగారు. వీరు జన్మతః వైశ్యులు. వ్యాపారం వీరి కులవృత్తి. వీరి తండ్రిగారు యుక్తవయస్కుడైన కొడుకును పిలిచి కొంతమూలధనమిచ్చి 'వ్యాపారం చేసి ఈ డబ్బును అభివృద్ధిచేయ'మన్నారు. వీరు ఆ సొమ్మును భగవద్భాగవత కైంకర్యానికి ఖర్చుచేశారు. కొంతకాల మయ్యాక తండ్రిగారు తిరుకచ్చినంబిని 'ఆ సొమ్మును ఎంత వృద్ధి చేశావ'ని అడిగారు. దానికి వీరు 'దుఃఖాతీతమైన మహానగరంలో దాచి ఉంచాను' అన్నారు.

"అంటే ఏమిటి?"

"దుఃఖమేలేని చోటు పరమపదము. అక్కడికి చేరటానికి భగవద్భాగవత కైంకర్యానికి వెచ్చించి పుణ్యంగా మార్చారన్న మాట. అది విని తండ్రిగారు కోపంతో కొడుకును మందలించారు.

తిరుక్కచ్చినంబికి కూడా కోపంవచ్చి ఇల్లువదిలి వెళ్ళిపోయారు. కొంతకాలం శ్రీరగంలో ఆళవందార్ల శ్రీచరణాల వద్ద సేవచేశారు. వారి ఆజ్ఞమేరకు కంచిచేరి అక్కడ వరదరాజస్వామికి కైంకర్యం చేసేవారు. వీరు కంచిలో నివసించటం వలనే తిరుకచ్చినంబి అనే పేరు వచ్చింది. వీరినే కాంచీపూర్ణులని కూడా పిలుస్తారు.

"పిన్నీ అందరికీ చివర 'నంబి' అని ఎందుకు పేరు ఉంది?"

"గుణపూర్ణులను 'నంబి' అంటారు. మనం అలాంటి గుణపూర్ణుల గురించే చెప్పుకుంటున్నాం కాబట్టి అందరి పేర్లు 'నంబి'తో ముగుస్తున్నట్టు కనపడుతుంది. అంతే!"

"మరి రామానుజుల ప్రశ్నలకు జవాబులు వరదరాజ స్వామి నడిగి చెప్పిందెప్పుడు?"

"ఇదిగో అక్కడికే వస్తున్నా. రామానుజులవారికి పూర్వాశ్రమంలో 'లక్ష్మణముని' అని పేరు. వారు కంచిలో విద్యాభ్యాసం చేసే రోజులలో తిరుకచ్చినంబి వరదరాజస్వామి కైంకర్యం చేస్తున్నారు. తిరుకచ్చినంబి జ్ఞాన, భక్తి, అనుష్ఠానాలను చూసి వారి శిష్యులు కావాలని కోరుకున్నారు. కాని తిరుక్కచ్చి నంబి దానికి ఒప్పుకోలేదు."

"ఎందుకని పిన్నీ?"

"ముందే చెప్పాను కదా! వీరు వైశ్యకులంలో పుట్టారని, మరి లక్ష్మణముని బ్రాహ్మణులు. ఇప్పటిలా కాదు కదా! ఆ రోజులలో వర్ణవ్యవస్థ ఖచ్చితంగా పాటించేవారు."

"మరి లక్ష్మణముని ఎందుకు తిరుకచ్చినంబి దగ్గర శిష్యరికం చేయాలనుకున్నారు. వారికి వర్ణభేదం తెలియదా!"

"తెలుసు. కాని వారు జన్మవర్ణాన్ని తృణీకరించారు. చేసే కర్మనే పరిగణించారు. అందుకే తిరుకచ్చినంబి శిష్యరికం చేయాలనుకున్నారు. సరే నంబి అంగీకరించకపోయే సరికి లక్ష్మణముని బాధపడ్డారు. "సరే కనీసం నా సందేహాలను తీర్చండి. వరదరాజస్వామి ఏకాంతంలో మీతో సంభాషించే సమయంలో నా అనుమానాలను వారికి విన్నవించి సమాధానాలు తెలుసుకొని చెప్పండి అన్నారు. రోజూలాగానే ఆరోజు రాత్రి ఏకాంతవేళలో వరదజాస్వామి అర్చారూపం నుండి వెలువడి తిరుకచ్చినంబితో మాట్లాడుతున్నాడు. ఈయన కూడా రోజూలాగే స్వామికి వీవన కైంకర్యం చేస్తున్నారు. నంబిని చూసి "ఏమిటి నంబీ ఏదో అడగాలనుకుంటున్నట్టున్నావే!" అన్నారు స్వామి.

"అవును స్వామీ. లక్ష్మణముని ఆరు సందేహాలు తమకు విన్నవించి సమాధానాలు తెలుసుకొమ్మని కోరాడు" అని చెప్పాడు.

"సరే! సరే! లక్ష్మణముని మనసులోని ఆరువార్తలను మేమే చెప్తాం అని ఆరువార్తలు చెప్పారు. వాటి సమాధానాలూ చెప్పారు. అవి...

1. **మేమే పరమపదార్థము (పరమ్‌పొరుళ్)**
2. **జీవాత్మ పరమాత్మ భేదము సత్యము.**
3. **ప్రపత్తియే పరమపదము పొందుటకుపాయము.**
4. **ఈ మార్గాన్ననుష్ఠించిన వారికి దేహాంతంలో మోక్షప్రాప్తి ఉంది.**
5. **ఇటువంటి ప్రపన్నులకు అంతిమ స్మృతి అవసరం లేదు.**
6. **లక్ష్మణమునిని పెరియనంబి(మహాపూర్ణులు)ని ఆశ్రయించ మని చెప్పండి"** అని చెప్పారు.

తిరుక్కచ్చినంబి ఆ సమాధానాలు విని ఎంతో సంతోషించి మరుసటిరోజు లక్ష్మణమునికి ఈ వార్తలన్నీ చెప్పారు. అందుకే మన తిరుక్కోళూరమ్మాళ్ **అవనురైక్క పెత్తేనో తిరుకచ్చియార్ పోలే** అన్నది. 'వారు మాట్లాడగా విన్నానా తిరుకచ్చిగారిలాగా?' అని అర్థం. *(సశేషం)*

# నేర్చుకుందామా! - 13

శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-విజయవాడ

**ప్రాణేశ! నీ మంజుభాషలు వినలేని**
**కర్ణరంధ్రంబుల కలిమియేల?**
**పురుషరత్నమ! నీవు భోగింపగాలేని**
**తనులతవలని సౌందర్యమేల?**
**భువనమోహన, నిన్ను పొడగనగా లేని**
**చక్షురింద్రియముల సత్త్వమేల?**
**దయిత! నీ అధరామృతం బానగాలేని**
**జిహ్వకు ఫలరస సిద్ధియేల?**

**నీరజాతనయన నీ వనమాలికా**
**గంధమబ్బలేని ఘ్రాణమేల?**
**ధన్యచరిత, నీకు దాస్యంబు సేయని**
**జన్మమేల, యెన్ని జన్మలకును.**

శ్రీ పోతనామాత్యులవారి కవితాశక్తిలో రుక్మిణీదేవి దాస్య భక్తిపుష్పం పరిమళాలు వెదజల్లిన పద్యం ఇది.

ఎన్నో జన్మల తపఃఫలం ఈ శరీరం.

**'విచిత్రా దేహసంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్'** అన్నట్లు వినడానికి చెవులు, భోగానుభవానికి శరీరం, చూడడానికి కళ్ళు, రుచులను ఆస్వాదించడానికి నాలుక, వాసనలను తెలుసు కొనడానికి ముక్కు... ఇలా పంచేంద్రియాల సంపుటి సర్వప్రాణికి సహజం.

రుక్మిణీదేవి దృష్టిలో ఈ పాంచభౌతిక శరీరానికి పరమావధి వేరు. ప్రాణేశ్వరుడైన భగవంతుని కలయికలోని ఆనందమే ఇంద్రియాలున్నందుకు చరితార్థం.

ప్రాణేశుని తియ్యని మాటలు వినలేని చెవులెందుకు? ఆయన అనుభవం పొందని ఈ శరీరం ఎందుకు? భగవంతుని దర్శించలేని కన్నులెందుకు?

ఆ స్వామి అధరామృతం ఆస్వాదించలేని నాలుక ఎందుకు?

నారాయణుని వనమాలికా పరిమళాలను ఆస్వాదించ లేని ముక్కువలన లాభమేముంది?

అసలు అతని సేవకు ఉపయోగపడని ఈ జన్మ ఎందుకు?

శరీరమున్నందుకు స్వామిసేవకు ఉపయోగపడడమే సార్థక్యం. పంచ ఇంద్రియాలు పంచభూతాల గుణాలను ధ్వనింప చేస్తున్నాయి.

చెవులకి శబ్దగుణం, తనువుకు స్పర్శగుణం, కనులకి రూపాస్వాదనం, నాలుకకి రుచుల రసాస్వాదనశక్తి, నాసికకి గంధం గ్రహించేశక్తి సహజం కదా!

వీటన్నింటిని పరమాత్మ సేవలో ఉపయోగించి ధన్యులు కావాలి అని మహోత్తమ సందేశం.

# మన ఆళ్వార్లు

- శ్రీ నృసింహ -



తిరుమొళ్ళిశై ఆళ్వారు

*గత సంచిక తరువాయి*

**తిరుమొళ్ళిశై ఆళ్వారు**

మన ఆళ్వారులు 12మందిలో నాల్గవవారు తిరుమొళిశై ఆళ్వారు. వీరి జీవితకథ అత్యంతాశ్చర్యకరంగా, ఆనంద ప్రదంగా ఉంటుంది.

పూర్వం మహర్షులంతా కలసి బ్రహ్మగారి దగ్గరకి వెళ్ళారు. ఆయనకి నమస్కరించి, 'పితామహా! ఈ భూమిమీద చాలా గొప్ప పుణ్యక్షేత్రం ఏదో తెలియచెయ్యి. అక్కడ మేం తపస్సు చేసుకోవాలని అనుకొంటున్నాం అని ప్రార్థించారు. వెంటనే బ్రహ్మగారు విశ్వకర్మని పిలిపించారు. మహీసారం అనే క్షేత్రం చాలా గొప్పదని వివరంగా చూపించమన్నారు.

విశ్వకర్మ ఒక త్రాసుని తెప్పించి మహీసారక్షేత్రాన్ని ఒకవైపుపెట్టి, మిగిలిన భూమండలమంతా రెండోవైపుపెట్టి తూచాడు. భూమండలంపైకి తేలింది. మహీసారం క్రిందికి మొగ్గింది. విశ్వకర్మ దానిని ఋషులకి చూపించి చూశారా! ఈ మహిలోనే ఈ క్షేత్రం సారవంతమైంది అని తెలుసుకున్నారు కదా అన్నాడు. అప్పుడు బ్రహ్మగారు ఆ క్షేత్రానికి మహీసారం అని పేరు పెట్టారు. ఆ ఊరే కాలక్రమంలో తిరుమొళిశైగా ప్రసిద్ధికి ఎక్కింది.

అదే క్షేత్రంలో భార్గవుడు అనే ఋషి దీర్ఘసత్రయాగం చెయ్యాలని సంకల్పించాడు. దానికి ముందు గొప్ప తపస్సు ప్రారంభించాడు. అతని తపస్సుకి దేవతలు భయపడిపోయారు. ఎలాగైనా అతని తపస్సు పాడు చెయ్యాలని అనుకున్నారు. కొందరు అప్సరసలను పంపించారు. కాని అతని తపస్సుకి ఆ అమ్మాయిలు భయపడిపోయి వెనక్కి వెళ్ళిపోయారు. కనకాంగి అనే అప్సరస మాత్రం ఏమైనాసరే వచ్చిన పనిని సాధించాలి అనుకొంది. తియ్యగా పాడడం మొదలు పెట్టింది. మనోహరంగా గానం సాగుతోంటే కన్నులు విప్పాడు భార్గవుడు. అద్భుతనాట్యంతో అతని మనసును దోచుకొందావిడ. తపస్సు భగ్నమైంది. కనకాంగి గర్భవతి అయింది. అయితే రోజులు నిండకుండానే గర్భం పడిపోయింది. ఆ పిండాన్ని కనకాంగి ఒక వెదురుపొదలో పెట్టి, అనుకున్న పనిని సాధించేశా అనే తృప్తితో స్వర్గానికి వెళ్ళిపోయింది. అయ్యో నా తపస్సు చెడిపోయిందే అని భార్గవుడు సిగ్గుపడి మళ్ళీ తపస్సు చేసుకోవాలని వేరే అడవికి వెళ్ళిపోయాడు. వెదురుపొదలో విడిచిన పిండం క్రమక్రమంగా పెరిగి, రూపుదాల్చి, ఒక బాలునిగా కనిపించింది. ఆ బాలుడే మన ఆళ్వారుగా ప్రసిద్ధికి ఎక్కారు.

ద్వాపరయుగాంతంలో ఎనిమిదిలక్షల అరవైరెండువేల తొమ్మిదివందల ఎనబది తొమ్మిదివ సంవత్సరంలో... విభవ నామ సంవత్సరం పుష్యమాసం కృష్ణపక్ష దశమీ, గురువారం మఖానక్షత్ర తులాలగ్నంలో భార్గవఋషికి, కనకాంగికి కలిగారు వీరు. తిరుమొళిశై అనే గ్రామంలోపుట్టడం వలన ఆ పేరుతోనే 'తిరుమొళిశై' ఆళ్వారుగా ప్రసిద్ధికి ఎక్కారు. శ్రీమన్నారాయణుని 'సుదర్శన' అంశతో అవతరించారు వీరు. వీరికి భక్తిసారులు అనే పేరు పరమశివునివలన లభించింది. మహీసార పురాధీశులు, భార్గవాత్మజులు, తిరుమొళిశై అయ్యార్, మణిశైప్పిరాన్ అనే నామాంతరాలు ఉన్నాయి వీరికి.

వీరు నాన్ముకన్ తిరువందాది అని 96 పాశురాల దివ్యప్రబంధాన్ని, తిరుచ్చందవిరుత్తం అని 120 పాశురాల దివ్యప్రబంధాన్ని అనుగ్రహించారు. వీరు వేంచేసి పాడిన దివ్యతిరుపతులు...

శ్లో॥ **రంగం, ప్రేమపురం, కపిస్థలవరం, శ్రీకుంభకోణస్థలం**
**శ్రీమాల్యాఖ్యపురం చ వేంకటగిరిః శ్రీకైరవిణ్యాఃస్థలం**
**కాంచ్యాం శేషగృహం చ గానసదనం, వేగార్ణవో విశ్రుతః**
**శ్రీమత్ కిం గృహపట్టణం భృగుసుతే నైకాదశాపుః స్తుతిమ్॥**

శ్రీరంగం, తిరుమలై, పెరుమాళ్ కోయిల్(కంచి) యథోక్తకారి సన్నిధి, తిరుక్కుడంద్రై, తిరుప్పేర్, అంబిల్, కపిస్థలం, తిరువూరకము, తిరుప్పాడవకము, తిరుక్కురుంగుడి మొదలగునవి.

వెదురుపొదలో విడిచిన పిండమే బాలునిగా రూపుధరించి నట్లు తెలిసింది కదా! ఆ ప్రాంతానికి పేముకఱ్ఱలను నరకు కోవాలని 'శ్రీఖడ్గుడు' అనే ఆయన వచ్చాడు. తిరువాళన్= శ్రీఖడ్గుడు ఒక మేదరి. ఆ వెదురుపొదలో బాలుని ఏడ్పు వినిపించిందతనికి. చూస్తే ఏముందీ! మెరిసిపోతున్న చిన్నారితండ్రి కనిపించాడు. పిల్లలులేని తిరువాళన్ చాలా ఆనందంగా ఆ అబ్బాయిని ఎత్తుకొని ఇంటికి తీసుకొని వెళ్ళాడు. భార్య పంకయచ్చెల్వి ఎదురువచ్చింది. ఆశ్చర్యంతో బాలుణ్ణి అందుకొంది. గుండెలకి హత్తుకొంది. భగవంతుడిచ్చిన పుత్రుడివి నాయనా! అంటూ ప్రేమతో పెంచింది.

అలా బ్రాహ్మణబాలుడు మేదరి ఇంట పుత్రునిగా పెరిగాడు. ఈ కథ ఆ నోట ఆ నోట అలా అలా ప్రాకింది. ఒక వృద్ధుడే ఈ కథ విన్నాడు. అతనికి పిల్లలు లేరు. ఆయన కాచినపాలు తీసుకొని భార్యతో కలసి ఈ అబ్బాయిని చూడడానికి వచ్చాడు. తాను తెచ్చిన పాలనర్పించాడు. ముందు త్రాగలేదు. కాని వారి ప్రార్థనకి కరిగి కొన్నిపాలు త్రాగి మిగిలినవి త్రాగమని వారికిచ్చాడు. వారు మహాప్రసాదంగా ఆ పాలు త్రాగారు. ఆశ్చర్యం! యౌవనవంతులయ్యారు వారు. భక్తిసారుల కటాక్షంతో వారికి ఒక పుత్రుడు కలిగాడు. ఆనందంతో ఓలలాడారు. ఆ అబ్బాయికి కణికణ్ణన్=కణికృష్ణుడు అని పేరు పెట్టారు. భక్తిసారుల శ్రీపాదములనే నమ్మి వారినే సేవిస్తూ జీవితం గడిపారు. భక్తిసారులు తమ దివ్యత్వాన్ని మరుగుపరచు కొని, సాధారణ మేదరిగా కులవృత్తిని ఆదరిస్తూ కాలం గడిపారు.

భక్తిసారులకి తీర్థయాత్రలపై మనసుపోయింది. ప్రాణాయామం, ధ్యానం, ధారణ, అష్టాంగయోగం-వీటి యందు మనసు లగ్నమైంది. ధ్యానం అంటే.. దేనిని ధ్యానించాలి? ఎవరిని ఆరాధించాలి? సంఘర్షణ మొదలైంది. శాక్య, ఉలూక్య, కాపిల, పాతంజలి, అక్షపాదమతాలు వేదబాహ్యాలని తెలిసింది. మాయావాదం, న్యాయం, వైశేషికం అన్నిటిని తెలుసుకున్నా తృప్తికలుగలేదు. చివరికి శైవంలో ప్రవేశించారు. గ్రంథరచన కూడా చేశారు. శివవాక్యుడు అని పేరు తెచ్చుకున్నారు. అప్పటికి వెయ్యేళ్ళు గడిచిపోయాయి.

ముదలాళ్వార్లలో చివర చెప్పుకున్న పేయాళ్వారు వీరిని గురించి విన్నారు. స్వయంగా కలుసుకోవాలని వీరి దగ్గరికి వచ్చారు. శరీరంలో పన్నెండు స్థానాలలో ఊర్ధ్వపుండ్రాలు పెట్టుకొని, భుజాలపై శంఖ చక్రాలు ధరించి, మెడలో తులసిమాలలతో వెలిగిపోయే వీరిని చూచి కూడా ఏమీ పలుకరించకుండా వెళ్ళిపోయారు భక్తిసారులు. అప్పుడీయన ఏం చేశారంటే కొన్ని మొక్కలు తెచ్చి వాటిని తలక్రిందులుగా పాతారు. వాటికి చిల్లుకుండతో నీరు పోయడం ప్రారంభించారు. చూశారు భక్తిసారులు. ఒకనవ్వు నవ్వి... ఏమిటాపని? పిచ్చివాడవా ఏమిటి? అన్నారు. నాయనా! జగత్కారణమైన తత్త్వాన్ని తెలుసుకొనలేక అజ్ఞానంతో భ్రమతో తిరిగే నీకాపిచ్చి - నాకా ? అన్నారు. ఆశ్చర్యపోయారు భక్తిసారులు. అయ్యా! తత్త్వాలని గూర్చి తెలుసుకున్నాను... శంకరుడు పరాత్పరుడని భావిస్తున్నాను. జగత్కారణమైన వస్తువును గూర్చి తెలుసుకున్నాను. ఇందులో పిచ్చేముంది అన్నారు.

నాయనా! నిజమే

శ్లో॥ **ఏకః ప్రాసీసరిత్ పాదం కశ్చిత్ ప్రాచిక్షళత్‌జలైః ।**
**అన్యశ్చాదీధరన్మూర్ధ్నా కోధికస్తేషు గణ్యతామ్ ॥**

ఒకాయన తన శ్రీచరణాన్ని చాపాడు. మరొకరు ఆదరంగా ఆ పాదాన్ని కడిగారు. మూడవ ఆయన ఆ తీర్థాన్ని తనశిరస్సుపై ధరించాడు. ఈ ముగ్గురిలో పరదైవమెవరు చెప్పు?

భక్తిసారులు అంటున్నారు. వామనుడు తన శ్రీపాదాన్ని చాచినవాడు. చతుర్ముఖుడయిన బ్రహ్మ తన కమండలంలోని తీర్థంతో పురుషసూక్తం చదువుతూ ప్రక్షాళన చేశాడు. తన కుమారుడైన శివుని శిరస్సుపై జల్లాడు కూడా. పరమశివుడు దానిని శిరసా ధరించాడు. ఔను గదా! (సశేషం)



చిత్రకథ - 15

# రామానుజ చిత్రకథ





















వ్యాఖ్యానం చేయడంలో ప్రసిద్ధులుగా ఉన్నారనుకొనే యదవ ప్రకాశులే ఎన్నో చోట్ల పొరపాట్లు చేసారు.


స్వాభావిక నారాయణ! త్వయి న మృష్యతి వైదికః కః? అంటూ తత్వాన్ని ఎంత సులభంగ నిర్ణయం చేసేవారో! కదా వీరు!


ఆ! మీరు విన్నారా ఆ స్తోత్రాన్ని?
ఆ!


బ్రహ్మసూత్రాలకి కూడా మంచి వ్యాఖ్య రావాలని వీరికి మహా కోరిక ఉండేది సుమా!


వీరికా ఆశ అలానే మిగిలిపోయింది.


అది మన దురదృష్టం
స్వామి అనుగ్రహిస్తే బ్రహ్మసూత్రాలకి తగిన భాష్యాన్ని రచిస్తా!

ఋషి ఋణాన్ని తీరుస్తా!


ఉపనిషత్తుకేర్పడ్డ అపార్థాలు తొలగిస్తా


ఆ! నిజంగా?


నువ్వు రాయగలగవనే
తోస్తోంది
నాయనా


అదిగో! స్వామి ఉంగరం వ్రేలు తెరుచకొంటోంది.


అమ్మో!
తెరిచేసుకుంది.


నీకు స్వామి అనుగ్రహం లభించింది. నీ
తేజస్సే, నీ యోగ్యతను స్పష్టం చేస్తోంది
నాయనా!

ఇంకా ఉంది..

# అష్టాక్షరీ మంత్ర(రాజ) వైభవము

- శ్రీమాన్ సముద్రాల శఠగోపాచార్యులు, వరంగల్

సర్వేశ్వరుడు, సర్వజగత్కారణభూతుడు, సర్వజగద్రక్షకుడు, శ్రియఃపతియైన శ్రీమన్నారాయణుడు శ్రీవైకుంఠంలో నిత్యసూరిగణంచే, ముక్తపురుష గణంచే అనుభవింపబడుతూ, వారిచే సర్వకాల సర్వావస్థల యందు వివిధ సేవలను అందుకుంటూ ఉండును. శ్రీ-భూ-నీళాదేవి మారులతో కూడి నిత్య ముక్త గణముచే సేవింపబడుతూ ఉన్నను శ్రీమన్నారాయణుడు సంసారచక్రబంధములోనున్న చేతనుల విషయంలో మాత్రం తీవ్ర చింతాగ్రస్తుడై యుండును.

బద్ధచేతనోజ్జీవమునకై భ్రమప్రమాదాదులను తొలగిస్తూ పారమార్థికమైన జ్ఞానాన్ని కలిగించే వేదరాశిని, స్మృతీతిహాస పురాణాదులను పరమాత్మ ప్రవర్తింపజేసినను మానవాళి ప్రకృతికి వశులై వైదిక విజ్ఞానాన్ని అధ్యయనం చేయడానికి, ఆత్మస్వరూపాన్ని తెలుసుకోవడానికి ఆసక్తిని ప్రదర్శించుటలేదని పరమాత్మ గుర్తించెను. మానవులు విస్తరభీతిచేత వేదశాస్త్ర పురాణేతిహాసాదులను అధ్యయనం చేయలేక ఆత్మజ్ఞానశూన్యులై సంసారంలో మునిగినందున వారి ఉజ్జీవనముకొరకై పరమ సులభము, సంగ్రహము, వేదశాస్త్రసార రూపము, ఆత్మ-పరమాత్మ స్వరూప జ్ఞాన ప్రబోధకమునైన అష్టాక్షరీ మంత్రాన్ని పరమాత్మ తాను ఆచార్యుడుగా నిలిచి, తన అంశభూతుడైన నరునకు బదరికాశ్రమంలో ఉపదేశించెను.

మహామహిమాన్వితమైన అష్టాక్షరీ మంత్రాన్ని విశిష్టాద్వైత సంప్రదాయజ్ఞులు తిరుమంత్రమని వ్యవహరిస్తారు. సారాసార వివేక సంపన్నులైన మంత్రశాస్త్రజ్ఞులు అష్టాక్షరీ మంత్రాన్ని మంత్రరాజంగా పేర్కొన్నారు. ఈ అష్టాక్షరీ మంత్రానికే మంత్రరత్నమని ప్రసిద్ధిగాంచిన ద్వయమంత్రము వివరణాత్మకము (ద్వయమంత్రాన్ని శ్రీహరి వైకుంఠంలో లక్ష్మీదేవికి ఉపదేశించెను). ద్వయమంత్రానికి వివరణ రూపమే (శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునికి ఉపదేశించిన) చరమశ్లోకము.

**అష్టాక్షరీ మంత్ర వైభవము :** దేవాధిదేవుడైన శ్రీమన్నారాయణుని మించిన వేరొక దైవం లేనట్లే, మంత్రాలలో అష్టాక్షరీ మంత్రాన్ని మించిన మంత్రము మరొకటి లేనేలేదు -

**"యథా సర్వేషు దేవేషు నాస్తి నారాయణాత్పరః ।**

**తథా సర్వేషు మంత్రేషు నాస్తి చాష్టాక్షరాత్పరః ॥"** అని బృహద్ధారీత స్మృతిలో పేర్కొనబడినది.

అష్టాదశ పురాణ కర్తయగు వేదవ్యాసమహర్షి తన శిష్యులకు పరతత్త్వాన్ని ఉపదేశించే సందర్భంలో "పుత్రతుల్యులైన ఓ శిష్యులారా! నేనిపుడు చేతిని పైకెత్తి మీ ముందు ప్రమాణపూర్వకంగా ఒక ముఖ్య విషయాన్ని చెప్పుచున్నాను - జాగ్రత్తగా వినండి. అష్టాక్షరీ మంత్రాన్ని మించిన గొప్పదైన మంత్రము వేరొకటి లేనేలేదు -

**"భూత్వోర్ధ్వ బాహురద్యాత్ర సత్యపూర్వం బ్రవీమి వః ।**

**హే పుత్ర శిష్యాః శ్రుణుత నమన్త్రోऽష్టాక్షరాత్పరః ॥"**

అని ప్రతిజ్ఞా పూర్వకంగా పేర్కొనెను అని నరసింహపురాణంలో చెప్పబడింది.

అష్టాక్షరీ మహామంత్రము అనునది సకల వేదాంతములలోని సారతమమైన అర్థము. ఇది సంసారమనే మహాసముద్రాన్ని సులభంగా దాటించగల సుదృఢమైన నావగా పేర్కొనబడినది. జన్మపరంపరను, సంసారబంధాన్ని ఇష్టపడని మనుష్యులందరూ ఆలంబనగా స్వీకరించ వలసిన మంత్రము ఈ అష్టాక్షరీ మహామంత్రమొక్కటియే -

**సర్వవేదాంత సారార్థః సంసారార్ణవ తారకః ।**

**గతిరష్టాక్షరో నృణాం అపునర్భవ కాంక్షిణామ్ ॥**

అని నారదీయ అష్టాక్షర బ్రహ్మవిద్యలో ప్రకటించబడినది. లోకంలో అనేకులు తమ తమ అభీష్టములను నెరవేర్చుకొనుటకు వేరు వేరు మంత్రాలను జపిస్తూ ఉంటారు. వివిధ నియమాలతో కూడిన అనేక వ్రతాలను ఆచరిస్తూ ఉంటారు. కాని మనకు సర్వాభీష్టములను, సమస్త పురుషార్థములను పొందుటకు ఓంకారముతో కూడిన నమో నారాయణాయ అనే అష్టాక్షరీ మంత్రానుష్ఠానము ఒక్కటే చాలును -

**"కిం తత్ర బహుభిః మంత్రైః కిం తత్ర బహుభిః వ్రతైః ।**

**నమో నారాయణాయేతి మంత్ర స్సర్వార్థసాధకః ॥"**

అని బ్రహ్మ పురాణ (57-24) శ్లోకం మనకు ప్రబోధిస్తున్నది.

**ముముక్షువులు - అష్టాక్షరీ మంత్రం :** మోక్షమును కోరువారు తప్పక తెలుసుకోవలసిన స్వరూపము (జీవాత్మ తత్త్వము) ఉపాయ స్వరూపము, భగవత్కైంకర్యము అను మూడు రహస్యములలో మొదటి రహస్యజ్ఞానం అష్టాక్షరీ మంత్రం వల్లనే కలుగును. అనన్యార్హ శేషత్వము - జీవుడు శ్రీమన్నారాయణుడికి మాత్రమే యథేష్టముగా వినియోగించుకొనదగియుండుట. అనన్యశరణత్వము - జీవునికి శ్రీమన్నారాయణుడు తప్ప వేరొకరు ఎవరూ రక్షకులు కారు. అనన్య భోగ్యత్వము-జీవుడు ఒక్క శ్రీమన్నారాయణుడిచేతనే ప్రీతితో అనుభవించ దగినవాడు అనే మూడువిధములైన లక్షణములను, ఆత్మస్వరూపాన్ని గురించి, విడువదగినవానిని, పట్టదగినదానిని గురించి ఏ లోటు లేకుండా యథార్థమైన జ్ఞానాన్ని కలిగించునది అష్టాక్షరీ మంత్రమే.

**"ఓమిత్యగ్రేవ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్, నారాయణాయేత్యుపరిష్టాత్"**

అను శ్రుతివాక్యమును అనుసరించి

**"ప్రణవాద్యం నమో మధ్యం నారాయణ పదాంతిమమ్ ।**

**మంత్రమష్టాక్షరం విద్యాత్ సర్వసిద్ధికరం నృణామ్ ॥"**

అను స్మృతివాక్యము కూడా అష్టాక్షరీ మంత్రములోని మూడు పదాల క్రమాన్ని వివరించి ఈ అష్టాక్షరీ మహామంత్రము మానవులకు సర్వాభీష్టములను అనుగ్రహించునని పేర్కొన్నది.

అష్టాక్షరీ మంత్రంలోని మొదటి పదం - **ఓంకారము (ప్రణవము)**. ఇందులో అ-ఉ-మ్ అను మూడు అక్షరాలు కలవు. **"అ"**కారము సృష్టి-స్థితి-సంహార కర్తయైన విష్ణువును బోధించును. విష్ణు అను పదము సర్వవస్తువులయందు లోపల-బయట వ్యాపించియుంటూ రక్షించువాడు అను బోధించుచున్నది. **"మ"**కారము నకు జీవుడు అని అర్థము. జీవరాశి మూడు వర్గములు. 1) సంసార మండలంలోని బద్ధజీవులు, 2) భగవద్భాగవతాచార్య అనుగ్రహంతో పరతత్త్వాన్ని తెలుసుకొని, ఉపాసించి, ముక్తిని పొందిన జీవులు (ముక్తులు), 3) సంసార బంధము అసలే లేక నిత్యవిభూతిలో ఉంటూ భగవత్సేవలోనే నిమగ్నమైన శ్రీ-భూ-నీళాదేవి వర్గము, అనంత గరుడ విష్వక్సేనాదులు నిత్యజీవులు. మూడు వర్గములుగా విభాగమునొందిన ఈ జీవరాశియంతయు భగవంతునకు ఉపకరణముగా యథేష్టముగా ఉపయోగించుకొనదగిన శేషభూతముగా ఉండును. **"ఉ"**కారము పరమాత్మకు జీవాత్మకు గల సంబంధాన్ని తెలుపును. జీవాత్మ-పరమాత్మల ముఖ్య సంబంధము స్వ-స్వామి (శేష-శేషి) భావ సంబంధము. ఇది విడదీయుటకు వీలుకానిది, శాశ్వతమైనది, వదులుకుంటే వదులుకో రానిది (ఒ Z క్క ఒ Z యాదు - గోదాదేవి తిరుప్పావై సూక్తి). జీవుడు పరమాత్మకు, ఆయన ముగ్గురు పత్నులకు, ఆచార్యులకు, భగవద్భక్తులకు తప్ప వేరెవరికి దాసుడు కాడు అని ప్రణవ పదంతో జ్ఞానబోధ కలుగుచున్నది.

మధ్యన ఉండు రెండవ పదము **"నమః"** పదము. ఇది దాస్యము నకు చిహ్నమైన నమస్కారార్థమును బోధించును. జీవుడు స్వతంత్రుడు కాడు, తనను తాను రక్షించుకోలేడు అని నమః పదముచే విదితమగును.

చివరిది నారాయణాయ అను పదము. **"నారాయణాయ" పదవివరణము** : నశించని నిత్యవస్తువుల సముదాయమగు నారములకు లోపలా-బయటా వ్యాప్తిని కలిగియుండి, అయనము- ఆధారమైనవాడు నారాయణుడు. అట్టి పరమాత్మకు నేను సర్వకాలములయందు, సర్వదేశములయందు, సర్వదశలయందు నిరంతరం అభీష్ట కైంకర్యము లను చేయుదును గాక అని "ఆయ" అను చివరి ప్రత్యయముచే బోధించబడుచున్నది. అష్టాక్షరీ మంత్రములోని మూడు పదాలు వరుసక్రమంలో శేషత్వ-పారతంత్ర్య-కైంకర్యములు అను మూడు అర్థాలను బోధించుచున్నవి.

రక్షకుడైన పరమాత్మ విషయంలో శరణాగతిచేసిన ప్రపన్నుడు భ్రమ-ప్రమాదాదులకు లోనుకాకుండా అష్టాక్షరీ మహామంత్రము నిశ్చయ జ్ఞానాన్ని కలిగిస్తుంది.

**"దేహాసక్తాత్మ బుద్ధిర్యది భవతి పదం సాధు విద్యాత్తృతీయం**
**స్వాతంత్ర్యాంధో యది స్యాత్ ప్రథమమితర శేషత్వ ధీశ్చేత్ ద్వితీయమ్,**
**ఆత్మత్రాణోన్ముఖశ్చేత్ నమ ఇతి చ పదం బాంధవాభాసలోలః**
**శబ్దం నారాయణాఖ్యం విషయచపలధీశ్చేత్ చతుర్థీం ప్రపన్నః ॥"**

జీవునికి దేహాత్మ భ్రమ కలిగినప్పుడు తన్నివారణకై ప్రణవములోని మూడవ అక్షరమైన జీవ స్వరూప ప్రతిపాదకమైన మకారమును గుర్తించవలెను. ఈ మకారము జీవుడు జ్ఞానస్వరూపుడు, ఆనంద స్వరూపుడు, అణుస్వరూపుడు, అంతేకాని నిజమైన దేహస్వరూపుడు కాదు అని తెలుపుచున్నది. స్వతంత్రుడను అను భ్రమ జీవునికి కలిగితే అది రావణ దుర్యోధనాదులకు వలె అనర్థానికి హేతువగును. అట్టి స్వతంత్ర భావనను దూరం చేసుకొనుటకు సర్వ స్వతంత్రుడు, సర్వస్రష్ట పరమాత్మయే అని తెలిపే అకారమును దృఢంగా గ్రహింపవలెను. ఇతర దేవతలకు తాను శేషభూతు(సేవకు)డను అనే భ్రమ కూడా సరికాదని ఉకారము బోధించుచున్నది. కొందరు తమను తామే రక్షించుకోగలము అనే భ్రమలో పడి ఏవేవో ఉపాయాలను చేస్తూ స్వీయరక్షణకై ప్రయత్నించెదరు. అట్లే చేయుట సరికాదని పరమాత్మయే రక్షకుడని నమః అను పదము ఉపదేశిస్తున్నది. మరికొందరు లోకంలో కనిపించే బంధువులను రక్షకులు అని భావించెదరు. తాత్కాలికమైన బాంధవ్యాలు వ్యామోహాన్ని కలిగించేవే. ఈ బంధువులు ఆభాస బంధువులే. వీరెవ్వరు సంసారబంధమునుండి కాపాడలేరు అనే యథార్థాన్ని నారాయణ పదము ఉద్బోధిస్తున్నది. యామునాచార్యుల వారు "పితా త్వం మాతా త్వం దయిత తనయస్త్వం" ఇత్యాదిగా స్తోత్రరత్నంలో పేర్కొన్నట్లు ఈ నారాయణ పదము జీవునికి అసలు బంధువు శ్రీమన్నారాయణుడే అని తెలుపుతూ జీవాత్మ పరమాత్మలకు ఉండే 1) పితా-పుత్ర, 2)రక్ష్య-రక్షక, 3)శేష-శేషి, 4)భర్తృ-భార్య, 5)జ్ఞాతృ-జ్ఞేయ, 6)స్వ-స్వామి, 7)ఆధార-ఆధేయ, 8)శరీర-శరీరి, 9)భోక్తృ-భోగ్య భావములు అను నవవిధ సంబంధమును దృఢపరచు చున్నది.

అష్టాక్షరిలో చిట్టచివరన ఉండే ఆయ అను చతుర్థీవిభక్తి శ్రీమన్నారాయణుని కొరకు తాను చేయు సేవయే యథార్థముగా తాను పొందదగినది. అదొక్కటే ఎటువంటి అపాయాలను కలిగించనిది. లౌకికమైన సుఖాలు, వ్యసనాలు దుఃఖానికి కారణాలవుతాయి అని నిష్కర్షగా పేర్కొంటున్నది. ఈ విధంగా అష్టాక్షరీ మంత్రము తత్త్వాన్ని తెలుపుచూ లోకోజ్జీవనానికి కారణమగుచున్నది.

ఈ అష్టాక్షరీ మహామంత్రముచే బోధించబడు ఆరు అర్థాలు ఆరు దోషాలను తొలగిస్తూ జీవాత్మను రక్షించినట్లే అష్టాక్షరీ మహామంత్రము "మన్తారం త్రాయత ఇతి మంత్రః" (ఉచ్చరించువానిని కాపాడునది) అను వ్యుత్పత్తిని అనుసరించి తన శబ్దశక్తిచేత జపము,

హోమము చేయు ఉపాసకులను రక్షించి తరింపజేయునని బ్రహ్మవేత్తలు నిర్ధారించిరి.

అపౌరుషేయాలు, స్వతఃప్రమాణాలు అని ప్రసిద్ధిగాంచిన నాలుగు వేదాలు, వాటి అర్థాలను విశదీకరించే స్మృతులు, పురాణాలు, ఇతిహాసాలు మొదలగు గ్రంథాలు అన్నింటిలోను తెలుపబడే ముఖ్యార్థమైన అర్థపంచక (జీవ-పర-ఉపాయ-ఫల-విరోధుల) జ్ఞానము ఈ అష్టాక్షరీ మంత్రముతోనే తెలుపబడుచున్నది –

**"ఋచో యజూంషి సామాని తథైవాథర్వణాని చ ।**

**సర్వమష్టాక్షరాంతస్థం యచ్చాన్యదపి వాఙ్మయమ్ ॥"**

అని వృద్ధహారీతస్మృతి తెలిపినది. ముముక్షువు తెలుసుకోవలసిన అర్థాల నన్నింటిని తెలిపే ఈ అష్టాక్షరీ మంత్రము **మంత్రాణాం పరమో మంత్రః** –మంత్రాలలో సర్వశ్రేష్ఠమైన మంత్రము అని విష్వక్సేన సంహితలో చెప్పబడిన విషయాన్ని మనసులో స్థిరంగా నిలుపుకోవాలి. మంత్రాలన్నింటిలో శ్రేష్ఠమైనది, సనాతనమైనది మూలమంత్రమని, మంత్రరాజమని ప్రసిద్ధిని పొందినట్టిది, దాచదగిన రహస్యములలో ఉత్తమమైన రహస్యము అని భావించదగినది, పాపాలను నశింప జేయు నది, పవిత్రమైన వాటిలో అగ్రగణ్యమై నిలిచినది అష్టాక్షరీ మహామంత్రమే –

**"మంత్రాణాం పరమో మంత్రః - గుహ్యానాం గుహ్యముత్తమమ్ ।**

**పవిత్రం చ పవిత్రాణాం - మూలమంత్రః సనాతనః ॥"**

అనే ఈ నారసింహపురాణ సూక్తిసారాన్ని హృదయంలో పది కాలాల పాటు పదిలపరచుకుంటూ పరమాత్మ ఎంతో దయగలవాడై బద్ధచేతన వర్గానికి ఉజ్జీవింపజేయుటకై అనుగ్రహించిన పరమ పవిత్రమంత్రము ఇది కదా అనే దృఢ విశ్వాసంతో పరమాత్మ చేసిన కృషిని తలుచుకుంటూ భక్తి కలిగి అష్టాక్షరీ మంత్రాన్ని స్నానానంతరము శుభ్రవస్త్రధారియై పవిత్ర మనస్సుతో, పరిశుద్ధ ప్రదేశంలో జపించుకోవలెను. భగవంతుని పట్ల భక్తి కలిగి సదాచార్యుని ఆశ్రయించి ఆచార్య ముఖతః ఉపదేశ రూపంలో పొందవలసిన ఈ అష్టాక్షరీ మంత్రాన్ని విశ్వాసం, శ్రద్ధ, ఆసక్తి లేనివారికి చెప్పరాదు. అపరిశుభ్ర వస్త్రాలతో స్నానాదులు చేయకుండా పఠించరాదు. భోజనం తర్వాత జపం చేయరాదు. ఈ నియమాలను పాటిస్తూ అతి విలువైన వజ్రరాసులను, బంగారు ఆభరణాలను ఎట్లా భద్రపరచుకుంటామో అట్లాగే మంత్రరాజాన్ని కూడా హృదయమందిరంలో పరమపవిత్రంగా భద్రపరచుకోవాలి.

ఇహలోకానికి సంబంధించిన ఐశ్వర్యమును, పరలోకానికి సంబంధించిన స్వర్గాదులను, ఆత్మప్రాప్తియనెడు కైవల్యమును పరమపురుషార్థ మైన పరమాత్మ సాన్నిధ్యాన్ని కూడా ఈ అష్టాక్షరీ మంత్రము సాధించి పెట్టగలదు –

**"ఐహలౌకిక మైశ్వర్యం స్వర్గాద్యం పారలౌకికమ్ ।**

**కైవల్యం భగవంతం చ మంత్రోయం సాధయిష్యతి ॥"**

అని చెప్పబడియున్నందున ఫలాపేక్షతో అష్టాక్షరీ మంత్రాన్ని జపించ కోరువారు నియమాలను పాటిస్తూ అక్షర లక్షగా ఎనిమిది లక్షల సార్లు జపించవలెను. పదవ వంతుతో 80 వేల సార్లు స్వాహాకారాన్ని జోడించి హోమం చేయవలెను. అందులో 10వ వంతుగా 8000 సార్లు తర్పణము, అందులో 10వ వంతు 800 సార్లు పుష్పాంజలి సమర్పించవలెను. ఈ అష్టాక్షరీ మహామంత్రాన్ని తమ తమ గృహాల్లోని పూజా మందిరాల్లో, ఆలయాల్లో, వివిధ దివ్యక్షేత్రాల్లో, పుణ్యనదీతీరాల్లో జపం చేసుకోవచ్చు. అయితే ఈ మహామంత్రం ఆవిర్భవించిన బదరీ క్షేత్రంలో జపం చేస్తే కలిగే ఫలితం, పొందే అనుభూతి అనిర్వచనీయం.

పరమాత్మ దయామయుడు. ఆయనే నరుడిగా, నారాయణుడిగా అవతరించాడు. తిరుమంత్రాన్ని భూలోక వాసులకు అందుబాటులోకి తెచ్చాడు. అంతటితో ఊరుకోక ఆయనయొక్క పర వ్యూహములను అనుభవించలేక విభవావతారములను దర్శించే భాగ్యము నొందక అందుబాటులోనున్న అంతర్యామిని విశ్వసించక దివ్యదేశాలలో సులభుడై సుఖారాధ్యుడై అర్చామూర్తిగా వేంచేసియున్న స్వామి వైభవాన్ని సంపూర్ణంగా గుర్తించలేక సంసారచక్రబంధంలో చిక్కుకొని అజ్ఞానములో మగ్గుతున్నాము అని తెలుసుకోలేక పోతున్న మనల్ని ఉద్ధరించడానికి తన సంకల్పంతో శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారలను అవతరింపజేసాడు.

భగవత్సంకల్పానుసారం పెద్దజీయర్‌స్వామివారు 108 దివ్యదేశాలలో ఎంతో ప్రాధాన్యాన్ని సంతరించుకున్న, అష్టాక్షరీ మహామంత్ర ఆవిర్భావ క్షేత్రమైన బదరికాశ్రమ వైభవాన్ని లోకానికి చాటిచెప్పారు. శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి మార్గాన్ని అనుసరిస్తూ, శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారు కూడా ప్రతి యేటా భక్తులు ఎక్కువ సంఖ్యలో బదరీ క్షేత్రాన్ని దర్శించి అక్కడ అష్టాక్షరీ మహామంత్రానుష్ఠానం చేసి తరించుటకై వసతి సౌకర్యాన్ని ఏర్పరచినారు. అన్నదాన సత్రాన్ని ప్రారంభించారు. గతంలో ఎన్నెన్నో కార్యక్రమాలను నిర్వహించిన శ్రీశ్రీశ్రీ స్వామివారు ప్రస్తుతం బదరీ క్షేత్రంలో కోటి అష్టాక్షరీ క్రతువును సంకల్పించారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఆసక్తి, అవకాశం ఉన్నవారందరూ శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి మంగళాశాసనముతో బదరీక్షేత్ర సందర్శనం చేసి అష్టాక్షరీ మహామంత్రాన్ని అనుష్ఠించి ఆచార్య కృపకు, భగవదనుగ్రహానికి పాత్రులు కావాలని ఆశిద్దాం.

## భియా దేయం - హ్రియా దేయం

**దాతలు తాము చేస్తున్న దానం పేరు ప్రతిష్ఠల కోసమే చేయకూడదు. మనం చేసే ఈ సహాయం సరిపోతుందో లేదో అనే భయంతో, సంకోచంతో, సిగ్గుతో చేయాలి అంటుంది వేదమాత.**

# 5. పదకేళి -వంశీ



**ఆధారములు**

**అడ్డం:**

1. ఉపనయనమైన చిన్నవాడు
3. మంత్రరాజము
6. కవిత్వం చెప్పేవాడు
7. సీతమ్మే. నాన్న కూతురు
10. తోక తెగిన రెండో నక్షత్రం
11. గోపాలుని శృంగార లీలలే
12. అటు ఇటుగా అనవుడి స్నేహితుడు
13. నిశ్చయంగా రాడా అంటే ఔను
14. ఈ అసురుణ్ణే మురారి చంపాడు
16. గోదాదేవిని సంస్కృతంలో పిలిస్తే
18. అష్టాంగాలలో మొదటి రెండూ
20. వట్టి నతి కాదు గొప్ప నతి
21. ఈశుడే – మునులకి

**నిలువు :**

1. త్రిమూర్తులలో సృష్టికర్త
2. వినలేని మొరటుదనం తిరగబడితే
3. రక్షణ – అర్థంగల ధాతువు
4. కార్పణ్యానికి ముందే వస్తుంది కసి కిందనుండి
5. తలక్రిందులుగా విరిసిన పువ్వు
8. ముసలితనం
9. గిరిధరనాగరా! నీవాద్యం అటూ ఇటూ
14. మౌనంగా ఉండేవాడు
15. వేగం
17. ఆటాడే భగవంతుడు
19. ఆంగ్లంలో డబ్బు

## 4. పదకేళి - సమాధానములు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| జ | యం | తి | | తి | రు | మొ | జి | శై | |
| గ | | థి | ర | | క్మాం | | | లం | క |
| న్నా | | ద్వ | | న | గ | జా | త | | |
| థ | | యం | అ | | దు | | ల్లి | వ | |
| ర | థం | | | వీ | డు | | దం | డ | |
| ధ | | శి | | | | | ద్రు | | త్వం |
| చ | తు | ర్ద | శ | భు | వ | నా | లు | | |
| క్రా | | తు | | | న | ర | | | |
| లు | | చ | | ర | మా | ద | యి | తు | డు |
| | ద | | క | మ | ల | | వా | | వా |

పదకేళిని పూరించి, భక్తినివేదన - సీతానగరం చిరునామాకి పంపించగలరు.
15వ తేదీలోపు అందినవాటిని మాత్రమే పరిశీలిస్తాం

## సెప్టెంబరు నెల మెదడుకి మేత! సమాధానములు

1. భారతం శాన్త్యనుశాసనిక పర్వాలలోనివి; 2. తిరుమాలిరుంశోలై; 3. తిరుమంగై ఆళ్వార్; 4. యాదవరాజు శూరుని పుత్రి; 5. కిందముదు; 6. మైందుడు; 7. ధర్మసాధనము; 8. కందుమహర్షి; 9. బ్రహ్మమానస పుత్రులు; 10. నవవిధములు; 11. నలుడు; 12. శ్రీకృష్ణుడు; 13. నక్షత్రానికి; 14. ఉలహమళంద పెరుమాళ్; 15. వత్తి; 16. శ్రీరంగ సమీపంలో; 17. అవమతిథి; 18. విక్రమభేతాళుడు; 19. అశ్వగంధ; 20. మధుర.

# పంచాంగము - సంకేతములు

శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ

**శ్లో॥ తిథేశ్చ శ్రియమాప్నోతి వారాదాయుష్య వర్ధనం ।**
**నక్షత్రాద్ధరతే పాపం యోగాద్రోగ నివారణమ్ ॥**
**కరణాత్కార్య సిద్ధిశ్చ పంచాంగం ఫలముత్తమమ్ ।**
**కాలవిత్కర్మ కృద్ధీమాన్ దేవతానుగ్రహం లభేత్ ॥**

**తిథి:** సిరిసంపదలనిచ్చును.

**వారము** ఆయుష్షును వృద్ధి పొందించును.

**నక్షత్రము :** పాపమును హరించును.

**యోగము:** రోగనివారణ చేయును.

**కరణము :** కార్యసిద్ధిని కల్గించును.

కావున పంచాంగమనునది ఉత్తమమైన ఫలమును యిచ్చును. ఈ పంచాంగంలోని ఈ అయిదింటిని ప్రతినిత్యము అనుష్ఠించుట వల్ల కాలపురుషుడగు భగవానుడు మానవాళికందరకు తన సంపూర్ణ అనుగ్రహాన్నివ్వగలడు.

**వర్జ్యము :** వర్జ్యమనగా అన్ని పనులయందు విడువ తగిన కాలము. (ముఖ్యముగా శుభకార్యములయందు తప్పనిసరి)

**భోజ్యం :** లగ్నంలో సూర్యుడు పయనించు కాలమును భోజ్యం అని వ్యవహరిస్తారు.

**భుక్తి:** లగ్నంలో సూర్యుడు పయనించిన కాలమును భుక్తి అని వ్యవహరిస్తారు.

**వక్రారంభం :** గ్రహం వెనుకకు నడుచుటను వక్రారంభం అంటారు.

**వక్రత్యాగం :** గ్రహం వెనుకకు నడచుట ఎప్పుడు ఆగుతుందో అప్పుడు ఆ గ్రహమును వక్రత్యాగం అంటారు.

## మహాలయ అమావాస్య

భాద్రపదమాసం కృష్ణపక్ష అమావాస్య మహాలయ అమావాస్యగా పేరు పొందింది. ఈ పక్షానికి పితృపక్షమని కూడా పేరు. ఈ 15 రోజులలో తమ పెద్దలు పరమపదించిన తిథిని బట్టి మంత్రపూర్వకంగా శ్రాద్ధకర్మను ఆచరించడం సంప్రదాయం. కొందరు అమంత్రకంగా కూడా ఈ కార్యక్రమాన్ని ఆచరిస్తూ ఉంటారు. మహా... లయము అంటే గొప్ప వినాశము అని అర్థం. మహాన్ అత్యంతికో లయో యత్ర మహాలయః అని వ్యుత్పత్తి. సంవత్సరంలో ఉత్తరాయణం దేవతాకాలం. దక్షిణాయనం పితృదేవతాకాలం.

ఈ మాసమంతా జలమయంగా భాసిస్తూ మహాలయాన్ని కల్పిస్తుంది. ఈ పక్షంలో శ్రాద్ధతర్పణం చేయడం వలన, పితృదేవతలను పూజించడం వలన ఈ భయంకర లయము దాటి పోతుందని వైదిక విశ్వాసం.

శ్లో॥ కన్యాగతే సవితరి యాన్యహాని చ షోడశః ।
క్రతుభిః తాని తుల్యాని దేవో నారాయణో హరిః ॥

సూర్యుడు కన్యారాశిలో ఉన్నప్పుడు 16 రోజులు భాద్రపద శుద్ధ పూర్ణిమ నుండి ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి వరకు యజ్ఞదినములవంటివి. అంతటి పవిత్రములీ రోజులు. వీటికి అధిదేవత శ్రీమన్నారాయణుడు. అందుకే ఈ పక్షము మహాలయ పక్షమని అతి పవిత్ర పక్షంగా ప్రసిద్ధి పొందింది.

దివే దినే గయా తుల్యం – ప్రతిదినము ఈ రోజులలో చేసిన ప్రార్థన ఒక్కరోజు ఒక సంవత్సరం వరకు పితృదేవతలకి సంతృప్తిని కలిగిస్తుంది అని స్కాందం నాగరఖండంలో చెప్పబడింది. భవిష్య పురాణం కూడా ఈ విషయాన్నే స్పష్టీకరించింది.

ఈ మహాలయ అమావాస్య పవిత్ర దినమునాడే కుశలు–దర్భలు సేకరించుకోవాలి. వాటిని కొన్ని శుభకార్యములకి, కొన్ని శుభేతరములకు అని విడదీసుకోవాలి. వాటి నుండే ఆయా కుశలని గ్రహించి సంవత్సరమంతా ఉపయోగించుకోవాలని శాస్త్రం చెప్పింది.

పితృదేవతలని పూజిద్దాం!

[illegible]!!

గీతామాహాత్మ్యకథలు - 15

# సరసభేరి

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

గతమాసంలో విక్రమభేతాళుడు కథ చదివాం. గుండె గుభేల్మంది. మనం ఈ జన్మలో ఎవరితోనైనా కక్షలోకి దిగితే వాళ్ళు ఎన్ని జన్మలెత్తినా మనని వదలకుండా తరుముతారని తెలిస్తే.. మనకెందుకీ కక్షలు, కార్పణ్యాలు అని మనమే ప్రతి గొడవలోను తగ్గిపోతాం. ఎందుకంటే ఈ లోకంలో మనదేమీ లేదనుకున్నప్పుడు మనకీ కక్షలు మాత్రం కావాలా?

సరే ఈ విషయాన్ని మనం ఎలాగూ తెలుసుకున్నాం, కాబట్టి ఇక ఈ మాసం **సరసభేరి** అనే కాలికింద కన్నం వేయ గలిగిన ద్రోహి కథ. ఇది పదిహేనో అధ్యాయానికి సంబంధించిన కథ. భగవద్గీతలోని పదిహేనో అధ్యాయం **పురుషోత్తమప్రాప్తి యోగం**. ఈ మాసం కథలోకి వెళ్ళేముందు ఈ పదిహేనవ అధ్యాయం గురించికూడా టూకీగా తెలుసుకుందాం.

పురుషుడు, పురుషోత్తముడు అని ఇద్దరున్నారు. పురుషుడు అంటే జీవుడు. మానవులలో బద్ధులు, ముక్తులు, అని రెండు రకాలుగా ఉండే జీవులుంటారు. బద్ధులు అయినా ముక్తులైనా వారికుండే దోషాలు వారికుంటాయి. దోషాలే కాదు వారు ఇద్దరు కూడా భగవంతుడి మీదే ఆధారపడి ఉంటారు. ఆధారమంటే సామాన్యంగా ఆధారపడటం కాదు గాలి పీల్చా లన్నా, నీరుతాగాలన్నా, అన్నం తినాలన్నా, తిన్నది అరగాలన్నా, అన్నీ ఆయన ఆజ్ఞతోటే జరుగుతాయి.

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥**

ఆ పరమాత్మ "అందరు జీవులయొక్క శరీరాలలోను వైశ్వానరుడను జఠరాగ్నినై వారుభుజించే భక్ష్య,భోజ్య,లేహ్య, చోష్యములనే నాలుగువిధములైన ఆహారాలని ప్రాణాపానవాయువు లతో కూడి జీర్ణము చేస్తున్నాను" అని చెప్తున్నాడు. అంటే ఆయన మీద మనం అంతగా ఆధారపడి ఉండి కూడా నాకేం తక్కువ, నా అంతటివాడులేడు అని అహంకరించి భగవంతుడి ఉనికిని కూడా గుర్తించకుండా తిరుగుతుంటాం. కాని దయామయుడు, కరుణా సాగరుడు కాబట్టి లౌకికంగా మనకే ఇబ్బందిలేకుండా తానుచేసే పనులు తను చేసుకుపోతున్నాడు. నువ్వు నాకేం చేస్తున్నావని నీకు నేను సహాయపడడానికి అనుకోడా స్వామి. అందుకే ఆయన పురుషోత్తముడు.

క్షరుడు, అక్షరుడు అని జీవులు రెండు రకములు. ఈ భౌతికజగత్తులో గల ప్రతిజీవి క్షరుడు కాగా, ఆధ్యాత్మిక జగత్తులో గల ప్రతిజీవి అక్షరుడని పిలువబడుతాడు. అంటే బద్ధులందరూ క్షరులు. ముక్తులు, నిత్యులు అందరూ అక్షరులన్న మాట. బద్ధులందరూ క్షరులంటే వారి శరీరాలు క్షరమని అర్థం. ఈ జీవులే కాక ఆ పరమాత్మకూడా ఈ ముల్లోకాలలోను ప్రవేశించి ఉన్నాడు. ఆ పరమాత్మ తనని గురించి ఇలా చెప్తున్నాడు.

**యస్మాత్ క్షరమతీతోఽహం అక్షరాదపిచోత్తమః ।**
**అతోఽస్మిలోకే వేదే చప్రథితః పురుషోత్తమః ॥**

నేను క్షర స్వరూపుని కంటే మించినవాడను, అక్షర స్వరూపుని కంటే శ్రేష్ఠుడను అయినందున అన్ని లోకము లందును, వేదములయందును పురుషోత్తమునిగా వినుతికెక్కి యున్నాను అని చెప్తున్నాడు పరమాత్మ.

అట్టి పురుషోత్తముని స్వరూపము, ఆయనని పొందడానికి కావలసిన మార్గములు, వాటి ఫలితములు. మొదలైన విషయా లన్ని చెప్పిన అధ్యాయం కనుకనే దీనికి **'పురుషోత్తమ ప్రాప్తియోగం'** అని పేరు. క్రిందటి అధ్యాయాలలో కర్మజ్ఞానభక్తియోగాలు, త్రిగుణాతీతుడు భగవంతుని చేరే మార్గాలు వివరింపబడ్డాయి. పరమాత్మప్రాప్తికి ప్రతిజీవుడు ఈ సాంసారిక విషయములలో వైరాగ్యం అలవరుచుకోవాలి. భగవంతుడి మీద ప్రీతి పెంచుకోవాలి. కాని మనం జగత్తు మీద ప్రీతి పెంచుకొని భగవంతుడి మీద వైరాగ్యం పెంచేసు కుంటాం. అందుకే మనదంతా తల్లక్రిందులు వ్యవహారం. అందుకే స్వామికూడా తల్లక్రిందులుగా ఉండే అశ్వత్థవృక్షంలా ఈ లోకమంతా విస్తరించియుంటాడు. అదే ఆయన కార్యరూపం. ఇవి ఈ అధ్యాయం గురించి టూకీగా విశేషాలు.

ఇక ఈ మాసం కథలో విశేషాలేమిటో చూద్దాం.

గౌరీ! నీకిప్పుడు పదిహేనో అధ్యాయం యొక్క మహాత్మ్యాన్ని చేప్పే కథ చెబుతాను విను. అన్నాడు శంకరుడు. భక్తితో ప్రణమిల్లింది పార్వతీదేవి.

పూర్వం గౌడదేశమనే ఒక ధనిక రాజ్యముండేది. దానికి మహారాజు నరసింహుడు. అతడు మహావీరుడు. ఈతడు ఖడ్గయుద్ధంలో దేవతలను కూడ ఓడించగలడని ప్రతీతి. ఈతనికి ఒక సైన్యాధ్యక్షుడున్నాడు. ఆతనిపేరు సరసభేరి. ఈతడు కూడా ప్రచండ బలశాలి. అనేక శస్త్రవిద్యలలో ఆరితేరినవాడు. అంతేకాకుండా ఈతడు దుర్బుద్ధి కలవాడు, నీచుడు. అందువలన రాజుగారిని, ఆతని భార్యను, పిల్లల్ని చంపేసి రాజ్యాన్ని తన కైవశం చేసుకోవాలన్నది ఆతని ఆలోచన. కాని తన దురాలోచనను అమలు చేసే లోపలే సరసభేరి అనారోగ్యానికి గురయ్యాడు. అంతే, అదే అనారోగ్యంతో ఆతడు మరణించాడు.

మరికొద్ది రోజులకు ఆ నీచుడైన సరసభేరి మళ్ళీ ఒక మేలుజాతి

గుఱ్ఱంగా జన్మించాడు. ఆ గుఱ్ఱం ఒక ఉచ్చైశ్రవంలా అందంగా ఉంది. చూడగానే కళ్ళు తిప్పుకోలేనంత అందమైన తెల్లగుఱ్ఱం అది. ఆ లక్షణాలు చూసి ఒక వ్యాపారి రాజుగారి కోసం ఆ గుఱ్ఱాన్నికొన్నాడు. దానిని రాజుగారికి చూపించి అధికవెలకు దానిని రాజుకు అమ్మేశాడు. ఆ రాజు గౌడదేశపు రాజు నరసింహుడే!

ఒకరోజు నరసింహరాజు ఆ గుఱ్ఱాన్నెక్కి వేటకి వెళ్ళాడు. చాలాసేపు వేట కొనసాగించిన తరువాత రాజుగారు ఆ గుఱ్ఱాన్ని ఒకచెట్టుకు కట్టేసి నీటికోసం వెతకసాగాడు. అంతలో ఒక తాళపత్రం ఎక్కడినుండో ఎగిరివచ్చి తన ప్రక్కన పడింది. దానిని తీసి నరసింహుడు ఏదో రాసి ఉన్నదని గమనించి దానిని బిగ్గరగా చదివాడు. అది విన్న గుఱ్ఱం అక్కడికక్కడే మరణించింది. ఆ గుఱ్ఱం యొక్క జీవాత్మను ఒక దివ్యవిమానం వచ్చి తీసుకుపోయింది. నరసింహుడు ఇదంతా కళ్ళారా చూసి నిర్ఘాంతపోయాడు.

ఆ తాళపత్రాన్ని అలాగే పట్టుకుని దగ్గరలో కొండమీద ఉన్న ఆశ్రమానికి నడుచుకుంటూ వెళ్ళారు రాజుగారు. ఆ ఆశ్రమం ఒక మునీశ్వరుడిది. ఆయన పేరు విష్ణుదేవుడు. ఆయన త్రికాలదర్శి. ఆత్మసాక్షాత్కారమై స్వస్వరూపజ్ఞానంతో భాసిల్లుతున్న పుణ్యమూర్తి.

ఆయన ఆశ్రమంలో అనేక రకాల పక్షులు, జంతువులు ఆనందంగా విహరిస్తున్నాయి. నేలంతా చక్కనిపచ్చికతో ఎంతో మెత్తగా చల్లదనంతో హాయిని కలిగిస్తోంది. ఎన్నో రకాల పళ్ళ చెట్లు కాయలు, పళ్ళతో ఆనందాన్ని కలిగిస్తున్నాయి. అనేక రకాల పూలమొక్కలతో ఆశ్రమం కళకళలాడుతోంది.

నరసింహమహారాజు వినమ్రతతో ఆ మునీశ్వరుణ్ణి సమీపించి ఆ తాళపత్రాన్ని చూపించి జరిగింది చెప్పాడు. "స్వామీ! ఇందులో ఏమి రాసి ఉంది? ఇది చదవగానే నా గుఱ్ఱం ఎందుకు మరణించింది? మరణించిన ఆ గుఱ్ఱంయొక్క ఆత్మ ఎందుకు ఊర్ధ్వలోకాలకు పోయింది? తమరు సర్వము ఎరిగిన మహాత్ములు. దయచేసి నాకీ శంకను తొలగించ వలసినది" అని ప్రార్థించాడు.

దానికి ఆ మునీశ్వరుడు కొద్దిసేపు ధ్యానముద్రలోకి పోయి, కనులు తెరచి ఇలా చెప్పాడు.

"రాజా! నీవు ఈ పత్రంలో చదివింది, ఈ తాళపత్రంలో ఉన్నది భగవద్గీతలో పదిహేనవ అధ్యాయంలోని ఒక అర్థశ్లోకం'' **"విమూఢానాను పశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః"** ఈ విషయాన్ని మూఢులు తెలుసుకోలేకపోతున్నారు. జ్ఞానులైనవారు సర్వము తెలుసుకోగలుగుతున్నారు అని అర్థం.

ఈ గుఱ్ఱం గతజన్మలో నీ సైన్యాధ్యక్షుడైన సరసభేరి. నిన్ను చంపాలని ఆ దుష్టుడు తలచేవాడు. ఆ దుష్టఆలోచనతో తాను తన జీవితాన్ని ముగించాడు. ఆ పాపచింతన వలననే ఈ జన్మలో గుఱ్ఱంగా జన్మించాడు. గత జన్మవాసనల వలన తన సంకల్పంతో మళ్ళీ నిన్ను చంపాలనే చూస్తున్నాడు. కాని ఆతని అదృష్టం ఈ తాళపత్రం నీవు బిగ్గరగా చదవడం వలన నిన్నే గమనిస్తున్న ఆ గుఱ్ఱం ఆ శ్లోకాన్ని శ్రద్ధగా వింది. దానితో ఆ గుఱ్ఱం మనసు ప్రక్షాళితమైంది. తాను చేసిన పనికి చాల పశ్చాత్తాపపడ్డాడు. ఆతని సకల పాపాలు నశించాయి. ఆ బాధ అధికమై ఆతడు మళ్ళీ మరణించాడు. ఆ శ్లోకంలో ఉన్న అర్థాన్ని విశ్వసించడం వలన ఆతనికి స్వర్గలోక ప్రాప్తి కలిగింది" అని ముగించాడు ఆ మునీశ్వరుడు. నరసింహుడు పరమాశ్చర్యాన్ని పొందాడు.

ఆ రాజు మునీశ్వరుణ్ణి ప్రార్థించి భగవద్గీతలోని పదిహేనోఅధ్యాయాన్ని అభ్యసించి, తిరిగి రాజ్యానికి వెళ్ళి నిష్కామంగా రాజ్యాన్ని పాలిస్తూ కొంతకాలం గడిపాడు. ఆ తరువాత విరక్తుడై తన రాజ్యానికి కొడుకు అయిన సింహబలుణ్ణి రాజుగా చేసి, చక్కటి మంత్రిగణాన్ని ఏర్పాటు చేసాడు. ఇక తన జీవితశేషాన్ని భగవద్గీతయొక్క పదిహేనో అధ్యాయాన్ని పారాయణచేస్తూ చివరికి మోక్షపదవిని అలంకరించాడు.

ఈ కథను గురించి పద్మపురాణంలో ఈ క్రింది శ్లోకం ఇవ్వబడింది.

**అథ పంచదశాధ్యాయ శ్లోకార్థం లిఖితం క్వచిత్**

**తతోవాచయితః శ్రుత్వానిరగాత్తురగోదివం"**

తాళపత్రంమీద లిఖింపబడిన భగవద్గీతలోని పదిహేనవ అధ్యాయంలోని శ్లోకార్థాన్ని చదవగా విని, ఒక గుఱ్ఱము సద్గతినంది తరించెను.

# మదర్ టించర్స్

డా॥ జి. రామారావు-9440884396

### ఎబ్రోమ అగష్ట

**(Abroma augusta)**

దీన్ని డెవిల్స్ కాటన్, యులాట్‌కంబల్ అని అంటారు. Sterculiaceae కుటుంబమునకు చెందిన. భారతదేశమున వేడి ప్రాంతములలో ఇది పెరుగును. నారింజపండు రంగువంటి ప్రకాశవంతమగు ఎర్రనిరంగు పూలతో చూడముచ్చటగా నుండును. ఈ మొక్క ఆకులు, వేరు, బెరడు ఔషధములుగా తయారు చేయుట జరుగుచున్నది. ఋతుదోషములకు సహజమైన మందుగా పేరుగాంచినది. రక్తాధిక్యత, నరముల పొడుగున కత్తితో పొడుచుచుండు ఋతుశూలకు ఇది మంచి మందు. మధుమూత్ర, అతిమూత్ర వ్యాధులకిది దివ్యౌషధము. సిజీజియంతో డయాబెటిస్ వ్యాధిని నియంత్రించుటలో పోటీ బడును. త్వరగా కోపము వచ్చుట, మతిమరపు తల ఖాళీగానున్నట్లుండుట, తలతిరుగుట, తలభారము, కళ్ళనుండి నీరుకారుట, చెవులలో ఝుంకారము, విడువకుండా తుమ్ములు వచ్చుట, ముక్కుదురద, ముఖముపై కురుపులు ఏర్పడుట సంభవించును. గొంతుక తడారిపోవును. ఎక్కువ మొత్తములో చల్లని నీరు త్రాగుదురు. పెదవులు పొడిగాను, నీలముగాను మారును. ఆకలిఅధికము. ఎంత తిన్నను పొట్ట ఖాళీగా నున్నట్లుండును. అజీర్ణము. ప్రేగులుబ్బరించును. తీవ్రమైన మలబద్ధకముండును.

రాత్రింబవళ్ళు అతిమూత్రము తరచుగానగును. మూత్ర విసర్జన తర్వాత అతిదాహము. మూత్రము చేపవాసన కల్గి యుండును. కొంతమడ్డి ఉండును. రాత్రి నిద్రలో మూత్రము తెలియకుండ పోవును. మూత్రాశయంలో మంట, మూత్ర మాపుకోలేకపోవుట, పురుషుని శిశ్నాగ్రభాగములో తెల్లని పుండ్లుండును మూత్రములో ఆల్బుమిన్ పోవుచుండును.

పురుషులలో రతి వాంఛ తగ్గును. సంభోగించగల శక్తి యుండదు. ఆందోళనతో గుండె నీరసముగా నుండును. గుండెదడ కదలికవల్ల అధికమగును. శోషిల్లును.

దగ్గునపుడు ఛాతీలో నెప్పి అధికమై నొక్కుకొనును. చలిగాలిలో, సాయంత్రము రాత్రి దగ్గు అధికమగును. కళ్ళె పచ్చగా నుండును. చర్మము పొడిబారును. దురద మంట ఎక్కువ. వేసవిలో సెగగడ్డలు, పుండ్లు చర్మముపై బాధ పెట్టును.

స్త్రీలలో ఋతువు సక్రమముగా నుండదు. ఋతుస్రావము కనబడక పోవుట లేదా ఋతుస్రావము బాధ తో నుండుట జరుగును. కుసుమ అధికముగ స్రవించును. పొత్తికడుపులో నెప్పి తీవ్రముగా నుండును. వీనివలన స్త్రీలలో మానసికోద్రేకములు కల్గును. మత్తుగానుండును, నిద్రపట్టదు, ఏపని చేయబుద్ధికాదు, వీపు కిడ్నీలుండు ప్రాంతము నెప్పిగా నుండును.

పై లక్షణములున్నప్పుడు 5-10 చుక్కలు ఎబ్రోమా అగష్ట పావు కప్పు నీటితో మూడు పూటలు వ్యాధి తగ్గువరకు త్రాగవలెను.

### యీగిల్ ఫోలియా - యీగిల్ మార్మెలోస్

**(Aegle Folia - Aegle Marmelos)**

మారేడుచెట్టు భారతదేశ పవిత్ర వృక్షము. దీని పత్రములు శివపూజకు శ్రేష్ఠము. ఆయుర్వేద వైద్యములో ఈ వృక్షపు అన్నిభాగములు ఔషధములుగా వాడుదురు. ఈగిల్ ఫోలియా మారేడు ఆకులనుండి, యీగిల్ మార్మెలోస్ మారేడు పండ్లనుండి తయారుచేయుదురు. ఉబ్బు (వంటికినీరు పట్టుట) తో కూడిన జ్వరములలో, మలబద్ధకము, బెరిబెరి, న్యుమోనియా గుండెజబ్బులతో సహితము ఈ ఔషధము గొప్పమేలు జేయును.

(Dropsy) ఉబ్బు, శరీరమునకు నీరుపట్టుట, ధాతువు లందు ద్రవము కూడుట చర్మమునకు కండరములకు మధ్య నీరు పట్టుట జరుగును. గుండెదోషముచేనిది కలిగినయెడల సిరలందు నిండుగా బరువుగానుండును. మూత్రపిండముల వ్యాధిచేనిది కలిగిన యెడల ధమనులందు నిండుగ, బరువుగా నుండును. మూత్రము తక్కువగానగును. కనురెప్పలుబ్బును, కాళ్ళుచేతులు ముఖము ఉబ్బును.

జ్వర లక్షణములు, ఉబ్బుతో పాటు విరోచనములున్నను, మలబద్ధకమున్నను ఈ మందు చక్కగా పనిచేయును. మంట, వేడిమి, తలనొప్పి సాయంత్రము నాలుగు గంటలనుండి ఎనిమిది గంటల వరకు అధికముగా నుండును.

జలుబుతో కూడిన జ్వరము, బ్రోంకైటిస్, నిమోనియా, ఉబ్బు, మూత్రము తక్కువ లక్షణములున్నప్పుడు ఈ మందు మేలు జేయును. అజీర్ణము, పొత్తికడుపులో నెప్పి, మలబద్ధకము,

రక్తము స్రవించు మూలశంక, ఆహార హితవు లేకపోవుట (Anorexia), కడుపుబ్బరము, వృద్ధిచెందిన బాక్టీరియా వలన వచ్చు విరోచనములకు ఈ ఔషధము ఉపయుక్తము.

మూత్రపిండములలో మూత్రము తయారగును. ఇందు శరీరమాలిన్యము లుండును. మాంసకృత్తులు శిధిలమగుటచే యూరియా ఉండును. ఉప్పు, అమ్మోనియా, యూరిక్ యాసిడ్, సల్ఫ్యూరిక్‌యాసిడ్, ఫాస్పేట్లు హార్మోనులుండును. 96 భాగములు నీరుండును. ఆరోగ్యవంతుడు 40-60 ఔన్సుల మూత్రము విసర్జించును. మూత్రోత్పత్తి తగ్గుట, వీపులో క్రింది భాగము, ప్రక్కటెముకల క్రింద నుండి పిరుదుల వరకు గల భాగము నెప్పిగా నుండుట, సాయంత్రమగుసరికి బాధలు పెరుగుట వున్నప్పుడు ఈ ఔషధము మేలుచేయును.

జననేంద్రియము దుర్బలముగానుండును చిడుము, తామర మొదలగు చర్మవ్యాధులకు ఇది చాలా మంచిమందు.

నాడి నిండుగ, బలముగ, క్రమము తప్పిఉండును. వర్ణక్రమము తప్పు చెప్పును. నడినెత్తి వేడిగా, నెప్పిగానుండి. ఏదో ఒకటి తినుటచే తగ్గును. కాలేయ ప్లీహవ్యాధులలో ఉబ్బుట అను లక్షణములున్న ఈ ఔషధము స్వస్థత జేకూర్చును.

**Cascara Sagrad or Rhamnus Purshiana**

సహజముగా Cascara Sagrada విరచనమగునట్లు చేయు ఔషధముగా పేరు పొందినది. దీర్ఘకాల అజీర్ణము, (Cirrhosis) అవయవములుగట్టిపడి పరిమాణము తగ్గును. అందుచే అవి వాటి పనులను సక్రమముగా చేయజాలవు. ఇట్లు గుండె, మూత్రపిండములు, స్ప్లీన్ కాలేయములందు కలుగుచుండును. మూలశంక, మలబద్ధకము, అజీర్ణము వలన కలుగు తలనొప్పి, బిగిలేని నాలుక, నోటి నుండి దుర్వాసన మొదలగు లక్షణములున్న కేస్కరాసగ్రడ బాగుగా పనిచేయును.

మూత్రము శీఘ్రముగా విసర్జింపబడదు. ముందు చుక్కలు చుక్కలుగా పడును. మలబద్ధకముతో కూడిన కీళ్ళ వాతమునకు ఇది అద్భుతమైన ఔషధము 5-10 చుక్కల మదర్‌టించర్ పావుకప్పు నీళ్ళతో బాధలు తగ్గువరకు రోజుకు మూడు పర్యాయములు తీసికొనవచ్చును.

## ప్రేమే - భగవత్ స్వరూపం

*డి.దుర్గ- పడమట, విజయవాడ*

మనిషి తనని తాను ప్రేమించుకొనడం సహజమే! దానితో పాటు భగవంతుని ప్రేమించడంలోనే విశేషం దాగి ఉంది.

దైవాన్ని ప్రేమించడమంటే ఏం చెయ్యాలి? ఎలా చెయ్యాలి? అంటే ఆ దైవం అందరిలోనూ నిండి ఉన్నాడు కనుక అందరినీ ప్రేమించడం నేర్చుకోవాలి.

సాధారణంగా మనదృష్టి కనిపించే వ్యక్తిమీదేగాని అతనిలో దాగి ఉన్న పరమాత్మ వరకు పోదు కదా! ఒకరిని చూడగానే వారు చేసిన పనులే గుర్తుకు వస్తాయి మరి. ఆ స్థితిని దాటి అందరిలో ఉన్న దైవం వరకు మన మనస్సు పోగలిగితే ప్రేమ దానంతట అదే బయలుదేరుతుంది. ఇది అభ్యాసం చేతగాని సాధ్యంగాదు.

కాని ప్రపంచాన్ని జయించడం అనేది కేవలం ఈ ప్రేమ చేతనే సాధ్యమౌతుంది. ప్రేమకి కక్షలుండవు. చెడు జరగాలని ప్రేమ కోరదు. త్యాగాన్ని పెంచేది ప్రేమ లక్షణమే.

ముందు మన చుట్టూ ఉన్న వ్యక్తుల్నీ, సమాజాన్ని ప్రేమించడం నేర్చుకొంటే... అదే విశ్వమానవ ప్రేమగా పరిణమిస్తుంది. అదే వసుధైక కుటుంబ భావనని కలిగిస్తుంది. ప్రేమ శాశ్వతమైనది. ప్రేమ అవ్యయమైనది. ఆ ప్రేమే భగవత్ స్వరూపం. భగవంతుని ప్రేమిద్దాం! ఆయన శరీరమైన సమాజాన్ని ప్రేమిద్దాం!! ప్రేమలో దైవత్వాన్ని దర్శిద్దాం!!

జై శ్రీమన్నారాయణ!



రాయల ఊరేల పల్లకీ....

# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

మధుర చేరిన విష్ణుచిత్తులవారు నేరుగా రాజసభలోకి ప్రవేశించేరు. రోజూ పండిత సభ జరుగుతూ ఎవరో పండితులు వస్తూనే ఉన్నందువల్ల ముందు కబురుకాని రాజాజ్ఞకానీ, సిఫార్సుకానీ ఏమీ అక్కర్లేకుండానే ద్వారరక్షకుడు ఆయన్ను లోపలకు వదిలేడు.

వారిమొగం మంచితేజస్సుతో వెలిగిపోతోంది. విష్ణుచిత్తులు సభలో ప్రవేశించేటప్పటికి రాజుగారు, కూచున్న సభాసదులూ అంతా ఎవరో ఈ మహానుభావులని చకితులై దిగ్గున ఆసనాలపైనుంచి లేచి సభామర్యాదకు తగినట్లుగా స్వాగతించి నిలబడ్డారు. విష్ణుచిత్తులు సభలో ప్రవేశించి రాజుగారు నిర్దేశించిన ధగధగ మెరిసిపోతున్న మణులు తాపిన ఎత్తైన స్వర్ణపీఠం మీద కూచున్నారు.

ఆతిథ్యమర్యాదలయ్యాయి. శ్రీహరి ఆయన మనస్సులో మెదిలేడు. అంతవరకూ జరుగుతున్న వాగ్వాదాలన్నీ విష్ణుచిత్తులవారు సభలో ప్రవేశించగానే ఆగిపోయాయి. అయ్యో! ఆరంభించింది ఆపేసేరే? మేమేం పరాయివారమా? కానీండి! అని వారనగానే జరుగుతున్న వాదం కొనసాగింది.

కాస్సేపట్లోనే వాదులాడుతున్నవారి పస ఏపాటిదో విష్ణుచిత్తులవారికి తెలిసింది. నవ్వుమొగాన రాజును చూచి "రాజా! నువ్వు మధ్యవర్తిగా ఉంటే మేమూ కొన్ని మాటలు చెప్పాలనుకుంటున్నాం" అన్నారు..

"అయ్యో! ఎంతమాట? తమరు తమ అభిప్రాయాన్ని తప్పక సెలవీయాలి" అన్నారు రాజుగారు.

విష్ణుచిత్తులవారు ప్రారంభించేరు.

కూచున్నవారిలో కాస్త పసకలవాడివైపు తిరిగేరు. అతడు చేసిన వాదమంతా తాము మళ్ళీ వినిపించేరు సంగ్రహంగా. ఇదే కదా మీవాదం. అని ఆయనచేత ఔననిపించేరు. ఇది శాస్త్రవాద మర్యాద. అవతలివాడు చెప్పిందాన్ని తాను మళ్ళీ సభకు చెప్పడంలో రెండు ప్రయోజనాలు. ఒకటి తాను అతని వాదాన్ని సరిగానే అర్థం చేసుకున్నవాడని సభవారి క్కూడా తెలియడం, రెండు అతను తరువాత నేను అల్లా అనలేదు, ఇల్లా అనలేదు అని మాటమార్చకుండా ఉండడం కోసం. దీన్ని 'అనువాదం' అంటారు. అంతకుముందు వాదసభలెరక్క పోయినా వటపత్రశాయి దయవల్ల ఆ మర్యాదలు కూడా వారికల్లా సమయానుకూలంగా స్ఫురిస్తున్నాయి.

అట్లా అనువదించి అతడు చెప్పినవాటిలో తొందరపాటు లేకుండా తడబడకుండా నిదానంగా నెమ్మదిగా క్రమంగా దోషాలు నిరూపించేరు. సభ అంతా కూడా అవును, వారు నిరూపించిన దోషాలు ఆవాదంలో ఉన్నాయి, నిజమే అను కొనేట్టు. ఆ దోషాల్ని చక్కగా ఎత్తిచూపేరు.

చర్చ అంటూ జరుగుతున్నప్పుడు పదిమంది ఉన్నప్పుడు ప్రధానవక్త మాటలకు అనుకూలంగానో ప్రతికూలంగానో పక్కవారు ఏదో అనడం పరిపాటి. ఆ మాటలవల్ల వాదించేవారి మనస్సు చెదురుతుంది. దాంతో సమాధానం చెప్పడం కొంచెం కష్టమవుతుంది. విష్ణుచిత్తులవారు ఇలాంటి వాదయుద్ధాలు ఎన్నో చూసినవారిలా వాటిల్లో ఆరితేరినవారిలా పక్కవాళ్ళ మాటలు అస్సలు పట్టించుకోకుండా ప్రధానవక్త మీదే చూపు నిలిపేరు. ఆయన వాదాన్ని ఒక్కొక్క యుక్తి చూపెడుతూ ప్రమాణం కనబరుస్తూ మర్యాదకు ఔచిత్యానికీ భంగం లేకుండా హుందాగా ఖండించేరు. దీంతో కొత్తగా ఎక్కణ్ణించో వచ్చిన ఈయన మనందరినీ వెనక్కు నెట్టివేస్తున్నాడని కొందరు మూకగా, దొమ్మికి వచ్చినట్లు మాట్లాడ్డం ప్రారంభించేరు. వాళ్ళు అంత గందరగోళం చేస్తున్నా చలించకుండా వాళ్ళందర్నీ క్షణాలమీద సమాధానపరచి కూచోపెట్టి మళ్ళీ మొదటివాడివైపే తిరిగి తమ సిద్ధాంతాన్ని ప్రతిపాదింప పూనుకున్నారు.

బ్రహ్మసూత్రాలకు, భగవద్గీతలకు, ఉపనిషత్తులకూ ఏకవాక్యత కల్పిస్తూ వాటిలోంచి ప్రమాణాలు చూపిస్తూ తమ సిద్ధాంతాన్ని ప్రతిపాదించేరు. *(సశేషం)*

**శ్రీ రామచంద్రాచార్య**



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



## నేత్రావిద్యాలయ 5వ వార్షికోత్సవ విశేషాలు

శ్రీస్వామివారి నేతృత్వంలో నిర్వహింపబడుతున్న నేత్ర విద్యాలయ స్కూల్, జూనియర్ మరియు డిగ్రీ కళాశాల 5వ వార్షికోత్సవము తేది. 31.08.2012న శ్రీవారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జీవా ప్రాంగణము, శ్రీరామనగరము- దివ్యసాకేత మండపంలో ఎంతో వైభవంగా నిర్వహింపబడినది.

విజయనగరం నుండి నేత్ర విద్యాలయ విద్యార్థులు, శ్రీరామనగర్, జీవా జూనియర్ & డిగ్రీ నేత్ర విద్యార్థులు, వేదవిద్యార్థులు, నిర్వాహకులు ఈ కార్యక్రమానికి హాజరయ్యారు.

ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా రాష్ట్రముఖ్యమంత్రి శ్రీమాన్ నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డిగారు విచ్చేశారు. రాష్ట్ర పంచాయితీరాజ్ శాఖామాత్యులు శ్రీమాన్ జానారెడ్డి, పౌరసరఫరాలశాఖ మంత్రి శ్రీమాన్ శ్రీధర్‌బాబు, హోంశాఖ మంత్రి శ్రీమతి సబితా ఇంద్రారెడ్డి, మున్సిపల్ పరిపాలన శాఖామాత్యులు శ్రీమాన్ మహీధర్‌రెడ్డి, జౌళిశాఖామాత్యులు శ్రీమాన్ ప్రసాద్, మరియు గృహనిర్మాణశాఖామాత్యులు శ్రీమాన్ ఉత్తమ్ కుమార్‌రెడ్డి, విశేష అతిథులుగ విచ్చేశారు. అంతేకాక శాసనసభ్యులు శ్రీమాన్ ఎర్రబల్లి దయాకర్, శ్రీమాన్ కె.లక్ష్మారెడ్డి, శ్రీమాన్ టి.ప్రకాశ్ గౌడ్, జిల్లా కలెక్టర్‌గారు కూడా ఈకార్యక్రమాలలో భాగం పంచుకున్నారు.

శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ ఎస్.వి. రంగరామానుజాచార్య స్వామి- డైరెక్టర్ జీవా ఎకడమిక్ కౌన్సిల్; జీవా ఛైర్మన్ శ్రీమాన్ జె. రామేశ్వరరావు; శ్రీమాన్ పి. మురలీకృష్ణంరాజు; భక్తి టి.వి. ఛైర్మన్- శ్రీమాన్ నరేంద్ర చౌదరి; ప్రఖ్యాత హోమియో వైద్యులు శ్రీమాన్ పావులూరి కృష్ణచౌదరి; శ్రీమాన్ జి.వి.కె. రంగరాజు మొదలగు ప్రముఖులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

కార్యక్రమ నిర్వాహకులు శ్రీమాన్ ఇ. రామారావు, శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డి, వేదపండితులు, కార్యక్రమానికి విచ్చేసిన మంత్రివర్యులను స్వాగతించి, మొదట దివ్యసాకేత ఆలయదర్శనం కావించి, కార్యక్రమ మండపానికి తీసుకొని వెళ్ళారు. శ్రీమాన్ నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డిగారిని శ్రీస్వామివారు ఇతర ప్రముఖులు ఆలయ మర్యాదలతో స్వాగతం పలికి, దివ్యసాకేతంలోని ఒక్కొక్క సన్నిధిలోనూ ప్రత్యేక అర్చనాదులను నిర్వహింపచేసి ఆలయ ప్రాముఖ్యతను వివరించారు.

అక్కడి నుండి నేత్రవిద్యాలయ, మరియు జీవా గురుకుల ప్రాంగణములో విద్యార్థుల మరియు అడ్మినిస్ట్రేషన్‌కు అవసరమైన ఆన్-లైన్ కెమెరా విధానాన్ని ముఖ్యమంత్రివర్యుల చేతులమీదుగా ప్రారంభింపచేశారు. విద్యార్థుల విజ్ఞానాన్ని పెంచేందుకు దోహదం చేసే ఫిజిక్స్, కెమిస్ట్రీ విభాగాల లాబ్స్‌ను ప్రారంభింపచేశారు. అంధులైన విద్యార్థులు తాము తయారు చేసిన వివిధ రకాల గ్రీటింగ్ కార్డ్స్, ఇతర కీచైన్స్, కార్ హ్యాంగింగ్స్, పిచ్చుకగూళ్ళు, తాజ్‌మహల్ వంటి ఎన్నో హ్యాండ్‌మేడ్ ఆర్టికల్స్‌ను ప్రదర్శించారు. ముఖ్యమంత్రిగారు తిలకించి విద్యార్థులను అభినందించారు.

ముఖ్యమంత్రిగారి సమక్షంలో నేత్ర విద్యాలయ విద్యార్థులు కొన్ని సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించారు. శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారి స్వాగతోపన్యాసంతో మొదట శ్రీస్వామివారిని, ముఖ్యమంత్రివర్యులను, ఇతర మంత్రులను, శాసనసభ్యులను, ప్రముఖులను వేదికపైకి ఆహ్వానించారు. దీపప్రజ్వలన, వేదశాంతి పఠనంతో కార్యక్రమం ఆరంభమయినది.

జూనియర్ కాలేజ్ ప్రిన్సిపాల్ శ్రీమాన్ మాధవరావుగారు, వార్షిక నివేదికను సమర్పిస్తూ "విజయనగరం నేత్ర విద్యాలయ విద్యార్థులు స్పోర్ట్స్‌లో 6 గోల్డ్, 2 సిల్వర్, 3 బ్రాంజ్ మెడల్స్ సాధించారు. 10మంది జూనియర్ కళాశాల విద్యార్థులు ఇంటర్ మీడియట్ బోర్డ్ స్కాలర్‌షిప్‌లకు ఎన్నికయ్యా"రని తమ నివేదికలో తెలిపారు.

కళాశాల విద్యార్థినులు కుమారి ప్రశాంతి, సునీతలు మాట్లాడుతూ అంధకారమైన తమ జీవితాలకు ఆధునిక విజ్ఞానంతో కూడిన లాప్‌టాప్ మరియు ఇతర సదుపాయాలను కలుగజేసి వెలుగును ప్రసాదించిన శ్రీస్వామివారికి కృతజ్ఞతలను తెలిపారు. ప్రపంచంలోనే మొదటిసారిగా అంధవిద్యార్థులు నేరుగా లాప్‌టాప్స్‌తో ఎగ్జామ్స్ రాయగలిగేట్టుగా తీర్చిదిద్దిన ఘనత శ్రీస్వామివారి నేత్ర విద్యాలయాలకు మాత్రమే కలిగిందన్నారు.

వక్తలంతా కూడా శ్రీస్వామివారి ద్వారా సాగుతున్న ఈ కళాశాలల విద్యా వ్యాసంగాన్ని కొనియాడుతూ, తమ తమ పరిధిలో వీటికి కావలసిన సహకారాలను అందించగలమని, ఈ కార్యక్రమంలో పాల్గొనటం తమ భాగ్యంగా భావిస్తున్నామని తమ అభిప్రాయాలను తెలిపారు.

విచ్చేసిన ప్రముఖులందరిని శ్రీస్వామివారుజ్ఞాపికలతో, దుశ్శాలువలతో సత్కరించారు.

శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపజేస్తూ అంధత్వం వారి నేరం కాదు. వారూ సమాజంలోని ఇతరులవలే ఆత్మ విశ్వాసంతో బ్రతుకగలిగేట్టుగా వారిని తీర్చిదిద్దటం సమాజంయొక్క బాధ్యత. అందుకు ప్రభుత్వమే ఆ పని చేయాలని ఎదురు చూస్తూ కూర్చోక స్వచ్ఛంద సంస్థలు, సామాజిక సంస్థలు కూడా తమ బాధ్యతలను నిర్వహించాలి. ప్రభుత్వం కూడా తగిన విధంగా వారికి సహకరించాలి. మేము చేసే సేవాకార్యక్రమాలకి ఎవరినీ సహాయ సహకారాలను అడగడం కానీ, ప్రాధేయ పడడం కానీ ఇంతవరకు జరుగలేదు. సహృదయులైన వ్యక్తులు సమాజంలో సహకరించడం వల్లే ఇవన్నీ సాధ్యమవుతున్నాయి అన్నారు.

శ్రీమాన్ కిరణ్‌కుమార్‌రెడ్డిగారు మాట్లాడుతూ శ్రీస్వామివారు చేస్తున్న సేవాకార్యక్రమాలు వింటున్నాను కానీ చూసే అవకాశం కలుగలేదు. అందుకే ఆహ్వానించగానే కార్యక్రమం చూసే భాగ్యం కలుగుతుందని వచ్చామన్నారు. తమ నిజాంకాలేజ్‌లో జరిగిన సంఘటన ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకుని ఆనాటి కొంతమంది అంధ స్నేహితులు ఈనాటికీ తనకు ఫోన్స్ చేస్తారు, కలుస్తారు. కళ్ళుండీ సరిగా ప్రవర్తించలేని మనం అంధులం అంటూ ఇలాంటి ఎన్నో కార్యక్రమాలను శ్రీస్వామివారు నిర్వహించాలని, ప్రభుత్వపరంగా తాము పాల్గొని సహాయాన్ని అందించేట్టుగా అవకాశం కల్పించాలని తమ ఆకాంక్షను తెలిపారు.

అనంతరం శ్రీస్వామివారు జ్ఞాపికతో ముఖ్యమంత్రిగారిని సత్కరించారు.

శ్రీమాన్ ఇ. రామారావుగారు వందన సమర్పణ కావిస్తూ ప్రభుత్వపాలనా పరంగా ఎంతో బిజీగా ఉన్నా కార్యక్రమంలో పాల్గొన్నందుకు మంత్రులందరికీ కృతజ్ఞతలు తెలిపారు. జాతీయ గీతాలాపనతో సభా కార్యక్రమం ముగిసింది.

తరువాత వచ్చిన ప్రముఖులు, ఇతరులు సుమారు 7వేలమంది తదీయారాధన కార్యక్రమంలో పాల్గొన్నారు. కార్యక్రమం సుసంపన్నమయింది.

## శ్రీరామనగరం-దివ్యసాకేతంలో వరలక్ష్మీవ్రత వైభవం

శ్రావణమాసం వరలక్ష్మీవ్రత పర్వదిన సందర్భంగా మన శంషాబాద్, శ్రీరామనగరం-దివ్యసాకేతంలో రెండవ శుక్రవారం లక్ష్మీపూజలు వైభవోపేతంగా జరిగాయి. సుమారు 500మంది పుణ్యస్త్రీలు ఈ మహోత్సవంలో పాల్గొన్నారు. బారులు తీర్చి కూర్చుని శ్రీస్వామివారి చేతులమీదుగా అమ్మ రూపు ప్రసాదంగా పొంది చేసిన లక్ష్మీపూజ కన్నులవిందుగా సాగింది. హోమకార్యక్రమం మనసుల్ని, మనుషుల్నీ పవిత్రీ కృతం చేసింది. అమ్మవారి విశేష అలంకారం చూడడానికి రెండు కన్నులు చాలలేదనిపించింది.

ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన టి.కె. సోదరీమణులు శ్రీమతి సరోజ, సుజాతల గాత్ర సంగీతం ఆనందంలో ఓలలాడించింది. నర్తకీమణుల నాట్యాలు రసరమ్యంగా సాగి పులకింపచేశాయి. శ్రీమతి వనజాభాస్కరరావు, వసుమతీ భాస్కరరావువంటి శ్రద్ధాళువులైన భక్తుల నేతృత్వంలో సాగిన శ్రీరంగనాయకి పూజామహోత్సవం వికాసతరంగిణి కార్యకర్తల భక్తిశ్రద్ధలకి అద్దంపట్టింది.

## సికిందరాబాద్ లక్ష్మీనారాయణ కోవెలలో..

శ్రావణశుక్రవారమహోత్సవం శ్రీ లక్ష్మీనారాయణ సన్నిధిలో వికాసతరంగిణి ఆధ్వర్యవంలో అద్భుతంగా జరిగింది. శ్రీమతి వనజాభాస్కర్‌రావు, శ్రీమతి వసుమతీ భాస్కర్‌రావు మిగిలిన వికాసతరంగిణి సభ్యులందరూ ఈ పూజాకార్యక్రమాన్ని వైభవోపేతంగా జరిపించారు. సుమారు 300 మంది ఈ పూజాకార్యక్రమంలో అన్వయించి తరించారు. శ్రీమతి వనజాభాస్కర్‌గారి అభ్యర్ధనపై శ్రీమతి డా॥ టి.కె. చూడామణి గారు, శ్రీ మహాలక్ష్మీ వైభవాన్ని గూర్చి ప్రసంగించారు. చక్కని క్రమశిక్షణతో ఈ కార్యక్రమం సాగింది.

## నాలాయిర దివ్యప్రబంధ పారాయణ:

శ్రీరామనగరం-దివ్యసాకేతంలో శ్రీరామచంద్ర, శ్రీరంగనాథ, పరమపదనాథుని దివ్యసన్నిధిలో ఆగస్టు 21 నుండి 28 వరకు వారంరోజులు **నాలాయిర దివ్యప్రబంధ పారాయణ** ఆనందంగా సాగింది. గుడివాడ వికాసతరంగిణి సభ్యులు శ్రీమతి జయమ్మగారి నేతృత్వంలో సుమారు ఇరవై ఐదుమంది మహిళలు వారంరోజులు నాలాయిర దివ్యప్రబంధ పారాయణం కావించారు. శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు వీరికి మంగళాశాసనములు కృపచేశారు.

## శ్రీరాంగనగర్‌లో జరిగిన భజన పోటీలు

శ్రీజయంతి సందర్భముగా శ్రీరాంనగర్ జీవా ప్రాంగణంలో సెప్టెంబర్ 6,7 తేదీలలో భజనపోటీలు నిర్వహించడం జరిగింది.

మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన వివిధ గ్రామాలనుండి సుమారు 42 భజన బృందాలు ఈ పోటీలో ఉత్సాహంగా పాల్గొన్నాయి.

ఇందులో బహుమతులు సాధించిన వారి వివరములు ఈ విధంగా ఉన్నాయి.

**మొదటి బహుమతి : రూ. 10,000/-**

వీరాంజనేయ భజనమండలి-కొండపల్లి

**రెండవ బహుమతి (ఇద్దరికి): రూ. 6,000/-**

1. శ్రీ ఆంజనేయ భజనమండలి - చిన్నమందడి
2. శ్రీ మారుతి నల్లారెడ్డి భజనమండలి - పాల్వాయి

**మూడవ బహుమతి (ముగ్గురికి) రూ. 3,000/-**

1. శ్రీ భీమేశ్వర భజనమండలి- విజ్వారం
2. శ్రీ విజయరాయ భజనమండలి - శమ్మాపురం
3. మారుతి భజనమండలి - కోటకొండ.

**ప్రోత్సాహక బహుమతులు (నలుగురు) రూ. 1,000/-**

1. మారుతి భజనమండలి - పర్గిపూర్
2. శ్రీరామంజనేయ భజనమండలి - తిమ్మాజిపల్లి
3. సీతారామాంజనేయ భజనమండలి - నాగర్ కర్నూల్
4. శ్రీమారుతి భజనమండలి - చిట్లంగుంట

**భజన కార్యక్రమాలకి న్యాయ నిర్ణేతలు**

శ్రీమాన్ రామాచారి
శ్రీమాన్ అద్దంకి రామకృష్ణ
శ్రీమాన్ వీణాపాణి వ్యవహరించారు.

**భజనమండలుల సమన్వయకర్త**

శ్రీమాన్ వెంకటరెడ్డి ఉండ్యాల గారు

శ్రీజయంతి రోజున వీరందరికి శ్రీస్వామివారి కరకమలముల మీదుగా నగదు బహుమతి మరియు ధృవీకరణ పత్రములు అందించడం జరిగింది. న్యాయనిర్ణేతలను, సమన్వయ కర్తలను శాలువాతో సమ్మానించారు.

## చెర్లపల్లి జైలులో...

ఖైదీలలో మంచిమార్పును తీసుకొని రావాలని ఆనాడు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారు అనేక కార్యక్రమాలు చేపట్టిన విషయం లోకవిదితమే! ఆసేవా కార్యక్రమాలు శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి నేతృత్వంలో మరింత ముందుకు సాగుతున్నాయి. చెర్లపల్లి జైలులో కార్యక్రమాలన్నీ శ్రీమతి వనజాభాస్కరరావుగారి నేతృత్వంలో కొనసాగడం విశేషం. ప్రతి ధనుర్మాసంలో ఖైదీలు శరణాగతి దీక్షను చేపట్టడం, నియమబద్ధమైన జీవితాన్ని గడపడం, ఏడుకొండలవాని కటాక్షఫలంగా కొందరు సత్ ప్రవర్తన ద్వారా శిక్షనుండి విడుదల పొందడం ప్రశంసనీయమైన విషయం కదా! ఆ కార్యక్రమంలో భాగంగా చెర్లపల్లి జైలులో శ్రీమతి డా॥ టి.కె చూడామణిగారు 'భగంతుని మీ హృదయాలలో బంధించండి' అంటూ చేసిన ఉపదేశం శ్రోతల హృదయాలను కదిలించింది.

తెలియక పొరపాటుగా ప్రవర్తించాం అంటూ కొందరు పాదాలపై పడి కన్నీటి పర్యంతం కావడం గమనార్హం. ఉపదేశాలతో పాటు చెవులకి, కళ్ళకి కూడా ఆనందం కలిగించేలా చి॥ వేణుగారి నాయకత్వంలో సాగిన వెంకిగారి మిమిక్రీ, ఇంద్రజాలం, నాట్యాలు విశేషంగా ఆకర్షించాయి. శరణాగతి దీక్షను గూర్చి వివరించి ఎందరినో ఉత్తేజపరుస్తున్న శ్రీమతి వనజగారు ధన్యులు. ఈ సందర్భంగా స్వీట్లు, బిస్కట్లు పళ్ళు ఖైదీలకు ప్రసాదంగా పంపిణీ చేశారు.

## ముఖచిత్ర వివరములు

1. నేత్రవిద్యాలయ 5వ వార్షికోత్సవంలో వేదికను అలంకరించిన ప్రముఖులు
2. ల్యావ్‌టాప్స్‌పై 'జాస్' సాఫ్ట్‌వేర్ వినియోగాన్ని విద్యార్థులద్వారా తెలుసుకుంటున్న ముఖ్యమంత్రివర్యులు
3. ముంబాయిలో నిర్వహించిన NAB 'అఖిలభారత జాతీయ అంధవిద్యార్థుల సమాఖ్య' వారు నిర్వహించిన క్రీడోత్సవాలలో, విజయనగరం నేత్రవిద్యాలయ విద్యార్థులు గెలుపొందిన 6 స్వర్ణ, 2 రజత,1 కాంస్యపతకాలను ముఖ్యమంత్రి ద్వారా అందుకుంటున్న తిమిరి కృష్ణవేణి.
4. విద్యార్థులు తయారుచేసిన హస్తకళాప్రదర్శనను తిలకిస్తున్న ముఖ్యమంత్రి శ్రీమాన్ కిరణ్‌కుమార్‌రెడ్డి
5. భౌతిక, రసాయన ప్రయోగశాలను ప్రారంభిస్తున్న శ్రీమాన్ కిరణ్‌కుమార్ రెడ్డి
6. విజయనగరం నేత్రవిద్యాలయ విద్యార్థులు
7. శ్రీరాంనగర్ జూనియర్, డిగ్రీ కాలేజి విద్యార్థులు
8. వార్షికోత్సవ కార్యక్రమ వ్యాఖ్యాతలు చి॥ త్రినాథ్, చి॥ రమ్య
9. బృందగానాన్ని ఆలపిస్తున్న ఇంటర్ విద్యార్థినులు
10. ఇంటర్ విద్యార్థుల వాద్య ప్రదర్శన
11. అభిప్రాయావిష్కరణలో బికాం విద్యార్థిని చి॥ సునీత
12. పర్యావరణ పరిరక్షణపై రూపకమును ప్రదర్శించిన డిగ్రీవిద్యార్థులు
13. మిమిక్రీచేస్తున్న డిగ్రీవిద్యార్థులు చి॥ రమేశ్, చి॥ వేంకటేశ్
14. వేణువును ఆలపిస్తున్న డిగ్రీవిద్యార్థి చి॥ కిషోర్
15. తబల వాద్యప్రదర్శనలో డిగ్రీవిద్యార్థిని వందన
16. నృత్యప్రదర్శనతో డిగ్రీవిద్యార్థినులు
17. పిరమిడ్ ప్రదర్శనతో నేత్రవిద్యాలయ విద్యార్థులు
18. ముఖ్యమంత్రి శ్రీమాన్ కిరణ్‌కుమారెడ్డి ద్వారా బ్రైలీ వాచీలను అందుకుంటున్న కళాశాల విద్యార్థిని చి॥ మమతాభాయ్
19. సుమధుర గానాలాపనలో విజయనగర నేత్రవిద్యాలయ విద్యార్థి చి॥నాగవోలు పరమేశ్వరరావు (ఈటివి వారు నిర్వహించిన బ్లాక్ ప్రోగ్రాంలో తృతీయ స్థానాన్ని, మా టివి వారి రేలారే రేలారే అనే కార్యక్రమంలో ప్రథమ స్థానాన్ని పొందినది ఈ విద్యార్థే).

# శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి USA ప్రచార వార్తలు

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు ఆగస్టు 2వ తేదీ చాతుర్మాస్యదీక్షను స్వీకరించారు. ఆరోజు హయగ్రీవ జయంతిని పురస్కరించుకొని హయగ్రీవ ఇష్టిని పూజా కార్యక్రమాలను నిర్వహించారు.

5వ తేదీ వరకు జగదాచార్యులైన రామానుజుల వైభవాన్ని చాటు "ఇరామానుజ నూత్తందాది"పై ఉపన్యసించారు.

6వ తేది పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి తిరునక్షత్ర మహోత్సవ సందర్భంగా శ్రీవారి పాదుకలకు నవకలశ స్నపన, అర్చన జరిపి, సాయంత్రం శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి వైభవాన్ని కొనియాడుతూ ఉపన్యసించారు.

భక్తుల కోరికపై 21 రోజులు ప్రవచన గోష్ఠిని జరిపారు. విశేషించి ప్రతి శ్రావణశుక్రవారం సాయంత్రం లక్ష్మీ అమ్మవారికి జరిగే "ఊంజల్‌సేవ", విశేషార్చన, తిరువీధి ఉత్సవాలలో భక్తులు విరివిగా పాల్గొన్నారు. ఆరాధనలో భాగంగా సంగీతం, వాద్యం, నృత్యం ఇలా ఎన్నో సేవలను సమర్పిస్తూ అక్కడి చిన్నారులు చురుకుగా పాల్గొన్నారు.

భక్తుల కోరికపై విశేషదినములలో సుదర్శన, నారసింహ, ధన్వంతరి ఇష్టులను నిర్వహించారు.

ఆగస్టు 19వ తేదీన న్యూజెర్సీ ఆశ్రమంలో గుంటూరుకు చెందిన శ్రీ విశ్వంజీ స్వామివారు జరిపిన సుదర్శన యజ్ఞ కార్యక్రమములో శ్రీ అహోబిల స్వామివారు పాల్గొన్నారు. విశ్వంజీగారు శ్రీచిన్న జీయరు స్వామివారు జరిపే సేవలను కొనియాడారు. న్యూజెర్సీ జీయర్ ఆశ్రమం ఒక తపోభూమి అని సదాచార్యులైన శ్రీస్వామివారి దృష్టి ఎవరిపై ప్రసరిస్తుందో వారు ఎంత గొప్ప వారు అవుతారో అందుకు ఉదాహరణ శ్రీ అహోబిల రామానుజ జీయరుస్వామి అని కొనియాడారు. ఆ తర్వాత శ్రీ అహోబిల స్వామి సుదర్శన వైభవాన్ని వివరిస్తూ ఆశీఃప్రసంగం చేశారు.

భాగవతంలో శ్రీకృష్ణజననం బహువేడుకగా జరిగింది. అక్కడవారు వారి పిల్లలను శ్రీకృష్ణునిగా గోపికలుగా అలంకరించి తీసుకొని రావడంలో మన జీయర్ ఆశ్రమం బృందావనంలా శోభిల్లింది. అనేక రకాల పిండివంటలు తయారుచేసి నల్లనయ్యకు సమర్పించారు.

శ్రీమాన్ తోట గోవిందరాజుల దంపతులు ఈ ప్రసాద కైంకర్యాన్ని సమర్పించి శ్రీ అహోబిల జీయరు స్వామివారి మంగళాశాసనాలు తీసుకున్నారు.

ఈ కార్యక్రమంలో వేషధారణలో విచ్చేసిన చిన్నారులకు ప్రోత్సాహకముగా బహుమతులను ప్రతిమలను శ్రీమాన్ అలక్కి శర్మగారు శ్రీ అహోబిల జీయరు స్వామివారి ద్వారా అందించారు.

25వ తారీఖు గోవర్ధనోద్ధరణ ఘట్టాన్ని పురస్కరించుకొని అన్నకూట ఉత్సవంలో ఎన్నో పిండివంటలు ప్రసాదాలను పెరుమాళ్ళకు సమర్పించారు. భక్తులు ఆహా! ఇలాటి అన్నకూటోత్సవం ప్రతిరోజు జరిగితే ఎంత బాగుండునో కదా! అంటూ తమ ఆనందాన్ని వ్యక్తపరిచారు. కృష్ణనామాన్ని గానం చేస్తూ పిల్లలు పెద్దలు అందరూ వయస్సుతో నిమిత్తం లేకుండా నృత్యాన్ని చేశారు. ప్రసాద కైంకర్యాన్ని సమర్పించిన కైంకర్యపరులకు మంగళాశాసనము చేసారు. 27వ తేదీ సాయంత్రం శ్రీకృష్ణ రుక్మిణీ కళ్యాణ కార్యక్రమాన్ని చిరంజీవి ఆరవెల్లి పవన్‌కుమారాచార్యులు (న్యూజెర్సీ ఆశ్రమం అర్చకులు) చక్కగా నిర్వహించారు.

శ్రీమద్భాగవత ప్రవచన గోష్ఠిలో 21 రోజులు రోజుకు ఒకరు ఇద్దరు జంటలు కలశపూజలో పాల్గొన్నారు. వారందరికి శ్రీ రుక్మిణీకృష్ణ కళ్యాణ సందర్భంగా మహదాశీర్వచనాన్ని మన వేదపండితులు జరిపారు.

28వ తేది ద్వాదశి విశేష తదీయారాధన జరిగింది. ఈ తదీయారాధనకు శ్రీమతి విశాలి దంపతులు కైంకర్యాన్ని సమర్పించారు. చాతుర్మాస్యదీక్షలో ప్రతిరోజు ప్రసాద కైంకర్యాన్ని శ్రీమతి డింగరి వెంకటరమణ-అపర్ణ దంపతులు జరిపారు.

సెప్టెంబరు 1వ తేది శ్రీమాన్ లీలారాజశేఖర్ గృహంలో హయగ్రీవ ఇష్టి నిర్వహించి సాయంత్రం (యూనిటారియల్ సొసైటీలో) ప్రజ్ఞ ద్వితీయ వార్షికోత్సవంలో పాల్గొని చిన్నారులను వారిని ప్రోత్సహించిన తల్లిదండ్రులను ఉద్దేశిస్తూ అనుగ్రహభాషణ చేశారు.

పాశ్చాత్యదేశంలో ఉన్నా పుణ్యభూమిని సంస్కృతిని మరువని శ్రద్ధను వ్యక్తులమధ్య సమాజం దైవంపట్ల ప్రేమను పెంచేదిశలో మమ్మల్ని నడుపుతున్న శ్రీ చిన్న జీయరు స్వామివారిని ఈ సంవత్సరం సేవించుకోలేదని ఆవేదన వ్యక్తపరుస్తూ శ్రీస్వామి వారిని పదేపదే స్మరించుకున్నారు. అక్కడ ప్రజ్ఞా పిల్లలకు ప్రశంసాపత్రాలను జ్ఞాపికలను అందించారు.

ఈ కార్యక్రమాన్ని శ్రీమాన్ సాయి, శ్రీమాన్ సీతారామ్, శ్రీమతి గీత, తదితర వి.టి. సభ్యుల సమన్వయంతో నిర్వహించారు. 2వ తేది ఆదివారం ఉదయం 9గం॥ నుండి 12 వరకు ... మహాసౌరపూర్వక అరుణ పారాయణ, సూర్యనమస్కారాలు జరిపారు.

ఈ పూజలో 70మంది భక్తులు ఆసాంతం పాల్గొనుటయే కాక స్వయంగా 140 నమస్కారాలు చేయటం చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. మధ్యాహ్నం 1గం॥ శ్రీమాన్ సతీష్, రేవతి దంపతుల గృహంలో శ్రీపద్మావతి శ్రీనివాస కళ్యాణం నిర్వహించారు. విశేషంగా భక్తులు పాల్గొన్నారు.

అనంతరం జిజ్ఞాసువులైన భక్తుల గృహాలలో ఆచార్యుల శ్రీపాదుకలకు పాదుకాపూజ నిర్వహించారు. సాయంత్రం శ్రీమాన్ ఉమా శ్రీనివాస్ దంపతుల గృహంలో శ్రీ సీతారామ కళ్యాణం వైభవంగా జరిపారు. విచ్చేసిన భక్తులకు కళ్యాణం లోని ఆంతర్యాన్ని వివరించారు. 3వ తేది ప్రజ్ఞ టీచర్స్‌తో సమావేశం జరిపారు.

4వ తేది శ్రీమాన్ డా॥ గీతా విజయభాస్కర్‌రెడ్డి గృహంలో సుదర్శన నారసింహ ఇష్టిలో పాల్గొన్నారు. సాయంత్రం శ్రీమాన్ శ్రీనివాస్ గృహంలో లక్ష్మీ నారాయణ పూజను జరిపారు. లక్ష్మీవైభవంపై ఉపన్యసించారు.

5వ తేదీ ఉదయం శ్రీమాన్ శృతి రఘునాథ్‌ల ఆహ్వానంపై బూస్టన్‌కు చేరుకున్నారు. సాయంత్రం శ్రీమాన్ డాక్టర్ చంద్రారెడ్డి శశికళల గృహంలో రామానుజ వైభవాన్ని ప్రవచనం చేశారు.

6వ తేది శ్రీమాన్ ఎస్. రఘునాథ్ గృహంలో శ్రీసుదర్శన నారసింహ ఇష్టి జరిపి సాయంత్రం 7గం॥ నుండి రామాయణంలో రహస్యాలు ప్రవచనం చేశారు. అనంతరం వి.టి. సేవా కర్యకర్తలతో సమావేశంలో పాల్గొన్నారు.

7వ తేది ఉదయం శ్రీమాన్ రఘునాథ్‌గారి గృహంలో సీతారామ కళ్యాణం జరిపి బూస్టన్ నుండి న్యూజెర్సీ మీదుగా పిట్స్‌బర్గ్ చేరి శ్రీమాన్ రంగనాయకీ సుబ్బారెడ్డి దంపతుల గృహంలో బసచేశారు.

8వ తేది శ్రీజయంతి సందర్భంగా శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో శ్రీకృష్ణ అవతార ఘట్టాన్ని ఉపన్యసించారు.

రాత్రిబసలో శ్రీకృష్ణునికి తిరుమంజనం అర్చనాదులు జరిపి శ్రీకృష్ణలీలలను ఉపన్యసించారు. శ్రీమాన్ శ్రీరామ్‌గారు నూతనంగా ఆరంభిస్తున్న ప్రజ్ఞాసెంటర్‌ను ప్రారంభించి చిన్నారులకు పెద్దలకు ఆశీః పూర్వక ప్రవచనాన్ని అందించారు.

9వ తేది ఉదయం శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిలో తిరుమంజన సేవను దర్శించి "అభిషేక వైశిష్ట్యంపై అనుగ్రహభాషణ చేశారు. చాలామంది భక్తులు ఈ ప్రవచనంలో పాల్గొన్నారు. ఆలయ ప్రధాన అర్చకులు శ్రీమాన్ కె. వెంకటాచార్యులు ఆలయ కమిటి సభ్యులను శ్రీ అహోబిల జీయరుస్వామివారు ప్రోత్సహించారు. అనంతరం శ్రీమాన్ డాక్టర్ శ్రీరాంగృహంలో పాదుకాపూజ నిర్వహించి అక్కడి ప్రజ్ఞ నిర్వాహకులు శ్రీమాన్ బెల్లంకొండ శ్రీనివాస రాఘవన్ గృహంలో ప్రజ్ఞ చిన్నారులు వారి తల్లిదండ్రులకు నైతిక విలువలు వాటి ఆవశ్యకతపై ఉపన్యసించి రాత్రికి శ్రీమాన్ డా॥ కిషోర్-మంజల దంపతుల ఆహ్వానంపై (క్లీవ్‌లాండ్)లోని వారి గృహంలో బసచేశారు. క్లీవ్‌లాండ్‌లో మన జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో "రౌండ్‌హిల్"లో నూతనంగా నిర్మాణమవుతున్న ఆలయాన్ని దర్శించారు. 8 సంవత్సరాల నుండి ఆలయం నిర్మించాలనే కోరికతో ఆరంభిస్తున్న పనులు జరుగకపోవటంతో గత సంవత్సరం శ్రీ చిన్న జీయరు స్వామివారిని ఆహ్వానించామని వారు వచ్చి మంగళాశాసనము చేశాక కోర్టుకేసులు అన్ని ఆటంకాలు తొలగి పనివేగవంతమైనదని శ్రీవారిని ప్రతిష్ఠకు ప్రార్థిస్తున్నామని ధర్మకర్తలు శ్రీ అహోబిల స్వామివారికి విన్నపం చేశారు.

సాయంత్రం శ్రీమాన్ కిషోర్‌గారి గృహంలో "శ్రీకృష్ణ లీలలు" ప్రవచనాన్ని అందించారు. 11వ తేదీ రాత్రి "సిన్సినాటి" శ్రీమాన్ కేదార్ రాధిక దంపతుల గృహంలో బసచేశారు.

12వ తేదీ ఉదయం లక్ష్మీనారాయణ ఇష్టి జరిగింది. సాయంత్రం ప్రజ్ఞ చిన్నారులకు ప్రశంసాపత్రాలను అందించారు. అనంతరం ప్రవచనగోష్ఠి జరిగింది. 13వ తేదీ "లూయీస్‌విల్" శ్రీమాన్ రజని, రాజీవ్, ముదుంబై దంపతుల గృహానికి చేరి, సాయంత్రం డా॥ పద్మాసిని గృహంలో సుందరకాండ ప్రవచనం జరిపారు. మరునాడు లక్ష్మీనారాయణ పూజ వీరి గృహాల్లోనే జరిపి సాయంత్రం శ్రీమతి ఆండాళ్... దంపతుల గృహంలో ఉదయం సీతారామ కళ్యాణం సాయంత్రం వారి గృహంలో రెండు రోజులనుండి జరిగే సుందరకాండ ప్రవచనాన్ని సంపూర్ణం చేసారు.

16వ తేది ఉదయం గోష్ఠి పూర్తి చేసుకొని ఇండియానాపోలీస్ లో సాయంత్రం ఇండాయానా తెలుగు అసోసియేషన్‌వారి కోరికపై భగవద్గీతపై ఉపన్యసించి టెర్రాహట్ అధ్యక్షులు శ్రీమాన్... తదితర సభ్యులకు మంగళాశాసనం చేశారు రాత్రి టెర్రాహట్ శ్రీమాన్ వేదాల రంగనాథ్ కృష్ణ దంపతుల గృహానికి విచ్చేశారు.

17వ తేదీ ఉదయం ఆరాధన గావించి సాయంత్రం డెట్రాయిట్ లోని శ్రీమాన్ మాధవి-సుధాకర్ దంపతుల గృహంలో బస చేశారు. స్థానిక ఎస్.వి. టెంపుల్‌లో 18వ తేదీ నుండి 21వ తేదీ వరకు సా॥ శ్రీ వేంకటాచల మాహాత్మ్యాన్ని ప్రవచనం అందించారు.

22వ తేదీ ఉ॥ ఎస్.వి. టెంపుల్‌లో సామూహిక లక్ష్మీనారాయణ పూజ నిర్వహించారు.

23వ తేదీ ఆదివారం మహా సౌరపారాయణ పూర్వక సూర్య నమస్కారములు వైభవముగా జరిగాయి. 24వ తేదీ సాయంత్రం చికాగో చేరుకున్నారు.

#  పరమపదవార్తలు 

## శ్రీమాన్ రంగినేని రఘుపతిరావుగారు



శ్రీరామానుజ సిద్ధాంత, సంప్రదాయాలతో మన జెట్ సంస్థతో అత్యంత సంబంధం కలిగిన శ్రీమతి వనజాభాస్కరరావుగారి తండ్రి శ్రీమాన్ శ్రీరంగినేని రఘుపతిరావుగారు **13.9.2012** త్రయోదశి గురువారం నాడు ఆచార్య శ్రీచరణ సన్నిధిని అలంకరించారు. మహబూబ్‌నగర్ జిల్లా, జూపల్లి గ్రామవాస్తవ్యులు వీరు.

04-02-1918వ సం॥లో వీరు జన్మించారు. వీరి ఆచార్యులు శ్రీమాన్ ఆసూరి మరింగంటి నరసింహాచార్యులుగారు. మన శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్ స్వామివారిని సేవించి వారిసేవలో ఆచార్యనిష్ఠతో జీవనయానం సాగించారు వీరు. శ్రీ విష్ణు సహస్రనామాన్ని ఊపిరిగా భావించారు. ఎన్నెన్నో ఆధ్యాత్మిక గ్రంథాలను తాము చదివి, ఆ ఆనందాన్ని అందరికీ పంచాలని రుచికలిగిన వారందరికీ గ్రంథ వితరణ చేసిన వీరు ధన్యజీవులు. వీరి స్ఫురత్ రూపం అందరినీ విశేషంగా ఆకట్టుకొనేది. రూపాన్ని మించిన హృదయసౌందర్యం. ఉత్సాహం చూపరులను తలలూపించేది. వీరి ధర్మపత్ని శ్రీమతి సౌందర్యాదేవిగారు, కైంకర్యపరులయిన ఇద్దరు కుమారులు, ఐదుగురు కుమార్తెలు వీరి అడుగుజాడలలో నడుస్తూ జెట్ సేవలో తరిస్తున్నారు. సంప్రదాయ నిష్ఠ కలిగిన ఈ కుటుంబం ఎందరికో మార్గదర్శకమైంది అనడం అతిశయోక్తి కాదు. వీరు సేకరించిన అన్నమయ్య సంకీర్తనల సంపుటాన్ని శ్రీస్వామివారి గ్రంథాలయానికి సమర్పించారు. రోజులో ఎక్కువ భాగం మౌనవ్రతాన్ని పాటిస్తూ నిరంతరం హరిచరణానుచింతనతో గడిపే వీరి దినచర్య ఎందరికో మార్గదర్శకం. శ్రీమతి వనజాభాస్కరరావుగారు మన జెట్ సంస్థకి, మన స్వామివారికి చేసే కైంకర్యాలు నిరుపమానాలు. జైళ్ళలో ఖైదీలను కూడా సంస్కరించడం కోసం వీరు చేపట్టిన వికాసతరంగిణి సేవా కార్యక్రమాలు అభినందనీయాలు. శ్రీమాన్ రఘుపతిరావుగారి వియోగం ఈ కుటుంబానికి తీరనిలోటు. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు ఆ కుటుంబసభ్యులందరికి ధైర్యస్థైర్యాలను ప్రసాదించాయి.



విజయవాడ వాస్తవ్యులు **శ్రీమాన్ తుమ్మల బాబూరావు** ది.**28.07.2012**న పరమపదాన్ని అలంకరించినారు. వీరు శ్రీస్వామివారి శిష్యులు. శ్రీస్వామివారు నిర్వహించే అనేక కార్యక్రమాలలో తమ వంతు కైంకర్యమును అందించేవారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీవారు మంగళాశాసనాలు కటాక్షించారు.



ఇడుపులపాడు వాస్తవ్యులు **శ్రీమాన్ మద్దాల శ్రీమన్నారాయణగారు** ది.**23.08.2011**న పరమ పదాన్ని అలంకరించినారు. వీరికి ది.28.05.2012న శ్రీస్వామివారి ఆధ్వర్యంలో పరమపదోత్సవము జరిగిన సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యమును సమర్పించినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీవారు మంగళాశాసనాలు కటాక్షించారు.



పశ్చిమగోదావరి జిల్లా, తిమ్మిరెడ్డిపల్లి వాస్తవ్యులు **శ్రీమతి గంగవల్లి జయప్రదాదేవిగారు** ది.**22.07.2012**న పరమపదాన్ని అలంకరించి నారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీవారు మంగళాశాసనాలు కటాక్షించారు.



మెదక్ జిల్లా, రాఘవపూర్ వాస్తవ్యులు **శ్రీమతి పొనుగోటి లలితగారు** ది.**21.08.2012**న పరమ పదాన్ని అలంకరించి నారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీవారు మంగళాశాసనాలు కటాక్షించారు.



విజయనగరం జిల్లా, పెదతాడినాడ వాస్తవ్యులు **శ్రీమతి పి. అమ్మణ్ణమ్మగారు** ది.**28.08.2012**న పరమపదాన్ని అలంకరించినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీవారు మంగళాశాసనాలు కటాక్షించారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన **సెప్టెంబరు నెల సమాధానాలందాయి.** విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. అష్టాక్షరీ మంత్రోపదేశం ఎక్కడ జరిగింది? | |
| 2. బ్రహ్మగారి కుమారుడెవరు ? | |
| 3. భార్గవుని తపోభంగమునకు కారకులెవరు ? | |
| 4. దేవతాకాలమేది ? | |
| 5. భౌతిక జగత్తులో జీవుని పేరేమి ? | |
| 6. దేహ సంపద ఎందుకు ? | |
| 7. తిరుక్కచ్చినంబి తండ్రి ఎవరు ? | |
| 8. లక్ష్మణముని ఎవరు ? | |
| 9. ఎబ్రోమ అగస్ట ఎక్కడ పెరుగును ? | |
| 10. శ్రాద్ధ దేవుడెవరు ? | |
| 11. వేద విభాగము చేసినవారెవరు ? | |
| 12. భూమిని వాసయోగ్యంగా చేసినదెవరు ? | |
| 13. విష్ణుచిత్తుల వాదానికి మధ్యవర్తి ఎవరు ? | |
| 14. ప్రహ్లాదుని తల్లిని ఎవరు అపహరించారు ? | |
| 15. కాద్రవేయులంటే ఎవరు ? | |
| 16. సుషేణుదెవరు ? | |
| 17. చంద్రుని మందలించిన వారెవరు ? | |
| 18. శ్రీరంగంలోని పుష్కరిణి పేరేమి ? | |
| 19. దుర్యోధనుడు ఎవరి అంశతో పుట్టాడు? | |
| 20. ఇంద్రజిత్తు పేరేమి? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు.**

శ్రీమతి జె. విజయలక్ష్మి-హైదరాబాద్, శ్రీమతి మున్నలూరి భ్రమరాంబ-గుడివాడ; శ్రీమాన్ వై.ఎన్.బి. గుప్తా-అమలాపురం.

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తోంది. బహుమతులను కూడ పంపిస్తుంది.**

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

**భక్తినివేదన** సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః






65 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...
ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన


శ్రీ నందన నామ సంవత్సరం
ఆశ్వయుజమాసము

సంపుటి 65 నవంబర్
సంచిక 8 2012

వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు
**శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు**


## పంచాంగ వివరాలు

నవంబర్ :

2. త్రిద్యుస్పృక్
6. విశాఖ కార్తె
10. సర్వేషామేకాదశి
12. అవమతిథి, మాసశివరాత్రి
13. నరకచతుర్దశిస్నానం- ఉ॥పూర్వము 4గం॥నుండి దీపావళి, ధనలక్ష్మీపూజ, పిండపితృయజ్ఞము అమావాస్య, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి తిరునక్షత్రము.
15. ధన్వంతరి ద్వితీయ
16. వృశ్చిక సంక్రమణము సా॥ 4-21
17. నాగచతుర్థి, వల్మీకపూజ
19. అనూరాధ కార్తె
20. తిథిద్వయం, యాజ్ఞవల్క్య జయంతి
24. సర్వేషామేకాదశి
25. చిలుకు ద్వాదశి, క్షీరాబ్ధిపూజ, తులసీవివాహం చాతుర్మాస్య వ్రతసమాప్తి
26. వైకుంఠ చతుర్దశి
28. కార్తీపూర్ణిమ, ధాత్రీ నారాయణ పూజ, ఆమలకస్నానం, తిరుమంగైయాళ్వార్ తిరు॥ వైష్ణవదేవాలయములందు ప్రబంధ నిగమనం, నంబిళ్ళై తిరు॥
29. తిరుప్పాణియాళ్వార్ తిరు॥ వైష్ణవ గృహములందు ప్రబంధ నిగమనం.
2. జ్యేష్ఠకార్తె

## విషయ సూచిక




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.
*Editor* : Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Madhyaveedhi, Simhachalam, Visakhapatnam- Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-





మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,
ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం



E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

## ప్ర.స్కం. 9వ అధ్యాయం శ్రీ భీష్మాచార్యకృతస్తుతి

**ఇతి మతిరుపకల్పితా వితృష్ణా**
**భగవతి సాత్వతపుంగవే విభూమ్ని ।**
**స్వసుఖముపగతే క్వచిద్విహర్తుం**
**ప్రకృతిముపేయుషి యద్భవప్రవాహః ॥**

భీష్ముడు, స్వామి తన కట్టెదుట పరమానందస్వరూపుడై విగ్రహాన్ని ధరించి నిలుచుండగానే, ఇలా స్తుతించడం ప్రారంభించాడు. స్వామీ! నిరతిశయానంద పరాకాష్ఠయైన నీవు, ఈ ప్రాకృతభూమిపై ఎప్పుడో ఒకప్పుడు స్వసంకల్పం చేత నీదివ్యప్రకృతిని విడువకుండా, లీలగా విహరించడానికై అవతరించావు కదా? ఈ ప్రాకృతిక సాంసారిక ప్రకృతిప్రవాహం నీ వల్లనే కదా ప్రవర్తించేది. "నీ వల్లనే ఈ ప్రపంచం సృష్టిస్థితిలయాది పరంపరను అవిశ్రాంతంగా పొందుతున్నది. ఇలానీవు యాదవవంశంలో శ్రీకృష్ణమూర్తిగా ఆవిర్భవించినా, నీ వైభవం నిరతిశయం. నీ స్వరూపమైన ఆనందపరాకాష్ఠకు లేశమంతైనా లోటులేదు. అట్టినీయందు నాకు తనివితీరని (అవితృష్ణా) భావంతో నామనస్సు కుదురుకున్నది." అంటున్నాడు భీష్ముడు. స్వామి, నిరతిశయానందస్వరూపుడు. దీన్ని నిరూపించేది భూమవిద్య. ఏ ఆనందాన్ని అనుభవిస్తే ఇంక అనుభవింపవలసిన ఆనందం అంటూ ఏదీ మిగలదో అట్టి నిరతిశయానందాన్నే ఉపనిషత్తు **"భూమ"** అని అంటుంది. **యత్ర నాన్యత్ పశ్యతి, నాన్యచ్ఛృణోతినాన్యద్విజానాతి. సభూమా, అథ యత్రాన్యత్ పశ్యతి, అన్యచ్ఛృణోతి,అన్యద్విజానాతి తదల్పమ్"** (ఛాం. 7-14-1) అని ఉపనిషత్తు, పరమాత్మ కంటే వేరైనవాటి అనుభవం అత్యల్పమని, కనుకనే వాటిని అనుభవించినా తనివితీరక వేరువేరువాటికోసం మనస్సు పరుగులెత్తుతుందని, ఇక, సర్వేతరవిలక్షణమైన పరమాత్మ తత్త్వాన్ని సాక్షాత్కరించి అనుభవించినప్పుడు ఆనందరూపమైన పరమాత్మానుభవం అవధులులేనిది, సర్వాతిశాయి. దీన్ని అనుభవించినవాడు ఇకమరిదేన్నీ చూడడు. వినడు. తెలిసికొనడని ఉద్ఘోషించి, ఇలాంటి నిరతిశయానంద బ్రహ్మస్వరూపాన్నే **'భూమ'** అని అంటారని, దీన్ని గురించే జిజ్ఞాస చేయాలని ఉపదేశిస్తుంది.

ఇలాంటి నిరతిశయానంద భూమస్వరూపాన్ని దర్శించి అనుభవించినవానికి కలిగే వైభవం కూడా నిరతిశయమే నంటుంది ఉపనిషత్తు. **'సవా ఏష' ఏవం పశ్యన్, ఏవం మన్వానః, ఏవం విజానన్ ఆత్మరతిః ఆత్మక్రీడః ఆత్మమిథునః ఆత్మానందః। స స్వరాడ్ భవతి. తస్య సర్వేషు లోకేషు కామచారః భవతి ॥** "ఎవ్వడిలాంటి నిరతిశయానంద బ్రహ్మస్వరూపాన్ని సాక్షాత్కరించి అనుభవిస్తాడో అలాంటి ముక్తపురుషుడు, పరమాత్మయందే పరమప్రీతిగొని, పరమాత్మానందానుభవంలోనే క్రీడిస్తూ, పరమాత్మతోనే కలసి ఉంటూ, పరానందనిమగ్నుడౌతాడని, ఈ దశలో ఆతడు **'స్వరాట్'** అంటే కర్మలకు వశపడనివాడు సర్వలోకాల్లో అప్రతిహతంగా సంచరించేవాడు అవుతాడని ఉపనిషత్తు ఆవిష్కరిస్తున్నది. భీష్ముడు తనఎదుట ఉన్న శ్రీకృష్ణస్వామిని, భూమవిద్యలో చెప్పబడిన పారమాత్మికానుభవం పొందినముక్త పురుషానుభవాన్నే పరామృశిస్తూ సాక్షాత్కరిస్తున్నాడని శ్రీభాగవతం ఈ శ్లోకంలో ఉద్ఘోషిస్తున్నది.

**త్రిభువనకమనం తమాలవర్ణం**
**రవికర గౌర వరాంబరం దధానే ।**
**వపు రలకకు లావృతాననాబ్జే**
**విజయసఖే రతిరస్తుమేఽనవద్యా ॥**

స్వామీ! అర్జునమిత్రుడవైన నీ పట్ల నా ప్రీతి నిర్మలమై ఉండుగాక! స్వామీ! నీవు ముల్లోకాలకు కమనీయమైన (పరమస్పృహణీయమైన) స్వరూపం కలవాడవు. తాపించపు ఛాయతో ఒప్పుతున్నావు. సూర్యకిరణాలవలె పచ్చగా బంగారపు

రంగులో ప్రకాశిస్తున్న పీతాంబరాన్ని ధరించిన దేహంతో పరమ రమణీయంగా ఉన్నావు. మెల్లగా కదులుతున్న నల్లనిముంగురులతో నీవదనం వికసితకమలంలా విరాజిల్లుతున్నది. ఇలాంటి నీ దివ్యమంగళ విగ్రహంపై నాబుద్ధి కుదురుకొనుగాక అని ప్రార్థిస్తున్నాడు భీష్ముడు.

ఇంకా ఎలా ఉంది స్వామి యొక్క స్వరూపం? స్వామి, పార్థసారథియై రథాన్ని యుద్ధరంగంలో తోలుతున్నాడు. నలువైపుల చతురంగబలాల పాదఘట్టనాలచే రేగినధూళి, స్వామి చక్కని కేశపాశంపై నలువైపులా పడింది. ఇలా చెదరిపడిన ధూమ్రరజోరూషితాలైన అలకలతో అందగించిన స్వామిముఖంపై పొటమరించిన చెమట, విలక్షణ రామణీయకతను సంతరించింది. భీష్ముడు ప్రయోగించిన నిశితబాణాలచే కవచం భిన్నమై స్వామిసుందరత్వక్ చీరికలై, ఒక మహాయోద్ధకు ఉండవలసిన పరమస్పృహణీయాలంకారంగా అలరారుతూ ఉంటే, అట్టి స్వామి యోద్ధృరూపంలో, నామనస్సు సులగ్నంకావాలని ప్రార్థిస్తున్నాడు భీష్ముడు. స్వయంగా కురుయోద్ధ, సేనాధిపతి అయిన భీష్ముడు తప్ప కృష్ణస్వామిలోని ఈ స్వరూపవైభవాన్ని మరెవ్వరు భావించగలరు? ఈ క్రిందిశ్లోకం పై భావనకు సుందరాక్షరరూపం.

**యుధి తురగరజో విధూమ్రవిష్వక్**
**కచలులిత శ్రమవా ర్యలంకృతాస్యే ।**
**మమ నిశితశరై ర్విభిద్యమాన**
**త్వచి, విలసత్ కవచేఽస్తు కృష్ణ ఆత్మా ॥**

సాక్షాత్తు పరాత్పరుడైన స్వామి ఇలా సారథియై, ఒకసామాన్య రథచోదకుని స్వభావాన్ని అనుకరిస్తూ ధూళిధూసరితాలకుడై చూపరుల హృదయాలను హరిస్తున్నాడు. అంతేకాదు. స్వాశ్రితార్జునరక్షణం కోసంతాను స్వయంగా, భీష్మ బాణాభిఘాతాలకు నెలవై తనశరీరం గాయాలచే పీడితమైనా తనధర్మవీరతను చాటుతున్నాడు. భక్తవాత్సల్యం ఉద్వేలమని కూడా ఈ సన్నివేశం ఆవిష్కరిస్తున్నది. పరమభక్తుడైన భీష్ముడు ఈ సన్నివేశాన్ని చూచి, ఆ సుందరరూపం పట్ల గాఢంగా తనమనస్సు లగ్నంచేస్తున్నాడు.

**సపది సఖివచో నిశమ్య మధ్యే**
**నిజపరయో ర్బలయోరథం ప్రవేశ్య ।**
**స్థితవతి పరసైనికాయురక్ష్ణా**
**హృతవతి పార్థసఖే రతి ర్మమాస్తు ॥**

స్వామి, తను ప్రబోధనం చేస్తున్న అర్జునరథాన్ని ఉభయ సేనామధ్యంలో ఉంచాడు. ఇలా ఉంచమని కోరినవాడు అర్జునుడు.

**సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేచ్యుత! ।**
**యావదేతాన్ నిరీక్షేహం యోద్ధుకామా నవస్థితాన్ ॥**

హే అచ్యుతా ! రెండుసేనల నడుమ నా రథాన్ని నిలుపు. ఎవ్వరు యుద్ధోద్యుక్తులై నిలబడి ఉన్నారో చూస్తాను.

**కైర్మయా సహయోద్ధవ్యమ్ అస్మిన్ రణసముద్యమే ।**
**యోత్స్యమానా నవేక్షేహం య ఏతేఽత్ర సమాగతాః ॥**
**ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియచికీర్షవః ॥**

ఈ మహారణోద్యమంలో నేనెవ్వరితో యుద్ధంచేయాలో, ఎవ్వరు దుర్బుద్ధియైన దుర్యోధనుని పక్షాన యుద్ధంచేసి ఆతనికి ప్రీతిని కల్గింపసమకట్టి యుద్ధంచేస్తున్నారో వారినందరినీ చూస్తాను అన్నాడు అర్జునుడు. ఈ సన్నివేశాన్ని గమనిస్తున్నాడు ధార్తరాష్ట్ర సేనాధిపతియైన భీష్మాచార్యుడు. స్వామి ఇలా రథాన్ని సేనామధ్యంలో ఉంచి పరసేనలను తనకంటితో వీక్షించినాడట. ఇలా తనదృష్టిని ప్రసరింపచేసినంత మాత్రంచేతనే, ఆ సైన్యంలోని యోద్ధల ఆయువు హరింపబడిందట. అట్టిస్వామిపై తనమనస్సు ప్రీతిగొనియుండాలని ప్రార్థిస్తున్నాడు.

*(సశేషం)*

శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః



జై శ్రీమన్నారాయణ!





శ్రీమత్పరమహంస పరివ్రాజకులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి

# తిరునక్షత్ర మహోత్సవము

## జీయర్ పురస్కార ప్రదానము

వేదిక : శ్రద్ధానంద్ గంజ్, వ్యవసాయ మార్కెట్ యార్డ్, నిజామాబాద్

**తేది 13.11.2012 న ఉ॥ 9గం॥నుండి**

మరియు

**తేది 17.11.2012న**

శ్రీ స్వామివారి ఆరాధ్యదైవమైన

శ్రీసీతారామచంద్ర స్వామికి

## సహస్రకలశ స్నపనము

వివరములకు:

జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, సీతానగరం,
గుంటూరు జిల్లా. 522 501. ఫోన్ : 08645 272929

జీవా, శ్రీరాంనగర్, పాలమాకుల పోస్ట్,
శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఫోన్: 95535 49971/72

భగవద్బంధువులకు శుభాహ్వానము

శ్రద్ధానంద్ గంజ్, వ్యవసాయ మార్కెట్ యార్డ్, నిజామాబాద్.
ఫోన్: 98480 71967

# కలివైరిసూరి వైభవము



*గత సంచిక తరువాయి...*

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-8-7 (బృహత్సూక్తి)**

**7. పారునీరెరి కాత్తినోడు ఆకాశము ఇవైయాయినాన్**
**పేరుమాయిరమ్ పేశనిన్న పిఱప్పిలి పెరుకుమిడమ్ ।**
**కారుమ్‌వార్‌పని నీళ్ విశుంబిడై చ్చోరుమాముకిల్ తోయ్‌తర**
**చ్చేరువార్ పొழிల్ శూழ் ఎழிల్ తిరువేంగడమడై నెంజమే॥**

**ప్రతిపదార్థము:** **నెంజమే!**=ఓ మనసా! **పారుమ్**= భూమియును; **నీర్**=నీరును; **ఎరి**=అగ్నియును; **కాత్తినోడు**= వాయువుతో కూడ; **ఆకాశముమ్**=ఆకాశమును; **ఇవై**=ఇవి; **ఆయినాన్**=అయినవాడు; **ఆయిరమ్‌పేరుమ్**=సహస్రనామములను; **పేశ**=అనుసంధించుటకు (అనుసంధానము చేసేవారు ఆశ్రయించుటకు వీలుగ) **నిన్న**= వేంచేసియున్న; **పిఱప్పుఇలి**= జన్మలు లేనివాడగు సర్వేశ్వరుడు; **పెరుకుం**=వృద్ధిపొందుచున్న; **ఇడమ్**=ప్రదేశమైనటువంటి; **కారుం**= నీలిరంగు కలవియు; **వార్**=విస్తారమైన; **పని**=మంచును; **నీళ్ విశుంబిడై**=సువిశాలమైన ఆకాశమందు; **శోరుం**=వర్షించుచున్న; **మాముకిల్**=గొప్ప మేఘములు; **తోయ్‌తర**=స్పృశించునట్లు; **శేరుం**=సమీపించుచున్న; **వార్**=దీర్ఘములైన; **పొழிల్**=తోటలతో; **శూழ்**=చుట్టబడియున్న; **ఎழிల్**=సుందరమైన; **తిరువేంగడమ్**= తిరుమల దివ్యదేశమును; **అడై**=ఆశ్రయింపుమా!

**తాత్పర్యము:** పంచభూతాత్మకుడును సహస్రనామము లచే ప్రతిపాదింపబడు వైభవము కలవాడును, కర్మానుగుణము లగు జన్మములు లేనివాడునగు సర్వేశ్వరుడు వేంచేసియున్న శ్రీ వేంకట గిరిని మనసా! ఆశ్రయింపుము. ఆ పర్వతము శోభాయమానముగ నుండును. సుదీర్ఘములైన తోటలతో పరివేష్టితమై, రమణీయమైన శ్రీ వేంకటాద్రిని ఆశ్రయింపుమా మనసా!

**విశేషార్థము:** ఆరవ పాశురమున హిరణ్యాసురుని నిరసించుటకై ఆవిర్భవించిన నరసింహావతారమును ప్రస్తావించి ఉన్నారు. భగవన్నామోచ్చారణమును సహించలేని హిరణ్యకశిపుని సంహరించిన ఆ స్వామి వేంచేసియున్న స్థలము తిరుమల దివ్యదేశముగనుక ఈ క్షేత్రమున భక్తులు భగవన్నామ సంకీర్తనమును చేయవచ్చునను విషయమును ఆ దివ్యమూర్తిలోని జగదాకారత్వమును తిరుమంగై ఆళ్వార్లు ఈ పాశురమున తెలుపుచున్నారు.

**పిఱప్పిలి పెరుకుమిడమ్:** నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొழி దివ్యప్రబంధమునందు **"పిఱందవారుం"** 5.10.1 పాశురమున భగవంతుడు శ్రీకృష్ణుడుగా జన్మించినాడని ఆయనకు జన్మలు గలవని అనుగ్రహించియున్నారు. శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో **"బహూని మే వ్యతీతాని జన్మాని"** నాకు అనేక జన్మలు గడచినవని కూడ తెలిపియున్నాడు. పైన తెలిపిన ప్రమాణములు భగవంతునకు జన్మలు గలవని తెలుపుచుండగ తిరుమంగై ఆళ్వార్లు ఈ పాశురమున భగవంతుడు "పిఱప్పిలి" జన్మ రహితుడని తెలుపుట సమంజసమేనా అను సందేహము మనకు కలుగకమానదు. దీనికి సమాధానమును ఇట్లు తెలిసికొనవలెను. జన్మరహితుడనగ కర్మమూలముగ పంచభూతాత్మకములైన శరీరములను పరిగ్రహించని వాడని గ్రహించవలెను. భగవంతుడు కర్మవశ్యుడు కాడు. **"నమాం కర్మాణి లింపన్తి"** తనను కర్మలంటవని భగవద్గీతలో స్పష్టముగా తెలిపియే యున్నాడు. కనుకనే పంచభూతాత్మకమగు ఈ జగత్తునకు భిన్నముగ, ఈ జగములోని ప్రాణులకు భిన్నముగ అపూర్వమగు దివ్యమంగళ విగ్రహముతో తాను ఆవిర్భవించు చుండును. ఈ పాశురమున తెలుపబడిన పంచమహాభూతములు భగవంతునిలోని జగదాకారత్వమును తెలుపుచున్నవి. ఈ జగము పంచభూతాత్మకమైనది కదా!

**కారిత్యాది:** తిరుమల దివ్యక్షేత్రమును వర్ణించుచున్నారు. తిరుమల క్షేత్రము అధికమగు మంచుతోను మేఘములతోను, ఆ మేఘములను స్పృశించు ఎత్తైన తోపులతోను ప్రకాశించుచుండును. సాంద్రమగు వృక్షములతో ఈ క్షేత్రము పరివేష్టితమై అలరారు చుండును. ఓ మనసా! అటువంటి వేంకటగిరిని ఆశ్రయింపుమా!



# అహో! భారతమ్

(గత సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

పాండురాజు పరుగుపెట్టుకుంటూ వచ్చి బాలభీముని ఎత్తుకొన్నాడు. పిల్లవానికేం కాలేదు సరిగదా రాళ్ళు పొడిపొడి అయిపోయాయి. ఆహా ఏమి బలం అనుకొంటూ అక్కున చేర్చుకున్నాడు. ముల్లోకాలనూ జయించే కొడుకు ఇంకొక్కడుంటే.. అందుకే ఇంద్రుని ధ్యానిస్తూ తపస్సు చేశాడు పాండురాజు.

ప్రత్యక్షమయ్యాడు ఇంద్రుడు. శత్రుభయంకరుడయిన కుమారుడు కలుగుతాడని వరంకూడా ఇచ్చాడు. వెంటనే ఇంద్రుని ప్రార్థించాలని కుంతీదేవిని కోరాడు పాండురాజు. ఆమె మంత్రంతో ఇంద్రుని ఆహ్వానించింది. ఆయన అనుగ్రహంతో ఫాల్గుణమాసంలో పూర్వఫల్గునీ, ఉత్తరఫల్గునీ నక్షత్రాల సంధికాలంలో పగలు అర్జునుడు పుట్టాడు. ఉత్తరఫల్గునీ ప్రథమ పాదంగా ఆంధ్రమహాభారతం చెప్పింది. ఏదైనా ఫల్గునీ నక్షత్రసంబంధంతో ఫల్గునుడయ్యాడతడు. పుట్టిన వెంటనే ఆకాశవాణి అతడు మహావీరుడౌతాడని పలికింది. పూలవాన కురిసింది. అర్జునుడు పుట్టిన వేళ శతశృంగ పర్వతం సకల దేవతాకోటితో వారి ఆశీర్వచనములతో కళకళలాడింది.

పాండురాజు రెండవభార్య మాద్రి ఇదంతా చూస్తోంది. అక్క కుంతి తల్లి అయింది. అక్కడ గాంధారికీ వందమంది పిల్లలు పుట్టారట. మరి నామాటేమిటి? సంతానం లేని దానిగా నిస్సారమైన బ్రతుకు గడపడమేనా? దుఃఖం కట్టలు తెంచుకొంటోంది. అప్పుడే వచ్చాడు పాండురాజు. ఆమె మనస్సు గ్రహించాడు. స్వామీ.. అక్కతో చెప్పి... అంటూ ఆగింది. కుంతికి చెప్తానులే అంటూ పిలిచాడు. అతని ఆజ్ఞని పాటించింది కుంతి. మాద్రి అశ్వినీదేవతలని ఆరాధించి కుంతి మంత్రోపదేశం చేస్తే... ఆ మంత్రఫలంగా అశ్వినీదేవతల అనుగ్రహంతో ఇద్దరు కొడుకులను కన్నది. వారే నకుల సహదేవులు. ఇలా పాండురాజు ఐదుగురు పుత్రులను పొంది ఆ పాండవులను చూస్తూ మురిసిపోయాడు.

ఈ విషయం వసుదేవునికి తెలిసింది. వెంటనే పిల్లలకి వస్త్రాలు, ఆభరణాలు, దాసదాసీజనాలు, గోవులు, వెండి బంగారాలు అన్నీ ఇచ్చి కాశ్యపుడు అనే పురోహితుని వారి దగ్గరకి పంపించాడు. ఆయన పిల్లలకి చౌలం, ఉపనయనాల వరకు అన్నీ చక్కగా జరిపించాడు. శర్యాతివంశంలోని పృషత్కునికి కొడుకైన శుకుడు పాండవులకు ధనుర్విద్య నేర్పించాడు.

ఒక్కొక్క ఏడాది వయస్సు తేడా కలిగిన ఆ పాండవులు చక్కగా విద్యలనభ్యసించారు. కాలం ఆనందంగా కదులుతూ వసంతంలో అడుగు పెట్టింది. పాండురాజు వసంతఋతు సౌందర్యానికి పరవశుడై కిందముని శాపాన్ని మరిచిపోయాడు. విధిని ఎవ్వరడ్డగించగలరు? పాపం మాద్రి తన వలన మరణించిన పాండురాజు శరీరాన్ని చూచి గొల్లుమంది. విషయం తెలిసి కుంతి పిల్లలతో సహా వచ్చి భర్తను చూచి మూర్ఛపోయింది.

నెమ్మదిగా తేరుకొని 'అమ్మా – మాద్రి! లే! ఆయన దగ్గర నాకింత చోటియ్యి. పిల్లల్ని జాగ్రత్తగా పెంచు' అంటూ సహగమనానికి సంసిద్ధురాలయింది. కాని, మాద్రి ఒప్పుకోలేదు. 'అక్కా! ఆయన మరణానికి కారణం నేనే కదా! అందువల్ల నేనే ఆయనతో పరలోకానికి వెళతాను. నువ్వే పిల్లల్ని బాగా చూడగలవు. అందుచేత పిల్లల్ని జాగ్రత్తగా చూసుకో' అంటూ భర్తతోపాటు చితిలో చేరి శరీరాన్ని విడిచిపెట్టేసింది. అది చూసి ఋషులంతా కుంతిని, పాండవులను హస్తినాపురంలో కురువంశంలోని పెద్దలకు అప్పగించాలనుకొన్నారు. తీసుకొని వెడుతూ ఉంటే, ప్రజలు పాండుకుమారుల్ని చూచి ఆ రూపసౌందర్యానికి ఆశ్చర్యపోయారు. విదురుడు పాండురాజుకి ఉత్తరక్రియలు జరిపించాడు. వ్యాసుని ఉపదేశంతో సత్యవతి కోడళ్ళతో కొంతకాలం అడవికి వెళ్ళి తపస్సు చేస్తూ కాలం గడిపింది. కొంతకాలానికి వారు స్వర్గస్థులయ్యారు.

పాండుకుమారులను, తన పుత్రులను ధృతరాష్ట్రుడు ఎంతో ప్రేమతో పెంచాడు. కుమారులంతా బాల్యక్రీడలలో మునిగి తేలారు. భీముడు తన బలాన్నంతా కౌరవులపై చూపిస్తూ ఏడ్పిస్తూ ఉండేవాడు. జలక్రీడలలో అయితే పదేసిమందిని భుజంపై ఎక్కించుకొని నీళ్ళలో ముంచుతూ, పైకి తీస్తూ ఉక్కిరిబిక్కిరి చేస్తూ ఎలాగో గట్టుపై పడేసేవాడు. పళ్ళుకోద్దామని అందరూ చెట్టెక్కిన తరువాత ఆ చెట్టు బలంగా అటూ ఇటూ ఊపేసి పళ్ళతోపాటు వాళ్ళనికూడా నేలమీద రాలేటట్లు చేసేవాడు.

అతణ్ణి ఎలా ఎదిరించాలో, ఆ బాధలు ఎలా తట్టుకోవాలో తెలియక కౌరవులంతా లబోదిబోమంటూండేవారు. మిగిలిన వారికంటే ఈ భీముని బలం చూస్తే దుర్యోధనునికి కడుపుమండి పోతూ ఉండేది. వీడే పాండవుల బలం. వీడినొక్కడిని లేకుండా చేస్తే... బాబోయ్ ఎలా... ఒక్కటేదారి. రహస్యంగా చంపాల్సిందే! అప్పుడే శత్రువులు లేకుండా హాయిగా నేనే రాజ్యం పాలించవచ్చు. ఇలా సాగాయి దుర్యోధనుని ఆలోచనలు. అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడు.

ఒకసారి భీముడు స్నానం చేశాక 'ప్రమాణకోటి' అనే స్థలంలో చల్లగాలికి హాయిగా నిద్రపోతూంటే... తీగలతో కట్టి గంగలోకి తోసేశాడు. కాని, భీముడు ఒక్కసారి ఒళ్ళు విరుచుకొనేటప్పటికి ఆ తీగలన్నీ తెగిపోయి హాయిగా నీళ్ళలో నుంచి బయటికి వచ్చేశాడు. ఇంకొక్కసారి నిద్రలో నాగులచే కరిపించే ప్రయత్నం చేశాడు. కాని అలా చేసే మనిషినే చంపేశాడు భీముడు. ఇంకేం చెయ్యాలో తెలియక మరొక్కసారి తినే అన్నంలో విషం కలిపించాడు. ఈ విషయం తెలిసిన యుయుత్సుడు భీముడికి చెప్పాడు కాని ఆకలివలన భీముడు ఆ విషాన్ని తినేశాడు. కాని అతనికేమీ కాలేదు. ఆశ్చర్యం. అన్నం జీర్ణమైపోయింది. దుర్యోధనుడు ఏం చెయ్యాలా అని ఆలోచనలోనే ఉన్నాడు. ఇలా ఉండిక్కడ..

శరద్వంతుడు అనే మహాత్ముడు గౌతముడనే మునికి కొడుకు. ఆయన ధనుర్విద్యనే నేర్చుకుంటానని దానిని సాధించాడు. గొప్ప తపస్సు చేస్తూండగా ఇంద్రుడు ఆ తపస్సును భగ్నం చెయ్యాలని జలపద అనే అందమైన స్త్రీని పంపించాడు. ఆవిడని చూడగానే శరద్వంతుని మనస్సు చెదిరిపోయింది. ధనుర్బాణాలతోపాటు వీర్యం కూడా జారిపడింది. శరద్వంతుడు చూచి ఆ ఆశ్రమంలో ఉండలేక వేరొక చోటికి వెళ్ళిపోయాడు. అతని వీర్యం రెండు భాగాలుగా రెల్లులో పడింది. దానినుండి ఒక కొడుకు, ఒక కూతురు పుట్టారు.

తరువాత ఒకనాడు శంతన మహారాజు వేటకి అక్కడికి వచ్చాడు. అతని సైనికులు ఆ రెల్లుగడ్డిలో ఉన్న పిల్లల్ని చూశారు. ఆ ప్రక్కనే ధనుర్బాణాలు కనిపించాయి. దాని ప్రక్కనే జింకచర్మం కనిపించింది. ఓహో వీళ్ళు ఒక ధనుర్వేద పండితుని సంతానం అయి ఉంటారు అని అనుకొని శంతన మహారాజుకి చూపించారు. వారిని చూడగానే ఆయనలో కృప పొంగిపొర్లింది. కృపతో పెంచడం చేత వాళ్ళు కృపుడు, కృపి అని ప్రసిద్ధి చెందారు. శరద్వంతుడు వచ్చి శంతనునికి వారు తన సంతానం అని తెలిపి కుమారునికి ఉపనయన సంస్కారం చేశాడు. వేదాలు చెప్పించాడు. రథ, గజ తురగ, పదాతి బలాలతో సంబంధం ఉన్న ధనుర్వేదాన్ని, అస్త్రశస్త్ర ప్రయోగాల్ని ధనుర్వేద పండితులు చూచి మెచ్చేంత గొప్పగా నేర్పించాడు. అలాంటి కృపాచార్యుని దగ్గర ఈ కౌరవ పాండవులకు ధనుర్విద్య నేర్పించాలనుకొన్నాడు భీష్మాచార్యుడు. (సశేషం)

# పురాణాలలో నృసింహ కథా వైవిధ్యం

*గత సంచిక తరువాయి*

డా॥ కండ్లకుంట్ల నరసింహమూర్తి- జనగామ

ప్రహ్లాదుని ప్రార్థనను మన్నించి స్వామి ప్రీతుడై శాంతించాడు. వరాలు అనుగ్రహిస్తాను కోరుకొమ్మన్నాడు. తనకు సంసారబంధాలపై ఆసక్తి లేదు గనుక ముక్తిని ప్రసాదించమని విష్ణుభక్తుడైన తనకు కీడు తలపెట్టిన తన తండ్రి దోషాలను మన్నించి శాశ్వత పరబ్రహ్మలోకాన్ని అనుగ్రహించమని వేడుకున్నాడు.

కొంతకాలం ఇహలోక సౌఖ్యాలు అనుభవించిన తరువాత హిరణ్యకశిపుడు తనసాయుజ్యాన్ని పొందుతాడని, కులపావను డైన ప్రహ్లాదుని కుమారునిగా పొందినందున హిరణ్య కశిపునికి 21 తరాల ముందువారు కూడ పావనులైనారని స్వామి అనుగ్రహించాడు. తండ్రి సింహాసనాన్ని అధిరోహించి, తనయందే భక్తిగలిగి ధర్మపరిపాలనచేసి అనంతరం తన సన్నిధికి చేరగలవని ఆదేశించాడు, నరసింహస్వామి.

అనంతరం ప్రహ్లాదుడు తండ్రికి ఉత్తరక్రియలు నిర్వర్తించి రాజ్యాభిషిక్తుడై ధర్మపరిపాలన చేశాడు. బ్రహ్మాది దేవతలు స్వామిని మరల స్తుతించిన పిమ్మట దుర్మార్గులైన ఇటువంటి రాక్షసులకు ఇకముందు దుర్లభాలైన వరాలు ఇవ్వవద్దని, అది పాములకు పాలుపోసినట్లే కీడు చేస్తుందని బ్రహ్మతో చెప్పి అందరూ చూస్తుండగా స్వామి అదృశ్యుడైనాడు. ప్రహ్లాదుడు అకుంఠిత విష్ణుభక్తితో సుపరిపాలన గావించి సత్సంతానాన్ని పొంది, చివరకు విష్ణు సాయుజ్యాన్ని పొందాడు.

**బ్రహ్మపురాణం** 213వ అధ్యాయంలో నృసింహావతార గాథ ఉన్నది. హిరణ్యకశిపుడు బ్రహ్మదేవుని గురించి పదకొండువేల ఐదువందల సంవత్సరాల తపస్సు చేసినట్లు చెప్పింది. తన తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమైన బ్రహ్మను హిరణ్యకశిపుడు భాగవతంలో వలెనే వరాలు కోరి, ఒక్కచేతితో మాత్రమే సైన్యసపరివారంగా తనను చంపగలవాడే తనకు మృత్యువు అయ్యేట్లు వరం అనుగ్రహించమని కోరినట్లు తెలుపబడింది.

బ్రహ్మ ఆ విధంగా అనుగ్రహించగా వరగర్వంతో వాడు విధ్వంసం సృష్టిస్తుండగా దేవతలు నారాయణుని శరణువేడారని వరగర్వంతో చెలరేగిపోతున్న దానవుని ససైన్యంగా సంహరిస్తానని విష్ణువు వారికి అభయప్రదానం గావించాడని పేర్కొనబడింది.

నారాయణుడు దేవతలను తమతమ లోకాలకు పంపి హిరణ్యకశిపుని పట్టణానికి వచ్చి అర్ధభాగం నరరూపం, అర్ధభాగం సింహరూపం కలిగిన నరసింహస్వరూపంతో విక్రమించి మహాబలవంతుడైన హిరణ్యకశిపుని పట్టి చేతిదెబ్బతో సంహరించాడని, ఈ సన్నివేశాన్ని చూచి భయంతో పారిపోయి దాగివున్న రాక్షసమూకనంతటిని ఒకే చేతివ్రేటుతో విగత ప్రాణులను గావించి అంతర్ధానమయ్యాడని వర్ణింపబడింది.

కనుక ఈ పురాణంలో ప్రహ్లాదుని ప్రస్తావనగాని, ఆయన విష్ణుభక్తిగాని హిరణ్యకశిపుని విష్ణుద్వేషంగాని ప్రస్తావించనే లేదు. కేవలం దేవతలు, ఋషుల బాధానివారణకొరకే లోకకంటకుడైన హిరణ్యకశిపుని సంహరించేందుకే నృసింహ ఆవిర్భావం జరిగినట్లు తెలుపబడింది.

**శ్రీవిష్ణుపురాణం :** ప్రథమాంశంలో 17 నుండి 20వ అధ్యాయం వరకు ప్రహ్లాద చరిత్ర వివరించబడింది. మిగిలిన పురాణాలకంటే ఈ పురాణంలో కథ భిన్నంగా ఉన్నది. భాగవతాది పురాణాలలోవలె ప్రహ్లాదుని విష్ణుభక్తి, హిరణ్యకశిపుని విష్ణుద్వేషం, తండ్రి తనయుని పెట్టిన బాధలువంటి అంశాలు విస్తారంగా వర్ణింపబడినప్పటికి – ప్రహ్లాదుని భక్తికి సంతుష్టుడై నారాయణుడు ఆయన ఎదుట ప్రత్యక్షమై వరాలు కోరుకొమ్మనడం, ఆయన తనకు నిరంతర విష్ణుభక్తిని, చివరకు ముక్తిని ప్రసాదించమని, తన తండ్రి తప్పులను మన్నించుమని వేడుకోవడం, నారాయణుడు అన్నింటినీ అనుగ్రహించడం, తరువాత పితాపుత్రులు కలిసి ఉండడం, కొంతకాలం తరువాత మహావిష్ణువు నరసింహ రూపంతో హిరణ్యకశిపుని సంహరించడం జరిగినట్లు వర్ణితమైంది.

**పద్మపురాణ ఉత్తరఖండం:** సృష్టిఖండంలో పులస్త్యుడు భీష్మునికి నృసింహ వృత్తాంతాన్ని వివరించాడు. ఈ పురాణగాథ

బ్రహ్మపురాణకథవలెనే సాగింది. దేవతలు హిరణ్యకశిపుని బాధలను తాళలేక నారాయణుని శరణువేడగా ఆయన వారి వెతలు తీర్చేందుకు నరసింహ స్వరూపంతో దానవరాజసభలో ప్రత్యక్షమైనాడని, ఆ విచిత్ర ఆకారాన్ని పట్టి వధించండని దనుజపతి తన అనుచరులను ఆజ్ఞాపించాడు.

అప్పుడు ఆ సభలో ఉన్న ఆయన కుమారుడు ప్రహ్లాదుడు లేచి ఆ ఆకారం దండనార్హం కాదని, ఆ రూపంలో తనకు విశ్వరూప సందర్శనం కలుగుతున్నదని తండ్రికి హితబోధ చేసినట్లు ఈ పురాణం వర్ణించింది. రాక్షసులతో నరసింహస్వామి చేసిన యుద్ధం విలక్షణంగా చెప్పబడింది. తరువాత నరసింహునితో హిరణ్యకశిపుడు ముఖాముఖి తలపడి ఎన్నో మాయలు, మంత్రాలు ప్రయోగించడం వాటిని స్వామి ఉపసంహరించినట్లు వర్ణించడం ఈ పురాణ కథా వైచిత్ర్యం.

**శ్రీవిష్ణు ధర్మోత్తర పురాణం :** ప్రథమఖండంలోని శంకరగీతలలో నరసింహావతార ప్రస్తావన ఉన్నది. ఇందులోని కథ కూడ దాదాపు బ్రహ్మ పురాణకథను పోలి ఉన్నది. అయితే ఇందులో నృసింహస్వరూప వర్ణన విపులంగా చేయబడింది. దేవతల ప్రార్థనపై వారికొరకే మహావిష్ణువు నరసింహ స్వరూపాన్ని ధరించి, తనను ఎదిరించేందుకు వస్తున్న రాక్షసగణాన్ని తన కరచరణాలతో అంతమొందించి, తనపై శరవర్షాన్ని కురిపిస్తున్న ఆ మహాదైత్యుని అణచిపట్టి తన తొడపై పరుండబెట్టి అరటి ఆకును చీల్చినట్లు వాని రొమ్మును చీల్చివేశాడని ఈ పురాణం వర్ణించింది. ఇందులో కూడ ప్రహ్లాదుని ప్రస్తావన లేదు.

**స్కాంద మహాపురాణం :** అవంత్యఖండంలోని 66వ అధ్యాయంలో నృసింహ తీర్థ మాహాత్మ్యవర్ణన సందర్భంలో నృసింహావతారగాథ సంక్షేపంగా ఉన్నది. హిరణ్యకశిపుని తపస్సు, బ్రహ్మ వరప్రదానం, వాని ఆగడాలు వంటి అంశాలు ఇతర పురాణాలలో వలెనే ఉన్నాయి.

మహావిష్ణువు నరసింహరూపం ధరించి వాని సభామధ్యలో అవతరించి ఒకే చేతిదెబ్బతో దనుజపతిని వధించాడని, స్వామి హిరణ్యకశిపుని వధించిన ప్రదేశం సంగమేశ్వరానికి దక్షిణాన, కర్కరాజ క్షేత్రానికి ఉత్తరాన, సిప్రానది తూర్పుతీరాన ఉన్నదని, అప్పటినుండి ఆ ప్రదేశం నృసింహ తీర్థంగా ప్రసిద్ధికెక్కిందని, అది మహామహిమాన్విత మైందని ఈ పురాణం తెలిపింది. ఈ పురాణంలో కూడ ప్రహ్లాదుని విషయం లేదు.

**శ్రీ కూర్మపురాణం:** పూర్వభాగంలోని 16వ అధ్యాయంలో నృసింహావతార గాథ ఉన్నది. హిరణ్యకశిపుడు తపస్సుచేత బ్రహ్మదేవుని మెప్పించి అనేక దివ్య వరాలను పొంది లోక కంటకుడుగా తయారుకాగా, దేవతలు, ఋషులు, బ్రహ్మదేవుని ఆశ్రయించగా, ఆయన వారినందరినీ వెంటబెట్టుకొని నారాయణుని వద్దకు వెళ్ళినాడని, మహావిష్ణువు వారి బాధలు విని వారికి అభయమిచ్చి పంపివేసి, వెంటనే తనలోనుండి ఒక దివ్యపురుషుని సృష్టించి హిరణ్యకశిపుని వధకొరకు పంపినాడని ఈ పురాణం వర్ణించింది. రాక్షససమూహం ఆయనపైకి యుద్ధానికి వచ్చిందని, దనుజపతి నలుగురు కుమారులు ఆయనతో పోరు సాగించారని, ప్రహ్లాదుడాయనపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడని, ఆ అస్త్రాలన్నీ ఆయనలో లీనమైపోగా నారాయణస్వరూపుడు ఆ నలుగురు పుత్రులను పట్టుకొని పాదాలతో అణగద్రొక్కుతూ, చేతులతో మోదుతూ బాధించాడని, ఏదో విధంగా ఆ దివ్యపురుషుని బారినుండి వారు తప్పించుకొని పారిపోయి తండ్రికి విషయం వివరించారని, అప్పుడు రాక్షసరాజే స్వయంగా యుద్ధానికి సిద్ధంకాగా, నారాణాంశ సంభూతుడు అదృశ్యుడై నారాయణునితో జరిగిన విషయం నివేదించాడని, స్వామి వెంటనే నరసింహరూపాన్ని ధరించి రాక్షసుని ఎదుట ప్రత్యక్షమయ్యాడని ఈ పురాణం తెలిపింది.

నృసింహునితో ప్రహ్లాదుడు తలపడ్డాడని, తరువాత రాక్షస రాజు తన సోదరుడు హిరణ్యాక్షుని యుద్ధానికి నియోగించాడని, వాడు నృసింహునిపై పాశుపతాస్త్రాన్ని ప్రయోగించగా అది నిష్ఫలమైపోయిందని వర్ణింపబడింది. అప్పుడు ప్రహ్లాదుడు సంస్కారవశంచేత ఆ మహాపురుషుని వాసుదేవునిగా గుర్తించి స్తోత్రం చేసి శరణు వేడాడని, ఆయనను ఆశ్రయించమని తండ్రికి హితోపదేశం చేశాడని, అయినా వాడు పెడచెవిని పెట్టినందున స్వామి గోళ్ళతో వానిని వధించాడని, సోదరవధను చూచి హిరణ్యాక్షుడు పలాయనం చిత్తగించాడని, నృసింహుని శరీరం నుండి ఉద్భవించిన అనేక సింహాలు మిగిలిన రాక్షసులనందరినీ యమపురికి పంపాయని, తరువాత నృసింహుడు ఆ రూపాన్ని ఉపసంహరించి, స్వస్వరూపాన్ని ధరించి తిరిగి వైకుంఠానికి వెళ్ళిపోయాడని ఈ పురాణకథనం.

హిరణ్యకశిపువధ తరువాతనే, వరాహరూపం ధరించిన మహావిష్ణువు చేతిలో హిరణ్యాక్షుడు మరణించినట్లు ఈ పురాణం తెలిపింది.

ప్రహ్లాదుడు కూడ బ్రాహ్మణశాపంతో విష్ణుభక్తి మరచి, రాజ్యసుఖాలపై మోహం పెంచుకొని, దేవబ్రాహ్మణులను బాధిస్తూ, తన తండ్రిని, పినతండ్రిని చంపాడనే క్రోధంతో విష్ణువుపై ద్వేషాన్ని పెంచుకున్నాడని, ఆ వైరంతో వారిరువురి మధ్య భీకరపోరు జరిగిందని, పూర్వ సంస్కారంతో అతడు తిరిగి విష్ణు మహిమను గుర్తించి శరణువేడి, నారాయణభక్తితో రాజ్యకాంక్షను వీడి తన పినతండ్రి కుమారుడైన అంధకుడనే వానికి రాజ్యభారాన్ని అప్పగించి, చాలాకాలం నారాయణ స్మరణతో కాలం గడిపి ముక్తిని పొందాడని ఈ పురాణం నూతన అంశాలను వర్ణించింది.

శ్రీ మత్స్య మహాపురాణం : 160,61,62 అధ్యాయాలలో "హిరణ్యకశిపు ఉపాఖ్యానం" పేరుతో నృసింహావిర్భావ గాథ వర్ణితమైంది.

బ్రహ్మవరాలవల్ల చెలరేగిన హిరణ్యకశిపుని హింసలకు తాళలేక దేవతలు నారాయణుని ఆశ్రయించగా, ఆయన వారికి అభయమిచ్చి ఓంకార సహాయుడై నరసింహరూపాన్ని ధరించి రాక్షసరాజసభలో ప్రత్యక్షమైనాడని తెలుపబడింది. ఈ విషయం మరేపురాణంలోను కనిపించదు.

ప్రహ్లాదుని విష్ణుభక్తి హిరణ్యకశిపుని విష్ణుద్వేషం వంటి అంశాలు కనిపించవు.

కేవలం దేవతల రక్షణ కొరకే నృసింహావిర్భావం జరిగినట్లు పేర్కొనబడింది. నృసింహుడు దర్శించిన రాక్షసరాజ సభాభవన వర్ణన కూడ ఈ పురాణంలో విస్తారంగా కనిపిస్తుంది. దేవశిల్పి అయిన మయుడు నిర్మించిన సభాభవన వైభవం లోకోత్తరంగా ఉన్నట్లు చెప్పబడింది. ఈ విషయం కూడ ఇతర పురాణాలలో కనిపించదు.

భాగవతాది పురాణాలలో ఐదు సంవత్సరాల బాలుడైన ప్రహ్లాదుడు విష్ణుభక్తి విషయంలో సభాభవనంలో ప్రహ్లాదుడు, అతని కుమారుడు విరోచనుడు, అతనికుమారుడైన బలిచక్రవర్తి, నరకాసురుడు, రావణాసురుడు మొదలైన రాక్షసవీరులున్నట్లు తెలుపబడింది. కనుక ఈ కథలోని ప్రహ్లాదుడు పసివాడు కాదని విశదమవుతుంది.

సభలో ప్రత్యక్షమైన నృసింహుని చూచి అందరూ ఆశ్చర్య పడుతుండగా, ప్రహ్లాదుడొక్కడే అతడు నారాయణాంశ సంభూతుడని గుర్తించి, ఆతనిని శరణువేడి రక్షణ పొందమని తండ్రిని ఉద్బోధించాడు. *(సశేషం)*

## భక్తినివేదన ప్రోత్సాహకులు

| | | | |
|---|---|---|---|
| 1. | పి. మణి పార్థసారధి | బొబ్బిలి | 5,116/- |
| 2. | కొండపల్లి లక్ష్మీవసంత | హైదరాబాద్ | 5,116/- |
| 3. | సత్యనారాయణ | హైదరాబాద్ | 5,116/- |
| 4. | పి. చిరంజీవులు | కామారెడ్డి | 5,111/- |
| 5. | కాకుమాను సంపూర్ణమ్మ | నగరం | 5,016/- |
| 6. | గిరిజ, మనోహర్‌బాబు | హన్మకొండ | 5,010/- |
| 7. | కె. లలిత | హైదరాబాద్ | 5,016/- |
| 8. | సిహెచ్. కుసుమకుమారి | హైదరాబాద్ | 5,000/- |
| 9. | శ్రీమతి వి. వరలక్ష్మి | హైదరాబాద్ | 5,000/- |

**మీరు భక్తినివేదన అభివృద్ధికై ప్రోత్సాహక కైంకర్యాన్ని సమర్పించినందుకు శ్రీస్వామివారి మంగళాశాసనములు అనుగ్రహించారు.**




*గత సంచిక తరువాయి*

**వైశారది**

నిప్పుచిన్నదైనా దానికుండే కాల్చేశక్తిలో ఏలోటూ లేకుండానే ఉంటుంది. జాగ్రత్తగా దానిని వాడుకోగలిగితే అదే చిన్ని నిప్పుకణం లోకాన్నే దహించగలిగేటంత మహాజ్వాల కాగలుగుతుంది. అలానే భగవత్తత్త్వమనేది ఎక్కడ ఎలా ఉన్నా, సకల మంగళ గుణములతో పూర్ణమయ్యే ఉంటుంది. కనుకనే దానిని 'పూర్ణం' అని వేదం సంబోధించింది.

పూర్ణమైన ఆ భగవత్ తత్త్వాన్ని స్థూలంగా ఎన్ని రకాలుగా గుర్తించవచ్చో తెలుసుకున్నాం. పరమాకాశం, పరమపదమనే నిత్యవిభూతిలో ఎలా పూర్ణుడై విలసిల్లుతూ ఉంటాడో గమనించాం. 'కలంగా పెరునగర్' – మార్పు చెందని గొప్ప నగరమునందు షాడ్గుణ్య విశిష్టుడై నిత్య, ముక్త జనుల సకలవిధ సేవల నందుకుంటూ ఉండే అద్భుత స్వరూపమది. దానిని 'పరం' అంటారు.

పాలకడలిలో జగద్రచనాసక్తుడై వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ రూపాలతో అక్కడ కూడా గుణపూర్ణుడే అయి ఉండే స్థితి రెండవది. దీనిని 'వ్యూహ'మంటారు. ఇక్కడి నుండే అసంఖ్యాకమైన అవతారాలు ఆవిర్భవిస్తూ ఉంటాయి. సృష్టి, స్థితి, ప్రళయాలు ఇక్కడి నుండే జరుగుతూ ఉంటాయట.

అవసరానికి తగిన రూపము, నామము ధరించి, ఏవో కొన్నికొన్ని గుణాలను ప్రకాశింపచేసే విధముగా అవతారకందమైన వ్యూహస్వరూపమునుండి బయలుదేరుతాయి అని తెలుసుకున్నాం. అవి ఎన్ని రకాలుగా ఉంటాయో గూడ గతసంచికలో మనం ముచ్చటించుకున్నాం. భగవంతుని 'విభవము' అంటే 'సంపద' అయిన ఈ లోకము యొక్క వ్యవస్థను చక్కదిద్దే ఈ అవతారముల నన్నింటిని 'విభవములు' అంటారు. ఇవి ఆయనలో ఉండే కళ్యాణగుణములనెడి సంపదను, విభవమును ప్రకాశింపచేసేవి అవతారాలే కనుక వాటినన్నింటినీ 'విభవావతారములు' అంటారు. ఆ పూర్ణ తత్త్వము యొక్క మూడవ స్థానము.

తానే సృజించిన జీవులు దేహధారులై వారి వారికి ఏర్పడిన ప్రకృతి ప్రయుక్తమైన ప్రవృత్తులను కొనసాగించాలంటే అవసరమైన శక్తిని ప్రసాదించడానికి ఈ ప్రాణులందరిలోను 'అంతర్యామి'గ ఉండేస్థితి మరొకటి. అతడూ పరిపూర్ణుడేనని మనం మొదటనే తెలుసుకున్నాం.

ఇలా పర, వ్యూహ, విభవ, అంతర్యామి అనే నాల్గు స్థితులలో ఈ జీవులను ఉద్ధరించడానికే వేంచేసియుండే పరమాత్మ, ఇవి నాలుగు కూడా వీరి బాగుకై అంతగా ఉపయోగపడడం లేదనుకున్నప్పుడు స్వీకరించే ఐదవ స్థానమే 'అర్చా'. ఇది కూడా సకల విధములుగా పరిపూర్ణమయ్యే ఉంటుందని 'పూర్ణమిదం' అనే మంత్రంలోని చివరిభాగము 'పూర్ణమేవావశిష్యతే' అంటూ తెలిపింది.

పై నాలుగు స్థానాలలో పర, వ్యూహములు మనకి అందవు. విభవ స్వరూపాలుగ ప్రసిద్ధములైన అవతారాలు మనకాలానికి చెందినవి కావు. మన కాలంలోనూ అవతారాలేమైనా ఉన్నాయేమో! తెలియదు. రామ, కృష్ణాదుల కాలంలో కూడా వాళ్ళను గుర్తించడం ఆనాటివాళ్ళకే చాలా కష్టమైపోయింది. ఇప్పటి పరిస్థితి అంతకంటే బలహీనమైనదే కనుక, గుర్తించడం ఇంకా కష్టం.

ఇక అంతర్యామిని గురించి ఎంతవెదకినా లభించడం దుర్లభం. 'ఇదం పూర్ణం' అంటూ అన్నిటికంటే అతిసమీపంలో ఉండేదే అయినా దానంత దూరమైనదీ మరొకటి లేదు. కనిపించనంత సూక్ష్మమైనది కావడంతో దానివిషయంలో ఎవరికి తోచిన వ్యాఖ్యానాలు వాళ్ళు చేసేస్తూంటారు, వ్రాసేస్తూంటారు. వివరణలిస్తూనే ఉంటారు. ఆరకంగా అంతర్యామికూడ దగ్గరగా ఉన్నా, మన బాగు విషయంలో

ఉపయోగపడనిదే అయింది. అందుకే ఐదవది అయిన అర్చావతారమవసరమైంది. ఇది పైపై రూపాలలో ఏదో ఒకదానిని ఆధారం చేస్కోని ప్రవర్తిస్తూ ఉంటుంది. ప్రాయశః విభవరూపాలననుసరించి అధికంగ ఏర్పడుతూ ఉంటుంది. అలాగే తననే సేవించే సిద్ధపురుషుల మనోభీష్టాలకి తగినట్లుగా కూడా ఆయా దేశాల్లో, ఆయా రూపాల్లో రూపుదిద్దుకుంటూ నిలుస్తుంది.

అర్చామూర్తులలో స్వయంభూ మూర్తులు అంటే, తమంత తామే వెలసి అనుగ్రహించినవి కొన్ని. ఇవి మనదేశంలో ఉత్తరంలో ఓ నాలుగు, దక్షిణంలో ఓ నాలుగు జగత్ ప్రసిద్ధిని పొందాయి. ఉత్తరభారతంలో బదరీనాథ్‌లో పర్వత రూపంగా, ముక్తినాథ్‌లో–సాలగ్రామశిలా రూపంగ, నైమిశారణ్యంలో వృక్షరూపంగా, పుష్కరంలో జలరూపంగా అర్చామూర్తులుగ భగవానుడు వెలిసాడు.

అలాగే దక్షిణభారతంలో శ్రీరంగం, తిరుమల, శ్రీముష్ణం, తోతాద్రి. ఈ దివ్యక్షేత్రాలలో స్వామి స్వయంవ్యక్త స్వరూపుడై భక్తులననుగ్రహిస్తూ ఉన్నాడు. ఉత్తరంలో ఎక్కువగా స్థావరరూపిగా, దక్షిణంలో జంగమ రూపధారిగా వెలసి లోకాన్ని అనుగ్రహించాడు స్వామి. ఆళ్వార్లు సంకీర్తన కావించిన నూటఎనిమిది దివ్యతిరుపతులలో చేరిన వీటిని అష్టవైకుంఠాలని కీర్తించారు.

అర్చావతారం అటు కోవెళ్ళలోను ఇటు గృహాల్లో కూడా మనకి అందుబాటులో ఉండే రూపం. ఈ అవతారానికి ఉన్న ప్రత్యేకలక్షణం సౌలభ్యం. స్వామి అర్చక పరాధీనుడై ఉంటాడు. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన భగవంతుడు అర్చకునికి అధీనుడై, ఏది పెడితే దానిని ఆరగించి, ఎపుడు ఏసేవ లందిస్తే అవుడే వాటిని అందుకుంటూ, అసలు విశ్రాంతి ఎందుకయ్యా అంటూ విశ్రాంతినీయకపోయినా, 'సరే!' అని సరిపెట్టుకొని ఆయనకి లొంగి ఉంటాడు. ఇది చాలా ముఖ్యమైన గుణం.

ఇక గృహాలలో పెరుమాళ్ళ విషయానికి వస్తే, 'యే యథా మాం ప్రపద్యంతే' అన్నట్లు తన రూపాన్ని వెండి, బంగారుమయంగా చేస్తున్నారా, పంచలోహాలా, మట్టివిగ్రహాలా అనే ఆలోచన చేయకుండా, వారివారి శక్తికి, యోగ్యతకి తగినట్లు ద్రవ్యము ఏదైనా సరే భక్తుల భావాలకి తగినట్లు చేసిన ఆయా రూపాలలో తనను తాను నిలుపుకొని వారి పూజాదికముల నానందంతో అందుకుంటూ కొలువుతీరి ఉంటాడు. ఈ సౌలభ్యగుణమే పరమాత్మ వైభవాన్ని పదింతలు చేసింది. మన ఆళ్వారులు, ఆచార్యులు కూడా ఈ అర్చావతార సౌలభ్యానికి మోహపడి పోయారు. మన సంప్రదాయానికే మరింత విలువని పెంచి, బంగారానికి పరిమళమబ్బినట్లు ప్రకాశింపచేసింది.

ముదలాళ్వార్లలో పొయ్‌గై ఆళ్వార్లు 'తమరుగన్ద' పాశురాలలో అర్చావతార వైశిష్ట్యాన్ని కొనియాడారు. ఆశ్రితులు ఆ పరాత్పరుని, ఏద్రవ్యంతో చేయాలనుకొంటారో, ఏ నామంతో పిలవాలని అనుకుంటారో, ఆద్రవ్యమూర్తిగ, ఆ నామధేయంతో స్వామి పిలిపించుకొనే సౌలభ్యమూర్తి ఈ అర్చామూర్తి అంటూ వర్ణించారు.

నాలాయిరానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన పెరియవాచ్చాన్ పిళ్ళై అర్చావైభవానికి ఆచార్య విశ్వాసాన్ని జోడించి ఐతిహ్యాలను ఎన్నింటినో అందించారు.

ఒకసారి, ఎంబెరుమానార్లుగ జగత్ప్రసిద్ధిపొందిన భగవద్రామానుజాచార్యస్వామి, శ్రీరంగంలో భిక్షాటనకి బయలుదేరారు. దారిలో వారికి కొందరు చిన్నపిల్లలు ఆటలాడుకుంటూ కనిపించారు. ఆ పిల్లల్లో ఒకడు ఇసుకలో ఒక బొమ్మగీసి, శంఖం, చక్రం చేతులలో ఉన్నట్లు గీతలుగీసి, 'ఉడయవరే! ఇరుగో మీ పెరుమాళ్, ఇక్కడున్నారు చూడండి!' అని పిలిచారట. వెంటనే ఉడయవర్లు ఆ బొమ్మదగ్గరకు పోయి, సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుని దర్శించినంత ఆనందం పొంది, సాష్టాంగనమస్కారం చేసారట. భగవన్మూర్తి అనే భావనకి వారెంత పరవశించారో, ఎంత వ్యామోహపడ్డారో ఈ చిన్ని వృత్తాంతం తెలియచేస్తుంది.

అలాగే మరోసారి శ్రీరంగంలోనే పిల్లలంతా నంబెరుమాళ్ సన్నిధిలో జరిగే ఉత్సవాలు తాము జరుపుతున్నట్లు మణల్‌వెళ్ళి, అంటే, వైకుంఠనాథుని సన్నిధికి ఎదురుగా ఉన్న ఇసుకతెన్నెలలో ఆటలాడుకుంటున్నారు. ఇసుకలో గీసిన పెరుమాళ్ళకి ఇసుక ప్రసాదం ఆరగింపుచేసి అరుళప్పాడు అంటూ ముందుగా ప్రసాదాన్ని ఆచార్యపురుషులుగ ఉండే పిల్లలికిచ్చారు.

ఆతర్వాత జీయర్‌స్వామివారికి ఇవ్వాలని జీయా! ప్రసాదం తీసుకోండి! అంటూ పిలిచారట. ఆ సమయానికి అక్కడికి వచ్చిన రామానుజులు తమనే పిలిచినట్లు భావించుకొని, 'స్వామీ! వచ్చేశా నాయిందే'నంటూ ఆపిల్లలదగ్గర ఒడిచాచి ఇసుక

ప్రసాదం తీసుకొని కళ్ళకి అద్దుకొని తమ పాత్రలో వేసు కున్నారట. ఎదురుచూడని ఈ సంఘటనకి పిల్లలు అవాక్కైపోయా రట. అయితే, ఈ విశ్వాసం భక్తకోటిని ఆనందంలో ముంచిందట.

అర్చామూర్తి అంటూ వచ్చిన తరువాత అసలు భగవంతుడే స్వయంగా వచ్చినా, 'వద్దయ్యా! నీ అర్చామూర్తి దర్శనమే బాగుంది' అంటూ భక్తులు మురిసిపోయి వ్యామోహపడిన సంఘటనలెన్నో మనస్సుని ఆనందంతో ముంచెత్తుతాయి.

నంజీయర్ వారి ఆరాధ్యమూర్తి పెరుమాళ్ శ్రీకృష్ణుడు. వారికి ఆయర్ దేవుడు. గొల్లస్వామి అని పేరు. ఆయన ఒకసారి ఎంగళ్ ఆళ్వాన్ అనే రామానుజుల శిష్యులకి కలలో కనిపించి, 'అయ్యా! నాకు నేరేడుపళ్ళు కావా'లని అడిగారట. ఆవిషయాన్ని మరునాడు ఎంగళాళానే నంజీయరుగారితో "స్వామీ! మీ పెరుమాళ్ళేంటండీ, నేరేడుపళ్ళు కావాలని నాప్రాణాలు తీసేస్తున్నాడు" అని నవ్వుతూ చెప్పారట. అంటే, 'అది ఏదో కలలే!' అని కొట్టిపడవేయలేదు. ఆ అర్చామూర్తిని సాక్షాత్ కొంటె దైవంగా భావించి, చెప్పడంలో వారి ప్రేమ, విశ్వాసం స్పష్టంగా వెల్లడికావడం మనం గమనించాలి.

తిరుమంగై ఆళ్వార్ల విషయంలోకూడా అర్చావైభవాన్ని స్పష్టంగా చాటే ఇతివృత్తం ఒకటి కనిపిస్తుంది. ఒకసారి తిరువెందళూరులో శ్రీపరిమళ రంగనాథుని సన్నిధికి వేంచేసారట తిరుమంగై ఆళ్వార్లు. స్వామి అర్చక పరాధీనుడు కదా. పూజాదికములన్నీ పూర్తి అయిపోయి కోవెల మూసివేశారు. కానీ తిరుమంగై ఆళ్వార్లు 'స్వామీ! నాకు నీ దర్శనం కావాలి' అని పట్టుపట్టారు. 'అర్చకులు వచ్చిన తరువాత' అన్నాడు స్వామి. 'కాదు! ఇప్పుడే నువ్వు కనిపించాలి' అంటారాయన. ఆళ్వారే, 'మీకు ప్రహ్లాదుని గురించి తెలియదా?' అన్నారు. 'ఎందుకు తెలియదు? భగవంతుడు అంతటా వ్యాపించి ఉన్నాడని చెప్పిన భాగవతోత్తముడు కదా!' అన్నారు.

'మరింకేం! మీరు కూడా సర్వాంతర్యామిగా నన్ను దర్శించవచ్చును గదా!' అన్నాడట స్వామి.

'అబ్బే! మాది ప్రహ్లాదుని గోష్ఠికాదు. అది విభవావతారానికి చెందినది. ఆ భావనలో మాకు తృప్తి లేదు. ఇక్కడ వెలసిన స్వామిని, దయామూర్తిని, సర్వగుణశోభితుని విభవానికి వేయిరెట్లు సౌలభ్యపూర్తికల ఈ అర్చామూర్తిని దర్శించడంలోనే తృప్తి మాకు, కాబట్టి నిన్ను దర్శించుకొని తీరవలసినదే. నీ అసాధారణ దివ్యమంగళ విగ్రహం చూడాల్సిందే. నువ్వేమో భక్తుల మనోభీష్టం తీర్చడానికి వచ్చిన దయాసముద్రుడవు కదా! అటువంటి నీ రూపాన్నే చూడకుండా ఎలా ఉండగలను?' అన్నారట తిరుమంగై ఆళ్వార్లు. అర్చావతార దర్శన అభినివేశం చూడండి! "మాకోసం వచ్చిన నిన్ను మేం చూడకుండా ఎలా ఉండగలం?" ఇదీ ఆళ్వార్ల ప్రశ్న! *(సశేషం)*

### విద్యాతురాణాం న సుఖం న నిద్రా!

విద్యలు నేర్చుకోవాలి అని భావించే వారికి సుఖానికి చెందిన ఆలోచన ఉండకూడదు, నిద్రపోదామనే కోరిక రాకూడదు. సుఖానికీ, నిద్రకి అలవాటు పడితే ఏవిద్యలనూ నేర్చుకొనలేం! అనుకొన్న దానిని సాధించలేం!

సుఖాన్ని, నిద్రనీ త్యాగం చేసినవాడే విద్యని నేర్చుకోగలుగుతాడు. విద్వాంసుడౌతాడు.

**నీతిశతకం**

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...)

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

"అవనురైక్క పెత్తేనో తిరుకచ్చియార్‌ప్పోల"

వరదరాజస్వామి మాట్లాడగా విన్నానా తిరుకచ్చినంబి లాగా అని అర్థం.

"నిజమే కదా! పరమాత్మను చూడటమే సాధ్యం కాదంటే రోజూ వారితో సంభాషించడమంటే మాటలా! అలాంటి వారి నామస్మరణ చేసినా చాలు మన పాపాలు తొలగిపోతాయి" అంది విమల.

"బాగా చెప్పావు విమలా..." అంది బామ్మ.

"ఆ రోజులలో వర్ణభేదం బాగా పాటించేవారా పిన్నీ?"

"మామూలుగా అడుగుతావేమిటి. కులంకాని వాళ్ళతో ఎవరైనా చేరినా, వారికుపకారం చేసినా వీళ్ళనూ కులం నుండి వెలివేసేవారు."

"పరమాత్మకు కులభేదం లేదుకదా! మనుషులెందుకు అంత పట్టింపు చూపుతారు?"

"తెలిసినవాళ్ళు అలా చిన్నబుద్ధి చూపరు. తెలిసీ తెలియని వాళ్లే అలాంటి చిల్లరపనులు చేస్తారు. మన రామానుజాచార్యుల కాలంలో జరిగిన ఒక సంఘటన చెప్తాను విను...

కావేరీతీరంలోని ఒక రాజ్యాన్ని ఒక బ్రాహ్మణోత్తముడు పరిపాలిస్తూండేవాడు. ఆయన రోజూ కావేరీలో స్నానసంధ్యాదు లాచరించేవాడు. ఒకరోజు కావేరీతీరంలో ఒక శవం కొట్టుకురావటం చూశాడు. ఆ శవాన్ని పరిశీలించి చూడగా భుజం మీద చక్రముద్ర కనపడింది. వెంటనే అవతలి భుజం చూడగా శంఖముద్ర కూడా ఉంది. అయితే ఈ శవం ఒక వైష్ణవుడిదనే నిశ్చయానికి కొచ్చి ఇతర వివరాలు ఏవీ ఆరాతీయకుండా ఉత్తరక్రియలు జరిపించారు. ఆ ఊరిలోని ఇతర బ్రాహ్మణులు ఆ శవం తక్కువ కులం వాడిదని, అలాంటి శవానికి సంస్కారం చేయటం ఆరోజు చేసిన తప్పని నిర్ణయించి దానికి శిక్షగా ఆయనను కులబహిష్కారం చేశారు."

"రాజును ఒక కులంవాళ్ళు బహిష్కరించగలరా?"

"ఆరోజులలో రాజులు ప్రజాభిప్రాయానికి అనుగుణంగా నడుచుకునేవారు కదా! అందువల్ల రాజు తప్పును ప్రజలు ఎత్తి చూపగలిగేవారు." "తరువాత ఏం జరిగింది?"

"ఆరాజు ప్రజాభిప్రాయానికి తలవొగ్గి వారికి మంచిబుద్ధి ప్రసాదించమని శ్రీరంగనాథుడిని ప్రార్థించాడు.

మరుసటిరోజు శ్రీరంగనాథుడి సన్నిథిలో గుంపుగా చేరివున్న వైష్ణవుల నుద్దేశించి, స్వామి అర్చకముఖంగా మాట్లాడారు.

"ఆ బ్రాహ్మణుడు మీకు మంచివాడు (నల్లాన్) కాక పోవచ్చు. కానీ, మాకు మంచివాడే. మీరు కూడా అతనిలోని మంచిని గ్రహించండి" అని చెప్పారు. దానితో అందరికీ ఆ 'నల్లాన్' మంచితనం అర్థమయింది.

ఆ 'నల్లాన్' తన పనివాళ్ళు, తన దగ్గర ఉండేవాళ్ళు అందరికీ చక్రాంకితాలు చేసి 'శ్రీమద్రామానుజుల శ్రీచరణాలే మనకు శరణ్యం' అని ఉపదేశించారు. వాళ్లు కూడా 'నల్లాన్' మాటకు కట్టుబడి ఆచార్యాభిమానం పాటిస్తూ జీవనం గడుపుతున్నారు. క్రిమికంఠచోళుని బారినుండి తప్పించి శ్రీమద్రామానుజులను అడవిదారిలో మేల్కోటకు పంపిన వివరాలు తెలుసుకదా!

"ఆ తెలుసు తెలుసు. కూరత్తాళ్వాన్, పెరియనంబి కలిసి భగవద్రామానుజులను తప్పించి వాళ్ళు చోళుని సభకు వెళ్ళారు కదూ!"

అవును. అప్పుడు రామానుజులవారు అడవిలో దారితప్పి పోయారు. అప్పుడు ఆ అడవిలో నివసిస్తున్న కొండజాతివాళ్ళు ఈ వైష్ణవగోష్ఠిని ఆదరించారు. వారిలో రామానుజులవారున్నారని తెలియగానే వారి ఆనందానికి హద్దులేదు. తామంతా 'నల్లాన్' శిష్యులమని వారి కృపవలనే ఈ రోజు రామానుజాచార్యులకు వారిగోష్ఠికి కైంకర్యం చేసే భాగ్యమబ్బిందని పొంగిపోయారు. ఆ గోష్ఠికి చక్కని ఉపచారాలు చేశారు.

ఆచార్యులు కూడా వీరి భక్తి ప్రపత్తులను మెచ్చుకొని దీనికి కారకుడైన 'నల్లాన్ అనే ఘనమేఘాలు అభిమాన వృష్టిని ఈ మారుమూల అడవిలోకూడా కురిపిస్తున్నాయి కదా'' అని పొంగిపోయారు. అంటే, ఆచార్యులు ఇంత మూలప్రాంతాలవారిని గూడ వైష్ణవులుగ సంస్కారాలు చేసి తీర్చిదిద్దారే! అని ఆశ్చర్యపడ్డారన్నమాట.

"వీరికే నల్లాన్ చక్రవర్తి" అని పేరు. కాలక్రమంలో వీరి సంతతి దినదిన ప్రవర్ధమానమై దేశం నలుమూలల విస్తరించారు."

"అయితే అత్తయ్యా మన 'నల్లాన్ చక్రవర్తి' వాళ్ళు వీరి సంతతేనంటారా?" "అంటారా ఏమిటి ఒదినా! అదేగా పిన్ని చెప్తున్నది. "అవునమ్మా అందుకే తిరుక్కోళూరమ్మ కూడా 'నల్లాన్‌లాగా చక్రాన్ని చూసి వైష్ణవుడని గుర్తించి పరుల మాటలకు వెరవక సంస్కారం చేశానా?" అనే అర్థంలో "అరుళాళ్రిక్కుండేనో నల్లానైప్పోల" అన్నది. (సశేషం)

# మన ఆళ్వార్లు

- శ్రీ నృసింహ -



## తిరుమళ్లిశై ఆళ్వారు

తిరుమళ్లిశైయాళ్వార్లు, పేయాళ్వార్లని మహాజ్ఞానులని గుర్తించారు. పరతత్త్వ నిర్ణయము వీరి వలననే నాకు లభిస్తుందని తెలుసుకున్నారు వెంటనే వారి శ్రీపాదములపై పడి 'తత్త్వోపదేశం చెయ్యండి' అని ప్రార్థించారు. పేయాళ్వారు వారికి పంచసంస్కారాలు ప్రసాదించారు. మంత్రమంత్రార్థాలు అనుగ్రహించారు. సర్వేశ్వరుని దివ్యాత్మస్వరూపాన్ని, ఆయన జ్ఞాన శక్త్యాది కల్యాణగుణాల్ని, స్వామి దివ్యమంగళ విగ్రహాన్ని, ఆయన దివ్యాభరణాల్ని, లక్ష్మి మొదలైన మహిషీ వర్గాన్ని, దివ్యపరిజనాన్ని, పరమపదమును చక్కగా వివరించి చెప్పారు. దర్శన సమానాకారంగా వారు వివరించి చెప్పిన విషయం తిరుమళ్లిశైయాళ్వార్లను ముగ్ధుల్ని చేసింది.

సర్వజగత్కారణభూతుడు, సర్వాంతర్యామి, పుండరీకాక్షుడును, జగన్నాథుడును అయిన శ్రియఃపతిని ఆయన తమ హృదయ కమలములో నిల్పారు. అష్టాంగయోగమార్గంలో ధ్యానించారు. ఏడువందల ఏండ్లు గజేంద్రసరస్సు ఒడ్డున తిరువల్లిక్కేణియందు వేంచేసి యున్నారు.

ఒకరోజు వీరు బొంతకుట్టుకుంటూ కూర్చుని ఉండగా, ఆకాశంలో పార్వతీపరమేశ్వరులు వెళ్తున్నారు. 'ఈయనెవరో తెలుసా?' అని ప్రశ్నించింది పార్వతీదేవి. 'తెలుసుకుందాం!' అని క్రిందికి దిగారు దంపతులు. 'ఏదైనా వరం కోరుకోండి ఇస్తా'నని శివుడు అన్నాడు. వెంటనే వీరు 'మోక్షం ఇస్తారా? ఇవ్వండి' అన్నారు. 'అబ్బే! మోక్షం శ్రీమన్నారాయణుడే ఇవ్వాలి. అది నావల్లకాదు!' అన్నాడు శంకరుడు. 'ఇంకేదయినా కోరుకోండి' అన్నాడు. 'అబ్బే ఇంకేమీ వద్దు' అన్నారు వీరు. 'మేం వచ్చినందుకు ఏదో ఒకటి కోరుకోండి' అన్నాడాయన. 'ఈబొంత కుట్టడానికి సూదిలో దారం మళ్ళీ మళ్ళీ ఎక్కించుకునేశ్రమ లేకుండా దానంతట అదే దూరేలా వరమియ్యండి' అన్నారు వీరు.

ఈశ్వరుడికి చాలా కోపం వచ్చింది. వెంటనే తన మూడవ కన్ను తెరిచి కంటిమంటను ప్రసరింపచేశారు. ఈయన సుదర్శనాంశతో పుట్టారు గదా! తమ కాలి బొటనవ్రేలునుండి అగ్నిని ప్రసరింపచేశారు. భాగవతోత్తములను జయింపలేము కదా! అని ఈశ్వరుడు భావించి పార్వతీదేవికి కూడా ఆ విషయం చెప్పాడు. 'ఆహా, ఈయన భగవద్ భక్తి సారంగా కలిగినవారు కదా! భక్తిసారులు అనే బిరుదు వీరికే తగినది' అంటూ బిరుదునిచ్చి తమ దారిన తాము వెళ్ళిపోయారు పార్వతీ పరమేశ్వరులు.

శుక్తిహారుడు అనే ఖేచరుడు, అంటే, ఆకాశంలో విహరించే దేవజాతి పురుషుడు పెద్దపులినెక్కి వెళ్తున్నాడు. ఆ పులి ఆకాశంలో వీరికిపైన పోలేక ఆగిపోయింది. ఏమిటా అని చూస్తే క్రింద ఈయన, బొంత. 'అయ్యా! మీరా బొంతని పడేయండి. ఇదుగో వజ్రాలు పొదిగిన ఈ వస్త్రాన్ని ధరించండి' అంటూ ఒక వస్త్రాన్ని ఇయ్యబోయాడు. తిరుమళిశైయాళ్వార్లు తాము కప్పుకొన్న బొంతనే వజ్రవైఢూర్యాలతో నిండినదానినిగా చూపించారు. ఆశ్చర్యపోయాడు శుక్తిహారుడు. తన మెడలోని ఒక హారాన్ని తీసి ఇస్తూ దీనిని ధరించండి అన్నాడు. ఈయన తన మెడలోని తులసి పద్మాక్షమాలల్ని నవరత్నహారాలుగా కన్పింపచేశారు.

అదిరిపడ్డాడు ఖేచరుడు. 'మహానుభావులు మీరు. క్షమించండి' అంటూ తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఒకసారి కొంకణ సిద్ధుడనే రసవాది భక్తిసారుల దగ్గరకి వచ్చాడు. ఒక రసగుళికను ఈ ఆళ్వార్లకి ఇయ్యబోయాడు. వీరు

తమ ఒంటిపై ఉన్న మన్ను నలిచి, ఒక ఉండగా చేసి దానిని ఆ సిద్ధునకిచ్చారు. అది తానిచ్చిన గుళికకంటే ఎంతో విలువైనది అని తెలుసుకొని సిగ్గుతో అక్కడనుండి వెళ్ళిపోయాడు సిద్ధుడు.

భక్తిసారులు ఒక గుహలో యోగస్థితిలో ఉండగా ఒక అప్రాకృతమైన దివ్యతేజస్సు ఆ గుహని నింపేసింది. ముదలాళ్వార్లు ఆ తేజస్సు చూచి ఆశ్చర్యపడి వచ్చారు. ఒకరినొకరు ప్రేమగా ఆలింగనం చేసుకొని కుశల ప్రశ్నలు వేసుకున్నారు. నలుగురూ కలిసి పేయాళ్వార్ల అవతారస్థలమైన కైరవతీర్థం చేరారు. ముదలాళ్వార్లు భూసంచారం కోసం బయలుదేరారు. భక్తిసారులు మాత్రం పొయ్‌కై ఆళ్వార్ల అవతారస్థలమయిన సత్యవ్రతక్షేత్రంలోని తిరువెఃకా దివ్యదేశంలో ఉండిపోయారు. యోగస్థితిలో అక్కడే కాలం గడిపారు.

ఆ గ్రామంలో ఒకవారకాంత వృద్ధురాలైపోయి, వ్యాధుల బారిన పడింది. పిల్లలు వెళ్లగొట్టేశారు. ఆవిడ భక్తిసారులను సేవించి 'మీసేవ చేసుకుంటూ ఉంటాను స్వామీ!' అని ప్రార్థించింది. ఆయన ఆశ్రమాన్ని ప్రతిరోజు శుభ్రంగా ఊడ్చి నీళ్ళుచల్లి ముగ్గులు పెట్టి అలంకరించేది. కొంతకాలానికి భక్తిసారులు ఆవిడసేవకి తృప్తి చెందారు. అమ్మా! నీకేదైనా ఒక వరమిస్తా కోరుకో' అన్నారు. ఆవిడ 'స్వామీ! నా ముసలితనం పోవాలి. అలా వరమియ్యండి' అని ప్రార్థించింది.

తిరుమళ్ళిశై ఆళ్వార్ల కటాక్షముతో యౌవనవతిగా మారిపోయింది. చూపులు తిప్పుకోలేనంత అందగత్తెగా కన్పించింది. ఆ దేశపురాజు అనుకోకుండా ఒకనాడామెను చూశాడు. మోహించాడు. భార్యగా చేసేసుకున్నాడు. చాలా ఆనందంగా కాలం గడుస్తోంది. క్రమంగా రాజుగారు ముసలివారయ్యారు. వేశ్యమాత్రం అలాగే ఉండిపోయింది. ఆశ్చర్యం కలిగింది రాజుకు. 'ఏమిటి నేనిలా అయిపోయాను? నువ్వలానే ఎలా ఉన్నావు?' అని అడిగాడు.

దానికావిడ అంతా తిరుమళ్ళిశైయాళ్వార్ల కటాక్షం అని తెలిపింది. 'అయితే నన్ను కూడా ఆయన కటాక్షించేలా చెయ్యి' అన్నాడు రాజు. 'అయితే కణికణ్ణన్‌ను ఆశ్రయిద్దాం' అందావిడ. వెంటనే ఆయన కణికణ్ణన్‌ను పిలిపించి 'మీ ఆచార్యులవారితో పని ఉంది. వారినిక్కడికి తీసుకొని రావయ్యా!' అని ఆజ్ఞాపించాడు.

దానికి కణికణ్ణన్ 'మా ఆచార్యులవారికి ఎవరితోనూ ఏ పనీలేదు. ఆయనెక్కడికీ రాడు' అని చెప్పారు. 'అయితే పోనీ నువ్వు నామీద మంచికవిత్వాన్ని చెప్పు' అన్నాడు రాజు.

'భగవంతుని గురించిగాని, భాగవతోత్తములను గురించిగాని నా నాల్క పలుకుతుందే గాని మిగిలిన విషయాలను వర్ణించదు' అంటూ ధైర్యంగా చెప్పాడు కణికణ్ణన్. ఆ.. మహారాజునైన నాకే ఎదురు చెప్తావా? నాదేశం విడిచిపెట్టి వెళ్ళిపో! అంటూ ఆజ్ఞాపించాడు. కణికణ్ణన్ తమ ఆచార్యులను చేరి 'స్వామీ! రాజుగారు నన్ను దేశం విడిచి పొమ్మన్నారు. మీరు ఆజ్ఞ ఇస్తే బయలుదేరుతా' అన్నాడు. 'నాయనా! నువ్వు లేనిచోట నేనెందుకుంటానయ్యా! పద నేనూ వస్తా..

'స్వామీ సర్వేశ్వరా! నా శిష్యునితో కలిసి నేను కూడా బయలుదేరుతున్నా. నువ్వు కూడా శేషపాన్పు చుట్టుకుంటావా!' అనగానే స్వామి 'అలాగే!' అంటూ శేషపాన్పు చుట్టుకొని బయలుదేరాడు. ఈ విషయం తెలిసి ఆ ఊళ్ళో అన్ని ఆలయాల్లో ఉన్న దేవతామూర్తులు మాయమైపోయారు. అర్చకులంతా గొల్లుమంటూ రాజుగారికీ విషయం చెప్పారు. రాజు మంత్రులతో సంప్రదిస్తే విషయం తెలిసింది. వెంటనే తన తప్పు తెలుసుకొని 'ఓరిరుక్కై' అనే గ్రామంలో వారందరిని పట్టుకొన్నాడు. కణికణ్ణన్ పాదాలపై పడి అపరాధం మన్నించమంటూ ప్రార్థించాడు. ఆయన ఆళ్వార్లని వేడుకున్నాడు. ఆళ్వార్లు ఆశ్రిత పరతంత్రుడయిన సర్వేశ్వరుని చూచి.. 'స్వామీ! మా శిష్యుడు వెనక్కి బయలుదేరాడు. నేనూ అతనితో పోతున్నా. మరి నువ్వు కూడా నీ శేషపాన్పుతో పూర్వంలాగే ఆలయంలో వేంచేసి ఉండు అని ప్రార్థించాడు. అంగీకరించాడు సర్వేశ్వరుడు. ఈ విషయం తెలిసి మళ్ళీ అన్ని ఆలయాల్లోకి దేవతామూర్తు లంతా వచ్చిచేరారు. ఊరంతా కళకళలాడిపోయింది. ఆరోజునుండి తిరువేకా దివ్యదేశంలోని పెరుమాళ్ళకి "శొన్నవణ్ణమ్ శెయ్‌ద పెరుమాళ్" యథోక్తకారి (చెప్పినట్లు చేసిన స్వామి) అనే తిరునామం ఏర్పడింది. ఇలా భగవంతుడు కూడా ఈయన భక్తికి పరవశించి ఆయన చెప్పినట్లు నడుచుకొనేవాడంటే, ఈ ఆళ్వార్లు ఎంతటి మహిమాన్వితులో తెలుస్తుంది. ఇలాంటి విశేషాలు ఇంకెన్నో... (సశేషం)

జై శ్రీమన్నారాయణ

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో....!**

## వికాసతరంగిణి నిర్వహించే

# మహిళా ఆరోగ్య వికాసము

## క్యాన్సర్ అవగాహన - నివారణ శిబిరములు

"ప్రతి ఇంట గృహిణి ఆరోగ్యమే ఆ కుటుంబానికి, దేశానికి భాగ్యప్రదము" అనే నానుడితో మన వికాసతరంగిణి మహిళా ఆరోగ్య వికాసం పేర "క్యాన్సర్ అవగాహన-నివారణ శిబిరములు" నిర్వహిస్తోంది. ఈ శిబిరములలో ప్రతీమహిళ పాల్గొని క్యాన్సర్ రహిత సమాజ నిర్మాణానికి దోహదపడాలని ఆహ్వానిస్తున్నాము.

## Save Mother! Save Generation!

మన భారతీయ సమాజము మహిళాకేంద్రకమైన సమాజం. ప్రతిగృహం మహిళపై ఆధారపడి జీవిస్తుంది.

మహిళ ఇటు భర్తని, సంతానాన్ని అటు ఇరుగు పొరుగు వారిని సమన్వయం చేసుకుంటూ కుటుంబాభివృద్ధికి తోడ్పడుతుంది.

సహజంగ ప్రేమ హృదయం స్త్రీది. అందుకే ఎప్పుడూ తనచుట్టూ ఉండేవారి క్షేమాన్నే ఆలోచిస్తుంది. వారినెలా ఆదుకోవాలో ఆలోచిస్తుందే తప్ప తనను గురించి తాను ఆలోచించదు.

ఈ విధానంలో స్త్రీ ఆరోగ్యం సహజంగానే దెబ్బతినే అవకాశం ఏర్పడుతుంది. అయినా, తనవారందరి ఆరోగ్యాలు సరిచూడడానికే ప్రాధాన్యమిస్తూ, తన ఆరోగ్యాన్ని నిర్లక్ష్యంచేసే మహిళలనే సమాజంలో అధికంగ ఇప్పటికీ చూడవచ్చు.

ఏదో సామాన్యమైన జలుబు, దగ్గువంటివైతే వస్తూ, పోతూ ఉన్నా పెద్దగ ప్రమాదం లేదు. పైగ అవి రావడం పోవడం తెలుస్తూంటాయి. అలా కాకుండా కొన్ని అనారోగ్యాలు వచ్చినట్లు తెలియవు. అవి ముదిరేదాకా ఏబాధా ఉండదు. పైకి కనిపించే దశ వచ్చేసరికి ఆ రోగం శరీరంలో బాగ ముదిరి ఉంటుంది. పైకి తేలాక దానికి ప్రతిక్రియ చేయడం శ్రమసాధ్యమవుతుంది. అది ప్రాణానికే హానికరంగ కూడా పరిణమించవచ్చు. అలాంటివాటిలో క్యాన్సర్ ఈమధ్యకాలంలో తీవ్రవేగంతో భయంకరంగ పెరుగుతోంది.

ఈ వ్యాధిబారిన పడుతున్నవారిగ ఏడాదికి 10 లక్షలపైనే కొత్తకేసులు నమోదు అవుతున్నాయని, ఇండియన్ మెడికల్ అసోసియేషన్ న్యూఢిల్లీవారు తెలియ చేస్తున్నారు. అయితే దీనిని గురించి భయపడడం కాదు చేయవలసినది! దీనిరాకను ముందే గుర్తించే జాగ్రత్తలు తీసుకుంటే ఈ వ్యాధిరాకుండా నివారించుకోవచ్చు.

క్యాన్సర్ అంటే? ఒంట్లో ఉండే జీవకణాలలో కొన్ని విశృంఖలంగ ఎవరిమాటా వినకుండా పెరిగిపోవడమన్నమాట. ఇది ఒంట్లో ఏభాగానికైనా రావచ్చు. ముఖ్యంగ మహిళలలో **బ్రెస్ట్, సర్వైకల్** క్యాన్సర్ అధికంగ వస్తుంది మన దేశంలో.

**ఇతర భాగాలకంటే ఈ భాగాలకు వచ్చే క్యాన్సర్‌ను మాత్రమే త్వరగ గుర్తించే అవకాశం ఉండటం ఒకరకంగ మహిళలకు వరమే!** అయితే, గుర్తించే శ్రద్ధ మహిళలలో రావాలి. మన దేశంలో అవగాహన చాల తక్కువ.

**అవగాహన కలిగి తక్కువ ఖర్చుతో తక్కువ శ్రమతో చిన్న పరీక్ష ద్వారా దీని రాకను గుర్తించి, తగు జాగ్రత్తలు తీసుకుంటే, ఈవ్యాధి దరిదాపులకు రాదు.** అది లేకపోతే వ్యాధి లోలోపలే పెరిగితే మహిళాజీవితం నరకమవుతుంది. కుటుంబానికి తట్టుకోలేని ఒత్తిడి, ఖర్చు కూడా మీదపడతాయి. అందుకే మహిళ ఆరోగ్యవిషయంలో "అవగాహన" చాల అవసరం. అదే లక్ష్యంగ వికాసతరంగిణి **మహిళ ఆరోగ్యవికాసమ**నే చిన్న ఉడతసాయం చేయాలని 2007 సం॥నుండి ప్రారంభించింది.

ఇది మన సమాజానికి వెన్నెముక అయిన మహిళలకోసం, మీ కోసం! మీరు సహకరిస్తే మాకదే ఆనందం.

వరంగల్ జిల్లాలో ప్రారంభమైన ఈ వైద్యసేవలను ప్రస్తుతము 4గు కేంద్రములద్వారా మన వికాసతరంగిణి కొనసాగిస్తోంది.

**జిల్లాల వైద్యసేవ సమన్వయ కర్తలు**

| | |
|---|---|
| **వరంగల్ -** | **శ్రీమాన్ డా॥ బి.రాధాకృష్ణ- 92468 95656** |
| | **డా॥ వీణ దంపతులు - 92468 96656** |
| **కృష్ణ - గుంటూరు** | **శ్రీమతి డా॥ వి. రాజేశ్వరి - 91772 95291** |
| | **శ్రీమతి మాధవి - 93464 05010** |
| | **శ్రీమతి రుక్మిణీ - 98669 11536** |
| **విశాఖపట్నం** | **శ్రీమతి ఎ. విజయ - 97017 06432** |
| | **శ్రీమతి డి. భద్రాయమ్మ - 96181 21441** |
| **విజయనగరం,శ్రీకాకుళం** | **శ్రీమతి ఎన్. శకుంతల - 94901 07787** |
| **కరీంనగర్** | **శ్రీమాన్ ఎస్. ప్రభాకర్‌రావు - 93470 76804** |
| | **శ్రీమాన్ సిహెచ్. లక్ష్మీనరసింహరావు- 9849645577** |

గత రెండు సంవత్సరాలలో ఒక్క కరీంనగర్ జిల్లాలోనే కొద్ది తక్కువగ 100 గ్రామాలలో 100 క్యాంపులను శ్రీమాన్ లక్ష్మీనరసింహారావు, విటి. వైస్ చైర్మన్‌గ, తమ కాలేజీ విద్యార్థులు& స్టాఫ్ అందరితో నిర్వహిస్తున్నారు.

ఇన్ని జరుగుతున్నా ఇకా, మహిళాలోకంలో అవగాహన చాలా తక్కువగానే ఉంది. 1000మందికి తెలిపితే అందులో ఒకవంతు మాత్రమే క్యాంపులో పరీక్షలకు వస్తున్నారు. పరీంక్షించాక, పాజిటీవ్ రిపోర్ట్ వచ్చినతరువాత కూడ, ట్రీట్‌మెంట్‌కి సిద్ధపడి రావడం కష్టమైపోతోంది. మొదట్లో బాధలేమీ కనిపించవు. కనుక, ఉచితంగ ట్రీట్‌మెంటు అంటూంటే పట్టింపు తక్కువ అవుతోంది. దీనిలో, వారికి ఓపికగ విషయం వివరిస్తే, వారిలో చైతన్యం కలిగి కొందరు సిద్ధపడి వస్తూంటారు. అందుకే ఈ పథకానికి ఓపిక, శ్రద్ధ ఉన్న మహిళాకార్యకర్తలే చాలా అవసరం. ఉత్సాహం కలిగి, సమయం ఇచ్చి, తోటి మహిళలకు క్రొత్తజీవనాన్ని ఇవ్వడంలో ఆనందం పొందాలనుకునే మహిళాకార్యకర్తలు తమతమ వివరాలతో సంసిద్ధతాపత్రాలను పంపించవలసినదిగ ఆహ్వానిస్తున్నాం.

సంసిద్ధత పత్రాలు ఇచ్చినవారికి 2/3రోజుల శిక్షణతో వైద్యసేవా కార్యకర్తలుగ తీర్చిదిద్దుతుంది మన వికాసతరంగిణి

మీ వికాస తరంగిణి
**మహిళా ఆరోగ్యవికాసం,**
Jet, Sitanagaram- 522501, Guntur Dt. A.P. India. Ph: 08645 272929

## శ్రీమతి జ్యోతి - గుణదల, విజయవాడ



నాకు గత మూడు మాసములుగా ఆరోగ్య పరంగ ఇబ్బందులు ఉన్నాయి. కాని, భయంచేత ఎక్కడా పరీక్ష చేయించుకోలేదు. నా స్నేహితురాలు శ్రీ చిన్నజీయరు స్వామివారి ఆశీస్సులతో వారి సంస్థ సేవావిభాగమైన వికాసతరంగిణి వారు 2008 సం॥నుండి క్యాన్సర్ క్యాంపులు నిర్వహిస్తున్నారని, ఆ క్యాంపులో మహిళలకు చాలా చక్కటి సూచనలతో ఆరోగ్య పరీక్షలు నిర్వహిస్తారని చెప్పింది.

ఆమె సూచనమేరకు 26.8.2012న వికాసతరంగిణి 'చైతన్యటీమ్' వారు గుణదలలో నిర్వహించిన క్యాన్సర్ క్యాంప్‌లో పరీక్ష చేయించు కున్నాను. గర్భసంచిలో 3 కణితలు ఉన్నాయని తెలిసింది. నాతోపాటు పరీక్షచేయించుకున్న కస్తూరి అనే మహిళ ఈ క్యాంపు ద్వారా వెంటనే స్పందించి మొదటి దశలో వ్యాధిని గుర్తించింది. ప్రస్తుతం గర్భసంచి తీసివేసి హాస్పిటల్లో చికిత్స పొందు తున్నది. ఈ క్యాంపువలన నాలాంటి చాలామంది స్త్రీలు ఆరోగ్య విషయంలో ఎలాంటి శ్రద్ధతీసుకోవాలి అనేది తెలిసింది. కారణం మొదటి దశలోనే వ్యాధినిర్ధారణ చేసి, వారు తగినసూచనలు ఇవ్వటం ఈ క్యాంపు మొదటి లక్ష్యం.

వికాసతరంగిణి కార్యకర్తలు నిర్వహించే "మహిళా ఆరోగ్య వికాస్ క్యాంపు"లో పాల్గొనటం వల్ల సహజంగా స్త్రీలకు వచ్చే శారీరక రుగ్మతలు గురించి తెలుసుకోగలిగాము. 35 సం॥ దాటిన ప్రతి మహిళా ప్రతి సంవత్సరం వ్యక్తిగతంగా చెకప్ చేయించుకోవాలని తెలుసుకున్నాను.

ముఖ్యంగా మహిళలు ఋతుకాలంలో వ్యక్తిగత శుభ్రత పాటించాలని ఈ క్యాంపుల ద్వారా మేము తెలుసుకున్నాను.

సాధారణంగా స్త్రీలకు వచ్చే వ్యాధులను తెలుసుకోవడానికి కేన్సర్ వంటి భయంకర వ్యాధులు కాకుండా సకాలంలో జాగ్రత్తలు తీసుకోవడానికి ఈ క్యాంపులు మాకెంతో ఉపకరించాయి. వైద్యులు, కార్యకర్తలు కూడా శ్రద్ధ, ఓపికతో మమ్మల్ని జాగ్రత్తం చేయటం మాకు ఎంతో ఆనందాన్ని ఇచ్చింది. ఇది నా అనుభవ పూర్వకరంగా తెలిసింది. ఇటువంటి ఆరోగ్యశిబిరం నిర్వహిస్తున్న శ్రీజీయర్‌స్వామివారి కార్యకర్తలకు శ్రీస్వామివారికి అనేక విధములుగ కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

### విభూషణం మౌనమపండితానామ్

విషయ జ్ఞానం లేనప్పుడు మౌనంగా ఉండడమే అలంకారం. నోరు విప్పితే మన అజ్ఞానం బయటపడుతుంది. తెలియని విషయాన్ని తెలియదని అంగీకరించడం, తెలిసినట్లు నటించ కుండా మౌనం వహించడం చాలా శ్రేయస్కరము. నీతిశతకం



చిత్రకథ-16

# రామానుజ చిత్రకథ


















వారి పరంపర లోకంలో అలాగే కొనసాగేట్టు చేస్తా!


3వ వేలు తెరుచుకుంది


ఓహో ఏమాశ్చర్యం


3 ప్రతిజ్ఞలూ గురువుగారు అంగీకరించారు.
నీకాశీశ్శులందించారు నాయనా!


రామానుజులు
సామాన్యుడుకాడు.
మహాత్ముడు.


అంతేకాదు. మన ఆచార్యులు యామునులు
మనకందించిన భవిష్యదాచార్యులు వీరే కాబోలు!!!


నమో నమో యామునాయ
యామునాయ నమోనమః ।
నమో నమో యామునాయ
యామునాయ నమోనమః ॥


యామునాచార్యులవారికి బృందావనం నిర్మించారు.


యామునుల బృందావనానికి పుష్పాలంకారం
చేసి, హారతులిచ్చారు.


రామానుజులు అక్కడినుండే వెనుతిరిగి కంచికి బయలుదేరారు.


రామానుజా!
ఇక శ్రీరంగనాథుణ్ణి దర్శించివద్దాం. రండి!


ఊహూ! నేను రాలేను.
శ్రీరంగనాథునికి దయలేదు.


ఇంత దూరంవచ్చి?
స్వామిదర్శనానికి రారా?
క్షమించండి.
రాలేను.


అపచారం! అపచారం! రంగడు
భక్తవత్సలుడు నాయనా!


హు! అంత దయే ఉంటే ఈ
ఆచార్యులని, కొద్దిలో, కనీసం
ఒక్కమాటైనా మాట్లాడనీయకుండా
దూరం చేసేవాడు కాదు గదా!
ఇంకాఉంది

# నేర్చుకుందామా! - 13

శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-విజయవాడ

సంస్కృతభాష అందమైన దేవభాష. ఆ భాషలో ఉన్న శ్లోకాలు మనస్సును ఆకర్షిస్తాయి. దివ్యానందాన్ని కల్గిస్తాయి. అటువంటి శ్లోకాల్లో ఈ క్రింది శ్లోకం ఒకటి. పిలుపు అనడానికి సంబోధన అంటారు. ఆ పిలుపులే విశేషణాలుగా మారి చక్కని అర్థాన్నిచ్చిన శ్లోకం.

శ్లో॥ **పద్మే! త్వన్నయనే స్మరామి సతతం భావో భవత్ కుంతలే**
**నీలే! ముహ్యతి కింకరోస్మి మహి తైః క్రీతోస్మి తే విభ్రమైః ।**
**ఇత్యుత్స్వప్నవచో నిశమ్య సరుషా నిర్భర్త్సితో రాధయా**
**సర్వం తత్ పరమేవ తత్ వ్యపదిశన్ క్రీడావిటః పాతు వః ॥**

శ్రీకృష్ణుడు ఒకసారి రాధతో కలిసి నిద్రిస్తున్నాడు. నిద్రలో పలవరింతలు. రాధ లేచి శ్రద్ధగా వింటోంది.

1. **పద్మే! త్వన్నయనే స్మరామి సతతమ్:** పద్మా! నీ కన్నుల అందం ఎప్పుడూ గుర్తుకు వస్తోంది.
2. **భావో భవత్ కుంతలే నీలే ముహ్యతి :** నీలే! నా ఆలోచన అంతా నీ ముంగురులలోనే మోహపడిపోయి చిక్కుకుంది.
3. **మహి! తే తైః విభ్రమైః క్రీతోస్మి:** మహి=భూదేవీ! నీ విలాసాలకి లొంగిపోయాను.

కృష్ణుడు శ్రీమన్నారాయణుడు కదా! పద్మా! అంటూ శ్రీదేవిని నీలే! అంటూ నీళాదేవిని; మహి! అంటూ భూదేవిని తన ముగ్గురు భార్యల్ని పిలుస్తూ... పలవరిస్తూ కలవరించాడు.

వింది రాధ. నా ప్రక్కన ఉండి ఎవరో పద్మట–నీలట–మహి..ట ఆ! ఎంత ధైర్యం నీకు అంటూ కృష్ణుని నిలదీసింది. అంతే! కథ అల్లేశాడు. అబ్బే! కలలో కూడా నిన్ను తప్ప ఇతరులని తలచను కదా! అన్నాడు. మరి అలా పిలిచావే అంది అవి పిలుపులు కాదు, పిచ్చిదానా! నిన్నే నీ అందాలనే అనుసంధిస్తున్నా. అవి విశేషణాలు సుమా! చూడు!

1. **త్వన్నయనే పద్మే స్మరామి:** నీ పద్మాల్లాంటి కళ్ళని తలుస్తున్నాను.
2. **భావః నీలే భవత్ కుంతలే :** నా మనస్సు నల్లని నీ జుట్టుమీదే!
3. **మహితైః తే విభ్రమైః** నీ గొప్ప విలాసాలకి లొంగిపోయాను. (మహి–తైః అని రెండు పదాలుకాదిప్పుడు) రాధా–నీ అందం తప్ప వేరే ఏమీ నామదిలో కూడా ఉండదుసుమా! అంటూ చెప్పేశాడు. అంతే... పరవశించి పోయింది రాధ. తనలో తానే నవ్వుకున్నాడు కొంటె కృష్ణుడు.



# కాలస్వరూపమే - పంచాంగము

శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ

సిద్ధాంత భాగము అంతయూ జగత్ స్వరూపం. కాలము భగవత్స్వరూపమే! ఇది శ్రీమన్నారాయణ స్వరూపముగా అభివర్ణించ బడినది. కాలముయొక్క సమగ్ర స్వరూపమును తెలిసికోవడం శ్రీమన్నారాయణ తత్త్వమును తెలిసికోవడమే అని పూర్వాచార్యులు అనుగ్రహించారు.

శ్రీమన్నారాయణుడు సృష్టిలో ఎలా ప్రవర్తించేదీ మనం తెలుసుకోగలమా? బ్రహ్మ తానే. లోక పితామహుడు ఆయనే! ఈ చరాచర సృష్టిని కావించువాడు ఈయనే!

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు వేదాంత వేద్యుడగు శ్రీమన్నారాయణుని సంకల్ప పురస్సరముగా చతుర్ముఖబ్రహ్మ ఉద్భవించి సృష్టికార్యమును నిర్వర్తిస్తూ ఉంటాడు. సృష్టిమొదలుకొని ఇప్పటికి ఆరుగురు బ్రహ్మలు గతించారు. 1వ బ్రహ్మ శ్రీమన్నారాయణుని మనస్సునుండి; 2వ బ్రహ్మ నేత్రములనుండి; 3వ బ్రహ్మ వాక్కునుండి; 4వ బ్రహ్మ కర్ణములనుండి; 5వ బ్రహ్మ నాసికనుండి; 6వ బ్రహ్మ అండజములనుండి అవతరించి సృష్టిని కొనసాగించారు. 7వ బ్రహ్మ నాభికమలమునుండి అవతరించి పద్మజుడుగా ఇప్పుడు సృష్టికార్యమును జరుపుచున్నాడు.

బ్రహ్మ కల్పము 2 భాగములు ఒకటి ఉదయకల్పము. (అనగా పగటికాలము) ఇది సృష్టి యొనర్చు సమయము. రెండవది క్షయకల్పము (అనగా రాత్రికాలము) ఇది ప్రళయాదుల ద్వారా సృష్టిని నశింపచేయు సమయము. ఈ రెండు కల్పములు కల్సి 864 కోట్ల సంవత్సరములగును. ఇది బ్రహ్మగారికి ఒకదినము. (అనగా ఒకపగలు, ఒకరాత్రి కాలమన్నమాట). స్వయంభువుయొక్క పరమాయుర్దాయమే బ్రహ్మమానం ప్రకారం (శత) వంద సంవత్సరములు. దీనికి 'పరాయువు' అని పేరు. దీనిలో సగం "పరార్థం". మొదటి యాబది సంవత్సరాలను "పూర్వపరార్థం". అని రెండవ యాబది సంవత్సరాలను "ద్వితీయ పరార్థం" అని వ్యవహరించడం ఆచారము. బ్రహ్మగా, సృష్టికర్తగా, శ్రీమన్నారాయణుని జీవనకాలప్రమాణం. దేవతల కాలమాన ప్రకారంఈ విధంగా మనకందించారు పూర్వాచార్యులు. ఈ కాలాన్ని మానవ కాలమానంతో పోల్చి చూసుకోవడానికి పురాణరత్నం మొదలు జ్యోతిషగ్రంథాలు ఈ విధంగా మనకు వివరించాయి.

**శ్లో॥ విపరాణాం పరాషష్ట్యా తత్షష్ట్యా వికలాస్మృతః ।**
**వికలానాం కలాషష్ట్యా తత్షష్ట్యా భాగ ఉచ్యతే ।**
**తత్త్రింశకా భవేద్రాశిః భగణో ద్వాదశైవతే ॥**

ఇక్కడ 1. సూక్ష్మమానము; 2. మధ్యమానము; 3. స్థూలమానము అని మూడు విధములు:

1. సూక్ష్మ మానము: అరవై విపరలు ఒకపర, అరవై పరలు. ఒకవికల, అరవై వికలలు ఒకకల అరవై కలలు ఒక భాగ ముప్పది భాగలు ఒకరాశి పన్నెండు రాశులు ఒకరాశి చక్రము.

*(సశేషం)*

## ముఖచిత్ర పరిచయము




దివ్య దీపావళి మహోత్సవానికి కారణమైన 'నరకాసురవధ' సత్యా శ్రీకృష్ణుల విజయ విహారాన్ని దర్శింపచేస్తున్న చిత్రమిది.

చిత్ర మధ్యభాగంలో నరకాసురుని పట్టణం ప్రాగ్జ్యోతిషపురం. దాని సంరక్షణభారం మురాసురునిది. నరకాసురుని పట్టణానికి భద్రతావలయాలు ఐదు రకాలుగా నిర్మించారు. అందులో పట్టణం చుట్టూ పెద్దపెద్దకొండలు - గిరిదుర్గాలు నిర్మించబడ్డాయి. ఇవి శత్రు దుర్భేద్యాలు. ఆ పర్వతాల చుట్టూ ఎన్నో రకములైన అస్త్రాలతో అభేద్యాలయిన దుర్గాలు - అస్త్రదుర్గాలు ఏర్పరచారు. ఇంక మూడవ స్థాయిలో విష సంభరితములైన జలాలతో అగడ్తలు నిర్మించారు. ఇవి జలదుర్గాలు. తరువాత భయంకరాగ్నిని నింపి అగ్నిదుర్గాలను ఏర్పాటుచేసారు. చివరిగా భయంకర విషతుల్యవాయువులను నింపారు. అవే అనిల దుర్గాలు.

సత్యభామా సహితుడై గరుడుని అధిష్ఠించి నరకాసురునెదిరింపవచ్చిన శ్రీకృష్ణుడు. కౌమోదకీ అనే పేరుగల గదతో గిరిదుర్గాన్ని భేదించాడు. శక్తివంతములయిన బాణాలతో శస్త్రదుర్గాలని మట్టుపెట్టాడు. సుదర్శన చక్రముతో జల, అగ్ని, వాయు దుర్గాలను భేదించి, నిర్వీర్యం చేశాడు.

శ్రీకృష్ణుడు తనను బంధించిన మురాసురుని పాశాలను నందక నామ ఖడ్గంతో ఛేదించాడు మురాసురుని. అతని పుత్రులను తునుమాడాడు. అప్పుడు నరకాసురుడు శ్రీకృష్ణుని ముందు నిలిచి యుద్ధంచేసాడు. సత్యభామ ప్రేరణతో చక్రాయుధంతో నరకుని సంహరించాడు శ్రీకృష్ణపరమాత్మ. ఆ ఆనందంతో అందరూ చేసుకున్న పండుగే దివ్యదీపావళి.

అమావాస్య చీకట్లను పారద్రోలి అద్భుత దీపకాంతుల వెలుగులతో లోకాన్ని కాంతిమయం చేసిన పండుగ ఇది. అధర్మాన్ని జయించి, ధర్మస్థాపనచేసిన వృత్తాంతము. నరకాసురుని వధించిన శ్రీకృష్ణుని దివ్యగాథ దీపావళిపండుగ!

# 6. పదకేళి -వంశీ

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | ■ | 5 | ■ |
| | ■ | 6 | | | ■ | | ■ |
| | ■ | 7 | | | ■ | 8 | 9 |
| 10 | | ■ | | ■ | 11 | | |
| | ■ | 12 | | | ■ | | ■ |
| ■ | 13 | | | ■ | 14 | ■ | 15 |
| 16 | | ■ | ■ | 17 | | | |
| ■ | 18 | | | ■ | ■ | ■ | |

## ఆధారములు

**అడ్డం:**

1. బదరీ ప్రయాణంలో మనతో కూడా వచ్చేనది (5)
6. అరిషడ్వర్గాలలో ఐదవది (3)
7. పరమ శివుడు చేసేపని (3)
8. రెండక్షరాల వానరం (2)
10. వికృతి చెందిన లక్ష్మి (2)
11. కవచకుండలాలతో పుట్టిన వీరుడు (3)
12. వైదిక ప్రక్రియలకి మూలం (3)
13. నాగములు (3)
16. అలజడి రెండక్షరాలలో (2)
17. యజ్ఞపురుషుడు దశరథునికి ఇచ్చినది. (4)
18. మూడురకాల నీరు చేరిన సముద్రం (3)

**నిలువు :**

2. పద్మంలో పుట్టిన లక్ష్మి (3)
3. కన్నయ్యని పెంచిన తండ్రి, తల్లి (6)
4. తడబడిన సంతోషం (3)
5. బదరీ క్షేత్రపాలకుడు (5)
9. తోకతెగిన పిడుగు (2)
12. వేపకే మరోపేరు (2)
13. త్రివిక్రముడు చాచినది..... నాల్గోవంతు (3)
14. చీలిన నదీభాగం (2)
15. వెన్నెల (3)

గత పదకేళి పూరణలో కలిగిన అసౌకర్యానికి చింతిస్తున్నాం!

## 5. పదకేళి - సమాధానములు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 వ | టు | 2 వు | | 3 అ | ష్టా | 4 క్ష | 5 రి |
| న | | టు | | వ | | 6 క | వి |
| 7 జ | న | క | 8 జ | | 9 ర | | |
| 10 భ | ర | | 11 రా | స | లీ | ల | లు |
| 12 వు | నా | డు | | | ము | | |
| 13 దు | రా | | 14 ము | 15 ర | | 16 గో | 17 దే |
| | 18 య | మ | ని | య | 19 మ | | వు |
| 20 ప్ర | ణ | తి | | 21 ము | నీ | శు | డు |

పదకేళిని పూరించి, భక్తినివేదన - సీతానగరం చిరునామాకి పంపించగలరు. 15వ తేదీలోపు అందినవాటిని మాత్రమే పరిశీలిస్తాం

## అక్టోబర్ నెల మెదడుకి మేత! సమాధానములు

1. బదరికాశ్రమము; 2. శివుడు; 3. దేవతలు,కనకాంగి; 4. ఉత్తరాయణం; 5. క్షరుడు; 6. ఈశ్వరాయ నివేదితము; 7. గజేంద్ర దాసులు; 8. రామానుజులు; 9. వేదిప్రాంతములో పెరుగును. 10. సత్యవ్రతుడు; 11. వ్యాసభగవానుడు; 12. పృథు చక్రవర్తి; 13. పాండ్యరాజు; 14. దేవేంద్రుడు; 15. కద్రువ సంతానమైన విషనాగులు; 16. సుగ్రీవుని మామగారు; 17. దక్షుడు; 18. చంద్రపుష్కరిణి; 19. కలి; 20. మేఘనాథుడు.

గీతామాహాత్మ్యకథలు - 16

# సరసుడు

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

సరసభేరి కథ మనకి కనువిప్పు కలిగిస్తుంది. ఇది గతమాసం కథ. మానవుడు ఎంతటి నయవంచకుడైనా, దుర్మార్గుడైనా శ్రద్ధతో భగవద్గీతలోని ఒక్కశ్లోకాన్ని శ్రవణం చేసినా తన మనసును ప్రక్షాళితం చేసుకోవచ్చునని ఈ సరసభేరి కథ నిరూపించింది.

మనసును ప్రక్షాళితం చేసుకొని పరిశుద్ధ మొనరించుకోవడం ఒక్కటే కాదు, మన పాపరాశిని దగ్ధం చేసి పుణ్యరాశిని పెంచే మహనీయగ్రంథం శ్రీమద్భగవద్గీత. మన అదృష్టం బాగుండి ఆ శ్లోకంతో తాదాత్మ్యమే పొందగలిగితే ఆ సరసభేరి లాగా మనం ఈ జీవితాన్ని ముగించుకుని మనసుని భగవంతుడి మీద లగ్నం చేసుకొని స్వర్గవాసం చేయడానికే వెళ్లవచ్చు. అది తపోలోకంలాంటి పుణ్యభూమియై మనకు ఈ లీలా విభూతి నుండి విముక్తి కూడా కలిగించవచ్చు. అందరూ భగవద్గీత చదవాలి, పారాయణ చెయ్యాలి.

ఇక మనం ఈ మాసం కథలోకి ప్రవేశిద్దాం. ఈ మాసం కథ సరసుడు అని చెప్పబడే భాగవతుడి కథ. నిత్య భగవద్గీతా పారాయణ శీలి కథ. ఆ పుణ్యాత్ముడిని తలచుకుంటేనే మనలను తరింప జేసుకుంటాం. అటువంటి మహాపండితుణ్ణి గురించి తెలుసుకోబోయేముందు మనం తెలుసుకోవలసింది.

ఈ కథ భగవద్గీతలోని 16వ అధ్యాయంయొక్క మహాత్మ్యాన్ని చెప్పే కథ అని. ఆ మహాత్మ్యాన్ని తెలుసుకునే ముందు ఈ పదహారో అధ్యాయం ఏమిటో అది చెప్పే విషయాలు ఏమిటో సంక్షిప్తంగా తెలుసుకుందాం.

భగవద్గీతలోని 16వ అధ్యాయం **దైవాసుర సంపద్విభాగ యోగము.** ఈ అధ్యాయంలో దైవీగుణాలు అసురగుణాలు ఎలా ఉంటాయో చెప్పబడ్డాయి. భగవంతుడు ఎంత స్పష్టంగా చెప్పినా మన మనస్సు సత్త్వ సమృద్ధి కలిగిన దైవీ గుణములయందు నిలవదు, రజస్తమోగుణ సమన్వితమైన అసుర గుణములను వదలదు.

**దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపద మాసురీమ్ ॥**

దంబము, దర్పము, క్రోధము, కాఠిన్యము, అజ్ఞానం అనే గుణాలు ఆసురీ ప్రకృతికి సంబంధించినవి.

ఇలా చెప్పిన ఆ పై లక్షణాలు లేకుండా మనముండగలమా! శాంత స్వభావము, చాడీలు చెప్పకపోవడం, తప్పుడు పనులయందు బిడియపడడం, శుచిత్వం, అసూయ లేకపోవడం, క్షమించడం వంటివి దైవీగుణాలని చెప్పబడింది. మరి ఈ లక్షణాలు మనం అలవరచుకోగలమా!

అంతేకాకుండా ఈ అధ్యాయంలో అసురగుణాలున్నవారు ఇలా అనుకుంటారట.

నాకిప్పుడింత ధనం ఉంది. ఇంకా ఎక్కువ ధనాన్ని సంపాదించగలను. ఈ శత్రువుని ఇప్పుడు నాశనం చేసాను. ఇంకా మిగిలిన శత్రువులను కూడా నాశనం చేస్తాను. నేను ఈ భోగాలన్నింటిని అనుభవిస్తాను. నేనే భాగ్యవంతులైన బంధువులతో కూడిన అత్యంత సంపన్నుడిని. నేను గొప్ప వంశంలో జన్మించాను. నాతో సమానమైన వారెవ్వరూ లేరు. నేను అన్ని ఆనందాలు అనుభవిస్తాను.

అసురగుణములతో నిండిన వారి మనస్సులో ఇలాంటి ఆలోచనా పరంపర సాగుతూ ఉంటుంది. నిజం ఆలోచిస్తే మన ఆలోచనలు కూడా ఇంచుమించుగా ఇలాగే ఉంటాయి. మనని చూసుకొని, మన వంశాన్ని చూసుకొని, ధనాన్ని, బంధువులను చూసుకొని గర్విస్తూ ఉంటాం. ఇవి అసురగుణాలని తెలిసినా మనలో మార్పురాదు. అలా మార్పు రావాలంటే పక్కవారి ప్రవర్తన చూసి మనం మన ఆచరణ ఏర్పరచుకోకూడదు. ఇలాంటి భావనలను వదలాలంటే ఆచార్యుల బోధనలను మనసులో ధరించి, ప్రయత్న పూర్వకంగా ఇలాంటి ఆలోచనలను దూరం చేసుకొని, దైవీగుణ సంపత్తిని అలవరుచుకోమని మనందరికి శ్రీ కృష్ణ భగవానుడు ఉద్బోస్తున్నాడన్నమాట. ఇక మనకి ఈ మాసం కథని పద్మపురాణం ఏలా చెప్తోందో చూద్దామా!

పూర్వం గుజరాతు అనే దేశంలో సౌరాష్ట్రమనే నగరం ఉండేది. ఆ దేశానికి రాజు ఖడ్గబాహుడు అతడు అవిక్రమ పరాక్రముడు. అయినా నిగర్వి. ఆతనికి తన రాజ్యంలో ఊరేగే

మదపుటేనుగు ఒకటుండేది. దాని పేరు అరిమర్దనం. ఆతడు యుద్ధాలకి వెళ్లేటప్పుడు కూడా ఈ మదగజం అతనితో పాటు యుద్ధాలలో పాల్గొనేది. దాని ఆలనా పాలనా చూడడానికి నలుగురు మావటి వాళ్లుండేవారు. దాని సేవ చెయ్యడానికి మరో నలుగురు పని వాళ్లుండేవారు. ఆ మదగజం వారితో చక్కగా సేవలు చేయించుకుంటూ సుఖంగా ఉండేది.

ఒకసారి దానికి ఎందుకో తిక్క పుట్టింది. ఏదో మత్తు దానిని ఆవహించింది. పిచ్చి పిచ్చిగా ప్రవర్తించడం మొదలుపెట్టింది. ఘీంకారాలు చేసింది. దాని అల్లరికి మావటివాళ్లందరు హడావిడిగా ఆయుధాలు అంకుశాలు పట్టుకొచ్చారు. దానిని లొంగదీయడానికి అనేక విధాల ప్రయత్నించినా అది వారికి లొంగి రాలేదు. రాజు కొందరు సైనికుల్ని పంపారు. వాళ్లు విసిరిన ఆయుధాలు తగిలి దాని కోపం తారాస్థాయికి చేరింది. గట్టిగా ఘీంకరించి సంకెళ్లు తెంపేసుకుంది. గజశాల, ఆశ్వశాలలకి ఉన్న స్తంభాలన్నీ కూల గొట్టేసింది. అక్కడినుండి సైనికుందరినీ చెల్లా చెదరు చేసేసి వీధిలోకి వచ్చేసింది. సైనికులందరూ భయపడిపోయారు. వీధిలో జనాలందరూ బిక్కచచ్చిపోయి ఇళ్లకున్న గోడలకు అతుక్కుపోయారు. యధేచ్ఛగా వీధుల్లో వేగంగా నడుస్తూ ఆ ఊళ్లో ఉన్న చెరువుకేసి వెళ్లిపోతుంది ఆ ఏనుగు.

ఈ వార్త రాజు దాకా పాకి ఖడ్గబాహుడు కూడా కృపాణధారియై ఏనుగును అదుపు చెయ్యడానికి వీధి వెంట పరుగెట్టసాగాడు. ఆ ఏనుగుని, దాని వెంట భయపడుతూ పరుగులు పెడుతున్న మావటి వాళ్లని, పని వాళ్లని, సైనికుల్ని చూసి ఆశ్చర్యపోయాడు. పశుబలమెంత గొప్పది. ఒక్క జంతువు ఎదురు తిరిగితే రాజ్యము, ప్రజలు అల్లకల్లోలమయిపోతోందే! అని విచారపడ్డాడు.

ఆ సమయంలో ఆ ఊరి చెరువులో సరసుడు అనే బ్రహ్మణుడు స్నానం చేసి బయటకు వస్తున్నాడు. అతనికి చెరువునుండి తన ఇంటికి వెళ్లేలోపుగా భగవద్గీతలోని 16వ అధ్యాయాన్ని ఆపకుండా పారాయణ చెయ్యడం ఒక అలవాటు. అలా భక్తితో పారాయణ మొదలు పెట్టాడు.

**అభయం సత్త్వ సంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥**

భయంలేకపోవడం, సత్త్వ గుణం నిండిన మనస్సు, జ్ఞానము, దానము, దమము, యజ్ఞము, వేదాధ్యయనము, నిజాయితి...... వంటి దైవీ గుణాలతో ఆరంభమైన ఆ పారాయణ చేసుకుంటూ చెరువులోనుండి బయటకు వచ్చాడు. అల్లంత దూరంలో ఆ మదపుటేనుగు తనకెదురుగా వస్తోంది. ఆ మావటివాళ్లు, సైనికులు ఊరి ప్రజలందరూ "తప్పుకోండి" "తప్పుకోండి" అని ఆ సరసుడనే బ్రాహ్మణుణ్ణి హెచ్చరించారు. కాని మనస్సు నిశ్చలంగా శ్రీకృష్ణుని మీదనే కేంద్రికరించి అలా 16వ అధ్యాయాన్ని చదువుతున్న సరసుడు భయపడలేదు, ఆ ఏనుగు ఈ మహానుభావుణ్ణి చూసి వేగం తగ్గించేసింది. బ్రాహ్మణుడు దగ్గరకువచ్చేసరికి అది పూర్తిగా ఆగిపోయింది.

సరసుడు ఆ పారాయణ చేస్తూనే ఆ ఏనుగును తన కుడి చేత్తో నిమిరాడు. అలా నిమరగా నిమరగా అంతటి అరిమర్దనం అనే మదపుటేనుగు పిచ్చిగా ప్రవర్తించడం మానివేసి మావటివాళ్లకు లొంగిపోయింది.

ఆ వింత చూసి ఆ ఊరి ప్రజలందరూ ఆ బ్రాహ్మణుని శక్తికి, తేజస్సుకి సాగిలపడి మొక్కారు. దూరం నుండి ఈ వింతను చూచిన ఖడ్గబాహుడు కూడా సరసుని వద్దకు చేరి నమస్కరించి "మహానుభావా! మీకింతటి శక్తి కలగడానికి గల కారణం ఏమిటి? ఈ మహాభయంకరమై, కాల సమానమైన ఏనుగును సమీపించడానికి మావటివాళ్లు, సైనికులే ధైర్యాన్ని కోల్పోయిన సమయంలో దానిని మీరెలా లొంగదీయ గలిగారు. మీరు చదివే మంత్రం ఏది? దయచేసి చెప్పగలరు" అని ప్రార్థించాడు.

**గీతాయా షోడశాధ్యాయ శ్లోకాన్ కతిపయా నహం ।**
**జపామి ప్రత్యహం భూప తేనైతా స్సర్వసిద్ధయః ॥**

"రాజా! నా దగ్గర అలాంటి దివ్యమంత్రాలేమీ లేవు. నేను ప్రతిదినం స్నానం చేసిన తరువాత ఇంటికి వెళ్లేలోపు శ్రీకృష్ణ భగవానుణ్ణి తలచుకుంటూ భగవద్గీతలోని 16వ అధ్యాయాన్ని పారాయణ చేస్తుంటాను. దానిని పఠించడం వలనే నాకీ శక్తి కలిగింది" అని చెప్పాడు సరసుడు.

ఆ మాటలకు అచ్చెరువొందిన రాజు, ఆ మహాపండితుడిని ఆస్థానానికి తీసుకొని వెళ్లి ఒక లక్ష సువర్ణ నాణెములను బహుకరించి ఇలా అన్నాడు. "స్వామీ! ఈ మహా విద్యను నాకు

కూడా ఉపదేశించండి” అని ప్రార్థించాడు. “అలాగే” అని సరసుడు మహారాజుకు కూడా భగవద్గీతలోని పదహారో అధ్యాయాన్ని చక్కగా నేర్పించాడు. రాజు ఆ శ్లోకాలను నేర్చుకొని చాల ఆనందించాడు. రోజు 16వ అధ్యాయాన్ని పారాయణ చెయ్యడం మొదలు పెట్టాడు.

కొంత కాలం తరువాత ఖడ్గబాహునికి ఆ మదపుటేనుగుని చూద్దామనిపించి దాని దగ్గరకు వెళ్లాడు. అది ఆ సమయంలో గడ్డి తింటోంది. దాని కట్లు విప్పేయమన్నాడు రాజు. “వద్దు మహారాజా! ఇది తిక్కది. దీని సంగతి మనకు తెలియదా!” అన్నారు మావటివాళ్లు. “పరవాలేదు విప్పండి” అన్నాడు రాజు. మావటివాళ్లు భయం భయంగా దాని కట్లు విప్పారు. ఏనుగు వేగంగా వెనక్కి తిరిగింది. ఖడ్గబాహుడు ఏమీ బెదరి పోలేదు. ధైర్యంగా వెళ్లాడు. దానిని నిమిరి మచ్చిక చేసాడు తనే స్వయంగా తాళ్లతో కట్టేసాడు. అప్పుడు తెలిసింది తనకి భగవద్గీత మహిమెంతో!!

తిన్నగా రాజస్థానానికి వెళ్లాడు తన కుమారుడు వీరబాహుని రాజు పట్టాభిషేకం చేసి తాను రాజ్య భారము, సంసార బంధము రెండింటి నుండి బయట పడ్డాడు. ఆ తరువాత ఏ చీకుచింతలేక భక్తితో 16వ అధ్యాయాన్ని పారాయణచేస్తూ చివరికి పరమ పదాన్ని పొందాడు.

ఈ విధంగా ఈ కథని శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవికి చెప్పాడని శంకరుడు పార్వతీదేవికి వినిపించాడు. “ఆహా! ఏమి ఈ భగవద్గీత మహిమ. దీనిని చదివిన వారి యొక్క శక్తిని జ్ఞానంలేని జంతువులు కూడా గుర్తించ గలుగుతున్నాయి” అని అచ్చెరువొందింది పార్వతీదేవి!. (సశేషం)

# స్త్రీలవ్యాధులు - తగినవైద్యము

డా॥ జి. రామారావు-9440884396

ఒక స్త్రీ కష్టనష్టములుగాని బాధ, సుఖము, సంతోషము మొదలగు వ్యక్తిగతమైన భావనలు ఆమెకు మాత్రమే తెలియును లేదా ఆ భగవంతుడొక్కడే చెప్పగలడు. హోమియో వైద్యులు మానసిక లక్షణముల ప్రాతిపదిక పై వైద్యము చేయుదురు కనుక, స్త్రీలకు ఆరోగ్య విషయములో తోడ్పడగలరు.

ఆడుతు, పాడుతు స్వేచ్ఛగ తిరుగుచున్న ఆడపిల్ల ఇంచు మించు 12వ సంవత్సరము వచ్చేసరికి యౌవ్వనములోకి ప్రవేశించును. అప్పుడామె రజస్వల అయి, జననేంద్రియములు సంతానోత్పత్తి చేయు స్థితికి వచ్చును.

ఆ వయస్సులో వున్న ఆడపిల్లల విషయములో తల్లి జాగ్రత్తగా గమనించు చుండవలెను. వారికి కొన్ని సంకేతములను, సమాచారమును ఇచ్చుచుండవలెను. జాగ్రత్తలు బోధించు చుండవలెను. తొలుత రజస్వల అయిన గంటలోపు గ్లాసు గంజిలో, అరబద్ద నిమ్మరసము, కొంచెము సామాన్య ఉప్పు కలిపి తాగించవలెను.

ప్రతిరోజు అదే సమయంలో, మూడు రోజులు ఇవ్వవలెను. కాళ్ళు తడవనీయరాదు. ప్రశాంతచిత్తము అవసరము. హై హీల్సు చెప్పులు వాడరాదు.

సూర్యచంద్రుల గమనంలో గర్భధారణ లెక్కలుండును. ఆరోగ్యవతి ఐన స్త్రీకి ఋతుకాలం ప్రతి 28 రోజులకే కలుగుతుంది. చంద్రుడు భూమి చుట్టూ తిరిగి వచ్చుటకు 28 దినములు పట్టును. భూమిపై చంద్ర సూర్యుల ప్రభావమున పూర్ణిమ, అమావాస్య మున్నగు తిథులుకల్గును. చంద్ర కిరణములు ప్రభావము వలన విత్తనములు, జల సంసర్గమున మొలకెత్తుట; గర్భధారణ, పిండోత్పత్తి, అభివృద్ధి కలుగును. మనసునకు చంద్రుడు అధిదేవతగా వేదములు చెప్పినవి.

రజస్వల అయిన పిల్లకు, పెద్దల అదుపాజ్ఞలు పెరుగుతాయి. వాళ్ళ స్వేచ్ఛకు సంకెళ్ళుపడతాయి. మొదట ఇబ్బంది పడినా నెలసరులకు ఆడపిల్లలు అలవాటు పడతారు.

సాధారణంగా ఋతుసమయం 3-5 రోజులుంటుంది. ఈసమయంలో 1-2ఔన్సుల వరకు రక్తం పోతుంది. ఋతుస్రావం తక్కువగానో, మందముగానో లేక ఆలస్యముగానో అయినప్పుడు కొందరు తెలివి తక్కువగా మందులు అధికముగా వాడి, ఆరోగ్యము పాడుచేసుకొందురు. కొందరు ఋతువు యొక్క తేదీలను తమకు అనుకూలముగ మార్చుటకు మందులు వాడుదురు. హార్మోనుల సమతూకము దెబ్బతిని, చివరకు హార్మోనులను స్వీకరింతురు. దీనివలన వారికి మేలు కన్నా కీడెక్కువ జరుగును.

ఆ స్థితిలో వారు సాత్వికాహారము తీసికొనుట, దేహపరిశ్రమ జేయుట, కాఫీ, టీలను మానివేయుట మొదలగు పనులు చేయవలెను. వస్త్రములు వాతావరణమును బట్టి వాడవలెను. పాదములను పొడిగా వుంచవలెను.

(Menorrhagia) ఋతుస్రావము అమితముగ, అత్యధికముగా స్రవించడానికి కారణములు; గర్భసంచిలో కణుతులు, కేన్సర్, హార్మోనులోపమయియుండును. వైద్యుని సంప్రదించుట తప్పనిసరి.

(Metrorrhagia) ఋతు సమయం కానప్పుడు గర్భకోశము నుండి రక్త స్రావము జరుగును. నెలసరి సమయంలో వచ్చే కడుపు నెప్పి భరించడం కష్టం. దీనికి అనేక కారణాలున్నాయి.

(Amenorrhagia) ఋతుస్రావము అగుపడకపోవుట లేక అణగారుట, గర్భధారణ వలనగాని, వ్యాధిచేగాని జరుగును. ముందుగా కారణం తెలుసుకోవాలి. రక్తహీనత ఉన్నప్పుడు నెలసరి రాకపోవచ్చు; హిస్టీరియాతత్వం, (Obesity) స్థూలకాయం, వంశానుగత లక్షణాలను పరిగణనలోకి తీసికోవాలి.

(Menopause) దీన్ని Climacteric Period, change of life అని అంటారు. స్త్రీకిముట్లు ఆగిపోవు వయస్సు 40-50 సంవత్సరముల మధ్య యుంటుంది. శరీరతత్వం, వంశానుగత లక్షణాలనుసరించి అది యుంటుంది. తదుపరి ఆమెకు సంతానము కలుగదు.

గర్భసంచి జారినపుడు చాలా ఇబ్బందులు కలుగుతాయి కనుక ఆపరేషన్ తప్పని సరి అగుతుంది.

గర్భసంచి ద్వారం వాపును సర్విక్స్‌వాపు అని అంటారు. దీనికి కారణములు ఇన్‌ఫెక్షన్, సుఖవ్యాధులు మొదలగునవి కనుక గైనకాలజిస్టును సంప్రదించాలి.

## USTILAGO MAYDIS

(corn-smut)

'యుస్టిలాగో' ఒక మొక్క వ్యాధిని మాత్రమే గాక దాని వంశానుగత లక్షణములను కూడా తెలుసుకొన గలుగుచున్నాము. కుక్క గొడుగుఎట్లు పెరుగునో అట్లే ధాన్యము పండు మొక్కలకు,

గింజలకు స్పాంజి వలె పెరుగు సూక్ష్మమగు ఫంగస్. మెక్సికోలో ఇది పేరెన్నికగన్నది. దీనిపై పెక్కు పరిశోధనలు జరిగినవి. విశేషమేమిటంటే ఇది. ధాన్యముకంటే విలువైనది. కనుక రైతులు ఫంగస్ పెంపుదలను కోరుకుంటారు.

యుస్టిలాగో (Yeast) ఒక రకమైన నురగవలె కనబడు పదార్థము. 850 రకములున్న ఈ ఫంగస్ మట్టిపై గాని, మొక్కలలోగాని కన్పించును. తీయని ధాన్యముపై ఇది ఎక్కువగా కన్పించును.

సూక్ష్మజీవుల ద్వారా వృద్ధి చెంది మొక్కలను, ధాన్యపు గింజలను వ్యాధి గ్రస్తము చేయు ఈ ఫంగస్ హోమియో వైద్యములో స్త్రీ జననేంద్రియ వ్యాధులపై అద్భుతముగా పనిచేయును.

గర్భాశయము బిగి కోల్పోవుట; వదులుగానుండుట; ముట్లుడుగు కాలములో రక్తాధిక్యతతో రక్తస్రావము జరుగును. మానసికశక్తులు కృంగిపోవును. ఋతుక్రమము తప్పుటచే, నరముల బలహీనత వలన తలనొప్పి, తలత్రిప్పు, కనుగ్రుడ్లు లాగుట, నీరుకారుట యుండును.

ఎర్రని ఋతుస్రావమధికము – అండాశయములలో మంట, వాపు నెప్పి యుండును. గర్భపతనము జరిగిన, ఋతుస్రావము నల్లని రక్తము కుదపలతో ప్రోగులవలె నుండును. వీపు భాగమున వేడి నీరున్నట్లు భావన.

నడుము నెప్పి, హస్త ప్రయోగకారణముగా శుక్రస్కలనము, జననేంద్రియములపై మనసు పెట్టుట వలన, కామసంబంధమైన కలల వలన శుక్ర నష్టము జరుగును. సోరియాసిస్, ఎగ్జిమా వంటి చర్మ వ్యాధులను కుదుర్చును.

మదర్ టించర్‌తోపాటు, 3x, 6c 30c, 200c పొటెన్సీలలో కూడా లక్షణములు సరి పోయినపుడు చక్కగా పనిచేయును.

*****

## 2. XANTHOXYLUM

zanthoxylum americanum, common prickly Ash, Toothache Tree Zanthoxylum armatum, winged prickly Ash తెలుగులో కొండకసిమి అనుపేర్లతో అనేక రకములున్న ఈ మొక్క Rutaceae (Citrus) కుటుంబమునకు చెంది స్కాట్‌లాండ్ దేశస్థుడైన ఫిలిప్ మిల్లర్ చేత 1768 లో Xanthoxylum అని పిలువబడింది. దీని ముదురు ఆకుపచ్చని ఆకులు (Aromatic) సుగంధ భరితమై యుంటాయి. పండ్లు మొదట ఎర్రగా వుండి తర్వాత ముదురు నీలము, ఆ తర్వాత నల్లగా మారుతాయి. పూలు పసుపు, ఆకుపచ్చ రేకులు కలిగియుంటాయి.

దీర్ఘకాలిక వ్యాధులు కీళ్ళజబ్బులు, చర్మవ్యాధులు, శీతలముచే చర్మముపై యేర్పడే బొబ్బలు (Chilblains) కాలి కండరములు దగ్గరకు ముడుచుకుపోవుట (Cramp) సిరలుబ్బి పుండ్లేర్పడినపుడు (Varicose Ulcers) ఈ ఔషధము ఉపయోగములోనున్నది. రక్త పోటు తక్కువగా యున్నపుడు, కీళ్ళ వాతము గలవారిలో ఉత్తేజము కల్గించి సక్రమము చేయుటకు తోడ్పడును.

అండాశయములలో నెప్పి, ఋతుస్రావము ఆలస్యము గాను, తక్కువగాను యుండును. సయమమునకు ఎనిమిది రోజులు ముందే ఋతువు కనబడును కుడి అండాశయములో నెప్పి, తుంటిలోనికి, తర్వాత పిరుదలలోనికి, వీపులోనికి ప్రయాణించును. నరముల బలహీనత, మానసిక నిస్త్రాణ, ఆస్తిమితముగా ఉండి బాధాకరమైన ఋతుస్రావములో పీసెస్ పడుచున్న వారికిది మంచి ఔషధము.

అజీర్ణము, నిద్రలేమి, తెల్లబట్ట, తల వెనుక భాగమున నొప్పి, ఎడమవైపు పక్షవాతము, సయాటికా కరంటు షాకు వలె నెప్పులు, రాత్రింబవళ్ళు పొడిదగ్గు, దీర్ఘముగా ఊపిరి పీల్చుకో వలెనన్న కోరిక, మొదలగు బాధలను నిలువరించు శక్తి గలది ఔషధము.

మదర్ టించర్ 5 చుక్కలు 1/4 కప్పు నీటితో మూడుపూటలా ఇవ్వదగును.




# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

ప్రపంచం సత్యం, నిత్యం కూడాను. ప్రాణికోటి కూడా నిత్యమే. పరమాత్మా నిత్యుడే. జగత్తూ, చేతనులూ, ఈశ్వరుడు అనే ఈ మూడే తత్త్వాలు. జగత్తు, ప్రాణులు అస్వతంత్రాలు. ఈశ్వరుడు స్వతంత్రుడు. జీవులు, జగత్తు ఈశ్వరునికి చెందినవి. ఆయన స్వామి. ఇవన్నీ ఆయన సొత్తు. కారణం లేకుండా కార్యమంటూ ఉండదు. కనుక కనిపించే ఈ సృష్టికంతకీ కారణమొకటుండాలి. ఆ కారణాన్నే 'సత్' అని, 'పరమాత్మ' అనీ, 'పరంబ్రహ్మ' అనీ ఉపనిషత్తు చెపుతున్నాయి. ఈ పరమాత్మ శ్రీమన్నారాయణుడే అని కూడా ఉపనిషత్తులు పేర్కొంటున్నాయి.

ప్రకృతి, జీవులు పరమాత్మకు శరీరం. ఆయన శరీరి. భగవదాత్మకం కాని వస్తువంటూ సృష్టిలో ఏదీ లేదు. కారణ రూపంగా సూక్ష్మ అవస్థలో ఉన్న పరమాత్మ కార్యరూపంగా రూపొందుతాడు. ఇది స్థూలావస్థ. కారణరూపంలోనూ కార్యరూపంలోనూ కూడా పరమాత్మ చిదచిత్తులతో కూడుకొనే ఉంటాడు. అందుకనే ఆయన్ను విశిష్టుడు, కూడుకొన్నవాడు అంటారు. సూక్ష్మ చిత్ అచిత్ విశిష్టుడైన పరమాత్మ కార్యరూపుడు. కారణుడు స్థూల, చిత్ అచిత్ విశుష్టుడైన పరమాత్మ ఈ ఇద్దరూ ఇద్దరు కాదు. ఒక్కరే. అయితే చిదచిత్తులతో విశిష్టుడుగా అంటే, కూడుకున్నవాడుగా ఉండేవాడు. ఇట్లాంటి విశిష్ట (బ్రహ్మలకు) అద్వైతం (రెండుగా కాక ఒకటిగా ఉండటం) విశిష్టాద్వైతం.

ఇట్లా విశిష్టాద్వైత తత్త్వాన్ని నిరూపించి, దాన్ని సూటిగా వినేవారి హృదయాల్లో నాటుకునేందుకు స్పష్టంగా ఉపనిషత్తు ప్రతిపాదించిన విధానాన్ని కూడా ఆయన సభకు ఎరుకపరిచేరు.

రాజా! ఉపనిషత్తు బోధించిన ప్రకారం మొదట నారాయణుడొక్కడే ఉన్నాడు. బ్రహ్మలేదు. మహేశుడు లేడు. రోదసి లేదు. సూర్యుడు లేడు. చంద్రుడు లేడు. నక్షత్రాలు లేవు, నీళ్ళు లేవు. అగ్ని లేదు. అల్లాంటప్పుడు ఒంటరిగా ఉండే వినోదం లేదని అనేకంగా అవుదామని చిదచిత్తులు రెండిటా ప్రవేశించి అనేకంగా అయినాడు.

అల్లాగే ఉపనిషత్తులలో అంతరాదిత్య విద్య అని ఓ విద్య ఉంది. అందులో సూర్యునిలో పుండరీకాక్షుడున్నాడు అని ఉంది. అతడే పరమాత్మ. అతణ్ణి ఉపాసించాలని చెపుతోంది ఆ బ్రహ్మవిద్య. అందులో ఉన్న పుండరీకాక్షుడు రెండుకన్నులు కలవాడట. దీనివల్ల మూడుకనులవారు, ఎనిమిది కనులవారు వేయికనులవారు – ఎవరూ పరమాత్మ కారు. వికసించిన తామరల్లాంటి రెండుకనులు కల శ్రీమన్నారాయణుడే పరమాత్మ అని ఆయనే మోక్షార్థులకు ఉపాస్యుడనీ తెలుస్తోంది. ఈ శ్రీమన్నారాయణుడు లోనా వెలుపలా తానే వ్యాపించి ఉన్నాడనీ వేదం చెపుతోంది. శబ్దాలన్నీ నారాయణుణ్ణే చెపుతాయి. ప్రతిశబ్దం ఒక శరీరాన్ని ధరించిన వ్యక్తిని ఆ వ్యక్తికి అంతర్యామిగా ఉన్న పరమాత్మనూ కూడా బోధిస్తుంది. 'స ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యోదేవ ఏకో నారాయణః' అన్న శ్రుతి నారాయణునికంటే మరో పరదైవం లేదని నిరూపిస్తోంది.

విష్ణువునకు ఆయా కాలాల్లో శరీరాలైన బ్రహ్మరుద్రాదులను సేవించడం ధర్మార్థకామాలకు పరిమితమైనవారికి చెల్లుతుంది కానీ, మోక్షం కోరుకునేవారు వీరిని కాక విష్ణువునే సేవించాలి. బ్రహ్మాదులు పరిమిత ఫలాలను ఇచ్చేవారు. శ్రీమన్నారాయణుడు అనంతఫలదాత.

అంతేకాదు, శ్రీమన్నారాయణునికి జీవుడికీ ఉన్న సంబంధం తెచ్చిపెట్టుకుంటే వచ్చింది కాదు. పొమ్మంటే పోయేదీ కాదు. 'మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృత్ గతిః నారాయణః' తల్లి, తండ్రి, సోదరుడు, నివాసం, రక్షకుడు మిత్రుడు, పొందవలసినవాడు అంతా నారాయణుడే అని వేదమే చెపుతోంది.

అట్లాంటి పరమేశ్వరుణ్ణి దర్శించడానికి తగిన యోగాన్ని నీకు చెపుతాను. ఖాండిక్య, కేశిధ్వజ సంవాదమని విష్ణుపురాణంలో ఓ ఉపాఖ్యానముంది. అది విను, అని విష్ణుచిత్తులవారు మత్స్యధ్వజ మహారాజుకు ఆ ఉపాఖ్యానం చెప్పడం ప్రారంభించారు.

నిమి వంశంలోని రాజులందరికీ సాధారణంగా జనకులని వ్యవహారం. ఆ వంశంలో ధర్మధ్వజుడని ఓ రాజు. అతనికి

మితధ్వజుడు, కృతధ్వజుడు అని ఇద్దరు కొడుకులు. మితధ్వజుడి కొడుకు ఖాండిక్యుడు. కృతధ్వజుడి కొడుకు కేశిధ్వజుడూను. ఖాండిక్యుడు కర్మనిష్ఠుడు, కేశిధ్వజుడు తత్త్వవేత్తాను.

ఈ ఖాండిక్య కేశిధ్వజులకు ఒకరి పొడ ఒకరికి గిట్టదు. వాణ్ణి జయించాలని వీడు, వీణ్ణి జయించాలని వాడు యుద్ధాలు చేస్తూనే ఉన్నారు. హోరాహోరీగా వారు పోరాడుతూ ఉంటే ఇరువురి రాజ్యాలలో ప్రజలు హడలిపోయేవారు. ఎడతెరపి లేకుండా ఆ పోరు సాగుతూనే ఉంది.

ఇక్షుమతి అని వారి రాజ్యాల సరిహద్దుల్లో ఓ నది ఉంది. ఆ నదికి అవతలి ఒడ్డున ఒకరు, ఇవతలి ఒడ్డున ఒకరు సైన్యాలతో విడిసేరు. ఆ నది హద్దు ఉభయసైన్యాలకూను. దీనివల్ల రాజ్యాలలో ప్రజలు కాస్త ఊపిరి పీల్చుకున్నారు.

రోజూ తెల్లారగానే శిబిరాల్లోంచి ఇవతలకి రావడం, పోరాట్టం. సాయంకాలం కాగానే శిబిరాల్లో విశ్రాంతి. మళ్ళీ మర్నాడు పొద్దున్నే పోరు. ఇల్లా కొన్నాళ్ళు సాగింది. చివరకి కేశిధ్వజుడి సైన్యాల ధాకకు ఖాండిక్యుడు, అతని సైన్యం పిక్కబలం చూపించక తప్పలేదు.

యుద్ధంలోంచి పారిపోయిన ఖాండిక్యుడు మంత్రులలో ఆచార్యులతో భటులతో కలిసి అడవులు పట్టిపోయేడు. అడవిలో వలస ఏర్పరుచుకుని దానిచుట్టూ వెలుగునాటించి మధ్యలో ఆకులగుడిసెలు వేసుకుని వాటిలో ఉంటున్నాడు. కొండకొనలపై కొందర్ని వేగులుగా పెట్టుకున్నాడు, ఏవైనా శత్రువుల జాడలు పొడగడితే ఆవార్త అంచెలంచెలుగా తనకు తెలపడానికి.

ఇక్కడ కేశిధ్వజుడు ఖాండిక్యుని రాజ్యాన్ని కూడా కలుపుకుని పరిపాలించుకుంటున్నాడు. ఇతడు మంచి జ్ఞాని. ఫలాకాంక్ష లేకుండా కర్మలను ఆచరించి బ్రహ్మప్రాప్తి ప్రతిబంధకాలను తొలగించుకుని బ్రహ్మజ్ఞానంచేత అమృతత్వాన్ని పొందుదామని యజ్ఞాలు చేయడం ప్రారంభించేడు. ఇట్లా ఎన్నో యజ్ఞాలు చేసేడు. చేస్తూన్నాడు. కాలం గడుస్తోంది. మళ్ళీ ఒక యజ్ఞానికి దీక్ష ప్రారంభించేడు. ఆ యజ్ఞకోసం ఒక ఆవును తెచ్చేరు. అది యజ్ఞశాల దగ్గరగా ఉన్న ఏటిఒడ్డున గడ్డిమేస్తోంది. ఆ ఏటి ఒడ్డున పొదలు దట్టంగా ఉన్నాయి. గడ్డిమేస్తూ అలా ఓ పొద దగ్గరికి వచ్చింది ఆవు. ఇంతలో ఆ పొద పక్కన ఓ పులితోక కనపడింది. ఆడతాచులా కదులుతున్న ఆ తోకను చూడడ మేమిటి, అంభా అని ప్రాణభయంతో అరుస్తూ మెడలలో గంట కదిలి మోగుతూండగా పరుగుతీసింది. ఈ అరుపు, ఆగంట చప్పుడు విన్న పులి ఇటు తిరిగింది. పరుగెడుతున్న ఆవు కంటపడింది. ఇంకేముంది, పిడుగులా మీదపడింది.

పులి మీదపడగానే దాని నోటి గబ్బు ఆవుకు రోత అనిపించింది. దాని నోటిమీది ఈగెలు తన మొహాన ముసురుకోవడంతో ఊపిరాడ్డం మానేసింది. పులి అదటునమీదపడడంతో ఆవు చెట్ల బోదెలమీద పడిపోయింది. ఆ పాటుకు చెట్ల ఆకురాలి మీదపడుతున్నై. పులి పెట్టిన బొబ్బకు ఆవును మేపునకు తోలుకొచ్చిన గోపాలకుడు చెవులు దిబ్బవేసి మూర్ఛపోయాడు. పులి ఆవు గొంతు పట్టుకుంది. మెడ వెనక్కు వాల్చేసి ఆవు కాస్తా నేల కూలిపోయింది.

తన ఒంటికి ఆవు కొమ్ములు కాని, గిట్టలు గాని తగలకుండా ఉపాయంగా దాని ఒంటిని తిప్పుతూ తోకతో చరుస్తూ నెత్తురు తాగుతూనే నేర్పుగా యజ్ఞధేనువును గుహవైపు ఈడ్చుకుపోతోంది పులి.

ఆవు అరుపులు, పులి బొబ్బలు విని దగ్గర్లో పొలాల్లో ఉన్న పొలంకాపరులు చేరి కేకలు పెట్టసాగేరు. నదిలో అనుష్ఠానానికి వచ్చిన బ్రాహ్మణులు ఆచమించి ఈ బొబ్బలు విని పోతున్న పులిని చూడగానే చెట్లకొనలకు చేరి చప్పట్లు కొట్టి అదలించాలని చూసేరు. రౌతులు గుఱ్ఱాలను దౌడుతీయించేరు, తరిమి విడిపిద్దామని. ఇంత హడావిడి జరిగేటప్పటికి మెడకొరికిన ఆవును వదిలేసి పెదవులకొనలు నాక్కుంటూ గుటగుటమంటూ వీలైతే మళ్ళీ ఆవును ఈడ్చుకు పోవచ్చునేమో అని మాటిమాటికీ వెనక్కు చూస్తూ చెట్లతోపుల్లోకి దూరి పులి మరుగైపోయింది.

పులి వదిలిన ఆవు చురుకు చురుకుమంటూ నెత్తురు ఒంటిమీంచి ఉబికిపారుతూంటే అట్టా పడిఉంది. చప్పుడు చేస్తే మెడగాయంనించే ఊపిరి వస్తోంది. మిడిగుడ్ల పడి వణికిపోతోంది.

ఇల్లా దీక్షతో ఉన్న ఆవు పులివాతపడి మరణించిందని రాజుకు వార్త చేరింది. అయితే, దీనికి ప్రాయశ్చిత్తం ఏమిటని ఋత్విజులను అడిగేడు రాజు.

(సశేషం)

శ్రీ రామచంద్రాచార్య



# పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు ది 30.09.12వ తేదీ చాతుర్మాస్యదీక్షను విరమించారు. ఆ రోజే బయలుదేరి ఢిల్లీ వేంచేశారు. వ్రజ్ ఫౌండేషన్ వ్యవస్థాపకులు, ప్రఖ్యాత జర్నలిస్టు శ్రీమాన్ వినీత్ నారాయణ చేపట్టిన 'సంకర్షణ్‌కుండ్' జీర్ణోద్ధరణకి శంకుస్థాపన చేయడానికి బృందావనం చేరడం లక్ష్యంగా సాగిందీ ప్రయాణం. శ్రీమాన్ వినీత్ నారాయణ అత్యంత భక్తిశ్రద్ధలతో శ్రీస్వామివారికి స్వాగతం పలికారు. భక్తబృందానికంతటికి ఛప్పన్‌భోగ్, 56 రకముల భోగ్య పదార్థములతో ప్రత్యేక విందు ఏర్పాటు చేయించారు. బృందావనంలో గిరిప్రదక్షిణ వైభవం వర్ణనాతీతం. మరునాడు నయనానందకరంగా శోభాయాత్ర సాగింది బృందావనంలో. అల్వర్‌నుండి కోసలేంద్ర ప్రపన్న ఫలహారీ స్వామివారు వేంచేశారు. అలనాటి గోపస్త్రీలను తలపిస్తూ స్త్రీలంతా తలలపైన అందంగా అలంకరించిన కుండలను ధరించి శ్రీకృష్ణనామస్మరణ గావిస్తూ సాగిన శోభాయాత్ర భక్తులకు ఆనందపారవశ్యాన్ని కల్గించిందన్నమాట అతిశయోక్తికాదు.

సంకర్షణకుండ జీర్ణోద్ధరణకి వ్రజ్ ఫౌండేషన్‌కి శ్రీస్వామివారి కరకమలములద్వారా శ్రీమాన్ డా॥ జె.రామేశ్వరరావు కోటిరూపాయలు సమర్పించారు.

సాయంత్రం శ్రీ పెద్దజీయర్ స్వామివారు బృందావనంలో నెలకొల్పిన శ్రీరామనామ స్థానాన్ని సేవించుకొని వైకుంఠనాథాలయం, శ్రీరంగనాథాలయాలను సేవించుకున్నారు. ఆ చీకట్లో మన స్వామివారు భజనచేస్తూ సాగిన దృశ్యం, భక్తకోటి పొందిన అమందానందం వెలుగులాగా మారి బృందావనాన్ని మెరిపించింది. సేవాకుంజ్ వైభవం అనుభవైక వేద్యం. మహారాసలీల జరిగిన పవిత్ర ప్రదేశమది. రాసలీలలో అలసిన రాధకి శ్రీకృష్ణుడే స్వయంగా సేవలందించిన ప్రణయకుంజమది. రాధాకృష్ణుల ఆనందానుభవానికి నిదర్శనాలు కనిపించే దివ్యధామమది. ఆ మట్టిని తాకితే చాలు జన్మధన్యమే అని మానవులే కాదు చెట్లుకూడా తమ ఆకులను భూమి స్పర్శకోసం కిందికే వాల్చి ఉంచే అద్భుతదృశ్యం కూడా అబ్బురపరుస్తుంది. బృందావనయాత్ర ఆనందయాత్రగ 1వ తేది రాత్రిదాకా సాగింది.

అక్కడినుండి రాజస్థాన్, అల్వర్‌లోని ఫలహారీస్వామి ఆహ్వానం మేరకు వారి మధుసూదనసేవా ఆశ్రమానికి వేంచేశారు మన స్వామివారు పరివారంతో.

2వ తేది ఉదయం అక్కడ ప్రవచనాలు సాగాయి. శ్రీచిన్నజీయర్‌స్వామివారి ప్రేరణతో ఫలహారీ స్వామివారు చతుర్వేద పాఠశాలను నడిపిస్తున్నారు. సుమారు ఇక్కడకూడా 100మంది విద్యార్థులు 4వేదశాఖలను అధ్యయనం చేస్తున్నారు. ప్రభుత్వ సహాయంకూడా విద్యాలయానికి అందుతూండడం వల్ల చక్కగ వేదప్రచారాన్ని, వైష్ణవధర్మాన్నీ ఆప్రాంతంలో వీరు విరివిగ ప్రచారం చేస్తున్నారు.

మధ్యాహ్నం ఫరీదాబాదులో నెలకొన్న శ్రీజగద్గురు సుదర్శనాచార్య స్వామివారి ఆశ్రమాన్ని సందర్శించారు స్వామివారు. అక్కడ నెలకొన్న శ్రీరాధాకృష్ణ మందిరం అత్యద్భుతం. గజరాజుల స్వాగత దృశ్యాలతో అలరించే ఈ నిర్మాణం మొత్తం పాలరాతితో కూడి ఉండడం వెనుక ఒక భక్తి భావానికి నీరాజనం పట్టిన కథ తెలుస్తోంది. లౌకికమైన ప్రేమకే విలువనిచ్చిన పాలరాతి కట్టడాలు చరిత్రలో చోటు చేసికొంటే మనకెంతో ఉపకారం చేసిన ఆ భగవంతునికి, మనకోసం సామాన్య మానవునిగా పుట్టిన ఆ శ్రీకృష్ణపరమాత్మకి ఒక్క చలువరాతి మందిరం నిర్మించలేమా అనే తపనతో, ఆర్తితో, భక్తితో నిర్మించిన శ్రీకృష్ణమందిరమది. మందిరంలో చుట్టూ పరివార దేవతలు, చాల అందమైన భాష్యకారుల విగ్రహం, ఎన్నో చిత్రాలు, శ్రీలక్ష్మీ నృసింహస్వామి అద్భుత విగ్రహం, ఆశ్రమ వ్యవస్థాపకులైన శ్రీసుదర్శనాచార్యులవారి విగ్రహం. ఇలా ఎంత మనోహరంగా ఉందో ఆ మందిరం. శిఖరాలు బంగారుమయంగా మెరిసిపోతూ కన్నులవిందు చేస్తున్నాయి. వారి కుమారులైన శ్రీపురుషోత్తమాచార్య స్వామి వర్తమాన పీఠాధిపతిగ ఆ ఆశ్రమాన్ని నిర్వహిస్తున్నారు. అక్కడకూడ ఒక వేదవిద్యాలయాన్ని నిర్వహిస్తున్నారు వారు. అందులో సుమారు 50మంది విద్యార్థులు వైదికవిద్యలను అధికరిస్తున్నారు. శ్రీ జీయర్‌స్వామివారు వారికందరికీ మంగళాశాసనాలు చేసారు.

ఆ రాత్రికి ఢిల్లీ శ్రీనివాస్ గారింట్లో వారి జన్మదిన సందర్భంగా మంగళాశాసనములందించి హృషీకేశ్ చేరుకున్నారు.

**నిత్య సుందరకాండ పారాయణ - కోటి అష్టాక్షరీ హవన కార్యక్రమాలు**

హృషీకేశ్ : శ్రీశ్రీశ్రీ స్వామివారు 3.10.12 తెల్లవారు జామున 3.30గం॥లకు విచ్చేసారు.

నిత్య సుందరకాండపారాణ వైకుంతరాముని సన్నిధిలో 15.5.12 హనుమజ్జయంతి రోజున శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు, ఉ.వే.శ్రీమాన్ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యస్వామివార్ల ప్రత్యక్షపర్యవేక్షణలో (వైకుంత రామాలయ ప్రథమ బ్రహ్మోత్సవముల సందర్భములో) నిత్య సుందరకాండ పారాయణ ప్రారంభమైంది.

పరాశర సంహితానుసారము, సప్తసర్గ విధానముతో రోజుకు 7 సర్గల చప్పున, తొమ్మిదిన్నర రోజులకొక ఆవృత్తి, ఆవిధముగ 7 ఆవృత్తులు, 68 రోజులలో పూర్తి అగును. అది ఒక మహా ఆవృత్తి. ఆవిధంగా 136 రోజులలో రెండు మహా ఆవృత్తులు పూర్తి కాగానే శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారు మహాపూర్ణాహుతికి వేంచేసారు. లోకకళ్యాణార్థము, సర్వగ్రహ దోషనివారణార్థం సంకల్పించిన ఈ వైదిక ప్రక్రియ స్వామివారి రాకతో సుసంపన్నమైనది.

అదేవిధంగ బదరికాశ్రమంలోని అష్టాక్షరీక్షేత్రంలో 29.4.12న (జ్యోతిర్దర్శన పర్వదినాన) కోటి అష్టాక్షరీ జపము ప్రారంభమైది. ఏ ఒక్కరోజూ నిలుపులేకుండా జరిగిన జపానికి దశాంశముగ ఒక కోటి అష్టాక్షరీ మంత్ర హవనం జరపడానికి శ్రీస్వామివారు ఆజ్ఞ ఇచ్చారు. BAKASS అధ్యక్షులు శ్రీమాన్ డా॥రామనాథంగారు, తమ కమిటీ సభ్యులందరి సహకారంతో చక్కటి ఏర్పాటు చేసారు. సెప్టెంబరు 25వ తేదీ సాయంకాలం కోటి హవనక్రతు అంకురార్పణ జరిపించారు. అది 12దినాలు 26తేదీ నుండి 7.10.12 వరకు కొనసాగింది. నిరాటంకముగా కొనసాగిన హవనము మహాపూర్ణాహుతితో సుసంపన్న మయినది.

ద్వాదశాహ్నిక, పంచకుండాత్మక అష్టాక్షరీక్రతువు ఆఖరి 12 రోజులు శ్రీమాన్ ముదుంబై మధుసూదనాచార్యస్వామి నిర్వహణలో జరిగింది. అష్టాక్షరీ నిత్యహవనం 12 రోజులు 5 కుండాలలో ఉదయం 6గం॥ నుండి మధ్యాహ్నం గం॥ 3.00వరకు 50మంది వేదాగమాధ్యాపకులతో ప్రతిరోజూ 9లక్షల 60వేలు జరిగింది. కోటికి పైగా హవనకార్యక్రమం జరిగింది. పూర్ణాహుతి శ్రీస్వామివారి పర్యవేక్షణలో జరిగింది.

478మంది ముందుగా రిజర్వేషన్ చేయించుకున్నా, కార్యక్రమమునకు మాత్రము భక్తి అతిశయంచి 3000మందికి పైగా తరలి వచ్చినందున వసతి, ఏర్పాట్ల విషయంలో కొంచెం ఇబ్బంది కల్గినా BAKASS కమిటి వారు అందరికీ వసతి, తదీయారాధన ఏర్పాట్లు శ్రద్ధగ చేయగలిగారు.

డా॥ రామనాథం గార్కి పూర్తి సహకారారం అందించిన శ్రీమాన్ వేణుగోపాలాచార్యులు, శ్రీమాన్ మధుసూదనాచార్యులు, శ్రీమాన్ రాజగోపాలాచార్యులు, కమిటీనుండి శ్రీమాన్ చీకోటి వేంకటేశ్వరరావుగారు, (సెక్రటరీ) శ్రీమాన్ మోహన్‌రావుగారు, ఇంజనీర్ శ్రీమాన్ రవి, శ్రీమాన్ వి.వి. రామారావుగారు, శ్రీమతి అరుణగారు, శ్రీమాన్ శిరికొండ ప్రభాకర్‌రావుగారు, శ్రీమాన్ వేణుగోపాల్‌గారు, శ్రీమాన్ వెంకటేశంగారు, ద్రవ్యసేకరణ లోనూ, ఆర్థిక వనరులు సమకూర్చడంలోనూ ఎంతో కృషిచేసిరి. చెన్నై నుండి శ్రీమాన్ చలపతిగారు, దీక్షావస్త్రాలు, బ్యాగ్స్, ఇచ్చి సహకరించిరి. శ్రీమాన్ రఘునాథ్‌గారు, శ్రీమాన్ బద్రినాథ్‌గారు తదియారాధన, రవాణా సౌకర్యములలో సహకరించారు.

జీయర్‌మఠం కేర్‌టేకర్ శ్రీమాన్ గోపాల్ కిషన్‌రావు, తళిహస్వామి కృష్ణ, అర్చకస్వామి హరికృష్ణస్వామి, అదేవిధంగ బదరీనాథ్‌లో కేర్‌టేకర్ శ్రీమాన్ కృష్ణారావు, శ్రీధర్‌గార్లు, తళిహస్వాములు త్రిపాఠి, రాంచందర్, అర్చకస్వామి కూర్మాచార్యులు కార్యక్రమం విజయవంతం కావడానికి ముఖ్యపాత్రులయ్యారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు, అండదండలూ ఉండడం వల్లనే ఈవిధమైన వైదికకార్యాలు సుసంపన్న మవు తున్నాయి అని ''బాకాస్'' కమిటీవారి, ముఖ్యంగ డా॥ రామనాథంగారి దృఢ విశ్వాసం.

**గమనిక**

వివిధ దోషాలతో బాధపడే భక్తులు అందించిన గోత్ర, నామ, నక్షత్ర వివరములు సుందరకాండ పారాయణ, అష్టాక్షరీ హవన సమయాల్లో విన్నవించి, పూజలు జరిపినట్లు, వారందరికీ ప్రసాదం పంపిస్తున్నట్లు డా॥ రామనాథంగారు తెలిపారు.

ఈ కార్యక్రమాన్ని అభినందిస్తూ, ఆధ్యాత్మికానందమును వ్యక్తపరచిన భగవద్బంధువులందరికీ శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళా శాసనములను అందించి, 8వ తేదీ ఆరాధనానంతరం తిరుగు ప్రయాణం జరిపారు.

శ్రీస్వామివారు పాండుకేశ్వరం దగ్గర మన పెద్దజీయర్ స్వామివారు నిర్మించిన శ్రీరామనామస్థూపం, నారాయణా శ్రమంతో పాటు భగవద్రామానుజుల సన్నిధిని కూడా సేవించారు. న్యాయవేదాన్త విద్వాన్ శ్రీమాన్ టి.కె. గోపాలాచార్య స్వామివారికి 'శ్రీభగవద్విషయ గ్రంథి విచ్ఛేత్తా' అంటూ బిరుదును ప్రసాదించిన శ్రీమాన్ రంగాచార్యస్వామివారు ఈ భగవద్రామానుజసన్నిధిలో ఉండేవారట, వారి చివరి సమయంలో. ఈసన్నిధి సుమారు 70సం॥ల క్రితమే నిర్మితమైంది.

నడకదారి ఉండే రోజులలో ఈ ఆలయము ముందునుండే జనులంతా యాత్ర చేసేవారట. రోడ్డువేసాక అది బాగా పైభాగం లోంచి సాగిపోవడంతో ఇక ఈ సన్నిధిని పట్టించుకునే భక్తులు లేక వెలవెలబోతోంది. శ్రీవారు అక్కడ మంగళాశాసనములు చేసి, మనమతాన్ని పరిశీలించారు. శీతకాలంలో ఉండే వీలయ్యేట్టుగ దానిని చేసి, మంచి వసతులను ఏర్పాటు చేయించారు. అయితే, అది నిత్యమూ కాక, అవసరాలేర్పడ్డప్పుడు బాగా ఉపయోగ పడుతోంది.

8వ తేదీ రాత్రికి హృషీకేశ్ చేరారు. 9వ తేదీ ఉదయం ఆరాధనానంతరం ఢిల్లీ బయలుదేరారు. మార్గంలో ఢిల్లీలోని శ్రీకాకతీయ కాలనీవారి శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయంలో అనుగ్రహభాషణ గావించారు.

10వ తేదీ శ్రీ విశ్వహిందూ పరిషత్తువారు నిర్వహించిన నేషనల్ హిందూ లీడర్స్ కాన్ఫరెన్సులో పాల్గొన్నారు శ్రీవారు. శ్రీస్వామివారిని శ్రీమాన్ అశోక్ సింఘాల్ గారు శ్రీవారి మకాంకు వచ్చి, సేవించుకొని మంగళాశాసనము లందుకున్నారు.

ఉత్తరభారతదేశంలో జరిగే ధార్మిక కార్యక్రమాలలో దక్షిణదేశ ప్రాతినిథ్యము అంతగ ఉండడంలేదని, దానిని దృష్టిలో పెట్టుకొని ఏర్పాటుచేసిన ఈ సమావేశములో, దక్షిణాది స్వాములకు రాబోయే 2013లో ప్రయాగలో జరిగే మహాకుంభమేళాలో పాల్గొనాలని ఆహ్వానించడమే లక్ష్యమని ధర్మజాగరణలో అందరూ కలవాలని విన్నవించారు.

దానికి సమాధానంగ శ్రీస్వామివారు స్పందిస్తూ, 'ఫిబ్రవరి 7వ తేదీనుండి 10వ తేదీదాక ప్రయాగలో జరిగే మహాకుంభమేళాకు తప్పక వచ్చి పాల్గొంటామని' తెలియచేసారు. 11వ తేదీ రాత్రికి హైదరాబాదు చేరారు శ్రీస్వామివారు.

12వ తేదీ సింహాచలం విచ్చేసి, ఆరోగ్యం కుదుటపరచు కొంటున్న మన పత్రిక సంపాదకులు శ్రీఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామిని, వారి తిరుమాళికలోనే పరామర్శించారు.

అదేసమయానికి కేంద్రమంత్రి శ్రీమతి పురంధరేశ్వరిగారు కూడా అక్కడికి రావడంతో శ్రీవారి మంగళాశాసనాలందుకున్నారు. ఆపై పెరుమాళ్ళను సేవించి, రాత్రికి జీవా, శ్రీరాంనగర్‌కి చేరారు.

13వ తేదీన శ్రీమాన్ సత్యప్రకాశ్ వారి మిత్రబృందం బాలానగర్– హైదరాబాద్‌లో నడిపే Metsar Technologies వారి క్రొత్త ప్రాంగణాన్ని ప్రారంభించి మంగళాశాసనం చేసారు. ఆపై బీచుపల్లివద్ద మన వి.టి.కి చెందిన బెంగుళూర్ కార్యకర్త శ్రీమాన్ శశికిరణ్ నిర్మించుకొనిన నూతనగృహంలో జరిగిన సుదర్శనహోమం పూర్ణాహుతికి విచ్చేసి, దానిని జరిపించారు.

వారి కుటుంబసభ్యులందరికీ మంగళా శాసనములు చేసారు. 16వ తేదీన విజయవాడ కార్యక్రమాలలో కార్యకర్తగ ఉండే శ్రీమతి సత్యవతి నూతనంగ నిర్మించుకున్న గృహాన్ని, కొత్తూరు తాడేపల్లిలో వేంచేసి మంగళాశాసనం చేసి సీతానగరం చేరారు.

ఈ అక్టోబరు 1వ తేదీనుండి 19వ తేదీదాక హైదరాబాద్‌లో అంర్జాతీయ 11వ జీవవైవిధ్య సదస్సు జరుగుతోంది. 11వ బయోడైవర్శిటీ కన్వెన్షన్, ఇంతవరకూ వివిధ దేశాలలో జరిగిన ఈ సదస్సు ఈసారి భారతదేశంలో జరగడం, అందునా హైదరాబాద్‌లో జరగడం విశేషం.

ఇంతవరకూ జరిగిన సదస్సులలో లేని ఓ కొత్త అంశాన్ని దీనిలో పరిచయం చేయడం ఒక విశేషం. అది "జీవవైవిధ్య పరిరక్షణలో మత పెద్దలపాత్ర" ఎంతో ఉందన్న వాస్తవాన్ని గుర్తించి, వారిద్వారా కూడా ఈ విషయాలపై సలహాలు సంప్రదింపులు జరపడం.



గచ్చిబౌలీ, బ్రహ్మకుమారీల శాంతిసదన్‌లో జరిగిన సమావేశంలో ప్రముఖులు, మతపెద్దలు, దీనిని ఆం.ప్ర. బయోడైవర్శిటీ డైరెక్టర్ శ్రీమాన్ హంపయ్యగారు ఏర్పాటు చేశారు.

ప్రపంచంలో లక్షలాది జీవవర్గాలున్నాయి. వాటి ఉనికికి ఆధారమైన అచేతన పదార్థాలు ఎన్నెన్నోరకాలుగ ఉన్నాయి. వాటివాటి ప్రయోజనం వెంటనే, నేరుగ కనిపించకపోయినా, ప్రపంచస్థితికి అవేదోరకంగ ఉపయోగపడుతున్నాయి. మనిషి, తనకున్నదనుకొనే విజ్ఞానం ద్వారా, తన స్వార్థాన్ని తీర్చుకోడానికి, పెంచుకోవడానికీ ఈ ప్రకృతి ద్రవ్యాలను కలుషితం చేస్తూ, వాటి ద్వారా ఎన్నో జీవరాశుల వినాశనానికి కారణమౌతున్నాడు. వాటిని ఆహారాదులుగ గ్రహిస్తూ చివరకు తానుగూడ నాశనమౌతున్నాడు.

ఇప్పటికే ఈ ప్రపంచంలో ఉండే ఎన్నోరకాల విలువైన జీవరాశులు నశించిపోయాయి. కొన్ని సాంకర్యం చెంది కలుషితమయ్యాయి. ఇది ఇలానే సాగుతూపోతే, మనిషి మనుగడే ఈ భూమిమీద కొనసాగడమే ఒక ప్రశ్నార్థకంగ మారుతుంది. రాబోయే కాలంలో ఫలానా జంతువు, లేదా పక్షి, లేదా కీటకం,



బయో డైవర్సిటీ-మత పెద్దల పాత్ర సదస్సును శ్రీవారు ప్రారంభించారు.

లేదా, చెట్టు, లత, పొద, లేదా, ఫలానా రాయి.... ఇలా ఉండేదిట! అంటూ చెప్పుకోవలసివస్తుంది. వాటి బొమ్మలను చూచి 'ఇది ఇలాగట!' అనుకోవలసి వస్తుందేతప్ప ఆ ప్రాణినో, వస్తువునో మనం వాస్తవంగ చూడలేకపోతాం. ఇప్పటికే పిచుకల వంటివి కనపడడమే లేదు. అవి పోవడం వల్ల ఏర్పడే ఉపద్రవాలు హఠాత్తుగ తెలియవు కానీ, ఒకనాడు తప్పక ఇవన్నీ బయటపడి, తీర్చలేని మహోపద్రవంగ మారే అవకాశం ఉందిసుమా!

దీనికంతటికీ మనిషే మూలకారణం. మనిషియొక్క విజ్ఞాన వికాసమనే పేర జరిగే ప్రకృతి దుర్వినియోగమే కారణం. ప్రకృతిలోని ఈ చేతనాచేతనాల వైవిధ్యం సురక్షితంగ ఉండాలనేది మనిషికి తెలియాలి. చెప్పాలి.

ప్రపంచంలో అత్యధిక శాతానికి దైవం, మతం, గురువుల వద్ద తమను నిగ్రహించుకొని, శిరస్సువంచే అలవాటు ఉంది. మతాల గురువులు ఆవిధంగ చేరిన జనులకు హితాన్ని బోధించే ప్రయత్నం చేస్తూ ఉంటారు. వారే కనుక బాధ్యత వహించి, తమనాశ్రయించిన వారికి ఈ జీవ వైవిధ్య పరిరక్షణలో కర్తవ్యాన్ని బోధించగలిగితే అదెంతో ప్రయోజన వంతంగ ఉంటుంది. అందుకే ఇలాంటి సదస్సుకు మత గురువులనాహ్వానించాలి. వారి భాగస్వామ్యాన్ని అర్థించాలి. అంతేకాక, అత్యధిక జనాభా చేరేచోట కూడా ఈ విషయముపై అవగాహన కలిగేవిధమైన ప్రచారం జరగాలి. అంతర్జాతీయంగ గత 10 సంవత్సరాలనుండి ఈ ప్రయత్నమారంభమైంది.

ఈ ఆశయంతోనే అమెరికా, హ్యూస్టన్‌లో 'ది లివింగ్ ఎర్త్ ఫౌండేషన్' అనే ఒక సంస్థను శ్రీమతి కుసుమ్‌వ్యాస్ అనే మహిళ ప్రారంభం చేసారు. గత 7సం॥రాలుగ మత పెద్దల భాగస్వామ్యాన్ని ఈ సదస్సులో కలిగించే ప్రయత్నం ఆమె చేస్తూ, ఈ ఏడాదికి ఆయత్నంలో కృతకృత్యురాలు కాగలిగారు. దాని ఫలితంగానే 14వ తేదీన జరిగిన ఈ కార్యక్రమానికి శ్రీచిన్నజీయర్‌స్వామివారు ప్రారంభోత్సవం చేసారు.

దీనిలో శ్రీవారు 'జీవవైవిధ్య పరిరక్షణ, మతగురువుల పాత్ర' అనే ప్రారంభోపన్యాసంతో కార్యక్రమాన్ని ప్రారంభించారు.

నిజానికి ఈ "బయోడైవర్సిటీ కన్‌జర్వేషన్ జీవ వైవిధ్య పరిరక్షణ వంటి కార్యక్రమాలను 20॥సం॥ల క్రితమే వికాసతరంగిణి ప్రారంభించింది. 'మానవసేవే మాధవసేవ' అన్న సూక్తిని పక్కనపెట్టి 'మాధవసేవగ - సర్వప్రాణిసేవ' అనే లక్ష్యంతో 'వికాస తరంగిణి' ఆరంభమై లక్ష్యసాధనకై, సమాజసేవలో ముందుంటూ సర్వజనామోదాన్ని పొందింది అన్నారు.

వివిధ దేశాలప్రతినిధులుగూడ ఇందులో పాల్గొన్నారు. ఇక్కడ ప్రారంభించిన తర్వాత ఇదే అంశంపై రాష్ట్రప్రభుత్వం, గచ్చిబౌలీలో ఏర్పాటుచేసిన మరో సమావేశంలో కూడా శ్రీవారు పాల్గొని తమ సందేశాన్ని అందజేసారు.

తిరిగి మధ్యాహ్నం 2గంటలకి కన్వెన్షన్ సెంటర్‌లో రావిచెట్ల నీడలో ప్రకృతి ఒడిలో ఒక బహిరంగ సమావేశం జరిగింది. దానిలో సదస్సు ప్రధాన కార్యదర్శి అయిన బ్రెజిల్ దేశస్థుడు శ్రీమాన్



వివిధ దేశాల ప్రతినిధులతో శ్రీవారు

బ్రాలియో, శ్రీమాన్ జాన్ ప్రభృతులు పాల్గొన్నారు. వీరుకూడా గచ్చిబౌలీ సమావేశంలో పాల్గొన్నారు.

శ్రీమాన్ బ్రాలియో ప్రసంగిస్తూ.... Help the Nature అన్నచోట, శ్రీస్వామివారి ప్రసంగంలోని Serve the Nature అనేదే తగును అంటూ ఆ పదంతో తన ప్రసంగాన్ని ఒకటికి రెండుమార్లు సరిద్దికోవడం విశేషం.

మన నేత్ర విద్యాలయ విద్యార్థులు, ఓ రూపకాన్ని ప్రదర్శిస్తూ వృక్షాలు చేసే ఉపకారాన్ని హృదయంగమంగ ప్రదర్శించారు. ఆపై జీవా గురుకులవిద్యార్థులు మానవులలోని మత వైవిధ్యాన్ని చూపుతూ, జన్మభూమి అందరికీ ఈ భూమే కనుక మనమంతా కలిసి జీవించాలనే సందేశాన్ని బాలే నృత్యంద్వారా ప్రదర్శించారు.

ఇందులో పాల్గొనడానికే ప్రత్యేకంగ వచ్చిన UK. JET సభ్యురాలు శ్రీమతి రాగసుధ అద్భుతమైన స్వాగత నృత్యాన్ని సమర్పించారు.

ముందుగ జరిగిన సంక్షిప్త పరిచయానంతరం "గ్రీన్ కుంభ" కలశాన్ని శ్రీచిన్నజీయర్‌స్వామివారు శ్రీమాన్ బ్రాలియోకు అందజేసారు. శ్రీమతి కుసుమవ్యాస్‌గారి తీవ్రమైన కృషి ఫలితంగ ఇది నెరవేరింది. సుమారు 3,4 కోట్లమంది రాబోయే ఫిబ్రవరిలో ప్రయాగలో జరిగే మహాకుంభమేళాలో పాల్గొంటారు. ప్రపంచంలో ఆధ్యాత్మికంగ జరిగే అతిపెద్ద జన సమ్మేళనంగ దీనిని గుర్తిస్తారు.

అంతమందికీ బయోడైవర్శిటీ ఆవశ్యకతను తెలపడం, వారిద్వారా పర్యావరణ రక్షణ జాగ్రత్తలు తీసుకొనేట్టు చేయడం, ప్లాస్టిక్ వాడడాన్ని అక్కడ నిషేధించడం ఇలాంటివాటితో ఆ కుంభ్‌ను "హరిత కుంభమేళా"గ వర్ణించారు.

ఇప్పుడు తాము తయారుచేసిన ఈ కుంభాన్నీ, ఆ కుంభమేళాకి యాత్రగ చేర్చాలనీ, ఆపై రాబోయే ఏడాది కొరియా దేశంలో జరిగే 12వ జీవ వైవిధ్య సదస్సుకు కుడా ఈ కుంభం వెళ్ళాలని శ్రీమతి కుసుమవ్యాస్ కోరారు.

The Living Earth Foundation & వికాసతరంగిణి ఈ ఉద్యమంలో భాగస్వాములై కొనసాగుతామని ప్రకటించారు.

శ్రీవారికి కుడిప్రక్క డా. J. రామేశ్వరరావు, శ్రీ పీసపాటి బాలకృష్ణ, శ్రీ TSN. రాజు, శ్రీవారికి ఎడమప్రక్క శ్రీమతి కుసుమ వ్యాస్, ప్రొ. P. పురుషోత్తమరావు, శ్రీ E. రామారావుగార్లు.

వారికోరికతో ఇత్తడి కలశాలను శ్రీచిన్నజీయర్‌స్వామివారు తయారుచేయించి పచ్చని కొబ్బరి మొక్కతో XI COP కార్యదర్శికి అందజేసారు.

దేశాల హద్దులను దాటి వెళ్ళే ఈ కుంభంలో ఆయాదేశాల మృత్తికను కొద్దికొద్దిగ చేర్చాలని మొదట అనుకున్నా, రక్షణ దృష్ట్యా అది సాధ్యంకాదని, అందులో మంచి ముత్యాలను వేసి శ్రీచిన్నజీయర్‌స్వామివారు కలశాన్ని అందజేసారు. ప్రతిదేశం నుండీ ఇలా కొన్ని ముత్యాలు అందులో చేరుస్తూ, ఏకతాసూత్రాన్ని పాటించి, రక్షించుకొనే ఉద్యమంలో మనమంతా ఏకంకావాలని శ్రీస్వామివారు తెలిపారు.

జాతీయ బయోడైవర్శిటీ డైరెక్టర్ శ్రీమాన్ పీసపాటి బాలకృష్ణగారు ఈ సూచనను స్వాగతించి, ప్రశంశించారు. ప్రధానంగ వెళ్ళే కుంభంకాక, శ్రీమాన్ బ్రాలియోగారికి, జాన్ బాలకృష్ణగారికి, VT&LEF సంస్థల గుర్తుగ వేరు కలశాలను జ్ఞాపికలుగ శ్రీస్వామివారందజేసారు. మన వికాసతరంగిణి తరఫున శ్రీమాన్ TVSN రాజుగారు, వై. సూర్యనారాయణగారు, శ్రీమాన్



**సాయంకాలపు ఆరుబయట సమావేశంలో గ్రీన్ కుంభ్‌ను అందుకున్న శ్రీ బ్రాలియో వారికుడిప్రక్క డా॥జె. రామేశ్వరరావు, శ్రీపీసపాటి బాలకృష్ణ, శ్రీజె.యస్.ఎన్. రాజు, శ్రీవారి ఎడమప్రక్క శ్రీమతి కుసుమవ్యాస్, ప్రొ॥పి. పురుషోత్తమరావు, శ్రీఈ.రామారావు.**

J. జగపతిగారు ప్రభృతులు శ్రీమతి కుసుమవ్యాస్‌గారికి సంపూర్ణసహకారాన్నందజేసారు.

అక్టోబరు 20వ తేదీన ప్రొద్దుటూరులో కన్యకాపరమేశ్వరీ ఆలయంలోని అమ్మవారికి ఓ చక్కటి వజ్రకిరీటం తయారుచేయించి, దానిసమర్పణ సందర్భంగ శ్రీచిన్నజీయర్‌స్వామివారిని ఆహ్వానించారు అక్కడి వికాసతరంగిణి జోనల్ కార్యదర్శి శ్రీమాన్ బూశెట్టి రాములుగారు. ఆనాటి రాత్రి గం॥ 9.00కి శ్రీవారు అక్కడికి విచ్చేసి, భక్తులందరికీ మంగళాశాసనాలు చేసారు.

ఈ సందర్భంగ శ్రీమాన్ శేఖర్ దంపతుల నూతన గృహంలో బసచేసి, వారికి మంగళాశాసనాలు చేసారు.

విజయదశమి సందర్భంగ సీతానగరంలోనే శ్రీవారు వేంచేసి ఉండి, విద్యార్థులతో, భక్తులతో శమీపూజాదికాలను నిర్వహింపచేసారు. ఆపై హైదరాబాద్ జీవాకు శ్రీవారు చేరారు.

# శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి పర్యటన కార్యక్రమాలు

## నవంబర్ నెల

| | | |
|---|---|---|
| 01. | హైదరాబాద్ | బడంగ్‌పేట, అల్మాస్‌గూడ శ్రీవేంకటేశ్వరస్వామి పుష్కరిణి జీర్ణోద్ధరణ కార్యక్రమంలో పాల్గొంటారు. |
| 02. | వికారాబాద్ | మన్నెగూడ వద్ద కేశవరెడ్డి విద్యాసంస్థ నిర్వహించే సుదర్శన యజ్ఞానికి మంగళాశాసనం చేస్తారు. |
| 13-17 | నిజామాబాద్ | మార్కెట్ యార్డ్ - నిజామాబాద్‌లో శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్ర ప్రయుక్త జీయర్‌పురస్కార సమర్పణ మరియు సహస్రకలశాభిషేక కార్యక్రమాలలో పాల్గొంటారు. 15వ తేది: నిజామాబాద్‌లోని శ్రీరామాలయ పుష్కరోత్సవ కుంభాభిషేకంలో పాల్గొంటారు. |
| 18. | కరీంనగర్ | చల్మాడ ఆనందరావు మెడికల్ కాలేజిలో క్యాన్సర్ విభాగ ప్రారంభోత్సవంలో అన్వయిస్తారు. |
| 19. | హైదరాబాద్ | బోయినపల్లి: శ్రీరాఘవేందర్‌రావుగారి ఆహ్వానం మేరకు 108 సామూహిక షష్టిపూర్తి మహోత్సవకార్యక్రమంలో పాల్గొంటారు. |
| 21. | రాత్రికి దుబాయ్ | శ్రీమాన్ వినేశ్ బిమాని గారి గృహంలో బసచేస్తారు. |
| 22-23 | రాత్రికి అబుదబి | శ్రీమాన్ భాస్కర్‌రావు, అక్కినేనిగారి ఆహ్వానంమేరకు అక్కడి భక్తులచే సామూహిక శ్రీవేంకటేశ్వర కళ్యాణాలు జరిపిస్తారు. తిరిగి దుబాయి విచ్చేసి, హైదరాబాద్ తిరిగి వస్తారు. |
| 24. | శ్రీరాంనగర్ | శ్రీరాంనగర్‌లో వేంచేసియుంటారు. |
| 30. | సూర్యాపేట | రాజానాయక్ తండాలో శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయ ప్రతిష్ఠ కార్యక్రమంలో అన్వయిస్తారు. |

## డిసెంబర్ నెల

| | | |
|---|---|---|
| 01. | హైదరాబాద్ | శ్రీమాన్ పి. పురుషోత్తంరావు శ్యామల దంపతులు జరిపే శ్రీలక్ష్మీనారాయణ కళ్యాణమహోత్సవంలో పాల్గొంటారు. |
| 02. | భోపాల్ (MP) | శ్రీమాన్ సర్జన్‌సింగ్ కుమారుడు సుబోధ్‌సింగ్ ఆహ్వానం మేరకు ఎన్.ఆర్.ఐ. ఇంజనీరింగ్ కాలేజీలో శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయప్రతిష్ఠలో పాల్గొంటారు. |
| 03. | విజయవాడ | పోరంకిలో శ్రీమాన్ జి.వేణుగోపాలాచార్యస్వామివారి నూతన గృహప్రవేశ సందర్భంగ ఉ॥ తీర్థగోష్ఠి, అనంతరం శ్రీసీతారామ కళ్యాణమహోత్సవంలో పాల్గొంటారు. |
| 04. | చేవెళ్ళ | బండారు శ్రీనివాసురావుగారి ఇంజనీరింగ్ కాలేజీ ఆవరణలో శ్రీ హయగ్రీవస్వామి విగ్రహప్రతిష్ఠలో పాల్గొంటారు. అనంతరం వికారాదాబ్‌లో బి.రమేశ్‌గారి ఆహ్వానంపై మానసిక చికిత్స కేంద్రప్రాంగణంలో శ్రీవీరాంజనేయస్వామి ప్రతిష్ఠలో పాల్గొంటారు. |
| 07. | హన్మకొండ | యం. సుధాకర్‌రెడ్డిగారి ఆహ్వానంపై ఎక్సైజ్ కాలనీలో శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయ ధ్వజస్తంభప్రతిష్ఠలో పాల్గొంటారు. |
| 16 నుండి జనవరి 13వరకు | | జరిగే ధనుర్మాసవ్రతమహోత్సవం, నల్లగొండ, రామగిరి, ఆండాళ్‌సన్నిధిలో జరిపిస్తారు. శ్రీవేంకటేశ శరణాగతిదీక్షా కార్యక్రమాలు జరుగుతాయి. |

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **అక్టోబర్ నెల సమాధానాలందాయి.** విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

*గతనెల సమాధానాలు 26వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. నిరతిశయానంద బ్రహ్మస్వరూపాన్ని ఏమంటారు. | |
| 2. పెరియతిరుమొళ్ళిని రచించినవారెవరు? | |
| 3. అశ్వినీదేవతల అనుగ్రహంతో జన్మించినవారెవరు? | |
| 4. కృపుడు ఎవరి కుమారుడు? | |
| 5. విష్ణుపురాణంలోని భాగములను ఏమంటారు? | |
| 6. నల్లాన్ అంటే అర్థమేమిటి? | |
| 7. కృష్ణుడు భూదేవిని ఏపేరుతో స్మరించాడు? | |
| 8. తిరుమళ్ళిశై అళ్వార్లకి శంకరుడిచ్చిన బిరుదు ఏమి? | |
| 9. వికాసతరంగిణి స్త్రీల కొఱకు నిర్వహించే ఆరోగ్యకార్యక్రమమేమిటి? | |
| 10. సృష్టికార్యక్రమం చేయుచున్న ఇప్పటి బ్రహ్మ ఎన్నవవాడు? | |
| 11. ఖడ్గబాహుని ఏనుగుపేరేమిటి? | |
| 12. వీరబాహుడు ఎవరు? | |
| 13. మనస్సుకి అధిదేవత ఎవరు? | |
| 14. బృందావనంలో జీర్ణోద్ధరణ చేపట్టిన స్థలమేమిటి? | |
| 15. మోక్షార్థులు ఎవరిని ప్రార్థించాలి? | |
| 16. మన శరీరంలో కొలువుతీరిన స్వామికేమని పేరు? | |
| 17. నైమిశారణ్యంలో భగవంతుడు ఏరూపంలో నిలచాడు? | |
| 18. నాలాయిరములకు వ్యాఖ్యానము నందించిన మహనీయులు ఎవరు? | |
| 19. ఆయిర్ దేవుడని ఎవరికి పేరు? | |
| 20. నరకాసురుని పట్టణము పేరేమి? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు.**

1. శ్రీమతి వి. రామసీతమ్మ–కాళ్ళకూరు; పి. సూర్యప్రకాశ్‌రావు–వరంగల్; కె. రాగిణి మకరంద–అనంతపూర్.

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్లు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం–522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





65 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీ నందన నామ సంవత్సరం

కార్తీకమాసము

**సంపుటి 65 డిసెంబరు**

**సంచిక 9 2012**

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ**

**రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ S.V. **రంగరామానుజాచార్యులు**

## పంచాంగ వివరాలు

డిసెంబర్ :

9. సర్వేషామేకాదశి
11. మాస శివరాత్రి
13. తిథిద్వయం, పిండపితృయజ్ఞము, అమావాస్య
15. మూలకార్తె, ధనుస్సంక్రమణము రా.తె.4-16
16. అవమతిథి, ఉదయాత్పూర్వం ధనుర్మాస ప్రథమ పాశురసేవనం
23. స్మార్త ఏకాదశి, గీతాజయంతి
24. వైష్ణవానాం ఏకాదశి, ముక్కోటి ఏకాదశి, శ్రీరంగాది సమస్త శ్రీవైష్ణవక్షేత్రములయందు వైకుంఠద్వారదర్శనోత్సవం, మత్స్యద్వాదశి, వాసుదేవ ద్వాదశి, త్రిద్యుస్పృక్
25. హనుమద్వ్రతం
28. పూర్వాషాఢ కార్తె
8. సర్వేషామేకాదశి

## స్మృత్యంజలి




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-




D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం



మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



పరమహంస పరివ్రాజకులు

## శ్రీశ్రీశ్రీ త్రిదండి రంగరామానుజ జీయరు స్వామివారు

కాకినాడ

శ్రీ ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు ఆచార్య తిరువడికి వేంచేయడం మనందరికీ పెద్ద కొఱతేననడంలో సందేహమేమీలేదు.

శ్రీమాన్ రామచంద్రాచార్యస్వామివారిది మిక్కిలి నిర్దుష్టమైన జ్ఞానము పరిశోధన, లోతైన ఆలోచన లేకుండా వారి కలమూ సాగదు. వాక్కూ వెలువడదు. పరమ ప్రామాణికమైన ప్రవచనం వారిది. కొద్దిసేపు వారితో గడిపినా, ఎన్నో విషయాలు తెలుస్తాయి. బాల్యంనుంచి వారి ప్రవృత్తి జ్ఞాన సముపార్జనగానే ఉండేది. తూర్పు ఆంధ్రప్రాంతంలో, శ్రీ వైష్ణవ కుటుంబాలలో తొలిసారిగా M.A. చేసిన ఘనత వారిది. అందుకే వారి బంధువర్గంలో వారందరికీ రామచంద్రాచార్యులనే నామధేయం కన్నా M.A. చిట్టిగారనే నామధేయమే సుపరిచితం. (వారిని ఆప్తులందరూ 'చిట్టి' అని ఆప్యాయంగా పిలుచుకునేవారు.)

పరాశర భట్టరువారు, కూరనారాయణ మునులు వారి వారి రచనలలో వాడిన పదబంధాలు, పదప్రయోగాలు ఎంత అపురూపమైనవో అంతటి అపురూపమైన ప్రయోగాలు చేయగలిగిన సామర్థ్యం ఆధునికులలో శ్రీమాన్ రామచంద్రాచార్యస్వామివారికి మాత్రమే ఉన్నదనడంలో ఏమీ సందేహం లేదు.

వారికి ఆత్మ విశ్వాసం చాల అధికం. ఎదుటివారిని క్షణంలో అంచనా వేయగలరు. తదనుగుణంగా సంభాషించగలరు. వారి ప్రసంగాలు పండిత రంజకంగా ఉంటాయి. సున్నితమైన హాస్య చతురత దోబూచులాడుతూ ఉంటుంది.

మిక్కిలి సూక్ష్మబుద్ధి గలవారవడం వలన సాహిత్యంలో చాల పరిశ్రమ చేయగలిగారు వారు. సంస్కృతంలో, ఆంధ్రంలో మాత్రమే కాకుండా మిగిలిన భాషలలోని సాహిత్యాన్ని కూడ వారు చాలా పరిశీలించారు. రాజకీయ విషయాలలోగాని, దేశ ఆర్థిక విషయాలలోగాని, .. చివరకు న్యాయవ్యవస్థ విషయాలలోగాని వారి విమర్శనాత్మక, పరిశీలనాత్మక విశ్లేషణలు వింటూ ఉంటే 'నడయాడుతున్న విజ్ఞాన సర్వస్వమా' అని ఆశ్చర్యం కలుగుతూ ఉండేది.

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి సన్నిధిలో 'భక్తినివేదన' పత్రిక సంపాదకులుగా పాఠకులకు అపురూపమైన కానుకలందజేశారు, సంపాదకీయరూపంగా.

మా ఆచార్యులు శ్రీ ఉ.వే. శరణ్యాచార్యస్వామివారు, మిక్కిలి గౌరవించే వ్యక్తులలో శ్రీమాన్ రామచంద్రాచార్య స్వామివారు కూడ ఒకరనడం వలన మాకు, మా ఆశ్రమ అనుయాయులందరకూ కూడా వారు పరమపూజ్యులు.

పరమపదంలో శ్రీ, శ్రియఃపతుల సన్నిధిలో నిత్యకైంకర్యం నిమిత్తం శ్రీమాన్ రామచంద్రాచార్యస్వామివారు వేంచేయడం, ఇక్కడి మనందరికీ ఒక కొఱతే అయినప్పటికీ, మన గురించి పురుషకారం చేయడానికి నిత్యసూరుల గోష్ఠిలో ఇంకొకరు పెరిగేరని సంతోషిద్దాం!

అడియేన్, రామానుజ దాసన్

— (signature)

(శ్రీరంగ రామానుజ జీయర్ కాకినాడ)

జయ గోవింద ! జయ గోవింద!!





# శ్రీ భాష్యకార సిద్ధాన్త పీఠము

రిజిష్టర్ నెం. 8/2000
1-4-2, సూర్యనారాయణపురం, జీయర్ మార్గ్, అడ్డ వంతెన వద్ద, జువ్వలపాలెం రోడ్,
భీమవరం - 534 202, ప॥గో॥జిల్లా, ఆం.ప్ర. ఫోన్ : 08816-227599
వ్యవస్థాపకులు : శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరామచంద్ర రామానుజ జీయరుస్వామివారు

తేది 19/11/2012

"జాతస్య హి ధ్రువో మృత్యుః"
"మాటిమాటి పలపిరప్పుం పిఱన్దు"

అని ఈ జన్మ పరంపరలప్రవాహంలో ఉత్తమజన్మ మానవజన్మ. ఈ పవిత్ర భారతభూమిలో జన్మించడం ఎంత ధన్యమో, ఈ జన్మ సార్థకమయ్యే జన్మనెత్తడం చాలా దుర్లభం. అది పొంది, భగవంతుని నిర్హేతుక జాయమాన కటాక్షం వలన తమ ఈ జీవనయాత్రలో ఎన్నో అనుభవాలు గడించి, తమబాల్యదశనుండి సంప్రదాయక కుటుంబంలో జన్మించి, చక్కని విద్యను లభించి, మంచి పండితులుగా గుర్తింపు పొంది, పెద్దల మన్నలను స్వీకరించి, తామునేర్చిన జీవిత పాఠాన్ని తమ సంతానానికి, తమనాశ్రయించినవారికి నేర్పిన వారు మన భక్తినివేదన సంపాదకులు శ్రీరామచంద్రాచార్య స్వామివారు. వారి గంభీరమైన వాణి మూగబోయినదని తెలిసి చాలా చింతించాము.

ఉత్తరాంధ్రత్రయమని ప్రసిద్ధికెక్కిన ఉద్దండ పండితులైన శ్రీఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు, శ్రీఉ.వే. శ్రీమాన్ కందాడ వేంకటాచార్య స్వామివారు, శ్రీఉ.వే.శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారు. ఈ ముగ్గురూ ఆచార్యతిరువడి చేరటం ఉత్తరాంధ్రకు తీరనిలోటనే చెప్పవచ్చు.

శ్రీరామచంద్రాచార్య స్వామివారు సింహాచలనాథుని సన్నిధిలో చాలాకాలం సేవచేసి, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్ద జీయర్ స్వామివారితో, శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి తోను చాలా సన్నిహిత సంబంధం కలిగి, భక్తినివేదనకు శ్రీఉ.వే. శ్రీమాన్ తె.కం గోపాలాచార్యస్వామివారి తరువాత నేటివరకు సంపాదకులుగా ఉండి, ఎంతో గొప్పసేవచేసి, తరించిన మహానుభావులు.

వీరు లేని లోటు వారికుటుంబానికే కాక, పండిత లోకానికి, ఆస్తికలోకానికి అని భావిస్తూ వారికి ఆ శ్రియఃపతి వారి నిత్యకైంకర్యమును కలిగించవలెనని ప్రార్థిస్తున్నాము.

భీమవరం (ముద్ర)
19/11/2012

## పరమహంస పరివ్రాజకులు
## శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారు - సీతానగరం

**జైశ్రీమన్నారాయణ!**

**"సర్వేషామేవ ధర్మాణాం ఉత్తమో వైష్ణవో విధిః"**

అన్ని ధర్మాలలో శ్రీవైష్ణవ ధర్మముచాలా గొప్పది. ఎవరు ఈ ధర్మాన్ని ఆచరిస్తారో, వారిని మన శరీరాన్ని మనము ఎలా రక్షించుకుంటామో అలా భగవంతుడు వారిని అనుగ్రహిస్తాడట. అటువంటి ఉత్తమ వైష్ణవునిగా ధర్మాచరణ కావించిన ధన్యులు ఉ.వే. శ్రీమాన్ T.P. రామచంద్రాచార్యస్వామివారు వీరు సంస్కృతము, తెలుగు, ఆంగ్ల భాషలలో మంచి ప్రావీణ్యం కలిగినవారు. శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారు స్థాపించిన భక్తినివేదనకు శ్రీఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారి తర్వాత సంపాదకులుగా బాధ్యతలను నిర్వహించి పాఠకలోకానికి తమదైన సరళిలో తెలుగు భాషలోని సొగసులను వ్యాసాల రూపంలోను ప్రవచనాలుగాను, అందించి సాహిత్యవేత్తలచే "వాచస్పతి" బిరుదాంకితులైనారు.

శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి ప్రచారంలో ప్రధాన సారథ్యం చేసిన వారిలో వీరు ఒకరు. అమెరికా వంటి ప్రాంతాలలో కూడా శ్రీవారితో పాల్గొని తమ ప్రసంగాలతో అక్కడివారికి కూడా సంప్రదాయరహస్యాలను అందించారు. అటువంటి విజ్ఞాననిధి మన కళ్ళకు దూరమవడం ఆస్తిక లోకానికి ఒక తీరనిలోటు. ఉ.వే.శ్రీమాన్ T.P. రామచంద్రాచార్య స్వామివారు ఆచార్యతిరువడి చేరి నిరాటంకముగా పరమ పదములో భగవంతునికి కైంకర్యము జరుపుతూ మనందరికీ మార్గదర్శనం చేయుగాక అని పెరుమాళ్ళను ప్రార్థిస్తున్నాము.

**అహోబిల రామానుజ జీయర్**



**శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారితో... శ్రీఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు**

'సువచ శ్రీవల్లభ, పండితరత్న, శాస్త్రవిద్వన్మణి, వాచస్పతి'

## ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యుల

## జీవిత విశేషములు

| | | |
|---|---|---|
| పేరు | : | టి.పి. శ్రీరామచంద్రాచార్యులు |
| జననం | : | 1932 జనవరి 20 |
| జనని | : | శ్రీమతి తాయారమ్మ |
| జనకులు | : | ఉ.వే. శ్రీమాన్ అనంత పద్మనాభ సీతారామాచార్య స్వామి (కృష్ణయజుర్వేదపండితులు) |
| ధర్మపత్ని | : | శ్రీమతి రంగనాయకమ్మ. |

### విద్యాభ్యాసము

| | | |
|---|---|---|
| 1943-49 | : | దేవస్థాన సంస్కృతపాఠశాల, సింహాచలం. 'సంస్కృత ఎంట్రన్సు', పరీక్షలో ఉత్తీర్ణత. |
| 1949-53 | : | మహారాజ సంస్కృత కళాశాల, విజయనగరం. ఆంధ్ర విశ్వ కళాపరిషత్ వారి భాషాప్రవీణ పరీక్షలో ఉత్తీర్ణత. |
| 1955 | : | ప్రభుత్వ బోధన కళాశాల, రాజమహేంద్రి |
| 1955-60 | : | మెట్రిక్యులేషన్ నుండి బి.ఎ.వరుకు - ప్రైవేటుగ ఉత్తీర్ణత |
| 1961-63 | : | ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు - తెలుగులో ఎం.ఎ.లో ప్రథమశ్రేణిలో సర్వప్రథముడుగ ఉత్తీర్ణత. |
| 1963-66 | : | ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు - తెలుగుశాఖలో 'రీసెర్చ్‌ఫెలో'గా పరిశోధన. |

### ఉద్యోగము

| | | |
|---|---|---|
| 1953-63 | : | కృష్ణాజిల్లా పరిషదున్నత పాఠశాలలో తెలుగు పండితుడుగా.. |
| 1966-90 | : | విశాఖపట్నం మిసెస్ ఏ.వి.ఎన్. కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా, సీనియర్ లెక్చరర్‌గా, విభాగాధ్యక్షుడుగా |
| 1990 జనవరి 31 | : | పదవీ విరమణ |

### ఆధ్యాత్మిక కార్యక్రమాలలో అన్వయం

| | | |
|---|---|---|
| 1. 1968 నుండి | : | సింహాచల దేవస్థానం వైదికకార్యక్రమాల పర్యవేక్షణ, వార్షికాలైన కళ్యాణ, చందనోత్సవాదులతోపాటు రాజగోపుర కలశ ప్రతిష్ఠ, లక్ష్మీనారాయణ క్రతువు, కోటి తులసీపూజ, కోటి కుంకుమార్చన మొ॥ కార్యక్రమాల నిర్వాహణ. |
| 2. 1982 నుండి | : | శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి సాంప్రదాయిక కార్యక్రమాలలో భాగస్వామ్యం. |
| 3. 1997 నుండి | : | శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారు నిర్వహిస్తున్న 'భక్తినివేదన' ఆధ్యాత్మికమాసపత్రికకు సంపాదకత్వం |

### అధ్యయన వివరాలు

| | | |
|---|---|---|
| అధీత విద్యలు | : | సంస్కృతాంధ్రసాహిత్యాలు |
| అధ్యాపకులు | : | బ్రహ్మశ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మగారు, బ్రహ్మశ్రీ ఆకెళ్ళ అరుణాచల శాస్త్రిగారు. బ్రహ్మశ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, శ్రీమాన్ ఎస్.వి.ఎన్. భాష్యకారాచార్యులుగారు, బ్రహ్మశ్రీ వడ్లమాని రామమూర్తి శాస్త్రిగారు, బ్రహ్మశ్రీ కొల్లూరు లక్ష్మణ మూర్తిశర్మగారు, మధ్వశ్రీ జమ్మికృష్ణమూర్తి శాస్త్రి గారు, శ్రీమాన్ శ్రీన.చ.రఘునాథాచార్యులు గారు. |

తెలుగులో ఛందోవిశేషాలు,

| | | |
|---|---|---|
| కవిత్వపు మెలకువలు | : | శ్రీమాన్ తి.ప. నారాయణస్వామిగారు. |
| అలంకార శాస్త్రము | : | మధ్వశ్రీ జమ్మి కృష్ణమూర్తి శాస్త్రిగారు, బ్రహ్మశ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, శ్రీమాన్ ఎస్.వి.ఎన్. భాష్యకారాచార్యులుగారు, మహామహోపాధ్యాయ శ్రీమాన్ శ్రీన.చ.రఘునాథాచార్యులు గారు. |
| పాణినీయ వ్యాకరణము | : | బ్రహ్మశ్రీ పేరి వేంకటేశ్వర శాస్త్రిగారు, బ్రహ్మశ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిగారు, బ్రహ్మశ్రీ కర్రి శ్రీరామ మూర్తి శాస్త్రిగారు. |

న్యాయ మీమాంసా ప్రక్రరణాలు :

మధ్వశ్రీ జమ్మి కృష్ణమూర్తి శాస్త్రిగారు, శ్రీమాన్ తోగుమ్మి పార్థసారథి స్వామిగారు.

| | | |
|---|---|---|
| దివ్యప్రబంధము | : | ఉ.వే. శ్రీమాన్ కరి అనంతాచార్యస్వామివారు. |
| ఉభయవేదాంతాలు | : | 'మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, శాస్త్ర రత్నాకర' శ్రీమాన్ శ్రీన.చ.రఘునాథా చార్యులు గారు. |
| పొందిన బిరుదులు | : | సువచః శ్రీవల్లభ, పండితరత్న, ఆధ్యాత్మికరత్న, శాస్త్రవిద్వన్మణి, వాచస్పతి. |
| సమ్మానములు | 1 | శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి శ్రీహస్తాల మీదుగ శ్రీ ఉ.వే.శ్రీమాన్ గోపాలాచార్యస్వామి వారి స్మృతిరూపక 'గోపాలోపాయన' పురస్కారము. |

2 ఉభయవేదాంత మహావిద్వాన్, సాహిత్యభూషణ, ఉ.వే. శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్య భవ్యస్మృతి పురస్కారము.

3 కవిరత్న ఉ.వే. శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్య స్మృతి పురస్కారము.

4 అభినవ నమ్మిళ్ళై ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్య దివ్యస్మృతి పురస్కారము.

5 ఉభయవేదాంత మహావిద్వాన్ శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామి స్మారక పురస్కారము.

6 హైదరాబాద్‌లోని అష్టలక్ష్మీ దేవాలయంవారిచే 'ఉభయవేదాంత విశిష్టవిద్వాంసులు'గా, 'సౌవర్ణకంకణ' బహుమానము.

7 విశాఖపట్నం శ్రీశ్రీశ్రీ మహాకామేశ్వరీపీఠం అధ్యాత్మిక స్నాతకోత్సవాలలో 'ఆధ్యాత్మికరత్న' బిరుదు సత్కారము.

8 ఉభయవేదాంత మహావిద్వాన్ కోయిల్ రంగాచార్య స్మారక సమితివారిచే 'పండితరత్న' బిరుదు ప్రదానము.

9 తిరుమల తిరుపతి దేవస్థానంవారు అఖిలభారత స్థాయిలో నిర్వహించిన వేదశాస్త్రాగమ విద్వత్సదస్సు రజతోత్సవ సందర్భముగ శ్రీవేంకటేశ్వర వేదవిజ్ఞానపీఠం వారు సువర్ణపతకముతో 'శాస్త్రవిద్వన్మణి' బిరుదు ప్రదానము.

10 త్రిదండి శ్రీరామచంద్ర రామానుజ జీయర్‌స్వామి వారు నెలకొల్పిన శ్రీభాష్యకార సిద్ధాంతపీఠము వారిచే శ్రీ గోపాలదేశిక పురస్కారము.

11 హైదరాబాద్ తిరుమల చారిటబుల్ ట్రస్ట్‌వారి పురస్కారము.

12 హైదరాబాద్ ఎస్.వి.ఎస్. ట్రస్ట్‌వారిచే సర్వధారి ఉగాది పురస్కారము.

### రచనా వ్యాసంగం

1952 నుండి : వివిధ పత్రికలలో వ్యాసాలు, కవితలు, ప్రకటితములు

1968 నుండి : ఆకాశవాణిలో అనేక సంస్కృత, ఆంధ్రప్రసంగాలు ప్రసారితాలు.

ప్రత్యక్షవ్యాఖ్యానము : 1 విశాఖ, ఆకాశవాణిద్వారా శ్రీసింహాచల వరాహలక్ష్మీ నృసింహస్వామివారి కళ్యాణ మహోత్సవ సందర్భముగ (కార్యక్రమాన్ని ప్రారంభించినది మొదలు నేటివరకు)

2 చందనయాత్ర సందర్భముగానూ,

### ముద్రిత గ్రంథాలు

1. వ్యాసమాల : విమర్శవ్యాస సంపుటి - 1970- 72 ప్రాంతములో ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి బి.ఎ., బి.కాం. విద్యార్థులకు పాఠ్యగ్రంథంగ నిర్ణయించినారు. తరువాత మదరాసు విశ్వవిద్యాలయం వారు పాఠ్యగ్రంథంగ నిర్ణయించినారు.

2. సింహాచల క్షేత్రమాహాత్మ్యము : సంస్కృతానికి సరళమైన ఆంధ్రానువాదము.

3. సింహగిరి నరహరి వచనాలు : సువిపుల పీఠికతో, 'ప్రథమాంధ్రవచన సంకీర్తన కవితాచార్యుడు' కృష్ణమాచార్యుల సింహగిరి నరహరి వచనాలు. సింహాచల దేవస్థానంవారి ద్వారా ప్రకటితం.

4. ఆర్యోక్తులు : ఆచార్య సుందరపాండ్యుని ఆర్యలపై సామాజిక స్పృహతో కావించిన విపుల విలక్షణ వ్యాఖ్యానము. (హైకోర్టు మాజీ న్యాయమూర్తి మాన్య శ్రీమాన్ జి. రాధాకృష్ణరావుగారి ముందుమాటలతో).

5. ఆర్యోక్తి సుధ : ఆచార్య సుందరపాండ్యుని ఆర్యలపై (మరికొన్నిటికి) సామాజిక స్పృహతో కావించిన విపుల విలక్షణ వ్యాఖ్యానము.

6. సిద్ధాంత కుసుమాలు - సాంప్రదాయ సౌరభాలు
ఉభయవేదాంత విషయక లఘువ్యాసాలు, ఔపనిషదములైన ద్వాత్రింశద్బ్రహ్మవిద్యలు కూడా ఇందులో ఉన్నాయి.

వేదాంతదేశికులు అన్నట్టు సాంప్రదాయ విషయాలు వ్యాఘ్రీస్తన్యాల్లా దుర్గ్రహాలు. అలాంటివాటిని కూడా గోక్షీరమధురాలుగ సుగ్రహాలుగా ప్రసాందింపగల నేర్పరులు శ్రీరామచంద్రాచార్యస్వామి అని 'వాచస్పతి, ఉవే.శ్రీమాన్ కె.ఎస్. రామానుజా చార్యస్వామివారి మెప్పును పొందిన రచన.

7. మనసు - మాట : భక్తినివేదన సంపాదకీయాల సంపుటి, తిరుపతి రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం ఉపకులపతుల, తెలుగు విశ్వవిద్యాలయం మాజీ ఉపకులపతుల మెప్పుపొందినది.

8. కృష్ణమయ్య : కృష్ణమాచార్యుల జీవితం, అప్పటికి అముద్రితాలైన మరికొన్ని సింహగిరి నరహరి వచనాలు కలిపి ప్రకటితం.

(ముప్పదేండ్లకు పైగ కృష్ణమాచార్య వాఙ్మయంపై కావిస్తున్న పరిశోధన ఫలంగ వెలికివచ్చిన గ్రంథం. దక్షిణభారతంలో తాళపత్ర ప్రతులకై కావించే కృషిలో లభ్యమైన క్రొత్తవచనాలతో పాటుగ, కృష్ణమాచార్య జీవిత విశేషాలను ఆఖ్యాయిగ అందించిన గ్రంథం)

9. అమృతతరంగాలు : అమృతోత్సవ సందర్భముగ ప్రకటితము. 75 సంపాదకీయముల సంపుటి.

10. సౌవర్ణనివేదన : భక్తినివేదన స్వర్ణోత్సవ సంచిక సంపాదకత్వం.

శ్రీరామచంద్రాచార్యుల సప్తతి సంచిక : శ్రీరామచంద్రాచార్యుల సప్తతి సందర్భముగ వీరిని గురించి ప్రముఖుల వ్యాసాలతో వెలువడిన ప్రత్యేక సంచిక.

## ప్రవచనాలు, ప్రసంగాలు

దేశంలోని వివిధ ప్రాంతాలలో ఉభయ వేదాంత సభలలో అనేక సం॥లుగా ప్రవచనాలు.

తిరుప్పావై ధనుర్మాస ప్రవచనాలు.

తి.తి.దేవస్థానాలలో ప్రవచనాలు.

పలు సాహిత్యసభలలో ప్రసంగాలు.

పలువుర గుర్తింపు : సింహాచల దేవస్థానంతో అనుబంధంవల్ల దైవదర్శనానికి వచ్చిన ప్రముఖుల ప్రశంస పొందే అవకాశం ఏర్పడింది.

అటువంటివారితో కొందరు : శ్రీమతి శారద ముఖర్జి - రాష్ట్రగవర్నర్‌గ వీరు సింహాచలం వచ్చారు.

శ్రీమాన్ శంకర్‌దయాళ్ శర్మ - రాష్ట్రగవర్నర్‌గ, ఉపరాష్ట్రపతిగ, రాష్ట్రపతిగ మొత్తం ఐదు పర్యాయాలు వీరు విచ్చేసారు.

జస్టిస్ పి.ఎన్.భగవతి - సుప్రీంకోర్ట్ ఛీఫ్ జస్టిస్.

జనరల్ కె.వి. కృష్ణారావుగారు - కాశ్మీర్ గవర్నర్‌గ ప్రమాణస్వీకారానికి వెడుతూ... సింహాచలం విచ్చేసారు. ఇటువంటి పెద్దలైనవారికి క్షేత్ర విశేషాలను వివరించే వీలు కలిగింది.

శ్రీరామచంద్రాచార్యులవారు 35ని॥పాటు సంస్కృతములో అనర్గళంగ ప్రసంగిస్తూంటే విని, ముగ్ధులైన శ్రీశంకర్‌దయాళ్‌శర్మగారు వచ్చిన ప్రతిసారీ వీరితో గోష్ఠి జరుపక వెళ్ళేవారు కాదు.

ప్రసంగాలు : మధుర ప్రసంగ నిపుణులుగ, మహోన్యాసకులుగా, విద్వత్కవులుగా, విలక్షణశిల్పాభిరామ వచన రచయితగా పలువురచే ప్రశస్తి.

## ఉత్తరాంధ్ర పండిత త్రయం

శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ఆస్థానంలో ఉత్తరాంధ్ర పండితత్రయంలో ఒకరుగ గుర్తింపబడినవారు.

1. శ్రీమాన్ భాష్యం అప్పలాచార్యస్వామివారు
2. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారు
3. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు

ఉత్తరాంధ్ర పండిత త్రయంగ ప్రసిద్ధులు.

## ఉద్యోగవశాన నిర్వహించిన పదవులు

ఉద్యోగములో ఉండగ.... సెకండరీ ఎడ్యుకేషన్ బోర్డు, ఇంటర్మీడియెట్ బోర్డ్ ఆంధ్రయూనివర్సిటీ, ఉత్కళ యూనివర్సిటీ, నాగార్జున యూనివర్సిటీలలో ఎగ్జామినర్, ఛీఫ్, చైర్మన్ పేపర్ సెట్టర్, మెమ్బర్ బోర్డ్ ఆఫ్ స్టడీస్., ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ వైవా ఎగ్జామినర్ మొ॥లగు అనేక పదవులను నిర్వహించారు.

ప్రస్తుత వ్యాసాంగం : కోరినవారికి ఇంటివద్దనే ఉభయవేదాంత గ్రంథములను ప్రవచించుట. రచన వ్యాసంగము. ఓపికమేరకు ఆధ్యాత్మిక సభలలో పాల్గొనుట.

వ్యక్తిత్వ నిరూపిక : శ్రీరామచంద్రాచార్యుల సప్తతిపూర్తి సంచిక.

చిరునామా : టి.పి. శ్రీరామచంద్రాచార్యులు, 5-74, మధ్యవీధి, సింహాచలం, విశాఖపట్నం. 530 028. ఆంధ్రప్రదేశ్. ఫోన్ : 0891 2715427, సెల్: 098499 65415.

## మార్గనిర్దేశకులు మా శ్రీరామచంద్రాచార్యస్వామి



శ్రీశ్రీరామచంద్రాచార్యస్వామి 1977వ సం॥ నుండి మా కుటుంబానికి పరిచయం ఏర్పడింది.

మాకుటుంబ వ్యవహారాలు, వ్యాపార ఒడిదుడుకులు వారితో సంప్రదించి, వారు సూచించిన మార్గంలోనే ఈనాటివరకూ అన్వయిస్తూ, అతిక్రమించకుండా ఆచరిస్తూ వస్తున్నాం.

మాకు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారితో పరిచయానికి కారణం కూడా ఈ ఆచార్యులే.

విజయవాడమీదుగ ఎప్పుడువచ్చినా మాకుటుంబానికి ఫోన్ చేయకుండా పయనించలేదు. అలానే మా స్వగృహానికి లెక్కలేనిమార్లు వేంచేసి, మా ఆతిథ్యాన్ని స్వీకరిస్తూ, మమానందింపజేసే వారు. వారు పరమపదించినా, మా మనస్సులలో చిరస్థాయిగ వేంచేసియుంటారు.

దాసోహములతో....

ఎల్. చక్రధర్ - గన్నవరం

**Dr. S.V. Rangaramanujacharyaswamy**
President : SrimadUbhayaVedantaAharyaPeetam (Srirangam)
Director (Academiccouncil)
Jeeyar Integrated Vedic Academy
Sriramanagaram, Muchintal, Palamakul (Po)Shamshabad, R.R. Dist -509325. India

## ఋజు ప్రవృత్తి - శ్రీరామచంద్రాచార్యస్వామి

ఆచార్య కటాక్షంవల్లనే మరొక ఆచార్యుని బాంధవ్యం ఏర్పడుతుందనేది దాసునివిషయంలో త్రికాలాబాధసత్యం. ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామి వారికి, దాసుడు తన తండ్రిగారైన ఉ.వే. శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్యులవారి పేరున ఏర్పరచిన విశేష పురస్కారాన్ని సమర్పించడానికి, కొవ్వూరులో 1996 ఏప్రియల్ నెలలో ఏర్పరచిన సభలలో ఉత్తరాంధ్ర పండితత్రయంగా ప్రసిద్ధిచెందిన ఉ.వే. శ్రీమాన్ మా ఆచార్యులు శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారు, ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారు, వారితో పాటు ఉ.వే. శ్రీమాన్ T.P. రామచంద్రాచార్యస్వామివారు ముప్వురూ వేంచేసారు. ఇదిఒక అపూర్వ త్రివేణీసంగమం. అప్పటినుండి దాసునికి విశేషసంబంధం ఏర్పడి, అది దినదిన ప్రవర్ధమానమై, శ్రీమాన్ T.P.రామచంద్రాచార్యస్వామివారి **'సప్తతి'** మహోత్సవానికి దాసుడే సర్వాధ్యక్షునిగా వారిచేతను, వారి కుటుంబసభ్యుల చేతను వరింపబడేస్థాయికి చేరింది.

అదే సందర్భంగా **శ్రీమత్పరమహంస పరివ్రాజకులైన శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నజీయరుస్వామివారి**తో కూడా సర్వప్రథమానుబంధం ఏర్పడి అది అవిచ్ఛిన్నంగా నేటికీ సాగడం దాసుని జన్మాంతర పుణ్యపరిపాకమే తప్ప వేరుకాదు. ఆనాటినుండి శ్రీరామచంద్రాచార్య స్వామివారు, దాసుడు, ఇరువురం కలసి ఇంచుమించుగా ప్రతి కార్యక్రమంలోను స్వామి వారికి ఇరుపార్శ్వాల ఉంటూ అన్వయిస్తూ ఉన్నామని లోకమెరుగును.

సీతానగరంలో కాని ఇతరత్రగాని జరిగే సభల్లోను తిరునక్షత్రాది కార్యక్రమాల్లోనూ అన్వయించడానికి వెళ్ళినపుడు ఇరువురూ కలసి ఒకేగదిలో ఉండటం సాగేది. ఈ సందర్భంగా దాసుని కుటుంబ విషయాలు వారికి, వారికుటుంబవిషయాలు దాసునికి తెలుస్తూ ఒక అవ్యాజ ప్రీతి బాంధవ్యాలు మా ఇరువురి మధ్య ఏర్పడి దాసుణ్ణి స్వామివారు ఒక సోదరునిగా భావించి ఆదరించే స్థితి కలిగింది. దాసునిలో ఏర్పడిన సాంప్రదాయిక పరిణామక్రమంలో ఉత్తరాంధ్ర పండిత త్రయ ప్రభావం విశేషంగా ఉండగా, దానికి మరింత దోహదకారిగా శ్రీరామచంద్రాచార్య స్వామివారి స్నేహం ఉపోద్బలకమైందని దాసుడు నిర్ద్వంద్వంగా చెప్పగలడు.



ఆచార్య పీఠంద్వారా దాసుడు, భక్తినివేదన ద్వారా శ్రీరామచంద్రాచార్య స్వామివారు, ఇలా ఇరువురం అవిభజనీయస్థితిలో అన్వయింపగల్గడం మా భాగ్యవిశేషమే.

శ్రీరామచంద్రాచార్యస్వామివారు ప్రాచ్యకళాలాశాధ్యయనం, సాంప్రదాయిక విద్యాధ్యయనాలు కలిగిన వారవడం చేత సంస్కృతాంధ్రాలలో మంచి అభినివేశాన్ని సాధింపగలిగారు. తెలుగు డిపార్ట్‌మెంట్‌తో అనుబంధం కలిగి తెలుగు లెక్చరర్‌గానే తమ ఉద్యోగబాధ్యతలను నిర్వహించడం వల్ల తెలుగు, ప్రబంధ సారస్వతంలో గట్టి పట్టుకలిగి, వాక్య రచనలో చక్కటి చిక్కటి గ్రథనకౌశలాన్ని సాధించారు. భక్తినివేదన స్వర్ణోత్సవసభ హైదరాబాద్‌లో జరిగినపుడు వీరి భాషావైశద్యాన్ని పదప్రయోగచాతురాన్ని గమనించిన డా॥నారాయణరెడ్డి గారు వీరిని ప్రశంసించడం దాసుడు ప్రత్యక్షంగా వీక్షించాడు. ఒక ప్రసిద్ధతెలుగు కవిని 'శిరస్సు'ఊపేలా చేయగల భాషావైశద్యం మనస్వామిదని ఆసన్నివేశం స్పష్టపరచింది.

ఇక్కడ ఒక విషయాన్ని తప్పక చెప్పాలి. విజయనగరంలోని త్రైవర్ణిక రామానుజకూటంలో 1996లోనే ఒక అపూర్వసన్నివేశాన్ని **డా॥ కందాళవేంకటాచార్యస్వామి**వారు కల్పించారు. దాసుణ్ణి, విజయనగరం ఆహ్వానించి శ్రీఅప్పలాచార్యస్వామివారి అధ్యక్షతన శ్రీమాన్ కందాళస్వామివారి నిర్వహణంలో, శ్రీరామచంద్రాచార్యస్వామివారి పరిచయ ప్రక్రియతో దాసునికి ఒక సత్కారసభ ఏర్పాటు చేసి అభిజ్ఞానం

(అంగుళీయకం)తో సత్కరించారు పెద్దలు. ఆ సభలో నన్ను ప్రేరేపిస్తూ ఈ ముగ్గురు పెద్దలు మాటాడిన మాటలే ఈ దాసుని పూర్తిగా స్వరూపతః సంప్రదాయప్రవేశం చేయించాయి అన్న సత్యం ఈ సందర్భంలో చెప్పితీరాలి.

సాధారణంగా సంస్కృతశాస్త్రపాండిత్యం కలవారికి మాత్రమే విశేషంగాలభించే రాష్ట్రీయసంస్కృత విద్యా పీఠ గౌరవడాక్టరేట్ **'వాచస్పతి'** శ్రీమాన్ స్వామివారిని వరించడం వారకిగల యోగ్యతకు ప్రత్యక్షనిదర్శనం. సంస్కృత శ్లోకరచనంలో స్వామివారు అందెవేసిన చేయి. శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారి గురించి, మనస్వామి రచించిన శ్లోకాలు విద్వజ్జనహృద్యాలు.

**ఆదౌ సింహగిరీంద్ర సానుషుచరన్ లబ్ధ్వాశరీరం దృఢం**
**సోత్కంఠం విమలం నిపీయసలిలం రామానుజాబ్ధౌ తతః ।**
**పశ్చాద్రంగనరేంద్ర నాభిజలజాతక్షౌద్ర ధారాః పరం**
**పీత్వా వర్షతి దివ్యసూక్తి మనిశం గోపాలధారాధరః ॥**

గోపాలాచార్యస్వామిని ధారాధరంగా రూపించిన తీరు వీరికిగల సంస్కృతాలంకారశాస్త్ర ప్రవేశాన్ని విస్పష్టపరుస్తున్నది.

**ఆచార్యాస్సంతులోకే సురగురుధిషణా నైకశాస్త్రప్రవీణాః**
**శిష్యాశ్చాప్యాత్తవిద్యా సురభిత వినయాస్సంతువా బుద్ధిమంతః ।**
**శైష్యోపాధ్యాయికైషా వకుళపరిమళావల్లరీ భవ్యమూలం**
**గోపాల స్వాంత జాతాత్వనితర విభవా నాన్యతో దర్శనీయా॥**

అనే శ్లోకంలో వీరి స్వభావంలోని ఆర్జవలక్షణం ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

మనస్వామి ఋజుప్రవృత్తులు. కపటం వంచన, పరప్రతారణాది లక్షణాలు సుతరాముగిట్టనివారు, సత్యం ఎంతనిష్ఠురమైనా స్పష్టంగా చెప్పడం వీరినైజం. ఈవిషయంలో మాఇరువురుకి చాలా సాన్నిహిత్యం ఉంది. ముఖ్యంగా మేమిరువురం ఏస్వామివద్ద రెండు బాధ్యతలు నిర్వహిస్తూ నిత్యం అన్వయిస్తూ ఉన్నామో వారిపట్ల, ఇతరులు కొంత, స్వభావవక్రిమను స్వీకరించి ప్రవర్తించినా, మేము సహింపలేకపోయే వారిమి. మన స్వామి (**చిన్నజీయర్‌స్వామి**)లోనే ఏదైనా మా అభిప్రాయాలకు కొంత విరుద్ధమైన ప్రవృత్తి ఏవిషయంలోనైనా మేము గమనిస్తే, దాన్ని నిర్ద్వంద్వంగా దాపరికం లేకుండా మనస్వామిముందు ఉంచేవారం. మా ఇరువురి లోని ఈ లక్షణమే మనజీయర్‌స్వామికి విశేషంగా నచ్చిన లక్షణమని వారే స్వయంగా మావద్దనే కాక, పరులవద్ద కూడా ప్రశంసిస్తూ సహృదయతతో అనడం మేమేకాదు చాలామంది ఎరుగుదురు.

స్వామివారికి, ఏవిషయంలోను **'పరప్రధర్షణం'** కలుగరాదనే దృఢభావన మన రామచంద్రాచార్య స్వామిది. గడచిన సంవత్సరాలలో శ్రీజీయర్‌స్వామివారిపట్ల తిరుపతివిషయంలో మత్సరగ్రస్తులైన కొందరు బురదచల్లడానికి చేసిన ప్రయత్నం శ్రీరామచంద్రాచార్యస్వామిని ఎంతోకలవరపెట్టింది. ఈసందర్భంగా దాసుని వద్ద తాముబాధపడటమే కాక ఇలాంటి పరిస్థితులను ఎదుర్కొనే స్థితి కలుగరాదనే తలపుతో స్వామివారివద్ద కూడ దాసునితో పాటుగా ఏకాంతంగా స్వాభిప్రాయన్ని నిష్కర్షగా ఆవిష్కరించడం వారి హృదయవైశద్యాన్ని పట్టిస్తున్నది.

శ్రీరామచంద్రాచార్యస్వామి చాలా స్వతంత్ర ప్రవృత్తికలవారు. ఏవిషయంలోనూ పరాధీనత వీరికినచ్చదు. తమకువచ్చిన పెన్షన్‌తోను, తమ ఆర్జనతోనే తాముస్వేచ్ఛగా వలసినచోటకు ప్రయాణంచేస్తూ పరాధీనత ఎంతమాత్రం లేకుండా **"వినాదైన్యేనజీవనం"** అన్నరీతిలోనే జీవనాన్ని సాగించాలని దృఢంగా విశ్వసించినవారు. భాషాదారిద్ర్యం, భావదారిద్ర్యం, జీవనదారిద్యం మూడు ఎంతమాత్రం లేనివారు మనస్వామి. ఇక సాంప్రదాయిక విషయాల్లోకాని, భాషాసారస్వతాల విషయంలో కాని, "రాజీ"పడే లక్షణం ఎంతమాత్రంలేదు. భక్తినివేదన సంపాదకునిగా బాధ్యత నిర్వహిస్తున్నప్పుడు తాము సంపాదకీయం వ్రాసినా, వ్యాసాన్నివ్రాసినా తెలుగుభాషా విషయంలో నిర్దుష్టత, స్పష్టత, శిష్టత తప్పనిసరిగా ఉండాలనే భావన చాలాస్పష్టంగా కలిగిఉండేవారు. ఒకటి రెండు సందర్భాల్లో భావ సంఘర్షణను కూడా వారు ఎదుర్కొనవలసి వచ్చినా వెనుదీయని పూనికిగలవారని నిరూపించు కున్నారు మనస్వామి. చిన్నజీయర్‌స్వామివారితో**చనువు**గా ప్రవర్తింపగల చాలాకొద్దిమందిలో వీరూ ఒక్కరుకావడం విశేషం. శ్రీచిన్నజీయర్‌స్వామి వారు పలుసందర్భాల్లో ఆదరించడం శ్రీరామచంద్రాచార్యస్వామివారి మొక్కవోని ప్రీతికినిదర్శనం. గోపాలాచార్యస్వామి వారిపేరున సమర్పించే గోపాలోపాయనాన్ని శ్రీరామచంద్రాచార్యస్వామివారికి సమర్పించి తృప్తిచెందారు శ్రీశ్రీస్వామివారు.

**'మహామహోపాధ్యాయులు' 'శాస్త్రరత్నాకరులు'** అయిన ఉ.వే **శ్రీమాన్** N.C **రఘునాథాచార్యస్వామి** వారి సన్నిధిలో డెబ్బైసంవత్సరాలు పైబడిన వృద్ధత్వవయస్సులోకూడా భగవద్విషయ కాలక్షేపం పూర్తికావించుకున్న ధన్యజీవనులువీరు. దానికోసం కుటుంబసభ్యులకు దూరంగా, వారంతా ఏకకంఠంగా వద్దని వాదించినా వినక, పూనికతో వరంగల్లులో సంవత్సరంపైగా ఉండి లక్ష్యాన్ని మొక్కవోనిదీక్షతో సపత్నీకులై సాధించడం నేటి యువపండితలోకానికి కనువిప్పుకలిగించే విషయం అనక తప్పదు. వీరిగ్రంథాలు బ్రహ్మవిద్యల పైనా, సుందరపాండుని ఆర్యలపైన, కృష్ణమయ్యభవ్యచరితంపైనా ఇంకాఎన్నో సహృదయపాఠక హృద్యనైవేద్యాలు, ఇలాంటి మంచి**'మనిషి'**ని కోలుపోయిన ఆంధ్రసారస్వతశ్రీవైష్ణవసాంప్రదాయికలోకం పూడ్చలేని అగాథంలో పడిందనడంలో సందేహంలేదు. వీరి కుటుంబసభ్యులకు కలిగినలోటు మాటలచే పూడ్చరానిదే. విశేషించి శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామి వారి కార్యక్రమాలకు కొంత విఘాతమనక తప్పదు.

శ్రీ లక్ష్మీ హయవదన పరబ్రహ్మణే నమః
శ్రీ సింహాద్రినాథాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

## సాతులూరి గోపాలకృష్ణమాచార్య, సింహాచలం.



నిండైన విగ్రహం, అంతకుమించిన నిండైన గాంభీర్యం సంతరించుకున్న కమనీయమూర్తి శ్రీరామచంద్రాచార్యస్వామి. వారిని తొలుదొల్తగా సేవించినది... తెలుగుదనపు సౌరభాన్ని నింపుకున్న శ్రీసూక్తి వైభవాన్ని మొట్టమొదటగా అనుభవించిన దృశ్యాన్ని నేటికీ మరువలేను.

అతి 1976వ సంవత్సరం. ధనుర్మాసం, విశాఖపట్టణం జిల్లాపరిషత్ వద్దగల శ్రీ చైతన్యమఠం... శ్రీ గోదా దివ్యసూక్తి ప్రవచనాన్ని శ్రీరామచంద్రాచార్యస్వామి ప్రవచిస్తున్న సమయం. ఆ ప్రవచనంలో అలవోకగా ప్రవహిస్తున్న శ్రీనాథునిసూక్తి వైభవాలు, శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదా పద్యపుటచ్చతెనుగు గుబాళింపులు విన్నపుడు తెలుగుభాషను ఇంత హృద్యంగా ఉపన్యాసముగా అలవోకగా చెప్పగల వక్తలున్నారా? అని ఆశ్చర్యము, వారు మనవారే అని తెలియడం వలన ఆనందమూ కలిగినవి.

తరువాత బి.హెచ్.పి.వి. వారి హాలులో ఉపన్యాసముల సమయములో వారితో కలసి మాటాడే భాగ్యము కలిగినది. శ్రీ సింహాద్రినాథుని సేవాభాగ్యమబ్బిన తరువాత కీర్తిమూర్తి శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారితో కలిసి మరింత సాన్నిహిత్యాన్ని శ్రీరామ చంద్రాచార్య స్వామివారితో పెంపొందించుకునే భాగ్యము కలిగినది.

అపర రామానుజులు పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారికార్యక్రమములలో ఉత్తరాంధ్రత్రయముతో కలిసి అన్వయించు కున్నప్పుడు శ్రీరామచంద్రాచార్యస్వామివారి వాత్సల్యమును మరింతగా పొందే భాగ్యము కలిగినది. శ్రీ సింహాద్రినాథుని సన్నిధిలో ఏ వైదిక కార్యక్రమము జరిగినా అది శ్రీరామచంద్రాచార్య స్వామివారి రూపకల్పనముతో కొనసాగవలసినదే! సింహాచల క్షేత్రమును గురించి సాధికారముగ చెప్పవలసి వచ్చినా, శ్రీ సింహాద్రినాథుని గురించి కృష్ణమాచార్యులవారు రచించిన "సింహగిరి నరహరి వచనముల"ను గురించి తెలుపవలసి వచ్చినా సాధికారముగా తెలుపగలిగిన వ్యక్తి శ్రీరామచంద్రాచార్యస్వామివారు మాత్రమే! స్వామి కల్యాణోత్సవ సదస్య సభలయందు వేదాన్త శాస్త్రమున, సాహిత్యమున పెద్దలైన వారెందరో ఏతెంచి ఉపన్యసించుటకు భూమికను ఏర్పరచి నిర్వహించినవారు వీరే! అది గాలిగోపుర కుంభాభిషేకమేగానీ, శ్రీమన్నారాయణ యాగమే కానీ, శ్రీ సుదర్శన నృసింహయాగమేకానీ... ఏ కార్యక్రమమైనా సౌందర్యమును సంతరించుకుని నిర్వహింపబడినదనిన దాని వెనుకనున్న వ్యక్తి శ్రీరామచంద్రాచార్యులవారే!

వారు మొగమాటమెరుగని వ్యక్తి. తాము దేనిని తలుస్తారో దానిని ఆవతలివ్యక్తి ఎవరైనా సరే వారికి నిర్మొగమాటముగా తెలుపుటయే స్వామివారి నైజము. ఆవలివ్యక్తి కూడా ఒక్క నిముషము బిత్తరపోయినా, తరువాత స్వామివారి అభిప్రాయము లోని ఆర్జవము, ఆ వెనుకనున్న ఉపపత్తులను తెలుసుకొని శ్రీరామచంద్రాచార్య స్వామివారి మాటకు వల్లె యనవలసినదే!

శ్రీరామచంద్రాచార్యస్వామివారి మాట బయటకు నిర్మొహమాటముగ అనిపించినా, వారి మనసు వెన్న. తాము శ్రీ సింహాద్రినాథునికి కాని, శ్రీశ్రీశ్రీ చిన్నజీయరుస్వామివారికి గాని ఏమాత్రము అపచారము జరిగినదనినా అస్సలు సహించలేరు. అది అనేకమారులు ప్రస్ఫుటమగుట వారి సాన్నిహత్యము వలన దర్శించే అవకాశము కలిగినది.

శ్రీరామచంద్రాచార్యస్వామివారు గొప్ప భావకులు. అంతే కాదు, వారి రచనలు మనను కూడ ఆ భావనా ప్రపంచములోనికి తీసుకొని వెళతాయి. అందులకు నిలువెత్తు నిదర్శనము **కృష్ణమయ్య.** ఏమో నిజమునకు కృష్ణమయ్య ఎలా ప్రవర్తించాడో తెలియదుగాని, శ్రీరామచంద్రాచార్యస్వామివారి "కృష్ణమయ్య" ఎదలోపల తలపు లను తట్టి అందుతాను నిలకడగా ఉండిపోతాడు. "భక్తినివేదన" పత్రికకు వారు వ్రాసిన సంపాదకీయ వ్యాసములు మున్నగునవి వారి క్రాన్తదర్శిత్వాన్ని సుస్పష్టముగ వెల్లడిస్తాయి.

శ్రీరామచంద్రాచార్య స్వామివారు మా భారద్వాజులగుట, అస్మదాచార్యులు "కవిశాబ్దికకేసరి" శ్రీ న.చ. రఘునాథాచార్య స్వామి వారికంతేవాసులగుట, జగదాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారికత్యంతాప్తులగుట, నాయందత్యంత ప్రీతిని గలవారగుట మున్నగు నవన్నియు ఆనందదాయకములైతే, వారినిక చూడలేమనునది, వారి గంభీర వాక్యములను వినలేమనునది ఒక తీరని వెత.

శ్రీస్వామివారు శ్రీ వైకుంఠమునకేగినా, అచ్చటి పరమపద నాథుని కూడా శ్రీసింహాద్రినాథునిరూపంలోనే సేవిస్తారను కొనటంలో అనౌచిత్యము లేదనిపిస్తుంది. శ్రీస్వామివారు పరమ పదించుట వారి కుటుంబమునకు, శ్రీ వైష్ణవలోకమునకు విశేషించి శ్రీ సింహాచల క్షేత్రమునకే తీరనిలోటు. వారి కుటుంబమునకు నా ప్రగాఢమైన సానుభూతిని తెలియజేస్తున్నాను.

శ్రీమతే రామానుజాయ నమః

# స్మృత్యంజలి

ఉభయవేదాన్త విద్వన్మణి వేదాన్తవాచస్పతి
ఉ.వే.శ్రీమాన్ ఎన్ వి ఎల్ ఎన్ రామానుజాచార్యస్వామివారు -నరసాపురం.

శాస్త్రవిద్వన్మణి, వాచస్పతి ఉ.వే.శ్రీమాన్ టి.పి రామచంద్రాచార్యుల వారు ఆచార్య తిరువడిగళ్‌కు వేంచేశారనే వార్త పండితలోకాన్ని విషాదంలో ముంచింది. శ్రీవైష్ణవసంప్రదాయ ప్రచారకులుగానేగాదు సంస్కృతాంధ్రసాహిత్యపాథోదధిని ఆపోశనపట్టి అద్భుతమైన తమదైన శైలిలో పదిమందికి పంచిన మహామనీషి శ్రీరామచంద్రాచార్యులవారు. అటు వైదికసాహిత్యంలోను ఇటు లౌకిక సాహిత్యంలోను ఎదురులేని మనిషిగా మనీషిగా ప్రసిద్ధిగన్న వ్యక్తిత్వం వారిది. విషయాన్ని రసరాగరంజితంగా మనోహరంగా పండితపామర జనరంజకంగా అందివ్వడంలో వారికి వారే సాటి.

ఉభయవేదాంతాలను అధ్యయనంచేయడమేకాదు అధీతి బోధాచరణప్రచారాలతో తమ జీవితాన్ని సుసంపన్నం చేసికొన్న మహనీయులువారు. " ఋజువక్తా గుణవక్తా హితవక్తా దుర్లభః పురుషః అన్న సుందరపాండ్యుని అభిప్రాయానికి నిలువెత్తు ప్రతీక శ్రీస్వామివారు. ఎదుటివారికి కష్టంకలుగకుండానే తమ అభిప్రాయాన్ని నిర్మోహ మాటంగా వెల్లడించగల ధీశాలి శ్రీస్వామివారు. ఎవరికోసం ఎంతటి వారికోసంకూడా తమ అభిప్రాయాన్ని మార్చుకోడంగాని ఏమార్చడం గానీ లేని నిష్కపటి మన శ్రీరామచంద్రాచార్యులవారు.

"ప్రాచీన సంప్రదాయపరంపరలో ప్రవచనాలు సాగితే అవి నేటి సమాజానికి ఎంతవరకు ఉపయోగపడతాయి. నేటి కాలానికి అనుగుణంగా ఆ ప్రవచనాల్లోను విషయవిశ్లేషణలోను మార్పురావాలి" అనేది స్వామివారి అభిప్రాయం అందుకనే వారు చేసే ప్రవచనం ద్రవిడవేదాంతమైనా సంస్కృతవేదాంతమైనా తెలుగువారికి నచ్చిన వారుమెచ్చిన ఆంధ్రకావ్యాలలోనుండేగాదు ఆధునిక కవుల రచనల నుండికూడ సామ్యాలను ఎత్తిచూపించేవారు. అది కొందరు సంప్రదాయ పండితులకు నచ్చకపోవచ్చుగాక! ఎవరికో నచ్చలేదనో నచ్చదనో తమ అభిప్రాయాన్ని మార్చుకొనే వ్యక్తిత్వం కాదు వారిది.

ధృఢమైన సంకల్పబలం తదనుగుణమైన వాగ్వైఖరి వారు చేపట్టిన కార్యాలన్నింటిని దిగ్విజయం చేశాయి. వారి అసాధారణ మేథాసంపత్తి సాహితీసంపద ప్రవచనశైలి మొదలైనవి సర్వులను ఆకర్షించి వారిని వాచస్పతులను చేశాయి. కేంద్రీయ సంస్కృత విద్యాపీఠం వారిని వాచస్పతులుగా సన్మానించుకొన్నది. శ్రీశ్రీశ్రీ చిన జీయరుస్వామివారు గోపాలోపాయన పురస్కారంతో వారిని సన్మానితులను చేశారు. ఇక చిన్నాపెద్దా సన్మానాలకు సత్కారాలకు లెక్కేలేదు. అవి అహమహమికతో వచ్చిచేరినవే.

శ్రీమత్పరమహంసేత్యాది శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ



రామానుజ జీయర్‌స్వామివారి మంగళాశాసనాలతో కులపతులు న్యాయవేదాన్త విద్వాన్ ఉ.వే శ్రీమాన్ తె.కం.గోపాలాచార్యస్వామివారు సంపాదకులుగా ప్రారంభమైన భక్తినివేదన ముముక్షుజనలోకానికి ఒక కల్పతరువు. శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారు తాము వేంచేసియున్నంతవరకు అప్రతిహతంగా ఆ బాధ్యతలను నిర్వహించారు. వారు ఆచార్య తిరువడి చేరిన తరువాత శ్రీశ్రీశ్రీ చినజీయర్‌స్వామివారి మంగళాశాసనాలతో ఆబరువు బాధ్యతలను స్వీకరించారు మన రామచంద్రాచార్య స్వామివారు. ఈ నిర్వహణలో ఎన్నో ప్రయాసలను ఎదుర్కోవలసి వచ్చినా వాటినన్నింటిని నొప్పింపక తానొవ్వక తీరులోనే పరిష్కరించు కొంటూ ముందుకు నడిపించారు. గత కొంతకాలంగా శారీరకమైన అనారోగ్యంతో శ్రమపడుతున్నా భక్తినివేదనలో తమ శ్రీసూక్తులను అందించడమేకాదు ఎప్పటిలానే తమ సంపాదకత్వంలో నిర్వహిస్తూనే ఉన్నారు.

శ్రీరామచంద్రాచార్యస్వామివారిని గురించి ఒక్కమాటలో చెప్పాలంటే వారు ఒక వ్యక్తికాదు ఒక వ్యవస్థ. మేరునగధీరునివంటి శ్రీస్వామివారి పరమపదయాత్ర ప్రపన్నలోకానికి నిజంగా తీరని తీర్చలేని లోటే. ఉత్తరాంధ్రత్రయంగా ప్రశస్తిపొందిన ఆ తరం వీరి పరమ పదయాత్రతో పరిసమాప్తి అయింది. పరమపదనాథుడు వీరికి పరమపదంలో నిత్యకైంకర్యమును ప్రసాదించుగాత! యని మా అభినవభూతపురీశులైన భగవద్భాష్యకారులను ప్రార్థిస్తూ వారి కుమారులకు వారి కుటుంబానికి నాప్రగాఢసంతాపాన్ని తెలియజేసు కొంటున్నాను.



జై శ్రీమన్నారాయణ



శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః

# శ్రీరామానుజవాణి

11-49-136, శివాలయం వీధి, విజయవాడ - 520 001. ఫోన్ 0866 2420820

## అంజలి

వాచస్పతులు శాస్త్రవిద్వన్మణులు సుమధుర సువచశ్శ్రీవల్లభులు ఉ.వే.శ్రీమాన్ టి.పి.రామచంద్రాచార్యుల వారితో నాకు 25సం వత్సరాల పైబడిన పరిచయం. భక్తినివేదన సంపాదకులుగా వారు ప్రపన్నజనలోకానికి సుపరిచితులు. ఉభయవేదాంత విద్వాంసులుగా పండిత మండలికి ఆప్తులు. గీర్వాణాంధ్రసాహిత్య వినీలాకాశంలో వారు పున్నమిచంద్రులు. వారి సునిశిత మేధాసంపత్తి, వాగ్విలాసవైఖరి, నిష్కాపట్యము, బహుధా ప్రశంసింపదగినవి.

అప్రియస్యతు పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః అన్నట్టు అప్రియమైన హితాన్ని చెప్పేవాడు లోకంలో దొరకడం చాలా కష్టం. కానీ దానికి అపవాదం మన శ్రీరామచంద్రాచార్యస్వామివారు.

అవతలివారు ఎంతటివారైనా సరే వారికి ప్రియంకదా! అని అహితమైన మాటను పలికేవారుకాదు. అలాగని కఠినంగా మాట్లాడేవారూ కాదు. తమ అభిప్రాయాన్ని ఏనాడూ ఎవరికోసం మార్చుకోడంగాని ఎవరినీ యేమార్చడంగాని చేయలేదు. నిర్భయంగా నిర్మొహమాటంగా తమ అభిప్రాయాన్ని వెలువరించే ధీమంతులు శ్రీస్వామివారు.

ఉభయవేదాన్తములను అధికరించి పండితమండలికి తలమానికంగా ప్రకాశిస్తున్నా వీసమెత్తు గర్వంపుపోకడలు లేని విశిష్టవ్యక్తి వారు. తాము చెప్పదలచుకొన్న విషయాన్ని డొంక తిరుగుడు లేకుండా ఎదుటివ్యక్తి హృదయాంతరాళాల్లో సూటిగా దూసుకుపోయే విధంగా ఉండేది వారి ప్రవచనశైలి. సాంప్రదాయక పద్ధతులను పాటించినా నవీనులనుకూడ ఆకర్షించే విధంగా సాగే వారి ప్రవచనానికి ఆబాలగోపాలం తలలూపవలసినదే! బహిరంగ వేదికలమీద జరిగే ప్రవచనాలు కేవలం వేదికమీద వేంచేసియుండే పండితులకే కాదు వేదికకు దిగువన ఉండే మాన్యులనుండి సామాన్యులవరకూ ఉపయోగించేటట్టుగా ఆలోచింపచేసేటట్టుగా ఉండాలనేది వారి అభిప్రాయం. తదనుగుణంగానే సాగేది వారి ప్రవచనవాహిని.

భక్తినివేదన సంపాదకులుగా వారు ప్రపన్నజనలోకానికిచేసిన సేవలు చిరస్మరణీయం. వారి సంపాదకీయాలే మహత్తర గ్రంథాలై ఎందరికో దిశానిర్దేశం చేస్తున్నాయి. వారి రచనలే వారి వ్యక్తిత్వానికి నిలువెత్తు ప్రతీకలు.



శ్రీరామచంద్రాచార్యస్వామి రచనలు 'ఆర్యోక్తులు, కృష్ణమయ్య, సిద్ధాంతకుసుమాలు, సంప్రదాయ సౌరభాలు, ఆర్యోక్తిసుధ' గ్రంథములను జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ ద్వారా ప్రచురించు సమయంలో డి.టి.పి. ముద్రణాది కార్యక్రమాల్లో అన్వయించినపుడు ఆసమయంలో వారు ఎంతో సౌహార్ద్రంగా ఆశీర్వదించి నందుకు వారికి కృతజ్ఞతలు ఈ సందర్భంలో తెలియజేసుకుంటున్నాను.

శ్రీశ్రీశ్రీ త్రిదండి చినశ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామి వారి పరిపూర్ణకటాక్షపాత్రులై వారు నిర్వహించే ప్రతి ప్రధాన కార్యక్రమంలోనూ ముందుండి సుసంపన్నంచేసిన వారి కార్యనిర్వహణా దక్షత బహుధా ప్రశంసనీయం.

శాస్త్రవిద్వన్మణిగా గోపాలోపాయన పురస్కారగ్రహీతగా వాచస్పతిగా అనేక పురస్కారాలను పొందిన శ్రీమాన్ రామచంద్రాచార్యులవారి పరమపదయాత్ర ప్రపన్నలోకానికి తీరని లోటు. సింహగిరీశుని దివ్యపాదారవిందమధుపమై విహరించిన శ్రీరామచంద్రాచార్యస్వామి వారికి ఆ సింహగిరీశుడు పరమపదంలో నిత్యకైంకర్యమును ప్రసాదించుగాక!యని ప్రార్థిస్తూ వారి కుటుంబసభ్యులకు నా ప్రగాఢ సంతాపమును ప్రకటించు కొనుచున్నాను.

రామానుజ దాసుడు

(signature)

పురాణం వేంకటాచార్యులు, శ్రీరామానుజవాణి

# స్మృతిపీయూషధార

పాంచరాత్రపయోనిధి మోర్త సీతారామభట్టాచార్యస్వామి-
పురోహితులు, ప్రధానార్చకులు, శ్రీ సింహాచలం దేవస్థానం.

మాకు **రుసింగి మామయ్య**అంటే ప్రాణం. మా నాన్నగారిని చూస్తే హడల్. అంచేత తరుచుగా రుసింగి మావయ్య దగ్గరే తారాడేవాళ్ళం. మా నాన్నగారు, రుసింగి మామయ్య మేనత్త మేనమామ పిల్లలు. మా నాయనమ్మగారు పురిటాలిగానే పరమ పదించారు. అందుచేత మా తండ్రిగారిని కూడా వారి మేనమామగారి భార్యే పాలిచ్చి పోషించారు. బావమరుదులు ఇద్దరూ సొంత అన్నదమ్ముల్లాగ, కవలపిల్లల్లాగ పెరిగారు.

నా బాల్యం అంతా రుసింగి మామయ్య దగ్గరే గడిచింది. వారి సాన్నిహిత్యమే నాకు వైదికవిద్యలను, మంత్రశాస్త్ర రహస్యాలను అందించింది. కొంచెం వయస్సు వచ్చాక చిట్టిబావ (శ్రీరామచంద్రా చార్య స్వామివారు)తో పరిచయం పెరిగింది. అప్పుడే వారు కృష్ణాజిల్లాలో ఉద్యోగాన్ని విడిచిపెట్టి విశాఖలో ఆంధ్రాయూనివర్సిటీలో ఎం.ఎ. చదవడానికి వచ్చారు.

చిట్టిబావ మా రుసింగిమామయ్యగారి రెండవ కుమారులు. స్ఫురద్రూపి, చమత్కార సంభాషణ చతురులు. పాదరసంలాంటి బుద్ధి. ఏం మాటాడినా నిండుగా ఉండాలి, ఏ రకమైన వెలితి ఉన్నా ఊరుకోరు. మొదట్లో బెరుకుగా ఉండేది. రానురాను పరిచయం పెరిగింది. బంధుత్వాన్ని మించి, చనువు ఏర్పడింది. అది వారితో అంతరంగ సాన్నిహిత్యానికి దారి తీసింది.

నాచేత పట్టుబట్టి సంస్కృత, ద్రావిడ సంప్రదాయ గ్రంథాలతో పాటు, పాంచరాత్రాగమ సంహితలనూ మా చిట్టిబావ చదివించారు. సంస్కృత గ్రంథాలను నాకు పాఠం చెప్పారు. శ్లోకాన్ని అన్వయించే తీరు చాలా అద్భుతంగా ఉండేది. వారి పాఠప్రవచనం పూర్తి అయ్యేటప్పటికి నాకు శ్లోకం కంఠతః వచ్చేది. అంతేకాదు కారకం, వ్యాకరణ విశేషాలు, అలంకారం వంటి విశేషాలను వివరిస్తూ ఎన్నో ఉదాహరణలను పుంఖాను పుంఖాలుగా వివిధ గ్రంథాలనుండి ఉట్టంకించేవారు. దాంతో మా పరిజ్ఞాన పరిధి విస్తరించింది.

వీటి అన్నింటినీ మించి, వారి పాఠప్రవచన వైలక్షణ్యం ఏమిటంటే, విద్యార్థికి తను చదువుతున్న గ్రంథం పట్ల, కవిపట్ల అపారమైన గౌరవం ఆదరం కల్గించడం. అంతేకాకుండా, ఆ వర్ణనీయ సన్నివేశంతో తన్మయీభావనస్థితికి ఈ పాఠకుని తీసుకొని వెళ్ళడం ఈ రెండు లక్షణాలూ నాన్యత్ర దర్శనీయాలు. నన్ను వైదిక ప్రవృత్తిలో



మలచినదీ, ఇలా విశిష్టస్థానంలో నిలిపినదీ వారే!

వారి నేతృత్వంలో మార్గనిర్దేశంలో ఎన్నో మహత్తరాలు, బృహత్తరాలు అయిన కార్యక్రమాలను మేం సింహాచల దేవస్థానం పక్షాన నిర్వహించాము. వీటి అన్నిటికీ నిదానం ఆయన! ఈ ఉన్నతికి, వైభవానికీ నిదర్శనం ఆయన!

సింహాచలం అంటే పులకరించిపోతారు. సంపెంగల సొగసు లిక్కడివే! యుగళావతారమూర్తి ఈ సింహగిరి నరహరే! అంటూ కవిసమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిని ఆహ్వానించి, వారిచేత మా స్వామికి కవితలను చదివించారు. ఆనాటి చందనయాత్ర సాహితీసదస్సులో ప్రసంగించి, శిరఃకంపము, ప్రశంసావాక్యాలనూ పొందినట్టి జగజ్జెట్టి మా చిట్టిబావ.

కాంత కృష్ణమాచార్యులవారి వాఙ్మయాన్ని గురించి ఎంతో పరిశ్రమించారు. పదకొండో అవతారునిగా ప్రసిద్ధుడైన కృష్ణమాచార్యుని సాహిత్య, అంతరంగావలోడనంతో ఆగకుండా, వచనాలకోసం రాగిరేకులను, రాతిపలకలనూ ఆలయాంతరాలయాల కుడ్యకుహరా లలో అంగుళమైనా విడువకుండా గాలించిన నిత్యగవేషణైకశీలురు వారు. భగవత్కవి శ్రీమాన్ ముడుంబై నరసింహాచార్యస్వామివారి కవితలను స్వామితో బాటు, భక్తజనా లకూ అందించిన ఘనులు వారు.

సింహాచల దేవస్థానంలో కవీశానులతోపాటుగా, యతీశాను లనూ స్వామిసేవకు అందించారు. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు

మా స్వామికి మంగళాశాసనం కావిస్తున్నారంటే అది శ్రీరామచంద్రాచార్యులవారి పురుషకార బలమే!

శ్రీస్వామివారి నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, అయనోత్సవ, వార్షికోత్సవ, విశేషోత్సవాలలో అలంకారం, విశిష్య చంపకమాలాలంకారం ఎలాంటిదో, శ్రీరామచంద్రాచార్యులవారి వాక్ప్రసూనాలంకారం అలాంటిది. ఎన్ని మాలికలు అల్లారు వారు! ఎంతగా సమలంకృతుని చేసారు మా స్వామిని! వారి 'పామాల' నిత్యప్రత్యగ్రంగా మా ఎదలనుండాలి, వారి దివ్యస్మృతి పీయూషధారా శీకరసేచనా లతో.

వీరు చిట్టిబావగానే మొన్న నిన్నటి వరకూ నాకు తెలుసు. అందరూ ఆయన్ను 'ఎమ్.ఎ. చిట్టిగారు' అనడమే అలవాటు. తరువాత కాలంలో వారు శ్రీరామచంద్రాచార్యులుగా ప్రసిద్ధులు. కానీ అలవాటు ప్రకారం నాకుమాత్రం చిట్టిబావగానే వ్యవహారం. దానిని మార్చుకోవడం కష్టసాధ్యమయింది నాకు. వారి సంతానాన్ని అంత ప్రేమించారో లేదో కానీ, నన్ను అతిప్రేమతో, వాత్సల్యంతో సంరక్షిస్తూ – ఒక అర్చకునిగా, అర్చకత్వానికి ప్రతీకగా ఉండాలని, నన్ను తీర్చిదిద్దినవారు శ్రీరామచంద్రాచార్యస్వామివారు.

నేనీనాడు ఉద్యోగునిగా, అర్చకునిగా, పురోహితునిగా, ప్రధానార్చకునిగా అభివృద్ధి సాధించడానికి కారకులువారు, వారి మంగళాశాసనములు. లక్ష్మీనారాయణ యజ్ఞము, రాజగోపుర నిర్మాణ కుంభాభిషేకము, కోటికుంకుమార్చనలు, కోటి తులసి పూజలు, 43 చందనయాత్రలు నాచే సింహాద్రినాథుడు స్వీకరించ డానికి వారి ఉపదేశములు, వారి ఆదేశములే కారణములు.

వారు రాత్రిపూట విద్యాలయములో పనిచేసే రోజులవి... సుమారుగా రాత్రి గం।। 10.30 ని।।లు తరువాత ప్రతిరాత్రి వారితో "ఇష్టాగోష్ఠి". ఎన్ని రాత్రులు మాట్లాడినా ఏదో ఒక విషయంపై అనర్గళంగా మాట్లాడేవారు. ఒకరోజు ఆముక్తమాల్యద, ఒకరోజు ముకుందమాల, ఒకరోజు ఆళ్వందారు, ఒకరోజు సింహగిరి నరహరి వచనాలు, ఒకరోజు సుందరకాండ, ఒకరోజు చంపూ భారతం... నైషధం.. ప్రతాప రుద్రీయం... ఒకటేమిటి వారు మాట్లాడనిదేదీ లేదు.

**వారు విజ్ఞాన సముద్రం. !**

**అలాంటివారి సన్నిధిలో దగ్గరగా ఉండడం అదృష్టం. !!**

**వారు పరమపదించడం నా దురదృష్టం...!!!**

## భక్తినివేదన సంపాదకులు శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారికి నీరాజనం



భక్తినివేదన కార్యాలయ సిబ్బంది

**జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్,**

**సీతానగరం.**

# మాధుర్యపు రుచి మప్పిన మా నాన్నగారు

డా॥ టి.పి. శ్రీనివాసరామానుజమ్-సింహాచలం

మానాన్నగారు శ్రీ.ఉ.వే.శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యుల వారు. జన్మతః అగ్రహారీకులు, జమీందారీ ఫాయీలోనే వారి జీవితం ఆసాంతం గడిచింది. వారు కఠోరనియమపాలన వ్రతులు. బట్టకట్టుకోవడం, బొట్టుపెట్టుకోవడం దగ్గరనుండి అన్నీ ఒక పద్ధతిలో ఉండాలి. అది వారికి అనూచానంగా అంది వచ్చిన లక్షణం.

వేషభాషాభూషాదులలో వారి తీరు చాలా విలక్షణంగా ఉంటుంది. ఎక్కడ ఏ వేషధారణ అవసరమో అక్కడ అలానే ఉండాలి. అలాగే భాషా విషయంలోనూ. సందర్భానుగుణంగా సన్నివేశానుగుణంగానూ మాటలుండాలి. వాటికి రంగు రుచి వాసనా ఉంటాయి. నీరసపదాలు, నిస్సత్తువ పదాలు పనికిరావు. ఎవ్వరి పలుకైనా అలాగే ఉండాలన్న ఆకాంక్ష వారిది. అపశబ్దం అనడం వినడం దుస్సహం వారికి. అంతటి విద్యా తపస్సు కావించి అంతర్వాణుల అంతరంగముల నాచికొన్నారు వారు.

రుసింగి వారి అభిజనం. నాగావళీ తరంగిణీతీర పవిత్ర ప్రాంతంలోనున్న ఒక అగ్రహారం అది. వీరి పూర్వీకులు జ్యోతిష విద్యా పారంగతులు. ముఖవిలోకన మాత్రముననే భూత భవితవ్యములు తెలిపే వారి వైదుష్యానికి అబ్బురపడిన మండలేశ్వరులు బహూకరించిన సుక్షేత్రఖండిక ఈ రుసింగి అగ్రహారం. వారి పెద్దల అభిజనమది. వీరి వరకు సైతమదే, ఆపైన వీరు సింహాచలం తరలివచ్చి ఆ క్షేత్రాన్ని తమ నివాసంగా చేసుకొన్నారు.

బాల్యం ఉపనయనం తొలి చదువులు రుసింగిలో అయినాయి. పితామహులు, సమాశ్రయణాచార్యులు శ్రీ రామస్వామిగారు (సీనియర్ ప్రొప్రైటర్) ఆచార్యతిరువడి చేరగా, ఆ కుటుంబం అంతా వారి జ్ఞాపకాలతో అక్కడ మనలేక, సింహాద్రినాథుని శ్రీచరణాల చెంతకు తరలి వచ్చింది.

అక్కడ నుండి శ్రీరామచంద్రుల విద్యాభ్యాసం సింహాచలం దేవస్థానం పాఠశాలలో సాగింది. శ్రీ. ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం వేంకట నరసింహ భాష్యకారాచార్యులవారు ఈ పాఠశాలలో అధ్యాపకులు. వారు జగత్ప్రసిద్ధులైన పండితులు. వారు అందరికీ 'యస్వీయన్‌గారు'గా పరిచితులు. మన శ్రీభాష్యం అప్పలా చార్యుల వారికి అగ్రజులు. వారు సింహాచలంలో పండితులుగా ఉన్న రోజులవి.

1942-43 ప్రాంతం. రామచంద్రాచార్యులవారిని ఆచార్యులు చేరదీసి, వంశగరిమ- విద్యామహిమలను విశదీకరించారు. గోదావరీ దివ్యతరంగిణీమతల్లికి ఔపదేశిక ప్రతిపత్తిని గరపిన వంశమయ్యా మీది! పావనోదార గోదావరీ దేవి దరిచేరి అనుకంపదలిర్ప పాపాతిశంకా



భావావనోదన నిదానముగా శ్రీరామాయణ కాలక్షేపముల ననుగ్రహించిన మహోదార వంశమయ్యా మీది! రామకథా సుధాభరితాంతరంగ, కృతజ్ఞతాభారనమితాంతరంగ, భక్తిభావశబలితమధురాంతరంగ ఆ దక్షిణగంగ కైమోడ్చి కైవారాలు కావించి - అంజలులతో హరినీలమణుల నుపాయనములుగా ప్రసాదించ ఘనతకెక్కిన వంశమయ్యా మీది! వంశేస్మి న్న పండితో మా భూత్' అని గోదమ్మనుండి వరములనందిన వంశమయ్యా మీది. నదికి కాలక్షేపం చెప్పడం, ఆ నది శ్రద్ధగా వినడం, విని కృతజ్ఞతతో మణులను దోసిళ్ళ నొసగడం, ఆపై నీ వంశంలో జన్మించిన వారంతా పండితులే అవుతారని ఆశీర్వదించడం... ఇదంతా కర్ణరసాయనంగా చెప్పి, అటువంటి వంశంలో పుట్టిన నీవు అంతటి వాడివి కావాలని ఆశాసిస్తూ, ఆ మాణవకుని చేరబిలిచి మలచి మలచి మహనీయునిగా తీర్చిదిద్దుతూ- చదువులతల్లి ఒడిలో ఒడుపుగా కుదురుగా అధివసింపజేసిన మహోదార మూర్తులు. స్థిరతర శుభ్రకీర్తులు శ్రీ యస్వీయన్‌గారు.

ఇలా శ్రీరామచంద్రాచార్యులవారి మానసక్షేత్రంలో విద్యా బీజాంకురార్పణం శ్రీ యస్వీయన్‌గారు కావిస్తే, ఆ విత్తు పెనుమ్రాకై వేళ్ళూని నిల్చేట్లు అమృతధారాభిషేచనములు కావించిన వారు శ్రీ న.చ. రఘునాథాచార్య స్వామివారు. శ్రీస్వామివారి అత్తవారి ఊరు సింహాచలం.

శ్రీ న.చ. రఘునాథాచార్యస్వామివారు కొంతకాలం సింహాచలంలో నివసించారు. శ్రీవారి సోదరులు, రామచంద్రా చార్యులవారు సవయస్కులు. ఆటపాటలతో చేరిక అయింది. ఆ చేరిక ఆచార్యులవారినీ దగ్గరకు చేర్చింది. దానితో వారి ఆచార్యకత్వం వీరికి లభించింది. అది అప్రతిహతంగా సాగి సప్తతినీ జరిపించుకొంది.

ఆచార్యులు అంటే శ్రీరఘునాథాచార్యులవారేనని రామచంద్రాచార్యులవారి అభిసంధి. అన్యూనాతిరిక్తంగా సాగే వారి పాఠప్రవచనం వీరికి అమితానందసంధాయకమైనది. పాఠ్య విషయంతోపాటు ఇతరేతరాంశాలనూ ఆచార్యులు ప్రసంగిస్తే వీరికవి ఆమోద సంధాయకాలై అలరారేవి. సంస్కృత సాహిత్యాన్ని తొలినాళ్ళలో అభ్యసించారు. వారి మధ్య లేఖలు సంస్కృతంలో నడిచేవి. సాహితీసదస్సులుకానీ, శ్రీ వైష్ణవసభలు కానీ ఏమి జరిగినా– వాటినన్నిటినీ పరామర్శించి, గుణదోష విచారణ, పరిష్కారాలతో శ్రీస్వామివారు రామచంద్రాచార్యుల వారికి లేఖలు వ్రాసేవారు. ప్రతిలేఖా 'స్వస్తి సౌహార్దాయ శ్రీమతే రామచంద్రాచార్యాయ' అని ప్రారంభమై, 'భావత్కః' అని ముగిసేది. వాటినిండా అనేకానేక సాహిత్యపు పోకళ్ళు! అసలవి నిజానికి కాదంబరికి నకళ్ళు! వారి మధ్య అంతటి అంతరంగ సాన్నిహిత్యం ఉంది. అన్నగారు అనే మొదట్లో అనేవారు. శ్రీభాష్యం ప్రారంభించారు, ఆ వరుస మారి ఆచార్యులు అయింది. శ్రీస్వామివారు రెండు మూడు దఫాలు సింహాచలం వచ్చి విడిదిచేసి ఉండి కాలక్షేప మనుగ్రహించారు. సింహాద్రి నాథుని సన్నిధిని శాత్తుముఱై అయింది. శ్రీశ్రీశ్రీ జీయరు స్వామివారు, గోపాలాచార్య స్వామివారు, అప్పలాచార్యస్వామివారు, వేంకటాచార్యస్వామివారు మొదలైన పెద్దలెందరో ఆ గోష్ఠికి వేంచేశారు. కులపతులు గోపాలాచార్య స్వామివారు సంస్కృతంలో మాటాడారు. సింహాద్రినాథుడే నిదర్శనంగల పెరుమాళ్ళు అన్నారు. ఎందుకంటే మనకి శ్రీరామచంద్రాచార్యుల వారిని అనుగ్రహించారు కనుక అని వివరించారు. చటుక్కున ఆళవందారు వరదరాజప్పెరుమాళ్ళ ముందు కావించిన ప్రసంగం స్ఫురణకు వస్తుంది, ఇది వింటూంటే!

ఆ పిమ్మట చాలా కాలానికి రామచంద్రాచార్యులవారు తమ ఆచార్యుల వద్దకేగి భగవద్విషయం సేవించారు. ఇలా ఉభయ వేదాంతాలనూ వారి దగ్గరనే సేవించే భాగ్యం శ్రీరఘునాథాచార్య స్వామివారు అనుగ్రహించారు.

సింహాద్రినాథుడు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారితో సాన్నిహిత్యం ఏర్పరచాడు. 30 ఏళ్ళకు పైగా వారి అనుబంధం సాగింది. మా సిమ్మాదిరప్పన్న ఎన్ని అందమైన అపురూపమైన అద్భుతమైన సేవలు వీరినుండి పొందాడో? ప్రతి చందన యాత్రకూ ఈ స్వామి రావాలి! వెయ్యి కలశలతో భాగవతోత్తములు గంగాధారాశీతలాంబువులు కుమ్మరించగా చలువలప్పనికి చలివేస్తుందో ఏమో, ఈ జియ్యరులు వెలయించే నవ్వురేయెండకై అంతగా ఆశపడతాడు! వీరిద్దరినీ కలపడం అందెంత సంభ్రమం, మరెంత సంబరం! సింహాచలం అంటే ఇష్టమే, సంపెగలన్నా ఇష్టమే! సింహగిరిస్వామిని ఎవరు నుతించినా ఇష్టమే, ఆ స్వామి కైంకర్యాలు కావించే వారందరూ రామచంద్రాచార్యులవారి పాలిట కామధేనువులు కల్పవృక్షాలూను! కాంత కృష్ణమాచార్యులు, భగవత్కవులు నరసింహాచార్యస్వామి, కూర్మనాథకవి, కామశాస్త్రిగారు, మా శేషశాయి, వంకాయల నరసింహంగారు.. ఇలాగ.. ఎందరో!

చందనకలపం కలిపిందో, చంపకసౌరభం కలిపిందో తెలియదు కానీ రామచంద్రులకు, చిన్నజీయరులతో గాఢానుబంధమేర్పడింది. ఆ చందనాలచలువ, ఆ చంపకాల తళుకు మా వరకు సాగి వచ్చింది. అది మా అదృష్టం.

శ్రీరామచంద్రాచార్యులవారి సంతానం కావడం మా అదృష్టం. వారి తిరుమేని సంబంధం, తిరువడి సంబంధం కల్గినమేం భాగ్యవంతులం కదా!

రామచంద్రాచార్యులవారి ఆదరణ గొప్పది. వారి మనస్సు వెన్నలా మృదువుగా శీతలంగా స్వాదువుగా ఉంటుంది. వారి పలుకు వజ్రపుతళుకులీనుతుంటుంది.

ఎవరికైనా వారే నేరుగా తళిహచేసి, సాపాటు పెట్టడంలో ఆనందాన్ని పొందేవారు. నాకు ఈ పదార్థం ఇష్టంలేదు అనేవారు సైతం వారిచేతితో పెడితే అద్భుతంగా ఉందని లొట్టలువేసుకొని తినేవారు. అందరికీ అన్నీ అందించాలన్న మనసు వారిది.

శ్రీభాష్యం, మహాభాష్యం వారికి అభిమానపాత్రమైన వచన గ్రంథాలు. శ్రీవత్సాంకులు, పరాశరభట్టారకులు, వేదాంత దేశికులు వారి అభిమాన కవులు. శ్రీ వైష్ణవ స్తోత్ర వాఙ్మయం లోని భాషాభావములు వారికి పరమ స్పృహణీయములు. వైష్ణవపరిభాష వారికి తిరుపణ్యారమంత కమ్మనైనది. రాయలవారి ఆముక్తమాల్యద అన్నా, కాంత కృష్ణమాచార్య వచనములన్నా వారికి గల నెనరు అది ఇంతింతనరానిది. పెరియాళ్వారుల కృష్ణభక్తిని తమ అంతరంగపు సానపై అరగదీసి మాకు వజ్రలేపముగా అనుగ్రహించిన వెజ్జులు ఒజ్జలూ వారు.

**అస్మద్గురుభ్యో నమః**

**నిరంతరం వైష్ణవలోకానికి జీవితాన్ని అంకితం చేసిన శ్రీ.ఉ.వే.శ్రీమాన్ టి.పి శ్రీరామచంద్రాచార్యస్వామి పరమపదాన్ని అలంకరించారని తెలిసి విచారిస్తూ శతకోటి దాసోహాలు సమర్పించు కుంటున్నాం. భక్తినివేదన సంపాదకులుగా వారు అందించిన వ్యాసములను స్మరించుకుంటూ వారి కుటుంబ సభ్యులందరికీ సానుభూతిని తెలియజేస్తున్నాను. వారు సింహాచలనాథునికి సమర్పించిన కైంకర్యములను ఇకపై పరమపదనాథుడు స్వీకరించాలని ప్రార్థిస్తున్నాను.**

**దాసుడు**

**ఎర్నేని రామారావు**

(జీయర్ సంస్థల సలహాదారు)



శ్రీమాన్ తె.కం.గోపాలాచార్యస్వామి, శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివార్లతో
విజయనగరం భాగవతగోష్ఠి



సింహాచలం లక్ష్మీనారాయణ యాగానికి గోపాలాచార్యస్వామి వారిని
తోడ్కొని వస్తున్న రామచంద్రాచార్యస్వామి, గోపాలకృష్ణమాచార్యస్వామి



శ్రీమాన్ తె.కం.గోపాలాచార్యస్వామివారి అనుగ్రహభాషణ సమయం
రేమెళ్ళ సూర్యప్రకాశ శాస్త్రి, సాతులూరి గోపాలకష్ణమాచార్య స్వామివార్లతో



శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి సమక్షంలో ...



వానమామలై జీయర్ స్వామివారి సన్నిధిలో తీర్థగోష్ఠి



శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి శ్రీపాదార్చన సేవలో




భక్తినివేదన స్వర్ణోత్సవ వేడుకలలో ప్రసంగం



డా॥సి.నారాయణరెడ్డి గారిద్వారా సత్కారము



అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి
శ్రీమాన్ ఎన్. చంద్రబాబు నాయుడు గారిచే
భక్తినివేదన స్వర్ణోత్సవ సంచిక ఆవిష్కరణ సమయం




ఢిల్లీలో జరిగిన శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారి 92వ
తిరునక్షత్రోత్సవంలో శ్రీశ్రీశ్రీ వానమామలై జీయర్‌స్వామివారు,
శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామి,



శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారితో సంభాషణ



శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామి వారిచే శ్రీరామానుజవాణవారి
గ్రంథావిష్కరణా మహోత్సవంలో

# నమ్ర నివేదనమ్



శ్రీ ఉ.వే.శ్రీమాన్ టి.పి. రామచంద్రాచార్య స్వామివారు నాకు చిరపరిచితులే! విజయవాడలో జరిగే ఉభయవేదాంత పండిత సభలకు వారు వేంచేసి, శ్రీభాష్యంలో వారికి నిర్ణయించిన విషయాన్ని గురించి తమదైన శైలిలో పండితరంజకంగా ఉపన్యసిస్తూ ఉండేవారు.

ఆ సభలకు వచ్చే పండితులలో ముగ్గురిని ఉత్తరాంధ్రత్రయం అని పిలిచేవారు.

మొదటివారు శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు

రెండవవారు శ్రీమాన్ కందాడ వేంకటాచార్యులుగారు

మూడవవారు శ్రీమాన్ టి.పి. రామచంద్రాచార్యులుగారు

అప్పలాచార్యస్వామివారు సుమారు పది ఏళ్ళ క్రితము, వేంకటాచార్యస్వామివారు సుమారు పదిహేనుఏళ్ళ క్రితము ఆచార్య తిరువడి చేరినారు.

రామచంద్రాచార్యస్వామి కూడా ది. 14.11.2012న ఆచార్య తిరువడి చేరిన సంగతి తెలిసినదే!

పరమపదవాసులు తె.కం. గోపాలాచార్యస్వామివారికి శిష్యులై, వారి పరిపూర్ణ అనుగ్రహమునకు పాత్రులై, ఒక వెలుగు వెలిగిన మహనీయులు అప్పలాచార్యులుగారు, వేంకటాచార్యులుగారు. తమవద్ద ఏ గ్రంథములు సేవించకపోయినా, గోపాలాచార్యులు గారికి రామచంద్రాచార్యస్వామిపై ప్రత్యేక అభిమానం ఉండేది. వారి ఆశీస్సులతోనే రామచంద్రాచార్యస్వామి, శ్రీభాష్యంలో చక్కటి కృషిచేసి, సామాన్యులకు కూడా శ్రీభాష్యంలోని విషయాలు అర్థమయ్యేరీతిలో భక్తినివేదన ద్వారా ముముక్షువులకు అందించిన విషయం, భక్తినివేదన పాఠకులకు తెలిసినదే!

చిన్నతనం నుంచీ ప్రాచీనపద్ధతిలో విద్యాభ్యాసం చేసి, సంస్కృతాంధ్రభాషలు రెంటిలోను తలస్పర్శిగా అవగాహించి, ఆనాటి పండిత ప్రకాండుల మన్నలను పొందిన మహనీయుడాయన. తమ రచనల ద్వారా, తమదైన బాణిలో సాగే ఉపన్యాసముల ద్వారా పరితృశ్రోతృ లోకానికి ఉజ్జీవనమార్గాన్ని నిర్దేశించిన మహామనీషి.

వీరికి కృష్ణదేవరాయలన్నా, వారి ఆముక్తమాల్యద గ్రంథం అన్నా అమితమయిన ఇష్టం. ఈ విషయం మనం భక్తినివేదనమాస పత్రికలో వారి రచనలద్వారా చూస్తూనే ఉన్నాం.

వీరికి తమ గోత్రమూలపురుషుడైన భరద్వాజమహర్షి అంటే అపారమైన ప్రీతి. భరద్వాజ మహర్షి, మూడువందల సంవత్సరాలు వేదాలు చదువుకున్నాడని, వేదవిద్యయందు అత్యంత ఆసక్తికలవాడని, మనకు వేదాలు తెలియచేస్తున్నాయి. అందుచే ఆ గోత్రానికి చెందిన తాము కూడ ఉభయభాషలలోను, ఉభయవేదాంతాలలోను చక్కటి పాండిత్యాన్ని సంపాదించుకుని, తమ కుటుంబ సభ్యులనుకూడ మంచి విద్యావంతులగునట్లు ప్రోత్సహించేవారని పెద్దలవలన విన్నమాట.

తమ జీవితకాలంలో, సాహితీసామ్రాజ్యంలోను, ఉభయవేదాన్తసిద్ధాంత సామ్రాజ్యంలోను అత్యున్నత శిఖరాలను అధిరోహించిన శ్రీరామచంద్రాచార్యస్వామివారిని గురించి నాబోటి సామాన్యుడు వ్రాయబూనడం సాహసమే అవుతుంది.

అయినా కువలయానందం అనే అలంకార గ్రంథంలో అప్పయ్యదీక్షితులు దృష్టాంతాలంకారానికి ఇచ్చిన

**దేవీం వాచముపాసతే హి బహవః సారం తు సారస్వతం ।**

**జానీతే నితరామసౌ గురుకులక్లిష్టోమురారిః కవిః ॥"** గురుకులంలో కష్టాలను అనుభవించి సాహిత్య సారాన్ని గ్రహించిన మురారి శ్లోక ఖండాన్ని శ్రీరామచంద్రస్వామివారికి చక్కగ అన్వయించుకొని ఆనందిస్తూ – సెలవు.

**విజయవాడ** భాగవత దాసుడు

**21.11.2012** **ఉడయవర్లు**

# పవిత్ర స్మృత్యంజలి

డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు, తిరుపతి

**విద్వచ్ఛిరోమణిః శ్రీమాన్ రామచంద్రాచార్యదేశికః ।**
**భారద్వాజాగ్రణీః సోఽయం చిరం విజయతాం తరామ్ ॥**

ఉత్తరాంధ్రత్రయంగా ప్రఖ్యాతి పొందిన ముగ్గురు విద్వద్వరేణ్యులలో వాచస్పతి, సువచః శ్రీవల్లభ, పండితరత్న డా॥ శ్రీమత్తిరుమల పల్లేర్లమూడి శ్రీరామచంద్రాచార్య స్వామివారు ఒకరు. పొట్టివారైనా అన్నిట గట్టివారుగా సంభావింపబడే శ్రీరామచంద్రాచార్యస్వామివారు, కులపతి ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారు, శ్రీ.న.చ. రఘునాథాచార్యస్వామివారి వంటి పండితాగ్రేసరుల సాన్నిధ్యంలో శుశ్రూష చేసిన గురుకుల క్లిష్టులు, విదిత వేదితవ్యులు. చిరకాలంగా "రామస్య దక్షిణో బాహుః" అనే రీతిలో శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారి పూర్ణకటాక్షానికి పాత్రులై, వారికి కుడిభుజంగా నిలిచిన ఈ స్వామివారు శ్రీ చిన్న జీయరు స్వామివారి కార్యక్రమాలలో ప్రత్యక్షంగా, పరోక్షంగా అన్వయాన్ని కల్గినవారు. రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం (తిరుపతి) వారు ప్రదానం చేసిన "వాచస్పతి" బిరుదం, శ్రీ చిన్న జీయరు స్వామివారు అనుగ్రహించిన "గోపాలోపాయన పురస్కారం", శ్రీరామచంద్ర జీయర్ స్వామివారు సత్కరించి ఇచ్చిన "గోపాలదేశిక పురస్కారం", వరంగల్‌లోని "పండితరత్న" బిరుద ప్రదానం మొదలైనవి వీరి పాండిత్యాన్ని, వైభవాన్ని తెలియజేసే కొన్ని నిదర్శనాలు.



దాసునకు శ్రీరామచంద్రాచార్యస్వామివారితో, వారి కుటుంబ సభ్యులతో, చిరకాలంగా గల సాన్నిహిత్యం గాఢమైనది, మరువలేనిది. 1972వ సం॥లో నేను పై చదువుల నిమిత్తం ఆంధ్రాయూనివర్సిటీకి (వాల్తేరుకు) వెళ్ళినపుడు మొట్టమొదటగా శ్రీమాన్ స్వామివారిని వారి తిరుమాళిగలో సేవించాను. వారు ఆనాడు నాపట్ల చూపించిన ఆదరం, ఆప్యాయత ఈనాటికీ నా కళ్ళకు కట్టినట్లున్నది. అప్పటినుండి వారు నాపట్ల పుత్రనిర్విశేషమైన వాత్సల్యాన్ని చూపించి, ఆశీర్వదించారు. వారి మంగళాశాసనం నా అభివృద్ధి హేతువులలో ఒకటిగా నేను సదా విశ్వసిస్తాను. శ్రీమాన్ స్వామివారి కుమారులు శ్రీమాన్ దాశరథి, శ్రీమాన్ శ్రీనివాస రామానుజమ్, శ్రీమాన్ గోపాల్, శ్రీమాన్ శ్రీకాంత్– వీరందరు నా పట్ల చూపించే ప్రీతి మఱువలేనిది.

మా పితామహచరణులు ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామి వారి తిరునక్షత్రోత్సవ సందర్భంగా నరసాపురంలో ప్రతి ఏడు జరిగే ఉభయవేదాంత సభలలో శ్రీమాన్ స్వామివారు రెండు పర్యాయాలు వేంచేసి సభను అలంకరించి మంగళాశాసనం చేశారు. 2006వ సం॥లో శ్రీమాన్ పితామహపాదుల స్మృత్యర్థం సమర్పించే విశిష్టపండిత పురస్కారాన్ని వారు స్వీకరించిన దృశ్యం ఇప్పటికీ నాకంటిముందు మెదులుతున్నది. అన్నిటికి మించి, కంబమహాకవి శఠకోపర్ అన్దాదికి వ్యాఖ్యానాన్ని వ్రాయమని నన్ను పదేపదే వెన్నుతట్టి ప్రోత్సహించి, ఆ ప్రయత్నంలో నాకు పలురీతుల్లో మార్గదర్శనం చేసి, ఆ వ్యాఖ్యానాన్ని తమ పిత్రువ్యులు ఉ.వే. శ్రీమాన్ తి.ప. నారాయణస్వామి వారి స్మృతిగా ముద్రించిన వారి ఔదార్యం మరువలేనిది.

సరసకవులైన శ్రీరామచంద్రాచార్య స్వామివారు విద్వత్పరిశోధకులు, సునిశిత విమర్శను చేయడంలో సమర్థులు. వారికి రాయలవారన్నా, వారికావ్యం ఆముక్తమాల్యద అన్నా వల్లమాలిన ప్రీతి. దాని ప్రభావం వారి వాగ్వైఖరిపై స్పష్టంగా గోచరిస్తుంది. స్వామివారి మనసు మాట, కృష్ణమయ్య, ఆర్యోక్తులు, సిద్ధాంతకుసుమాలు మొదలైన గ్రంథాలు, ప్రతినెల భక్తినివేదన మాసపత్రికలోని సంపాదకీయాలు – అన్నీ వారి రచనా వైభవాన్ని, ప్రస్తావించే విషయంపై వారికి గల పూర్తి పట్టును, అవగాహనను నిరూపిస్తాయి. శ్రీమాన్ రఘునాథాచార్య స్వామివారి కఠోపనిషద్వ్యాఖ్యకు వారు సంతరించిన పీఠిక విలక్షణమైన వారి విమర్శనాదృష్టికి మచ్చుతునక. కృష్ణమయ్య విద్వత్పరిశోధకుల ప్రశంసలను అందుకొన్నది. ఇది వారి Magnum Opus అని చెప్పదగినది. బ్రహ్మవిద్యలను గూర్చివారు సప్రమాణంగా చేసిన వివరణ అమూల్యమైనది. సంప్రదాయ సౌరభాలు అనే గ్రంథంలో పలు సత్సంప్రదాయ విషయాలను గూర్చి వారు పలుశీర్షికలతో చేసిన వివరణలు విజ్ఞానగనులు. "ఆయనకు ఆమెకు అదే తేడా", మళ్ళీ పుట్టాలి. సరే ఎక్కడ? ఎట్లా", "కన్నపు దొంగలు నల్గురు", ఈ ఆరూ కావాలి" – ఈ విధంగా ఆయా విషయాలనుబట్టి వారు పెట్టే శీర్షికలు కూడా విలక్షణంగా ఉంటాయి. ఇక, "సూక్తిం సమగ్రయతు నః" ఇత్యాది శ్రీగుణరత్నకోశ శ్లోకానికి ఉత్తమ సంవాదంగా చెప్పదగిన

**"నవ్యాం దివ్యపరీమళ ప్రణయినీం హృద్యానవద్యాం ప్రియాం**
**జ్యోత్స్నాఫేనతరంగ ఖండ విశదాం మృద్వీకధారానిభామ్ ।**
**సౌహార్దామృత వర్షిణీం హిమజలాసారాభిరామాం మణి**
**శ్రేణీకాంతిమయీం మురారిదయితే! త్వం దేహి మే భారతీమ్॥"**

శ్రీరామచంద్రచార్యస్వామి వారి మధురకవితా ధారకు ఒక మచ్చుతునక. ఇంచుమించు ఎనభై సంవత్సరాలపాటు ఈ విభూతి అలంకరించి వేంచేసి ఉన్న శ్రీరామచంద్రాచార్యస్వామివారు సింహాద్రినాథుని సేవలో నిత్యకైంకర్యాన్ని ఆచార్య పురస్సరంగా చేసికోవడం కోసం పరమపదానికి వేంచేయడం ఒక విధంగా ఆనందదాయకమే అయినా, వారి శాశ్వత విశ్లేషం బంధుమిత్రులను, ఆత్మీయులను, శిష్యకోటిని అనుచరవర్గాన్ని బాధించకమానదు. శ్రీమాన్ స్వామివారు ఆచార్య శ్రీచరణ సన్నిధానాన్ని చేరడంవల్ల శ్రీ వైష్ణవ సమాజానికి, సంప్రదాయానికి కల్గినలోటు తీర్చగల్గినది కాదు – అనేది నిస్సందేహం.

# సముద్ర ఇవ గాంభీర్యే...

'మధురకవి',శ్రీ ఉ.వే.శ్రీమాన్ కోగంటి వేంకటాచార్యులు - ముత్తుపల్లి.



ముత్యాలకూ రత్నాలకూ పగడాలకూ ఆకరం సముద్రం. మన శ్రీరామచంద్రా చార్యస్వామివారు ఒక సముద్రం. సాహితీ సముద్రం, దయాసముద్రం, సద్గుణ సముద్రం. శాస్త్ర సముద్రం!! ఆయన పెదవులే చెలియలికట్ట! ఆయన లోతులెవ్వరూ ఎఱుగలేరు మరి.

లోకంలో సముద్రం చెలియలి కట్టదాటితే అంతా కల్లోలమే! బీభత్సమే! రామచంద్రసాగరం చెలియలి కట్టదాటితే - భావసాహితీ పరంపర. ఆ సముద్రం గద్యంగా, పద్యంగా, ప్రవచనంగా ఎల్లలు దాటి దేవతటినీశీతవాః కల్లోల ప్రథడిందుచేసి, కవితాకల్హార సౌరభ్య సంపల్లాభం గడించి, పంకజసుధామాధుర్యాన్నిమించి, దేశవ్యాప్తమై అలరారి శ్రవణ సుభగమై జీవితాలకొక ప్రయోజనాన్ని అనుగ్రహించి శివేతర క్షతిని కలిగించి శాంతిని ప్రసాదిస్తుంది.

ఆయనమాట చెవిసోకితే ఎవరయినా నిలిచిపోతారు వినాలని. ఆయన వ్యాసం పుస్తకంలో కనిపిస్తే చూపు అక్కడే అతుక్కుపోతుంది. అదే పనిగా చదువుతారు. చదువుకుంటూనే వుంటారు.

ఆయనమాటే ఒక కావ్యం. ఆయన సామీప్యమే స్వర్ధునీస్నానం! ఆ మహానుభావుడు పెదవులతో కాదు కన్నులతో నవ్వులతో మాట్లాడగలరు.

మన రామచంద్రాచార్యస్వామివారి మాటల్లో మల్లెలుంటాయి. తులసీదళాలుంటాయి. ఉరకలెత్తించే ఉత్సాహాలుంటాయి. చురకత్తులుంటాయి. ఆ మాటలూ చూపులూ నవ్వులూనూ ఎదిరిని ఉద్ధరించి నిలిపేవే! ఉన్నతి కలిగించేవే! యశస్సునందించేవే! ఉజ్జీవింపచేసేవే! తత్త్వరహస్యాన్ని తెలిపేవే!

శ్రీరామచంద్రాచార్యులవారి ఔన్నత్యం గుర్తించిన, ఉచితజ్ఞులైన విశ్వవిఖ్యాతయతి సార్వభౌములు, యావత్ప్రపంచ సంపూజ్య చరణులూ శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు వారికి ''భక్తినివేదన'' సంపాదకత్వాన్ని అనుగ్రహించారు. శ్రీరామచంద్రాచార్యులవారి సంపాదకత్వంలో భక్తినివేదన నూతన మహస్సులతోభక్తాళికి ఎంతో ఎంతెంతో విజ్ఞానాన్నందించింది. అనిదంపూర్వంగా భక్తులకు వివిధ విధానాల్లో ఆత్మసంతృప్తిని కలిగించింది. పత్రికా ప్రపంచంలో నిస్సమానమై నిలిచింది. భక్తినివేదన బంగారమయితే శ్రీరామచంద్రాచార్యస్వామివారి వ్యాసాలు - ఆ బంగారానికి తావులద్దాయి.

స్వామివారి సంపాదకీయాలు చదివినవారు ఆసక్తులై, ఆకర్షితులై మరల క్రొత్త పత్రిక వచ్చేదాకా వీరి 'సంపాదకీయాన్నే కొసరి కొసరి చదివేవారు. శ్రీస్వామివారి సంపాదకీయం భక్తినివేదనకు సత్తను కలిగించింది. ఆ పుటలను దాచుకున్నవారెందరెందరో!

దాసుడు ప్రూఫ్‌రైటర్‌గా వున్నప్పుడు ఏదయిన అనుమానం వచ్చి రామచంద్రాచార్యస్వామివారికి ఫోన్ చేస్తే ఆప్యాయంగా వివరంగా "యిలా యిలా" అని చెప్పిన విషయాలు నాకు జ్ఞానప్రదాలయ్యాయి. అవి మధురానుభూతులు. అన్నీ ఎదలో పదిలపరచుకున్నాను.

"భక్తినివేదన రజతోత్సవం''లో శ్రీరామచంద్రాచార్యస్వామి ప్రవచిస్తోంటే, డా॥ సి. నారాయణరెడ్డిగారు తాదాత్మ్యంతో "ఆహా! ఓహో, అబ్బబ్బ" అంటూ లోకాన్ని గమనించకుండగ అచ్చతెనుగు గడుసుపోకడలకు పొంగిపోయారు. అహో! ఏమి భాష!!

రామచంద్రాచార్య స్వామివారిమాట కదిలిస్తుంది - పరవశుల్ని చేస్తుంది. అలాంటి ప్రవచనం మనకిక అలభ్యం.

శ్రీశ్రీశ్రీ జీయర్ స్వామివారి ఆజ్ఞను ఔదలదాల్చి దాసుడు 'మన చరిత్రపుటల్లోంచి' అనే శీర్షికతో వ్యాసాలు వ్రాశాడు. వ్యాసభారత ఉపాఖ్యానాలకు సరళాంధ్రీకరణాల వ్యాసాలు. ఆ వ్యాసరచన వెనుక ఉన్నది శ్రీ రామచంద్రాచార్యస్వామివారి ప్రోత్సాహమే!

ఆయన ఏ శ్లోకాన్ని వ్యాఖ్యానించినా కవి హృదయాంతరాళంలోకి వెళ్ళి చూస్తారు. ఆయన సంపాదకీయాలూ, ఆర్యోక్తులూ శ్రీరామానుజ వాణివారి కృషితో అందరకూ గ్రంథరూపంలో అందుబాటులోకి వచ్చాయి. యిలాటి సద్గ్రంథాలకు రూపాన్నిస్తున్న శ్రీమాన్ పురాణం వేంకటాచార్యులవారి గురించి వారి మెచ్చికోలు ఇంతా అంతాకాదు. ఆ గ్రంథాలు జనపాళికి అమృతత్వాన్నందించే సుధాతరంగాలు.

శ్రీరామచంద్రాచార్యస్వామివారు తాము తేల్చుకొన్న మధురఘట్టాలను చెబుతూ "శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి అంతరంగాన నెనరున నెలకొని వుండటం" ముఖ్యంగా సాయించారు. ఆయన చరణస్పర్శకు పుడమి పులకరించింది. ఇప్పుడు పరమపదం పరవశించిపోతోంది.

**శ్రీయతీశానుల చిత్తమ్ములో నిత్య**
**వాసమ్ము చేయుచు వరలువాడు;**
**సుమముల సౌకుమార్యము గల పల్కులో**
**జుంటితేనెల రుచిచూపువాడు;**
**కమనీయ రమణీయ కావ్యసౌరభముల**
**సంపాదకీయాన చల్లువాడు;**
**భక్తినివేదన పత్రిక పుటలెల్ల**
**ఆధ్యాత్మికామృత మలదువాడు;**
**తన పథమ్మున నించుక తప్పటడుగు**
**లేక వర్తించినట్టి గుణాకరుండు**
**మధుర శ్రీరామచంద్ర నామాంకితుండు**
**పరమపదనాథ సత్సభాప్రముఖుడయ్యె!**

# మహోన్నత వ్యక్తి - గంభీర సౌజన్యమూర్తి

**డా॥ ముడుంబై నరసింహరంగాచార్య -** M.O.L., Ph.D. **గీతాభవనం, జె.పి.ఎన్. రోడ్, వరంగల్.** సెల్ : 9391053883

ఉత్తుంగతుంగ మహోన్నత వ్యక్తిత్వంకల పరమ గంభీర సౌజన్య మూర్తి, ఉభయవేదాంత ప్రవర్తక శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారు. సంస్కృతాంధ్రములలోనే కాక ఆంగ్ల, తమిళ భాషలలో కూడా తగినంత వారికి గల ప్రావీణ్యము ఒక మహా మనీషిని మన కట్టెదుట సాక్షాత్కరింప జేస్తుంది.

**శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామి**వారల శ్రీచరణాలలోను, అస్మదాచార్యపాదులు ఉ.వే. శ్రీమాన్ డా॥ శ్రీ.న.చ. రఘునాథాచార్యస్వామివారు మరియు పరమ భాగవత శిఖామణుల పదసన్నిధిలో తప్ప వేరెవరివద్దా నా ఈ శిరస్సు వంగదని చెప్పుకున్న మహోన్నతమైన ఆత్మాభిమాని శ్రీమాన్ ఆచార్యులవారు.

తాము చెప్పదలచిన విషయం ఎదుటివారికి ఎంత కష్టాన్ని కలిగించేదే ఐనా నిర్మొహమాటంగా సూటిగా చెప్పడం వారి జీవనశైలి. ఏ విషయాన్ని చెప్పదలచినా, వ్రాసినా, ఉపన్యసించినా, కాలక్షేపం చేసినా వారి ముగ్ధ మంజుల మనోహర వచోవిన్యాసం, సరళ సరస గంభీర వాక్య సన్నివేశం శ్రీమాన్ జి. రాధాకృష్ణగా రన్నట్లుగా మనిషిని నిలబెట్టి వినేట్టుగా, చదివేట్టుగానూ చేస్తుంది.

ఆర్యోక్తులు గ్రంథానికి మంగళాశాసనములనుగ్రహిస్తూ, "కవి హృదయాంతరాళాల్లోకి చొచ్చుకుపోవడంతో పాటు, సువిశాల విశ్వవిహాయస వీధులలో గూడ వీరవిహారం చేయనేర్చిన భావనా పౌష్కల్యం నింపుకొన్న"వారుగా శ్రీమాన్ ఆచార్యులవారి వ్యాఖ్యాన పరిమళాలలను లోకానికి వెదజల్లినారు శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామివారు.

సంప్రదాయ కుటుంబంలో జన్మించిన శ్రీమాన్ ఆచార్యులవారికి గిరిగీసుకొని మడికట్టుకొని కూర్చోవడం చేతకాదు. తాము లౌకికంగా అధ్యాపకులుగా ఉద్యోగించిన సందర్భంలోనూ, ఇతరత్రా స్వీయ భావావిష్కరణ చేయవలసిన సందర్భాలలోను మానవీయ విలువలను ఆవిష్కరించిన తీరు వారి హృదయ వైశాల్యాన్ని చూపిస్తుంది. "విశ్వహిత కామన" అన్న వారి భక్తినివేదన సంపాదకీయం అర్థార్జన విషయంలో వారి భావాన్ని వ్యక్తీకరిస్తూనే, మరొక కోణంలో ఈనాడు సమాజంలో "సంపాదనలో ఆర్జవం కొరవడిందని, పక్కవాణ్ణి మించి సంపాదించా లన్న స్పర్థతో ఎదుటివాడి కాళ్లలో కట్ట పెట్టి ఆగేటట్టు చేసి వీడు ముందుకు పోవడం" సరికాదన్న వారి హృదయాంతరాళాలలోని సామాజిక స్పృహను పట్టిస్తుంది.

"బడుగుల చెమటకు వీనలు విసరనక్కరలేదు. మెత్తని వలువ మడతలు ఒత్తనూ అక్కరలేదు. ఆ చెమటను ఎక్కువగా రప్పించి సీసాల కెత్తుకొని వీడు గొంతు నింపుకోకుండా ఉంటేచాలు. వారి చెమట ఫలం కొంత అయినా వారికి దక్కనిస్తే చాలు. అదే పదివేలు" అన్న




వారి మాటలలో బడుగు బలహీనవర్గాల విషయంలో పైపైకి ఉబికి వచ్చిన వారి లోలోతులలో గల దయాస్వరూపం బయటపడుతుంది. ఈ క్రమంలోనే మేరుపర్వత శిఖరానికెగసిన వారి వ్యక్తిత్వ వికాసములకు అస్మత్ పితృపాదులు ఉ.వే. శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యస్వామి వారు ముగ్ధులైనారు. గీతాభవన రజతోత్సవ సంచికలో శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్య స్వామివారు వ్రాసిన వ్యాసం వీరికి, మా నాన్నగారికి గల ఘనిష్ఠ సంబంధాన్ని తెలియజేస్తుంది. పెద్దజీయర్‌స్వామివారి కార్యక్రమాలనుండి చిన్నజీయర్‌స్వామివారి కార్యక్రమాల వరకు ఎన్నో కార్యక్రమాలలో అన్వయించి, శ్రీస్వామివారి కృపకు పాత్రులయ్యారు.

మా నాన్నగారు పరమపదించిన తరువాత మా సోదరులపై ఎంతో ఆప్యాయతతో 2010-11లో గీతాభవనంలో ధనుర్మాసంలో ఆండాళ్ వైభవాన్ని అందించ వలసినదిగా కేవలము ఫోనులో మాత్రమే ఆచార్యుల వారిని మేము ప్రార్థించాము. ఇక్కడ వారికి మేమేమీ సౌకర్యాలు అందించకపోయినా తమ ఆరోగ్యాన్ని కూడా లెక్కచేయ కుండా గోదావైభవాన్ని అందించిన వారికి మేమేమి చేయగలిగినాము? ప్రణామాంజలి తప్ప.

శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామివారి మార్గదర్శనంలో భక్తినివేదనకు సంపాదకత్వము స్వీకరించిననాటినుండి ఆధ్యాత్మిక విషయా లనందిస్తూనే వాటిలో వారు ఆవిష్కరించిన నైతిక, సామాజిక, సాంఘిక విషయాలు ప్రతివారికి అవశ్య పఠనీయములు. వానినన్నింటిని ఒక గ్రంథముగా వెలువరిస్తే పాఠకులకు ఒక గొప్ప వరమౌతుంది.

ఇంతటి మహోన్నత శిఖరం వాలిపోవడం జిజ్ఞాసువులైన వారికి ఎనలేని లోటుగానే భావించవలసి ఉంటుంది. శ్రీమాన్ ఆచార్యులవారి విషయంలో మా గీతా ప్రచారక పరిషత్తు భక్తి భావ బంధుర స్మృత్యంజలి సమర్పణం గావిస్తున్నది.

# మా రామచంద్రాచార్య స్వామివారు

తె.కం. వెం. అయ్యంగార్, విశ్రాంత గణితశాస్త్రాచార్యులు, వరంగల్

ఉ.వే. శ్రీమాన్ టి.పి.శ్రీరామచంద్రాచార్య స్వామివారితో నా పరిచయం వయస్సు సుమారు 40 సం॥రాలు. 1975నుండి పరోక్షంగాను, 1987 నుండీ ప్రత్యక్షంగానూ నాకు వారి పరిచయభాగ్యం కలిగింది. శ్రీస్వామివారు సాహిత్యలోకంలోనూ, ఆధ్యాత్మికరంగంలోనూ ప్రసిద్ధులు, అందరికీ తెలిసినవారే. భక్తినివేదన పాఠకులకు ప్రతినెలా దర్శనం ప్రసాదించిన ఆచార్యులు. ఇక వారిని అలా దర్శించమనే భావన వారి ఆత్మీయులందరినీ బాధించేవిషయం.

శ్రీరామచంద్రాచార్యస్వామివారు పరమహంస శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారికి, మహామహోపాధ్యాయ, శ్రీన.చ. రఘునాథాచార్య స్వామివారికి అత్యంత సన్నిహితులు, ఆప్తులు, వారిరువురి ఆదరణనూ పొందిన మహామహులు. శ్రీఉ.వే.గోపాలాచార్య స్వామివారి తరువాత భక్తినివేదనకు సంపాదకులుగా శ్రీరామచంద్రాచార్యుల వారిపై ఉంచి, పత్రికయొక్క సర్వతోముఖ అభివృద్ధిని శ్రీజీయర్‌స్వామివారు దర్శించారు.

**రఘునాథదేశికులతో వారి సాన్నిహిత్యము:**

శ్రీరామచంద్రాచార్య స్వామివారు, శ్రీమాన్ రఘునాథాచార్యుల వారి శిష్యులలో ప్రధానులు. అందరికన్నా, అన్నివిధాలుగా, ఉన్నత స్థాయిలోనివారు. ఆచార్యులవారి చేత, చిన్నతనంలోనే ఎంతగానో ప్రభావితులైన శిష్యులు. ఆచార్యులవారి సన్నిధిలో వారెంతో నేర్చుకున్నారు అనడం అంత సరికాదు. వారితో, వారి వాత్సల్యానికి, ప్రేమకు పాత్రుడైన, ఆత్మీయుడైన చిన్న పిల్లవాడిగా సంస్కృత సాహిత్యాన్ని అభ్యసించిన ధన్యులు స్వామివారు. వారి మాటలలో "చిన్ననాట చేరదీసి సౌహార్దపు సౌభ్రాత్రపు హిమాంబువుల చిరుజల్లులు చిలుకరించి విబుధవాణి పదమంజుల మంజీరధ్వనులు వినిచి సాహిత్యోపనిషత్తులు సమగ్రముగా, సరసముగా ఉపదేశము కావించిన అన్నగారు తమకు శ్రీమద్రఘునాథాచార్యవర్యులు".

తమ చిన్నతనంలో, ఆచార్యులవారు రెండు సంవత్సరాలు సింహాచలంలో గడిపినపుడు వారింటి అరుగులమీద కూర్చుని, వారు పిలిచి పెట్టిన మామిడితాండ్ర, పనసతొనలు తింటూ, కబుర్లాడుతూ, సంస్కృత సాహిత్యాన్ని ఆస్వాదించినవారు స్వామివారు. అపుడు సంస్కృత శ్లోకాలతో 'అంత్యాక్షరీ' ఆడేవారట స్వామివారు, ఆచార్యుల వారు కలసి. అపుడపుడు, ఒక్కొక్క అక్షరంతో ఆరంభిస్తూ, ఆచార్యుల వారు శ్లోకం చెప్తే, "ఆ శ్లోకానికి ఆకారం ఏదో చెప్పండి? ఎక్కడుందో చూపించండి?" అని ఆచార్యులవారిని నిర్బంధించేంతటి ఆత్మీయత, చనువు కలవారు స్వామివారు. అప్పటికే రఘునాథాచార్యుల వారు సంస్కృతంలో ధారాళంగా ఆశువుగా శ్లోకాలు చెప్పేవారట. అందుకని, ఆటలో, అంతకుముందులేని, అప్పటికప్పుడు కూర్చిన శ్లోకం చెప్తున్నారేమోనని "ఆకరానికై పట్టుపట్టేవాడిని" అన్నారు గత స్మృతులలో తన్మయులౌతూ స్వామివారు ఒకసారి.

రఘునాథాచార్యుల వారికి స్వామివారంటే ఎంతో ప్రేమ. వారే సింహాచలం వెళ్ళి, శ్రీభాష్యాన్ని కాలక్షేపంగా అనుగ్రహించారు. అల్లాగే స్వామివారికి అపారమైన ఆచార్యనిష్ఠ. డెబ్బది సంవత్సరాలు దాటిన వయస్సులో "ఎందుకండీ ఈ శ్రమ మీకు?" అని ఆత్మీయులన్నా వినక సింహాచలం నుండి సతీసమేతంగా వరంగల్ వచ్చి ఆచార్యసన్నిధిలో "భగవద్విషయం" సుమారు ఒకటిన్నర సంవత్సరాల కాలం ఉండి సేవించడం వారికి సంప్రదాయం పై ఉన్న నిష్ఠకు తార్కాణం. అల్లాగే తాము విన్నదాన్ని తిరిగి కాలక్షేపరూపంలో పుత్రులకూ, అభిరుచిగల శ్రోతలకూ అనుగ్రహించి భగవద్విషయ కాలక్షేపపరుల గోష్ఠిలో స్థానాన్ని పొందిన ధన్యులువారు.

**నాతో అనుబంధము :** ఉభయవేదాంత సభల రజతోత్సవాలు 1987లో విజయవాడలో జరిగాయి. ఈగోష్ఠిలో ఒక ఉపన్యాసం రామచంద్రాచార్యస్వామివారిది. వారు 'పెరియాళ్వారుల కృష్ణానుభవము" గురించి ప్రసంగించారు. సూరదాసు కవిత్వాన్నీ, పోతన భాగవతాన్నీ, కొన్ని సంస్కృత శ్లోకాలనూ ఉదహరిస్తూ, పెరియాళ్వారుల పాశురాలను వివరిస్తూ, ఆళ్వారుల భావనలలోని ఆర్ద్రతనూ, విశేషాలనూ, విశ్లేషిస్తూ, పెరియాళ్వారుల కృష్ణానుభవాన్ని గురించి అద్భుతంగా ఉపన్యసించారువారు.

ఆ సభలో మర్నాడు "విష్ణుపురాణప్రాశస్త్యం" గురించి నేను ప్రసంగించుభాగ్యం కలిగింది. వేదికపై నేనూ, శ్రీశ్రీశ్రీ జీయరుస్వామి వారు, మరంగంటి శ్రీరంగాచార్యస్వామివారు ఉండగా, శ్రోతలలో శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారు, స్వామివారూ, మరెందరో ఉన్నారు. ఆ మధ్యాహ్నం నా ప్రసంగవ్యాసాన్ని ఆమూలాగ్రం చదివి రామచంద్రాచార్యస్వామివారు, శ్రీభాష్యంవారితో "ఈయన ప్రణాళిక చాలా గొప్పది" అని ప్రేమగా మెచ్చుకున్నారు. ఆ తర్వాత చాలా సార్లు వేదాంతసభలలో పాల్గొనే అవకాశము, పలువిషయాల గురించి ముచ్చటించే భాగ్యమూ నాకు కలిగాయి.

భక్తినివేదన స్వర్ణోత్సవాల సందర్భంగా "సౌవర్ణనివేదన"లో పలువురు పెద్దల సరసన నన్ను కూడా ఒక వ్యాసం వ్రాయమని కోరడం వారికి నామీద కల అవ్యాజమైన ప్రేమకు నిదర్శనం. భక్తినివేదనలో "సుధామధుతరంగిణు"ల పేర పలువురు పెద్దలను పరిచయం చేస్తూ, నాగురించి కూడా వారు వ్యాసం వ్రాయడం నాపై వారు చూపిన ఆదరానికి నిదర్శనం. "అయ్యంగార్‌స్వామి" అని ఆత్మీయంగా పలకరించడమూ, వారి కుటుంబ సభ్యులందరికీ నాగురించి గొప్పగా చెప్పడమూ, నేను మరచిపోలేని విషయాలు.

విషయాన్ని నిర్మొహమాటంగా ప్రకటించడం వారి ప్రత్యేకత. అల్లాగే మాలాంటి వాళ్ళం ఎప్పుడైనా వారికి ఏదయినా విషయాన్ని విన్నవిస్తే మా భావాన్ని గ్రహించడమూ వారి ప్రత్యేకత. వారు సేవించిన పెద్దల మంగళాశాసనాలూ, వారు ఆరాధించిన సింహాద్రినాథుని అనుగ్రహము, రామానుజ పాదసంబంధమూ, వారిని నిత్యులతోనూ, ముక్తులతోనూ చేర్చి, ఆ శ్రియఃపతిలాలనలో వారు సదా తన్మయులవుతారనే భావనయే, అస్మదాదులకు వారు లేరనేలోటు తీరుస్తుంది.

# పుణ్యశ్లోకులు
# శ్రీరామచంద్రాచార్యులవారు

ప్రాచార్య శ్రీమాన్ శలాక రఘునాథశర్మ

శ్రీమత్తిరుమల పల్లెర్లమూడి రామచంద్రాచార్యులవారు అత్యంత పవిత్రమైన కార్తికమాసం నందన నామసంవత్సరంలో ప్రవేశించిన పుణ్యదినాన భౌతికకాయాన్ని వదలిపెట్టారు. వారు ముక్తకోటిలోనికి చేరి ఉంటారనటానికి ఇది ఒక తార్కాణం. శ్రీవారు పుణ్యశ్లోకులు. కనుక వారిని గురించి సంభావించటం, సమానధర్ములతో సంభావింప జేయటం పుణ్యప్రదం. కాబట్టి వారిని గురించి నా భావాలను అక్షరబద్ధం చేస్తున్నారు.

మాది కృష్ణాజిల్లా, నూజివీడు తాలూకా, గొల్లపల్లి గ్రామం. శ్రీరఘునాథ స్వామివారు కోరి వరించి దేవాలయం కట్టించుకొన్న పుణ్యక్షేత్రం. మా ఊరి నానుకొని 'రాములేరు' అనే ఒక తీర్థం కూడా ప్రవహిస్తున్నది. మా ఊరిలో విభిన్నరంగాలలో ప్రసిద్ధికెక్కిన మహానుభావులు కొందరు నివసించారు. అటువంటి వారిలో ప్రథమగణ్యులు శ్రీమాన్ రామచంద్రాచార్యులవారు. నాకు బాల్యంలో అంతగా వారిని పరిచయం చేసుకొనే భాగ్యం కలుగలేదు కానీ, మానాయనగారికీ, వారి సన్నిహిత బంధువులు శ్రీమత్తిరుమల పల్లెర్లమూడి వరదాచార్యులు గారికీ పరమాత్మీయమైనమైత్రి ఉండేది. వారి సంతానానికీ మాకు ఆ మైత్రి అవిచ్ఛిన్నంగా ఇప్పటికీ కొనసాగుతున్నది.

శ్రీరామచంద్రాచార్యులవారు మా ఊరివారు అన్నంత మాత్రమే కాదు నాకు వారి పట్ల గౌరవం. వారు గొప్పపండితులు. గొప్ప అధ్యాత్మవిద్యాగురువులు. గొప్ప తాత్త్వికులు. అనుష్ఠాన వేదాంతులు. అట్టివారితో పరిచయం ఉండటమే ఒక గొప్ప సంగతి. దానికితోడు వారికి నాయందు చాలా గొప్ప వాత్సల్యం. అనేక పర్యాయాలు వారి వాత్సల్యం కారణంగా నాకు సింహాచల నరసింహస్వామివారి సన్నిధిలో వాఙ్మయార్చన చేసే భాగ్యం కలిగింది.

శ్రీరామచంద్రాచార్యులవారు జీవికకోసం కృష్ణాజిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో కొన్ని గ్రామాలలో తెలుగు పండితులుగా ఉద్యోగం చేశారు. అటు పిమ్మట, విశాఖ పట్టణం మిసెస్ ఎ.వి.ఎన్. కళాశాలలో ఆంధ్రోపన్యాసక అధ్యక్ష స్థానాన్ని అలంకరించారు. ఈ విషయంలో కూడా నాకు వారి అడుగుజాడలలో నడిచే అదృష్టం కలిగింది. నేను కూడా చాలా పాఠశాలలో తెలుగు పండిత పదవిని పొందాను. ఎ.వి.ఎన్. కళాశాలా ఉన్నత పాఠశాలలో కొన్నాళ్ళు పై స్థాయి తెలుగు పండితుడుగా పనిచేశాను. అయితే ఈ ఉద్యోగసంబంధంగా చెప్పుకోవలసిన మాట, వారిని గురించి ఒక్కటి మాత్రమే. వారి శిష్యులమని చెప్పుకొన్నవారి భాగ్యమే భాగ్యం.

ఉత్తరాంధ్రలో ప్రసిద్ధి పొందిన వైష్ణవత్రయం ఉన్నది. అందులో మొదటివారు శ్రీభాష్యం అప్పలాచార్యస్వాములవారు, శ్రీమాన్ కందాళ వేంకటాచార్యులవారు, శ్రీరామచంద్రాచార్యులవారు. ఉభయవేదాంత ప్రవర్తక సార్వభౌములు ఈ ముగ్గురు. ఆగమ విషయంలోగానీ, అధ్యాత్మ విద్యా విషయంలో గానీ అనుయాయులకు కలిగే ఏ సందేహాలకయినా మనోవిశ్రాంతిదాయకములైన పరిష్కారాలను చెప్పటంలో ఈ ముగ్గురూ మహాప్రసిద్ధులు.

సింహాచల క్షేత్రాన్ని, ఆ స్వామినీ ఉపాసించిన మహితాత్ములు. వారు సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో అనర్గళంగా ప్రసంగించే నైపుణ్యం పుష్కలంగా ఉన్నవారు కావటం వల్ల భారతరాష్ట్రపతి స్థాయి వ్యక్తులు ఆ క్షేత్రానికి వస్తే క్షేత్ర, క్షేత్రస్వామి మహిమలను వారికి మానసోల్లాసం కలిగే విధంగా వివరించే వారట. ధార్మిక విషయాలలో నిష్కర్షగా వ్యవహరించే వారని విన్నాను.

శ్రీ వైష్ణవధర్మ అనుష్ఠాన ప్రవచనాలలో శ్రీవారిది నిష్ఠతో కూడిన వ్యవహారం. ప్రసంగాల ద్వారా, రచనల ద్వారా, ఉత్తమ శిష్యులకు మంత్రోపదేశ ప్రదానాల ద్వారా వారు వైష్ణవ ధర్మాన్ని వ్యాప్తిలోనికి తెచ్చారు. కృష్ణమయ్య, వ్యాసమాల మొదలైన గ్రంథాలను రచించి, భాగవతానురక్తిని ప్రజలలో కలిగించారు. అందులో 'వ్యాసమాల' అనే గ్రంథం ఒకప్పుడు ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో కొన్ని పరీక్షలకు పాఠ్యంగా ఉండేది. అలాగే అనేక కీర్తనలు రచించి భగవత్తత్త్వాన్ని ప్రజల హృదయాలలోనికి చొప్పించే ప్రయత్నం చేశారు.

"మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అన్నారు శ్రీ శంకరులు. మోక్షసాధన సామగ్రియందు భక్తియే గొప్పది. భగవంతుడు గీతలో "నమే భక్తః ప్రణశ్యతి" అని ప్రతిజ్ఞాపూర్వకంగా ప్రకటించాడు. మహాత్ములు భక్తిని అనుసంధానం చేసుకుంటూ భక్తితత్త్వాన్ని జనరంజకంగా తెలియజేస్తూ ఉంటారు. ఆ లక్ష్యంతో రూపొందినదే "భక్తినివేదన" అనే ఆధ్యాత్మిక పత్రిక. దాని సారథ్యాన్ని శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు శ్రీరామచంద్రాచార్యులవారికి అప్పగించారంటే వీరి భక్త్యనుసరణ ప్రచారణల సామర్థ్యం ఎంత గొప్పస్థాయికి చెందినదో మనం గమనించవచ్చు. కొన్ని వేలమంది పాఠకులలో భక్తిదీపపు కాంతులను నిర్నిద్రంగా ప్రసరింపజేస్తూ ఉన్న ఆ పత్రిక శ్రీ ఆచార్యుల వారి సంపాదకత్వంలో, వారి తుదిశ్వాస దాకా, సాగుతూ వచ్చిందనటం ఒక విశేష విషయం. ఆ స్ఫూర్తితోనే భవిష్యత్తులో కూడా అది విరాజిల్లుతుంది.

శ్రీరామచంద్రాచార్యస్వామివారి విశిష్టతను గురించి, వారి సౌజన్య వాత్సల్యాలను, స్మృతిపేటికలో నిక్షిప్తమై ఉన్న దానిని యథాశక్తి అక్షరబద్ధం చేయగలిగినందులకు నన్ను నేను అభినందించు కుంటున్నాను. శ్రీ సింహాచల లక్ష్మీనరసింహస్వామి శ్రీవారికి ఉత్తమోత్తమ సామీప్యాది ముక్తిలక్షణాలను అనుగ్రహించి ఉంటారని విశ్వసిస్తున్నాను. ఇతిశమ్.

# కవి సింహమునకు సింహాచలం నిలయం

అమరవాది నరసింహాచార్య-అల్వాల, సికింద్రాబాద్.

'భక్తినివేదన' పత్రికా సంపాదకులు శ్రీ ఉ.వే.శ్రీమాన్ టి.పి. రామచంద్రాచార్యులుగారు. శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి పరిపూర్ణ అభిమానపాత్రులు. జీవితాంతము పత్రిక నిర్వహణకు అంకితమైన త్యాగమూర్తి. ధన్యజీవి, పరిపూర్ణాయుష్యవంతులు.

సత్సంప్రదాయ కుటుంబంలో జన్మించి చివరి వరకు సాంప్రదాయ పరిరక్షణ దీక్షా దక్షులైరి. స్వయం తీర్త్వా పరాన్ తారయతి' అన్నట్లు పత్రికాముఖంగా వేలాది జనులను తమ ప్రవచన వాగామృతమున నోలలాడించిరి. వీరి కవిత్వము ప్రౌఢ సమాస రచనాలంకార శోభితమై సహృదయ హృదయరంజకమై యలరారుచుండును.

తమకున్న సంస్కృతాంధ్ర కవితాపాండిత్యములకు తోడు బంగారమునకు పరిమళమబ్బినట్లు ఉభయ వేదాంతములనధికరించి తమదైన ధోరణిలో ఉపన్యాసములనందించిరి. సంస్కృత భాషా సొబగులను ఆంధ్రభాషతో మేళవించి మణి ప్రవాళ ప్రవచన రచన గావించిరి.

శ్రీ ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యులగారి పోషణలో యౌవ్వనము సంతరించుకున్న భక్తినివేదన పత్రికా సీమంతిని వీరి పర్యవేక్షణలో ప్రౌఢయై విరాజిల్లినది. సభలకు మొదట ఉపనిషత్ ప్రవచనం ద్వారా ప్రవేశించి క్రమంగా ద్రావిడ- సంస్కృత వేదాంతోపన్యాసకులుగా వాసికెక్కి తిరుమల రజతోత్సవాలలో బిరుదగ్రహీతులైరి.

ఆంధ్రదేశంలో సుప్రసిద్ధ నృసింహ క్షేత్రమైన సింహాచలము ఈ కవి సింహమునకు ఆలవాలము.



'లే జవరాలు చెక్కుగీటిన వసవల్చు బాలకుడు డెందమునం గలుగంగ నేర్చునే' యనునట్లు తెలుగు, వ్యవహారభాష కలవడి సంస్కృతాంధ్ర కావ్య నాటకాదుల వైపు చూడ నొల్లని నేటితరంలోని కొందరికి రామచంద్రాచార్యులగారి వర్ణనా పాటవము, అలంకార వైచిత్రి రసస్ఫోరక రచన సులభ గ్రాహ్యము గాక తికమకగా కొంత అర్థావగాహనలో మాంద్యమేర్పడవచ్చు గాక - ఐననేమి?

గత కొంతకాలము నుండి సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీ కృష్ణదేవరాయల 'ఆముక్తమాల్యద' కావ్య సుమ మధుర మంజుల మోహన ముగ్ధ వైదగ్ధ్యము 'రాయల ఊహల పల్లకి' ద్వారా 'భక్తినివేదన' పత్రికలో మన రామచంద్రాచార్యులు గారు ధారావాహికంగా మనకందించుచున్నారు. రాయల కవిత్వము మనకు నారికేళపాకమై విద్వజ్జనులకు మాత్రము మనోరంజకము. అద్దానిని మన వద్దకి సులభశైలిలో తెప్పించి మెప్పించిన ప్రజ్ఞాధురీణులు వీరు.

మొదట వీరు M.A. చిట్టిగారుగా వాల్తేరులోని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తమ విజ్ఞాన సుమమును పూయించిరి.

మన రాష్ట్రములో ఉభయ వేదాంత పండితుల వివరములను 'భక్తినివేదన'లో సుధా మధురంగిణులు శీర్షిక ధారావాహికగా 2,3 సంవత్సరములు వెలువరించుటలో వీరి కృషి అమోఘము.

అప్పట్లో పండితుల వివరాలు, ఫోటోలు ముందుగా సేకరించి ఉత్తరాలు వ్రాసి బయోడేటా తెప్పించుకొని వరుసగా ప్రతినెల పత్రికలో ప్రచురించి పఠితలను మెప్పించిన ధీశాలురు.

'ప్రజాయై గృహమేధినామ్' అన్నట్లు ఉత్తమ గృహస్థులై సుగుణాలనేక సుపుత్రులను బడసిరి. అంతేకాదు వారిని చక్కని క్రమంలో పెంచి పెద్దజేసి సాంప్రదాయ సౌరభములనందించి పవిత్రులను గావించిరి. 'పితరం రోచయామాస' అన్నట్లు పుత్రులు తండ్రికి తగినవారుగా సింహాచల దేవస్థానంలో స్థానాచార్యులుగా సేవలందించు స్థాయిగలవారైరి. అధీతి-బోధా-ఆచరణ-ప్రచారణులై, అనేక బిరుదులు, సన్మానములు లభించి కృతకృత్యులైరి. వారు అనేక వేలమంది మదిలో సుప్రతిష్ఠులైన చిరంజీవులు. వారి గురించి ఎంత రాసిన చాలదు.

# అశ్రునివేదన



తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య
సిద్ధాంతి, జనగాం.

శ్రీ ఉ.వే.శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారు ఆచార్య శ్రీచరణ సన్నిధిని చేరుట శ్రీ వైష్ణవ లోకానికంతటికి తీరని లోటు.

శ్రీవారు మన భక్తినివేదనకు సంపాదకులుగా అనేక సేవలనందించారు. "వస్త్రేణ వపుషా వాచా విద్యయా వినయేన చ" అన్నట్లు శ్రీరామచంద్రాచార్యస్వామివారు పురాణ సముచ్చయ జ్ఞానము, చక్కటి వాగ్ధాటి, మధురభాషణ కలవారు. పదగుంభన, రససిద్ధి గల కవీశ్వరులు, యశఃకాయులు. శ్రీమన్నారాయణుడే శేషియని సంపూర్ణముగా ఆ పరమాత్మకు ఆధీనమైన స్వరూపస్థితి కలవారు. మహానుభావులు, మహాజ్ఞానులు, వాసుదేవుడే తన సర్వస్వమని భావిస్తూ నిరంతరము సింహాద్రినాథుని స్తుతిస్తూ అనేక గ్రంథ, వ్యాస, రచనలతో మరియు ప్రసంగాలతో అందరిని మంత్రముగ్ధుల్ని చేసేవారు. వీరికి సాలోక్య, సారూప్య, సామీప్య, సాయుజ్యములు కలగాలని శ్రియః పతిని ప్రార్థిస్తూ..

# స్మృత్యంజలి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు పరమపదించిన వార్త ఆశ్చర్యాన్ని, ఆవేదనని కలిగించింది. సంస్కృతాంధ్రభాషలలో నిష్ణాతులయిన ఈ స్వామి భక్తినివేదన ద్వారా అందించిన వ్యాసాలు ఆణిముత్యాలు. శ్రోతలుగాని, పాఠకులు గాని నా స్థాయికి ఎదిగి నా భాషని అర్థం చేసుకోవాలి. అంతేగాని నేను ఆ ఎత్తునుంచి దిగిరాను లోకమంతా జ్ఞానాభివృద్ధిని చెందాలి, అనే వారి తపన అలనాటి సంస్కృత కవులను స్మరింపచేసింది.

భక్తినివేదన ఏ విధంగానూ పాఠకులను అసౌకర్యానికి గురిచేయకూడదని వారి ఆశయం. సంపాదకులుగా ఎంతో శ్రద్ధవహించి ఆ పత్రికను తీర్చిదిద్దారు. శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామి వారి ప్రత్యేక అభిమానాన్ని చూఱగొన్నారు. పరమపదనాథుని సేవలో నిత్యకైంకర్యంలో అన్వయించే భాగ్యం పొందారు. వీరికి దాసోహములు సమర్పిస్తూ...

డా॥ టి.కె. చూడామణి

# సింహాచల సంపంగి సాహిత్యపరిమళాలు ఇక లేవు...

శ్రీ రామచంద్రాచార్యస్వామివారు పరమపదించారు అన్న వార్త విని, శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆజ్ఞతో వారి చరమదేహాన్ని సేవించుకునే భాగ్యం కలిగింది. గత 15సంవత్సరాలుగ శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్య స్వామివారితో మన 'భక్తినివేదన' వ్యాసాల పరంగ ఫోన్ ద్వారా సంప్రదింపులు జరుపుతూ ఉండేవారం. చాలా ఓర్పుగ, అర్థమయేరీతిలో వ్యాసాలగురించి విపులంగ తెలిపేవారు.

శ్రీరామచంద్రాచార్యస్వామివారిని మాతండ్రిగారైన కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యస్వామివారి పేరిట 'కవిరత్న' పురస్కారాన్ని స్వీకరించవలసినదిగ ప్రార్థించగ, మా కుటుంబసభ్యుల ప్రార్థనను మన్నించి, 2006వ సం॥లో విచ్చేసి, పురస్కారాన్ని స్వీకరించారు.

నడిగడ్డపాలెం ఆశ్రమంలో ఏటా జరిగే శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారి తిరునక్షత్రమహోత్సవానికి, పరమపదోత్సవాలకి విచ్చేసి, వారి మధురసూక్తులను, అనుభవాలను భక్తులందరికీ అతి మధురంగ అందించేవారు.



మన వైదిక కుటుంబంలో వారిలేని లోటు ప్రస్తుత తరాలకి తీర్చలేనిది. వారి కుటుంబసభ్యులకు కవిగారి కుమారులైన బదరీనాథ్, కూర్మనాథ్, రఘునాథ్ సోదరులు ప్రగాఢ సంతాపాన్ని తెలియ జేస్తున్నాము.

గుదిమెళ్ళ రఘునాథ్
సీతానగరం

# జాతి వజ్రం చేజారిపోయింది

శ్రీమతి క. తిరువేంగళమ్మ, విజయనగరం



**శ్రీరామచంద్రాచార్య**స్వామివారిని ఇక 'ఊహలపల్లకీలో'నే దర్శించాలంటే అది వాస్తవమే నని అంగీకరించనంటోంది మనసు. ఉత్తరాంధ్ర త్రయంగా విఖ్యాతులైన మహితాత్ములలో చివరగా శ్రీరామచంద్రాచార్యస్వామివారు ఆధ్యాత్మిక పరిమళాలను, సంప్రదాయ సౌరభాలను, ఆంధ్ర భాషాయోషాలంకారులుగా గుదిగుచ్చి అందించి, తమ మిత్రులను కలుసుకోవడానికి అపరాజితకు, పయనమయారనే వాస్తవాన్ని జీర్ణించుకోవడం కష్టంగ ఉన్నది.

సార్వభౌమ వర్చస్కంగా, వైభవసనాథంగా వంటి పదప్రయోగా లతో, ప్రామాణికమైన సంభాషణాచాతుర్యంతో మన మనసులను ఆకట్టుకున్న శ్రీరామచంద్రాచార్యస్వామివారు, మాకుమాత్రం 'చిట్టిమామయ్యే'. మా బంధుజాతంలో ఎం.ఎ చదువుకున్న మొదటివ్యక్తి ఆయనేనేమో, ఆయనను అందరూ ఎం.ఎ. చిట్టిగారు అనే వారు. చిట్టిమామయ్యా అనే పిలిచేవాళ్ళం. మా నాన్నగారు చాలా గౌరవంగా 'రామచంద్రాచార్యస్వామీ' అని ఉట్టంకిస్తూ ఉంటే, మా అమ్మగారు మాత్రం 'మా చిట్టి వచ్చాడండీ!' అంటూ ఆత్మీయంగా మాటాడేది. మామయ్యకూడా అత్తా! అత్తా! అంటూ అమ్మని ఎంతో ఆప్యాయంగా పలుకరిస్తూ ఉండేవారు. 'తే హి నో దివసా గతాః'

ఆరోజు నాకిప్పటికీ మరపురాదు. చందనయాత్రావైభవాన్ని గూర్చి ఎందుకో ఒక వ్యాసం వ్రాసారు శ్రీరామచంద్రాచార్యస్వామివారు. అది ఎందుకని వ్రాసారో నాకిప్పడయితే గుర్తులేదు కానీ, అందులో వారు వాడిన పదజాలం, భావవైచిత్రి ఇప్పటికీ నా మనస్సులో నిలచిపోయింది. మా నాన్నగారు శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారు వింటూ ఉండగా, వారు ఆ వ్యాసాన్ని చదువుతూ ఉంటే, మా నాన్నగారి ముఖంలో తళుక్కుమన్న వెలుగురేఖ ఇప్పటికీ నామనసులో మెదులుతూనే ఉన్నది.

స్వామి దివ్యమంగళవిగ్రహం నుండి చందనాన్నితీసి నిజరూప సేవకు సిద్ధపరుస్తారు కదా! ఆ సన్నివేశాన్ని వర్ణిస్తూ చెప్పేరు. భక్తుల పాపాలు పెళ్ళలు పెళ్ళలుగా ఇలా తొలగిస్తాను సుమా! అంటూ మనకు ధైర్యం కలిగిస్తున్నాడా అన్నట్లుగా ఇన్నాళ్ళుగా నున్న చందనం పెళ్ళలు క్రిందపడుతున్నాయట. నా ఆశ్రితవ్యామోహాన్ని చూచి, నిబ్బరంగా ఉండండని, చెప్పినట్లు ప్రహ్లాదవరదుని హస్తముద్ర అభయమిస్తోందట. ఈవిధమయిన భావసముదాయం వారి స్వంతం.

మా నాన్నగారిని ప్రస్తుతిస్తూ 'ఒకసారి నాతోటే చెప్పారు. అమ్మా! మీ నాన్న సుప్రసిద్ధ వైయ్యాకరణి. సహజంగా ఈ వ్యాకరణవేత్తలకి భాష శుద్ధంగా ఉండాలనే పట్టుదలేకానీ, సరసంగా ఉండాలనే స్పందన ఉండదు. ఒక వ్రోడును చూపించి, ఒక వ్యాకరణవేత్తను, ఒక సాహితీ రసజ్ఞుని కూడా వర్ణించమన్నారట. దానికి వైయాకరణి 'శుష్కో వృక్షస్తిష్ఠత్యగ్రే' అని చెప్పాడట. సాహితీవేత్త 'నీరస తరురివ నివసతి పురతః' అని లలిత సుందరంగా చెప్పాడట. అలాగే మీ నాన్నగారికి ఇంత సుకుమారమయిన భాష ఎలా వచ్చిందో ఆశ్చర్యమే' అని తృప్తిగా మెచ్చుకున్నారు. నిజమైన సాహితీవేత్త రామచంద్రాచార్యులవారు. వారు వ్రాసిన లేఖలు కూడా కావ్యాల్లా ఉంటాయి. 'ఉభయకుశలోపరి' ఉత్తరాలు వ్రాయడమంటే నా నాకసహ్యం అనేవారాయన. తమ కుమారునికి బదరీనుండి వ్రాసిన లేఖ వారి 75సం॥ ఉత్సవం సందర్భంగా వెలువరించిన ఒక గ్రంథంలో ముద్రింపబడింది. అది ఒక లఘుకావ్యమే. వారిని దూరదూరంగా చూసినవారికి అమ్మో! ఇంత గంభీరంగా ఉన్నారు, వీరితో మాట్లాడడం సాధ్యమా అనిపించే విధంగా ఉండేవారు. కానీ, దగ్గరగా మాటాడినవారికి వారి సౌజన్యం, వాగ్వైభవం ఆనంగావహమవుతూ ఉంటాయి.

ఒకసారి వారు విజయనగరం వారమ్మాయిగారింట్లో ఉండగా వారింటికి వెళ్ళి దశావతారస్తోత్రంలో ఉన్న అందాలను తెలియచేయ మని ప్రార్థించాను. చాలా భాషాక్లిష్టత గల ఆ స్తోత్రాన్ని రమణీయంగా వివరించి, భావావేశాన్ని పొంది, కనులుచెమర్చి, ఆనందంలో తేలారు వారు. హృదయస్పందన ఉన్న వ్యక్తి కనుక, కేవలం భాషావైభవంతో మనసు ఆగక, భావ వైచిత్రికి పరవశించి, దానిని విశ్లేషించగలిగారు. వారి ఆర్యోక్తులు మొదలైన రచనలన్నీ ఒక ఎత్తయితే, 'కృష్ణమయ్య' ఒక ఎత్తు. అందులో వీరు వాడిన భాష చాలా విచిత్రంగా ఉంటుంది. పెద తిరుమలాచార్యులవారి రచనలను తలపింపచేస్తుంది. ఆధ్యాత్మిక భావపరంపరతోబాటు, సున్నిత శృంగారాన్ని కూడా మేళవించి వ్రాసినతీరు స్పృహణీయం.

వారు మాటతీరుపై వ్రాసిన ఎన్నో వ్యాసాలను చదివిన తరువాత, హితంగా, మితంగా, ప్రియంగా, ఎవరినీ నొప్పించకుండా, మాటాడాలని కనీసం కొన్ని రోజులైనా ప్రయత్నించని పాఠకుడు ఉండడనడంలో అతిశయోక్తిలేదు.

కులపతులైన గోపాలాచార్యస్వామివారు పరమపదించాక, భక్తినివేదనకు ఎవరు సంపాదకులైనా ఆ లోటు భర్తీ అవదేమోనని అందరం బెంగపడిన సందర్భంలో ఆ బాధ్యతను తమ భుజస్కంధాలపై ఉంచుకొని, 'భక్తినివేదన'ను సర్వాంగసుందరంగా తీర్చిదిద్దిన ఘనత వీరిదే. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారి వద్ద వీరు కాలక్షేపం చేసినపుడు చూసినవారు, 'అబ్బ! ఆ గురువే గురువు, ఈ శిష్యుడే శిష్యుడు' అంటూ ముక్కున వేలువేసుకొనేవారట. శ్రీకృష్ణదేవరాయల ప్రౌఢరచనకు వీరు వశపడి, దానిగురించి మాటాడితే చాలా తృప్తిగా వినేవారు.

**విద్యార్థులకు మంచి ఆచార్యుడు.ఆచార్యులకు లభించిన చక్కని అంతేవాసి. పద గుంభనతో శ్రోతలనలరించే ఉపన్యాసకుడు. చినజీయరు స్వామివారికి కుడిభుజం. బంధుమిత్రులకు గర్వకారణం.సరస కవితావధూటీ రసికుడు ఇంకా ఎన్నో ఎన్నెన్నో......**

ఈ బహుముఖ ప్రజ్ఞాశాలిని నిత్యవిభూతికి తీసుకొనివెళ్ళి, తన సభను రక్తికట్టించుకుని, మన సభలను వెలవెలబారిపోయేలా చేసి స్వార్థపరుడనిపించుకున్నాడు సర్వేశ్వరుడు.

# నమస్యే శిరసాఽ సకృత్

శ్రీమతి కె.వి. జానకి-విజయనగరం

మహాత్ములతో మనకుండే సంబంధం, అనుబంధము మన ఉనికికి ఊతగా నిలుస్తుంది. మన మనికికి మార్గదర్శక మవుతుంది. మన జీవితానికి జీవాతువు, మన లక్ష్యసాధనకు హేతువు సత్పురుష సంబంధమే.

సజ్జనారాధనమే ధనమని, భాగవతాభిమాన వసతిగా మనం మసలుకోవడమే జీవనపరమావధి అని నమ్మి, ఆచరించి, ధన్యులైనవారి సంస్కృతికి వారసులం మనమంతా...

సజ్జన సంయోగం, సత్పురుషలాభం వలన ఎంత సంతోషం కలుగుతుందో, వారి వియోగం అంతకుమించిన వేదనను కలిగిస్తుంది. "సంయోగాః విప్రయోగాంతాః" 'కలయికకు విడిపోవడం అవధి' అని తెలుసు. "మరణాంతం చ జీవితమ్" 'జీవితానికి మరణం అవధి' అని తెలుసు. అయినా మనసు పడే వేదన మాటకు అందనిది. అనుభవించక తప్పనిది.

శ్రీరామచంద్రాచార్యస్వామివారి పరమపదవార్త మనకు అసహ్యవేదనను కలిగించింది. నిరాశ, నిస్పృహలను మిగిల్చింది. "భక్తినివేదన" పరివారమంతా దుఃఖసాగర నిమగ్నమయింది. ఇందులో తర తమ భేదం లేదు. చిన్న, పెద్ద తేడా లేదు. సముద్రముప్పొంగితే మునిగిపోవడంలో అణువైనా, అచలమైనా సమానమే కదా!

"కోమజ్జతోరణు కులాచలయోర్విశేషః" అలా మునిగిపోతున్న మనం నిలద్రొక్కుకోవాలంటే ఒక ఆలంబన కావాలి. మనసుకు కొంత ఊరట కలగాలి. పంచుకుంటే బాధను కొంతవరకు భరించవచ్చునని పెద్దలు చెప్తారు. "సంవిభక్తం ఖలు దుఃఖం సహ్యవేదనం భవతి" అని. అందుకే ఈ ప్రయత్నం శ్రీరామచంద్రాచార్యస్వామివారితో మా కుటుంబానికున్న సంబంధము, మాకు వారికి ఉన్న అనుబంధము, వారికి మాపట్లగల ప్రేమబంధము తలచుకొని, ఆ మధురస్మృతులను మీతో పంచుకొని ఆ మహనీయునికి మనసారా అంజలి ఘటించడమే దీనికి పరమావధి.

ఉత్తరాంధ్రను తమ ఉత్తమ వ్యక్తిత్వంతో సదాచరణంతో, సాటిలేని విద్వత్తుతో, స్వార్థంలేని నిర్మల హృదయంతో సర్వోత్తమ పథంవైపు నడిపిన మహనీయులు ముగ్గురు. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారు, శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామి వారు (మా తండ్రిగారు), శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారు. ఈమూర్తిత్రయం 'ఉత్తరాంధ్రత్రయం'గా కీర్తిని పొందింది. 'త్రయీ' అని చెప్పబడే వేదాలు వాటికవేసాటి. ఈ ముగ్గురు వారికి వారేసాటి. శ్రీ చిన్నజీయర్ స్వామివారి ఆదరగౌరవాలకు, ప్రేమాభిమానాలకు పాత్రులు కావడంలో వారికి వారే పోటీ! వారిలో పరమపదానికి పయనవారిలో ప్రథములు మా నాయనగారు వేంకటాచార్యస్వామివారు. అనుసరించినవారు అద్వితీయులైన అప్పలాచార్యస్వామివారు. "నేనెవరినీ అనుసరించను. నా సరళి వేరు, స్వభావం వేరు" అనే మన శ్రీరామచంద్రాచార్యస్వామివారికి వారివెంట వెళ్ళాలనే కోరిక ఎందుకు కలిగిందో! లేక ఆ పరమపదనాథునికే తన సన్నిధిలో ఉత్తరాంధ్రత్రయంలో ఒకరులేని కొరత కనిపించిందో! సంకల్పించేడు. సన్నిధి చేర్చుకున్నాడు. రామచంద్రాచార్యస్వామి మనను విడిచి వెళ్ళాలనుకోరు. మనకిచ్చిన మాట తప్పరు. "రామో ద్విర్నాభిభాషతే" కదా! మేరు నగధీరులైనవారు మరణాన్ని ఆహ్వానించరు. మరణానికి భయపడరు. కృతకృత్యులైన వారు జీవనాన్ని, మరణాన్ని సమానంగానే ఆదరిస్తారు. దీనికి నిదర్శనంగా జరిగిన ఒక సన్నివేశాన్ని మీముందుంచుతాను.

మా తండ్రిగారు కందాళ వేంకటాచార్యస్వామివారు పరమపదించిన తరువాత మమ్ములను నడిపిస్తున్న మహనీయులు ప్రధానంగా ముగ్గురు. శ్రీమాన్ సముద్రాల రంగరామానుజాచార్యస్వామివారు, శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారు, శ్రీమాన్ టి.పి. రామచంద్రాచార్య స్వామివారు. "పితేవ" అన్నట్లు వారిలాగే ప్రేమిస్తూ, ఆదరిస్తూ, ప్రోత్సహిస్తూ, సహకరిస్తున్న సహృదయులు. ప్రతి సంవత్సరంలాగే ఈ సంవత్సరం జూలైలో జరిగిన తిరునక్షత్ర మహోత్సవము (మాతండ్రిగారిది), పండిత సభలకు శ్రీరామచంద్రాచార్యస్వామివారిని ఆహ్వానించాలని సింహాచలంలోని వారి స్వగృహానికి వెళ్ళేరు. శారీరకమైన అనారోగ్యం నుండి కోలుకొని కాస్త స్వస్థంగా వారు దర్శన మిచ్చేరు. మా కుశలప్రశ్నలకు స్పందిస్తూ చిరునవ్వుతో సమాధానమిచ్చేరు. ఆ సందర్భంలో వారన్నమాటలు ఇవి. "వ్రాయలేక, చదవలేక, తిరగలేక ఇలా బ్రతికి ఉండడమెందుకని నేననుకోవడం లేదు. నా దగ్గరకు ఎవరైనా వస్తే వారికి ఒక మంచిమాట చెప్పగలను కదా! అదే వారికి శక్తినిస్తుంది. అంతకంటే ఏం కావాలి! ఒక లాయర్, ఒక డాక్టర్ చేసేది అదే కదా! అలాగే మేము కూడా. ఎందుకు స్వామీ! నన్నింకా తీసుకుపోవడం లేదు!' అని నేను భగవంతుని దగ్గర ఏడవను. ఆయనిష్టం. ఎప్పుడు కావాలంటే అప్పుడు తీసుకెళతాడు. అంతవరకు నిశ్చింతగా ఉంటాను" అన్నారు.

"కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియమివాతిథిమ్" అన్నమాటకు ప్రత్యక్ష ప్రమాణం వీరు అని అనిపించింది. వారి హృదయస్థైర్యానికి, జీవితంపట్ల వారికున్న స్పృహకు **"నమస్యే శిరస్యాఽ సకృత్"** (శిరస్సుతో అనేక పర్యాయములు నమస్కరి స్తున్నాను.)

నదులు, గోవులు, వృక్షాలు, మహాత్ములు పరోపకార పరాయణులు. అందరికీ చెందినవారు. ఇందులో సందేహం లేదు. సర్వసాధారణమైన సంబంధంతోపాటు దేహసంబంధం కూడా వారితో మాకుందని చెప్పుకొనే అవకాశం కలగడం నిజంగా అదృష్టమే! కించిత్ గర్వకారణం కూడా! శ్రీరామచంద్రాచార్యస్వామివారు మాకు పినతండ్రిగారవుతారు. మా తండ్రిగారివైపున, మా తల్లిగారివైపున కూడా దగ్గర సంబంధం.

ఆప్తబంధువు. వారి కుటుంబంతో మాకుటుంబానికి ఎంతో ఆత్మీయత ఉంది. మా తండ్రిగారికి శ్రీరామచంద్రాచార్య స్వామివారికి స్వరూపంలో, స్వభావంలో కూడా చాలా సమానత ఉంది. అక్కచెల్లెళ్ళ పిల్లలయినా స్వంత అన్నదమ్ములని అనిపించేటట్లు ఉండేవారు. బంధువర్గంలో వారి వ్యవహారనామం కూడా ఒకటే 'చిట్టి' అని పిలిచేవారు. ఇది కూడా విచిత్రంగా అనిపిస్తుంది. చిన్న తేడా ఏమిటంటే శ్రీరామచంద్రాచార్యస్వామివారిని 'M.A. చిట్టిగారని' అనేవారు. మానాయనగారు కూడా M.A. చేసేరు. అయినా రామచంద్రాచార్య స్వామివారినే అలా ఎందుకంటారని మాకు సందేహం కలిగింది. మా తండ్రిగారిని అడిగేము. మన బంధువర్గంలో అందరికన్నా ముందు ఆ అర్హతను పొందినది వారే కనుక ఆయన 'M.A. చిట్టి' నేను 'వట్టి చిట్టి' అని నవ్వేవారు. ఏమాత్రం అసూయ లేకుండా నిర్మలంగా ఉండేది ఆ నవ్వు. వారిద్దరికి మంచి అనుబంధం ఉండేది. వామనులుగా కనిపించినా సత్కార్య నిర్వహణలో త్రివిక్రములై అందరి హృదయాలపై తమ పదముద్రలను ప్రతిష్ఠించిన ప్రతిభా సంపన్నులు. సింహాద్రినాథుని సన్నిధిలో ఎన్నో విలక్షణమైన కార్యక్రమాలను నిర్వహించాలని కార్యవర్గం వారు తలపెడితే అద్భుతమైన రీతిలో వాటికి రూపకల్పన చేసిన కార్యశిల్పులు. ప్రేమించినా, శాసించినా, లాలించినా, నిలదీసినా 'వారే మాకు కావాలి' అని అనిపించేటట్లు చేయగల చమత్కారం వారిసొత్తు. ఇటువంటి అపురూప సహోదరులకు "నమస్యే శిరస్యాఽసకృత్".

శ్రీరామచంద్రాచార్యస్వామివారిని సేవిస్తే దగ్గరకు చేరాలనిపిస్తుంది. అంతలోనే 'అమ్మో' అని భయం కలుగుతుంది. 'ఆర్యోక్తి' రత్నాలను ఏరుకోవాలంటే, మూటగట్టి దాచుకోవాలంటే శ్రీరామసంద్రాన్ని చేరవలసిందే! 'మనసు-మాట' మన సొంతం కావాలంటే దూరంగా ఉంటే ఎలా! సునిశితంగా పరిశీలించి సుస్పష్టంగా విడమరచి వారు చెప్పేమాట శిలాశాసనంలా ఉంటుంది. చెప్పే తీరులో అందం వారిదగ్గరే దర్శిస్తాం. సుమధురగళంతో నెమ్మదిగా మొదలయి, ఊపందుకొని, ఉవ్వెత్తున ఎగిసిపడి సముద్రంలో విలీనమయే తరంగాల వంటివే వారి ప్రవచనములు. బయటకు కఠినంగా కనపడినా వారు అత్యంత మృదుహృదయులు. మంచి భావుకులు. విమర్శకులు కూడా. వారు మైమరచి పరమాత్మను కీర్తించగల 'కృష్ణమయ్య'. ఆళ్వారుల మదిలో నిండైన ప్రేమ లోపల ఒదగలేక పైకి పొంగి పాటలుగా ప్రవహించి దివ్యప్రబంధమై అందరికీ అందింది. అటువంటి ప్రేమవాహినికి ఆలవాలమే ఈ రామచంద్రుని హృదయం. దివ్యప్రబంధ పాశురార్థ విశేషాలను వారినోట వినాలని నాకెప్పుడూ కోరికగా ఉండేది. వారికి విన్నవించేను. విజయనగరం పండిత సభలలో ఆ కోరిక నెరవేర్చేరు. శ్రీకాకుళంలో వారి కుమారులకు భగవద్విషయ కాలక్షేపాన్ని వారు నిర్వహిస్తున్న సందర్భంలో వారి అనుమతితో ఒకరోజు నేను, మా సోదరి అక్కడకు వెళ్ళేము. పాశురవ్యాఖ్యానాన్ని వివరిస్తూకొన్ని అంశాలలో వారు చేసే విశ్లేషణ ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించింది.

మరొక పర్యాయం వారి ఆజ్ఞమేరకు ధనుర్మాసంలో శ్రీకాకుళంలో వారిని సేవించే అవకాశం కలిగింది. మేము అక్కడకు చేరిన సమయానికి వారు "గోదాస్తుతి" శ్లోకాన్ని వివరిస్తున్నారు. సుమారు ఒకగంటసేపు రోజుకు ఒక శ్లోకం వివరిస్తున్నారు. ఆనాటి శ్లోకం "చూడాపదేన పరిగృహ్యతవోత్తరీయమ్".. గోదా అమ్మవారి ఎదను అలంకరించి, సువాసనలను వెదజల్లుతున్న ఉత్తరీయాన్ని తాను చూడాలంకారంగా చుట్టుకొని, ఆ పరిమళాన్ని ఆఘ్రాణిస్తూ మురిసిపోతున్న రంగనాథస్వామిని, ఆయన మురిపెమును కనుల ఎదుట కనపడేటట్లు చేసేరు. విచిత్రమేమిటంటే ఆయన చెప్పినప్పుడు రంగనాథుడు దర్శనమిచ్చేడు. కాని తరువాత ఈ శ్లోకాన్ని ఎప్పుడు అనుసంధానం చేసినా నాకు మా చిన్నాన్న గారు రామచంద్రాచార్యస్వామివారే కనిపిస్తారు. అందులో వారు లీనమై, మనను కూడా ఆ సీమకు చేర్చే వారి భావనాదీప్తికి "నమస్యే శిరసాఽ సకృత్".

ఆనాడు వారు మమ్ములను పిలిపించినది స్వార్థంకోసం కాదు. ఒక మంచిపని మాచేత చేయించాలనే సంకల్పంతో మా విజయనగరానికి దగ్గరలో ఉన్న 'రామతీర్థ' ఆలయం (ఎంబేరయ్యగుళ్ళు) జీర్ణోద్ధరణకు ప్రేరకులు అయినారు. వారి సూచనలతో, ప్రోత్సాహంతో మాతండ్రిగారి శిష్యవర్గం త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటము- విజయనగరంవారు పురాతనమైన శిథిలావస్థలోనున్న పవిత్రమైన ఆ ఆలయానికి కొంత సేవ చేయగలిగేరు. మండపనిర్మాణము, ప్రహరీగోడ, నిర్మాణము, త్రాగునీటి సదుపాయము. పెరుమాళ్ళకు అలంకారములు సమకూర్చుట మొదలైన కైంకర్యములు చేసేరు. శాశ్వతమైన సేవను మాచేత చేయించిన మహనీయులు వారు. మా కుటుంబ మన్నా, మా నాయనగారి శిష్యులైన విజయనగరం రామానుజ కూటం గోష్ఠివారన్నా వారికి విశేషమైన వాత్సల్యం ఉండేది. మా ప్రార్థనను, మా ఆహ్వానాన్ని ఏనాడూ తిరస్కరించలేదు. ఆదరంతో, ప్రేమతో మా గోష్ఠికి వచ్చి, ఆతిథ్యాన్ని స్వీకరించి, మంగళాశాసనం చేసేవారు. వారు ఒక ఏడాది (2007-2008) ధనుర్మాసవ్రతాన్ని మా రామానుజకూటంలో నిర్వహించడం మాకు కలిగిన మహద్భాగ్యం. వారి అసామాన్యమైన అనుగ్రహం. ఆ సమయంలో వారికి తగినరీతిలో సౌకర్యాలు చేయలేమేమో అని ఆందోళన పడుతున్నామని తెలిసి, "భయపడవద్దు. నేను ఎలా ఉన్నా సర్దుకుంటాను. మాట ఇచ్చేను. తప్పక వస్తాను" అని తమ సహృదయాన్ని ప్రకటించిన ప్రేమమూర్తి. ఈ సంవత్సరం జూలై నెలలో జరిగిన పండిత సభలకు కూడా శరీరం మొరాయిస్తున్నా మనోనిశ్చయంతో విచ్చేసి మంగళాశాసనం చేసేరు. కొత్తగా పునర్నిర్మించుకున్న రామానుజకూటంలో వారు పాదం మోపినప్పుడు మాకు కలిగిన ఆనందానికి అవధిలేదు. "ఒకరోజు చాలదు మళ్ళీ రేపు కూడా రావాలి" అని ఆశగా అర్థిస్తే నవ్వి ఊరుకున్నారు. మా అభ్యర్థన వారి అనుగ్రహంతో సఫలమయింది. మరునాడు ఆ దంపతుల దర్శనం కనుల వేడుకయింది. వారికి మాపట్లగల ప్రత్యేకమైన ప్రేమకు "నమస్యే శిరసాఽ సకృత్".

శ్రీరామచంద్రాచార్యస్వామివారి విలక్షణమైన జీవనం మనకు మంచి సందేశాన్నందిస్తుంది. సాంసారిక జీవనంలో కష్టసుఖాలకు కరిగిపోక, తమదైన ఒక ప్రత్యేకతను, విశిష్టతను నిలబెట్టుకున్న మహోన్నతులు వారు. కష్టమొస్తే కదిలిపోయేవారు సామాన్యులు. నిశ్చలంగా నిలిచి ఉండేవారు ధీమాన్యులు. గాలికి చెట్టూ, పర్వతమూ రెండూ చలిస్తే ఇక వాటికి భేదమేముంది? సంసారంలో ఉంటూ కష్టాలను తట్టుకుంటూ ఉన్నత శిఖరాలను చేరిన సజ్జనకోటిలో మేటిగా రాణించినవారు శ్రీరామచంద్రాచార్యస్వామివారు. వారి రచనలలో నాకు చాలా ఇష్టమైనది వారు బదరికాశ్రమం నుండి తమ కుమారునికి వ్రాసిన లేఖ. ఒకసారి వారి సప్తతి సంచికలో ప్రచురితమయింది. హృదయానికి హత్తుకుపోయింది. తమ సంతానానికి తన రక్తాన్ని, సమయాన్ని, సంపదను మాత్రమేకాక తన హృదయాన్ని కూడా పంచి ఇచ్చేవాడే తండ్రి అని అనిపించింది. "తండ్రి హరిజేరుమనియెడి తండ్రి తండ్రి" అని విన్నాం. చదువుకున్నాం. కాని ఇటువంటి తండ్రిని వారి లేఖలోకన్నాం. వారి సౌహార్దానికి "నమస్యే శిరసాఽసకృత్".

గతమాసంలో జరిగిన మా సోదరి కుమార్తె వివాహానికి వారు రావడం మాకందరికీ చాలా సంతోషాన్ని కలిగించింది. కాని అదే వారి అంతిమ దర్శనమవుతుందని ఆనాడు ఊహకు కూడా అందని విషయం. ఈనాడు యథార్థం. "విధిర్నూన మసంహార్యః ప్రాణినాం" విధి బలీయమైనది. దైవగతి విచిత్రమైనది. కాదనలేని సత్యం. తలవంచక తప్పదు.

"అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృతపాన విశేష మత్త చిత్తుడు" ప్రహ్లాదుడు. ప్రహ్లాదుని రక్షణలో అప్రమత్తుడు సింహగిరీశుడు. ఆయన సన్నిధిలో అవతరించిన శ్రీరామచంద్రుడు చిన్నజీయర్‌స్వామి వారి పాదారవింద మకరందపానలోల మధుర మనస్వి. "నేర్‌న్దేన్, అడిమై నినైన్దేన్ అతోణ్ కమలమ్ ఆరేన్దేన్ ఉన్ వేవడియేలన్బాయ్....." నీపాద కమలసౌందర్యాన్ని తలచి నీ కైంకర్యం చేయాలని చేరేను. నీ శ్రీపాదకమల ప్రేమరూపుడనై పరిపూర్ణుడను అయినాను...") అని మురిసిపోయేవారు. వారి ప్రేమకు బద్ధులయి ముగ్ధులయ్యే వారు చినజీయరుస్వామివారు. పుష్పహాస సుకుమారులైన స్వామివారు మనసారా నవ్వుతూ ఉంటే చిరుదరహాసంతో సేవిస్తూ ఉండిపోయేవారు శ్రీరామచంద్రాచార్యస్వామివారు. వారిద్దరినీ చూస్తూ ఉండిపోయేవారు మిగిలినవారంతా. అటువంటి ప్రేమమూర్తి కైంకర్యంతో ఆనందించాలని ఆనందమయుడైన ఆ భగవంతునికి అనిపించిందేమో! తన చెంతకు చేర్చుకున్నాడు. నిత్యకైంకర్య సంపదనిచ్చి సత్కరించేడు. భాగవతసేవ భగవంతునికి కూడా ఆనందదాయకమే కదా! అందుకే శ్రీరామచంద్రాచార్య స్వామివారు మనకు భౌతికంగా దూరమైనారు. సత్యసంకల్పులై సదా సన్నిహితులైనారు.

వారిని మధురస్మృతిగా మదిలో పదిలంగా నిలుపు కుంటూ "నమస్యే శిరసాఽసకృత్".

## శ్రీరామచంద్రాచార్యస్వామివారు - ఒక ఇన్‌స్పిరేషన్

నేను వృత్తిరీత్యా వైద్యుడిని అయినా ప్రవృత్తిరీత్యా శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి జెట్, వికాసతరంగిణి కార్యక్రమాలకు రాజమహేంద్రిలో సమన్వయకర్తగా ఉంటాను. తద్వారా శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యులవారితో పరిచయ భాగ్యం కలిగింది. వారు శ్రీస్వామివారితోగాని, ఏదైనా కార్యక్రమంలో భాగంగా గాని రాజమహేంద్రి వచ్చినప్పుడు కొంత సాన్నిహిత్యమూ కలిగింది.

విరాట్ విష్ణు సహస్రనామ పారాయణ కానీయండి, గోదావరీ పుష్కరాలు కానీయండి. ఉభయవేదాంత పండిత సభలు కానీయండి ఆ కార్యక్రమాల్లో మాకు జీయర్‌స్వామివారితో బాటు శ్రీరామచంద్రాచార్యస్వామివారి మార్గదర్శకత్వం కూడా లభించేది. వారి మాటల్లోనే చెప్పాలంటే "జీయర్‌స్వామివారు ఒక ప్రభంజనంలాంటివారు, వారిని అనువర్తించేటట్లుగా మనల్ని మలచుకోవాలి తప్ప కార్యక్రమాలు సరిగా జరుగుతాయా, జరుపగలుగుతామా అనే సందేహాలు పెట్టుకోవద్దు" అంటూ మాలో ధైర్యాన్ని ప్రోదిచేసి మమ్మల్ని ఉత్తేజపరుస్తూ ఉండేవారు. ఆయన ప్రవచనాలు చాలా గంభీరంగా ఉండేవి. ఇష్టాగోష్ఠి మటుకు చాల హృద్యంగా, చనువుగా ఉండేది. ఇటువంటి దిగ్దంతులైన పండితులు మన సంప్రదాయంలో చాల అరుదుగా కనిపిస్తారు. మా రాజమండ్రికి చెందిన శ్రీమాన్ పురిహెళ్ళ వేంకటాచార్యులువారు, శ్రీమాన్ కోనప్పాచార్యస్వామివారు అలాగే మాకు అత్యంత ఆప్తులూ అయిన శ్రీరామచంద్రాచార్యస్వామి శ్రీభాష్యం స్వామి ఇలాంటి పండిత ప్రకాండులంతా ఆదిశేషుని అపర అవతారమైన భగవద్ రామానుజుల ఫణా సహస్రంలోనివారే! వారంతా తిరునాడును అలంకరిస్తే ఆ సహస్రఫణులలో ఒక్కొక్కటీ ముకుళించుకుపోతున్నాయా అనే ఆవేదన కలుగుతుంది. అయితే వారంతా ముందు తరాలకు అందించిన మార్గదర్శకత్వంతో మళ్ళీ ముకుళించిన ఫణాలు మణిదీపాలుగా ఉపయోగిస్తాయనే ఆశ. మా కార్యక్రమాలు కొనసాగించే శక్తిని వారు పైనుండి అనుగ్రహించుదురుగాక!

డా॥ సాతులూరి రాజారాం
రాజమహేంద్రి

# జ్ఞాన సముద్రాలు ఇంకిపోయాయి!

శ్రీమాన్ ఏ.వి.రెడ్డి శాస్త్రి-శ్రీకాకుళం

శ్రీశ్రీశ్రీ రామచంద్రాచార్యులవారి అమృతవాక్కులను ఆలకించగలిగే మహాభాగ్యం నాకు ఒక ధనుర్మాసంలో సంప్రాప్తమయింది. శ్రీవారు తమ పుత్రరత్నం శ్రీ శ్రీనివాస రామానుజమ్‌గారి దగ్గరకు వచ్చి కొంతకాలం మా శ్రీకాకుళ నివాసం చేసి– మా ఊరిని ధన్యం చేసిన సమయం అది! ధనుర్మాస ప్రవచన యజ్ఞాన్ని శ్రీనివాస రామానుజంగారు అఖండంగా 20 సంవత్సరాలపాటు చేశారు. రామానుజంగారు మా శ్రీకాకుళం నుంచి వెళ్ళిపోయి ఈ ధనుర్మాసానికి 3 ఏళ్ళు అవుతోంది. గతాన్ని తలచుకొంటూ సవినయంగా నా అభిప్రాయాన్ని మనవి చేసుకుంటున్నాను.

రామానుజంగారు శ్రీకాకుళంలో ఒక భక్తివిప్లవాన్ని తీసుకు వచ్చారు. వారి విప్లవ మహానదీ ప్రవాహంలో నాబోటి నాస్తిక భావాలు కలవారం సహితం మా అస్తిత్వాన్ని కోలుపోయి వారి ప్రవచన ప్రలోభంలో పడిపోయాం. సరే, దాన్నలా ఉంచితే – రామచంద్రాచార్య స్వామివారు తమ కుమారుని ఇంట బసచేసి ఉన్న కాలం, మాబోంట్ల అమృతసమయం. ఆ సంవత్సరం స్థానిక కోదండరామ స్వామివారి దేవాలయంలో శ్రీస్వామివారిని తిరుప్పావై ప్రవచనం చేయవలసిందిగా వందలాది అభిమానులం అందరం సవినయంగా అభ్యర్థించాం. కాని వారు దానికి అంగీకారం తెలుపలేదు. వయస్సు, సుమారు రెండుమూడు గంటలసేపు ఆరుబయట కూర్చుని, విశేషసంఖ్యలో హాజరయ్యే భక్తబృందానికి వినిపించేంత పెద్దస్థాయిలో ప్రసంగించడానికి సహకరించని గొంతు, ఇలాంటి కారణాలని పురస్కరించుకొని వారు తిరుప్పావై ప్రవచనం చెయ్యలేదు.

అయితే ఒకరోజుమాత్రం గోష్ఠికి విచ్చేసి, ప్రవచనాలని తమ ప్రారంభోపన్యాసం అనుగ్రహించి మంగళాశాసనం చేశారు. ఆ ఘట్టంమాత్రం ఇంకా మా కనులముందు గోచరిస్తూనే ఉన్న మహాద్భుత దృశ్యం. వారి నిండైన విగ్రహం, మల్లెపూలతో తయారయినట్టు అవుపించే తెల్లని వస్త్రవిశేషం, నుదుటినిండగా తిరునామాలు, అన్నిటికీ మించి గంభీరమైన వారి కంఠం, సరస్వతీదేవే స్వయంగా వచ్చి వారి ప్రసంగ గమనాన్ని నిర్దేశిస్తున్నట్టు వినిపించే వారి స్వచ్ఛమైన వాణి.. ఓహో... వారి సమక్షంలో ఉన్నంతసేపూ ఏదో దివ్యపురుషుని సన్నిధిలో ఉన్నభావన. సరే, ఆ మంగళాశాసనం అక్కడితో ముగియలేదు.

ఆయన తిరుప్పావై చెప్పి ఉంటే ఎంత బాగుండేదో కదా అని భావించిన వారందరి కోరికనూ తీరుస్తూ, శ్రీనివాస రామానుజంగారి ఇంటిలోనే, శ్రీరామచంద్రాచార్య స్వామివారు ఒక విలక్షణమైన గోదా ప్రబంధ ప్రవచనాన్ని అనుగ్రహించారు.

రామానుజంగారు సాయంత్రం కోదండ రామాలయంలో 'తిరుప్పావై' ప్రవచనాన్ని మహామధురంగా సాగిస్తూంటే, వారి పితృపాదులు ఇంటిదగ్గర వేదాంత దేశికులవారి 'గోదాస్తుతి' ప్రవచనం కావించారు. ఓహో! అదేమి ప్రసంగం! ఒక్కొక్క శ్లోకం చదివి ఆ చదవడమే ఒక గొప్ప విలక్షణమైన అంశం– దాని అర్థం, అంతరార్థం, దాని ప్రాశస్త్యం.. వారు వివరిస్తూంటే, రసజ్ఞుడు కాని శ్రోత ఎవడు? ఏ శ్రోత... ఆఫీసుంది, కాలేజీ ఉంది, అని, లేచి వెళ్ళిపోగలడు? వారి వాగ్ధోరణి ఒక గంగాస్రోతస్విని. ఏ వ్యాసమహర్షో, వాల్మీకి మహర్షో స్వయంగా విచ్చేసి – వింటున్న మా అందర్నీ శబ్దమాధుర్యాల అర్థమాధుర్యాల మహాస్వప్నసంగీతంలో ఓలలాడిస్తున్న భావన. అయితే ఆచార్యులవారిది శాసించని క్రమశిక్షణ. సరిగ్గా శ్లోకం అయ్యేటప్పటికి గంట, మహా అయితే గంటన్నర అయ్యేది. అప్పటికి సమయం 9గం॥ అయ్యేది. 'మీరంతా ఆఫీసులకు వెళ్ళాలి ఇవాళ్టికి స్వస్తి" అన్నట్లు తమ ప్రసంగాన్ని ఆపివేసేవారు. 'చూశాను సీతమ్మ తల్లిని' అంటూ ముక్తసరిగానైనా సమగ్రంగా చెప్పి అందరి మనస్సులనూ ఆనందపరచిన హనుమచందంగా! ఆ రససౌందర్యాన్ని ఆవిష్కరించిన హనుమచుట్టూ వానరులు ఎలా గుంపులుగా చేరి, తనవితీరడం లేదే అని తృష్ణతో దర్శించుకున్నారు కదా! అచ్చం మా పరిస్థితీ అదే! ఆ రామచంద్రాచార్య స్వామివారిని, ఆ సద్గురువులను, ఆ వ్యాఖ్యాతృ శిరోమణిని విడిచి ఆఫీసులకి వెళ్ళాలనిపించేది కాదే! అందరం 'అడియేన్ దాసోహం' అన్న భంగిమలో వారి శ్రీపాదయుగ్మాన్ని తాకి – మధురమైన భావనలతో తేలిపోతే, రేపు వినబోయే మధురఘట్టాలగురించి కలలు కంటూ వెళ్ళిపోయేవాళ్ళం.

అది ఒక ఘట్టం. ఇక్కడ చేరిన శ్రోతలందరూ ఇంచుమించు అంతో యింతో సాహిత్య పరిచయాలు ఉన్నవారే! అందుకనే రామచంద్రాచార్యస్వామివారు మమ్ముల్ని ఎన్నుకున్నారు శ్రోతలుగా! ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్ దొరకినగాని ఊరక కృతుల్ రచియించు మటన్న మాటలే?' అన్నారుట పెద్దనగారు. శ్రీనివాస రామానుజంగారి యింటిలో జరిగిన ప్రవచనాన్ని ఆలకించడానికి విచ్చేసినవారు కూడా 'సెలెక్టెడ్ ఆడియన్సు'. గుణగణ వివేచన కలవారు. అందుకనే అనిపించేది, ఆ ప్రవచనాలను ఆలకిస్తూంటే – "దొరకునా ఇటువంటి సేవ?" అని.

ఇంతకు మించింది మరో సన్నివేశం. శ్రీకాకుళంలో డాక్టరు సి. కృష్ణారావుగారు, వారి సతీమణి మిక్కిలి సాహిత్య ప్రియులు. సౌమ్యులు. ఎవరినీ ఏ విధంగానూ నొప్పించని స్వభావం ఒక్కటే కాదు, వారిద్దరి లక్షణం. వారి సౌహార్దంతో అందరి మనస్సుల్ని గెలుచుకో గలిగిన శక్తి వారికి సహజగుణంగా అబ్బింది. వారిరువురూ ఈ కాలపు రాజప్రాసాదంలాంటి గృహంలో అన్ని రకములైన శబ్దకాలుష్యాలకు దూరంగా, మామిడి తోపుల మధ్య, నాగావళిని నిత్యం వీక్షించగలిగేంత చేరువలోనున్న ఇంటిలో నివసిస్తున్నారు. వారు ఇంట్లో నెలకో, రెండ్నెల్లకో ఒకమారు – ఏదో ఒకక సాహితీసభ ఏర్పాటు చేసేవారు.

సభకి ఆహ్వానితులు మహా అయితే ఒక డజనుమంది. సభాప్రారంభంలో శీతలపానీయం, అంతకంటే చల్లనైన క్లుప్తమైన వారి ఉపోద్ఘాతం.

అటువంటి ఒక సభలో రామచంద్రాచార్యస్వామివారిని ఆహ్వానించి వారి ప్రసంగంతో శ్రోతల్ని తరింపచెయ్యమని అభ్యర్థించేరు ఆ పుణ్యదంపతులు. ఆచార్యులవారు వచ్చారు. తెల్లగా మెరిసిపోతూ పంచె, పైమీద మాంచి ఉత్తరీయం... ఏ ఋషిశ్రేష్ఠుడో మమ్మల్ని కనికరించి మా మధ్యకు వచ్చి కూర్చున్న భావన. ఆ వేళ ప్రసంగం చాలా జటిలమైన అంశంమీద సాగింది. 'వైష్ణవసంప్రదాయంలో ఆళ్వారులు' గురించి. ఏమి ఆ వాక్ప్రవాహం! ఏమి ఆ వైదుష్యం! ఏమి ఆ విపుల వ్యాఖ్యానం! సాక్షాత్ కులశేఖర ఆళ్వార్లే విచ్చేసి మళ్ళీ ముకుందమాలలాంటి భక్తి కావ్యాన్ని వివరిస్తున్నారేమోనన్న భావన కలిగింది. అంత దివ్యంగా భవ్యంగా నవ్యాతినవ్యంగా సాగింది వాక్ప్రవాహం.

రామచంద్రాచార్యస్వామివారినే నా గురువుగా భావించు కున్నాను. అయితే అవిటివాడిగా నాకున్న పరిమితుల వల్ల నేను వారిని సింహాచలంలో కలిసి – వారి ఆశీర్వచనాన్ని తీసుకోగలిగే భాగ్యానికి నోచుకోలేకపోయాను. ఇప్పుడు వారులేరు. శ్రీమన్నారాయణుడి సన్నిధికి వెళ్ళిపోయి – అక్కడ మహోత్కృష్ట విషయాలమీద ప్రవచనం చేస్తూ ఉండి ఉంటారు, అని తలచుకోగానే ఒక తీవ్రమయిన నిస్పృహ. మరి వారి వాణి మనకు వినిపించదే అనే నిర్వేదంతో!

రామచంద్రాచార్యస్వామివారూ, శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు, కందాళ వేంకటాచార్యస్వామివారు వీరంతా సముద్రమంత లోతు – గాంభీర్యం కల మహా పండితులు. వారు వెళ్ళిపోయారంటే జ్ఞానసముద్రాలు ఇంకిపోయాయే అని తీవ్రమయినవ్యథ.



# మన శ్రీరామచంద్రాచార్యస్వామివారు

**నిండుమనంబు నవ్యనవనీత సమానము**
**పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము**

అని భారతంలో నన్నయ్యగారు నుడివినట్లు, శ్రీ ఉ.వే.శ్రీమాన్ రామచంద్రాచార్యస్వామివారితో సాన్నిహిత్యం కలవారిలో చాలమందికి అనిపిస్తూ ఉంటుంది. అయితే ఆయనలో నిష్కర్ష అనే ఒక స్వభావాన్ని సరిగా అర్థం చేసుకోగలిగితే ఆయన వ్యక్తిత్వం ఎంత సమున్నతమయి నదో కదా అని అనిపించకమానదు.

ఉత్తరాంధ్రత్రయంగా చెప్పబడి విశిష్టాద్వైత ఉభయవేదాంత పండితులలో వీరు అన్యతములు. సంప్రదాయపు విషయాలు, అవి లౌకికమైనవి కానీయండి, వైదికమైనవి కానీయండి వాటి విషయంలో అవగాహన కలిగించడంలోకాని, అమలు చేయాలని చెప్పడంలోకాని, పాటించడంలోకాని ఒక భావాన్ని నిష్కర్షగా వెల్లడించడంలో వీరు ఎటువంటి మొహమాటాలుకాని, మెరుమెచ్చుకోలు దరిచేరనిచ్చేవారు కాదు. ఒకరకంగా చెప్పాలంటే కుండబ్రద్దలు కొట్టి చెప్పే స్వభావం.

వీరి పాండిత్యం ప్రవచనం సంభాషణ చాలవరకు నారికేళ పాకంలో ఉంటాయంటే అతిశయోక్తికాదు. అయితే తరచి చూస్తే అవి ఎంత మధురంగా హృద్యంగా ఉంటాయో బోధపడుతుంది. భాషను సులభతరం చేయవచ్చుకాని భావగాంభీర్యాన్ని, విషయగాంభీర్యాన్ని అందించేటప్పుడు రాజీపడకూడదనేది వీరి తపనగా ఉండేది తప్ప తమ పాండితీప్రకర్షను చాటాలనేది కాదు వీరి స్వభావం. వీరి కవిత్వంలో సంస్కృతంగాని తెలుగుకాని ఒక గంభీరమైన గంగా తరంగంగా వెళ్ళవలసిందే! దాంట్లో శార్దూలాలూ, మత్తేభాలు కూడా ఈతకొట్టవలసిందే! ఎవరైనా, ఏదైనా గ్రంథాలను రచించినా లేక సంకలనం చేసి ప్రకటించాలనుకొన్నా వాటిని శ్రీమాన్ రామచంద్రా చార్యులవారికి ఇస్తే వారిని వెన్నుతట్టి ప్రోత్సహించడమే కాకుండా ఆయా గ్రంథాలను సమూలంగా చదివి ఆయా విషయాలను సాకల్యంగా స్పృశిస్తూ వీరు ముందుమాట, ఆముఖంవంటివి సుస్పష్టంగా వ్రాసేవారు. వాటిని చూస్తేనే ఆ గ్రంథాలు పూర్తిగా చదవాలి అని అనిపించేది మాలాంటివారికి మన 'భక్తినివేదన' వీరి సంపాదకత్వంలో ఎన్నో సంపెంగలను పూయించి, మల్లెల చల్లదనాన్ని ఆస్వాదింపచేసింది. అలాగే గులాబీల సౌరభాన్ని అందించింది. వీరి సంపాదకీయాలు, సుందరపాండ్యుని ఆర్యోక్తులు ఎందరికో మార్గదర్శకాలు. వీరి సంపాదకత్వంలో ఎందరో మరుగున పడిన పండుతులను గురించి తెలుసుకొనే అవకాశం కలిగింది.

సింహాచల దేవాలయ ఉత్సవాలలో వీరు కైంకర్యపరులను ప్రోత్సహించేవారు. వీరు ఎంతోమంది విద్వాంసులను తయారు చేశారు.

మా నాయనగారు పరమపదించిన సందర్భంగా వారిపై తనియన్ అనుగ్రహించారు. అటువంటి మహనీయులు పరమపదించా రంటే గుండె గుభిల్లుమంది. వీరిలేని లోటు ఎవరూ తీర్చలేనిది.

"జయంతు తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

**శ్రీభాష్యం జగన్నాథాచార్యులు - విజయవాడ**



# అక్షరమూర్తి

ప్రొఫెసర్ కోలవెన్ను మలయవాసిని, విశాఖపట్నం

శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యస్వామివారు ప్రసిద్ధ సాహిత్యవేత్తలే కాదు – శ్రీ వైష్ణవ సంప్రదాయజ్ఞులైన ఉత్తరాంధ్రత్రయంలో ఒకరు. అటు వైష్ణవభక్తి, ఇటు సంస్కృతాంధ్ర సాహిత్యాలపై గల అనురక్తి తోడై వారిని ఉత్తమ సంపాదకునిగా చేశాయి.

అసాధారణమైన ప్రజ్ఞాపాటవాలకు తోడు వీరికి విషయాన్ని వివరించి చెప్పడంలో గల నేర్పు సాటిలేనిది. 'భక్తినివేదన' పత్రికకు సారథ్యం వహించి నరజాతికి గీతోపదేశం చేసిన శ్రీకృష్ణులువారు.

శ్రీరామచంద్రాచార్యస్వామివారు సంపాదకీయాలలో అందించే విషయాలు సమాజకల్యాణానికి అత్యంతోపకారకాలుగా నిలిచి ఉండే సార్వకాలిక సత్యాలు. ఆ పత్రికను సర్వతోభద్రంగా భక్తితో నారాయణు నకు నివేదన చేస్తూ తాము తరించడంతోబాటు ఆంధ్రజాతిని తరింపజేసిన మహనీయులు. పెద్దలు శ్రీ. పి.వి.ఆర్.కె. ప్రసాద్‌గారు వీరి సంపాదకీయాలను గురించి శ్రీ శ్రీకాంత్‌గారికి వ్రాసిన లేఖలో పేర్కొన్న విషయాలు సత్యసమ్మతాలు.



"శ్రీరామచంద్రాచార్యులవారు అసమాన పాండితీ ప్రభావ సంపన్నులు. భక్తినివేదన మాసపత్రిక ద్వారా వారు వెలువరిస్తున్న సంపాదకీయాలు ఒక్కచోట చేరిస్తే అది ఒక 'శీలసంపదాసంహిత' అవుతుంది.

శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యులుగారు ఆంధ్రవాఙ్మయానికి చేసిన మహోపకారాలు రెండు. ఒకటి తెలుగులో ప్రప్రథమ వచన రచనాచార్యులు శ్రీకాంత కృష్ణమాచార్యులవారి సింహగిరి నరహరి వచనములు కూడినంతవరకు సేకరించి (తంజావూరు వరకు ప్రయాణించిన వచనాలను) ప్రచురించడంతోబాటుగా 'కృష్ణమయ్య' అనే ఒక ప్రామాణిక పరిశోధనాగ్రంథాన్ని వెలువరించడం.

సింహగిరి నరహరి వచనాలు – సంకీర్తనా ప్రభేదాలు. కాంత కృష్ణమాచార్యులవారిని ప్రప్రథమ సంకీర్తనాచార్యులుగా పరిగణిస్తారు. 'చాతుర్లక్ష గ్రంథపరిమితమైన ఈ వచనాలు మొదట్లో – 109 మాత్రమే లభించాయి. ఆచార్యులవారి పరిశోధనలో తంజావూరులో మరో 139 వచనాలు లభించాయి. ఈ మొత్తం 248 వచనాలతో 'కృష్ణమయ్య' గ్రంథం రూపుదిద్దుకుంది.

ఆచార్యులవారు ఈ సింహగిరి నరహరి వచనాలను గురించి కాంత కృష్ణమాచార్యులువారి గురించి ఎవరైనా ఏ కొత్త విషయమైనా చెప్పకపోతారా అంటూ – కాంత కృష్ణమాచార్యులవారి ఊహాచిత్రాన్ని సింహాచలం ప్రదక్షిణపథంలో (బేడా)లో పెట్టించారు. కొత్త విషయాలు చెప్పలేకపోయినా, ఆయన ఎవరు అని తెలుసుకునే జిజ్ఞాసువులు ఉండకపోతారా అని కూడా వారి ఆశ.

ఈనాడు అన్నమాచార్యులవారి కీర్తనలు ప్రపంచం నలుమూలలా గానం చేయబడుతున్నాయి. అన్నామాచార్యుల వారికి గురుస్థానీయులు మార్గదర్శకులూ కృష్ణమాచార్యులవారు. అన్నమయ్య సాహిత్యం మీద అంతులేని పరిశోధనలు సాగుతున్నాయి. ఇది ఎంతోమంది ఆనందించవలసిన విషయం. శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు అన్నమాచార్యుల వారిని ఆత్మీయంగా 'అన్నమయ్య' అని పిలుచుకున్నారు. శ్రీరామచంద్రాచార్యులవారు కృష్ణమాచార్యులవారిని 'కృష్ణమయ్య' అని విశేష భక్తిప్రపత్తులతో సంభావించి 'కృష్ణమయ్య' అనే గ్రంథాన్ని రూపొందించారు. ఆచార్యులవారి సంప్రదాయ విజ్ఞాన వివరణా విశేషాలకు, కావ్యపరిశీలనా చాతురికి నిదర్శనంగా నిలిచిన గ్రంథం, పరిశోధనాగ్రంథం "కృష్ణమయ్య."

'కృష్ణమయ్య' మీద నేటికీ ప్రామాణిక పరిశోధన గ్రంథం ఆచార్యులవారిదే! ఈ సింహగిరినరహరి వచనాలపై ఇంకా అన్వేషణ, పరిశోధనా సాగాలని ఆచార్యుల వారి ఆకాంక్ష. ఆంధ్రులు వారి కోరికను తలకెత్తుకొందురు గాక. సింహాచల దేవస్థానం వారు ముద్రించిన 'సింహగిరి నరహరి వచనా'లకు ఆచార్యులవారు కూర్చిన పీఠిక ఆంధ్ర సరస్వతికొక మణిమయ పేటిక.

ఆచార్యులవారు ఆంధ్ర సరస్వతికి అందించిన రెండో కానుక ఆముక్తమాల్యద వచనం. ఆచార్యులవారికి అత్యంత ప్రీతిపాత్రమైన ప్రబంధం శ్రీకృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యద. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు వీరిని ఆముక్తమాల్యద మీద పరిశోధన చేయ వలసిందిగా కోరారు. వీరు కూడా ఆనందంగా సంసిద్ధులయ్యారు. మానాన్నగారు (శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు) సేకరించిన ఆముక్తమాల్యద గుజిలీ ప్రతి (ప్రథమముద్రణ) వారికి ఇచ్చాను. అది నేటికీ వారి వద్దనే ఉంది. కాలక్రమంలో వారి పరిశోధన ఏ కారణాలవల్లనో ముందుకు సాగలేదు. ఎన్నోసార్లు అయ్యో ఆచార్యులుగారు 'ఆముక్తమాల్యద' విషయం ఎందుకు పక్కన పెట్టారో అనిపించింది.

ఒక శుభముహూర్తంలో "భక్తినివేదన"పత్రిక ద్వారా– ఆముక్తమాల్యద కావ్యామృతం గోరుముద్దలుగా అందించడం ఆరంభించారు. మహాకవులు తమ రచనలు 'జగద్ధితంబుగ' చేస్తారు. అదే బుద్ధితో ఆచార్యులవారు ఈ రాయలవారి "ఊహల పల్లకి" ఆముక్తమాల్యదకు శ్రీకారం చుట్టారు. భక్తులకే కాదు, ఆంధ్ర సాహిత్యాభిమానులందరికీ అది అపూర్వమైన విందు.

రాయలవారి శైలి నారికేళపాకాన్ని మించి ఉంటుంది. పద్యం కట్టుబడిలో కొంత అన్వయకాఠిన్యం ఉంటుంది. వీటిని మించి ఊహాబలం ఉంటుంది. అన్నింటినీ సమన్వయం చేస్తూ అతిసరళమైన భాషలో అలతి అలతి పదములతో రసవద్రసాయనంగా, ఏడు వడపోతలు పెట్టిన చెఱుకురసం ఆస్వాదించినంత ఆనందంగా ఉండేలా అందించారు తమ రచనాచషకంలో.

**ఆచార్యులవారి రచనారీతి – రెండు మూడు ఉదాహరణలు:**

**విల్లిపుత్తూరు వర్ణన:** 'ఇళ్ళ ముందు ధాన్యం ఆరబోసి వాటిని ఏవీ తినకుండా బాలికలు కాస్తున్నారు. దేవాలయంలో తిరుగాడే దుప్పిపిల్ల ఒకటి మాటిమాటికీ వచ్చి ఆ ధాన్యాన్ని బొక్కిపోతోంది. సరిగ్గా అదే వేళకు కొండెలపై చుట్టుకోవడానికి కట్టిన చెంగలువ పూదండలను పేపగంపల్లో పెట్టుకుని పక్కనున్న పల్లెలనుంచి పడుచులు అమ్మడానికి తెస్తే ఈ పిల్లలు ఆ చెంగల్వదండలతో ఆ దుప్పిపిల్లను తోలుతారు. తోలుతారే తప్ప కొట్టరు. అదీ మరోదాంతో మరోదాంతో కాదు. చెంగల్వ పూదండతో.'

మత్స్యధ్వజుడు శత్రుసైన్యంలో ఏనుగులతోపోరాడడం ఎలా ఉందో రాయలు ఊహించి కట్టిన పద్యానికి వివరణ:

'శత్రుసైన్యం ఓ పెద్ద సముద్రం. సముద్రంలో తిమి అని ఒక చేప ఉంటుంది. ఇది చాలా పెద్దది. ఈ తిమితోక ఓ కత్తి అనుకోండి. సముద్రంలో కెరటాలు ఏనుగుల్లా ఉన్నాయి. కెరటాల విరుపులు ఏనుగుల కుంభస్థలాలు. తిమితోకతో అలలని కొడుతూ ఉంటుంది. ఇది కత్తితో ఏనుగుల్ని కొట్టడంలా ఉంది. కత్తితో ఏనుగు కుంభస్థలాన్ని కొట్టేటప్పటికి ఆ కుంభస్థలం పగిలి దానిలో ఉన్న ముత్యాలు కిందికి రాల్తాయి కదా! తిమి తోక దెబ్బకు కెరటాల వంపులమీంచి నీటితుంపరలు లేవడం ఈ ముత్యాలు రాలడం మత్స్యధ్వజరాజు కత్తి పుచ్చుకుని శత్రుసైన్యంలోకురికి గజసైన్యాన్ని చీల్చి చెండాట్టం సముద్రంలో తిమి ఉత్సాహంతో కోపంతో రెచ్చిపోయి తోకతో కెరటాలను నుగ్గునుగ్గు చెయ్యడంలా ఉంటుందన్నమాట.

వేసవికాలంలో పగలు ఎందుకు ఎక్కువసేపు ఉంటుందో రాయలవారు చేసిన ఊహ:

'సూర్యుడు ఉదయాన్నే దినయాత్రకు బయలుదేరతాడు. తన రథంమీద, తెలుసు కదా! ఆయన గుఱ్ఱాలకు కళ్ళేలు పాములు. సారథి అనూరుడు. తొడలపైభాగమేగాని కిందిభాగం లేని వికలాంగుడు ఆయన. పాములకు ఆహారం, గాలి. చల్లనిగాలి నోటికి హితవుగా ఉంటుంది. పడమటి దిక్కు వాటికి పెట్టేది ఉడుకన్నం. వేడివేడి తిండి. అది నోటి కెక్కడం లేదు. దాంతో పాపం అవి కూటి పేదలయి బడలిపోయి ఎక్కడికక్కడ అవయవాలు సడలిపోయి గుర్రాలు క్రుంగిపోతున్నాయి. ఆ రథానికి సంబంధించిన కళ్ళేలు గుర్రాల నోళ్ళలోంచి జారిపోతున్నాయి. కళ్ళేలు లేకుండా రథం తోలేది ఎట్లా? కళ్ళేలు సరిగా పెట్టి మరీ పోనియవయ్యా రథాన్ని అని సూర్యులవారి హుకుం. పాపం సారథి వికలాంగుడు. పిచ్చుగుంటు. రథం దిగడం కళ్ళేలు అమర్చడం, చచ్చీచెడి మళ్ళీ రథం మీద కూచోగానే అన్నహితవులేక అలమటించి పోతున్నాయేమో, మళ్ళీ బడలిపోయి చచ్చుపడి జారిపోవడం. ఊc కళ్ళేలమర్చు–అంటూ ఆయనగారి ఆజ్ఞ. రథం దిగడం ఎక్కడం, బ్రహ్మప్రళయ మౌతోంది ఆ సారథికి. దీంతో రథం కాస్తా వెళ్ళాల్సిన వేగంతో వెళ్ళక అస్తాద్రిని బాగా ఆలస్యంగా చేరుకోవడం. ఇదిగో ఇందువల్లనే గ్రీష్మకాలంలో పగళ్ళు దీర్ఘాలు కావడం.'

ఇక్కడ వివరణ పొందిన వాటి మూలపద్యాలు చదివితే గుఱ్ఱాలు, కళ్ళేలు, ముత్యాలు, ఏనుగులు కనబడనే కనబడవు. అంతటి కాఠిన్యంగల పద్యాలను ఇలా విచ్చుకున్న సన్నజాజుల్లా మనముందు పెట్టారు ఆచార్యులవారు.

రాయలవారి ఆముక్తమాల్యద అర్థం కాదు అనేమాట ఆచార్యులవారి వచన రచన చదివిన తరువాత ఎవ్వరూ అనలేరు.

రాయలవారి కావ్యాన్ని ఇంత రమణీయంగా కమనీయం గానే కాక లాలిత్యంలో రంగరించి 'రాయలవారి ఊహలపల్లకి'ని కనుల పండువుగానే కాక మనోరంజకంగాను అందించిన శ్రీరామచంద్రా చార్యులవారు సాహిత్యార్చనాపరులే కాదు అక్షర మూర్తులు కూడా! ఇంత సరళంగా రాయలవారి రచనను వివరించడం మరొకరివల్ల అయ్యేపని కాదు.

రాయలవారి ఆముక్తమాల్యదకు రామచంద్రాచార్యుల వారి ఈ వచన రచన సులలితామోదమే!

ఆంధ్ర సరస్వతి శ్రీ ఆచార్యులవారి ఊహలపల్లకీలో విహరిస్తూ ఉంటుందనడంలో అతిశయోక్తి లేదు. ఇది ఆచార్యులవారు సరస్వతీమాతకు అందించిన అపూర్వము, అనర్ఘము అయిన కానుక. అనితరసాధ్యమైన కానుకను అర్పించిన ఆ అక్షరమూర్తికి నమస్కృతులు.

శ్రీ ఆచార్యులవారి పూర్తి రచన భక్తినివేదన ద్వారా అందుకో గలమని ఆశిస్తున్నాను.

---

**జై శ్రీమన్నారాయణ!**

**శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో రాజకీయాలలో బిజీగా ఉండే మాకు ఆధ్యాత్మిక చింతనను కలిగించింది శ్రీస్వామివారు.**

**శ్రీవారి ద్వారా అనేక కార్యక్రమాలలో శ్రీ రామచంద్రచార్య స్వామివారిని సేవిస్తున్నాము. భక్తినివేదన సంపాదకులైన వీరి సంపాదకీయ వ్యాసాలను చదువుతూ మేమెంతో ధన్యత చెందుతున్నాం. ఉన్నదున్నట్లుగా సంప్రదాయబద్ధంగా చెప్పే పండితులలో మన శ్రీరామచంద్రాచార్యులు గారు ఒకరు. వారు పరమపదించటం వైష్ణవ లోకానికి ఎంతో బాధాకరం. వారి కుటుంబానికి నా ప్రగాఢ సంతాపం తెలియజేసుకుంటున్నాను...**

**శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డి**
**హైదరాబాద్**

### పండితరత్న, వాచస్పతి

# శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యస్వామివారు

**సముద్రాల శఠగోపాచార్య**
**నక్కలగుట్ట, హనుమకొండ. సెల్ : 98483 73067**

సుచిరకాలం సత్సంప్రదాయముగా ప్రసిద్ధిగాంచిన భగవద్రామానుజ సిద్ధాంత వ్యాప్తికి కృషిచేసిన "పండితరత్న, వాచస్పతి" ఉ.వే.ప్ర. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారి గళం మూగ బోయింది. వారి కంఠం నుండి వెలువడే గంభీరమైన సూక్తిసుధా ప్రవాహం అదృశ్యమైనది అనే నమ్మలేని నిజాన్ని జీర్ణించుకోలేని స్థితి నాది.

తమదైన శైలిలో పండితసభల్లో మనోహరమైన రీతిలో సంప్రదాయ విషయాలను అనర్గళంగా ఉపన్యసించి అలసట చెందిన శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యస్వామివారు 2012 నవంబర్ 14వ తేదీన ఈ లీలావిభూతిని వదిలినారు.

వారు ప్రస్తుతం పరమపదంలో నిత్యముక్తుల సమక్షంలో తమ ఆచార్య వైభవాన్ని, పరమాత్మ కళ్యాణగుణాలను శబ్దాలంకారభరితమైన, దీర్ఘసమాసభూయిష్ఠమైన, స్ఫుటమైన తమ దివ్యవాణితో వివరిస్తూనే ఉంటారని భావిస్తున్నాను.

ఉత్తరాంధ్ర త్రయముగా ప్రసిద్ధిగాంచిన మహా మహోపాధ్యాయ ఉ.వే.ప్ర. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు, విశాఖపట్టణం, ఉ.వే.ప్ర. శ్రీమాన్ కందాడై వేంకటాచార్యస్వామివారు, విజయనగరం, పండితరత్న ఉ.వే.ప్ర. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు అను మువ్వురిలో మూడవవారైన శ్రీరామచంద్రాచార్యస్వామివారితో నాకు ఒక పుష్కరకాలంగా సన్నిహితమైన సంబంధం ఉన్నది.

శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యస్వామివారికి, నాకు గ్రంథాచార్యులు ఒక్కరే. ఈ విధంగా స్వామివారు, నేను "సతీర్థులము" అని చెప్పగలిగే భాగ్యవంతుణ్ణయ్యాను. శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యుల వారు మహామహోపాధ్యాయ, కవిశాబ్దిక కేసరి, శాస్త్రరత్నాకర ఉ.వే.ప్ర. శ్రీమాన్ డా॥ న.చ. రఘునాథా చార్యస్వామివారివద్ద భగవద్విషయాన్ని సేవించి శాత్తుముఱై చేసుకునే సందర్భంలో నన్ను, మా నాయనగారైన అయోధ్య స్వామివారిని ఆహ్వానించారు.

తమకు భగవద్విషయాన్ని ప్రబోధించిన ఆచార్యస్వామి వారితో పాటు వారి దగ్గర ఇదివరలో సంప్రదాయ గ్రంథాలను అధికరించిన శిష్యవర్గాన్ని కూడా ఈ సందర్భంలో సన్మానించా లనుకుంటున్నాను అని శ్రీరామచంద్రాచార్యస్వామివారు తెలిపి, జ్ఞానంలో వయస్సులో కూడా చిన్నవాడనైన నన్ను కూడా వారు సత్కరించడం ఎన్నటికీ నేను మరువలేని మధురస్మృతిగా భావిస్తున్నాను.



నేను కార్యదర్శిగా బాధ్యతలను నిర్వర్తిస్తున్న కోవెల రంగాచార్య మెమోరియల్ ట్రస్ట్ పక్షాన 2007లో శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్య స్వామి వారిని "భగవద్రామానుజులు - ఉపనిషత్తులు" అనే అంశంపై విశిష్టోపన్యాసమునకై ఆహ్వానించి, వారిని "పండితరత్న" అనే బిరుదంతో సంస్థ పక్షాన సత్కరించాము. అప్పుడు నేను శ్రీ స్వామివారి ప్రేమను, వాత్సల్యాన్ని దగ్గరగా చవిచూసే భాగ్యాన్ని పొందాను.

2003 నుండి వరుసగా ఒక మూడు సంవత్సరాల పాటు శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యస్వామివారి సమక్షంలోనే ఉభయ వేదాంత పండిత సభల్లో (విజయవాడ, శంషాబాద్) ఉపన్యసించాను. శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యస్వామివారు సంపాదకత్వ బాధ్యతలను నిర్వర్తిస్తున్న భక్తినివేదన మాసపత్రికలో 2006 జనవరి నుండి ఇప్పటివరకు సుమారు 70 వరకు నేను రచించిన వ్యాసాలు ముద్రింపబడినాయి. ఈ రెండు సందర్భాల వల్ల శ్రీరామచంద్రాచార్యస్వామివారియొక్క కృపా కటాక్షములకు పాత్రుడనయ్యే భాగ్యాన్ని పొందగలిగాను.

పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారు తమ గ్రంథాచార్యులైన "కులపతులు" ఉ.వే.ప్ర. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారి విషయంలో కృతజ్ఞతగా "ఆచార్య వరివస్య" రూపంలో ఏర్పరచిన "గోపాలోపాయన" పురస్కారంతో 2011 మార్చి నెలలో సీతానగరంలో శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారిని సత్కరించినప్పుడు ఆ సన్నివేశాన్ని నేను దర్శించుకోవడమే కాకుండా ఆ సభలో శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి, శాస్త్రరత్నాకర ఉ.వే.ప్ర. శ్రీమాన్ డా॥ ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామివారి అనుగ్రహంతో ఐదు నిముషాలపాటు మాట్లాడే అవకాశాన్ని కూడా పొందినందుకు చాలా సంతోషించాను.

శంషాబాద్ శ్రీరామనగర్‌లోని శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామి వారి ఆశ్రమంలో, వరంగల్‌లోని గీతాభవనంలో, సింహాచలంలోని శ్రీ స్వామివారి స్వగృహంలో కూడా శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యస్వామి వారు చిన్నవాడనైన నాతో కూడా చాలాసేపు మాట్లాడిన విషయాలను స్మరిస్తూ, వారు రచించిన ఆర్యోక్తులు వంటి గ్రంథాలను, భక్తినివేదన సంపాదకీయాలను పఠిస్తూ వారి యశఃకాయాన్ని దర్శిస్తూ శ్రీవైకుంఠ నాథునికి వారు ప్రస్తుతం చేసే నిత్య నిరంతర కైంకర్యాలను ఊహిస్తూ, వైకుంఠవాసులైన ఉ.వే.ప్ర. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారి దివ్యపాద సన్నిధిలో స్మృత్యంజలిని ఘటిస్తున్నాను.

## నీరాజనం

శ్రీమాన్ టి.పి. రామాచంద్రాచార్యస్వామివారు పరమపదించిన వార్త విని నిర్ఘాంతపోయాను. ఒక్కసారి వారి దివ్యమంగళ విగ్రహం నా కన్నులముందు నిలిచింది. మన చిన్న జీయరు స్వామివారికి అత్యంత ఆత్మీయులైన వీరు మన రామానుజ సంప్రదాయ పరిరక్షణకి చేసిన సేవ నిరుపమానం.

మన భక్తినివేదన పత్రికకి సంపాదకులుగా వీరందించిన సేవలు మరపురానివి. వీరు పరమపదవాసులు కావడం శ్రీ వైష్ణవ లోకానికి, ఆ సంప్రదాయానికి తీరని లోటు. వీరి ఆత్మకు శాంతి లభించాలని ఆ పరమాత్మను ప్రార్థిస్తున్నాను.

దాసోహములతో...
గోకరాజు గంగరాజు
ఛైర్మన్ - జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్

## ఆవేదన

భక్తినివేదన సంపాదకులు శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారు పరమపదించారని విని, చెప్పలేని దుఃఖం కలిగింది. ఆ శ్రీమన్నారాయణుడు ఇటువంటి మహనీయులను తన చెంతకు పిలిపించుకుంటే, ఈ లోకంలో మనకిక మార్గదర్శనం చేసేవారెవరు? ఆలోటు ఎలా పూడ్చగలం? సంప్రదాయ సౌరభాలను ఎలా ఆస్వాదించగలం? ఆర్యోక్తులను ఎలా వినగలం? ఊహలపల్లకిలో ఎలా విహరించగలం?

కానీ, పుట్టిన ప్రతిప్రాణీ గిట్టక తప్పదని అందరికీ తెలిసినదే. భగవంతుని సేవలో పరమపదములో ఈ స్వామి మనగురించి పురుషకారం చేయడానికే వేంచేశారని భావిస్తూ వారి కుటుంబానికి ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నాను.

సాష్టాంగప్రణామములతో...
డా॥ రామేశ్వరరావు
ఛైర్మన్ - జీయర్ ఇంటిగ్రేటెట్ వేదిక్ అకాడమీ

## ఆత్మీయతానుబంధము

మేము 1993సం॥లో ఉద్యోగరీత్యా విశాఖపట్నం బదిలీ అయినప్పుడు, శ్రీమాన్ వేణుగోపాలచార్యుల వారిని కలిసి, స్వామీ! మాకు విశాఖపట్నంలో ఎవరూ తెలియదు. మీరు కాస్త తెలిసినవారి పేర్లు చెబితే వారి ద్వారా మేము అక్కడ స్థిరపడతాము అని అడిగాము. అప్పుడు ఆయన విశాఖపట్నంలో మీకు ఇరువురిని పరిచయం చేస్తాం, ఆ ఇరువురు ఉంటే అందరూ మీ కు తెలిసినవారే అవుతారు అంటూ, మొదటివారిపేరు సాక్షాత్ శ్రీ వరాహ లక్ష్మీనృసింహస్వామివారు, రెండవవారు శ్రీమాన్ టి.పి. రామచంద్రాచార్యస్వామివారు అని చెప్పారు. మేము విశాఖపట్నం చేరగానే శ్రీమాన్ రామచంద్రాచార్యస్వామివారి కుటీరానికి వెళ్ళి, అయ్యా మేము ఈ ఊరికి బదిలీ మీద వచ్చాము. వేణుస్వామివారు మిమ్మల్ని కలవమన్నారని చెప్పాము. ఈ విషయం చెప్పగానే వారెంతో ఆప్యాయంగా, ఆత్మీయంగా రెండుగంటలు మా విషయాలన్నీ కనుక్కొని, మీకు ఈ ఊళ్ళో ఉన్నంతకాలం ఎప్పుడు, ఏ అవసరమున్న నన్నుకాని, మావాళ్ళనికాని అడగండి అని చెప్పటం మాకు ఈ రోజుకి ఎప్పటికి గుర్తుండి పోతుంది.

అది లగాయితు అక్కడున్నంతకాలం ఆదివారం వచ్చిందంటే ఆ సింహాద్రినాథుని దర్శనం, తరువాత శ్రీమాన్ రామచంద్రాచార్యస్వామివారితో కనీసం ఒకగంట గడపడమనేది మాకు అలవాటు అయి కాలక్రమేణా వారు మా ఇరువరిని వారి కుటుంబ సభ్యులుగా పరిచయం చేయటం మా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాము. వారు అటు ఆధ్యాత్మిక విషయాలను, సింహాద్రినాథుని మాహాత్మ్యమును చెప్పటంతోపాటు, అనేక ఇతర విషయాలమీద చాలా స్పష్టంగా వారి అభిప్రాయాలను మాతో పంచుకునేవారు. వారు మాట్లాడుతూ ఉంటే మండువేసవిలో, చల్లటి సువాసనలు వెదజల్లే విరజాజులు వర్షించినట్లు మనసుకి హాయిగా ఉండేది. సమయమే తెలిసేది కాదు. ఏ విషయమైనా ఇతరులకి అర్థమయ్యేటట్లు ఏకధాటిగా గంభీర మృదుమధురంగా చెప్పటంలో వారికి వారేసాటి.

1995లో తిరిగి విజయవాడకి బదిలీ అయినప్పుడు, వారి దగ్గర సెలవు తీసుకొందామని వెళ్ళినప్పుడు వారు చాలా బాధపడుతూ మా కుటుంబంలో ఒకరు మమ్మల్ని విడిచి వెడుతున్నారు అన్నప్పుడు మా ఇరువురికి కళ్ళు వర్షించకుండా ఉండలేకపోయాయి. అప్పుడు వెళ్ళవలసి వస్తోంది అన్నప్పుడు వారు మమ్మల్ని ఓదార్చుతూ అన్న మాటలు మా జీవితాంతం గుర్తున్నాయి. వారు మాకు మంగళాశాసనము చేస్తూ మీరు ఇంకొకసారి ఇంకా ఎక్కువకాలం ఇక్కడ ఉండేటట్లు వస్తారు. ఆలాగున సింహాద్రినాథుని ప్రార్థన చేద్దాము అన్నారు.

వారు దీవించిన విధంగానే మాకు 2003లో ప్రమోషన్‌మీద మళ్ళీ విశాఖపట్నం బదిలీ అయి దాదాపు 5సం॥లు వారితో తిరిగే భాగ్యాన్ని వారు ప్రసాదించారు. ఇది వారి మంగళాశాసనానికి ఉన్న గొప్పబలం.

వారితో మా అనుబంధం మా జీవితాలకి ఒక మధురస్మృతి. వారి పరమపదవార్త మమ్మల్ని దుఃఖసాగరంలో పడవేసింది. వారు తప్పక పరమపదనాథుడి సన్నిధిలో, మన పెద్దజీయరు స్వామివారి పరివారంతో చేరి పెరుమాళ్ళసేవలో తరిస్తూ ఉండి ఉంటారని భావన చేస్తూ వారి కుటుంబానికి పత్రికాముఖంగా మా ప్రగాఢ సానుభూతిని తెలియజేస్తున్నాము.

రామానుజదాసులు
యల్లాప్రగడ సూర్యనారాయణ, లక్ష్మీ రాజరాజేశ్వరి
హైదరాబాదు.

### శ్రీమతే రామానుజాయ నమః

సనాతన సంప్రదాయమునకు బుగాది చతుర్వేదములు సాంగములుగా మూల స్రోతస్సులు. భగవన్నిశ్శ్వసితములుగా ఈ మూల స్రోతస్సులే జీవనదులవలె మీమాంసాది శాస్త్రరూపమున ఇతిహాస పురాణములుగను పరమ కారుణికులగు వాల్మీకాది మహర్షులచే ఈ కర్మభూమియందు ప్రవహింపచేయబడుచూ నిరంతరము కర్మజ్ఞానభక్తిప్రపత్తులను పండించుచున్నవి. వీటికి వివరణముగనే సర్వజన సుగమముగ, సుబోధముగా, మహాజ్ఞానులగు ఆళ్వారుల దివ్యముఖారవిందములనుండి జాలువారిన భగవ త్కీర్తనామృతము రస్యమానమయి ముముక్షులోకమున పునరావృత్తి రహితమగు జీవినానికి సేతుభూతమగుచున్నది. ఇవి అన్నియూ **'శ్రుతిస్మృతిర్మమైవాజ్ఞా'** అని చెప్పినట్లు పరమహితకారక ములైన భగవదాజ్ఞారూపములే.

వీటిని సదాచార్యముఖముగ శ్రవణమననములు చేయుట వలన ప్రాకృత ప్రపంచమున దిశానిర్దేశరహితముగ పయనించుచున్న జీవునికి కృత్యాకృత్యవివేకమును కల్పించి, పునరావృత్తరహితమగు ఉత్తమమార్గమున నడిపించును. పూర్వాచార్య పరంపర అంతయు వారివారి ఆచార్యుల అకంపానుకంపముచే అత్యుత్తమ మార్గమున పయనించి భగవత్సన్నిధానమును పొందినవారే.

ఇట్టి సదాచార్యానుగృహీతమైన మార్గములో పయనించినవారే 'వాచస్పతి ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు. సద్వంశజాతులగు వీరు ఉభయవేదాంతములను అధికరించుటయే కాక, సంస్కృతతాంధ్ర సాహిత్యములో చిరకాలము విహరించి, **'ముహురహో! రసికా భువి భావుకాః'** అన్నట్లు ఆపాతమధురముగ రసమునుగ్రోలిన పిపాసువు.

ఉపన్యాసములలో వారి శైలి తత్సమాదిపదసంఘటన శబ్దోచ్చారణ విధానము. అందు సౌందర్యానుభూతి చాలా విలక్షణము, అసదృశము. అనువంశికముగ భగవదారాధనాదుల వలన శైశవావస్థనుండి సహజముగ ఉద్బుద్ధమైన భక్తిప్రపత్తులు జగదాచార్యులగు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి, అట్లే శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి దివ్య చరణారవిందముల సన్నిధిలో వెల్లువిరిసి భగవంతునియందు ప్రేమగా ఫలించేసుకొనిన ధన్యజీవులు శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామి.

విజ్ఞాపకః
**రామానుజ దాసుడు**
**శ్రీ.తి.కుం. శ్రీరంగాచార్యః**

**Prof. P. Purushotham Rao**
Ph.D.
Chairman Board of Studies
& Member, BOM, IGNOU, New Delhi



Re-accredited by
NAAC with 'A' Grade

Department of Commerce
Osmania University
HYDERABAD, Andhra Pradesh - INDIA
PIN : 500 007
Ph. : +91-40 –27070367, 27682308 (Off)
Fax : +91-40-27097979

***Jai Srimannarayana***

I am sorry to know that the sudden, untimely and sad demise of U.V.Sriman T.P. Sriramachandra Charyulu, Editor Bakthi Nivedana. He was a great scholar with in-depth knowledge on various subjects. He was a man with lot of commitment and conviction towards our Acharas Sapradayas.He contributed immensely for the propagation of Vedic Philosophy. The credit goes to him in maintaining high standards for Bakthi Nivedana as Editor. He laid strong foundation in designing and developing moral and cultural values through Bakthi Nivedana. It is a great loss to his family, to our organization and to the readers of Bakthi Nivedana. I condole his death and pry Almighty that may his sole rest in peace.

22/11/12
(Prof. P.Purushotham Rao)

22nd November, 2012

శ్రీమతే రామానుజాయ నమః

# స్మృతి పథం

శ్రీ.ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారి వైభవం ప్రపన్నలోకానికి పరిచయం చేయనవసరం లేదు. అట్లు చేయుట ఒక విధంగా సాహసమే అవుతుంది. సింహాద్రినాథుని తోటలో విరసిన తావియొప్పారు కుసుమమే శ్రీస్వామివారు.

పాతతరపు పండిత ప్రకాండులలో మున్నెన్నదగినవారు శ్రీస్వామివారు. ఉభయవేదాంతముల యందు సుగాఢ అనుభవం, ఉభయవేదాంతములను సవ్యసాచిలా ప్రవచించు దక్షత శ్రీస్వామివారికి సింహాద్రినాథుని కృపాలబ్ధమే.

సుమారు ఇరవై సంవత్సరాల క్రితం దాసుడు మా ఆచార్యులతో విజయవాడ సభలకు వెళ్ళినపుడు వారి ప్రథమ కటాక్షం దాసునిపై పడింది. ఆ సమయంలో దాసుడు మా స్వామివారి వద్ద భగవద్విషయం కాలక్షేపం సేవించుచున్నాడు. శ్రీస్వామివారికి పరిచయం జరిగినపుడు భుజం తట్టి, ప్రోత్సహించి, ఆప్యాయతానురాగాలతో మంగళాశాసనం చేసిన సుమనస్కులు.

దాసునకు శ్రీవారితో విజయవాడ, విజయనగరం మొదలగు అనేక సభలలో సుమారు పదిహేను సంవత్సరాలుగా పాల్గొనే భాగ్యం లభించింది. శ్రీస్వామివారి ప్రవచనం ప్రౌఢగంభీర సుమధురశైలిలో నుండి శ్రోతలను "ఎంగుం పక్కనోక్కరియాన్" అన్నట్లు మంత్ర ముగ్ధులను చేసేది.

లోకంలో వక్తలు ప్రాసకోసం ప్రాకులాడితే, శ్రీస్వామివారిని పట్టుకుని ప్రాసే ప్రాకులాడేది. లోకంలో వక్తలు పదగుంభనకు కష్టపడితే ఆ పదసంపదే శ్రీస్వామివారి పదములపై మోకరిల్లేది.

శ్రీస్వామివారి ప్రవచనం 'శరవర్షం వవర్ష హ" (శరవర్షం ఎడతెరిపిలేకుండా కురిసినది) అన్నట్లు వారి వాగమృతవర్షధారలు శ్రోతలపై ఎడతెరిపిలేకుండా కురిసి శ్రోతలను ధన్యులను చేసేవి.

శ్రీస్వామివారు 'గీర్వాణులు'. గీర్వాణః అంటే వాక్కులే బాణములుగా కలవారని అర్థం. వబయోరభేదః అని పై అర్థాన్ని సాధించారు. కానీ, స్వామివారి వాగ్బాణములు పదునైనవి కావు. పుష్పహాస సుకుమారములు. మారుని బాణములు లౌకికమైన కామాన్నుద్దీపన చేయ సమర్థములైతే, శ్రీస్వామివారి వాగ్బాణములు "శీరియనల్ కామమ్" (శ్రేష్ఠమైన మంచికామము) అని చెప్పబడిన పరమాత్మ విషయకమైన కామాన్నుద్దీపింపచేయ సమర్థములు.

గీర్వాణః అంటే, 'గిరం వేదశాస్త్రాది రూపాం వణంతి వ్యాకుర్వంతి" (వేదశాస్త్రరూపమైన వాక్కును వివరించి చెప్పువారు) శ్రీస్వామివారు వేదశాస్త్రదివ్యప్రబంధ ప్రవచనములు అతివిశదమై విరాజిల్లినవి గనుక, వీరు 'గీర్వాణులే'.

స్వామివారి శ్రీసూక్తులు 'అనిమిష నిషేవ్యం శ్రవణయోః... వాణీ విలసితం" (చెవులకు ఆసక్తిగా సేవింపదగినట్టి వాణీ విలాసము) అన్నట్లు ఉండుటయే గాక, 'అనాఘ్రాతావద్యములు' దోషవాసనలు లేనివి.

వారి శ్రీసూక్తి అమృతధారలలో తడిసి, సంతసించినోల్లము కలిగిన వారిలో దాసుడొకడు. శ్రీస్వామివారికి రాయలవారి "ఆముక్తమాల్యద" అంటే అమితమైన వ్యామోహము. వారి ప్రవచనములలో ఆముక్తమాల్యదా కావ్యకన్య నర్తించని ప్రవచనములు లేవనుట అతిశయోక్తి కానేకాదు.

శ్రీస్వామివారు నాబోటి యువకులకే కాదు, ప్రవచనదక్షులైన పెద్దలకు కూడా మార్గదర్శి. శ్రీస్వామివారు చిరకాలంగా గొప్ప సంప్రదాయ సేవచేసిన పెద్దలు. గత కొంతకాలంగా భక్తినివేదన సంపాదకులుగా వేంచేసియుండి వారందించిన సంపాదకీయాలు చిరస్మరణీయములు.

శ్రీస్వామివారు ఆచార్యతిరువడిఘళ్ చేరుట మనబోటులను బాధించినా, వారి ప్రవచనామృతం గ్రోలుట పరమపదనాథునికి ఆనందావహమే అగుననుటలో సందేహమే లేదు.

శ్రీస్వామివారి కైంకర్యమును పరమపదనాథుడు స్వీకరించునట్లు కటాక్షించమని మా స్వామి ఎంబెరుమానార్లకు విన్నవిస్తూ....

భాగవతదాసః
వంగల వేంకటాచార్యః
నరసాపురం

## శ్రీరామచంద్రాచార్య స్వామివారి... పద్యం

సింహాద్రి కందరాంచిత మందిరాంతర
సాంకవశ్రీగంధ సౌరభములు,
దంభకేసరి మేన దరచైన తులసికా
చాంపేయమాలికా సౌరభములు,
నీహారఘనసార నీకాశ నిజరూప
వారాహహరిదేహ సౌరభములు,
కాశ్మీర కర్పూరగంధిల విద్యముల్
స్వామిభోగంబుల సౌరభములు........

నల్లకలువలట్టి నయనాంచలాలతో
ప్రేమజల్లు కురియ ప్రియవధూటి,
దాన తాన మాడి తా నల్లనాయేనా?
నిర్మలుండు లోకశర్మదుండు!

సప్తతి సంచికనుండి